## అ

అంకకత్తె : (అంకము + కత్తె) వి. శూరురాలు, ముఖ్యురాలు, మాత్సర్యశీలురాలు, కళంకం కలది, పార్శ్వమందుడే చెలికత్తె, పామరురాలు చూ : అంకెకత్తె.

"ఏడసుద్ది నన్నుఁజూచి యేల కొంకేవు
ఆడానీడా నిన్నొరయ నంకకత్తెనా" 27-227

"వంక లాడవలెఁగాక వలచిన పతితో
అంకకత్తెవలె నేల అ ఙ్దిమేవే" 27-233

అంకగాఁడు : (2) వి. పామరుడు (ఆం.ప.ని.), చలము పట్టువాడు, శూరుడు, ముఖ్యుడు.

"బింకమాడకుండ నాన వెట్టితినవో
అంకగానివలె నన్ను నఙ్దిమీని" 17-437

నిఘంటువుల్లో అంకకాఁడు అనే రూపమే. చూ : అంకెకాఁడు.

అంకించు : స.క్రి. స్తుతించు (పట్టుకొను, కలిగించు, దొంగిలించు, తిప్పు, ధరించు), గుఱుతించు.

"పంకజభవాదులకుఁ బరదైవ మాతఁడని
అంకింతు రితఁడో అధికుఁడొకచో" 1-37

అంకిలి : వి. అడ్డగింత. (క్షోభం అని ఆం.ప.ని.)

అంకు : వి. దవడకీలు. (గ్రామదేవత)

"కందువల వెన్న దీసే కాంతలతో నవ్వ నేల
కిందువడి అంకులు దాఁకించుకో నేల" 20-584

అంకురార్పణము : వి. ఆరంభం; ఏ శుభకార్యారంభం లోనైనా పాలికాపూజ చేసి అందులో నవధాన్యాలు చల్లి మొలకలు పోస్తారు.

"వెలయఁగ లక్ష్మీవిభుని పెండ్లికిని
బలసి అంకురార్పణ మదివో" 22-96

అంకులు : వి. ఆభరణవిశేషం.

"అంకులు వెట్టించుకోఁగా నండ వచ్చితి గాక
లంకెలఁ బెనఁగితేను లావు చూపేవా" 20-306

అంకె : వి. 1. సామీప్యము, చేరిక 2. పట్టు, ఊతం, వశం, అధీనం, అదను, సమయం. (పీఠిక)

అంకెకత్తె : వి. (అంకె + కత్తె) అధీనంలో ఉన్న స్త్రీ, ప్రధానురాలు, మాత్సర్యశీలురాలు, కళంకం కలది.

"అలిగితే నీతోడి అంకెకత్తె నందువు
యెలమి నీతోడి గాడ కేమి సేతురా" 25-213

"అంకెకత్తె నైతినంటా అప్పటి నుప్పతించేవు
సంకెదీర నీకు నీవే పాదవు గారాదా" 23-412

"తూటిపాటి తెలియకే దొడ్డమేలు రాఁగా రాఁగా
ఆఁబడిబెట్టను నేను అంకెకత్తెను గానీ" 13-41

"అగ్గలమై నీతోడి అంకెకత్తెనా నేను
దగ్గరి నంతాఁగలిగి తగురా నీకు" 11-295

అంకెకాడు : (అంకె + కాడు) వి. మొనగాడు, ముఖ్యుడు, శూరుడు. (వర్తకముఖ్యుడు)

"ఇంక నేలా నాతోడ యింత సేయ
అంకకాఁడ వౌర శేషాద్రినాథ" 12-10

"కొంకు లేక కూడితివి కూరిమితో నిటు నన్ను
అంకెకాడ విఁక నీకు వల పున్నదా" 24-584

"కొంకు దేర నిన్ను నిట్టే కూడుదు నటే
అంకెకాఁడ నీకు నేను అప్పణిచ్చేనా" 16-395

అంకెకుఁజిక్కు : అ.క్రి. దారికి వచ్చు.

"ఆసలే పుట్టించుఁగాని అంకెకు ఁజిక్కడే
వేసరక యంతేసి వేఁడుకోనీనా" 28-565

అంకెకు రాని పనులు : వి; బహు. దారికి రాని పనులు, గణనకు రాని పనులు.

"అంకెకు రాని పను లైనపాటి చాలును
మంకులు చెల్లవు నిన్ను మరిగినదానను" 7-585

అంకెకు లోనగు : అ.క్రి. వశంలోనికి వచ్చు, గణనలోనికి వచ్చు.

"కొంకక నీ మేన నెన్ని గురుతులు నించుకొన్నా
నంకెకు లోనగుఁ గాక యలిగేనా" 13-401

అంకెకు వచ్చు : ప.బం; అ.క్రి. 1. దారికి వచ్చు, రీతికి వచ్చు 2. వశమగు.

"ఇల నా యంకెకు రావు యింద్రియములు నావైనా
కలసి నా మర్మములే కాఁడిపారీఁగాని"
10-58 old

"ఆస విడిచినఁగాని యంకెకు రాదు విరతి"
15-326

**అంకెలో నుండు :** అ.క్రి. అధీనంలో ఉండు, వశంలో ఉండు. 12-425

**అంకెవచ్చు :** అ.క్రి. (?)
"అరుదై శ్రీవేంకటేశ అంకెవచ్చేనా నీకు
పరువపు నీ మాటపట్టు నమ్మివుంటిని" 20-509

**అంగజముద్ర :** వి. మన్మథముద్ర, నఖక్షతాదికం.
"అంగజముద్రలు నీపై నట్టి నెలకొనే నంటే
అంగడిఁబెద్దరికము అది నీకుఁ గాదా" 25-395

**అంగజసాము :** వి. మన్మథకేళి; వింత సమాసం.
"ముంగిట చెలి చెమట ముంగారులవె ముంచె
అంగజసాములచేత నలసినవేళను" 26-121

**అంగడిఁదోయు :** స.క్రి. (?)
"తేనెలు పెరల దించె తీగెలను వల్లెవేసె
ఆనుకొని చంద్రకళ లంగడిఁదోసి" 23-63

**అంగడిఁబడు :** ప.బం; అ.క్రి. 1. పరుగెత్తు (పారిపోవు ఆం.శ.ర.) 2. బహిరంగమగు, బయటబడు, బజారునపడు.
"ఆవల భయపడ్డవా రంగడిఁబడితే దొర
లోవల విచారించి వూరడింతు రంతలోనే" 3-70
"జంగిలి సతుల నీవు సారెసారె నమ్మించఁగా
అంగడిఁబడీనవే నీ అన్నమాటలు" 8-151

**అంగడిఁబెట్టు :** ప.బం; స.క్రి. బట్టబయలు చేయు, బహిరంగపరచు, అల్లరిపెట్టు.
"అంగడిఁబెట్టేవు మమ్ము నౌనోయి బావ నీ
ఇంగితము లెల్లాఁగంటి మింకా నా బావా"
16-305

**అంగడిఁబెట్టే వయసు :** వి. యౌవనం.
"అంగడిఁబెట్టే వయసు అడియాల మానునే
బెంగతనాన నుండినాఁ బెడరేచుఁ గాక" 21-404

**అంగడిఁబెద్దరికము :** వీధి పెద్దఱికం, రచ్చబండ పెద్దఱికం.
"అంగజముద్రలు నీపై నట్టి నెలకొనె నంటే
అంగడిఁబెద్దరికము అది నీకుఁ గాదా" 25-395

**అంగడికర్మము :** వి. బాహ్యకర్మము.
"మింగుచుఁ గర్మపునాము మేసిన సంసారికి
అంగడికర్మమే బ్రహ్మమై తోఁచును" 3-367

**అంగడికెక్కు :** ప.బం; అ.క్రి. బయటపడు, రచ్చకెక్కు, వీధికెక్కు, బజారుకెక్కు, బహిరంగమగు, అల్లరిపడు
"ముంగిట నాకఁడున్నాఁడు మూల నున్నదాన నేను
అంగడికెక్కె వలపు లవుఁ గదవే" 11-350

**అంగడికెత్తినట్టి దివ్వె :** ప.బం; వి. ఇతరుల కుపయోగపడేది, బయల నెత్తిన దివ్వె.
"అంగడి కెత్తినట్టి దివ్వె లంగనాముఖాంబుజములు
ముంగటి పసిడికుంభములును ముద్దుల కుచయుగంబులు" 1-1

**అంగడిచుట్టరికము :** ప.బం; వి. అస్థిరమైన చుట్టరికం.
"ముంగిట నే నుండఁగాను మోహించి చెనకేవు
అంగడిచుట్టరికాలు అవి యేల" 9-231

**అంగడిజంత :** ప.బం; వి. బజారుస్త్రీ, బజారు గయ్యాళి, విణ. దుష్టురాలు, సాహసికురాలు (సూ.ని.)
"రంగయిన పెండ్లికూఁతురవు సిగ్గువలెఁగాక
అంగడిజంతవలె నాన లెంత చూపేవే" 22-354

**అంగడిజాణతనము :** ప.బం; వి. వీధిలోని నేర్పరితనం.
"కంగు లేక నీకు నేను కాఁపిరము సేయఁగాను
అంగడిజాణతనాల క దేమి గారణము"
25-323 , 7-252 & 25-457

**అంగడిదొరతనము :** ప.బం; వి. రచ్చబండ పెద్దఱికం, వీధి పెద్దఱికం, వీధి పెత్తనం, అందరికీతెలిసే దొరతనం.

"యెంగిలి మోవి చూపి యితవరి వైతివి
అంగడి నీ దొరతనా లవి యేమి చెప్పేదే"
29-392

**అంగడినమ్ముకొను:** ప.బం; అ.క్రి. అందులోనే పడి తన్నుకొను.
"ఆపదలంగడి నమ్మిఁ గొనరో
పాపాత్ములు పైపయిఁబడకా" 1-142

**అంగడిపరిమళము:** ప.బం; వి. అందరికీ లభించేది.
"అంగడిపరిమళ మందరివాఁడవు నీవు
సంగడిఁ దన సొమ్మంటా సాదించీఁగాక"
25-466

**అంగడిబేరాలు:** ప.బం; వి; బహు. ఫలప్రదం కానివి, బయటి బేరాలు.
"పొంగఁబొంగఁ బొంగులాయ పొలఁతి కోరికలవి
అంగడిబేరా లాయ నడియాసలు"
29-402 & 18-531

**అంగడిమొక్కు:** ప.బం; వి. అంగప్రదక్షిణం, తిరువీథులందు చేసే ప్రదక్షిణం, అందరితోపాటు చేసే నమస్సు, బయలున చేసే పొర్లుదండం.
"అంగపుఁజెమటల ప్రహ్లాదవరదా! నీకు
నంగడిమొక్కు మొక్కేఁ బ్రహ్లాదవరదా!"
21-203

**అంగడిలోనికి నెక్కు:** ప.బం; అ.క్రి. వీధికెక్కు, బజారుకెక్కు, బహిరంగమగు. చూ: అంగడికెక్కు.
"ముంగిటికి వచ్చె నివె మోహపు నీ సుద్దులు
అంగడిలోనికి నెక్కె నా సుద్దులు" 19-189

**అంగడివలపు:** వి. వేశ్య ప్రేమ, అస్థిరమైన ప్రేమ.
"అంగడివలపులకు ఆసపడేటివాఁడవు
అంగమే కాదా నిన్ను నడిగేఁగాని" 23-522

**అంగడివాడు:** వి. దుకాణదారు.
"అమ్మెడు జక్కవలంటా నడిగితినే వోరి
కమ్మర మానవు నే మంగడివారమా" 17-75

**అంగడివేయు:** ప.బం; స.క్రి. బహిరంగముచేయు, వెల్లడిచేయు.
"నిచ్చ నిచ్చా నీ విద్యలు నేరనివారా తాము
గచ్చుల తమ గుట్టంగడివేయ నోపనా" 25-257

**అంగడిసతి:** ప.బం; వి. జారస్త్రీ, కులట.
"అంగడిసతుల నెల్లా నంటినవాఁడవు నీవు
చెంగక ప్రియము లెల్లాఁ జెప్పరాదా ఇఁకను"
14-159

**అంగడిసరకు:** అందరికీ అందుబాటులో ఉండే వస్తువు.
"శ్రీవేంకటేశ నన్నుఁ జెందితి వింతటిలోనే
నీ వంగడిసరకవు ని న్నే మనేమయ్యా" 14-68

**అంగద:** వి. ఆట, తిండి, ఆశ, ఆకలి, కోపం, కుతూహలం, ఉత్సాహం, మనోవ్యథ, దుఃఖం, ఉపద్రవం. (ద్వేషం అని ఆం.ప.ని)
"యెంగిలి మోవిచ్చె నాపె యెనసి శ్రీవేంకటేశు
డంగదేలే యే లిద్దరట్టే మనములను" 13-470

**అంగపు బంధువులు:** వి; బహు. శరీరసంబంధం గల బంధువులు, దగ్గరి బంధువులు.
"అంగపుబంధువు లెల్ల అంటుబంధములు
సుండి
సంగతి హరి యొకడె సత మింతేకాని" 4-108

**అంగమచ్చము:** (అంగము + మచ్చము) ప.బం; వి. 1. ఆనవాలు 2. శరీరం మీది గుర్తు, పుట్టుమచ్చ మొ॥
"అంటిన మోవిపై కెంపె అంగమచ్చమాయఁగాక
నంటున దారుకాణించ నా వసమా" 10-II-30

**అంగమచ్చెము:** 'అంగమచ్చము'నకు రూపాం.
"పట్టితి నంగమచ్చెము భావించి చూచినప్పుడే
పెట్టితి నీమీఁద నొక్క పెనునేరమి" 14-291

**అంగము:** వి. అందం, ఆకర్షణ. ప్రా. అంగ; సం. చంగ. (సుందరం)
"అంగమయిన మొల పీతాంబరమున
కొంగుబంగారై కూడె నీతఁడు" 9-2-7old
"ముంగిలిఁ బిడికిలించి మొలఁజేర్చిన చేయి

అంగమాయ నీ సొబగు హనుమంతరాయ"
4-413

"అంగవు నీ మాటల పయ్యెద గొంత విసరితే
వెంగలివాని గుట్టు విరియుఁ బో యివుడే"
21-530

"బంగారు మొలనూళ్లతో బాగై
యుండినపిఱుఁదు
అంగమైన పాదములు హస్తములను" 28-383

**అంగరంగవైభవము:** ప.బం; వి. అంగములకు (దేవతల విగ్రహాలకు), రంగమునకు (ఆలయమునకు) భోగాలు చేయటం, దేవుని ఊరేగింపులో అన్ని హంగులు ఏర్పరచి బయలుదేర దీసినప్పటి వైభవం, సమస్త భోగాలు.

"ఆటలఁ బాటలఁ జూచి అంగరంగవైభవముల
నీటుతోడ సొమ్ములెల్లా నిండాఁబెట్టుక" 14-368

"అట్టె కాఁగిటఁ గావించె అంగరంగవైభవాలు
ముట్టిన మీ చెనకులు ముయికి ముయి"
21-188

**అంగవించు:** అ.క్రి. 1. దగ్గరికివచ్చు, చేరువఅగు 2.ఉంకించు, యత్నించు 3. మించు, జయించు 4.తెగించు, సాహసించు 5. ఉల్లసించు, ఉత్సహించు. స.క్రి. అతిక్రమించు .

"చెంగట నలమేల్మంగ శ్రీవెంకటేశ నిన్ను
నంగవించి కూడె నీవే యఖిలభోగాలు" 7-129

"అచ్చుమోపి దాసునిఁగా నంగవించిరి నీ దాసు
లిచ్చల నన్నుఁజేపట్టు మిందులకు నైననాను"
15-16

"పొంగేటి జవ్వనముతో పొదరిల్లు దూరి నీతో
నంగవించి సన్నసేసే నది గొనవా" 19-363

"రంగుగనే నలమేలుమంగను శ్రీవేంకటేశ
అంగవించి నీ వేలితి వందా లాయ రతులు"
24-340

"వుంగిటి నాతఁడు నీతో నొడివట్టిపెనఁగితే
నంగవించవానే నిన్నాడుదుఁబో అపుడు"
9-282

"యింగితాన శ్రీవేంకటేశుఁడాకె తన పొందు
కంగవించి సాకిరై తన కనరాదు గాని" 7-162

"వెట్టిగాడు వేంకటాద్రివిభుఁడ నీవు మదనరచన
లట్టునిట్టు సేయ నన్ను నంగవించినాఁడవో"
5-136

"పూవువలెఁ దొల్లి తాను పొందు గలది గనక
ఆవేళఁ దా నొరసితే నంగవించకుందురా" 21-56

"కొంగువట్టి తీసితేను కోపగింతురా యేమి
అంగవించి అందుకు లోనౌదురుగాక" 8-98

"అంగవించి శ్రీవేంటాధీశుడై నన్నుఁగూడె
సంగడిసేసలు పైపైఁ జల్లితి నేను" 26-537

**అంచ(ల)న:** వి; క్రి.విశ. (మాం.) 1. దగ్గరలో 2. ప్రక్కన, పార్శ్వం. జానపదగేయాల్లోనూ అంచన పదం ఉంది.

"అదిగదిగో అనంతపురము
అంచనా టెంకాయవనము
పక్కలోనే పామిడేరన్నా"

"మించి నిండుకొంటే నెనిమిదియే దిక్కులు
అంచల నీ కతలైతే ననేకములు" 2-314

**అంచ:** From అంచు affix, near, with by వద్ద.

"అంచ నెవ్వరు నిద్రవొమ్మని బుద్ధి చెప్పవద్దు
మించి వారి తమోగుణమే కప్పీని" 2-184

**అంచగమన:** వి. 'హంసగమన' శబ్దానికి తద్భవరూపం. హంసనడకవంటి నడక గలది.

"మంచముపై ముసుగులు మనసులో
విసుగులు
అంచగమన కిదివో అమరె నేడు" 7-53

**అంచు:** వి. కొన, చివర అని సామాన్యార్థములు. కాని అన్నమయ్య దీనిని చనుమొన, కుచాగ్రము అనే అర్థంలో వాడినాడు.

"అంచు మోవ నొరఁగఁగ ఆనుకోనైతి ననేవు
నించిన కొండలు మోవ నీ యెంతవారమ్మా"
7-17

"బలిమి నరంట్లును పక్కనఁనైఁ దోయనేలే

అలమి యంచుల బాతురాడింతురా" 7-182
"అంచు మోవ నాకు నదే ఆనతియ్యవయ్యా"
18-94
"ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు
పొంగార పైయంచుల్ మోవఁగ" అని మ.చ. ప్రయోగం.

**అంచెబొందులు :** మధ్య మధ్య విశ్రాంతి తీసుకుంటూ పొందే పొందులు.
"యెంచగ శ్రీవేంకటేశునకు మనకు
నంచె బొందు లాయె నట్టె కాని" 11-450

**అంచెజాణతనము :** వి. (?)
"అంచెజాణతన మటు నీ వాడగ
మంచము ములిగే మానవయ్యా" 20-163

**అంచెల లేకలు :** వి; బహు. వాహనాలు లేక వాహకుల మార్పుపై వచ్చే లేఖలు.
"అంచెల లేక లంపి అట్టే కొంత పొద్దువుత్తు"
12-233

**అంజనగాఁడు :** (అంజనము + కాఁడు) అంజనం వేసి నిధి నిక్షేపాలు కనిపెట్టేవాడు, పోయిన వస్తువులను కనిపెట్టే వాడు.
"చనవున జలధిలో సంపదింద్రునికిఁ జూపి
అనువరి వాఁడివో అంజనగాఁడు" 8-22
"నెట్టన నంజనగాఁడై నేల దవ్వించే మనసు
అట్టె కాయసిద్ధికిఁ గా నాసపడేటి మనసు"
15-280

**అంజనగిరి :** వి. శ్రీవేంకటేశ్వరస్వామి నెలకొన్న ఏడు తిరుమలకొండల్లో అంజనాద్రి అనే కొండ.
"మిసిమి నంజనగిరిమీఁద వసంతవేళను
వెసఁ గల్పవృక్షము విరులిచ్చినట్లు" 13-107

**అంజనగిరిరాయఁడు :** వి. అంజనాద్రికి అధిపతియైన శ్రీవేంకటేశ్వరుడు.
"అంజనగిరిరాయఁడు వేంకటపతి
సంజీవని పరుషల కొదవఁగను" 1-119

**అంజనాద్రీశ్వరుఁడు :** వి. వేంకటేశ్వరస్వామి, అంజనాద్రికి ఈశ్వరుడు అని వ్యు.
"అలిగి సాదించఁ దగదంజనాద్రీశ్వరునిఁ గలికి
చూపులనె మదిఁ గరఁగఁజేసెదను" 25-478

**అంజనీతనయుఁడు :** వి. హనుమంతుడు, అంజనాదేవి పుత్రుడు. 'అంజనా' అనడానికి బదులు 'అంజనీ' అని ప్రయోగించడం విలక్షణం.
"అంజనాచలముమీఁద నతఁడు శ్రీవేంకటేశుఁ
డంజనీతనయుఁ డాయ ననిలజుఁడు" 4-443

**అంజనీదేవి :** 'అంజనాదేవి' యే అంజనీదేవి గా పేర్కొనబడింది. హనుమంతుని తల్లి పేరు.
"అంజనీదేవి కొడుకు హనుమంతుడు
సంజీవని దెచ్చినాఁడు సారె హనుమంతుడు"
4-272 & 4-499

**అంజు :** అ.క్రి. 1. భయపడు, బెదరు 2. సందేహించు.
"అంజనీదేవికిఁ గొడుకైనాఁడు యే పనుల
నంజఁడు కలశాపుర హనుమంతుఁడు" 4-499

**అంటఁబారు :** ప.బం; అ.క్రి. పరుగెత్తు, వెంటబడు.
"అంటఁబారి పట్టుకోరె అమ్మలాల యిదే
వెంటఁబారనీదు నన్ను వేడ మాయ తురుము"
1-122

**అంటకుముట్టకు :** ప.బం; క్రి.ప. సంబంధం పెట్టుకోకు.
"ఎప్పుడు వచ్చునో యంటూ నెదురుచూచీఁ బతికి
దప్పిదేరు మోముతోడ దాచలేదు ప్రియము"
5-336

**అంటిముట్టు :** ప.బం; స.క్రి. 1. స్పృశించు, తాకు 2. సంబంధం కల్పించుకొను.
"నంటునఁ దల వంచుక నవ్వులు నవ్వీ నాపె
అంటిముట్టి చెనకీ నీ యశోదాలకు" 25-392

**అంటిమోసు :** వి. అరటి మొలక. (అంటి = అరటి)
"ఆఁటది యింతకోపునా అంటిమోసువంటిది

మాఁటులనే లాలించి మరపుకోవయ్యా" 28-38

**అంటివనము :** వి. అరటివనం. (అంటి = అరటి)

"గరిమనడుమ వ్రాయఁగా సింహమై తోఁచె

వరుసఁ దొడల యంటివనము వ్రాసెనే" 9-70

**అంటిసుడి వంటిది :** వి. (?)

"ఇంటికి విచ్చేసితివి యెంత పనికి

అంటి (అరటి) సుడివంటి దాననందు కోపినో"

23-198

**అంటుఁదామరలు :** వి; బహు. అంటుకొని జంటగా పుట్టిన తామరలు.

"ఆకసవుఁ గొలనిపై నంటుదామరలు వుట్టె

యీ కత చెప్పఁగదవే యింతిరో నీవు" 23-350

**అంటుకొను :** ప.బం; స.క్రి. తగులుకొను, లగ్నమగు, ఆసక్తమగు.

"అచ్చట నీ వెవ్వతెనో అంటుకొన్నది చాలక

యిచ్చగించి నాతోఁజెప్ప విది యొకటి" 11-215

**అంటుజేయు :** ప.బం; స.క్రి. అపరిశుద్ధం చేయు, మైలపడ జేయు.

"ఇతవుగానివార మేల నీకు నా మేని

అతితాప మంటుఁజేసు నటు వోవయ్యా" 5-40

**అంటుబచ్చలి :** వి. తీగెకు అంటుకొని పైకి పాకే ఒకరకం బచ్చలి. ఒకదాన్ని ఆధారంగా చేసుకొని ఉండేది.

"వోడఁగట్టిన దూలమై వొకతె నీ కుండఁగాను

ఆడనే వేరొకతెకు నంటుబచ్చలైతివి" 18-232

ఓడకు నడుమ కట్టిన నిలువుదూలము (దీనికి తెరచాప కడతారు) వలె నీకు ఒకతె ఉండగా నిన్నంటుకొని పాకిన బచ్చలితీగె వలె అంటుకొని వేరొకతె ........ ఓడవంటి నీకు నడిమి దూలముగా ఒకతె (లక్ష్మి) ఉరమున నుండగా దానికి పద్మావతి అంటుకొన్న బచ్చలితీగెవలె కలిసిందని భావం.

**అంటుబచ్చలి వంటివాఁడు :** ఒకదాన్ని ఆధారం చేసుకొని ఉండేవాడు.

"అవునయ్య నీ సుద్దు లటువంటివి

జవళితో నంటుబచ్చలి వంటివాఁడవు" 19-20

**అంటుముట్టు :** ప.బం. 'అంటు' అనే అర్థంలో జంటపదం. 1. స్పృశించు, తాకు, సంబంధం కల్పించుకొను. వి. 2. సంబంధం, స్పర్శ, తాకిడి, మైల 3. ఆర్తవం, ముట్టు 4. విటీవిట సంబంధం.

"అంటుముట్టు అడియాసకేకా మెంటునఁ

జెమటలు మిక్కిలిఁ బొలసె" 20-356

"అంటుముట్టు లేక మనసు లంటుకొన్న చెలిమి

కంటఁగంట నవ్వించే ఘనమైన చెలిమి" 1-29

**అంటురాయి :** వి. సూదంటురాయి, అయస్కాంతం చూ : సూదిరాయి.

"ఇదివో నీ పొందు లెట్టనరాదు

కదిసితే నంటురాయి గతివంటివాడవు" 18-20

**అంటుసంటు :** ప.బం; వి. అయినవారు, చుట్టాలు, రక్తసంబంధులు. (ఆం.శ.ర.)

**అండవారు :** (అండ+వారు) వి; బహు. సమీపంలోని వారు.

"అతఁడూ నీవూ నొక్కటే అండవారలే వేరు

సతులతో నీ గుట్టు సారెఁ జూపేవు" 14-82

**అందుకాచు :** అ.క్రి. 'ఆలసించు' కావచ్చు. నిఘంటువుల్లో వాచ్యార్థం. కానరాదు (పద. వ్యా.) దీనికి సం.ప.న. లో ఈవిధంగా వివరణ ఉంది. "అందు = going near అని కిట్టెల్. అండై అని తమిళము. అండ అని తెలుగు. కాచు ధాతువు సాహచర్యముతో అందు శబ్దము, దగ్గరగ తిరిగి రహస్యమును గుర్తించు అను నర్థమున మాండలికముగ ప్రసిద్ధము. కిట్టెలిచ్చిన యర్థమున కిది కొంత విశేషార్థము కావచ్చును. (18 సం. 427 పు.)

"తోడనే మాటాడేవారిఁ దోయనేల సరసము

ఆడరాదా యేఁటికి నీ నందుకాచేవు" 18-150

"అందుకాచే వదియేమే ఆదరించి యాతఁడు

పెండెము నీ పాదమునఁ బెట్టేనంతేను" 18-144

"కొండవలె నన్నునే కూటిమి మనలో నెందో

అందుకాచి నీవతని నడిగితివటవే" 25-50

"మెండుగా బరకాంతలమీఁది తమి పుట్టితేను

అండుకాచందుకు భ్రమయకుండుటే బుద్ధి"
2-195

"సెలవి నవ్వినవాఁడు సిగ్గులు దేరుచుఁగాక
అలసి తానింకా నేమి అండుకాచీనే" 25-90

**అండుకొను:** అ.క్రి. అంటుకొను (?) లేదా అండకొను కావచ్చు. ఆశ్రయించు.

"అండనే శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
అండుకొని యిప్పుడూ నీ యండనే
వున్నదానవు" 17-387

"అండనుండుమని నన్ను నంత
వాలాయించకువే
అండుకొని మరుఁడేడ నాయమేసునో" 11-285

**అంతకతొల్లి:** అవ్య. అంతకుముందు.

"అంటఁగాక వున్నదాన నట్టె వుండరా
అంటెనె నీ చూపులు నన్నంతకతొల్లె" 9-48

**అంతయింత యను :** వ.బం; స.క్రి. లెక్కించు, పరిగణించు, పరిమాణాన్ని తెలుపు.

"ఆమని నీ సింగార మంత యింత యనరాదు
వేమారు నీ చూపు వెల్లి విరిసీఁగాన" 20-205

**అంతరంగమైనవాఁడు:** వి. ఆప్తుడైనవాడు, సన్నిహితుడైన వాడు, ప్రాణమిత్రుడు.

"అంతరంగమైనవారి నాదరించకేఁకఁబోదు
పంతము నీది సుమ్మీ బడిదాన నేను" 11-566

**అంతరంగుడు:** వి. మిక్కిలి ఆప్తుడు, ప్రాణసఖుడు.

"అట్టె శ్రీవేంకటేశుఁడ వంతరంగుడవు హరి
వుట్టిపడి కానకున్న నొచ్చెము దేహికి హరి"
3-369

"అంతరంగులున్నారా నన్నాదరించేరా"
అని క్షేత్రయ్య. ఇట అంతరంగి అనే పదానికి ప్రాణసఖి అని అర్థం.

**అంతరంగురాలు:** (అంతరంగ + ఆలు) ప్రధానురాలు, మిక్కిలి ఆప్తురాలు.

"పంతగత్తె నంటాను బలిమి చూపను నేను
అంతరంగురాల నంటూ నట్టె సొలదు" 28-500

**అంతరాత్మకుఁడు:** వి. అంతరాత్మ స్వరూపుడు, దేవుడు.

"ఆతుమ నున్నాఁడు అంతరాత్మకుడు
ఆతుమ మరచిన నాతడు మరచును" 3-378

**అంతరియామి:** వి. 'అంతర్యామి'కి వికృతరూపం. అంతటా వ్యాపించి యున్నవాడు. జీవాత్మ, పరమాత్మ. అన్నమయ్య 'అంతర్యామి' అనే రూపం కూడా వాడినాడు.

"రవ్వగు శ్రీసతి రమణుఁడు మా
కవ్వనజోదరుఁ డంతరియామి" 1-83 & 2-381

**అంతరియామిత్వము:** వి. 'అంతర్యామిత్వము' నకు వికృతి రూపం; అంతటా వ్యాపించి ఉండే లక్షణం.

"వరుస నంతరియామిత్వము నవతారములు
పరఁగ మూడుమూర్తుల ప్రభావము" 2-332

**అంతరు:** వి. 'అంతరువు' కు రూపాంతరమా? 1. తారతమ్యం 2. చాటు, మరుగు.

"చీచీ యిందుకే పో సిగ్గయ్యీ నాకు
యేచి అంతరు మాలిన యీడుజోడు లేలరా"
11-214

**అంతేసివారము:** వి; బహు. గొప్పవారు.

"అంతేసివారల కటువలె నుండఁగ
వింతజీవులకు వివేక మెట్లొకో" 3-335

**అందఁగాఁడు:** వి. సుందరుడు; ఇందులో అందశబ్దం మీది అరసున్న చింత్యం.

"అందఁగాఁడ తిరువేంకటాద్రీశ పెక్కిండ్ల విందవై
నీ
వొ(కొ)కతెపై వెచ్చఁదన మున్నదా" 5-1

అందశబ్దంమీద అరసున్న లేని ప్రయోగం కూడ కనిపిస్తుంది.

"అద్దుకొనీఁ గాఁగిట అందగాఁడు" 18-105

**అందగారి:** వి. అందగాడు. ఈ అర్థంలో కన్నడంలో 'అందగార' అని అంటారు. A showy man, a handsome man (కిట్టెల్).

'అందగార' నుండి ఏర్పడిందే ఈ అందగారి అనే పదం.

"ఎక్కడనుండి వచ్చెనో యీపె నీకు

గక్కున యీ చేతలను కడు నందగారి"

29-524

అందగారితనము : వి.సౌందర్యం, అందం ; చూ: అందగారి

"ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి

అందగారితనమైతే నట్టి నిన్ను నవ్వనా" 27-84

అందగారిది : (అందగారి + అది) వి. సౌందర్యవతి, అందకత్తె ; చూ: అందగారి.

"మందెమేళపుదానికి మారుకొని వుండఁజెల్లు

అందగారిదానికిపై యాడఁజెల్లును" 25-119

అందగారిమాటలు : వి; బహు. అందమైన మాటలు చూ: అందగారి.

అందచందము : (అందము + చందము) వి. సొగసు అనే అర్థంలో వాడబడే జంటపదం. 'చందము' లోని 'చ' కారం లోపింపగా ఏర్పడ్డపదమే అందం.

"తివిరి శ్రీవేంకటేశ తెరవఁగూడితి విట్టే

సవరనిమేని కందచందమే సింగారము" 7-374

అందదుకు : (అదుకు + అదుకు) విణ. మిక్కిలి అదుకులు గలది, చాలీచాలని అనే రెండర్థాలు నిఘంటువుల్లో కనిపిస్తున్నాయి.

"కొందరు చుట్టాలు కొందరు వగసే

అందదుకు మానుటదియే నీ పూజ" 3-320

అందనిపంటి కళ్లు చాచు : ప.బం; అ.క్రి. దొరకనిదానికై, అలభ్యమైన దానికై ఆశించు (అందని పండుకై మెడ చాచు అని వాచ్యార్థం.)

"వెస గురుఁడు లేక శ్రీవేంటేశు సాధించితే

అసదై యందని పంటి కళ్లు చాచుట" 15-106

అందని పండ్లకు అఖ్ఖు చాచు : ప.బం; అ.క్రి. అలభ్యమైన దానికై ఆశించు.

"చిందరవందర పని చెప్పుదునో వుండేవో

అందని పండ్ల కేల యఖ్ఖు చాచే విపుడు"

17-127

అందని మానిఫలంబు : ప.బం; వి. అలభ్యవస్తువు, అలభ్యం.

"ఆ కమలోదరుఁ గోరని కోరికె

లందని మానిఫలంబులు" 2-235

అందికలుఁ బొందికలు : ప.బం; వి; బహు. ఈడుజోడు వంటి శబ్దం.

"విందము దన సుద్దులు వేగిర మేలే

అందికలుఁ బొందికలు అణఁగీనా యిఁకను"

14-263

అందిపొందు : ప.బం; స.క్రి. 1. పొందు 2. అంటు, తాకు 3. గ్రహించు, పట్టుకొను 4. అందుకొను 5. చేరు, అతుకు 6. అవలంబించు. అ.క్రి. 1. లభ్యమగు 2. సమానమగు, సాటియగు 3. సరిపడు, తగియుండు.

"జిడ్డుదేరఁ జెనకఁగా శ్రీవేంకటేశ

అడ్డాక లేక ఇట్టె అంది పొందవలదా" 28-189

అందుకంటె : దానికంటె. ఇట 'దాని' అనే షష్ఠ్యంత తచ్ఛబ్దార్థానికి బదులుగా అందు అనే సప్తమ్యర్థకం ప్రయోగింపబడటం విశేషం. అందుకొఱకు వంటిది.

"ఇరవున యిటుగాక యెరవెరవై వూడితే

పరఁగ నందుకంటె పాపము లేదు" 23-286

"పాయుమన్న నందుకంటె పాపము లేదు"

అందుకు : కొఱకు, కోసం అనే అర్థాల్లో క్రియాజన్య విశేషణంపై వాడబడే పదం. ఉదా:- కూడేయందుకు, వచ్చేయందుకు మొ॥

"అంగవించి నిన్నుఁగూడేయందుకు

నేనూఁగలను

చుంగుల శ్రీవేంకటేశ చొక్కవద్దా యిఁకను"

11-122

అందుకోలు : వి. 1. చేతికి అందుబాటులో నున్నది, సమీపం 2. అందుకోవటం 3. అతి సమీపం

"యెందరిఁ గైకొంటివో యిటువలెనె తొల్లి

అందుకోలు వావు లిట్లు నీకు నిపుడు" 27-86

"ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి

అందుకోలు జాణతనాలాడేవా ఇంకాను "
26-482

"సందుసుడి వనితవు జాణవమ్మా
అందుకోలు పెండ్లాడే వౌనమ్మా" 18-160

**అందుతో:** దానితో, ఇట 'దాని' అనే షష్ఠ్యంత తచ్ఛబ్దార్థకానికి బదులుగా 'అందు' అనే సప్తమ్యర్థకం ప్రయోగింపబడటం విశేషం.

"సంపెంగనూనె యంపేవు సారెసారె నందుతోనె
అంపవైతి గన్నెరలు అప్పుడైనాను" 5-87

**అందుమీఁద:** దానిమీద, 'దాని' అనే షష్ఠ్యంతానికి బదులుగా 'అందు' అనే సప్తమ్యంత ప్రయోగం విలక్షణం.

"అందుమీఁద నాలఁగాచే వతి మంకుఁదనము
సందుల వంకలొత్తితే చాయకు వచ్చీనా" 7-415

**అందువంక:** అందుమూలంగా, దాని కారణంగా.

"అంగవించి అందువంక అన్నిటా వెరవుదేరి
రంగుగా యీడ నిట్టే రచ్చసేసే విపుడు" 20-409

**అందెల సూడిగాలాపె:** వి. అందెల చేతి కడియాలు గల స్త్రీ.

"అందెల సూడిగాలాపె అండనుండి విడెమిచ్చె
అంది ఇచ్చీ కొనవేళ్ల నాకు మడిచి" 22-181

**అంబరమధ్య:** వి. స్త్రీ; వ్యు. శూన్యమైన నడుము గలది.

"కంబుకంఠికిని కప్రపుబొట్టు వెట్టరే
అంబరమధ్యకును ఆరతులు యెత్తరే" 29-15

**అంబారాసులు:** వి; బహు. ధాన్యపురాసులు.

"లంపటాలు సంపదలు లలి నంబారాసులాయ
యింపుల ముంచి తలలకెత్తుకోరో" 3-170

**అంబాళపుఁగాయలు:** వి; బహు. భక్ష్యవిశేషము.

"పాయరాని యంబాళపుఁగాయలు
నాయతమగు దధ్యన్నములు" 6-4

**అక్కాళపాశము:** వి. 'అక్కుళ్లు' అనే ధాన్యవిశేషంతో చేసిన పాయసం, ఆకలి పుట్టించే పాయసం.

"అక్కాళపాశాలు నప్పాలు వడలు
పెక్కైన సయిదంపు పేణిలును" 1-22

**అక్కిలించు:** అ.క్రి. 'అక్కళించు'కు రూపాం. కావచ్చు. పొట్ట మొ॥ ముడుగజేయు, సంకుచితం చేయు, తగ్గించు.

"ముక్కున నూర్పులు నీకు ముంచె నంటె లేదంటా
అక్కిలించి లోలోనె ఆఁపీనె వీఁడు" 11-182

**అక్షంతలు:** వి; బహు. 1. పూజాదులకు ఉపయోగించే పసుపు (లేదా కుంకుమ) కలిపిన బియ్యం, సేసఁబ్రాలు 2. నొసటి బొట్టుకై బొగ్గు కలిపి నలుపు చేయబడిన పసుపులేపం, చాదు, రూపాం. అక్షింతలు. 'అక్షతలు' అని సాధు రూపం.

"దండిగా నొసల నక్షంతలు నీకుఁబెట్టు మనె
దండమువెట్టు మనెను తనమారుగా" 14-492

"దయపుట్టఁ జెప్పి నీతోఁ దమయింటఁ బెండ్లి యని
ప్రియమున నక్షంతలు పెట్టెఁగా నీకు" 24-426

**అక్షరవాచి:** వి. బ్రహ్మ(?)

"అరయ నక్షరవాచి యతఁడట యిలలోన
పరమమంత్రాలె పో పలుకు లెల్ల" 4-341

**అఖండదీపము:** వి. దేవాలయంలో ఒక్కక్షణం కూడా ఆరిపోకుండా రాత్రింబవళ్లు వెలిగే దీపం.

"దిట్టయై కోరి యఖండదీప మెత్తఁగఁ బోలు
నిట్టు చూపే చూచీని నివ్వెరగై" 24-61

**అగడు:** విశ. నీచం, హీనం, నింద్యం. వి. అపనింద, దూరు, పేరాశ.

"తగుల వలచువాఁడు తమకమె చూపుఁగాక
అగడైన అడియాస లణఁచఁగఁ గలఁడా" 7-367

"అగడుగా మొగమాట లాడించవద్దు గాని
తగిలిన చన్నులంటఁగా తగదనేనా" 27-7

**అగడుసేయు:** (అగడు+చేయు) స.క్రి. 1.రట్టుచేయు, అల్లరి చేయు 2. చిన్నపుచ్చు 3. నిందించు.

"మొగమాటలు గలవు ముంచి యంకెకు రాకుంటే

అగడుసేసి కోపము లణఁచఁగరాదు" 26-353

"విభునిఁ దెమ్మని చెలులతోఁ జెప్పఁగఁబోతే

అగడు సేయకుమని ఆనపెట్టేనే" 10-2-45

"పగటున నే నీతో పలుకక వుండితేను

అగడుసేసి యిట్టె అలిగితి వనవా" 9-162

అగపడు: అ.క్రి. కనిపించు, ప్రత్యక్షమగు.

"అన్నిటా నిట్టే కాని యగపడదు

అన్నమదమునఁ జిత్త మగపడదు" 4-120

"అగపడి శ్రీవేంకటాద్రిపై నిల్చె నతఁడు

జగదేకమూర్తి కౌసల్యాసుతుఁడీపుడు" 4-279

అగవుదగవులు: ప.బం; వి; బహు. (అగవు + తగవు) పద.పారి. ఇచ్చిపుచ్చుకొనుటలు అనే అర్థాన్ని వ్యా.ప., వధూవరులకిచ్చే పెండ్లికానుకలు, సారెపెట్టి వధువు నత్తవారింటికి పంపే వేడుకలు అనే అర్థాన్ని చూపినాయి. ఇట 'కానుకలు' అనే అర్థం ఉచితంగా ఉంటుందేమో.

"తగిలి కొంగువట్టితే తమకించే నింతలో

అగవుదగవుల ప్రహ్లాదవరదా" 13-344

అగవూ తగవూ: వధూవరులకిచ్చే పెండ్లి కానుక.

"మృగరూపై గద్దెమీఁద మెఱిసీ వాఁడదిగో

అగవూఁదగవెఱిఁగి యహోబలేశుఁడు" 11-585

అగువరములు: వి; బహు. అనుకూలమగు వరములు, తగిన వరములు, చాలిన వరములు.

"చిగురుఁ జేవ యగు శ్రీవేంకటేశుఁడు

అగు వరములొసఁగు నటుగాన" 4-333

క్రిందిప్రయోగంలో ఇచ్చిపుచ్చుకోవడమనే అర్థం కుదురుతుంది.

"నగినదొక్కటే కాని నాకు నేమి తెలియదు

అగవుదగవు లెల్లా నాతఁడెరుఁగు" 27-392

అగ్గము: విణ. 1. అధీనం 2. కనబడింది 3. అనుకూలం, అందుబాటులోనిది, సమీపించింది.

"సిగ్గుపడ నేమిటికి చెక్కు చెయి యేమిటికి

అగ్గమై మీలోనఁబట్టినదే పంతము" 21-197

అగ్గలము: వి. రా.సీ; మాం. లెక్కలేకపోవడం, నిర్లక్ష్యం. బ్రౌన్. 1. మెండు 2. దుస్సహం.

"సిగ్గుపడ నేటికి చెందిన కౌగిటిలోన

అగ్గలమయ్యేరా నీకు నండవారెల్లా" 20-454

"అగ్గలపుసరసాల కవుఁగాదనేవు సుమ్మీ

సిగ్గుపడి చెక్కు చేత చింత నుందుఁగానీ"

20-257

"సిగ్గులే నిజమయితే సేవలు చేయఁగనేల

అగ్గలపురతుల చయ్యాటము" 26-252

అగ్గలిక: వి. 'అగ్గలిక'కు రూపాం. 1. ఉత్సాహం, పూనిక, విజృంభణం 2. ఆధిక్యం 3. శౌర్యం 4. విలాసచేష్ట.

"నీతి యెంత చూచితేను నీవెంత నేనెంత

యాతల నా యగ్గలికెకు నేమనుచున్నాడా"

15-413

అగ్గళిక: వి. ఉత్సాహం, పూనిక, విలాసచేష్ట, సరసం.

"వెగ్గళించి అతనిపై వేసితివి చేయి నీ

అగ్గళిక లెల్లఁజెల్లె నాయఁగదె పనులు" 15-26

అగ్గళ్లు: ప.బం; అ.క్రి. 'అగ్గడి' శబ్దానికి బహువచనరూపం. 1. ముందుభాగాలు 2. కొనలు 3. అంచులు.

"అప్పటి మానవే నీవు అతనిఁగానని వేళ

వుప్పరాలై అగ్గళ్లు వురికినదానవా" 17-109

"ఆరితేరినదేవుఁడ వగ్గళ్లురుకుదురా

రీతివారికైనా నిట్టుండు మోహము" 16-17

అగ్గిపొంతనున్న వెన్న: ప.బం; వి. కరగిపోయేది.

"చింతలవేదనలఁ జిక్కువడుచు నగ్గి

పొంతనున్న వెన్నయై పోయెఁగాలము" 1-48

అగ్గిబాసగొను: ప.బం; స.క్రి. అగ్నిపరీక్ష చేయు, అగ్నిసాక్షిగా పెండ్లాడు.

"అదరి వుత్తమురాలి నగ్గిబాస గొన్నవాఁడు

సడిఁబెట్టి మేనమామఁజంపినవాఁడు" 11-235

అగ్గువ: అ.క్రి. తగ్గు, చౌక.

"అమరఁగాపురము నీ వట్టే మాతోఁజేయఁగాను
తమక మగ్గువాయ చెంతల నెల్లాను" 13-311
పై కీర్తన పాదాలకు తరువాత నున్న పాదాల్లోని 'హెచ్చె' అనే పదం పై అర్థానికి సాధకంగా ఉంది.
"మమకారమున నీవే మాటలట్టే యాడఁగాను
ప్రమదపుటాసహెచ్చె భావించినట్టెల్లాను"
13-311

అగ్గువ అనే ఈ పదానికి 'చౌక' అనే అర్థం కూడా ఉంది.
"కోతి మాంసమగ్గువయ్యె"
"తడఁబడి నీ సుద్దులు దైలువారఁ జెవులును
అడఁచరాని నవ్వులు అగ్గువాయనయ్యా"
21-105

**అగ్నీకరణము :** వి. అగ్నిపాత్తుగా చేయడం.
"వివిధజంతువ్రాత భువన మగ్నీకరణ
నవనవప్రియ గుణార్ణవ నారసింహా" 1-281

**అఘాసురుఁడు :** వి. శ్రీకృష్ణునిచే చంపబడ్డ అసురుడు, బకాసురిని తమ్ముడు.
"తొడిఁబడ మద్దులు భువిపైఁ గూలఁగ దొబ్బి
యఘాసురుఁ జంపితివి" 3-277

**అచ్చలము :** (అ + చలము) వి. అ + చలము = అ పట్టుదల; క్రమంగా పట్టుదల అని రూఢి. 1. కోపం 2.పట్టుదల 3. ఉత్సాహం. అచ్చలాన అనేదానికి వదలక, దాచక అనే అర్థాలు సూచింపబడ్డాయి. 14సం 348 పు.
"వచ్చేనని రాకుందురా యేమే నీవు
అచ్చల మేమి గల్లాను అప్పుడే యాడరాదా"
17-48

"అచ్చలాననే పొద్దు నందనుండి పనేసేసి
నెచ్చెలులు గూడేది నీ సారము" 18-549
"అచ్చలానఁజేచాఁచితే నంతలు నిలుచునా
పెచ్చుపెరిగి వలపు పెద్దసేసుఁగాక" 29-529

**అచ్చలాన :** వదలక, దాచక; అచ్చల శబ్దభవం. స్ఖలితం ఛలమ్ అని అమరం.
"నెచ్చలి వలపుజాడో నీ వలపుజాడో యిది
అచ్చలాన నాతో నీవు ఆనతీవయ్యా" 14-599

**అచ్చికబుచ్చికలు :** ప.బం; వి; బహు. తేడాలు లేకపోవడం, అనుకూలత, బెల్లింపు మాటలు .
"మలసిన సరసపు మచ్చికలు
అలవాటైన రతుల అచ్చికబుచ్చికలు" 29-831

**అచ్చికము :** వి. 'అచ్చిక' కు రూపాం. 1. కలవరం, క్షోభ 2.కొరత, వెలితి, లోపం.
"కమ్మటి నీ భక్తి యనే కామధేను వున్నవారు
వుమ్మడి నచ్చికము లేకుందురయ్యా" 2-309
"ఇచ్చకుఁడ శ్రీవేంకటేశ నన్నుఁగూడితి
అచ్చికములెల్లఁబాసె నంపరాదా" 19-486

**అచ్చితుడు :** వి. 'అచ్యుతుడు' అనడానికి జానపదవ్యవహారం; చూ. అచ్యుతుడు.
"అచ్చితుడు జనించె నద్దమరేతిరికాడ
ముచ్చిలు రాకాసులు ముట్టుపడిరి" 4-20

**అచ్చివచ్చు :** ప.బం; అ.క్రి. కలిసివచ్చు, శుభప్రదమగు.
"అచ్చివచ్చు నీ కెప్పుడు నంగనతోడి పొందు
కొచ్చికొచ్చి ఇందుకెంత కోరుకొంటా నుంటివో"
18-224

"అచ్చివచ్చిన చోటికి ఆయాలు దాకించుకొన్న
మచ్చికఁగళలు రేగే మర్మము తాను" 11-394
"కచ్చువెట్టి యాతఁడు నీ కైవసమై వున్నవాడు
అచ్చివచ్చునే నీకు నాతనిపై వలపు" 25-34

**అచ్చివచ్చులు :** ప.బం; వి; బహు. కలసిరావడాలు, శుభప్రదం కావడాలు, లాభసాటిగా ఉండడాలు, లాభించడాలు.
"ఆవు లీతని పేరిట నచ్చివచ్చు లెంచి చూడ
వేవేలు గొల్లెతలకు విటుఁడవును" 28-17

**అచ్చుకట్టు :** స.క్రి. 1. ఏర్పరుచు, విభజించు 2. నేర్పు, కర్రలకు వడిదారం కట్టి అచ్చు తయారు చేయు.
"యెడయక కళలనే యిదివో పదనులెక్క
కడగోరి రేక నచ్చుకట్టరాదా నీవు" 7-434

**అచ్చుతుఁడు :** వి. 'అచ్యుతుడు' అనే శబ్దానికి వికృతి రూపం. అచ్చితుడు అనే ప్రయోగం

కూడా ఉంది. విష్ణుమూర్తి.

"అచ్చుత మిమ్ముఁ దలంచేయంత పని వలెనా
యిచ్చల మీవారె మాకు నిహపరా లియ్యఁగా"
3-23

అన్నమయ్య 'అచ్చుత' శబ్దంతో పాటు 'అచ్యుత' శబ్దాన్ని కూడా ప్రయోగించినాడు.
"ఆదినంత్యము లేని అచ్యుతమూర్తివి"
2-122, 3-1, 3-561, 3-253

**అచ్చుమోపు:** (?)
"యిచ్చట శ్రీవేంటేశ యిహమందే వరమిచ్చి
అచ్చుమోపి యేలఁగా నేనన్నియుఁ దెలిసితి"
2-15

**అచ్చులు:** వి; బహు. ప్రతిరూపాలు.
"ఇచ్చకములాడినవే ఇంపులు నేకొఁగాక
అచ్చులము మమ్ము నేల అలయించేవు"
21-316

"నిచ్చనిచ్చ నీ గుణాలు నెఱుఁగని వున్నవా
అచ్చులొద్దు రిన్నిటాను ఆనలేనయ్యా" 27-2

**అచ్చొత్తినట్లు:** ప.బం. ముద్ర వేసినట్లు, గుర్తు వేసినట్లు.
"అతివఁజూచిన చూపు అచ్చొత్తినట్లు నీ
మతిలో నున్నదో మాటాడవు" 24-554

**అజాగళస్తనము:** వి. వ్యర్థం, నిష్ప్రయోజనం. మేకమెడలో నున్న స్తనాలు పాలేమీ ఇవ్వవు కనుక అవి వ్యర్థమే కదా!
"అదె యశక్తుఁడ నేను అజాగళస్తనము
అదియె పనికి వచ్చునంతయె నేను" 15-202

**అజామిళుఁడు:** రూపాం. అజామీళుడు, అజామీడుడు. ఒక బ్రాహ్మణుడు శూద్రస్త్రీని కూడి ధర్మాన్ని వీడి పాపకర్మలు చేసేవాడు. ఇతని కామె యందు సంతానం కలిగింది. అతని పేరు నారాయణుడు. అజామీళుడు రోగగ్రస్తుడై మృతి చెందడానికి సిద్ధంగా ఉండగా అతని ప్రాణాలు తీసుకు పోవడానికి యమదూతలు రాగా అతడు తన కుమారుని నారాయణా! అని పిలిచినాడు. అది విష్ణునామం కనుక విష్ణుదూతలు వచ్చినారు. అజామీళుడు కుమారునుద్దేశించి పలికిందే అయినప్పటికీ నారాయణపదం విష్ణునామం కనుక అక్కడ యమదూతలకు స్థానం లేదని వారు అజామీళుని స్వర్గానికే తీసుకొనిపోయినారు. ఆవిధంగా అజామీళుడు విష్ణువు అనుగ్రహానికి పాత్రుడైనాడు.
"శ్రీపతినే అడిగినను జిగి నజామీళువలె
చేపట్టి సిరుల రక్షించుగాక" 4-347

**అజ్జకాఁడు:** (అజ్జ+కాఁడు) వి.అదను తెలిసినవాడు, నేర్పరి
"బుజ్జగించరాదా పొలఁతి నిట్టె
అజ్జకాఁడ నంటా నుంటి వౌనయ్యా నీవు"
13-358

**అజ్జాయించు:** అ.క్రి. ఆలస్యం చేయు, తాత్సారం చేయు. (అజ్జ = సమయం)

**అటమటపడు:** అ.క్రి. బాధపడు, వ్యాకులపడు.

**అటమటీడు:** (అటమటము + ఈడు) దుష్టుడు, వంచకుడు, అసత్యాలు మాట్లాడేవాడు, వ్యర్థుడు. (అటమట = వంచన, దుఃఖం, అసత్యం, వ్యర్థం అని ఆం.ప.ని.)

**అటికలి:** వి. 'అటకలి'కి రూపాం. కుంకుడుగాయపులుసు, సీకాయపొడి మున్నగు జిడ్డును పోగొట్టే ద్రవ్యం, జిడ్డు పోవడానికి రుద్దుకునే ఉడకబెట్టిన పిండివంటి పదార్థం. అన్నమయ్య ఈ పదాన్ని 'అటికలి' అని ప్రయోగించినాడు.
"సంతసాన నంటరో సంపెంగనూనియ దెచ్చి
కాంతలు గందపుటటికలి వెట్టరో". 7-473

**అటుగనక:** అవ్య. అందువల్ల, అ కారణంగా.
"అటుగనకనేఁ దన్ను నౌఁగాదనఁగలనా
నటనఁ దన కరుణే నాకు వలెఁగాకా" 12-516

**అట్ట:** వి; బహు. తలతెగిన శరీరం, కబంధం.
"అని రావణు తల లట్టలుఁ బొందించి
చెనకి భూతములు చెప్పె బుద్ధి" 3-31

**అట్టలుగట్టు:** అ.క్రి. అట్టలుగా ఏర్పడు.
"గుట్టున శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె

అట్టలుగట్ట నవ్వితివా కన్నులనే" 16-178

**అట్టుగ :** వి. 'అటక'. రూపాం. అటుక, అటక, అటుకు, అట్టిక, అట్టువ.

"అక్కజపు రోళ్లక్కి అట్టుగపై దాఁచిన
చక్కిలాలు నురుగులుఁ జవిగొసీని" 24-267

"గొల్లఁడు దెచ్చిన పాలకుండ లందుకొనవలె
యిల్లు చొచ్చి అట్టుగపై నెక్క కుండవయ్యా"
11-273

**అట్టువంచి తడుకల్లు :** ప.బం. శ్రమపడి ప్రయత్నం చేయు.

**అడపకత్తె :** (అడపము + కత్తె) వి. వక్కలాకుల సంచిని లేదా బరణిని అందించే స్త్రీ, తాంబూలకరండ వాహిని, తాంబూలమందించే స్త్రీ; చూ : అడపము వనిత.

"పడియుఁజెమటలతో వలపులు రేఁగఁగాను
అడపకత్తెలతోడి ఆలోచన వలెనా" 13-25

**అడపమాపె :** (అడపము + ఆపె) వి. వక్కలాకుల సంచిని అందించే స్త్రీ.

"పెట్టుకొన్న పదకము పెద్ద అడపమాపెది
నెట్టన నీ సింగారాలు నే నెరఁగనా" 7-432

**అడపముది :** (అడపము + అది) వక్కలాకుల సంచి లేక బరణిని అందించే స్త్రీ.

"తారుకాణ నేసి నిన్నుఁ దడవఁగరాదుగాక
కోరి యడపముదానిఁ గొనగోర నూఁదవా"
29-456

**అడపము వనిత :** వి. వక్కలాకుల సంచిని లేదా బరణిని అందించే స్త్రీ . తాంబూలమందించే స్త్రీ. చూ : అడపకత్తె, అడపము సతి మొ॥

"తొడ చరచి నన్నేల అడిగేవు విడెము
అడపము వనిత నీ కందియ్యఁగా" 25-85

**అడపమువారు :** వి; బహు. అడపం అంటే వక్కలాకులు ఉంచుకునే సంచి. అడపంవారు అంటే రాజులకు తాబూలం అందించే సేవకులు లేక సేవికలు అని అర్థం.

"అలివకు నీకు నేము అడపమువారము"
20-5-33

**అడపమువెలఁది :** వక్కలాకుల సంచిని లేదా బరణిని అందించే స్త్రీ . తాంబూలమందించే స్త్రీ.

"వూడిగపుసతులాల వొద్ద నుండగదరే
వీడె మీరే అడపమువెలఁదులాల" 24-268

**అడపముసతి :** వి. వక్కలాకుల సంచిని లేదా బరణిని అందించే స్త్రీ . తాంబూలమందించే స్త్రీ.

"జాడతోనే అడపముసతుల వెదకఁగాను
వీడెము నీ విచ్చేవు విటకత్తెవమ్మా" 12-160

**అడబాల :** వి. వంటవాడు, వంటకత్తె (అడపాల = వంటశాల)

"పొత్తుల నాకెతో నుండి పూఁచి వడ్డించుమనేవు
హత్తి మీకు నిద్దరికి నడబాలనా" 17-214

"అగ్గమై తవుడుదిండి కడబాల లేల" 15-154

అడబళ = అడవళ A cook, అడి - అడె, అడిగె - cooking, అడిగెమాడువవళు - A female cook" అని కిటెల్ నిఘంటువులో 'అడబళ' అనే పదానికి వంటవాడు అనే అర్థం చూపబడింది. అడబళకే అడబాల అనేది వికృతి రూపం. బసవపురాణం లోనూ (7 ఆ.) పోతనభాగవతం (10 స్కం. II-7) లోనూ దీనికి ప్రయోగాలు కనిపిస్తున్నాయి.

**అడబాల సతి :** వి. వంటకత్తె.

"అడబాలసతి బోనమారగించు మటంచు
బడిబడిని విన్నపము సేయఁగా" 2-23

**అడవిఁగాసిన వెన్నెల :** ప.బం; వి. వ్యర్థం, నిరుపయోగం. అడవిలో కాసే వెన్నెల అని వాచ్యార్థం.

"వొడలఁబెట్టిన సొమ్ము లొగిఁ దనకుఁ గానరా
వడవిఁగాసిన వెన్నె లది కన్నులకును" 1-486

"హరిగొలువని కొలువులు మఱి
యడవిఁగాసిన వెన్నెలలు" 2-235

**అడవిఁగాసే వెన్నెల :** ప.బం; వి. వ్యర్థమైనది.

"ఇంత గాల మాయను యేడ నున్నారో వీరు
వింతలై యడవిఁ గాసే వెన్నెలాయ బ్రదుకు"
3-344

"ఆవలి మోమైన నవ్వు అడవిఁగాసే వెన్నెల
తనివి యాతని నెంతదడవు సాదించేనే"
17-187

**అడవికిఁగాయు వెన్నెల:** ప.బం; వి. వ్యర్థం, నిరుపయోగం. అడవిలో కాసే వెన్నెల అని వాచ్యార్థం.

"పోయఁ గాలంబడవికిఁగాయు వెన్నెల కరణి
శ్రీయుతుఁ దలచుడీ నరులు మాయఁబడి
చెడక" 1-194

**అడవిమృగములకు పల్లము వేయు:** అ.క్రి. పల్లము అంటే గుఱ్ఱం మొదలైన వాటిని ఎక్కేప్పుడు కింద మెత్తగా ఉండడానికి కుట్టి మీదవేసికట్టే గంత అని అర్థం. అడవి మృగాలకు పల్లము వేయడమంటే వ్యర్థమని భావం. అడవి మృగాలపై స్వారీ చేయడం సాధ్యం కాదు కనుక వాటిపై పల్లం వేయడం వ్యర్థమే కదా!

"అల్లనె చూడవె అడవిమృగములకుఁ
బల్లము వేసీఁబై వీఁడు" 5-124

**అడవుల వెన్నెల:** ప.బం; వి. వ్యర్థం, నిష్ప్రయోజనం.

"అడవుల వెన్నెలలాడెడి బ్రదుకులు
తడతాఁకుల పరితాపములు" 1-24

**అడాటము:** వి. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు. ఇది 'ఎడాటము' కావచ్చును. ఎడాటమునకు 1. విషయం 2.భేదం, ప్రణయకోపం 3. క్రీడావిలాసం 4. ఎడబాటు అనే అర్థాలు ఉన్నాయి.

ప్రణయకోపం:

"మగువఁగూడితి నెమ్మది శ్రీవేంకటేశుఁడ
అగడుసేయ నున్నదా అంగన యడాటాన"
14-10

"పొందుసేయ వలసితే పొలఁతుల యడాటాన
యిందుముఖులను జూపి యెలయింతురా"
14-500

"జాణతన మెంచవద్దా సతుల యడాటాన
వీణె వాయించినదాఁకా వేగిరమా" 23-464

విషయం, క్రీడావిలాసం:

"కాంతల యడాటాన కాఁకదేరినవాఁడవు
చెంతల వలపించ నేర్చినవాఁడవు" 23-452

**అడిచిపడు:** ప.బం; అ.క్రి. తమకించు, త్వరపడు, మండిపడు.

"బెదరి యైదుగురికిని భీతినొందుచుఁగడుఁ
జెదరంగఁజూతువే చిలుకా
అదయులైన శత్రులాఱుగురికిఁ గాక
అడిచిపడుదువే నీవు చిలుకా" 1-50

**అడిబంటు:** (అడి + బంటు) ప.బం; వి. సేవకుడు, కాపలావాడు, పాదసేవకుడని వాచ్యార్థం. బ్రౌన్ ధూర్తుడు అని వివరించినాడు. అర్థమిట సరిపడదు.

"కామక్రోధములకు కాణాచికాఁపను
ఆమని యింద్రియముల కడిబంటను" 2-480

**అడిబండఁడు:** ప.బం; వి. అధముడు, దుష్టుడు, సిగ్గుమాలినవాడు, ఒక తిట్టు. రూపాం. అడిబండ.

"చిడిముడిగొల్లెతల చీరలు దొంగిలినట్టి
అడిబండనికి నేటి యాచారమే" 9-102

కిటెల్ నిఘంటువులో "అడి, అడియ, అడిగ - one who is in low position, slave, బండు, బండ (k) వండ (T) a shameless dishon ourable man" అని చూపబడింది.

**అడియాలము:** (46) (అడ + ఆలము) వి. క. అడయాళ 1.ఆనవాలు 2.రుజువు, ప్రమాణం (3.చిహ్నలతో కూడిన రాజధ్వజాదికం.)

"అడరి సొమ్ములిద్దర మట్టే మార్చుకొంటి మని
అడియాల మిచ్చి పంపనందు కేమే" 7-162

**అడియాలముగ:** క్రి.విశే; మాం. అలవోకగా, సులభముగా.

"అడియాలముగ గోరనంటి యంటి చెనకేవు
కడు నాతఁడు మరిగి కైకొనునంటాను" 29-18

**అడుకులు:** (4) వి; బహు. అటుకులు.

"అడుకులు చక్కిలాలు ఆనవాలు నురుగులు

వడపప్పు మొదలుగా వాములకొలఁదులు"

4-27

ఇట 'అడుకులు' లోని దకారం ప్రాసస్థానంలో ఉండడం వల్ల ఇది నిర్ధారకప్రయోగం.

**అడుగడుగుకు:** ప.బం. మాటిమాటికి, తేపతేపకు, పదేపదే.

"అడుగడుగుకు నీ వాడఁగాను మా

బడలికంతయుఁదీయ పండరంగిరాయ" 5-218

"అడుగడుగుకు విడే లందుకొంటా సంకీర్తన

లెడయుక భాగవతు లెచ్చి పాడఁగా" 18-281

"పొంచి అడుగడుగుకుఁ బొడలేవాఁడు

చెంచలించక పగలు సాదించేవాఁడు" 28-350

**అడుగులకు మడుగులు పరచు:** ప.బం; స.క్రి. అతిభక్తితో సేవించు, పూర్వం ఎవరైనా గొప్పవారు వస్తే వారి అడుగులు నేలకు తగులకుండా ఉతికిన బట్ట పరచి దానిమీద నడిపించుకొంటూ వచ్చేవారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"అడుగులకు మడుగులాపె కిట్టే పరచేవు

యెడయకాపె కాఁగిట నెనుశుండేవు" 13-175

"అరివి మోహమున నీ యడుగులకు మడుగులే

బరచకా విరహతాపమునఁ బడవలసే" 5-213

"అడుగులకు మడుఁగు లటు నీవు పరచేవు

బడి నాపె గర్వమైతే పట్టరాదు" 26-401

**అడువు:** వి. ఎక్కువ, అతి (వ్యు.)

"యీవలను శ్రీవేంటేశు శరణాగతుల

కావటించిన పుణ్య మడువు గాదు" 2-114

**అడుసు చొరు కాళ్లు కడుగు:** ప.బం. స్వయంగా ఆపదను తెచ్చుకొని దానికి ప్రతీకారం చేసుకొను. (బురదతొక్కు - కాళ్లుకడుగు అని వాచ్యార్థం.)

"అడుసు చొరనేపట్టి నటునిటు గాళ్లుఁ

గడుగుకొననే పట్టెఁ గలకాలము" 1-14

**అడుసులోపలి కంబము:** ప.బం; వి. అస్థిరం, నిలువనిది, బురదలోని స్తంభం స్థిరంగా నిలువదు కదా!

"గడకుఁగట్టిన పాఁతగతి దోచె మనసు

అడుసులోపలి కంబమై తోఁచె మనసు" 1-337

**అడ్డపాటి:** (అడ్డపాటు?) ఇది 'అడ్డపాటు' కు రూపాం. కావచ్చు. ఆటంకం, నిరోధం, అడ్డగింత.

"ఆఅడి యితని భక్తులైన చనవరులకు

ఆఱితేరి పుణ్యపాపా లడ్డపాటి లేదు" 15-110

**అడ్డపాపఁడు:** (అడ్డము+ పాపఁడు) వి. అడ్డముగా పట్టదగిన శిశువు, పసిబిడ్డ.

"నడ్డిముక్కుతోడ వెఱ్ఱినవ్వులు నవ్వేవాఁడు

అడ్డపాపఁడై యున్న ఆకుమీఁదివాఁడు"

4-43 & 6-60

**అడ్డమాడు:** (3) ప.బం; అ.క్రి. అడ్డుచెప్పు, వ్యతిరేకించు, విరుద్ధంగా చెప్పు, ఎదురుచెప్పు.

"అడ్డమాడఁజాలను అవుఁగాదనఁజాలను

దొడ్డదొరవు నీ మాట తోయఁజాలను" 18-342

**అడ్డాఁక:** (5) (అడ్డు + ఆఁక) ప.బం; వి. అడ్డు, నిరోధం, నిర్బంధం, ఎదురు అనే అర్థాల్లో జంటపదం.

"జిడ్డుదేరఁ జెనకఁగా శ్రీవేంకటేశ కూడితి

వడ్డాఁక లేక ఇట్టె అంది పొందవలదా" 28-189

**అడ్డాలుదుడ్డాలు వచ్చు:** ప.బం; వి; బహు. తారుమారుగా వచ్చు, అడ్డదిడ్డంగావచ్చు.

"వొడ్డినందుకెల్లా నాతఁడోపికతో నుండఁగాను

అడ్డాలుదుడ్డాలు వచ్చేవప్పుటి నీవు" 11-74

**అడ్డాలు వచ్చు:** ప.బం; అ.క్రి; రా.సీ.మాం. అడ్డుకొను, అడ్డుపడు. అడ్డాలడ్డాలు వస్తావే అని రా.సీ. ప్రయోగం. (అన్న. రా. మాం.)

"పూని నేనప్పటి నీపై పుప్పొడి చల్లితేను

ఆనుకొని సారెసారె అడ్డాలు వచ్చీని" 22-325

**అడ్డికపుది:** (అడ్డికము + అది) వి. ఎల్లప్పుడు సమీపము నందుండు పరిచారికయా అని సం.ప.స. 14 సం 348 పు.

"గట్టిగాఁ దమవద్దనే కాచుకవుండుమనీ

దట్టమైన అడ్డికపుదాననా నేను" 14-567

**అడ్డివెట్టు:** అ.క్రి. ఆటంకపఱచు, అడ్డుపెట్టు, నిరోధించు. క; త; తు. భాషల్లో అడ్డు అనే అర్థంలో అడ్డి అనే పదం ఉంది.
"వెడ్డువెట్టి నే మెల్లా వేసరితిమి
అడ్డివెట్టి కిప్పుడే రావయ్య లోనికిని" 23-395

**అడ్డెన:** వి. (?)
"అట్టె పీటపై నునిచి యడ్డెనపై బళ్లెమిడి
వొట్టి వడ్డించరే బోనా లువిదలాల" 22-242

**అణకించు:** స.క్రి. 1.ఎగతాళి చేయు, అపహసించు 2.మోసపుచ్చు, వంచించు 3.ఉల్లాసమాడు.
"కావించి కన్నులలోని కళంకు దెలియలేక
ఆవలిఁ జందురు నలు సణకించినట్లు" 3-192

**అతికము:** విణ. 'అధికము' అనే పదానికి జానపద వ్యవహారరూపం. ఎక్కువ.
"స్వతంత్రుడవు నీవు సరిలేని దొరవు నే
నతికమై యాడినట్లు ఆడఁబోయేనా" 4-431
ఇట తకారం ప్రాసస్థానంలో ఉండడంవల్ల ఈ ప్రయోగం నిర్ధారకం.

**అతినిష్ఠూరి:** విణ. మిక్కిలి కఠినుడు.
"సమరతి నాయకుని చాయకు రాకుండితేను
అమరిన చుట్టమా అతినిష్ఠూరి గాక" 7-393

**అతివసంతము ఆడు:** మిక్కిలిగా రంగులు చల్లుకొను.
"రతిదేవి మొదలైన రమణులు నాట్యమాడి
రతివసంతమాడే మేఘావళి యెల్ల" 7-445

**అతివె:** వి. 'అతివ'కు వ్యావహారికరూపం.
"అతివె లిదెంత వచ్చి యనరా నన్ను
రతిసేసి తెరదీసి రామలఁ బిలిపించేవు" 11-447

**అతిశయుఁడు:** వి. అధికుడు, అతిశయము (= ఆధిక్యము) అనే భావార్థకమైన పదానికి అధికుడని ధర్మివాచకంగా ప్రయోగం. ఇట్టి ప్రయోగాలు అన్నమయ్య కీర్తనల్లో ఎన్నో.
"అన్నిటాఁ దాము నతిశయులే
యెన్నఁగ నధికులె యెసఁగఁగను" 4 అను. 75

**అత్తగారు:** వి. ఇందులోని అరసున్న విలక్షణం.
"అత్తఁగారు వచ్చుదాఁకా నణఁగుంటిని
యెత్తిన కోపముతోడ యేమందునో" 21-67

**అత్తయింటికోడలు:** ప.బం; వి. మగనాలు, మగడుగల స్త్రీ.
"అత్తయింటికోడల నన్నుమ్మ మీఁద నేరా నీ
తొత్తుఁదిట్టినట్టె తిట్ట దొరకొంటివి" 5-3

**అత్తయ్య:** (అత్త + అయ్య) వి. అత్తగారు.
"గుడ్డము పయిన కోనేటిరాయని
నడ్డగించుకొంటి నత్తయ్యా" 5-313

**అత్తల:** (ఆ + తల) అవ్య. అవతల.
"చిత్తమంతర్ముఖము సేసుకొన నేర్చెవా
అత్తల నతఁడు యోగి యనఁబడును" 2-452

**అత్తలనిత్తల:** (అత్తల + ఇత్తల) ప.బం. అవతల - ఇవతల.
"అత్తలనిత్తల నీకు ఆపె నేను నుండగాను
పొత్తులనవ్వు నవ్వేవు పోపో నీవు" 9-271

**అత్తలివారు:** వి; బహు. అవతలివారు.
"పొత్తుకు రావలసిన నేఁబోరి యింతేనంటి
అత్తలివారి పొత్తు అరసితిఁగాక" 11-473

**అత్తింటికోడలు:** ప.బం; వి. మగనాలు, మగడు గల స్త్రీ.
"శ్రీవేంకటేశుడవు చిన్న చక్కనిదాన
ఆవటించేమి సేతువో అత్తింటికోడలను" 27-551

**అత్తు:** అ.క్రి. 1. కలసిమెలసి యుండు, ఏకీభవించు 2. తగులుపడు, అనుకూలమగు 3. కలుగు, సంభవించు 4. అంటుకొను 5. యుక్తమగు. స.క్రి. 1. అద్దుకొను 2. కూడు, పొందు.
"అత్తి శ్రీవేంకటపతి ఆదరించి కూడితివి
పొత్తు సత్తుఁగూడె నింక బూటక మేలయ్యా"
26-7

**అత్తుగడ:** వి. (అత్తు+కడ) పొందిక. (చేరుగడ, సామీప్యం)
"చిత్తము వచ్చినచోట సేవ లెల్లా నీడేరు
అత్తుగడైతే మాట లనువులౌను" 12-295

**అదను**: (10) వి. తగిన సమయం, అవకాశం, వేళ, విధం.

"అదన శ్రీవేంకటేశుఁడాతఁడే నన్ను నేలే
పదరకువే యాతఁడు వచ్చెదేరీ నంటాను"
25-165

**అదనూఁబదనూ**: సమయమూ సందర్భమూ అనే అర్థంలో జంటపదం.

"అదనూఁబదనూ నెఱిఁగి అండ నుంటేఁ జాలు
చదురుఁబదురు నొక్క సమ్మతౌనే" 17-32

**అదరుబెదరు**: వ.బం; అ.క్రి. జంకు, భయపడు అనే అర్థాల్లో జంటపదం.

"సుదతులాల చూడరమ్మా సోద్య మిదియే కాఁబోలు
అదరిబెదరి కరఁగె గోరు ఆయ మంటఁబోలును"
17-279

**అదవద**: వి. (ధ్వన్యనుకరణరూపం) 1. అవమానం 2. కలత, చింత 3. తొందర. విణ. 1. చెదరినది, తారుమారైనది 2. శ్రమపడినది 3. క్షుబ్ధం (వ్యా.)

"కొండలనునుపులు కొనకొన మమతలు
అండలకేగిన అదవదలు" 1-24

"అమరని సింగారాలు అదవదలు
తమి లేని కాగిళ్లు తలపోఁతలు"

"ముంచి తగులములకు మొదలు
అంచెల నలిగితేను అదవదలు" 28-573

"మా పొందు సేయుమా మచ్చికలతోడ
ఆవనిఁదిరుగఁగా నదవదలాయ" 18-554

**అదిబిదుకు**: వ.బం. ఇది 'అదుబిదుకు' కావచ్చు. భయం అని అర్థం. ధ్వన్యనుకరణశబ్దం. బిదుకు బిదుకు అంటే వ్యవహారంలో భయమని అర్థం.

"పొదిగేవు ఒకవేళ పొరలేవు వొకవేళ
అదిబిదుకు వలపు లవి యాల" 9-226

**అద్దపునీడ**: వ.బం; వి. అశాశ్వతం. 1-486

"వొద్దికై శ్రీవేంకటోత్తముఁడు యింతలో
అద్దపునీడవలె నాత్మఁబొడమాపె" 1-486

**అద్దమరాతిరి**: (3) వి. అర్ధరాత్రి, మధ్యరాత్రి, నడురేయి.

"అద్దమరాతిరి వోయె నమ్మలాల అయ్యో
నిద్దుర గంటఁబెట్టుదు నిన్నటనుండి" 5-32

**అద్దమరాతిరి కాడ**: (4) ఇట కాడ అనేది 'కడ'కు వ్యావహారికరూపం. అర్ధ రాత్రి సమయంలో.

"అద్దమరాతిరికాడ నటు చంద్రోదయముతో
వొద్దికఁ గృష్ణుఁడు పుట్టెనో చెలులాల" 22-92

**అద్దమరేతిరి**: (2) వి. మధ్యరాత్రి, నడురేయి. చూ: అద్దమరాతిరి.

"నిద్దురవోయే వేళ నీవు నన్ను లేపగాను
అద్దమరేతిరి వోపనంటిఁ గాక" 11-362

**అద్దమరేతిరికాడ**: అర్ధరాత్రిసమయాన, ఇట కాడ అనేది 'కడ'కు వ్యావహారిక రూపం.

"బుద్ధులు చెప్పఁగ వచ్చి పూఁచిన వాకిళ్లు దాటి
అద్దమరేతిరికాడ నాయఁగా తాను" 22-75

"బుద్ధులు చెప్పగ వచ్చి పూఁచిన వాకిళ్లను దాటి
నిద్దురవోయే వేళ నీవు నన్ను లేపగాను
అద్దమరేతిరి వోపనంటిఁగాక" 11-362

**అద్దమరేత్రి**: వి. అర్ధరాత్రి.

"కదిసి యద్దమరేత్రికాడ నేఁడు
వుదయించెఁ గృష్ణుఁడు చంద్రోదయాన నేఁడు"
4-179

**అద్దమరేత్రికాడ**: అర్ధరాత్రి సమయాన, నడురేయి సమయాన. ఇట 'కాడ' అనేది 'కడ' కు వ్యావహారికరూపం.

**అద్దమరేయి**: వి. మధ్యరాత్రి, నడురేయి.

"చెంగావిచీర గట్టి చెమటలు గారఁగాను
అంగమలియ వచ్చితి వద్దమరేయి" 26-517

**అద్దములో చంద్రోదయము**: నానుడి. నిష్ప్రయోజనం. 10-115 old

**అద్దములో నీడ**: వ.బం; వి. అలభ్యం.

"గుక్కక శ్రీవేంటేశ కూడినట్టె కూడేవు
నిక్కి యద్దములో నీడ నీ వలపు" 27-340

అద్దములోపలి నీడ: వ.బం; వి. చూ: అద్దములో నీడ.

"అద్దములోపలి నీడలు అందరి దేహరూపులు"
2-133

అద్దరిపాటు: వి. ఇది 'అద్దిరపాటు' కావచ్చు.
1. ఏమరిపాటు, ఆకస్మికత 2. ఆశ్చర్యపడటం.
"నీ విది నే నదె నెమ్మదిఁ దాను నదె
ఆవలిమొగము లేల అద్దరిపాటాయెను"
11-199

"ఏల తలవంచుకొనే రిద్దరును నన్నుఁజూచి
తాలిమి నద్దరిపాటు తగదు నావల్ల" 7-7

"అద్దరిపాటుగాను నా యండకు నీవు వచ్చితే
కొద్దిమీరిన వేడుక గుదిగొనును" 27-567

అద్దలించు: స.క్రి. 'అదలించు'కు రూపాం.
బెదిరించు, కదలించు, తిరస్కరించు, తట్టు, కొట్టు, లాగు, సర్దు (వ్యు.)

"వొద్దనఁగాఁ బొయ్యేవు వొంటిఁ జిక్కించుక యాపె
అద్దలించి యేమైనా ననకుండేనా" 7-30

"యేడనైన నిలిచి నీ వెవ్వతెతోనైనా మాట
లాడుకొన్న నిన్ను నే నద్దలింతునా" 16-570

అద్దికము: వి. కావలి, రక్షణం, కనిపెట్టిచూడడం.

"మిక్కిలి కాఁగిటఁ గూడి మెప్పించవచ్చేఁగాక
కక్కసించి నీపై నద్దికము వచ్చెనా" 19-103

అద్దిగో: అవ్య. అదిగో, అదే చూడు అని దూరంలో ఉన్న వస్తువును నిర్దేశించే పదం.

"ముద్దుల మొగమువాఁడు ముత్తేల నామమువాఁడు
అద్దిగో శంఖచక్రాల హస్తాలవాఁడు" 7-116

అద్దో: (15) అవ్య. 'అదిగో' అనే అర్థంలో వాడబడే రా.సీ. మాండలికపదం. రూపాం. అద్దొ.

"అద్దో నే మెందాకానైనాఁ గాచుచుండలేము
వొద్దనే యెంతవాడైనా నోసి రావే" 5-9

"తిద్దితిని జగడము తేరిచి శ్రీవేంకటేశ
అద్దో మొదల మమ్ము నారడిసేతురా" 17-397

అనఁగుపెనఁగు: వ.బం. అ.క్రి. అన్యోన్యంగా, ప్రీతితో కలిసిమెలసి ఉండు.

"అనఁగుచుఁ బెనఁగుచు అయములంటుచు
చనవులు మెరసీ జవరాలు" 27-159

అనంతగిరి: వి. ఏడు తిరుమలకొండల్లో ఒకటైన శేషాద్రి. (అనంతుడు = శేషుడు)
ఏడుకొండలకూ ఇది ఏలిక.

"గరుడాచలం బనఁగా శ్రీవేంకటశైలంబనఁగా
గిరులకు నేలికె యగు ననంతగిరి దా నీ గిరి
యనఁగా"

అనంతాళువారు: వి. భగవద్రామానుజులవారి ఆజ్ఞతో తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామికి పుష్పమాలా కైంకర్యం చేసిన భక్తుడు. తన పుష్పమాలాకైంకర్యం కోసం ఒక పుష్పోద్యానాన్ని పెంచదలచి దానికి నాందిగా ఒక పెద్ద చెరువును నిర్మింపదలచి ఇతరులెవ్వరి సాహాయ్యం లేకుండా తాను, తన భార్యతో మాత్రమే ఆ చెరువును తవ్వడానికి పూనుకున్నాడు. అతను గడ్డపారతో మట్టిని తవ్వి గంపలతో ఇస్తుండగా అతని భార్య ఆ మట్టిని దూరంగా పోసేది. అప్పుడామె నిండుచూలాలు. ఆ స్థితిని చూచి శ్రీవేంకటేశ్వరస్వామి పంద్రెండేండ్ల బాలుని రూపంతో వచ్చి మట్టిని దూరంగా పోయడంలో సహాయపడతాడు. ఈ విషయాన్ని భార్య ద్వారా తెలుసుకున్న అనంతాళ్వారు తన భార్యను నమ్మించి స్వామి కైంకర్యంలో పాలు పంచుకుంటున్న ఆ బాలునిపై కోపంతో గునపాన్ని పైకెత్తి బాలుని పైకి విసిరివేస్తాడు. అది ఆ బాలుని చిబుకానికి తాకి రక్తం కారుతుంది. బాలుడు ఆనందనిలయంలోకి వెళ్ళి కనబడకుండా దాక్కొంటాడు. అర్చకులు స్వామివారి చిబుకంపైన రక్తస్రావాన్ని చూచి కలకలం చెంది అనంతాళువారి కీ విషయం చెపుతారు. అనంతాళువారు విషయాన్ని గ్రహిస్తాడు. అర్చకులు ఆ గాయంపై పచ్చకర్పూరం అద్దుతారు. నేటికీ శ్రీస్వామివారి చిబుకంపైన పచ్చకర్పూరం అద్దటం ఆచారం. స్వామివారిని కొట్టడానికి

అనంతాళువారు ఉపయోగించిన గడ్డపార ఇప్పటికీ తిరుమలలోని స్వామివారి ఆలయ మహాద్వారం లోపల వేలాడదీసి ఉంచబడింది.

"అచ్చపు వేడుకతోడ ననంతాళువారికి
ముచ్చిలి వెట్టికి మన్ను మోఁచినాఁడు" 1-151

**అనరుహాఁడు :** వి. అనర్హుఁడు.

"మునుప శ్రీపతికి మ్రొక్కిన చేతుల
అనరుహులకు దండమనుట యెట్టు" 3-456

**అనలుఁగొనలు :** ప.బం; బహు. తీగెలు.

"అక్కట మొదలొకటి అనలుఁగొనలు వేరు
యెక్కడని తగిలేది యేమి సేసేది" 2-247

**అనలుఁగొనలు అగు :** ప.బం; అ.క్రి. తీగెలు సాగు.

"మునుకొని యిప్పటి మోహము చూచిన
అనలుఁగొనలునై యాసలు పొదలు" 24-51

**అనలుఁగొనలు సాగు :** (2) ప.బం; అ.క్రి. తీగె సాగు, వృద్ధిచెందు.

"అనలుఁగొనలు సాగునట్టి యాసలు
గడించరావు
తనివి లేని చుట్టరికపు తగులువారికి" 27-584

**అనాయుధాసో అసురా అదేవాః :** వేదమంత్ర వాక్యం. ఆయుధాలు లేనివారూ, దేవద్వేషులూ ఐన రాక్షసులు. (6 అష్టకం; 6వ అధ్యాయం, 33వ వర్గం, 9వ మంత్రం) చక్రసమానవీర్యం కల వజ్రంతో పారదోలుము అని అర్థం.

"అనాయుధాసో అసురా అదేవా" యని
వినోదముగ ఋగ్వేదము దెలిపెడి" 2-485

**అని :** అవ్య. కొన్నిచోట్ల నిరర్థకంగా వాడబడే పదం. ఉదా :- ఎందుకని, ఎందరికని.

"విందులువెట్టేరు వేవేలు మోపుల
యెందుకని వొగ్గేవేమయ్యా నీవు" 25-249

"ఎందరికని వుత్తరమిచ్చేవు నీవు
సందడించి వొక్కమాటే చల్లేరు సరసము"
7-529

**అనుకు :** విఙ. పలుచనిది; పిండివంటలు చేసేప్పుడు నీళ్లు ఎక్కువైతే పిండి అనుకైందని అంటారు. (రా.సీ.మాం. 62 పు.)

"అగ్గలమై చూచితేను అనుకనేవు నన్ను
సిగ్గులువడితే నట్టే చిక్కన నేవు" 14-62

**అనుచరించు :** అ.క్రి. సహాయంగా ఉండు, తోడుగా ఉండు, అనుసరించు, సాగనంపు.

"అనుచరించితో లేదో ఆకనే ముందరనైనా
వెనక నాతోడ నవ్వేవు గాని" 5-7

**అనుభవత :** (అనుభవ + త) వి. అనుభవం. భావార్థకమైన అనుభవశబ్దంపై మళ్లీ భావార్థంలో 'త' ప్రత్యయం రావడం విలక్షణం.

"ఎవ్వరికిఁ గలదురా యిటువంటి యనుభవత
యివ్వల నీ వాకెవలె నిటు నోమవలదా" 9-151

**అనుభవన :** (6) వి. అనుభవం; అనుభవించడం ఈ అర్థంలో ఇది అన్నమయ్య విలక్షణ ప్రయోగం.

"అనుభవనకుఁ బ్రాప్తమైనది
తనకుఁదానె వచ్చి తగిలి కాని పోదు" 1-6

**అనుమె మినుమైతే :** సామెత. కృశించిపోవడమని భావం. అనుములు = పెసలు, అలసందలు, శనగలు, మినుములు వంటి కాయవస్తువు - పప్పుబద్దలు - అనుముల బద్దలు పెద్దవి; మినుముల బద్దలు చిన్నవి - ఆ పెద్దవైన అనుములు మినుములైనవి. అంటే వాటి విలువ తగ్గిందని అర్థం. పెద్దవి చిన్నవైనవని భావం.

"కననీ కననీ తనకడల చుట్టరికాలు
అనుమె మినుమైతే నదెవ్వరి మేలు" 9-105

**అనువు :** వి. 1. ఉపాయం 2. విధం 3. అవకాశం 4. సామర్థ్యం 5. అనుకూలత 6. ఒప్పు 7. మంచినుడి. విఙ. యుక్తం.

"మనవులు చెప్పితేనే మచ్చికలు రేగుఁగాక
అనువుకు మాటాడితే నందములవునా" 12-474

**అనుసు :** వి. గదాదండములు మొ॥ వాటికి వేసే ఇనుము మొ॥ వాటి కడియం.

"పాపపుణ్యా లిరువంక పైఁడి వెండి యనుసులు

పైపైఁ గుత్తికె మేటిపై చనిగె" 3-467

అన్నువ: విశ. 1. కొంచెం, తక్కువ, అల్పతి 2. చిన్నది 3. మనోహరం, అలవి, సన్నం.
"కన్నులఁ తుదలంగెంపు గానరాఁగాను నీకు
నన్నువ యలుకలు వేఁడాయె నోసవితిమి"
6-140

అన్నువట్టు: అ.క్రి. 1. పారవశ్యం పొందు 2. ఆవేశం పొందు 3. కాంతిని పొందు.
"యిది పుణ్య మిది పాప మెట్టని తెలిసేమయ్యా
అదన నన్నవునామె యన్నువట్టెను" 4-253

అన్యోన్యము: వి. 1. ప్రేమ, అనురాగం (2. పరస్పరం)
"ఒకరొకరి అన్యోన్యము చూడరే
సకలము నెరిఁగిన సరసులె వీరు" 7-308

అప్ప: అవ్య. 1. ఆశ్చర్య, ప్రీతి, పూజ్యతా, గౌరవాదర, ప్రశంసాసూచకపదం (2. అక్క 3. తండ్రి 4. తల్లి)
"అనిశముఁ జెప్పరప్ప అతని సుద్దులే నాకు
విన వేడు కయ్యీని వేమారును" 29-522

అప్పఁజెల్లెండ్లు: వి; బహు. అక్కచెల్లెండ్లు. (అప్ప = అక్క)
"అప్పఁజెల్లెండ్ల మింతే అతఁడు నవ్వీనంతనె
ఇప్పుడు వేరుగఁ జూచే నిది యేమే నీకు"
26-97

అప్పఁడు: వి. తండ్రి.
"అప్పఁడైన వేంకటాద్రి అసవాలకుడు గాన
తప్పకుండఁబెట్టి వాని తలకెత్తరే" 4 అను. 20

అప్ప(డు): వి. (రా.సీ; మాం.) తండ్రి, గౌరవవాచకం, సంబోధించేప్పుడు ప్రయోగించే శబ్దం, వ్యక్తి నామాంతంలో ప్రయోగించే శబ్దం.
"అప్ప! వేంకటనగాధిప! మీ కృప
ఇప్పుడు తెలిసితి నిదివో నేడు" 4-17; 372 పు.
"అప్పడు తొల్లే అనుమతించె నివి
తప్పక యాతని దలఁచుటే కలది" 4-50
"అప్పా! నే దొల్లి అజ్ఞాని నైనది తప్పా!
నేడు గావ తగదా నన్ను" 2-11

అప్పటిన్: దే; (39) అవ్య. 1. మరల 2. పూర్వంవలె. (విలక్షణ ప్రయోగం)
"అగడై తొల్లే నేను అలినై వుండఁగాను
మొగము చూచి అప్పటి మొక్కకుమీ నీవు"
7-211
"సరి నిన్న భుజించిన చాలు నన్న యన్నమే
అరిది నే డప్పటిని నాసరేచీని" 3-351
"చెప్పె నప్పటి నేమే చెవిలోన నేకతాలు
అప్పసము సేసేసే యాపె వుండఁగాను"
13-494

అప్పణ: (30) వి. 1. ఉత్తరువు, ఆజ్ఞ, అనుమతి 2. ఇచ్చుట, కానుక. అప్పణై, (క) అప్పణె; కిట్టెల్ ఆజ్ఞ, అనుజ్ఞ command, order, permission, leave అనే అర్థాలు చూపి ఆజ్ఞాపన శబ్దభవంగా పేర్కొన్నాడు. అప్పణమాడు అని కన్నడంలో నున్నట్లే తాళ్లపాకవారు అప్పణ - అప్పణదెచ్చు, అప్పణిచ్చు, అప్పణచేయు మొ॥ పదబంధముల ప్రయోగించినారు.
"అనువునఁదాఁ దనిపి అప్పణియ్యఁగా మమ్ము
యెనసితి నిందాఁకా నందెరఁగక వుంటివి"
23-405
"అప్పణిచ్చి మిము సమ్మతి సేయుచు నట
మముఁ గావఁగఁ దానే కర్త" 7-60
"నీ కడ నిన్నే కొలిచి నీ యప్పణ దెచ్చి" 7-29
ఆజ్ఞ, అనుజ్ఞ అనే అర్థాలు ఇట పొసగుచున్నవి అని ఆనందమూర్తిగారు. (సం.కీ.వా.)

అప్పణ ఇచ్చు: (3) అ.క్రి; స.క్రి. ఆజ్ఞ ఇచ్చు, అనుమతి నిచ్చు, కానుకగా ఇచ్చు, అర్పణ చేయు.

కానుకగా ఇచ్చు:
"నే నేమందునో యంటా నీ వనుమానించ నేల
పూని అప్పణ ఇచ్చెను పొందవయ్య సతిని"
18-443

ఆజ్ఞ ఇచ్చు:

"వలపుల వడ దాకె వనిత నిన్నుఁబాయఁగ
అలరి చలిమందుల కప్పణీవయ్యా" 27-293

**అప్పణగొను:** స.క్రి. 1. పైవారు ఆదరపూర్వకంగా ఇచ్చేదాన్ని స్వీకరించు; అప్పనపెట్టు అన్నది వైష్ణవ పరిభాషగా వినబడుతుంది. దేవాలయాదుల్లో ప్రసాదము అప్పనపెట్టు మని అనడం ఉన్నది. దీనిమీద మరింత సాగి అప్పనము = ఊరక వచ్చినది అన్న అర్థాలలో కొన్నిప్రాంతాలలో 'ఇదేమి అప్పనంగా వచ్చిందా' అని వాడుకలో వినబడుతుంది. ఇదే అర్థంలో 'ఉద్ధరకు వచ్చిందా' అని రా.సీ. లో వ్యవహారంలో ఉంది. 2. కానుక గ్రహించు. రూపాం. అప్పనగొను.

"తరుణి అప్పణగొని తమకించి నాతోడ
యెరవులనవ్వులు నీ వేల నవ్వేవు" 11-3

"అప్పణగొంటివా గోపాంగనలకెల్లఁ దొల్లి
యిప్పుడు నాతో మాయ లేల సేసే వికను"
11-88

**అప్పణసేయు:** స.క్రి. కానుకగా ఇచ్చు, అర్పణ చేయు, సమర్పించు.

"అసురుసురు కాఁగిట నడియాస రతులను
పొసఁగ నప్పణసేసీఁ బొలితి నీకు" 29-19

**అప్పణించు:** (2) స.క్రి. 1. అనుమతించు, ఆజ్ఞాపించు 2. కానుక ఇచ్చు 3. అప్పగించు, అధీనం చేయు.

"యిక్కువ శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
తక్క కాపె అప్పణించె దైవము నీ కిపుడు"
27-132

"పుప్పతిల్ల మొదల నీ పుద్దండాలు సేసితేను
అప్పుడే చేతకుఁజేత కప్పణించుట గాదా"
14-141

**అప్పన:** వి. అర్పణ శబ్దభవం. కాని దీనికి అర్పణమని అర్థం కాదు. ఆజ్ఞ అని అర్థం. (అప్పణె = ఆజ్ఞ అని కిట్టెల్)

**అప్పనము:** విణ. ఎడతెగని.

"అప్పనమైన భ్రమ ఆలజాలాలకున్నట్లు
యిప్పుడే వుండవలదా యీతని మీఁదటను"

**అప్పము:** వి. రొట్టె, అప్పచ్చి, సం. అపూపం, త. అప్పం, గుడాపూపం. బెల్లం, పిండి కలిపి చేసిన గుండ్రని భక్ష్యం.

"అప్పమైన నీయరే యమ్మలాలా నేఁ
డప్పఁడారగించీ నదె యమ్మలాలా" 5-345

**అప్పలప్పలను:** వ.బం; అ.క్రి. పిల్లలను దగ్గరకు పిలవడంలోని అనుకరణశబ్దం.

"అద్దపుంజెక్కులతోడ నప్పలప్ప లనినంత
గద్దించి యశోద మేనుఁగౌగలించు శిశువూ"
6-1

"యెంచి యప్పలప్పలనుచు యెనసి
కాఁగిలించ నేర్చి
దించరాని వురముమీఁద దివ్యకాంతను" 2-387

"అంచెల అప్పలప్పలని వచ్చి కాఁగిలించి
చంచుల మేనెల్ల గీతె సన్నమా వీఁడు" 26-158

**అప్పలప్పలు:** వి. క్రీడావిశేషం.

"అల్లరి నా కౌఁగిట నప్పలప్పలాడే వంటా
పిలిచి కూడేని పిన్నబిడ్డఁడా వీఁడు" 17-173

"అప్పలప్పలాడే నంటూ నంతలోనె కాఁగిలింప
చిప్పిలఁగూడితి వవురా చిన్నిబాలుఁడా"
27-123

**అప్పసపుకాంతలు:** ఇట అప్పనపు కాంతలు అని పాఠం కావచ్చు. కానుకగా వచ్చిన కాంతలు.

"అప్పటి నవ్వేవు ప్రహ్లాదవరదా
అప్పసపుకాంతల ప్రహ్లాదవరదా!" 25-329

**అప్పసము:** (11) అవ్య. 1. నిచ్చలు, ఎల్లప్పుడు 2. స్వయంగా 3. నిజంగా. కర్నూలు మండలంలో ఈ పదం ఇప్పటికీ స్వయంగా అనే అర్థంలో వాడుకలో ఉందట. (చూ: మాం.ప.కో.) రూపాం. అప్పిసము.

"చెప్పినప్పటి నేమే చెవిలోన నేకతాలు
అప్పసము సేవ సేసేయాపె వుండఁగాను"
13-494

ఎల్లప్పుడు:
"చెప్పిన నా మాట విను సేసునే పనులైనాను
అప్పసము నా మేలువాఁడై వుండునే" 27-541
స్వయంగా:
"కొప్పు గడు వీడఁగాను కుచములు గదలంగ
అప్పసము నీ వద్దికి నాపె వచ్చెను" 14-71

**అప్రతి:** (న + ప్రతి) విణ. సాటి లేనిది.
"మతిలోపల విరక్తి మగువ జనియించి య
ప్రతి యయి మోక్షసంపదలు గడియించె"
1-308

**అబక:** వి. కొయ్యగుద్దలి, పెద్ద తెడ్డు, కొయ్యకు టెంకాయ చిప్పను గుచ్చి గరిటె వలె చేసినది. పళ్లెం, పాత్ర అని మాం.ప.కో. (రా)
"ఆతల నబక ముంచినట్టి వేడి చెయ్యంటదు
జాతిదేహము మోఁచిన సహజ మింతే" 2-288

**అభయహస్తమిచ్చు:** ప.బం; అ.క్రి. భయం లేదనే ధైర్యమిచ్చు.
"భావించి రాజసాన నభయహస్తమిచ్చినాడు
దైవ మాతనినే నమ్మి తరుణులు మొక్కరే"
24-136

**అభయహస్తము:** వి; ప.బం. భయం లేదని ధైర్యాన్ని ఇచ్చే హస్తం.
"బంతినే యలమేల్మంగపతి శ్రీవేంకటేశుఁడ
అంతటికి నీ యభయహస్తమే చాలును"
15-394

**అభ్యుదయమగు:** అ.క్రి. ఉదయించు.

**అమయు:** అ.క్రి. ఉపయుక్తమగు.
"వలపు లాకటికి వనిత లధర మిది
చెలువుని కిపుడమసిన విందు" 24-45

**అమరగాఁడు:** (అమరము + కాడు) యోధుడు, (పర్యా) అమరము ననుభవించి రాజసేవ చేయు భటుడు. (సూ.ని.) అగత్యమైనపుడు కొంత సైన్యాన్ని తీసుకొని రావలసింది అనే నిబంధనమీద చిన్నరాజులకు విడువబడిన సీమపై అధికారం కలవాడు. (బ్రౌన్)
"ఇరువది నలుగురి కిటు నే గమికాఁడ
అరిది దేహపుటురి అమరగాఁడా" 15-39

**అమాస:** వి. 'అమావాస్య'కు వ్యావహారికరూపం.
"పున్నమ నమాసయు పోగై నిలువఁబోలు
పున్నతి యోగీంద్రుల యూహ గాఁబోలు"
4-386
"అనుఁగుఁబున్నములకు అమాసచీకట్లకు
అనయ సరికి సరందుకందుకు" 3-363

**అమ్మఁగారు:** వి. అరసున్న విలక్షణం.
"అమ్మఁగారి విన్నపములయినాను విని నీవు
కమ్మక నన్ను నిట్టే కావరాదా" 16-336

**అమ్మక చెల్ల:** (అమ్మ + అక + చెల్లెలు) అవ్య. ఆశ్చర్యార్థకశబ్దం, ఔర.
"అమ్మకచెల్ల నే నీకు నడ్డమా వోరి యింపు
గుమ్మరింపుచు నా గుట్టు కొలగొంటి వోరి"
5-11

**అమ్ముడువోవు:** (అమ్ముడు + పోవు) ప.బం; అ.క్రి. ఒకరికి దాసుడగు, ఒకరు చెప్పినట్లు ప్రవర్తించు, వశమగు, అమ్ముడగు, వెలకుపోవు.
"మదిమది నుండిన నా మనసే నమ్మితినా
అదియును నింద్రియాల కమ్ముడువోయినది"
2-20

**అమ్మేటి(మ్మెడి) దొకటి అసిమలో (ని) దొకటి:** ప.బం. సంచిలో ఉన్న వస్తువు ఒకటి, అమ్మే వస్తువు మరొకటి. లోనొకటి, వెలుపలొకటి అనడం.
"అమ్మెడిదొకటి అసిమలోదొకటి
బిమ్మిటి నిందేటి పెద్దలమయ్యా" 1-483
అసిమిలోని దొకటి, యమ్మెడిదొకటి అని హరివంశ ప్రయోగం. 2-151

**అమ్మేదొకటి అసిమలందొకటి:** చూ: అమ్మేదొకటి అసిమలో దొకటి.
"అలరి యమ్మేదొకటి యసిమలందొక టాయ
చెలి యాతని కేమని చెప్పుదుమే నేము" 22-14

**అమ్మేదొకటి అసిమిలోదొకటి :** ప.బం; వి. సంచిలో ఒకటి పెట్టుకొని మరొకటని చెప్పి విక్రయింప జూచుట అనే అర్థంలో వాడబడే సామెత. (అసిమ = సంచి) మాట ఒక తీరుగను చేత ఒక తీరుగను ఉండడమని భావం.

**అమ్మేదొకటియును నసిమిలోని దొకటియు :** సామెత; మోసగించు అనే అర్థంలో వాడబడుతుంది.

"అమ్మేదొకటియును నసిమిలో దొకటియు
నమ్మిన నీ మోహమింతా కానరాదా నాకును" 17-284

చూ: అమ్మేదొకటి అసిమలం దొకటి.

**అయఁగారు :** వి. గురువు. చూ: అయ్యఁగారు.

"చదివించే అయఁగారు జంకించి చూచితేను
వొదిగి చదువుఁగాక వోపననీనా" 2-400

**అయజియలు పెట్టు :** ప.బం; అ.క్రి. పొగడు (తె.జాతీ.) చూ: అయ్యజియ్యలు వెట్టు.

**అయితేఁగనక :** అవ్య. అయినపక్షంలో.

"దవ్వు చేరువ మనసు తన యిచ్చయితేఁ గనక
రవ్వగ మృగాదులెల్ల రాజ్యమేల నేరవా" 1-372

**అయినపాటి :** వి. అయినంత, అయినకొలది.

"నిందలువేసేవు గాక నిజమా యిది
అందుకేమి వోరి నీకు అయినపాటి చాలదా" 17-325

**అయిరాణి :** వి. అయిరేని అని వాఙ్మయంలోను, అరివేణికుండ లని లోకవ్యవహారంలోను కనబడే పదానికి ఇది ప్రాకృత రూపం. అయిరేని కుండలని అర్థం. "అయిరాణి ఇంద్రాణీ ధుంధుమారీ పరాచిచ శక్రవల్లభాయామ్" అని షడ్భాషా చంద్రిక ఝుడాదిసూత్రం లో అయిరాణి అనే పదం పేర్కొనబడింది. ఇది ఇంద్రాణీ శబ్దభవం కావచ్చు. అయిరేని కుండలతో జరిపే పూజకూడా శచీపూజయే. వివాహకాలంలో సౌమంగల్య సిద్ధి కోసం శచీపూజ ప్రశస్తమై ఉన్నది. (చూ. పీఠిక. 5సం. 30పు.)

"బచ్చెనల మెఱుఁగుగుబ్బల అయిరాణి దెచ్చి
కుచ్చుఁబులకల(?) బూజగుండలాయను(?)" 5-189

**అయ్యఁగారు :** (అయ్య + గారు) వి.
1. పూజ్యుడు, బ్రాహ్మణుడు 2. ఆచార్యుడు. ఇట అయ్యపై నున్న అరసున్న చింత్యం. అయ్యంగారు శబ్ద సాదృశ్యంతో వచ్చిందేమో? చూ: బావఁగారు.

**అయ్య(లు) అసాదలు :** వి; ప.బం; బహు. ఆచార్యులు మరియు తక్కువ కులానికి చెందినవారు. పెద్దలు మరియు చిన్నలు అని భావం. సూ.ని. లో 'అసాది' అనే శబ్దం చూపబడింది. దానికి గ్రామదేవతను పూజించు పూజారి, మాదిగ అనే రెండర్థాలు ఇవ్వబడ్డాయి.

"పయ్యద జారఁగ నిల్చి భ్రమయించ నేమంటివి
అయ్య అసాదలు పెట్టేనందుకు నేమంటివి" 8-12

"అట్టు నిట్టును నీకు నయ్యలు నసాదలును
బెట్టినా నీచేతఁ బిరువీకులైతి" 5-213

**అయ్య జియ్య(లు) వెట్టు :** ప.బం; అ.క్రి. అయ్యా! జియ్యా అని వినయంతో మనవులు చేసుకొను, పొగడు, గౌరవించు. చూ :- అయ జియలు పెట్టు.

"యియ్యెడ సతులలోన నెమ్మెలు మెరసే నీకు
అయ్య జియ్య వెట్టినాను అప్పటిని మేలు" 8-44

"శరణాగతారాతి ధరణీరమణు లయ్య
జియ్యలువెట్టుచు సేవ సలుప" అని సారంగ. (1-62) ప్రయోగం.

**అరగంటఁజూచు :** స.క్రి. పరవశంగా చూచు.

**అరగు :** వి. 'అరుఁగు'కు వ్యావహారికరూపం. తిన్నె, ఇంటి ముందుద్వారానికి ఇరువైపులా గోడనానుకొని కట్టిన తిన్నె అరుగు. కూర్చోవడానికి, పడుకోవడానికి అనువుగా ఉంటుంది. తెలంగాణంలో దీన్ని 'అరుగు' అని వ్యవహరిస్తారు. శ.ర.లో 'అరుగు' అనియే చూపబడింది. అరుఁగనియే తఱచుగా వాడుక. అరఁగని యొకానొకచో గానబడుచున్నదని

కూడా సూచింపబడింది. అన్నమయ్య అరసున్న లేకుండానే ప్రయోగించినాడు.
"పుట్టినవారికెల్లా పొత్తుల దీ జగము
మెట్టి కూచుండే యరగు మేదిని యెల్లా" 2-310

**అరగొర :** (3) వి. అఱగొఱలు, న్యూనత, అసంపూర్ణత, అఱమఱ, భేదం, గుట్టు, కాపట్యం, సందేహం.
"ఆయములంటితేను అరగొరలే లేవు
పాయక వద్ద నుండితే పంగెము గాదు" 26-427
"అడిగే నేననఁగానే అరగొర లెల్లఁ దేర్చె
కడమలు మాని నవ్వఁగదవె యిఁక" 9-280
"కందువ శ్రీవేంకటేశ కలిసితి విట నన్ను
అందాలు సేయించును నీ యరగొర లెల్లాను"
21-380

**అరగొరత :** వి. నిఘంటువుల్లో 'అఱగొఱ' అనే పదమే కాని 'అరగొరత' అనే పదం లేదు. 'అఱగొఱ' పదానికి నిఘంటువులో 1. కపటం 2. భేదం 3. న్యూనత అనే అర్థాలు చూపబడ్డాయి. అరగొఱతకు కూడా ఈ అర్థాలు చెప్పుకోవచ్చు. అన్నమయ్య 'అరగొరత'లో రెండు రేఫాలనూ సాధురేఫాలుగానే ప్రయోగించినాడు.
"అతఁడిదె నీ విదె అరగొరతేటికే
కాతరానఁ గాగిలించి కపటము లేటికే" 20-457
"విరసమేమి గల్లాను వేళవేళనే పొసె
అరగొరత కేల అవి నీ వెఱగవా" 20-159
"అతఁడిదె నీవిదె అరగొరతేటికే
చేతిలోని వాఁడితఁడు సిలుగు లింకేటికే" 20-370

**అరగొరసేయు :** ప.బం; అ.క్రి. న్యూనత కలిగించు, న్యూనం చేయు.
"అయములంటిన మీఁద అరగొరసేతురా"
23-235

**అరచందురుని రేకలు :** వి; బహు. నఖక్షతాలు, గోరిగుర్తులు.
"మురిపమది యెట్లుండు
ముద్దుఁజనుఁగవమీఁద
నరచందురుని రేక లపుడెట్టులుండు" 6-27

**అరచేత నిలుచు :** ప.బం; అ.క్రి. సులభంగాఅబ్బు - లభించు, సులభమగు.
"వడిగా శ్రీవేంకటేశ్వర మీ శరణనఁగా
అదరి వైకుంఠము మా యరచేత నిలిచె" 8-12

**అరచేతనుండు :** ప.బం; అ.క్రి. సులభసాధ్యమగు.

**అరచేతికి అందు :** ప.బం; అ.క్రి. సులభంగా లభ్యమగు.
"విందై యిహము వెనకకుఁదీసి
అందీ వైరాగ్య మరచేతికిని" 8-4 old

**అరచేతికి దొరుకు :** ప.బం; అ.క్రి. సులభంగా లభ్యమగు.
"ఇలపై శ్రీవేంకటేశ్వర యిహపర
మలవడి దొరకెను అరచేతికిని" 3-118

**అరచేతిది :** (అరచేయి + అది) ప.బం; వి. అందుబాటు లోనిది, సులభమైనది.
"శ్రీవైకుంఠుని దాసుల మట
యరచేతిది మోక్షము మాకిదివో" 3-371

**అరచేతి దైవము :** ప.బం; వి. అందుబాటు లోని దైవం. సులభదైవం.
"వింతవింత విభవాల వేంకటేశుఁడిదె మా
యంతరంగమున నుండే అరచేతి దైవము"
1-172

**అరచేతి ధనము :** వి; ప.బం. అందుబాటులో నున్న అమూల్యవస్తువు, అరచేతి మాణిక్యము వంటి పదం.
"పరఁగ నంతరంగాన పాఁతినట్టి ధనము
హరినామ మిదియ పో అరచేతిధనము" 3-27

**అరచేతి నిమ్మపండు :** ప.బం; వి. అందుబాటులోని వస్తువు, కరతలామలకము వంటిది. ప్రేమను తెలిపే లోకోక్తి.
"నెలకొన్న అరచేతి నిమ్మపండువంటిది
వలపుల కాతరాన వాడింతురా" 7-426
"విభుండఅచేతిలోని నిమ్మపంటివలె నత్యాసక్తి మన్నింప" అని సారంగ. 2-113

**అరచేతి మణి**: ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్యవస్తువు.
"తెఱఁగుల నీ పతికి తెల్లని నవ్వులు చల్లి
అఱచేతి మణివైతి వలమేలు మంగా" 11-512

**అరచేతి మాణికము**: ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్య వస్తువు.
"అంతనింత గొల్లెతల అరచేతి మాణికము
పంతమాడే కంసుని పాలి వజ్రము" 3-577
"అక్కరో శ్రీవేంకటేశుఁడరచేతి మాణికము
యిక్కువలు గరఁగించే వింటే పో మంటా"
17-52

**అరచేతి మాణిక్యము**: ప.బం; వి. చూ: అరచేతి మాణికము.
"అరచేతి మాణిక్యమై యాపె నీ పొత్తున
యెరుకసే శారగించీ నేమి చెప్పేది" 14-386

**అరచేతి మోక్షము**: వి. సులభసాధ్యమైన మోక్షం.
"గరిమ మా పుట్టుగు నీ గర్భవాసములోనే
అరయ మా మోక్షము నీ యరచేతిదే" 3-11

**అరచేతిలోని పువ్వు**: ప.బం; వి. అందుబాటులో నున్న వస్తువు; కరతలామలకంవంటి పదం.
"అలమేల్మంగలో నవ్వు అరచేతిలోని పువ్వు
లలిఁదారుకాణించరే లలనలాల" 12-120

**అరచేనుండు**: ప.బం; అ.క్రి. అందుబాటులో సిద్ధంగా ఉండు.
"అకటా దృష్టంబరచే నుండఁగ
సకలము నుపదేశముల కనేవి" 3-120
'అర' శబ్దం శకటరేఫతో కూడా వాడబడింది.

**అరడు**: వి. 'అరటి' కావచ్చు.
"అలరి యరడువద్ది తీగె అంటఁబార కేల మాను
చెలులసరస నున్నవారి చిత్త మూరకుండునా"
15-438

**అరడుఁజేయు**: బాధించు.
"మెల్లనే శ్రీవేంకటేశ మేలుకొలిపి కూడితివి
వొళ్లెల్ల నరడుఁజేసు వొద్దురా నేము" 26-63
"చిల్లెరతీఁగెలవంటి చేతులు మావినా
ఒళ్లెల్ల నరడుఁజేసు వొద్దురా నేము" 26-63

**అరతన్**: అరుతన్ కావచ్చు. కంఠమునందు.
"అంది శ్రీవేంకటేశ్వరుకిదె యలమేలుమంగ
చెంది యరతఁగట్టఁగా శ్రీవిభుడై నిలచె" 2-50

**అరదు**: వి. 'అరుదు'కు వ్యావహారికరూపం, ఆశ్చర్యం, అపూర్వం.
"ఎనసి నన్నుఁగామటేమి యరదు నీకును
నసఘుఁడ పరమతత్వానంద తిరువేంకటాధిప"
1-35

**అరమఱ**: (అర + మరలుట) ప.బం; వి.
1. సందేహం 2. ఖేదం, పొరపొచ్చెం.
"అచ్చపుసిగ్గులలోని అంగభంగాలు
నీ అచ్చపడ్డ కాఁగిటిలో నరమఱలా" 19-412

**అరమఱచు**: (4) ప.బం. జంకు, సంకోచించు, సగం మఱచు, ఆదమఱచు, పరవశించు.
"సిరుల శ్రీవేంకటేశ సేవచేసితి, అరమఱచితి
నవ్వే నలమేలుమంగ నేను" 20-476
"కరఁగులు నీ మోము కళలోనె కానరాదా
అరమఱచితి నంటూ నాడవలెనా" 11-352
సగం మఱచు, ఆదమఱచు, పరవశించు.
"ఆయాలు సోకించితిని అరమరచి చొక్కితి
చాయనేయవలెఁ గాక సాదించేనా" 11-65
"సిరుల శ్రీవేంకటేశ చేరి నీ కాఁగిట నేను
అరమరచితిఁ బనులన్నియు నింతేపో" 21-481

**అరమఱపు**: (5) వి.; ప.బం. పారవశ్యం.
"అట్టె శ్రీవేంకటేశ అరమఱ పాయ మేను
చుట్టమై ఇంత సేయ సూడా నీకు" 22-151

**అరళుపాడులు పెట్టు**: అ.క్రి. 'అరళుప్పాడు' అంటే మీరు చెప్పవచ్చు నని ఆదేశం. భగవత్ కృపను పొందటానికి సంకీర్తనములను చెప్పడాన్ని సంకీర్తన అరళప్పాడుగ చెప్పదగును. సంకీర్తనసేవ, ముంగిట పారువత్యములు చేయు, దర్బారు చేయు, కొలువు చేయు. సంకీర్తన అరళుప్పాడు భాగవతులు. (దేవునికి సంకీర్తనలు పాడే

భాగవతులు అని ద.హిం.శా. 4సం. లో కలదు. 710 శాసనం)

"అంగరంగవైభవాల కరళుపాడులు వెట్టి
అంగపు నిత్యదానాదు లన్నియుఁజేసె" 7-473

అరవసము : (అర + వశము) వి. సగం లోగిపోవడం, లోగి లోగకుండటం అని భావం.

"వనిత తమ్ముంలము నీ వదనాన నిడఁగాను
మునుకొని అరవసమున నుండేవు" 14-85

అరవిరి : వి. అరవిరి అంటే సగం విరిసిన మొగ్గ అని అర్థం. సగం విరిసిన పువ్వు ముచ్చటగా ఉంటుంది కనుక అరవిరి చందముగు అందాన్ని సొగసుఁదనమునే అరవిరి అని ప్రయోగించి ఉంటారు.

"అరవిరివిధమైన నాన తీయరాదా" 75-190

"అలవోక నగవు నీ అరవిరిసాము" 5-195

"అందపు రెండుకన్నుల నరవిరి నీ మోము
చెందమ్మిరేకుల బోల జెల్లు నయ్య విఠల" 5-201

"వినయవివరంబు లరవిరి మ్రొక్కులాయె" 5-199

"అరవిరి నురమున అలయుచును వీఁడె
తిరువేంకటపతి దెలుపరమ్మా" 5-338

అరవు : వి. ఎరవు.

"విమల మూరితియైన వేంకటగిరిపతి
అమరఁజేరక యరవాయ బ్రదుకు" 1-250

అరవెరమాటలు : వి; బహు. కలవరింత మాటలు, అడ్డదిడ్డమైన మాటలు.

"దురితపుణ్యత్రిదోషజ్వరము వట్టి
అరవెరమాట లాడీని" 1-300

అరసత్తిది : వి. తక్కువ శక్తి కలది (?) శక్తి హీన (?)

"తానే యింత జాణ గాని తలఁప నే మెడ్డెలమా
ఆనుక యూరకుండితే అరసత్తిదాననా" 17-428

అరాజికము : వి. 'అరాజకం' అనే పదానికి వికృతిరూపం. నాయకుడు లేనందువల్ల కలిగే అస్తవ్యస్త పరిస్థితి, అరాచకమని వ్యవహారం. అనాయకం, రాజు లేనిది.

"యింపుల శ్రీవేంకటేశ యిది యరాజికమాయ
పంపున నీ కిదె మొఱ ప్రతిపాలించఁగదే" 4-58

అరిగోరు : భాగం.

"అట్టి కర్మము లనేటి అరిగోరులు పెట్టేము
నట్టుకొట్టి జీవులకు నరకము లేలయ్యా" 15-128

అరిగోరువెట్టు : అ.క్రి. భాగంపెట్టు. (ప్రభుత్వ భాగం, రైతుభాగం, మొత్తం ఫలసాయం.)

"అట్టి కర్మములకు నరిగోరువెట్టేము
నట్టుకొట్టి(ట్టే) జీవులకు నరకము లేలయ్యా" 3-487

"అట్టి కర్మములనేటి అరిగోరులు (?) వెట్టేము
నట్టుకొట్టి జీవులకు నరకము లేలయ్యా" 15-128

అరిగోలు : వి. నదిని దాటించే సాధనాల్లో ఒకటి (సూ.ని.)

"అనుఁగువిభుఁడు వాడె అరిగోలు దన సొమ్ము
వెనకముందర విన్నవించరమ్మా చెలులూ" 11-55

అరిదివడు : అ.క్రి. వింతపడు (అరిది = వింత)

"తెర వేసుకొనఁగానే దీకొని ఇంతిఁగూడేవు
అరిదిపడవు సారె నంటువాయవు" 27-71

అరివేనన్ : అరివాణము = గిన్నె, చషకం, తలె.

"మరులేల కొలిపేవు మనసు నా కియ్యరాదా
అరివేనఁదెచ్చితివా అప్పుడే నీవు" 7-487

అరుత లింగము గట్టి పరువతమేగిన బత్తుడు : సామెత. మెడమీద మేకపిల్లను పెట్టుకొని ఊరంతా వెతకినాడనే సామెత వంటిది.

అరుదందు : ప.బం; అ.క్రి. (అరుదు + అందు) ఆశ్చర్య పడు.

"యీ నెపాన నిన్ను నన్ను నేలె శ్రీవేంకటేశుఁడు
ఆనుక నవ్వినందుకే అరుదందేవు" 26-442

అరువడము : వి. ఆశ, కోరిక, సాన్నిహిత్యం, దగ్గరి సంబంధం.

"ఆపెకు నీకు నెంత అరువడమో

రేపును మాపునుఁ దమి రేచీని" 13-105

**అరుహము :** వి. అర్హము అనే శబ్దానికి జానపదవ్యవహార రూపం. యోగ్యం, యుక్తం, తగినది. ఇట రేఫకూ, హ వర్ణానికీ మధ్య ఉకారాగమం రావడం విశేషం. ఇట్టి రూపాలు శివకవుల రచనల్లో అనేకం.

"అంతయు ననరుహమును
నరుహంబనగరాదు
అంతవానికిఁ బరుల కలవడదుగాన" 1-60

**అరుహానరుహము :** (అరుహ+అనరుహము) అర్హము మరియు అనర్హము - తగినది మరియు తగనిది. యోగ్యం మరియు అయోగ్యం. చూ : అరుహము.

"అందరును సమమైతే నరుహానరుహము లేదా
అందరిలో హరియైతే నౌఁగాక" 2-170

**అరుహుఁడు :** వి. అర్హుడు అనే శబ్దానికి జానపద వ్యవహారరూపం. ఇట రేఫకూ, హకారానికీ మధ్యలో ఉకారం రావడం విశేషం. ఇట్టి ప్రయోగాలు శివకవుల రచనల్లో అతిసాధారణం.

"సతతదయాచారసంపన్నుఁడై మఱికదా
ఆతిశయవైష్ణవాన కరుహుఁడౌట" 1-423

**అర్చావతారము :** వి. భక్తులు పూజించుకోవడానికి వీలుగా వెలసిన భగవంతుని రూపం.

"సన్నిధిగల యర్చావతారమిది
వున్నతి ఘనమని వుండఁగవలెను" 15-230

**అఱచేత నుండు :** ప.బం; అ.క్రి. సులభంగా లభించు.

"అచ్చట వీరి ప్రసాదమమృత పానములు
అచ్చమై తెలిసే వారి కఱచేత నున్నది" 1-479

**అఱచేతిది :** (అఱచేతి + అది) సులభసాధ్యం, అందుబాటు లోనిది.

"ఆదైన చదువులు అఱచేతి వతనికి
మేదినిఁ దిరుగాడు మెట్లవలెనా" 2-68

**అఱచేతిలోనిది :** ప.బం; వి. అందుబాటులోనిది, సులభమైనది.

"చెచ్చెర నుపచారము చెప్పిన యాపెకుఁగదా
అచ్చపుమన్నన లెల్లా నఱచేతిలోనివి" 21-234

**అఱచేతిలోనివాఁడు :** ప.బం; వి. అందుబాటు లోని వాడు, సులభుడు.

"యెప్పుడు అహంకార మిటు మానును
అప్పుడు దైవము అఱచేతిలోనివాఁడు" 15-42

'అఱ' శబ్దం సాధురేఫతో కూడా వాడబడింది.

**అఱచేతివారు :** ప.బం; వి; బహు. సులభులు.

**అఱపడము :** వి. (?)

"మఱి యే పురుషార్థము మా వంకలేదు మీకు
అఱపడము మాకెంత అత్తువో నీవు" 3-59

**అఱిమురి :** క్రి.విణ. 1. అనాలోచితంగా 2. వెంటనే 3. అత్యంతం, మిక్కిలి 4. తబ్బిబ్బుగా 5. తరుచుగా 6. నిశ్చయంగా 7. బొత్తిగా 8. శీఘ్రంగా, వేగంగా. విణ. అత్యంతం, మిక్కిలి, గడబడ లాగా తొందరనుగానీ, తొందరపాటునుగాని తెలిపే ధ్వన్యనుకరణం.

"మెఱయు శశికాంతపు మేడ లోపలను
అఱిమురి కప్రంపుటరుగు మీఁద"

ఈ పదం వావిళ్ల నిఘంటువులో 'అఱిముఱి' అని చూపబడంది. 1. త్వర 2. క్షోభం, కలత అనే అర్థాలు చూపబడ్డాయి.

**అఱుకమ్ము :** చుట్టూ కమ్ము, కవియు, మెడ పట్టుకొను.

"అరు(లు) కమ్మి పెనగేవు అద్దిరా నీవు"

**అలపు :** వి. అలసట, శ్రమ.

"పోసరించి కెళవుల పొందులే వెదకుఁగాక
ఆసోదకాని కెంతైనా నలపు గద్దా" 16-36
"బలిమి వొద్దఁగూచుండి పాదాలేమి గుద్దేవే
అలపు దీరుచుకో అంతలో నీవు" 22-195

**అలబలము :** వి. కలకలం, సందడి, జనులు, పక్షులు మొ॥ వాని ధ్వని.

"వెలినున్న చైతన్యవిధుల దొరలచేతి
యలబలముగాన మహామేలు" 2-124
"అందంద మాటలాడే అలబలము చూడక

కందువఁ దెర దీసుటే కల్ల నా వల్ల" 7-7

**అలమటఁబడు :** ప.బం; అ.క్రి. చింతపడు.

"వావిరి నిదెఱఁగక వట్టి యలమటఁబడి

జీవు లేల బడలేరు చింత లిట్టే పాయరో" 2-94

**అలమట :** వి. చింత.

"దించక తిరిగే తిమ్మటలన్నియు

అంచల వెళ్లుల అలమటలు" 3-157

**అలమటకాఁడు :** (అలమట + కాడు) వి.

1. దురవస్థ కలవాడు, శ్రమ కలవాడు, దుఃఖం కలవాడు, బాధ కలవాడు.

"సరసపుమాటల సటకాడవు

మరుతంత్రముల యలమటకాఁడవు" 28-527

**అలమేర్(ల్)మంగ :** వి. అలమేల్మంగ, శ్రీవేంకటేశ్వరస్వామి ధర్మపత్ని, పద్మావతి. రూపాం. అలమేల్మంగ, అలమేలుమంగ, అలర్‌మేల్‌మంగ = పుష్పం (పద్మం) పై భాగంలో జన్మించిన లక్ష్మీదేవి అని అర్థం. త. అలర్ మేల్ మంకై.

"నిరతి శ్రీవేంకటేశ నేనల మేర్మంగను" 7-342

**అలయించు :** స.క్రి. శ్రమింపజేయు, విసిగింపజేయు, ఆలస్యంచేయు.

"కలయఁగ నేర్చుఁగాని గక్కన శ్రీవేంకటేశ

అలయించనేరదు అలమేల్మంగ" 16-570

**అలయింత :** (అలయించు + త) వి. శ్రమపెట్టడం.

"పొలిఁతి నాకేల యీ పొందులు వీని

అలయింతవలపుల నలయుచును" 6-130

**అలవోక :** వి; ప.బం. స్వేచ్ఛ, యదృచ్ఛ.

"సొలసి సొలసి చూచే చూపులే వేడుకగాక

అలవోక లవి యెల్లా నాసరేఁచీనా" 8-115

**అలసిసొలసి :** ప.బం; అ.క్రి. మిక్కిలి ఆయాసపడి అనే అర్థంలో జంటపదం.

"వెలుగు చేను మేసినట్టి విధము దోఁచె నీయందు

అలసి సొలసి నిన్ను నిఁక నాడ నేఁటికే" 23-593

**అలసును :** స.క్రి. అలయును అనే పదానికి వ్యావహారికరూపం.

"మారుకొ నీరెండుగాళ్లే మాపుదాఁకా జుట్టనోపు

యే రీతి దేవ! నీ గుడికేగ నలసుఁగాని" 2-230

**అలికి పూసి కుడుపు :** శుద్ధిచేసి, గంధంపూసి, నైవేద్యం సమర్పించు.

"ఆరగించి వేలుపుల అలికి పూసి కుడిపి

కూరిమి శ్రీవేంకటాద్రి గోవిందుఁడమ్మా" 2-167

**అలిగించు :** ప.బం; స.క్రి. కోపింపజేయు.

"అలిగించు ములిగించు నంతలోనె భ్రమియించు

కొలఁది సంసారపు గుణ మిది" 10-223

**అలుకలు :** వి. 'అలకలు'కు వ్యావహారికరూపం(?) ముంగురులు.

"పులకజొంపములఁ బ్రుంగుడగుచు నీ

యలుకల చెమటల కమ్ముడువోయె" 6-11

**అలుకసేయు :** అ.క్రి. కోపించు.

"అలుకసేసుకొంటివి అక్కడకుఁబోవలసి

తెలుసు కాని యేటికో తిరిగివచ్చితివి" 11-599

**అలుకు ఉలుకు :** ప.బం; అ.క్రి. భయపడు అనే అర్థంలో జంటపదం. (అలుకు = భయపడు, ఉలుకు = భయపడు)

"అలికేవు వులికేవు అంతలోన భ్రమసేవు

వెలయ నిలువుననె వెరగందేవు" 9-19

**అలుకుడు సేయు :** అ.క్రి. అలికిడి చేయు, చప్పుడు చేయు.

"అచ్చపు శ్రీవేంకటేశు నలమి కౌఁగిటఁబట్టి

కొచ్చి కూడే వేల అలుకుడు సేసేవే" 12-525

**అలుగక ములుగక :** ప.బం; అవ్య. కోపపడక - మూలుగక. (గొణగక)

"అలుగక ములుగక అతని గుణములు

తెలుసుకొనఁగదవె దినదినములను" 8-6

**అలుగువారు :** ప.బం; అ.క్రి. అలుగు అంటే పరీవాహం. చెరువు మొ॥ వాటిలోని అదనపు నీరు పోవడానికి ఏర్పరచిన దారి. దానిపైనుండి నీరు ప్రవహించు అని వాచ్యార్థం. అధికమగు.

"అరిది సురతభావరసము
లలుగువారఁబోలును" 17-279

**అల్లది:** (అల్ల + అది) వి. అయ్యది. ఇట అల్ల నిర్దేశార్థకం. పరిదృశ్యమానమైనదాన్ని చూపటం.

"నీవు మన్నించినదాన నీకు వలచినదాన
ఈవల నల్లది నాతో యీడుజోడుగా" 11-32

**అల్లదివో:** (అల్ల + అది + వో) అదిగో, పరిదృశ్యమైనదాన్ని చూపటం.

"అదివో అల్లదివో హరివాసము"
"అల్లదివో వోఁగునూతు లౌభలేశు పెద్దకోన
వెల్లి పల నీటిజాలు వెడలే సోన" 4-375

**అల్లదె:** (అల్ల + అదె) అదిగో. అల్ల నిర్దేశార్థకం. పరిదృశ్యమైనదాన్ని చూపటం.

"అల్లదె జవ్వని హరి యురమున నదె
మెల్లనె యిటు వుపమించరే మీరు" 19-375

**అల్లప్పుడు:** (అల్ల + అప్పుడు) అప్పుడు. ఇందలి 'అల్ల' అనేది నిర్దేశార్థకం.

"మేలిమి పొదరింటిలో మీరిద్దరు నల్లప్పుడు
తాలిమితోడ నేకతము లాడుకొనరాదా" 12-419

**అల్లమవుతా బెల్లమవుతా:** ప.బం. గాఢస్నేహం కలిగిఉంటూ; 'అల్లం బెల్లం' అని సామెత. ముద్ద చేస్తే రెండూ కలుస్తాయి. విడదీయరాని స్నేహం అని భావం.

"కొల్లి శ్రీవేంకటపతి కూడె నా కౌఁగిటిలోన
అల్లమవుతా బెల్లమవుతా అడిగెఁబో యికనూ"
17-468

**అల్లములు బెల్లములగు:** ప.బం; అ.క్రి. ప్రతికూలంగా ఉన్నవి అనుకూలములగు.

"ఆయనాయ నీ మాట లల్లములు బెల్లములు
మూయ మూయ నీకె మూరెడు నోరు" 9-73

**అల్లవాఁడు:** (అల్ల + వాఁడు) వి. ఆ వాడు, ఆతడు. ఇట అల్ల అనేది నిర్దేశార్థకం.

"ఎట్టు సేసినా జేయుమిక నాతఁడల్లవాడే
పట్టరాని వ్రతముతో పానుపుపైనే" 8-177

**అల్లా:** అవ్య. ఎల్లా, అంతా (అల్ల = ఎల్ల, అంత)

"మెట్టి కూచుండే యరఁగు మేదిని యల్లా"
2-310

"వాటపుఁ బెండ్లి చవికె వనిత నీ పిరుఁదు
మేటి రాజ్యపదవి నీ మేనల్లాను" 18-58

**అల్లాడన్:** (అల్ల + ఆడ) అక్కడ, అ చోటు. ఇట అల్ల అనేది నిర్దేశార్థకం.

"అల్లాడఁబడి వున్నదా ఆడుఁదనము
పల్లదానఁ బదికితే పచ్చిగాదా తనువు" 13-349

**అల్లికామ:** వి. అల్లికాడ, కలువతూడు.

"తిన్నని మేఘము చూచి తిట్టుచు నీరెల్లఁగార
సన్నపు టల్లికామల చాఁచి పిలిచీని" 7-422

**అల్లిదామెర:** వి. తెల్లకలువ.

"తల్లివె మాకెల్ల నీవు తగు నీకు చెలులము
అల్లిదామెరలై నీ వాతనిఁ జొక్కించను" 7-66
"అల్లిందామరల పొందులైన కన్నులవాఁడు
తల్లిఁగూఁతుఁ గౌఁగిటఁ దగిలినాఁడు" 6-43

**అల్లిబిల్లి:** ప.బం; విణ. 1. కలసిమెలసి ఉన్నది, కూడిమాడి అన్నట్లు 2. సాంద్రమగు 3. ప్రియమైనది. వి. 1. పెనకువ 2. స్నేహం 3. బాలక్రీడావిశేషం.

"బల్లిదుఁడలమేల్మంగపతి శ్రీవేంకటేశుఁడ
అల్లిబిల్లై యున్నాఁడమ్మా యశోదమ్మా" 4-161

**అల్లిబెల్లియగు:** కలిసిమెలిసి యుండు.

"నంటున జక్కవలపై నల్లఁబులుగులు వారె
అందీ తామరా జిగురూ నల్లిబెల్లే యగు"
24-562

**అల్లిరము:** వి. మనుగుడుపులు, పెండ్లివిందు.

"అన్నిచోట్లానుండి అల్లిరము లారగించ
వెన్నుఁడవై వేడుకతో విచ్చేసినట్లు" 3-433

**అల్లుకొను:** వృద్ధిచెందు.

"అల్లుకొనెఁ గర్మములు అక్కడికి నిక్కడికి"
2-490

**అల్లునేరేళ్ళు:** ప.బం; వి; బహు. 1. బాలికలు వెన్నెలలో ఆడే ఒక ఆట 2. నమస్కారం 3. ఒకవిధమగు పాట; రూపాం. అల్లోనేరేళ్లు.

"అవల వెన్నెలలోనె అల్లునేరే ళ్లింతే
నివిరి నిన్నటి వునికి నేఁటికిఁ గలదా" 1-449
"వేయకురే కొల నాపై వెన్నెల గలప్పుడే
ఆయెడ నల్లు నేరేళ్లనుట యెఱఁగరా" 19-440

**అల్లోనేరేళ్లు:** ప.బం; వి. (1. జంబూ ఫలాలు, జంబూ వృక్షాలు) 2. బాలికలు వెన్నెలలో ఆడుకొనే ఒక ఆట.
"నెయ్యము లల్లోనేరేళ్లో
వొయ్యన వూరెడి వువ్విళ్లో" 5-179
"వెన్నెలదినమున నల్లోనేరేళ్లు గాక
యావలఁగలవే" అని భా.రా.

**అళగిరి:** వి. అహోబలానికి పేరు. అహోబల నృసింహస్వామికి అళగిరిసింగం అని పేరు.
"అళగిరి చక్క నళగిరి వో యళగిరి
తలవంచుకోర నామట తారుకాణ సుమ్మీ"
19-457

**అళగు:** వి. సౌందర్యం.

**అళతి:** వి. (రా.సీ; మాం.) కొలతలు తీసుకోవడం, గుడ్డలు కుట్టించేటప్పుడు దర్జీ 'అలితి' ఉందా అని అడుగుతాడు. 'ఆది' అని కోస్తా వ్యవహారం.
"హత్తి కలువరేకుల యళతులు గొలిచేవు
కొత్తగా కనుగొనల కొలది దెలిపేవా" 22-257

**అవగళించు:** స.క్రి. 'అవఘళించు'కు రూపాం.
"చెందిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగళించి" 5-18

**అవధానము:** వి. ఒక కవితా ప్రక్రియ ; ఇందులో ఏకాగ్రతకు ప్రాధాన్యమెక్కువ.
"మూటగా నిట్టె పుస్తకమున వ్రాసుకుండితివో
నాఁటనుండియు నవధానములు నేరుతువో"
23-359

**అవధారు:** అవధరింపుము. వినుము అనే హెచ్చరికను తెలియజేసే శబ్దం.
"అవధారు పరాకుసేయకుకు మపరాధముగా నెంచకు
వివరింపఁగ నీవే గతి విష్ణుఁడ మన్నించఁగదే"
2-295

**అవలయివల చేయు:** ప.బం; స.క్రి. చలింపజేయు, కలతపరచు.
"తివిరి జలధిదాటి దీపించి లంకయెల్లా
అవలయివల సేసే హనుమంతుఁడు" 2-207

**అవసరించు:** స.క్రి. వేగిరపెట్టు, ఉవ్విళ్లుగొలుపు.
"ఇవల నలమేల్మంగ నిటు తా నన్నేలినాఁడు
అవసరించేవు నీకు నాతఁడే రమణుఁడా" 25-29

**అవళు:** వి. (?)
"అవళు గలిగి కా అష్టపుత్రులును
భవములు శ్రీహరిపాలనె కలిగె" 15-157

**అవుఁగాదననివాఁడు:** వి; బహు. తిరస్కరించనివాడు, బదులు చెప్పనివాడు.
"జవరాలు తనునెంత చలము సాదించినాను
అవుఁగాదననివాఁడే అందపురమణుఁడు"
18-368

**అవుఁగాదను:** (6) ప.బం; అ.క్రి. తిరస్కరించు, బదులు చెప్పు.
"అడ్డమాడఁజాలను అవుఁగాదనఁజాలను
దొడ్డదొరవు నీ మాట తోయఁజాలను" 18-342

**అవుఁగాదనేవాఁడు:** వి; బహు. తిరస్కరించేవాడు, బదులుచెప్పేవాడు, ఆలోచించేవాడు.
"అందుకేమీ దోసమా అవుఁగాదనే వారెవ్వరు
చెంది మాతో బాసలేల సేసేవు నీవు" 13-267

**అవుఁగాములు:** (5) వి; బహు. మంచి చెడ్డలు, రూపాం. ఔగాములు.
"కోలుముందుగా రతిఁగొన్నదే కోలుగాక
ఆలిమగని కైతే అవుఁగాములు" 14-514

**అవుగులు:** వి; బహు. భక్ష్యవిశేషం.
"అరెసెలు గారెలు నవుగులును
కరజికాయలును ఖండమండెగలు" 6-4

**అవుదు:** వి. (?) సందిగ్ధ పద సమీక్షలో (21సం. 385పు.) ఈ పదం కన్నడంలోని ఆముదపు చెట్టు అనే అర్థంకల అవుండ్ల (అవుండ,

అవుడ్లు, అవుడ్ల, అవుడలు, అవుకలికె) అనే పదమే తెలుగులో అవుదుగా మారిందేమో అని ఊహింపబడింది. అలాగే అవుడ్ల శబ్దం సంస్కృత ఆమండ శబ్దభవంగా కూడా సందేహింపబడింది. అవుదు శబ్దాన్ని అకుండ, అవుండ్ల శబ్దభవంగా భావించినపుడు అముదము అనే అర్థం చెప్పుకోవాలి. (ఆం.ప.ని.) అర్థం ఇక్కడ కుదురుతుందా? ఆలోచించాలి. వా.ని. లో అవుదు (జాదు) కు నీటి కాలువ అనే అర్థం చూపబడింది. ఈ అర్థం ఇట కుదురవచ్చు.

"చెలువుడ మతియును చెక్కులు నొక్కఁగ

అలరిన యాసలు అవుదునఁజిక్కె" 21-116

**అవుభళనారసింహుఁడు :** వి. అహోబలక్షేత్రంలో వెలసిన నరసింహస్వామి.

"అన్నిటా జాణ గదవే అవుభళనారసింహుఁడు

కన్నెలాటలు చూపఁగాఁ గత లడిగీని" 13-472

**అవుభళము :** వి. అహోబళమనే నృసింహక్షేత్రం. ఇది ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు జిల్లాలో ఉన్నది. అన్నమయ్య కీర్తనల్లో 'అహోబలం' అవుభళ, ఓబుళ, ఔభళ, ఓబుల, ఔబుళ ఇత్యాదిగా వాడబడింది.

**అవుభళేశుఁడు :** వి. అహోబలక్షేత్రస్వామి యైన నృసింహస్వామి; అహోబల అనే పదానికి అవుభళ అనేది వ్యావహారికరూపం. చూ: అవుభళము.

**అవులు :** వి. 'అవి' శబ్దానికి బ.వ.రూపం కావచ్చు. 'అవి' శబ్దానికి సూర్యుడు, భూమి, గాలి, కొండ, ప్రాకారం, ఇల్లు, ప్రభువు, కాంతి, ముట్టుది, గొఱ్ఱె, ఎలుక, కంబళి, అడవి ఉలవలు అనే అర్థాలున్నాయి. ఇట గాలి, కాంతి అనే అర్థాలు కుదురవచ్చు లేదా అవులువారు అంటే గుల్లగుల్లయగు, నుజ్జునుజ్జగు అనే అర్థం కుదురవచ్చు.

"భావపు వింతలతోడ పచ్చి సింగారముతోడ

అవులువారెడి మేని అలపులతోడ" 5-337

**అవుషధము :** (2) వి. 'ఔషధము'. ఇందలి ఔ అనే వర్ణం ఉచ్చారణానుకూలంగా 'అవు' అని ప్రయోగింపబడింది.

"అట్టి పథ్యములొల్ల అవుషధము గొనవొల్ల

మట్టు లేని మణుఁగొల్ల మైల గానొల్ల" 4-65

**అవ్వచరి :** వి. తిరుమల నడకదారిలో మోకాలి పర్వతానికి ముందుండే లోయను అవ్వాచారి కోన అని అంటారు. అవ్వాచారి అనే వైష్ణవభక్తుని పేరు మీద ఈ కోనకు ఆ పేరు వచ్చి ఉంటుంది.

"చక్క నేఁగుచు నవ్వచరిఁగడచి హరిఁదలఁచి

మ్రొక్కుచును మోకాళ్లముడుగు గడచినమీఁద"

1-227

**అష్టమదములు :** వి; బహు. ఎనిమిది విధాల మదాలు. అవి 1. అన్నమదం 2. అర్థమదం 3. స్త్రీమదం 4. విద్యామదం 5. కులమదం 6. రూపమదం 7. ఉద్యోగమదం 8. యౌవనమదం.

"పరమయోగు లీభావ మష్టమదము

భవవికారమని మానిరి" 2-383

**అష్టాక్షరమంత్రము :** వి. ఎనిమిది అక్షరాలు గల "ఓం నమో నారాయణాయ" అనే మంత్రం.

"యీతఁడే కా వుపదేశమిచ్చె నష్టాక్షరమంత్ర

మీతఁడే రామానుజులు యిహపరదైవము"

2-372

**అసదు :** (3) విణ. అల్పం, కృశం, సన్ననిది, నికృష్టం, దుర్బలం వి. అల్పుడు, దీనుడు.

"అతనుసంపదకంటె నసదా చెలిరూపు

మతి చింతచేత వేమరు నలఁగెఁగాక" 6-7

**అసపెట్టు :** (అసము + పెట్టు) పురికొల్పు, ఉత్సాహపెట్టు, ఆశపెట్టు.

"నన్నేల యసపెట్టేవు నాయకునిమీఁదను

పిన్నదాన ఆతనికిఁ బ్రియమాడేదానను"

20-541

**అసమిచ్చు :** అ.క్రి. అనురాగం పంచు. (అసము = కీర్తి, దర్పము, అనురాగము – ఆంధ్ర పదనిధానము) చనవు అని సారంగ. వ్యాఖ్య. చనవిచ్చు (?) అవకాశమిచ్చు(?)

"ముసిముసినగవుతో మునిఁగి నా కొనగోరి

కసమిచ్చి యేల లోఁగే వానతీవయ్యా" 24-46
"రసికత నీతో సరసము లాడేనంటే
అసమిచ్చేవా ఆపె ఆసలనున్నాఁడవు" 19-166
"కొసరి కొసరి నీపై కోపమున నుండిఁగాని
అసమిచ్చు నీతో మాటాడ నైతిఁగా" 21-499
"మగువకు నసమిచ్చి మాటలెల్లా నాడించి
తగవు దిద్దవచ్చేను తగునా నీకు" 26-257
"మగువకు నసమిచ్చి మాటలెల్లా నాడించి
తగవు దిద్ద వచ్చేవు తగునా నీకు" 26-257
"ఎంతవలపైనను మొగవాని కసమిచ్చి మాట
లాడుదుర" అని క్షేత్రయ్య ప్రయోగం.

అసము : (1) వి. యశస్సు, కీర్తి, పొగడ్త, అనురాగం అని (ఆం.ప.ని.) అహంకారం, గర్వం, దర్పం, ఉత్సాహం, శక్తి, పలుకుబడి, అవకాశం, వీలు, ప్రేమ, చనవు, స్నేహం.
"కొసరేటి తరినెనెంత గోరనూఁదుదు నిన్ను
అసముతో నవ్వేదువందుకు నీవు" 7-344
"అసమునఁ జేయిచాఁచీ నాతఁడు గదే" 20-554

అసము దించు : అ.క్రి. అహంకారం వదల్చు, గర్వం వదల్చు, దర్పం వదల్చు.
"పొసఁగ పాదరసముఁ బోలిన నా మనసు
అసముదించక సదా అల్లాడీఁగాను" 2-395
"అసము దించక బీరాలాడీఁ గాక తాను
పసిఁగాటు దత్తరము నాకంటెఁబో" 24-118
"యిసుక లెక్క వెట్టితే నెంతైనా గలదు
అసముదించని పుణ్యా లటువంటివే" 3-568
"అసముదించని ఆన అది యెంతోకాని
అసముదించఁగ లేవు ఆరగించఁబెట్టరే" 11-256
"అసముదించక మాట లాడేగాని నీతో
విసిగితి నీ విరహవేదనలను" 20-130
"అసముదించక మాటలాడేవు గాక నాకు
వసమయ్యేవా యింత వన్నెకాఁడవు" 10-2-28

అసముదిగు : అ.క్రి. గర్వముపోవు.
"యెసఁగి శ్రీవేంటేశ యింతలో నన్నుఁగూడితి
అసముదిగితేఁగన కప్పుడనరాదా" 11-234

అసలుఁగంబము : (అసలు + కంబము) ప.బం; వి. అస్థిరమైంది. బురదలోని స్తంభమని వాచ్యార్థం.
"అసలుఁగంబ మీ యాశాదోషము
విసిగిన నూరక విడువనిది" 1-180

అసలు : అవ్య; అ.దే. నిజంగా, వాస్తవంగా.
"కొసరే మా మాటలు కూరిమిలో తేటలు
అసలు నే డింపేనా నాఁడె కాక" 11-154

అసలుకొను : అ.క్రి. బురదగా అగు, పూసిన దగు.
"కుప్పలుగా మై నసలుకొని కస్తూరితోడ
తొప్పఁదోగేటి చెమటతోడ" 5-130

అసలు చొచ్చి అలయు : ప.బం; అ.క్రి. తెలిసి తెలిసి బాధలో పడు. 11-3 భా 74 old

అసవాలకుఁడు : వి. శక్తి గలవాఁడు. (ఆ.మూ.)
"అప్పఁడైన వేంకటాద్రి అసవాలకుఁడు గాన
తప్పకుండఁ బెట్టె వాని తలకెత్తరే" 4 అను. 20.

అసాదలు : వి; బహు. 'ఆసాదులు'కు రూపాం. చర్మకారులు.
"పయ్యెద జారఁగ నిల్చె భ్రమియించ నేమంటివి
అయ్యొ అసాలు వెట్టే నందు కేమంటివి" -12 old

అసిపత్రము : వి. నరకభేదము, వృక్షాలను నరికినవాడు అసిపత్రనరకానికి వెళతాడట.
"సరి నసిపత్రములు నాటు సమయదెంతైనా
జిగిరింపు చుండు" 15-410

అసిమ : వి; మాం. గుడ్డతో కుట్టిన పొడుగాటి సంచి, నడుమ తెరవటానికి వీలుగా ఉంటుంది. అటు, ఇటు సరకులు వేసుకొని భుజంమీద వేసుకొని వెళ్ళడానికి వీలుగా ఉంటుంది. అశ్వసంచి అని వ్యవహారం. సంచి. రూపాం. అసిమి.
"అమ్మేడి దొకటి, అసిమలో దొకటి
బిమ్మిటి నిందేటి పెద్దలమయ్యా" 1-483
"ఆడేదొకటి నీ యసిమలోని దొకటి
యీడ నాతో నాడుమాఁట లివియైనా నిజమా"
24-90

**అసిమి :** వి. గుడ్డతో కుట్టిన పొడుగైన సంచి. నడుమ తెరువడానికి వీలుంటుంది. రెండువైపులా వస్తువులు వేసి బుజం మీద వేసుకొని పోవడానికి వీలుగా ఉంటుంది.
"అమ్మెడి దొకటి అసిమిలోని దొకటి" 1-483
నుడికడలిలో ఆసెము అనే రూపం చూపబడింది. మూడు నాలుగు అరలు గల గుడ్డసంచి అనే అర్థం చూపబడింది. కనుక ఆసెము అనే రూపాం. కూడ వ్యవహారంలో ఉండి ఉంటుంది.

**అసురలు :** వి; బహు. రాక్షసులు. 'అసురులు' అనే ప్రయోగం కూడా ఉంది. 24-135
"పురుషోత్తముని పూజ పొంతఁబోరు అసురలు
సరవి విష్ణుని జపించనివారు నసురలే" 3-5

**అసురుసురగు :** (21) ప.బం; అ.క్రి. అలసిపోవు, బడలు, మిక్కిలి శ్రమపడు, చిరాకుపడు - ధ్వన్యనుకరణం.
"విసుగక జీవుఁడు వీరిఁడిమాయల
అసురుసురయి తా నలసీఁగాక" 1-495

**అసురుసురను :** (5) ప.బం; అ.క్రి. బడలు, శ్రమనొందు. (అనుకరణశబ్దం)
"అదె పాడిఁబడి పతి యసురుసురనఁగా
పదరి నేఁబిలుచుట పాటి యౌనా" 11-156

**అసురుసురులు :** ప.బం; వి; బహు. బడలికయందు విడిచే ఉచ్ఛ్వాసనిశ్వాసల ధ్వన్యనుకరణం.
"నేమే చెప్పిన నొల్లవు వీయంతనే నీకిప్పుడు
యీ మోహపుటసురుసురులు యెక్కుడివే నీకు"
19-543

**అస్తమానము :** వి. 'అస్తమనము' నకు వికృతి రూపం. సాయంకాలం, సూర్యాస్తమయం.
"సతి నీ మో మెత్తుటే చంద్రోదయ మౌట
అతివ నీ తలవంపు అస్తమానము" 24-163

**అస్తినాస్తులు :** వి; బహు. కలిమిలేములు, అస్తి, నాస్తి అనేవి సంస్కృత క్రియాపదాలు. ఇట నామవాచకంగా ప్రయోగింపబడటం విశేషం.
"మన్నన శ్రీవేంకటేశ్వరుకరుణను మా
యాచార్యుఁడే అధికారి
వున్నరీతినే అస్తినాస్తుల నూరకుండుటే నా
తలఁపు" 1-463

**అస్సారము :** వి. అసారము (సారం లేనిది) అనే పదానికి వికృతిరూపం. ఇట సకారానికి ద్విత్వప్రయోగం విలక్షణం. సారం లేనిది. ఇట 'స్సా' అనేది ప్రాస స్థానంలో ప్రయోగించడం విశేషం. ఇట్టి ప్రయోగాలు చేయడంలో అన్నమయ్య ధైర్యం దొడ్డది.
"ఇస్సీ నే నెఱఁగనా యీపాటి నేను
అస్సారాస నడిచేనా అన్నిటా నేను" 27-207
"లెస్సాయఁగా నేఁడు నీ లెక్కలేని సరసాలు
అస్సారముగా వలపు లారడిఁబెట్టేవు" 18-460

**అస్సురుసురు :** వి. బడలిక యందు విడిచే నిట్టూర్పు ధ్వనికి అనుకరణం ; రూపాం. అసురుసురు.
"కోరి నేరా లెంచనేలే కొయ్యగాండ్లతోడ
వోరుచుకుండే టస్సురుసురే మేలు" 11-458

**అహంబ్రహ్మత్వము :** 'అహం బ్రహ్మాస్మి' అనే భావం.
"అక్కటా ప్రాణికిని అహంబ్రహ్మత్వమే కాని
దిక్కుదెసయైన వానిఁ దెలుసుకో నోపఁడు"
15-262

**అహమాదిశ్చ మధ్యం చ :** "అహమాదిశ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ" అనే భగవద్గీతా శ్లోకంలోని (10-20) భాగం. "సమస్త ప్రాణుల సృష్టి స్థితిలయాలకూ నేనే కారకుణ్ణి" అని తాత్పర్యం.
"మెండగు యీ జీవులను మీరు గారన
వెఱతును
వుండెడి వీరలు నిత్యులు వొగి నహమాదిశ్చ
మధ్యము గాన" 2-121

**అహమించు :** అ.క్రి. గర్వించు, నేనే అన్నింటిని చేయగలను అనే ధీమాతో విజృంభించు.
"సహజాచారము లెల్లా సర్వేశ్వరుని యాజ్ఞే

అహమించి నమ్మకుండు టదియే పాషండము "
1-431

**అహమిక**: వి. అహంకారం, అహంభావం, ఉత్కంఠ.
"చేపట్టి నీ శిరసు పూజించే అహమిక కంటే
నీ పాదాలు పూజించే నేమ మెక్కుడు" 2-483

**అహివెట్టు**: (అహి + పెట్టు) స.క్రి. తాకట్టుపెట్టు, కుదువబెట్టు. రూపాం. ఆహివెట్టు.
"అప్పుడే గోవిందునికి అహివెట్టితిఁ జిత్తము "
"అహివెట్టితి జొన్నగడ్డాగ్రహార
వృత్తి యేనూఱు రూకల వృత్తమునకు" (క్రీడా. 245 ప.) అని శ్రీనాథుని ప్రయోగం.

**అహోబలదేవుఁడు**: వి. అహోబలక్షేత్రంలో నెలకొన్న నృసింహస్వామి. 2-508

**అహోబలనృసింహస్వామి**: చూ: అహోబలేశుఁడు.

**అహోబలము**: వి. ఆంధ్రప్రదేశ్ కర్నూలు జిల్లాలోని నృసింహస్వామిక్షేత్రం. రూపాం. అవుభళం, ఓబుళం. ఈ క్షేత్రం కర్నూలు జిల్లా ఆళ్లగడ్డ సమీపంలో ఉంది. దీనికి అహోబిలం, ఔబళం, ఔభళం, ఓబుళం అనే పేర్లు కూడా వ్యవహారంలో ఉన్నాయి. స్వామి గుడి గోపురాలు చిన్న అహోబలంలో ఉన్నాయి. ఊరూ వాడా ఇకడే. పెద్ద అహోబల సానువుల్లోనే నవనారసింహుల మూర్తులున్నాయి. అన్నమయ్యకు తిరుమల తరువాత చాలా అభీష్టమైన క్షేత్రం ఇది.
"ఆరీతి నీ కొలువిట్టే అహోబలము మీఁదే
నారుకొనె నీఁ నేరుపు నారసింహో" 2-248

**అహోబలేశుఁడు**: వి. అహోబలక్షేత్రంలో నెలకొన్న నృసింహస్వామి. నవనారసింహులలో ఇట వెలసిన నరసింహుడు ప్రహ్లాదనరసింహుడు.
"దాసులపాలిటి నిధానమై వున్నాఁడదిగో
ఆసాబాసా నితఁడే అహోబలేశుఁడు" 4-488

**అహోబలేశ్వరుఁడు**: వి. అహోబలక్షేత్రానికి స్వామియైన నృసింహస్వామి. ఇతడు ప్రహ్లాద నరసింహస్వామి. అన్నమయ్య అహోబలం లోనే శ్రీశఠకోప యతీంద్రులవద్ద పన్నెండు సంవత్సరాలు శిష్యరికం చేసి శ్రీనృసింహ మహామంత్రసిద్ధి పొందినాడు. కనుకనే అహోబల నృసింహస్వామిపై ఎన్నో సంకీర్తనలు రచించినాడు.
"అహోబలేశ్వరుఁ డరికుల దమనుఁడు
మహామహిమలను మలసీ వాఁడె" 2-112

## ఆ

**ఆఁక**: వి. 1.నిరోధం, అడ్డు 2.వేల, చెలియలికట్ట 3.చెరసాల 4.కట్టుబాటు, మర్యాద.
"ఆఁక శ్రీవేంకటేశ పాలంటె గుటుకన్నమాట
యేఁకట నీ జాడ లాయ నిఁక నేఁటిమాటలు"
9-272

**ఆఁకటికిఁగూరఁదిన్నట్లు**: నానుడి, సామెత. ఇబ్బంది పడడమని భావం.
"కూడులేక యాఁకటికిఁ గూరఁదిన్నట్లు
ఆడనీడ మోవిచిగురాకు దినేరయ్య" 1-234

**ఆఁకటికి గుక్కిళ్లు ఆసయినట్టు**: ఏమీ లేనప్పుడు అందుబాటులో నున్న సామాన్య వస్తువులపైనే ఆశ కలిగినట్లు. ఆకలి ఐనప్పుడు గుక్కిళ్లపై ఆశ కలిగినట్లు అని శబ్దార్థం.
"చీకటి నోటికిఁ గడిచేయే కొంట వచ్చినట్టు
ఆఁకటికి గుక్కిళ్లు ఆసయినట్టు" 2-96

**ఆఁకరు**: అ.క్రి. 'ఏఁకరు' ఏకారు కు రూపాం. చేసిన పనినిగాని, తప్పునుగాని పదేపదే చెప్పు.
"కన్నులనే యాఁకరేవు కౌఁగిటనే కూడేవు
సన్నల శ్రీవేంకటేశుఁ జలమునను" 12-532

**ఆఁకారు**: (ఆఁక + ఆరు) అ.క్రి. ఏఁకారుఁకు వ్యావహారికరూపం; 1. ఉవ్విళ్లూరు, మిక్కిలి కోరిక కలిగి యుండు. 2. భయపడు, దైన్యంతో బాధపడు.
"అండనున్నవారు చూచి యాఁకారనేల"
29-294
"కప్పురము మోవి నిచ్చి కాఁకలతోఁ దమకించి
యిప్పుడె యాఁకారీని నెవ్వతెరా" 17-72

**అఁగఁజేయు :** స.క్రి. ఆపివేయు.
"ఇతవుగానివార మేల నీకు నా మేని
అతితాపమంటుఁ జేసు నటు వోవయ్యా" 4-40

**అఁగు :** స.క్రి. 1. మోచు 2. కాపాడు 3. నిషేధించు.
"అఁగెను ని న్నురముపై నట్టె శ్రీవేంకటేశుఁడు
వేఁగా తీగెకుఁగాయ వినోదమే కాక" 7-81

**అఁటదానితనము :** (అఁటదాని + తనము) వి. స్త్రీత్వం.
"పోనీ వూరకుండవే యేపొద్దుదాఁకఁ గెలనేవు
దానికేమి నీ యాటదానితన మించుకా" 2-498

**అఁటది :** (100) (అఁట + అది) వి. ఆడది, స్త్రీ, నర్తకి, వేశ్య. 'అఁట' శబ్దంలోని అరసున్న విచార్యం. ఈ పదానికి విరళ ప్రయోగమని తె.వ్యు.కో. లో చెప్పబడినా అన్నమయ్య కీ పదం ఎంతో ఇష్టమని చెప్పవచ్చు. అన్నమయ్య కీర్తనల్లో ఈ పదం సుమారు వంద పర్యాయాలు ప్రయుక్తమైంది.
"అఁటది యింతకోపునా అంటిమోసువంటిది
మాఁటలనే లాలించి మరపుకోవయ్యా" 28-38

**అఁడిముత్యము :** వి; ప.బం. గుండ్రని ముత్యం, జాతిముత్యం. రూపాం. అణిముత్యము.
"కడఁజూడ జలధికి కల్లలు బుల్లలునే
నడుమ నాఁడిముత్యాలు నవరత్నాలే" 26-87

**అఁడుఁగులము :** వి. ఆడుజాతి, స్త్రీజాతి.
"తెల్లని వెల్లాఁ బాలే తెలిసితి వవులే
గొల్లదోమటాయ నాఁడుఁగుల మెల్లాను"
19-517

**అఁడుఁగొల :** (అఁడు + కొల) వి. స్త్రీహత్యా పాపం.
"ఆలకించ నింతటను అఁడుఁగొల నీ కేల
కూళతనములు మాని కూడవయ్య ఆపెను"
27-255

"వువ్విళ్ల నిది వూరకుండ నేలనుచునా
అవ్విభుఁడు చలముకొనె నాఁడుగొల యేల"
11-242

"అడుఁగొల వచ్చుఁజుమీ్మ ఆచారా లింతైతే
నేఁడు గామించితిఁజుమీ్మ విన్ను రఘునాథ"
26-37

**అఁడుఁదగవు :** వి. స్త్రీల తగవు.
"ఎఱఁగవా అఁడుఁదగ వింతిరో నీవు
తఱవాతిపనులకుఁ దమకించదే" 13-150

**అఁడుఁబోడి :** వి. (?) ఆడుఁబోడిమి లో 'మి' లోపించి యేర్పడిన రూపం కావచ్చు. ఆడువారి పద్ధతి, అఁడుదనము అని అర్థముగా తోచుచున్నదని సం.ప.స. (19సం.)
"కన్నదే కంటి గురుమ కంటివి నీ వవు లేరా
అన్నిటా నీ కాఁడుఁబోడి అగ్గువాయను"
19-517

"మఱి యాఁడుఁబోడెడ్డెడు మగపోడిమా నేఁడు"
22-456

**అఁడుబారీ :** (?)
"కోనేటిరాయఁడు కోరి నిద్రించీ వాడే
అనకమై జాలీయరో అఁడుబారీ" 15-118
ఈ కీర్తనలో అన్నిపాదాలు చివర 'పారి' అనే పదం ప్రయుక్తం.

**అఁడులు :** వి; బహు. స్త్రీలు, విశేషణమైన 'అఁడు' శబ్దాన్ని విశేష్యంగా ప్రయోగించడం విలక్షణం.
"వాఁడె వాఁడె వీఁడె వీఁడె వాడలలో మెరసీని
అఁడుల నడుమ నెంత అలరీని చూడరే"
13-107

**అఁడువారు :** (3) వి; బహు. స్త్రీలు.
"అఁడువారమైతే అంత సిగ్గు విడిచేమా
వేఁడుక పానుపుపైకి పిలిచేవు నీవు" 7-428

**అండ్లు :** (9) వి. 'అలు' శబ్దానికి బహువచన రూపం. స్త్రీలు, భార్యలు. 'అండ్రు' గ్రాంథికరూపం.
"వేసరక సేసేవు వినయా లెవ్వరికైనా
అనోదకాఁడవు నీకు నాండ్లుఁబాతా" 13-18
"అప్పనమై యిద్దరము నాండ్ల మింతే నీకు

ముప్పిరి దేవరవలె మొక్కించుకోరాదా"

10-2-78

-అండ్లు: పేదాది శబ్దాలపై చేరే 'అలు' శబ్దానికి బహువచనరూపం. 'అండ్రు' అనే గ్రాంథిక రూపానికి ఇది వ్యావహారికరూపం. అన్నమయ్య అంతటా -అండ్లు అనే వ్యావహారికరూపాన్నే కాని అండ్రు అనే గ్రాంథిక రూపాన్ని వాడలేదు. ఉదా :- ప్రియురాండ్లు మొ॥

25-374, 6-76

అందోళము: వి. పరితాపం, ఉత్కంఠ.

"ఆతుమలో హరిమీఁది అందోళమే వలె

చేతికి లోఁగాకుంటేను చింతించవలె" 3-228

ఆకడ: అవ్య. అక్కడ, అచోట.

"యేకతాన నీవొక్కఁడ వింటిలోఁ బవ్వళించితే

ఆకడ కెవ్వతో రాఁగా నలమితివి" 14-592

ఆకతాలు: వి; బహు. కతములు, కారణాలు.

"వట్టి యాకతాలు చెప్పి వద్దికి దగ్గరే విడె

అట్టె వుండరాదా అన్ని నయ్యాఁగాని" 11-242

ఆకరిషించు: స.క్రి. 'ఆకర్షించు' అనే దానికి వికృత రూపం. రేఫ షకారాలకు నడుమ ఇకారం ఆగమం గా వచ్చింది, ఆకర్షణచేయు. చూ: ఆకరుషించు.

"చిత్తజ భూతము బంపి చెలుల నాకరిషించి

తత్తరించి కూడేటి భూతనాథుడవు" 26-362

ఆకరుషించు: స.క్రి. 'ఆకర్షించు' కు వికృత రూపం. రేఫ షకారాలకు నడుమ ఉకారం ఆగమం; ఆకర్షణచేయు. చూ: ఆకరిషించు.

"ఆకరుషించ దలంతును అప్సరోగణములను

కైకొని దేవతాసమితినిఁ గనుఁగొనఁదలఁతును"

15-387

ఆకసపుఁజంద్రునికి నాసపడు: ప.బం; అ.క్రి. అసాధ్యమైనదానికి ఆశపడు.

"ఆకసపుఁజంద్రునికి నాసపడఁగా నేమి?

వాకై రాని పతికి వలవఁగా నేమి?" 9-66

ఆకసపుఁగొలనిపై అంటుఁదామరలు: ఇదొక పొడుపుకథ; ఆకాశం అంటే శూన్యం - అంటే నడుము; నడుమనే కొలని పైభాగంలో ఉన్న అంటుకొన్న తామరలు - స్తనాలు అని అర్థం. లావైన స్తనాలు అంటుకొని ఉన్న తామరమొగ్గల్లాగా ఉన్నాయని భావం.

"ఆకసపుఁగొలనిపై అంటుఁదామరలు వుట్టె

యీ కత చెప్పఁగదవే యింతిరో నీవు" 23-350

ఆకాశగంగ: వి. తిరుమలలో గల పవిత్ర తీర్థాలలో ఒకటి. ఇది శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయానికి 4కి.మీ. దూరంలో ఉంది. ఆకాశగంగ జలాన్నే స్వామితీర్థంగా ఉపయోగిస్తారు.

"కామితఫలదాయిని ఆకాశగంగయుఁగల

మా కొండా" 15అను. 460

"ఆకాశగంగ తోయములు సోకిన భవము

లంతంత వీడి పారఁగను" 1-227

ఆకాశపంచాంగము: ప.బం; వి. ఆధారంలేని వట్టి ఊకదంపుడు, అర్థంలేని వ్యవహారం.

"ఆకాశపంచాంగము అందుకుఁబేరేదే

రాకపోక జగడము రాఁజీ నదే" 19-421

ఆకాశపాకాశము: వి. అల్లకల్లోలము.

"ఆకాశపాకాశ మరుదైన కూటంబు

లోకరంజకము తమలోని సమ్మతము" 1-328

ఆకాసము: వి. 'ఆకాశము'నకు వికృతిరూపం.

"రాకాసునెల్లాఁగొట్టి రావణుని భంగపెట్టి

ఆకాసము మోచెనదే హనుమంతుఁడు" 3-143

ఆకు(లు)వ్రాయు: ప.బం. ఉత్తరం వ్రాయు, లేఖ వ్రాయు.

"ఆకులు వ్రాశంపఁగాను అనుమానింతువో యంటా

చేకొని నేనే విన్నవించితి నింతాను" 14-407

ఆకుగొరుకులు: వి; బహు. తమలపాకుల కొరుకుటలు. (?)

"ఆకుగొరుకులగు యంగజుమర్మము

యీ కడఁజెలి కెర వేలాయా" 16-370

**ఆకుమడుచు:** ప.బం; అ.క్రి. తమలపాకు ఈనెలు తీసి సున్నం రాసి వక్కలు చేర్చి మడుచు.

"ఆకుమడచి చేతికంది నీ విచ్చితివట
నీకేల సిగ్గుపడ నిజమావోయీ" 22-298

**ఆకె:** (107) (ఆ + అక) వి. ఆమె; 'ఆకె' అనే పదంలో చివర 'ఎ' కారం ఆదేశంగా వచ్చిందని గ్రహించాలి. 'ఆమె' అనే అర్థంలో అన్నమయ్య ఆకె, ఆపె అనే పదాలనే అంతటా వాడినాడు. 'ఆమె' అనే పదాన్ని వాడలేదు.

**ఆగడపుఁదలపోఁతలు:** వి; బహు. అల్లరి ఊహలు, కొంటె ఊహలు.

"వేగి లేచి సేసేదెల్లా వెలఁదులతోడి పొందే
ఆగడపుఁదలపోఁత లాప నెట్టు వచ్చును"
18-386

**ఆగడీఁడు:** (7) (ఆగడము + ఈఁడు) విణ. ఆగడము చేసేవాడు, కొంటెవాడు, దుండగీఁడు, దుష్టుఁడు.

"ఆగడీఁడవని నే నిన్నప్పుడు దూరినందుకు
వేగిరపడేవు నీవు వింతవాడవా" 16-204

**ఆచమనియ్యము:** వి. 'ఆచమనీయం' శబ్దానికి వికృత రూపం. ఆచమింపదగింది, ఉపస్పర్శింపదగింది.

"జలధులన్నియును నాచమనియ్యము మీకు
అల యా వరుణజల మిదియే స్నానము"
2-272

**ఆచార్యపురుషుఁడు:** వి. ఆధ్యాత్మిక జీవనం గడుపుతూ సమాజానికి మాన్యుడైనవాడు.

"ఆచార్యపురుషులు అవ్వలఁగొందరు
యేచిన సమయులై ఏర్పడిరి" 1-499

**ఆజ్ఞ:** వి. ఉత్తరువు.

"పోరుచుఁ జెలికువింటి పూవుటమ్ము
లంటఁజొచ్చె
ఆరయ తుమ్మెదలకు ఆజ్ఞ లేదు" 26-534

**ఆట:** వి. రూపకం, నాటకం.

"అన్ని కర్మములు చేసి ఆటలో
బ్రాహ్మణుడనైతి
నన్ని వేదములనేటి యంగడివీధి" 6-6

**ఆటకము:** వి. (7)

"ఆతఁడు వాసులెక్కించి ఆటకానకుఁబెట్టితే
యేతులకుఁ గాఁతాళించి యేల చూచేవే"
19-186

**ఆటపాటలు:** (3) ప.బం; బహు. ఆటలుపాటలు, ఉల్లాసకరమగు క్రీడలు.

"అక్కజపు సతులచే నాటపాటలు వినీని
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు"
29-2

**ఆటలో పతిమ:** ప.బం; వి. నిమిత్తమాత్రం.

"ఎవ్వరివాఁడో యెఱఁగరాదు
అవ్వలివ్వలి జీవుఁ డాటలో పతిమే" 1-472

**ఆటలో బ్రాహ్మణుఁడు:** ప.బం; వి. విదూషకుడు; నాటకంలోని బ్రాహ్మణుడు అని వాచ్యార్థం.

"అన్నికర్మములుఁజేసి ఆటలో
బ్రాహ్మణుఁడనైతి
నన్నివేదము లనేటి యంగడివీధి" 2-6

**ఆటవాఁడు:** (ఆట + వాడు) వి. నటుడు, నర్తకుడు, ఆటగాడు.

"పాటి నా కర్మమే క్రియాభాషాంగము
ఆటవాఁడ నింతె నేను అవధారు దేవ" 2-150

'ఆఁటది' మొదలైన శబ్దాల్లో 'ఆఁట' శబ్దాన్ని అర సున్నతో ప్రయోగించగా ఇట అరసున్న లేకుండా ప్రయోగించడం విశేషం.

**ఆడ:** (7) అవ్య. 'అక్కడ'కు వ్యావహారికరూపం. ఈ పదం రా.సీ.లోనూ, తెలంగాణలోనూ ఎక్కువగా వాడుకలో ఉంది.

**ఆడనీడ:** (6) (ఆడ + ఈడ) అవ్య. అక్కడ ఇక్కడ.

"పేరంటాండ్లకు మీరు పేరు లిద్దరుఁ జెప్పఁగా
నారసి నవ్వేరు సతు లాడ నీడను" 13-101

**ఆడనుంటి:** అక్కడనుండి.

"పొదిగిన మా యిద్దరికిఁ బొత్తుల నీ వాడనుంటే
యిదివో వలపు చల్లే వెరఁగనా నేను" 14-437

**ఆడసుద్దులు :** వి; బహు. స్త్రీల మాటలు.
"వేవేలు విష్ణుకథలు వినియేటి చెవులను
ఆవటించి యాడసుద్దు లాలకించేదా" 2-115

**ఆడానీడా:** అవ్య. అక్కడా ఇక్కడా.
"కూడి శ్రీవేంకటేశుఁడు గురుతులేల నించీనే
ఆడానీడాఁ దెలుసుక అన్నిటా నమ్మితిని "
23-238

**ఆడిక :** వి. 1. నింద, అపవాదం 2. బాస, ప్రతిజ్ఞ.
"కూడిన శ్రీవేంకటేశు గోర నేను గోరితేను
ఆడికల నీ వేల అడ్డమాడేవే" 8-87
"వలపు సిగ్గెఱుఁగదు వడి నేమి సేయవచ్చు
అలసి యాడికలకుఁ గలఁగదు మనసు" 26-401
"ఆడికకుఁ బాలైతి నందరిముందూ నేను
యీడ నన్ను మన్నించి యీడేరించు మనవే "
29-428

**ఆడికాఁడు :** (ఆడి + కాఁడు) వి. 1. గుట్టు తెలిసినవాఁడు, మర్మజ్ఞుడు 2. ఆప్తమిత్రుడు, గాఢమైన పరిశీలనదృష్టి కలవాడు. రూపాం. ఆణికుఁడు.
"చెంగట నీపై జూపి చేసన్నలు సేసేవు
అంగడి ఆడికాఁడవు అదెఱఁగవా" 27-467

**ఆడికె :** (11) వి. 'ఆడిక'కు వికృతిరూపం. 1. బాస, ప్రతిజ్ఞ 2. నింద, అపవాదం
"కోడెవయసువాఁడు మంచి గోపసతుల
మనము లెల్ల
ఆడికెలకు నోపి కొల్లలాడి బ్రదికె నితఁడు "
1-324

"అపకీర్తులఁబడి ఆడికె లోనై
అపవాది యౌట అది రోఁత" 1-26

**ఆడినదే మాట :** ప.బం; వి. అన్నదే మాట, అడ్డుపెట్టేవారు ఎవరూ లేరనడం.
"ఆడినదే మాటా అదె శ్రీవేంకటపతి
కూడే నేననఁగాను గొణఁగేవు" 19-322
"ఆడినదే మాటా ఆతఁడే యెరుఁగును
యేడలేని బుద్ధులు మీరేమి చెప్పేరే" 19-393
"ఆడినదే మాట గాక అప్పటి వేరొకటా
వోడక తానేడ నైనా నుండుఁగాక" 17-264

**ఆడినదే యాట :** ప.బం; వి. అడ్డుపెట్టేవారు ఎవరూ లేరనడం.
"లలి మోవి పిప్పిసేసీ లావణ్య మెఱఁగడు
అలరి తా నాడినదే ఆట యనవే" 26-249
"ఆడినదేయాటా ఆకెఁజక్కఁ జూడరాదా
వీడుదోడు వయసులు వేడుకోవెట్టో" 7-328

**ఆడినవే వేదాలు :** ప.బం; వి; బహు. చెప్పిందే ప్రమాణం.
"చెలులచే యింకా బుద్ధి చెప్పించవలెనా
వెలయ నీ వాడినవే వేదాలు గావా" 23-189

**ఆడుకోలు :** వి. 'ఆడికోలు'కు రూపాం. దూఱు, నింద, ఒప్పందం.
"యీడుకుఁగా మాతోను యింత సేయఁ బని
లేదు
ఆడుకోలు గలిగితే ననరాదా" 9-193
"వేడుక శ్రీవేంకటేశ వెలయ నన్నుఁగూడితి
ఆడుకోలిదే సుమ్మీ ఆనతిత్తుఁగాక" 20-81
"పాడితో శ్రీవేంకటేశ పైకొంటివి మెత్తుఁగాక
ఆడుకోలు పంతాలకు నలసేనా ఇఁకను "
20-454

**ఆడుతాఁబాడుతా :** ప.బం; అవ్య. ఆడుతూపాడుతూ, అవలీలగా, హాయిగా, అనాయాసంగా. 'ఆడుతూ' పాడుతూ అనే పదాల్లోని శత్రర్థక 'తూ' వర్ణాన్ని అన్నమయ్య ఆడుతా, పాడుతా అని 'తా' వర్ణంతో వాడడం కనిపిస్తుంది.
"ఆడుతాఁబాడుతా నీతో నట్టి ముద్దు గునుసుతా
వోడక నీ దండచేరి వున్నారమయ్యా" 3-390

**ఆడుమాట :** వి. స్త్రీయొక్క పలుకు.
"ఆడుమాటనక అంతలో ద్రౌపదిని
వాఁడిమిఁ గాచిన వరదుఁడు" 1-394

**ఆడేటి దొకటి అసిమలోని దొకటి :** ప.బం; వి. చేప్పేదొకటి చేసేదొకటి.

"ఆడేటి దొకటి నీ యసిమలోని దొకటి
యీడ నాతో నాడు మాఁట లివియైనా నిజమా"
24-90

**ఆడేటివి గొణఁగులు అమ్మేవి సణగులు :** నానుడి; చెప్పేదొకటి చేసేదొకటి.

"ఆడేటివి గొణఁగులు అమ్మేవి సణగులు
యీడనే మా పొందు నీకు నితవయ్యీనా"
14-204

**ఆడోవారు :** వి; బహు. 'ఆడవారు'కు వ్యావహారికరూపం. స్త్రీలు.

"కావరించి యాడోవారి కాఁగిట నలసివచ్చి
వోవరిలో నా చొప్పులే వూహించేవు గాక"
18-453

**ఆణా(నా)జ్ఞ :** (అణ + ఆజ్ఞ) ప.బం; వి. హద్దు, ఆజ్ఞ అనే పదాలు ఏకార్థకాలైనా కలిపి వాడడం నేటికీ వ్యవహారంలో ప్రసిద్ధమే అని పరిష్కర్తలు. (II – 72 పాదపీఠిక) ఆన అనే పదంలోని 'న' కారం ణకారంగా ప్రయోగింపబడటం విశేషం. రూపాం. ఆనాజ్ఞ.

"రాజు సేసిన యాణాజ్ఞ రాజుకంటె నెక్కుడా
వోజతో వజ్రాయుధాన కోపునా పర్వతాలు"
2-72

"ఏపను లెవ్వరికి గలదెంత యంతే కాని
శ్రీపతి యాణా(నా)జ్ఞచేతఁ జిక్కునది జగము
యేపున మా యాణాజ్ఞ లేఁటివయ్యా" 4-19

"శ్రీపతి యాణాజ్ఞలు మీఱఁగ చింతింపఁగఁ
దరమా" 4-102

"జాణఁడు తనకు నాకు సరికి బేసికి లంకె
ఆణాజ్ఞకు లోను అట్టే సేయుమనవే" 22-24

అన్నమయ్య 'ఆణాజ్ఞ' అనే పదంతో పాటు 'అనాజ్ఞ' అనే పదం కూడా వాడినాడు.

**ఆణికాఁడు :** (ఆణి + కాఁడు) వి. దీనికి శ.ర.లోనూ, బ్రౌన్.లోనూ, వాచ.లోనూ మర్మజ్ఞుడనే అర్థం ఉన్నది. తె.వ్యు.కో లో దీనితోపాటు ఆప్తమిత్రుడనీ, గాఢమైన పరిశీలనదృష్టి గలవాడనీ అర్థాలు కూడా ఉన్నాయి. ఆనందమూర్తిగారు దీనికి మేలువాడు, ఘనుడు అనే అర్థాలను చూపినారు. దీనికి ప్రమాణంగా కిట్టెల్ నిఘంటువును ఉదాహరించినారు. (ఆణి = Excellency, superiority) పై అర్థాలన్నీ ప్రయోగాల్లో యుక్తంగానే కనిపిస్తున్నాయి. 1.మాననీయుడు, ఆప్తమిత్రుడు 2.మర్మజ్ఞుడు, గాఢమైన పరిశీలనా దృష్టి కలవాడు. రూపాం. ఆడికాఁడు.

"ఔనయ్యా మేలెరిగిన ఆణికాఁడవు
తానకమైన నీ దొరతనమెల్లాఁగంటిమి" 10-298

"కందువ కాఁగిట నేల ఘాతలెల్లాఁ జూపేవే
అందుకు శ్రీవేంకటేశుఁడాణికాఁడు" 21-46

"ఆణికాఁడవట యంతటికి
జాణవు తెలియము సరిగొనవయ్యా" 24-49

**ఆణిముత్యము :** వి. ప్రశస్తమైన ముత్యం, గుండ్రని ముత్యం. చిలుకూరి నారాయణరావుగారీ పదంలోని 'ఆణి' శబ్దానికి గుండ్రన అనే అర్థం తప్పనీ, మేలైన, మాననీయమైన అని అర్థమనీ తెలిపినారు. (ఆం.భా.చ. 483 పు.) చూ : ఆడిముత్యము.

"జాణతనాలాడఁగాను సరసుఁడందుకు మెచ్చి
ఆణిముత్యముల కంఠహార మిచ్చెను" 23-462

**ఆతల :** (9) (ఆవలి + తలము) అవ్య. అవతలి ప్రదేశము, ఆవలికాలం.

"ఆతల నబక ముంచినట్టి వేడి చెయ్యంటదు
జాతిదేహము మోఁచిన సహజమింతే" 2-288

**ఆతల యీతల :** అవతల – ఇవతల, అవతలి ప్రదేశం – ఇవతలి ప్రదేశం, ఆవలి కాలం – ఈవలి కాలం.

"చేతికి పీడమియ్యఁగ చెలియను చాలు నీకు
నాతల యీతలను ఆయాలు మోచెను" 7-32

**ఆతుమ :** వి. ఆత్మ; అన్నమయ్య 'ఆత్మ' అనడానికి బదులుగా అంతటా 'ఆతుమ' అనే రూపాన్నే ప్రయోగించినాడు. సమాసాల్లో కూడా ఆతుమ అనే ప్రయోగం కనిపిస్తుంది. ఉదా :- పరమాతుమ, ఆతుమ బంధువు, ఆతుమ వేదాలు. అన్నమయ్య కీర్తనల్లో

ఒక్కచోట మాత్రమే 'ఆత్మ' అనే ప్రయోగం కనిపిస్తుంది. చూ : 8.181

"ఘనపాపిఁగనక నీ కరుణఁగోరి నీ వనవరతము
నా యాతుమ విహరించుమంటిఁగాక" 1-35

కళాపూర్ణోదయంలో కూడా 'ఆతుమ' అనే ప్రయోగం కనిపిస్తుంది. 6-161

**ఆతుమవేదాలు :** వి; బహు. ఆత్మను వివరించే వేదాలు.

"గాతల కొరవుఁదిట్టి కందువ సాందీపునితో
ఆతుమవేదాలు నేర్చి తా నోరనే" 16-178

**ఆతుమార :** (5) (ఆతుమ + ఆర) ఆత్మసాక్షిగా; ఆత్మతృప్తిగా, మనసారవంటి పదం.

"ఆతుమార రమణుని అలుకెల్లఁ దీరిచితివి
రాతిరిఁబగలు నట్టి రాజ్య మేలనమ్మా" 23-321

"చేకొని యాతుమార సేవలెల్లాఁ జేసితివి" 23-73

**ఆతురపడు :** అ.క్రి. బాధపడు.

"కాతరినై నే నిన్ను కరకరిఁ బెట్టినాను
ఆతురపడవు యెంత అభ్యాసమో" 27-471

**ఆతురబందుగుఁడు :** వి. రోగార్తులకు బంధువు.

"ఆతురబందుగుఁడవు హరినారాయణ కృష్ణ!
మా తలఁపెటిఁగి నీవే మన్నించితి విపుడు"
2-277

**ఆత్మ :** వి. జీవాత్మ, పరమాత్మ, మనస్సు, బుద్ధి.

"యింతి కాఁగిలించుకొన్న యితవు దెలుసుకొంటే
అంతటి వేడుక నీయాత్మ నున్నది" 8-181

**ఆత్మాపుత్రనామము :** వి. తానే పుత్రునిరూపంలో జన్మించడం.

"ఆత్మా వై పుత్రనామాసి" అని వేదవాక్యం. 4సం.

**ఆత్ముఁడు :** వి. ఆత్మస్వరూపుడు. ఈ అర్థంలో మహదర్థకంగా ఇది విలక్షణప్రయోగం.

"అనుభవించువాఁడాత్ముఁడే యందురు
అణురూపం బని తలఁచఁగరాదు" 15-403

**ఆదరింపు :** (ఆదరించు + పు) వి. ఆదరించడం, ఆదరణ, గౌరవం.

"పోదిమాటలు మిగుల భోగంబులకుఁ దగులు
ఆదరింపులు సతము లగుటకునుఁ దగులు"
27-585

"దయతోడి యాదరింపు తగులాయములు సేసు
నియతాన మెలఁగేటి నేరుపు లివి" 28-288

**ఆదిగొను :** (54) స.బం. పొందు, (పర్యాయ) మొదలిడు, ఎదుర్కొను, నడుపు, మీఁదపడు, ఎదురుపోవు, ఎదుర్కొను (వ్యు.), కన్నువేయు, ఆసక్తి చెందు, (శ.ర.) మొఱగు, లాచు, లాచుకొను. (పర్యా.కో) 'ఆదికొను' అని శ.ర.

"పాదుకొన్న సంసారబంధము నోరూరించితే
ఆదిగొని మత్తుఁడు గానట్టివాఁడే నిత్యుఁడు"
2-117

"ఆదిగొని చెలులెల్ల నట్టె పైపైఁ బడఁగాను
గాదిలి యాతని మది కాయగాచె నిపుడు"
21-398

"గుఱుతుచూచు నే రాగా ఆదిగొని నఱచేతి వెన్నముద్ద
పాదుకొన నోర నిండాఁజాపుకొన్నాఁడు" 20-450

"పాదుకొన్న సంసారబంధము నోరూరించితే
ఆదిగొని మత్తుఁడు గానట్టివాఁడే నిత్యుఁడు"
2-117

"ఆదిగొని వెదకితే నట్టె నాలిక కొన
వేదమై నిలిచినాఁడు వీఁడివో హరి" 3-57

"శ్రీదేవు హరి నాశ్రితపారిజాతుని
ఆదిగొని శరణంటి మన్యము నే మొల్లము"
10-87

ఆసక్తిచెందు అనే అర్థం ఇట యుక్తం.

**ఆదిచదువులు :** వి; బహు. తొలిచదువులు, వేదాలు.

"అనుఁగువారికి నాది చదువుల
పనిగొన్న మంత్రసారము" 4-419

**ఆదినంత్యములు :** (ఆది + అంత్యములు) వి. మొదలు తుది.

"ఆదినంత్యము లేని అచ్యుతమూరితివి" 2-122

**ఆదిమతము :** వి. విశిష్టాద్వైతమతం.

"ఆదిమతమునఁగాని తగులవు నీ వంటే
యే దెస ఘంటాకర్ణుఁ డే మతమువాఁడు" 15-3

**ఆదిమూరితి :** (7) వి. తొలిమూర్తి, ఆదిదైవం.

"అంతటాఁదా నున్నవాఁడు అరయ
స్వతంత్రుఁడు
అంతము నాదియు లేని ఆదిమూరితి" 2-509

**ఆదోపాదో :** వ.బం. పాదసూచికలో సంపాదకులు ఇట "ఆటో పాటో అని రేకు" అని అన్నారు.

"అసమగతి వాని రాక (ఆటో పాటో) ఆదో పాదో
రసికు వేంకటేశు పొందు రాజ్యమో లక్ష్మో"
5-193

**ఆధరువుబొమ్మ :** వి. ఆధారం గల బొమ్మ, ఆశ్రయం గల బొమ్మ.

"నెలవై నీలోనివాఁడ నీవే నేనౌదునా
పొలసి నియ్యాధరువు బొమ్మ నింతేకాక"
2-139

**ఆధీనపుది :** (అధీనము + అది) వి. ఇతరుల అధీనంలో ఉన్నది, అస్వతంత్రురాలు, పరతంత్రురాలు.

"నీ యాధీనపుదానను నిన్ను వెంగెమాడనోప
రాయడించ కెటువలె రక్షించినా మంచిదే"
13-498

**ఆధీనము :** (14) విణ. 'అధీనము' నకు వికృతిరూపం. వశం; పెక్కుచోట్ల ఆధీనమనే పదమే ప్రయోగింపబడింది. ఒక్కచోట మాత్రమే అధీన, మని వాడబడింది. 4-450

"కర్మము నాదెందుఁగాని కర్మములో ఫలమెల్ల
అర్మిలి నా జన్మముల ఆధీనమే" 2-1

**ఆనందించుకొను :** అ.క్రి. సంతోషాన్నిపొందు. రా.సీ. వ్యవహారంలో కొన్ని ధాతువులపై విలక్షణంగా 'కొను' అను ప్రయుక్తం కావడం విశేషం. ఉండుకొను మొ॥

"అలరి నీవు గూడితే నానందించుకొనుఁగాక
అలమేలుమంగ నీ చొప్పులు చూచునా"
12-122

**ఆనక :** అవ్య. తరువాత; చూ : అనుక.

"ఆనక పోరాదుగాని అండనుండువారము
నిను నీ వెరఁగలేవు నీ కేడ వలపు" 7-227

**ఆనకము :** (4) వి. జీవింపజేసేది, ఉత్సాహపెట్టేది. (శ.దీ.)

"ఆనకమై వైరాగ్యమంట దలవాటు లేక
కానఁబడ కర్మములు గాసిఁబెట్టరాదు" 4-257

"నూనెగొలదే కుంచము నునుపెక్కు మీద మీద
ఆనకమై దిగువారీ నాయనాయ నయ్యా"
7-108

**ఆనతి :** వి. పద్ధతి, లోకువ, తడబాటు మొ॥ కావచ్చు. (ఆజ్ఞ, అనుమతి)

"పలికే ఆనతి చెప్పీ బలునిందలు"

**ఆనవాలు :** (ఆన + పాలు) వి; బహు. బాగుగా మరగ కాచిన పాలు.

"తేనెలు జున్నులు టెంకాయపాలు
ఆనవాలు వెన్నట్లును" 6-4

**ఆనవెట్టు :** (ఆన + పెట్టు) స.క్రి. ఆజ్ఞాపించు.

"ఆనవెట్టి మమ్ము మాటలాడించేవే నన్ను
గుణము దెలిసెనంటా గట్టున నున్నాఁడతఁడు"
7-535

**ఆనాజ్ఞ :** (7) (ఆన + ఆజ్ఞ) వి; వ.బం. ఆజ్ఞ – హద్దు అనే అర్థాల్లో వాడబడే జంటపదం. రూపాం. ఆణాజ్ఞ.

"తలవరులు ముగురు తగు వాదులేఁబైయారు
వొలసి ఆనాజ్ఞ కిందుఁజోటే లేదయ్యా" 3-464

అనాజ్ఞలు అని బహువచనంలో కూడా ప్రయోగింపబడింది.

"పంచేంద్రియములకే పైరులు వేసితిమి
అంచెలఁ బ్రాణులకిఁక నానాజ్ఞ లేలయ్యా"
3-487

అనాజ్ఞలు: (అన + ఆజ్ఞలు) వి. ఆజ్ఞ అనే అర్థంలో వాడబడే జంటపదం.
"యిూహల నా యాసలును యేమి సేయు నన్నిటికి
శ్రీహరి యానాజ్ఞ లిటు చిమ్మిరేఁచఁగాను" 4-53
అణాజ్ఞలు అనే పదం కూడా అన్నమయ్యలో కనిపిస్తుంది.

అనిపట్టు: (4) అ.క్రి. ఊని పట్టు.
"అనిపట్టి తనతో నలిగి వుందాననా
మోనానఁ దన కిప్పుడు మొక్కనా నేను"
9-125, 9-17, 19-409, 21-518 & 17-188

ఆనుక: (66) అవ్య. అటువిమ్మట, తరువాత; రూపాం. ఆనక.
"జానకీరమణ సప్తజలధులు లంఘించి
ఆనుక సంజీవి దెచ్చె హనుమంతుడు" 4-490
"కానుక పైఁడి గాదెలకాడఁదన నిజరూపు
ఆనుక పొడచూపీని అఖిలేశుఁడు" 3-511

ఆపతి: వి. ఆపద; 'ఆపత్తి'కి వ్యావహారికరూపం. రా.సీ.లోనూ, తెలంగాణంలోనూ మాండలికంగా వ్యవహారంలో ఉంది.
"ఉప్పతిల్లు మానసము వొడిఁబట్టుకుండఁగాను
అప్పుడే కన్నెరికాన కాపతి రాదా" 25-268

ఆపదోద్ధారుఁడు: వి. 'ఆపదుద్ధారకుడు'కు వ్యావహారిక ప్రయోగం. ఆపదలనుండి ఉద్ధరించేవాడు.
"అరయఁ బ్రహ్లాదుని ఆపదోద్ధారసింహము
గిరివై యిందిరకును క్రీడాసింహము" 3-151

ఆపసోపము: (6) వి; ప.బం. ఇబ్బంది, (తె.జా.) అలుక, జ్వరాదులవల్ల కలిగే అలసట, అసురుసురు.
"ఆకకే మోహించుఁగాక ఆపసోపపుఁదాపాన
చీకాకుపడి నాలోఁ జిన్నఁబోరాదా" 19-439
"చేపట్టినదానవు సిగ్గులు పడుదురా
ఆపసోపాలఁబెట్టకు అందపు నీ వలపు" 23-340

ఆపె: (ఆ+అప) వి. 'అప' శబ్దంలోని పకారంలోని అకారానికి ఎకారం రాగా 'ఆపె' అనే రూపం ఏర్పడుతుంది. ఆమె అని అర్థం. అన్నమయ్య సంకీర్తనల్లో 'ఆమె' అనే అర్థంలో అంతటా ఆకె, ఆపె రూపాలే కాని ఆమె అనే రూపం కనిపించదు.

ఆపొద్దు: వి. (రా.సీ; మాం.) ఆ రోజు, ఆ దినం.
"ఆ పొద్దున నుండనీవు అట్టె కాచుకుండగాను
యేపున నీ వున్న మంచమెక్కితి నేను" 20-420

ఆపోనారాయణుఁడు: వి. నారములంటే నీరు. నారములే స్థానంగా కలవాడు నారాయణుడు. నారాయణ శబ్ద వ్యుత్పత్తిని చెప్పే శ్లోకంలో "ఆపో నారా ఇతి ప్రోక్తాః" అని ఉండడం వల్ల ఆపోనారాయణుడనే రూపాన్ని అన్నమయ్య కల్పించినాడు.
"అదన ఆపోనారాయణుఁడవైన నీకు
అదియ పో మంత్రకలశాభిషేకము" 4-46

ఆపోవు: (అదట + పోవు) అ.క్రి. తృప్తిపడు.
"ఆపోక కౌరవుఁడు హరిపరాఙ్ముఖుఁడైన
పైపైనే సంపదలు పార్థుచేఁబడవా" 4-347

ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినః : ఇది భగవద్గీత లోని శ్లోక భాగం. (8-16)
"బ్రహ్మలోకం వరకూ ఉన్న అన్నిలోకాలూ కూడా తిరిగి రావడం అనేది ఉన్నదే" అని దీని అర్థం. శ్రీకృష్ణుడు దీన్ని అర్జునునితో చెపుతున్నాడు.
"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినో ఽర్జున
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న
విద్యతే" భ.గీ. 8-16

ఆమని: వి. వసంతఋతువు, సమృద్ధి.
"ఆమని యిూఁగకు సుఖమాజన్మమై తోఁచు
యేమిటా నెక్కువ సుఖమెవ్వరి కేదయ్యా"
2-409

ఆమనికాలము: (5) వి. వసంతకాలం.
"చేముట్టి నాతో నప్పటి చేరి సరసమాడేవు
ఆమనికాలము గాఁగా నగ్గువాయ వలపు"
7-83, 7-586 & 17-522

ఆమనివేళ: వి. వసంతసమయం.

"సతి కనుఁగవలనే చకోరములు నెక్కె
ఆతని నవ్వు వెన్నెల లామనివేళ" 26-121

**ఆ మరి :** ఆ తరువాత.

"వంతుకెక్కిఁన వెంగెమా మరేమైనా నందినా
కొంతగొంత నీ వేఁటికిఁ గొంకేవోకాక" 27-215

**ఆముకొను :** (11) అ.క్రి. 1. క్రైపెక్కు, బలియు, కొవ్వు 2. అలముకొను, పైకొను, వ్యాపించు 3. గాఢమగు, అధికమగు. స.క్రి. కవియు, పైకొను.
వ్యాపించు, గాఢమగు :
"బూమెలాడీ వైనదే బొమ్మల జంకించుఁగాని
ఆముకొన్న నవ్వులే యతివలు చల్లేవి"
16-576, 13-410, 15-255, 14-591, 15-30, 12-292, 11-51, 13-25, 28-338, 29-209 & 22-177

"ఏమనేము నిన్ను యెగసక్కెడ విన్నిటా
ఆముకొన్న సటకాడ నౌదు వయ్యా" 27-39

"ఆముకొని మోహించితి హరి నీ రూపునకు"
"ఆముకొన్న ప్రేమవాఁడు ఆకడ జారుకొన్నాఁడు" అని క్షేత్రయ్య పదం.

**ఆయ :** (212) క్రి.ప. అగుధాతువు భూతకాలిక ప్రథమపురుషైక వచనరూపం. ఆయెను అని అర్థం. అన్నమయ్య పెక్కుచోట్ల 'ఆయె'ను అనే రూపానికి బదులుగా 'ఆయ' అనే రూపాన్ని వాడినాడు.

**ఆయఁబోయ :** (ఆయెను + పోయెను) వ.బం; క్రి.ప. అయ్యిందేదో అయ్యింది - పొయ్యిందేదో పొయ్యింది. రూపాం. ఆయెఁబోయె.

"యెఱుఁగక పుట్టితివి యిన్ని యోనులందుఁ దొల్లి
తతినీఁటి కాయఁబోయ దానికేమి" 9-331

**ఆయకట్టు :** అ.క్రి. ఆదాయం వచ్చేట్లు సాగుచేయు. (పండించు)

"తచ్చన తరితీపుల తగవరివాఁడవు
పచ్చ లాయకట్టే లాబపువాఁడవు" 19-17

**ఆయము :** వి. 1. మర్మం 2. వచ్చుబడి, పన్ను.

"చేతికి పీడెమియ్యఁగ చెలియకు చాలు నీకు
ఆతల యీతలను ఆయాలు మోచెను" 7-32

**ఆయాస :** వి. ఆయాసం, 'ఆయాసము' అని 'ము' లేకుండా ప్రయోగించడం విలక్షణం.

"అలసి యిందు నాయాస లేమిటికి
కలిగినపాటే కానీవయ్యా" 3-454

**ఆయిటి :** వి. ఆవిరి, సుడిగాలి కావచ్చు. బూరుగు (శ.ర.)

"అంగన విరహవేళ నాయిటిగాలై వూర్పు
వెంగలితనాన నట్టె విసరఁజొచ్చె" 11-442

"అలరి నిట్టూరుపుల ఆయిటి విసరఁజొచ్చె
వెలయఁ దనవలపు వెదవెట్టు మనవే" 28-409

**ఆయిటిగాలి :** వి. "ఆయిటి అనునది 'ఆవర్త' శబ్దమునకు వ్యావహారికరూపముగా తోచుచున్నది. సుడిగాలి అని యర్థము. గ్రీష్మర్తువులో వీచే పెనుగాలికి ఆవటిగాలి, ఆవిడిగాలి అనియు వ్యవహారమున్నది" అని సం.ప.స. (18 సం. 428పు.)

"వుమ్మగిలు నూరుపుల నొనరె నాయిటిగాలి
తమ్మికంటి జవ్వనపుఁ దతి వచ్చె రావయ్యా"
18-152

**ఆయితము :** (3) విణ. 'ఆయత్తము'అనే పదానికి వికృతిరూపం : సిద్ధం. రూపాం. ఆయిత్తము.

"చాయల చక్రవాళాద్రి సముద్రాలు దాటివచ్చె
ఆయితమై పైఁడి టెక్కె లవే కానవచ్చె" 3-512

**ఆయితము సేయు :** స.క్రి. సిద్ధం చేయు.

"కమలనాభుఁడ నీకు గంగాదినదులెల్ల
నమర యెుక మజ్జనం బాయితము సేసె"
2-436

**ఆయిత్తము :** (3) విణ. 'ఆయత్తము'నకు వ్యావహారికరూపం.

"హరియందు మీఁదట ఆయిత్తమై యున్నాఁడదె
అరులనెల్ల గెలిచి అమరులఁగావను" 2-274

**ఆయు :** అ.క్రి. ఉత్కంఠను అణచుకొను, త్వరను అణచుకొను. దీనికి సజార్థకంగానే

(ఆస్తులేదు, ఆయలేదు, ఇత్యాదిగా) ప్రయోగం.

"ఆయలేవే తనమాట కందాలు చెప్పఁగవచ్చీ
చాయసేసుకొన్నఁ బోఁడు సాధించీని" 26-139

**ఆయురన్నం ప్రయచ్ఛతి :** సంస్కృత సూక్తి. ఆయుస్సే అన్నాన్ని సమకూరుస్తుంది అని భావం.

"కాయమేల బడలీని కడుపు నింపకొఱకు
ఆయురన్నం ప్రయచ్ఛతి యనఁగాను" 15-223

**ఆయుష్యము :** వి. ఆయుస్సు.

"ఆతఁజేసినట్టుండు నాఇడి దేహ
మాయుష్యముతో
ఆతుమ యెడసితేను అదవదలవును" 15-418

**ఆయెఁబోయె :** ప.బం; క్రి. అయ్యిందేదో అయ్యింది, పొయ్యిందేదో పొయ్యింది.

"నాకు నీకు నేమి వోదు నాఁడె నాఁటికాయెఁ
బోయె
పోకుమంటూ నాగేవు పొద్దు వోదా" 6-59

**-ఆయె :** వ్యతిరేకక్రియపై భూతార్థంలో చేరే అనుబంధ క్రియ. మఱగదాయె, పోదాయె, లేదాయె, తినడాయె, పడదాయె, దైవారదాయె 6-92, తెలియలేదాయె 6-19

**ఆరచి :** వి. ఇది శ.ర; సూ.ని; బ్రౌన్ మొ॥ తె.వ్యు.కో. ల్లో లేదు. పొడుపుకథ కావచ్చు.

"యిచ్చట శ్రీవేంకటేశుఁడిన్నిఁటాను నన్ను
యిచ్చల నీ యారచిని నెన్నాళ్లైనా గలువు"
29-11 అను.

"మగువ యీ యారచి మతి నీవు దెలియవే
తొగరు నీ పలుకుల తుదదాఁకా గడువు" 24-4

**ఆరచి కత :** వి. 'రహస్యపు కతయా? అని సంపాదకులు. (19-439) పొడుపుకథ కావచ్చు.

"ఆయములంటే యారచికత యిది
చాయల సన్నకు చలి యిక నేదయ్యా" 9-36

"చెప్పితే నారచికత చెప్పకుండితే వెత
దప్పికి నీరే మందు తలపోయఁగదరే" 19-421

**ఆరజకత్తె :** (ఆరజము + కత్తె) వి. సొగసైనది, మనోజ్ఞురాలు, ఇంపులాడి, విలాసవతి.

"ఆఁటది బతిమాలితే నారజకత్తె యందురు
యేఁటిది నన్నుఁగొసరే విన్నిఁటా జాణఁడవు"
29-191

**ఆరజకాఁడు :** (ఆరజము + కాఁడు) వి. మనోజ్ఞుఁడు, సొగసుకాడు, విలాసకాడు.

"మేటియైన నీ విభుఁడు మిక్కిలి నారజకాఁడు
ఆఁటదానికిఁ గలదే యందుకే మాయనే" 18-7

**ఆరజపుది :** (ఆరజము + అది) వి. మనోజ్ఞురాలు, సొగసైనది, విలాసవతి.

"సారె సారెఁ దనతోను సరిగా నవ్వు మనీని
ఆరజపుదాననా నే నందరిలోన" 29-455

**ఆరజపువాఁడు :** (ఆరజము + వాఁడు) మనోజ్ఞుఁడు, విలాసకాడు.

"అనిశ మందరు వంటి ఆరజపువాఁడా
చెనకి పెనఁగఁగాను చేతనంటేఁగాక" 16-7

**ఆరజము :** వి. (11) 1. ఇంపు 2. లీల, విలాసం 3. కలధ్వని. మనోహరము (అం.వ.ని.) దుర్విలాసం (వ్యు.)

"యీరాని వడిగితేను యేచి వలపు విరుగు
నేరుపులు చెప్పఁబోతే నిగుడు నారజము"
29-540

"కేరకేరి నవ్వులును కేఁకరించే సన్నలును
ఆరజము లవియే మీ కలవాటు" 27-102

**ఆరజీఁడు :** (ఆరజము + ఈఁడు) వి. సొగసైనవాడు, మనోజ్ఞుఁడు, విలాసకాడు.

"ఓరుపులతో చుట్టువలె నుండుఁగాక
ఆరజీఁడైనవానికి నొఁగాము లేడని" 27-101

**ఆరతి :** వి. నివాళి, నీరాజనం; సం. ఆరాత్రికం, ప్రా. ఆరత్తియమ్.

"సంతసాన మాఁటలాడే సంబురముతోడనే
యింతలో ముత్యాల ఆరతెత్త మఱచితిని"
7-159

**ఆరికమ్మ :** (అరికె + అమ్మ) డాలు అనే ఆయుధం.

"ఆరికమ్మ వేసె నట్టె అల్ల నరకాసురుపై
మేర మీరి రావణునిమీఁద నేసెను" 2-107

**ఆరుఁదేరు :** (3) ప.బం; అ.క్రి. గడతేరు, ఆరితేరు.

"ఆరెఁదేరె నెడమాటలాడించ మీతో నేలే
చేరి తానే యడిగితేఁ జెప్పఁగాని" 7-235

"చేరి నిమ్ము నిటు గూడె శ్రీవేంకటేశ్వరుఁడు
ఆరెఁదేరెఁ బిలువవే ఆతని మా యింటికి" 11-161

**ఆరు కర్మలు :** వి. షట్కర్మలు. అధ్యయనం, అధ్యాపనం, యజనం, యాజనం, దానం, ప్రతిగ్రహం.

**ఆరుచు తీరుచు :** ప.బం; స.క్రి. ఊరార్చు, కోర్కె తీర్చు.

"అగపడి యెవ్వరైనా నారిచి తీరిచేమంతే
చిగురుఁగొమ్మను చాగై
చిమ్మిరేఁగఁజొచ్చును" 7-19

**ఆరు మతాలు :** వి; బహు. శైవం, వైష్ణవం, శాక్తం, గాణాపత్యం, సౌరం, కాపాలికం అనే ఆరుమతాలు.

"వాడిక నారుమతాలవాఁడై తిరుగుకంటే
యీడనే శ్రీపతివారై యీడేరరో" 9-279

**ఆరుమూరు సేయు :** ప.బం; అ.క్రి. పనిని చెడగొట్టు, క్షీణింపజేయు.

"ఆరుమూరు సేసి విద్యలందరికిఁ బారఁజల్లి
పారితెంచి వోలలాడెఁ బాలవెల్లి" 5-48

**ఆరు శాస్త్రాలు :** వి. తర్కం, వ్యాకరణం, అలంకారం, మీమాంస, ధర్మశాస్త్రం, జ్యోతిశ్శాస్త్రం.

"ఆరుశాస్త్రముల ఆరుమతంబుల
నారుగర్మముల నైనాను
యీ రీతిల మిము శరణని కొలువక
యెవ్వరికుపాయము లేదు" 2-412

**ఆరోగిణము :** వి. భోజనం.(వ్యు.)

**ఆర్పులు – బొబ్బలు :** ప.బం; వి; బహు. అరపులు అనే అర్థంలో జంటపదం.

"ఆర్పులు బొబ్బలు నవె వినుఁడు
యేర్పడ నసురుల నిటువలె గెలిచె" 2-108

**ఆఅడి :** వి. 1. కష్టం, దుఃఖం, బాధ 2. హాని, భంగం 3. నింద, అట్టు, అపవాదం (సూ.ని.)

"అరుదై శ్రీవేంకటేశుఁడట్టె నిన్నుఁ గలసెను
అరమరచేవు మేను ఆఅడింత గలదా" 7-63

**ఆఅడిఁబెట్టు :** స.క్రి. అల్లరిపెట్టు, నిందపెట్టు, బాధపెట్టు, వ్యర్థంచేయు.

"చెలులము నేమైనాఁ జెప్పవలె నీకు బుద్ధి
అలుకలు పనిలేవు ఆఅడిఁబెట్టకువే" 26-530

**ఆఅడికత్తె :** (ఆఅడి + కత్తె) వి. దుష్టురాలు, నింద్యురాలు, వ్యర్థురాలు, అప్రయోజకురాలు.

"నేరుపరి యైనదే నిండుకొని యుండ నేర్చు
నా రీతి నాఅడికత్తె ఆడు వెంగేలు" 17-118

**ఆఱుగురు పగవారు :** వి. శరీరంలోని ఆరుగురు శత్రువులు. అరిషడ్వర్గ మన్నమాట. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు.

"పదిలము కోట పగవారు
అదనఁగాచుకొందు రాఱుగురు" 1-61

**-ఆల :** సంబోధనలో బహువచన పదాలపై చేరే ప్రత్యయం. అన్నమయ్య ఏ కొన్నిచోట్లనో తప్ప 'అంతటా' 'ఆల' అనేరూపాన్నే ప్రయోగించినాడు. సాధారణంగా ఈ అర్థంలో 'అర' చేరుతుంది. అన్నమయ్య 'ఆల' అని ప్రయోగించడం జానపదవ్యవహారసరళిని బట్టే అని భావించాలి. అన్నమయ్యలో 'ఆల' తో కూడిన రూపాలు సుమారు 250కి పైగా కనిపిస్తున్నాయి. 'ఆర' తో కూడిన రూపాలు మాత్రం ఎనిమిదే కనిపిస్తున్నాయి.

"అమ్మలాల, అక్కలాల, అతివలాల" 14-143

**ఆలకింపు :** వి. శ్రద్ధగా వినడం.

"యెనసిన యాసలె యెదురుల చూపులు
అనుఁగుఁ గూరిములె ఆలకింపులు" 9-20

**ఆలజాలము :** (4) శ.ర.; సూని; బ్రౌన్, వ్యు.కో, పద కోశాల్లో ఈ పదం కనిపించదు. వేటూరి

ప్రభాకరశాస్త్రి గారు ఈ పదానికి నీట గిరగిర తిరుగు ఒక రకపు పురుగులు అని అర్థం చెప్పినారు. (చూ : తెలుగు మెఱుగులు – పుట 78-80) నీటి ప్రవాహమందు కోలాహలముగ తిరుగులాడు ఈ జలజంతువుల ఆటయే కాబోలు నేటికిని చాలా ఉత్సాహముతో చెలరేగిన కార్యక్రమమును చెప్పునపుడు "ఆలజాలంగా ఉంది" అని వ్యవహారంలో ఉంది అని సంపాదకులు. (1సం. పీఠిక) ఈ పదం "ఆలజాలంబు నీరిలో నీదుజాడ, గాలిపడగ యాకసమునఁగాలు త్రోవ, నిదురలోపల గలఁదోచు నీడవిధము, గానవచ్చునె యప్పుడె కన్నుఁగాక" అనే ఉ. హరి, పద్యంలో కూడా కానవస్తుదనీ, ఇక్కడ కూడా ఆ అర్థమే పొసగుతుందని శాస్త్రిగారు వివరించినారు.

"అప్పసమైన భ్రమ ఆలజాలాల కున్నట్లు
యిప్పుడే వుండవలదా యీతనిమీఁదటను"
15-46

"అరయఁ జంచలముచే నాలజాలంబువలె
దిరుగ దొరకొనియెఁ దన దేహము" 1-321

"తటతటన నీటిమీఁదట నాలజాలంబు
లిటునటుఁ జరించవా యీఁది యీఁది" 1-218

**ఆలదొడ్డివారు :** (2) వి; బహు. గొల్లవారు.

"ఆలదొడ్డివారము నే మంతేసి యెఱఁగము
పాలదుత్త దుత్తెఁడేసి పట్టవయ్యా" 7-180&5-58

**ఆలపోతు :** వి. ఎద్దు.

**ఆలపోతుకొండ :** వి. శ్రీవేంకటేశ్వరస్వామి నెలకొన్న ఏడుకొండలలో ఒకటైన వృషభాద్రి.

"ఆలజాలమైన నీట నలరఁదేలిన వాఁడు
ఆలపోతుకొండమీఁద ననువైనవాఁడు" 5-216

**ఆలపోతువాఁడు :** వి. శివుడు; ఎద్దువాహనంగా కలవాడని వాచ్యార్థం.

"ఆలపోతువానితోడ నంటిన మేనివాఁడు
ఆలగాపరులతోడ నాడినవాఁడు" 5-216

**ఆలరి :** దుష్టుడు, టకటొంకు, అవివేకి, మూర్ఖుడు, అనాథుడు, భర్తృహీనుడు.

"ఆలరి జాణఁడవని అంటిఁగా నేను
ఆలనైతి నింత యేఁటి కంటిఁగా నేను" 14-103

దుఃశీలము :

"ఆలరి బంగారు గంటే నందరి మనసులూను
పోలిమి నా పసఁ జిక్కి పుంగుడుగాకుండునా"
4-66

"ఆలరి శ్రీవేంకటేశ ఆండ్లఁ బెండ్లాడితివి
తాలిమి నన్నట్లానె దయఁజూడరా" 23-491

"పాలసముద్రము బలిమిఁ దచ్చికొని
రాలరి దేవతలమృతమును" 2-10

"ఆలరి శ్రీవేంకటేశుఁడా తఁడేమి సేసినాను
నీలాగు భాగ్యము గాక నేనేమి సేతునే" 9-99

**ఆలరికత్తె :** (ఆలరి + కత్తె) వి. 1. దుస్స్వభావురాలు, దుష్టురాలు 2. అవివేకిని, మూర్ఖురాలు 3. దిక్కులేనిది, అనాథ, భర్తృహీన విణ. దిక్కులేనిది.

"తాలిమిగలదానికి తనంతనే వచ్చు మేలు
ఆలరికత్తెకుఁ గద్దా ఆపసోపాలు" 27-420

**ఆలరితనము :** (ఆలరి + తనము) వి. 1. దుష్టస్వభావం 2. అవివేకం, మూర్ఖత 3. దిక్కులేనితనం, భర్తృహీనత.

"పోలించి నీకుఁగాఁబూనుక వచ్చొకతెతో
ఆలరితనాన వాదు లడిచినది" 26-117

**ఆలరీఁడు :** (31) (ఆలరి + ఈఁడు) విణ. దుస్స్వభావుడు, దుష్టుడు, అవివేకి, మూర్ఖుడు, అనాథ.

"ఆలరీఁడ రుక్మిణిఁ బయ్యాఁడించి
తెచ్చినలవాటు
పోలి మీతో నంటుఁగాక పోనిచ్చునటయ్యా"
14-32

**ఆలవట్టమాపె :** (ఆలవట్టము + ఆపె) వి. గాలికోసం విసనకఱ్ఱను ఊపే సేవకురాలు. చూ : ఆలవట్టము.

"సారె సారె నీ చేతలు చక్కఁబెట్టరాదు గాక
చేరి యాలవట్టమాపెఁ జెక్కు నొక్కవా" 29-456

**ఆలవట్టమిడు:** అ.క్రి. గుడ్డతో గుండ్రంగా కూర్చిన విసనకఱ్ఱతో వీచు, రాజాదులకు ఎండ తగులకుండా ఉండే సాధనాన్ని పట్టు.

"ముక్కున నిట్టూరుపులు ముంచి
బుసకొట్టఁగానే
అక్కరతోఁగొంతవడి యాలవట్ట మిడెను"
28-298

**ఆలవట్టము:** వి. 1. వస్త్రంతో గుండ్రగా చేసిన విసనకఱ్ఱ. 2. గుండ్రటి విసనకఱ్ఱ లాగా ఉండి రాజాదులకు ఎండ తగులకుండా పట్టే ఒక సాధనం, గుడ్డగొడుగు.

"అరుదుగ సకలలోకారాధ్యుఁడయి మించి
విరివి నాలవట్టాల విసరరే సతులు" 5-343

"అంగన నిట్టూరుపులే యాలవట్టములు
నీకును" 29-538

"ఆలవట్టములు వట్టే రవధరించఁగదో పెద్ద
పాలిండ్ల బరువున భామ బడలితివి" 5-273

**ఆలవట్టాలవారు:** వి; బహు. విసనకఱ్ఱలతో వీచేవారు. (ఆలవట్టము = విసనకఱ్ఱ)

"సిరులఁ గట్టికవారు సేయరే బరాబరి
వరుస నాలవట్టాల వారెల్లా విసరరే" 24-269

**ఆలవారు:** (ఆలు + వారు) వి; బహు. గొల్లవారు. ఆవులను పాలించేవారు అని వ్యుత్పత్తి.

"హత్తి శ్రీవేంకటేశ ఆలవారమైతేఁ జూచి
కొత్త పేయల గూడంటూ నొప్పంటేవు" 7-156

**ఆలిమగనాట:** (ఆలిమగని + ఆట) వి. భార్యాభర్తలుగా అభినయిస్తూ బాలికలు ఆడుకునే ఒక విధమగు ఆట.

"ఆలమి శ్రీవేంకటేశుఁడాలి మగనాట లంటా
చెలరేగి మోవెడిగే చిఱుతా వీఁడు" 17-173

**ఆళాపించు:** 'అలాపించు'కు వ్యావహారిక రూపం కావచ్చు.

"పాటలలో శంకరాభరణ మాళాపించరే" 28-273

**ఆళువారు:** వి. రూపాం. ఆళ్వారు. ద్రావిడ ప్రబంధకర్త యగు విష్ణుభక్తుడు (వీరు పదిమంది అని కొందరు, పన్నెండుమందని కొందరు.) వీరు గరుడాళ్వారు, అనంతాళ్వారు మొదలైనవారు.

"తిరమై యాళువారల తేజము దానై యుండు
గరుడానంతముఖ్యఘనుల సంగడిని" 4-192

**ఆవటము:** వి. పొందిక; విశే. అనుకూలం, అనుగుణం, వీలైనది. పరిహాసము, ఎగతాళి ఇత్యాదిగ మాండలికవ్యవహారం.

"అలమేల్మంగవు నీవు అతఁడు శ్రీవేంకటేశుఁ
డలయించితే రతు లావటమై వుండునా"
24-573

"మోవి యానేది గొంత ముంటిపోట్లును గొంత
ఆవటమాయ నీకు నట్టే కాదా" 24-196

**ఆవటించు:** స.క్రి. 1. కలిగించు, కావించు 2. వహించు, పూను 3. సంగ్రహించు, సేకరించు 4. పొందుపరచు, సవరించు 5. తిను, భక్షించు.

"నీ వొల్లలేని గుణము నేఁ జేసిపెట్టేనా
ఆవటించి నమ్మి వుండుటది మేలు నాకు"
19-213

పొందుపడు:

"కంచపు గాలావటించే కలిమిలో వారమింతే
చంచలపుటాసలు చేయిచాచ నేటికే"

"నీ వొల్ల లేని గుణము నేఁజేసి పెట్టేనా
ఆవటించి నమ్మి వుండుటది మేలు" 19-213

ఎదిరించు, లెక్కచేయకుండు, వ్యతిరేకించు:

"శ్రీవేంకటేశ్వర నీవే చేరి నన్ను గూడితివి
ఆవటించి యిఁక నిన్ను నలయించఁ జెల్లునా"
12-36

**ఆవపచ్చడి:** వి. ఆవపెట్టి చేసిన పెలుగుపచ్చడి. (వ్యా.)

"కాంత గోరి చెనకులు కారపుఁగూరల విందు
పంతపుమాటలే ఆవపచ్చడి విందు" 21-529

**ఆవల:** వి. పరలోకం.

"శ్రీవేంకటేశ్వరుఁడు చిత్తములో నున్నవాఁడు

ఈవలేది యావలేది యితని దాసునికి" 2-19

**అవి:** వి. 1. శ్వాస 2. తాపం.

"భావపు వింతలతోడ వచ్చి సింగారముతోడ

అవులు వారెడి మేని అలవులతోడ" 5-337

**అవులవారు:** వి. గొల్లలు, ఆవులు కాచేవారు.

"మేలిమి ఆవులవారి మెలుతలు మీరుగాన

మూలనున్న మీ చన్నులు ముట్టి నేఁగూడితిని"

11-346

**ఆవేలము:** వి. తమ్మ, నమలినతాంబూలం (వాచ.)

"పుక్కిటితమ్మలముతోఁబొంచి యేకాంతా లాడేవు

తక్కక నోరి ఆవేలము తాఁకించేవే" 12-525

**ఆశకుఁడు:** వి. ఆశ గలవాఁడు, వింతప్రయోగం, భారకుడువంటిది.

"ఏమి సేయఁగల యెంతాశకుఁడను

తామసపుమనసు తనియదు నాకు" 3-329

"అలరి నీ వైతేను ఆశకుడవూఁగావు"

**ఆశ్చరియము:** వి. 'ఆశ్చర్యము'నకు వికృతిరూపం.

**ఆసకత్తె:** (7) (ఆస + కత్తె) వి. ఆశ గల స్త్రీ, లోభం కల స్త్రీ.

"అట్టి కాఁగిలించుకొంటే ఆసకత్తె నందువు

గుట్టున నూరకుండితే గొంట నందువు" 25-213

**ఆసకాఁడు:** (3) (ఆస + కాఁడు) వి. ఆశ గలవాఁడు, లోభి.

"అక్కర నీ వింత ఆసకాఁడ వవుత

యిక్కడ మాలోనె యెఱఁగముగా" 9-13

"అలవిగాని మోహపు టాసకాఁడ నీ

వలుగకురా వెటపయ్యీ్యాని" 6-103

**ఆసకురాలు:** (ఆసక + ఆలు) వి. ఆసక్తురాలు, ఆశ గల స్త్రీ, 'ఆశకుడు' అన్న శబ్దానికి స్త్రీలింగ రూపం. వింతప్రయోగం.

"ఆసకురాలైనది అలయదు రతులను

పాసి తొలఁగదెప్పుడు పైకొనుఁగాని" 28-295

**ఆసగించు:** (13) అ.క్రి. ఆశపడు, అపేక్షపడు.

"ఆసగించి వున్న యింతి నారఁడిఁబెట్టుదురా

సేసవెట్టి పెండ్లాడిన చెలువుఁడవు" 19-45

"కాఁపురము సేసితేను కానిమ్మనీఁ జొప్పడునే

పైపై నాసగించితే బాఁతిపడనగునే" 26-431

**ఆసచేయు:** అ.క్రి. ఆశ కలిగిఉండు, ఆశించు.

"ముంగిటనుండి నీవు మోము దప్పక చూచితే

అంగడి నుండిన చెలి యాసచేసెను" 18-416

**ఆసపాటు:** (3) (ఆశపడు + టు) అపేక్ష, కోరిక.

"ఆసపాటుగా హరి యున్నాఁడదె

అందుకు ప్రహ్లాదుఁడు సాక్షి" 2-41

**ఆసపాలకుఁడు:** ప.బం; వి. ఇది ఆసపాతకుడు కావచ్చు. ఆశపోతు, పిసినారి, ఆశాపాతకుఁడు.

"అప్పఁడైన వేంకటేశుఁ డాసపాలకుఁడు గాన

తప్పకుండ పెట్టె వాని తలకెత్తరే" 5-148

**ఆసబాస:** ప.బం; వి. ఆశపెట్టుకోవడం - బాస చేయడం.

"తలవంచుకుండినాను తలఁపు నామీదనే

పలుకకుండిన నాసబాస నామీఁద" 7-276

**ఆసయిచ్చు:** (ఆస + ఇచ్చు) ప.బం. ఆశగొలుపు, ఆశ కలిగించు.

"చేసినంతఁ జేయనీరే చెప్పకురే యా సుద్ది

ఆస యిచ్చాతేఁ డొకమాటాడితేఁ జాలు"

19-385

**ఆసలాసలు:** (2) (ఆసలు + ఆసలు) ప.బం; వి; బహు. మిక్కిలి ఆశలు. రూపాం. ఆసాసలు.

"నా సొమ్మైనవాఁడవు నన్ను నీవు యెడసేవా

ఆసలాసలను నీకు నేఁకరేఁగా" 28-497

"సేసవెట్టినట్టివాఁడు చేరి కాఁగిలించుఁ గాక

ఆసలాసలె రేఁచి అట్టె వుండీనా" 11-98

**ఆసలిచ్చు:** (ఆసలు + ఇచ్చు) ప.బం. ఆశలు గొలుపు, ఆశలు కలిగించు.

"మొగము చూచి నీవు ముంచి

యాసలియ్యఁగానే

తగిలి నీ మాటలట్టె దాటజాలఁడు" 21-236

**ఆసలు మెడఁగట్టుకొను :** ప.బం; అ.క్రి. మిక్కిలి ఆశలు కలిగి ఉండు.

"ఆసలు మెడఁగట్టుక అన్నియుఁ జదివినాను
దోసము లెల్లా మాని దొర నయ్యేనా" 3-250

**ఆసలు పొనలఁబట్టు :** ప.బం; అ.క్రి. ఆశలను తీవ్రం చేయు, ఆశలను తీక్ష్ణంచేయు.

"కంటిమి వింటిమి నీ కతలు నేఁడు
నంటుననే ఆసలు పొనలఁబట్టేవా" 8-30

**ఆసాబాసా :** ప.బం; వి. రూపాం. ఆసబాస ; ఆశపెట్టుకోవడం మరియు బాసచేయడం.

"దాసులపాలిటి నిధానమై వున్నాఁడదిగో
ఆసాబాసా నితఁడే అహోబలేశుఁడు" 4-488

"సేసఁ బొందు లిద్దరిని శ్రీవేంకటేశుఁ డీతఁడు
ఆసాబాసా నెవ్వరిదే అంగనలాలా" 22-493

**ఆసాసలు :** (ఆసలు + ఆసలు) ప.బం. అధికాశలు, గొప్ప ఆశలు. ద్విరుక్తి ఆధిక్యాన్ని తెలుపుతుంది.

"ఆసాసల నీ మాటకు నడ్డమాడనైతిఁగాక
వాసిదెచ్చుకొని నిన్ను వంచుకోలేనా" 19-532

"పూని నేఁ బిలువకుంటే పొగిలేవా నీవేమైనా
దాని యాసాసలనైనాఁ దనుతువుగాక" 24-592

**ఆసుకోవి :** వి. ఆసుపోసే కోవి. ఆసు అనేది చేనేత పనిముట్లలో ఒకటి. దీనిపై దారాన్ని పడుగుకు అనుకూలంగా పోసుకుంటారు. కోవిద్వారా దారం కుడికీ, ఎడమకూ తిరుగుతూ చుట్టబడుతుంది. ఆసందర్భంలో 'ఆసుకోవి' కుడికీ, ఎడమకూ తిరుగుతూ ఉంటుంది. ఎవరైనా మాటిమాటికీ ఇటూ అటూ తిరుగుతూ ఉంటే "ఆసుపోసినట్టు తిరుగుతున్నాడు" అని అంటారు. రూపాం. ఆసుగ్రోవి.

"గాసి కోపక సిగ్గుతోఁ గదలితే వెంటవెంట
ఆసుకోవివలె వచ్చేనట్టే కాదా" 14-354

**ఆసోదకత్తె :** (14) (ఆసోదము + కత్తె) కోరిక గల స్త్రీ, ఆశ గల స్త్రీ. చూ : ఆసోదము.

"తడవి శ్రీవేంకటేశ తగవు నీ వెఱఁగవా
అదరి నీవు మన్నించే యాసోదకత్తెలము"
27-195

**ఆసోదకాఁడు :** (33) (ఆసోదము + కాడు) వి. కోరిక గలవాడు, ఆశ గలవాడు.

"అచ్చుగా నా సరులంటీ నాసోదకాఁడు
యిచ్చటనే కాచుకున్నాఁ డెలయింపుకాఁడు"
18-105

**ఆసోదపుఁగత్తె :** (ఆసోదము + కత్తె) కోరిక గల స్త్రీ, ఆశ గల స్త్రీ.

"వేసారక నీతో వేమారు విన్నవించఁగ
ఆసోదపుఁగత్తె యని యాడవా నీవు" 13-444

**ఆసోదపుఁదనము :** (ఆసోదము + తనము) వి. ఆశ, కోరిక ; ఆసోదము అనే భావార్థకశబ్దంపై స్వార్థంలో 'తన' ప్రత్యయం. చూ : ఆసోదము.

"ఆసోదపుఁదనములు అంగములు వనితలకు
ఈ సుదతిఁ గూడితివి యేలుకోవయ్యా" 19-83

**ఆసోదపుది :** (ఆసోదము + అది) వి. కోరిక గల స్త్రీ, ఆశ గల స్త్రీ.

"ఆసోదపుదాన నన్నా నంటివి గాని
పాసి వుండలేఁ జుమ్మీ పాయకుండుఁగాని"
26-134

**ఆసోదము :** (145) వి. కోరిక, ఆశ, కామం. అన్నమయ్య సంకీర్తనల్లో కనబడే విలక్షణపదాల్లో ఆసోదమనే పదం ఒకటి. ఇది ఆసోదము, ఆసోదకాడు, ఆసోదకత్తె, ఆసోదపుఁగత్తె, ఆసోదపుఁదనము, ఆసోదపు బాపడు అనే రూపాల్లో కనిపిస్తుంది. ఈ పదం బ్రౌణ్యం మిశ్రమమాండలిక పదకోశంలో తప్ప ఇతర నిఘంటువుల్లో కనిపించదు. బ్రౌణ్యం ఈ పదానికి విశ్రాంతి, సేదదీర్చుకోవడం అనే అర్థాలను చూపింది. కాని ఇవి సంకీర్తన పాఠాల్లో పొసగడం లేదు. తాళ్ళపాక పద సంకీర్తన మూడో సంపుటం అనుబంధంలోని సందిగ్ధ పదసమీక్షలో సంపాదకులు అర్థాన్ని చర్చిస్తూ "ఇది ఆస్వాదశబ్దభవమని పండితులొక్కరు సూచించిరి. ఆచోద్యభవమా" మేమనుకొనుచుంటిమి. రమణీయత అర్థము కావచ్చును అని వివరించినారు. దీనిని బట్టి

వారు ఆసోదశబ్దానికి రమణీయత అనే అర్థాన్ని సంభావించినట్లుగా చెప్పుకోవచ్చు. ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు అర్థాన్ని చర్చిస్తూ అన్నమయ్య పదాల ఆధారంగా వాంఛ, కోరిక అనే అర్థాన్ని భావిస్తున్నట్లుగా ఊహించినారు. (సంకీర్తనవాఙ్మయము – పదకవితలు – భాషా ప్రయోగవిశేషములు, పుట 430) ఆనందమూర్తి గారూహించిన ఈ అర్థం అన్నమయ్య ప్రయోగాలను పరిశీలించినపుడు 'రమణీయత' అనే అర్థం కన్నా సముచితంగా కనిపిస్తుంది. అంతేకాక ఈ అర్థానికి సమర్థకంగా ఒక బలమైన ప్రమాణం కూడా ఈ నిఘంటుకర్తకు లభించింది. తాళ్లపాక పెద తిరుమలాచార్యులు భగవద్గీతకు రచించిన వ్యాఖ్యానంలో "కామమాశ్రిత్య దుష్పూరం దంభమాన మదాన్వితాః" అనే శ్లోకంలోని 'దుష్పూరం కామమాశ్రిత్య' అనే పద్యానికి ఒక పాఠంలో "ఎంతైనా తీరని ఆసోదముతోను" అని వివరణ ఇవ్వబడింది. ఇట కామ శబ్దానికి ఆసోదమనే శబ్దం సమానార్థకంగా ప్రయోగింపబడింది. కనుక ఆసోదమంటే కామం, కోరిక, ఆశ అనే అర్థాలను చెప్పుకోవడం సముచితంగా కనిపిస్తుంది.

**ఆస్తియుఁబాస్తి:** ప.బం; వి. ఆస్తిపాస్తులు, ఆస్తీపాస్తీ. జంటపదం.

"ఇదివో నా సంపదా అస్తియుఁబాస్తి
నీవు యితరంబు నాకుఁ బని లేదు"

7-106 & 2-340

**ఆహికము:** వి. నిఘంటువుల్లో ఈ పదానికి ధూమకేతువు, సుషిరవాద్యవిశేషం, వరుసజ్వరం అనే అర్థాలు చూపబడ్డాయి. అన్నమయ్య కింది ప్రయోగంలో వీటిలో ఏ అర్థమూ సముచితంగా కనిపించదు.

"ఆహికముగ నిట్టి అధమవృత్తికి నే
సాహసమున నెట్టు చాలుదునయ్యా" 1-235

**ఆహిపెట్టు:** (అహి + పెట్టు) స.క్రి. ఈ శబ్దం శ.ర., సూ.ని., బ్రౌన్ మొ॥ నిఘంటువుల్లో కానరాదు. ప్రభాకరశాస్త్రిగారు దీనికి కుదువబెట్టు అనే అర్థాన్ని నిర్ధారించినారు. (చూ: తెలుగుమెఱుగులు – 147 పు) కుదువపెట్టు, తాకట్టుపెట్టు.

"నవ్వి నవ్వి వేగినంతా నలిఁబొద్దులు వుచ్చేవు
అవ్వల నివ్వల నెందు నాహిపెట్టితి వయ్యా"

28-547

"వెదకి కామునికి విషయములకు నే
అదివో నా వయసెల్ల నాహివెట్టితిని" 4-142

## ఇ

**ఇంట గెలిచి రచ్చ గెలుచు:** ప.బం; అ.క్రి. మొదట స్వస్థలంలో గెలిచి తరువాత పరస్థలంలో గెలుచు.

"ఇంట గెలిచి కా నీవు యిఁక రచ్చ గెలిచేది
వెంటనే ఆనతీరాదా వినవలె నేను" 8-4

**ఇంటాడ:** (ఇంటి + ఆడ, వాడ) 1. ఇంటిదగ్గర (2. ఇంటివాడ)

"రవ్వలాయ మా వలపు రమ్మనవే
యింటాడకు"

**ఇంటికాడ నిడి గానుగకాడ గసి:** ఇడి = సేమియ, భక్ష్యవిశేషం, గసి = కాచిననెయ్యి, లోనగు వాటిలో దిగే మడ్డి; ఇంట్లోనేమో ఆవిరికుడుము, గానుగ దగ్గరేమో గసి. ఒకచోట అనుకూల వస్తువు, మరోచోట ప్రతికూల వస్తువూ లభ్యం కావడమన్నమాట.

"కని ఇంటికాడ నిడి గానుగకాడా గసి
నినుఁజూచి నేరుచుకోనేరనే నేను" 19-383

**ఇంటికాడి బేరము:** వి. సులభమైంది.

"నీ తలనే వేగినా నెట్టుకొన్న వలపులు
యేతుల సిగ్గువడకు యింటికాడిబేరము" 7-515

**ఇంటిది:** (ఇంటి + అది) వి. గృహిణి, భార్య, యజమానురాలు.

"ఇంటిదాన నే నుండఁగా యెరవు సతమా నీకు
పెంటవెట్టుక నావద్దఁ బ్రియాలు చల్లేవు" 9-269

**ఇంటిమగఁడు:** (ఇల్లు + మగఁడు) వి. భర్త.

"యెక్కడో గొల్లసతుల కింటిమగఁడాయఁగా
తక్కక వెదకే పరతత్త్వమితఁడే" 1-454

"ఇంటిమగని జూచి యిల్లాలు దుఃఖించి
వెంట విటునిఁ దగిలి వెతలఁబడును" అని
వేమన.

**ఇంటియాడ :** (ఇంటి + ఆడ) ఇంటి దగ్గర,
ఇంటికాడ.
"పొంది ఆవులు దూడలుఁ బొలానఁ
గలసుఁజేసు
అందాఁకా నీవు మా యింటియాడ
నుండవయ్యా" 11-273

**ఇంటియాపె :** (ఇల్లు + ఆపె) ప.బం; వి. ఇల్లాలు,
గృహిణి.
"దంటతనము నిన్ను దప్పులెంచీ నంటాను
ఇంటియాపె నేల నీఁగే వింతవాఁడవు" 36-578

**ఇంటిలోని నిధానము :** ప.బం; వి.
అందుబాటులో నున్న అమూల్యవస్తువు.
"గక్కన శ్రీవేంకటేశ కలిసితివి యిక్కువ
లన్నియు నింక నింటిలోని నిధానము" 9-154

**ఇంటిలోని పంట :** ప.బం; వి. అందుబాటులో
నుండేది.
"అరుదై తూరుపుఁగొండ నారఁగ బండిన పంట
యిరవై శ్రీవేంకటేశు నింటిలోని పంట" 4-342

**ఇంటిలోని పోరు :** వి; ప.బం. దుర్భరమైన
పోరు.
"పన్నిన పగల వెలుపటివారికంటె
ఎన్నరాని పగ గాదా యింటిలోని పోరు"
15-199

**ఇంటిలో పోరు :** ప.బం; వి. అనుక్షణ బాధాకరం.

**ఇంటివేలుపు :** వి. (ఇల్లు + వేలుపు) కులదైవం,
ఇలువేలుపు.
"కంటి మున్నిటి సత్వాలు కమలాక్ష యింక నీవే
యింటివేలుపవై మమ్ము నీడేర్తువు గాకా"
15-311

**ఇండువిండ్లవారు :** వి; బహు. ఇండ్లు నిండ్లవారా?
ఇంటింటి వారని అర్థం కావచ్చు.
"బండిబోయఁడవై పౌఁజులలో నుండఁగ
యిండువిండ్ల వా రేమందురు" 23-547

**ఇండె :** వి. పూలమాల; త. ఇంటై, క. ఇండె.
"నిండిన మోహమునను నినుఁదూరఁ జాలదు
ఇండెవెట్టి బాసలు నీ వెన్ని యిచ్చినా" 13-394

**ఇండెవట్టు :** ప.బం. (?)
"రెండుఁజూచి పగయుఁగూరిమి దోఁచె
నింతలోనె
యిండెవట్టి నిన్నిటికి నేమిసేతురా" 5-173

**ఇంతక తొలుత :** అవ్య. ఇంతకుముందు,
ఇంతకుమునుపు. ముందు, మునుపు అనే
శబ్దాలకు బదులు తొలుత, తొల్లి అనే
రూపాలను వాడడం అన్నమయ్యకు అలవాటు.
"ఇచ్చితిమి కానుక యింతక తొలుతే నీకు
తచ్చేము మా సిగ్గు దగ్గరి రావయ్యా" 27-155

**ఇంతకతొల్లి :** (14) అవ్య. ఇంతకు ముందు,
ఇంతకు మునుపు, ముందు, మునుపు అనే
పదాలకు బదులు తొలుత, తొల్లి అనే
రూపాలను వాడడం అన్నమయ్యకు అలవాటు.
"చన్నుమొనలు దాకించి సారెకు సేవలు సేసే
యెన్నఁడు గూడితివో యింతకతొల్లి" 18-74

**ఇంత గుండెవాఁడు :** వి. ఎక్కువ ధైర్యం
కలవాడు.
"పంతులాడేవు పిలువ వచ్చిన మాతోనె నీవు
ఇంత గుండెవాఁడ వైతే నెటు వొయ్యా జనులు"
11-335

**ఇంతానింత :** ఇదంతా (?)
"మోవి చూచినంతలోనే ముంచి నోరూరీ నీకు
వావిరి నింతానింత వలపే కాదా" 22-196
"వాగమైన దింతానింత వలపే కాదా"
అంతనంతా శరీరపోషణమనే
ధూర్తత్రిప్రయోగంలోని అంతానంత ఇటువంటి
రూపమే!

**ఇంతేసి :** (ఇంత + ఏసి) విశ. ఇంతటి,
ఇటువంటి; ఇంతటి ప్రమాణం.
"మెత్తని మనసుదాన మేలు దాఁచనే నేర
కొత్తగా నింతేసికిని గురి యైతివయ్యా" 11-50

**ఇంద :** (3) అవ్య. ఇదుగో, తీసుకో.

"పీడెమింద వేసుకో వెస దప్పిదేరుచుక
వాడుమోముతో నలసి వచ్చితివి" 3-418

**ఇంద కొండు:** ఇదుగో తీసుకోండి.
"అందపు శ్రీవేంకటేశ అంతరాత్మవై వున్నాఁడ
ఎందు చూచిన యింద కొండో యనుచు"
2-102

**ఇందకో:** (2) క్రి. ఇదుగో తీసుకో.
"పీడె మింద కోవయ్య వింతవారమా
వేడుకకు వెల లేదు వెరపేల నీకు" 7-532

**ఇందము:** (5) క్రి. ఇదుగో, తీసుకో; చూ: ఇంద.
"నిగ్గుల శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
వొగ్గి పీడె మిందమంటా నుప్పతించే వేలరా"
17-348

**ఇందవయ్య:** (9) (ఇంద + అయ్య) ఇదుగో, తీసుకో.
"ఇవ్వలి మోమేలయ్యే వాపెతో మాటాడవయ్య
ఇవ్వల నాకెకుఁగాను ఇందవయ్య కానికె"
12-207

"కందువైన వాసనలు కప్పిపెట్ట నేమిటికి
ఇందవయ్యా జవాది ఇచ్చే నేను" 29-200

**ఇందవె:** ఇదుగో.
"ఇందవె యాతఁడు నీ కిచ్చిన సొమ్ము
కందువ నీ మేలులోని కాంతలము గదవే"
18-148

**ఇందుకంటె:** (5) దీనికంటె, ఇంతకంటె.
సప్తమ్యంతమైన 'ఇందు'పై 'కంటె' విభక్తి ప్రత్యయం విలక్షణం. ఇందుకోసంవంటి పదం.
"ఇందుకంటె నేమి సెల్లు నింకా నేను
నింద నీపైఁ బడీ జుమ్మీ నీ చిత్తమికను"
26-382

**ఇందుకొను:** (5) అ.క్రి. ఇముడ్చుకొను, ఒంట పట్టించుకొను, రుచించు, ఇష్టమగు.
"సేవ సేయుచుండఁగాను జీతము మానుపరాదు
యీవిధి నాన దోసితే నిందుకోరాదు" 2-434

"అతివంపిన యేకాంతమాయములు
సోఁకఁబోలు
ఇతవై నీలోలోనే యిందుకొంటివి" 10-2-40

**ఇందు రమ్మంటే ఇంటిలోనికే వచ్చు:** ప.బం; అ.క్రి. కొంచెం అవకాశం ఇస్తే చాలు అంతా తానే ఆక్రమించు. (దుర్మార్గునికొక అంగుళంమేర నిలువ స్థలం ఇస్తే ఎదురయి వాడిల్లంతా లాగి వేసుకుంటాడు.)
"ఇందు రమ్మంటేఁజాలు నింటిలోనికే వత్తువు
సందడిఁగాలు దొక్క జాణవుగా నీవు" 17-385

**ఇందువంక:** (7) దీనిద్వారా, దీనిమూలంగా, ఇటునుండి.
"యెంచ నిందువంకనే పో ఇందరిలో రూపు లేక
అంచెల నంతరభూతమై యుండవలసె" 24-33

**ఇంపు:** అ.క్రి. వి. ఇష్టపడు, (?) వలపు చూపు.
"అలమేలుమంగవు నీ వతఁడు శ్రీవేంకటేశుఁ
డిల
తామెంత గూడినా నింపు నీపై నితఁడు" 26-288

**ఇంపువాఁడు:** వి. ఇచ్ఛ గలవాడు, ఆనందం కలవాఁడు.
"అంగవించి నీసేత కర్దమాడని సతిని
యెంగిలి సేతురా మోవి ఇంపువాఁడవు" 21-285

**ఇంపుసొంపులు:** ప.బం; వి; బహు. అందచందాలు.
"ఇంపుసొంపులు వేంకటేశ్వరునిమీద
గుంపైన చందురులు కుచయుగముమీఁద"
6-131

**ఇంబు:** వి. ఇంపు, మనోహరత, ఇమ్ము. చూ: కిటెల్: ఇమ్బు - (tel) ఇమ్పు - ఇమ్పిన పద్మముఖి.
"బింబాధరుఁడాతఁడు పికవాణిని నేను
యింబడర నిద్దరికి నేటి పొందులే" 15-28 old

**ఇంస:** వి. 'హింస'కు జానపదవ్యవహారం.
"యింసలన్నియుఁదేరె నిందరుఁజుట్టము లైరి
హంస చేతి పాలు నీరు నట్లాయె బ్రదుకు" 2-6

**ఇక్కువ:** వి. 1. సంకేతస్థలం 2. జాడ

3. వేదవిహితమైన విధి.

"ఇక్కువ శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి

మొక్కలములెల్లా మాని మొక్కవద్దా

యిందుకు" 27-184

"ఇక్కువతో యజ్ఞము సేయించెబో మా

గురుఁడు"

**ఇగిరించు:** అ.క్రి. 1. చిగిరించు 2. కలుగు, పొడము 3. ఎఱపెక్కు; ప్రే.క్రి. ఇగిరిపోజేయు, నశింపజేయు (వావిళ్ళ)

"ఇగిరించేవు పైపైనె యిట్టిదివో వలపు" 7-9

**ఇగురులోపలి నిప్పు:** ప.బం; వి. మృదువైన దానిలో కఠినమైన పదార్థం.

"చిగురులోపలి చేఁగ చెప్పరే మీరు

నిగురు లోపలి నిప్పు నిలుపరాదె" 19-421

**ఇగురువెట్టు:** స.క్రి. చిగిరించు.

"పగగొన్న మోహతాపము వేరుగ విజ్ఞాన

మిగురువెట్టక మానె నేఁటి బ్రదుకు" 1-156

**ఇగో:** అవ్య. 'ఇదిగో' అనే పదానికి వ్యావహారికరూపం. చూపుటను తెలిపే పదం.

"వీఁడిగో నిలుచున్నాఁడు విజయనగరములోన

వేఁడుకొన్న ప్రతాపానఁ బెద్దహనుమంతుఁడు"

3-519

**ఇగ్గు:** అ.క్రి; రా.సీ. మాండలికపదం. మిక్కిలి సంతోషించు, గర్వించు, బడాయిపడు (రా.సీ; మాం. 65 పు.) (ఇగ్గు = ఈడ్చు; ఇగ్గులాడు = అన్యోన్యమీడ్చుకొను అని ఆం.ధా.పా.)

"అగ్గమై శ్రీవేంకటేశ అన్నిటా గూడితి మిదె

యిగ్గుచు నుందము వెరపిఁక నేలయా" 20-600

**ఇచ్చకాఁడు:** (ఇచ్చ + కాఁడు) వి. కోరిక గలవాఁడు, కాముకుడు, ముఖప్రీతికి మాటలాడేవాడు.

"నీ యిచ్చకాఁడవు తొల్లే నీ వెవ్వతెవద్ద నున్నా

నాయమా నిన్ను దూర నడుమ నేను" 12-193

**ఇచ్చకీఁడు:** (ఇచ్చకము + ఈడు) ముఖప్రీతిని కలిగించే వాడు, కపటవర్తనుడు.

"చేకొని శ్రీవేంకటేశ చెల్లుఁజెల్లు యిది నీకు

యేకాలముఁ బాయకుమీ యిచ్చకీఁడా" 20-153

**ఇచ్చకుఁడు:** (9) వి. ప్రియవాది, నయవంచకుడు, ఇచ్చకాలమారి.

"ఆరీతి మాటాడఁగా ని న్నొగాదనరాదు గాక

కూరిమి నీపతి యిచ్చకుఁడె కాఁడా" 9-283

**ఇచ్చకురాలు:** (10) (ఇచ్చక + ఆలు) ప్రియవాదిని, నయవంచకురాలు, ఇచ్చకాలమారి.

"ఇచ్చకురాలను నీకు ఇట్టె నన్నుఁగూడితివి

పచ్చిగా నేల నవ్వేవు పంతగాఁడవా" 18-307

**ఇచ్చలాడు:** (4) (ఇచ్చలు + ఆడు) అ.క్రి. ఇచ్చకము లాడు, ముఖప్రీతిమాటలు పలుకు.

"తగవులు చెప్పలేను తగ నిచ్చలాడలేను

తగువైన వావులతో" 20-124

**ఇచ్చలాడు:** అ.క్రి. ఇష్టపడు.

"శ్రీవేంకటేశ నీవు చేరి నన్నుఁ గూడితేను

యీవల సవతులెల్లా యిచ్చలాడేవు" 27-214

**ఇచ్చితే:** అస.క్రి. ఇస్తే, అన్నమయ్య అంతటా 'ఇచ్చితే' అనే పదమే ప్రయోగించినాడు.

"వేదుకకత్తె యైనది వీడెము చేతి కిచ్చితే

తోడనే యందుట గాని తొలఁగరాదు" 12-80

**ఇచ్చేయందుకు:** (ఇచ్చే + అందుకు) ఇవ్వడానికి అనే అర్థంలో వాడబడే పదం. ఇచ్చేందుకు.

"దేవ నీ విచ్చేయందుకు దీనికిఁగా నింత యేల"

1-372

**ఇట్టికపీట:** వి. ఇటుకపీట.

"గట్టిగాఁబుండరీకుఁడు కడువేడుకఁ బెట్టిన

యిట్టికపీఁటపై నున్నాఁడీ విట్ఠలుఁడు" 2-217

**ఇడియు:** అ.క్రి. చీలు, భేదిల్లు.

"కడలేని పొలయలుకలచేతఁ దన దేహ

మిడియఁగ నిజసుఖ మెన్నఁడు" 1-352

**ఇడుపు:** వి. 1. గోడ, చిత్రరచనకు అనువైన వస్త్రాదికం 2. ద్వారప్రాంతం లోని గోడ.

"అదరి శ్రీవేంకటేశ అందుకే మమ్మేలితివి

ఇడుపుల నాకెమీఁద నెంత గద్దో వలపు" 13-175

**ఇడుపునఁజేర్చు:** వి; ప.బం. తమిళంలో ఇడుపు అంటే నడుమని అర్థం. కనుక ఇడుపునఁజేర్చు అంటే ఎత్తుకొను అని చెప్పవచ్చు.

"తొడిబడఁగూడితివి దొమ్మిరతిఁదేలితివి
యిడుపునఁజేర్చితి యీ మోహము" 14-255

**ఇడుమపాటు:** వి. కష్టము.

"పొడవైన మమతతోఁ బొదలఁబొదల మాన
మిడుమపాట్లఁబడె నేటి బ్రదుకు" 5-98

**ఇడుమపాట్లఁబడు:** అ.క్రి. కష్టాలు పడు, బాధలు పడు.

"పొడవైన మమతతోఁ బొదలఁబొదల మాన
మిడుమపాట్లఁ బడె నేటి బ్రదుకు" 1-156

**ఇతవరి:** (4) (ఇతవు + అరి) వి. హితం కోరేవాడు, మేలు కోరేవాడు, శ్రేయోభిలాషి.

"ఇతవరియైన కాంత యెరవులు సేయదు
సతమైన దేహుని నా చోల పట్టదు" 24-377

**ఇతవరిది:** (ఇతవరి + అది) వి. హితం కోరే స్త్రీ, మేలుకోరే స్త్రీ, శ్రేయోభిలాషిణి.

"ఎఱుఁగుదుఁ జెప్పవే నీ కితవరిదాన నేను
నెఱయా నీ సుద్దులివి విన్ననే వింటిని" 28-536

**ఇత్తడి దెచ్చి యపరంజిఁ జేయు:** ప.బం; అ.క్రి. మామూలు వస్తువును అమూల్యవస్తువుగా చేయు. చూ: ఇత్తడి బంగారు సేయు.

"ధరలోన నతిపాతకుని నన్నిట్లు
అరయ నిత్తడిఁదెచ్చి యపరంజిఁ జేసె" 1-282

**ఇత్తడి బంగారు సేయు:** ప.బం; అ.క్రి. మామూలు వస్తువును విలువైనదానినిగా చేయు.

"ఇత్తడి బంగారు సేయ నింతకు నేరుతునంటా
కొత్తసేఁతలెల్లా దొరకొంటిగా నీవు" 1-360

**ఇత్తల:** (50) (ఈ + తల) అవ్య. ఈతల, ఇవతల, ఇటువైపు, ఈవల, ఇప్పుడు, ఈ పదం నిఘంటువుల్లో కానరాదు.

"ఇత్తల శ్రీవేంకటేశుఁడింతలోఁ దా వచ్చి కూడె"
22-292

"ఇత్తల నీవు నేను యిటు గూడిన కూటమి
చిత్తాన మఱవకుమీ చెలికాఁడ" 20-153

దీనివలెనె అత్తల, ఎత్తల అనే ప్రయోగాలు కూడా సంకీర్తనల్లో ఉన్నాయి.

**ఇత్తలనత్తల:** (2) ఇవతల అవతల, ఇటువైపు అటువైపు, ఇప్పుడు అప్పుడు.

"ఇత్తలనత్తల నీ వెందరిఁబెండ్లాడినా నీ
చిత్తము వచ్చినదే మించిన దేవులు"
12-202 & 1-448

**ఇదేమే:** (ఇది + ఏమే) ప.బం. చనవుతో అనేమాట. 'ఇది ఏంటి' అని వాచ్యార్థం.

"ఎన్నాళ్లకెన్నాళ్లు యిదేమే నీవు
విన్నపము లాలకించి విచారించేవు" 21-34

**ఇదేసందుగా:** ప.బం; క్రి.విణ. ఇదే అవకాశమని, అవకాశం దొరికింది కదా అని.

"ఇత్తలనేఁ బరాకైతే నిదే సందుగా నాతని
నొత్తేవు కొనగోర నొల్లనే నీవు" 22-194

"ఇరవై శ్రీవేంకటేశ యేలితి వీక నింతలో
సరులు దిద్దేవు యిది సందా నీకు" 28-302

**ఇద్దరు ఇద్దరే:** ప.బం; వి. అసాధ్యులు, అసామాన్యులు.

"ఇంక నేల రావయ్య యిద్దరము నిద్దరమే
సంకెదేరెఁ బనులెల్ల సరికి బేసాయను" 9-285

**ఇనుపగుగ్గిళ్లు:** ప.బం; వి; బహు. కొరుకుడు పడనివి, అసాధ్యములు.

"ఇందువల్ల నేమి గద్దు యినుపగుగ్గిళ్లింతే
ఇందిరారమణు సేవే యిరవైన పదవి" 2-268

"ఎనలేని బీరము లెండమావులు
ఇనుపగుగ్గిళ్లు నీ వేమి సేసేవే" 5-196

**ఇనుపగుగ్గిళ్లు నమలు:** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను.

"నానించినుప గుగ్గిళ్ళు నమలుట బలిమిని
ధ్యానించి మనసుఁబట్టి దైవము సాధించుట"
2-49

**ఇనుమారు:** (ఇను + మారు) రెండు మార్లు.

"పువ్వుల చెండు వేసెఁ బోలఁతి ని న్నినుమారు

రవ్వలుగ నవి నీ వురమునఁ దాకె" 12-2

**ఇనుమిక్కిలి :** ప.బం; అవ్య. మిక్కిలి, అధికం, ఇబ్బడి.

"మంతుకు నేనెరిగిన మనసువాఁడవే నీవు
యింతనింత వొకటికి నినుమిక్కి లయ్యేది"
16-352

**ఇనుము అడిచేవారికి తగరము అడుచుట తడవగునా! :** నానుడి; కష్టమైనపని చేసేవానికి సులభమైన పని చేయడానికి ఆలస్యమౌతుందా? అని భావం.

"యెనలేక యెదిరికి యినుమడిచే వారికి
తన తగరమడువఁ దడవయ్యీనా" 3-161

**ఇనుము గుడిచిన నీరు :** (4) ప.బం; వి. వ్యర్థం, ఇంకిపోయింది. వేడెక్కిన ఇనుముపై చల్లిన నీరు వ్యర్థమే కదా!

"సడిఁబడి కుడిచిన కుడుపెల్ల నినుము
గుడిచిన నీరై కొల్లఁబోయె" 1-124

**ఇనుము దాగిన నీరగు :** ప.బం; అ.క్రి. వ్యర్థమగు.

"వూహల నా భోగమెల్లా వొళ్లఁబట్టి నంటా నుంటే
దాహముతోడ నినుము దాగిన నీ రాయఁగా"
3-41

**ఇనుమున నిరిగిన నీళ్ళు :** ప.బం; వి; బహు. లేనివి.

"మనసునఁదాగిన పాలివి మదిగల కోరిక లిన్నియు
యినుమున నిగిరిన నీళ్లు యిల నాహారములు"
2-133

ఇనుమున నిగిరిన నీళ్లు : వి; బహు. మిగులనివి.

"ఇనుమున నిగిరిన నీళ్లు యిల నాహారములు"
2-133

**ఇమ్మఁడికి ముమ్మడి :** ప.బం. అత్యధికం, రెండింతలకు మూడింతలు.

"ఏ మాయనే మీకు నేలె చింత
యీమేర వలపులు యిమ్మడికి ముమ్మడి"
7-519

**ఇయ్యకతొల్లి :** అవ్య. ఇవ్వకముందు; ఇవ్వకపూర్వం; వ్యతిరేక క్త్వార్థకం మీద ముందు, పూర్వం అనే అర్థాల్లో అన్నమయ్య అంతటా 'తొల్లి' అనే శబ్దాన్ని ప్రయోగించడం కనిపిస్తుంది.

"కప్పురమియ్యక తొల్లి కడు వేగిరము
నీకు అప్పుడె కాఁగిట నన్ను నప్పళించేవు"
6-211

**ఇయ్యకొలుపు :** వి; స.క్రి. అంగీకరింపజేయు, ఒప్పించు.

"కైకొని శ్రీవేంకటాద్రి ఘనుఁడిట్టె నన్నుఁగూడె
యీకడ యాతని నేల యియ్యకొలిపేరే" 7-39

**ఇయ్యకోలు :** (4) వి. సమ్మతి, మెప్పుదల.

"ఎరవులు లేక మరి యియ్యకోళ్లే కలితేను
గొరబుగాని యట్టి సిగ్గులే సుఖము" 21-66

**ఇరవగు :** (2) అ.క్రి. ఉండు, నెలకొను, స్థిరమగు.

"ఇరవాయ సూర్యచంద్రు లెదురు పారి"
15-118

**ఇరవుకొను :** (2) ప.బం; అ.క్రి. నెలకొను, స్థిరపడు, కలుగు, నివసించు.

"వేమరు శ్రీవేంకటేశు వెస నీవు గూడితివి,
ఈమెయి నలమేల్మంగ విరవుకోరాదా" 26-413

**ఇరుమేలు :** (11) వి; బహు. రెండువైపులు.

"వరుసతో నిద్దరికి వలపు పంచి పెట్టేవు
యిరుమేలా నీ యాస యెంతగలదయ్యా"
22-221

**ఇరుమొనసూది :** (8) ప.బం; వి. రెండువైపులా పదును గలది, సవ్యసాచి, రెండువైపులా తీక్షత గల సూది అనే అర్థంలో ఏర్పడిన పలుకుబడి.

"ఇచ్చట నన్నుఁ గూడితి విరుమొన సూదివైతి
విచ్చనవిడికాఁడవు వెర పేల యిఁకను" 7-457

**ఇరువుకొను :** అ.క్రి. 'ఇరవుకొను'కు రూపాం. నెలకొను, స్థిరపడు, ఆక్రమించు.

"సిరులు మించఁగ మించ శ్రీవేంకటేశుఁడు కూడి
యిరువుకోవలదా యిచ్చకము లిపుడు" 8-150

**ఇళ్లీదీము:** వి. మృగతృష్ణ, ఎండమావి.
"వెళ్లి దెలిసి రోకలి వెసఁ జుట్టుకొన్నట్లు"
"ఇళ్లీదీముభోగముల సేసేము" 3-174

**ఇళ్లీదీము భోగములు:** ప.బం; వి; బహు. చంచలమైన సుఖములు. (ఇళ్లీదీము = మృగతృష్ణ)
"వెళ్లి దెలిసి రోఁకలి వెస జుట్టుకొన్నట్లు
యిళ్లీదీము భోగముల సేసేము" 3-174

**ఇలువరుస:** (2) ప.బం; వి. ఇంటివంతు, వంశానుక్రమం, కులమర్యాద, పాతివ్రత్యం, మంచినడత, అభిమానం.
"ఇలువరుస యెంచుక యిచ్చలో మెలఁగేఁగాక
చలములు తనతోను సాధించేనటే" 25-256
"యిచ్చకమెఱిఁగి తన యిలువరుస నెరపి
నిచ్చఁబతిఁ గూడినదే నెరవాది" 22-524

**ఇల్లారు:** వి. గవాక్షిని మూసే గంప (మాం.) ఇంటి పైభాగంలో ధాన్యం నిలువ చేసుకోవడానికి రాతితో కట్టిన కట్టు. గుడిసె, గొల్లెన, గడ్డితో చేసిన బుట్ట, వలయాకారం. రూపాం. ఇలారం, ఇల్లారం, ఇలవరం.
"ఎడయని పయ్యదనే ఇల్లారుగాఁ బెట్టి
కడలేని రతుల కంగాణింతువు రావయ్యా"
22-320

**ఇల్లిందాకా:** (ఇల్ల + ఇందాక) ఇంతవరకు.
"వెల్లువెత్తినప్పటి నన్నుఁ బిలువకురా నీవు
ఇల్లిందాకా కాఁకఁబెట్టి యిఁకనేల ప్రియము"
11-333

ఇల్లిటము: (28) వి. 'ఇల్లటము' నకు వ్యావహారికరూపం. ఇల్లఱికము. రూపాం. ఇల్లంటము, ఇల్లింటము, అల్లుడు అత్తవారింటిలో చేసే కాపురం (వ్యు.)
"చల్లనిచూపుల సతికి వలచిపోయి
యిల్లటమున్నవాఁ డీతఁడు" 5-296

ఇల్లిదె: (21) (ఇల్ల + ఇదె) ప.బం. ఇదివో, అల్ల వలె 'ఇల్ల' ప్రసిద్ధిని, నిర్దేశార్థాన్ని తెలిపే పదం. అల్ల అనే పదం అదె శబ్దానికి పూర్వమందువచ్చి అల్లదె అయినట్లుగా ఇల్ల అనే శబ్దం ఇదె శబ్దానికి పూర్వమందు చేరి ఇల్లిదె అని ఔతుంది.
"తొల్లి యెట్టుండునో తాను తుద నెట్టుండునో
తాను
యిల్లిదె నట్టనడుమ నింతేసి మెరసీ" 2-380

**ఇల్లు నింపు:** ప.బం; వి. వధూవరుల నూతన గృహప్రవేశం.
"నేఁడే నాగవెల్లి నేఁడే యిల్లునింపులు
పోఁడిమి గోవిందపతి భోగించీ నిదివో" 20-558

**ఇల్లుముంగిలి:** (3) ప.బం; వి. 'ఇల్లు' అనే అర్థంలో పలుకుబడి.
"ఇల్లుముంగిలి చూచి యీ దేహులు వాని
నొల్లమనుచు రోసి వుడుగరు" 10-44

**ఇల్లురికి:** (4) (ఇల్లు + ఉరికి) ప.బం. అభిమానం లేక ఇల్లు వీడివచ్చి.
"ఇల్లురికి మాతో నేల యీసడించ వచ్చేవు
చెల్లు బడాతనిమీఁదఁజేయవే నీవు" 7-252

**ఇల్లురికి పేరటము చెప్పు:** ప.బం; అ.క్రి. పిలువని పేరటము అని ప్రయోగం.
"ఇల్లురికి పేరటము లేల చెప్పవచ్చేవే
పల్లదాన నీవు గొంత పైకొసరా" 2-331

**ఇల్లులేని ముంగిలి:** ప.బం; వి. అసంభవం, ఉండదనడం, ఇల్లు లేకుండా ముంగిలి ఉండదనే దానిపై ఏర్పడ్డ పదబంధం.
"వెల్లిగొను మమతపై విసిగేవు యీ
యిల్లు లేని ముంగిలి నీ వేమి సేసేవే" 5-190

**ఇసిళ్ల పుట్టవెట్టు:** ప.బం; స.క్రి. విపరీతంగా సంతానం కను.
"మదనజలంబుల కాలువ మా పెద్దల
పూర్వంబులు (?)
"పొదలిన పుత్రుల యిసిళ్ల పుట్టలు పెట్టెదము"
3-340

**ఇసిళ్లు:** వి; బహు. ఱెక్కల పురుగులు. వర్షంతరువాత పుట్టల్లోనుండి బయటికి వస్తాయి. కొంతసేపటికి రెక్కలు పోగా కేవలం

నేలపై పాకుతూ మరణిస్తాయి. పుట్టలవద్ద నిప్పు రగిలిస్తే పైకి వస్తాయి. ఉసిళ్లు అని కూడా అంటారు.

**ఇసుకఁదాడు వేడు :** (తాడు + పేడు) ప.బం; అ.క్రి. అసాధ్యమైన కార్యాన్ని తలపెట్టు, ఇసుకతో తాడు పేనడం సాధ్యం కాదనే భావంతో ఏర్పడిన పదబంధం.

"యెలయింపుమాఁటలనె ఇసుకఁదాడు వేడేవే

సొలపుఁజూపులనే సొక్కు చల్లేవు" 29-464

**ఇసుకగుళ్లు :** వి; బహు. ఒకానొక బాలక్రీడ.

"బాలులు యిసుకగుళ్లు పసఁగట్టు కాడినట్టు

వీలి వెళ్లివాఁడు గంతువేసిన యట్టు" 2-37

**ఇసుకతక్కరి :** ప.బం; వి. ఇసుకతక్కడ, (?) వంచకం, హద్దులేనిది.

"ఇసుకతక్కరి వంటి దీ వలపు

అసము దించక నవ్వే వది నే నెఱఁగనా"

27-340

**ఇసుకదిబ్బెము :** వి. ఇసుకతిన్నె, ఇసుకదిబ్బ, సైకతస్థలి.

"యింతలోనా పిరుఁదులు

యిసుకదిబ్బెములంటా

రంతులుగాఁ గడు నేల రాఁపుసేసేరే" 9-210

**ఇసుకపాతర :** (10) ప.బం; వి. ఎంతకూ తరుగనిది, అంతు లేనిది.

"క్రియ నిసుకపాతర కెల్లొత్తు నీ మాయ

జయమంది వెడలఁగ జనులకు వశమా" 3-347

**ఇసుకపాతర దవ్వు :** (2) ప.బం; అ.క్రి. వ్యర్థప్రయత్నం చేయు.

"తన వైరాగ్యము లేక తత్వము వెదకేనంటే

తనియ కిసుకపాఁతర దవ్వుటా" 15-106

**ఇసుకమీఁదు :** ప.బం; వి. నిలుకడ లేని స్థితి. (?)

"ఇంత చాలదా నీకు యిసుకమీఁదు లేలరా

చింతతోడ నుండఁగాను చిముడఁజేయ నేలరా"

17-467

"కొసరి శ్రీవేంకటేశ కూడితివి నన్ను నీవె

యిసుకమీఁదైన చేతలేల మరచేవు" 9-263

**ఇసుమంత చెలమకు యేఁతము లెట్టుటా :** సామెత; చిన్నదానికి పెద్ద ఏర్పాట్లా అని భావం. వ్యర్థమని తాత్పర్యం.

"పసగా కితనిఁ దన పనికిఁగాఁ బొగడుట

యిసుమంత చెలమకు యేఁతము లెట్టుటా"

15-106

**ఇహపరము :** (2) వి. ఇహలోకం మరియు పరలోకం.

"యిమ్ముల శ్రీవేంకటేశుఁ డిచ్చినంతే యిహపర

మెమ్మెల నిది మరచి యేమరఁగ నేలో" 4-220

## ఈ

**ఈఁతకు మిక్కిలి లోతు లేదు :** కష్టాలకు తలొగ్గిన తరువాత అవి ఎన్ని ఐతే నేమిటి? (ఈదడానికి సిద్ధపడిన తరువాత ఇక ఎంత లోతుంటే నేమి ? అనీ వాచ్యార్థం.) చేతనైనవానికి అసాధ్యం లేదు. (పద.)

"ఈఁతకు మిక్కిలి లోతు యిఁక లేదు

జాఁతిపడనేమనఁగా భయమేల నీకు" 25-431

**ఈఁతగాడు మోఁతగాడు :** (?)

"ఈఁతగాడు మోఁతగాడు

ఇంతే లోతు మోహము" 26-66

**ఈఁతలబంటి :** తలమున్కలు, దుస్తరం.

"వలపు లీతలబంటి వాసులు రొమ్ములబంటి

సొలసితే మాటలు పుక్కిటిబంటి" 23-536

**ఈఁతలు మోఁతలు :** (3) వి. నానాబాధలు, ఛిన్నాభిన్నము, దుర్భరము.

"ఈఁతలుమోఁతలు నీకు యిాడకు రాఁబొద్దు

లేదు" 24-77 & 4-426

"ఈఁతలు మోఁతలు నిఁక నేలయ్యా" 9-35

**ఈఁతలు మోఁతలు నగు :** (2) అ.క్రి. చిన్నాభిన్నమగు, దుర్భరమగు, కష్టమగు.

"ఇదివో నీ సరసము యీఁతలు మోఁతలు

నాయ" 25-292

"కాఁతాళించి చూచి నిన్ను గమ్మటి వేడుకొనీని

యీఁతలుమోఁతలు నాయ నింతి వలపు"

28-141

**ఈత లేని చల్లులాట :** ప.బం; వి. అసంభవం. ఈత లేకుండా జలక్రీడ కుదరదనే దాని నుండి వచ్చిన పలుకుబడి.

"పూఁతమాటల సొలపు బొంకులనే దూరేవు
ఈత లేని చల్లులాట యేమి సేసేవే" 5-196

**ఈఁతామోఁతలు :** వి. దుర్భరములు. (పద.)

"మోము లెత్తుకొనిందరు మోవితేనె లొసఁగేరు
యేమి సేసేవయ్యా నీవు యీఁతామోఁతలు"
23-513

**ఈఁతామోఁతా :** ప.బం; వి. నానాబాధలు.

"ఏలే యింతేసి చేత యీఁతామోఁతా
వేళ వచ్చినదాఁకా వెరగులే చాలు" 26-55

**ఈఁతో మోఁతో :** ప.బం. సుద్దో మద్దో, నుయ్యో కొండో, కాయో పండో.

"అప్పుడు శ్రీవేంకట విభుఁడలరించె నిదె
ఇప్పుడె యీతని కృప యీఁతో మోఁతో" 5-341

**ఈఁదాడంటే గోఁదాఁడను :** (2) ప.బం; అ.క్రి. ప్రతిమాటనూ వ్యతిరేకించు.

"ఈఁదుకరమ్మనవే యిటు నన్నుఁజూమఁగాని
ఈఁదాడంటే గోఁదాఁడనే యెడమాట లేఁటికి"
18-37

**ఈఁదామోఁదా :** ఇబ్బడి ముబ్బడి. (తె.జా.)

"మీఁద మిక్కిలి సన్నలు మీరే యెఱఁగుదురు
ఈఁదామోఁదా మొక్కు మొక్కే మిదివో నేము"
13-119

**ఈఁదులాడించు :** స.క్రి. ఈతకొట్టించు.

"వొనరిన యారు పొంతనున్నవి వళితరంగాలు
యెనసి నీ వేడుకలు యీఁదులాడించవయ్యా"
29-139

**ఈండ్లు :** 'ఈడు'కు బహు. రూపం. సమానులు.

"భూసురుల కామినులు బోయల నాయకుల
జేసుకొని యీండ్లై చిచ్చురికిరి" 4 అను.77

**ఈ(యీ)ద :** వి. 1. ఈదగాలి 2. చలిగాలి.

"యీదచేత వానచేత నెల్లనాఁడుఁ బాయని
బాదచేత మేలెల్ల బట్టబయలై" 1-90

**ఈకడాకడ :** (ఈకడ + ఆకడ) ఇక్కడక్కడ.

"పైకొని శ్రీవేంకటేశ బలిమిఁగూడితి నన్ను
యీకడాకడి సుద్దులు ఇక నెంచనేఁటికి"
20-307

**ఈకె :** (ఈ + అక) వి. ఈమె : అక శబ్దంలోని కకారం మీది అకారం ఎకారంగా మారింది ; అన్నమయ్య 'ఈమె' అనే అర్థంలో ఈకె, ఈపె అనే శబ్దాలనే వాడినాడు. ఈమె అనే శబ్దాన్ని ఒక్క చోట మాత్రమే వాడినాడు. (16-326)

**ఈటిసేయు :** (?)

"దక్కె నీకుఁజాలదా తగు రుకుమిణి నీవు
వెక్కసాన యీటిసేసి వేసుకొన్నది" 9-25

**ఈటు :** (88) వి. 'ఈటు' శబ్దానికి నిఘంటువుల్లో వ్యర్థము, శూన్యము అనే అర్థాలు ఇవ్వబడ్డాయి. ఇవి అన్నమయ్య ప్రయోగాల్లో పొసగవు. ప్రయోగాలను బట్టి ఈ పదానికి వేడ్క, ఉత్సాహం, కుతూహలం అనే అర్థాలు చెప్పవచ్చునని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సూచించినారు. వీటితోపాటు బలిమి, దర్పం, అతిశయం అనే అర్థాలు కూడా చెప్పవచ్చు నని వేటూరి ఆనందమూర్తిగారు సూచించినారు. ఈడు, సమానం,సాటి అనే అర్థాల్లో కూడా ఈ పదానికి ప్రయోగాలు కనిపిస్తున్నాయి. మొత్తంపై ఈ పదానికున్న అర్థాలను ఈవిధంగా సంగ్రహించవచ్చు. అ. వేడ్క, ఉత్సాహం, కుతూహలం. ఆ. బలిమి, దర్పం, అతిశయం. ఇ. ఈడు, సమానం, సాటి .

అ. వేడ్క, ఉత్సాహం, కుతూహలం.

"నీటు లేమిటికి మీరు నెట్టనఁగూడితి రిట్టు
ఈటుతో మదనరాజ్యమేలఁగ రాదా" 18-318

"ఈటుతో బెండ్లాడితివి యిట్టె సేసవెట్టితివి"
11-412

"ఈటునం గాలు తొక్కేది యెన్నఁడే తాను
ఈటుతో శ్రీవేంకటేశ యిట్టె నన్ను నేలితివి"
12-304

ఆ. బలిమి, దర్పం, అతిశయం :

"చీటికిమాటికిఁ దొల్లి చేసన్నకై వచ్చేవాఁడ
నీటున రాజసాన నీవెవ్వరిఁ గైకొనవు" 11-386
"తేటలుగా నీ నిజాలె తెలిసె చెలులకెల్ల
యీటుతోడి కుచ్చితాలు యిఁక నేలయ్యా"
14-157

ఈడు, సమానం, పాటి
"ఈటులేని శ్రీవేంకటేశుఁడేఁగీ నల్లవాఁడె
కోటానఁగోటి దాసుల కోరిక లీడేర్పేను" 3-274
"ఈటైన సవతులము ఇట్టి బుద్ధి చెప్పనేల
పాటించి మొగమోటానఁబైకొనేరుగాక" 28-415
సం.ప.స (సం.14) లో "ఈటు – ఇంత, అని కన్నడ మందర్థము. 'ఈడు' అను తమిళ శబ్దమునకు గౌరవము, తృప్తి, బహుమానము మొ॥ అనేకార్థములు గలవు. అని పేర్కొనబడింది.

**ఈటుమీరు :** ప.బం; అ.క్రి. కొలఁది మీరు. (క. ఈటు = ఇంత)
"నీటునఁదమి పెంచితే నెలకొనీ విరహము
యీటుమీరి జవ్వము యేమి సేతురా" 14-106

**ఈటువెట్టు :** (21) ప.బం; స.క్రి. సమానంచేయు, పోల్చు (పద.)
"పాటెల్లా నొక్కచో నుండు భాగ్యమొక్కచో నుండు
యీటువెట్టి పెద్దతనా లెంచఁబని లేదు" 2-182

**ఈడ :** (36) అవ్య. 'ఇక్కడ'కు వ్యావహారిక రూపం. రా.సీ. లోనూ, తెలంగాణంలోనూ ఈ పదం జనవ్యవహారంలో సర్వసాధారణం. అన్నమయ్య 'ఇక్కడ'కంటే 'ఈడ' అనే పదాన్నే పెక్కు పర్యాయాలు వాడినాడు.
"ఈడా నుండఁడు చూడ నింటనే వున్నాఁడు"
20-220

**ఈడనాడ :** (ఈడ + ఆడ) అవ్య. ఇక్కడక్కడ. రూపాం. ఈడాడ.
"యిటు నన్నుఁ గూడేవాఁడు యీడనాడ నేలుండునే
తటుకన తా నాకు దక్కవలదా" 20-117

**ఈడాడ :** (ఈడ + ఆడ) ఇక్కడక్కడ.
"పూనిన దిక్కుల గాలిపొందు నీడాడని
మానీన లోకమెల్లా మలయుగాక" 2-168

**ఈడు :** వి. 1. వయస్సు 2. సామ్యం, ఉద్ది 3. యౌవనం, పెండ్లివయసు 4. తాకట్టు, కుదువ. పెండ్లిండ్లలో ధనరూపంగా ఇచ్చిన కానుక.
"ఈడుతో శ్రీవేంకటేశుఁడిద్దరి నొక్కటఁగూడె
మాడుపుదిండిలో సిగ్గు మా కేటికే" 27-127

**ఈడు :** వి. సామర్థ్యం.
"ఈడెఱుఁగక వేంకటేశుఁడ నిన్నుఁగొని
యాడుట యది నా యపరాధము" 1-271

**ఈడుకు నీడు :** అవ్య. సరిసమానం.
"సరుగ నీవు గూడఁగా చన్నుల నాపె నొత్తఁగా
ఇరవాయ సమరతు లీడుకు నీడు" 25-181

**ఈడుజోడాడు :** ప.బం; అ.క్రి. ఒకటినొకటి అతిశయించు, ఒకరిని మరొకరు మించు. (పద.)
"జాడతో శ్రీవేంకటేశ సరుసఁ బెండ్లాడితివి
ఈడుజోడాడినదాఁకా నియ్యకొనరాదా"
17-446

**ఈడుజోడు :** (43) వి. సమానము, వివాహానికి వధూవరుల అనుకూలత.
"ఆడ నీ వదినెయైతే ఆపె నీకు దొడ్డుగాక
ఈడుజోడు సవతులు యింత కోపఁగలరా"
26-245

**ఈడుదోఁడు :** వి. ఈడుజోడు.
"వేడుకకాఁడైన శ్రీవేంకటేశు నండ నన్ను
ఈడుదోఁడై యందలాన నెక్కించరె" 24-199

**ఈడుపడు :** అ.క్రి. సమానమగు, సరిపడు, కుదురు. ఆ పని యీడుపడ లేదని దక్షిణాంధ్రలో నేటికీ వ్యవహారంలో ఉన్నదట.
"ఈడుపడ నే నిన్ను నింతకంటె నే మాడేను
యేడ లేని యాసలు నీ వేల పెట్టేవిఁకను"
21-326

**ఈడులువెట్టు:** అ.క్రి. సమానం చేయు.

"ఈడనే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టి
యీడు లేల వెట్టేవు యివ్వల నవ్వలాను"
19-159

"యీడులు వెట్టితినా యెరుక సేసుకొంటా"
18-483

**ఈడువెట్టు:** (4) స.క్రి. సమానంచేయు. (పద.)

"బారెడేసి నా నెరులపాటి వాపె నెరులును
యేరీతి నుండీనో ఇప్పు డీడువెట్టుమా" 25-53

"ఇంతలో మీ చక్కదనా లీడువెట్టి చూచేవాఁరు
చింతదీర మమ్ము సంతోషించనేరదా"

"సరుగు సూడిగముల సతు లీడువెట్టుక
పరఁగఁబొత్తు గూడఁగాఁబడరాదు గాని" 12-251

"చక్కని కన్నుల సూర్యచంద్రులుగాఁగలవాఁడు
ఎక్కడుగా కిందటిలో నీడువెట్టేవా" 3-45

"వీడని చుట్టరికము వెంటవెంటఁ దగులఁగా
ఈడువెట్టి మా పొందుల కేకరఁగ వలెనా" 27-73

**ఈడేఱు:** ప.బం; అ.క్రి. సఫలమగు, కృతార్థుడగు.

"నీ కథలు విని మే మీడేరితిమి" 6-161

**ఈణెమెట్టు:** వి. వీణెమెట్టు; వీణె సరకట్టు; ఈణె అనేది వీణెకు జానపదవ్యవహారరూపం.

"మిక్కుటమై కేల యీణెమె ట్లిగముట్టిఁగాని
ఇక్కువ నీ సుద్దులకు నేమీ ననదు" 26-540

**ఈతల:** (9) అవ్య. (ఈ + తల) ఇవతల, ఇవలిభాగం.

"రాతిరేది పగలేది రమించు సాత్వికులకు
యీతల నింతా వెలుఁగింతే కాక" 4-9

**ఈతల నాతల:** అవ్య. ఇవతల అవతల, ఇటూ అటూ.

"అతఁడు నీవును నేకమైనట్టే వుందురుగాక
యీతల నాతలా బింకాలేల దూసేరే" 7-80

**ఈతల బాయట:** ఇవతలా బయటా.

"పోతరము గలదంటా పొలఁతుల సిగ్గులు
ఈతల బాయట వేసి దెందైనాఁగలదా" 28-188

**ఈత లేని చల్లులాట:** ప.బం; వి. అసంభవం.

"పూఁతమాటల పొలపు బొంకులనె దూరేవు
యీఁతలేని చల్లులాట యేమి సేసేవే" 5-196

**ఈద:** వి. చలిగాలి; శ.ర.లో అరసున్నతో కూడిన ప్రయోగం ఉంది.

"ఈదచేత వానచేత నెల్లనాఁడుఁ బాయని
బాదచేత మేలెల్ల బట్టబయలై" 1-90

**-ఈని:** తద్ధర్మార్థకక్రియాప్రత్యయం. కొసరీని, వచ్చీని, పోయీని మొ॥

**ఈపు:** ఇది 'ఈవు' కావచ్చునేమో!

"పైకొన నేరిచితేను పాయమే బంగారుకొండ
యీకడ మెచ్చనేర్చితే యీపు సంజీవి" 29-6
(అను)

**ఈరసపు సంసారము:** వి. ఈర్ష్యగల సంసారం.

"ఈరసపుసంసార మింగలము దగిలించి
యేరుదాఁటిపోయె నెటువంటి జాణే" 1-173

**ఈరసము:** (2) వి. 1. ఈర్ష్య 2. ద్వేషం 3. కోపం 4. చలం, పట్టుదల, మాత్సర్యం.

"చేరువ నే నున్నదాన చేతిలోనిదాన నింతే
యీరసానఁగాదనే వా రెవరయ్య నిన్నును"
7-540

**ఈరసించు:** (2) స.క్రి. అసూయపడు, ఈర్ష్యపడు, కోపించు (తె.వ్యు.కో.)

"నేరుపులెల్లా దక్కె నెయ్యయములు దలకక్కె
ఈరసించి తోడివారు యేమి గట్టుకొనేరే"
19-177

**ఈరికెలెత్తు:** ప.బం; అ.క్రి. 'ఈరిక'కు రూపాం. మొలకలెత్తు.

"యెలమిఁగోరికలై యీరికెలెత్తె నవే
బలుపంట లిఁక నీ భాగ్యము కొలఁదయ్యా"
11-442

**ఈరుదియ్యఁబేసు వచ్చు:** (10) సామెత; కొంచెం కదుపగా పూర్తిగా కదలు, ఒక ప్రత్యవాయాన్ని తొలిగించుకొనే కోరికతో ఆ ప్రయత్నం చేయగా అంతకన్న పెద్దదే సంభవించడం, తీగె కదిపిన డొంకంతా కదలు, ఈరు దీయుటకు తలను

దువ్వినపుడు ఈరుతో పాటు దువ్వెనకు పేలు కూడా వస్తాయనే దానినిబట్టి ఏర్పడిన పదబంధం.

"సారెకు నాకెకుఁగా బాసలు దానే సేయరాఁగా
ఈరుదియ్యఁబేను రాక యేల మానునే"

11-446

**ఈరెండ :** వి. (ఈరు + ఎండ) లేత ఎండ, కొద్దిపాటి ఎండ.

"పొదలు రతికాఁకలు పొద్దులువొడచి వచ్చె
ఇదివొ తమకమున నీరెండలు గాసెను" 7-450

**ఈలకఱచు :** ప.బం; అ.క్రి. దేనికోసమో ఎదురు చూడు.

"గాలపుఁజిక్కుల కర్మపుతొడసుల
యీల కరచే మే మొకో" 10-5

**ఈలకూరకు నుప్పడుగు :** ప.బం; అ.క్రి. అవసరం లేనిదాన్ని అడుగు ; ఈలకూరలోనే చాలా ఉప్పు ఉంటుంది. మళ్ళీ ఉప్పు అడగటం అనవసర మన్నమాట.

"తలఁపులో నీవలె తాలిమి మా కున్నదా
వొలసి యీలకూరకు నుప్పడిగేవారము" 8-131

**ఈలకూర కుప్పు చాలదు :** అనవసరంగా తప్పుపట్టే సందర్భాలలో వాడబడే పలుకుబడి. అసలు ఈలకూరలోనే ఉప్పు ఉంటుంది. అది చాలకపోవడమనేది ఉండదు.

"ఏల నాతోఁగరాళించి యిది (చేనిది) వో తప్పు
యీల కూరకుప్పు చాల దిది వో తప్పు" 7-272

"చాలుఁజాలు ననరే సాదించ మమ్మింత యేల
ఈలకూర కుప్పు చాల దిందేమి గలదు"

21-532

**ఈలకూర కుప్పులు :** ప.బం; వి; బహు. అనవసరమైనవి.

"నాలుకతుదలే నయములు తన
ఈలకూర కుప్పు లింతే లే" 17-422

**ఈలకూర కుప్పువేయు :** ప.బం; అ.క్రి. అనావశ్యకమైనది చేయు, వ్యర్థప్రయత్నం చేయు; ఈలకూర ఒక ఉప్పని కూర. ఆ కూరలోనే ఉప్పు ఉంటుంది. మళ్లీ దాంట్లో ఉప్పువేయడం అనవసరం కదా!

"వేళ లేదు పొద్దు లేదు వేగిరించీ నింతలోనే
ఈలకూర కుప్పు వేసే నిటుండి రమ్మనవే"

20-162

**ఈలకొను :** అ.క్రి. ప్రాణములు ఉగ్గబట్టు, బిగియబట్టు, ఈలకఱచు.

"యీలకొని మాయామృగ మెమ్ముల
నొరసినమ్మ
రాలించె నుత్తరగోపురముపై గొడగులు" 3-133

"ఈలకొన్న యెముకల యింటిలో
కాపురమింతే" 3-334

**ఈవల :** వి. ఇహలోకము.

"శ్రీవేంకటేశ్వరుఁడు చిత్తములో నున్నవాఁడు
ఈవలేది యావలేది యితని దాసునికి" 2-19

**ఈశ్వరేశ్వరుఁడు :** వి. ప్రభువులకు ప్రభువు.

"ఈశ్వరేశ్వరుఁడు యితఁడు దివిజులకు
శాశ్వతమూరితి జగములకు" 4-19

**ఈసడము :** వి. నింద, దూఱు, ఈసడింపు.

"లాసిన శ్రీవేంకటేశు లాగు లెల్లఁ గనుఁగొని
యీసడము దీర వురమెక్కనైతినా" 9-32

**ఈసమంత :** అవ్య. 'పీసమంత'కు జానపద వ్యవహారరూపం, కొంచెం.

"రాసికెక్కఁగదె యీ కరతలు
యీసమంతైనా వొద్దే యీ వెతలు" 28-573

"బాసిచ్చిన శ్రీవేంకటపతిఁ గూడి పంగింతురా
యీసులు వాసులు సేసు కిచ్చకము లాడవే"

25-447

**ఈసులు వాసులు :** (2) ప.బం; వి; బహు. నిందలు - పొగడ్తలు అనే అర్థంలో వాడబడే పదబంధం.

"ఈసులు వాసులు మాకు నేల రేచేవు
నీ సూటికి రాని సేత నేము సేసేమా" 27-359

**ఈహీ :** అవ్య. ఎగతాళితో నవ్వుటకు అనుకరణశబ్దం.

"ఈహీ శ్రీహరిఁగంటే యింత లేదుగా వట్టి
దాహపుదాసల వెత్తీ దవ్వుటింతే కాకా" 2-69

ఉ

**ఉంకు:** అ.క్రి. 1. పైకెగయు 2. భయపడు 3. పూను.
"సంకె లేక నిన్ను మరి సాదించదగవా
ఉంక నీవు చెప్పినట్టొడఁబడెఁగాక" 18-327

**ఉంకువ:** వి. అల్లుడు కన్యక కోసం మామగారి కిచ్చే శుల్కం.
"యింకనైతే బిగువూ యియ్యకొంటే తగవు
ఉంకువాయ మీకు సెలవుల నగవు" 20-233

**ఉంగరపువేలు:** (16) వి. అనామిక, చిటికెన వ్రేలి ప్రక్కవేలు.
"చెంగటఁబెండ్లాడుతాను శ్రీవేంకటేశుఁడు దానే
వుంగరపువేలు చూపి వొద్దికయ్యీని" 13-128

**ఉంగిటఁగలుగు:** (?)
"కుంగేటి భోగములకుఁ గొనచింత
వుంగిటఁగలిగె మాకు నోహో చింత" 4-48

**ఉంగిటి:** కపటం.
"పంగించి మా నెరులివి బారెఁడేసి ఆయ
వుంగిటిగా సారె నేల వుప్పతించే నంటారే"
9-210

**ఉంగిటిబతుకు:** కపటపు బ్రతుకు.
"వోడుపోయినట్టి వుంగిటి బతుకుల
యీడగిలఁబడే మేమెుకో" 10-5

**ఉంగిటిమెచ్చులు:** వి; బహు. పెదవుల మెచ్చులు, కపటపుమెచ్చులు, మెరమెచ్చులు, పైపై మెచ్చులు.
"కొంగువట్టితే వలపు కుప్పపడదూ!
నీ వుంగిటి మెచ్చులనే వుట్టిపడదు" 21-8

**ఉంగిటిమేను:** కపటపు శరీరము.
"కొంగువట్టి తియ్యగాను కోమలి మేను మరచి
వుంగిటి నీ మేని మీద నొరగున్నదా" 11-300

**ఉంగిడి:** పశురోగము (నాము) అని శ.ర. ఇక్కడ దాని గౌణార్థముగ బాధ, తొందర - అనవచ్చును అని సం.ప.స. కాని ఈ అర్థం అంతటా సరిపడదు.
"రంగుగ శ్రీవేంకటేశ రాజువలె నుండుగాక
వుంగిట నిన్నుఁగూడితే వురమెక్కించేవా" 26-6
"వుంగిటిగా నెవ్వతో నీ వురమున నెత్తి నాకె
యెంగిలిగందాలు నాపై నేల పూసేవు" 20-461
"వుంగిటి దీరఁగ సెలవుల నవ్వేనట కా" 20-459
"ఉంగిటిగా నాపె నేల వొరసేవు నీవు"
21-263 & 15-210
"ఉంగిటిగా రతుల ని న్నోలలాడఁ జేసెను"
29-275
"అంగడివారెల్లా నిన్ను నంటఁగాఁగిలించి రంటా
వుంగిటిగా నే నిన్ను నొత్తుకోలు సేతునా"
13-116

**ఉంగిలి:** కపటం.
"కొంగువట్టి తియ్యకుర కూచున్నదాని నన్ను
ఉంగిటి నేనోప నొళ్ళు నొచ్చీని" 11-265

**ఉంచము:** వి. విలాసం, ఉచ్చస్వరం, High note. క. ఉంచ = విలాసం. సం.ప.స. లో "ఉచ్చ' శబ్దమునకు 'ఉంచ' అని కన్నడ రూపమును కిట్టెల్ ఇచ్చినాడు. దీని తెలుగురూపము ఉంచము; ఉంచమున - ఉంచాన కావచ్చును. హిందీలోని ఊంచ్ కూడ నిదే కావచ్చును. పెద్దగా అని అర్థము. 402 పాటలోని ఉంచవు కూడ ఉంచ+ అవు అని కావచ్చును" అని పేర్కొనబడింది. (13సం. 1.వ అని. 2.పు.) ఈ రెండర్థాలు సందర్భాను గుణంగా చెప్పుకోవచ్చును.
"ఉంచాన గతి (?) గతుల నూదేవు
తుత్తురుఁగొమ్ము
అంచలఁదాళము గూడె నది వినవయ్యా"
13-207
"ఉంచవు నీ జంకెనల వొరయకు మమ్మును"
14-417
"ఉంచానఁ బయ్యెద జారనొగి విరులు గోసిటి
చంచని తా లేచి వచ్చి సరిఁగాఁగిలించెను" 9-67

"ఉంచముగాఁ బిలిచితే నూఁకొనుటే తప్పు
ఇంచుకంత మతిలోన నీసడించే చోటికి"

21-466

"అంచ తుంబరునారదాదు లదె
మంగళపాటకులు ఉంచానఁబాడేరు"

15-201 & 15-67

**ఉంట:** (ఉండు + ట) వి. ఉండటం.
"పురముపై నుంటే కాని వువిద ప్రాణము నీపై
గరిమల శ్రీవేంకటవిభుఁడు" 24-17

**ఉంట:** వి. ఉండ.
"గుబ్బలపై గందము గొప్ప వుంట సేసి యింత
వుబ్బుచు నిన్ను వేయఁగా" 12-430

**ఉంటవిల్లు:** (8) వి. ఉండవిల్లు, వడిసెల. రూపాం. ఉండవిలు, ఉండేలు. చిన్న పంగలకఱ్ఱకు చర్మపు వారో, తాడో కట్టి, దానిలో గట్టిగా ఎండబెట్టిన మట్టి ఉండలు పెట్టి పక్షులు మొ॥ వానిని కొడతారు. నేడు దీనిని 'ఉండేలు' అని అంటారు. పిల్లకాకి కేం తెలుసు ఉండేలు దెబ్బ" అని నానుడి.
"కోమలి నిన్నుఁబాసి కోవిలకూతలు విని
వేమరు కోపాన వుంటవింట వేసీని" 7-422
"ఉంటవింటఁ గప్పురాన నుబ్బి నన్ను నేసేవు"

5-72

**ఉండఁబట్టు:** (11) మాం; అ.క్రి. 'ఉండబట్టదా' అని నఞర్థకంగా ప్రయోగింపబడుతుంది. ఉండబట్టదా అంటే కాలక్షేపం కాలేదా? ఊరకే ఉండలేవా అని అర్థం. ఈ అర్థంలో ఇది నేటికీ రా.సీ. వాడుకలో వినిపిస్తుంది.
"పట్టపుదేవుల భావ మెల్లా నీ సొమ్ము
వొ ట్టేల పెట్టుకొనేవు వుండఁబట్టదా" 18-307
"చిప్పలవంటి కన్నులు చేరదేసి కలవంటా
వుప్పటించీ దనకేమి వుండబట్టదా" 14-364

**ఉండవి:** క్రి. 'ఉన్నవి' కి గ్రామ్యరూపం. 'ఉండాయి' అని కూడా రా.సీ. వ్యవహారం.
"చేతిమీదనే వుండవి చేకొను నా మొక్కులెల్లా"

14-85

**ఉండితే:** (52) అస.క్రి. ఉంటే, ఉండినచో. అన్నమయ్య ఒక్కచోట తప్ప (25-436) అంతటా 'ఉండితే' అనే పదమే ప్రయోగించినాడు.
"మేరతో నుండితేనే మెచ్చనిదానవా" 26-481
"అడఁకువ నుండితే అలిగినదానవా" 26-481
"ముంగిట నుండితేఁజాలు మోహమెల్లా
రేగును" 27-190

**ఉండినట్టే ఉండు:** ప.బం; అ.క్రి. మార్పు లేకుండా ఉండు.
"యెడనెడఁ జేదు గాదు యింతలోనే తీపు గాదు
వొడలితోడవే యివి వుండినట్టే వుండును"

9-252

**ఉండుండి:** ప.బం. ఒక్కసారిగా.
"ఉండుండి చెలులఁ బిలిచే వొద్దికి నీవు
దండిగా నాతఁడు తానె తలుపు మూయఁగను"

14-384

**ఉండాన(వు):** వి. ఉన్నదాన(వు) అనే అర్థంలో వాడబడిన వ్యావహారికరూపం. 'ఉండాన'(వు) అనే పదం వ్యస్తంగానే కాక ఉంచుకుండాన, పట్టుకుండాన మొ॥ సమస్తరూపాల్లో కూడా ప్రయోగింపబడింది. 'ఉండాన'తో పాటు 'ఉన్నదాన' అనే రూపానికి కూడా ప్రయోగాలు విరళంగా కనిపిస్తున్నాయి.
"ఒంటి నీ కెదురు చూచి వుండాన నేఁ
నింటిలోన సిగ్గున నుండానఁ జూమ్మీ" 7-531

**ఉంది:** 'ఉండు' ధాతువు అమ; ఏ.వ; క్రి. రూ. 'ఉన్నది'కి వ్యావహారికరూపం.
"ఉన్నతి రెప్పలతుది నుంది మోహము
ఓటలేక పెదవుల నుంది మోహము
ఒక్కటై దేహముమీఁద నుంది మోహము"

27-272

**ఉంబడిపొత్తు:** వి. ఉమ్మడిపొత్తు.
"వోపనన్నుఁబోనీడు వుంబడిపొత్తుల చేతుల
మోఁపవచ్చీ నాకు చాల మొక్కినాను
మానఁడు" 26-149

**ఉం(వుం)బళి:** వి. పన్ను లేక అనుభవించే వస్తువు. (శ.ర.)

"జ్ఞానమే మాకు ధనము సర్వవేదములు సొమ్ము
పూనిన వైరాగ్యమే వుంబళి మాకు" 3-63

"యెంచి నడచేకాలమే యిందరికి నుంబళి
తెంచి మెచ్చుకుందు లిందు దెలుప నేమున్నది" 2-310

"పంచిన భూకాంతపతిఁ బాయక సేవించరో
వుంబళ్ళు వూళ్లు నిచ్చే వున్నతుఁడు నీతఁడే" 4-238

**ఉంబళి:** వి. పన్నులేని అగ్రహారాదికం.

"ఎంచి నడచేకాలమే యిందరికి నుంబళి" 2-310

**ఉక్కఁబట్టు:** ప.బం; స.క్రి. వదలు. (శ.ర.)

"వుక్కఁబట్టి వుట్టిమీఁద నునిచి రోలుదీసి
చొక్కి తా నెందున్నాఁడో చొప్పు ఇదే కంటిమి" 2-166

**ఉక్కళము:** వి. శత్రువులు ఎత్తిరావడాన్ని తెలుసుకోవడానికై ఉంచే కావలి, కోపురం.

"ఒక్కట మీ రిద్దరు అహోబలేశ
వుక్కళమై కాచుకుండహోబలేశ" 21-202

**ఉక్కిపోవు:** అ.క్రి. నశించిపోవు, గాలి లేక తపించు, నలిగిపోవు.

"ఆనకమై నవ్వేవేమె అంగన నీ నగవులు
పూని నీ కుత్తికలోన వుక్కిపోవుఁజుమ్మీ" 15-26

**ఉక్కిస:** వి. పొడిదగ్గు, దగ్గు, శ్వాసబాధ.

"వుమురఁబెట్టఁగ నట్టి వుక్కిస కూడా యేమి
తమకము చెల్లఁబెట్టి దగ్గరి రమ్మనవే" 8-57

**ఉక్కుఁబదనులవారు:** వి; బహు. ఉక్కువంటి వాడి గలవారు. (పదను = వాడి)

**ఉక్కుగుబ్బలు:** వి. ఉక్కువలె కఠినమైన స్తనాలు.

"చిక్కని చెమటల జేరులు వారఁగ
వుక్కుగుబ్బలను వొత్తీఁ జెలి" 16-429

**ఉక్కుగోరు:** వి. ఉక్కువలె వాడియైన గోరు.

"చెక్కులఁజెమట గారె శింగరి నీ
వుక్కుగోరు సోఁక నీకు వో శింగరి" 7-315

**ఉక్కుమీరు:** ప.బం; అ.క్రి. ప్రబలు, అతిశయించు.

"చక్కనివాఁడ మరి చంద్రసూర్యనేత్రుఁడవు
వుక్కుమీరి నీ వెట్లా నుండినా నమరును" 8-202

**ఉక్కురాతి గుండె:** వి. మిక్కిలి కఠినమైన హృదయం.

"ఊరకే కరఁగునా వుక్కురాతి గుండె నీది
సారెకు విన్నవించఁగా సమ్మతించితివి" 23-485

**ఉగము:** వి. ఆయువు, ఊపిరి, నిట్టూర్పు.

"వూరు దిప్పినట్టి యాస వుగము దిప్పిన యాస
చేరవచ్చి దైన్య మందించిన యాస" 4-456

**ఉగాదిపండుగ:** వి. నూతన సంవత్సరాది పండుగ, చైత్రశుద్ధ ప్రతిపదనాడు చేసుకునే పండుగ.

"వున్నతి నొక నిమిష ముగాదిపండుగ సేసె
తన్నుఁదానె తనలోని తమకానను" 11-184

**ఉగ్గళించు[1]:** 1. కౌఁగిలించు 2. పెంచుఁ (వా.ని.) నట్టువుఁడు కొలిపించు (శ.ర.)

"నిగ్గుదేర మెచ్చుకొంటా నీ నాటకసాల చూచి
వుగ్గళించి తాళములొత్తీ సతి" 29-26

**ఉగ్గళించు[2]:** స.క్రి. వచించు.

"ఒల్లనే సతులు దన్ను వుగ్గళించి పొగడఁగా
కొల్లలాడీ వలపులు కోడతిరునాళ్ళు" 14-240

**ఉగ్గువ:** (?)

"యెగ్గు లేదు తగ్గు లేదు యిఁక నీ దాసులలోన
వుగ్గువ లేని ప్రసాదమూనినది వొడల" 9-171

**ఉట్టిఁగట్టు:** స.క్రి. దూరంపెట్టు, అపహాస్యం చేయు.

"రారాదా యిఁకనైనా రమణి పానుపుపైకి
వూరనిచ్చి విరహము వుట్టిఁగట్టేవా" 7-401

"పట్టకింత మా చెఱఁగు బాపఁడా నాఁడె
వుట్టిఁగట్టితివి కులమో బాపఁడా" 6-90

**ఉట్టిఁబెట్టు**: స.క్రి. దూరంపెట్టు, వదలిపెట్టు.
"ఉద్దండపు నీ చేతలు వుట్టిఁబెట్టవయ్యా"
21-91

**ఉట్టికెక్కు**: ప.బం; అ.క్రి. కూలఁబడు. (పద.) రూపాం. ఉట్లెక్కు.
"ఉట్టికెక్కు నీ సిగ్గులు నో బావ" 17-231

**ఉట్టిగొట్టు**: ప.బం; అ.క్రి. గోకులాష్టమినాడు ఉట్టిని వేలాడదీస్తూ, లాగుతూ ఉండగా దానిని కొట్టు; చూ: ఉట్లుగొట్టు, ఉట్లపండగ.

**ఉట్టిపై చెరలాటము**: ప.బం. వి. నిప్పుతో చెలగాటం వంటిది. ఉట్టిమీద నిలచి ఏమాత్రం కదలినా కిందపడతారు.
"ఉట్టిపై చెరలాట మూరఁబొత్తుల కూడు
పట్టు చాలని కొమ్ము బహునాయకము" 1-71

**ఉట్టివడు**: ప.బం; అ.క్రి. అకస్మాత్తుగా వచ్చు.
"హరి ఉట్టివడి కావకున్న
నొచ్చెము దేహికి హరి" 3-369

**ఉట్లపండుగ**: (3) వి. గోకులాష్టమి (కృష్ణాష్టమి) పండుగకు జానపదుల వ్యవహారం. ఈ పండుగనాడు ఉట్లను వ్రేలాడదీస్తూ పైకి లాగుతూ ఉండగా వాటిని కొట్టుతారు. దీనిని బట్టి ఈ వ్యవహారం. నునుపైన స్తంభం కొనలో రూకలసంచి ఉంచుతారు. దానినెక్కి తీసుకోగలిగిన వ్యక్తిదే ఆ సొత్తు. కాని ఆతడు పైకెక్కుతూ ఉంటే నిరోధిస్తూ వసంతపు నీళ్ళు అతనిపై చల్లుతుంటారు.
"పచ్చిదేరుచు నుట్లపండు గాయను
గచ్చులకు గొల్లెతలు కాఁగిలించి పట్టఁగా" 3-150

**ఉడయవరు**: వి. శ్రీమద్రామానుజాచార్యులు; నిత్య విభూతి (వైకుంఠం), లీలా విభూతి (సంసారం) ఈ రెండిటిని తన అధీనంలో ఉంచుకొన్న అధికారి అని అర్థం. ఒడయవర్ అనే ద్రావిడ పదంనుండి ఏర్పడ్డ పదం.
"ఉన్నతోన్నతుఁడు వుడయవరు
యెన్న ననంతుఁడే యీ యుడవరు" 15-220

**ఉడయవర్లు**: చూ: ఉడయవరు.

**ఉడికినందుమీఁదట వుప్పు చల్లినట్లు**: ప.బం; అ.క్రి. అసలే బాధలో ఉండగా మరింత బాధ పెట్టినట్లు.
"ఉడికినందుమీఁదట వుప్పులు చల్లినట్టాయ
యెడయెడ నీ చేతల కేమనేము నేము"
21-88 & 27-87

**ఉడికిపడు**: ప.బం; అ.క్రి. ఉలికిపడు.
"ఉడికిపడే విదేమే వూరివారితో నవ్వితే
విడువ కెవ్వరికైనా వేడుక లేదా" 11-324

**ఉడిగట్టు**: ప.బం; స.క్రి. ఒడిగట్టు. (?)
"ఒనర నీ రతులకు నుడిగట్టఁజేసినది
వెనువెంటఁదిరిగే నా వేడుకే కాదా" 27-106

**ఉడిబడిపనులు**: ప.బం; వి; బహు. చిల్లరపనులు, చిలిపిపనులు, (f.n) చిన్నాపెద్దా పనులు.
"పక్కనే నీ కుడిబడి పనులెల్లాఁ జెప్పని
గక్కక నిన్నెంత యేలుకొన్నదో కాని" 29-406

**ఉడిబడివారు**: (ఉడి + బడి + వారు) ప.బం; వి; బహు. ఉపద్రవకరమైన పద్ధతి కలవారు. ఉడి =, to burst, to crack, to split, to break ఇత్యాదిగా కిట్టెల్. బడి = పద్ధతి. ఉపద్రవకరమైన పద్ధతి కలవారు కావచ్చు. తాత్పర్యార్థం దుర్జనులు, చిల్లరవారు.
"అడుగఁదగినవాఁడు అన్నిటా నుదారివాఁడు
వుడిబడివారి నేల నొల్లనివాఁడు" 22-121
"ఊరకే లోనౌదువా వుడిబడివారి కెల్ల
మేరమీరి యాపెనే మెచ్చవలెనయ్యా" 25-424

**ఉడిబడి సుద్దులు**: వి; బహు. చిల్లర సుద్దులు.
"ఉడిబడి నీ సుద్దులు వూరెల్లా నాడుకొంటే
తడయక నేనందు కుత్తర మియ్యఁగలనా"
19-227

**ఉడివోవు**: (ఉడిగి + పోవు) ప.బం; అ.క్రి. 1. నశించు 2. వ్యర్థమగు 3. విచ్ఛిన్నమగు 4. తొలగు (తె.వ్యు.కో.)
"వుడివోవు కోరికలు వొడుగదు కోపము

కడుదాకా నీ మహిమ కాదనరాదు" 3-200

"వుడివోని జవ్వనము వొడల్పైఁ బెట్టుకొని

పడఁతికి నలుకలు పాటించఁజెల్లునా" 16-26

**ఉడుకు:** వి. 1. అంతస్తాపం, విచారం 2. బాధ, పీడ 3. వేడి, ఉష్ణత.

"నెరజాణ విన్నిటాను నీ వేడ నేనేడ

వులిసినమీఁద నింక వుడుకులు నా" 7-302

**ఉడుకులు గట్టు:** ప.బం; అ.క్రి. మనస్తాపం కలిగించు, బాధలు కలిగించు, కోపాలు చూపు (?)

"ఊరకున్నవానిమీఁద నుడుకులు గట్టేమా"

14-27

**ఉడుకెత్తు:** ప.బం; అ.క్రి. బాధపడు, తాపం చెందు, వేడెక్కు.

"బత్తితోడ నీపై నాపె పక్కనఁ బన్నీరు చల్లె

ఒత్తిన విరహాన నీ కుడుకెత్తెను" 13-428

**ఉడుపా:** వి. కానుక.

"వుమ్మగిలి సింగారాలు వుడుపా వట్టుకున్నది

తమ్మిమోము సూడిదెగా దాఁచుకున్నది"

28-359

**ఉడుబడి పనులు:** చిల్లరపనులు.

"చెమ్మఁజెమటలతోడ చేసన్న సేసే నలల

పమ్మి మాకు నుడుబడిపనులు చెప్పేవు"

13-257 old

**ఉడ్డగచ్చకాయలు:** వి. ఒకానొక క్రీడ.

"వుదుటునఁబారిపారి వుడ్డగచ్చకాయలాడీ

ముదము దొలఁకఁగాను ముద్దుకృష్ణుఁడు"

4-172

**ఉత్తరాలాడు:** ప.బం; అ.క్రి. సమాధానాలు చెప్పు.

"నీడ నున్న రమణుని నింద లిందరాడఁగాను

యీడ నీ వుత్తరాలాడ కెందు వోతివే" 8-136

**ఉత్తలము:** వి. కలత, తారుమారు, తత్తరపాటు, బెదురు, భయం, త్వర, వేగిరపాటు, సంక్షోభం, పరితాపం.

"ఉత్తలాన నేడనైనా నుండుదువో యని

బిత్తరముగాఁబెట్టితి పెట్టరాని యాన" 5-60

**ఉదటు:** వి. నిఘంటువుల్లో కానరాదు. ఇది 'ఉదుటు' కావచ్చు. ఉదుటు అంటే ఉద్ధతి, పరాక్రమం, గర్వం, స్థైర్యం, అందం, అతిశయం. విణ. గర్వించేవి అని (ఆం.వా.)

**ఉదయచందురుఁడు:** వి. ఉదయించే చంద్రుఁడు. కేవల సంస్కృత పదానికి తద్భవంతో సమాసం. 19-80 & 7-223

**ఉదారికాఁడు:** (ఉదారి + కాఁడు) విణ. ఔదార్యం కలవాడు. ఉదారి శబ్దంపై స్వార్థంలో కా ప్రత్యయం; ఉదారుడనే అర్థంలో ఉదారి శబ్దం విలక్షణం. చూ: ఉదారివాఁడు.

"........ వొనరిన వరముల వుదారికాఁడు

చెల్లుబడి పీ(వాఁడు) గదే శ్రీవేంకటేశుఁడు".

23-92

**ఉదారివాఁడు:** (ఉదారి + వాఁడు) ఔదార్యం కలవాడు, ఉదారుడు, వింత ప్రయోగం.

"అడుగఁదగినవాఁడు అన్నిటా నుదారివాఁడు

వుడిబడివారి నేల నొల్లనివాఁడు" 22-121

ధర్మివాచకమైన 'ఉదార' శబ్దాన్ని ఉదారిగా మార్చి దానిపై వాడు అని చేర్చి ప్రయోగించడం వింత. చూ: ఉదారికాఁడు.

**ఉదాసీనము:** వి. ఉదాసీనత, ధర్మవాచకానికి బదులు ధర్మి వాచకాన్ని ప్రయోగించడం అన్నమయ్యకు అలవాటే.

"చీకాకుమై చూచి వుదాసీనము సేయనేర్తువా"

9-94

**ఉదియగొను:** ప.బం; స.క్రి. ఆరంభించు.

**ఉదుటిహము:** వి. వేదన కలిగించే ఇహలోకం.

"ఉదుటిహముఁ బరము నొక్కయందె తగులు

అదె శ్రీవేంకటపతి యంతరాత్మ తగులు" 1-471

**ఉదుటు:** వి. 1.ఉద్ధతి, పరాక్రమం, గర్వం, స్థైర్యం, అందం 2. ఉద్ధతం 3. సుందరం 4. అతిశయం విణ. గర్వించేది (ఆం.వా.)

"ఊర కేల దాఁచేవు వుదుటు నీ చేతలు

యే రీతి నీ వుండినాను యెవ్వ రేమనేరు"

19-285

"ఉదుటుల పోతరాలు వుడివోని కాతరాలు
అదన నన్నియు నీకు నమరీని నేఁడు " 28-80

**ఉద్దండము :** (28) వి. సాహసం, అఘాయిత్యం, 'క్రమశిక్ష' అనే అర్థంలో సారంగపాణి ప్రయోగం. 2-279

"బుద్ధులెఱుఁగుదు నంటా పొరుగుపోరచి యంటా
ఉద్దండానఁ జన్నులంటీనో యక్కరో వీఁడు "
7-96

"రట్టు సేసే నీ వుద్దండా లిట్టే ఇంతటా నిండె
నెట్టుకొని బాసడుగ నాతో నేల ఇఁకను " 13-535

**ఉద్దండీఁడు :** (4) (ఉద్దండము + ఈఁడు) వి. సాహసి, ఉద్దండుడు. "ఉద్దండ భావార్థమై మతుబర్థమున 'ఈఁడు' వచ్చుట వింత" అని సం.ప.స. కాని ఇట 'ఉద్దండ' అనే విశేషణవాచకంపై 'ఈ' స్వార్థంలో వచ్చినదని భావించాలి. మతుబర్థంలో కాదు.

"వుద్దండీఁడవు నీ వైతే వొంటి నున్నదాన నేను
అద్దో నీ వేమి సేతువో అత్తింటికోడలు " 27-557

**ఉద్దగళలు :** వి; బహు. పొడుగువెడల్పులు; ఇట అంతటను అని అర్థం.

"కూలిన తలలును గుజ్జువుడెక్కలు
నేలపై కూరిన నెత్తురులు
వోలిఁజూడు డిదె వుద్దగళ లీ రణ
కేలిని విష్వక్సేనుఁడు గెలిచె" 2-108

పై కెగసిన కళలు అని సంపా.

**ఉద్దగిరికృష్ణుఁడు :** వి. నెల్లూరుజిల్లా ఉదయగిరి తాలూకా యే ఉద్దగిరి. ఈ గ్రామసమీపంలో ప్రాచీనమైన కృష్ణదేవాలయ మున్నది. ఇందు వెలసిన కృష్ణుడే ఉద్దగిరికృష్ణుడు.

"ఉవిదలాల చూడరే వుద్దగిరి కృష్ణుఁడు
నవకపు నెలవుల నవ్వుచున్నాఁడు" 3-235

"చూడ చిన్నవాఁడు గాని వీడు సుద్దులైతే వేవేలు
వింతలు సేసే వుద్దగిరి కృష్ణుఁడు"
21-278 & 16-432, 433

**ఉద్దపు నడపులు :** వి. చెప్పుతోడి నడకలు.

"ఉద్దపునడపుల లోపల నొయ్యన పాదము జారిన
నొద్దికతో నునుఁగౌఁగిట నొరసిన చందములు "
5-360

**ఉద్దవిడి :** వ.బం; అవ్య; ద్రు. 1. శీఘ్రంగా, వడిగా, వెంటనే 2. మిక్కిలి, అత్యంతం. రూపాం. ఉద్ధవడి. 10-272(ఊర్ధ్వవిడి గాదగునని శ్రీరాళ్లపల్లి వారు పేర్కొన్నారు)

"వుద్దవిడి లంకఁజొచ్చి వుంగరము సీతకిచ్చి
అద్దివో రాము మెప్పించె హనుమంతుఁడు "
4-272

**ఉద్దాలు :** (5) వి; బహు. చెప్పులు.

"మెల్లనే వుద్దాలు మెట్టి మీరిన తురుము వెట్టి
తెల్లని ముత్యాలు గట్టి తిరుగకువే" 5-270

కుచ్చుటుద్దాలు అని శు.స.

**ఉద్దాలువెట్టే యాపె :** వి. చెప్పులందించే (చెప్పులు తొడిగే) సేవకురాలు.

"వుద్దాలువెట్టే యాపె వూడిగము సేయఁగాను
వొద్దఁగూచుండు మనుచు వొడివట్టేవు" 7-171

**ఉనుకులు :** 'ఉనికి'కి బ.వ; రూపం కావచ్చు.

"నిన్నటి వునుకుల నీ జాడలెల్లఁ గంటిమి
అన్నియు నాతో నీ వాడవలెనా" 23-592

**ఉనుకొను :** అ.క్రి. 'ఉండుకొను'కు రూపాంతరమేమో? విలక్షణప్రయోగం.

"వొడఁబరచఁగనేల వునుకొను చక్కనైతే
అడియాలములు మేను లమరుఁగాక" 27-332

**ఉనుచు :** స.క్రి. ఉంచు, పెట్టు.

"వుడివోక తారుమారై వునిచిన వుంగరాలు
తడఁబడీ వేళ్లను తా నెరఁగఁడా" 8-278

**ఉనుచుకొను :** స.క్రి. 1. ఉంచుకొను 2. నియమించుకొను 3. స్థాపించు, నెలకొల్పు; ఉంచుకొను అనే రూపానికి 'ఉనుచుకొను' అనేది విలక్షణరూపం.

**ఉనుపుఁ జేఁతలు :** వి; బహు. (?)

"పెనగుచు నీ విట్టి ప్రియములు నెరపేవు

వునువుఁజేతల వూటుకూరి చెన్నరాయ" 16-24

**ఉన్నకాలము:** వి. వర్తమానకాలము.

"చన్నకాలమున నున్నకాలమున
నున్నవాఁడు యీ వుపేంద్రుఁడే" 3-289

**ఉపకారుఁడు:** విణ. ఉపకారం చేసినవాడు. 'ఉపకారి' అనడానికి బదులు 'ఉపకారుడు' అని ప్రయోగించడం విలక్షణం.

"నారాయణుఁడున్నతుఁ డచ్యుతుఁడుప
కారుఁడు శ్రీవేంకటవిభుఁడు" 3-529

**ఉపజిహ్వ:** వి. కొండనాలుక.

"వున్నతి నీ కడకు రాకున్న కాళ్ళు మరగాళ్లు
సన్నుతి సేయని జిహ్వ సరి నుపజిహ్వ" 2-450

**ఉపద్ర:** వి; రా.సీ; మాం. ఉపద్రవం, ప్రమాదం; 'ఏమమ్మా ఉపద్రా, ఏమిగతి' అని ఈనాడు రా.సీ. ప్రజల్లో వాడుకలో ఉన్నదని అ.సం.సా. రా.సీ.మాం. లో పేర్కొబడింది.

"కతకారి నిన్నుఁజూచి కదుఁ జలములెక్కినను
పతిభక్తి సేయంగ ఉపద్ర రాదు గదా" 3-10

**ఉపమ:** (24) వి. 1. ఉపాయం (2. పోలిక 3. పోల్చదగిన చంద్రాది 4. ఒక అర్థాలంకారం)

"సర్వేశ్వరా నీకు శరణు చొచ్చితిమిదే
వుర్విలోన నే మెంచే వుపమ లేమున్నవి"
3-159

**ఉపమకెక్కు:** అ.క్రి. నేర్పుకెక్కు.

"తానై శ్రీవేంకటేశ వొత్తగిలి పవ్వళించేది
వోవరిలో నిది యొక వుపమకెక్కె" 23-352

**ఉపమించు:** స.క్రి. పోల్చు.

"రపమై శ్రీవేంకటేశ రతి నన్నుఁ గూడితిని
వుపమించి చూడనింతా నొక్కటే వలపు" 11-7

**ఉపరతి:** వి. పురుషాయితం అనే రతిభేదం.

"నీలమేఘమువంటి నీపై నా కుచగిరు
లోలి నుపరతియందు నొగి వాలె నేఁడు"
24-148

**ఉపరిసురతము:** వి. పురుషాయితమనే సురతభేదం.

"చక్కఁగా నీ దొడ్డ రాజసపు దొరతన మెల్ల
తక్కినా వుపరిసురతమే చూపీరా" 22-43

**ఉపలాలించు:** స.క్రి. ఉపలాలన చేయు.

"కొమ్మ గడు జవరాలు కోమలపుమేనిది
నెమ్మది నుపలాలించి నెయ్యము చూపరాదా"
29-307

**ఉపారము:** వి. 1. కానుక, ఉపాయనం 2. నైవేద్యపదార్థం (వ్య.)

"పలుకుఁదేనియల నుపార మియ్యవే" 5-221

**ఉప్పటించు:** అ.క్రి. 'ఉప్పతించు'కు రూపాం. ఓర్వలేనితనం చేత ఆడిపోసుకొను, దృష్టి తాకునట్లు నుతించు. 5-56

**ఉప్పడము:** వి. అవబోధం, మేలుకోవడం.

"ఉప్పడమయి దేహమనే వూరఁ బెద్దచావడి
ఉప్పతిల్లి దేహి కొలువున్నపుడు" 2-124

**ఉప్పతించు:** (ఉప్పత + ఇంచు) ఓర్వలేనితనం చేత ఆడిపోసుకొను, దృష్టి తాకునట్లు నుతించు.

"ఉప్పతించి దూరఁగానె వొద్దఁ గూడుచుండి నాతఁడు
పిప్పిగట్టే సిగ్గులతోఁ బెనఁగేవే" 9-1

"చూచినవారెల్ల నన్నే సారిది నుప్పతింతురు
మా చనవు చెల్లించి మన్నించరాదా" 18-19

"ఉప్పతించి మమ్ము నేల వోవలు వేసేవు"
26-208

**ఉప్పతింపు:** (2) వి. అపనింద, రద్ది, రట్టు, ఓర్వలేక నిందారోపణం చేయు.

"బద్దుల కాంతలకు వుప్పతింపులే మించెను"
27-481

**ఉప్పమ్మఁగొందరు చిట్లు మోయఁగొందరు:** నానుడి. పెద్దపనికి కొందరు – చిన్నపనికి కొందరు; కొందరు ఉప్పు అమ్మితే కొందరు చిట్టు (తవుడు కలిసిన నూక) అమ్ముకొలారని వాచ్యార్థం.

"జిగి నుప్పమ్మఁగొందరు చిట్లు
మోయఁగొందరు

నగు నీతో సరసమరగదు మాకును" 14-429

**ఉప్పరాలు :** (?)

"అప్పటి మానవే నీవు అతనిఁగాననివేళ

ఉప్పరాలై (?) అగ్గళ్ళు వురికినదానవా"

17-109

**ఉప్పరాలెగయు :** అ.క్రి. పైకెగయు, అతిశయించు.

"యెప్పటికప్పటి సుద్దు లేమోయి నీపై

నుప్పరాలెగసీఁ జన్ను లేమోయి" 7-250

**ఉప్పరిగె :** వి. 'ఉప్పరిగ'కు వ్యావహారికరూపం. 1. పై అంతస్తు 2. సౌధం 3. మేడ.

**ఉప్పవడము :** (3) వి. మేల్కొవడం, అవబోధం. రూపాం. ఉపవడము అని శ.ర. ఒప్పువడము, ఉప్పడము. ఉప్పవడము - విశ్రాంతి చెందుట, సుఖశయనము అను నర్థమున తాళ్ళపాక వారి ప్రయోగము లున్నట్లున్నవని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఇది నిద్రకును, లేచి యుండుటకును నడిమి దశ కావచ్చు. పరుండి మేల్కొని యుండుట - వెన్ను వాల్చి - అనగా సుఖశయనమున విశ్రాంతి గొనుట" అని వేటూరి ఆనందమూర్తిగారు తెలిపినారు. (సం.వా; పద; భాషా. 434పు)

"ఉప్పవడము గావయ్యా ఉయ్యాలమంచము మీఁద

దప్పిదేరు తన మోముఁ దమ్మితోడ నిది వీఁడె"

6-102

"దప్పిదేరు తనమోముఁ దమ్మితోడ నిదె వీఁడె

వుప్పవడముగఁ బాదాలొత్తరమ్మ" 5-338

**ఉప్పు చింది యినుమడగు :** ప.బం; అ.క్రి. కొంత నష్టమైనట్లు కనిపించినా దానివల్ల మరింత లాభం కలిగే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి. 'ఉప్పొలికి ఇమ్మడి అయినట్లు' అని కూడా వ్యవహారం.

"ఉప్పు చింది యినుమడాయ నందురు"

16-547

"యెందువోయీ నింతలోనే

నుప్పు చింది యినుమడీఁగాకా" 9-128

**ఉప్పులో కప్పురమేల :** నానుడి. ఒక దానిలో దానికి సాటి గాని వస్తువు వుండడమనే భావాన్ని తెలియజేసే నానుడి.

"ఒప్పుగ నాకెను నన్ను నొకటి సేయఁబనిచీ

వుప్పులోఁ గప్పురమేల వొద్దమ్మా" 7-309

**ఉప్పువేసి పొత్తు గలియు :** (2) ప.బం; అ.క్రి. కొద్ది వస్తువును త్యాగం చేసి గొప్పలాభాన్ని పొందడానికి ప్రయత్నించు.

"విసరె మొటల నుప్పు వేసి పొత్తు గలసీని

పెనఁగి యెక్కడనైనా పెద్దబావఁగారు" 11-355

"పోనిపోని వుప్పువేసి పొత్తు గలియవచ్చీని

నేనోపఁగా యింతేసికి నిద్దుర వచ్చీని" 9-138

**ఉప్పువేసి పొత్తు గూడు :** (2) ప.బం; అ.క్రి. చూ: ఉప్పువేసి పొత్తు గలియు.

"కందువ లంటుచు నిన్ను కాఁగిట నించఁగాను

పొందుల నుప్పువేసి పొత్తు గూడేవు" 11-423

**ఉప్పువేసి పొత్తులు :** ప.బం; వి; బహు. కొద్దిగా శ్రమపడి పెద్ద లాభాన్ని పొందడం.

"యీ లాగులే యిందరికి యీఁదులాడే నీటిలోని

వోలలాయ నిదివో నీ వుప్పు వేసి పొత్తులు"

21-340

**ఉప్పొలి కినుమడగు :** (4) ప.బం; అ.క్రి. కొంతనష్టమైనట్లు కనిపించినా దానివల్ల మరింత లాభం కలిగే సందర్భంలో వాడే పలుకుబడి. చూ: ఉప్పు చింది యినుమడగు.

"వులిపచ్చి వలపుల వుప్పొలి కినుమడైతే

ములుగములుగ నిట్టి వేగే నిపుడు" 20-478

"అప్పటికప్పటి మాటలంటి మింతే

వుప్పొలి కినుమడాయ నూరకే వుండవయ్యా"

9-168

**ఉబ్బరి :** (4) (ఉబ్బు + అరి) 1. పొగరుబోతు, గర్వి 2. సంతోషి (వ్యు; వా.ని.) పొగడ్తలకు పొంగిపోయేవాడు, ఏదైనా చేసేవాడు అని అ.సం.సా; రా.మాం. (పుట. 14)

"ఊరివారి నెల్లా మెచ్చే వుబ్బరికాఁడవు

కారణము లేకే వచ్చే గండికాఁడవు" 24-324
"గబ్బి నా నోరను నిన్నుఁ గరకు లెల్లా నాడక
ఉబ్బరివై తిట్టకేల వుండేవు నీవు" 22-345
"పట్టివాఁడు చక్రము ఉబ్బరి కాలనేమి మీఁద"
15-208
"గబ్బరైన యాటది గక్కనఁ గౌఁగిట నించు
ఉబ్బరియైన యాఁటది వొడివట్టును" 2-334

**ఉబ్బరికత్తె:** (ఉబ్బు + అరి = ఉబ్బరి; ఉబ్బరి + కత్తె) సంతోషం కల స్త్రీ, గర్వం కల స్త్రీ.
"గుబ్బలు నీ సారెలంటాఁ గూడి పట్టే వౌనంటే
వుబ్బరికత్తె యనుచు నుప్పటించరా" 12-399

**ఉబ్బరికాఁడు:** (5) వి. (ఉబ్బు + అరి – ఉబ్బరి; ఉబ్బరి + కాఁడు) గర్విష్ఠి, సంతోషి, పొగడ్తలకు పొంగిపోయేవాడు, ఏదైనా చేసేవాడు అని రా.మాం. (పుట 15)
"నవ్వులెన్ని నవ్వినాను ననుపు సేసుకొనీని
వువ్విళ్లూరి జడియఁ డుబ్బరికాఁడు" 25-305
"గబ్బి నా నోరను నిన్నుఁ గరకు లెల్లా నాడక
ఉబ్బరివై తిట్టకేల వుండేవు నీవు" 22-345

**ఉబ్బరిచిత్తము:** వి. గర్వం కల చిత్తం.
"వొగరు పీడెపుమదము వుబ్బరిచిత్తపు మదము
బిగియనేఁటికి నీకుఁ బ్రియమౌనో కాదో" 14-53

**ఉబ్బరితనము:** (ఉబ్బరి + తనము) వి. 1. సంతోషం, ఆనందం 2. గర్వం
"ఉబ్బరితనములకు వోపేవాఁడవు గనక
గొబ్బున నన్నేలి యీకాఁ గొలిపించితివి"
25-440
"నేరుపునఁ జెమటతో నిలువునఁ గొలువుసేసి
పూరఁబోసీఁ దమకము లుబ్బరితనానను"
28-104

**ఉబ్బరిమందు ముద్ద:** వి. చంద్రుడు. ఉబ్బుగా పైకి వచ్చిన ఓషధీశుడు, అమృతకిరణుడు అని వ్యుత్పత్తి.
"కూడపెట్టి దాఁచినట్టి కూడేటి బుద్ధి
ఓడక జలధిపాలి వుబ్బరిమందుముద్ద" 27-549

**ఉబ్బసపోక:** (ఉబ్బసము + పోక) వి. అలసిపోవడం.
"వుబ్బసపోక నేనే వుస్సురంటి నొకమాట
గొబ్బునఁ దనమీఁది కోపమా యిది" 19-507

**ఉబ్బసపోవు:** అ.క్రి. అలసిపోవు.
"వురుమున నీ కెంత వుబ్బసపోకుంటెను
అరుదుగాఁ బడగసా లాడుదము రమ్మా"
21-344

**ఉబ్బు:** వి. 1. సంతోషం 2. ఆధిక్యం 3. విజృంభణం 4. ఉత్సాహం 5. ఉబ్బటం 6. వ్యాధివిశేషం 7. జనశ్రుతి 8. గర్వం
"గబ్బితనొలొద్దుఁ గాని కదిపి వినయముతో
వుబ్బురేఁ చూరక పాదాలొత్తఁ గదవే" 28-87

**ఉబ్బుసగ్గులు:** వి; బహు. హెచ్చుతగ్గులు.
"కలిమి గలదని వుబ్బవలదు, కడగి లేదని సగ్గవలదు" అని అన్నమయ్య ప్రయోగం.
"యేతుల వుబ్బుసగ్గులు యిలమీఁద నాతనికి
చైతన్య మెప్పుడీతఁడు సింగారవిభుఁడు గాని"
3-114
"నెలవై ఉబ్బుసగ్గులే నిచ్చలు లోటును బాటు
బలువైన యాశే బడబాగ్ని" 2-56

**ఉమరఁబడి:** వేడిమి.
"అమరఁగ నంతలో వాయవ్యాస్త్రి మేయఁబోలు
వుమరఁబడి నిట్టూర్పులొగి రేఁగెను" 7-407

**ఉమరఁబెట్టు:** స.క్రి. మగ్గఁబెట్టు.
"జమళి నింతి చన్నుల సాములు సేయఁగరాదా
వుమరఁబెట్టి వలపు వొడి నించుకొనేవా" 7-401

**ఉమి నాకే చవుతాలు:** ప.బం; వి. 'ఉమ్మి నాకి చవిచూచుట' అని సంపాదకులు భావించినారు. శృంగారం పరమావధి కాదనటం.
"చో యయ్యో యిదియెల్లా వుమినాఁకే
చవుతాలు
చాయల శ్రీ వేంకటేశు శరణను జీవా" 2-157
"లేవే నేఁబిలిచితే లెక్కసేసీనా తాను
చావివోయ వుమినాకి చవుతమా ఇఁక" 26-61

**ఉమురుఁగూటము :** (ఉమురు + కూటము) వి.
ఈ పదం ఏ నిఘంటువుల్లోనూ లేదు.
తమిళంలో ఉమరి, ఉమిరి అంటే నత్త కనుక
దీనికి నత్త గుల్ల గుంపు అని అర్థం కావచ్చునని
ఊహింపబడింది. (సం.ప.స. 14సం.) కాని ఈ
అర్థం ప్రయోగాల్లో పొసగడంలేదు. 'ఉమురు'
పదానికి ఉక్కబోయు అనే అర్థం
పొసగుతుందేమో? ఉమురుఁగూటము అంటే
ఉక్కబోసే కూటమి అని అర్థం. ఉమురు
వెన్నెల అనే చోట కూడా ఉమురు అంటే
ఉక్కబోయు అని అర్థం.

"ఉమురుఁగూటాన నా వొడిపట్టి పెనఁగేవు
చమురు చిందీ నోయి జగడగాఁడ" 7-474

"తమక మెటువంటిదో తలపోఁత వలపులు
వుమురు కూటములై వున్నవి లోలోనను"
14-448

"అమర శ్రీవేంకటేశ ఆపె నింతకుఁ దెచ్చితిమి
ఉమురుకూటపు నిన్ను నొడఁబరచేదా" 25-350

**ఉమురువెన్నెల :** వి. ఉక్కబోసే వెన్నెల ;
విరహులకు వెన్నెల ఉక్కగా ఉండడం
సహజమే.

"వుమురువెన్నెలకు గాకూహింతు నిన్నుఁ
బైకొన
భ్రమసి నీవే నేనని భావించి వూరకుందు"
12-190

**ఉమ్మ :** వి. 1. ఉక్క, వేడి 2. దుఃఖం.

"కొమ్మా నీ కురులు చూచి గుంపుఁదుమ్మెద
లనుచు
ఉమ్మలూర మదిలోన నులికెనయ్యా"
10-2-105

**ఉమ్మగాలి :** వి. వేడిగాలి.

"ఉమ్మగాలి విసరఁగా నొంటి నే బండితి నింతే
అమ్మరో నీతోనే నలుగఁజూమ్మీ" 21-494

**ఉమ్మగించు :** స.క్రి. ఆవిరిచే ఉక్కపెట్టు,
ఉక్కగానుండు.

"నిండుఁబరితాపమున నీలపు మణులమేడ
నుండరాక దేహమెల్ల నుమ్మగించరాదా" 6-75

**ఉమ్మడివయసు :** వి. యౌవనం. (?)

"నమ్మికలలోనివే నానాటి వొడఁబాట్లు
ఉమ్మడివయసులోనే వొద్దికలెల్లా" 21-103

**ఉమ్మదము :** వి. ఉమ్మ, ఊష్మము,
ఉక్కపోయడం.

"విడువదు మదము విరహమే ఉమ్మదము
జడిసే నా మేన నిదె సరినేమి సేతునే" 27-35

"కలువ కనుచూపులఁ జలువలు చల్లవే
తలపోఁత వుమ్మదాల దైవార నేఁటికే" 27-576

**ఉమ్మల మోనము :** వి. (?)

"వుమ్మలమోనానఁ బతికుండెఁగా నా సగవు
అమ్మరో యాతఁడు మాటలాడినదాఁకా" 9-52

**ఉయ్యాలగంభము :** వి. తిరుమలలో స్వామి
యెదుట ఏర్పాటుచేసిన ఉయ్యాలస్తంభం,
డోలోత్సవం జరిగే ప్రదేశం కావచ్చు. ఇట
తమకు కలిగిన సంతానాన్ని ఉయ్యాలలో వేసి
స్తంభానికి కట్టి స్వామికి సమర్పించి మరల
స్వామికి ధనమిచ్చి ఆ సంతానాన్నే కొనుక్కునే
ఆచారం ఉండేదట. 5-172

"జనులు నమరులును జయలిడఁగా
ఘనుఁడదె వుయ్యాలగంభముకాడ" 1-320

**ఉయ్యాలపిన్నది :** వి. చిన్నవయస్సుగల బాలిక.
ఉయ్యాలలో ఊగే వయస్సుగల బాలిక అని
వ్యు.

"చెయ్యారాఁగూడిన శ్రీవేంకటేశుఁడే కదే
వుయ్యాల పిన్నదానవా వొదగె నీ చన్నులు"
29-261

**ఉయ్యాలమంచము :** (14) వి. గొలుసులు మొ॥
వాటి ఆధారంగా ఊగే మంచం.

"కొయ్యతనము నిట్టె కోనేటిరాయనిఁ గూడి
వుయ్యాలమంచము మీఁద నోయమ్మా"
5-328 & 6-102

**ఉరికివచ్చు :** అ.క్రి. పఱుగెత్తుకొనివచ్చు.

"ఇల్లురికివత్తురా యెవ్వరైన సవతులు
మెల్లమెల్లన నీవు మేకులేల సేసేవే" 7-431

**ఉరిసిన పుండుపై పుష్పులు వెట్టు :** (2) ప.బం; అ.క్రి. అసలే బాధపడుతున్నవారికి మరింత బాధ కలిగించు, గోరుచుట్టుపై రోకటి పోటు వంటిది.

"ఒప్పెలర మా వురిసిన పుండ్లు
ప్పులు పెట్టించె నుద్ధవుఁడా" 5-56

**ఉరిసినమీద ఉడుకులు :** ప.బం; వి; బహు. (?)

"నెరజాణ విన్నిటాను నీ వేడ నే నేడ
వురిసిన మీఁద నింక వుడుకులునా" 7-303

**ఉరిసినయందు (పుండు) పై నుడుకు చల్లు :** ప.బం. అసలే బాధపడుతుండగా మరింత బాధ కలిగించు; గోరుచుట్టు పై రోకటి పోటు వంటిది. 'ఉరిసినపుండుపై పుష్పులు చల్లు' కూడా ఇటువంటిదే.

"పన్ని ఉరిసినయందుపై నుడుకు చల్లినట్లు
యెన్న మాతో మేకు సేసే వీక నేలయ్యా" 9-33

**ఉరుఁదాళ్లు :** వి; బహు. పాలు పితికేప్పుడు ఆవుకాళ్లకు కట్టే తాళ్లు, బంధములు.

"ఉదుటుఁగాంక్షలలోని వురుఁదాళ్ళే కావా"

**ఉరుకు :** అ.క్రి. 1. పరుగెత్తు 2. వెలికివచ్చు 3. దుముకు, అతిశయించు.

"సుదతి నిన్నుఁ జూచే చూపులు" 21-391

"సంతపాన నిన్నుఁజూచి సరసమాడి నంతలో
దొంతుల కురుకఁడుగా దొరకొని మరుఁడు" 9-7

**ఉరుటుఁబాయము :** (ఉరుటు + పాయము) గట్టిప్రాయం, యౌవనం (?), పొంగువయసు.

"పరగ తురుము జారె పచ్చిపులకలు మీరె
వురుటుఁబాయము సతి కొమ్మదాయను" 26-4

**ఉరుటు :** విణ. దృఢమైంది, గట్టిది. క. ఉరట, ఉరటు, ఉరుటు, ఉంగరము, కంపితస్వరము అని వా.ని.

"ధరఁబశుపక్షి మృగాదులు తగరోఁబుట్టుగులు
వురుటగు మా దేహంబులు వుయ్యెలతొట్టెలలు"

"వురుటై యలమేల్మంగ నురమున నించుకొని
యిరవై శ్రీవేంకటేశుఁ డెదుట నున్నాఁడు" 2-231

**ఉరుత :** వి. 'ఉదుత'కు రూపాం. ఉఱుత అని శ.ర.

"నీకుఁ దొల్లే యలవాటు నిరుహేతుకపు దయ
జోక నురుత మెచ్చిన సులభుఁడవే కా" 3-451

**ఉఱక :** 'ఉఱు' ధాతువు వ్యతిరేకక్త్వార్థక రూపం; లక్ష్యపెట్టక.

"మఱియు సురతపుఁజెమటలు జొబ్బిలఁగాను
వుఱక నాపైఁ బూసేవు వుద్దండాలా వోరి"
11-373

**ఉఱిమిచూచు :** ప.బం; స.క్రి. కోపంతో భయపెడుతూ చూచు.

"కొప్పు జారెనంటేను కొచ్చి యేల నవ్వీనే
వుప్పతిలీఁ గళంటే వురిమి యేల చూచీనే"
28-126

**ఉఱుట్లు :** పరిభ్రమణములు.

"వెఱచి బ్రహ్మాదులు వేదమంత్రముల నీ
వుఱుట్లు గొనియాడేరో చక్రమ్మా" 1-183

**ఉలికి కాలఁగ కొఱవుల జూడినట్లు :** మొదటనే ఒకబాధలో ఉండగా మరల తీవ్రమైన మరొకబాధ కలిగినట్లు.

"యెలయించి యితఁడు నన్నేల యేఁచీనే
మలినమై దేహమెల్ల మఱచినఁ దలఁపించి
వులికి కాలఁగఁ గొఱవుల జూడినట్లు" 6-167

**ఉలిపచ్చి :** (5) విణ. కొంచెంపచ్చి; నులిపచ్చి అని కూడా వ్యవహారం.

"వులిపచ్చి తలపోఁత లుమ్మగిలి వుమ్మగిలి
చెలికిఁ జుట్టరికమై చిగిరించెను" 27-594

**ఉలివచ్చి :** (7) (ఉలి + పచ్చి) కొంచెం పచ్చి; ఉలిపచ్చి, నులిపచ్చి అని కూడా వ్యవహారం.

"యెలమి శ్రీవేంకటేశునిట్టె కూడినదాన
ఉలివచ్చి సేయకుంటే వొరయుఁగఁజెల్లదా"
26-31

**ఉలివెచ్చ :** విణ. కొద్ది వెచ్చ.

"వొగిఁ బన్నీరు చల్లితే వులివెచ్చ దోఁచెఁగా
నగినగి ఆపె నీతో నాలిసేయఁగా"

**ఉలుకు** : అ.క్రి. 1. తపించు, తప్తమగు 2. అసూయపడు 3. మిరుమిట్లుగొను 4. పొర్లు
"ఉలుకుగాలి వంటిది వూరుపులది" 22-56

**ఉలుకుట్టుఁజేతలు** : వి; బహు. వెక్కిరింత చేతలు, వేళాకోళపు చేతలు. రూపాం. ఉల్లికుట్టు చేతలు.
"వులుకుట్టుఁజేతలకు నుస్సురంటా నున్న నాతో
యెలయించి నవ్వు నవ్వేవేరా నీవు" 11-384

**ఉలుప** : వి. కానుక, ఉపాయనం, గృహప్రవేశం చేసేప్పుడు ఇచ్చే బలి. రూపాం. ఉలుపా.
"కట్టరో కలువడాలు గక్కన వాకిళ్లను
పట్టరో వులుపలు శోభనద్రవ్యములును" 25-432

**ఉలుపా** : వి. ఉపాయనం, రాజాదుల కిచ్చే కానుక.
"ఉవ్విళ్లూరఁ దనమోవి వులుపా వట్టి" 21-228

**ఉల్లి దిన్న కోమటి ఊరకున్నట్లు** : లోకోక్తి; చెడ్డపని చేసినవాడు తన చెడ్డపనిని దాచుకోవడానికి ప్రయత్నించినట్లు - ఉల్లివాసన వస్తుందేమోనని మాట్లాడక నోరుమూసుకుంటాడనే అంశం పై వచ్చిన లోకోక్తి.
"ఉల్లిదిన్న కోమటూరక వున్నట్లు
అల్లెడ నావాలు జారిపోయినట్లు" 2-494

**ఉవ్విళ్ళు** : అశ. (త్వర, తహతహ)
"ఉవ్విళ్లవలె నోరూరించి పగటుల
నివ్వటిలుట వో నేరుపు విభుని" 13-88
"దవ్వుల సరసములు తగునా నీకు
వువ్విళ్లై మేన నొచ్చమున్నవానివలెను" 9-19

**ఉవ్వు** : అ.క్రి. చిప్పిలు.
"ఉలిపచ్చి మోవితేనె లువ్వుచు నువ్విళ్లూరె
మలసి నీ పతి నీతో మాఁటాడె నటవే" 28-89

**ఉసురసురను** : ప.బం. 1. మిక్కిలి బాధపడు, శోకించు 2. తాపంతో, కోపంతో వచ్చే నిశ్శ్వాసధ్వనికి అనుకరణం.
"వొట్టులు వెట్టుక లోలో నుసురసురనుకంటే
చుట్టరిక మే పాటైనా సుకము దక్కు" 22-519

**ఉసురసురు** : వి. తాపమునందగు నిశ్వాసధ్వనికి అనుకరణం. ఆపసోపం.
"కుమ్మరించి నీ యెదుట కుప్పలు వోసిని
వుమ్మగిలు కోరికలు ఉసురసురుఁగాఁకలు" 18-426
"వూటురేగెఁ జెమటలు వుసురసురులు రేఁగె
బూటకపుఁ జలమింతే బొంకనేలే యిఁకను" 14-359

**ఉసురు** : వి. తాపంతో వచ్చే నిశ్వాసధ్వనికి అనుకరణం.
"ముక్కున ఉసురులు చెక్కుల యసరులు" 9-91
"నవ్వుచు నీ కొంగువట్టి నా యింటికిఁ దీసితేను
వువ్విళ్లూర దిగులుతో నుస్సురనేవు" 13-434

**ఉసురుగొను** : సేదదీర్చు కొను.
"ఉగ్గున రేపల్లె వుసురుగొనేటి వాని
దగ్గరి తమకానఁ దడవీనయో" 5-261

**ఉసురుతోడి సుఖము వుండిన పాటే చాలు** : లోకోక్తి.
"బ్రతికి యుండిన సుఖములు బడయవచ్చు"
"జీవన్ భద్రాణి పశ్యతి" అని భావం.
"వుసురుతోడి సుఖము వుండిన పాటే చాలు
కొసరి జన్మములింకాఁ గోరనోప నేను" 3-7

**ఉసురునూరుపు** : (ఉసురు + ఊరుపు) ప్రాణవాయువు.
"వెస పీడుదోడాడే పీడెములఁ బచ్చిదేరి
వుసురునూరుపులతో నున్నాఁడు వీఁడె" 24-157

**ఉసురుమాను** : వి. ముష్టిచెట్టు.
"ఉసురుమానై పుట్టి వుండనైనవచ్చుఁగాక
విసువక వీరి వారి వేసరించవచ్చునా" 1-397

**ఉసురెక్కు** : ప.బం; అ.క్రి. (?)
"ఉసురెక్కఁగదె దీని యొరపు నూరుపుల
పొసఁగి వేంకటపతి పొందు దెలిపెడిని" 4-13

**ఉస్సురను** : (14) అ.క్రి. బాధపడు, శోకించు,

దుఃఖంతో వచ్చే నిశ్శ్వాసధ్వనికి అనుకరణం.

**ఉస్సురస్సురను :** వ.బం; అ.క్రి. 1. మిక్కిలి బాధపడు, శోకించు 2. తాపంతో వచ్చే నిశ్శ్వాసధ్వనికి అనుకరణం.
చూ: ఉసురసురను.

"సింగారపుఁదోటలోన చెలిని దవ్వులఁజూచి
అంగపుఁజెమట నుస్సురస్సు రనేవు" 7-146

**ఉస్సురుస్సురను :** బడలికతో నిట్టూర్పు పుచ్చు, మిక్కిలి బాధపడు, శోకించు.
చూ: ఉస్సురస్సురను.

## ఊ

**ఊఁకొను :** స.క్రి. 1. అంగీకరించు, సమ్మతించు 2. కథాదులు, ఊఁ అంటూ విను ; అ.క్రి. ఊఁ అను.

"ఆఁకలు సేయక నీకు నట్టె నే లోనైతిఁగాక
వూఁకొననైన రతికి నుద్యోగము వుట్టునా"

11-59

**ఊఁచదు వాఁచదు :** సంకోచించదు అనే అర్థం లోని లోకోక్తి.

"ఆఁచి కాఁగిలించి కూడి అంగడిఁబెట్టీ సిగ్గులు
ఊఁచదు వాఁచదు సూడు వోయమ్మ తాను"

27-570

**ఊఁటాడు :** అ.క్రి. గట్టిగా కదలు, సంభ్రమించు.

"గుబ్బలచెమటల పయ్యెదకొనకొంగున నల్లార్చుచు
ఉబ్బున గమనావస్థల నూఁటాడెద వేలే" 5-164

**ఊఁటుకొను :** స.క్రి. పొడుచుకొను.

"అండ నూఁటుకొన్న కాయలట్టె నేఁ బరాకైతే
పండెనంటాఁ బడదొబ్బి పట్టనియ్యఁడే" 7-420

**ఊఁదు :** (5) స.క్రి. నొక్కు, ఒత్తు, గిల్లు, అదుము, గుచ్చు, నాటు, అను, నిలుపు, మోపు.

"గుమితాన నవ్వు నవ్వి గోరనూఁదెను" 25-260

"కమ్మటి నీ కుచములు కడుఁబిసికె నంటాను
కుమ్మెలు వో నూఁదకువే కొనగోర నిపుడు"

29-137

**ఊఁపె :** వి. (?)

"లోపలికి వెలికిని లోఁగి యెడ తాఁకేటి
వూఁపెల ముక్కుకొన వుసురింతే తనవు"

15-187

**ఊకొంటేఁబైడికత :** వ.బం; వి. (?)

"ఊరకుండితే మేలు వూఁకొంటేఁ బైడికతాను
బారపెట్టితే నలపు పచ్చిదేరె నందువు" 7-478

**ఊకొను :** ఊకొట్టు, 'ఊఁ' అను.

"వద్దనుండి ఊకొనేటివారు గలిగితే నీవు
సుద్దు లెన్నైనా జెప్పేవు సూటివడను" 17-223

**ఊటచెలమ :** వ.బం; వి. తఱుగనిది, చెలమలో నీరు వినియోగమయ్యే కొద్దీ తిరిగి ఊఱుతూనే ఉంటుంది.

"కందువ శ్రీవేంకటేశ కరుణించవయ్య యింక
పొంది వూట చెల మాయఁ బుట్టుగుల సివము"

4-417

ఇందులోని వూఁట వూ(ఊ)ట కావచ్చు.

**ఊటలెత్తు :** అ.క్రి. ఊటలుగా స్రవించు, చెమ్మ కలుగు.

"యెలిమి శ్రీవేంకటేశ యెదురీఁత కాఁగిట
వులివచ్చి యానందాన నూటలెత్తును" 18-47

**ఊటవట్టు :** (ఊట + పట్టు) అ.క్రి. చెమ్మ కలుగు.

"ప్రేమముతోఁ గేదారి పెరిగి పండినపంట
తేమ రేఁగి ఊటవట్టె తిమ్మనాయఁడా"

4 అను 47

"వుద్దండాలు రాచకూఁతురు లోరిచి
యెట్టుండిరో
గద్దరివై వూరూరి కాఁపురాల వాఁడవు" 8-256

**ఊటు :** వి. వానచినుకులవల్ల కలిగిన చెమ్మ.

"ఊరనూర నూటు లాయ నువిద తమకములు
గోర గీర నేరులాయ కూరిములు" 29-402

**ఊటుకూరి కోనేటిరాయఁడు :** వి.
ఊటుకూరుగ్రామంలో వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామి. చూ: ఊటుకూరి కోనేటిరాయఁడు.

"కోరిక లీడేరె నేఁడు కోనేటిరాయ ! ఇట్టి
కూరిముల వూటుకూరి కోనేటిరాయ !" 26-299

**ఊటుకూరి చెన్నరాయడు :** వి. అన్నమయ్య జన్మస్థలమైన రాజంపేట తాలూకాలోని తాళ్ళపాకకు అర ఆమడదూరంలో ఉన్న ఊటుకూరులో వెలసిన చెన్నరాయఁడు. అన్నమయ్యతాత నారాయణసూరి విద్యనభ్యసించడానికి వచ్చిన గ్రామ మిదియే. ఇది రాజంపేటకు పరువు దూరంలో తిరుపతి రోడ్డుపై ఉంది. ఊటుకూరు తమ బంధుగ్రామం కావడం వల్లా, సమీపంలో ఉండడంవల్లా తాళ్ళపాకవారు తఱచు ఆ గ్రామం పోతూ అందలి చెన్నరాయని దర్శిస్తూ సేవిస్తూ ఉండిఉండ వచ్చును.

"పెనఁగుచు నీ విట్టి ప్రియములు నెరపేవు
వునుపుఁజేతల వూటుకూరి చెన్నరాయ"
10-24

**ఊట్లెత్తు :** (ఊట్లు + ఎత్తు) ప.బం; అ.క్రి. ఊటలుగా స్రవించు.

"చెక్కులపై చెమటలు చిరుమోవి తేనెలు
వొక్కమాటే చెలరేగి మాట్లెత్తెనే" 18-11

**ఊడిగకాఁడు :** (3) (ఊడిగము + కాఁడు) వి. సేవకుడు, పరిచారకుడు, ఊడిగం (సేవ) చేసేవాడు.

"వెరవున నీ చెవిలో విన్నపాలు సేయుకంటే
ధర నీ వూడిగకాండ్లఁ దలపించు టెక్కుడు"
2-483

**ఊడిగపుకాంత :** (ఊడిగము + కాంత) వి. సేవకురాలు, పరిచారిక, ఊడిగం (సేవ) చేసే స్త్రీ.

"లలి నూడిగపుకాంతలను సన్నసేసుకొంటా
పొలసి నీవేఁగి రాఁగాఁ బొగడే రిందరును"
18-321

**ఊడిగపుటాపె :** (ఊడిగము + ఆపె) వి. పరిచారిక, సేవకురాలు.

**ఊడిగపుటింతి :** (ఊడిగము + ఇంతి) వి. సేవకురాలు, పరిచారిక.

"యిరుమేలా నూడిగపుటింతులు సేనాసేన
యెరవు లేక యిందరినెట్టు మన్నింతువయ్యా"
25-123

**ఊడిగపుది :** (ఊడిగము + అది) వి. సేవకురాలు, పరిచారిక, ఊడిగం చేసే స్త్రీ.

"వోప ననవలెనా వూడిగపుదాన నేను
చేపట్టి నట్టిల్లా నీకె చెల్లెఁగాక" 14-171

**ఊడిగపువారు :** (13) (ఊడిగము + వారు) వి; బహు. సేవకులు, పరిచారకులు, ఊడిగం చేసేవారు.

"లలి నూడిగపువారు తెలియ నిన్నడిగితే
పొలసి బొంకుచుఁ బతికి పూనుక వచ్చేవు"
14-83

**ఊడిగపువెలఁది :** (ఊడిగము + వెలఁది) వి. సేవకురాలు, పరిచారిక, ఊడిగం(సేవ) చేసే స్త్రీ.

"పంతమిచ్చి నా కేల బాసలు సేసే విప్పుడు
ఎంతవారా వూడిగపువెలఁదులు మనకు"
20-532

**ఊడిగాలకాంత :** వి; బహు. పరిచారిక, ఊడిగం చేసే స్త్రీ.

"అయ్యయ్యో పాపముగాక ఆదరించవచ్చునా
గయ్యాళిని వూడిగాలకాంతల నెందు" 17-27

**ఊడిగాలవారు :** (3) (ఊడిగాలు + వారు) సేవకులు.

"అప్పటప్పటికి నింతు లలిగి వుండేవేళ
కప్పురవిడె లూడిగాల వారిత్తురా" 17-174

**ఊదు :** (4) స.క్రి. నొక్కు, ఒత్తు. ఈ అర్థంలో అన్నమయ్య అర్ధబిందురహితంగా కూడా ప్రయోగాలు చేసినాడు. చూ: ఊఁదు.

"చన్నుల నూదితేను పాదించినటులయ్యా
యెన్నికలిట్టివి నేనేమి సేతునే" 12-478

**ఊరఁగతలు :** (2) వి; బహు. ఊరిముచ్చట్లు.

"లలి నిన్నుఁ బెండ్లాడ లగ్గము పెట్టుకుండఁగ
బలిసి యేమి వినేవు వూరఁగతలు" 22-306

"తేనె గారే అధరపుతేనెలు నీ తలకెక్క

వీనులు వూరఁగతలు వినఁగూడీనా" 27-298

**ఊరఁగూటము:** వి. వేర్వేరు ఊర్లవారు ఒక ఊరిలో కలియుట ఊరఁగూటమని లాక్షణికముగ వాడినట్లున్నది. పరస్పరము సంబంధము లేని పదార్థములు ఒకచోట కలియుటకు ఈ వ్యవహారము ఆనాడుండిన దేమో! అని సం.ప.స. లో వివరింపబడింది.

"ఎక్కడి కెక్కడ మరుఁడేలికలు యిన్నిటికి
యిక్కువల నూరఁగూట మెట్టు గూడెనే" 23-44

**ఊరఁగూటములవారు:** వి; బహు. ఒకచోట చేరిన వేర్వేరు ఊర్లకు చెందినవారు.

"ఊరఁగూటములవారు వొద్ద నెంత వుండినాను
యేరా నీ వీఁపుమీఁద నెక్కి వుండఁగలరా"
23-313

**ఊరఁజుట్టము:** ప.బం; వి. స్త్రీలంపటుడు, వ్యభిచారి; ఊరికంతకూ చుట్టమని వాచ్యార్థం.

"యెగసక్కెపు శ్రీవేంకటేశ వూరఁజుట్టమవు
సొగిసి మమ్మేలితివి జోడుగాక మానేవా"
14-183

"ఊరఁజుట్టపు శ్రీవేంకటోత్తముఁడైన వానికి
యే రీతిఁ దమి రేగి నేమి చెప్పేవే" 7-241

**ఊరఁబసులు:** వి; బహు. ఊరిపశువులు; పశువులు అనడానికి పసులు అనేది జానపదవ్యవహారం.

"కావించిన యల కామధేనువుల
కేవి యూరఁబసు లీడవునా" 3-350

**ఊరఁబొత్తు:** ప.బం; వి. అందరిసొత్తు.

"యీ సరినే శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁగూడె
వోసరించితే బువ్వము వూరఁబొత్తు గాదా"
2-285

**ఊరకున్నవాని మీద ఉడుకులు గట్టు:** ప.బం; అ.క్రి. ఊరకున్నవాని మీద కోపం చూపు, బాధ కలిగించు.

"ఊరకున్నవానిమీఁద నుడుకులు గట్టేమా
దారతప్పక తనంత తా నుండరాదా" 14-77

**ఊరకున్నవారికి వుడుకులు గట్టు:** ప.బం; అ.క్రి. మౌనంగా ఉన్నవారికి బాధలు కలిగించు.

"ఊరకున్నవారి కేల వుడుకులు గట్టేవు" 17-335

**ఊరకున్నవారి కూరోపదన్నట్లు:** నానుడి; మౌనంగా ఉంటే కలహాలు రావన్నట్లు.

"ఊరకున్నవారి కూరోపదన్నట్లు
నేరనైతి నే నింక నిన్నేల కొసర" 19-540

**ఊరగుంత:** వి. రొచ్చుగుంట వంటిది.

"బంతి గాఁగ నెల్లవారుఁ బందేటి మంచ మూర
గుంతలో విరుగఁదోసి కూళఁడెవ్వఁడో" 5-154

**ఊరదయివము:** వి. గ్రామదేవత, చిల్లరదేవత. (వ్యం)

"చేరి యీతఁడే శిక్షించ రక్షించ
వూరదయివములు వొగి నితని సరా" 3-529

**ఊరదోమటి:** వి. (?)

"తొలఁగు సిగ్గుల నూరదోమటాయ వలపు
అలరి దొడ్డిపెంటల నామనాయ వలపు" 22-305

**ఊరపొత్తు:** అందరికీ అందుబాటులో ఉండేది.

"యీ సరినే శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁగూడె
వోసరించితే బువ్వము వూరఁబొత్తు గాదా"
2-285

**ఊరబావ:** వి; ప.బం. స్త్రీలంపటుడు, ఊరందరికీ బావ అనే దానినుండి ఏర్పడిన పదబంధం.

"వోపల వలపు చల్లి వూరబావవైతివి
కావించి మమ్ము నేలి మగఁడవైతివి" 12-540

**ఊరవదినె:** వి; ప.బం. పురుషలంపట, వాడవదినెవంటి పదం.

"ఇది యేమె పీని గుణ మెటువంటిదే
వదలక నవ్వ నూరవదినెనా నేను" 10-2-89

**ఊరవిందు:** ప.బం; వి. జారుఁడు.

"సందడి వలపించి జవరాండ్ల వూర
విందవైన యట్టి వేడుకకాఁడ" 10-2-82

కార్యాలపట్ల ఊరందరినీ పిలిచి చేసే విందు :

"పచ్చిదేరీ నీ మాటలు బతుకవయ్యా

విచ్చనవిడిని వూర విందులాయ వలపు"
13-60

**ఊరివారి యింతి :** వి. జారిణి, కులట.
"ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁదుటారాలఁ
బేరుకుచ్చి పొలయుచుఁ బిసాళించేవు" 5-3

**ఊరుపుగాలి :** (5) వి. నిశ్శ్వాసవాయువు.
"వొప్పగుఁ బ్రాణము లవి వూరుపుగాలి వెంట
యెప్పుడు లోని వెలికి నెడ తాఁకును" 1-434

**ఊరులేని పొల(లి)మేర :** ప.బం; వి. అసంభవం, లేనిది. ఊరే లేనప్పుడు ఆ ఊరికి పొలిమేర ఉండదుకదా! ఆధారం లేని వార్త అని సంపాదకులు (పీఠిక. 5.సం. 32 పు.) గ్రామో నాస్తి కుతః సీమా.
"ఊరులేని పొలమేర వొడలు మోచుకొని నేము
తేరదేహ మెక్కుకొని తిరిగేము" 1-73
"ఊరులేని పొలిమేర పెంపు లేని బతుకు
గౌరవంబు లేని ప్రియము కీ దయ నేటికే"

**ఊరు వాడెడు చెలమ :** ప.బం; వి. 1. వేశ్య, భోగం స్త్రీ 2. సులభగమ్యం, ఊరందరూ నీళ్ళు తెచ్చుకునే చెలమ అందరికీ అందుబాటులో ఉంటుంది.
"ఒడలిపై నీ చెమట వూరువాడెడు చెలమ
జడియు నీ తమకంబు సంతతగరు" 5-75

**ఊరూరి కాపురాలవాఁడు :** ప.బం. జారుడు.
"ఉద్దండాలు రాచకూఁతురు లోరిచి యెట్టుండిరో
గద్దరివై వూరూరి కాఁపురాలవాఁడవు" 8-256

**ఊర్పుగాలి :** వి; చూ: ఊరుపుగాలి.
"ఒక్క చిత్తమేల యౌను వూర్పుగాలి విసరఁగా
చిక్కి గుణత్రయము చేఁజెదరుఁగాక" 4-61

**ఊళిగకాఁడు :** (ఊళిగము + కాఁడు) వి. ఊడిగకాడు, సేవకుడు, పరిచారకుడు.
"జపితఁగాను, శాస్త్రిఁగాను, వుపదేశపు
గురువూళిగకాఁడ" 4-212

**ఊళిగము :** వి. ఊడిగము, సేవ.
"పీఁడెమిచ్చు తినే విన్నపాలెల్లాఁ జేసి
వూళిగపువేళనే వొడఁబరచె" 22-376

**ఊసివాసులు :** వి; బహు. నిఘంటువుల్లో కానరాదు. నిఘంటువుల్లో ఊసివాసము అనే పదం కనిపిస్తుంది. దానికి ఈర్ష్య, అసూయ, ద్వేషం అని అర్థాలు. 'ఊసువాసులు' కావచ్చునేమో! 'ఊసులు వాసులు' అంటే కాలక్షేపం కబుర్లు, గొప్పలు అని అర్థం. ఇది ఈ సందర్భంలో సరిపోతుంది. వ్యత్యాసాలు, ఈర్ష్యా ద్వేషాలు (ఊసివాసము = వ్యత్యాసము. (బ్రౌన్) పుసి, హుసి = అబద్ధము అని కన్నడము. అదియే ఊసి యైనచో ఊసివాసులు = అసత్యములైన విలువలు కావచ్చును. ఊసివాసి ఏ.వ.
"వూడిగము సేసేవారు వూసివాసు లెంచరు
జోడై తమమేనులు సోఁకింతురు" 21-301
"ఊసివాసు లెంచక వొగి నన్ను వేఁడుకొనె"
21-390
"మన్నన గలుగువారి మాటలెల్లాఁ జక్కనే
వున్నవారి మాట లెల్ల నూసివాసులే" 14-377
"మన్నన గలుగువారి మాటలెల్లాఁ జక్కనే
ఉన్నవారి మాటలెల్ల నూసివాసులే" 14-377

**ఊహాపోహలు :** (ఊహ + అపోహ) ఆవశ్యకమైన దానిని తెచ్చుకొని అనావశ్యకమును వదలుట.
"కోరినట్టే నిన్నుఁగూడె కొమ్మఁ గూడితివి నీవు
యిరీతి మీ వూహాపోహ లెవ్వఁడెఱుఁగు"
21-36

## ఎ

**ఎంగిలి :** వి. పరస్త్రీ సంగమమనే అపవిత్రత.
"ఈకడ ననుఁగూడి యెంగిలితోనే పోయి
వాకిట నాపెఁగూడి వచ్చితి విట్టే" 7-430

**ఎంగిలించు :** ఎంగిలి చేయు.
"మోసాన జలనిధికి మునినోరి యెంగిలినే
వూసివాసి నోరు తనవొద్ది యెంగిలించీనా"
22-17

**ఎంగిలికిఁ జేతులొగ్గు :** ప.బం; అ.క్రి. ప్రసాదానికి చేతులు చాచు, దానోహమను.

"వేవేగ బిడ్డల పేర్లు విభునికిఁ బెట్టరో
వోవో యెంగిలికిఁజేతులొగ్గరో రక్షించీని" 7-11

**ఎంగిలికి పొత్తుగూడు :** చుంబనాది శృంగారచేష్టలకై జతగూడు.

"కాంతలమోవి తేనెలు కైకొనేటి వేళను
పొంతనుండి యెంగిలికి పొత్తుగూడ వలెను"
19-169

**ఎంగిలి దేహము :** వి. అన్య సంగమం చేసిన దేహం, అపవిత్రమైన దేహం.

"ఎంగిలి దేహముతోనే యీడకు విచ్చేసినాఁడు
యింగిత మెఱిఁగితి నన్నేల పిలిచీనే" 7-25

**ఎంగిలినోరు :** వి. ఎంగిలిగల నోరు, హేయమైన నోరు.

"కొంగువట్టి నిన్నుఁ జేరుకొన నైతినని దూరే
ఎంగిలినోరఁ బిలిచే దెగ్గు గాదా" 7-17

"ఎంగిలి నోరు వెట్టుక యే మాటలాడినాను
సంగతిగా నవి నేఁడు సత్యమయ్యీనా" 3-250

**ఎంగిలిపొత్తు :** ప.బం; వి. పరస్త్రీతో పొందు, అపవిత్రమైన పొందు, పంక్తిభోజనం, బంధుత్వం.

"పొంతనే నీ వెంగిలిపొత్తు గలపుకొంటివి
పంతాన నిందు కొగ్గించి భ్రమయించెఁగా" 7-34

"సంగతిగా నప్పటిని సారె విడెమిచ్చుకొంటూ
ఎంగిలిపొత్తు గల నీ నెంత చుట్టరికమో"
18-130

"ఎంగిలి పొత్తుకు వచ్చీ యేడనైనాఁ దమకించీ
అంగవించి సోబనపు టక్షత లిప్పించెనా"
18-487

**ఎంగిలి పొత్తుల మాటలు :** (?)

"రంగుగా నీవున్నచోటు రాతిరే వింటిమి నేము
యెంగిలి పొత్తుల మాట లీడనేలా" 9-231

**ఎంగిలిపొత్తువారు :** ప.బం; వి; బహు. బంధువులు.

"ఎంగిలిపొత్తువారము యిద్దరి యెడకు నేము
వుంగిట నే మే మనినా నోరుచుకోరయ్యా"
13-202

**ఎంగిలిబూరెను కడుగు :** అ.క్రి. వ్యర్థమైన పనిచేయు.

"కడుగఁగ నేటికి నెంగిలి బూరెట
కడవేయ నేల (?) నారాయణా"
3-257 & 2-494

**ఎంగిలి బూరెను గడుగు :** వ్యర్థ ప్రయత్నం చేయు.

"కడుగఁగ నేటికి నెంగిలి బూరెలు
కడ వేయనేల నారాయణా!" 3-257 & 2-494

**ఎంగిలి మనుజులు :** ప.బం; వి; బహు. నీచమానవులు, కక్కుర్తి గలవారు, విటులు.

"అంగనల రతుల యాసల నీడేటి
యెంగిలి మనుజుల కగ్గేది" 5-257

**ఎంగిలిముద్దు :** (?)

"ఎడుపించకు రేయమ్మా యెంగిలి
ముద్దిచ్చేమంటూ
చూడఁచిన్నవానితోడ సుద్దులింతేలే" 22-70

**ఎంగిలిసేయు :** ప.బం; స.క్రి. దంతక్షతాదులచే స్పృశించు, బలాత్కరించు.

"అంగన విచ్చేసి నేఁడు ఆయమైన నీ మోవి
యెంగిలి సేసినదట ఇది నిజమా" 21-61

**ఎండఁబడ్డ నీడఁగోరు :** దుఃఖాన్ని అనుభవించినపుడు సుఖాన్ని కోరు.

"యెందు నెండఁబడ్డఁగాని ఇంపు నీడఁగోరఁడు
కందువ సంసారియైనఁ గాని మోక్షము గోరఁడు"
4-37

**ఎండకన్ను :** ప.బం; వి. కష్టము.

"ఎండకంట నీడకంట నేల చూచేవే యాతని"
(ఆం.వా) 20-243

"యిది నీడకన్ను యెండకన్ను మరి
కదిసి నీయందె కలిగెనట" 1-415

**ఎండకన్ను :** వి. సూర్యుడు.

**ఎండకన్ను నీడకన్ను నెఱుఁగు :** ప.బం; అ.క్రి. సుఖదుఃఖాలను తెలియు.

"నిందురాజసముతోడ నీ వాతనివద్దనుండి

యెండకన్ను నీడకన్ను నెరిగే వటే" 8-110

**ఎండకన్నువాఁడు :** వి. సూర్యుడు.

**ఎండకు నీడకుఁ దీయు :** ప.బం; స.క్రి. (?)

"పండి పొల్లవోయినా పట్టరాని మనసు
యెండకు నీడకుఁదీసి యింత కోపఁగలనా"
8-49

**ఎండచూపు :** వి. కోపపుచూపు.

**ఎండనీడ కన్నులవాఁడు :** సూర్యచంద్రులు కన్నులుగా గలవాడు.

"దుండగపు భూభారము తొలఁగదొబ్బ నీతఁడు
ఎండనీడ కన్నుల వాఁడిక నింతా మంచిది"
28-172

**ఎండనీడ కన్నులు :** ప.బం; వి; బహు. సుఖదుఃఖాలు.

"పండును గాయయునైన బలుపుల దొరవై
ఎండనీడకన్నులను యెలయించే విపుడు"
8-38

**ఎండనీడ కన్నెఱుఁగు :** ప.బం; అ.క్రి. కష్టసుఖాలు ఎరుగు, ఇల్లువెడలు.

"పండిన కెమ్మోవితోడ పైకొని నిన్నిటుగూడె
ఎండనీడ కన్నెఱఁగ విది యేమే నీవు" 14-584

**ఎండపసపు :** ప.బం; వి. అశాశ్వతం, నీరెండ పడి ఏర్పడే పసుపురంగు. పసుపు ఎండలో పెడితే రంగుమారుతుంది. అనడంపై కూడా ఈ పదబంధం ఏర్పడి ఉండవచ్చు. పసుపు కు పసపు అని వ్యావహారికరూపం.

"యిల నెండపసపాయ యింతుల ప్రియము
లెల్ల
నలువంకఁ బురుషుల నడవడి చేతను" 14-264

**ఎండమావి నీరు సేయు :** ప.బం; అ.క్రి. అసాధ్యాన్ని సుసాధ్యం చేయు.

"ఎండమావి నీరు సేసేవేమే నీవు
అండనుంటేఁ గాక దవ్వులైతే నవి గావా"
26-200

**ఎండమావుల నీ(రు)ళ్ళు :** (4) ప.బం; వి; బహు. అసంభవమైనది, లేనివి, ఎండమావులు నీళ్లుగా కనిపించినా అందులో నీళ్లుండవు.

"ఎండమావుల నీరు ఏకతపు పొలయలుక
వండఁగ వండఁగ నట్లు వలపు లెల్ల" 7-231

"సతులతో నవ్వులు చందమామగుటుకలు
మతి తలపోఁత లెండమావుల నీళ్ళు" 2-268

"యెరవెల్లఁ బాసదీఁక నేమి
మరలి వెదకు టెండమావుల నీళ్ళు" 9-154

**ఎండమావులు తాగ దగ్గరఁబోవుట :** ప.బం; వి. లేని వస్తువుకై ప్రయత్నించుట, నిష్ఫలమైన ప్రయత్నం చేయుట.

"దప్పికి నెండమావులు దాగ దగ్గరఁబోవుట
తప్పుఁజదువులలోఁ దత్త్వము నెంచుట" 2-49

**ఎండలేని నాటి నీడ :** ప.బం; వి. అసంభవం, లేనిది.

**ఎండ లేని నీడ :** ప.బం; వి. అసంభవం; ఎండ లేకుండా నీడ ఉండదు కదా!

"పండరంగినుండి వచ్చి పామరులనెల్ల మెచ్చి
యెండ లేని నీడలోన యెచ్చి యెచ్చి" 6-26

"కొండలలో నెలకొన్న కోనేటిరాయఁడు గూడె
యెండ లేని నీడ నీకు నితవేల ఆయనే" 6-44

**ఎండలోని నీడ :** ప.బం; వి. శ్రమను పోగొట్టేది.

"ఎండలోని నీడ యీ మనసు
పండు గాయసేయఁబనిలేదు" 1-337

**ఎండలో నీడలు :** వి; బహు. శ్రమను పోగొట్టేవి.

"ఎంచఁగ నెండలో నీడలు యెడనెడ
కూటములు" 1-1

**ఎండుగలు :** వి; బహు. 'ఎండుగులు' అనే పదానికి వ్యావహారికరూపం; ఎండబోసిన ధాన్యం.

"నవ్వులపండుగ లాయ ననుపు లెండుగ లాయ
యివ్వల చెంతతో పొందు లిఁక నెన్నఁడు"
7-575

**ఎంతకంతే :** (ఎంతకు + అంతే) ప.బం. తగినంత, మేరకు మేర.

"చెనక నేరుతు నంటూ చేతిగోరు దాఁకింతురా
యెనసీ మగవానితో నెంతకంతే" 27-526

**ఎంతకెత్తుకొను :** ప.బం; అ.క్రి. ఎంతపని చేయు.
"ఎంతకెత్తుకొంటివి నీవేరా వోరి
చెంతల నవ్వు నవ్వేవు చెల్లురా వోరి" 11-373

**ఎంత గుండె :** ప.బం. చాలా ధైర్యం అనే అర్థంలో వాడబడే పదబంధం.
"అట్టి దొర యాతఁడు నిన్నడిగే మాటల కెల్ల
యెట్టైన నుత్తరమియ్య వెంత గుండె నీకు"
11-171

**ఎంతవడి కెంతవడి :** (?)
"ఇంత యేఁతురా సతుల నెండాఁకను
యెంతవడి కెంతవడి యిప్పుడా నీ వలపు" 8-31

**ఎందువంక :** వి. ఏ పక్షం, ఏ వైపు.
"పుట్టుగు దూరితిమి పోరానియట్టి వేళ
కట్టఁగడ నెందువంకఁ గానమైతిమి" 3-344

**ఎకదిగు :** ప.బం; అ.క్రి. పైకి ఎక్కు – కిందికి దిగు.
"ఎకదిగఁగ కృషికుఁడెత్తు ఏతమై
అకటా కర్మము లాడించీని" 15-63

**ఎకపోయు :** ప.బం. 'ఎగపోయు'కు రూపాంతరం కావచ్చు. దుర్బోధచేయు, సూచించు (బ్రౌన్.; శ.ర)
"చాయలనే యెకపోసి సన్నల నింతోసీసి
యేయెడకుఁ బోనీవు ఇంతకంటె నేమే" 19-368

**ఎకసక్కెఁడు :** (ఎకసక్కెము + ఈఁడు) వి. మోసగాడు, పరిహాసం చేసేవాడు, అవమానించేవాడు.
"వికటించి మేనమామ వీటికేఁగి తానె చంపె
యెకసక్కెఁడు వీనితో నేఁటి చుట్టరికమే" 9-102

**ఎకసక్కెలు :** వి; బహు. ఎకసక్కెములు, మోసాలు, వంచనలు, పరిహాసాలు, వికటపుమాటలు, తిరస్కారములు, అవమానములు. ఎగసక్కెలు. ఏకసఖ్య శబ్దభవమా అని సంపా. (సం.ప.స. 16. నం.)
"ఒకతెపైఁ బెట్టి మాట లొక టొకటె యాడి
యెకసక్కె లకు, గల్ల లేల యాడేవు" 9-267

**ఎకసక్యము :** వి. 'ఎకసక్కెము'నకు రూపాం.
"ఒకటొకటే గడించే వూరకున్న యాకె మీఁద
యెకసక్యాలిఁక నేల యెరుగుదుమయ్యా"
29-350

**ఎక్కడా :** అంతటా.
"యిక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
ఎక్కడా జాణైన వాని నెలయించఁదగునా"
27-22

**ఎక్కసక్యము :** వి. చూ: ఎకసక్కెము.
"మొక్కుతే సారెకు నైనా మోపులై వేసట వుట్టు
యెక్కసక్యాలకుఁ బాదమేల పట్టేవయ్యా"
13-31 old

**ఎక్కితే యేనుగ గుజ్జు :** నానుడి; కొన్ని సమయాల్లో ఎంత పెద్దదైనా చిన్నదిగానే భావింపబడటం.
"యే లీలా గెలువరాదు యెక్కితే యేనుగ గుజ్జు
లోలోనె మమ్మునింత లోఁచి చూడనేటికి"
7-222

**ఎక్కినవానికి ఏనిగె గుజ్జౌఁగదే :** చూ: ఎక్కితే యేనుగ గుజ్జు, ఎక్కినవానికి ఏనుగు గుజ్జు.
7-239

**ఎక్కినవానికి ఏనుగ గుజ్జు :** సామెత; కొన్ని సమయాల్లో ఎంతో పెద్దదైనా చిన్నదిగానే భావింపబడడం, ఏనుగు ఎత్తైన జంతువే అయినా దానిమీద ఎక్కినవానికి అది పొట్టిగానే కనిపిస్తుంది కదా.
"ఇల్లిదె యెక్కినవాని కేనుగ గుజ్జను మాట
పొల్లవునా తనున్నారకే పొదిగేనేఁ గాక" 22-33

**ఎక్కుకొను :** (9) స.క్రి. ఎక్కు, ఎక్కు ధాతువుపై స్వార్థంలో కొనుధాతువు అనుప్రయుక్తమైన రూపం. ఇలాంటి రూపాలు కొన్ని రా.సీ. వ్యవహారంలో విలక్షణంగా కనిపిస్తాయి. ఉదా. ఉండుకో, వినుకో మొ॥
"శ్రీవేంకటేశ నీ దేవు లలమేలుమంగ
వోవల నడిగితే నీ వుర మెక్కుకొనెను" 19-112

"నిండువురమున నింతి నిలిపి శ్రీవేంకటాద్రి
కొండమీఁద నెక్కుకొన్న కోడెకాఁడే" 9-134

**ఎక్కుడుకెక్కుడగు** : ప.బం; అ.క్రి. మిక్కిలి గొప్పదగు.

"మర్మంబు శ్రీహరి నీ మఱఁగు చొచ్చినఁగదా
కూర్మిఁ దన జన్మ యెక్కుడు కెక్కుడౌట"
2-104

**ఎక్కువతక్కువలు** : (5) ప.బం; వి; బహు. హెచ్చుకుందులు, హెచ్చుతగ్గులు.

"ఇక్కువ లంటేటివేళ ఇద్దరము నిద్దరమె
యెక్కువతక్కువ లెంచ నిఁక నేల" 20-367

"ఎక్కువతక్కువలేవో యెఱుఁగ మిద్దరిలోన
నొక్కటై నీ వురముపై వున్న దిదె చెలియ"
22-112

**ఎక్కువనేల** : వి. ఎత్తైననేల.

"నిక్కము గొండల నీరు నేలకు వేగమె పారు
యెక్కువనేలపై నీరు యెక్కుడందుకు"
10-1-16

**ఎగదిగఁజూచు** : ప.బం. తత్తరపాటుతో చూడు.

"చిగురుటాసఁదగిలి చింతాజలధిఁ బడి
యెగదిగఁ జూడఁబోతే యెందుకు నెక్కినది"
3-313

"యిత్తల నదియును గాకే యెగదిగ నాతనిఁ
జూచుచు
చిత్తిణిగుణముల చెక్కులు చెమరించే వేమే"
16-331

"ఎగదిగ నాతనిఁజూచుచు" 16-331

**ఎగదిగనాడు** : వెనుకముందులు మాట్లాడు.

"జగడాలు మానరాదా సరస మాడేటివేళ
యెగదిగనాడితే యెగ్గులున్నవా" 7-84

**ఎగదిగపోతలు** : ప.బం; వి; బహు. ఎగపోతలు, దిగపోతలు.

"మొగమును జూచేవు మోనానఁ దలవంచేవు
యెగదిగపోత లైతే నేడ చొచ్చేదే" 20-271

**ఎగపోఁత** : వి. పైకి పోయటం, తూర్పారబట్టడం, ప్రేరేపణ, దుష్ప్రోత్సాహం, (వ్య.) ఎగఁబోత, పైకి వ్యాపించడం, సూచించడం, దుర్బోధచేయటం.

"కూరవండి కసవేరె గుణము లోలో నేల,
యేరా నిన్నుఁగూడి పోసే యెగపోఁతేల" 9-69

ఇట నిశ్వాసం, నిట్టూర్పు అని అర్థం కావచ్చు.

"యెలయింపుఁజెలులచే యెగపోఁత లేటికే"
17-40

**ఎగపోయు** : (3) ప.బం; అ.క్రి. పురి యెక్కించు, దుర్బోధన చేయు, ప్రేరేపించు, పురికొల్పు. (తాగు, ఆస్వాదించు) రూపాం. ఎగఁబోయు, 'ఎగసనఁబెట్టు'కు రూపాం.

"కలుపుగోలుగ నిట్టె కాఁగిలించి కూడేవు
పొలసి యెవ్వతె యెగపోసిరా నీకు" 26-492

"చెలిఁగొంగువట్టి తీసి చేయిమీఁదఁ జేయి వేసి
యెలమి వలపు రేచె నెగపోసి" 25-186

**ఎగవు** : వి. గర్వం.

"పొందుల మాటలాడితే పులకించవలెఁగాక
యిందరివలె నుండితే యెగవులే కావా" 17-63

**ఎగసక్కెఁడు** : (6) వి. 'ఎకసక్కెఁడు'కు వ్యావహారికరూపం. వంచకుడు, పరిహాసకుడు, వికటపు మాటలాడువాడు.

"వెగటుగా మా యక్క వింటే నిందు కేమనును
యెగసక్కెఁడవు సంగ తెఱఁగవుగాక" 25-137

"మొగము దప్పక చూచి మోవితేనె లానేవు
యెగసక్కెఁడవు నిన్ను నే మనేమయ్యా"
22-407

**ఎగసక్కెలు** : ప.బం; వి; బహు. ఎగతాళులు, పరిహాసాలు. రూపాం. ఎగసక్యాలు.

"యెగసక్కె లాడరాదు యెదురు మాటాడరాదు
నగ నోపుదుమా నీతో నయముగాను" 20-473

**ఎగసక్యాలు** : ప.బం; వి; బహు. పరిహాసాలు. రూపాం. ఎగసక్కెలు.

"యెక్కడైనా జేయి యెకసక్యాలు
తక్కినవారితోడ తచ్చన లెంచకయ్యా" 12-1

**ఎగుసనఁబెట్టు :** స.క్రి. పురికొల్పు.
"తగవులు చెప్పుతాఁ గాఁతాళము గొంత రేఁచుక
యెగుసనఁ బెట్టీ రేసులెవ్వతో యీపె" 11-77

**ఎగ్గుతప్పులు :** ప.బం; బహు. ఒప్పుతప్పులు, మంచిచెడ్డలు.
"వొగ్గి విడెమయ్యగాఁబో వొడలెల్లాఁ గాఁక వుట్టి
యెగ్గుతప్పులకు నోప ఇంట నుండేనయ్యా" 19-458
"సిగ్గువడి వుండేది చెలియకు నుచితము
యెగ్గుదప్పు లిందేల యెంచేవయ్యా" 22-19

**ఎగ్గుదప్పులు :** (2) (ఎగ్గు + తప్పులు) వి. ఒప్పులు - తప్పులు.
"యెగ్గుదప్పు లేడవి యింత వలచిన నీకు
కగ్గు లేక యిట్లానె కలతువు గాక" 21-317

**ఎగ్గులాఁడి :** (ఎగ్గులు + ఆఁడి) నింద్యురాలు.
"సిగ్గరికత్తెకుఁగాని సెలవినవ్వులు రావు
యెగ్గులాడికిఁ గాని యీసు లేదు" 16-561
"సిగ్గరికత్తెకుఁగాని చెక్కిటి చెయ్యామరదు
యెగ్గులాడి గాని మరి యీసు నేరదు" 18-184

**ఎగ్గులు సిగ్గులు :** (3) ప.బం; వి; బహు. మానమర్యాదలు, సిగ్గుసంకోచములు.
"జవ్వనభారముచేత జడిసేటి విరహులు
యివ్వేల నెగ్గులు సిగ్గు లెఱుఁగుదురా" 17-50
"దగ్గరి వద్ద నుండితే తరగదు నీ మేను
యెగ్గులు సిగ్గులుఁ దేరె నేఁటికోయి" 16-352

**ఎగ్గుసిగ్గు :** (6) వి; ప.బం. మానమర్యాద, సిగ్గు - సంకోచం.
"యెగ్గుసిగ్గు నెరఁగక యితఁడిట్టె నన్నుఁగూడె
వొగ్గి నానాళ్ళు సేసి వున్నదాన ననవే" 16-91

**ఎగ్గుసిగ్గులు :** (9) ప.బం; వి; బహు. మానమర్యాదలు, సిగ్గుసంకోచం.
"ఎగ్గుసిగ్గు లెరఁగవు ఇది యేఁటిదోయి బావ
వెగ్గళించేవు కలికివిద్యల బావ" 16-305

**ఎ(య)చ్చరించు :** స.క్రి. ఎచ్చరిక చేయు, జ్ఞప్తిచేయు, తెలుపు, ప్రోత్సాహపరచు.
"కొంచక భుజియించుమని కోరి
యచ్చరించవద్దు
పెంచిన తన యాఁకలే పిలిచి తెచ్చీని" 2-184
అన్నమయ్య 'ఎచ్చరిక' అనే పదాన్ని వాడినా ఎక్కువ పర్యాయాలు 'ఎచ్చరికె' అనే పదాన్నే వాడినాడు.

**ఎచ్చరి :** వి. హెచ్చరిక.
"అప్పుడు చూచేదివో అధికుల నధముల
తప్పక యెచ్చరి యిదే తలఁచవో మనసా"
2-117

**ఎచ్చరికె :** (12) వి. అవధానం, సూచన. రూపాం. ఎచ్చరికె, హెచ్చరిక.
"ఎచ్చరిక మఱవకు మిన్నిటా నమ్మ
విచ్చనవిడాయ నీకు వేడుకలమ్మా" 7-589
"అచ్చపు శ్రీవేంకటేశ ఆయమెరిఁగి కూడితి
వెచ్చారికతో నుండఁగ యిట్టె మైచ్చనైతిక"
9-251

**ఎచ్చరు :** అ.క్రి. 'ఎచ్చిఱు' అని సూ.ని. మేలుకొను అని అర్థము. ఎశ్చరు, ఎచ్చరు అని కన్నడరూపములు. అర్థమొకటే అని సం.ప.స. (13సం. 1అను. 2పు.) జాగ్రత్తపడు, ఎచ్చరికపడు, తేరుకొను, మేలుకొను, వృద్ధిపొందు.
"కలికాలమిన్నియును గందు విందుఁగాని మతి
యెలమి వొక్కటినైన యెచ్చరలేను" 1-382
"పాయపు మదమో యిది పట్టినట్టి చలమో
యీయెడ నింతటనైనా యెచ్చరవయ్యా"
13-37

**ఎచ్చు :** అ.క్రి. గొప్పనగు, అతిశయించు.
"నిచ్చలు శ్రీవేంకటేశ విధానము నీ భక్తి
యెచ్చినాఁడ నింతటా నీడేరే జన్మము" 6-172

**ఎచ్చుకుందులాడు :** (3) హెచ్చుతక్కువలు పలుకు.
"పచ్చిదేర నవ్వితేనే పట్టి వెనఁగుట గాక
యెచ్చుకుందు లాడఁగాను యెరవులే కావా"
26-411

"ఇన్నాళ్లు నెఱఁగనైతి నెచ్చుకుందులాడితినీ
వన్నెదీయ మెరసేది వనితా భూమిని" 7-27

**ఎచ్చుకుందులు:** (10) వి; బహు. హెచ్చుతగ్గులు.

"ఎచ్చుకుందు లిద్దరిలో నేమేమి గలిగినా
పచ్చివెచ్చి రతులలోపలఁ దేరీఁగాని" 24-80

**ఎచ్చుకొందులాడు:** అ.క్రి. ఎచ్చుకుందులాడు, ఎక్కువ తక్కువ పలుకు.

"నొచ్చునోవని నోరిలోనే వుండఁగాను
యొచ్చుకొందులాడ వచ్చేవేరా నీవు" 17-339

**ఎజ్ఞము:** (3) వి. 'యజ్ఞము'నకు జానపద వ్యవహారరూపం.

"భూమిసురలెజ్ఞములు పూని సేయుదురు బ్రహ్మ
కేమంత్రాలఁజేయు నతఁడెవ్వరిఁ గూర్చి"
15-314

ఎజ్ఞభాగాలు. 2-371

**ఎటపెటి:** క్రి.విణ. ఎదురెదురుగా, సరికిసరిగా ఇత్యాది అర్థములు కావచ్చు. ఇంకను విచార్యము.

"పచ్చిగా నెటపెటికిని బాగాలొత్తి యిచ్చుకొంటా
మచ్చిక లెంత చూపేవే మఱఁగునను" 23-64

**ఎట్టకేలకు:** క్రి.విణ. చివరకు, చాలాసేపటికి, అతికష్టంమీద.

"యెట్టకేల కిటు మాతో యేలాటాలాడితినే
పట్టినా నీ మనసున పంతపు నా సేవలు"
19-200

**ఎట్టనెదుట:** (2) క్రి.విణ. 'ఎట్టయెదుట'కు వ్యావహారిక రూపం. మిక్కిలి ఎదుట. ఇట 'ఎట్ట' శబ్దాన్ని ద్రుతప్రకృతికంగా వాడడం విలక్షణం.

"గుట్టున నన్నింతలోనే కూడె శ్రీవేంకటేశుఁడు
యెట్టనెదుట నా మోహమెంత సేసీ నన్నును"
12-341

"తక్కక నీ మోము చూడఁ దమకించీ నాతఁడు
నెక్కొని యెట్టనెదుట నిలుచుండవే" 29-163

**ఎట్టనెదుర:** ఎట్టయెదురకు వ్యావహారికరూపం. మిక్కిలి ఎదుట.

"అట్టె కోపించకుమీ అడిగే నే నొకమాట
ఎట్టయెదుర నున్నావె యేమౌరా నీకు" 7-64

**ఎట్లన్:** క్రి.విణ. ఎట్టులన్, ఏవిధంగా.

"పొదిగి యాడ కెట్లఁ బోదుమే నేము" 22-14

**ఎట్లనో:** ఏ విధంగానో 'ఎట్లో' అనడానికి వ్యావహారికరూపం.

"ఏమి సోద్యమిది యెంతయును వెరగాయ
ఈ మగువ విభుఁగలయు టెట్లనో యనుచు"
5-234

**ఎడకాటము:** వి. 1. తార్పుడు, వియోగం, ఎడబాటు 2. మఱుగు. ఎడకాటమనే ఈ శబ్దం ఏ నిఘంటువులోనూ కానరాదు. ఐతే ఎడకాడు, ఎడకత్తె అనే పదాలు తార్పుడుకాడు, తార్పుడుకత్తె అనే అర్థాల్లో కనిపిస్తున్నాయి. కనుక ఎడకాటము అంటే 'తార్పుడు' అనే అర్థాన్ని గ్రహించవచ్చు. 15 సం. పీఠికలో ఈ అర్థమే సూచింపబడింది. (పుట.8)

"ఎందునుఁ బొందని ఎడకాట మిదె యని
యిందిరనాథుని సేవించు మనసు" 15-117

**ఎడగాళ్ళు:** వి; బహు. మధ్యలో ఎడం కల కాళ్లు.

"తొక్కె యక్షకుమారునిఁ దుంచి యడగాళ్ల సంచి
నిక్కించెను తోఁక యెత్తి నింగిమోవను" 10-167

**ఎడగొల్లకత్తె:** వి. ఎడకత్తె అంటే దూతిక. ఎడగొల్లకత్తె అంటే గొల్ల దూతిక అని అర్థం చెప్పవచ్చు. గొల్లఎడకత్తె కు బదులుగా ఎడగొల్లకత్తె అని ప్రయోగించినట్లున్నది.

"ఎడగొల్లకత్తె యీపె యెవ్వతోయి
అడియాలాలెత్తీ నాతో నానతీవోయి" 16-589

**ఎడతాఁకు:** వి. బాధ (పద.) కలియుట, రాకపోకలు చేయుట.

"చెక్కులు నొక్కకురా చిత్తమెల్లాఁ జిల్లులౌ
తక్కరితనాల యెడతాఁకులే చాలు" 26-100

"ఎనయు నానలకు గుఱి యెడతాఁకులే చెలియ
నునుపులకు గుఱి సెలవినవ్వు లివియే" 7-35

**ఎడతాఁకు:** స.క్రి. చేరు, సంధించు, బాధపడు (పద.)

"ఎండలకు నీడలకు నెడతాఁకినాడు" 16-2-56

**ఎడదవ్వులు:** వి; బహు. మిక్కిలిదూరములు, హృదయమును తవ్వుటలు.

"చెంది సెలవులఁజిమ్మి చిఱునవ్వులు
యిందరిలో నీకు నవి యెడదవ్వులు" 26-319

**ఎడపడు:** వ.బం; అ.క్రి. ఆలస్యమగు, లోపం కలుగు (పద.)

"ఎడపడకందు కంటే నెక్కుడైన బంధము
కడునాసఁ బొరలించు కనకము" 3-361

**ఎడపదడప:** అవ్య. అడపాదడపా, అప్పుడప్పుడు.

"వెడఁగుఁదనము విడువలేదు వేదమైనఁ జదువలేదు
ఎడపఁదడప నిట్ల నీకు నేమి సేతువయ్యా" 5-67

**ఎడపు:** వి. శూన్యం, లేమి, ఎడఁబాపటం.

"యెదిరిఁ దన్నుఁ గానని యెడపుల గుడ్డికన్ను
మొదలఁదెఱచె నేమి మూసెనేమి" 1-456

**ఎడపులవారు:** వి. లేమి కలవారు (ఎడపు=లేమి) ఎడయు అంటే 'ఎడబాయు' అని అర్థం. 'ఎడపు' అనేదాన్ని ఎడయు ధాతువు కృదంతరూపంగా భావిస్తే ఎడపు శబ్దానికి ఎడబాటు, విరహం అనే అర్థం రావచ్చు. అప్పుడు ఎడపులవారు అనేదానికి విరహిణులు అనే అర్థం చెప్పవచ్చు.

"ఎడపులవారము నేమే మెరుగుదుము మీ
తడబాట్లేమి గల్లా తనువు లెరుగును" 14-336

**ఎడమాటలు:** వి; బహు. సంధిమాటలు. ఎడ=స్థానం, అవకాశం, దూరం, గడువు, భేదం, విఘ్నం, వ్యవహారం, సంధి, దేవతానైవేద్యం.

"ఎడమాటలాడి యీ యినవంశుఁడేరఁ
గడు హనుమంతుడు గలిగెనే నీకు" అని రంగ.రా.

"తడబాటైన సిగ్గులు తనువుపై నుండఁగాను
యెడమాటల బీరాలు యిఁక నేడవే" 16-462

**ఎడవాయు:** (ఎడ + పాయు) విడిపోవు, దూరమగు. రూపాం. ఎడఁబాయు.

"ఇమ్ములఁ గలసితివి ఇందుకు లోనే నేను
యెమ్మెల కాతనితోడ యెడవాయఁగలనా"
23-415

**ఎడసుద్దులు:** వి; బహు. చూ: ఎడమాటలు.

"నవ్వులనె తనిసితి నయాలనే మొనసితి
యెవ్వరు నేమిచెప్పేరు యెడసుద్దులు" 11-62

**ఎడాటము:** విషయం; దీనికి ఆట అని కొందరర్థం చెప్పినారు. (శ.ర.) బ్రౌన్.

"కాంతల కన్నుసన్నల మెలంగుఁగదా మరు నంబకంబు లాద్యంతము
లెంచి చూడ జవరాంగ్ర యెడాటములందు శక్యమే" అని సారంగ. ప్రయోగం. 2-11

**ఎడాడు:** వ.బం. దూరంచేసి మాటలాడు.

"మాపుదాఁకా నేము మాటల నెడాడి
పైపై నూరకె బడలితిమి" 26-172

**ఎడ్డ:** వి. ఎడ్డెకు వ్యావహారికరూపం. ఎడ్డివాడు, తెలివి లేనివాడు, బుద్ధిహీనుడు, మోసగాడు. క. హెడ్డ, ఎడ్డ.

"నిన్నుఁ గొసరేటి యట్టి నేనే యెడ్డ నింతే కాక
యెన్నిమాటలాడినా నీ కేడ మొకదాకిరి" 7-457

**ఎడ్డతనము:** వి. మూర్ఖత్వం, తెలివిలేమి.

"నడపెడి యీ జగములన్నియును నటనలు నీవట తొలుతనే
యెడయక యిందే వినోదించెదవు
యెడ్డతనంబా నీ కేమి" 8-257

**ఎత్తలఁగొండలు:** ఎత్తైనకొండలు. ఎత్తల్ అని ఎక్కడ అను వర్థమున కన్నడపదము గలదు. కాని, ఎందు అనీ పదము ఈ వాక్యమందే యున్నది. కనుక పునరుక్తి అగును అని సం.ప.స. (14 సం.)

ఎత్తల: (ఏ + తల) ఎప్పుడు, ఎక్కడ. (తల = సమయం, చోటు)

"ఎత్తల నెవ్వతెనైనా నిన్నేమైనా సాడినాను
వుత్తరువు చెప్పే నేను వొద్దు నీకు వెరపు"
24-565

"ఎత్తలఁజూచిన నన్ను నెక్కువగా మన్నించె
హత్తి ఇంత బుజ్జగించి యాదరించవలెనా"
22-233

"ఎత్తల నేరిచితివో యిటువంటి బిన్నాణాలు
మత్తిలి నీవైతే నిసుమంతదానవు" 28-440

ఎత్తాదించుక: ఎత్తుకొని దించుకొని.

"చేతులు పైఁజాచఁగాను సిగ్గుపడవలసె
యేతువ లెత్తాదించుక యిందరిలోన" 8-254

ఎత్తినవారి చేతిబిడ్డఁడు: ప.బం. ఎవరు కాస్త మంచి మాట మాట్లాడితే వారివైపు ఉండేవాడు. ఒక పద్ధతిలో నడువక బహుముఖాల వర్తిల్లేవాడు.

"కాచే పూచే మాకులైన కడలకు దొబ్బేని
చేచేత నెత్తినవారి చేతిబిడ్డఁడు" 22-59

ఎత్తుకోలు: వి. కోరిక, యత్నం.

"యెలమి నీ వేడుకకు యెత్తుకొన్న యెత్తుకోలు
తెలిసినవాఁడ వీక దించవచ్చునా" 8-128

ఎత్తుదీయు: అ.క్రి. తఱుగుదీయు, బంగారుతూకమును తగ్గించడం.

"వన్నెకుఁబెట్టిన సొమ్ము వడి రాసి యెత్తుదీసె
మున్నిటివే వెనకాయ ముచ్చటాఁ దొలఁగదు"
2-4

ఎత్తుసేయు: దీనికి ప.పా. లో సమానమగు అనీ, తె.వ్యు.కో.లో కపటం పన్ను అనీ అర్థాలు ఉన్నాయి. ఐతే ఈ రెండర్థాలు ఇట కుదురవు. ఎత్తు అంటే ఉన్నతి కనుక ఇట ఎత్తుచేయు అనేదానికి గొప్పచేయు అనే అర్థం చెప్పుకుంటే సమంజసంగా ఉంటుందేమో.

"ఇంత నన్నెత్తుసేసితే ఇటు నిన్ను మెత్తుఁగాక
పంతమందరితో నాడ పగటా నాకు" 24-448

ఎదట: క్రి.విణ. 'ఎదుట' కు వ్యావహారికరూపం, ముందర.

"యెదట నున్నది చెలి యెక్కడ పరాకు నీకు
అది నీవద్దఁ గూచుండు మనఁగరాదా" 14-495

ఎదరొమ్ము: వి. ఎదురుఱొమ్ము, రొమ్ము నడిమి భాగం.

"పదర లేనైతిఁగాక పక్కనఁ బువ్వుల బంతి
ఎదురొమ్ము వేసితేను యేమనీనె యపుడూ"
11-502

ఎదిరించి ఉండు: అ.క్రి. ఎదురుగా ఉండు.

"ఎన్నఁడొకో బు ద్దెరిగి యీడేరేది జంతువులు
యిన్నిటా నీ మహిమలు యెదిరించి వున్నవి"
3-285

ఎదిరికి యినుమడిచేవానికి తనకు తగరమడువఁ దడువయ్యీనా: నానుడి; ఎదుటివాడికి కఠినమైన ఇనుము సరిచేసి ఇచ్చేవానికి మెత్తగా ఉండే తన తగరాన్ని సరిచేయడంలో ఆలస్యం జరుగదు. కష్టంకాదు. కష్టమైన పని చేయగలిగిన వానికి సులభమైన పని చేయడంలో సౌలభ్యమే ఉంటుందని భావం.

"ఎదిరికిన్మడఁచువాడు తనకుఁ దగరంబు
సఱచు టెంతటి భరమ్ము" అని నాచన సోమన.

ఎదుగా: క్రి.విణ. ఎక్కువగా, ఎదుగుగా. రా.సీ. వ్యవహారంలో ఈ అర్థంలో 'ఎదగా' అనే పదం ఉంది. ఎదుగు ధాతువు రూపం కావచ్చు. (సం.ప.స. 13 సం. 1 అను. 2 పు)

"ఎదురుగుదురు గాను యేల నవ్వీనే
యెదుగా తడవునుండి యేల నవ్వీనే" 13-48

"ఎదుగా సతుల దాను యేలేవాఁడు గాదా"
19-378

ఎదురాఁక: (ఎదురు + ఆఁక) వి. నిరోధం - అడ్డగింత అనే అర్థాల్లో జంటపదం, విఘ్నం.

"యెనయని జాగరాలు యెదురాఁకలు
కనుగొంటిని నీవిఁక రాఁగదవో చెలియా"
14-584

**ఎదురు :** స.క్రి. మార్కొను, ప్రతిఘటించు, ఎదురుపడు.
"అదే రాముడు సువేలాద్రిపై నిలిచె
ఎదిరితివి సీత యింక నేమమ్మా" 20-178.

**ఎదురు కట్ట(ట్టు)లన్ :** (4) ఎదుటి ప్రదేశంలో, ముందటి ప్రదేశంలో. కట్టెదుట.
"ఒక్క మహాతేజంబెదురుకట్లఁ
గన్నులకు మిఱుమిట్లు గొన నిల్చినన్" అని శ్రీకాళ.మా. ప్రయోగం. 4-128
"నా యెదురుకట్టులనె నవ్వఁబొయ్యే వాపెతోడ
యీయెడ నప్పుడె యెంతకెత్తు కొంటివి" 11-321
"పైపై నెదురుకట్లఁ పంచదార వుండఁగాను
చేపట్టి యడిగితెచ్చి చేఁదు దిన్నట్లు" 6-103

**ఎదురుగుదురుగా :** (2) పరస్పరం నిల్కడగా.
"ఎదురుగుదురుగా నిది యేమే
పెదవులు గదలఁగఁ బెనఁగీఁదాను" 20-150
"మొదలఁదనపై నేను మోహము సేసినందుకు
ఎదురుగుదురుగాను యేమనీఁదాను" 27-266

**ఎదురుత్తరము :** (ఎదురు + ఉత్తరము) వి. ప్రత్యుత్తరం.
"మొదల నాతఁడె ముచ్చటలాడీ
యెదురుత్తరము నీ వియ్యఁగరాదా" 11-547

**ఎదురుబడి :** (2) వి. ఎదురుపాటు, ఎదురుపడుట, అభిముఖంగా రావడం.
"ఎలమి నాకెయు నీవు నెదురుబడి నుండి
సెలవుల నవ్వితివి సిగ్గులతోను" 19-297

**ఎదురుబడు :** అ.క్రి. ఎదురగు, ప్రతిఘటించు, ఎదురుగా వచ్చు.
"ఎదురుబడి సొలయ నింక నేలయ్యా
ముదముతోడ నీకు మొక్కేమయ్యా" 18-584

**ఎదురుమాటాడు :** ప.బం; అ.క్రి. అన్నదానిని కాదను, ప్రతిఘటించు.
"యెదురు మాటాడరాదు యేమని అడుగరాదు
కదిసి తనచే నెట్టు కత వినేనే" 26-391

**ఎదురులుచూచు :** ప.బం; అ.క్రి. 1. నిరీక్షించు 2. ముఖాముఖి చూచు.
"ఇంతి పానుపుపై నుండి యెదురులు చూచు నీకు
చెంత నీవున్నాఁడవని చెనకి నవ్వు" 22-530
"యెంతవొద్దు రాకుండినా నెదురులుచూతు నేను
చెంతనుండి పరాకైతే చే చాఁతు నేను" 23-74

**ఎదురులేని మాట కదురువలెనే ఉండు :** సామెత; ఎదురులేని మాట కఠినంగా ఉంటుందని భావం కావచ్చు.
"యెదురులేని మాట కదురువలెనే వుండు
పెదవిపై తేనెల ప్రియమేలే యింకను" 19-393

**ఎదురెదురుకట్ల :** క్రి.విశ; ప.బం. మిక్కిలి ఎదురుగా, మిక్కిలి ముందర.
"పొదిగి నేనుండఁగానే బూటకాలు సేసేవు
యెదురెదురుకట్ల నేరా నీవు" 20-410

**ఎద్దు దన్నీనని గుజ్జము చాటుకేగు :** ఒక బాధను తప్పించు కోవటానికి అంతకంటె పెద్ద బాధకు తలఒగ్గు.
"నీటుగ నెద్దు దన్నీనని గుజ్జము
చాటుకేఁగిన యట్టి చందమాయె" 1-203

**ఎద్దుఁ బట్టిన సివము :** ప.బం; వి. గంతులు వేయించేది. 11-3 భా 26 old.
"ఎద్దుఁ బట్టిన సివం బెఱుకమాలిన ప్రియము
లొద్దిక విహారంబు లుబ్బుఁ గవణంబు" 1-96

**ఎద్దుబండి కంటి సంది :** వి. అశాశ్వతం. బండి వెళ్లేప్పుడు దాని కంటి సందు కనబడదు.
"బుద్ధిలేని బుద్ధితోడ పొందుసేసుకొని
వచ్చి యెద్దు బండికంటి సంది నీఁగేము" 1-73

**ఎద్దేమెఱుఁగు నడుకుల చవి :** సామెత;
"అఁపఁగ నెద్దేమెఱుఁగు నడుకుల చవి మూట
మోపరివి నీకు నా ముదము ముద్దా" 1-87

**ఎద్భావం తద్భవతి :** "యద్భావం తద్భవతి" ఇందులోని యద్భావం 'ఎద్భావం' గా

ప్రయోగింపబడటం విలక్షణం. దేన్ని భావిస్తే అదిగా మారుతుంది అని అర్థం.

"ధరలో నెద్భావం తద్భవతనెఁగాన
హరిమయమే జగమంతాను" 2-435

ఎనగొను: అ.క్రి. ఈ పదం ప్రధాన నిఘంటువుల్లో కానరాదు. ఆం.క్రి.మ.దీ.లో పొందు అనే అర్థం చూపబడింది. ఇందుకు కు.సం. ప్రయోగం ఉదాహరించబడింది. 3.ఆ.

"ఎనగొని శ్రీవేంటేశు శరణమిటు
గని మన కుండిన గతి యిఁక నేది" 1-432

ఎనయు: అ.క్రి. 1. సరిపోలు 2. వ్యాపించు 3. కలుగు 4. కలియు 5. లభించు 6. ఒప్పు 7. మూఁగు 8. సంగమించు. స.క్రి. 1. పొందు 2. పోలు 3. తాకు 4. అనుభవించు, రతియందు కలియు 5. గ్రహించు.

"పెనఁగి పెనఁగి వట్టి బిగువులు బిగిసితే
ఎనసునా పొందులు యెరవులే కాక" 12-319

"చన్నులు గట్టిన యాపె చలపట్ట కేల మాను
యిన్నిటా నాపెకు లోనై యెనతువు గాక" 21-70

"యెంగిలిపొత్తు గలసి యెనసేకొరకుఁగాక
సంగతిగా మోవియ్యి రాజసమా నాకు" 27-146

ఎనుపోతుతో నెద్దు నేరు గట్టినట్లు: లోకోక్తి. సాటికానిదానితో సంబంధం కలుపు, తగని దానితో సంబంధం కలుపు. ఎద్దు మంచి బలమైన జంతువు. ఎనుపోతు కాదు. ఐనా ఈ రెండింటిని అరకకు కట్టితే దున్నడం సాధ్యం కాదు కదా!

"ఎనుపోతుతో నెద్దు నేరుగట్టినయట్లు
యెనసి ముందర సాగదేటి బ్రదుకు" 1-156

ఎన్నిక: (3) వి. 1. గణనం, లెక్క 2. సంకల్పం 3. అపకీర్తి, నింద 4. ఊహ, ఆలోచన 5. ప్రసిద్ధి 6. ఎన్నుకోవడం. విణ. కోరదగింది, తగింది, గణనీయం, శ్రేష్ఠం.

"ఎన్నికనామము లిటు నీవై యుండఁగ
యిన్ని నామములవా రిది యెవ్వరు" 1-93

ఎన్నికలకెక్కు: ప.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు, గణనకెక్కు. రూపాం. ఎన్నికెకెక్కు.

"అన్నిటా నొక్కటియైతే నైనదేమి కానిదేమి
యెన్నికల కెక్కితేను యీడు జోడేది" 11-26

ఎన్నికి: (ఎన్ని + కి) ఎన్నింటికి (?)

"శేరడాన నంతలో గిలిగించేవు సందులు
యిారీతిఁ దప్పించుకొని యెన్నికొఁజెలియ"
23-267

ఎన్నికె: (15) వి. 'ఎన్నిక'కు వ్యావహారికరూపం. చూ: ఎన్నిక. అన్నమయ్య ఎన్నిక శబ్దాన్ని విరళంగానూ, 'ఎన్నికె' శబ్దాన్ని బహుళంగానూ ప్రయోగించినాడు.

"ఎన్నికెతో గోమంతమెక్కి జయము చేకొని
మన్ననతో మధురకు మరలినట్లు" 3-433

ఎన్నికెకెక్కు: (3) ప.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు, గణనకెక్కు. 'ఎన్నికె' 'ఎన్నిక'కు వ్యావహారికరూపం.

"ఇన్నిటా జాణవు నీవు యెవ్వరు గుద్ది చెప్పు
యెన్నికె కెక్కిన నీ ఇంటిలోనివారము" 27-7

"నిన్నుఁజూచి వెరగయ్యీ నేఁడు మాకందరికిని
యెన్నికెకెక్కినవాఁడ వింత సేయఁదగునా"
27-71

ఎబ్బెడి: వి. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు. అసహ్యం, తక్కువతనం.

"సరసము లాడఁగానే చవులు గానిపించుఁగాక
యెరపరికము లైతె యెబ్బెడి గాదా" 7-363

"ఎబ్బెడేల శ్రీవేంకటేశ యలమేల్మంగను
అబ్బురాన నన్నేలితి వతిజాణ ననరా" 12-399

ఎముకల యిల్లు: (3) ప.బం; వి. శరీరం, అస్థిపంజరం.

"యెవ్వారు నెఱఁగని యెముకల యింటిలో
పవ్వళింపుచునున్న బ్రాహ్మఁడు" 1-209

ఎమున: వి. 'యమున'కు వ్యావహారికరూపం.

"సిసువవై యెమునలోని చీకటి నీ తప్పులా
యెసఁగిన నాతోడి యియ్యకోలుఁజాతలు"
7-259

**ఎమ్మె**: వి. 1. విలాసం 2. చక్కదనం 3. గర్వం.
"ఎమ్మెల నాలిమగని కిద్దరికిఁ దగునయ్య్య
మమ్మెుబోంట్ల నన్నిటా మన్నించఁడీ అయ్యా"
20-334

**ఎమ్మెకాఁడు**: వి. విలాసవంతుడు, అందగాడు.
"నిలువరా యెమ్మెకాఁడ నీవు మమ్ముఁ జెనకక
కలసేవు వట్టి పొత్తు కాననా నిన్నును" 14-266

**ఎమ్మెలకాఁడు**: (ఎమ్మెలు + కాఁడు) వి.
విలాసవంతుడు, ఎమ్మెకాఁడు.
"యెమ్మెలకాఁడవు గావా యిందుకు రాజవు
గావా
దొమ్మికాఁడనైతే నీకు దూరుగట్టవలెనా" 20-550

**ఎమ్మెలాడు**: (ఎమ్మెలు + ఆడు) అ.క్రి.
విలాసములు చూపు.
"ఇందుకుఁగా నీ వేల యెమ్మెలాడేవు
అందరి ముందర నాపె నాఁడిఁ బెట్టెదరా"
21-177

**ఎరఁగు**: (108) ఎఱుఁగు కు వ్యావహారికరూపం.
తెలియు. 'అన్నమయ్య' ఈ రూపంతో పాటు
ఎఱగు, ఎఱుఁగు, ఎరుఁగు అనే రూపాలను
కూడా వాడీనాడు. ఎఱఁగు అనే రూపాలే
అత్యధికం.
"చిత్తమెరఁగనియట్టి చెలిఁ జేరి కూకులును
వత్తులునై విరిగిన వాఁడెపో కూళ" 20-41

**ఎరపరము**: వి. ఎరపరికము నకు రూపాంతరం
కావచ్చు. కోపతాపం, (?) రోత, అసహ్యం.
"సొరిది నీపై నవి సోకి వచ్చెనో
యెరపర మే లానతీయవయ్యా" 13-178

**ఎరపరికము**: (10) వి. 1. అసహ్యం, రోత 2.
ఆశ్చర్యం, ఆసక్తి. రూపాం. ఎఱబఱికము
(వ్యా.) భేదం, అరమరిక. (ఎఱబఱికము =
రోత అని ఆం.ప.ని.)
"ఎరపరికపు పొందు లిపుడేఁటికే
కరుణ గలప్పుడే కనుపట్టీఁగాక" 14-299

**ఎరవు**: (30) వి. 1.విలక్షణం, వికృతం,
విపరీతం, అస్పష్టం 2. అన్యం, లాతి,
అపరిచితం, అజ్ఞాతం 3. చేబదులుగా తెచ్చినది
4. అశాశ్వతం, క్షణికం 5. తాత్కాలికంగా
ఉపయోగించు కోవడానికి తెచ్చిన వస్తువు.
భేదం:
"ఎరవు లే కిద్దరమూ నియ్యకోలై యుంట గాక"
12-248
"కరఁగించే ననఁగానె కాఁగిటఁ గూడి చొక్కి
యెరవు లేక చనవియ్యవే నీవు" 9-280
"ఎంతయినా మీలోన యెరవున్నదా
చెంతనున్న తీగెలె కా చిగిరించేవి" 7-84
"ఇయ్యకోలైన చోట యెరవులేల" 16-84
"మగఁడైన పిమ్మటను మరి యెరవేమిటికి
తగు సతులకు లోనై దక్కవలెను" 25-121
తాత్కాలికంగా ఉపయోగించుకోవటానికి
తెచ్చుకొన్నది:
"ఇంటిదాన నుండఁగా ఎరవు సతమా నీకు
పెంటవెట్టుక నావద్దఁ బ్రియాలు చల్లేవు" 9-269
"పట్టరాని తమితోడ బాఁతిపడే మింతేకాక
యెట్టు సేసినా నీకు యెరవు సతమయ్యీనా"
29-516
అన్యం:
"ఎరవుగాఁజూచేవు యేరా నీవు" 11-295
క్షణికం:
"సరసాన నీవు నవ్వు చల్లినయంతటనుండి
యెరవాయ నిద్దురలు యెనేసేవో లేవో" 26-4
విలక్షణం, వికృతం, విపరీతం:
"పావనపు హరినామపతన పుణ్యుల మెచ్చు
ఈవలావలి మూర్ఖుల కెరవయి తోఁచును"
15-277

**ఎరవుచేయు**: స.క్రి. ఉపేక్షించు, వేఱుచేయు,
పరాయిదానిగా భావించు (పద.) వేరుగా
చేయు, వేరుగా తలచు.
"ఎరవులు సేసుకొని యెగసక్కెమాడెనా
ఎరవులు సేసినా యెగ్గులు నే బట్టేనా" 25-109
"ఒరసి సతి నీ తోవ నూరకే నటుండితేను

యెరవులు సేసుకొనే వేమే నీవు" 9-192
"శిరసు వంచుకొంటిని చెరఁగు నీవు వట్టితే
యెరవుసేయకు నన్ను నిదివో మొక్కేను"
7-534

ఎరవుల చెలి: వి. అన్యస్త్రీ.
"చేవదేరఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
యేవ లేల వచ్చెనొకో యెరవుల చెలికి" 11-66

ఎరవులది: (ఎరవులు + అది) వి. పరాయిది, అన్యురాలు.
"ఎరవులదానఁగాను యెంతైనా నే నీకును
సురతవిద్యల కెల్లా చుట్టమును సుమ్మీ"
19-250
"ఎరవులదానఁగాను యెగ్గు పట్టేదానఁగాను
చెప్పరే మీరైనా బుద్ధి చెలువునికి
ఇప్పుడెంత బజ్జగించీ నెరవులదానవా" 12-438

ఎరవులయాతఁడు: వి. అపరిచితుడు, అజ్ఞాతుడు, అన్యుడు, విపరీతుడు, తాత్కాలికంగా ఉపయోగించుకోవడానికి తెచ్చుకొన్నవాడు.
"యెరవుల యాతనికి యేమి విడె మిచ్చేవే
మరగించుకొంటేను మరి నీవే సతివి" 25-445

ఎరవులవాఁడు: (2) వి. ఇతరుఁడు, పరాయివాడు.
"వరుస దప్పితే నాడవారిమీఁది యానే సుమ్మీ
యెరవులవారమైతి మిఁక నేఁడ సుద్దులు" 7-28
"తెరమరగు సన్నలు తెగని యాసలు చూపు
ఎరవులవారి పొందులెంత లేదే తనకు" 12-234

ఎరవుల విషయాలు: వి. పరాయి విషయాలు.
"ఎరవుల విషయాల నేల పొరలవలె
జిగురువంటి బందాలఁ జిక్కనేల వలెను" 10-49

ఎరవుల సరసాలు: వి; బహు. (?)

ఎరవెరవు: (ఎరవు + ఎరవు) విణ. విలక్షణం, వికృతం, విపరీతం, అస్పష్టం.
"తరుణులే వచ్చితెరి తానాడనున్నాడు
యెరవైరవై తా నేమనెనే" 7-329
"గరిమ మొక్క వచ్చిన కాంతఁగౌఁగిలించ కుంటే
యెరవెరవై తోఁచదా యెవ్వరికైనా" 7-386

ఎరికెత: వి. ఎఱుకత, సోదెకత్తె. బండి 'ఱ'కు బదులు సాధురేఫం.
"వచ్చే మీఁది పని చెప్పేవా యెరికెత నీవు
వచ్చేది నా కాఁగిలేరా వంతుల నీకు" 23-109

ఎరివి: వి. త. కాలడం.

ఎరుఁగు: స.క్రి. ఎఱుఁగు, తెలియు. బండి 'ఱ' కు బదులు సాధురేఫం.
"సంగతెరుఁగునా" 18-445
ఈ అర్థంలో ఎరఁగు, ఎఱఁగు, ఎఱుఁగు అనే రూపాలు కూడా ప్రయోగింపబడ్డాయి.

ఎరుఁగుకొను: (2) స.క్రి. ఎఱుగుకొను, తెలుసుకొను, ఎఱుగు ధాతువుపై 'కొను' అనుప్రయుక్తం కావడం మాండలికం.
"మేకొని యూపె బలిమి మెరఱుంచవలసితే
యేకతాననుండి సాము లెరుఁగుకోరాదా"
27-20

ఎరుకగు: అ.క్రి. తెలియు. ఈ మాండలిక పదం రా.సీ.లోనూ, తెలంగాణంలోనూ వాడుకలో ఉన్నది.
"అందవు శ్రీ వేంకటేశ అప్పటి నన్నుఁగూడితి
విందు నా రితాకు నీ కెరుకాయనో" 16-117

ఎర్లించు: (?)
"దిట్టలై ముచ్చటలుగా తీపులు మాటలాడేరు
యిట్టె తేనె గారీ నిప్పులెర్లించే పొద్దు" 8-176

ఎఱఁగు: (252) 'ఎఱుఁగు'కు వ్యావహారిక రూపం. తెలియు. చూ: ఎరగు. ఎరగు కన్నా ఎఱగుకు ప్రయోగాలు ఎక్కువగా ఉన్నాయి.

ఎఱఁగుకొను: ఎఱుఁగుకొను; తెలుసుకొను. ఎఱుగు ధాతువుపై 'కొను' అనుప్రయోగం విలక్షణం.
"ఇంతి ప్రతాపము నీవే యెఱఁగుకొనేవు గాక
వింతలుగా వేరే నేము విన్నవించవలెనా"
29-248

**ఎఱపరికము :** (3) వి. రూపాం. ఎరపరికము, ఎఱబఱికము, రోత, అసహ్యాం, ఆశ్చర్యాం, ఆసక్తి, భేదభావం, అరమరిక.

"ఎఱపరికము లేల యెంతోసేసేవూ
తఱవాతి పనులకుఁ దడవు గాదా" 12-39

**ఎఱికత :** వి. రూపాం. ఎఱుకత, ఎరికెత, సోదిచెప్పేది.

"ఎఱికెతనా నీకు యేమోయి మూపై
వొఱగుంటే నేమాయనో వోవోయి" 7-250

**ఎఱికెత :** వి. సోదె చెప్పే స్త్రీ, ఎరుకసాని.

"యెఱగవా మా గుట్టు యేమోయి మమ్ము
ఉఱక గుట్టరసేవు వోవోయి
యెఱికెతనా నీకు యేమోయి – మూపై
వొఱగుంటే నే మాయనో – వోవోయి" 7-250

**ఎఱుఁగు :** (16) తెలుసుకొను ; అన్నమయ్య ఈ అర్థంలో ఎక్కువగా ఎరఁగు, ఎఱఁగు అనే రూపాలనే వాడినాడు.

**ఎఱుఁగుకొను :** స.క్రి. తెలుసుకొను ; ఎఱుగు మొదలైన కొన్ని ధాతువులపై 'కొను' అనుప్రయుక్తం కావడం రా.సీ. మాండలికంలో కనబడే లక్షణం. ఉదా : "ఉండుకొను మొ॥

"ఈ రమణి తెలిఁగు నీ వెఱుఁగుకోవయ్యా"
23-63

తెలియు ధాతువుపై 'కొను' అను ప్రయుక్తం కావడం ఉంది. కాని ఎఱుగు ధాతువుపై అను ప్రయుక్తం కావడం విలక్షణం.

**ఎఱుక :** (ఎఱుఁగు + క) 1. తెలివి, జ్ఞానం 2. స్మృతి 3. జోస్యం 4. గుర్తు, చిహ్నం 5. పరిచయం 6. సోది.

"తాలిమిలో హరిఁదలఁచక యెఱుకెల్ల
గాలిఁబోవుట పూర్వకర్మశేషం" 1-113

**ఎఱుక మఱపు :** వి. తెలిసినది మరచిపోవడం, జ్ఞాపకం ఉంచుకోవడం – మరచి పోవడం.

"ఎఱుకమఱపు లేదా యెవ్వరికైనా
వొలుపున నెగ్గు లెంచకుండవలదా" 17-366

"అంది నిద్దిరించువాఁడ నటు మేలుకొనువాఁడ
బొందితో నెఱుకమఱపులకు నొక్కఁడనే" 3-497

**ఎఱుకముడి విశ్వాసము :** వి. ఈ పదం ఏ నిఘంటువులోనూ కానరాలేదు. జ్ఞానగ్రంథిపై విశ్వాసం, తత్వంపై నమ్మకం. 11-169

**ఎఱుకలది :** (ఎఱుకలు + అది) సోదె చెప్పే స్త్రీ, ఎఱుకత, ఎఱుకలసాని.

"తఱిఁ దనలోని మేలు తానె యెఱుఁగుఁగాక
ఎఱుకలదానివలె నెట్టు చెప్పీనే" 14-189

**ఎఱుకలుసేయు :** అ.క్రి. తెలియఁజేయు, చెప్పు,తెలుపు.

"తఱినిట్టి పనులెల్లా తగ నీ వెరఁగవలె
ఎఱుకలు సేసునా యిల్లాలు" 7-454

**ఎఱుక లేదు :** అ.క్రి. తెలియదు. రా.సీ.లోనూ, తెలంగాణంలోనూ ఇది మాండలికపదం.

"వలపు చెప్పఁగరాదు వయసుపైఁ బూయరాదు
ఎలమి నాతనికైతే నెఱుకలేదు" 16-278

**ఎఱ్ఱశిల కనుమ :** వి. ఇది రాజంపేట సమీపంలోని పోలి-అప్పరాజుపేట దగ్గర ఉంది. దీనికి కడియాల పల్లెకనుమ అని నామాంతరం. (క.అ.క.కీ.30 పు.)

"ఇది వో నీ కెమ్మోవి యెఱ్ఱశిల కనుమ
కదిసి లేఁజిగురులఁ గప్పుకొన్నది" 5-115

అన్నమయ్య ఈ కీర్తనలలో ఆరు కనుమలను పేర్కొన్నాడు. ప్రతికనుమ దగ్గర ఏ వైపునో ఒకవైపున చెన్నకేశవస్వామి వారి ఆలయం ఉండడం విశేషం. ఈ కనుమలు షట్చక్రాకారంలో ఉన్నాయని, షట్కోణాంత్గతాలని పెద్దలంటారని మై.వేం.సు. గారి అభిప్రాయం. 5 సం. పీఠిక 39, 40 పు.

**ఎలగోలు :** వి. కలకలం, ముందు నడవడం, మొదటి ప్రసరణం, మొదట సటసటమని వచ్చు వాన. విణ. ముందు నడిచేది, మొదటిది.

"వలపుల దాడి వచ్చె వనితలారా మరుం
డెలగో లేయంగఁజొచ్చె నేలాగే" 6-15

**ఎలయించు :** స.క్రి. 1. పురికొల్పు, ప్రోత్సహించు 2. తీసుకొనిపోవు, ఆసక్తిపఱచు,

కలిగించు, పొందించు, ప్రవేశింపజేయు, చేర్చు (శ.ర.)
"పురియై తగులుఁ గర్మ మూడిచితే నూడును
యిరవైన హరిమాయ ఎలఇంపుచున్నవి"
4-474
"గుట్టుతో మంచితనాలే కోరి చూపవలెఁగాక
ఎట్టయెదుటనే వుండె ఇంత యెలయింతురా"
28-300

ఎలయింపు: వి. ఆసక్తిపరచుట, కౌఁగిలింత
"చలమా శ్రీవేంకటేశు సంగతి నీ వుండవో
యెలయింపుఁగోరికల కేల పారే వికను" 4-14

ఎలయింపుకాఁడు: (ఎలయింపు+కాఁడు) వి. ఆసక్తి కలిగించే వాఁడు (ఎలయు = ఆసక్తిపడు), సంతోషింపజేసేవాడు, సొగసుకాడు, రంజకుడు.
"అచ్చుగా నా సరులంటీ నాసోదకాఁడు
యిచ్చటనే కాచుకున్నాఁ డెలయింపుకాఁడు"
18-105

ఎలయింపులాఁడి: (3) (ఎలయింపులు + ఆఁడి) వి. విలక్షణమైన ప్రయోగం. ఆసక్తి కలిగించే స్త్రీ, సొగసుకత్తె చూ: ఎలయింపుకాఁడు.
"అలమేల్మంగపతి నన్నలమె శ్రీవేంకటేశుఁ
డెలయింపులాఁడివి నీ వెంత నేరిచితివే" 29-33

ఎలుఁగించు: (ఎలుగు + ఇంచు) అ.క్రి. 1. కూయు 2. పిలుచు.
"సొలసితే సంతలోనే పొదిగి కాఁగిలించేవు
ఎలుగించితే తల యెత్తి చూచేవు" 20-175

ఎలుగిచ్చు: (2) ప.బం; అ.క్రి. 1. పిలుచు 2. పలుకు, మాట్లాడు, బదులుపలుకు.
"పలుకకుండఁగ నన్నుఁ బచరించి పచరించి
ఎలుగిచ్చి యాడేవెంత సేసేవయ్యా" 14-378
"ఎడనెడఁగోయిలలు యెలుఁగియ్యఁదొడఁగె"
16-37

ఎలుతగుబ్బలు: వి; బహు. వలుదగుబ్బలు, లావైన గుబ్బలు.
"ఎలుతగుబ్బలు నీకు మీదెత్తుక వున్నది
పలచని మోవి జన్నె పట్టుకున్నది" 28-359

ఎల్లందు: (ఎల్ల + అందు) అంతటా.
"ఉల్లము శ్రీవేంకటోత్తమ శరణని
యెల్లందుఁ దుదిపదమెక్కిరి గాన" 4-86
"నిను నెల్లయందుఁ బ్రోచు" అని ఉ.హరి.ప్రయోగం. పూర్వ. 5-162 చూ: భాగవత ప్రయోగం.

ఎల్లనాఁడు: (ఎల్ల + నాఁడు) ఎల్లప్పుడు.
"వల్లెతాట రోలఁగట్టువరచినను పరచినను
ఎల్లనాఁడు మానఁడింక నేమి సేతువే" 24-103

ఎవురు: వి. 'ఎవరు' కు రా.సీ. మాండలికరూపం.
"రాతిరిఁ బగలీతని రతికిఁ గాచుకుండిన
యీ తరుణీమణులలో ఎవురిఁబోలుదువే"
29-351

ఎశోద: (5) వి. 'యశోద'కు వ్యావహారికరూపం.
"యెశోద నీ బిడ్డ నేమందుము
రాశికెక్క మమ్ము రక్షించుమనవో" 23-331
"పెక్కువగా నుట్లలో బిందెలు నించిన నీవే
చక్కనెశోద బిడ్డకుఁ జాటేరు సుండీ" 1-256
"యిల దేవకికిఁ బుట్టి యెశోద కొడుక వైతి
వెలమి నీ సుద్దులకు నిదివో దిష్టాంతము"
16-327
"ఏమమ్మ వూరకుండే వెశోదమ్మా
యీ మేటి బాలకృష్ణు నేమరకువమ్మా" 26-50

ఎస: ఆధిక్యం, అత్యంతం (ఆం.ప.ని.) నానార్థ.

ఎసరు: విణ. విజృంభించు, అతిశయించు, మీరు, సందడించు.
"కసరుచు హరిమీఁది కాఁకల కోపముతో
యెసరుఁజెమట గోర యెమ్మెలఁబిమ్ముచును"
5-372

ఎసరెత్తు: (2) (ఎసరు + ఎత్తు) ప.బం; అ.క్రి. విజృంభించు, ఎసరుపెట్టు, అపకారం చేయడానికి ఒడిగట్టు, హాని చేయతలపెట్టు,

ఎత్తులువేయు, నష్టం చూపించు, బాకీ ఎగగొట్టు.

"వసంతము లాడుతానే వడి నిన్నుఁగాగిలించి

ఎసరెత్తంగా మోహా లింతులెల్లాను"

"కొసరుచు నాతోఁ గూటమి సేసీ

యెసరెత్తకుమీ యింకాను" 5-277

"ఎసరెత్తుక లేల్లేవని తోలక

పసఁదన విధిఁగల పాటే సుఖము" 3-545

"తోడ నెసరెత్తి లేల్లఁ దోలేటి యట్టివారు

యీడనే విందులు చెప్పే రియ్యకోవయ్యా"

7-264

ఎసరెత్తుకొను : ప.బం; అ.క్రి. ఎసరుపెట్టు.

"ఎసరెత్తక వెళ్ళేవని తోలక

పసఁదన విధి గలపాటే సుఖము" 3-545

ఎసవెట్టుకొను : స.క్రి. ప్రేరేపించు, పురికొల్పు, ఎక్కులు పెట్టు.

"యెసవెట్టుకొని సతులెంత పతిఁదిట్టినాను

కొసరులై తోఁచుఁగాని కోపము రాదు" 25-133

## ఏ

ఏఁకట : వి. మిక్కిలి ఆపేక్ష, మిక్కిలి కోరిక, మిక్కిలి ఆశ.

"ఏఁకటతో శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి

తూఁకువ సుమ్మీ పిఱుఁదు తొడ లెక్కమనేవు"

19-307

"ఎన్ని మాఁటలాడినాను యేఁకటలు వాయవు"

20-530

"అలరి మర్మములంటే యాఁకలు మరేటికే"

29-2 (అను.)

"ఆఁకలిగొన్నవానికి - నన్నముపై నుండినట్టు

యేఁకట పుండపలటా యీశ్వరునిపై" 15-46

ఏఁకరు : (22) అ.క్రి. మిక్కిలి కోరిక కలిగియుండు, ఉవ్విళ్ళూరు, భయపడు, కృశించు, దుఃఖాదులచే శుష్కించు. రూపాం. ఏఁకారు.

"మరిగి రతికిఁ బలుమరు నేఁకరేటి దాని

అరిది కోవిల వనాలందు నాడించకురే" 29-264

ఏఁకరుకొను : అ.క్రి. మిక్కిలి అపేక్షపడు, మిక్కిలిగా కోరు.

"కొద దీర మాఁట పలుకులు నీతో నాడెఁగదే

కదలక యిందుకే యాఁకరుకొంటా నుంటివి"

29-358

ఏఁకారు : (17) అ.క్రి. 1. ఉవ్విళ్లూరు, మిక్కిలి కాంక్ష గలిగి యుండు 2. బాధపడు, భయపడు. రూపాం. ఏకరు.

"ఎదురు చూచి చూచి యేఁకారితిని

యిదివో నీ విట్లానైతే యేమనఁగవచ్చును"

23-398

ఏఁగుఁబెండ్లి : (4) (ఏగు + పెండ్లి) వి. పెండ్లియైన తరువాత వధూవరులను ఊరేగించే ఉత్సవం.

"పైపై నీ కిదివో పల్లకి పెట్టింపె నమ్మ

యీపొద్దే తమకు నేఁడేఁగుఁబెండ్లి" 7-55

ఏఁటనేఁట : (ఏటన్ + ఏటన్) ప్రతి ఏడు, ప్రతిసంవత్సరం.

"ఒప్పుగ శ్రీవేంకటాద్రి నున్నతిఁగోనేటిలోన

తెప్పరిల్లె నేఁటనేఁట తెప్పతిరుణాళ్ళు" 2-143

ఏఁట బుట్టెడువాఁడు : వి. వసంతుడు (?)

"ఏఁటఁబుట్టెడివాఁడు నేడు దెరువులై

వ్రూఁటాడెడివాఁడు నొనగూడి" 5-139

ఏఁటలువేయు : పద.పా.లో ఏటవేయు అనే పదానికి భారం వేయు అనే అర్థం చూపబడింది. చూపులు నిగుడ్చు అని తె.తె.ని.

"వేఁగి లేచి సంసారవిధులకే ఒడిగట్టి

యేగతిఁ నొసరి నీపై నేట వేసెము" 4-2

ఈ అర్థం క్రింది ప్రయోగంలో కుదరడం లేదు.

"గాఁఅపు నా గుబ్బలు గదలించి పైపై

నేఁటలువేసి నిది యేమే ఆఁసు" 16-81

ఇట 'ఏటలు' కు బదులు 'ఏఁటులు" అని గ్రహిస్తే సముచితమేమో! 'ఏటవేయు' అనే దానికి 'భారంవేయు' అనే అర్థం మాత్రం ఈ కింది కీర్తనలో పొసగుతుంది.

"వేగిలేచి సంసారవిధులకే ఒడిగట్టి

యే గతిఁగొసరి నీపై నేటవేసేము" 4-2

ఏఁటవెట్టు: ప.బం; అ.క్రి. భారంవేయు; ఏటు = బలిపిల్ల - మేక అనే అర్థమున్నది. తద్వారా ఏట వేయు = బలియిచ్చు, మొక్కుబడి చెల్లించు తొలి అర్థం కావచ్చు. అర్థమింకనూ విచార్యమని పద.పా. ఏటవేయు, ఏటవెట్టు సమానార్థకములే కావచ్చు. గురిపెట్టు అని తె.తె.ని.

"మాటలలో తీపులును మాయదారి చూపులును

యేఁటవెట్టి నడపితి విందాఁకాను" 19-394

"ఈటుతో శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి

యేటవెట్టే యీలాగు లేమి చేప్పేమయ్యా"

12-285

ఆనందమూర్తిగారు దీనికి చూపు నిగుడ్చు, దృష్టిని సారించు అనే అర్థాలను సూచించినారు.

"యేఁటవెట్టి పతితోడ మాటలాడి వేగిరాన

గాఁటపుటందెలు తన కరమునఁ బెట్టినే" 20-121

సంపాదకులు దీనికి అతిశయించు అనే అర్థాన్ని ఊహించినారు. ఎత్తిపొడిచి, వ్రేలుచూపి ఇత్యాదులుగ తోచుచున్నది. ఎత్తులువేసి ఆడుటకు కావచ్చునా" అని సంపా. (25-64)

అతిశయించు:

"మాటలనే తేనెలూరీ మంతనాన నోరూరీ

యేటవెట్టే నీ మహిమ లెక్కడెక్కడ" 27-292

ఏఁటి: 'ఏమిటి'కి వ్యావహారికరూపం, ఏమిటి, ఏరకం, ఏది.

"జాలిఁబడి సంసారజలధిలో మునిగేటి

కూళఁడ నాకేటి తేకువ పుణ్యము" 1-286

"ఎక్కడి దురవస్థ లేటి దేహము లోనఁ

జిక్కి జీవుఁడు మోక్షసిరిఁ బెండలేఁడు" 1-106

ఏఁటికి: ఎందుకు.

"మతిలో నాతఁడుండఁగా మాయలు మా కేటికి"

4-13

ఇందులోని అరసున్న విచార్యం. నిఘంటువుల్లో ఊపదంలో అరసున్న కానరాదు.

ఏఁడు: వి. ఏఱు.

"నీటి నడు మడచితే నేఁడు రెండౌనా

యేటి కింక గొంకేవు యింతిఁ జేకోవయ్యా"

9-75

ఏఁపు: స.క్రి. 'ఏఁచు' ధాతువునకు ప్రేరణార్థకం, బాధించు.

"ఎదుట నీవుండఁగాను యేపే మరుఁడో

అదివో గుండె బెదరి అవ్వలి మోమైతి యంటా"

7-316

ఏఁపులఁబెట్టు: స.క్రి. బాధలఁబెట్టు. (ఏపు = సంతాపం, బాధ)

"కాఁపురాలు సేసేమని కాచుకున్నవారి నింత

యేపులఁబెట్టితే నిన్ను నెట్టు నమ్మె రికను"

25-101

ఏకచిత్తము: (18) వి. ఒక్కమనసు, ఏకాభిప్రాయం, సంతృప్తి.

"ఏకచిత్తమైనవు డిన్నియు మరె (ర)య్యాఁగాని

నాకు నీ వేళకు నీ నవ్వులె చాలు" 9-110

నిశ్చింత, సంతృప్తి:

"నీకుఁ గట్టినట్టి తాళి నీ మారు సేసుకొని

యేకచిత్తమున నే నింట నుండఁగా" 11-587

ఏకతమాడు: అ.క్రి. రహస్యంగా మాట్లాడు.

"యిద్దరమేకతమాడె యీవేళ మనవద్ద

గుద్దిరాన నాపె వచ్చి కూచున్నది" 9-4

ఏకతవేళ: (2) (ఏకతము + వేళ) వి.

1. ఆలోచనవేళ, సంప్రదింపువేళ
2. ఒంటరియైనవేళ, ఏకాంతసమయం.

"దగ్గరి నీ వున్నపుడే తలఁచఁగాని

సిగ్గున నేకతవేళఁ జింతింతురా" 12-44

ఏకమగు: అ.క్రి. (?)

"యీకడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె

యేకమాయ సగినము యింటికిఁ బోవయ్యా"

18-519

ఏకరాజ్యము: వి. ఏకచ్ఛత్రాధిపత్యం గల రాజ్యం.

"ఇన్నిటా నీ వేకరాజ్య మేలుదుగాక
మన్నన కాంత వైతివి మరి యాలే వెలితి "
7-274

**ఏకసమ్మతి :** వి. ఒకేవిధమైన అభిప్రాయం, ఒక్క మనసు.
"ఏరీతిఁ జూచినాను యేకసమ్మతి లేదు
సారము దెలియరాని సంసారికి" 3-256

**ఏకాంగవీరుఁడు :** (6) వి. ఒంటరివీరుడు, అసహాయశూరుడు, ఎదురులేని వీరుడు.
"విలసిల్లె నేకాంగవీరుఁడితఁడు
చలమరి కోదండదీక్షాగురుఁడితఁడు" 4-514

**ఏకాంగి :** వి. 1. విరక్తుడైన విష్ణుభక్తుడు, పుత్రమిత్ర కళత్రాదులను పరిత్యజించి భగవత్కైంకర్యమే పరమ ప్రయోజనమని కావి వస్త్రాలు కట్టు కొని భగవత్కైంకర్యార్థం శరీరాన్ని, ప్రాణాన్ని, అర్థాన్ని తృణప్రాయంగా చూస్తూ విరక్తుడైన విష్ణుభక్తుడు.
(2. ఒంటరీడు)
"విరులు యేకాంగులు వినువీథిఁ జల్లఁగాను
గురుతరముగ మించీఁ గోడతిరునాళ్లు" 18-281

**ఏకాంతమాడు :** అ.క్రి. మంతనమాడు, రహస్యము లాడు.
"పిప్పిరైయి మేని కస్తూరి బేట్లెల్లా రాలఁగాను
యిప్పుడే మేకాంతమాడే నింతి నీతోను "
17-149

**ఏకాంతవీరుఁడు :** వి. ఏకాంగవీరుఁడు (?), 'గట్టివీరుడు' కావచ్చు.
"భువిఁ గవచకుండలములతోఁ బుట్టినవాఁడు
వివరించ నేకాంతవీరుఁ డైనవాఁడు" 4-486

**ఏకాంతి :** వి. ఏకాగ్రత కలవాఁడు, విష్ణుభక్తుడు.
"ఏకాంతు లిరువంక నెదిరి కొలువఁగ సకల
లోకేశ్వరుఁడు మెరయఁగాను" 5-228

**ఏకాత్మవాది :** వి. జీవాత్మ పరమాత్మలకు భేదం లేదని చెప్పే అద్వైతమతస్థుడు.
"ఏకాత్మవాదులాల యిందుకేది వుత్తరము
మీకు లోకవిరోధమేమిటఁబాసీ నయ్యలాల "
2-253

**ఏకారు :** స.క్రి. 1. అవలంబము లేక తిరుగు 2. దైన్యంతో యాచించు (ఆం.ధా.మా.)

**ఏకార్ణవమునాఁడు :** ప్రపంచమంతా ఒకే సముద్రమైననాడు అంటే ప్రళయకాలం నాడని అర్థం.
"ఈతఁడాకుమీఁదఁ దేలె నేకార్ణవమునాఁడు
యీతఁడే పోరి మనకిందరికి దైవము" 2-470

**ఏఁకు :** స.క్రి. దూఁకు.

**ఏకోదకము :** (ఏక + ఉదకము) అంతా జలమయమగుట.
"ఏకోదకముగ వటపత్రమున యీఁదేటి నీకంటే
దీకొని పలికినకాలంబుల కొనదేవుఁడు మఱి
వేఁడీ" 4-104

**ఏకోనారాయణుఁడు :** వి. నిత్యుఁడొక్కడే యైన నారాయణుడు. (ఏకః + నారాయణుడు)
"నీకంటేనితరము మరిలేదు నేనెవ్వరితో
భాషింతు
యేకో నారాయణుఁడవు నీవని యెన్నుచు
నున్నవి వేదములు" 4-103

**ఏఁగించు :** స.క్రి. ఊరేగించు.
"ఎలమితో వీదులెల్ల నేఁగించినారు" 11-61

**ఏటల మాయలు :** వి. అధికములైన మాయలు. (ఏట = అతిశయం, అధికం)
"నాటుకొన్న తమకము నాకుకు నొక్కపాటె
ఏటలమాయల యెరవేఁటికింక" 10-2-17
"నాఁటించే యింతి కోరిక యానకు వచ్చుఁగాక
ఏటతో చెలుల మింతే యేమిసేసే మిపుడు "
23-500

**ఏటవెట్టు :** (?)
"గూటిలో దవ్వులవాఁడు కొండెలెల్లా
నునుపంటా
యేటవెట్టి యేఁగినట్లే హీహీ నేము" 1-94

**ఏటావలిగిలిగింతలు :** ప.బం; వి; బహు. కానిపని, అసంభవం, వ్యర్థం. ఏటి యవతలినుండి యివతలికి చేతులు చాచి గిలిగింతలు పెట్టడం అసంభవం కదా!

అలభ్యములు, ఏటికి అటువైపున ఉన్న సంబరాల్లో పాల్గొనడం అసంభవం. ఇట ఏరు దాటకుండా ఆటంకంగా ఉందన్నమాట. ఉన్నా లేనివాటితో సమానమైన సుఖం.

"కదియక ఆడనుండే కత లేల చెప్పీని

కెదటుచు నేటావలిగిలిగింత లంటునా" 22-2

-ఏటి: ఎడి, ఎడులకు వ్యావహారికరూపం.

"నుడిగేటి" 2-104

ఏటినడిమి పైరు: ప.బం; వి. అశాశ్వతం, వ్యర్థం. ఏటినడుమ పైరు వ్యర్థమే కదా! ఏరువచ్చినపుడు కొట్టుకొని పొయ్యేదే కదా!

"దాకొని విష్ణుని తెలియని తెలువులు

తగ నేటినడిమి పైరులు" 2-235

ఏటిలో పైరు: ప.బం. అశాశ్వతం, వ్యర్థం, పంట ఎంత బాగా పెట్టినా ఏటిలో పంట ఎప్పుడు ఏరువచ్చినా కొట్టుకొని పోయేదే కదా!

"ఏ పనులు సేసినా నిటువలెనే పో

యీ పనికిఁ జొరవిపని యేటిలోపైరు" 1-364

ఏటేటివి: ఏవేవి, ఏమిటివి - ఏమిటివి, ఏవేవో.

"యేకతము చెప్పీనంటా నేటేటివో

పలికీని కాకు సేతురటవే కాంతలను" 13-47

ఏట్లపేడ: వి. తిరుపతినుండి తిరుమలకు వెళ్లేదారిలో పల్లవరాయ మఠానికీ, అవ్వచరి కోనకూ నడుమ ఉండే ప్రదేశ విశేషం.

"అక్కజంబైన పల్లవరాయ మటము అల యేట్లపేడ గడవన్

చక్కనేగుచు నవ్వచరిఁగడచి ..............."

1-227

ఏడ: (20) 'ఎక్కడ' అనే పదానికి వ్యావహారికరూపం. అన్నమయ్య 'ఏడ' అనే పదాన్ని ఎక్కువగా వాడినాడు. రా.సీ. లో నేటికీ ఈ పదానికే ఎక్కువ వాడుక. అన్నమయ్య ఎక్కడ అనే పదాన్నికూడా వాడినా అతి విరళంగా వాడినాడని చెప్పవచ్చు. ఆడ, ఈడ అనే పదాలు అం.మ.భా. లో కనిపించకున్నా 'ఏడ'కు మాత్రం ప్రయోగాలు కనిపిస్తున్నాయి. (III - 2 అ)

"ఏడ పని గలిగో మీరెక్కడో పోతావచ్చి

యీడ కాతఁడంపె నంటా యిచ్చలాడేరు"

14-251

ఏడకేడ: దానికీ దీనికీ సంబంధమే లేదనే అర్థంలో వాడబడే పదబంధం, పోలిక కందదని భావం.

"ఏడకేడ రుకుమిణి నెలయించి యింటికి

వేడుకతోఁ దెచ్చుకొంటివిగా నీవు" 13-502

ఏడకేడో: (2) ప.బం. దానికీ దీనికీ సంబధమే లేదనడం.

"కూడిన వేడుకలకు గుఱి గావచ్చుఁగాక

యేడకేడో వేడుకల కింపు పుట్టీనా" 12-368

ఏడది: ఎక్కడిది.

"ఆటదానిఁగంటే పతి ఆదరించనేవలె

వేటకానివలె నంటే వేడు కేడది" 1-227

ఏడలేని: విణ. ఎక్కడలేని, విరళమైన.

"ఏమి నేరిచితివి (యే) లేల

వేమారు గొల్లెతలును విడిచిరి సిగ్గులు"

"ఏడలేని సుద్దులు" 27-250

ఏడిగట్టించు: స.క్రి. ఏడ్పించు (?) ఈ పదం నిఘంటువుల్లో కానరాదు.

"మొగము చూచి నా మొగమాట మిదియే కా

నగుతా నేమిటికైన నన్నేడి గట్టించెను" 12-52

ఏడుగురు బంటులు: వి; బహు. సప్తవ్యసనాలు.

"దంటతనంబునఁ దమయిచ్చఁ దిరిగాడు

బంటు లేడుగురు బలవంతులు" 1-61

ఏడుజానల మేను: వి. అత్యల్పశరీరం, ఏడుజానల ప్రమాణం కల శరీరం.

"యేడుజానల మేనిలో

నిందిరానాథుఁడున్నాఁడు

వేడుకతో నతనిని వెదకరో" 4-475

ఏడేడ: (ఏడ + ఏడ) ఎక్కడెక్కడ.

"నవ్వుతా నీవంత నాకు నీ మోవియ్యఁగాను

యెవ్వల నీకేడేడ నా యొంగి లాయనో"

16-298

**ఏడోనుండి :** ఏడనుండో, ఎక్కడనుండో. ఇట సందేహార్థకమైన 'ఓ' అనేది నుండి పై చేరాల్సి ఉండగా ఏడశబ్దం మీద చేరడం విలక్షణం. ఇట్టి ప్రయోగాలు అన్నమయ్య సంకీర్తనల్లో ఐదారు కనిపిస్తాయి. ఉదా :- ఎవ్వతో చేతలు (ఎవ్వతె చేతలో) 19-333 మొ॥

**ఏతరి :** (ఏతు+అరి) వి. 1.ఉద్ధతుడు, గర్వి 2.నిరంకుశుడు, స్వేచ్ఛావిహారి 3.లోభి, దురాశ కలవాడు 4.క్రూరుడు, దుర్నయుడు, కుత్సితుడు. (వంచకుడని ఆం.వ.ని.)

"పాతకపు రాకాసి పల్లెలు చూరలు గొన్న

యేతరపై నేరమి మా కేఁటి కిఁక నెన్న"

5-48 & 1-31

**ఏతరికత్తె :** (ఏతు + అరి + కత్తె) వి. చెడ్డది, గర్విష్ఠురాలు, నిరంకుశురాలు, లోభం కలది, దుర్నయురాలు, ఎదిరించి పనిచేసే గుణం కలది.

"ఆతుమలో మెలఁగేది అవుఁగాములు చూడదు

యేతరికత్తె గుణాలే యెఱుఁగము గాని" 24-377

**ఏతరికాఁడు :** (ఏతు + అరి + కాఁడు) వి. చెడ్డవాడు, క్రూరుడు, గర్వి, నిరంకుశుడు, లోభి, దుర్నయుడు.

"రాతిరి బగలు నిట్టే రతుల నోలాడుఁగాక

యేతరికాని కెంతైనా నెంగిలి గద్దా" 16-36

**ఏతరితనము :** (5) (ఏతు + అరి + తనము) వి. చెడ్డతనం, క్రూరత్వం, ఔద్ధత్యం, గర్వం, నిరంకుశత్వం, లోభం, దుర్నయం.

"ఏతరితనము నను యేల పరాకై వుండేవు

నీతో నవ్వినయట్టె నవ్వవయ్యా" 14-192

**ఏతరిది :** (ఏతు + అరి + అది) ఉద్ధతురాలు, గర్విష్ఠి స్త్రీ, నిరంకుశురాలు, స్వేచ్ఛావిహారిణి, లోభం కల స్త్రీ, దుర్నయురాలు, క్రూరురాలు.

"అతడెంత నీవెంత అవునే మేలు

యేతరిదానవు నీకు నెంచనున్నదా" 7-479

**ఏతరివాఁడు :** (2) (ఏతు + అరి + వాఁడు) 1. ఉద్ధతుడు, గర్వి 2. నిరంకుశుడు, స్వేచ్ఛావిహారి 3. లోభి 4. దుర్నయుడు, క్రూరుడు.

"ఆతనితో నేల పంతాలాడేవే నీవు

ఏతరివాఁడు గుట్టుతో నెడయఁగ నేర్చునా"

7-367

**ఏతరీఁడు :** (2) (ఏతు + అరి + ఈఁడు) వి. చెడ్డవాడు, క్రూరుడు, నిరంకుశుడు, లోభి, దుర్నయుడు.

"ఏతరీఁడ తిరువేంకటేశ నన్ను నేలితివి

ఏతులతో వలపించ నెంత కలికివిరా" 5-222

**ఏతలన్ :** (ఏ + తలన్) ఎక్కడ, ఎప్పుడు.

"ఏతలఁజూచినా నాకు నేడు గడయు నీవె

ఆతల నీతల నన్ను నాడుకొని కాచితి" 10-39

**ఏతాయాతనఁబడు :** (యాతన + యాతన + పడు) దుర్భరమైన యాతనపడు అనే అర్థంలో జానపద వ్యవహారం కాబోలు.

"యెందరో సంపదలకు లోనై

యేతాయాతనఁబడువారు" 2-138

'యేతాయాతన' అనే రేకుల్లోని రూపాన్ని సంపాదకులు 'యాతాయాతముల' కావచ్చునని సందేహించినారు. కాని ప్రకృతార్థానికి 'యేతాయాతనల' అనే పాఠమే యుక్తంగా కనిపిస్తున్నట్లుగా భావించవచ్చు.

**ఏతు :** (6) వి. 1. దంబం, డాబు, ఉద్ధతి 2. దోషం, లోపం 3. గర్వోక్తి, బడాయిమాట.

"యేతు నీకుఁ గలిగితే నెందైనాఁ జూపుదుఁగాక

ఆతని నావద్దఁ దిట్టే వదేమే నీవు" 11-312

"నీ తగులు చూపితివి నెగులెల్లాఁ బాపితివి

యేతు నీకు గనమాయ" 11-412

**ఏతులది :** (ఏతులు + అది) గర్వోక్తులు పలికే స్త్రీ, బడాయి మాటలది, ఉద్ధతురాలు.

"వేడుక నవ్వి వేసాల ప్రియాలు చెప్పి

యేడనైనా మేలమాడే యేతులదాననా" 27-539

**ఏతులాఁడి :** (2) (ఏతులు + ఆఁడి) వి. హెచ్చులాఁడి, ప్రగల్భాలు పలికే స్త్రీ.

"అవధరించవయ్యా ఆపె సేసే చేతలు
తివిరి చేతులు చాచీ దిట్ట యేతులాఁడి"
26-254

ఏతులాఁడిది: (ఏతులు + ఆఁడి + అది) వి. హెచ్చులాడి, ప్రగల్భాలు పలికే స్త్రీ.

"ఈతనిఁ జూడఁగదే యిన్నిటికి లోనైనాఁడు
ఏఁతులాడి దానితోడ నెంత మొకదాకిరే"
16-561

ఏతులాఁడు: వి. ప్రగల్భాలు పలికే వాడు.

ఏతులాడు: (ఏతులు + ఆడు) వి. ప్రగల్భాలు పలుకు.

"గాఁటపు శ్రీవేంకటేశ కడపలో నన్నుఁగూడి
యేఁటవెట్టే వంటిఁగాక యేతులే మాడితినే"
13-357

ఏతులు: (70) వి; బహు. బడాయిమాట(లు), గర్వోక్తులు, ప్రగల్భాలు, ఎచ్చులు, గొప్పలు.

"ఏతులఁజూపినందుకే యెదుటఁ దలవంచీని
చేతఁ జిక్కు నొక్కరాదా చెలఁగి యే మాయను"
13-182

"యేతులకు నవ్వితేను యెగ్గు లెంచఁబనిలేదు
యాతల నన్నుఁజూచి తానేల సిగ్గువడీనే"
16-64

'ఏతు' అనే పదం కన్నా 'ఏతులు' అన్న బ.వ. పదానికే ఎక్కువ ప్రయోగాలు ఉన్నాయి. తెలంగాణంలో ఈ పదం వాడు ఏతులోడు, వానికి ఏతు లెక్కువ, ఏతులకు పోతాడు మొదలైన ప్రయోగాల్లో ఇప్పటికీ బాగా వాడుకలో ఉన్నది.

ఏతువ: వి. ఈ శబ్దం నిఘంటువుల్లో కానరాదు. ఇది 'హేతు' శబ్దభవం కావచ్చు, కారణం, నెపం.

"యెచ్చరించి నే నేమైనా యేతువ లెత్తితినా
పచ్చి దేర నీవే నేగు పడేవు గాక" 19-206

ఏతువలెత్తు: చూ: ఏతువ. నెపము ఎత్తిచూపు. ఈ అర్థంలో నేటికీ ఏతువలెత్తి మాటలాడినాడు అనే వ్యవహారం ఉంది.

"యివలా నావలా యేతువలెత్తీ నంటా
దేవుల కేల కొంకేవు దిట్టవాఁడవు" 26-578

"ఆతుమెల్లా నీవు నాతో నట్టె చెప్పితివంటా
ఏతువలెత్తి నీమీఁద యెమ్మె చూపీ నాపె"
21-285

ఏతువు: వి. హేతుశబ్దభవం కావచ్చు. అర్థం సరిపోతుంది. ఏతువలెత్తి మాట్లాడినాడు అనే వ్యవహార మీనాటికీ ఉన్నదట. నెపములెత్తి చూపుట అనే విశేషార్థంలో పై వ్యవహారం ఉందని సం.ప.స. (18 సం. 428 పు.)

ఏతువులెత్తు: ఉద్ధతి కలుగు.

"మలసి యేతువులెత్త మాటలాడవలెనా
వలచి నిన్నుఁబాయక వసమైనవానికి" 19-321

-ఏది: భావార్థంలో ధాతువులపై చేరే పదం. ఉదా :- కొసరేది 7-68, కలిగేది 2-176, అయ్యేది 2-175, వెలసేది, పోసేది, తలఁగేది, విడిచేది, బలిసేది, చెందేది, బదికేది 2-411 మొ॥ ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి.

ఏదు: (?)

"చక్కెర యేదుగా నైతే చవి మొగచాటు గాదా
వొక్కమారే యింత గద్దా వూరకుండవయ్యా"
7-108

ఏదు: (ఏద?) వి. 1. ఏకాగ్రత, అవధానం 2. విచారం, వ్యాకులత 3. మనసు.

"పెదవిపై సుద్దులు ప్రియముల బుద్ధులు
ఏదుగాఁ జదివితివి యిపుడు నీవు" 8-275

ఇందలి 'ఏదు'గా అన్న పాఠం 'ఏదగా' కావచ్చు.

ఏదుల తీఁట: వి. (?)

"ఏఁటిమాట యేదుల తీట
జూటికపువాని సుద్ది చెప్పకురే మీరు" 24-152

ఏదోపాదో: ప.బం. పాదపీఠికలో సంపాదకులు 'ఏటోపాటో' అని రేకు అని తెలిపినారు.

"తిలకింపఁ జందనము తేలో పామో
యెలమిఁ గోవిలకూఁత యేదో పాదో" 5-193

**ఏనిగ:** వి. 'ఏనుగు'కు వ్యావహారికరూపం. అన్నమయ్య 'ఏనిగ' తో పాటు ఏనిగె, ఏనుక, ఏనుగ, ఏనుగు అనే రూపాలనుకూడా వాడినాడు.

"ఎక్కినంతలోననే యేనిగ గుజ్జా
అక్కరై మా యింటికి రా కాతఁడట్టె వుండీనా" 21-89

**ఏనిగె:** (4) వి. 'ఏనుగు' కు వ్యావహారికరూపం. చూ: ఏనిగ.

"యేనిగె తొండాలఁబోలే ఇంతి తొడల మీఁదట
ఆనించేవు నీ పాదము లంత కోపేవా" 24-431

"ఏనిగె నడపు పాదాలు" 17-121

**ఏనుఁగ:** (16) 'ఏనుగు'కు వ్యావహారికరూపం.

"కడు మదించిన హంకారమనే యేనుఁగపై
యెడనెడ నెక్కి తోలీనదె జీవుఁడను" 3-386

**ఏనుక:** వి. 'ఏనుగు'కు వ్యావహారికరూపం. ఏనిగ.

"నునుపునడపుల యేనుక పెద్ద యడవి
చెనకు నట్టనడిమి సింహపుటడవి" 5-153

**ఏనుగ:** (7) 'ఏనుగు'కు వ్యావహారికరూపం. చూ: ఏనిగ.

"పీఁపునఁ గుచాలు మోపి వెలఁది
కౌఁగిలించఁగా
నేపున నేనుగ నెక్కె నిదె దేవుఁడు" 7-58

**ఏనుగ చేతి చెఱకు:** ప.బం; వి. త్వరలో నశించేది.

"తానూఁ జేతికి నీఁడు దగ్గరి తీసుకోరాదు
యేనుగ చేతి చెఱకే యీ మోహము" 19-407

**ఏనుగ బిడ్డఁడు:** వి. ఏనుగువంటి శిశువు, పెద్దబిడ్డ.

"దేవతలు జయవెట్ట దేవకి గర్భమునందు
యీవేళ నేనుగ బిడ్డఁడిదె జనించె" 22-92

**ఏనుగవీధి:** వి. పెద్దవీధి, రాజవీధి.

"శ్రీతిరుమలపతి శ్రీవేంకటపతి
ఏ తెరువేగిన యేనుగవీధి" 23-589

**ఏనుగుతో ఏలాటాలు:** ప.బం; వి; బహు. శక్తికి మించిన పనులు.

"నానాఁడు నిన్నుఁ దగిలే నాకే కాక
యేనుఁగుతో యేలాటాలు యెవ్వరి కేలోయి" 16-138

**ఏనుగు దిన్న వెలగపంటి బేసము:** ప.బం. తనకు తానే అదృశ్యమగునది. ఏనుగు తిన్న వెలగపండు లోని గుజ్జు అదృశ్యమై వట్టి వెలగపండు బయట పడుతుందని ప్రతీతి.

"సిరిదాఁబోయినఁబోవును
కరి మ్రింగిన వెలగపండు కరణిని సుమతీ"

అని సుమతి శతకం.

"లలి నేనుగు దిన్న వెలఁగపంటి బేసము
వలెనే పోఁగలవెల్ల వడిఁదానే పోవురే" 2-140

**ఏనుగునెక్కి దిడ్డిదూరు:** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూను, అనుచితమైన పనికి పూను.

"హరి నీకు నిచ్చునట అనుమానమేల
తెరలి యేనుగునెక్కి దిడ్డు దూరెదరా"

**ఏ నోర అడుగు:** ప.బం. ఏ ముఖం పెట్టుకొని అడుగు; అడగడానికి నోరు రాదని భావం.

"సేయరాని పాపములు సేసి వచ్చి యేనోర
నా యెడ నిన్ను వరములడిగేను" 4-2

**ఏ నోరుపెట్టుక:** ప.బం. ఏ ముఖం పెట్టుకొని, అడుగడానికి నోరు రాదని భావం.

"ఏ నోరు వెట్టుక నిన్ను నేమని కావుమందును
నే నిన్నుఁ దలఁచినది నిమిషమూ లేదు" 3-60

**ఏ పొద్దు:** (2) వి. అన్నిసమయాలు, ఎల్లప్పుడు.

"నెలఁతకు ఏ పొద్దూ నీ మీదిదే పరాకు" 7-428

**ఏమందుకునైనా:** (ఏమి + అందుకు + ఐనా) దేనికైనా, దేనికొఱకైనా, అందుకు అనే పదం దానికి అనే అర్థంలో మాండలికం.

"యేటికి నవ్వితివయ్యా యెఱఁగము నే మా
పని
నాటకుఁడవే మందుకునైనా వచ్చును" 23-208

ఏమని చెప్పు: ప.బం; స.క్రి. వర్ణింపసాధ్యం కానిదగు, చెప్పవీలు కానిదగు.

"ఎట్టు వలపించితివో యేమని చెప్పేది
చుట్టమ వన్నిటా నీవు సుదతికి నైతివి" 14-593

ఏమాట కేమాట: ప.బం. ఒకమాటకు ఒకమాట.

"ఏ మాఁట కే మాఁట యేలరా
నా మోము చూడవే నవ్వే నేను" 26-65

ఏమి గట్టుకొను: (19) ప.బం; అ.క్రి. ఏమి లాభం పొందినావు అనవసరంగా ఇతరులను బాధించడం తప్ప అనే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"ఏమి గట్టుకొంటివి నీ విందువంకను
కామించిన మే లొక్కటే కట్టుకొనరాదు" 27-94

ఏమిరే: సం.ప.స. లో దీని వివరణ మిట్లున్నది. "ప్రార్థనార్థక మ.పు; ఏక; బహు. లందు పు-రులపై వచ్చు చెప్పవే, చెప్పరే వంటి రూపము అన్యయముపై గూడ చేసినట్టు కానవచ్చుచున్నది లేక ఏమిరా అను పుం రూపమువలె, ఏమిరే స్త్రీలింగరూపమైన కావచ్చు ఈ వాఙ్మయంలో ఏమిరే అని పుం.రూపప్రయోగములును కలవు. సంబోధక 'రి'కి వ్యావహారికరూపమైన 'రే' లోని శేషభాగమైన నకారములు" ____ ఏమైనా ఇదొక విలక్షణప్రయోగమే.

"చెందమ్మి కన్నులవాఁడు చేతి పిల్లఁగోవివాఁడు
యిందు వచ్చెఁ గంటిరా ఏమిరే యమ్మా" 18-14

ఏమో సేయఁగఁబోఁగా నేమో అగు: ప.బం. అ.క్రి. ఒకటి చేయబోతే మరొకటి అగు.

"ఏమో సేయఁగఁబోఁగా నేమో ఆయ
యేమని చెప్పుదుఁ బను లిటువంటివే" 9-87

ఏరాలు: వి. 1. తోడికోడలు 2. సవతి.

"ఏరాలిఁ బొగడఁగా నేమీ ననముగాక
మీ రెంతేసి జాణలు మీకే తెలుసులే" 26-215

"అక్క యేమే చెల్లెలేమే అందులో భేదమున్నదా
నిక్కి యేరాండ్ల మైతే నేర మాయనా" 21-131

ఏరుగట్టు: అరకకట్టు (ఏరు = నాగలి)

"ఎనుపోతుతో నెద్దు నేరుగట్టినయట్లు
యెనసి ముంద సాగదేటి బ్రదుకు"

ఏరుగుడిచి కాలువఁ బొగడు: (4) నానుడి; ఒకదానివల్ల లాభం పొంది మరో చిన్నదానిని పొగడు.

"గరిమ నేరు గుడిచి కాలువఁబొగడఁబోతే
యెరవెరవే కాక యిత వయ్యీనా" 3-67

"ఈతని నెఱఁగకుంటే నిల స్వామిద్రోహము
ఘాతల నేఱుగుడిచి కాలువ పొగడుట" 3-536

ఏరు దాఁటిపోవు: ప.బం; అ.క్రి. తప్పించుకొని పోవు, దొరకకపోవు. (పద.)

"ఈరసపుసంసార మింగలము దగిలించి
యేరుదాఁటి పోయె నెటువంటి జాణే" 1-173

ఏరు నిద్దురవుచ్చు: (3) ప.బం; అ.క్రి. అసాధ్యమగు పనికి పూను. (నదిలో అలలు లేకుండ ప్రవహింపజేయు అని వాచ్యార్థం.)

"సగము సగము గొంకి సత్యము లెవ్వరితోడ
నిగిడించి మొక్కి యేరు నిద్దురవుచ్చినే" 11-244

ఏరు నిద్రపుచ్చు: చూ: ఏరు నిద్దురవుచ్చు.

"గారవించి నన్నుఁగూడె కడు నిచ్చకము చేసి
యేరు నిద్రవుత్తురటే యింతలోఁదాను" 19-221

ఏరుపడు: (2) అ.క్రి. 1. తేటపడు 2. నిర్ణయింపబడు 3. బయటపడు 4. రూపుపడు, వేఱుపడు.

"యెడసి యీ గురుతిది యేరుపడ దిందాఁక
అడియాలము గంటిమి ఆనతేల వోయి" 11-112

ఏల: వి. ఏలపాట. నాయకాహ్వానం కలిగి, మ్లేచ్ఛ పరిభాషతో రాగమిళితమై, శృంగారాత్మకమైన పాట. దీనినే యా(ఏ)లపాట అనీ, యా(ఏ)లపదమనీ అంటారు. ఉదా :-

"మేడలెక్కి నిన్ను జూచి
కూడేననే యాసతోడ
వాడుదేరి ఉస్సురందురా వేంకటేశ

యాడనుంటి విందాకానురా" 13-223
ఏలపదము: వి. చూ: ఏల.
ఏలాట: వి. ఒకానొక ఆట.
"అక్కరతో నంతలోనె యాసల మాటాడుకొంటా
ఇక్కడ మీరెందాకా నేలాటాడేరు" 23-36
ఏలాటపువాఁడు: (ఏలాటము + వాఁడు) వి. పరిహాసకాడు, తచ్చనకాడు.
"అలించి శ్రీవేంకటేశ అట్టే నన్నుఁ గూడితివి
ఏలాటపువానివలె నట్టిపెనఁగేవు" 14-277
ఏలాటము: (11) (ఏల + ఆట) వి. పరిహాసం. ఇందలి 'ఏల' 'హేలా' శబ్దభవం కావచ్చు.
"ఎప్పుడును దొరలతో యేలాటము లైనా మేలు
చప్పనైన నీచులతో సంగాతాలకంటెను"
"నను మన్నింతువు గాన నమ్మి కడఁగితిఁగాని
యెనసి యేనుగతోడ యేలాటమున్నదా"
20-114
ఏలాటాలాడు: (2) అ.క్రి. పరిహాసాలాడు.
"ఏడో సతులతో నీ వేలాటాలాడితి వంటా
ఆడరాని మాటలు నే నాడవచ్చునా" 26-597
ఏలికసాని: (2) వి. రాణి, దొరసాని, యజమానురాలు. రూపాం. ఏలికెసాని.
"ఎఱఁగవా ఆపె మాకు నేలికసాని యాత
గుఱిసేసి నన్ను నేల గుట్టుతో మెచ్చేవే"
29-14 & 1-464
ఏలికె: (20) వి. 'ఏలిక'కు వ్యావహారికరూపం, రాజు, ప్రభువు.
"ఏలికె గల బంటుకు యెక్కడిది విచారము"
2-237
అన్నమయ్య ఏలిక అనే రూపాన్ని కూడా వాడినా 'ఏలికె' అనే రూపాన్నే ఎక్కువ పర్యాయాలు వాడినాడు.
ఏలికెసాని: (3) రాణి, దొరసాని, యజమానురాలు. రూపాం. ఏలికసాని.
"ఐతివే ఏలికెసాని వందరికిని
నీతితో సవతులెల్ల నీకు లోనే యిఁకను" 13-151

ఏలినవాఁడు: వి. ప్రభువు, భర్త.
"యేలినవానితోడ యెగసక్కెమాడనేల
నోలిగాను తప్పక చూమట గాక" 14-476
ఏళ్లవెంటనే చాళ్లు: (2) 'నాగేళ్ల వెంటనే చాళ్లు' 'నాగలి వెంటనే చాలు' అని సామెత. (ఏరు = నాగలి, మడక)
"అరయ శ్రీవేంకటేశ ఆపె నట్టే మెచ్చేవు
సారెకు నేళ్లవెంటనే చాళ్లసుఁ గావా" 17-182
ఏళ్ల వెనుకనే చాళ్లవుత: నానుడి; నాగళ్ల వెనుకనే చాళ్లు అని అర్థం. (ఏరు = నాగలి)
"విచ్చనవిడినే ఏళ్ల వెనక చాళ్లవుత
తచ్చి తచ్చి కాఁగిటిలోఁ దారుకాణాలాయను"
19-440
ఏవల: ఆవల, ఈవల వంటి శబ్దం కావచ్చు. ఎక్కడ అని అర్థం.
"నీవే మన్నించితేను నెలఁత నీ కంటెను
యేవలా వీసమంత యెక్కుడయ్యా" 25-217
ఏవూరి కేవూరు: నానుడి. సంబంధం లేనిదని భావం.
"సోవల నీ శరణము చొచ్చిన నాకు నివి
యేవూరి కేవూరు యేనాటి రుణము" 4-421
"వేవేగన రాని విభునితోడి పొందు
ఏ వూరి కే వూరు యే వూరే" 5-178
"రావెతానూ నేను రతి నే వూరి కే వూరు
కోవరము నిన్నుఁ బెట్టి కొంగువట్టీని" 9-138
ఏసపెట్టు: స.క్రి. ఆశపెట్టు. 'ఆస'ను ఏస గా ప్రయోగించడం యతి కోసమా? లేక 'ఆస' కు 'ఏస' జానపదుల వ్యవహారమా? ఆయాసపెట్టు (?) (ఏస = వక్రము, విజృంభణం అని ఆం.ప.ని.) లేదా విసిగించు, వేసట పెట్టు అని అర్థం కావచ్చు.
"చొప్పుగా నవ్వినఁగాని చుట్టరికము నిండదు
యిప్పుడే యాతని నేల యేసపెట్టేరే" 7-39

ఐ

ఐతేఁగన: ఐతేకనక, ఐనచో.
"కడనుండి చూచే నీకుఁ గనికరమైతేఁ గన

బడి నన్నుఁగావు నీతో బలిమేలే" 2-519
ఐతేఁగనక : 'ఐనచో' అనడానికి వ్యావహారికరూపం.
"అడుగరే విభునివె యైతేఁగనక
విడువక మా యింటికి విచ్చేయమనవే" 8-261
ఐదుగురు : వి; బహు. ఈ సందర్భంలో పంచేంద్రియాలు అని అర్థం.
"బెదరి యైదుగురికిని భీతినొందుచుఁ గడు
జెదరంగఁజూతువే చిలుకా" 1-50

ఒ

ఒంటికాఁడు : విణ. (ఒంటి + కాఁడు)
1. ఒంటరివాడు, ఏకాకి 2. అన్యుడు 3. వియోగి (వి. ఏకచరము, పంది)
"ఒంటికాఁడు రాజు వుడుగక తమలోన
వొంటనీని మంత్రులొక యిద్దరు" 1-161
ఒంటిపడు : ప.బం. అసహాయురాలగు.
"ఉవిద విరహమున నొంటిపడె మన
కివల నీకతో యిది యేపాటు" 23-597
ఒంటిమెట్ట వీరరఘురాముడు : కడప జిల్లా సిద్ధవటం తాలూకాలోని ఒంటిమెట్ట గ్రామంలో వెలసిన శ్రీరామచంద్రుడు. ఒంటిమెట్టకు ఇప్పుడు ఒంటిమిట్ట అని వ్యవహారం. ఒంటడు, మెట్టడు అనే ఇద్దరు బోయీలు కట్టించిన కారణంచే ఇది ఒంటిమెట్ట అయ్యిందని స్థానికుల కథనం. ఇక్కడి స్వామి కోదండరామస్వామి.
"ఇందులోనే కానవద్దా యితఁడు దైవమని
విందువలె ఒంటిమెట్ట వీరరఘురాముని" 1-477
ఒంటు : అ.క్రి. అనుకూలించు, సరిపడు, గిట్టు; స.క్రి. అంటు, తాకు.
"దంటతనమున నిన్నుఁ దప్పక చూచినందుకు
వొంటుచు సిట్టూర్పుల వుసురనేఁగాక" 7-186
ఒందురులు : వి; బహు. ఒండొరులకు రూపాం. ఒకరికొకరు, పరస్పరం.
"సమదిష్టి నొందురులు సంగడివనాల నీడ
జమళి కాఁగిళ్లకు సమకూడేరు" 18-210
ఒందము : వి. 'ఓదము'నకు రూపాం. అవపాతం, ఏనుగు మొ॥ వాటిని పట్టేప్పుడు అవి పడటానికి తవ్వి మీద తేలికైన కఱ్ఱలను, కంపలను, ఆకులను పలుచగా కప్పి ఆపైన కొద్దిగా మట్టి పరచి నేలమట్టుగా చేసిన పల్లం.
"ఓపి సంసారమనే వొందముపై నడవఁగాను
కూపపుజన్మము పాలై కూయుచు
నున్నాఁడను" 15-58
ఒందిలి : వి. దుఃఖం, విచారం.
"అందుకే తల్లడమందీ నంతరంగము
వొందిలినే పవ్వళించివున్నాఁడు లోనను"
26-446
"కందువ నాపెతో నేఁడు కాపురము సేసేవంటా
ఒందిలిఁ దలుపు మూసుకున్నది చెలి" 7-339
ఒందిలి : విణ. దుఃఖం కలది, సంతాపంకలది.
"ఇందరము గంటిమి నీ విది గొనవా
ఒందిలి పానుపుమీఁద నున్నది గానవా"
19-363
గుట్టుగా :
"కందువ నన్ను నప్పటి గయ్యాళిఁజేసి నిన్ను
నొందిలి యేమాడిన నోరుచుకుందానవు"
24-461
ఒకటంటే ఒకటను : (3) ప.బం; అ.క్రి. మారు పలుకు, ఎదురు పలుకు, అన్నదానికి భిన్నంగా పలుకు.
"ఒకటంటే నొక టనేవోయి నీవు
వొక్కటైతే మన పొందు చక్కటాయఁ గదవే"
28-323 & 20-410
ఒకటి కినుమడగు : (3) ప.బం; అ.క్రి. ఒకటికి రెండింతలగు, ద్విగుణమగు, వృద్ధిచెందు.
"ఈరీతి వలపు లొకటి కినుమడాయ విభుఁడ
కోరికలు కోటానఁగోటి సతి కాయ" 24-5
ఒకటికి పది యగు : ప.బం; అ.క్రి. వృద్ధిచెందు.
"పట్టరాదు వొకటికిఁ బదియౌదువు
అట్టె నీ వన్నట్టె యవునోఁ దలఁగరా" 24-77

**ఒకమాట మీదఁ బెట్టి ఒకమాటలాడు :** ప.బం; అ.క్రి. వ్యాజంతో – నెపంతో మాట్లాడు.

"వొకమాట మీదఁబెట్టి వొకమాటలాడేవు
వెకలివై కొంతగొంత వేరే నవ్వేవు" 21-113

**ఒక్క కొలికికిఁదెచ్చు :** ప.బం; స.క్రి. ఒకదారికి తెచ్చు.

"బలు భూమి దూరి వొక్క కొలికికిఁ దెచ్చినాఁడు
నిలచి యంతరిక్షము నిండి భేదించినాఁడు" 4-306

**ఒక్కగాడిఁగట్టు :** ప.బం; స.క్రి. కూడని వానిని ఒకచోట చేర్చే సందర్భంలో వాడబడే పలుకుబడి.

"పాడైన యెరుకతో బంధమోక్షము లొక్క
గాడిఁగట్టుట తెలివి గానకే కాదా" 4-16

"కాంతలనెల్లా నొక్కగాడిఁగట్టే వింతే కాక
మంతన మాడితేనే మర్మము గరగునా" 19-200

"బంధమోక్షము లొక్కగాడిఁగట్టేటి తెలివిగానకే కదా!" 11-2 భా 16

**ఒక్క చిత్తమగు :** వి. ఒక్కటగు.

"ఒక్క చిత్తమేల యౌను పూర్పుగాలి
చిక్కి గుణత్రయముచేఁ జెదరుఁగాక" 4-61

**ఒక్కటంటే రెండను :** ప.బం; అ.క్రి. గట్టిగా ఎదిరించు.

"వొక్కటంటే రెండనక వుండుదురా యెవ్వరైనా
మక్కువ ముందర చూచి మాటాడరా" 24-84

**ఒక్కటివాఁడు :** విణ. ఒకే నిశ్చితాభిప్రాయం కలవాడు.

"వొక్కటివాఁడు దానైతే వున్నచోటనే మేలు చేరు
పెక్కుబుద్ధులఁ బోతేను పెరిపీకౌను" 2-94

**ఒక్కటులగు :** (7) అ.క్రి. ఏకమగు, ఇష్టపడు.

"మంతనాన నిద్దరికి మనసులొక్కటు లైతే
పంతములాడఁగ మరి పని యేమే" 28-128

**ఒక్కపారి :** అవ్య. ఒక్కసారి. 'పారి' అనే పదం పర్యాయం అనే అర్థంలో వాడబడే మాండలికం. తెలంగాణంలో ఈ పదం ఎక్కువగా వాడుకలో ఉంది. ఉ.రా. (3-54) శు.స. (3-444) హరి. (ఉ) (10-304) శ్రీరామాయణం (5-2103) ఉరా. (6-39) రాజ.విజ. (3-84) కావ్యాలలో 'పారి' అనే పదానికి ప్రయోగాలు లభిస్తున్నాయి. ఇది 'పరి' కి రూపాంతరమేమో!

"యెగ్గెరఁగ కొక్కపారే యిద్దరిఁగూడ వచ్చేవు
కగ్గుదేర నిటువంటి కాకు గలదా" 13-158

**ఒక్కమనసగు :** (6) ప.బం; అ.క్రి. మనసులు కలియు, ఏకాభిప్రాయం కలుగు.

"ననిచి యశోదానందగోపులు దెంచేరు
వొనర నందరికి వొక్కమనసాయను" 23-538

**ఒక్కమొగనాండ్లు :** వి; బహు. ఒక్కమగనికి భార్యలైన పలువురు స్త్రీలు.

"ఒక్క మొగనాండ్లకు వొరటు లెందాఁకానే
వెక్కసపుఁ బొత్తు గూడి వేడుకతో నుందమే" 25-429

**ఒక్కసమ్మతి :** వి. ఏకాభిప్రాయం, ఇష్టపడటం.

"పెక్కుమతంబుల పెద్దలు నడచిరి
వొక్కసమ్మతై వొడఁబడరు" 3-348

**ఒక్కసరిగా :** క్రి.విణ. ఒక్కరీతిగా.

"అందరు నొక్కసరిగా నాడకు నీవు
మందలించి మమ్ము నిట్టె మన్నింతువు గాని" 27-90

**ఒగరుఁదనము :** వి. కటుత్వం, వగరుదనం.

"వొగరుఁదనముల నీ వొరటా యిది
యెగసక్కెపు నీ చేత లెందుకు సరివచ్చెనో" 20-451

**ఒగరు :** విణ. కటువు.

"ఒగరాయ నలుకలు వొడిని నిండె వలపులు
చిగురు మోవియ్యఁగదే సిగ్గు లేటికే" 27-138

**ఒగరుతీపగు :** ప.బం; అ.క్రి. బాధలే ప్రియమగు.

"పగటున మా ప్రాణము మా కిక
వొగరే తీపాయ నుద్ధవుఁడా" 15-56

ఒగరులాడు: అ.క్రి. ఆశించు. (పద.)
"మొగమోడితిఁ జాలదా మొక్కలీడ నియ్యెడకు
వొగరులాడ వచ్చేవు వోపము నేమిందుకు"
20-200

ఒగరెక్కు: అ.క్రి. ఒగరగు, కటువగు.
"ఉమ్మగిలి నా సరస మొగరెక్కి నిండఁబూచె
దిమ్ము రేఁగిన చలము తిప్పుకోకు మీఁకను"
11-80

ఒగ్గాలివాఁడు: వి. ఒగ్గిలువాడు, లోబడినవాడు, దాగినవాడు, స్వాధీనమైనవాడు. లేదా ఒక + కాలివాడు అని విడదీస్తే ఒక కాలివాడు, ఎప్పుడూ తిరిగేవాడు అనే అర్థం కూడా చెప్పవచ్చునేమో?
"ఒగ్గాలివాఁడు గదె వోయమ్మా
సిగ్గున నా కగవడె చిలుకచందమునా"
10-2-115

ఒగ్గు: అ.క్రి. ప్రకటమగు, సిద్ధపడు, వశమగు, లోనగు, ఒప్పుకొను, ఇష్టపడు, ప్రయత్నించు, లోబడు, సిద్ధమగు, చెవియొగ్గు, వ్యాపించు.
"తప్పక నీవు చూచితే తగులమితో నున్నది
వొప్పఁగఁ జేయివేసితే వొగ్గుచున్నది" 24-240
"దగ్గరి విన్నపానకు దరుణి గాచుకుండఁగా
వొగ్గక వుంటివి తడ వున్నదాఁకాను" 11-144

ఒచ్చము: (9) వి. 'ఒచ్చెము' కు రూపాం. కొఱత, న్యూనత, అవమానం, తప్పు, నైచ్యం,అపకీర్తి, కపటం.
"విచ్చనవిడినీ యాడీ వీఁడె కృష్ణుఁడు
వొచ్చము లేనివాడు వుద్దగిరికృష్ణుఁడు" 4-172

ఒజ్జలు: వి; బహు. ఒజ్జలు, గురువులు, పంచాణంవారు, పురోహితులు; ఇట 'ఒజ్జలు' అనే బ.వ. రూపంపై మళ్ళీ బ.వ. ప్రత్యయం చేరడం విశేషం.
"పూవుల వాన గురిసె భూభారమెల్లఁ దీరె
వేవేగ నొజ్జళ్ళు వేళ చూడరో" 22-92

ఒట్టికొను: హత్తుకొను, తాకు.
"ఊపిరి మోచినవాఁడే ఒట్టికొంటి నాస లెల్ల"
3-83

ఒట్టు: అ.క్రి. కలుగు.
"వొట్టిన నీ కాఁగి లయోధ్యలోని పట్టము
నెట్టన శ్రీవేంకటేశ నీ దేవికి" 9-228

ఒట్టు: స.క్రి. పెట్టు, ఉంచు.
"అద్దలించి నేఁబెట్టిన ఆనలెల్లా నీ వాపె
వొద్దఁబోయి సూడిదెగా వొట్టుకుండేవా"
10-2-41
"ఒట్టుఁడి జాజులు పరపున వొరపెరఁగిన
చెలికత్తెలఁ
బెట్టుఁడి మరుబలములచే బెగ్గిలి పడకుండ"
5-352

అ.క్రి. పుట్టు, కలుగు:
"ఒట్టిన జీవులకొక బ్రహ్మ గలఁడు" 3-333
త్రాగు:
"వొట్టితే పాలునుఁ జల్లా నొక్కరీతి నుండును"
13-483
ప్రకాశించు:
"ఒట్టిన జవ్వనమున నువ్వెళ్లూరేదానవు"
28-421
"అద్దలించి నేఁ బెట్టిన ఆసలెల్లా నీ వాపె
వొద్దఁబోయి సూడిదగా వొట్టుకుండేవా"
10-2-41

ఒట్టుకొను: ఒట్టు పెట్టుకొను .
"వొట్టుక నీవద్ద నుండి వూడిగాలు సేసేనంటే
నెట్టన నే నంతేసికి నేరుపరినా" 12-30
పుట్టు, కలుగు:
"ఒట్టుకొన్న జీవులు వొరలు చూడఁగఁజూచి
యెట్టు నీ వొరిచేవోయీ వేదన కిపుడు" 3-246
"కడలేక నాలుకకుఁ గన్న యాహారములెల్ల
వొడలిలోఁ బూటపూఁట వొట్టుకొనీనా" 4-316

ఒట్టువొర్లు: (?)
"చుట్టి నానాలోకములు చొచ్చి సిగ్గు గాదాయె
వొట్టువొర్లై చదివి సొబ్బుద్ధి గాదాయె" 15-303

ఒడగు: వి. (?)
"ఒకటొకటికివి వొడగాయ
సకలంబునకు సమరస మాయ" 28-485

ఒడబడికె: వి. 'ఒడఁబడిక'కు రూపాం. సమ్మతి.
"మనసులో నంతలో వొడబడికె
చేసి మలయుచు నీవే నిలుతువు" 8-240

ఒడయవరు: వి. "ఉదయవరు' కు రూపాం.
"తెంకినే వొడయవరై తిరుమంత్రద్వయమున
పంకమెల్లఁ బోఁగడిగె భాష్యకారులు" 1-162

ఒడలిలోపలి రోగము: ప.బం; వి.పైకి కనిపించనిది.
"ఒడలిలోపలి రోగ మొనరఁ బరితాపంబు
కడుపు లోపలిపుండు కడలేని యాస" 1-104

ఒడలు మోచు: ప.బం; అ.క్రి. దేహధారణం చేయు, పుట్టు.
"ఒడలు మోచినయది యొక యపరాధము" 2-519

ఒడలులేని వాఁడు: వి. అనంగుడు, మన్మథుడు.
"వొడలు లేని వాని కొక్కఁడే తండ్రాయఁగాని
తడయక పురుషోత్తముఁడితఁడే" 1-454

ఒడలోము: అ.క్రి. శరీర రక్షణ చేసుకొను, ఒళ్ళు దాచుకొను.
"జడిగొన్న గుక్కిళ్ళు చవిగొన్న యందాఁక
వొడలోముటలు మోహముడుగు నందాఁకా" 5-152

ఒడిఁగట్టు: అ.క్రి. సిద్ధపడు, పాల్పడు; ఏదైనా వస్తువును తీసుకొనేప్పుడు ఒడిని పట్టి అందులో తీసుకునే అలవాటుపై వచ్చిన పలుకుబడి. ఇది ఎప్పుడూ కూడనిదానికి ఒడబడు అనే అర్థంలో ఉపయోగింప బడుతుంది.
"పాపముఁ బుణ్యము పరఁగ నొకట నదె
వోపినవారలు వొడిఁగట్టెడిది" 4-218

ఒడి: వి. ఒడుపు, నేర్పు.
"ఊరకున్నా నెఱఁగడు వొడులు సాధించవచ్చీ
కేరి వొక్క రొక్కరమే గెలువఁగలేమా" 7-134

ఒడికట్టు: వి. కోకముడి (?), ఒడిప్రదేశాన కట్టే గుడ్డ, ఒడ్డాణం.
"ఒప్పి సరసమాడితే వొడికట్టు వదలెను" 23-176

ఒడివట్టు: (?) ప.బం. రొండిపట్టుకొను, నిలవేయు (పద.) ఎవరినైనా నిలవేసేప్పుడు రొండిలో చేయివేసి నడుమున పంచెను కట్టుకొన్న తావున పట్టుకొని ఆపుటపై ఈ పలుకుబడి వచ్చినది.
"వూరకున్నవారి నేల వొడివట్టి కూడేనే
యిరీతి శ్రీవేంకటేశుఁ డెంతటు సేసేనే" 19-178
"ఒడివట్టి తీసి పతి నొద్దికిఁ బిలువఁగాను
వెడవెడ పోఁకముడి వీడకుండునా" 19-88
కొంగువట్టు:
"కూడ నీవు రాఁగా నాపె తోడు చెలుల
రమ్మంటే నూడిగపువారి నేల వొడివట్టేవు" 12-401

ఒడుళ్ళు: వి; బహు. 'ఒడులు' అనే బహు. రూపంపై మళ్లీ బహు. ప్రత్యయం రాగా ఏర్పడ్డ రూపం. (ఒడి + లు = ఒడులు; ఒడులు = లు = ఒడుళ్లు) ఉత్సంగాలు, పిల్లలు కూర్చోవడానికి వీలయ్యే తొడ పైభాగాలు.
"వొత్తిలి నవ్వులు నవ్వి వొడుళ్లు నించేవారు
బత్తులు సేసేరు నీకుఁ బైకొనవయ్యా" 7-264

ఒడ్డాఁబెట్టా: ముందువెన్కలా – తారుమారుగ.
"ఒడిఒడి నీతో నొడ్డాఁబెట్టా మాటలాడేటి
పడఁతుల మేము వొడఁబరచేమా" 13-85
"వొడ్డాఁబెట్టా మాటలాడి వువిద జంకించఁగాను" 26-564

ఒడ్డాణము: వి. నడుము చుట్టు ధరించే స్వర్ణాదులచే చేసిన ఆభరణవిశేషం.
"కొనవేలి వుంగరము కుంచెవేసే యాపెది
కొనలు వొడ్డాణము గొడగాపెది" 7-432

ఒడ్డారపుమాటలు: వి; బహు; మాం. ఒయ్యారపు మాటలు.
"అడ్డము చెప్పఁగరాదు అవుగాదనరాదు నిన్ను
వొడ్డారపుమాటలకు నోపునా యీకె" 13-42

ఒడ్డారపువాడు: వి. 1. పోటీపడేవాడు 2. ప్రతిఘటించేవాడు 3. అసూయపడేవాడు, ద్వేషించేవాడు 4. వంకర మాటలాడేవాడు.

"అడ్డాలు చెప్పనివారి కట్టి వలతురు గాక
వొడ్డారపు వారికేల వొద్ది కొదురు" 21-207

ఒడ్డారము: (6) వి. 1. పంతం, పోటీ
2. అసూయ, ద్వేషం 3. ప్రతిఘటనం
4. వక్రోక్తి, వంకరమాట. త. ఒట్టారము. పగ
(అం.ప.ని.)
"అడ్డమాడకువమ్మ నీ వాతనితోను
వొడ్డారమతఁడు నీతో నొనరించెనా" 11-448
"దొడ్డవాడైన వానికి దోసము లేదు
వొడ్డారాలేమి సేసినా వొద్దనే వారెవ్వరే" 25-46

ఒడ్డారములాడు: అ.క్రి. పంతములాడు,
వంకరమాటలు పలుకు, వయ్యారాలాడు,
వయ్యారాలుపోవు (అన్న.రా.సీ. మాం.)
"ఒడ్డారములాడదు వొడివట్టి తీసి నన్ను
వెడ్డువెట్టి వేడుకొంటే వేసర నేలే" 26-542

ఒడ్డారించు: (2) స.క్రి. ఎదిరించు,
ప్రతిఘటించు, ద్వేషించు, వ్యతిరేకించు,
సాహసించు, పలుకు, మాటాడు (వ్య.)
"సిగ్గువడ్డదానవు శిరసు వంచుకుండంగ
వొగ్గి పతితో నేల వొడ్డారించేవే" 26-366

ఒడ్డించుకొను: స.క్రి. తప్పించుకొను,
వ్యతిరేకించు, విరోధించు, నిరాకరించు,
ఒడ్డునట్లు చేయు.
"కప్పురపు బయ్యెదకొంగు కడు నొడ్డించుకొనేవు
తప్పక మాధిక చూపు లాఁకి నటవే" 7-236
"కొక్కు నైన దోలికి వొడ్డించుకొందురటవే
చెక్కు నొక్కించుకొంటివి చెలువునిచేత" 26-274
"ఊరకె కొసరనేల వొడ్డించుకొననేల" 28-20
"పువ్వులనాతఁడు నిన్ను పూచి
పూచివేయఁగాను
మువ్వంకా నొడ్డించుకొంటూ మొక్కేవేమే నీవు"
25-178

ఒడ్డుఁబొడవు: వెడల్పు - పొడవు.
"వాసి చూప నేమిటికి వనిత వొడ్డుఁబొడవు
సేసవెట్టఁగానే నీవు చెలిమి మెచ్చేవు" 18-287

ఒడ్డుకొను: అ.క్రి. ఎదిరించు, దాటు, పందెము
వేయు, చాగఁజేయు, చక్కగా వినుటకు
మొనయించు (నాచ.), తప్పుకొను,
ప్రారంభించు, పూను.
"ననిచి కూడిన కాంత నవ్వనిదెల్ల నవ్వే
ఒనరి ప్రాణేశ్వరున కొడ్డుకోరాదు" 18-348

ఒడ్డెభాష: వి. ఓఢ్రదేశపు భాష. (ఒరియా భాష)
"వొగినొడ్డె భాషలాడీ, వొడ్డెవాఁడ నైతిని
తెగి తెలుఁగాడనేర్చి తెలుగువాఁడ నైతి" 3-370
గజపతులు విద్యానగరాన్ని ఆక్రమించినపుడు
అన్నమయ్య ఓఢ్రభాష (ఒడ్డెభాష) నేర్చుకొని
ఉండవచ్చు.

ఒడ్డెవాఁడు: వి. ఓఢ్రదేశస్థుడు.
"ఒగి నొడ్డెభాషలాడి వొడ్డెవాఁడ నైతి" 3-379

ఒణికె వేసుకొను: వి. ఈ పదం నిఘంటువుల్లో
కానరాదు. మొగము వ్రేలాడవేసుకొను.
"వొణికె వేసుక నే నూరకున్నా మానఁడే
సణఁగులాడఁగ వేరె సాకిరి వెట్టీనే" 9-146

ఒత్తడించు: స.క్రి. 'ఒత్తరించు' కు రూపాం:
కావచ్చు. 1. వెడలగొట్టు, తోయు 2.
ఉద్రేకపరచు (అతిక్రమించు, మించు)
బాధించు, రాపిడిపెట్టు.
"ఏల వొత్తడించేరే యిన్నియు నయ్యోఁగాక
పోలిక లొక్కటే యెట్టు పొందుసేసేదే" 14-180

ఒతడించు: స.క్రి. పీడనం చేయు, రాయిడి
చేయు, ఒత్తిడి చేయు, బాధించు. (ఒత్తడి =
బాధ)
"ఏల ఒత్తడించేరే యిన్నియు నయ్యోఁగాక"
14-180

ఒత్తరించు: స.క్రి. అతిక్రమించు, మించు,
వ్యాపించు, ఉద్రేకము కలుగజేయు.
"ఒత్తరించుకొని రాఁగా నువిద నిట్టే కూడితి
ఎత్తల శ్రీవేంకటేశ యెచ్చరింతుమా" 13-414

ఒత్తి మాటాడు: అ.క్రి. గట్టిగా మాటాడు.
"పూకొనకుండిన వొత్తి మాఁటాడేవు
బూక లింతేశేల మోవయ్యా" 24-172

ఒత్తు: వి. ఒత్తుకోవడంవల్ల కలిగిన ముద్ర, నొక్కు.
"వంకలైన వొత్తు లెల్ల వడిఁగాన వచ్చె నింక
బొంక నేమిటికిరా నీ బూమెలెల్లఁ గంటిమి" 5-84

ఒత్తుకోలు సేయు: వి. 1. ఆక్రమించు 2. అద్దుకొను. అ.క్రి. అతిశయించు, తోసుకొను.
"అంగడివారెల్లా నిన్ను నంటఁగాఁగిలించి రంటూ
ఉంగిటిగానే నిన్ను నొత్తుకోలు సేతునా" 13-116

ఒదకిలు: అ.క్రి. 'ఒదికిలు'కు రూపాం. పక్కకు ఒరుగు, ఒత్తగిలు.
"ఒయ్యారి బాగుగాను వొదకిలి కూచుండేవు"
28-552

ఒద్ద: వద్ద, దగ్గర;అన్నమయ్య 'ఒద్ద' తో పాటు 'వద్ద' అనే రూపాన్ని కూడా ప్రయోగించినాడు.
"ఒద్దఁ బండుండి యవ్వల
వొగిఁ జోటిచ్చుకుండేవు" 29-253

ఒద్దిక: వి. 1. ప్రేమ, అనురాగం, మైత్రి, చెలిమి 2. విధం 3. పోలిక 4. వినయం, నమ్రత 5. పూర్వాభినయం. ఒక వస్తువుకు సరితూగే రాయి మొదలైనవి, పడికట్టురాయి, విలాసం. విణ. అనుకూలం. రూపాం. ఒద్దికె.
"ఇల్లిదె శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
వొళ్లఁబెట్టిన సొమ్ములు వొద్దికెఁ గూడుండవా"
7-254
"ఒద్దిక తామరవిరి నొత్తేవు కన్నులు నీ
గద్దరి కన్నులకంటె కమలము ఘనమా" 5-2

ఒద్దిక మాటలు: వి; బహు. అనుకూలమైన మాటలు.
"వూరకుండఁగ నాతో వొద్దిక మాటలాడీని
కారణము లేని పొందు కద్దా బూమి" 26-45

ఒద్దికె: వి. చూ ఒద్దిక.
"తక్కక యహోబలానఁ దగ శ్రీవేంకటాద్రిని
వొక్కటై నిన్నుఁ బెండ్లాడి వొద్దికె చూపీని"
12-271

ఒద్దు: (4) క్రి.రూ. వద్దు (వలదు)కు వ్యావహారికరూపం.
"ఒనరి గోరనూదితే వొద్దంటూ వేడుకొనేవు"
29-343

ఒనగూడు: (2) అ.క్రి. 1. సిద్ధించు, నెరవేరు, ప్రాప్తించు 2. కలుగు, జనించు 3. కూడు, కలియు స.క్రి. సంభోగించు (వ్య.), ప్రాప్తించు.
"వొయ్యనె శ్రీవేంకటేశ వొనగూడితి వింతలో
యియ్యెడఁ గామిని విల్చి నిట్టె రావయ్యా"
7-111

ఒప్పనచేయు: స.క్రి. అప్పగించు, అప్పనముచేయు.
"అంచల నీ వంతర్యామి వైన యీ దేహము
పంచేంద్రియముల కొప్పన సేతురా" 3-55

ఒప్పనము చేయు: స.క్రి. అర్పణము చేయు.
"నీతితో శ్రీవేంకటేశ నీ పాలివాడఁగాన
బాతితో సర్వము నీ కొప్పనము సేసితిని"
9-154

ఒప్పులకుప్ప: ప.బం; వి. 1. సౌందర్యరాశి 2. బాలికల క్రీడావిశేషం.
"వొడికపు నెలఁతా వొప్పులకుప్పా
కడఁకల సతి రాఁగదవమ్మా" 28-192

ఒబ్బిడి: వి. 1. బాగు, నిశ్చింత, హాయి, స్వేచ్ఛ, ప్రత్యేకం అనే అర్థాల్లో ఇది మాండలికం. (చూ. అ.సం.సా; రా.సీ.మాం. 18 పు.) (పొదుపు, పంటనూర్పిడి)
"ఒబ్బిడిగా నీ యింట నీ వుండితేనే చాలదా
గుబ్బల గర్వము నిన్ను గురించీ గాక" 18-278
"నిబ్బరపుఁజేతులను నిన్నుఁ గాఁగిలించి పట్టి
వొబ్బిడిఁ దా మెరసె నహోబలేశ" 21-202

ఒబ్బుద్ధి: (ఒక + బుద్ధి, ఒప్పు + బుద్ధి) ఒక బుద్ధి, మంచి తెలివి. విలక్షణమైన సంధి.
"చుట్టి నానాలోకములు చొచ్చి సిగ్గుగాదాయె
వొట్టు వొర్లై చదివి నొబ్బుద్ధి గాదాయె" 15-303

ఒమ్ము: (9) అ.క్రి. ఒప్పు, సరిపడు, అనుకూలమగు. (ఆ.ధా.పా.)

"నెమ్మ(దరితీపు లేని నెలంత యెంత మొక్కినా
వొమ్మ సమ్మతమై వుండదు వుప్పనై తోచు."
23-257

"సొమ్ములుఁ బెంచవు కన్నుఁజూపుల
యమ్ములనే
వొమ్మదు నీ పొందు నాకు నొల్లమయ్యా."
5-121

ఒరగల్లు: (ఒరయు + కల్లు) వి. గీటురాయి, బంగారం మొ॥ వాటిని ఒరపెట్టే రాయి, నికషోపలం.

"మంచి చలువరాయనే మెచ్చుల వొరగంటిపై
నించినట్టి వేడుకల నీ దేహము" 10-295

ఒరగు: వి. 1. ఒరగుదిండు 2. వంపు విణ. వంపైనది. రూపాం. ఒఱగు. వంపు. విలాసం, సౌందర్యం, బాధ (ఆం.శ.ర.), లోపము. ఒరగు = crookedness.

"ఇంక నేటి బిగువు యేల నీకును
వంకలొత్త నొరగులై వాసిమీఁదను" 11-19

"నెఱతనము చూపి నీవు మా ఇద్దరిలోనా
వొఱగులు దిద్దేవు వువిద నీవు" 25-276

"మతిలేని నీ కుచాలు మెత్తని మొరగులమ్మా
ఆతనికి నీ కొను వయ్యాళి బయలమ్మా"
26-102

"తగవు లిద్దరమును తమతోఁ దేరుచుకోఁగా
తెగి మాట వొరగులు దిద్ద వచ్చేవు" 13-538

ఒరగుఁబెరుమాళ్లు: వి. పడుకొనిఉన్న గోవిందరాజస్వామి. దిగువ తిరుపతిలోని గోవిందరాజస్వామి పడుకొని ఉన్న ఆకారంలో ఉంటాడు. ఒరగు అంటే దిండు అనే అర్థం కూడా ఉంది. గోవిందరాజస్వామి తలకింద ఉండే గుండ్రని దిండును స్థానికులు 'సేరు' అని అంటారు. సేరు అంటే ధాన్యాన్ని కొలిచే ఒక పరికరం. గోవిందరాజస్వామిని వెంకటేశ్వరస్వామికి అన్న అని అంటారు. వెంకటేశ్వరస్వామి తన పెండ్లికి కుబేరుని దగ్గర అప్పుగా తీసుకున్న ధనాన్ని కలియుగంలో తీరుస్తానని వెంకన్న ఒప్పందం చేసుకుంటాడు. అప్పుగా తీసుకున్న ధనాన్ని గోవిందరాజస్వామి సేరుతో కొలిచి కొలిచి అలసిపోయి ఆ సేరునే దిండుగా చేసుకొని నిద్రపోతూ అలాగే శిలగా మారిపోయినాడని స్థానికుల నమ్మకం. కనుక ఒరగు = దిండు తలకింద గల స్వామి అని అర్థం కూడా చెప్పవచ్చు.

"వొగి నొరఁగుఁబెరుమాళ్ల వునికి పట్టయి
వెలయు దిగువ తిరుపతి గడవఁగాను" 1-227

ఒరగోసుకొను: స.బం; అ.క్రి. కత్తిదీయు, ధిక్కరించు. (పద.)

"వొద్దిన గర్వాన నాతో వొరగోసుకొన్నది
సడ్డలాడి నీ వింత చనవు లిచ్చితివా" 10-2-52

ఒరటు: విణ. (తు) మూర్ఖపుపట్టు, ద్వేషం, మొండితనం, అహంకారం, గర్వం (క్ర) ఒరటు. విణ. మొండి, మొరటు. (వ్యు.)

"మక్కళంపు మంకులతో మాటలాడ రిద్దరును
వొక్కటై యుండుండి మీకు నొరటులు వచ్చెగా"
17-304

"ఒక్క మొగనాండ్లకు వొరటు లెందాఁకానే
వెక్కసపుఁ బొత్తుగూడి వేడుకతో నుందమే"
25-429

"చెప్పరాని తిట్టుదిట్టి చేయెత్తి మొక్కితేను
వొప్పు గొనవద్దా మఱి వొరట్లేమిటికి" 7-243

ఒరటులువట్టు: మూర్ఖపుపట్లు పట్టు.

"వ్రూడిగాలు సేసేవార మొరటులు పట్టుదుమా
వేడుకఁగూడి బారము వేతుము గాక" 27-182

ఒరట్లు చూపు: మూర్ఖపుపట్లు చూపు.

"వుమ్మడి నుండఁగవచ్చు వొరట్లు చూపవచ్చు
కమ్మ కాఁగిలించుకుంటే కాదనఁగరాదు"
23-211

ఒరట్లువెట్టు: రాయిడిపెట్టు, అహంకారం చూపు.

"వొప్పి వొరట్లువెట్టి వూడిగాలు సేయించుక
దప్పిదేరించకు మోవిదండము నీకు" 14-108

**ఒరతొమ్మిదిచాఁచు**: (?)
"వొరకు నెత్తుకు సరివో బావ నీవె
వొరతొమ్మిది చాఁచావో వో మరదలా" 3-346

**ఒరపరి**: (ఒరపు + అరి) వి. సౌందర్యవంతుఁడు, ఒఱపరి (శ.ర.), ఉపాయశాలి, యోగ్యుడు.
"చెప్పఁగానె వుద్దండానఁ జెఱఁగు వట్టితి నిదె
వొప్పితి శ్రీవేంకటాద్రి వొరపరి బాలుఁడు"
20-154
"అలమేలుమంగ నీ వన్నిటా నొరపరివి
కలికి నీ వొళ్ళ నివి కంటిమే చెలియా" 28-279

**ఒరపరితనము**: (ఒరపు + అరి + తనము) వి. సౌందర్యం, ఉపాయం, యోగ్యత, గొప్పతనం.
"వెగ్గళించి యాతఁడెంత వేడుకకు నవ్వినాను
వొగ్గి గుట్టుతో నుండు టొరపరితనము" 24-288

**ఒరపు**: వి. విలాసాతిశయం, సౌందర్యం, యోగ్యత. (ఉపాయం, తంటా, దోషం, తాపం, ఆదుర్దా)
"ఎంచితే నొకటి కొక టెక్కుడాయ సింగారము
మించిన యాపె వొరపు మిక్కిలి సింగారము"
29-478

**ఒరపులాడు**: (?)
"ఒరపులాడక పోవె వోసి మాయ నాతోఁ
దొరలేవు నిను ముట్ట దోసము" 1-107old

**ఒరపోలిక**: వి. (?)
"ఇయ్యింతి మురిపెము యెట్లుండెనే
ఒయ్యారముతో నొరపోలికనో యనఁగా" 5-123

**ఒరయించు**: స.క్రి. పరీక్షించు.
"ఇంతులు నిద్దరి నొరయించేవు శ్రీవేంకటేశ
ఇంతసేయఁగా నీకు నేమి వచ్చెను" 26-212

**ఒరయు**: స.క్రి. 1. రాచు, సంఘర్షణచేయు 2. పరీక్షించు 3. విచారించు 4. వెదకు. వి. విలాసాతిశయం, సౌందర్యం.
"మొగము చూచి నీ మోవినే యేల తిట్టేవు
పొగరే పులుసు గాదా ఒరయకు నీవు" 27-156
"పొంకపుఁ గాఁగిటిలో నీ పొందులు సతము చేరి
వుంకువఁ జొక్కించితివి వొరపు మరుఁగఁడా"
19-254

**ఒరయు**: అ.క్రి. 1. మూర్కొను, స్పర్ధచేయు 2. రాచు, సంఘర్షించు 3. నొక్కుడుపడు
"పాసివుండ దొరతురు పైకొని పెనఁగుదురు
వాసి నింతు రిట్లానే వలపు చల్లుదురు" 26-462

**ఒరవు**: వి. విధం, పోలిక, సామ్యం.
"సింగారించఁగానే ఆపె చేతికి లోనైతివి
వుంగరపువేలి గోరి కొరవైతివి" 21-274

**ఒరిమ**: వి. 1.స్నేహం, ఒద్దిక 2. ఆసక్తి 3. దయ, జాలి (వ్య.), ఐకమత్యం, అనుకూలత. రూపాం. ఒరిమె.
"తొరలింపు మాటలును దొంతుల సరసములు
వొరిమతోఁ బచరించీ నొక్కమాఁటే" 13-195

**ఒరిమె**: (6) వి. 'ఒరిమ'కు రూపాం.
"ఎరవుగ మఱచైనా యెంచదు నేరాలు నిన్ను
వొరిమెతో మోనాన నుండుఁగాని" 23-180

**ఒఱగులు దిద్దు**: అ.క్రి. లోపాలు దిద్దు. (వంకలుదిద్దు)
"నెఱతనములు చూపి నీవు మా ఇద్దరిలోనా
వొఱగులు దిద్దేవు వువిద నీవు" 25-276

**ఒఱటు**: వి. 1. చెడ్డ ఆడది, దురదృష్టవంతుడు, చెడ్డ అలవాట్లున్న వ్యక్తి 2. దుర్మార్గుడు, క్రూరుడు, దుశ్శీలుడు.

**ఒఱటువాఁడు**: వి. మూర్ఖపు పట్టువాడు, మొండివాడు.
"వో వేడుక పుట్టవలసి విభుఁడు జూజాన నిన్ను
ఓడించెఁగాక నీతో వొరటువాఁడా" 21-206

**ఒఱపు**: విణ. 1. యుక్తం 2. ఒప్పైనది 3. పెద్దది
"ఒఱపు నీ మాటలకే వొడఁబడి తన మతి
కఱకరిఁ గరఁగీనా గామిడిగాక" 19-296

**ఒఱిమ**: వి. సాధురేఫ ముండదగిన రూపం. స్నేహం, ఐకమత్యం, ఆనుకూల్యం. (మిత్రత్వం – ఆంధ్రభాషార్ణవం)

"ఒతిమ గలదానై వొరిచినా నెఱగవు
మతి సరసమాడేవు మలసి నాయెదుట"
14-187

**ఒళ్లీ(య):** (?)
"వొళ్లియై ప్రకృతి వొరసి వేటలో
యిళ్లీవలెనే యెలయించీని" 3-224

**ఒళ్లిబాగులవాఁడు:** వి. వెళ్లిబాగులవాడు, తెలివిమాలినవాడు.
"వెళ్లితనమున నిన్ను వేసరించేఁగాక నీవు
వొళ్లి బాగులవాఁడవు వొద్దికయ్యేనా" 13-508

**ఒల:** వి. చెమ్మ, నెపము, మిష, సాకు.

**ఒలగె:** మెల్లఁగ అని అర్థం, కన్నడ సంబంధంతో వచ్చినది కావచ్చునని సం.ప.స.

**ఒలపక్షపాతి:** వి. పక్షపాతం కలవాడు.
"ఇంత వొలపక్షపాతి వెట్టైతివి
బంతినే నామీదఁగడు బత్తిసేసే వీపుడు" 25-172

**ఒలపక్షమాడు:** పక్షపాతపు మాటలాడు.
"ఒలపక్షమాడకురే వువిదలాల పలుమారుఁ
బిలువఁగా బలుకరాదా మెలుతలాల" 21-314

**ఒలపక్షము:** (3) వి. పక్షపాతం.
"తప్పక చూడనేలే తానే సాకిరి చెప్పఁగా
అప్పటి నొలపక్షము లందుండెనా" 21-97

**ఒలయు:** అ.క్రి. 1. వ్యాపించు 2. ప్రవేశించు 3. కలుగు 4. కలియు, చేరు (శ.ర.) స.క్రి. చుట్టుకొను, కదియు.
"ఒలసి యచ్చువాసిన వురమే నా పీఠము"
12-273

**ఒలలు వేయు:** (2) అ.క్రి. వలలు వేయు, 'వల'కు 'ఒల' వ్యావహారికరూపం.
"అనుమానములకుఁగా అట్టె వొలలు వేసితి
వినుఁగాఁగలించితేనే నేర మాయనా" 7-263

**ఒలవేయు:** (4) అ.క్రి. 'వల'కు 'ఒల' వ్యావహారికరూపం. 'వలవేయు' శబ్దముయొక్క వ్యావహారికరూపం కావచ్చు నని సం.ప.స. (1-2 వు.)

"వొరటు జక్కవలపై వొల వేసెను" 19-278
"ఏమన్నాఁ దనకే చెల్లు నింతెకాక
వోముచు నాపై నేల వొలవేసీనే" 14-202

**ఒలసి:** 'వలచు' ధాతువు క్త్వార్థకరూపమైన 'వలచి'కి వ్యావహారికరూపం; ఇష్టపడి.
"ఒలసి శ్రీవేంకటేశుఁ దురముపై నిడుకొన్న
లలి మొక్కుటే మేలు యలమేల్మంగకు"
24-288

**ఒలసితే:** 'వలయు' ధాతువు చేదర్థకక్రియ; వలసితే అనే రూపానికి వ్యావహారికరూపం.
"మలసి రాలు దింటా మలిగండ్లననేల
ఒలసితేఁ గైకొంట వొల్లకుంటే మానుట" 4-223

**ఒలసీనొల్లని:** (2) విఱ. అంతగా ఇష్టపడని.
"వొలసీ నొల్లని పతి వొగిఁ గాఁగిలించుకంటే
నొలసి మాను గాఁగిలించుటే మేలు" 16-237

**ఒలసినొల్లమి:** వి. ఇష్టపడటం మరియు ఇష్టపడకపోవటం.
"చెలువల నరపె నిపుడు చేరవచ్చే ననుచు
వొలసినొల్లములకు వొరయఁ జోటేది" 20-568
"ఒలసి నొల్లములైనా వొద్దనే వుండుటగాక
తలఁగవచ్చునా మరి తరుణులకు" 26-521

**ఒలసీనొల్లమి:** (6) వి. అంతగా ఇష్టం లేకపోవడం.
"పలుమారు నాతఁడు బాఁతిపడి పిలువఁగా
వొలసీనొల్లమి నేల వూకొనేవే" 19-47

**ఒలివిలయుఁడు:** వి. (?)

**ఒలసీనొల్లక:** క్రి.విఱ. అంతగా ఇష్టం లేక.
"ఒలసీనొల్లక యాల వూరకుండేవే" 19-387

**ఒలుగులువారు:** (4) అ.క్రి. 'ఒలుగులు' అన్న పదం నిఘంటువుల్లో కానరాదు. ఇది 'అలుగులు వారు' అన్న పదానికి రూపాంతరం కావచ్చు. 'అలుగు' అంటే చెరువుకు నీరు ఎక్కువైనపుడు అది పోవడానికి ఏర్పరచిన దారి; తూము అని అర్థం. అలుగులు పారడమంటే నీరు నిండి పారి వెళ్ళడమని

వాచ్యార్థం. అతిశయించు, అధికమగు అని భావార్థం

"జలనిధి యంతా మీరే చవిగొని చూచితేను
వొలుగులు వారఁగడు నుప్పులై వుండును"
26-477

'ఒలుగు' అంటే మిక్కిలిగా బయటికివచ్చు అని అర్థం. 'ఒలుకులు వాఱు' అనే పదం సూ.ని.లో కనిపిస్తుంది. 'ఒలుకులువాఱు' పదమే వ్యవహారంలో ఒలుగులు వారు కావచ్చునేమో! ఈ క్రింది ప్రయోగాలు పై రెండు తీరుల అర్థాలకు సమర్థకంగా ఉన్నాయి.

"చెలులము మమ్మి నేల సిగ్గులు వరపించేవు
వొలుగులు వారీ నవ్వు వొడిగట్టుకోరాదా"
27-277

"చలివాసి గొల్లెతలు సొరె నిన్ను నెత్తుకోగా
వొలుగులు వారె మోహమూఁచి పాడఁగా"
21-83

"యెలమి శ్రీవేంకటేశు మోహరస
మొలుగులు వారుచు నుండిన రీతి" 24-183

ఒల్లగె: 'మెల్లగ'. కన్నడ సంబంధంతో వచ్చినపదం కావచ్చునని సం.ప.స. 26-427 పు.

"చేచేత శ్రీవేంకటేశ చేకొని నన్నేలితివి
లాచి మెచ్చినట్లా వొల్లగె మెచ్చరాదు" 26-480

పాదపీఠికలో సంపాదకులు ఈ పదాన్ని సూచించి అర్థం చూపలేదు. ఎందుకో?

ఒల్లనె: ఒల్లన + ఎ = తిన్నగ, శీఘ్రంగా, మిక్కుటంగా, అధికంగా.

"చల్లని నీ నామ ముచ్చరించని ద్రోహానే
వొల్లనే సంసారవార్ధి నోలలాడను" 15-99

ఒళవు: వి. వీణాదండం, ప్రవాణం. (కీలు, దిటవు)

"తనువే ఒళవు తలయే దండెకాయ
ఘనమైన వూర్పులు రెండు కట్టిన తాళ్ళు"
3-467

ఒళ్లు: (84) 'ఒడలు'కు వ్యావహారికరూపం; శరీరం.

"సరిఁదీగె వంటి మేన జనియించిన చన్నులు
వొరసి పెనఁగితే నీ వొళ్లు నొచ్చీనా" 13-466

విభక్తులు పరంగా ఉన్నప్పుడు, సమాసంలోను అన్నమయ్య దీనిని 'ఒళ్లి'గా ప్రయోగించినాడు. ఉదా :- వొళ్లిమీద (16-102) 12-275, వొళ్లిపై (7-496) మొ॥ ఒళ్లిపనులు (19-524) మొ॥

ఒళ్లువేయు: శరీరాన్ని ఉంచు.

"పట్టిన చలముతో నేఁ బవ్వళించి వుండఁగాను
వొట్టుక దగ్గరి నామై వొళ్ళువేసీని" 11-586

"ఓపననఁగానే పో వొళ్లు వేసీని
తీపుల జంకించి నాపైఁ దేనె చల్లీని" 21-490

ఒవ్వు: (8) అ.క్రి. రూపు చెడు, సౌందర్యవిహీనమగు, గిట్టు, పొసఁగు, వీలుపడు.

ఒసపరి: వి. అందగాడు, అందగత్తె; విణ. అందమైన, ఉత్కృష్టము.

"కసరేమి లేక కౌఁగిట నీ విట్టె
ఒసపరి రీతి నుండంగ వద్దా" 6-120

## ఓ

ఓక: వి. 1. పుల్లికలివె 2. వక్క

"వీఁకవింటి చెంచెతా వీఁచి కోసేవేఁటివే
వోఁకల విడేలు వో వొగరుగాని" 26-77

ఓకర: వి. పిత్తవ్యాధి మొ॥ వాటివలన కడుపులోనిది ధ్వనిపూర్వకంగా నోటిలోనికి రావడం.

"ఆఁకలీ నొక్కటె యటు జనించినవాడు
వోఁకరెన్నఁడో దాగివుండుఁ గొన్నాళ్లు" 4-296

ఓగునూతల: వి. కడపజిల్లాలో చిన దాసరిపల్లెకు సమీపంలో కొండలోయల నడుమగల ప్రదేశం. దీనికి వోనూతలకోన అనీ, వోగు నూతలకోన అనీ పేర్లున్నాయి. ఇక్కడ నరసింహస్వామి ఆలయం ఉంది. ఓగునూతల అన్నపదమే వేయి నూతలగా మారింది. ప్రస్తుతం ఈ

క్షేత్రాన్ని వేయినూతలకోన అని వ్యవహారిస్తున్నారు. ఇక్కడి నృసింహస్వామిని అన్నమయ్య, చినతిరుమలాచార్యులు అనేక కీర్తనల్లో ప్రశంసించినారు.

"వోయమ్మ శ్రీవేంకటేశుఁడోగునూఁతులాడ
నన్ను
చాయలకే కూడెఁబో వేసాలుసేసీని నన్ను" 21-490

"వోయమ్మ శ్రీవేంకటేశు
డోగునూతులలోఁగూడె" 11-385

**ఓగు:** వి. కీడు. విణ. అశుభం, అప్రశస్తం.
"ఓగుల లంపటమున కోపికెంతైనాఁ గద్దు
యోగపు సత్కర్మాన కొకయింత లేదు" 1-467

**ఓగునూతులోభళేశుఁడు:** వి. కడపజిల్లాలో చినదాసరిపల్లెకు సమీపంలో కొండలోయల నడుమ నృసింహస్వామి ఆలయం ఉంది. ఇక్కడున్న ఆలయంలోని శాసనాన్నిబట్టి ఓగునూతలపల్లె అహోబలేశ్వరానికై గండికోట సీమపాలకుడైన కార్యకర్త బాచరసు తాళ్లపాక తిరుమలయ్యగారి అజ్ఞ ననుసరించి దుర్గన్నయని పర్తనగా సమర్పించిన వివరంగల శాసనాన్నిబట్టి ఓగునూతలలోని స్వామిపేరు అహోబలేశ్వరస్వామి అని తెలుస్తుంది. ఈ ఓగునూతలే తరువాత వేయినూతలగా మారింది. (ఔభళేశుఁడు అహోబలంలో నెలకొన్న స్వామి, నృసింహస్వామి.)

"ఔభళేశ వోఁగునూతలోభళేశ
శోభనము నీకు నాకు జోడుగూడెఁ గాదా" 26-3

"అల్లదిగో వోఁగునూతలోభళేశు పెద్దకోన
వెల్లి పాలనీటి జాలు వెడలే సోన" 11-80 old

**ఓజ:** వి. 1. పూనిక, ఉత్సాహం, విధం, రీతి 2. నేర్పు 3. న్యాయం, ప్రకృతి, స్వభావం.

"చెనకఁ జూచినవేళ చేరి బాస లడిగేది
వొనరఁ దుచ్చపువారి వోజ లింతేకా" 25-373

"వెన్నలెల్లా దొంగిలి శ్రీవేంకటేశుడైనాఁడు
వున్నతిఁ దనకుఁ గల వోజే కదే" 21-172

**ఓడఁగట్టిన దూలము:** ప.బం; వి. విడిపోవక పెద్దవానిని ఒకనినే ఆశ్రయించి కష్టసుఖాలలో పాలు పంచుకొనేది, నిత్యసంబద్ధమై ఉండేది. ఓడకు కట్టిన దూలము ఓడపోయినట్లెల్లా పోతుంది. అది మునిగిపోతే ఇదీ మునిగి పోతుంది. అది గమ్యం చేరితే ఇదీ చేరుతుంది. అందుపై వచ్చిన నానుడి. అవినాభావ సంబంధం.

"ఓడఁగట్టిన దూలమై ఉపేంద్రుఁడా నీకుఁ
నూడిగాలు సేసేము ఉపేంద్రుఁడా" 17-232

**ఓడతో దూలము:** పబం; వి. అవినాభావ సంబంధంతో ఉండేది ; ఓడతోపాటే దానికి కట్టిన దూలం ఉంటుంది అని వాచ్యార్థం.

**ఓడబేరము:** వి. ఓడమీద చేసే వ్యాపారం, నౌకావ్యాపారం.

"నెమ్మది నోడబేరము నీతోడి మాట
పమ్మి కాచుకున్నవారి భాగ్యముల కొలంది" 16-382

**ఓడ మింగిన భూతము:** వి. మత్స్యావతార రూపుడు. సముద్రంలో తిమింగలములనే పెద్దపెద్ద చేపలు ఓడలను మింగివేస్తాయి కదా!

**ఓడ మింగెడి భూతము:** వి. సోమకుని నిగ్రహించి వేదాలను ఉద్ధరించడానికి మత్స్యావతారంగా అవతరించిన భగవంతుడు.

"కినిసి వోడ మింగెడి భూతము
పునుక పీఁపు పెద్ద భూతము" 1-109

**ఓడలు బండ్ల వచ్చు:** (2) ప.బం. దేశకాలపరిస్థితులను బట్టి ఆధారాధేయాలు మారుతాయనే విషయాన్ని తెలిపే పదబంధం. నేలపై ఓడలు బండ్లపై, నీటిపై బండ్లు ఓడలపై వెళ్లక తప్పదుగదా! ఇట్లే బండ్లు ఓడల వచ్చును అనే పలుకుబడి కూడా.

"ఈడనే శ్రీవేంకటేశ యింతఁ గూడితివి నీవు
వోడలు బండ్ల వచ్చు వుండవయ్యా నీవు" 7-328

**ఓడ విడిచి పదరిడు:** ప.బం; అ.క్రి. ఓడను వదలి సొరకాయను గ్రహించడం (పదరు = సొరకాయ), శాశ్వతమైన రక్షణ ఇచ్చేదాన్ని వదలి రక్షణ లేనిదాన్ని గ్రహించడం,

సులభమైన ఉపాయం ఉండగా తెలిసి తెలిసి అనుమానాస్పదమైన దాన్ని గ్రహించడం.

"యిందివేలుపు వేంకటేశుఁ గొలువక పరుల
వెంట తిరుగుట వోడవిడిచి వదరిడుట" 1-104

**ఓడుపడు:** అ.క్రి. 'ఓటుపడు' కావచ్చు, అపజయపడు, కోలుపోవు.

"దొడ్డతనమేది యందు దొర యాడనున్నవాఁడు
వొడ్డి హరిఁగొలువక వోడుపడె జీవుఁడు" 2-13

**ఓతడ:** (ఓ + అతఁడ) ఓ మనిషీ!, వింత సంధి.

"ఊరికిఁ బోయెడి వోతఁడ కడు
చేరువ తెరు వేఁగి చెలఁగుమీ" 1-89

**ఓదెఁడు:** కొలత. (చేటెడు, మోపెడువంటి పదం) (ఓదె = ఓదియ, కోతకోసి చేనియందు అక్కడక్కడ నుంచెడు వెన్ను పోచల ప్రోగు - శ.ర.)

"బిగిసేవు గాక ప్రియురాండ్లు నిన్ను
వొగరులాడేది వోదెఁడు గాక" 17-152

**ఓపికె:** (2) వి. 'ఓపిక'కు వ్యావహారికరూపం, బలం, ఓరిమి.

"వున్నదేవునికి వోపికె గలుగుచోట
చెన్నగు విభుఁడ నీ చిత్తమింతే యిఁకను"
24-174

**ఓపె:** వి. నీచమిత్ర, స్త్రీ సంబోధనార్థకం, ఆపె, ఈపె మొ॥ పదాల సామ్యంవల్ల ఈ పదం ఏర్పడి ఉండవచ్చు. ఇట్లే ఓమె అనే పదం కూడా ఉంది. శృం.నై. 4-114

"అంది వాదులకు వచ్చే వదే మోపె
మందపసులు దవ్వేఁగె మమ్ము విడవోపె" 7-11
"పేయ చొరఁగానె యిల్లు బెంబడిఁ జొచ్చితిఁగాక
ఆయెడ నన్నేల తిట్టే వదేమోపె" 7-11

**ఓబ(బు)ళేశుఁడు:** (ఓబళ + ఈశుఁడు) చూ: ఓబులేశుడు. అహోబలేశుడు, నృసింహస్వామి.

"ఓపము నీతోఁ బెనఁగ వోబళేశుఁడు
ఆ పని నే నెఱుఁగనా అయ్యో వోబుళేశుఁడా"

**ఓబులేశుఁడు:** (ఓబుల + ఈశుఁడు) అహోబల క్షేత్రాధిపతి యైన నృసింహస్వామి, 'అహోబల'కు 'ఓబుల' అనేది వ్యావహారికం.

"ఓబులేశుఁ డీ కాంత నోరసీఁగొంత
యీ బిగువు దన కేల ఇంతెఱఁగదా" 21-475

**ఓబుళపుకొండ:** వి. అహోబలపర్వతం, ఇది నృసింహక్షేత్రం, అహోబలం అనే దానికి ఓబుళం అనేది వ్యావహారికరూపం.

"గొంది నీవు వోబుళపుకొండలో వుండే వునికి
ఇందిరతో విన్నవించే నిదివో నేను" 21-476

**ఓము:** (9) స.క్రి. 1. రక్షించు, పోషించు, కాపాడు 2. బాగుచేయు, సంస్కరించు 3. అనుగ్రహించు 4. తాల్చు, వహించు 5. పురుడు, ఓర్చుకొను. 21-69

"పొల్లవోని పూవుల పుప్పొడి పోదిసేసేనే
వొల్లనన్నఁ బోదు దీని కోమరమ్మా చెలులు"
10-2-44
"వోముచు నెన్నాళ్లదాఁకా వోరుమక వుందునే"
11-437

**ఓరంత ప్రొద్దు:** వి. దినమంతా, ఎల్లకాలం.

"వొప్పించె నాసలకు వోరంత ప్రొద్దునను
తిప్పించె కోరికల తిరిగి నలుగడల" 1-185

**ఓర:** వి. 1. హద్దు, మేర, మర్యాద (2. క్రీగంటి చూపు 3. పక్క, వైపు 4. అంచు 5. వాలుప్రదేశం)

హద్దు, మేర:
"సారెఁ జెలికత్తెల కాసలెల్లాఁ జూపుతానె
వోరలేక కూడితేనే వొడబాటా నాకు" 19-241

క్రీగంటిచూపు:
"ఓరతోడ నాపె సేసే ఉద్దండాలెల్లాఁ
బీరాన నీవు వచ్చి పెనఁగవద్దా" 11-44

**ఓరగన్ను:** (2) వి. క్రీఁగన్ను, ఓరచూపు.

"వొగరుఁ దీపుగా నీవు వోరగండ్లఁ జూచిన
మగటిమిఁబూసగొండిమాటలెల్లా నాడుదూ"
12-34
"సారెఁ దురుమొకచేతఁ జక్కఁబెట్టుకొంటానే

వోరగండ్లనే చూచె నొక లేమ" 17-344

ఓరవాకిలి: (ఓర + వాకిలి) సగం తెరచి ఉండే గృహద్వారం. (సూ.ని.) ఓర అంటే ఒరగినది, వంకరయైనది అని అర్థం కనుక ఓరవాకిలి అంటే సగం తెరచి ఉన్న గృహద్వారమని అర్థం. రూపాం. ఓరువాకిలి (వాచ.)

"ఓరవాకిలి సేసి వొంటి నీవు లోననుండి
రారమ్మనాన్నా నెదురుగా రావు గదవే" 27-183

ఓరసేయు: (ఓర + చేయు) పక్కకు ఉంచు, పక్కకు ఒరగించు.

"భారపు వేంకటగిరి బాఁపడా మమ్ము
నోరసేయక కూడితివో బాపఁడా" 6-90

ఓరికొట్లు: వి. ఓరి అనెడి నీచ, మిత్ర పురుష సంబోధన చేయడం. రాకొట్లు వంటిది.

"ఉద్దండాలకే కాదా వోరికొట్లను నిన్ను
పెద్ద బెట్టుగా నూరకె పేరఁబిలిచేది" 26-452

ఓరికొట్లు కొట్టు: (4) ప.బం; అ.క్రి. ఓరి అని నిందా పూర్వకంగా సంబోధించు.

"ఓరికొట్లు కొట్టేది వున్నట్టే సిగ్గువడేది
కోరిక సతులకివి గుణములే కావా" 20-237

ఓల: (2) వి. జలక్రీడ, జలక్రీడలు జరిపేసమయంలో 'పట్టుకో చూద్దాం' అని ఇతరులను ప్రేరేపించడానికి ఉపయోగించే శబ్దం. (నింద, నెపం, వ్యాజం)

"యీ లాగులే ఇందరికి యీఁదులాడే నీటిలోని
వోల లాయ నిదివో నీ వుప్పువేసి పొత్తులు"
21-340

ఓలమాసగొను: అక. తిరోహితమగు, మఱుగుపడు, వెనుదీయు, శ్రమ తీర్చుకొన నెంచు. (ఓలము = రహస్యస్థలం ఆం.ప.ని.)

ఓలవేయు: (3) అ.క్రి. నిందవేయు.

"ఓలవేసి పలపించి వోర సేయవద్దు గాక
వేళతో వచ్చి కూడితే వేడుకే కదే" 28-356

ఓలి: (2) వి. 1. ఉంకువ, కన్యాశుల్కం, పెండ్లికొడుకు పెండ్లిసమయంలో వధువు కిచ్చే ధనం. 2. వాక్యాలంకారంగా ప్రయోగింపబడే పదం.

"ఓలివెట్టి పెండ్లాడితి వొడఁబరచవలెనా
మేలుతోడిదాననై మెలఁగుదుఁగాక" 12-157

"కోలుముందై బ్రహ్మ యజ్ఞకుండలము
లాహుతి గొని
వోలినుండే అది నీకు హోమము" 4-46

ఓవపుచ్చు: స.క్రి. తెలియజేయు, వివరించు, సరిపడునట్లు చేయు, తీర్పుచేయు, సమాధానపరచు.

"చేవదేర నీ దొంగచేత లెల్లా వీరు వారు
వోవపుచ్చే రివి విననోపమయ్యా" 20-133

ఓవరి[1]: (2) వి. సభ్యత, నాగరికత, మర్యాద. (తె.వ్యు.కో.)

"శ్రీవేంకటేశ్వరునికి చెలి యలమేలుమంగ
వోవరిగా నెలకొని వురముపై నున్నది" 7-198

"ఓవరిగా నాతఁడు నిన్నురమునఁ బెట్టుకొంటే"
20-385

ఓవరి[2]: (23) వి. వాసగృహం (ఆం.భా.) లోపలి గది, చంద్రశాల (శ.ర.), అంతఃపురం, పడకటిల్లు. (పీఠిక)

"ఓవరిలోనికి వచ్చి వొరసి నీవే యడుగు
కావిరి నివ్వెరఁగులఁ గమ్ముకొని వున్నది" 8-38

ఓవలఁబెట్టు: ప.బం; స.క్రి. దూరంగా ఉంచు, బలవంతపెట్టు, ఇబ్బందిపెట్టు.

"పేద కలమేల్మంగ శ్రీవేంకటేశ నీ కుండఁగా
వూడిగపువారి నెంత వోవలఁబెట్టితివి"

"ఈవలఁ జన్నులె గొప్ప లించుకంతె
నెన్నడుము
వోవలఁబెట్టితే నంత వోరుచుకో నోపను" 18-534

ఓవల: (10) ఆవల (?)

"దేవుఁడవై ఇందరిలోఁ దిరుగాడుదువు గాని
ఓవల నాకైతే నీపై వున్నచోనే వున్నది" 26-28

"దావతి జలనిధి దాటినవారికి
వోవల మరియును వోడేలయ్యా!" 4-260

"ఓవలఁ బాలెల్లఁ దాగి వుబ్బి మదించీని
తావి బుజాల గోరికోఁతలు కోసిరి" 21-231

**ఓవలకత్తె:** (ఓవల + కత్తె) వి. ఉపాయశాలిని యైనస్త్రీ, తీర్పరియైన స్త్రీ.
"నీవుఁగూడి యిందుకుగా నిందుఁజొట్టాలఁ జేసేవు
వోవలకత్తెవు గదే వువిదరో నీవు" 18-440

**ఓవలుసేయు:** స.క్రి. దోషులను చేయు (మై.వే.సు.)

**ఓవసేయు:** అ.క్రి. 1. ఇబ్బందిపెట్టు 2. దోషముచేయు
"లావుల నీ మన్ననకొలఁదులవారము నేము
వోవేసి మమ్ము నేల వొరసేవు విభుఁడా"
8-285

**ఓశక్క:** ఓసి + అక్క కు వ్యావహారికం.
"ఓపో అదేడ సుద్ది వోశక్క
కోపగించుకొందురటె గొబ్బున నోశక్క" 25-427

**ఓసరించు:** (6) స.క్రి. తొలగించు, అపసరిల్లఁజేయు, విడుచు, త్యజించు (పీఠిక)
"ఓసరించి నీ విభుఁడు వొద్దనె వున్నాఁడిదె"
17-331

అ.క్రి. 1. ఓసరిల్లు, తొలగు, అంతరించిపోవు 2. ఇష్టపడకుండు 3. వంగు (తె.వ్యు.కో.)

**ఓసరు:** అ.క్రి. తొలగు, అపసరిల్లు.
"ఓసరి యాతని నీడ దోసిటిలోఁగని నీరు
వాసిఁగాల్లఁ జల్లుకోఁగా వడీ నవ్వె కృష్ణుఁడు"
21-457

**ఓసికొట్లు కొట్టు:** (ఓసి + కొట్టు) వి. 'ఓసి' అని నిందాపూర్వకవాక్కులను పలుకు.
"వోసికొట్లు గొట్టి కంచుటుంగరాల చేయి
తీసేవు నీ చెల్లెతోడు తియ్యకురా నన్నును"
5-103

**ఓహరిసాహరి:** వి. తండోపతండంగా అని శ.ర., బ్రౌన్: Backwards and forwards; అహమహమికతో, సాహంకారంగా అని సూ.ని. "అహమహమిక పేరు రహికెక్కు నోహరిసాహరి యనఁగను" ఆం.భా. 2-221. కొన్ని ఉదాహరణల్లో ఎడతెగక - అవిచ్ఛిన్నంగా అనీ, గుంపులు గుంపులుగా అనీ అర్థాలను చూపి ఉదాహరణలు చూపింది. బ్రౌన్ ఇచ్చిన ముందుగా వెనుకగా అనే అర్థమే పొసగునట్లున్నదని ఆ.మూ. (సం.వా; పద. భాషా. 437)
"అకట యీ జగతి నోహరిని సాహరిని
యొకఁడు నాతోఁ బోరనోపునే పోర"
పద. హోరాహోరిగా అనే అర్థమిచ్చింది. పై ఉదాహరణంలో అహమహమీకతో, హోరాహోరీగా అనే అర్థాలే పొసగేట్లుగా ఉన్నాయి.

## ఔ

**ఔఁగాదను:** (14) (ఔను + కాదు + అను), విమర్శించు, ఆలోచించు, అడ్డుచెప్పు.
"హత్తి వలచినదాన నౌఁగాదనఁగరాదు
తత్తరపు నా వయసు తన సొమ్ము గాదా"
26-249

**ఔఁగాములు:** వి; బహు. (అవు + కామి) మంచిచెడులు, సత్యాసత్యాలు, కష్టసుఖాలు, ఉచితానుచితాలు.
"చింతలన్నియు విడిచి సేసవెట్టేవారికి
యింతులలో నౌఁగాములు యిక నేడవే"
13-20

**ఔఁగు:** వి. భక్ష్యవిశేషం, అవుగు. 6-4

**ఔత:** (అగు + త) వి. కావడం, భావార్థంలో 'ట' ప్రత్యయం బదులుగా అగుధాతువుపై 'త' ప్రత్యయం. భావార్థంలో ఈ 'త' ప్రత్యయం చేరినరూపం అన్నమయ్యలో పెక్కుచోట్ల కనిపిస్తుంది. చూ: 5-69, 7-126, 441, 9-72, 53, 11-54, 13-399, 14-519, 395, 14-422, 16-417, 18-495, 349, 19-465 మొ॥
రూపాం. అవుత. అన్నమయ్య 'ఔట' అనే రూపాన్నికూడా అతివిరళంగా మాత్రమే వాడినాడు.
"అలమేలుమంగవార మౌట చాలదా" 27-439

**ఔబళపుఁగొండ:** వి. అహోబలంకొండ. కర్నూలు జిల్లాలో ఉన్న నృసింహస్వామి క్షేత్రం.

"పెదయౌబళపుఁగొండఁ బెరిగే వదే
వదలక కొలిచితే వరము లిచ్చీని" 4-309

**ఔభళనారసింహము :** వి. అహోబలక్షేత్రంలో వెలసిన నరసింహస్వామి.
"పరఁగీ నదివో గద్దెపై సింహము వాఁడే
పరమైన యౌభళనారసింహము" 4-415

**ఔభళపు సింహము :** (ఔభళము + సింహము) అహోబలం క్షేత్రంలో వెలసిన నరసింహస్వామి.
"నానాటికిఁ బెరగని నరసింహము
అనుక వరములిచ్చే నౌభళపుసింహము"
3-153

**ఔభళేఁశుడు :** (5) (ఔభళ + ఈశుఁడు) అహోబలక్షేత్రస్వామి యైన నృసింహస్వామి. అహోబలమునకు ఔభళము వ్యావహారికరూపం.
"సందించి వైశాఖశుద్ధచతుర్దశి శనివార
మందు సంధ్యాకాలమున నౌభళేశుఁడు" 4-310

**ఔభళేశ్వరుడు :** (ఔభళ + ఈశ్వరుడు) అహోబలంలో నెలకొని ఉన్న నృసింహస్వామి. ఔభళం అనేది అహోబలానికి వ్యావహారికరూపం.

## క

**కంకణదారాలు :** వి. బహు. వివాహాది శుభకార్యాల్లో కంకణాలు కట్టుకునే దారాలు, ఇది వైరి సమాసపదం.
"కంకణదారాలు కట్టరో యిద్దరికిని
సుంకులఁ బెండ్లిపీటఁ గూచుండఁబెట్టరో"
14-365

**కంకి :** వి. కఠినుడు, దురుసుతనం కలవాడు.
"అందరి యెంగిలివైతి వాడికలకు లోనై
కందువరతులలోన కంకి వైతివి" 21-212

**కంకిగ(గా) :** (14) క్రి.విశే. వికృతంగా, నిండుగా, దట్టంగా. కంకి అంటే గింజ ముదిరిన ఎన్ను అని అర్థం. ఇక్కడ లాక్షణికంగా నిండుదనము అని అర్థము అని సం.ప.స. (14. అను. 348 పు.) బలవంతంగా (మాం.ప.కో; తె.అకా.)
"కంకిగాఁగ నెలయించి కొఁగిటఁగూడితి నన్ను
వేంకటవిభుఁడ యిఁక వీడవయ్యా" 5-121
"వంకలచంద్రుల నించి వాడివెట్టిఁగాక నీకు
కంకిగా రతులలో ఘాతేసునా" 8-112
"కంకిగ బహునరకంబులు చొచ్చితి
నింకా భయమది యెరఁగను" 3-317
"అంకెల శ్రీవేంకటాధిప కూడితి
కంకిగ నలయదు కాయంబిదివో" 27-263

**కంకిసేయు :** (3) అ.క్రి. దురుసుతనమాచరించు. కంకి = కండె (పర్యాయ) కంకి = జొన్న లోనగువాని యెన్ను (సూ.ని.)
"అంకెకు రాకున్నవేళ ఆడువారు మగవానిఁ
గంకిసేసి కన్నచోటఁ గాకుసేతురు"
"కంకి సేసి రతులను కాఁగిటఁగూడితి నిన్ను
యింకాఁ దనియ వేమోయి యెందాకను"
11-578
"తొడమీఁదఁ దొడవేసి దొరతనాలు చూపఁగా
కడఁగి నీ మోవి యాకె గంకిసేయఁగా" 27-443
"మంకు చూపవద్దు గాని మనసిచ్చి
యన్నిటాను
కంకిసేసి రతులను కాఁగిలించవచ్చును"
25-193

**కంకు :** అ.క్రి. గద్దించు, అదలించు, గదమాయించు, గదుము (పర్యాయ), సొరము పీల్చు (మాండ)
"కంకి తన సుద్దులకు గక్కన నవ్వినదాన"

**కంగనాడు :** అ.క్రి. అబద్ధమాడు, బొంకులాడు, వంచించు (పద.) కిట్టెల్ నిఘంటువులో కంగు = displeasure, anger. కంగారు = to become angry or annoyed అని వివరింపబడింది. దీనినిబట్టి చూడగా 'కంగనాడు' కు గట్టిగా పలుకు, ఆగ్రహించి పలుకు అనే అర్థాలు కూడా క్రింది ప్రయోగంలో సరిపడుతున్నాయి.
"బంగారు మెఱుగుచాయ పడఁతి నొకతెఁగూడి
కంగనాడేవు నాతో కానియ్యరా" 5-51

**కంగాణించు :** వ్యవసాయం, తదనంతరం కల్లం

పని చేయు, కంగాణమైంది అనడం వాడుక.
"యెడయని పయ్యెదనే ఇల్లారుగా బెట్టి
కడలేనిరతుల కంగాణింతువు రావయ్యా" 22-320

**కంగు:** (13) అ.క్రి. చలించు, కదలాడు, తూలు, కసరు, బిత్తరపోవు, తప్తమగు.
"కంగి నిలుచున్న దదే కంబముదండ" 11-487
"వెంగేన నిమ్మపంటను వేసల వేసితి నంటా
కంగి మనికితపడి కరఁగీఁజెలి" 7-221
"అంగవించి కూడితిరి అట్టి శ్రీవేంకటేశ
కంగకిట్టి వుండరాదా కడు జంకె లేఁటికి" 20-531

**కంగు:** (8) వి. 1. సరిహద్దు 2. మడత 3. పక్షం 4. ఉప్పుబట్టీ లోని గీతపై పిల్లవాడు నిల్చొని ఇటూ అటూ దాటిపోకుండా కాయడం 5. జరీ మొ॥ వాటితో వంకరగా ఏర్పరచిన కన్ను.
"సంగడినున్న వారి సాకిరివెట్టి రావే
కంగు లేక తన బుద్ధి కైకొని రావే" 7-215
"పంగించ నీ నోరు బండెయెద్దు మోరాయ
కంగు లేక కదుపునఁ గలపఁగవలెనా" 7-185
"కంగు లేక వింటేను కత చెప్పవచ్చుఁగాక
వెంగేలుగా భావించితే వింతగాదటే" 22-329
"అంగనకు కర్పూర పారటము మాన మాటు
కంగు లేని యిప్పటి నీ కాఁగిలే మందు" 16-145

**కంగుదేరు:** (3) ప.బం; అ.క్రి. ఆరితేరు.
"సింగారించుకొనఁబోతే చీర గట్ట వచ్చీఁ దానె
కంగుదేరిన బిడ్డనిఁ గంటివో యమ్మా" 7-188
"చెంగటఁ బెనఁగుదురా చేతులెత్తి మొక్కితేను
కంగుదేర నన్నుఁజూచి కరుణించీఁగాక" 14-527

**కంగువాయు:** (?)
"కంగువాయ శ్రీవేంకటేశుఁడు నన్నుఁగూడె
అంగడినవ్వులలోనే ఆస మానీనా" 25-200

**కంగువెట్టు:** (3) (?)
"కంగువెట్టేనా నీతో కల్ల గుట్టు నీకేఁటికి" 27-286
"జంగిలిమాయలు సేసి జట్టి ఐనె నిన్ను నాపె
కంగు వెట్టుకోము నేము గరితెలము" 27-285
"కంగు వెట్టుకొని పాసికాఁకలఁ బొరలవద్దు" 27-581

**కంచపుఁబాపములు:** వి; బహు. కూటికోసం చేసే పాపాలు (?)
"కొంచెపరచు నా కోపముఁ గోసివేసి మరికదా
కంచపుఁ బాపంబులలోఁ గడతేరుటా" 10-4

**కంచపుఁబెండ్లి:** వి. సులభసాధ్యమైన వివాహం, వడ్డించిన విస్తరి వంటి ప్రయోగం కావచ్చు!
"యెంచగ శ్రీవేంకటేశ యిందిర నీ కూటములు
కంచపుఁబెండ్లి మీకుఁ గలిగెఁగా నేడు" 9-129

**కంచపుఁబొత్తు:** (3) వి. సపంక్తిభోజనం, సంబంధం, దగ్గరి చుట్టరికం.
"మంచిదే నీలోని గుట్టు మాకే యిన్నిటా అట్టు
కంచపుఁబొత్తుకు నీవే కైకొలుపరాదా" 19-341

**కంచపుగాలి:** వి. కూటిమీది మరులు.
"కంచపు గా లావటించే కలిమిలో వారమంతా" 9-49

**కంచపుజన్మము:** కేవలం భోజన దృష్టి గలిగిన జన్మము, తిండికోసమే పుట్టిన పుట్టుక, భోగార్థమైన జన్మము.
"పొంచి కామాంధకారము పుణ్యము గానఁగనీదు
కంచపుజన్మపు చిక్కు గతి చూపదు" 3-30

**కంచపు పంతపుది:** వి. భోజనంమీది పంతం కలది.
"కంచపుపంతపుదానవు మా కతలాలకించ నేలె యీా
పంచల మాయలు మాని పదరాదా" 9-100

**కంచపుపొత్తు:** (4) వి. సపంక్తిభోజనం, మిక్కిలి సన్నిహిత సంబంధం.
"మించి యెప్పుడును నేము మీవారమే
కంచపుపొత్తు గలసి కసిగాటు లేఁటికే" 19-434

**కంచపుపొత్తు చుట్టము:** వి. అతిసన్నిహిత బంధువు, జ్ఞాతి, పాలివాడు.

"మంచి మాటలాడినవాఁడు మరుగక యాలమాను
కంచపుపొత్తు చుట్టము కాకు సేసీనా" 16-43

**కంచపుమోవి:** వి. వడ్డించిన కంచంవంటి పెదవి, అనుభవించడానికి అందుబాటులో నున్నది.
"వంచనతో నీవు నాకు వలచిన వలపెల్ల
కంచపుమోవియందే కానవచ్చెను" 7-581
"కంచపుమోవి యట్టే కానుక వట్టుకున్నది
అంచెలఁజేతులు చాచి అందుకొనవయ్యా" 29-222

**కంచపురతి:** వి. (?)
"యెంచఁగ శ్రీవేంకటేశుఁ డేలె నించుకే
కంచపురతి యొసఁగె కదుమకువే" 7-155

**కంచపువిడెము:** వి. ఎంగిలి విడెము.
"కంచపు విడెమిచ్చితేఁ గారమాటే తప్పు" 21-406

**కంచపుసంసారము:** వి. భోజనమే ప్రధానమైన సంసారము.
"ముంచిన జన్మదుఃఖములు దలపోయుట
కంచపుసంసారము గడుచుటే జ్ఞానము" 4-346

**కంచము కాలఁదన్ను:** ప.బం; అ.క్రి. ఆదరంతో పెట్టినదాన్ని తిరస్కరించు.
"పెంచేటి తలిదండ్రులు ప్రియమై వడ్డించఁగాను
కంచము కాలఁదన్ను సంగతియా బిడ్డలకు" 3-20

**కంచముపొత్తు:** (30) వి. సపంక్తి భోజనం, (పద.) బంతికూడు, దగ్గరి చుట్టరికం. (తె.జా.)
"కలయ మోవితేనె లొసఁగు కంచము పొత్తు
లెన్నండె" 17-20
"కంచముపొత్తుకొరకే కానుక చేతికియ్యనా
యెంచుకోక మఱచితివేమో కాక" 23-230

**కంచముపొత్తు చుట్టము:** వి. దగ్గరి చుట్టరికం.
"మంచి మాటలాడినవాఁడు మరుగక యాలమాను
కంచముపొత్తుచుట్టము కాకుసేసీ" 16-43

**కంచములోపలి కూడు కాలదన్ను:** ప.బం. సిద్ధాన్నాన్ని కాదను.
"ముంచిన వేడుకతోడ మొక్కుట గాక
కంచములోపలి కూడు కాలఁదన్నేటికి" 1-497

**కంచి:** వి. మదరాసుకు సమీపంలో ఉన్న కంచి పట్టణం. మోక్షదాయకాలైన సప్తక్షేత్రాల్లో ఒకటి. ఇట వరదరాజస్వామి వెలసి ఉన్నాడు.

**కంచిరాయఁడు:** వి. కంచి క్షేత్రంలో వెలసిన స్వామి. వరదరాజస్వామి. (కాంచి యే కంచి)

**కంచుఁగుత్తికల వారు:** ప.బం; వి. హెచ్చుస్థాయిలో పలికే కంఠం కలవారు. కంచు ఖణేలు మని శబ్దిస్తుంది. అట్టి కంఠమని భావం. కంచుగొంతు.
"కంచుఁగుత్తికలవారి గానములఁ జొక్కిచొక్కి
కంచుఁబెంచు నాయెఁబో నా కడలేని గుణము" 1-40

**కంచుఁగుత్తుక:** (కంచు + కుత్తిక) ప.బం; వి. కంచుకంఠం, హెచ్చుస్థాయిలో పలికే కంఠం. కంచు ఖణేలుమని మోగుతుంది. అట్టి కంఠమని భావం. 1-401

**కంచుఁబదను:** ప.బం. చాలా పెళుసు (పద.) మిక్కిలి నిశితము, మిక్కిలి కఠోరము. కంచునకు పదును పెట్టితే అతిసునిశితంగా ఉంటుంది కదా! ఏ యింతకైనా విరిగి పోతుందని భావం. కంచు చాలా పెళుసైన లోహం. మెత్తనిది, మృదువైనది అని అం.శ.ర.
"కంచుఁబదనుల కాంతలు నేఁడిట్టే
వంచుకొన నీకు వసమా" 8-289
"కంచుపదనువంటి మనసు కనుక వాడిందుకు
రాడే" అని క్షేత్రయ్య.

**కంచుఁబెంచు నగు:** (2) ప.బం; అ.క్రి. విరిగిపోవు (కంచు మట్టిపెంచు అగు అని వాచ్యార్థం)
"కంచుఁగుత్తుకలవారి గానములఁ జొక్కిచొక్కి
కంచుఁబెంచు నాయెఁబో నా కడలేని గుణము" 1-401

"ఇంచుక వడి నీ విటు రాకుండిన
కంచుఁబెంచు నౌఁగాయ మిది" 24-51

**కంచుఁ బెంచు సేయు :** ప.బం; స.క్రి. విరుగునట్లు చేయు.
"వంచన లేక సుద్దులు వారివీరితోఁ జెప్పి
కంచుఁబెంచు సేసి అట్టె కాకుసేసే నదివో" 5-226

**కంచుమాయ :** వి. గట్టిమాయ(?)
"కంచుమాయఁ బొరలఁగా గాచితి శ్రీవేంకటేశ
కొంచిన యిన్నాళ్లు నా గుణమేఁటి గుణము" 2-428

**కంచుమించు అగు :** ప.బం; అ.క్రి. చెల్లాచెదరగు, చిందరవందరగు, అగోచరం (తె.జా.), అదృశ్యమగు (ఆం.ప.ని.)
"కంచుమించులగు గగనపునడుమిది
అంచగమనయే ఆదరువు" 24-53
"అంచెల విప్రవినోదై తిరిగేటివాఁడు
కంచుమించై తిరిగాడీఁ గానరటే మీరు" 24-112

**కంచువంటి చూపులు :** వి; బహు. కంచువలె మిక్కిలి పెళుసైన చూపులు.
"ముంచిన నీ నా సంది మొగమోటా
లుండఁగాను
కంచువంటి చూపు లేల కాఁడిపారీని" 16-363

**కంచువంటి మెరుపు :** (2) కంచువర్ణం కల మెరుపు.

**కంటకమాడు :** ప.బం; అ.క్రి. పరుషవాక్కులు పలుకు, మనసు నొచ్చునట్లు పలుకు.
"కంటకమాడఁగలేదు కసరుకొనఁగలేదు
నంటున నే నీతోను నవ్వరాదా" 24-594

**కంటకములాడు :** (3) ప.బం; అ.క్రి. పరుషోక్తులు పలుకు, దూషించు.
"ఇంటికి విచ్చేసె నాతఁడేమే నీవు
కంటములాడేది కాదే నీవు" 19-563

**కంటకాలాడు :** (2) ప.బం; అ.క్రి. చూ: కంటకములాడు.
"నంటున నిట్టె నవ్వు నవ్వకుంటే యాకెఁజూపి
కంటకాలాడకు చాలుఁగానీవయ్యా" 26-150

**కంటమాల :** వి. కంఠమాలకు వ్యావహారికరూపం. కంఠంలో ధరించే మాల. చూ: కంఠమాల.
"మంచివానివలెఁ గంటమాల మెడఁబెట్టితివి
పొంచి నన్ను మరగించే పూసలో వోరి"
17-383, 1-133 & 5-84

**కంటము :** వి. కంఠము, మెడ. 5-84

**కంట వత్తివెట్టి కాచు :** ప.బం; స.క్రి. నిద్రాహారాదులు మాని అతిశ్రద్ధగా రక్షించు, ఎల్లవేళల కండ్లు మూతలు పడతాయేమో నని వత్తులు వేసుకొని అనడం నేటికీ వ్యవహారంలో ఉన్నది.
"గంటవేఁటలో తగులు కాపురమా
కంట వత్తివెట్టి కాచే కాఁపురమా" 2-34

**కంటసరి :** (9) ప.బం; వి. మెడలో ధరించే బంగారు ఆభరణం. 'కంటెసరి' అని నేటి వాడుక. (పద.)
"అంగన కంటసరి నేఁడట్టె మెడ నున్నది
సంగతిగా నీ కది లాంచనము గాదా" 19-15

**కంటహారము :** వి. 'కంఠహారము'నకు వ్యావహారికరూపం. మెడలో ధరించే హారం.
"ఆరయ నింత కంటహార మిదె కట్టుకొనె
హారమై తా నీకు నుండె ననఁబోలు" 17-259

**కంటికి రెప్పవలె కాచు :** ప.బం; స.క్రి. అతి జాగరూకతతో రక్షించు. 2-96

**కంటు :** (4) వి. 1. పగ, విరోధం (2. పగవాడు, శత్రువు) ఈ పదం నేటికీ తెలంగాణంలో వాడుకలో ఉన్నది.
"కంటు లేని యిలుదొర కక్కూరితి సేసితేను
ఇంటికాడ సతులెల్లా నిఁక దిద్దగలరా" 27-22

**కంఠమాల :** (2) కంఠంలో ధరించే హారం. చూ: కంటమాల.
"దేవు లలమేలుమంగ తెచ్చి కంఠమాల వెట్టి
శ్రీవేంకటేశ కాఁగిటఁ జిక్కించీ నిన్ను" 22-319

**కంఠమాలిక :** వి. కంఠంలో ధరించే మాల.
"యెక్కువై తడఁబడిన ఇంతి కంఠమాలికలు

చిక్కులు దీసుకొంటాను చిత్తగించేవు" 21-303

**కండగట్టు** : వ.బం; అ.క్రి. బలియు, కండపట్టు.
"కండగట్టుకొంటివా వేంకటరమణుఁడ దీన
బండుసేసితివి నన్ను బాపురా లోకానను"
12-62

"కండగట్టుకొంటేఁ జాలు కాదనేనా నేను"
11-227

"చాలిము లింతే నేలే తడవు సేయఁగనేలే
కాలము గడపఁగాను కండగట్టీనా" 20-317

**కండగర్వము** : (2) వ.బం; వి. బలగర్వం.
"యెచ్చరించి సారెసారె నిక్కువ లంటేవు నీవు
గచ్చుల నేనూ నొరయఁ గండగర్వమా" 27-25

**కండతుండాలు** : (కండములు + తుండములు) వి; బహు. ముక్కలు ముక్కలు.
"యేతుల రావణాసురుఁ డీటువంటివాఁడే కాఁడా
కాతరాన నొంటిఁజిక్కి కండతుండా లాయెను"
15-269

**కండపట్టు** : వ.బం; అ.క్రి. లావగు, బలిష్ఠమగు.
"పేస లెండాఁకా బెట్టినఁ జేతులు కండపట్టవు
వేసరక వలతువు వెలఁదులకు" 16-572

**కండించు** : స.క్రి. 'ఖండించు'కు వ్యావహారికరూపం.
"కొండవంటి దానవు కోరి చేయివట్టఁ గాను
కండించి యూడవచ్చునా కానీవయ్యా" 23-134

**కంతుని కైతప్పు** : వి. మన్మథ వికారము కావచ్చు అని సంపా.
"అంతలో వేడఁదట్టితే నాపె గోరు నిన్ను సోఁక
కంతుని కై తప్పులాయ గక్కున నీ మేనను"
15-163

**కందనవోలి గోపాలకృష్ణుఁడు** : కర్నూలులో వెలసిన గోపాలకృష్ణుడు.
"కూడితి కందనవోలి గోపాలకృష్ణ
యీడనే శ్రీవేంకటాద్రి యిర వాయనా" 13-481

**కందనవోలు కృష్ణుఁడు** : వి. చూ : కందనవోలి గోపాలకృష్ణుఁడు. 23-323

**కందికుడుము** : వి. 'మంగళకరమైన విందు' అను నర్థమున వాడెనా అని పాదసూచికలో సూచింపబడింది.
"కన్నచోటనే నీకు కందికుడుము
విన్నప మిదె యింటికి విచ్చేయవయ్యా"
24-335

**కందిగురుమ** : వి. కందికుడుము (?)
"అన్నిటికి నేరుతువు అవునయ్యా
కన్నదే కందిగురుమ కంటిమయ్యా" 23-130

**కందుకుందులు** : (3) వ.బం; వి; బహు. కళంకములు, బాధలు.
"విందువలె శ్రీవేంకటవిభుఁడు నన్నుఁ గలసె
కందుకుందులెల్లాఁ బాసె కానీవే ఇంక" 19-449
"కందువ శ్రీవేంకటేశ కౌఁగిటఁ గూడితి నన్ను
కందుకుంద నీక నేల కారణము గలదా"
14-406

**కందువ** : వి. నిఘంటువుల్లో ఈ శబ్దానికి చూపబడిన అర్థాలు; 1. సంకేతస్థలం 2. జాడ 3. ఋతువు 4. ఏకాంతము 5. చమత్కారము 6. ప్రదేశము 7. సామర్థ్యము 8. తెగ 9. నేర్పు 10. కులము 11. గుఱుతు (పర్యాయ; శ.ర.) 12. సామ్యం 13. విధం, క్రమం (ఆం.ప.ని.) విశే. ఏకాంతం, కపటమైన, సత్యంలేని, చిత్రమైన.

సంకేతస్థలం :
"చిందువందైన దానిఁ జెనకుమయ్య నీవు
కందువ చెప్పంపి మీఁదఁ గలతు గాని" 7-28
"కందువ నాపై నిన్నుఁగాఁగిలించి తందులోననే"
11-88

నేర్పు, కౌశలం :
"కందువ గలుగుచోట కాఁపురాలు వేడుకలే"
12-295

ప్రదేశాలు, కళాస్థానాలు :
"చెంది నిన్నాతఁడు చెనకఁగా యేమే
కందువ లంటక కసరేవు" 7-269

"యెందాకా సిగ్గుపడే విప్పుడు నీవు
కందువ లెల్లా నంటి కాఁగిలించరాదా" 12-177

**కందువకూటమి :** వి. ఏకాంతపు కూటమి, ప్రియమైన కూటమి.

"కందువ నీ కూటమి కాఁగిటికి గురుతాయ
యిందరు జెప్పి బుద్ధులేడ కెక్కను" 13-535

**కందువగు :** అ.క్రి. సమర్థమగు.

"ఇందరికి నభయంబు లిచ్చు చేయి
కందువగు మంచి బంగారు చేయి" 1-334

**కందువజవ్వనము :** ఆసక్తిని కలిగించే జవ్వనం.

"కందువ జవ్వనమునఁ గావరించి వున్నవేళ
యిందమంటా గందము నా కేల పూసేవే"
11-221

**కందువనిధానము :** వి; ప.బం. ముంగిటి నిధానం, అందుబాటులో నున్న నిధి, ఏకాంతమున నున్న నిధి.

"ఇందరిఁగాచిన నీవు యిట్టే నీవు నాకు
కందువ నిధానమవై కలవుగా నీవు" 4-350

**కందువపనులు :** వి; బహు. చిత్రమైన పనులు, కపటమైన పనులు, సత్యం లేని పనులు.

"కందువపనులు సేయఁగలవు నీ వేమైనా
అందాలు సేసుకరాను ఆపె గలదు" 7-69

**కందువమచ్చములు :** గుఋతులైన మచ్చలు.

"కాయవు నీ ఘాతాలివి కందువమచ్చము లివి
యే యింతి సేసినవంటే యేమనేవు నీవు"

**కందువమన్నన :** ప్రియమైన మన్నన.

"మందెమేళమున నీతో మాటలాడితిమి గాక
కందువమన్నన చాలు కలకాలమెల్లను"

**కందువవేళలు :** ఏకాంతవేళలు.

"కాటుకకన్నులఁజూచి కందువవేళలు గాచి
చాటి చెప్పేఁగాక యిఁక జాగు లేలే" 8-3

**కందువసంసారము :** అసత్యమైన సంసారం, కపట సంసారం.

"కందువసంసారమందే కలదు మోక్షము" 4-72

**కందువ సోబనాలు :** ఏకాంతపు శోభనాలు.

"ఇట్టి శ్రీవేంకటేశ ఇంతి నిన్ను నిట్టె కూడె
గట్టిగాఁ జేకొనవయ్యా కందువ సోబనాలు"
21-188

**కందువైన బిడ్డ :** వి. చిత్రమైన బిడ్డ.

"అందరు సంతోసించేరు యశోదమ్మ వినవమ్మ
కందువైన బిడ్డనిఁ గంటివో యమ్మా" 7-188

**కందువైన ముచ్చటలు :** చాటూక్తులు, శ్లేషోక్తులు.

"కందువైన ముచ్చటలు కాఁగిటిలో జెప్పేఁ గాక
గందమియ్యఁగానే యేల గరిసించేవు" 7-113

**కంపమోపు :** ప.బం; వి. బాధాకరమైన మోపు.
1-197

**కంపు :** వి. సుగంధం.

"సంపద గలాపె గూడి సరసము లాడుచు
కంపులే పూసేవు గానియ్యరా" 5-51

**కంబసూత్రపు వేసాలవాఁడు :** వి. బొమ్మకఱ్ఱకు కట్టిన దారాన్ని పట్టుకొని బొమ్మలను ఆడించేవాడు.

"జాడతో భూమెల్లా ముకుచాయనె
యేలినవాఁడు
వేడుకఁ గంబసూత్రపు వేసాలవాఁడు" 7-163

**కంబసూత్రము :** వి. బొమ్మల నాడించడానికి బొమ్మకఱ్ఱకు కట్టిన దారం.

"జాడతో భూమెల్లా ముకుచాయనె
యేలినవాఁడు
వేడుకఁగంబసూత్రపు వేసాలవాఁడు" 7-163

**కంబాన వెళ్ళే దైవము :** వి. నృసింహస్వామి, స్తంభంలో నుండి వెళ్ళిన దైవం.

"మనసునఁదలఁచితే మాటలఁబిలిచే నంటా
తనిసి కంబాన వెళ్లే దైవమవునా" 3-451

**కంబాలాట :** (కంబాల + ఆట) ఒక బాలిక్రీడా విశేషం, నాలుగు స్తంభాలాట.

"గరిమఁ దొడలు ముట్టి కంబాలాట లాడేనంటా
పరఁగ నొడఁబరచీ పడుచా వీఁడు" 17-173

**కంబుకంఠి :** వి. కంబుకంఠికి వ్యావహారికరూపం; స్త్రీ. శంఖంవంటి కంఠం కల స్త్రీ.

"యింతుముఖి కంబుకంఠి యున్నిటా
సంతసైనది" 28-363

**కంబుకంఠి :** వి. శంఖంవంటి కంఠం కలది, స్త్రీ.
"కంబుకంఠికిని కప్పురపుబోట్లు పెట్టరే
అంబరమధ్యకును ఆరతులు యెత్తరే" 29-15

**కంభం :** ఒక గ్రామం పేరు.

**కంభపు సూత్రమాడెడివాఁడు :** వి. బొమ్మకళ్లకు కట్టిన దారాన్ని పట్టుకొని బొమ్మల ఆడించేవాడు.
"కతు పోట్లములనే కర్మపుఁజేఁతలవాఁడు
అతని కంభపుసూత్రమాడెడి వాఁడు" 4-352

**కంభపుసూత్రము :** వి. చూ: కంబుసూత్రము.
4-352

**కంభము :** వి. స్తంభం.
"ఉదయాస్త శైలంబు లొనరఁగంభములైన
పుడమిమండలము మోచె నుయ్యాల" 1-67

**కంభమురాయఁడు :** వి. కంభములో వెలసిన నృసింహస్వామి.
"కలిమికాంత తోడెక్కె గంభమురాయ
నీపై గలువదండలు వేసెఁ గంభమురాయ"
18-420
"కరుణించవయ్య మమ్ముఁ గంభమురాయ
పెరిదేవుని కాలువ పెద్దకంభమురాయ" 18-420

**కంభాయుళ్లు సేయు :** స.క్రి. త్రిప్పులబెట్టు, కొలికికిదెచ్చు (?)

**క :** అనుబంధంగా చేరిన 'కొని' అనేదానికి వ్యావహారిక రూపం. ఉదా :- కూడుక (కూడుకొని), వహించుక (వహించుకొని), భావించుక (భావించుకొని) మొ॥

"క : అనుబంధంగా చేరిన 'కొని' అనే దానికి వ్యావహారిక రూపం; ఉదా : కూడుక - కూడుకొని, వహించుక - వహించుకొని, భావించుక - భావించుకొని మొ॥

**కకపిక :** అవ్య. నవ్వడంలో ధ్వన్యనుకరణపదం.
"వొకరొకరి మొత్తిరి హోరాహోరిగాఁగాను
కకపిక నవ్వుకొంటా కడనుండె నమ్మా" 26-157

**కక్కరము :** విశే. కర్కశం, కఠినం, మోటు.
"నిక్కి తుమ్మెదలవంటి నెరు లెల్లాఁ దెల్లనాయ
కక్కరమాయ మేను కాంక్షలూ నుడుగవు" 2-4

**కక్కసపువారు :** వి. కర్కశులు, కఠినులు.
"గక్కన మొక్కినవారిఁ గాఁగిట నింతురు గాక
కక్కసపువారి నేల కైకొందురు" 21-207

**కక్కసపెట్టు :** (2)స.క్రి. బాధించు.
"కక్కసపెట్టకురె కమ్మర విచ్చేసెఁదాని
మక్కువ గలుగుపాటి మన్నించనీవే" 9-61

**కక్కసము :** (7) విశే. కర్కశం, కఠినం. (కష్టం, కోపం, బాధ, క్రూరత్వం, కొరడా, వాడి) మోటుదనం అని సారంగధరవ్యాఖ్యానం.
"కక్కసమేటికి యాకెఁగాఁగిలించి కూడరాదా
మిక్కిలి శ్రీవేంకటేశ మెచ్చేవుగాని" 19-48
"వెక్కసపువలపుల వేడుక చెల్లించలేక
కక్కసాన దూరఁబోతేఁ గలఁగు మది" 12-317

**కక్కసించు :** (54) స.క్రి. 1. నొప్పించు, బాధించు 2. సంకటపఱచు.
"అక్కర గల విభుఁడు యాసిచ్చితేఁ జాలుఁగాక
కక్కసించనేల చెలికత్తియలను" 28-48
"శ్రీవేంకటేశ్వరుఁడు చేరి నిన్నుఁగూడఁగానే
కావరించి నీ వేల కక్కసించేవే" 19-156

**కక్కసీఁడు :** (3) (కక్కసము + ఈఁడు) వి. క్రూరుఁడు, కఠినుడు, కర్కశుఁడు.
"లక్కవలెఁ గరఁగె యీ లాగు చూచి నా మనసు
కక్కసీఁడ వయితివిగా కాంతలయెడకు" 14-412

**కక్కురితిసేయు :** కక్కుర్తిపడు, లోభపడు.
"ఇటమీఁది పనులకు యిట్టె వేగిరింతునా
కటకటా నేనెంత కక్కురితి సేతునా" 11-279

**కక్కూరితి :** (2) వి. రూపాం. కక్కురితి, కక్కుర్తి, కక్కూర్తి. 1. లోభం, ఆశ 2. ఇబ్బంది, కష్టం.
"ఇప్పటి కక్కూరితికి నెంత సేసినే
కప్పుక వున్నారందరు కాఁతాళించరా" 7-542
"నెలవునఁ బానుపుపై నిన్నుఁ గసరుకొనఁగ

చలమా నీ కక్కూరితే జరపేవు గాక" 11-362

**కక్కూరితితనము :** వి. 1. ఆశ, లోభం
2. ఇబ్బంది. ఇట కక్కూరితి శబ్దంపై స్వార్థంలో 'తన' ప్రత్యయం.
"కక్కూరితితనమేల కడదాఁకాను
అక్కరతో నింత నిజమాడీ బదుకరాదా" 8-172

**కక్కూరితిది :** (కక్కూరితి + అది) వి. లోభం కల స్త్రీ, ఆశాపరురాలు.
"కామించి నేఁ బదరితే కక్కూరితిదాన నౌదు
యీ మెలఁత లిద్దరును యెఱిఁగుంటేఁ జాలును"
12-64

**కక్కూర్తికాఁడు :** (2) (కక్కూర్తి + కాఁడు) వి. లోభి, ఆశాపరుడు.
"చింతతో నే నుండఁగాను చిమ్మేవు నీ వేడుకలు
యెంత కక్కూర్తికాఁడ వేమోయి నీవు" 21-166

**కగ్గు :** (17) వి. 1. కళంకం 2. మాలిన్యం 3. సంతాపం, దుఃఖం 4. దోషం 5. కందు
"దగ్గరి కొలిచితే తనివి పుట్టినా
కగ్గు లేని వేడుకతోఁ గాఁగిలించుకొనవే" 22-507
"వొగ్గి చేయి చాచవచ్చు నుద్దండాలు సేయవచ్చు
కగ్గు లేక వలచేది ఘనము గాని" 9-240

**కగ్గు :** (30) అ.క్రి. 1. వివర్ణమగు 2. నల్లఁబడు 3. కందు. సంకోచించు అనే అర్థం కావచ్చు.
"కగ్గక శ్రీవేంకటేశ కలసితివి
వొగ్గి విడెమియ్య్య రాఁగా వొడివట్టేవు" 14-133
"దగ్గరియంతలో వచ్చి తానెంత వేడుకొనిన
కగ్గినట్టి తనలోని కపటాలు మానునా" 14-381

**కగ్గు దీరు :** (2) అ.క్రి. (?)
"సిగ్గులు వడరో యేమో చెనఁకులు నించఁబోతే
కగ్గుదీర చన్నులంటఁ గాఁగిలించవే" 13-429

**కగ్గుదేరు :** (10) అ.క్రి. కందుదేరు, నల్లబడు ?
"సిగ్గుతోడి చెలుములు చేర వెంటఁగాఁనీని
కగ్గుదేరి మోము కళ కాదనే వేమే" 27-216

**కచ్చిక :** వి. కచ్చకాయ, గచ్చకాయ.
"చూడగల వన్నియును చూడనీ యోగీశ్వరుఁడు
బూడిదలో కచ్చికయై పొరయఁడెందు" 2-374

**కచ్చికాయల తిత్తి :** ప.బం; వి. (?)
"కట్టిన చిక్కపు బుత్తి కచ్చికాయల తిత్తి
చుట్టిన పింఛెపుఁబాగు చుంగులసోగ" 5-96

**కచ్చు :** వి. ఆపేక్ష, గర్వం, పుష్పదళం, అక్షగమనం, సిగబంతి, కోరిక.
"ఇచ్చకమైతే మేలు యెంత నవ్వినా నేమౌను
కచ్చువుట్టి పెండ్లాడిన కాంతుని" 14-540

**కచ్చు :** స.క్రి. 1. కోరు, ఆపేక్షించు, నొప్పించు.
"యిచ్చ నా స్వతంత్రమంటా యిందునందుఁ బొరలుచు
కచ్చి నిన్నుఁదలఁచని కల్ల యింతే కాక" 15-173
"కచ్చిక శ్రీవేంకటేశ గందవొడి చల్లేవు
ఇచ్చకురాలఁ గొసరులిఁక నేటికయ్యా" 29-103

**కచ్చుపెట్టు :** (91) ప.బం; అ.క్రి. 1. పగబట్టు 2. ఎదిరించు, ఢీకొను, ప్రతిఘటించు 3. పట్టుదల వహించు (పద.) 4. కోరికపడు.
"కచ్చుపెట్టి వీనులకుఁ గతలెన్ని విన్నాను
అచ్చుతు కీర్తన వినేయందు సరి రాదు" 4-250
పట్టుదల వహించు :
"కచ్చుపెట్టి ధర్మజునిఁ గనలించెఁ గోపము
కొచ్చి కార్తవీర్యుని బురికొల్పెఁ గోపము"
15-304
కోరికపడు :
"మచ్చికతో మీరిద్దరు మాటాడుకోరాదా
కచ్చుపెట్టి నే వాకిటఁ గాచుకుండేను" 23-34
"మెచ్చితి నీ నేరుపులు మేనఁబులకలు నిండ
కచ్చువెట్టి నన్నుఁ గూడి కాఁగిలించఁగా"
13-177
మిషపెట్టు :
"కచ్చుపెట్టి నీకునట్టి కస్తూరిపూసీని" 23-137

**కజ్జాయపుమోవి :** వి. తియ్యనిమోవి.
"సరసములాడుకొంటా చవి చెప్పుతా నతఁడు

సరిగజ్జాయపు మోవి సారె ఏచ్చి నదివో"
20-21

కటకట : అవ్య. అకట, గడగడ.
"ఇటువంటిదాన నాకేటి యటుకో
కటకట తా రాఁగాఁ గాదనేనా నేను" 19-366

కటకేశుఁడు : కోనరాయుడు. (కటకము = కొండ నడిమిచోటు)
"కందువ శ్రీవేంకట కటకేశ నీవద్ద
నెందుఁ గటకేశ! భయమిఁక లేదు" 4-379

కటమర : వి. హనువు, చెక్కిలిమీఁది భాగం.
"ఎనుపుఁ గటమరలు నిటలలోచనము
నొనరఁగఁ గొలువైయున్నాఁడు వాఁడె" 2-113

కటారము : కఠోరశబ్దభవము కావచ్చునని పరిష్కర్తల సూచన, కాఠిన్యం.
"మంకు దీర్ప వసమా మది ఇంచు కుచముల
పొంకపుఁగటారమే మది ఇంచు కుచముల"
24-181

కటారికాఁడు : (కటారి + కాఁడు) వి. కత్తి గలవాడు.
"కక్కసించి పెనఁగేవు కటారికాఁడవా వోరి
నొక్కమాఁటే యింతయితే నోపరా నేను"
11-237

కట్టఁగడ : (3) (కడ + కడ) చిట్టచివర. ఇట ద్విరుక్తమైన కడశబ్దానికి ద్రుతప్రసక్తి లేనందువల్ల అర్థానుస్వారం చింత్యం.
"సొరిది తగుల మీరు చూపు చూచుకొన్నమీఁద
గరిమ నందరి చూపు కట్టఁగడే కాదా" 16-255

కట్టఁగడపట : (కడపట + కడపట) అవ్య. చిట్టచివర. ఇందలి అర్ధానుస్వారం చింత్యం.
"గుట్టువిడిచి నవ్వినా గుణము చెప్పకున్నది
కట్టఁగడపటఁ బతి కన్నదే కానుపు" 22-44

కట్టకానికలు : ప.బం; వి; బహు. కట్నాలు - కానికలు.
"కడుఁదగవు చెప్పేవు కట్టకానికలు వెట్టి
అడిగితిమా నిన్ను నయ్యో నేఁడు" 10-2-77

కట్టడి : వి. (?)

కట్టణము : వి. వస్త్రం.

కట్టణి : వి. 'కట్టడి'కి రూపాం. నియమం, కట్టుబాటు.
"తగ వెఱఁగక నేనే తమకించితి నీమీఁద
జిగి నన్నింత కట్టణిఁ జేసెఁగా దైవమా" 11-393

కట్టికవారు : వి. 1. వెండిబెత్తంవారు, వేత్రహస్తులు 2. స్తుతిపాఠకులు.
"సిరులఁగట్టికవారు సేయరే బరాబరి
వరుస నాలవట్టాలవారెల్లా విసరరే" 24-268

కట్టికాపె : (కట్టిక + ఆపె) వి. వేత్రధరురాలు, ద్వారపాలిక.
"వేడుకతో నిన్ను వెల్లవిరిసేయరాదుగాక
వాడికఁగట్టికాపెను వలపించవా" 29-456

కట్టిగవారు : వి; బహు. వెండిబెత్తమువారు, స్తుతిపాఠకులు. రూపాం. కట్టికవారు.
"సందడించి చిలుకలు చదువఁజొచ్చె పద్యాలు
గొందినే కట్టిగవారై కోవిల లుగ్గడించె" 7-445

కట్టిన ఓడదూలము : ప.బం; వి. ఎప్పుడూ ఒకదాన్ని అనుసరించిపోయేది. ఓడకు కట్టిన దూలం ఎప్పుడూ దాన్ని అనుసరించే వెళుతుంది అనేదాన్ని బట్టి వచ్చిన పలుకుబడి.
"కట్టిన వోడదూలము కాయపు సంసారము
దట్టమైన ప్రాణులకుఁ దని వేదదయ్యా" 4-24

కట్టినకంకణము : ప.బం; వి. అందుబాటులోనున్న అమూల్యవస్తువు. కొంగుపసిడివంటి శబ్దం.
"పట్టినదే పంతమాయఁ బైకొంటి వవు లేరా
కట్టినకంకణమాయఁ గాంతలెల్లాను" 19-517

కట్టినముడుపు : ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్యవస్తువు. కొంగుబంగారం వంటిది.
"కట్టిన ముడుపు వెంకటనిలయుఁడు" 4-350

కట్టిపెట్టు : (3) ప.బం; స.క్రి. 1. దాఁచు, చాలించు, మానివేయు 2. అప్పగించు

3. అణఁగఁగొట్టు 4. బంధించు 5. అంటుఁగట్టు, దాచు.
"కలసిన సంతోసము కట్టిపెట్టుఁజోటు లేక
నిలచి మోముకళలై నిండఁజొచ్చెను" 12-486
చాలించు:
"ఎందువొయ్యీ నేను తన ఇంటిలోనే వున్నదాన
కందువలేల తడవీఁ గట్టిపెట్టు మనవే" 22-357

**కట్టివేయు:** ప.బం. స.క్రి. 1. నిలుపుచేయు 2. బంధించు 3. నిర్మించు.
"అక్కరతోఁ జేసిన పుణ్యమే కట్టివేసునట
దిక్కుదెస యెవ్వరు యీదేహీఁ గరుణించను"
2-259

**కట్టుఁగాలువ:** వి. చెరువుకు నీళ్ళు వచ్చే కాలువ. 6-41

**కట్టుఁజీర:** వి. రోజూ కట్టుకునే చీర.
"కాంత మేను చెమరించి కట్టుఁజీర తొప్పఁదోఁగి
వింతగాఁ దొడలకాంతి వెలిఁబడెను" 7-388

**కట్టుకొను:** స.క్రి. 1. లాభపడు, పొందు, సంపాదించుకొను, తెచ్చిపెట్టుకొను 2. అనుభవించు (3. ధరించు, తాల్చు 4. బంధించుకొను 5. పెండ్లాడు)
"కట్టుఁగడ నూరకుండి కట్టుకొనే దే మున్నది
చుట్టాల సురభివై చొక్కించరాదా" 22-422
"మానలేక పైపై యెడమాట లట్టి యాడించఁగా
కానిమ్మని ఇఁక మరి కట్టుకొనే దేమి" 27-16

**కట్టుగాచుకొను:** (?)
"ఇట్టి తప్పు లెంచేనంటే నెంత లేదు
కట్టుగాచుకొని వూడిగము సేసేఁగాక" 23-225

**కట్టుగాడి:** వి. (కట్టు + కాడి) బంధమైన బండిసొగ, ఎద్దు మొ॥ వాటిమీద ఉంచే బండి మొదలైన వాటి యుగము. (శ.ర.)
"పసిమిఁబాపమనేటి బండెలు మేసితివి
కసరి దేహపు కట్టుగాడి నుంటిమి" 4-227

**కట్టుబండి:** వి. వేటకొరకు వేటగాడు తయారు చేసుకున్న బండి.
"కాముఁడు జఘనమనే కట్టుబండిమీఁదఁ బెట్టి
దీమముతో వేటలాడీఁ దేరి చూడ వసమా"
24-195

**కట్టుమట్టు:** ప.బం; వి. 1. ఏర్పాటు, కట్టుబాటు 2. ఉనికిపట్టు, పశ్వాదులను కట్టే చోటు.
"మట్టు లేని శ్రీవేంకటమాధవా కట్టు
మట్టుతో మమ్ముఁగూడితి మాధవా" 15-236

**కట్టుమట్టుసేయు:** ప.బం. కట్టుబాటు చేయు, ఏర్పాటుచేయు.
"పట్టపగలాయ నీతో పంతాలాడే విట్టే
కట్టుమట్టులు సేసేదిఁక మరి యెన్నఁడే" 26-405
"కడల నిన్నాపై యెంత కట్టుమట్టు సేసేనో
జడిసెనేఁ దడవితే సన్నసేసేవు" 16-390

**కట్టువగట్టు:** వి. వెలుగుగట్టు, కంచెగట్టు.
"కట్టువగట్లు కందువకుచములు
వట్టు శ్రీవేంకటపతి మాయ" 3-299

**కట్టు వదలిన క్రేపు:** ప.బం. స్వేచ్ఛగా తిరిగేది. (కట్టు వదలిన దూడ అని శబ్దార్థం) స్వేచ్ఛావర్తనం కలది.

**కట్నము కానికె:** ప.బం; వి. కట్నం అనే అర్థంలో వాడబడే జంటపదం. కట్నము – కానికె రెండూ ఏకార్థకాలే.
"నసుపుల కూటము కట్నము కానికె
పొనుఁగు మోవి సోకులు బూమి కానికె"
23-450

**కట్లు:** వి; బహు. (?)
"వుమ్మడిఁగోతుల కూటము లుదధికిఁ
గట్లువచ్చె
తమ్ముని బుద్ధి రావణుని తలవోయను"

**కఠినము:** వి. కాఠిన్యం. భావార్థంలో ధర్మివాచక శబ్ద ప్రయోగం.
"కలికి కుచాలు వ్రాసి కఠినము వ్రాయలేక
తలపోయఁదొడఁగెఁ బంతపువిభుఁడు" 23-590

**కడఁగడలు:** వి; బహు. చిట్టచివరలు.
"కద్దురా నీ సుద్దులు కడఁగడల వింటిమి

వద్దురా యింతేల మమ్ము వల(బెట్టేవు" 26-487

కడకట్టు: అ.క్రి. ఏర్పాటుచేయు, కట్టడసేయు.
"ప్రణుతింపగ శ్రీవేంకటరమణుని బహుళ
మహిమెల్లా
గణనకెక్క(గా పురాతనులు మును కడకట్టిన
మతము" 1-451
"బడినే శ్రీవేంకటేశ పాయలే మిద్దరమును
కడకూ నీ చిత్తమింతే కడకట్టేనా" 22-27

కడగంట: వి. అంతమును చూచుట.
"పెలుగ(గ(బెలుగ(గ( బెద్దలమైతిమి నేము
కలికలిలే కాని కడగంట లేదు"

కడగడ: (కడ + కడ) కొట్టకొన.
"కాంతలనే కూడెనట కడగడ దొక్కెనట
పొంతల(దట్టుపుణుగు పూయరే నేడు"
19-335

కడగడ చోటు: (?)
"కాంత నీవు గల చోటు కలిమి గలుగు చోటు
కాంతునికి తరమెల్లా( గడగడ చోటు" 24-163

కడచను: ప.బం; అ.క్రి. 1. ముగియు,
సమాప్తమగు 2. సొంతమగు, ఫలించు
3. చచ్చు, మరణించు 4. నశించు, పోవు
5. ఫలించు. స.క్రి. దాటు.
"నిన్నటి యా(కలి నేడూ నున్నది
కన్నదినంటే కడచనెను" 3-336
"పాయము గడచనదు పంతమింతో దప్పదు"
20-329

కడచూపు: వి. కడకంటి చూపు.
"చెడని జీవునకు శ్రీవేంకటపతి
కడచూపెన్న(డు గలుగును" 1-174

కడసరులు: (?)
"తలచ(చిన కొల(దే దైవము తన
కలుపుకోలు కొల(దే కడసరులు" 4-220

కడనుండు: ప.బం; అ.క్రి. స్త్రీలు
మూడుదినాలు బయటనుండు, బహిష్టగు.
"నీకు గుణము లేదు నేడిన్నాళ్ళదాకా
కాకున బడుటకంటే కడనుంటే మేలురా" 20-19

కడప: వి. 1. ఆంధ్రప్రదేశ్‌లోని రాయలసీమ
ప్రాంతానికి చెందిన జిల్లాకేంద్ర పట్టణం. ఇక్కడ
శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయం ఉంది.
(2. కడప, ఇంటిగడప, దేహం, ఇల్లు)
"చేరువ(గడపలోన శ్రీవేంకటేశ్వరు(డు
గారవాన నన్ను(గూడె(గాదనీ నేలే" 19-490

కడపరాయ(డు: వి. జిల్లాకేంద్రమైన కడపలో
పాతకడపలోని శ్రీనివాసుని, అన్నమయ్య
ఎన్నో కీర్తనల్లో వర్ణించినాడు. ఈ కడపనే దేవుని
కడప అని అంటారు. చినతిరుమలాచార్యులు
కూడా ఈ స్వామిని కీర్తించియున్నారు. వీరు
స్వామిని కడపరాయడని, కడప శ్రీనివాసుడని,
వేంకటాద్రి కడపరాయుడనియు కీర్తించినారు.
"కన్నులపండుగ లాయ కడపరాయని తేరు
మిన్నునేల శృంగారము మితిమీరినట్లు" 3-93
"ఆగుచు కడపరాయ(డై శ్రీవేంకటేశు(డు
వీ(గడు యీ వేసాలెట్టు వెలయించ వచ్చునే"
19-252
"కందము నీ గుణములు కడపరాయా తొంటి
కందువకు రా(గదోయి కడపరాయా" 18-472

కడపల: అవ్య. చివర.
"ఈ భవమునకు(జూడనేది గడపల తనదు
ప్రాభవంబెడలించి బాధ( బెట్టించె" 1-185

కడపు: స.క్రి. తొలగించు, పోగొట్టు.
"మరిగి నీ ముద్రలు మోచితిని మన్నించితి
కరుణతోడ నా యపరాధంబులు కడపు
కావుమనుచు" 2-299

కడబడు: ప.బం. పూర్తియగు, ముగియు.
"కనుగాక పుణ్యాలు కడబడెనా ?
తనువు లేదో చేతనము లేదో" 4-50-394

కడమ(లు)వెట్టు: స.క్రి. మిగుల్చు, కప్పిపుచ్చు.
"కలసి పెన(గీ నాపె కడమలేల పెట్టేవు
చెలిమికత్తెల సుద్ది చెప్పే నీకు" 7-516

కడమ: (38) 1. లోపం, న్యూనత, వెలితి.
(శేషం, మిగులు, కడ, అంతం)

"నాయందుఁగడమ లేదు నమ్మించినవాఁడవు
చెయిమీఁదుగా నెట్టు సేసినా నీ చిత్తము"
20-511

**కడమదొడమ:** (9) ప.బం. "ఇది జంటపదం గా తోచుచున్నది. ఈనాటి వ్యవహారంలో కానవచ్చుట లేదు. మిగిలింది – తగిలింది, వచ్చింది – పోయింది ఇత్యాద్యర్థములలో వా డినట్లు తోచుచున్నది. 'మిగిలినది' అను నర్థమున కడమ శబ్ద మీనాటికిని వ్యవహారములో గలదు" అని సం.ప.స. (19 వాల్యూం) లో వివరింపబడింది. మిగిలింది అనే అర్థం ప్రకృతానికి సరిపోయే అర్థం.

"పన్ని కడమదొడమ పాలలో నూరిపోసిరి
సన్నల బుద్ధి చెప్పితే చక్కనుండేనా" 7-415

న్యూనత, కొఱత, మిగులు, శేషం అనే అర్థాల్లో జంటపదం.

మిగులు, శేషం:

"వున్నవెల్లాఁ జెప్పనేల నొకతెతో భోగించి
కన్నెలకెల్లా వడ్డించె కడమదొడమలు" 27-508

"జలజాక్షి పతిఁజూచి సగము మాటలఁ దిట్టి
ఎలమిఁ గడమదొడమెందు దాఁచీనే" 24-6

లోపములు, కొఱత, న్యూనత:

"కడమదొడమ లేవి కలిసినవారికి
వుడివోని రతులలో వొద్దికే కాని" 20-362

**కడమలెంచు:** ప.బం. అ.క్రి. కొఱతలెన్ను, లోపాలు ఎంచు.

"కని కానని యజ్ఞానజంతువను
కడమ లెంచ నిఁక గొలఁదేదయ్యా" 3-495

**కడమపడు:** అ.క్రి. మిగులు, కొదవపడు.

"తలఁచిన తలఁపులు తలకూడీఁగాక ఇక
కలిగిన నీ బత్తి కడమవడీనా" 26-297

**కడలుగన్నులు:** వి; బహు. కన్నులఁకడలు అనే బదులు కడలుగన్నులని విలక్షణ ప్రయోగం.

"కడలుఁగన్నుల నిద్ర కడుఁ గమ్ముకొనఁగాను
ఇదివో నిన్నుఁ గసరి యేల చూచేము" 24-330

**కడలుడిపి నీరాడు:** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను, అలలను ఆపి స్నానం చేయు అని వాచ్యార్థం.

"కడలుడిపి నీరాడఁగాఁ దలచువారలకు
కడలేని మనసునకుఁ గడమ యెక్కడిది" 1-226

"సముద్రే శాంతకల్లోలే స్నాతుమిచ్ఛతి
మూఢధీః" అని సంస్కృత మూలం.

**కడళ్లు:** వి. బహు. అలలు. 'కడలు'కు బహువచనం.

"వొడిగట్టకుండవలె వొడిగట్టితే నాసలు
కడళ్లతో సముద్రము కడతేరనట్టు" 15-420

**కడవ:** వి. 'కడమ'కు వ్యావహారికమా? చూ: కడమ.

"కన్నుల నొలయుఁగాని కడవ మాఁటాడదు
చన్నుల నొరయుఁగాని జంకించదు" 28-452

**కడవర:** (4) వి. కడపల కావచ్చునని పాదపీఠిక. చివరిమితి, కడమ, అంతం. (చివరిసమయం)

"ముంతనీళ్లనే మునిఁగేటి బ్రదుకు
వంతఁ బొరలి కడవర లేని బ్రదుకు" 1-348

"కప్పిన యీ మాయలకు కడవరెందూ లేదు
తిప్పని హరిభక్తికిఁదిరుగు లేదు" 3-569

"చెలరేఁగి చెప్పితేను శేనాశేన ప్రియములు
వలపులకెందుఁ గడవర లేదే చెలియా" 12-308

**కడవారు:** వి. అన్యులు.

"కడవారు నవ్వేది కానవు గాక
గొడవల మమ్ముఁజూచి గుద్దిరములేఁటికే"
11-297

**కడవేయు:** స.క్రి. పారవేయు.

"కడుగగ నేఁటికి నెంగిలి బూరెలు
కడవేయ నేల నారాయణా!" 3-257

**కడసారు:** అ.క్రి. పూర్తిగా ప్రసరించు.

"కంటిమిగా నీ గుణాలు కడసారెను నేఁడు
నంటు నీవు సేయరాఁగా నవ్వువచ్చీఁ బనులు"
20-102

**కడిఖండలు:** వి. ముక్కలుముక్కలు.

"ఖరదూషణాదుల కడిఖండలుగ సేసె

సరుసఁగుంభకర్ణునిఁ జావనేసెను" 2-107

**కడిగడి గండమగు:** వి. ముద్దముద్దకు గండము ఏర్పడు, అడుగడుగుకూ గండమేర్పడు.

"కడిగడిగండమై కాలము గడిపేవు
కడుగఁగడుగ రొంపి కలియుగమా" 1-118

**కడిగడియగు:** (కడి + కడి) వి. ఆహారమగు.

"విడువక చేతిలో విష్ణుప్రసాదము
కడిగడి యైనది కానరుగాని" 2-10

**కడితము:** వి. (క.) నలుపురంగు పూసిన గుడ్డ, కవిలె, వహి.

"జిగిఁ గడితాన వ్రాసి చేతి కియ్యవలెనా
తగఁజేసే పనులెల్లా తా నెఱఁగఁడా" 26-288

**కడితాసుచీర:** వి. నల్లనిచీర, వస్త్రము.

"కడలేని మోహంబు గలవాని వలెనా
కడితాసు చీర నీవు కాసెవోసి" 5-168

**కడితొడుకుబందె:** (?)

"కన్నవారి వేడేది కడితొడుకు బందె
కొన్నిట నేమి గొనేవు కొనవయ్య బందె" 4-208

**కడియెత్తు:** అ.క్రి. భోజనం చేయు, ముద్దయెత్తు.

"కల వెల్లా వర్ణించి కడియెత్తు మనఁగాను
అలమి మోవితేనియ లడిగేవు" 25-92

**కడివోవు:** (కడి + పోవు) ప.బం; అ.క్రి.
1. చెడిపోవు, పాడగు 2. వాసనపోవు, వాడిపోవు 3. తరుగు, తగ్గు (వ్యా.)

"కాయము కాయము గూడి కడివోని తమకము
చేయెత్తి సేసవెట్టితే సెలవయ్యీనా" 12-426

"కడివోని మాటలనే కప్పురపుఁబలుకులు
బడిబడి కానుక గాఁబట్టుకున్నది" 3-321

**కడునంత:** (కడు + అంత) మిక్కిలి యెక్కువగా, అంత ఎక్కువగా అని కావచ్చు.

"అగ్గలమై నీవు గడునంత నన్ను రేచితేను
తగ్గని నీ మే నన్ని దాయిమాను గాదా" 25-451

**కడుపనులు:** (?)

"అదియేమే గొల్లెతా అందుకేరా గొల్లఁడా
కడుసెఁగడుపనులు కల్ల గాదురా" 19-514

**కడుపులోపలి పుండు:** ప.బం. వి. పైకి కనిపించని బాధ. చూ: పేగులోపలి తీట.

"కడుపులోపలి పుండు కడ లేని యాస" 1-104

**కడుపే చెరువగు:** ప.బం; అ.క్రి. దుఃఖాతిరేకం కలుగు.

"పుడమిఁబుట్టితిని బుద్ధినెఱఁగితిని
కడుపే చెరువవుత గానమయ్యా" 4-136

**కడ్డాయము:** వి. నిర్బంధం, బలాత్కారం, వర్తకులపై హెచ్చు వెలలేని వాటిని కొనుమని బలవంతం చేయడం. (వ్యా.) (త. కట్టాయం = తప్పక) రా.సీ.లో ఈ పదం వాడుకలో ఉన్నది. "అంత కడ్డాయంగా మాట్లాడితే ఎట్లనప్పా, కొంచెం వ్యవధినివ్వు" "వాడు నన్ను బాకీ తీర్చి తీరాలని కడ్డాయం చేస్తున్నాడు".

"మానరే ఆతని నేల మండాడేరు
కానుక మా మొక్కులివి కడ్డాయము గాదు"
7-593

"ఇంత కడ్డాయపు పొందులేల మాకు
యెంతేసి వారలు నీకు నెదురు చూచేరో"
16-396

**కణఁజము:** (4) వి. 1. భూమిలో ధాన్యం నిలువ చేసే చోటు 2. పాతర. ఇందులో అరసున్న చింత్యం. అరసున్న లేకుండా కూడా ప్రయోగాలు ఉన్నాయి.

"చక్కెర బొమ్మయిన సతి నీ కాఁగిలి
గక్కన కణఁజముగాఁ గట్టి
పొదిగి శ్రీవేంకటేశ భోగపు నీ గురుతబ్బె
చదరాన మేని కణజాన నించవయ్యా" 14-73

"కంగిట్లతి కెల్ల కణఁజమైతిని
పంగెన మానిసి నింక పనికివచ్చేవా" 21-274

"కటి సొబగులు రతి కాణాచి కణజాలు
కుటిలకుంతలాలే కొమ్మల బాగు" 28-112

శృంగారసంకీర్తనలు 26 వ సం.
విశేషానుబంధంలో గౌరిపెద్దివారు, కామిశెట్టి శ్రీనివాసులు గారు కణజముగా గట్టి = ధాన్యం పోసే గాదె అని వివరించడం సముచితం కాదనీ,

గాదె అనేది నేలమీద బద్దలతో చేసిన అల్లిన గాదె, లేదా మట్టితో చేసిన గాదె కానీ. కణజము అనేది నేలలో తవ్వి సిద్ధం చేసిన ధాన్యం ఉంచేది కణజం – కంజం అని ఆచార్య గంగప్పగారు వివరించినారు. (అ.సం.స. రా.సీ.మాం. 20 పుట) (బ్రౌణ్యం a grain cellar అనీ, సూ.ని. ధాన్యాదులు దాచుకొను కొట్టు, గాదె 2. పాతర 3. గంగాళము అనే అర్థాలను పేర్కొన్నాయి.

**కణుంగు :** వి. లోహపు ధ్వనికి అనుకరణం.

"కనకపుమెట్టెలు కణుంగని వాఁగఁగాను
వనితె నీకెదురుగా వచ్చీ నెవ్వతో" 12-495

**కత :** (71) వి. 'కథ' కు తద్భవరూపం. వృత్తాంతం 2. చరిత్రము, కథ, చేష్ట, చర్య 3. లోకోక్తి (సూ.ని.) అన్నమయ్య 'కత' తో పాటు 'కథ' అనే పదం కూడా వాడినాడు (3-271) కాని ప్రయోగాలు విరళం.

"ఏమని విన్నవించేము యెందాఁకా నీతోను
కామిని సుద్దులుచెప్పఁగతలాయ నీకును" 25-467

"వెక్కసపు నీ కతలు విని విని వెగటయ్యీ
యెక్కడెక్కడ నీ పగటు యెవ్వరిఁ బోలుదునే" 29-351

**కతకఱచు :** (క)

"కతకఱచిన యీ కన్నులెదిటివే
మతిఁదోఁచీ నిఁక మఱఁగులు గలవా" 3-244

"వొనరించీఁ బ్రియములు వూడిగేలు సేయవచ్చీ
తనలోనె యెంతేసి కతలఁగఱచినది" 13-312

**కతకఱపు :** వి. కథలు నేర్పు.

"అతివ నీ వూరుల యరంట్ల యడవి
కతకఱపుల చిలుకల యడవి" 5-153

**కతకారి :** (21) వి. 1. నేర్పరి, గడుసరి, కథలు చెప్పడంలో నేర్పరి, (వ్యు.) మాటకారి.

"సెలవుల నవ్వేవు చేతఁ బాపటు దువ్వేవు
కలికితనాల నెంత కతకారివే" 29-27

**కతకారి చేతలు :** వి. గడుసరిపనులు.

**కతకారితనము :** (10) వి. నేర్పరితనం, గడుసుదనం, మాటకారితనం, కథాకథనంలోని నైపుణ్యం.

"కొత్తగొత్త మాటలను కూరిమి గొసరితేను
తత్తరపు కతకారితనములందురా" 12-421

"పతివద్ద నేడే నీవు పచరించేవు
కతకారితనా లెందు గడిఇంచుకొంటివే" 28-44

**కతకారిది :** (కతకారి + అది) గడుసరిది, నేర్పరిది, మాటకారిది, కథలు చెప్పడంలో నేర్పరిది.

"తతి శ్రీవేంకటేశుఁడు తగ నన్నుఁ గూడె నేఁడు
కతకారిదానివా చక్కటులు చెప్పఁగను" 7-397

"మతి నమ్మికైనది మర్మములు దడువదు
కతకారిదాని మాయ కానలేము గాని" 24-377

**కతకారియాపె :** వి. (కత + కారి + ఆపె) 1. కథలు చెప్పే స్త్రీ 2. నేర్పుగల స్త్రీ 3. గడుసరియైన స్త్రీ.

**కతకారివాఁడు :** వి. గడుసరివాడు, నేర్పరి, మాటకారి.

"అలమేలుమంగ నేను అన్నిటా శ్రీవేంకటేశ
కలసితి గుట్టేటికి కతకారివాఁడవు" 25-25

**కతకుఁగాళ్లడుగు :** (92) ప.బం; అ.క్రి. అసంభవమైనదాన్ని గురించి అడుగు. కతకు కాళ్లు ముంతకు చెవులుండవని పూర్తి పలుకుబడి.

"కదిసి చెప్పే కతకుఁగాళ్లడిగితిఁ గాక
యెదురు మాటాడ నీతో నెంతదానను" 11-460

**కతకుఁగాళ్లు గలితే కలవు ముంతకుఁజెవులు :** సామెత; కతకు కాళ్లు లేవు ముంతకు చెవులు లేవు అని భావం.

"కతకుఁగాళ్లు గలితే కలవు ముంతకుఁజెవులు
వెతలఁ బెట్టక కొంగు వీడరా నీవు" 17-334

**కతకుఁగాళ్లున్నవా? :** అసంభవమనుట.

"బల్లిదునిచేత నుంటే పచ్చబూస మాణికమే
కల్లమాడ దొడ్డముద్ర కతకుఁగాళ్లున్నవా" 14-377

**కతకుఁగాళ్లు ముంతకుఁ జెవులడుగు** : ప.బం; అ.క్రి. అసంభవమైన దానిని గూర్చి విచారించు.

"ముంది కతలకుఁగాళ్ళు ముంతకుఁజెవు లడిగేవు
అంగిలి మోవి బిట్ట కంటు లే మరిగేవు" 21-383

**కతకుఁగాళ్లు మొలచు** : ప.బం; అ.క్రి. అసంభవమైనది జరుగు.

"కాంతలాల కంటిరటే కతకుఁగాళ్లు మొలచె
యింత సేసే పతికంటే యిట్టే నేనే వెగటు" 17-349

**కతకుఁగాళ్లు వచ్చు** : ప.బం; అ.క్రి. అసంభవమగు.

**కతకుఁగాళ్లేత** : (?) అసంభవం అనే అర్థంలో వాడబడే పలుకుబడి.

"పతిని సొలయనోప బడలనోప
కతకుఁగాళ్లేదఁ జెప్పి కలుచపెట్టకురే" 17-449

**కతకు కాళ్లేత** : (?) అసంభవం అనే అర్థంలో వాడబడే పలుకుబడి.

"పతిని సొలయనోప బడలనోప
కతకుఁగాళ్లేదఁ జెప్పి కలుచపెట్టకురే" 17-449

**కత చెప్పు** : (2) ప.బం. విషయం చెప్పు.

"మునుకొని వొండొరులు మొగములు చూచుకోఁగా
కనుఁగొని ఇక నేమి కతచెప్పవే" 28-375

**కత నడపు** : ప.బం; అ.క్రి. వ్యవహారం నడపు.

"ఎంత కత నడిపితి వేమి జోలిఁబెట్టితివి
చింతించ లోకములు నీ చేతివే కావా" 2-315

**కతల్కాఁడు** : వి. జాణ, నేర్పరి, మాటకారి.

"యీయెడ శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
కాయజకేలిఁగూడితి కతలకాఁడా" 28-221

**కతలకారి** : (3) వి. జాణ, నేర్పరి, మాటకారి, కథలు చెప్పడంలో నేర్పరి.

"కతలకారికిఁగాని కాఁతాళము గలుగదు
మతకరిగాని మర్మము లంటదు" 18-184

**కతలాడుకొను** : ప.బం; అ.క్రి. కథలు చెప్పుకొను, ముచ్చట్లు చెప్పుకొను.

"ఇరవై శ్రీవేంకటేశు నెద నీపై వున్నదంటా
కత లే మాడుకొనేరే కాంతలాలా" 18-38

**కతలుసేయు** : (4) వికారపుచేష్టలు చేయు.

"చిడుముడిఁగూడితివి శ్రీవేంకటేశ నన్ను
కడవారమా యేల కతలు సేసేవు" 27-358

**కతుకున** : కొరికేప్పుడు వచ్చే ధ్వనికి అనుకరణం, కటుక్కున.

"రతిరాజు నమ్ము లివి రంట దెప్పరపువేళ
కతుకున నాటుఁజేసు గవిశన నిడరే" 11-221

**కత్తరము** : వి. ఆయుధవిశేషం. (కవచం)

"కత్తరాలు చిమ్ము చుండెఁ గదలుచుండె
చిత్తజజనకుఁడైన శ్రీమూరితి" 4 అను 61

పై అర్థం ఈ క్రింది కీర్తనలో కుదరడం లేదు.

"రిత్తకు రిత్తయి యీరెంటి నడుమను జిక్కి
కత్తరపు రొంపిలోన కంబమైతిఁగాక" 4-44

**కత్తికోఁత** : ప.బం; వి. విపరీతమైన పోరు.

"చిత్తము రాఁ బతిమాలు చేసితే కడువేడుక గాక
కత్తికోఁతఁ గొసరితే కాంత యింపీనా" 17-341

**కత్తులబోను** : ప.బం. ప్రాణాంతకం, ఎటు కదలినా మెదలినా బాధించేది. 1-180

**కదలు** : (3) వి. 1. కదలిక, చలనం 2. ప్రయాణం, యాత్ర 3. ప్రయత్నం.

"కమలకును భూసతికి కదలు కదలుకు
మిమ్ముఁగౌఁగిలింపఁగఁ జేసె నుయ్యాల" 1-68

"కదలు కదలుకును కాంత వాలారుగోళ్ల
నదిమి యదిమి తన్ను నంటఁబట్టఁగ" 14-392

**కదియు** : అ.క్రి. 1. సమీపానికి వచ్చు 2. తగులు, తాకు స.క్రి. 1. ఎదిరించు 2. చేరు.

"కదిసి గాలి ముడియ గట్టరాదు
ఇదివో నా తలపోఁత యేమిసేతును" 27-530

**కదిరి** : వి. నృసింహస్వామి క్షేత్రమున్న గ్రామం. ఈ గ్రామం అనంతపురం జిల్లాలో ఒక తాలూకా కేంద్రం. ఖాద్రి అనేది దీనికి పౌరాణిక నామం.

ఖాద్రి అనే పేరుగల చెట్టునీడలో చీమలపుట్టలో లక్ష్మీనృసింహస్వామి యా విర్భవించినాడు కనుక ఆ గ్రామానికి ఖాద్రి అనే పేరు వచ్చినట్లు పెద్దల అభిప్రాయం.

"తన దాసునికొఱకు ధరియించె నీ రూపము

దినదిన వేడుకఁ గదిరి నారసింహము" 10-1-37

**కదిరికాఁడు :** వి. 'కదిరి' క్షేత్రంలో వెలసిన నృసింహస్వామి.

"కానమే నేమింత తాను కదిరికాఁడౌత

మోనాన నే నూరకున్న మోము చూచీఁదాను"

19-471

**కదిరినారసింహము :** వి. కదిరిక్షేత్రంలో వెలసిన నృసింహస్వామి. చూ : కదిరి.

**కదిరినృసింహుఁడు :** వి. అనంతపురంజిల్లా కదిరిలో వెలసిన నృసింహస్వామి. చూ : కదిరి.

**కద్ది :** వి. అనురాగం (క.కద్ది = కోరిక)

"బుద్ధులు చెప్పీఁ బొరుగులు మెట్టీఁ

గద్దులే తనకుఁ గలిగినవే" 16-215

**కద్దు :** క్రియ. 'కలదు'కు రూపాంతరం.

"కద్దు లేదనఁగ నేల కమ్మటిఁ దాను

యిద్దరి సతుల పొందూ నీడేరె ననవే" 16-11

**-కన :** అవ్య. చేదర్థకములైన వచ్చితే, చిక్కితే మొదలైన శబ్దాలపై 'కనుక' అనే అర్థంలో వచ్చే పదం.

"యీరాదా ఆపె సొమ్ము లెత్తుకవచ్చితేఁ గన

యీ రీతి చనవు లిచ్చి యింతగాఁ బెంచితివి"

9-4

**-కన :** (9) కనుక అనే అర్థంలో వాడబడే పదం. 'కనక' కు రూపాంతరం. (?)

"సేస వెట్టిన చెలికి సేసినదెల్లాఁ జేత

ఆస యిచ్చి నీవు గన ఆదరించితే" 19-256

"పంతగాఁడవైతేఁ గన పడఁతుల నెల్లాఁ గూర్చి

చింత దీర తగవులు చెప్పించుకోరాదా" 26-221

ఇది కనుక వలె నామవాచకానికో, క్రియారూపానికో, క్రియాజన్యరూపానికో అనుబంధంగా చేరుతుంది. స్వతంత్రంగా మాత్రం దీనికి ప్రయోగం లేదు.

**_కనక :** (12) అవ్య. అ వాక్యాలంకారంగా చేదర్థకాలపై ప్రయోగింపబడే పదం. ఉదా :- తీసుకుంటేఁ గనక 9-4, ఎత్తుక వచ్చితేఁ గనక, జీతము చిక్కితేఁ గనక 9-4, కలిగితేఁ గనక 26-269, ఊరకుండితేఁ గనక 26-232, తప్పయితేఁ గనక 2-423, నిలుచుండితేఁ గనక 24-414, ఎగ్గు పెట్టితేఁ గనక 14-194, నిజమాడితేఁ గనక 11-278 నిన్నుఁ గనక.

**కనక :** (49) అవ్య. 'కనుక' కు వ్యావహారిక రూపం. కాబట్టి, కావున.

"దేవులు గనక నిన్నుఁ దిలకించి కాలుదొక్కె"

28-13

**కనకకసిపుఁడు :** వి. హిరణ్యకశిపుడు.

"గద్దెమీఁదఁగూరుచుండి కనకకసిపుఁ జెండీ

గద్దరి ప్రహ్లాదునిపై కరుణ నిండీ" 15-132

**కనకగిరి :** వి. రాయచోటి సమీపంలో ఉన్న గ్రామం కావచ్చునని వే.ఆ.మూ. ఊహ. ఇట వెలకొన్న నృసింహస్వామిని అన్నమయ్య రెండు కీర్తనల్లో కీర్తించినాడు. కడపజిల్లా రాయచోటి మండలానికి పూర్వం 'కనకగిరి' అని పేరుండేదట. (క.అ.క.కీ. 27పు.)

**కనకగిరి నారసింహుఁడు :** వి. రాయచోటి సమీపంలోని కనకగిరిలో వెలసిన నృసింహస్వామి. చూ : కనకగిరి.

"నంటునఁ గనకగిరి నారసింహో

వెంటవెంట నాకుగానే వేడుక సేసేవు"

**కనకరాయఁడు :** వి. కుబేరుడు, చిందనూరిలో వెలసిన స్వామి. చూ : 17-126

"అప్పఁడగు కెలవాడీ అది కనకరాయఁడె

కప్పురము చల్లీ చక్కని సతులపైని" 5-14

**కనకవసంతము :** వి. బంగారు పండించే వసంతము అని అర్థం కావచ్చు. ఇక్కడ భోగాలే బంగారం.

"కనకవసంతము కామిని సరసము

ఘనమగు నీలపుగని కొప్పు" 29-77

**కనకసతి :** వి. లక్ష్మీదేవి.

"నగు శ్రీవేంకటేశ! కనకసతి పొందు గాదు

పొగడే సీతనైన నా పొందులు గాని" 7-119

**కనకసింహము :** వి. హిరణ్యకశిపుని సంహరించిన నృసింహుడు. నామైకదేశే నామగ్రహణమ్ (ఒక పేరులోని ఏకదేశాన్ని గ్రహించినపుడు నామాన్ని మొత్తం గ్రహించటం జరుగుతుంది) అనే న్యాయం చేత కనక శబ్దం చేత కనక కశిపు (హిరణ్య కశిపు) ను గ్రహిస్తే కనకసింహము అనే పదానికి హిరణ్యకశిపు పాలిటి సింహము - అనగా నరసింహస్వామి అని అర్థం చెప్పవచ్చును.

"శరణని బ్రతుకరో జనులార!
గరిమ మెరసె నిదె - కనకసింహము"

**కనిగుడ్డు :** కండ్లు ఉండీ చూడలేకపోవడం.

"కనిగుడ్డును నదె విని చెవుడును నదె
నినిదె జగత్తు నడపీ నదివో" 3-185

**కనిగుడ్డు వినిచెవుడు :** ప.బం; వి. కండ్లు ఉండీ చూడలేక పోవడం, చెవులు ఉండీ వినలేక పోవడం.

"కనిగుడ్డును నదె వినిచెవుడును నదె
నినిదె జగత్తు నడపీ నదివో" 3-185

**కనీగానిములు :** (కని + కానమి) వి; బహు. చూడటం - చూడకపోవడం.

"కనీగానిములకుఁ గక్కసించేనా నిన్ను
ఘనుడవు నీవైతే గబ్బితన మేలరా" 20-46

**కనుకట్టు :** ప.బం; వి. గారడీ, ఇంద్రజాలం, కండ్లకు కనబడకుండా చేయడం, మరపించడం, మోసగించడం.

"ఘటన మాయలెదుటఁ గనుకట్టై వుండఁగాను
అటమటపు విద్యలు అన్నియుఁ జూచేను"
4-190

**కనుకూరిమి :** వి. కన్నులపండుగ, నేత్రానందం.

"కనుకూరిమియో గయ్యాళితనమో
వెను తగిలేవు గోవిందుఁడా" 5-129

**కనుకొను :** (4) (కను + కొను) ప.బం. చూచు, కనుగొను కు వ్యావహారికరూపం.

"తాఁకక శ్రీవేంకటేశు దాసులైతేఁ జాలుఁగాని
కాఁక తీరు నిందరికిఁ గనుకోరో జనులు" 3-104

"కనుకొనవయ్యా ఘనుఁడ విన్నిటా నీవు
వినుకొనవయ్యా విభుఁడవు నీవు" 13-240

**కనుగలుగు :** ప.బం; అ.క్రి. జాగ్రత్త వహించు.

"కనుగలిగి శ్రీవేంకటనాథ కాతువె
కొనసాగి నిన్ను నే కొలిచి బతుకుట గాక"
10-59

"కనుగలిగి యరసి ననుండేటపడియెడు" భార; శాంతి.

"కనుగలిగి మెలంగ వెడలఁగా నెడ లేమిన్" శుక.
2-508

**కనుదిష్టి :** వి. కనుదృష్టి, దృష్టిదోషం.

"నెలఁతల కనుదిష్టి నెమలి చుంగులై యుండె
వలఁబెట్టి చలపట్ట వద్దనవే" 9-97

**కనుపెట్టుకొను :** స.క్రి. 1. కాచుకొను, రక్షించుకొను 2. ఆలోచించుకొను 3. ఎదురుచూచు.

"కాంతలిందరును నిదే కనుపెట్టుకున్నవారు
యింతకుఁదాఁ జొచ్చితేను యెగ్గుపట్టరా" 7-542

**కనుమాయ :** వి. ఇంద్రజాలవిద్య.

**కన్నది కానుపు :** ప.బం. వి. (?)

**కన్నదే కందికుడుము :** ప.బం. చూచిందే కందికుడుము, దొరికిందే గొప్పదనే భావం కావచ్చు. 'చూచినదే తిండి' 'కన్నదే గాతి' అనే పదబంధం కూడా ఇట్టిదే.

"గయ్యాళి రతిఁ గన్నదే కందికుడు మన్నమాట
నియ్యందే శ్రీవేంకటేశ నిజమాయె నేఁడు"
7-261

**కన్నపెట్టు :** ప.బం; స.క్రి. దొంగిలించు.

"వన్నెమాటల వలతువా నీవు నా మనసు
కన్నపెట్టంగఁగదా కడు బేలనైతి" 5-213

**కన్నపోవుట :** ప.బం; అ.క్రి. (కన్నము + పోవు) కన్నం వేయబడడం, కన్నంవేసి దొంగిలింపబడటం.

"ఎన్నాళ్లదాఁకఁ దానిట్టె వుండుట బుద్ధి
కన్నపోవుట పూర్వకర్మశేషం" 1-113

**కన్నప్పుడే మొక్కులు కానకున్నఁదక్కులు :** ప.బం; వి. ఎదుట గౌరవించడం, చాటున నిందించడం.

"కన్నప్పుడే మొక్కులూను
కానకున్నఁదక్కులును
పన్ని యింత సేయ నీకుఁబగదాననా" 11-452

**కన్నళవి :** వి. ఉపేక్ష, గొడవ.

"ఇన్నాళ్లవలెనె యంటా నీపెకు వరుసియ్యక
కన్నళవిఁ గూడినదె కల్ల నావల్ల" 7-7

**కన్నవారిదే కందికుడుము :** అందినవానిదే వస్తువు.

"కన్నవారిదె కాదా కందికుడుమన్న మాట
యెన్నఁడునుఁజెప్పంగ విని యెరఁగవోన్"

**కన్నవిన్నవారు :** వి; బహు. చూచినవారు – విన్నవారు.

"కన్నవిన్నవారెల్లా కాకుసేయరా
వున్నతుఁడవైన నీ కి వొచ్చము లేలయ్యా"

3-90

**కన్నిగట్టు :** ప.బం; అ.క్రి. తాడుగట్టు (పశువులకు, దూడలకు మెడకు తగిలించి కట్టే తాడును కన్నితాడని అంటారు)

"మన్ను దినియేటి దూడ
కన్ని మాను మంటా మొత్తిమొత్తి"

10-113 old & 3-502 old

గట్టి యెందాకఁగాయవచ్చును" 1-208

**కన్నులకెంపు :** ప.బం; వి. కోపం.

"కాతరపుమాటలాడి కన్నుల కెంపెక్కించేవు"

11-447

**కన్నులతుదలు :** వి; బహు. అపాంగములు.

"కంటిమి మిమ్మందరిని కన్నుల తుదల నేఁడు
తొంటి వినుకులకు సంతోసమాయ నయ్యా"

13-106

**కన్నుల నవ్వు :** (6) ప.బం; అ.క్రి. కన్నులయందు నవ్వు కనబరుచు. (తిరస్కృతిని తెలుపు)

"కన్నుల నవ్వితే నేమే కపటాలు గంటేను ఆ
కన్నులనె కాఁక చల్లఁగాదనేరా" 17-43

**కన్నులనీళ్లు కుత్తుకవట్టు :** ప.బం; అ.క్రి. డగ్గుత్తిక పడు.

"గొనకొని కన్నుల నీళ్లు గుత్తుక వట్టెడిని"

5-291

**కన్నుల నొత్తుకొను :** ప.బం; స.క్రి. కన్నులకద్దుకొను. ఇది ప్రేమాదరాలను సూచిస్తుంది.

"పొలంతి నీ చిఱునవ్వుఁబువ్వులాతఁడు గోసి
కులికి కన్నుల నొత్తుకొనంగాను" 5-211

**కన్నులపండుగ :** (9) ప.బం; వి. నేత్రానందం, నేత్రపర్వం.

"కన్నులపండుగ లాయఁ గన్నవారికిందరికి
వెన్నుఁడేఁగీ నిల్లిదివో వీథుల వీథులను" 4-178

**కన్నుల మొక్కిన మొక్కు :** వి. ఒక విధమైన నమస్కారం.

"కన్నుల మొక్కిన మొక్కు కాంక్షలకు
మూలము
విన్నపాలకు మూలము వినయములు" 13-383

**కన్నుల మొక్కు :** ప.బం; అ.క్రి. ఒకవిధమగు నమస్కారం చేయు.

"అదరి శ్రీవేంకటేశుఁడ లమేల్మంగను నేను
కడలేక నన్ను నేలె కన్నుల మొక్కేను" 14-503

"కలికి యీ జవరాలు కన్నుల నీకు మొక్కితే
సెలవుల నవ్వితివి చెలరేఁగి" 13-346

**కన్నులవంటివారు :** ప.బం; బహు. మిక్కిలి ముఖ్యులు.

"అన్నిటాను హరిదాసు లధికులు
కన్నులవంటివారు కమలజాదులకు"

16-170 old

**కన్నులా నోరా విను :** ప.బం; స.క్రి. అతి జాగ్రత్తగా విను.

"కన్నులా నోరా వినెను కాంత నీవు మాటాడఁగా
సన్నపుఁజిరునవ్వులు జాలువారఁగా" 9-184

కన్నులార్చు: ప.బం. రెప్పవేయు, సంజ్ఞచేయు.
"మన్నన కౌగిట నన్ను మరపించి యెక్కడికో
కన్నులార్పితివి వేంకటరాయ యోరి" 6-6

కన్నువేయు: (6) ప.బం; అ.క్రి. గాఢంగా చూచు, దృష్టిని ప్రసరింపజేయు, అభిలాష కలిగి ఉండు, కాముకతతో చూచు, ఆశించు, వలచు.
"కన్నువేసి మాటలాడె కమ్మని నవ్వులు
చిన్ననాఁడే నీ చలము చెల్లెనా నేఁడు నవ్వె" 19-472

కన్నెక: వి. 'కన్యక'కు వ్యావహారికరూపం.
"నౌకరి రాజుఁజేసు నౌకరి బంటుగఁజేసు
నౌకరి కన్నెకల వేరొకరికి నమ్మించు" 1-458

కన్నెనాఁడు: (3) కన్యగా ఉన్నప్పుడు.
"కన్నెనాఁడే యతఁడూ నీకుఁ గన్ను వేసినాఁడు
యెన్నరాని బిగువు యింక యేల సేయ నీవు" 17-126

కన్నెపడుచు: వి. కన్య, పెండ్లికాని బాలిక.
"కన్నెపడుచైనదానిఁ గౌఁగిట బిగింతురా
పన్నీ పూవువలెఁ జేతఁబట్టుటగాక" 18-19

కన్నెవయసు: వి. యుక్తవయసు.
"కన్నెవయసుమీఁద నీ ఘనజవ్వనము వచ్చె
విన్నకన్నచోట నేల వెరగందేవే" 20-262

కపిలెద్దు: వి. కపిలవర్ణం కల ఎద్దు.
"తడవి దేవరలను దామెర (న) లను గట్టి
గడఁగి మానిసిరూపు కపిలెద్దు" 4-74

కపురము: వి. కప్పురమునకు రూపాం. కర్పూరం.
"కంచువంటిది కుత్తిక కపురాలు పలుకులు
యెంచి మా మాటలు సోదించఁగనేలే" 21-532

కపురు: (9) వి. సొగసు, శోభ, కాంతి, అందం, రూపం.
"వుపమ నేరుతువె వొద్దికతో నాతఁడు
కపురుగా నవ్వు నవ్వి కరఁగించును" 7-66
"అందుకేమి దోసము అంతవాడ వౌదువయ్య
గందము పూసినయట్టి కపురా యిది" 17-135
"లలనల జవ్వనాలు లక్కపూస కపురులు
నెలకొని సేసే బత్తి నీటిపై వ్రాఁత" 2-268

కప్పచిప్ప: వి. ఆలిచిప్ప, 'కొచిప్ప' అని తెలంగాణంలో వ్యవహారం.
"జగము కప్పచిప్ప రజతభ్రాంతివలె నైతే
నిగమము లీ యర్థము నిలుపనేలా" 15-290

కప్పురకాపు: (2) వి. కర్పూరంతో అలదడం. రూపాం. కప్రకాపు.
"అంచలఁగప్పురకాపు అంగముల మెత్తుకొని
కొంచక నిలుచున్నాఁడు గోణముతోడను" 1 అను 6
"యెలమిఁగప్పురకాపు ఇదె చాతుకున్నవాఁడు
వెలలేనియట్టి పెద్ద వెండికొండవలెను" 20-406

కప్పురగంధి: వి. 'కర్పూరగంధి'కి వికృతిరూపం. కర్పూరపు వాసనవంటి వాసన గల స్త్రీ.
"కప్పురగంది నిన్నుఁగంటే నే తిట్టునని
అప్పుడే యీమాట నీతో నాడనా నేను" 14-159

కప్పురపలుకు: వి. కర్పూరం వలె చల్లనైన పలుకు.
"పడఁతి నీకుఁ గప్పురపలుకు గానుక యంపె
వడి నీ మాఁటలు నీకె వచ్చె నంటాను" 26-95

కప్పురపునవ్వులు: వి; బహు. తెల్లనినవ్వులు.
"కప్పురపు నవ్వుల కడపరాయ నాకుఁ
గప్పవోయి పచ్చడము కడపరాయ" 13-500

కప్పురములో నుప్పు గలుపు: ప.బం; అ.క్రి. అమూల్యమైన వస్తువును పాడుచేయు.
"చొప్పులెత్తి యాపె సుద్దులే యప్పటిఁ జెప్పి
కప్పురములో నుప్పు గలుపఁగనేటికే" 28-432

కప్పురమే కారమగు: ప.బం; అ.క్రి. సానుకూలమైనదే ప్రతికూలమగు.
"కప్పురమే కారమాయ కదిసే మాటలు లేక
దప్పులెల్లాఁ దనివాయ దగ్గరి రాగా" 19-485

కప్పురాలు మాటలు కారాలు చేతలు: నానుడి; మాటలేమో మృదువైనవి చేతలేమో

కఠినమైనవి.

"కప్పురాలు మాటలు కారాలు చేతలు

యెప్పుడు మీ పొందులు సతు లెట్టు సేతురో"

27-472

**కప్పూరబాగాలు :** వి; బహు. కర్పూరం కలిసిన వక్కలు, తావిపోకలు.

"పడఁతులకుఁ గప్పూరబాగాలు నీవు పెట్టఁగా

నడుమ నుండిన నాకు నవ్వు రాదా" 7-376

**కప్రకాపు :** వి. కపురపుకాపు. కర్పూరంతో అలదడం.

"చంద్రుడు నీ మనసులో జనించె నటుగాన

చంద్రికలు కప్రకాపై సరినిండెను" 2-280

**కప్రపుఁబడివారు :** వి; బహు. నాయకుడిచ్చే కర్పూరానికి పాలివారు. నాయకుడు ఒప్పందమునకై నాయికకు కర్పూరమిచ్చుట. ఈ వాఙ్మయమున పలుచోట్ల కలదు. (చూ. సం.ప.స., సం. 13, పుట. 3) (పడి = దేవాలయంలో వంతుసేవ)

"కడు మేనవారమో కప్రపుఁబడివారమో

యెడయక ఇట్టె వీడే లియ్యవయ్యా" 13-112

**కమనియ్య :** విణ. 'కమనీయ'; మనోజ్ఞమైన. "కమనియ్య యాగభాగకర్త" 4-144 ఇట్టిదే రమణియ్య = రమణీయ.

"రమణియ్యభూషాభిరామ నరసింహ" 3--513

**కమ్మగట్టు పావురము :** వి. జాబు కట్టే పావురం; పూర్వకాలంలో జాబులు పావురాలకు కట్టి దూరంలో ఉన్నవారికి అందజేసేవారు.

"తలఁచుకొంటేఁజాలు తా నాడ కేఁగునమ్మా

వొలసి కమ్మగట్టు పావురమువలె" 10-2-115

**కమ్మటిన్ :** (50) అవ్య. మరల, క్రమ్మర. (కమ్మర అనే పదానికి ఈ ఔపవిభక్తికరూపం విలక్షణం.)

"కాలు దొక్కకుర నీవు కమ్మటి నవ్వకు నాతో"

17-165

"పలికేవు కమ్మటిని పరాకు నయ్యేవు" 11-159

"కొమ్మచే నేమి సేయించుకొంటివయ్యా

కమ్మటీఁ దా మొక్కినట్టి కారణ మేమయ్యా"

28-6

**కమ్మటీఁడు :** (కమ్మటము + ఈఁడు) వి. స్వర్ణకారుడు.

"ఏ మందునే వీని మాయ నెన్నైనాఁగలవు

కామించి నన్ను నేలే కమ్మటీని చూడరే" 8-142

**కమ్మర :** అవ్య. మరల.

"గుజగుజఁబొయ్యేవు కొంకి కొంకి నీకు నీకే

గజరు నీ చేతలకు కమ్మరా నేమందురా"

21-510

**కమ్ము :** అ.క్రి. 'క్రమ్ము'కు వ్యావహారికరూపం. 1. వ్యాపించు, ప్రసరించు 2. కవియు, పైఁబడు 3. ఉబుకు 4. కలుగు, పుట్టు 5. అతిశయించు స.క్రి. 1. కలియు, కూడు 2. కప్పు, పొదుగు 3. ఆవరించు 4. మఱుగుపఱచు.

"అదరి రాదాయ నంటా నాపెతో నలుక లేల

కడు నీకు వేడుకైతే కమ్మి మొక్కరాదా" 11-584

**కయ్యపుఁగూటము :** వి. ప్రణయకేళి.

**కయ్యపుటలుక :** (కయ్యము + అలుక) వి. పోరులోని కోపం.

"పయ్యెద జారిన కట్టు భారంపు నొసలిపట్టు

కయ్యపుటలుక తిట్టు గలిగెఁగా నాకు" 5-272

**కరఁగు :** (8) వి. (ప్రేమాదులచే) కరగుట, పరవశమగుట.

"కాఁగిటిలోపలి నా కరఁగులట్లా నీవు

చేఁగదేరక నమ్మేనా శ్రీవేంకటేశ" 27-474

**కరఁగుకొను :** అ.క్రి. 1. (ప్రేమాదులచే) కరగిపోవు, పరవశమగు 2. ద్రవమగు, నీరగు, రూపంమారు 3. భస్మమగు.

"కురిసితివి నవ్వుల గురిగాఁబువ్వులవాన

కరఁగుకోవయ్య లోలో గట్టి మనసు" 7-527

**కరఁచు :** స.క్రి. కరగజేయు, ద్రవింపజేయు, మెత్తబరచు, రూపరజేయు.

"పట్టరాని వ్రతములు పట్టించి సేయించవచ్చు

గట్టి రాయైనాఁ గడుఁ గరఁచవచ్చు" 7-310

"చెంతనుండి యీకొసెలవుల నవ్వి
కాంత నీమనసు కరఁచెను" 26-518

**కరక :** వి. నల్లదనం విణ. నల్లని. ఉదా :-
కరకగర్భము.
"గ్రీవముఁగరకజడలు పిరిఁది దింణ్లు దీరిచి
కామించి నవ్వీ వాఁడే కల్యాణవేదికను" 14-368

**కరకర :** ద్వేషం, క్రూరత (అం.ప.ని.)
"కాదనఁగా నౌననఁగా కరక రేమిటికే
మీఁదమీఁద జగడాలు మితిమీరీని" 10-2-70

**కరకరి :** వి. 1. ద్వేషం, స్పర్థ, ఈర్ష్య, అసూయ
2. క్రౌర్యం 3. చలం, పట్టుదల 4. వెత
"కాదనఁగా నౌననఁగా కరకరేమిటే" 10-2-70
"మరలి చూచేదాని మాటలాడి దూరేదాని
గరిమఁగరకరైతే కాఁతాళించును" 24-572
"అరసి శ్రీ వేంకటేశ అట్టి నన్నేలితివి
కరకరి యేల చక్కటి నంటరాదా" 26-524

**కరకరించు :** అ.క్రి. 'కరికరి'కి నామధాతురూపం
కావచ్చు. 1. స్పర్థవహించు 2. పగబూను,
వివాదపడు, క్రూరత వహించు.
"సరసములాడఁబోతే సరివలపులు చిక్కు
కరకరించఁగఁబోతే కాఁకలు రేఁగు" 23-466
"తరవులవారమూ దవ్వుననుండి రాకుంటే
కరికరించి పిలిచి కమ్మటి సాదించకు" 22-127

**కరకరోసేయు :** అ.క్రి. బాధకలిగించు, హింసపెట్టు,
ఇబ్బందిపెట్టు.
"సరసములెల్లా నాడి సవతుల నెచ్చరించి
కరకరోసేతురా కాంతల నింత" 21-344
"కన్నుల జంకించరాదు కరకరి సేయరాదు
మన్ననె గలదంటాను మాటిమాటికి" 28-336

**కరకులాడు :** అ.క్రి. కఠినోక్తులు పలుకు,
పరుషవాక్కులు పలుకు.
"గబ్బి నా నోరను నిన్నుఁ గరకులెల్లా నాడక
ఉబ్బరినై తిట్ట కేల వుండేవు నీవు" 22-345

**కరజపువినయాలు :** వి; బహు. గోరిగిచ్చులనే
భక్ష్యవిశేషాలు (?)
"కరజపువినయాలు కాఁగిటిబువ్వాలు
సిరులతో విందువెట్టీ శ్రీసతి నీకు" 8-166

**కరజపువినయాలు కాఁగిటిబువ్వాలు :** ప.బం; వి;
బహు. కొనగోటితో నమస్కారం, కౌగిలితో
అన్నాలు, శుష్కప్రియాలు, శూన్యహస్తాలు
అని భావం.
"కరజపువినయాలు కాఁగిటి బువ్వాలు
సిరులతో విందువెట్టీ శ్రీ సతి నీకు" 8-166

**కరజము :** వి. గోరిగిచ్చు (?)
"కరజపువినయాలు కాఁగిటిబువ్వాలు
సిరులతో విందువెట్టీ శ్రీసతి నీకు" 8-166

**కరజములు :** వి; బహు. గోళ్ళు.
"మునుకొని యిద్దరు మురిపెపు నడపుల
చెనకి కరజములఁ జెన్నుగను" 23-558

**కరడి :** ఇది వీణలోని భాగం (?)
"మనసే నీబద్ధితాడు మరి గుణాలె జీవాళి
మొనసిన పుట్టుగే మూలమైన కరడి" 3-467

**కరడు :** వి. అల.
"కొండలవంటి కరళ్ళు కోరికె లెందు చూచినా
తండుముండుపడేవారే దాఁటలే రెవ్వరును"
2-56

**కరత :** (2) వి. దుశ్చేష్ట, దుండగం.
"కరఁగినట్టే కరఁగి కరతలెల్లా మొరఁగి
సిరులఁగూడదుఁగాక చింత లేలే" 8-3

**కరతలాడి :** (కరతలు + ఆడి) వి. దుశ్చేష్టురాలు,
అందెవేసిన చేయి.
"పాఁగిన శ్రీవేంకటాధిపతి నన్ను నేమన్నా
కాఁగాదు యిదియెంత కరతలాడెందురు"
14-256

**కరపట్నము :** వి. కరపట్నం కావచ్చు.
కరపట్నమంటే రేవుపట్టణం.
"కాంతల మానమనేటి కరపట్నాలకు దిగె
మంతనాన జీవుఁడనే మంచి మరకాఁడు" 3-388

**కరవాలు :** వి. కరవాలం, ఖడ్గం.
"వలరాజు కరవాలు వసంతుఁడనేటి కమ్మరి

పెలుచుగ వాడిపదను పెట్టినయట్టున్నది" 7-410

**కరసాన :** (2) వి. గంధం తీసే చిన్న సాన ; బాణాలకూ, రత్నాలకూ సానపట్టే చక్రంవంటి సాన.

"దరికొలుపకురే తలపోత దాలి
కరసాన కాఁకలఁగనలీని" 6-175

**కరాళించు :** అ.క్రి. 1. బొబ్బరించు 2. సకిలించు 3. మొరుగు 4. పాటియగు 5. మండిపడు స.క్రి. నిందించు.

"ఏల నాతోఁగరాళించి యిది (చేవిది) వో తప్పు(?)
యీలకూర కుప్పు చాల దిదివో తప్పు" 7-272

"బతిమాలించి మతులు భ్రమయించఁ జేసేవు
రతికేళినే కడుఁ గరాళించేవు" 7-170

**కరాళి :** భయంకరమైనది.

"వనిత నిండుజవ్వనగర్వమునకు
ఘనమగు ఘనమగు నీ రతి కరాళి" 7-292

**కరికరించు :** (2) స.క్రి. ఇబ్బందిపెట్టు, బాధించు, హింసించు.

"కరికరించఁగ రోలఁగట్టితే నప్పుడు మా
హరి గాఁడు గదా ఆడనున్న బిడ్డఁడు" 2-65

**కరికరిఁబెట్టు :** స.క్రి. బాధించు, హింసించు, (తె.వ్యు.కో.) ఇబ్బంది. (రా.మాం.)

"కరికరిఁబెట్టరాదు కాఁకల సొలయరాదు
తరుణి వినయానకే దయఁజూడరాదా" 26-531

"పొరలింపు మాటలాడి పొద్దు గడిపేవాని
కరికరిఁబెట్టఁగాను కలిగేదేమీ" 27-62

**కరికుంభజఘన :** వి. ఏనుగు కుంభస్థలాల వంటి పిఱుదులు గలది, స్త్రీ ; ఏనుగు కుంభస్థలాన్ని స్త్రీల వక్షస్థలానికి ఉపమానంగా చెప్పడం ప్రసిద్ధం. కాని పిరుదుభాగంతో పోల్చడం విలక్షణం.

"అదరి శ్రీవేంకటేశుఁడాతఁడే నిన్నేలినాఁడు
కడఁగి యే లలసేవే కరికుంభజఘన" 26-351

**కరిగమన :** వి. ఏనుగు నడకవంటి మందమైన గమనం కలది, స్త్రీ, గజగమన.

"కరిగమనకును బాగాలు చేతి కొసఁగరే" 29-15

**కరియమాణిక్కదేవుఁడు :** వి. తిరుపతికి నలభై కిలోమీటర్ల దూరంలోని నగరి బొడ్డులో ఉభయ నాంచారులతో వెలసిన నిలువెత్తు అర్చామూర్తిని 'కరయమాణిక్క దేవుడు' అని వ్యవహరిస్తారు. కరియమాణిక్కం వరదరాజస్వామిగ వినుతికెక్కిన ఈ వేలుపును దర్శిస్తే ఆయురారోగ్యైశ్వర్యాలు చేకూరుతాయని భక్తుల విశ్వాసం. అనుభవసత్యం కూడా. గజేంద్రుని కాపాడిన వరదు డితడే యని, గజేంద్రమోక్షానికి సంబంధించిన గాథ ఇక్కడే జరిగిందని స్థానికులు కథలు చెప్పుకుంటారు. అన్నమయ్య పాటల్లో చోటుచేసుకొన్న వేలుపితడే అని నా విశ్వాసమని గౌరిపెద్దివారు తెలిపినారు. (శృంగార సంకీర్తనలు.27సం. విశేషాంశాలు 405 పు.)

"కైవశమై పాయలేను కప్పురవిడేలకు
నీవద్దనే కరియమాణిక్కదేవుఁడా" 27-145

**కరివడు :** అ.క్రి. నల్లబడు, కఱివడు.

"రాఁగదవె అన్నిటాను రవ్వయితిమి
కాఁగిన కోఁకలచేతఁ గరివడె నిపుడు" 21-398

**కరుకుపడు :** అ.క్రి. 'కఱకుపడు'కు రూపాం. కఠినమగు.

"నగినగి నీతోను ననుపు నటించఁగాను
అగడై కరుకుపడె అదిగో నీ చిత్తము" 21-80

**కరుగు :** వి. అచ్చుబోసిన బొమ్మ, పోతపోసే అచ్చు. రూపాం. కరువు.

"కప్పురపు కరుగువంటి చెలి నిన్ను మెచ్చె"
16-335

"అంచెలఁ జెనకఁగానే మట్టే సిగ్గువడ నీవు
కంచునఁ గట్టి పోసిన కరుగులమా" 17-150

**కరుగుగట్టు :** మూసకట్టు, పోతపోయుటకై దిమ్మను తయారు చేయు.

"యిత్తల నీవెట్ట బొంది యెన్నఁడీక వడదేరు
కొత్తగా కరుగుగట్టి కోమలిఁ జేసితివా" 8-63

**కర్తతనము :** వి. కర్తృత్వం, కర్తగా ఉండే లక్షణం. పెత్తనమైన పదం.
"ఇది లేదు నిష్కారణుడను దాని వుండు
తనకుదాని కర్తతనమొ గాని" 1-49

**కర్తారుడు :** వి. కర్త ; ఈ అర్థంలో కన్నడంలో 'కర్తార' అనే శబ్దం వాడుకలో ఉన్నది.
"కర్మకర్తారుడని కడలేని పుణ్యములు
కర్మఫలములు తనకుఁ గైకొలుపఁగా" 1-293

**కర్పూరకాపు :** వి. కర్పూరంతో భగవంతుని విగ్రహాన్ని అలఁదడం.
"పోలింప కర్పూరకాపు పురుషోత్తమునికి
యే లీల నుండెనని యెంచి చూచితే" 4-177

**కర్మవహి :** వి. కర్మవిధి ; ఇది 'కర్మమహి' కావచ్చునేమో? అని సంపాదకులు సందేహించినారు. అప్పుడు కర్మభూమి అని అర్థం.
"మహిలో సంసారపుసామ్రాజ్య మేలేవాఁడ నేను
యిహమునఁ గర్మవహి కెక్కితి నేను" 3-48

**కర్మి :** వి. కర్మ చేసేవాడు.
"తలకొన్న ఫలవాంఛఁ దగులకుండఁగఁ జిత్త
మలవరించుట కర్మియైన ఫలము" 1-223

**కఱకరించు :** స్పర్ధవహించు, పగబూను, వివాదపడు, బాధించు, ద్వేషించు.
"కఱకరింపుచు నింతి కందువకు రమ్మని
చెఱఁగు వట్టి తియ్యకు చెమరించీని" 13-461
"ఎఱగవుగాక మీఁదటెత్తు నీవు
కఱకటించి తిట్టితే కాదనఁగగలవా" 23-377

**కఱకరిఁబెట్టు :** స.క్రి. నిర్బంధపెట్టు, బాధపెట్టు.
"నెఱజాణతనముల నేరుపరి యాతఁడు
కటికరిఁబెట్టకే కరఁగించఁదగవే" 22-514

**కఱకఱ :** వి. బాధ, ప్రయాస, పరితాపం.
"పెఱఁగఁగఁబెఱఁగఁగఁ బెద్దల మైతిమి నేము
కఱకఱలే కాని కడగంట లేదు" 3-352

**కఱకటిఁబెట్టు :** స.క్రి. బాధపెట్టు.
"కఱకటిఁబెట్టినాపె కాఁగిలించ కొనెనాపె
యెఱవులు చూపి నిన్ను యింత సేసెనా"
27-273

**కఱకటి :** వి. చూ: కరకరి.
"ఎఱిఁగించవలయు నిప్పుడిప్పుడే నీ
కఱకటి నిన్నియుఁ గసరకుమీ" 24-24
"కఱకటిఁగరఁగినా గామిడి గాక" 19-296

**కఱకటి సేయు :** అ.క్రి. బాధ కలిగించు, హింసపెట్టు, ఇబ్బందిపెట్టు.
"యెఱిఁగించరే పతికి యీ సుద్దులెల్లాను
కఱకటి సేసితేను గయ్యాళి యందురు" 12-109

**కఱకుపడు :** ప.బం; అ.క్రి. కఠినమగు.
"మఱచి వూరకుండితే మనసే కఱకుపడు
యెఱుకఁదలపెట్టితే నీడేరుఁ బనులు" 18-189

**కఱకులాడు :** ప.బం; అ.క్రి. కఠినోక్తులు పలుకు.
"వెఱకువయ్యా నిన్ను నే వేసరించను
కఱకులాడఁగ నేను గబ్బిదాననా" 12-18

**కఱత :** (15) వి. చెడ్డపని, దుండగం.
"కఱతల నేరుపులు కడకన్నుల నున్నవి
యెఱఁగము నీ వుపమ లే మనేవే యిఁకను"
14-29

**కఱతల కలికి :** వి. దుండుగురాలు, పోకిళ్ళమారి స్త్రీ. (కఱత = చెడ్డపని, దుండగం)
"ఎఱుఁగము నీ విపుడింత చేతువని
కఱతల కలికినిగా విభుఁడా" 6-3

**కఱతలయోగి :** ప.బం; వి. పరమపదం పొందిన యోగి. కఱ = తీరం (త) చివరిమెట్టు చేరినవాడని భావం.
"కఱతలయోగిని కర్మ మంటునా" 2-445

**కఱతల యోగిని :** వి. పరమపదాన్ని పొందిన యోగిని. (పద.) (కఱ = ఒడ్డు, తీరం)
"కఱతల యోగిని కర్మము లివంటునా
చుఱచుఱ జడునైతే జుట్టుకొనుఁ గాక"

**కఱదలఁబెట్టు :** వి. మాయమాటల్లో పెట్టు, కోరికల్లో పెట్టు. (కఱద = మాయమాట, వింతలు, బుద్ధి, కోరిక)

"మఱియేఁటి విన్నపము మాపుదాఁకాను
కఱదలఁబెట్ట కింకఁగావఁగదయ్యా" 7-447

**కఱమి కఱమి నమలు :** కఱచి కఱచి నమలు.
"కఱమి కఱమి నమలు గంపల నురుగులు
యెఱఁగి దొంగిలె యీతఁడే కదవే" 4-288

**కఱవిద్య :** వి. కఱ్ఱవిద్య, కఱ్ఱసాము.
"కఱవిద్య బాఁపనిచేఁ గఱచె నేరుపులెల్ల
గుఱుతు బాఁపనిఁగనెఁగొడుకుఁగాను"

**కలంతే :** (కల + అంతే) ఉన్నంతే.
"పిలువక రానంటా పెనఁగీఁదా రమణుఁడు
వలపు గలంతే కాక వడి నెక్కు డౌనా" 27-32

**కలకంటి :** (4) వి. 'కలకంఠి'కి వ్యావహారికరూపం. అవ్యక్తమధురమైన కంఠస్వరం గల స్త్రీ.
"చలముకొను నలులకు సంపంగి పెనుగాలి
కలకంటిమేనికి కాపిడిన యట్లు" 5-339
"విందులు చేసే వేమరుఁబ్రియముల
కందువనవ్వుల కలకంటి" 26-450

**కలగంప :** (9) వి. కలగూరగంప, కూర శబ్దానికి లోపం. అనేక వస్తువులున్న గంప. విణ. అనేకం, పెక్కు.
"చెలఁగి పెక్కు చెలుల చీఁకటిమేడలోఁ బెట్టి
కలగంపగా విభుఁడ కలిసితివి" 17-179
"తలపోసే కాంతల చిత్తములకు నీ వయసు
కలగంపై పడిగము గతి యాయను" 25-358

**కలగంపదేవతలు :** వి; బహు. అనేక దేవతలు.

**కలగంపపెండ్లిండ్లు :** వి; బహు. అనేకములగు పెండ్లిండ్లు.
"కలగంపపెండ్లిండ్లు కన్నచోట నితవాయ
యెలమి శ్రీవేంకటేశ ఇదివో నీ సుద్దులు"
23-393

**కలగంపవలపు :** ప.బం; వి. సమృద్ధమైన వలపు, (తె.జా.) అమ్మజూపు వలపు, విలువలేని ప్రేమ, (పద.) అనుకోకుండా భాగ్యవశమున సిద్ధించిన వలపు అని వే.ఆ.మూ.
"కలగంపవల పాయ కాదా మరి
కల దెచ్చి పైవేసేవు కాదా మరి" 17-130

**కలగన్నచోటికి గంప యెత్తినట్లు :** నానుడి; అసత్యమైన దానిని నమ్మినట్లు ; భ్రమను ప్రమ (సత్యము) అనుకొని దానికై పరుగెత్తి నట్లు.
"కలగన్నచోటికి గంప యెత్తినట్లు
ఆలవు మీఱిన దెట్లనమ్మా" 5-64

**కలగూరగంపగు :** ప.బం; అ.క్రి. విషయసాంకర్యం కలదగు.
"కైకొని యిద్దరు నూడిగము సేకుఁజేయఁగాను
కాకువడి కలగూరగంపాయ నీ నోరు" 7-404

**కలగూర వంటిది :** వి. (?)
"కూడినవారికి రతి కొట్టినపిండి వంటిది
కూడనివారికి కలగూర వంటిది" 7-204

**కలగూరవేడుకలు :** వి; బహు. నానావిధములైన వేడుకలు.
"మలసి నిన్ను దూరెదమా మనసు నీ
కందుండితే
కలగూరవేడుకలు గంపఁబెట్టవచ్చును" 18-291

**కలపండ్లు :** వి; బహు. (?)
"పలుమారు నీ మోవిపండు చవి చూపఁగాను
కలపండ్లు గోటరానఁగప్పెను వసంతుఁడు"
7-414

**కలపుకోలుఁదనము :** వి. కలుపుగోలుదనం, ఐకమత్యం, మైత్రి.
"వలపులు చల్లఁగాను వాసు లంత యేఁటికే
కలపుకోలుఁదనమే కందువ వో యగువా"
18-359

**కలపుకోలు :** (14) వి. 'కలుపుకోలు'కు వ్యావహారికరూపం. మైత్రి, ఐకమత్యం.
"కలపుకోలున చల్లగాలి మన్నించుఁగాని
మలయజమలఁదరే మందుగాను మేనను"
24-545
"కలపుకోలు గలితే కానుక లియ్యఁగవచ్చు
మెఱపున నియ్యకొంటే మెచ్చఁగవచ్చు"
14-582

**కలబిరకు :** పరస్పరం కలిసినది.

"వనిత కుచంబులు వసజంబులు హరి
కనుచూపు తామరలు కలబిరకై
ఎనసి చిక్కువడి యేరుపరచఁగరాక
నినుపు చిక్కితగుల నిలిచి రిత్తరుసు" 21-456
"తలపునఁ ఆనుపక నాటిక మొకటి
కలసి కలపబుపు కలబిరికాయు" 7-298

**కలలోఁగనియేటి కానుపు :** ప.బం; వి. అసత్యం, అసంభవం. కలలో కనిపించినవన్నీ చూచినంతసేపే కాని అవి యథార్థం కావు అనే దానిపై ఏర్పడిన పదబంధం.

"తెలులు నవ్వేరని వెనకకున్నది గానీ
కలలోనఁ గనియేటి కానుపిదే" 20-352
"అది కలలోని కానుపయి" అని హరివంశ ప్రయోగం.

**కలలో నింతులఁ గలయునట్లు :** నానుడి; అ.క్రి. నిజం కానట్లు.

"కలలో నింతులఁ గలసినట్లనే
వెలిఁగాంతలతోడి వేడుకోలు" 4-381

**కలలోని కాఁపిరాలు :** ప.బం; వి; బహు. నిజం కానివి.

"అలరి నా నిద్దుర నాదెందుఁగాని సుఖమెల్ల
కలలోని కాఁపిరాల కతల పాలె" 2-1

**కలలోని కాఁపురము :** ప.బం; వి. నిజం కానిది.

"తలఁపులోపల నీవు దగ్గరితేనే చాలు
కలలోని కాఁపురముఁ గైవల్యమే" 4-128

**కలలోని కాన్పు :** ప.బం. అసంభవం, మిథ్య.

**కలలోని కూటమి :** ప.బం; వి. నిజం కానిది.

"పలుమారు సుద్దులనే భ్రమలఁబెట్టితి నిట్టె
కలలోని కూటములే కలిగినంతాను" 23-259

**కలలోని రతులు :** ప.బం; వి; బహు. అసంభవం, అయథార్థములు, నిజం కానివి.

"తలఁచి చూచితేనే తప్పులుఁ దారులె
కలలోని రతుల యాఁట వంటిది"

**కలలోని సిరులు :** ప.బం; వి. నిజం కానివి, అసంభవాలు.

"కలలోని సిరులెల్ల కనుకూర్కులే కాక
మెలఁకువఁజూడనవి మెరసీనా" 1-220

**కలలోని సుఖము :** (2) ప.బం; వి. నిజం కానిది.

"కలలోని సుఖమే కలియుగము వెన్న
కలిలో నెక్కడిది కలియుగమా" 1-118

**కలలోపలి సంభోగము :** ప.బం; వి. నిజం కానిది. కలలో కనిపించేవన్నీ కొద్దిసేపే ఉన్నట్లుగా భాసిస్తాయి. అవి యథార్థం కావు అనడంపై వచ్చింది. 'కలలోని కాన్పు' మొ॥ వి ఇట్టివే.

"కలలోపలి సంభోగము ఘనమగు
సంపదలిన్నియు
వలలోపలి నిడిపరులు వన్నెల విభవములు"
2-133

**కలవంటకములు :** (కలపు + వంటకము) వి; బహు. నువ్వులపిండి మొదలైన వాటితో కలిపిన వంటకం, చిత్రాన్నం.

"కలవంటకములు పులుగములు
దుగ్ధాన్నములు
పలుదెరఁగులైన అప్పముల గములు" 1-138

**కలశము లెత్తు :** ప.బం; అ.క్రి. (?)

"కలి మెఱుంగని ఎందు కాంత వయసేకదా
కలశంబులెత్తెఁ దమకంబుమేడకు" 6-135

**కలశాపుర వీరహనుమంతుడు :** హంపిలో మాల్యవంతాని కెదురుగా నున్న కొండల అపత్యకల్లో ఒక చక్కని హనుమద్విగ్రహ మున్నది. సుమారు పదిఅడుగుల ఎత్తు విగ్రహం. దీనికి కళశాపురమాంజనేయులు అని నేటి వ్యవహారం. ఈతడే కళసాపురంలో వెలసిన హనుమంతుడు. చూ : కలశాపుర హనుమంతరాయడు. కలశాపురం అనే గ్రామం ఈ దేవళం చుట్టుపక్కల ఉండినదంటారు. కలశాపురానికి నేనడు కసాపురమని వ్యవహారం. (రా.అ.కృ.శ.తా.ప.భవి. పీఠిక. 9 పుట.) 4-525

"పంతగాఁడు మిక్కలి బంటుతనమునను

అంతటాఁ గలశాపుర హనుమంతరాయఁడు"

3-503

చూ: కలశాపుర వీరహనుమంతుఁడు.

కలసిమెలయు: ప.బం; అ.క్రి. కలిసి ఉండు.

"అలమేలుమంగ భూమి యంబుజాలు చేపట్టిరి

కలసిమెలసేరు బంగారుమేడ లనఁగ" 3-517

కలసుఁజేయు: మందగూడు, మందగా ఏర్పడు (?)

"పొంది ఆవులు దూడలుఁ బొలానఁ

గలసుఁజేసు

అందాకా నీవు మా యింటియాడ

నుండవయ్యా" 11-273

కలికిగాఁడు: (కలికి + కాఁడు) 1. దంట, నేర్పరి 2. అందమైనవాడు. 'కలికి' శబ్దం పై స్వార్థంలో 'కా' ప్రత్యయం.

"మానినుల పొందు లేల మాకుపడివుండ నేల

కానీవే బుద్దెరఁగఁడా కలికిగాఁడా" 9-159

కలికితనము: (13) కన్నడంలో కల్ (=నేర్పు) ధాతువు కృదంతరూపం కలికె – ఇదియే తెలుగులో ధర్మివాచకంగా 'కలికి' ఐనది. (కలికి + తన) 1. దిట్టతనం, గడుసుతనం, నేర్పు 2. మనోజ్ఞత.

"కలికితనాల నిన్ను గరఁగించ వసమా

బలిమితో నీ చిత్తము వట్ట వసమా" 28-568

కలికివాఁడు: వి. నేర్పరి, దంట. విణ. అందమైనవాడు, మనోజ్ఞమైనవాడు.

"పలుదూరులు బాలునిపైఁ జెప్పినట్టుండుఁగాని

కలికివాఁడమ్మ శ్రీవేంకటనాథుఁడు" 10-2-87

కలిగినాతఁడు: వి. కలిగి ఉన్నవాడు.

"ఎపుడు నాయెడ నీకు నిది వలెనా

కపటాలు నిజములు కలిగినాతఁడవు" 5-329

కలితి: క్రి.ప. కలిగితి, కలిగితివి, ఉంటి (వి).

"అందపు శ్రీవేంకటేశ ఆసెఁగూడి నన్నుఁగూడి

తిందులో మాయిద్దరికి నిటు గలితివిగా"

11-530

కలితే: (89) స.క్రి. కలుగు ధాతువుకు వ్యావహారికరూపమైన కలు ధాతువు చేదర్థకరూపం. కలిగితే, కలిగినట్లైతే అని అర్థం. రా.సీ.లో 'కలుగు' ధాత్వర్థంలో కలు ధాతువు ప్రయోగం ఉంది. సంకీర్తనల్లో ఈ రూపం పెక్కుచోట్ల ప్రయోగింపబడింది. అన్నమయ్య 'కలిగితే' అనే పదం కూడా వాడినా 'కలితే' ప్రయోగాలే ఎక్కువ.

"కన్నవిన్న నీ మతకము లే మైనాఁ గలితే

వున్నతిఁ దెలుసుకొమ్మా వూహించి నీవే"

18-530

"కలయికలు గలితే కపటాలన్నియుఁ బాసు

వెలినుండి నీ వేల వెంగెమాడేవే" 7-460

కలి దచ్చ వెన్నగు: ప.బం; అ.క్రి. అసాధ్యమైనది. సంభవమగు అనే అర్థంలో నిరసనగా అనే మాట. పెరుగు చిలికితే వెన్న పుడుతుంది గాని గంజిని చిలికితే రాదు కదా!

"నిలువు రాజస మేలే ని న్నాతఁడు గూడఁగాను

కలి దచ్చ వెన్నాయెఁగద వమ్మా" 17-35

కలిమికాంత: వి. లక్ష్మీదేవి.

"కలిమికాంత తొడకెక్కఁ గంభమురాయ నీపైఁ

గలువదండలు వేసెఁ గంభమురాయ" 18-420

కలిమికామిని: వి. లక్ష్మీదేవి.

"కలిమికామిని తోడ కారుకమ్మిన పంట

మలయుచుఁ దమలోని మజ్జిమానిపంట"

4-342

కలిమి లేని గర్వము: ప.బం; వి. నిష్ప్రయోజనం, వృథా.

"ఫలము లేనియట్టి పను లేలా కడు

కలిమి లేని యట్టి గర్వ మేలా"

కలిముదిరి మెడిదగు: (?)

కలియుగవైకుంతము: వి. కలియుగంలో వైకుంఠసదృశమైన తిరుమలకొండ. శ్రీవేంకటేశ్వరస్వామి నెలకొన్న తిరుమలకొండకు పేరు.

"కలియుగవైకుంఠంబను నామము

గలిగి వెలయుచు మా కొండా" 15-460

**కలువపడు :** (2) అ.క్రి. కలతపడు, క్షోభపడు.

"కక్కసింపటోతేను కలువపడు వలపు

వొక్కటై నీ వుండితేను వోజకు వచ్చేఁడాని"

29-47

**కలుపడఁజేయు :** స.క్రి. ఈ పదం నిఘంటువుల్లో కనిపించదు. ప్రకరణాన్ని బట్టి నివ్వెరపడునట్లుచేయు, భ్రమాన్పడునట్లుచేయు, కలవరపడునట్లుచేయు ఇత్యాదిగ ఊహింపవచ్చునని సం.ప.స. (19 వాల్యూం. 10 పు.)

"ఏ మమ్మ యశోద మీ యింటికి నేము వచ్చితే

గాముపంటి బిడ్డనిచ్చి కలుపడఁజేసితి" 19-481

**కలుపు :** పెరుగు, మిశ్రదధి.

"యేఁకట దీర నీకు నెందరు గలరని

వోఁకలపులుసు కలుపులఁ బుచ్చవలెనా" 5-1

**కలుపు :** పైరుతోపాటు మొలకెత్తే గడ్డి మొ॥

"కామక్రోధాదులనే కలుపు దవ్వి వేసి

వేమరు వైరాగ్యమనే వెలుగు వెట్టి" 9-20

**కలుపుకోలు :** (4) వి. మైత్రి, ఐకమత్యం. రూపాం. కలపుకోలు.

"చెలువుఁడ వీ మాటకు సిగ్గుపడే వదియేమీ

కలుపుకోలైన మేళగాఁడవు గావా" 7-151

**కలుపుకోలుతనము :** వి. ఐకమత్యం, మైత్రి.

"నిలచి నే నింతలోనె నివ్వెరఁగుతో నుండితే

కలుపుకోలుతనాలు గలుగఁజేసేనే" 25-112

**కలుపుదీయు :** క్రి.విణ. పైరులోని చెడు మొక్కలను తీసివేయు.

"వనము వెట్టినవాఁడు వాడకుండా నీరు వోసి

పెనచి కలుపుదీసి పెంచినయట్లు" 7-109

**కలువకన్నులయమ్మ :** వి. కలువలవంటి కన్నులు గల స్త్రీ, కువలయాక్షి.

"కలువకన్నులయమ్మ కాంతుని దిక్కు చూడవే

అలరుచు నీకు మొగమై యున్నాఁడు" 28-424

**కలువకన్నులవాఁడు :** వి. కలువలవంటి కన్నులు గలవాడు, కువలయాక్షుఁడు.

"గక్కన నిన్నుఁ జూడని కలువకన్నులవాఁడు

చొక్కిన నీ వదనచంద్రునిఁ జూచితేలెను"

28-570

**కలువపడము :** (కలువ + పడము) వి. ఉత్సవాది సమయాలలో ధ్వజస్తంభాదులకు వ్రేలాడగట్టే బంగారు కలువపూదండ.

**కలుషము :** (5) వి. కాలుష్యం. ధర్మవాచకానికి బదులుగా ధర్మివాచకం ప్రయోగింపబడింది. అన్నమయ్యలో ఇట్టి ప్రయోగాలు అనేకం.

"అలరిన నాలో అంతర్యామివి

కలుషమెడయ నన్నుఁ గాతువు గావా" 3-474

**కలుషించు :** అ.క్రి. కలఁకఁబాఱు, కలఁతపడు.

"కలుషించే నాఁటి కడమెల్ల దిగవలె

అలుగనీ అలుగనీ అలుగనీవే" 5-276

**కలుహారము :** (2) వి. కల్హారమునకు వ్యావహారిక రూపం. సుగంధం కల కలువపువ్వు.

"కపటరాక్షసనేత్ర, కలుహారములు మోడ్చె"

4-465

**కల్యాణవేదిక :** వి. వివాహం జరిగే వేదిక.

"ప్రేమఁగరకజడలు పిరిఁది దిండ్లు దీరిచి

కామించి నవ్వే వాఁడే కల్యాణవేదికను" 14-368

**కల్ల :** వి. ముండ్ల కంచె, ముండ్ల వెలుగు.

"మందావు కల్లలు - మావులెల్లా మొగ్గలు"

18-259

**కల్లతనము :** వి. 1. వంచన, మోసం 2. నేరం, తప్పు 3. చెడ్డతనం (వ్యా.)

"పాడిపంతాలు చెప్పేవు పక్కన శ్రీవేంకటేశ

యేడనైనాఁ గల్లతనా లెంచేరా నీమీఁదను"

26-488

**కల్లనిజాలు :** వి; బహు. సత్యాసత్యాలు.

"చెవి విన్నమాట లెల్ల శ్రీపతియై తోఁచీని

ఇవల కల్లనిజాల నేను" 4-228

**కల్లపడు :** అ.క్రి. 1. హానిపడు, భంగపడు 2. మోసపడు.
"బుద్ధి లెంచుకొను లోలో పోసరించి కల్లపడు
అద్దివో శ్రీవేంకటేశుఁడాడ నాడనె" 9-39

**కల్ల మాడ దొడ్డ ముద్ర :** (2) సామెత; చెల్లని కాసుకు పెద్ద ముద్ర, అసత్యమైన విషయానికి పెద్ద గౌరవమివ్వడం, నాణెం నకిలీదే అయినా దానికి ముద్ర మాత్రం పెద్దది అనే దాన్నిబట్టి వచ్చిన పదబంధం. 'చెల్లని కాసుకు గిల్టులెక్కువ" అని సామెత.
"బల్లిదునిచేత మంటే పచ్చఁబూస మాణికమే
కల్ల మాడ దొడ్డ ముద్ర కతకుఁ గాళ్ళున్నవా"
14-377

**కల్ల లేదు పొల్ల లేదు :** నానుడి. అసత్యమూ లేదు – వ్యర్థతా లేదు లేదా కల్ల – పొల్ల జంటపదం కావచ్చు.
"కద్దుకద్దు నీ మాట కల్ల లేదు పొద్దు లేదు
వద్దు వద్దు నీతోడి వాదులు నాకు" 9-73

**కల్లాను :** కలిగినను, ఉన్నను. 29-15
"ఎందరు చుట్టాలు గల్లా నింతకు మేలే
అందుకోలు వలపుల కంగవించీఁ గాక" 7-516
"మలసి నామీఁద మచ్చరమెంత గల్లాను"
11-307
"రాజసమెంత గల్లాను రాసి చేసుకొమ్మనవే
జాజుకొన మాయెడఁ బచరించనేల" 20-165
"ముంచి నవ్వులేవి గల్లా మూట గట్టుకొమ్మనవే
వంచి మాపై నేల చల్లీ వరుసఁదాను" 20-165

**కళంకు :** వి. 'కళంకము'నకు తద్భవం, రూపాం. కలంకు.
"ఒనర చంద్రునకు కళంకు గలిగిన
నుడుగక శైత్యము మానీనా" 15-258

**కళబెళమను :** తళతళమను, ప్రకాశించు.
"కట్టిన గింటెపుఁజీర గళబెళమనఁగాను
యిట్టె వచ్చి కానుక నీ కిచ్చీ నెవ్వతో" 12-495
"కట్టిన చెంగావిచీరఁ గళబెళ మనఁగాను
గట్టి కొప్పులో విరులు కడు బుగులుకొనఁగా"
28-441

**కళవళము :** వి. 1. నిద్ర, మోహం మొ॥ వాటివల్ల కలిగే కలవరింత 2. సంభ్రమం, తొందర 3. వ్యాకులత, క్షోభం.
"చెక్కు నొక్కేనా బుద్ధి చెప్పుటగాక
గక్కన నిందులకుఁగా కళవళ మేఁటికే" 21-469

**కళుకు :** వి. 1. కాంతి 2. పొడి 3. కిరణం (వ్యు.)
"అలరె నీ వీపునను అవి యెవ్వతెవో కాని
కళుకు వ్రాసినయట్టి కంకణాల వొత్తులు"
12-528

**కళ్లు :** వి. బహు. 'కడి'కి బహు. రూపం. ముద్దలు.
"సందడించి మరునాఁటి చవులకే కూడఁబెట్టు
పొంది మింగినకళ్ల పులుసరమెంచఁడు" 3-206

**కవ :** వి. ఇద్దరు; దేహమూ, జీవుడూ అని భావం (?)
"కవ నంతర్యామి కరుణాకరుఁడట
వివిధభంగులను వెదకఁగనేలా" 3-533

**కవకవ :** అవ్య. నవ్వడంలో ధ్వన్యనుకరణ శబ్దం. (పక్షులకూతకు ధ్వన్యనుకరణ శబ్దం, కోపంతో వచ్చే ధ్వనికి అనుకరణం.)
"కాతరించి పెనఁగేవు కవకవ నవ్వేవు
అతఁడేడ నీ వేళ అవునే నీవు" 29-341

**కవకివ :** ధ్వన్యనుకరణశబ్దం.
"కడు సకినల సజ్జ కవకివమనఁగాను
యెడపక నిన్నుఁగూడె నీకె ఇందాఁకా" 29-122

**కవగూడు :** (2) అ.క్రి. జతగూడు, రతికి కూడు, సంభోగించు.
"జవళి శ్రీ వేంకటేశ్వరుఁడల మేల్మంగను
కవగూడి నన్నిటాను ఘనుఁడే తాను" 12-118

**కవడి :** వి. రొమ్ము, అక్కు, వక్షస్థలం.
"కలికి చూపుల కాంక్ష కడు సందడించఁగాను
వలపు నీకుఁగాను కవడిఁబట్టుకున్నది" 12-286

**కవదువాయు:** అ.క్రి. బాధానివర్తి యగు అని ప.పా. ఇతర నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. ప.పా. చూపిన బాధానివర్తి యగు అనే అర్థం గౌణమే కాని ముఖ్యార్థం కాదనీ కవదు + వాయు, కవదు "కవలు" జంట అని, (చూ: kittel కవదు - కవల్ - కవలు - a bifumeatun devided stake) రెండుగా వేరుపడినవారే కవలు అనీ వివరిస్తూ శ్రీ వేటూరి ఆనందమూర్తి ఈ పదానికి చీలిపోవు, వేరుగా అగు, జంటువాయు అనే అర్థాలను సూచించినారు. కవలుపోవు అనే పదం కూడా ఇటువంటిదే.

"యివల శ్రీవేంకటేశుఁ డింతలో దిక్కయి కాఁచె
కవదువాసి జీవుఁడు కన్నవారిచేతను" 3-64

**కవణము:** (3) వి. ముద్ద, (కబళము) దాణా!

"పుబ్బుఁగవణము వంటి దున్నతపు నీ నవ్వు
గొబ్బున నవ్వటి నిన్నుఁ గొసరనేల" 16-254

"కాదనక రతి నుబ్బుఁగవణము మేపెనో
నాదెస చూచి నీవు నవ్వులు నవ్వేవు" 17-180

**కవిసెన:** వి. గవుసెన, గలీబు, దిండుముసుగు.

"కాంతుల యద్దములను కవిసెనఁ బెట్టనేలే
వింతగాఁ దుమ్మిదవిండు విరియించ నేఁటికే" 7-182

**కవుక:** వి. కబళం, ముద్ద.

"బంతిఁగట్టి నురిపేటి పసురము లెడనెడఁ
బొంత నొక్కొక్క గవుక పుచ్చుకొన్నట్టు" 4-201

**కవెల:** వి. 'కవిలె'కు రూపాం. 1. పాతపుస్తకాల కట్ట (2. తూకం రాళ్లు వగైరా ఉంచుకునే సంచి)

"చెప్పితిఁబ్రియములు చిత్రగుప్తునకు
తప్పక కవెలలు దాచుమని" 15-375

**కసరు:** వి. 1. కోపం 2. దోషం 3. పొగరు, గర్వం 4. విజృంభణం 5. అతిశయం, గాలివాన 6. హెచ్చు, లాభం (వ్యా.)

"వద్దేలే కసరు వలవని కిసరు
పొద్దువొద్దులకుఁ జూపుల యసరు" 5-321

"ననిచి కూడినవారు నమ్మక ప్రియునిమీఁద
కనలి యాడిన మాట కసరౌనటే" 5-111

**కసరులాడు:** ప.బం; అ.క్రి. కోపపడు, ఘోషించు, చిరాకుపడు.

"పసిఁడిమంచముమీఁదఁ బవళించి యతనితో
కసరులాడెడి యట్టు గాదువో నేఁడు" 5-200

**కసరులు చూపు:** ప.బం; అ.క్రి. కోపం చూపు, గర్వం చూపు, అతిశయం చూపు.

"కసరులు చూపరాదు కాఁగిలించుకుంటేను
పొసఁగక యాఁపరాదు బూటకానను" 28-121

**కసరెత్తు:** అ.క్రి. విజృంభించు, ఉప్పొంగు.

"వసుధఁ జంద్రుడు నీలవర్ణుఁడేటికి నాయ
కసరెత్తి నునుఁగందు గలయఁగొనుఁబోలు"
1-332

"కప్పురపు మోవి వాడి కసరెత్తెఁ దేనెలు
దప్పిదేర మాటలాడి తగులఁగాను" 25-114

**కసవు:** వి. గడ్డి, చెత్త.

"గంట వాఁగకుండా నిండఁ గసవు దురిగి మా
యింటివారు నిద్దిరించ నిల్లు చొచ్చెను" 2-166

"కసవు కట్టలు వేసి కదా గోవులచేత
కొసరుచుఁబాలు పిండుకొనేది" 2-290

**కసిగాటు:** (9) వి. అపరిణతమైన అనుభవం, పైపై కాటు అని వాచ్యార్థం 2. దంతక్షతం. విశ. అల్పమైన.

"కసిగాట్ల వేంకటపతి కొఁగిట రసము
లొలుక నేరము లెన్నుచును" 5-294

"కలసీకలియని మనసు కసిగాటు కంటేను
తలపులో నడియాస తమకమే మేలు" 24-83

**కసివుచ్చుకొను:** అ.క్రి. కోపగించుకొను, కోపియగు.

"యీ కడ శ్రీవేంకటేశ యిట్టు నన్నుఁ గూడితివి
వాకు కసివుచ్చుకుంటే వనితా భూమినిని" 7-27

**కసుఁగాటు:** వి. లేతకాటు.

"పెనఁగే రమణునిఁ బ్రియమే సేతువుగాక
కనుచూపులలో నేలే కసుఁగాట్లు" 21-120

**కసుఁగాయ:** (కసురు + కాయ) వి. పచ్చికాయ.

"పచ్చితనానఁ దిరిగి పండవద్దా చిత్తము
గచ్చులఁదాఁ గసుగాయే కలకాలము"

**కస్తిఁబడు :** అ.క్రి. ఇబ్బందిపడు, కష్టపడు, దుఃఖపడు.

"ఆస్తికనాస్తికుఁడై తా నందెవ్వరివాడూఁగాక
కస్తిఁబడి వాలి వృథా కలహానఁ బొలిసె" 3-130

**కస్తిఁబెట్టు :** స.క్రి. దుఃఖపెట్టు, కష్టపెట్టు.

"యేవేళ నీ కితవాయ నింటి కిట్టి విచ్చేయు
కావించి నాయంత నిన్నుఁ గస్తిఁబెట్టఁ జూమ్మీ"
16-223

**కస్తిసేయు :** (కస్తి + చేయు) స.క్రి. దుఃఖం కలిగించు, కష్టపెట్టు, శ్రమపెట్టు.

"కాఁగిలించి నిన్ను నంత కస్తిసేయ నోపఁగాని
రాఁగిన నా వలపులు రాసులై వున్నవిరా"
11-200

**కస్తురిబొట్టు :** వి. కస్తూరి తో దిద్దుకున్న బొట్టు.

"నులివచ్చి చెమటల నుదుటికస్తురి బొట్టు
పెలుచఁ గుచ్చల మీఁది పిరిచుట్టు" 16-569

**కస్తూరి గీరునామము :** వి. గోటితో గీటువలె పెట్టుకొనే కస్తూరిబొట్టు.

"కందువ మొసలిమీఁద కస్తూరి గీరునామము
యిందరిలో నీపె యెమ్మె లేమని చెప్పుదమే"
29-106

**కస్తూరినామము :** (5) కస్తూరితో దిద్దుకునే పొడుగు బొట్టు.

"కలికి రమణునికిఁ గస్తూరినామము వెట్టి
చెలరేఁగి తాఁజూపెఁ జెక్కుటద్దాలు" 19-404

"మెండుగఁ గస్తురినామమె నుదుటఁబెట్టినది
కొండలరాయఁడ నీకు గురియై తా నున్నది"
24-149

**కస్తూరిబొట్టు :** (14) వి. చూ : కస్తురిబొట్టు.

## కా

**కాఁక :** వి. తాపం 1. బాధ 2. కోపం 3. విరహవ్యథ 4. తపస్సు 5. వేడిమి 6. జ్వరం.

"వెదకుతానే నిన్ను వెలఁది కాఁకలఁబొంది
యెదుటఁ బొద్దు వొడవకొండగా నేను" 7-402

**కాఁకరించు :** గ వంచించు, బాధించు.

"దిమ్మరి జాణఁడవోరి తిరువేంకటేశ నన్ను
క్రమ్మర క్రమ్మరఁగూడి కాఁకరించే వేలరా" 6-8

**కాఁకసేయు :** అ.క్రి. 1. తపింపజేయు 2. బాధించు 3. వేడికలిగించు 4. కోపింపజేయు.

"నెలఁత చిత్తము కొద్ది నీ వెఱుఁగవా
కలయఁగవలెఁగాక కాఁకసేతురా" 13-11

**కాఁకు :** వి. 1. అవమానము 2. నింద.

"చిలుకలు మీ చేతలు సిగ్గులు దోఁచఁగనాడే
ఇలమీఁద నింత కాఁకు యెఱుఁగమమ్మా" 12-5

**కాఁగలించు :** (20) స.క్రి. 'కౌఁగిలించు'కు వ్యావహారికరూపం. దీనికి రెండు మూడు ప్రయోగాలు మాత్రమే కనిపిస్తున్నాయి.

"చీరలు నీ వియ్యఁగాను చేకొని కాఁగలించిరి"
7-537

**కాఁగలి :** వి. 'కౌఁగిలి'కి వ్యావహారికరూపం.

"గరిమ నా కోరినట్లు కాఁగలియ్యవయ్యా"
7-335

**కాఁగిపడు :** ఉద్రేకపడు, ఆవేశపడు.

"కవకవ నవ్వితేనె కాఁగిపడే విప్పు డిట్టె
తివిరి కాలు దాఁకితే తిట్టకుండేవా" 9-143

**కాఁగిలించు :** స.క్రి. 'కౌఁగిలించు'కు వ్యావహారికరూపం. అన్నమయ్య 'కౌఁగిలించు' అనే పదాన్ని కూడా వాడినా 'కాఁగిలించు' అనే వ్యావహారికరూపాన్నే చాలా ఎక్కువగా వాడినాడు.

**కాఁగిలి :** వి. 'కౌఁగిలి'కి వ్యావహారికరూపం. అన్నమయ్య 'కౌఁగిలి' అనే పదాన్ని వాడినా 'కాఁగిలి' అనే పదాన్నే ఎక్కువగా వాడినాడు.

"కాఁకలెంత విరివైనా కాఁగిలంత విరివౌను"
20-33

"కాఁగిట శ్రీవేంకటపతి కూడితి
వేఁగక యిచటనె యెనసి వుండరా" 20-37

కాఁజేయు : స.క్రి. అగునట్లు చేయు, నిర్వర్తించు.
"హరియే స్వతంత్రుఁడు అన్నిపనులు
గాఁజేయు
పరుల ఉద్యోగాలు పనిలేవు" 9-164

కాఁడిన పోట్లలోన కత్తి గోసినట్లు : వ.బం; అవ్య. అనుభవిస్తున్న బాధకు తోడుగా మరో బాధ కలిగినట్లు. (నాటిన దెబ్బలచోట్ల మళ్ళీ కత్తితో కోసినట్లు అని శబ్దార్థం.) 'కాలిన పుండ్లలోన ఉప్పులు చల్లు' ఇటువంటిదే.
"వేడుకలన్నియు మాని వేదనల నుండఁగాను
కాఁడిన పోట్లలోన కత్తిగోసినట్లు" 6-165

కాఁడిపారు : అ.క్రి; వ.బం. గరుపెక్కు.
"కన్నుల చూపులనె కాఁడిపారె మనసు
యెన్ని లేవు నీ సుద్దులేమి చెప్పవికను"
21-224

కాఁడు : స.క్రి. 1. నాటు, గుచ్చుకొను 2. స్థిరపడు 3. కమ్ము, సాంద్రమగు, దట్టమగు.
"కన్నులు గొప్పలంటాను కాఁడఁజూచుటే కాని
మిన్నక తల చుట్టిరా మించేది దలఁచము"
29-427 & 23-273

కాఁతాళము : (31) వి. ఈర్ష్య, కోపం, అధైర్యం. రూపాం. కాంతాళము. ఈర్ష్యతో పాటు 'క్షమం' అనే అర్థాన్ని కూడా ఆం.వ.ని. చూపింది. కోపంతో పాటు Rashness, hesteness, passion అనే అర్థాలను కూడా బ్రౌణ్యం చూపింది. శ.ర., సూ.ని. లలో ఈ పదం అర్ధబిందురహితంగానే చూపబడింది.
"మాటలాడ వచ్చుఁగాక మనసులో కాఁతాళము
మూటగట్టవచ్చునా ముందర దెచ్చి" 27-39

కాఁతాళించు : (58) అ.క్రి. ఈర్ష్యపడు, కోపపడు, అధైర్యపడు, వ్యాకులపడు.
"కన్నులఁదప్పక చూచి కాఁతాళించఁబని లేదు"
16-379
"ఏల రట్టుసేసేవు యిదేరా నీవు
కాలుదొక్కినదానితోఁ గాఁతాళించనేటికి"
14-565

కాఁదారి మాఁదారి పొద్దు : వి. మధ్యరాత్రి సమయం, నడురేయి. రూపాం. కాందారి మాందారి పొద్దు.
"నించిన యానోదముతో నిద్దుర గంటిఁబెట్టక
మంచమెక్కేవు కాఁదారి మాఁదారి పొద్దు"
26-517
"నడిరేయి యనఁగఁ గాందారి మాందారి పొ
ద్దన సరిప్రొద్దన నర్ధమరేయి" (ఆం.భా. 1.94)
గాంధారి మాంధారి పొద్దు అని బ్రౌన్.
(అనుబంధం)
"కాపుటూరి మంగలి రాజైతే కాపులంతా గడ్డాలు పెరిగి బాధపడ్డారట" అని సామెత.

కాఁపిరము : (11) వి. 'కాపురము'నకు వ్యావహారిక రూపం. 1. సంసారం 2. నివాసం.
"కైకొని నీవు నాతో కాఁపిరము సేతువంటూ
నీకుఁజేతులు చాఁచుట నేఁడా నేను" 21-34

కాఁపిరేలు : వి. 'కాపురాలు'కు వ్యావహారికరూపం.
"పుక్కిట లోకాలు చూపి బూమెలు సేతువుగాక
కక్కసించి మాతోడి కాఁపిరే లేలా" 11-268

కాఁపుటూరి మంగలోజు : కాపులున్న ఊరిలోని మంగలివాడు, అల్పుడు.
"కాఁపుటూరి మంగలోజు గడిమీఁది రాజుగాఁగా
కాఁపులెల్లాఁ బనిమాని కందినయట్టు"
4 అను. 31
"నిక్కము తన కబ్బెను గానుపు రిపుమిత్ర
మధ్య గణనకుఁ బోలమై" అని నృ.పు.
ప్రయోగం. (4-157)

కాంచనదైత్యుఁడు : వి. హిరణ్యకశిపుడనే రాక్షసుడు.
"కాంచనదైత్యుఁడు దొరకాలువ నెత్తురు వార
చించెను గోళ్ల నరసింహదేవుఁడు" 2-228

కాంతాళము : వి. 1. ఈర్ష్య 2. తాలిమిలేమి 3. కోపం, (వాచ; సూ.ని.) వ్యాకులము మీద వచ్చే కోపము, అధైర్యం. తాలిమిలేమి (బ్రౌన్) 1. ఈర్ష్య 2. తాలిమిలేమి. (శ.ర.) రూపాం. కాఁతాళము.

"గాటపుఁబొరుగువారి కాంతాళపు పరాకున
మాటాడినా నీతోడ తూటాడనైతి" 12-42
"మనసు కాంతాళముతో మరి యెంత సేతువో"
అని క్షేత్రయ్య.

**కాంతాళించు**: అ.క్రి. కోపించు, ఈర్ష్యపడు, అధైర్యపడు.
"కళలు నిండే మోమంటే కాంతాళించేవు సుమీ
సొలసి నీకు దిష్టాలు చూపుమని" 12-154
"కలికి నా చేతులని కాంతాళించే వప్పటిని
యిలపై వుప్పు చిందితే యినుమడి గాదా"
17-182
"నీకు మోహించినవారు నిన్ను మరి
దూరుదురా
కైకొను మనేవారు కాంతాళింతురా" 12-128

**కాంతాళింపు**: వి. కోపం, ఈర్ష్య, అధైర్యం.
"మరిఁగినమీఁద నేలే మరి చింతలూ
కరఁగినమీఁద నేలే కాంతాళింపులు" 12-134

**కా**: అవ్య. కదా అనే రూపానికి వ్యావహారికరూపం.
"సారెకు నా వలపు రచ్చలఁబెట్టేనని కా
పోరుచు నా చీర కాసి పోయుమంటివి" 7-126

**కాకతాళనాయము**: వి. కాకతాళీయ న్యాయము, యాదృచ్ఛిక సంఘటనను తెలియజేసే న్యాయం, కాకి వ్రాలగానే అప్రయత్నంగా తాటిపండు పడిన విధం.
"కాచి యిదే పసో నీకు కాకతాళనాయమో
ఆ చెంతే విచారింతు పండ కిటు రమ్మా"
20-207

**కాకరి**: 'కాకు' శబ్దం పై మత్వర్థం (కలవాడు, కలది అనే అర్థం)లో 'అరి' ప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. కాకు శబ్దానికి సూ.ని.లో గాసి = బాధ (శ్రమ), తిరస్కారం, అనే అర్థాలు, బ్రౌణ్యంలో కలఁత, బాధ అనే అర్థాలు చూపబడ్డాయి. కనుక కాకరి అంటే బాధకలవాడు, అవమానం కలవాడు, కలత కలవాడు అనే అర్థాలు చెప్పవలసి ఉంటుంది. కాని ఈ అర్థాలు కాకరి శబ్దప్రయోగాల్లో సంగతమైనట్లుగా కనిపించవు. కనుక కాకు శబ్దానికి మాయ, వంచన అనీ, కాకరి అంటే మాయగలవాడని (= వంచకుడని) అనే అర్థాలు సం.ప.స. లో సూచింపబడ్డాయి. (16 వాల్యూం. 3వ అను. 4.27 పు.) తె.వ్యు.కో. లో ఒంటరి, ఏకాకి, వ్యర్థుడు అనే అర్థాలు ఇవ్వబడ్డాయి. కనుక కాకరి శబ్దానికి సందర్భానుగుణంగా అర్థాలు చెప్పవలసి ఉంటుంది.

వంచకుడు:
"యెచ్చట నీతో నవ్విన దెటువంటి యాఁటదైనా
గచ్చురేఁగి మిక్కిలి కాకరి గాకపోవునా" 16-533
"కాకరివై యసూయ కడరు బాలుఁడవైతి
నీకు నిది మెచ్చుగాక నెరి మాకుఁదగునా"
23-596
"కాకరివై దూరేవు గక్కున పోనంటా
పోకులఁబోక నీ వాపెఁబూఁట వెట్టరాదా" 8-197

**కాకరిగుణము**: వి. చిల్లరగుణం, వంచనగుణం.
"ఆకడ నీ వెవ్వతె మోములు చూచితివో వాని
కాకరిగుణము ఇందుఁ గలయగఁ బోలును"
16-133

**కాకరిగొల్లెతలు**: వి. మాయకత్తెలైన గొల్లస్త్రీలు.
"కాకరిగొల్లెతలు కాఁగిలించి వట్టేరు
యేకమైతిరి మీ గుట్టు లెరిగే సుండీ" 22-537

**కాకరిచేతలు**: వి. చిల్లరచేష్టలు అని ప.పా., మోసగాని చేతలు అనే అర్థం కూడ చెప్పవచ్చు.
"ఈ కాకరిచేతలకు లోకమువారు నగరా"
12-341

**కాకరితనము**: వి. వంచన, మోసం, కాపట్యం.
"కాకరితనముతోడ కతలేమి చెప్పేవే
తూకొని తమ్మఁబేంట్లు తుడుచుకోరాదా"
22-195
"నాకు నీవే మానతిచ్చినా సమ్మతించేఁగాక
కాకరితనాల నీతోఁ గాఁతాళించేనా" 27-568

**కాకరిపనులు**: వి. మోసపుపనులు, కపటపుపనులు, దిల్లరపనులు.
"యేకతఁబలుకుఁ బంతమెక్కి నన్నుఁగూడితివి
కాకరి నీ పనులే లోకమున సమ్మతము" 24-90

**కాకరి మతములు**: వ్యర్థమైన మతములు, మాయమతములు.
"కాకరిమతములెల్ల గాలిఁబుచ్చి పరమిట్టే
పైకొనఁగఁ గరుణించె భాష్యకారులు" 1-162

**కాకరివాఁడు**: వంచకుడు, మాయగాడు, కోపశీలి.
"కాకరివాఁడవు మాతో గాలి ముడియగట్టేవు
చేకొని నీ చెలిమెట్టు చేసిరయ్య సతులు" 21-20

**కాకరివిద్యలు**: వి; బహు. మోసపు విద్యలు, వ్యర్థమైన విద్యలు.
"యేకడా మంచి గుణాలే యెన్నికకు నెక్కుగాక
కాకరివిద్యలకు లోకమువారు మెత్తురా" 16-9
"నీకితఁడు మేలువాఁడు నన్నిట్టె
మన్నించినాఁడు
కాకరివిద్యల నేల కాఁతాళించేవే" 28-486

**కాకరిశత్రువు**: వి. మోసగాడైన శత్రువు.
"లోకులఁగోపింతుఁగాని లోని కామాదులనేటి
కాకరిశత్రులమీఁదఁ గతుఁగోపించ" 4-74

**కాకరి సతి**: వి. వంచకురాలైన సతి.

**కాకరిసొమ్ము**: వి. మోసపుసొమ్ము.
"అముకొన్న మగవాఁడ వాటదాన వయ్యేవా
యేమిటి కాకరిసొమ్ము ఇయ్యవయ్యా ఇఁకను"
26.404

**కాకిజున్ను**: వి. ఆకుల బూజుపై మంచు కురువగా ఏర్పడిన జున్ను వంటి తెల్లని మంచుముద్ద, ఉత్తుత్తి జున్ను; ఈ అర్థం రాళ్ళపల్లి, గౌరిపెద్ది వారి చర్చల్లో నిర్ణీతమైందిగా మైనంపాటి వెంకట సుబ్రహ్మణ్యంగారు తెలిపినారు. ఈ చర్చలో వీరుకూడా పాల్గొన్నారట.
"కాకిజున్ను జున్నులంటా గంపెడేసి తినిపించి
వాకొలిపి బాలులెల్లా వాపోవఁగ" 2-167

**కాకిపైఁడిబొట్టు**: (3) వి. పీతాభ్రకంతో పెట్టుకున్న బొట్టు.
"కాకిపైఁడిబొట్టు నీకుఁగడు ప్రియమా
ఆకుఁదొలసిదండ నీ కది బాఁతా" 19-418

**కాకిబెగడ శీర**: వి. అభ్రకపుచీర.
"కాకిబెగడ శీరను కాశవోసినాఁడు తాను
వాకిటికి వచ్చినాఁడు వలశితి ననవే" 11-93

**కాకిభక్తి**: ప.బం; వి. అల్పభక్తి, నీచభక్తి, దొంగభక్తి.
"దీపము చేటుమృగము తెగని యానోదకాఁడు
దూపము కాకిభక్తి యెందును లేనివాఁడు"
15-378

**కాకు**: వి. దీనికి నిఘంటువుల్లో శ్రమ, బాధ; తిరస్కారం, అవమానం; కలఁత, అనే అర్థాలు లభిస్తున్నాయి. విశేషణంగా వాడినప్పుడు శూన్యం, వ్యర్థం, చెల్లాచెదరైన, కళావిహీనమైన, మాయ అనే అర్థాలని చెప్పబడింది.
"ఇంతులెల్లా విని యింక నేమందురు
కాంతుఁడవు ఇటువంటి కాకు గలదా" 13-158
"చిలుకలు మీ చేతలు సిగ్గులు దోఁచఁగనాడీ
ఇలమీఁద నింత కాఁకు యెఱుఁగమమ్మా" 12-5
"యేకతాన నెందునైనా నియ్యకొనేఁగాని నిన్నుఁ
గాకుగా మందెమేళాలఁగప్ప నోపరా" 11-107

**కాకుచే(సే)యు**: (60) స.క్రి. 1. నిందించు, అవమానపఱచు 2. అణచు 3. బాధించు, హింసించు 4. వ్యర్థపుచ్చు 5. చీకాకుపఱచు.
"వినుమా ఆపెచేతనే వింతలుగఁగాకు చేసి
అనఁబోలుదువు నీవే ఆపెతో నేఁడు" 7-471

**కాకుపడు**: (3) అ.క్రి.వ్యాకులపడు, కలఁతనొందు (సూ.ని.) చీకాకుపడు, బాధపడు, అవమానపడు, వ్యర్థమగు.
"కన్నవిన్నవారిలో నెప్పుడు
కాకుపడకుమీ వో మనసా" 1-188
"కైకొని యిద్దరు నూడిగము నీకుఁజేయఁగాను
కాకుపడి కలగూరగంపాయ నీ నోరు" 23-164

**కాచు (కొను):** స.క్రి. ఎదిరి చూడు, వేచి ఉండు.
"ఎన్నాళ్ళనుండి కాచేవో యిందుకుఁగాను
వన్నెలఁజూడ వచ్చినవారిఁ జుట్టుకొనేవు"
22-177

**కాచుకుండు:** (కాచుక + ఉండు) ఎదిరిచూస్తూ ఉండు, వేచి ఉండు. (దీనికి అనేక ప్రయోగాలు ఉన్నాయి)
"చెంతనుండి యెందాఁకాఁ జేసేవే విన్నపాలు
కాంతలందరు వాకిటఁ గాచుకుండఁగా" 22-283

**కాటారించు:** మోసగించు, బాధించు, వ్యాకులపఱచు, భయపెట్టు.
"ఒల్లనివాఁడవై వుండి వొక్కొక్క నెపమువేసి
కల్లయలుకలుగాఁ గాటారించేవు" 11-281

**కాటికె:** వి. 'కాటుక'కు వ్యావహారికరూపం.
"కన్నుల కాటికెతోడ కసరకువే నా
వెన్నెలమోమునవ్వుల విసరేను" 20-89

**కాటువోవు:** వ.బం. గాయపడు, మచ్చపడు, గాటుపడు.
"వేడుకకు వెలలేదు వెన్నెలకుఁ గాటువోదు
ఆడ నీవే తన మాట కడ్డము లేదు" 7-226

**కాడ:** (7) కడ (= ఒద్ద, దగ్గర) అనే పదానికి మాండలిక రూపం. ఈ పదం రా.సీ. లోనూ, తెలం, లోనూ బాగా వాడుకలో ఉన్నది. గుడికాడ, బడికాడ, ఇంటికాడ మొ॥
"కొప్పెరల నెదురుగఁ గుంకుమపన్నీరు నించి
కుప్పెలఁజల్లులాడేరు కోనేటికాడ" 20-49
"కాఁగి భూపతిచెఱువుకాడ శ్రీవేంకటేశుఁడు
వీగకుండ రతి నన్ను వెలయించెఁదాను"
19-424
"కని యింటికాడ నిడి గానుగకాడా గసి
నినుఁజూచి నేరుచుకొనేరనే నేను" 19-383

**కాడువడు:** అ.క్రి. కలతపడు, ఆకులపడు, కలవరపడు, సంక్షోభించు, పాడగు; చెడిపోవు, స్మృతితప్పు అని ఆం.ధా.మా.
"కాడువడ్డ చిత్తమిది కలకాలము నిట్టే
ఆడికెలకు లోనై తనియకపోయ" 1-208

**కాణాచి:** వి. 1. చిరకాల నివాసస్థానం 2. ఆటపట్టు విణ. వంశపరంపరాగతమైన.
"నీవు నాతఁడునుఁగూడి నెమ్మది నిట్టె వుండితే
కైవసమై నీకెప్పుడూఁ గాణాచాయ నతఁడు"
28-164

**కాణాచిది:** (కాణాచి + అది) నివాసస్థానమైనది.
"బడినె శ్రీవేంకటేశ పాయకుండా మరపేవు
కడలేని మోహానకు కాణాచిదాననా" 11-52

**కాతరపడు:** అ.క్రి. భయపడు, తత్తరపడు, అధీరుడగు.
"చేతులు చాఁచక సిగ్గులు విడువక
కాతరపడితేఁగలదా రతి" 16-121
ఉత్సాహపడు:
"కాతరపడి నేను కర్తననుచుఁ జనులు
యీతలఁ జెప్పఁగఁ బూనే నిస్సిరో" 4-371

**కాతరపుగుణాలు:** వి; బహు. పిరికి స్వభావం.
"ఆతనివల్లఁ దప్పేది అరసి చూచేనంటే
కాతరపు నా గుణాల గతులింతే కాక" 7-500

**కాతరపుజీవులు:** వి; బహు. భయస్వభావులైన జీవులు.
"ఈ తగవే నాకు నీకు నెంచి చూచితే
కాతరపుజీవులకుఁ గలదా వివేకము" 3-97

**కాతరపుది:** (కాతరము + అది) వి. భయశీలురాలు, వెతనొందే స్త్రీ.
"ఎంత కాతరపుదని యెంచేవు గనక నీవు
సంతోసాన సారె నిన్ను జరతు సుమ్మీ" 12-75

**కాతరపువాడు:** (3) వి. భయశీలుఁడు.
"కాతరపువాఁడవు గజరు నీకుఁబట్టితే
నీతి యెఱిఁగినదాన నిన్నుఁగాదనేనా" 17-138

**కాతరము:** విణ. 1. భయశీలమైనది 2. పిఱికి 3. వ్యాకులం 4. చంచలం వి. ఉత్సాహం, భయం, తత్తరం, వ్యథ, చాంచల్యం (3-69)
ఉత్సాహం:
"కాతరాన మాయింటికిఁ గక్కనఁ బిలిచితేను

"యేతులింత సేసేనని యెట్టుండునో" 7-14
"తరుసతోఁ బోఁకముడి వదలినదీ నెంచదు
గరిమ సరసమాడీ కాతరానను" 27-45
తత్తరము :
"అతఁడేమి నీవేమి అవుఁగాములిందులో నేమి
కాతరవుఁదమకము కలది యిద్దరికి" 7-412
"కాతరవు మగవాఁడు కాదు గూడదనరాదు
యీతల నెవ్వతె విన్నా నేతువలికేదరా"
26-560
చాంచల్యం :
"చేత మొక్కితేఁ జాలు శ్రీవెంకటేశుఁడు గాచు
కాతరాన సేవించని కడమే కాని" 3-169

**కాతరించు :** అ.క్రి. ఉత్సహించు.
"కాతరించి సారె సారెఁగడు సరసమాడేవు
అతనికి నీవు దొల్లి ఆలవా యేమి" 7-397
భయపెట్టు :
"చేతిలోనైన యట్టి శ్రీవెంకటేశ్వరుని
కాతరించరాదు మరి కాదనరాదు" 25-306

**కాతరి :** వి. కాతరము (భయం, ఉత్సాహం, తత్తరం, వ్యథ) కలవాడు, ఉత్సాహం కలవాడు.
"యేకతమాడీ రమ్మనేవింతులము మొదలనే
కాతరి యాతఁడు చెనకకపోనీఁడే" 14-26

**కాతరిదవు :** వి. 'కాతరిది' అనే శబ్దంపై మ.పు; నామ ప్రత్యయం చేరిన విలక్షణరూపం. కాతరిదానవు అంటే భయశీలురాలవు, ధైర్యంలేని దానవు అని అర్థం.
"ఇంత కాతరిఁదవౌట యెఱుగమయ్యా
మంతుకెక్కితి విన్నిటా మంచివాఁడవయ్యా"
12-531

**కాతరీఁడు :** (14) (కాతరము + ఈఁడు) భయశీలుడు, వ్యాకులుడు.
"ఈతఁడు గుట్టు మానిసి యీతఁడు గంభీరుఁడు
కాతరీఁడు గాఁడు యేల కాఁకలు సేసేవే" 13-40
ఉత్సాహశీలుడు :
"చూతము నీ నేరుపు సుదతి యెదుట నేఁడు
కాతరీఁడ వీ గుట్టు కనుకొనవయ్యా" 18-376
"యెన్నేసి నవ్వులు నవ్వీ నెంతైనాఁబోనీఁడు
కన్నులఁగంటేఁజాలు కాతరీఁడు" 12-408

**కాతురపడు :** అ.క్రి. 'కాతరపడు' కావచ్చు. అధైర్యపడు.
"కాతురపడి నేను కర్తననుచుఁజనులు
యీతలఁజెప్పఁగఁబూనే నిస్సిరో" 4-37

**కాదనునను :** వ.బం; అ.క్రి. తిరస్కరించు – అంగీకరించు.

**కాదుకూడదను :** (25) వ.బం. వద్దను, నిర్బంధించు.
"ఏదైనా సుఖమే యిన్నిటా నీవు గలవు
కాదుగూడదని నిన్ను గక్కసించనేఁటికి" 4-478

**కానిక :** (26) వి. 'కానుక'కు వ్యావహారికరూపం.
"ఆపె యంపిన కానిక యవధరించితివా
చూపులఁదప్పక లెస్స చూచితివా" 24-468
అన్నమయ్య 'కానిక' తో పాటు 'కానికె' 'కానుక' అనే రూపాలను కూడా వాడినాడు. కానిక, కానుక, కానికె రూపాల దృష్ట్యా 'కానుక' ప్రయోగం విరళం.

**కానికె :** (27) వి. 'కానుక'కు వ్యావహారికరూపం. ఇది కాణికె, కాణ్కె అనే కన్నడ రూపాల ప్రభావంతో ఏర్పడి ఉంటుంది.
"ఇచ్చిన కానికెలోనే యితవెల్లాఁ దెలియదా
తచ్చి మా గుణము లేమి తలపోసేవు" 20-479

**కానుగమానినరసింహము :** వి. దిగువ, ఎగువ అహోబిల మార్గంలో వెలసిన నరసింహస్వామి, నవ నారసింహులలో ఒకరు. ఈ స్వామి కానుగచెట్టు కింద ఉండడం వల్ల ఈ స్వామికి కానుగమాని నరసింహుడు అనే పేరు వచ్చింది. ఈ స్వామి వరాహలక్ష్మీ నరసింహుడు.
"నాఁటి కానుగమానినరసింహము వీఁడె
మేఁటి వరాహపు లక్ష్మీనారసింహము" 4-182

**కానుగుమాని నారసింహుఁడు :** వి. చూ: కానుగమాని నరసింహము.

"మతిశాంతపు కానుగుమాని నారసింహా"
1-453

**కానుపు[1]:** (కను + పు) వి. చూపు, తలపు, జ్ఞానం. (ప్రసవం)
"గుట్టు విడిచి నవ్వినా గుణము చెప్పకున్నది
కట్టఁగడపటఁ బతి కన్నదే కానుపు" 22-44

**కానుపు[2]:** (కను + పు) వి. వీక్షణం, చూడడం, దృశ్యం.
"విన్నదే వినికి వివేకించిన చోట
కన్నదే కానుపు మరి గలయు చోట" 24-174
"అది కలలోని కానుపయి" అని ఉ.హా. ప్రయోగం. 7-99

**కామధేనువు మాని యెద్దుఁ బిదుకు:** ప.బం; వి. అమూల్య మైన ఉపయోగకరవస్తువు ఉండగా పనికిరాని వస్తువును ఆశ్రయించు. వ్యర్థమైన ప్రయత్నం చేయు.
"గద్దరి జీవుఁడు కామధేనువు మాని
యెద్దుఁబిదుకఁజొచ్చె నేది దెరఁగు" 4అను.65

**కామలాపురం కంచిరాయఁడు:** వి. కడప జిల్లాకు చెందిన కమలాపురంలో వెలసిన వరదరాజస్వామి. కమలాపురము కామలాపురంగా పేర్కొనబడింది. (కంచిరాయుఁడు = వరదరాజస్వామి)
"మూగుచుఁ గామలాపురమునఁ
గంచిరాయఁడవై
చేఁగదేర నేలితివి శ్రీవెంకటేశుఁడా" 26-162

**కామిడి:** విణ. చెడ్డ. (క. కామిటి = చెడ్డ)

**కాయకము:** వి. 1. ఈ పదం సాక్షాత్తుగ నిఘంటువులందు కానరాదనీ, ప్రకరణాన్ని బట్టీ మాయ, అశాశ్వతము అనే అర్థాల్లో ప్రయోగించి నట్లున్నదని సం.వ.స. (2వ వాల్యూం. 378 పు.) లో చెప్పబడింది. ఈ అర్థం సముచితంగా ఉంది. తె.వ్యు.కో. కాయకాలు అన్నపదానికి బూటకాలు, కల్పనలు అనే అర్థాన్ని చూపింది. కాయకము అన్నపదాన్ని కూడా చూపి 1. జీవనోపాయం 2. సేవ 3. వృత్తి వ్యాపారం అనే అర్థాలు ఇచ్చింది. ఈ అర్థాలు ఇక్కడ కుదరవు.
"మాయమౌఁగొన్నాళ్ళకు
మానుషకృత్యములెల్లా
మాయముగానివి దైవికమహిమలెల్లా"
కాయకములే తమ కల్పితము లన్నియును
కాయకము గాక నిల్చుఁ గమలాక్షుమన్నన"
2-242

"కాయకము లందరునుఁ గార్యపరవశులే
పాయని నీ వకారణబంధుఁడవు" 2-306

**కాయగంటివాఁడు:** వి. కాయగాచిన కన్నులు గలవాడు, గుడ్డికన్ను గలవాడు.
"సేయరాని చేతలెల్లాఁజేసితి నేను నీ
గాయకంటివాఁడ నేను గతి చూపవయ్య"
3-111

**కాయగాచు:** (4) ప.బం; అ.క్రి. ఎక్కువగా పనిచేయడం మొ॥ వాటివల్ల చేతులు మొ॥ వాటిపై చర్మం గట్టిపడి కాయవలె ఏర్పడు. (సంతానం కలుగు)
"కాంతలచేత నిన్నిటా కాయ గావఁబోలు మేను
యెంతైనా జంకించఁడు యిచ్చగించీనందుకే"
25-305

**కాయదారి:** వి. శరీరధారి, ఆత్మ.
"మాయలోనఁబుట్టేది మాయలోనఁ బెరిగేది
కాయదారులకు నెల్లాఁగలిగినదే" 2-9

**కాయ పండుసేయు:** ప.బం; అ.క్రి. పనిని సఫలం చేయు.
"సేయరాని చేతలెల్లాఁ జేయమని యే లనేవు
కాయ పండుసేసేదానఁగాను సుమ్మీ నిన్నును"
23-122

**కాయపుఁజుట్టాలు:** వి; బహు. దేహబంధువులు, జ్ఞాతులు.
"కాయపుఁజుట్టాలే నీకుఁగలిగేరు సుమ్మీ" 9-253

**కాయసిద్ధి:** వి. నిత్యయౌవనం.
"నెట్టిన నంజనగాఁడై నేల దవ్వించే మనసు
అట్టే కాయసిద్ధికిఁగా నాసపడేటి మనసు" 15-280 అని శు.స. ప్రయోగం.

**కాయాటు :** వి. ఈ శబ్దం ఏ నిఘంటువులోనూ లేదు. పనిచేయడం ద్వారా శరీరం కాయగాయటం (?) కావచ్చు లేదా గట్టిదనం కలది అని కావచ్చు.

"గాఁటపు సతులఁబొంది కాయాటైనవానికి
యేఁటికిఁ గరఁగీ గుండె యేమి చెప్పవే" 7-241

**కాయాటుది :** (కాయాటు + అది) వి. 18 సం. సం.ప.న. లో 'కాయాటుది' అనే పదవివరణలో 'కాయవాటు శరీరముగలది' అనుదాని వ్యావహారిక రూపానికి సంగ్రహరూపంగా కనిపిస్తుందనీ, కాయవాటు శరీరము అనేదానికి గట్టి శరీరమని వ్యవహారమునన్నదని వివరింపబడింది. (18 సం. 429 పు.) దీన్నిబట్టి గట్టి శరీరం కలది అని అర్థం చెప్పవచ్చు.

"మాయదారికిఁగాని మాటలు నోరికి రావు
కాయాటుది గాని రతికాక కోర్వదు" 18-184

**కాయాటుపడు :** ప.బం; అ.క్రి. కాయగాచు; చూ; కాయాటు.

"కాంతలఁబెక్కులఁబొంది కాయాటుపడె నీ
మేను
దెంతవద్దినా నెలయు దిదివో నేఁడు" 21-322

**కాయో పండో :** ప.బం. పని సఫలమో, విఫలమో అనే అర్థంలో వాడబడే పలుకుబడి.

"అలికి నీతంపులోయి వచ్చినట్టి పొరుగువని
రేయువగలు నన్ను రేసుల నేచిన
పోయపు విభునికిఁబరితామా" 17-509

**కాయోత పండోత :** (కాయోట పండోట) పని సఫలం కావడం, కాకపోవడం.

"అయిమంటి వేగిరించినప్పుడే తనకుదాని
కాయోతా పండోతాఁ గనీఁగాకా" 11-160

**కారణము :** వి. సంబంధము.

"కామకొని వీనికి నాకూ గారణ మేమనక
యే చోటూ నీ రూపమే హరి యెదలో
నుండఁగదే" 2-295

**కారపుబొంకులు :** వి; బహు. కటువైనబొంకులు.

"కన్నుల జంకెలు గొన్ని కారపుబొంకులు గొన్ని
నిన్నటనుండి పడేము నీచేతను" 20-257

**కారపుమాట :** వి. కోపపుమాట, కఠినమైనమాట, విరసపుమాట.

"పలుకులు తేనియలు పైపై నాలికకొన
నెలమిఁగారపుమాఁట లేలవూరీనే" 16-244

**కారించు :** స.క్రి. 1. బాధించు, పీడించు 2. చంపు 3. పరాభవించు (వ్య.)

"కారించి యిందుఁమీదను కాఁకలు
చల్లఁజూచేవు
గారవపు నీ దయ కానవచ్చెఁగా" 12-7

**కారింత :** వి. 1. బాధ 2. చంపడం 3. పరాభవం.

"యింత యేలే నాతోఁగారింతలు నీవల్లనే వో
సంతమైతినే వో వసంతకాఁడవా" 24-217

**కారింపు :** వి. బాధపెట్టడం.

"కలువ లేమిటికి కారింపు లాయనే
తలపోఁత లేఁటికిఁ దరవాయనే" 24-299

**కారిమారసుతుఁడు :** వి. నమ్మాళ్వారు, ఇతని తండ్రి కారిమారుడు.

"కారిమార సుతుని చక్కని మాటలకుఁ జొక్కి
మూరఁగా వేదాల గుట్టు చూపినవాఁడు" 1-121

**కారుకమ్ము :** అ.క్రి. దట్టంగా వ్యాపించు.

"కారుకమ్మఁ బచ్చడము గప్పినయట్టివాఁడవు
సారె సారె సిగ్గులెల్ల జరపఁగనేరవా" 26-325

**కారుకొను :** అ.క్రి. సందడిచేయు, వ్యాపించు, కమ్ము, అతిశయించు.

"సారెనిది మా యేలికసాని వింటేనేమి యను
కారుకొన్న జాణకాఁడు గదరె నేఁడితఁడు"
26-348

**కాలఁ జేతఁ బేదగు :** ప.బం. అన్నివిధాలుగా నిర్బలుడగు.

"జాతిగాఁగర్మపుసంకెళ్లఁ బడి కాలఁ
జేతఁ బేదైతివే చిలుకా" 1-50

**కాలకాసు :** వి. కాలికింది కాసు, ఏమాత్రమూ విలువలేనిది.

"నాలుకరుచుల యాస నాతుల కాఁకల యాస

కాలకాసు కైన బొంకు గరపే యాస" 4-456

**కాలకాసు సేయకుండు :** ప.బం; అ.క్రి. ఏమాత్రమూ విలువచేయకుండు.

"ఏలినవారికిఁబోదు యీడేరించఁదమ సొమ్ము
కాలకాసు సేయకున్న ఘనముగాఁజేతురు"
15-33

**కాలగాలము :** వి.కలకాలము, సర్వకాలాలు, అన్నికాలాలు.

"అదనెరిగి కాలగాలమున ఆతుమ శ్రీవేంకటపతికి
పొదిగి యాతనికి శరణని కొలిచిన పొందగు ముక్తికి యిది గీలు" 4-99

**కాలవేలములు :** వి; బహు. (?)

"అంచెల శ్రీవెంకటేశుఁడనే బోయనాయఁడు
పంచఁ గాలవేలముల బలు బోయనాయఁడు"
1-460

**కాలాంతకుడు :** వి. కాలాతీతుడు.

"హరికిఁబరమేశ్వరునకును శ్రీధరునకును గాలాంతకునకును
పరమ పురుషోత్తమునకును బహుబంధదూరునకు" 1-46

**కాలానుభాగి :** వి. (?) ఆయా సమయముల యందు అనుభవమునకు భాగమైనది, ఉంపుడుకత్తె అని తాత్పర్యము కావచ్చునని సం.ప.స. (2 సం. 379 పు.)

"పతిఁ బెండ్లాడిన యాలు పక్కనుండి నిద్రించితే
కొతికి కాలానుభాగిఁ గొనవచ్చునా" 2-214

**కాలిగోరఁబోలు :** ప.బం; అ.క్రి. దీనికి నఞర్థంగానే ప్రయోగం. ఏమాత్రమూ సరిపోదు. కాలిగోరితో పోలు.

"యేల కిందువడి మొక్కే వేమి బాతి నే నీకు
కూళ నింతేని కాలిగోరఁబోలను" 6-170

**కాలితాఁకు :** వి. పాదతాడనం, కాలితో తన్నుట.

"తగని యెవ్వనితో కాలితాఁకులు నీ మై నుండఁగ
బిగువు నా చన్నులొత్తు బిరుసాయఁగా"
11-181

**కాలినపుండ్లలోన నుప్పులు చల్లు :** ప.బం; అ.క్రి. మిక్కుటమైన బాధ కలిగించు, గోరుచుట్టు పై రోకటిపోటు వంటిది. కాలిన పుండుమీద కారంచల్లు ఇట్టిదే.

"కప్పినఁబోవు సేతలు కాలినపుండ్లలోన
నుప్పులు చల్లక తలరో సతులు" 5-33

**కాలిమీఁదఁగాలువేయు :** ప.బం; అ.క్రి. అట్టహాసంగా ఉండు, పనీపాటా లేకుండా ఉండు.

"కాలిమీఁదఁగాలు వేసి కడుఁదలవంచేవు
అలరి కేలికిని రమ్మనె నంటావు" 9-57

**కాలీఁచపడు :** అ.క్రి. కాలు బలహీనమగు, శక్తిహీనమగు.

"కాలీఁచపడగ వెక్కడికి నేఁగెడిని
పాలుమాలినయట్టి ప్రాణి" 1-201

**కాలుదవ్వు :** ప.బం; అ.క్రి. ఉత్సాహపడు, పురికొను, సిద్ధమగు.

"వాలుఁగన్నుదోయి మెఱుఁగు వల్లెవేసి వేసి రతికి
కాలుదవ్వ రమణి చల్లకడవతోడను" 5-162

**కాలుదువ్వు :** ప.బం; అ.క్రి. కయ్యానికి పిలుచు, తిరస్కరించు.

"కయ్యంపుఁగూటమికిఁగాలు దువ్వుచునెంతె
కొయ్యతనమునఁ దెచ్చుకొన్నదీ వలపు" 5-74

**కాలుదొక్కినది :** వి; ప.బం. పెండ్లాడిన స్త్రీ.

"కాలు దొక్కినదానితోఁ గాఁతాళించనేటికి"
14-565

**కాలుదొక్కినవాఁడు :** ప.బం; వి. పెండ్లాడిన వాడు.

"కాలుదొక్కినవాఁడిట్టి కరఁగించవలెఁగాక
తాలిమితో సారె సారెఁ దలపోత లేటికే"
25-18

**కాలుదొక్కు :** (20) అ.క్రి. యువతీ యువకులు కూడుకొను, వెంబడించు, పెండ్లిలో ఆచారంగా కాలుదొక్కు, ఎదురుపడు.

"యిరవై శ్రీవెంకటేశుఁడే నలమేలుమంగను

"గరిత సన్నుతింపుఁడి పెండ్లాడి కాలుదొక్కె నితఁడు"
29-324

పెండ్లాడు!

"కరఁగించితివాఁడవు కాలుదొక్కితే నేమాయె
పొరయు నీ గుణము వేరొక్కటయ్యీనా"
26-357

**కాలుమీఁదఁగాలువేయు :** వి.బం; అ.క్రి. ఠీవిగా కూర్చొను.
"కాలుమీఁదఁ గాలువేసి కరఁగించేవు యింత
మేలా నాతోడి సమేళములు" 5-242

**కాలురులు :** (కాలు + ఉరులు) వి; బహు. కాలిబంధాలు, యమపాశాలు.
"కన నా సంసారము కడ లేని భారమౌట
కనినాఁదొలఁగరాదు కాలురులు"

**కాళాంజాపె :** (కాళాంజి + ఆపె) వి. తమ్మపడిగము పట్టెడి దాసి, తమ్మ ఉమిసెడి పాత్రను పట్టెడి దాసి.
"దంటతనమున నీపై దప్పు వేయరాదు గాక
ఇంటికాడ కాళాంజాపె కియ్యవా విడెము"
29-456

**కాళాఁజి :** వి. రూపాం. కాళాంజి, తమ్మపడిగము, తమ్మ ఉమ్మివేసేపాత్ర.
"కుచ్చులపై నుమిసేవు కోరి నీ తమ్మరసము
నెచ్చెలిచే నే కాళాఁజి నేఁబట్టఁగా" 8-239

**కాళాంజి :** వి. తమ్మపడిగము, ఉమ్మివేయు పాత్ర. రూపాం. కాళంజి.
"అమరాధిపులిడుఁడాలవట్టములు
కమలజ పట్టుము కాళాంజి" 1-12

**కాళాంజిముదిత :** వి.తమ్మపడిగము (తమ్మఉమిసెడి పాత్ర) పట్టెడి స్త్రీ.
"ముచ్చట నా కాళాంజిముదితఁ గాఁగిలించితి
వచ్చఁగా నే రత్నపుగోడావలఁ గంటి" 10-2-91

**కాళిక :** వి. నల్లదనం.
"అంచలఁబరుసము లోహపుఁగాళికలనెల్ల
యెంచీనాఁ బసిఁడి గావించుఁగాక" 2-168

**కాళ్ళాడు :** (కాళ్లు + ఆడు) వ.బం; అ.క్రి. వెళ్ళుటకు మనసొప్పు.
"యీకడనేఁ జూడఁగానే యించుకంత దయలేక
కైకొని తోసి విచ్చేయఁగాళ్ళెట్లాడెరా" 11-249

**కావరము :** వి. 1. గర్వం, మదం 2. కొవ్వు.
"దైవమా నీ మాయ తలమొలెలఁగనీదు
కావరపువిషయాల కట్లు వదలవు" 2-4
"కావరపు వనితలు" 25-286 "కావరపు జీవుఁడు" 26-578

**కావరించు :** (39) అ.క్రి. గర్వించు, మదించు, పొగరెక్కు, కావరం కలవాడగు.
"భావించ నింతి నీ పాలిటి దేవరాయనా
కావరించి మాట కతి కడవఁగఁజాలవు" 26-578

**కావలించు :** స.క్రి. 'కౌగిలించు'కు వ్యావహారికరూపం. ఈ అర్థంలో కౌగిలించు, కాఁగలించు, కాఁగిలించు అనే రూపాలను కూడా అన్నమయ్య ప్రయోగించినాడు.
"కావలించి నీ వేల కాఁతాళించేవే" 27-260

**కావలికాఁడు :** (కావలి + కాఁడు) రక్షకుడు.
"గాములు వారెడి పొద్దు కావలికాండ్లాల
జాము జాము దిరుగరో జాలి" 4-166

**కావించు :** స.క్రి. 'ఎఱుపుచేయు' కావచ్చు.
"చేవ దేరే నీ మోవి శ్రీవెంకటేఁశుడు నాఁడు
కావించి పచ్చడమిట్టె కప్పుకొంటిరి" 22-453

**కావిరి :** (6) వి. 1. నలుపు 2. పొగవంటి నల్లని పదార్థం.
"కావిరితో నీవెంత కాఁకదేరఁజూచినాను
మూవంకఁదమకమే ముంచీ నాకు" 11-573
"వేవేలు రతులచేత వెలయఁగా దిక్కులెల్ల
కావిరిమాని హృదయకమలము నించెను"
8-282
"శ్రీవెంకటేశుఁడే చెనకకవుండితేను
కావిరిఁగాఁగిలించేది గయ్యాళి గాదా" 14-550

**కావిరినది :** వి. 'కావేరినది'కి వ్యావహారికరూపం.
"దేవేంద్రసంపద దిక్కులకెక్కుఁడు

కావిరినది యొక కాలముది" 3-292

కావిరెక్కబొల్లిపిట్ట : వి. ఎరుపురెక్కల తెల్లనిపిట్ట.

"కావరపుఁబెనుఁబాము గట్టుమీఁద నెక్కి

కావిరెక్క బొల్లిపిట్టఁగైకొని యెక్కి" 17-230

కాశ : వి. 'కాసె'కు వ్యావహారికరూపం ;
1. కాసెకోక, దట్టి 2. కచ్ఛభేదం, కుచ్చెల.

"తూపుచేత నంటితేనె తుత్తుమురై పారుదురు

రావు నీలికాశ గంటే రణభీతి గొందురు" 3-186

"కుందనపు కాశతోడి గోవిందుఁడితఁడు

విందుల రేపల్లె గోవిందుఁడితఁడు" 4-180

కాశపోయు : (కాశ + పోయు) 'కాశెపోయు'కు వ్యావహారిక రూపం ; వస్త్రాన్ని గోచివలె వెనుకకు చెక్కు.

"చెలఁగి తాఁగట్టినది చెంగావిదుప్పటియు

నిలువుగాశ వోయుటే నీ కానవాలు" 17-375

కాసుకునుఁగొరగాని : ప.బం; విణ. ఎందుకూ పనికిరాని.

"కాసుకునుఁగొరగాని గతిలేని పనికిఁ

గాలూద నీవేల కర్మమా" 5-187

కాసుచే(సే)యని పని : (8) ప.బం; వి. పనికిరానిపని, నిష్ప్రయోజనమైన పని.

"పోసరించి యెడ లేని పొట్టులు వెట్టుకోనేల

కాసుచేయని పనికి కల్లలాడేనా" 18-515

కాసుచేయు : ప.బం; అ.క్రి. పనికివచ్చు, ప్రయోజనకరమగు. దీనికి నఞర్థంలోనే ప్రయోగం.

"యీసునను నీవలన నెక్కువ కులములెల్ల

కాసుసేయకపోయెఁ గలికాలమా" 4 అను. 77

కాసువీసపుబ్రదుకు : ప.బం; వి. కొద్దిపాటి మాత్రమే విలువగల బ్రదుకు, అంతగా విలువ లేని బ్రదుకు.

"కల్లలోని బ్రదుకు కాసువీసపుబ్రదుకు

కల్లరిప్రాణాలు నమ్మి కట్టువీడెను" 4-460

కాసువీసము : వి. కొద్దిపాటి. (డబ్బు)

"రాసికెక్క యిందరిని రక్షించే దేవుఁడె

కాసువీసములపాటి కావ నోపఁడా" 10-1-42

కాసువీసములు : ప.బం; బహు. ఏ కొంతో డబ్బు. కాసు, వీసము అనేవి కొద్ది విలువగల నాణాలు. అధికము సారంగ. 119 పు.

"వేసదారి వనితలు వెంగెము లప్పటిఁజూపి

కాసువీసములకుఁగా గరగింతురు" 18-201

కాసుసేయు : ప.బం; అ.క్రి. పనికివచ్చు - దీనికి నఞర్థంలోనే ప్రయోగం.

"యీసునను నీవలన నెక్కువ కులములెల్ల

కాసుసేయక పోయెఁ గలికాలమా" 4 అను. 77

## కి

కింకపుకిసరు : వి. దృష్టిదోషం, రోగవిశేషం.

"కింకపుకిసరుచేత కీడైన దేహము

వంకవంక తెరువుల వడిసీని" 1-305

కింకము : ఈ శబ్దం నిఘంటువుల్లో కానరాదు. 'కింక' కు రూపాంతరమా? కింక (కిన్క) అంటే కోపం.

"కింకపు కిసరుచేత కీడైన దేహము

వంకవంక తెరువుల వడిసీని" 1-305

కింకరవర్తి : వి. కైంకర్యము (=సేవ) నందుండువాడు, కైంకర్యవర్తి అనడానికి కింకరవర్తి అనడం విలక్షణం. ధర్మవాచకానికి బదులు ధర్మివాచకం ప్రయోగింప బడిందన్నమాట. ఇట్టి ప్రయోగాలు అన్నమయ్య భాషలో సహజమే. సంపాదకులు ఈ పదానికి "కింకరాః ఇవ వర్తంతే ఇతి కింకరవర్తినః (కింకరులవలె నుండువారు కింకరవర్తులు) అని అర్థాన్ని ఊహించినారు. కాని ఈ సమాసం సాధ్యమా?

"కెలన మరియు నీ కింకరవర్తులు

తెలిసిన బ్రహ్మాదిదేవతలు" 3-581

కింకురువాణపుగెలుపు : వి. కింకరుల గెలుపు, సేవకుల గెలుపు. (కింకుర్వాణ = కింకురువాణ) కింకుర్వాణుడు = సేవకుడు, ఏమి చేయాలని విచారించేవాడు.

"వేంకటపతిఁదడవినదాక యీ

కింకురువాణపు గెలుపే సుఖము" 1-212

**కిందిమీది పనులు:** వ.బం; బహు. తలకిందులగు పనులు.

"క్రియ గూడె నిన్నిటాను కిందిమీది పనులెల్లా
అయమాయ మా యింటికి సరుగ రావయ్యా"
13-6

**కిందుమీఁదగు:** వ.బం; అ.క్రి. తలకిందగు, వ్యత్యస్తమగు.

"మనసున నెంచ నవే మఱఁగుల తెర ఆయ
నినుపు కిందుమీఁదాయ నవ్వు లేటికయ్యా"
25-292

**కిందుమీఁదుసేయు:** వ.బం; స.క్రి. తలకిందులు చేయు.

"క్రియగూడ నిన్నుఁ గిందుమీఁదు సేసీ
ప్రియురాలిఁజూడు బీరాలు" 25-265

**కిందెడు మీఁదెడు:** కిందికి దిగినవి, మీదికి ఎక్కినవి (సంపా.)

"కోరి శ్రీవెంకటపతి కుక్షిలోనే లోకములు
అరయఁగిందెడు మీఁదెడై వున్నవి" 3-14

**కిందేడు మీఁదేడు:** వ.బం; వి. కింది ఏడు లోకాలు, మీది ఏడు లోకాలు. పూ.ము.

"కోరి శ్రీవెంకటపతి కుక్షిలోనే లోకములు
అరయఁ గిందేడు మీఁదెడై వున్నవింతే" 3-14

**కిక్కిరించు:** స.క్రి. 'కిక్కురించు'కు వ్యావహారికరూపం కావచ్చు. 'కిక్కురించు' అంటే 1. మోసగించు, వంచించు 2. ఓడించు, జయించు, పోగొట్టు; అ.క్రి. తప్పించుకొని తిరుగు, నక్కినక్కి తిరుగు అని అర్థాలు. (తె.వ్యు.కో.) రూపాం. కికురించు = లాలనచేయు అని ఆం.ధా.మా.

"కిక్కిరించిన యాసలఁ గిందవేసి మోక్షము
నిక్కినిక్కి చూచేవారు నీ దాసులు" 1-493

"చుక్కలు మోవిఁబొడమె చూపులు గెంపు
దడమె
కిక్కిరించిన కళలు గిజ్జిడిగొను" 12-389

"తక్కిన నా తమకము తనపైఁబొలియఁగాను
కిక్కిరించి నాపై దయ కెరలునే కదవే" 28-327

**కిగ్గాడి:** విశ. అల్పమైన, నీచమైన, పనికిమాలిన, సోమరి (వి. 1. కొరగానివాడు 2. సోమరి 3. అంబేద)

"కిగ్గాడి గుర్రాలు" 8-135

**కిచ్చు:** వి. 'చిచ్చు'నకు కన్నడరూపం. (సం.ప.స. 13 వాల్యూం. 3.పు.) నిప్పు.

"మెచ్చులుగ దడిబెముమీఁద నుంటే నే మాయ
కిచ్చు రేఁగి ముట్టి తమకించకుండఁగలవా"
13-66

**కిటుకులాఁడి:** (కిటుకులు + ఆఁడి) వి. మోసకత్తె, అకార్యాలు చేసే స్త్రీ.

"అటుగాని వుత్తమురాలైనది వోజతో నుండు
కిటుకులాఁడైనది కిందుపడి మెలఁగు" 7-255

**కిట్టు:** (5) స.క్రి. 1. సమీపించు, కదియు, చేరు 2. కవియు, తాకు 3. చంపు 4. సరిపెట్టు కొను (తె.వ్యు.కో.) అనుకూలించు (ఆం.ధా.మా.) సమీపించు, కదియు.

"కిట్టి శ్రీవెంకటేశుఁ గాఁగిలింతురటే
వొట్టుపెట్టుకున్నదాన వూరకే వుండుటగాక"
26-366

"బట్టబయ లీఁడేనని పంతము నీ కింత గల్తే
కిట్టి నా నడుము పిడికిటఁబట్టరాదా" 26-269

**కితకుఁడు:** విశ. 'కృతకుడు' అనే శబ్దానికి వికృతిరూపం కావచ్చు. కపటి.

"మతిలో వెత లేకుంటే మానవీ దీనిపట్టుకు
కితకుఁడవనే అపకీరితైనాఁ బుట్టదా" 7-430

ఈ పదం కితవుడైనా కావచ్చు. కితవుడంటే జూదరి, మోసగాడని అర్థం. పాఠం కోసం రేకులు చూడాలి.

**కిన్నరమీంట్ల యాపె:** వి. వీణను మీటే స్త్రీ.

"కిన్నరమీంట్ల యాపె గిలిగింతలు పేయఁగా
చిన్నదాన నాపై నేల చెయి చాచేవయ్యా" 7-161

**కిన్నరమీటు:** వి. వీణను మీటడం.

**కిన్నెరకాయ:** (4) వి. వీణకు బిగించే పెద్ద

ఎండుసొరకాయ, తుంబీఫలం. (కిన్నెర = ఒకవిధమైన వీణ)

"వెన్నెలతేటలు చూచి విసుగుచు వెళ్ళజల్లీ
కిన్నెరకాయల ముంచి కిమ్మలకును" 7-422

**కిమ్మలన్ :** (4) మాం. 'లోలోపలనే' అనే అర్థంలో 'కిమ్మలనే' అని నేటికీ వ్యవహారంలో ఉన్నదనీ, మెల్లగ, నిదానంగ, గుట్టుగ, రహస్యంగ కావచ్చునని సం.ప.స. (16 సం; పు. 427)

"కిమ్మలఁ దా నన్నీ నెరిగీనని వున్నదాన
యెమ్మె లితరులవలె నెచ్చరించదు" 16-220

అన్ని ప్రయోగాల్లో 'కిమ్మల(న్)' అనే పదానికి పైన చూపిన అర్థాలు సమంజసంగానే ఉన్నాయి. ఐతే 15 వ సంపుటం పీఠికలో "కిమ్మల విషయ కింకరుడై తా, నమ్మడు వోయె నందులకే" అనే కీర్తనలోని కిమ్మ (కిమ) శబ్దానికి సంకల్పమనే అర్థం సూచింపబడింది. 'కిమ్మ' అనే పదానికి విడిగా ఎక్కడా ప్రయోగం కనబడకపోవటం వల్లా, ప్రయోగాలన్నింటిలోనూ 'కిమ్మలన్' అనే ఉండటం వల్లా కిమ్మ అనే శబ్దాన్ని కాక 'కిమ్మలన్' అనే పదాన్ని గ్రహించడమే యుక్తంగా కనిపిస్తుంది. 'కిమ్మ' అనే పదానికి ప్రీతి అనే అర్థం సూ.ని.లో చూపబడింది.

"కిమ్మల సిగ్గులు" 23-426

"కిమ్మల యిల్లాలు" 12-27

మొదలైన చోట్ల ప్రీతిగల ఇల్లాలు అనే అర్థం చెప్పుకోవచ్చు.

**కిమ్మల సిగ్గులు :** వి; బహు. ప్రేమతో కూడిన సిగ్గులు.

"కమ్మ శ్రీవెంకటేశుఁడ కాఁగిలింపించుకొంటివి
కిమ్మల సిగ్గు లెంతేసి కెరలించితివో" 23-426

**కిరుదు :** విణ. తక్కువ, అల్పం, నీచం.

"ఘనమేమి కిరుదేమి కలవెల్లా నీ
తనువుగఁ దెలిసిన తత్త్వజ్ఞానికి" 10-48

"కిరుదురకం, దానికంటె ఇది కిరుదు" అనే మాండలిక ప్రయోగాల్లో పై అర్థమే కనిపిస్తుంది.

(చూ.అ.సం.సా.రా.సీ.మాం - పుట 21)

**కిసరు**[1]**:** అ.క్రి. పగగొను.

"నొసలెల్లఁ జెమరించి నున్నని చెక్కులఁజారె
కిసరి యెవ్వతె యలిగెనో నీతోను" 11-401

"ఉదుటున నడచిన వూర్పులు గిసరెను
యెదుటఁ జెలు లతని కే మనిరో" 24-138

**కిసరు**[2]**:** వి; మాం. 1. దృష్టిదోషం, అంటుసోకటం వల్ల పసిపిల్లలకు కలిగే దోషం (2. కోపవికారం, చూపోపమి, కనుకుట్టు) విణ. వాడి, పదను.

"సరసములాడె నాతో నటలెల్లా విడిచెను
కెరలెను నా మోహము కిసరు విడిచెనే" 21-390

"కింకల మాటలలోని కిసరులు మీ
వుంకువకాఁకలలోని వుసురులు" 7-296

వాడి, పదను :

"కిసరు కనుగొనల జంకెనలు విరసంబులా
రసము లొలికెడి మనోరతులు గాక" 5-126

**కిసుకాటము :** వి. కిసుక కృషిశబ్దభవం. మోటుతనం అని సం.ప.స. (14 సం. 349 పు.)

"అసు(స) దైవుండిన కన్నె నాదరింతురుగాక
కిసుకాటపురతుల గిజిబిజి సేతురా" 14-148

## కీ

**కీఁగన్ను :** వి. 'కీఁగన్ను'కు వ్యావహారిక రూపం. కడగన్ను, కటాక్షం.

"కేరికేరి నవ్వేవు క్రీఁగండ్లఁజూచుకొంటా
యేరా లేదటరా యీమాట నీవు" 11-379

**కీరితి :** వి. 'కీర్తి'కి వికృతి రూపం.

**కీరితి కట్టుకొను :** అ.క్రి. కీర్తిని పొందు.

"కట్టుకో శ్రీవెంకటేశ కడుఁగీరితెల్లా నీది" 27-28

**కీర్తనకెక్కు :** వ.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు.

"నిరతి శ్రీవెంకటేశ నీ కాఁగిటి లోపల
గరిమెఁ గీర్తనకెక్కె కాంతసింగారములు" 26-363

**కీలుగంటు :** వి. కేశబంధవిశేషం, జారుముడి.

"ముదిత కురులనెల్లా ముత్యములు మాణికాలు
గుదిగుచ్చి కీలుగంటు గొన్నది" 9-79

**కీలువట్టుకున్న యాపె :** వి. పత్ని, పాణిగ్రహణం చేసిన స్త్రీ, పెండ్లాడిన స్త్రీ.

"కీలువట్టుకున్నయాపె కిలకిల నవ్వఁగాను
మూలనున్నయాపె తోడ ముచ్చటాడేవు"
26-561

**కీస :** వి. తక్కువ, అల్పం, కొంచెం.

"కగ్గులేనిదానికి కైవశమా బనులెల్లా
కిగ్గాడిదానికిఁ గడ్డా కీసకాట్లు" 27-420

## కు

**కుంకుమగోళ్ళు :** వి; బహు. ఎరుపురంగు గోళ్ళు.

"కుంకుమగోళ్ళతోడ కోరదౌడలతోడ
అంకెల రవిచంద్రనయనములతో
తెంకిసురలఁ గొట్టి ............" 4-157

**కుంకుమరసాలు :** వి; బహు. కుంకుమ కలిసిన నీటిబిందువులు.

"చలిమి బలిమిఁగూడే జంటలమీ చెనకులు
కొలఁది మీర జారీఁ గుంకుమరసాలు" 22-426

"గొప్పలైన చన్నులపై కుంకుమరసాలు గారీ
వొప్పుగ నీ జవ్వనాన నోలలాడె నటవే" 22-383

**కుంచ :** వి. 'కుంచె'కు వ్యావహారికరూపం. క. కుంచ, ఒక విధమైన చామరం, చమరీ మృగం వంటి మృగముయొక్క కుంచెవంటి తోక.

"చన్నులు గదలఁగాను సారెఁగుంచ విసరఁగా
నిన్నుఁజూచి కరఁగీని నివ్వెఱగై యాతడు"
12-227

**కుంచది :** (కుంచె + అది) వి. కుంచెది, చామరం వీచే స్త్రీ.

"వొద్దనె నా కుంచదాని నొగిఁదోటలోఁ గూడఁగా
నిద్దపుఁ గేళాకూళి నీటిలోఁ గంటి" 10-2-91

**కుంచము¹ :** వి. కుంచె, చామరం.

"పుక్కిటి తమ్ములము గొబ్బున నీమైఁ జెదరఁగా
మిక్కిలి నవ్వఁ గుంచమే కాని విసరుచు" 25-52

**కుంచము² :** వి. మానవిశేషం.

"చేరికొల్చిన వారికిఁ జేపట్టుఁగుంచమవు
కోరి నుతించినవారి కొంగుపైఁడివి" 2-173

**కుంచవేయు :** (7) ప.బం; అ.క్రి. కుంచె విసరు, చామరం విసరు.

"చివ్వన రతికిఁ జెరగువట్టేయప్పుడు
నివ్వటిల్లఁ గుంచవేసి నీ వెంట రావా" 16-170

**కుంచె :** వి. చామరం.

**కుంచెది :** (కుంచె + అది) కుంచెతో విసరే స్త్రీ.

"అంటే నీ మాటలకు అడ్డమాడరాదు గాక
నంటునఁ గుంచెదానితో నవ్వవా నీవు" 29-456

**కుంచెవేయు :** (3) అ.క్రి. వింజామర వీచు.

"కోరి సిగ్గుపడి యాపె కుంచెవేయ వచ్చితేను
సారెకుఁబోకముడి జారించవా యపుడు"
7-1123

**కుంచెవేసే ఆపె :** వి. వింజామర విసరే స్త్రీ.

"కొద్ది మీర నది చూచి కుంచెవేసే ఆపె వచ్చి
వద్ద కూచుండుమనుచు వొడివట్టేవు" 7-171

**కుంచెవేసేయట్టి యాపె :** వి. వింజామర విసిరే స్త్రీ.

"కుంచెవేసేయట్టి యాపె కుచ్చలమీది మోచేత
అంచల నూదుకొనేవు ఆయాలుసోక" 7-117

**కుందణపుఁగుత్తిక :** వి. బంగారు కుత్తుక, మంచికుత్తుక.

"కుందణపుఁగుత్తికలో కునుకులే కతలైతే
పందెపురతులకివి పచ్చిదైయె నిలువవా" 24-21

**కుందణపు మేడ :** వి. బంగారుమేడ.

"కుందణపు మేడలోన గూచుండి నవ్వు నవ్వి
అందుకొనీ వేడుకతో నౌభళేశుఁడు" 29-190

**కుందణము :** వి. కుందనము, బంగారము. ఇట 'ణ' కారప్రయోగం కన్నడప్రభావంవల్ల కావచ్చు.

"పురిగొన్న మదనాగ్ని పుటము దాకిన వలన
తరుణి దేహంబు కుందణమువలె నాయ"
5-237

**కుందు :** వి. తక్కువ, న్యూనత.
"ఇందుకే పో వెరగయ్యీ నేమందును
కుందు లేని నీ మహిమ కొనియాడఁగలనా"
2-31

**కుంభినీరమణుఁడు :** వి. రాజు, ప్రభువు; వ్యు. కుంభిని (= భూమి) కి రమణుఁడు (= భర్త) కుంభిని లోని 'న'కారం ణకారంగా మారడం విలక్షణం.
"ఆ రీతి శ్రీవెంకటేశుఁడలమేలుమంగఁ గూడి
కోరిన వరము లిచ్చీఁ గుంభిణీరమణుఁడు"
13-385

**కుంభీపాతకము :** వి. (?) కుంభీపాకము కావచ్చు. నరకవిశేషము.
"కడుఁగుంభీపాతకంబులు గొనరో
బడిబడినమ్మీఁ బాలిండ్ల" 1-42

**కుక్కకాటుఁజెప్పుటేటు :** ప.బం; వి. చెడుగుకు బదులు చెడుగే చేయడం (కుక్క కాటుకు చెప్పుదెబ్బ అని వాచ్యార్థం) చెప్పు + ఏటు అనే చోట టుగాగమం రావడం విలక్షణం.
"యెక్కువైన తిరువెంకటేశునిఁ దలఁచలేక
కుక్కకాటుఁ జెప్పుటేటై కూడె నిన్ని రోతలు"
1-206

**కుక్కనోరి కళాసమగు :** ప.బం; వి. పాడగు, భ్రష్టమగు. (కుక్కనోటి తోలు అగు అని వాచ్యార్థం)
"అక్కడ నా పొట్లువడి యిక్కడ నీ పాటుపడి
కుక్కనోరి కళాసమై కొల్లఁబోయ బతుకు" 1-90

**కుక్కిమంచము :** వి. తాళ్లు వదులై పల్లమైన మంచము.
"కలది కుక్కి మంచము కన్నవారెల్లాఁ బండేరు
తలెతో దొగ్గి నంబలి దావకూళ్లు" 1-370

**కుక్షిఁబెట్టిపెంచు :** ప.బం; అతి జాగ్రత్తగా పోషించు.
"నానాటికి నీకేమి నమ్మీతి మనేదేమి
పేని మమ్ముఁదన కుక్షిఁ బెట్టి పెంచఁగాను"
8-252

**కుచ్చల :** (3) వి. 'కుచ్చెల'కు వ్యావహారికరూపం. 1. పింజె, మడత 2. పావడ, గాగర 3. పిడుకలు చొప్ప మొ॥ వాని ప్రోగు, రాశి.
"సంగలాయఁ గుచ్చలంటా సరుగ నొడివట్టేవు
చెంగటఁ గాకుసేతురా చెలువలను" 19-286
"అలమేల్మంగ పులకలంగమున నుబ్బఁగాను
బలిమిఁగుచ్చల జారి పచ్చిదేరెను" 7-388

**కుచ్చితము :** వి. 'కుత్సితము'నకు వ్యావహారికరూపం. నీచము, అల్పము, కాపట్యం, కౌటిల్యం, త. కుచ్చితమ్.
"వచ్చి వచ్చి నీతో వాపులు చెప్పఁగా
కుచ్చితము లేమిటికి కోమలితోను" 13-131
విణ. నీచము, అల్పము, కపటము, కుటిలము
"పచ్చిదేరే మాటలూ బయలీతమాటలూ
కుచ్చితపు వెంగేల కొనమాటలూ" 13-391

**కుచ్చితురాలు :** (కుచ్చిత + ఆలు) కుత్సితురాలు, నికృష్టురాలు, నీచురాలు.
"ఏమి నేరుచుకొంటివే యెంత కుచ్చితురాలవే
జాముజోయినా మానవు చలమే సాదించేవు"
11-324

**కుచ్చు :** స.క్రి. కూర్చు, చేర్చు, జతచేయు, ప్రియపడు (కోరుచు రూ.కుచ్చు)
"కూడినాడు సంతోసాన కుచ్చి నా కౌఁగిట నేఁడు
కుచ్చి కౌఁగిలించుకుంటే గుఱుతులా (గాక)"
18-360
"కుచ్చి శ్రీవెంకటేశుఁడ గురుతేది అట్లైతే
యిచ్చఁగూడితివి గురుతెటు చూపవచ్చురా"
7-230
"యివ్వల శ్రీవెంకటేశ యింతినిట్టె కూడితివి
కువ్వని పేరైనీకు గురుతాయ నదివో" 14-430

**కుచ్చుఁబులకల పూజ :** వి. అయిరేణి కుండల పూజ, వివాహ సమయంలో ఐరేణి కుండలను ఐదురంగులతో అలంకరించి పంచపల్లవాదులు నింపి పూజ చేస్తారు.

**కుటిలకుంతలి :** వి. వంకర ముంగురులు గల స్త్రీ.

"ఇటువలెనుండు భాగ్యమేమని చెప్పఁగవచ్చు
కుటిలకుంతలి నిన్నుఁగోరి దక్కఁగొనెను"
28-461

**కుటిలాలకి :** వి. 'కుటిలాలక' సాధురూపం. వంకర ముంగురులు గల స్త్రీ.
"కుటిలాలకి మైఁబూసిన కుంకుమగంధపు రసములు
చిటిపొటి చెమటలఁ బెనఁగొని చిప్పిలి రాలఁగను" 5-79

**కుట్టిచాతనివారు :** వి; బహు. సం.ప.స. (2 వ సంపుటం) లో ఈ పదానికి పరిష్కర్తలు చేసిన వివరణం ఇట్లున్నది. "కుట్టిచాతనివారికి = తక్కువజాతి సాతానివారికి కావచ్చునేమో? లేక కుట్టి సైతాన్ అను క్షుద్రప్రయోగము చేయువారు కావచ్చు. మొదటి అర్థములో కుట్టిశబ్దము పట్టి విశేషణము మాత్రమే. 'చాత్తాది' అనుపదము చాతాని, సాతాని అని వ్యవహారములో నున్నది. అది 'చాతని' అను ధాతుజ విశేషణముగ ప్రయోగించినట్లు ఊహింపవచ్చును. జాతితో తక్కువ వాడునై వైష్ణవము పుచ్చుకొన్న బిగువుతో అందరియొద్ద జంకుగొంకు లేక తిరుగువాడని తాత్పర్యార్థము కావచ్చు. కుట్టిసైతాన్ అను క్షుద్రప్రయోగము చేయువాడు కూడ తానూ పెద్ద మంత్రశాస్త్రవేత్తవలె అందరివద్ద జంకుగొంకు లేక తిరుగువాడు అను తాత్పర్యార్థము కూడ సరిపోవుచున్నది. ఈ రెండును పాటలోని ప్రధాన భావమునకు సరిపడుటలేదు" (సం.ప.స. 2 సం. 380 పు.)
"పట్టిన ముద్రుంగరపు ప్రధానికెదురులేదు
కుట్టిచాతనివారికిఁ గొంకు లేదు" 2-237

**కుడిచికట్టు :** ప.బం; అ.క్రి. జీవిక గడపు.
"పుడమికాధారము పురుషోత్తముఁడే
కుడిచి కట్టెడివారు కోటానఁగోటి" 4-183

**కుడుపు :** వి. 1. భోజనం 2. భోజనపదార్థం 3. జీవిక 4. విందు.
"సడిఁబడి కుడిచిన కుడుపెల్ల నినుము
గుడిచిన నీరై కొల్లఁబోయె" 1-124

**కుత :** వి. 'కుతి'కి వ్యావహారికరూపం కావచ్చు. 1. కోరిక 2. కస్తి 3. కుతిలపాటు.
"సతిలేని వానికి జరిగినదే యాలు
కుత దీరుటకు రచ్చకొట్టమే యిల్లు" 2-63
"ఇతరులయ్యాతని కిచ్చకము లాడితేను
కుత దీర మిమ్ము నిట్టె కోపించ నేలే" 20-369

**కుతిలకుడుచు :** (2) ప.బం; అ.క్రి. బాధపడు, కుతిలపడు.
"కుతిలగతి సేసె అటు గాడిద గూసె
కుతిలకుడిచి జనకుఁడు నోరుమూసె" 5-361

**కుతిలపడు :** ప.బం; అ.క్రి. బాధపడు, దుఃఖపడు, కాంతిహీనమగు.
"కుతిలపడు శూద్రకుని గొట్టెముచ్చుగఁజేసె
మతిమాలు కురురాజు మడుగు చొరఁజేసె"
5-760

**కుతిలము :** (4) వి. బాధ, దుఃఖం.
"కుతిలములును దారుణములును తృణీ
కృతములు సేయఁగ గుఱు తొకటే" 1-285

**కుత్తిక :** (9) వి. 'కుత్తుక'కు వ్యావహారిక రూపం. అన్నమయ్య కుత్తిక, కుత్తికె, కుత్తుక అనే మూడు రూపాలనూ వాడినాడు. కుత్తుక ప్రయోగం విరళం.
"పెదవినెత్తురు పేర్చి పెనుగోళ్ళఁజించుకొంటా
కొదలు గుత్తికలనుఁ గూసేరు జీవులు" 3-494

**కుత్తికలోన పావురములు :** ప.బం; వి. రతికాలంలోని కంఠస్వరం (?)
"మిగుల రతివేళను మెరసీఁదా మిన్నెటాను
పగటుఁ గుత్తికలోన పావురములు" 7-520 old

**కుత్తికె :** వి. 'కుత్తుక'కు వ్యావహారికరూపం.
"ఆనకమై నవ్వవేమె అంగన నీ నగవులు
వూని నీ కుత్తికెలోన వుక్కిపోవుఁజుమ్మీ" 9-26

**కుత్తుక :** వి. గొంతు, చూ :- కుత్తిక, కుత్తికె.
"బత్తి గలవానివలె ప్రాణము పోయినదాకా
కుత్తుక బిగించె నిట్టి కొత్త లెందుఁగలవా" 6-60

**కుదురువంటి కైదువ :** వి. చక్రము. (గుండ్రని

ఆయుధం అని వ్యు.)

"కొక్కరవంటి సంకము కుదురువంటి కైదువ

అక్కుమీఁదికొక పూస అబ్బేఁదనకు" 27-393

**కుదువు:** వి. తాకట్టు (కుదువ అని తెలంగాణా వ్యవహారం.) శ.ర. లోను, బ్రౌన్ లోనూ కుదువ అనే పదమే ఉంది. కుదువు అనేది రా.సీ. వ్యవహారం కావచ్చు.

"వాడుక ఇంతికి కుదువుగా నన్నుండమనేవు

కూడి వాని విడిపించుకొనగ వసమా" 7-455

**కుప్ప:** వి. పోగు, రాశి.

"కుప్పగాఁ గుచ్చెల ఎడఁగొంగువట్టి తీసితేను

కొప్పు నెరులఁజెలి మైఁ గప్పుకొనెను" 17-176

"యీడుజోడై జుట్టరి కాలెనసినవారు తాము

కూడిమాడి వుండినదే గురుతులు గాక" 28-15

**కుప్పలుఁదెప్పలు:** (4) ప.బం; బహు. సమృద్ధి, ధారాళము, అసంఖ్యాకములు.

"కొమరెపాయమందుపై కుప్పలు దెప్పలు

వాయ

ఇమడక వుపచారా లేమి సేతమే" 27-596

**కుప్పలుగా గురియు:** ప.బం; అ.క్రి. ఎక్కువగా కురియు.

"హృదయము జిల్లని కుప్పలుగాఁ గురిసీఁ

జెమ్మట" 6-179

**కుప్పళించు:** అ.క్రి. కుప్పించు. కుప్పళించి ఎగిరాడు అని నేటికీ వాడుక. ఎగిరేటప్పుడు, దూకేటప్పుడు కుప్పళించి అనడం ఉంది అని అ.సం.సా.రా.మాం. (పుట.70)

"కుప్పళించెఁ దమకము కోరికలు దైవారె

నెప్పున శ్రీవెంకటేశ నీవు గూడఁగాను" 23-244

**కుప్పవడు:** అ.క్రి. కుప్పగా చేరు, సమూహంగా ఏర్పడు, రాసులు పడు.

"కుప్పవడ్డ యలకలు కుమ్మరింపుఁజెమటలు

చిప్పిలు మోవితేనెలు సేనాసేన" 19-479

**కుప్పవెట్టు:** స.క్రి. రాసులుపోయు.

"ఇచ్చకురాలవు నాకు నితఁడు విడెమియ్యఁగా

కొచ్చికొచ్చి వెంగెములే కుప్పవెట్టేవు" 25-201

**కుప్పె:** వి. కుప్పియ, గొడుగుమీదిగుబ్బ, బొగడ, సవరానికి ఉండే గ్రంథి, శిరోభూషణం, గాజుగిన్నె, బిరడా, కత్తి ఒర చివరి తొడుగు, ఎద్దు మొ॥ వాటి కొమ్ములకు తగిలించే ఇత్తడి మొ॥ వాటితో చేసిన గుబ్బ, మందుగుళిక.

"యెప్పుడు నీ మనసులో నింతిని మఱవకుండా

కుప్పెలువంటి చన్నులు గుఱుతుచూచుకో"

24-589

**కుప్పెకతారము:** వి. చివర అమర్చిన తొడుగు గల కత్తి. రూపాం. కుప్పె కటారము.

"ఇప్పుడు శ్రీవెంకటాద్రి నిరవై శంఖుచక్రాలు

కుప్పెకతారముఁ బట్టె గోవిందరాజు" 12-470

**కుప్పెసవరము:** (8) వి. మూలభాగంలో ఉండే ముడితో గూడిన సవరం, స్త్రీలు దీన్ని తమ శిరోజాలతో కలిపి కొప్పు వేసుకుంటారు.

"కొప్పు వట్టే వది యేమి గుట్టున నన్ను నీ

కుప్పె సవరమున్నదా కొయ్యకాఁడవు" 13-481

**కుమారధార:** వి. తిరుమలకొండపై గల తీర్థాలలో ఒకటి. కుమారస్వామి తారకాసురుణ్ణి చంపి పాపవిమోచనం కోసం తండ్రిని సలహా అడగగా శివుడు వేంకటాద్రికి వెళ్ళి అక్కడ పుణ్యతీర్థంలో స్నానం చేసి స్వామిని దర్శించుకొమ్మని సలహా ఇచ్చినాడట. అప్పుడు కుమారస్వామి తిరుమలకు వచ్చి ఆ తీర్థంలో స్నానం చేసి స్వామిమంత్రాన్ని జపిస్తూ తపస్సు చేయగా స్వామి ప్రత్యక్షమై నీ వీ పుణ్యతీర్థంలో స్నానంచేసి నా మంత్రాన్ని జపం చేసినందువల్ల ఈ తీర్థానికి నీ పేరు వచ్చేట్లుగా "కుమారధార" అనే పేరుతో పిలువబడుతుందని చెప్పి మాయమైనాడట. అప్పటినుండి ఈ తీర్థాన్ని కుమారధార అనే పేరుతో పిలుస్తున్నారని చెపుతారు.

"తా మహిఁ గోరికలిచ్చుఁ గుమారధారయు

పాండవసరసీ" 15 అను. 460

**కుమ్మ:** (?)

"ఆవల నీవల నోరఁ గుమ్మలుగ

నాడుద మీతనిఁ బాడుదము" 3-332

**కుమ్మరదాసుడు:** వి. శ్రీవెంకటేశ్వరస్వామి

భక్తుడు. అతని పేరు కురువరత నంబి. 'కురువ్వురుత్త నంబి' అని సంప్రదాయ అకారాది అను ద్రావిడ నిఘంటువు (తమిళము.) కుండలను తయారుచేసి వాటిని అమ్మి జీవించేవాడు. పని ఒత్తిడివల్ల స్వామి దర్శనానికి ప్రతిరోజూ వెళ్ళేవాడు కాదు. స్వామిని పూజించుకోవాలని స్వామి బొమ్మను తయారుచేసుకొని ఇంటిలోనే పెట్టుకొని పూజించాలనుకొనేవాడు. ప్రతిరోజూ కుండలు చేసిన తరువాత చేతికి అంటుకొని ఉండే మట్టితో పూలను చేసి వెంకటేశ్వరస్వామికి ఆ పూలతో పూజ చేసేవాడట. అతని భక్తికి ముగ్ధుడైన శ్రీవేంకటేశ్వరస్వామి ఆ పూలను స్వీకరించేవాడట. ఆ మట్టిపూలు తిరుమలలోని శ్రీవెంకటేశ్వరస్వామి పాదాల దగ్గరపడేవట. తొండమాన్ చక్రవర్తి ప్రతిరోజూ బంగారుపూలతో స్వామిని అర్చించేవాడు. కాని ఆ పూలు పక్కకు తీయబడి మట్టిపూలు స్వామి పాదాలదగ్గర పడిఉండడం గమనించిన అర్చకులు చాలా ఆశ్చర్యపడేవారట. ఆ విషయం తొండమాన్ చక్రవర్తికి తెలియజేయగా ఆయన కుమ్మరిదాసు దగ్గరకు వచ్చి అతని శిష్యరికాన్ని పొందినాడట. చూ : కురువరతనంబి.

"కుమ్మరదాసుడైన కురువరతనంబి

ఇమ్మన్న వరములెల్ల నిచ్చినవాఁడు" 1-151

**కుమ్మరావమున చెంబు (గోరి) వెదకు :** ప.బం; అ.క్రి. అనుచితమగు పనిచేయు.

"కుమ్మరావమున చెంబు కోరి వెదకనేల

నమ్మిన శ్రీపతిఁ గొల్చి బదుకరో ప్రజలు"

4-135

**కుమ్మరింపువేడుకలు :** వి; బహు. మిక్కుటమైన వేడుకలు.

"చిమ్మిరేఁగఁ గదవే చెమటలెల్లా

కుమ్మరింపువేడుకల గుఱుతులాయ సుమా"

12-176

**కుమ్మరికొక యేఁడు గుదియ కొకనాఁడు :** ప.బం; వి. చిరకాలంగా శ్రమించి సాధించిన ఫలితాన్ని ఒకడు ఒక్కరోజులోనే నాశనం చేయడం.

"కుమ్మరికి నొకయేఁడు గుదియ కొకనాఁడేను

నమ్మి తలఁచిన విష్ణునామంబుచేత" 1-64

**కుమ్మలాడు :** అ.క్రి. ఇది 'కుమ్ముులాడు' కావచ్చు. పొడుచు, నలియగొట్టు.

"గోవుల చన్నులు నోర గుమ్మలాడిన నీ మోవి

యీవల మా కియ్యఁగాను యెంగి లనేమా"

7-92

**కుమ్ముడి :** వి. 'కొమ్ముడి'కి వ్యావహారికరూపం లేదా కుఱు + ముడి = కుమ్ముడి కావచ్చు. చిన్నముడి. జుట్టుముడి, తుఱుము, వేనలి, సిగ.

"చెంత నీ పాదాలొత్తి సిగ్గునఁ గుమ్ముడి జారె

కాంతుఁడవు యింతటను కౌఁగిలించరాదా"

9-10

**కుమ్మె :** (8) వి. 1. పోటు, పొడుపు 2. గంటు, నొక్కు.

"కొమ్మలు పదారువేల గోపీనాథా!

కుమ్మెలాయ మో మెల్ల గోపీనాథ!" 26-187

**కుమ్మెలువోవు :** (2) (కుమ్మెలు + పోవు) అ.క్రి. గాయమగు, గంట్లుపడు, నలుగు.

"కమ్మటి నాపె యే రీతి కాఁగిట బిగించెనో

కుమ్మెలువోయి గుబ్బలు గురుతున్నవి"

28-286

**కుయివోవు :** (కుయి + పోవు) ప.బం; అ.క్రి. ఆర్తరక్షణకై పోవు, విడిపింపబోవు, రక్షకంగా పోవు.

"చేరి తమ వూరివారి చెఱవట్టుకొని పోతే

కోరి కుయివోయి తెచ్చుకొన్నట్టు" 2-5

**కురివేరగు :** అ.క్రి. (?)

"మచ్చిక నీవె కాఁగిలి మరువపు నవలాయ

కొచ్చి కాఁగిటిరతులు కురివే రాయ" 28-460

**కురుఁబస :** వి. కొద్దికాంతి, లేతకాంతి.

"వరుసఁ గంటపువ్రాలు వాసెఁగొనగోరనే

కురుఁబసల నీవు చెక్కులు గిల్లఁగా" 5-319

ఇట కురుఁబసల అనే పదానికి చెక్కులు అనే పదంలో అన్వయం.

**కురుచబుద్ధి :** వి. అల్పబుద్ధి.

"అరగునా దుర్బలున కరుదైన యన్నంబు
కురుచబుద్ధులను నరమిగొనుఁగాక" 1-242

**కురువరతినంబి :** వి. సంప్రదాయ అకారాది అను ద్రావిడాంధ్ర నిఘంటువులో కురుమ్బరుత్త నంబి అనీ, భీముడు నామాంతరమనీ ఉన్నది. (పు. 466) ఇతడే కుమ్మరదాసు ; చూ. కుమ్మరదాసు.

"కుమ్మరదాసుడైన కురువరతినంబి
ఇమ్మన్న వరము లెల్ల నిచ్చినవాఁడు" 1-151

**కురువేరు చప్పరము :** వి. వట్టివ్రేళ్ల చప్పరము.

"చలువైన కురువేరు చప్పరములోఁబన్ని
తలకొన్న వట్టివేళ్ల దడియుఁగట్టి" 7-444

**కులకశోభనము :** వి. కులాన్ని శోభింపజేసేది (?)

"కులకశోభనము కాకుత్స్థనామము" 15-43

**కులకాంత :** వి. పతివ్రత.

"చేకొని నన్నేలినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
యీ కులకాంతలలో నీ వెవ్వరిఁబోలుదువే"
29-351

**కులమునాలు :** (2) (కులము + ఆలు) కులస్త్రీ, పతివ్రత.

"వలపు రచ్చల వేసేవారు గలరా
కులమునాండ్ల నింత గోరసేయవలెనా" 11-447

**కులుకు :** అ.క్రి. 1. వయ్యారంగా కదలు 2. శోభించు, ఒప్పు 3. మిక్కిలి సంతోషించు 4. ప్రకటమగు.

"కులికి నవ్వకువే కొప్పు వీడీని బెట్టు
పలుకకువే మోవి బయలయ్యీని" 5-83

**కులుకులు :** (2) విశే. అత్యల్పమైన, మిక్కిలితక్కువైన.

"కులుకులు దైవాలఁ గొందరను గడియించి
యెఱిఁగి నెఱఁగ నట్టి యేమి సేసేవయ్య" 3-314

**కులుగు :** అ.క్రి. మునుగు; 'ఘనీభవించు' కావచ్చునని సం.ప.స. (16-427 పు) కుర్గు = to shink అని కిట్టెల్.

**కులువ :** (?)

"ఏమే సంగతెరగ మింతిరో నీవు
ఆమె కులువ చరించ కయ్యో నీవు" 11-74

**కుల్లు :** అ.క్రి. బాధపడు (?)

"మేదరింటి లంజవోయి మేదినీశుఁ దగులఁగ
గోదిలి కువిటు లెల్లఁ గుల్లినయట్టు" 4 అను. 31

**కుళకము :** వి. 1. చేదుపొట్ల 2. పుట్టి 3. ఒక క్రియతో ముగిసిన పద్యాల సమూహం. నిఘంటువుల్లోని ఈ మూడర్థాలు ఇట కుదరవు.

"కుళకమగు సాత్వికపు గుణమేడ నేనేడ
కలియుగంబిది యిందుఁగలవాడ నేను" 2-408

**కువాడము :** వి. 1. కపటచేష్ట 2. కాపట్యం 3. హాస్యం, పరియాచకం 4. వాహనం వీపుపై కప్పే చిత్రవస్త్రం 5. ఓర్వలేనితనం 6. కుత్సితపుపని రూపాం. కువాళము (కుత్సితమూ, కువాళమూ లేని వాడని రా.సీ.లో వ్యవహారం)

"కువాడానఁ జెప్పరాని గురుతు కన్నులఁజెప్పి
నివాళివలపు చల్లె నీమీఁద నాకె" 7-530

**కువ్వ :** (12) వి. కుప్ప, పాతర.

"గవ్వ వోరయవచ్చునా కక్కసించ నిఁక నేల
కువ్వగాఁ బోసిన తన కొలువులోదానను"

**కువ్వలువడు :** ప.బం; అ.క్రి. కుప్పగూలు, త్రెళ్లిపడు.

"ఇవ్వల నప్పటి నిన్ను నింటికిఁ బిలిచితేను
కువ్వలువడఁగ నాపె కోక వట్టి తీసేవు" 12-454

**కువ్వవోయు :** (కువ్వ + పోయు) అ.క్రి. రాశిపోయు.

"నవ్వులు సెలవులను నానవేసి నానవేసి
కువ్వవోసె వలపులు గురుతుమాటలను"
28-102

**కువ్వసేయు :** (కువ్వ + చేయు) అ.క్రి. రాశిచేయు.

"దువ్వటము కొంగంటేవు దూరిదూరె
కువ్వసేసే వేమే వాని కోరికోరి" 22-489

**కుశీలికాఁడు :** విశే. (కుశీలి + కాఁడు)
చెడ్డస్వభావం కలవాడు.
"మచ్చిక బందిలివెట్టే మాయకాఁడ
కుచ్చితపు నేరుపుల కుశీలికాఁడు" 10-2-83

**కుసిగుంపు :** ప.బం; వి. శ్రమ, బాధ (శ.ర.), పగలు.
"కొసరి కొసరి నిన్ను గూడినట్టిదానను
కుసిగుంపు నీ వలపు గోర సేసేనా" 10-2-83
"కోరి తెచ్చుకొన్నవాఁడే కుసిగుంపుసేసితేని
కూరిమికిఁ బెనగేది కూళగాదా" 14-550

**కుసిగుంపు సేయు :** మాం. బాధించు.
"కోరితెచ్చుకొన్నవాఁడే కుసిగుంపుసేసితేని
కూరిమికిఁ బెనఁసేది కూళగాదా!" 14-550

**కుస్తరించు :** 1. ఊరడించు, ఓదార్చు 2. తాల్చు, ధరించు 3. సేవించు 4. శాంతపరచు 5. లాలించు, బుజ్జగించు 6. లాలనకై చేతితో తట్టు 7. కప్పు 8. గుప్పించు 9. ఆజ్ఞాపించు 10. ఉల్లాసపెట్టు, సంతోషపెట్టు.
"కొసరి దూరేపోట కుస్తరించక తీరదు
పొసఁగిన రతివేళ బుజ్జగించక తీరదు" 22-91

## కూ

**కూఁకట :** వి. 1. చుంచు, జుట్టు, సిగ 2. పిలుపిజుట్టు. (పుక్క.)
"పిన్నజాతు విభవోగ పెనచి కూఁకటితోడ
పచ్చి తీగ తోఁకగూడ బంధించి కట్టి" 2-165

**కూఁగు :** అ.క్రి. క్రుంగు.
"పొన్నపోతచుటయును
పొరిఁ గూఁగులు యొజాని" 7-37 old

**కూఁక :** వి. కేక, ధ్వని, ఆర్తనాదం.
"మెచ్చితేని మేకులు మీరితేని కూకులు
యిచ్చకొలఁది నడఁతు వేమందురా" 11-215
"పత్తుసంటాఁ జెప్పించేవు వడ దాకి కూకులును
వత్తులునై పోదుగాని వచ్చి యాడరాదా"
12-322 old

**కూఁకటపాయము :** పిల్లజుట్టు గల వయస్సు, లేత వయసు, శైశవం, బాల్యం.
"కాఁకల నెయ్యి గాఁచి గసివెట్టీ పారెపొరె
కూఁకటపాయపు నీకు గొల్లెత" 27-503

**కూఁకటవేరు :** వి. తల్లివేరు; రూపాం. కూకటివేరు, ఆధారభూతం.
"ఆవలఁజూడఁగఁజల్లనైపుండుఁగాని
తేవలఁగూఁకటవేళ్లు తెగఁబారును మిగులా"
10-60

**కూకులు వత్తులగు :** అ.క్రి; ప.బం. కృశించు, బహిరంగపడు, ఎక్కువ కలత చెందు, ముక్కలు ముక్కలగు, చెదరు, తుత్తునియలగు. (అసహ్యపడు)
"రాకవుండిన విభుని రమ్మని పిలువఁబోతే
కూకులువత్తులే కాక కూరిమంటీనా" 14-299
పాండురంగ మాహాత్మ్యంలో ఈ పదబంధ ప్రయోగం కనిపిస్తుంది.
"అక్కొండొక బ్రహ్మచారి మదిఁగూకులు
వత్తులునై యసద్గతిన్" 5-244

**కూకులు వత్తులగు :** ప.బం; అ.క్రి. కలవరమొందు అని ఆం.క్రి.మ.దీ. చితికిపోవు, పొడిపొడియగు.
"చేకొని యొకతె యింటి సిగ్గివడి వెళ్లి వచ్చి
కూకులువత్తులుగాను కూళదాననా" 11-189

**కూగూగు :** (కూగు + కూగు) గోగో అని అరచు; (కూగు = to cry aloud, to cry out కూగు – కూకు – a cry, a clamour, a shout తెలుగున నిది కూక అను రూపమున నున్నది – కూకపెట్టు (కిట్టెల్ పదకోశము) అని సం.వా. పద. భాషా ప్ర.వి. పుట. 441
"నెలఁతల దోఁచెనే నీళ్లాడఁగానే
కొలనిదరిని దొంగ కూగూగు
బలువైన పుట్ల పా లారగించేని
కొలఁది మీఱిన దొంగ కూగూగు" 6-55

**కూచి :** వి. 1. దండయాత్ర 2. యుద్ధవాద్యాన్ని వాయించడం 3. వాడిమి, పదును (నైశిత్యం, రణవాద్యం అని ఆం.ప.ని.)

**కూచుండఁబెట్టు :** (16) స.క్రి. కూర్చొబెట్టు.

"పెక్కు కానికె లొసఁగి పీటపైఁగూచుండఁబెట్టి
గక్కన నీ మనసెల్లఁ గరఁగించెను" 23-109

**కూచుండు:** అ.క్రి. కూర్చుండు. అన్నమయ్య ఒకటి రెండు చోట్ల మాత్రమే కూర్చుండు అనే రూపాన్ని వాడినాడు. తక్కిన చోట్లంతటా కూచుండు అనే రూపమే. వందకు పైగానే దీనికి ప్రయోగాలు ఉన్నాయి. ఈ రూపం ఆం.ధా.మా. లో చూపబడింది. (128 పు.)

**కూచుండుకొను:** అ.క్రి; మాం. కూర్చొను. రా.సీ. మాండలికంలో కొన్ని ధాతువులపై విలక్షణంగా 'కొను' అనుప్రయుక్తమై కనిపించడం సహజం.

"సంగడిఁగూచుండుకొంటూ సమ్మతులు
సేసుకొంటూ
అంగజరతుల కెంత ఆస చూపేవే" 28-292

**కూటువ:** సాధనసంపత్తి.

"కూటువతో స్వర్గాదిలోకములఁ గోరి వెదకినాఁ
గనరాదు"

**కూటువవేళ:** వి. సంభోగవేళ. (కూటువ = సాంగత్యం, కూటమి, సంభోగం, గుంపు ప్రోగు)

"ఏటికి వేగిరపడే విపుడు నీవు
కూటువవేళ నే నిన్నుఁ గొసరేఁగాక" 20-576

"మాటలఁదేటలు చల్లి మగువ లిద్దరిమీఁద
కూటువఁబాదాలు చాఁచి కొలువున్నాఁడు"
20-526

**కూడఁగొట్టు:** ప.బం; స.క్రి. ఇది 'కూడఁగట్టు' కావచ్చు. కూడ తీసుకొను, తనతో వచ్చేట్లు చేయు.

"వేడుక నాతని నింకా వేఁడుకొందువు గాక
కూడగొట్టు గాలి నేల కోపగించేవే" 29-202

**కూడపెట్టు:** ప.బం; స.క్రి. ఒకచోట చేర్చు.

"వేడుక నీ కైతేఁజాలు వేవేలు సతులను
కూడపెట్టి పెండ్లాడు కానివయ్యా"

"మొక్కుచు వైష్ణవులనే మునిసభ గూడపెట్టి
చొక్కుచు శ్రీపాదతీర్థ సోమపానము నించి"
2-148

**కూడపెట్టుకొను:** స.క్రి. ఒకచోట చేర్చుకొను, దాచు.

"కుచ్చితమే నీవైతేఁ గూడపెట్టుకొందు గాని
యిచ్చకురాల నేనైతే నింత పని కోపరా"
17-384

**కూడపోయు:** ప.బం; స.క్రి. కూడబెట్టు, రాశిచేయు.

"గోవిందనామ మొకటి కూడపోసిఁ
బుణ్యములు" 9-8

**కూడామాడా నుండు:** ప.బం; అ.క్రి; మాం. కలసిమెలిసి ఉండు. నేటికీ ఈపదం వాడుకలో ఉందని ప.పా.

"వాడూ నేనూ కూడామాడా కలిసి తిరిగినాము"

"కూడామాడా నుంటేఁ జాలు గోరఁ గీరితే
నేమాయె
ఆడరా యేమైనా మాట లవుఁగాదనేనా" 23-481

**కూడించు:** స.క్రి. పొందించు.

"కులమెంత గలిగెనది కూడించు గర్వంబు "
8-222

**కూడిమాడి ఉండు:** ప.బం; అ.క్రి. కలసిమెలిసి ఉండు. నేటికీ ఈ పదం వాడుకలో ఉందని ప.పా.

"వాడూ నేనూ కూడామాడా కలిసి తిరిగినాము"

"కూడి మాడి వుండి నీతోఁ గోపగించితి ననేవు
వాడికె వారి నవ్వులు వచ్చీనా మాకు" 27-327

**కూడిమాడు:** అ.క్రి. పెనగు (?) సారంగ. 1-109 కలసిమెలసి వర్తించు, కూడివచ్చు.

"కూడిమాడి వుండి నీతోఁ గోపగించితి ననేవు
వాడికెవారి నవ్వులు వచ్చీనా మాకు" 27-327

**కూడుకుండు:** (కూడుక + ఉండు) అ.క్రి. కలిసి ఉండు.

"కూరిమిఁగొందరు నన్నుఁగూడుకుండినా మేలు
మేరతో విడిచి నన్ను మెచ్చుకున్నా మేలు "
3-15

**కూడు చీర గాని చోటు:** ప.బం; వి. ఏమాత్రమూ జీవిక లభించని చోటు. అన్నవస్త్రాలు లభించని

చోటని వాచ్యార్థం.

"కూడు చీరగాని చోటై కొరగాని పాటై
వాడివాడి వేసారితి వదలి వేసారితి" 1-88

**కూడువేడయితే కూర్పై చేచాచినట్లు :** నానుడి; ఒకటి అనుకూలంగా లేకపోతే మరొకదానిని ఆశ్రయించు.

"గుక్కుచు కూడు వేడెయితే కూర్పై చే
చాచినట్టు
మక్కళింపు వెడమాయ మామీఁదనో వోరి"
17-451

**కూతవెట్టు దవ్వు :** వ.బం; వి. కూత వేస్తే వినబడేంత దూరం, కూతవేటుదూరం, కొంచెం దగ్గర, రాతివేటు దూరం మొ॥ ఇట్లాంటివే.

"కూతవెట్టు దవ్వె సుఁడీ కోరి పిలువ నేర్చితే
బాఁతి హరినామముండి పాలించే చోటు"
15-134

**కూను :** క్రి.విణ. నిండుగా, పూర్తిగా. (తె.వ్యు.కో.)

"కూను వంగి యింటింటఁ గోర నేల వేఁడ నేల
యీ నెపాన లోకమెల్లా నేలరాదా తాను" 2-415

**కూపనరకము :** వి. నరకకూపం, నరకమనే పెద్ద బావి.

"కూపనరకమునఁ గుంగి వెనకకు నే
బాప విధులనెల్లఁ బడితిఁగాని" 1-3

**కూపములోని కప్ప :** వి. బావిలోని కప్ప (కూపస్థ మండూకము) అని శబ్దార్థం. తానున్నచోటే సర్వమూ అని భావించేవాడు అని భావార్థం.

"పాపపుణ్యకర్మదేహి పసిరికాయపురుగు
కూపములోని కప్ప దుర్గుణబద్ధుఁడు" 15-378

**కూపెట్టుసదువుల కొనల పేరిటివాఁడు :** వి. వేదాంతములందు ప్రతిపాద్యుడు, విష్ణుమూర్తి. (కూపెట్టు సదువులు = వేదములు, వాటికొనలు = ఉపనిషత్తులు, వేదాంతం)

"కూపెట్టు సదువుల కొనల పేరిటివాఁడు
పూపకొడుకుఁగని బూము లేలేటివాఁడు" 24-13

**కూబ :** వి. గూబ, గుడ్లగూబ.

"చీఁకటిఁ బెడబాపేటి చేరువ సూర్యోదయము
చీఁకటి కూబలకైతే చిమ్మిరేఁచును" 15-136

**కూరవండి కసవేరు :** (6) వ.బం.

1. సిద్ధాన్నముండగా గడ్డికోసం వేకారు, కూర ఉండగా గడ్డికోసం వెదకు, తగని పని చేయు. (పద.)

"యీ రీతి శ్రీవెంకటేశ ఇన్నిటా నీ శరణని
కూరవండి కసవేరఁ గోరీనా జీవుఁడు" 3-175

**కూరాకుసే(జే)యు :** వ.బం. 1. నలిపివేయు 2. బాధించు.

"కొప్పువట్టి తీసి నిన్నుఁ గూరాకు సేయఁగరాదు"
13-63

"చెలఁగి కూరాకుఁజేసేవు నీ
తలమీద నుండే తరుణిఁ బో నేను" 12-193

**కూరాకు :** వి. కూరగా వండుకునే ఆకు, ఆకుకూర.

"పోరుకుఁజాల కిందుకుఁ బుత్తెంచిన విడె మిదే
కూరాకువలె నాయ కోపవు నాచేతను" 7-213

**కూరాడు :** అ.క్రి. కూడి ఆడు.

"గచ్చకాయలాడే నిన్నుఁ గాఁగలించుకొని వట్టి
కొచ్చి కొచ్చి చన్నులనే కూరాడిరి" 21-231

**కూరాడు :** వి. కలి, ధన్యామ్లం పులియబెట్టిన కడుగునీరు.

"ఎదుట యశోద దెచ్చి యిట్టె చూపఁబోతేను
అదన నీరాళ్లఁ గూరాళ్లన్నియుఁ బాలైనది"
26-56

**కూరిములు :** (21) వి; బహు. 'కూరిమి' శబ్దానికి బహువచనం. కూరుములు అని సాధురూపం. అన్నమయ్య ప్రయోగించిన 21 రూపాలూ కూరిములు అనే. ప్రేమలు, అనురాగాలు.

"కూరిములే కదవమ్మ కోపమయ్యీని కడు
భారమైన పోటు గాదా పచ్చిదేరే పలుకు" 5-199

**కూరుచుండు :** అ.క్రి. కూర్చుండు. అన్నమయ్య 'కూచుండు' అనే రూపాన్నే పెక్కుచోట్ల వాడినాడు. ఒకటి రెండుచోట్ల మాత్రమే 'కూరుచుండు' అనే ప్రయోగం కనిపిస్తుంది.

"కొంకక నావద్ద నిట్టి కూరుచుండఁగా
సంకెలెల్లాఁ బాపి నిన్ను జాణఁ జేసే విపుడు "
20-440

**కూరుసుందు :** ప.బం. 'కూర్చుండు'కు జానపద వ్యవహారరూపం.
"కొండపడ మేడలలో గూరుసుందు మనవే
నిండు నెమలిగురులు నెత్తికెక్కను" 11-93

**కూళఁడు :** వి. 1. మూఢుఁడు, అవివేకి 2. పిసినిగొట్టు 3. దీనుఁడు 4. క్రూరుడు 5. చెవిటి 6. పేదవాడు రూపాం. కూళ.
"వేళ లేదు జాడ లేదు వీనితోడదే పాటు
కూళఁడనై తిరిగేను గుణమేది నాకు" 3-457

**కూళతనము :** వి. 1. కక్కుర్తి, దైన్యం 2. పేదరికం 3. పిసినారితనం 4. తులువతనం 5. మూర్ఖత్వం.
"కూళతనమొ బత్తి గొట్టమునఁ బెట్టఁబోతే
ఆలసించ కిఁక లేవే ఆకెతోఁ జెప్పుదము"
11-342

**కూవ :** వి. కువ్వ, రాశి, పోగు.
"శ్రీవెంకటేశుఁడు సేస శిరసుపైఁ జల్లితేను
కూవగాఁ గొప్పులో దాఁచుకొనేవేమే" 7-176
"కూవలై నీ మేన జాజుకొన్న పులకవిరులు
మోవ నితనిఁ గూడఁగా ముద మాయను"
24-236

**కూవలు చేయు :** ప.బం. రాసులగు.
"కూవలు చేసే వలపు గోవిందరాజు పిల్లఁ
గోవిలోనే మాటలాడీ గోవిందరాజు !" 19-261

**కూహకము :** వి. (?)
"వూహాపోహలు సారె వువిదతో నేవే
కూహకము లేల పతికొంగుపట్టి తియ్యవే"
41-144

## కె

**కెంపువ :** ఎఱ్ఱనిది, ఎఱ్ఱన.
"కెలసి తన కన్నులను కెంపువగాఁ జేసేసీ నే
నెలఁత భీకరముగా నేఁడు నవ్వీనే" 6-22

**కెచ్చురేగు :** (2) అ.క్రి; ప.బం. విజృంభించు (?)
"ముచ్చటాడఁ గలిగెఁగా ముదిత నీ కొక్కతైనా
కెచ్చురేగి నాతో నలిగినవేళను" 23-48

**కెదటు :** అ.క్రి. నిఘంటువుల్లో ఈ పదం కనిపించదు. ఇది కన్నడపదం. To scatter, to expand ఇత్యాదిగా కిట్టెల్. దాని సన్నిహితరూపం కావచ్చు. వ్యాపించు, చెలరేగు ఇత్యాది. ఏటికవతల ఉన్నవారిని ఇవతల ఉన్నవారు గిలిగించితే అది అంత దూరము వ్యాపించునా అని కావచ్చు. (సం.ప.న. 22 సం.) ఎడమగుచు అనే అర్థం కూడా చెప్పవచ్చు.
"కదియక ఆడనుండే కత లేల చెప్పీని
కెదటుచు నేటావలి గిలిగింత లంటునా" 22-2

**కెమ్ములన్ :** 'కెమ్ములన్' అనేది నిఘంటువుల్లో కనిపించదు. ఇది 'కిమ్ములన్' అని కావచ్చు. మెల్లగా, గుట్టుగా, లోలోపల అని అర్థాలు.
"ఉమ్మడి నెవ్వతె గోరుకుండెనో నీ వెంట్రుకలు
కెమ్ములనే నా పిడికిటఁ జిక్కను" 7-424

**కెలను :** వి. 1. పార్శ్వం, పక్క 2. సమీపం 3. దిక్కు.
"కెలనఁ జుట్టుకొనే తీఁగెలవంటి చేతులది
వులుకు గాలి వంటి వూరుపులది" 22-56

**కెలయించు :** స.క్రి. విజృంభింపజేయు, ఉత్సహింపజేయు.
"చొక్కుచుఁ గాఁగిట నించి సురతము చవి చూపే
యెక్కువల కెలయించే దెఱుఁగరాదా" 23-186

**కెలయు :** (31) అ.క్రి. 1. విఱ్ఱవీగు, గర్వించు 2. కేరు, చెలరేగు 3. వేడుకపడు, ఉత్సాహపడు 4. కసరుకొను, కోపపడు (శ.ర.) 5. విజృంభించు, వికటించు (వా.ని.) 6. గద్దించు.
"నిలువున నాతఁడు నినుఁగని నవ్వీన
కెలసి బొమల జంకించితివి" 23-591 & 1-109
"దొరకొని కెలసేవు తోడివారు వినఁగానే
మరుతంత్రములలోని మదమా యిది " 23-465

**కెలవాడి :** వి. కిలాడి, టక్కరి.
"అప్పఁడగు కెలవాడి అదె కనకరాయఁడై

కప్పురమను చల్లి చక్కని సతులపైని" 5-14

**కెలవు**: వి. అనురాగం, వలపు, కూడిక, స్నేహం. (రతేచ్ఛ అని ఆం.వ.ని.) (వాంఛ అని వా.ని.)

"కెలవులిట్లు నిన్ను కిందుపరచ నేటికి
పెలవి నే నవ్వి యూకు దిమ్మరేచఁగా" 27-316

"మల్లవు మలవుల మల్లెల కెలవుల
కల్లరి సతవుల జాతి సతి" 5-24

**కెల్లుకని**: క్రి.విశే. వేగంగా.

"కెల్లుకని నీ వెనుక గతువనిని
కెల్లున నీ కెక్కి నరువులు
ఝల్లని రాక్షస సమితి" 1-92

**కెల్లురేగు**: అ.క్రి. విజృంభించు. (తె.వ్యు.కో.)

"కెల్లున నీతో నవ్వి కూడులు మేలు గాక
కెల్లురేగి నిన్ను విసిగించనేటికి" 14-27

**కెల్లొత్తు**: స.క్రి. పెల్లగించు (?)

"క్రియ నిసుక పాతర కెల్లొత్తు నీ మాయ
అయమంది వెడలఁగ జనులకు వశమా" 3-347

**కెళంగు**: వి. (?)

"మీరిన కెళంగు మిరియపుఁ దాళింపుఁ
గూరలు కమ్మని కూరలును" 1-22

**కెళవు**: వి. పక్క, అపమార్గం, పార్శ్వం, దూరం.

"పరకాంతల భంగపరచకుంటే మేలు
దొరకొని కెళవులు దొక్కకుంటే మేలు"

## కే

**కేఁకరించు**: (6) అ.క్రి; మాం. 1. కేకలువేయు 2. సకిలించేరీతిగా ధ్వనిచేయు, కటాక్షించు. స.క్రి. 1. మించు 2. గద్దించు.

"నిలచి నీవు నాతో నెయ్యములు చూపఁగాను
కెలననుండి తాను కేఁకరించీని" 18-563

ఇందులోని అరసున్న చింత్యం.

**కేఁగన్ను**: వి. కీఁగన్ను కావచ్చు. కడకన్ను, కటాక్షం.

"కేరి కేరి నవ్వేవు కేఁగండ్లఁ జూచుకొంటా
యేరా లేదటరా యీ మాట నీవు" 11-379

**కేడించు**: అ.క్రి. క్రీడించు, (?) చలించు.

"కేడించు గాలికిఁ గెరలిన పుప్పొడి
చూడ ధూళి యని వేడుకపడియె" 24-279

**కేదము**: వి. ఖేదమునకు వికృతిరూపం, దుఃఖం.

"కేదమున నోడి గెలిచితినంటా నా
పాదమంటి తీసుకోరా బంగారు మట్టెలు" 6-163

**కేదారి**: వి. కేదారం, పంటపొలం.

"ప్రేమముతోఁ గేదారి పెరిగి పండిన పంట
తేమ రేఁగి ఊటువట్టె తిమ్మనాయఁడా"

4 అను. 41

**కేనము**: (5) వి. 1. మాయ, వంచన 2. న్యూనత 3. బడలిక 4. కొరత. విణ. సాటి, సమానం అనే అర్థాలు నిఘంటువుల్లో కనిపిస్తున్నాయి. అసూయ (ఆ.మూ.) ప్రభాకరశాస్త్రిగారు, వన్నెచోడుడీ పదాన్ని అసూయ మొదలైన అర్థాల్లో ప్రయోగించినాడనీ, కన్నడంలోనూ, తెలుగులోనూ ఆదికాలంనుండీ వ్యవహరింపబడుతున్న పదమనీ తెలిపినారు. (తెలుగు మెఱుగులు. 90 పు.) కిటెల్ -కేణ = envy, grudge. 'కేన మేటికి' అని ప.యో.వి. ప్రయోగం.

"పూనిక లివన్నియును పొందినదాఁకానే కాక
కేనములు తొల్లిఁటివి కెరలించఁ దగునా"

13-169

"పూనిక లివన్నియును పొందినదాఁకానే కాక "

1-48

మానవల్లి వారు కు.సం. వ్యాఖ్యానంలో వట్టి గాంభీర్యము అనే అర్థాన్ని తెలిపినారు.

**కేపులు**: వి; బహు. ఇది 'కైపులు' కావచ్చునని గౌరిపెద్దివారి సూచన; ఉద్రేకాలు, పారవశ్యాలు, మత్తు, అందం.

"కేపుల నిన్ను నుతించి గెలిచె నారదుఁడు హరి
పైపై నిన్నుఁదిట్టి శిశుపాలుఁడు వీగెను హరి"

**కేరడము**: వి. తిరస్కారం 1. ఎగతాళి 2. ఉపేక్ష 3. తిరస్కారపు మాట 4. వక్రోక్తి.

"పవళించుమని నిన్నె బలిమిసేసితిఁ గాక
తవిలి కేరడముతో తన్నునే నవ్వితినా" 26-499

**కేరడములాడు:** అ.క్రి. వక్రోక్తులాడు, హాస్యమాడు.
"కేరి కేరి నవ్వేది కేరడములాడేది
నేరుచుకొంటివి నాలో నీ కేలే నొరట" 26-97

**కేలువట్టుకున్నయాపె:** వి. పాణిగ్రహణం చేసిన స్త్రీ, పెండ్లాడిన స్త్రీ.
"కేలువట్టుకొన్న యాపె కిలకిల నవ్వఁగాను
మూలనున్నయాపెతోడ ముచ్చటాడేవు"
26-561

**కేళాకూళి:** వి. క్రీడాసరస్సు.
"చిప్పిలేవు చెమటలఁ జెలియ కాఁగిలే నీకు
కుప్పళించి మంచి కేళాకూళి ఆయఁగదరా !"
21-296

"చెంగట నాపె యెంగిలిచేతితో నుండుట గని
సంగతిగాఁగేళాకూళి జలకమాడితివి" 14-592

**కేవడము:** వి. (సూ.ని.) ఒక విధమైన డాలు, ఖేటక భేదం.
"సొరిది శేషుని పెద్ద చుట్టు పెనుఁగేవడము
సిరి దొలఁక నొకచేతఁ జిత్తగించి"
4 అను 38. & 5-210

## కై

**కైకొంట:** వి. కైకోవడం, గ్రహించడం.
"ఆపదలు లేని సుఖ మదియె పో విరతి
వోపితేనే కైకొంట వొల్లకుంటే మానుట" 4-223

**కైకొలుపు:** (3) స.క్రి. సమ్మతింపజేయు, ధైర్యంచెప్పు, కైకొనునట్లు చేయు.
"కాదనేదానఁగాను కైకొలిపే దానఁగాను
గీదపోరి యేల సాకిరి గోరేవు" 27-192

**కైతప్పు:** ప.బం; అ.క్రి. పొరబడు.
"కానీ కానీ యందుకేమి కైతప్పీనా
సానఁబట్టి నీ గుణము జవదాఁటనిచ్చీనా"
20-263

**కైతప్పు:** వి; ప.బం. పొరపాటు, ప్రమాదం, (వ్యా.) చేతిపొరపాటు. (వ్యా.)
"కంతుని బలఁగము లివివో కైతప్పే నే మన్నా
సంతంబయ్యీన మీఁదట సందింతువుగాని"
22-34

**కైదివ్వె:** వి. కరదీపిక.
"కానవచ్చిన పనికిఁ గైదివ్వెలిఁక నేల
తానే యెఱుగుఁగాక తతిఁబోరనేలే" 20-568

**కైపు:** వి. మదం, విజృంభణం అని సామాన్యార్థం. కపటం, మోసం అనేవి విశేషార్థాలు.
"బత్తితోడఁ గొంగువట్టి బలిమి సేసినందుకు
చిత్తిణి వంటాఁ గైపుసేయఁడు గదా" 18-229

**కైపుసేయు:** అ.క్రి. విరక్తిగొను.
"కైపుసేసి యిన్నిటాను గడచి శ్రీవేంకటేశు
నోపి శరణని మనే దొక్కటే సుండీ" 4-108

**కైమీరు:** అ.క్రి; ప.బం. నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.
"నాములెక్కఁ బంతములు నాలిసేయ నిఁకనేల
కైమీరినందు కతనిఁ గాఁగిలించుకొనవే" 9-237
"నీ మనసే పట్టి నేను నెరవేరుదుఁగాని
కైమీరి చేఁతలు సేసి గయ్యాళించను" 27-504

**కైయొత్తు:** (కై + ఒత్తు) వి. చేష్ట.
"ఆపదలు సంపదలు అందులోని మకరాలు
కాపురపు లంపటాలే కైయొత్తులు" 2-56

**కైరవడి:** వి. తాంబూలవస్తువులతో చేసిన గుళిక. చూ: కైరవడి నాళము.

**కైరవడి నాళము:** వి. తాంబూలంతో కూడ ఉపయోగించు కోవడానికి కాచు లోనైన వస్తువులు చేర్చి చేసిన ఉండ గల నాళం, కాచు వడియం, దీని పొగను పీల్చు నాళము, కవిరిఉండ గల నాళం.
"కైరవడి నాళమున గాంతపై నీ వూదితేను
వూరక నీపైఁ దమ్మల ముమిసె నాపె" 7-124

**కైలాగు:** (7) వి. చేయూత, ఊత.

"మింటిమీఁది తోఁటలమీఁద నీవు నడవఁగ
నంటుచు కైలా గిచ్చి నదిగో నమ్మా" 7-589

**కైలాటము**: వి. 1. మోసం 2. ప్రమాదం 3. కలహం 4. నమస్కారం విశే. కుత్సితమైన.
"కన్నుగీటుటకు నాకుఁ గైలాటాలు పెట్టఁగాను
కన్నవిన్న వారెల్లాఁ బొగడకుండేరా" 10-2-50

**కైలాటాలుపెట్టు**: (4) అ.క్రి. కలహాలు పెట్టు, జగడాలు పెట్టు.
"గరిమ నిద్దరిసంది కైలాటాలు వెట్టితివి
వెరవాతె నింతేసి కావలెనా నీకు" 13-478

**కైవశము**: (6) వి. అధీనం రూపాం. కైవసము.
"దేవలోక మొక్కటే దేవేంద్రు లెందరో
కైవశమై యేలఁగ నొక్కరిదీ గాదు" 2-172

**కైవారించు**: స.క్రి. మొక్కు, పొగడు.
"వందిమాగధులు గైవారింపఁదన దివ్య
మందిరోపాంత ఘనమార్గమునఁ
గోనేటిముందటను" 5-228

**కైవాలు**: (కై + వాలు) ప.బం; అ.క్రి. 'క్రైవాలు'కు వ్యావహారికరూపం. 1. ఒఱగు, పడు 2. గతించు, కడచు 3. పశుపక్ష్యాదులు కిందికి దిగు 4. మ్లానమగు, వాడు.
"కాయపు సుఖములు గంపల నున్నవి
పాయమే కైవాలి పండెనదె" 3-336
'క్రైవాలు' అనే రూపం కూడ ప్రయోగింపబడింది. 6-4 old

## కొ

**కొంకి తెచ్చి ముడిగొంటె కుఱుచ**: ప.బం; వి. చెడిపోయి సరి చేసుకుంటూ కూర్చుంటే ఉన్నది తక్కువై పోతుంది అనుట. దారాన్ని తెంచి తెంచి ముడివేసినట్లైతే కురుచై పోతుంది కదా!
8-175

**కొంకు**: అ.క్రి. 1. సంకోచించు, వెనుదీయు 2. భయపడు, జడియు 3. సిగ్గుపడు. (వ్యా.)
"పొత్తుకు నీవు రమ్మంటేఁ బొలఁతి దా సిగ్గువడి
చిత్తములోఁ గొంకికొంకి చెక్కు చేఁబెట్టి
బత్తి గలితేఁ జేయివట్టి తియ్యరాదా" 11-584
"నిరతి శ్రీవేంకటేశ నీ మరఁగు చొచ్చి నేఁడు
గురుని యానతిచేతఁ గొంకులెల్లాఁ బాసె" 3-8

**కొంకుఁగొసరు**: వి. భయం, సంకోచం అనే అర్థాల్లో జంట పదం. వెనుదీయడం.
"అంకెల గుబ్బలనొత్తి అంతలోనే వేఁడుకొనె
కొంకుఁగొసరెఱఁగని కొమ్మలము" 23-33
"తలకొని బుజ్జగించి దండఁగూచుండఁ బెట్టుకో
కులికి నవ్వఁగ కొంకుకొస గెల్ల మానెను"
13-236

**కొంకుగొసరు**: వి; ప.బం. భయం, సంకోచం అనే అర్థాలలో జంటపదం, వెనుదీత.
"తలకొని బుజ్జగించి దండఁగూచుండఁ బెట్టుకో
కులికి నవ్వఁగ కొంకు గొసరెల్ల మానెను"
13-236

**కొంగు**: అ.క్రి. 1.సంభోగమిచ్చు, కొంగుపఱచు 2.ఒఱగు.
"అంగపువాసనకుఁగా అండకు రాకుండ నేల
కొంగి శ్రీవెంకటేశ కూడితి నేను" 23-492

**కొంగుఁబాలు**: (కొంగు + ప్రాలు) వి; ప.బం. కొంగులోని అక్షతలు.
"కొంగుఁబాలు గదవె పూఁట పూఁట నీ సిగ్గులు
అంగన ని న్నేలేవాఁడు అతిభాగ్యవంతుఁడే"
28-505

**కొంగుపసిఁడి**: ప.బం; వి. కొంగుబంగారం, సులభంగా అందుబాటులో నున్న అమూల్య వస్తువు, కొంగుపైఁడి.
"కడలేని యట్టి వాసి కమ్మిన తంగేటిజున్ను
గుడిగొన్న శీలము కొంగుపసిఁడి" 13-308

**కొంగుపైఁడి**: (6) వి; ప.బం. కొంగుబంగారం, అందుబాటు లోని అమూల్య వస్తువు, సులభంగా పొందదగింది. చూ. కొంగుపసిఁడి.
"యిా రీతి తచ్చనలు యిద్దరికీఁగలదే
కోరినట్టి యాపె నీకు కొంగుపైఁడి కాదా" 27-445
"కోరి నుతించినవారి కొంగుపైఁడి

కొలచినవారల కొంగుపైడితఁడు" 9-130

**కొంగుబంగరువు:** వి. కొంగుబంగారం, అందుబాటులోని అమూల్యవస్తువు, సులభంగా పొందదగింది. చూ. కొంగుపసిడి.

"కోరిన కోర్కియు కొంగుబంగరువు
సారె విష్ణుదాస్యము లోకములకు" 1-439

**కొంగుభత్యము:** వి; ప.బం. కొంగున ముడుచుకొనే బత్తెం, ధాన్యరూపమైన కూలి, వినాయకుని చేట, కొంగుబత్తెము (వ్యు.) సాధారణంగా కూలిగింజలను కూలీలు కొంగులో పోసుకునే ఇండ్లకు వెళతారు. దానిపై వచ్చిన పలుకుబడి.

"ప్రేమవు నీ యధరమే పెట్టరాని జీతము
కోమలి నీ తమ్ములమే కొంగుభత్యము" 5-206

**కొంగుముడియ:** వి. కొంగుముడి, వశవర్తియైనది, ఇష్టమైనది, అందుబాటులో నున్నది.

"కొచ్చి మీ నవ్వినవ్వే కొంగుముడియగా నెంచి
కచ్చుపెట్టి తమితోడఁ గాచుకున్నది" 26-382

**కొంగురొక్కము:** వి. చేతిలోని ధనం. కొంగుబంగారం వంటి శబ్దం. ఈవలసిన డబ్బు. పూర్వకాలంలో ధనాన్ని కొంగులో కట్టుకునేవారు. అందుపై వచ్చిన పలుకుబడి.

"కొలఁది పుణ్యపాపాలే కొంగురొక్కములు పెట్టి
వెలదెంచి బేరమాడ వేగిరమే రారో" 3-170

**కొంగులపసిడి:** ప.బం. చూ. కొంగుబంగారము, కొంగుపసిడి.

"కారణమితఁడే కలిగిన దైవము
కోరినవారల కొంగులపసిడి" 4-261

**కొంగులొడ్డు:** (కొంగులు + ఒడ్డు) ప.బం. సిద్ధమగు, కొంగుపఱచు, సంభోగసుఖమిచ్చు, రతికి సిద్ధమగు. దీనికి నీచకార్యాలకు లోబడు అనే అర్థంలోనే వాడుక.

"వేల నా మట్టె లుండఁగా విభు నేల పట్టేవే
కూళతనముల కేల కొంగులొడ్డేవే"

**కొంగుపట్టు:** (2) అ.క్రి; ప.బం. (కొంగు+పట్టు) దేహి అను, స్త్రీని బలాత్కరించు. (వ్యు.)

"చెంతనుండి యీతఁడే చేరి కొంగుపట్టె నంటా
పంతా లేల దూస్పేవే పలుమారును" 8-496

**కొంచపడు:** అ.క్రి; ప.బం. న్యూనపడు, అల్పత్వంచెందు.

"కొట్టఁగొన కెక్కించుఁ గోరి మొదలికి దించు
మట్టు లే దింతింతని మరియు నీ మాయ" 3-540

**కొంచపు నడుము:** (కొంచెము + నడుము) కొంచెపు నడుము, సన్నని నడుము.

"కొంచెపు నీ నోరి కేలే కొండలంతలు మాటలు
కొంచపునడుమే కాదా కుచగిరులానును" 7-38

**కొంచము:** (3) వి. 'కొంచెము'నకు వికృతరూపం.

"సొంపుల నీ యిచ్చకాలు చుక్కలకంటె గనము
గంపెన నీ గుణమె కొంచము గాని" 9-89

**కొంచముసేయు:** ప.బం; స.క్రి. తక్కువచేయు, వంచించు, మోసపుచ్చు.

"పెంచినఁబెరుగును పెను యింద్రియములు
కొంచము సేసినఁ గుందును" 4-12

**కొంచించు:** అ.క్రి. 1. సంకోచించు 2. తగ్గు 3. మందగించు 4. భయపడు 5. కొసరు.

"అంతలోనె దోసము గాదందుకేమీఁ గొంచించక
సంతోసానఁ జెప్పవయ్యా చల్లఁగా వినేము" 28-385

"మంచముమీఁదికిఁదీసి మన్నించి అంతలోనె
కొంచించి నిద్రవోఁబోతే కొల దాకదా" 8-33

**కొంచు:** అ.క్రి. 1. సంకోచించు, సంశయించు 2. మందగించు 3. భయపడు కొసరు. (తె.వ్యు.కో.)

"కొంత నిలుపఁగరాదు కొంచేవు వొక్కమారే
యింతాఁదీరిన మరి యేమి సేసేవే" 22-83

"కొంచమాయఁ బోరలఁగాఁ గాచితి శ్రీవెంకటేశ
కొంచిన యిన్నాళ్లు నా గుణమేఁటి గుణము" 2-428

"కొంచక పాసి కూడిన గొల్లెతలే చేప్పేరు
నించి మా నోరులు నిండా నేము చెప్పవలెనా"
14-193

**కొంచెపడు:** (3) ప.బం; అ.క్రి. అల్పత చెందు, న్యూనపడు (వ్య.) రూపాం. కొంచెపడు.
"పాలు మావి వుండినాను పరివోవుఁగాలము
కూళ గోష్ఠి నుండినాను కొంచెపడుఁగాలము"
15-270 & 11-2భా.17

**కొంచెపడు:** అ.క్రి. తక్కువపడు, అవమానపడు, సిన్నగిల్లు.
"గాటమైన సంపదల కడలేని పుణ్యుల
కోటికి పడగెత్తక కొంచెపడనా" 5-202

**కొంచెపుదేవునికి కొండంత పత్తిరి:** సామెత; చిన్నవిగ్రహ రూపంలో ఉండే దేవునికి ఎంతోపత్రి సమర్పిస్తాం. విలువగలిగినది చిన్నదే ఐనా గొప్పగౌరవం అని భావం.
"కొంచెపు దేవరకును కొండంతపత్తిరి వలె
మంచుకొని వున్నదిది మోచి గర్వము"
15-226

**కొంటఁబోవు:** (5) ప.బం; స.క్రి. తీసుకొనిపోవు.
"కొంతుల కడవలోన కొరలి దాఁచిన పెద్ద
పొంతకూటికుండఁ గొంటఁబోయె నెవ్వఁడో"
4-57అను. & 5-155
ఈ కొంటబోవుపదం రా.సీ.లోనూ, తెలంగాణంలోనూ వాడుకలో ఉన్నది.

**కొంటవచ్చు:** (2) స.క్రి. తీసుకొనివచ్చు 'కొంటబోవు'కు వ్యతిరేక రూపం.
"ఒనగొన్న తన విభు పెదపెద కన్నుల
గొనకొన్న పొందులెల్లఁ గొంటవచ్చె నిపుడు"
5-205
"కొలఁది లేని సొమ్ములు కొంటవచ్చె నీకు నిట్టె"
11-359

**కొండంత:** ప.బం; అవ్య. అత్యధికం.
"కొచ్చి కొచ్చి యొక కొండంత కనకము
వెచ్చపుఁబోకకు వెలయడిగినట్లు" 3-574

**కొండంత కనకము వెచ్చపుపోకకు వెల ఇడినట్లు:** ప.బం; అవ్య. కొద్దిపాటి ప్రయోజనం కోసమై అమూల్యమైన వస్తువును వెచ్చించినట్లు.
"కొచ్చికొచ్చి యొక కొండంత కనకము
వెచ్చపుఁబోఁకకు వెలయిడినట్లు" 9-285

**కొండగొను:** అ.క్రి; ప.బం. గ్రహించు, పొందు, తీసుకొను.
"దండిగా శ్రీవెంకటేశ తగనిన్నుఁగూడితి
కొండగొంటి నీక నాకుఁ గొప్పవెట్టవయ్యా"
14-358
"పారవైచిన పుల్లాకు బండికల్లె మించినట్లు
కోరినీ ముద్రలు మోచి కొండగొంటి నిదివో"
3-466
"కొండగొన్న సుఖమెల్లఁ గొల్లలాడుదువుగాక
బొండుమల్లె పానుపుపైఁ బొరలఁగ నేఁటికే"
4-28 old
'కొండగొని పో' అని రా.సీ.మాం.

**కొండదవ్వి ఎలుకఁబట్టు:** ప.బం; అ.క్రి. ఎంతో గొప్ప ప్రయత్నం చేసి చిన్నపాటి ప్రయోజనాన్ని సాధించు.
"ఎంత వెఱ్ఱిఁ గొండదవ్వి యెలుకఁబట్టెద నేను
పంతపు శ్రీహరి నా భ్రమ వాపవే" 4-344

**కొండదవ్వుట యెలుక గోరి పట్టుట:** ప.బం; వి. గొప్ప ప్రయత్నం చేసి కొద్దిపాటి లాభాన్ని మాత్రమే పొందడం.
"కొండదవ్వుట యెలుక గోరి పట్టుట దీన
బండాయ సంసారబంధము" 1-321

**కొండదవ్వుట యెలుక పట్టుట:** ప.బం; వి. చూ: కొండదవ్వి ఎలుకఁబట్టు.
"కొండదవ్వుట యెలుక కోరి పట్టుట దీన
బండాయ సంసారబంధము" 1-321

**కొండము:** వి. గుండం (తె.వ్యు.కో.)
"వలపుల రేనికి చెంగలువల కొండము చొర
మొక్కిడి
అలులకు పూఁదేనియ సోయగములు
మెయికొనుడి" 5-352

**కొండలంత:** ప.బం; క్రి.విశే. మిక్కుటమైన, అత్యధికమైన.

"కొండలంత కోరికలు గొచ్చి నినుఁగూడి నంటె

అండనే చనుగొండ లడ్డమాయను" 26-193

**కొండలంత:** విశే. అత్యధికమైన, లావైన.

"కొండలంతలు చన్నుల కొమ్మ

నిన్నుఁగూడఁగాను

అండ శ్రీవేంకటేశ పాయఁగఁ గలవా" 27-18

**కొండలకేగు:** ప.బం; అ.క్రి. అడవులకేగు, అనాథమగు, రక్షకుడు లేని దగు, శూన్యమగు.

"కొఱమాలెను నిజమంతయు కొండలకేగెను సత్యము

మఱుగయి పోయెను వినుకులు మతిమాలెను తెలివి" 1-63

**కొండల కోనేటి వాఁడు:** వి. ఏడుకొండల్లో నెలకొన్న కోనేటి రాయడు, శ్రీవేంకటేశ్వరస్వామి.

"కోపము శాంతము లేని కొండల కోనేటివాఁడు

పాపముఁబుణ్యము లేక బదికినవాఁడు" 5-216

**కొండలతిమ్మఁడు:** వి; చూ: ఏడుకొండల్లో వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామి. 4-352

**కొండలతిమ్మయ:** వి. ఏడుకొండల్లో వెలసిన శ్రీవెంకటేశ్వర స్వామి. (తిరుమల + అయ్యా = తిమ్మయ్యా)

"కొండని యడిగిన వరము లొసఁగు మా

కొండలతిమ్మయ"

**కొండల నునుపులు:** ప.బం; వి; బహు. పైపై మెఱుగులు, నిజం కానివి.

"కొండల నునుపులు కొనకొన మమతలు

అండల కేగిన నదవదలు" 1-24

**కొండలపొడవులు:** (2) ప.బం; వి. అత్యధికములు.

"కొండల పొడవులు కోరిక లింతికి

నిండుఁగుచములై నెరిఁబెరిగె" 7-306

**కొండలప్ప(డు):** వి. ఏడుకొండలస్వామి, వేంకటేశ్వరస్వామి.

"వుండి నీ శరణ మను వూఁతగొని యెక్కితిని

కొండలప్ప! నీ పనేటి కొనఫలము కొఱకు"

4-200

**కొండల మొయిలు మేసినట్లు:** ప.బం. మబ్బులు కొండలపై ఎక్కువగా పారాడినప్పుడు అది చూచి గ్రామీణులు 'కొండ మొగిలి మేస్తావుంది, వానకు బలమబ్బా' అని అంటారు. ఈ వాడుక ఇప్పటికీ రా.సీ.లో ఉన్నది. ఈ అర్థంలో ఈ పలుకుబడి నిచట మాండలికంగా ప్రయోగించి ఉండవచ్చు. (సం.ప.స. 19 సం. 19 పు.)

"కులికి సతిఁగలియుచో గురియుఁజెమటల జడికి

మెలఁగి కొండల మొయిలు మేసినట్లాయ"

19-559

**కొండలరాయఁడు:** తిరుమల కొండలకు స్వామి, శ్రీవేంకటేశ్వరస్వామి.

"నిండుఁబాయము గాయము నీ సొమ్ము

కొండలరాయఁడ నీవే గురి యింతే కాక" 26-26

"కొండలరాయఁడు కోనేటి తిమ్మయ్య

కొండ తలనెత్తి గుఱుతైనవాఁడు" 12-234

**కొండలు పెరుగు:** ప.బం; అ.క్రి. ఎక్కువగు, కొండలుగా పెరుగు.

"కోరేటి కోర్కెలు కొండలు పెరుగు" 8-50

**కొండవంటి:** విశే. అత్యధికమైన, గొప్పదైన.

"కొండవంటి యాస చేత కూళదాన నైతిని"

11-51

"కొండవంటి దొర" 26-532

"కొండవంటి సంతసాన కొల్లున నవ్వవయ్యా"

16-184

**కొండవింటివాఁడు:** వి. శివుడు, కొండ విల్లుగా కలవాడని వాచ్యార్థం.

"కొండవింటివాని గుత్తగొనినయట్టి

కొండుకపాయపుఁగూతురు తండ్రి" 5-235

**కొండవేలు:** ప.బం. సం.ప.స. (21 సం; 386) లో ఈ పదం ఈ విధంగా వివరింపబడింది. "వ్యవసాయదారుడు దున్నీ దోకీ కొటారు చేసి

గాదెలు నింపిన తర్వాత కడపట సిద్ధించెడి ఫలముగా ప్రకరణము బట్టి తెలియచున్నది. వ్యవసాయదారుల సాంకేతిక పదమా! అనిపించు చున్నది. నిఘంటువులలో కానరాలేదు. కొత్త పంట వచ్చినవెంటనే కొండవేలుపునకు నివేదించే పద్ధతి. వ్యావహారికంలో 'కొండవేలు' అయి వుండవచ్చును. అట్టిది ఇంకేదైనా కావచ్చు. తెలుగు వ్యుత్పత్తి కోశంలో దీనికి సమృద్ధి అనే అర్థం చూపబడింది. ఈ అర్థం సముచితంగానే కనిపిస్తుంది.

"యిచ్చట శ్రీవెంకటేశుఁడిన్నిటాను నేరుపరి
కుచ్చి కుచ్చి రతిసేయఁ గొండవేలానాయ"
21-156

**కొండసిల:** వి. కొండచరియ. పలుకు రాయి కావచ్చునని సంపా.

"పిటలుగ నవే నీకు యితవు లైతేఁ గనక
పొలసి మొగళ్ళెక్కి పూవులు గోయరాదా"
27-374

**కొండసేయు:** (3) వ.బం; స.క్రి. గొప్పచేయు, పెద్దదిగా చేయు, కొండంత చేయు.

"అండనున్నాపైఁ జూడక ఆవల వేరొకాపెను
కొండసేసి సారె సారెఁ గొనియాడేవు" 26-392

**కొండాటము:** (2) వి. 1. అన్యచింత లేక ఒకదానియందు మనస్సు లగ్నం చేయడం 2. స్తుతి, పొగడ్త (వ్యు.) సంతోషం. (నీ.శ.)

"కొండుక బాలులతోడ గోవిందరాజా వుట్లు
కొండాటముగఁగొట్టె గోవిందరాజా" 19-261

**కొండించు:** అ.క్రి. కొండెములు చెప్పు, కొండెము శబ్దమునకు అపురూపమైన ధాతు రూపమని సం.ప.స. (16 సం. 426 పు.)

"కొండవేల నెత్తినట్టి గోవిందా నిన్నుఁ
గొండించేరు యశోదకు గోవిందా" 16-325

**కొండించు:** స.క్రి. కొండాడు, స్తుతించు.

"నరహరి యచ్యుత వో నారాయణా
గురుఁడు నిన్నుఁ గొండించెఁ గోరి నే వింటి"
3-489

**కొండిపీట:** వి. కొక్కిగల పీట.

"తట్టి పొంకఁబోతేను బయలెల్ల బందీలె
కొట్టుఁ గొనకెక్కితేను కొండిపీట" 19-93

**కొండుక:** విశ. చిన్నవాడు, వివేకహీనుడు. (వ్యు.)

"రెండు చేతుల యిద్దరికిఁ గాఁగిలిచ్చి యిచ్చి
కొండుక జమళిపెండ్లికొడుకవు నైతివి" 7-183

**కొండుక పాయము:** వి. బాల్యం.

"కొండుకపాయపువారి కొడివేలుంగరమవు
అండనే మెడఁగిలే హారమవు" 14-68 & 6-102

**కొండుకవయసు:** (2) వి. 1. కొండికవయస్సు, చిన్నవయస్సు 2. బాల్యం.

"కొండుకవయసు కొమ్మా గుబ్బలపైఁ బ్రేమపు
టెండ దాకి పులకలు నెన్ను వెళ్లఁగా" 5-118

**కొండుక శిశువు:** వి. కొండిక శిశువు, చిన్న బాలుడు.

"కొండగొడుగుగా గోవులఁగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్ళో" 5-98

**కొండెగోడి:** వి. చాడీలు చెప్పేవాడు.

**కొండెగోడితనము:** (4) వి. చాడీలు చెప్పే స్వభావం. (ఇది కొండెగీడితనమా?) "ఇట 'గోడి' మత్వర్థంలో వచ్చిన ప్రత్యయం.

"ఉండనీరా యీ పాటి వూరకే నన్ను
కొండెగోడితనాలకుఁ గోపమెల్లా వచ్చును"
14-395 & 7-59

**కొండో నుయ్యో:** వ.బం. ప్రాణం తీసుకోవటానికి ఏదిగతో! నుయ్యో కొండో అని రుక్మాం. లో ప్రయోగం. (5-131)

"కొండో నుయ్యో కుమతులాల
తండుముండు తట్టుముట్టు తాఁకైనఁ గనుఁడీ"
1-160

**కొంగ్రఁగొంగ్ర:** కొంగ్ర అంటే మళ్లించి దున్నిన చాలు అని అర్థం.

"గొంటరి సతుల పొందు కొంగ్రఁగొంగ్ర వేయేసి
అంటేవు మా కుచములు అప్పటి నీ విపుడు"
14-45

కొంతపుఁజూపులు: వి; బహు. కుంతము వంటి చూపులు, తీక్ష్ణమైన చూపులు.
"ఎంత చన విచ్చితివో యీపె నీపై వెదచల్లీ
కొంతపుఁజూపుల చూడీకుడుతనాచారు"
23-369

కొంతపు కనుఁగొనలు: వి; బహు. కొంతము (= ఈటె, బల్లెం) వలె తీక్ష్ణమైన కనుఁగొనలు.
"ఇంతి కన్నీ రొలుక నిట్లుఁజదివె
కొంతపు కనుఁగొనల కోపమును చదివె" 5-319

కొంతపుచూపులు: వి; బహు. కుంతము. (= ఈటె, బల్లెం వలె తీక్ష్ణమైన చూపులు)
"దొంతులువెట్టీఁ దోడనె వలపులు
కొంతపుచూపుల కోమలి" 26-450

కొంతము: (2) వి. ఈటె, బల్లెం.
"పంతమాడేవాఁడవు బడిబడి రానేల
కొంతపు నీకు బత్తి గొట్టానఁ బెట్టితిమా" 26-166

కొంప: వి. ఇల్లు.
"పంపుడుదయ్యమై బాధవెట్టెడు యీస
కొంపలోన నుండరానీఁ గోరవా" 1-187

కొక్కు: వి. పందికొక్కు.
"యింటిలోనఁగొక్కు దెచ్చి యిరవుగఁ బెట్టుకొంటే
దంటయై గోడలు వడఁ దవ్వ కేల మాను"
1-476

కొక్కెర: వి. పెద్దకొంగ.
"ఇల నరులఁ గొలుచుటెందో కోకలు వేసి
బలు కొక్కెరలవెంటఁ బారాడుట సుండీ" 3-169

కొచ్చికొచ్చి: (63) కుచ్చికుచ్చి.
"కొచ్చికొచ్చి పారేనా కొనగొన చన్నులను
తచ్చనకు నదిమితే తమకించేవు" 7-568

కొచ్చిచూచు: (3) స.క్రి. కుచ్చి చూచు.
"వుంగరము చూతమని వొయ్యనే వేలు వట్టితే
కొంగువట్టి యీపె నింత కొచ్చి చూచేవు"
18-151

కొచ్చు[1]: (10) స.క్రి. కుచ్చు, గుచ్చు. 'క్రుచ్చు'కు వ్యావహారిక రూపమా? జతచేయు, కూర్చు.
"కొచ్చరో మనుజులార మీరే కథలు
యిచ్చీని శుభములు యివి యెల్లకాలము"
1-338
"అచ్చపు శ్రీవెంకటేశు నలమి కౌఁగిటఁబట్టి
కొచ్చి కూడేవేళ అలుకుడు సేసేస" 12-525

కొచ్చు[2]: (40) స.క్రి. తొలగించు, తొలగు. బ్రౌన్: కొచ్చు = to cut, away, up or to pieces.
"కొచ్చరో మనుజులారా కోరికె లెల్లను మీకు
కోపమెల్ల గలిగిన కొచ్చి శాంతమిచ్చుటకు"
7-196
"యిచ్చకములే సేసి యింతి నిన్నుఁ జెనకఁగా
కొచ్చకుమీ మేనంటూ గుట్టు సేసేవు" 8-127
"పచ్చడము గప్పేనంటా పడఁతులు తొడలపై
కొచ్చేవు నీ మునివేళ్ళు గోవిందరాజా" 23-204
ఈ ధాతువు అంతటా 'కొచ్చి' అనే క్త్వార్థరూపం లోనే ప్రయోగింపబడింది.

కొటారు: వి. ధాన్యాదిరాసు లుండే చోటు.
"కొండలంతలు చన్నులఁ గొటారుకుప్పలు వేసి
పండెఁగట్టుకొమ్మనవే పైఁడిచీర వరచి" 21-156

కొట్టఁగొన: (కొన + కొన) మిక్కిలి కొన. ఇట అరసున్న విచార్యం. ఇది తమిళసంప్రదాయమేమో!
"నిగ్గుల మునులతోడ నీ చదివే వేదములు
సిగ్గుల కొట్టఁగొనల చేఁగదేరీరా" 22-43
"కొట్టఁగొన కెక్కించుఁ గోరి మొదలికి దించు"
3-540

కొట్టము: వి. గుడిసెవలె వేసుకున్న ఇల్లు.
"రచ్చకొట్టాలలోనుండి రాగాన నీలలు వెట్టీ
గచ్చులు సేయుచు కోటిగాఁడు కృష్ణుఁడు"
27-550

కొట్టానఁబెట్టు: స.క్రి. తిరస్కరించు, తీసి పారవేయు, తీసుకుపోయి కొట్టంలో పెట్టు.

"పొత్తుల కూటమి నీకే పుణ్యము గట్టుదు గాక
బత్తి గొట్టాన బెట్టేటి పంతము నా కేలా" 26-179

కొట్టాము: వి. పావడి, శాల.
"గురుతరమగు పెద్ద కొట్టాములోపల
తిరుమైన పెనుమాయఁ దెరగట్టి" 1-163

కొట్టినపిండి: ప.బం; వి. బాగా తెలిసినది, ప్రహతమైనది.
"కూడినవారికి రతి కొట్టినపిండివంటిది
కూడనివారికి కలగూరవంటిది" 7-204

కొట్టు: వి. దెబ్బ, కొట్టడం.
"కొట్టు గొట్టుచు గోపాళులుఁ దాను
అట్టు తోడనే యారగించీని" 23-331

కొట్టువడు: అ.క్రి. 1. దెబ్బతిన్నట్టు లేచు 2. దైన్యం పొందు 3. వ్యయమగు 4. నికృష్టమగు.
"కోపపు శాంతము (?) చేతఁ గొట్టువడ్డప్రాణికి
తాపపు కర్మపువెట్టి తప్పించుకోవచ్చునా" 4-88

కొట్నాలు దంచు: ప.బం; అ.క్రి. ధాన్యం దంచు.
"కూరిమి విషయములకొట్నాలు దంచేము"
3-487

కొట్లాడు: అ.క్రి. దెబ్బలాడు, కలహించు.
"వేడుకకాఁడవు నీవు వెలఁదులఁగంటేను
కూడుక వత్తువు గాని కొట్లాడవు" 7-504

కొట్లుగొట్టు: స.క్రి. దెబ్బ కొట్టు – ఇట మొదటి 'కొట్లు' నామవాచకం. రెండవది ధాతువు. తిట్టు తిట్టు, నవ్వు నవ్వు, చదువు చదువు ల వంటిది.
"కొట్లుగొట్టుచు గోపాళులుఁదాను
అట్లు తోడనే యారగించీని" 23-331

కొతము: వి. రూపాం. కొడమ. చేపలను పట్టడానికి ఒడ్డే సాధనం, వల. (ముఖభాగంలో కట్టు లేదా మధ్యలో వలవలె అల్లిక కలిగిన ఊతవంటి చేపలుపట్టే సాధనవిశేషం.)
"పెట్టించె ఆసలను పెడకొడములఁ దన్ను
తిట్టించె నిజద్రవ్యదీనకులచేత" 1-185

కొడి: వి. 1. దీపశిఖ 2. దీపశిఖ నుండి వెలువడే పొగ 3. దీపంవత్తి మొ॥ దగ్ధాగ్రం – కాలిన చివర 4. లక్షణం, చిహ్నం, స్వభావం 5. జెండా (వ్య.)
"కొడి మిగిలిన నా గోల్లివి కడు వాడి
బడిబడి నీవాని బలమింతే కాని" 24-43

కొడితీగ: వి. ఆకుపచ్చని పూలు పూచే ఒకరకం తీగ.
"కొడితీగ వంటిది నా కోరిక గాఁబోలును
అదరి నీ పొందుల నల్లుకొనీని" 23-309

కొడిదెడు: (కొడిదిలి + ఎడు) ఇది 'కొడిఁగెడు' అని పొరపాటుగా ముద్రింపబడిందా? విఁ. చెరడు.
"కొడిదెఁడు మొగమాపె కోమలపు మేనియాపె
అదరి నీవు తన్నుఁ బెండ్లాడితి వనె" 28-511

కొడిమ: వి. నింద 'కొడిమె'కు వ్యావహారిక రూపం. 1. అపనింద 2. అసత్యం 3. పాపం, దోషం 4. దురవస్థ 5. కష్టం.
"చిడిముడి మరినేమి సిగ్గులు మోవనాడినా
కొడిమ లెన్ని యతనిఁ గోపించరాదు" 24-500

కొడిమలు గట్టు: ప.బం; అ.క్రి. చూ: కొడిమెలు గట్టు.
"పడఁతు లెందరినైనా బడిఁబెట్టుక రా నీవే
కొడిమలు గట్టి తన్నుఁ గోపగించనీఁకను"
24-595

కొడిమె: (5) చూ: కొడిమ.
"కోరి వూరకున్నవారి కింతేసి
కొడిమె లేఁటికి వచ్చీరా" 19-403

కొడిమెలు గట్టు: (8) అ.క్రి. నిందించు, దూషించు, అపనిందలు వేయు.
"కొడిమెలు గట్టుదురు కోపములు చూపుదురు
తడవినంతటిలోనే తప్పులు వట్టుదురు" 19-83

కొడివేలుంగరము: వి. (కుడివేలుంగరమా?) చిటికనవేలు ఉంగరం.
"కొండుకపాయపువారి కొడివేలుంగరమవు
అండనే మెడఁదగిలే హారమవు" 14-68

కొడిసాగు: (4) ప.బం; అ.క్రి. కొనలు సాగు, కొనలుదేరు, వర్ధిల్లు.
"వుడుగని వెలుపటి వుద్యోగమువలె
కొడిసాగేటి మితి కోరికలు" 4-373
"కొడిసాగి కోరికలు గుంపులుగా నల్లుకొని
అడియాస లేల విడె మందియ్యవయ్యా"
28-296

కొడ్డువో: (కొడ్డు + పో) 'గొడ్డుపో' (గొడ్డు + పో) కావచ్చు.
"బిడ్డడంటా నమ్మి యెట్టువెట్టు
కొన్నారిందుకంటె
కొడ్డువో మేలు యిట్టి కొత్త లెందుఁగలవా" 6-60

కొణిక: వి. కొంకి, కాలిమడిమపై భాగం.
"కొప్పులోని సంపెఁగలు కొణికలవెంట జారీ
విప్పక ముడుచుకోవే వేగఁదురుము" 23-46

కొణిదెడు: (కొణిదిలి + ఎడు) విణ. బొటనవేలు కాక తక్కిన నాలుగువేళ్లు వంపగా ఏర్పడిన చేర, కొణిదిలి అంత ప్రమాణంకల, చేరెడు, కంకెడు.
"ముందుముంది మోవితేనె ముంచిముంచి
అంది యిచ్చె
అందీ కొణిదెఁడుమోవి అతివ" 23-220

కొత: వి. ఇది కొంత లేక కొత్త కావచ్చు.
"యితఁడు శ్రీవెంకటేశుఁడేలె నలమేల్మంగను
చతురత నీవూఁగొత సాదించగలవే" 29-464

కొతుకు: అ.క్రి. జంకు, సంకోచించు, వెనుదీయు.
"పతిఁ బెండ్లాడిన యాలు పక్కనుండి నిద్రించితే
కొతికి కాలానుభాగి గొనవచ్చునా" 2-214

కొత్త చెమట: అప్పుడే ఏర్పడిన చెమట.
"హత్తి వుండే చెలులైనా నట్టి తుడుమరు గాక
కొత్త చెమటలెల్లాఁ జూచి కొమ్మలెల్లా" 20-307

కొత్తలు: వి. నాణెములు, డబ్బులు.
"ముడుపులు జాళెలు మొగిడల మూటలు
కడలేని ధనము కొత్తలును" 1-346

కొత్తలు సేయు: (?)
"ఏల కొత్తలు సేసేవు ఇప్పుడే నాతో
మేలు తోడిదాన నౌత మిక్కిలి నెఱఁగవా"
25-15

కొత్తవయసు పడుచు: వి. ముగ్ధ.
"కొత్తవయసు పడుచు గోరికొన సోకింతురా
పొత్తుగ లాలన సేసి పొందులు గాక" 18-19

కొత్త వెంట్రుకల గుబురుల గంతి: కొత్తవెంట్రుకల గుబురుగల మూంసపుముద్ద.
"కొత్తవెంట్రుకల గుబురుల గంతికి
పొత్తుల సంసారభోగము గలిగె" 2-251

కొత్తెన: వి. సంకోచం, జంకు. ఇది 'కొత్తైన' (కొత్త + ఐన) అని కూడా కావచ్చు.
"చిత్త మాతనిమీఁద చేయి చెలియమీఁద
కొత్తెన గమనంబు కొనవేళ్లమీఁద" 6-133

కొదుకు: అ.క్రి. భయపడు, జంకు, మాటలు నమలు. (వ్య.)
"అదిగో వేసరుమనీ నండనే కూచుండవే
కొదికి వట్టి గుట్టున గుబ్బతిలనేఁటికే" 22-334

కొద్దిఁబడు: అ.క్రి. కొంచెపడు.
"చద్దికి వేఁడికప్పటి జాణతనాలాడేవు
కొద్దిఁబడవు పనులు గోవిందరాజా" 9-174

కొనకెక్కు: (9) అ.క్రి; ప.బం. పైకెక్కు, వర్ధిల్లు, ఉన్నతినందు.
"సిబ్బితిపడఁగనేల చింతలఁ బొరలనేల
గొబ్బున మొదలి నీరు కొనకెక్కదా"
4-448 & 1-260
"యెనసిన శ్రీవేంకటేశుఁడే యింతా
కొనకెక్కిన నిజకోవిదునికిని" 4-406

కొనకొన మమతలు: వి; బహు. పైపై మమతలు, కృత్రిమమైన మమకారాలు.
"కొండల నునుపులు కొనకొన మమతలు"
1-24

కొనగోరి గీతలు: వి; బహు. నఖక్షతాలు.
"వెలయాలిచేతలు వింత బయలింతలు

కొలఁదివెట్టరు కొనగోరిగీఁతలు" 17-111

**కొనగోరి గుబుతులు:** వి; బహు. నక్షత్రాలు.

"గుబ్బలపై కొనగోరి గుబుతు లంటిన చోటు
ఉబ్బురమై మృగమద మంటినది చూడవే"
5-165

**కొనగోరి చినుకులు:** వి; బహు. కొనగోరి గుర్తులు.

"మేలు మేలే యితఁడు నేర్పును మెచ్చితి
నన్నిటా నీతని కూటమి
కోలుముంగై యిటులఁగోర్పులు కొనలుసాగ
చిటీఁటిరి"

**కొనగోరి తాఁకులు:** (5) వి; బహు. నక్షత్రాలు.

"వెల్లిగొను సురతపువేళ మరపుల యింపు
కొల్లలాడుటే కొనగోరి తాఁకులు" 1-189

**కొనగోరి రచనలు:** వి; బహు. నక్షత్రాలు.

"కొప్పెరగుబ్బలమీఁది కొనగోరిరచనల
కప్పురము మెత్తిమెత్తి కడు నలసితివి" 5-273

**కొనగోరివ్రాఁతలు:** వి; బహు. నక్షత్రాలు.

"చేసినదెల్లా నీపై చెలి చేసినది చేఁత
వ్రాసినవి కొనగోరి వ్రాఁతలు నివి" 8-53

**కొనగోరిసొమ్ములు:** వి; బహు. నక్షత్రాలు.

"అమ్మరో శ్రీవెంకటేశుఁడన్నిటా నన్నుఁగూడె
కుమ్మరించె నాపై కొనగోరిసొమ్ములు" 9-122

**కొనగోరి సోఁకులు:** వి; బహు. నక్షత్రాలు.

**కొనగోరొత్తులు:** వి; బహు. నక్షత్రాలు.

"విందుల మోవుల యీవులు వీపున నానిన
కుచములు
పొందుల కొనగోరొత్తులు పోలఁతికి నీ కమరె"
7-131

**కొనగోళ్లతాఁకులు:** వి. నక్షత్రాలు.

"కొనబు కొనగోళ్లతాఁకులవి మేని నొప్పులా
నునుపులకు నుబ్బుఁగవణములు గాక" 5-126

**కొనచూపు:** (2) వి. అపాంగం, క్రీగంటిచూపు.

"కొనచూపు దెలుపైన కొప్పు గడు నలుపాయ
నినుపుఁజీకటికి వెన్నెలకు సరియే" 17-544

**కొనచెమట:** వి. (?)

"కొనచెమట జవ్వాదిఁగూడి చెక్కుల జార
అనుఁగుఁజేయి పయి వేయుటది గదా వలపు"
21-519

**కొననాలికె:** వి. నాలుకకొన.

"యిదే హరినామము యదే కొననాలికె
వదలక తలఁచితే వైకుంఠము" 15-206

**కొనపరిది:** (కొనపరి + అది) వి. ఈ శబ్దమపురూపమైనది. అర్థము విచార్యము. 'గుణవంతురాలు' కావచ్చు అని సం.ప.స. (16 సం.) లేదా ఇది గొనబరిది (గొనబు + అరి + అది) కి రూపాం. కావచ్చు. గొనబు అంటే మనోజ్ఞత. గొనబరి = మనోజ్ఞుడు, గొనబరిది = మనోజ్ఞురాలు. ఈ అర్థం కూడా ఇక్కడ యుక్తంగానే ఉంటుంది.

"తనువులిద్దరికిని తతినెపుడు నొకటె
కొనపరిదానఁగాన కూడితి నిన్ను" 16-334

**కొనబు:** ఇది 'గొనబు' కావచ్చు. గొనబు అంటే విలాసం, సొగసు. శ్రావ్యమైన, మంజులమైన, పరిమళంకల, మధురమైన, లేత (వ్యు.ప.కో.) అని అర్థాలు.

"ననిచె నా చెలిఁగంటే నంటు సేతువా నీవు
కొనబైన నా రాక కోరుదువా యెపుడు" 25-44

**కొనబుఁదనము:** వి. అందం, సొంపు, విలాసం .

"కొనబుఁదనాన గోరికొన చూపీ పెండ్లిసేసు
కొనవలెనని నీకుఁగోమలి" 25-182

**కొనబుకాఁడు:** (4) వి. అందగాడు, సొగసుకాఁడు, విలాసవంతుడు.

"కొనబుకాఁడవు నీవు కొమిరె వయసు నేను
పనిలేక వొంటి నుంటేఁ బైకొనేదా" 20-140

**కొనబుతనము:** వి. చూ: కొనబుఁదనము . మనోజ్ఞత, సొగసు.

"కొనబుతనాన మరి గురులెన్ని యుండినాను
చనవుసేసుక మోవి చవిగొనెను" 23-502

**కొనబువాఁడు:** వి. మనోజ్ఞుడు, సొగసుకాడు.

"చెనకి యింకేల వాఁడు శ్రీవెంకటేశుఁడు సాదు

కొనబు వాఁడితఁడిట్టి కూడుమని చెప్పరే"

27-27

**కొనమొదలు :** (2) వి; ప.బం. సంపూర్ణత, ఆద్యంతాలు. ఇది తీగెలు మొదలగునవి పెరిగేప్పుడు కొనలు సాగుటను బట్టి వచ్చిన పలుగుబడి. తీగెసాగు.

"ఘనుఁడగు శ్రీవేంకటపతి గావఁగ

కొనమొద లేర్పడె కొంకే లేదు" 1-492

**కొనలంటులు :** (కొనలు + అంటులు) వి; బహు. విస్తరి కుట్టేప్పుడు ఒక అకునుండి ఇంకో ఆకుకు విడాకులు తగిలించి ఒకరు కుడతారు. ఆ పూర్తి కుట్టుపని మరొకరు చేస్తారు. అంటులు వేయడమనీ, కొనలంటించడమనీ దీనికి వ్యవహారం ఉంది. ఈ విడాకు కొన మొదలు కుట్టి ఉండడంవల్ల కదలకుండా ఉంటుంది. తరువాత పని సులభం. ఆ విధంగానే ప్రకృతం రెండు భావాలు తగులుకొని వీడ రాకున్నవి అని భావం కావచ్చు.

"కనుచూపు తనమీఁద కడునాస రతిమీఁద

కొనలంటులాయ నా గుణ మేఁటిదే" 22-32

**కొనలుఁబారు :** ప.బం; అ.క్రి. వర్ధిల్లు, వ్యాపించు, చిగురొత్తు.

"అన్నిటా సమ్మతించేవే ననలుఁగొనలుఁ బారు

యెన్నేని చెప్పఁగవచ్చు నింతుల వలపులు"

22-492

**కొనలు సాగు :** (3) అ.క్రి. వృద్ధిచెందు, తీగెసాగు.

"కొనలుసాగీ నన్నిటీ కూటువ గూడుకొన్నట్టి

అనంతుఁడొక్కటే మించీ నాదిమూరితి" 2-499

**కొనవాండ్లు :** వి; బహు. 'కొనవాఁడి'కి బహువచనరూపం. కొనలో ఉండే వాడితనాలు. గుణవాచకమైన వాఁడి శబ్దానికి 'వాండ్లు' అనే బహువచనరూపం విలక్షణం.

"కొమ్మా నీ కుచములివి కొనవాండ్లా యింత

యెమ్మె లేల నీకు నందుకేమి వోదురా" 17-75

**కొనవాఱు :** ప.బం; అ.క్రి. కొనవేయు, చిగురించు.

**కొనవేయు :** (2) ప.బం; మాం. అప్పుడే పుట్టిన మేక, గొఱ్ఱె మొ॥ జంతువుల పిల్లలను తల్లి చనుబాలకు అందించు.

"అప్పటి వొలసీనొల్ల నట్టి వలపు నీమీద

నిప్పుడె కొనవేసేది యేటి బ్రదుకు" 14-302

"ఇక్కువ నున్నవారము ఇచ్చాడఁగలముగాక

గుక్కక వట్టి వేడుక కొనవేయఁగలమా" 23-411

**కొనాడు :** (కొని + ఆడు) స.క్రి; ప.బం. 'కొనియాడు'కు వ్యవహారరూపం. ప్రశంసించు.

"అచ్చపు శ్రీవెంకటేశుఁడంతలోనె నన్నుఁగూడె

కొచ్చి తన గుణాలు నేఁగొనాడ నా వసమా"

18-124

"ఇంత చక్కఁదన మిఁక నేమని కొనాడుదును"

10-28

(కొనేడు అనే రూపంకూడ ఉన్నది .)

**కొనికెలు :** వి; బహు. మోకాలిచిప్పకు లోతట్టు రెండుపక్కలా ఉండే ఎముకలు. రూపాం. కొంకి.

"కొప్పునఁబెట్టిన సేస కొనికల జారఁగాను

కప్పి పయ్యెదతో నేమి గయ్యాలించేవే" 4-300

**-కొను :** కొన్ని ధాతువులపై చేరే అనుబంధ ధాతువు. ఉదా:- ఆనందించుకొను . (ఆనందించు అని అర్థమే)

"అంది శ్రీవెంకటేశుఁడ ఆనందించుకొన్నది

ఇందుముఖి చాలఁజిక్కి ఇంపు చూపరాదా"

27-50

**కొనుకవచ్చు :** స.క్రి; ప.బం. కొనుక్కొని వచ్చు, వెల యిచ్చి తీసుకొని వచ్చు.

"చెంగటి నప్పటి నీవు సేవలు సేయవచ్చేవు

అంగడిఁగొనుకవచ్చి తటవే యా వలపు"

22-259

**కొనుకొను :** కొనుక్కొను.

"కూరిమిఁగాలు చాఁచేవు కొనుకొంటి వా వోరి

వూరకె పతికిఁ బతి వోపనా నేను" 11-237

**కొనుట వెగ్గళము తినుట అల్పము :** ప.బం; సంపాదించడం ఎక్కువ – అనుభవించడం తక్కువ.
"కొనుట వెగ్గళము దాఁదినుట యల్పము మీఁదు
గనుట వినుటలే కదా కడ చన్నభవము" 1-49

**కొనీతు :** స.క్రి; వ.బం. 'కొనియాడు'కు వ్యావహారిక రూపం కావచ్చు.
"ఒప్పులతి గొనీతుఁగా బగ్గడినవు గదా" 28-190

**కొన్నకోలు :** వి. కొనుగోలు, క్రయము.
"మున్నీటిలు తనివంక మరి యింతకంటే నేవి
కొన్నకోలై యిక నేమి గొంగువట్టీ నన్నునూ" 11-546

**కొన్నది కోలగు :** ప.బం; అ.క్రి. కొన్నది అధికమగు, కొన్నది పెద్దదగు.
"కొన్నది కోలైనందుకు కొలఁదివెట్టగ నేల
చిన్ననాటి సుద్దులకు సిగ్గులేల" 13-347

**కొన్నదె కోలు :** (2) ప.బం; వి. కొన్నదే అధికము.
"కొన్నదే కోలుగాక కొంకుకొసరున్నదా
మున్నీటివలె నేనే మొక్కుటగాక" 17-264

**కొన్నేసి :** కొన్నిసార్లు.
"కన్నతండ్రి బాలునిఁ జంకంబెట్టి దించితేను
కొన్నేసి విలుచు ముద్దు గునిసినట్టు" (?) 2-455

**కొప్పుగులుకు :** (?)
"యెప్పుడో తిరువెంకటేశుఁడు కౌఁగిటఁగూడి
కొప్పుగులుకుచు దెచ్చుకొన్న దీ వలపు" 5-74

**కొప్పుచీకట్లు :** ప.బం. కొప్పు నల్లదనాలు.
"కప్పురపుఁబల్కు లెన్ని గాదెఁబోసేవే
కొప్పుచీఁక ట్లింతేసి కూడఁబెట్టేవే" 29-32

**కొప్పెర :** వి. వెడల్పు మూత గల పాత్రవిశేషం, కాగు, తలపుట్టె, కమండలం.
"కప్పులు దేరేటి కస్తురి చంకల
కొప్పెరగుబ్బల గొల్లెత" 5-92
"కొలచి బ్రహ్మాండముల కొప్పెరలో నర్థము
యిల నిహపరముల కెక్కి నర్థము" 2-3

**కొప్పెరగుబ్బలు :** వి; బహు. కాగులవంటి స్తనాలు.
"కొప్పెరగుబ్బలమీఁది కొనగోరి రచనల
కప్పురము మెత్తిమెత్తి కడు నలసితివి" 5-273

**కొమరాఁకలు :** (2) వి; బహు. అందపు కట్టుబాట్లు లేక మేరలు.
"కన్నులఁజూచి నప్పటి కాకలు
అన్నిటాఁజెలికిఁ గొమరాకలు" 25-295

**కొమరాఁకమానిపండు :** (కొమరు + ఆఁక + మాను + పండు) వి. యౌవనం నిలుపుకొన్న మానిపండు కావచ్చు. (సం.ప.స. 22-521)
"యెటిఁగెటిఁగి నా మోవి కేఁటికి నోరూరేవు
మఱిఁగేల కొమరాఁకమానిపండు" 22-521

**కొమరె :** (2) వి. అప్పుడే యౌవనం పొడమిన స్త్రీ, జవ్వని.
"ఈయేడే కొమరెనైతి యెక్కుడైన గరితెను
చేయి వచ్చి సుద్దు లేమి చెప్పేవయ్యా" 28-312

**కొమరెపాయపువారు :** వి; బహు. యౌవనంలో ఉన్న స్త్రీలు, యువతులు.
"కొమరెపాయపువారు కొచ్చికొచ్చి పెనఁగితే
జమళిఁ గైకొంట గాక సటలేటికి" 8-57

**కొమరెపాయము :** వి. అప్పుడప్పుడే పొడుముతున్న యౌవనం.
"సమరతి మనసులు సరిఁ దులఁదూఁగితేను
కొమరెపాయములకు గురుతెట్టు వెట్టేమే" 22-236

**కొమరెమదము :** వి. యౌవనమదం.
"కొమెరమదానఁ జొక్కి కోపించినా నెఱఁగదు
తమితోఁడఁ బట్టుమీ పదను వచ్చేవలపు" 7-71

**కొమరెవయసు :** వి. యౌవనం.
"జమళిసిగ్గుల నాడఁజాలక సతులనంపుదురా
కొమెరవయ సిదే చేతికబ్బెను కొంకనేమిటికే" 17-124

**కొమరెవయసుది :** (కొమరెవయసు + అది) వి. యౌవనం కల స్త్రీ, యువతి.

**కొమరేపాయము:** వి. అప్పుడప్పుడే పొడముతున్న యౌవనం. (కొమరె = అప్పుడే పొడమిన స్త్రీ జవ్వనం)
"కొమరే పాయమెంత కూడినాను మోపు గాదు
తమి యెంత రేఁగినా చేతనుఁ బట్టి వస గాదు"
12-246

**కొమారికము:** వి. 'యువతి' అనే అర్థంకల కొమిరె శబ్దానికి 'కొమరు' ఆదేశమౌతుంది. (కొమిరె + ఆలు = కొమరాలు) కొమరు శబ్దానికి మనోజ్ఞత అని అర్థం. దానికి స్వార్థంలో ఇక ప్రత్యయం చేరి 'కొమరికము' అని ఏర్పడుతుంది. కొమరికమే కొమారికమై ఉంటుంది. మనోజ్ఞత అని అర్థం.
"కోరినట్టి చెల్లెఁగా కొమారికములెల్ల
సారెకు రేపల్లెవాడ సందులలోన" 14-278
"సిరుల శ్రీవెంకటేశుఁ జెందఁ బోలించినందుకు
మరుని కొమారికపు మన్ననలు మించెను"
29-291

**కొమ్మిమాకు:** వి. ఒకానొక చెట్టు.

**కొమ్మిమాకు నీడలు:** వ.బం; వి. ఇందలి కొమ్మిమాకు కొమ్మమాకు కావచ్చునేమో! కొమ్మలు గల మాకు నీడలు అని అర్థమా? లేక కొమ్మిమాకు వృక్ష విశేషమా?
"గుత్తమైన మేడలు కొమ్మిమాకునీడలు
కొత్త సున్నపుదిండ్ల కొర యాల మాకును"
11-344

**కొయ్య:** (2) వి. మూర్ఖుడు.
"చయ్యన విటుఁడవై యే జాడలఁ దిరిగినాను
కొయ్యవు నీ వని దూరే గుణమా నాది" 14-499

**కొయ్యకలిచూపులు:** వి; బహు. (?)
"నెయ్యపుఁజుట్టరికాలు నీకే నేరిపినది
కొయ్యకలిచూపుల కసరులను" 29-7

**కొయ్యకాఁడు:** వి. మూర్ఖుడు, మొద్దు, గడుసుకాడు, వంచకుడు, కఠినుడు, అసాధ్యుడు, శూరుడు.
"కొప్పువట్టే వది యేమి గుట్టున నన్ను
నీ కుప్పెసవరమున్నదా కొయ్యకాఁడవా"
13-481

**కొయ్యగాఁడు:** వి. 'కొయ్యకాఁడు'కు రూపాం.
"కోరి నేరా లెంచనేలే కొయ్యగాండ్లతోడ
పోరుచుకుండే టస్సురుసురే మేలు" 11-458

**కొయ్యతనము:** (15) వి. 1. దుష్టచేష్ట 2. దౌష్ట్యం, మూర్ఖత్వం.
"కొయ్యతనాలు నీ కేల కోరినా మగఁడితఁడు
చెయ్యెత్తి చూపి యేల చెలులకుఁ జెప్పేవే"
14-516

**కొయ్యతనాలది:** వి. దుష్టురాలు, మూర్ఖురాలు.
"ఇయ్యకొంటి నిఁక నీ యిచ్చా యను
కొయ్యతనాలదాననా కొసరితిఁగాక" 19-2

**కొయ్యతనాలాడు:** అ.క్రి. దుష్టచేష్టలు చేయు.
"ఇయ్యకొని నట్టివాఁడు ఇట మీఁదెఱఁగడా
కొయ్యతనాలాడకురే కోపగించీని" 19-580

**కొయ్యది:** (కొయ్య + అది) దుష్టురాలు, దుడుకుది, పౌరుష్యం కలది.
"కలసి పరమపదఘనుడు శ్రీవెంకటేశు
కొలఁదెఱఁగక వుండఁ గొయ్యదాననా" 13-495

**కొరకొర:** వి. 1. విరోధం, ద్వేషం. 2. కోపం.
"సరసము నీతోడ నాడే చనవరి సతులతో
కొరకొర వెట్టుకొని కోపగించేనా" 16-236

**కొరకొరయగు:** అ.క్రి. చెలరేగు, కోపంతో చిరచిరలాడు.
"చిలుకలు కొరకొరై చిమ్మిరేఁగఁ బలికినా
చెలరేగి తాఁబెట్టిన సేసలు నా కున్నవి" 12-270

**కొరమాలు:** వ.బం; అ.క్రి. పనికిమాలు.
"విరసపు భావముల వినికిచే వీసులెల్లా
గొరమాలె మాకు నేఁటి కులాచారము" 4-312

**కొరముట్టు:** వి. పనిముట్టు, సాధనం. కొఱముట్టు అని శ.ర.
"కొరముట్టు బండిరైన కూలఁగాలఁ దన్నీని
యిరవై పాములమడు గీఁదఁ జొచ్చీని" 22-59

**కొరయు:** అ.క్రి. తొలఁగు.
"కొచ్చినఁ గొరయవు కోపములు
గచ్చుల గుణములు గల నాళ్ళు" 4-343

**కొరవిదయ్యము:** వి. ఒక పిశాచం, కొరవిరూపంలో కనిపించే దయ్యం.
"కోమలి చందురుఁడనే కొరవిదయ్యముఁ
దీమసు మింతయు మాని దిగు లందెను" 24-76

**కొరిమి:** వి. దోషం.

**కొఱకొఱ:** వి. 1. విరోధం, ద్వేషం 2. కోపం 3. కోపాదులలో ఊర్పులవల్ల కలిగే ధ్వనికి అనుకరణం.
"కొఱకొఱ లెల్ల దీరె కొచ్చికొచ్చి చూచితేను
యెఱుఁగని దేది యింతి యేమి సేసునయ్యా"
7-544

**కొఱకొఱఁబెట్టు:** (?)
"మెఱసి పెనఁగవచ్చీ మిక్కుటపు రతులను
కొఱకొఱఁబెట్టఁగదే గొల్లకొసరు" 7-489

**కొఱత:** వి. 1. తక్కువ, లోపం 2. దోషం, తప్పు, శేషం, అవమానం.
"చెఱఁగు మాసినవేళ చేరి ముట్ట వచ్చేవు
కొఱతంటా వద్దంటేఁ గోపగించేవు" 11-262

**కొఱ్ఱు:** వి. 1. ముల్లు 2. శూలం 3. మేకు 4. కాలుతున్న కఱ్ఱ 5. ఇంద్రధనుస్సు 6. ముళ్ళు తగిలి గుడ్డలో ఏర్పడ్డ చిరుగు.
"యెక్కువగా వినోదాన కితఁడు తే రెక్కితేను
యెక్కిరి దైత్యులు కొఱ్ఱు లందఱుఁ గూడి" 3-92

**కొల:** (5) వి; మాం. 1. వైరం 2. దోషం 3. పాపం, కసటు 4. హింస 5. బాధ. (వ్యు.)
"ఈతనిఁగొలిచితేనే యిన్ని గొలలునుఁ దీరు
చేతనఁబెట్టు పుణ్యాలు చేరువనే కలుగు" 2-57

**కొలఁగా:** క్రి.విణ. ఎక్కువగా, అధికంగా.
"చల్లగా శ్రీవెంకటేశు శరణంటి మిదె మేము
కొల్లగా మీ రెల్ల మమ్ము గుఱిగా వర్థిల్లరో"
1-441

**కొలఁగులు:** వి; బహు. 'కొలను'కు బహువచన రూపమైన 'కొలఁకులు'కు వ్యావహారికరూపం కావచ్చు. సరస్సులు.
"కొంత నీ కృపారసము కొలఁగులై ముంచఁగాను
వింతగాఁగలువ లట్టె వికసించెను" 19-378

**కొలఁదిఁబడు:** అ.క్రి. తక్కువపడు, న్యూనమగు.
"దంటలై నాచేతఁ దలపించుకొనఁగ
దొరకొంటవింక నిది నీకు కొలఁదిఁబడునా"
6-38

**కొలఁదిపాటు:** వి. తక్కువ కావడం, న్యూనత.
"ఎన్నఁదిఁక యేది గొలఁదిపాటు
వున్నతపు మాయలకే వొడిగట్టవలసె" 3-440

**కొలనిదోఁపరి:** వి. శ్రీవెంకటేశ్వరస్వామి, కొలనును దోచుకున్నవాడు.
"కొలనిదోపరికి గొబ్బిళ్ళో యదు
కులస్వామికి గొబ్బిళ్ళో" 5-98

**కొలము:** (3) వి. 'కులము'నకు వికృతిరూపం.
"చెలిమి విడువలేక చెయివూఁత యిచ్చేఁగాక
కొలమున నేమి తక్కువవాఁడా" 10-2-68

**కొలమునాలు:** (2) (కొలము + ఆలు) వి. కులస్త్రీ.
"కొలమునాలఁ గనక కోరి సేవ సేసేఁగాక
అలపు చూపితి నప్పుడే ఆయాలంటీఁ దగవా"
9-308

**కొలికి:** వి. కంఠస్వరం (?) బ్రౌన్. కొలికి - In poetry కొలికి means voice as kark and ABA declare that చిలుకలకొలికి is the same as శుకవాణి sweet voice.
"మనసు గోరికల కళ మర్మములఁ బూజించె
గొనకొన్న రతుల చేఁగొలికి పూజించె" 6-80

**కొలిమిగూటిలో సూదులమ్ముట:** వి. సూదులు తయారుచేసే కొలిమి గూటిలోనికే సూదులమ్మబోవుట – అనగా పని లేని పని, వ్యర్థమైన ప్రయత్నమని భావం.
"కొమ్మ చూడవే కొలిమిగూటిలో

నమ్మెడి సూదులె యదె వీఁడు" 5-123

కొలుచు: వి. ధాన్యం.

"గాదెల కొలుచు వో నీ గాథలు
ఆ దెస నీ దెస నే మంత కోపఁగలమా"

9-116 & 1-130

కొలుచుండి పొల్లు కడఁబడు: ప.బం; అ.క్రి. మేలిమి మిగిలి పనికిరానిది దూరమగు. తూర్పెత్తి నపుడు ధాన్యపు గింజలు మిగిలి పొల్లు దూరమగు అని వాచ్యార్థం.

"చెంది పీచే గాలొకటే చేని పంటానొకటే
పొందిగట్టు కొలుచుండి పొల్లు కడఁబడును"

3-14

కొలుపిడి: (?)

"యిలమీఁద తమ సొమ్ము లెవ్వరివద్ద నుండినా
తలపిడి కొలుపిడి తగిలినట్టు" 2-5

కొలువుకాంత: వి. చెలికత్తె, దాసి.

"చేయి మాటుసేసుక యా చెలిదిక్కే చూచేవు
యీ యెడఁ గొలువుకాంత లందరిలోన"

14-394

కొలువుడుబంటు: వి. సేవచేసే బంటు, ఇష్టమైన సేవకుడు.

"కొచ్చిన శ్రీవేంకటేశు కొలువుడుబంటు నింతే
పచ్చి యింద్రియాలకెల్లాఁ బంపుసేసేను" 2-427

కొలువుపతిమె: వి. ఆస్థానంలోని ప్రతిమ.

"కొలువుపతిమె లెల్లా గోడచేరుపులె కాక
కలయిక రతులకుఁ గారణ మేమి" 8-212

కొలువుసేయు: అ.క్రి. సభచేయు, సేవచేయు.

"కొలువు సేసేనంటా కొప్పు దువ్వేతివి గాని
ఇలఁ గాఁగిలించుకొంటే హీనమా నీకు" 18-535

కొల్చిపోయు: ప.బం; స.క్రి. వెచ్చించు.

"సారిది లోకములెల్లాఁ జొచ్చి కాలగతులను
పొరి నాయుష్యముఁ గొల్చి
పోయుచున్నారయా" 2-266

కొల్చు: వి. 'కొలుచు'కు రూపాం. ధాన్యం.

కొల్లఁబోవు: అ.క్రి. పాడగు, వ్యర్థమగు.

"అక్కడ నా పొట్లువడి యిక్కడ నీ పాటుపడి
కుక్కనోరికళాసమై కొల్లఁబోయ బతుకు" 1-90

"కడుపు నిండదు కన్నూ దనియదు
కడగి లోని యాకలియుఁ బోదు
సడిబడి కుడిచిన కుడుపెల్ల వినుము
గుడిచిన నీరై కొల్లఁబోయె" 1-124

కొల్లకత్తె: (కొల్ల + కత్తె) వి. కొల్లపెట్టే స్త్రీ, దోపుడుకత్తె. (వ్యు.)

"ఇల్లాలి చేతలా యివి యెల్లాను
కొల్లకత్తెవలెఁ బుచ్చుకొంటివి వుంగరము"

26-406

కొల్లకాఁడు: (కొల్ల + కాఁడు) వి. కొల్లగొట్టేవాఁడు, కొళ్లగాడు.

"చెల్లునా నీ కీ పనులు చెన్నకేశా
కొల్లకాఁడ వౌర గండికోటచెన్నకేశా" 20-50

కొల్లవట్టు: స.క్రి; ప.బం. కొల్లగొట్టు.

"గుట్టునఁ గోరిక లెల్లం గొల్లవట్టె" 5-188

కొల్లున: (?) క్రి.విశే. గొల్లున.

"కొల్లున నీతో నవ్వి కూడుట మేలు గాక
కెల్లురేఁగి నిన్ను విసిగించనేటికి" 14-27

కొసరికె: (కొసరు + ఇకె) వి. 1. వాంఛ, కోరిక, ప్రార్థన 2. విజృంభణం 3. సంకోచం 4. లోపం 5. సంశయం 6.అనులాపం 7.పెచ్చు. (వ్యు.)

"దెసల సజ్జనులకు తిరమైన పుణ్యము
కొసరికె కంసుని గుండె దిగులు" 17-144

కొసరు: స.క్రి. అపేక్షించు, కోరు, ప్రార్థించు, ఆస్వాదించు, అనుభవించు.

"అతనిఁగొసరకురే అందేమున్నది
ఆతుమలో సరివచ్చె నందేమున్నది" 7-466

## కో

కోఁచక: 'కొంచక'కు రూపాం. కొంచు = సంకోచించు.

"పూఁచిపట్టి యీ యింతిఁ బొగడరమ్మా
కోఁచక మేఘములోని కొమ్మెఱుఁగువలెను"

20-218

**కోఁడికోఁడి :** మఱలమఱల (?)

"ఒసఁగేవు వలపులు వేఁడివేఁడి
గునియుమ మొక్కేవేమే కోఁడికోఁడి" 22-489

**కోఁడికోఁడి చూపులు :** వి; బహు. కొనచూపులు, క్రీగంటి చూపులు; ఇందులోని కోఁడి శబ్దం కోటి శబ్దభవమో, కొంటికి రూపాంతరమో కాగలదని సూ.ని.స. (13 వాల్యూం. 1.అను. 3 పు.)

"కోఁడికోఁడి చూపులను కొమ్మలు చూడఁగాను
వాయతనీతు కొక్కరీతి నవ్వునవ్వివి" 13-128

**కోఁడు :** (?)

"కోఁడి నన్ను తోడుకొని నీ యిప్పుడిరిగి
అడుగాటి కిదే చాలు అంటి వారోరుతురా"

8-246

**కోఁతవేఁత :** వ.బం; వి. పంటకోయడం – కొట్టడం (గిరిజ రాళ్ళు)

"బూతాల పొంగటికే పొడమిన పంటలెల్లా
కోఁతవేఁత చూచుకొని కోరుకుంటారు" 3-464

**కోక బాఁకిఇంటవేసి కొక్కిరాల వెంటఁబోవు :** వ.బం; అ.క్రి. ఒకచోట వస్తువు నుంచి మరొకచోట వెదకు. వ్యర్థ ప్రయత్నం చేయు.

"కోక బాఁకియింట వేసి కొక్కిరాల వెంటబోతే
అకట పురుషార్థము నందీనా జీవుఁడు" 3-175

**కోకిలవాణి :** వి. కోకిల కంఠంవంటి కంఠం గల స్త్రీ, స్త్రీ.

"చెలరేఁగి యాదరించీ జెలువునిఁజూడవమ్మా
కులుకుమిట్టల రాణి కోకిలవాణి" 29-159

**కోకో :** కొనుము కొనుము, గ్రహించుము గ్రహించుము.

"కోక లేల దీసితివి గోవిందుడా నీకు
కోకో అదివో మొక్కు గోవిందుఁడా" 20-3

**కోగిలి :** (2) వి. 'కోకిల'కు వ్యావహారికరూపం. (?) క. కోగిలె. చూ : కోవిల.

"వనము గోగిలవైతి వామనా నీకు
వనితలు బాఁతి వామనా" 15-244

**కోటరము :** వి. కోడంట్రం, కోడటికం.

"జంతలైరి లోలోనే సారె నిన్ను ముద్దాడఁగా
కొంతయునా నత్తలకు కోటరాలు సేతురా" 21-83

**కోటా :** వి. కోట, గానానుకూలమైన దీర్ఘం.

"వెలియానలనే దండు విడిసిన కోటా
గులుగై యింద్రియములు కొల్లగొన్నకోటా"

2-84

**కోటానఁగోటి :** (21) (కోటి +కోటి) వి. అత్యధికం, పెక్కులు, అసంఖ్యాకం.

"ఈ రీతి వలపులొకటి సుమడాయ విభుఁడ
కోరికలు గోటానఁగోటి సతికాయ" 17-513

**కోటారు :** కొటారు, చూ : కొటారు.

"కోరుపంచరో కోటారు
అరసి మనసా అంతరాత్మకు" 1-387

**కోటి :** వి. గొప్ప, అమూల్యం.

"చెప్పనేలే ప్రియములు సారెసారె
గొప్పు దువ్వినదే నాకుఁ గోటి గాదా" 14-172

**కోటికిఁబడగలెత్తు :** వ.బం; అ.క్రి. కోటీశ్వరుడైనట్లు జెండా ఎత్తుకొను, ధనాఢ్యుడగు, ఘనుడగు. 'కోటి' ధనం సంపాదించగానే తచ్చిహ్నంగా పాముపడగ మాదిరిగా ఒక ధ్వజ మెత్తే ఆచారం ఉండి ఉంటుంది. అవిధంగా వచ్చిన పలుకుబడి.

"కోటికిఁ బడగలెత్తి కుచములు నీకుఁజూపీ
జూటుఁదనములు మాని చూడవయ్యా"

29-319

**కోటికిఁబడగెత్తు :** (4) వ.బం. అ.క్రి; చూ :కోటికిఁబడగలెత్తు.

"చేటెఱుంగని కూన చెలి చిత్తమే కదా
కోటికిని బడగెత్తెఁ గోరికలను" 6-133

**కోటికిఁబడిగెత్తు :** (2) వ.బం; అ.క్రి. చూ : కోటికిఁబడగెత్తు.

"కోరి నీవాడిన మాటకుఁగోటికిఁబడిగెత్తి
గారవానఁ బానుప్పపైఁ గాచుకున్నది" 26-382

**కోటికి ఒకతె :** వ.బం; వి. ఎంతోమందిలో ఒకతె, అతి విరళం.

**కోటికిబడెగెగా :** పూర్వం కోటిధనం ఉన్నవాడెల్లా ఒక ధ్వజం కట్టేవాడు. అదే కోటికి పడిగె
"మేటియైన గొంతిదేవి మేనల్లుఁడీతఁడా
కోటికిఁబడెగెగాను కొండ యెత్తెను" 4-6

**కోటికొండలు :** వి; బహు. అత్యధికం, ఇబ్బడిముబ్బడి.
"నిండుఁగొలువులో నాతో నీవు నవ్వినది నాకు
కొండంత పెద్దరికము కోటికొండలు" 16-286

**కోటీసేయు :** (13) వ.బం; అ.క్రి. అమూల్యమగు, మిక్కిలి విలువచేయు.
"కూరిమే కలిగితేను కొసరి తిట్టిన తిట్టు
కోరినట్టే యిద్దరికిఁ గోటీసేసు" 17-399

**కోడతిరునాళ్లు :** వి; బహు. వసంతోత్సవాలు. త. కోడై, కోడె = ఎండకాలం, వేసగికాలం, గ్రీష్మకాలంలో జరిగే ఉత్సవాలు. కోడతిరునాళ్లు తిరుపతి శాసనాలలో పేర్కొనబడ్డాయి. ఇవి వేసవిలో వెన్నెల రాత్రుల్లో జరుపబడే ఉత్సవాలు.
"చెప్పరాని మహిమల శ్రీవెంకటేశ్వరుఁడు
కుప్పళించీ వాసనలఁ గోడతిరునాళ్లు" 18-281

**కోడికూతనోరివాడు :** వి. ఇంద్రుడు; అహల్యకోసం వెళ్ళినపుడు ఇంద్రుడు కోడి రూపాన్ని ధరించి కోడివలె కూసినాడు.
"కోడికూఁత నోరివాని కుఱ్ఱతమ్ముఁ డైనవాఁడు
బూడిద పూసినవాని బుద్ధులవాఁడు" 5-295

**కోడికూతనోరివాని కుఱ్ఱతమ్ముఁడు :** వి. వామనుడు. (కోడికూత నోరివాడు = ఇంద్రుడు; ఇంద్రుని చిన్నతమ్ముడు వామనుడు; ఇంద్రుడు అదితి కశ్యపుల పుత్రుడు; వామనుడు కూడ అదితి కశ్యపుల పుత్రుడే. కనుక వామనుడు ఇంద్రునికి తమ్ముడే కదా!)
"కోడికూఁతనోరివాని కుఱ్ఱతమ్ముడైనవాడు
బూడిద పూసినవాని బుద్ధులవాఁడు" 5-295

**కోడి కూసినందాకా :** వ.బం; క్రి.విణ. తెల్లవారుజాము వరకు.
"కోడి కూసినందాకా సాగుడుఁగతే చెప్పితివి
పీడె మిప్పించుకొనను వేళ యేది" 14-169

**కోడిగము :** వి. విలాసచేష్ట, వంచన, కొంటెతనం, పరిహాసం.

**కోడియెరుకలు :** వి; బహు. (?)
"వాడికె నొండొరులము వలచిన వలపులే
కోడి యెరుకలు సేసి కొనవచ్చేరు" 8-14

**కోడెకాఁడు :** (18) (కోడె + కాఁడు) వి. విటుడు, పల్లవుడు, యౌవనానికి పూర్వదశలో నున్నవాడు, యువకుడు.
"కోడెకాఁడయితే నేమి గురుతులుండితే యేమి
జోడుగూడి నా మొగము చూచెగాఁ తాను"
29-210

**కోడెగత్తె :** వి. (కోడె + కత్తె) యువతి, యౌవనానికి పూర్వదశలో నున్న స్త్రీ.
"కోడెకత్తెవు కొమ్మా నీకు నేఁ జెప్పితి
రూడితోనే చేతలే నేరుచుకోవే చెలియా"
22-522

**కోడెతనము :** వి. 1.పడుచుతనం 2.జాణతనం 3.విటత్వం.
"వేడుక నేఁజేసితేను వెంగెమందురా
కోడెతనమెల్లా నాపై గురి సేసేవారా" 20-548

**కోడెతనాలుసేయు :** అ.క్రి. విటత్వం జరుపు.
"వేడుకకాఁడైన యట్టి విభుఁడు గాక
కోడెతనాలు సేసీని గోలవాఁడా యీతఁడు"
24-596

**కోడెవయసు :** వి. యౌవనం, పడచుదనం.
"కోడెవయసు కొమిరె లేమల
వాడికకు దేను వసమా"
"కోడెవయసున నింతి కోరికల నిండినది" 8-28

**కోడెవయసుది :** (కోడెవయసు + అది) యువతి.
"గొప్పైన కన్నులదాన కోడెవయసుదాన
చిప్పిలు గళలదాన సింగారిదాన" 29-409

**కోతి కొమ్మ తప్పఁబారునా :** సామెత; (?)
"ఎఱుఁగుకోలేని జీవి యెడ్డగాక గుతి
నెంతయినాఁ గోఁతి కొమ్మ దప్పఁబారునా"
15-154

**కోన చెన్నరాయఁడు :** కడపజిల్లా కడప తాలూకాలోని నంది మండలానికి దక్షిణంగా పాలకొండ పర్వతంలోని కోనలో చక్కని తోటలుగల కోనలో వెలసిన చెన్నకేశవస్వామి. ఈ స్వామిని పాలకొండరాయుడు అని అంటారు.

"మిక్కిలి తిరుపతివి మేలు మేలోయి
గక్కన తలపుల కో కోనచెన్నరాయఁడా" 10-2-19

"తిరుపతి పెంచుగాను నీ కోనేటి కేళువు
కోనచెన్నరాయఁడ నీ గుణమింత మానవు" 11-423

**కోనతిరువేంగళేశుఁడు :** కడపకు దక్షిణంగా నాలుగుమైళ్ళ దూరంలో ఉండే పాలకొండ కోనయే కోన జాతమ్మ. అక్కడ నెలకొన్న తిరువేంకటనాథుడు. ఇతనినే పాలకొండ రాయుడు అనీ, కోన చెన్నకేశవుడు అనీ అంటారు.

"వీడెమిచ్చెఁ గోన తిరువేంగళేశుఁడై వచ్చి
కూడెను శ్రీవేంకటాద్రి కొండమీఁదఁజూడవే" 8-142

"వేఁగిరమా కోన తిరువేంగళేశ విందెఁ
దేగవు వలపు కోనతిరువెంగళేశ" 26-182

**కోనాడు :** స.క్రి. కొనియాడు (?)

"కోటులైన వేదములు కోనాడి నిన్నందులోన
నోటి విన్నపము లొక్క నువ్వుగింజంతే" 8-42

**కోలాలగొంది :** వి. మిక్కిలి ఇరుకైన చీకటి మూల. రూపాంతరం. కోణాలగొంది.

"పానుపుమీఁదటఁ దాను పవళించి వున్నవాఁడు
గోలాలగొంది నిది గోవిందుఁడు" 18-414

**కోనేటప్ప :** (కోనేటి + అప్ప) కోనేటిరాయడు, శ్రీవేంకటేశ్వర స్వామి.

"తిమ్మరి కోనేటప్పని తిరువేంకటపతిఁ గూడిన
కొమ్మకు మీఁదటి యాసల కోరిక లేటి వొకో" 5-292

**కోనేటి తిమ్మఁడు :** వి. చూ : కోనేటి తిమ్మయ్య.

"తిమ్మరివి కోనేటితిమ్మ నీపైఁ బ్రియము
కుమ్మరించని దేటి కోర్కిరా వోరి" 5-45

**కోనేటి తిమ్మయ్య :** వి. కోనేటిరాయడు, తిరుమల లోని కోనేటివద్ద వెలసిన శ్రీవెంకటేశ్వరస్వామి. (తిరుమల + అయ్య = తిమ్మయ్య)

"కొండలరాయఁడు కోనేటితిమ్మయ్య
కొండ తలనెత్తి గుబులైనవాఁడు" 12-234

**కోనేటి తిమ్మనాయఁడు :** వి. కోనేటి తిరుమలనాయడు, తిరుమలలో కోనేటివద్ద వెలసిన శ్రీవేంకటేశ్వరస్వామి.

"తెలిసె కోనేటి తిమ్మనాయఁడు చొచ్చె
బలిసె యీ కోట భయమేల" 1-61

**కోనేటిపతి :** వి. తిరుమలలోని కోనేటికి విభుడైన శ్రీవేంకటేశ్వరస్వామి.

"కొండలను నెలకొన్న కోనేటిపతి వనగ
నుండవలెనను నీకు నోపలేనక" 1-200

"కోపకత్తె నా నిన్ను కొసరుచు జంకించఁగ
వోపి నీతో నవ్వుతానే వుండుదుఁగాక" 18-587

**కోనేటిరాయఁడు :** వి. శ్రీవెంకటేశ్వరస్వామి. తిరుమలలోని పవిత్రమైన కోనేటికి (పుష్కరిణికి) ప్రభువు.

"అందనే శ్రీవేంకటాద్రి నలరి నన్నేలితివి
కొండలలో నెలకొన్న కోనేటిరాయ" 26-299

**కోనేటివాఁడు :** వి. శ్రీవేంకటేశ్వరస్వామి, తిరుమలలోని కోనేరు (స్వామి పుష్కరిణి)కు విభుఁడు. 5-216

**కోనేటివిభుఁడు :** వి. కోనేటిరాయడు, తిరుమలలోని కోనేటివద్ద వెలసిన శ్రీవెంకటేశ్వర స్వామి.

"విటవరుఁడ కోనేటివిభుడ నీ
వెటు దొలంగిన దేహమెట్టు నిలుపుదురా" 5-121

**కోనేరమ్మ :** వి. పద్మావతి (కోనేరప్ప = వేంకటేశ్వరుడు)

**కోపకత్తె :** వి. కోపస్వభావంకల స్త్రీ.

"మల్లాడే కోపకత్తెను మట్టుకు దేవచ్చు గాని

చల్లజంపులాడినైతే సాధించరాదు" 23-107

**కోపము ముక్కుమీఁద నుండు** : ప.బం; అ.క్రి. తొందరగా కోపం వచ్చు.

"దూరఁబోతే కోపము దారకు ముక్కుననుండు వూరికే తోడుక రారే వొడఁబరచేనూ" 11-168

**కోపముసేయు** : స.క్రి. కోపించు.

"తప్పక చూచినందుకె తగఁగోపము సేసుక కొప్పు దువ్వినఁ గసరుకొనేవేమే" 11-306

**కోపు** : (1) వి. దిక్కు, పార్శ్వం, (కోపు = ఒయ్యారం అం.ప.ని.) పక్షం, బలగం, సమయం, నిమిత్తం, విధం, సుందరం, ధనురగ్రం, నాట్యం, తీరుప్పు, అందం, సొరంగ. నిడివి. (బహువచనం నమస్కారాలు అం.ప.ని.) (విధము అని అం.ప.ని.)

"కోపులఁగప్పురధూళి గుప్పరే యీతనికి" 19-335

"చూపుల కొలఁదివే సొంపైన కాంక్షలివి కోపులిందుకు నీవు గొణఁగుకొన నేలే" 24-177

**కోపులు** : వి; బహు. మాం. నిలుకడ లేని పోకడలు, దంభాలు. విసురుమాటలు మొ॥ అర్థాల్లో వాడబడే మాండలికం. కోపులు వదొద్దు అనీ ఈనాటికీ వ్యవహారం.

"కోపుల వెనుక నన్నుఁ గూడేవుగాని, పో పో యెందు పోయేవో పోయి రారాదా" 26-11

**కోమటిండ్లపొరుగు** : ప.బం; వి. ఇబ్బందిని కలిగించేది.

"ముద్దు ముద్దు సేసి నిన్ను మోవఁబెంచి మీ తల్లి పొద్దువొద్దు కోమటిండ్ల పొరుగాయ బ్రదుకు" 9-73

**కోమటిమేనరికము** : (3) వి; పబం. తప్పనిసరిగా జరిగేది. కోమట్లు మేనరికాన్నే ఎక్కువగా ఇష్టపడతారు. మేనరికాన్నికాక ఇతరసంబంధం చేసుకున్నా మేనమామ గోత్రంవారినే కోరుకుంటారు.

"నాననీవే వలపులు నాకుఁదనకుఁ గోమటి మేనరికమైనట్టు మెచ్చు గావలెను" 22-110

**కోమటిసాకిరి** : ప.బం; వి. ఉభయవాదులకూ పనికిరాని సాక్ష్యం, ఎటూ చెందని సాక్ష్యం.

"యేమని విన్నవించేము యెవ్వరినిఁ గాదనేము కోమటి సాకిరులాయ గొబ్బున మా మాఁటలు" 27-203

**కోమటి సాక్ష్యము** : చూ : కోమటిసాకిరి.

**కోమలపువాఁడు** : వి. చక్కదనం కలవాఁడు, సౌందర్యం కలవాడు.

"నోము నంచుకొని నిన్ను ముద్దరాల నేమి సేసే కోమలపువాఁడవు నీ గుణ మింతే కాక" 27-232

**కోమలికము** : వి. సౌందర్యం, చక్కదనం.

"కూడేటి సంతానములు కొనగోళ్లై వాండ్లెక్కు పాడితోఁ గోమలికము పాదాల నిండె" 19-342

**కోయరాని కోరికెలు** : వి; బహు. తుంచరాని కోరికలు.

"యీ యెడ శ్రీవెంకటేశుఁడేతెంచి తా నన్నుఁగూడె కోయరాని కోరికలు కొలఁది నుండీనా" 7-20

**కోయిల** : (2) వి. కోకిల.

"వాయెత్తి చిలుకేల వదరీనె పలుమారు కోయిలలు దామేల గొరగీనే" 5-191

**కోయిలకాలు** : వి; బహు. సజ్జ, జొన్న, వరి వంటి పైర్లు కోయగా నేలలో మిగిలిన మొదళ్ళు. ఇవి చేనిలో పండిన పంట స్థితిని సూచిస్తాయి. రూపాం. కొయికాలు, కొయలకాలు, కొయ్యలు, కొయ్యలకాళ్లు, కోలెలు

"చేయారఁ దన మేని చిన్న లివె చేని పంట కోయిలకాలే చెప్పఁ గోప మేటి కనవే" 26-139

**కోరకొప్పు** : వి. పెద్దకొప్పు.

"కోరకొప్పు వంగీ నది కూడ ముడుచుకొనవే నీరువలెఁ గరఁగుతా నివ్వెరఁగు లేటికి" 16-565

**కోరికె** : (46) వి. 'కోరిక'కు వ్యావహారికరూపం. అన్నమయ్య 'కోరిక' అనే రూపాన్నికూడా వాడినా 'కోరికె' అనే రూపాన్నే ఎక్కువగా వాడినాడు.

**కోరు** : (2) వి. 1. భాగం, పాలు, వంతు, కొలు

2. రాజాదులకిచ్చే ధనేతరమైన వస్తురూపమైన కప్పం. 3. లాకట్టు 4. అంచు.

"కొమ్ముల అవ్వనములు కోరువట్టేవా
కమ్మని మా కోరికలు గాదెబోసేవా" 7-302

"అలిమి మీతి చన్నులు కనకపురాకు లాయ
కొంది కోరు గొందువు కోటూరుకు రావయ్యా"
22-320

**కోరో:** తీసుకోండి అని ప్రార్థించటం.

"గొల్లజాతి పిల్లగోవి కోరో చెల్లా" 6-109

"కోరో చెల్ల యమునా తీరుగు
గుడుముల తరిమిళ్లే నటన
కోరో కోరో లారో కోరి విడేలు
పోరి పోరి నిందరికిఁ జాతిటిమి నుండి" 12-61

**కోర్పులు:** వి; బహు. (?)

"మేలు మేలే యితఁడు నేర్పును మెచ్చితి
నన్నిటా నీతని కూటమి
కోలుముందై యిటులఁ గోర్పులు కొనలుసాగని
దీటిది" 28-51

**కోలగాది పందె మాడుట:** వి. సం.ప.స. లో దీని వివరణం ఇట్లా ఉంది. "ఇదియొక పలుకుబడిగా తోచుచున్నది. జాతీయములన్నీ తాత్పర్యార్థ ప్రధానములు. ఒకహద్దు చేసి దానిని దాటకుండ నియమించుట దీని తాత్పర్యము. ఒక గీతనుగాని కఱ్ఱనుగాని హద్దుగా చేసికొని దానిని దాటకుండా (చెడుగుడు వలె) ఆడునట్టి క్రీడావిశేషమందు జాతీయముగ ప్రయోగించినట్లున్నది.

"మేలయ్య మచ్చములు నీ మేనఁ జూప నెన్ని లేవు
కోలగాది పందెమాడఁ గొంకేరు గాక" 18-401

**కోలదనివెట్టు:** స.ఐం. (కోల = దీర్ఘము, దని = ధ్వని) దీర్ఘముగా శబ్దించు - ఇట స్తుతిచేయు కావచ్చు.

"కూడఁగూడ గురుతులు కొనగోరి చెనకులు
మేడఁగోలదనివెట్టే మిట్టి చతురతలు" 29-11

**కోలాటము:** వి. చేతి కోలలతో తాళం వేస్తూ పాడుతూ చుట్టూ తిరుగుతూ ఆడే ఒక ఆట.

"కాంతలు వలయపు కంకణరవముల
నంతంతఁ గోలాట మాడఁగను" 19-343

**కోలుపడిగెలు:** వి; బహు. పెద్దపడగలు; పడగలు అనేదానికి పడిగెలు జనవ్యవహారరూపం కావచ్చు.

"గొడుగులనీడను కోలుపడిగెల తోడ
యెడనెడవాడల నీ వేగి రాఁగాను" 18-73

**కోలుపడు:** అ.క్రి. కోలుపోవు, పోగొట్టుకొను, తగ్గు.

"ఇందరి బుద్ధులు యీశ్వరేచ్ఛకు సరి రావు
గొందినున్న మానుషము కోలుపడింతైనా"
2-94

**కోలుముందు:** (45) స.ఐం. మున్ముందు, మిక్కిలి ముందు, మొట్టమొదలు. ముందుపడి పుచ్చుకొనుట అను నర్థము కావచ్చును. 'అహమహమిక' అని సం.ప.స. (13 వా. 1 అను. 3 పు.)

"నాలిసేసి పానుపుపై నవ్వులు నవ్వేవు నీవు
కోలుముందైన మీఁదఁ గొంక నేటికే" 8-100

"మేలము లమరెఁగా మీకు మీకును
కోలుముందుగా పొందు గూడె వినవయ్యా"
13-207

**కోవయ్యా:** (5) (కో + అయ్యా) తీసుకోవయ్యా.

"కొంచెపు వెన్నెలలివె కోవయ్య కానిక" 5-35

**కోవరము:** విఐ. అధికమైన (వ్యు.), గాఢమైన, అధికమైన.

"కోవరపుసంపదల కోరేటి జీవుఁడా
శ్రీవెంకటేశుని సేవ గోరరాదా" 15-133

**కోవరివాఁడు:** వి. (?)

"చలికిఁ గోవరివాని సరుస బా వాయఁగాని
పలుదేవతలకెల్లఁ బ్రాణబంధుఁడితఁడే" 1-454

**కోవిల:** వి. 'కోకిల'కు వ్యావహారికరూపం. అన్నమయ్యా ఒకటి రెండు చోట్లతప్ప అంతటా 'కోవిల' అనే రూపాన్నే ప్రయోగించినా దీనికి సుమారు నూట ఇరవైకి పైగా ప్రయోగాలు కనిపిస్తున్నాయి. ఒక్క చోట మాత్రం కోయిల

అనే ప్రయోగం, మరోచోట కోవెల అనే ప్రయోగం చోటుచేసుకున్నాయి. మరోచోట 'కోగిల' అనే రూపం కనిపిస్తుంది.

**కోవిలకుంట్ల గోపాలకృష్ణుడు :** వి. కోవిలకుంటయే కోవిలకుంట్ల కావచ్చును. కోవిలకుంట కర్నూలు జిల్లాలో ఒక తాలూకా కేంద్రం. ఇట వెలసిన స్వామియే కోవిలకుంట్ల గోపాలకృష్ణుడు.

"విడువని పొందులతో విభ్రమీగే నీకు నేల
కొడిమె కోవిలకుంట్ల గోపాలకృష్ణుఁడా"

10-2-26

**కోవెల:** వి. 'కోకిల'కు రూపాం.

"అందపుఁగోవెలవలె ఆకు కొరికి నీ కిచ్చి
చెంది పొత్తుల వీడెము సేయరాదా" 12-177

పగటుఁ గోవెలలు 6-7, కొమ్మకోవెల 16-551, గండుఁగోవెల 17-147, ఉంచపుఁ గోవెల 14-388, పాటల కోవెలలు 16-489, ఆమని కోవెల 17-418 "కోవెల కూఁతలకు నొక్క వింత నెఱప" అని య.చ.ప్రయోగం. (2-50)

**కోవో:** క్రి. తీసుకొమ్ము, గ్రహించుము. (బహువచనంలో కోరో అని రూపం.)

"నారాయణుని శ్రీనామ మిది
కోరినవిచ్చీఁ గోవో మనసా" 4 అను. 73

**కోసువానిపల్లె:** వి. కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలో కోసనేపల్లె అనే గ్రామం ఉంది. ఈ గ్రామంలో శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయం ఉంది. ఈ గ్రామానికి హరిహరపురమనే పేరు కూడా ఉంది. కోసనేపల్లె యే కోసువానిపల్లెగా మారి ఉంటుందేమో?

"కోసువాని పల్లెలోనఁ గూడి శ్రీవేంకటనాథ
తోసిపోవైతివి యింత దొరలకుఁ జెల్లునా"

10-2-71

"పతివైన కోసువానిపల్లె శ్రీవేంకటనాథ
గతియై కూడుండమన్నాఁ గాఁగిట నుండేవు"

10-2-75

## కౌ

**కౌఁగిలి:** (54) వి. వక్షఃస్థలం, ఱొమ్ము, బాహువుల మధ్యభాగం. అన్నమయ్య 'కౌఁగిలి' అనే పదాన్ని వాడినా, 'కాఁగిలి' అన్న వ్యావహారిక రూపాన్నే ఎక్కువగా వాడినాడు.

"కడు నెంత పెరిగినా కౌఁగిటిలోనే చన్నులు"

12-423

**కౌఁగలించు:** (6) స.క్రి. ఆలింగనం చేసుకొను ; దీనికి కాఁగలించు, కాఁగిలించు, కౌఁగిలించు అనే రూపాలు కూడా కనిపిస్తున్నాయి.

"అంది నీ చేతులుఁ దీగెలవి వొక్కసరందురు
కందువసరడునవి కౌఁగలించవు" 7-266

**కౌఁగిలించు:** (10) స.క్రి. ఆలింగనం చేసుకొను.

"వీఁపునఁ గుచాలు మోపి వెలఁది కౌఁగిలించఁగ
నేపున నేనుగ నెక్కె నిదె దేవుఁడు" 7-58

అన్నమయ్య ఈ పదాన్ని అతివిరళంగా వాడినాడు. ఎక్కువగా కౌఁగలించు, ఆతరువాత కాఁగలించు అనే రూపాలనే వాడినాడు.

**కౌస్తుభమణి వురమువాఁడు :** శ్రీమహా విష్ణువు. కౌస్తుభమణి వక్షఃస్థలంలో కలవాడు.

"పెద్దకిరీటమువాఁడు పీతాంబరమువాఁడు
వొద్దికఁ గౌస్తుభమణివురమువాఁడు" 7-116

## క్రా

**క్రాఁగు :** తపించు, వేడెక్కు.

"కయ్యపుఁగాఁకలఁ గ్రాఁగినతావూ
ఒయ్యన పైపై నుడికీనె" 6-86

## క్రి

**క్రితకము:** విణ. కృతకమునకు వ్యావహారికరూపం.

"క్రితకంబువిషయముల గెలు పెరఁగరాదు"

1-303

**క్రియగా:** క్రి.విణ. ఉపాయంగా(వా.ని.) విలాసంగా, రీతిగా, కర్తవ్యంగా.

"నియతము మా కిదె నీ పాదములె గతి

క్రియగా మ మ్మేల కింక లుడుపవే" 3-420

**క్రియాభాషాంగము:** (?)

"పాటి నా కర్మమే క్రియాభాషాంగము

ఆటకాఁడ నింతె నేను అవధారు దేవ" 2-150

**క్రిష్ణుఁడు:** (2) వి. 'కృష్ణుడు'కు వ్యావహారికరూపం.

"వన్నెలఁ గ్రిష్ణుఁ డింటింటి వాకిటఁ బొంచీని"

24-267

## క్రు

**క్రుమ్మ్ముడి:** వి. క్రొమ్ముడి, వదులుముడి.

"క్రుమ్ముడి జారినవాఁడు కోమలి చిమ్మనంగ్రోవి

చిమ్మెడి పన్నీటమోము చెమరించువాఁడు" 6-5

## క్రొ

**క్రొచ్చిపారు:** (?)

"క్రొచ్చి పారె గుబ్బచన్నుఁగొండల చెమ్మటనీరు" 6-16

## ఖ

**ఖండతుండములు:** వి; బహు. ముక్కలు ముక్కలు.

"ఖరదూషణాదుల ఖండతుండములు సేసి

అరుదుగా వాలి నొక్క యమ్మున నేసి" 29-196

**ఖండమండెఁగలు:** వి; బహు. పులకండము మరియు గోధుమపూరి. (ఖండము = పులకండము ; మండెగ = గోధుమపూరి)

"అరిసెలు గారెలు నవుగులును

కరిజికాయలును ఖండమండెఁగలు" 6-4

## ఖా

**ఖారవుఁదురుము:** గంపెడుకొప్పు. (ఖారము, ఖారి = పుట్టిగంప.)

"వ్వూరికే వద్దఁగూచుండి వొళ్ళిమీదఁ జెయి వేసి

ఖారవుఁదురుము వట్టి భ్రమయించఁగా"

16-102

## గ

**గంగ:** విణ. పెద్ద; క్రి.విణ. బొత్తిగా.

**గంగచిప్ప:** ప.బం; వి. పెద్ద ముత్యపు చిప్ప. (a large white cockle shell అని (బ్రౌన్)

**గంగబా(వా)యిలి:** వి. ఒక ఆకుకూర.

**గంగబాన:** వి. హరిజనులు వాడే అరివేణి బాన.

**గంగమైలావు:** వి. నలుపు – పసుపువర్ణం కల ఆవు. (వ్యు.)

**గంగ్యావు:** (గంగి + ఆవు) వి. సాధువగు ఆవు, గంగిగోవు, విలక్షణమైన సంధిరూపం.

"విడివిడి చేతులతో విద్యముల యాటవాఁడు

అడవిఁగాచేటి గంగ్యావులవాఁడు" 24-112

**గంగ్యావులవాఁడు:** వి. సాధుగోవులు గలవాఁడు. చూ: గంగ్యావు.

"విడివిడి చేతులతో విద్యముల యాటవాఁడు

అడవిఁ గాచేటి గంగ్యావులవాఁడు" 24-112

**గంటగటుక:** వి. గంట కొఱ్ఱల గటుక.

"దేవ నీ దయ యెంతునో దివ్య సులభమెంతునో

కావించి గంటగటుక కాచుకుండే విదివో" 2-38

**గంటవేఁట:** వి. రాత్రిపూట ఆడే ఒకరకం ఆట. ఇందులో దీపాలు, చిరుగంటలు ఉపయోగిస్తారు. (వ్యు.) ఒకరకం వేట అని శ.ర.

"గంటవేఁటలో తగులు కాఁపురమా

కంటవత్తి వెట్టి కాచే కాఁపురమా" 2-34

**గంటి:** వి. 1. గాయం, క్షతం 2. దుఃఖం 3. రంధ్రం. (వ్యు.)

"గరిమ నీ చెలిమనసు గంటిలేనిది గనక

వరుస లోలో మెఱుఁగువలెనె దాఁగీని" 24-1

"శ్రీవేంకటేశ నీ చేతే కాకుండితే

మోవితేనెకు గంటి మొదలఁ గలిగెనా" 24-3

**గంటిపడు:** అ.క్రి. 1.గాయపడు, కాటుపడు. 2.కన్నమేర్పడు.

"తుమ్మెదలు బెదరెను దొండపండు గంటివడె"
7-384

**గంటివెట్టు:** (?)

"గంటివెట్టి వాసులకు గుట్టుతో నేనుండఁగాను
అంటిముట్టి చేయివట్టే వంతేసి వలెనా" 20-357

**గంటుగట్టు:** అ.క్రి. డబ్బు, నగలు మొ॥ వాటిని మూటగట్టు. (గంటు = మూట)

"ఏలే నిష్ఠూరము అంత యేమి గట్టుకొంటి విందు
గాలిఁబోయే వాసనలు గంటుగట్టి నందురా"
19-436

**గంటువేయు:** స.క్రి. ముడివేయు.

"గంటువేసి పోకముడి గట్టిగాఁగట్టినయట్టు
వొంటి గాకుండా నాతని వొడిఁగట్టనేరవా" 8-97

**గంటెసాలాడు:** అ.క్రి. గెంటసములు కు 'గంటెసాలు' వ్యావహారికరూపం, పరుషవచనాలు పలుకు, అస్థలితోక్తులు పలుకు. (వ్యా.)

"కారములుగా నిన్ను గంటెసాలాడఁగ నేల
పేరడైతేఁదమకము పెడరేఁచీ గాక" 23-262

**గంటెసాలు:** వి; బహు. పరుషోక్తులు.

**గండబేటము:** వి. ప్రేమ. (వ్యా.)

**గండవరగోపాలుఁడు:** వి. నెల్లూరుజిల్లా కోవూరు మండలం లోని గండవరమనే గ్రామంలో వెలసిన గోపాలకృష్ణుడు. గండవరంలో వేణుగోపాలస్వామి, ఆంజనేయస్వామి, నరసింహస్వామి, ఉదయ కలేశ్వరస్వామి ఆలయాలు ఉన్నాయి.

"లాలనుము సూచేరు లలన లిరుగడల
బాల గండవరగోపాల నినుజాల"

**గండస్తలి:** వి. చెక్కిలిభాగం. ఇట స్థలులు అనడానికి బదులుగా స్తలులు, అనే ప్రయోగం జానపద వ్యవహారానుగుణం.

"వెలఁది నిన్నుఁ బిలిచె విడెము చేకొనుమని
సెలవుల నవ్వు గండస్తలులు మోవ" 7-411

**గండికాఁడు:** (గండి +కాఁడు) (1) నేర్పరి 2. దొంగ. (వ్యా.)

"మెండగు నీ చుట్టమో మెలుత నీ పొరుగాపో
గండికాఁడ నీకు నబ్బె గంటిఁగా యీ మేలు"
26-581

"యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
పన్నిన గండికాఁడను భళిరా మెచ్చితిని" 11-41

**గండికొట్టు:** స.క్రి. దొంగిలించు.

"వివరించి మా మొర విచారించదగఁదా
కవకవ నవ్వి గండికొట్టుకొంటివా" 11-250

**గండికోట చెన్నకేశవుఁడు:** వి. కడపజిల్లా జమ్మలమడుగు సమీపంలో మైలవరం మండలంలోని 'గండికోట' గ్రామం ఎంతో పురాతనమైనది. ఇక్కడ వెలసిన దేవుడే గండికోట చెన్నకేశవుడు. ఇప్పు డీ దేవాలయం చెన్నకేశవుడు లేక చిన్నబోయింది. అన్నమయ్య కాలంలో ఈ కేశవుడు ఎన్నో వైభవాలతో తులదూగి ఉండవచ్చు.

"ఇరవై శ్రీవెంకటాద్రి యిది యంటూఁగూడితివి
గొరబుచేతల గండికోట చెన్నకేశవా" 27-314

"కొల్లకాఁడ వేర గండికోట చెన్నకేశవా" 20-50

**గంతి:** వి. కంతి, బొప్పి. (వ్యా.)

"గంతివంటి గుణమింతే గాలి వంటి ప్రాణమింతే
యింత రట్టు సేయ నిందు నెడ మున్నదా"
4-453

**గందపుటోవరి:** (గందము + ఓవరి) చందనపు గది.

"గందపుటోవరిలోనఁ గప్పురంపుటింటిలోన
యిందుముఖి పవ్వళించు నింతలోనే లేచును"
5-172

**గందపు బొట్టు:** (2) వి. గంధంతోపెట్టుకునే బొట్టు.

"చెదరెను ముంగురులు చిట్టి గందపుబొట్టు
సుదతి నవ్వులనెంత చొక్కెవయ్యా" 27-532

**గందము:** (14) వి. 'గంధము'నకు వ్యావహారిక రూపం. చందనం. అన్నమయ్య పెక్కు చోట్ల గందము అని అల్పప్రాణదకారంతోనే ప్రయోగాలు చేసినాడు.

"గంతము నీవు చల్లఁగా కాంత సరసమాడఁగా
తంతమాయ మీ చేతలు సరికి జేసి" 25-181

గంపఁగమ్ము : స.క్రి / ప.బం. కప్పిపుచ్చు, దాచు.
"చెప్పరాదు చూపరాదు చిత్తములో తమకము
కప్పిన అవ్వనమిది గంపఁగమ్మ వచ్చునా" 18-305
"నీ వలమేల్మంగవు నిన్నెలె శ్రీవేంకటేశుఁ
డీవల మదనచిన్నలే గంపఁగమ్మేవే" 29-360
"వలపేమి గంపఁగమ్మ వచ్చునా యెందైనా" 10-2-90

గంపంతదురుము : వి; ప.బం. లావైన కొప్పు.
"గంపంతదురుము తోడి గబ్బిచూపుఁగన్నుల
గుఁడెపెన గుబ్బలది మేకులు సేయఁగా" 5-145

గంపఁబెట్టు : (2) ప.బం; స.క్రి. దాచు.
"చాటముగా నవ్వఁగదే వలపులు చల్లి నీవు
గాఁటపు నివ్వెరఁగేల గంపఁబెట్టేవు" 29-142

గంపకెత్తుకొను : ప.బం; స్వీకరించు, పొందు.
"అదరి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁగూడితివి
కడలేని వలపులు గంపకెత్తుకోరయ్యా" 29-526

గంపకొప్పు : వి; ప.బం. లావుపాటి కొప్పు. చూ : గంపంతదురుము.
"చెంపల లప్పలు నిండఁ జెరిగిన కప్పురపు
గంపకొప్పుల సతుల ఘనుఁడాతఁడు" 5-5

గంపగమ్ము : ప.బం; స.క్రి. దాచు, కనిపించకుండా చేయు.
"నీ వలమేలుమంగవు నిన్నెలె శ్రీవేంకటేశుఁ
డవల మదనచిన్నలే గంపఁగమ్మేవే" 29-360

గంపనమ్ము : ప.బం; స.క్రి. బయటపెట్టు, రట్టుసేయు.
"చంపవచ్చిన కర్మసంగ్రహంబగు బుద్ధి
గంప నమ్మక తన్నుఁగాచెనా" 1-187

గంపమోపు కోరికల కాలము : వి. యౌవనం, మిక్కుటమగు కోరికలుండే కాలమని వ్యు. (వ్యు.)
"లంపటమే సహజము లలిదేహధారులకు
గంపమోపు కోరికల కలకాలము" 8-32

గంపమోపు కోరికలు : మిక్కుటమగు కోరికలు.

గంపలకెక్కు : ప.బం; అ.క్రి. సమకూడు.
"చెలిమి చెమటలు నిండుసేయఁగఁ జేయఁగాను
కలిమి గంపలకెక్కు కైకొంటేను" 28-450

గంపలనించు : ప.బం; స.క్రి. కూడబెట్టు, సమకూర్చు.
"చిన్నదానవైతేనేమి చేతలన్నీ నేరుతువు
పన్నుకొన్న సుద్దులు గంపలనింతువుగాని"
29-229

గంపలనుండు : ప.బం; అ.క్రి. సమకూడు.
"కాయపు సుఖములు గంపల నున్నవి" 3-336

గంభీరము : వి. గాంభీర్యము.
"కాంతకును గుట్టు గుట్టు తోడి గంభీరమే
సొమ్ము" 7-217

గక్కదలు : (కదలు + కదలు) 'గ్రక్కదలు'కు వ్యావహారికరూపం. మిక్కిలి కదలు.
"కాంతుఁడ నే నెంతాడినా గక్కదలవు నీవు
యెంత రాతిగుండెవాఁడ వేమి చెప్పేది" 8-175

గగనపు కోరికలు : వి; బహు. అరుదైన కోరికలు, దుర్లభమైన కోరికలు.
"భగవన్నామ నిజపారిజాతము గలుగ
గగనపు మా కోరికలు ఫలించె" 15-70

గగనపునడుము : వి. మిక్కిలి సన్నమైన నడుము అనే అర్థంలో వాడబడిన ఆలంకారిక ప్రయోగం. (గగనం = ఆకాశం లాగా శూన్యమైన నడుమని అర్థం.)
"కంచుమించులగు గగనపు నడుమిది
అంచగమనయే ఆదరువు" 24-53

గగ్గుత్తిక : వి. ఇది డగ్గుత్తికయా? గద్గదస్వరం.
"కూటమై నోరికిమాట కొంత దోఁచవలదా
యేటికో గగ్గుత్తిక నన్నింతసేసీఁగాక" 17-62

గగ్గులకాడగు : (3) అ.క్రి. చెల్లా చెదరగు, కలతపడు.

"పరచి గగ్గులకాడై పారరో దానవులు
మురవైరి పంపులవె ముందరసేవ లవె" 2-79
(గగ్గు = సంతోష గద్గదము, సంకోచించుట అని ఆం.ప.ని., గగ్గులకాడు గావించు = చంపు అని ఆంధ్ర భాషార్ణవం.)

**గచ్చకాయలాట:** వి. బాలికలు గచ్చకాయలతో ఆడే ఒకరకపు ఆట.
"యెడ యెఱిఁగి యా మీఁద యిల్లు ముంగిలెఱుఁగకె
వెడ గచ్చకాయలాట వెఱ్ఱిగాదా" 15-67

**గచ్చకాయలాడు:** అ.క్రి. గచ్చకాయలతో ఆట ఆడు.
"గచ్చకాయలాడే నిన్ను గాఁగిలించుకొని వట్టి
కొచ్చికొచ్చి చన్నులనే కూడాడిరి" 21-231

**గచ్చు(లు)సేయు:** (3) ప.బం; అ.క్రి. మాయ(లు)చేయు, విలాసములు చూపు.
"పచ్చిమాటలాడేవు బయకాఁడా
గచ్చులు సేతురా నీవు కాతరీఁడా" 26-420

**గచ్చులఁబెట్టు:** స.క్రి. మాయలఁబెట్టు.
"మెచ్చేవంటా నుంటిఁగాని మేకులకు మాటలాడి
గచ్చులఁబెట్టేది యెరఁగలేనైతి" 27-98

**గచ్చులకొడిమెలు:** వి; బహు. అసత్యపు అపనిందలు.
"మచ్చిక నీ మీఁదిది మరొకతపై వేసి
గచ్చుల కొడిమెలేల కట్టేవే ఆతనికి" 14-338

**గచ్చుల వినయములు:** వి; బహు. కపటవినయాలు.
"యిచ్చకమాడుదురుగాని యియ్యకొంటిఁబోరా
గచ్చుల వినయములు గాక మానీనా" 9-42

**గచ్చులసిరి:** వి. మాయలాడి లక్ష్మి.
"గచ్చుల సిరి మోహాన కమలాన వేయఁగాను
తచ్చి రుక్మిణి పూవులదండ వేయకుండునా" 8-286

**గచ్చులాడి:** (గచ్చులు+ఆడి) డాంభికురాలు, మాయలాడి.

**గచ్చులు:** (29) వి; బహు. 1. దంభములు, డాబులు 2. కపటాలు, అబద్ధాలు, మాయలు, విలాసాలు, శోభ. అబద్ధాలు అనే అర్థంలో ఈపదం ఈనాటికీ వ్యవహారంలో ఉన్నదని సం.ప.స. (16 వాల్యూం. అనుబంధం)
"కొచ్చినఁ గొరయవు కోపములు
గచ్చుల గుణములు గల నాళ్లు" 4-343
"యిచ్చకమాడుదురు గాని యియ్య కొంటిఁబోరా
గచ్చుల వినయములు గాక మానీనా" 9-42
"ఇచ్చట శ్రీవేంకటేశు నెనసితివి రట్టేల
గచ్చుల నీడేల పొత్తు కలదె యిద్దరికిని" 7-412
బంగారము, సున్నము మొ॥ వాని పూత:
"అచ్చపు టుంగరముల అందెలుఁ బాయవట్టాలు
గచ్చుల ముంజేతుల కంకణసూడిగేలది" 9-79

**గచ్చులు సేయు:** అ.క్రి. మాయలు చేయు, నటనలు చేయు.
"మచ్చికకు వెలలేదు మాటలకుఁ దుద లేదు
గచ్చులేల సేసేవే కాంతుని తోను" 23-340

**గచ్చువిచ్చగు:** కార్యవైకల్యమగు.

**గజకరపుఁదొడలు:** వి. ఏనుగు తొండాల్లాంటి తొడలు, వింతరూపం.
"మఱి గజకరపుఁ దొడల నఱిచిఁ బగడపులతలు
అఱింట్లందముగాక అందుకేలా" 23-347

**గజదంతపరీక్ష:** ప.బం; వి. అవసరం లేనిది, తగని పని; గజములకు దంతములున్నవా లేవా యని పరిశీలింపబోవడం తగని పని అని భావం.
"నిర్మితము నీవింతె నెరసు లెంచఁగనేల
ధర్మమందునిక గజదంతపరీక్షేటికే" 5-322
"సరి గజదంతపరీక్షలు చూడనెంతవాఁడ
ధర శ్రీవేంకటేశుఁడ దాసుఁడ నీకు" 15-124

**గజనరసింహుఁడు:** వి. గొప్పనరసింహుడు.
"కనకపుకాశవాఁడు గజనరసింహుఁడు" 25-183

**గజబ(భ)జించు:** స.క్రి. కలవరపఱచు,

కలతపరచు, గజిబిజిచేయు.

"కంచు మట్టియుల రవంబు గజబజింపఁబడము దా

టించు గబ్బి నడపు నడచు మించు

గుబ్బలాఁడివి" 5-24

గజబలియు: అ.క్రి. మిక్కిలి బలియు. (గజదొంగ లోని గజ వంటిది)

"కాంత కుచంబులు ఘనదుర్గంబులు

కాంతి అక్కవలు గజబలిసి" 24-123

గజబిజ: వి; ప.బం. 1. తమకం, ఉద్రేకం 2. క్రోధం, కలత 3. గ్లానత 4. పీడ 5. అల్లరి 6. సందడి.

"త్రిజగములు నితఁడే దిక్కె కాచీ నిదె

గజబిజ లింక నుడుగరో రాక్షసులు" 15-156

గజబిజ: వి; ప.బం. గందరగోళం. రూపాం. గజిబిజి.

"త్రిజగాన నాతనిఁ జేరిన దాసులిదె వీరె

గజబిజ లిఁక నుడుగరో రాక్షసులు" 2-487

గజభజించు: అ.క్రి. కలవరపడు, కలతపడు.

"కట్టిన నీ దువ్వ(ప్ప)టము గజభజించఁగనీ

దిట్ట మాటలివి మాకుఁదెలియవు గదే" 19-570

"కంచుమట్టియుల రవంబు

గజభజింపఁబడముదా

టించు గబ్బినడపు నడచు

మించుగుబ్బలాఁడివి" 5-241

గజభజింపు: స.క్రి. "గజిబిజింపు"కు రూపాం. కలవరపెట్టు, కలతపెట్టు.

"గజభజింపుచు వచ్చి కాచుక నుతించేటి

ద్విజమునిసంఘముల దేవసింహమా" 2-363

గజరు: వి. ఉదుటు, మదం, కోరిక, కామం.

"చన్నులేల పిసికేవు బుజమేల గీరేవు

ఇన్నేసి నీ గజరుల కేమందును" 19-240

"కూనైన నాటి నీ మదమెల్ల దిగవలె

కలికైన నాటి నీ గజరెల్ల దిగవలె" 6-345 old

పూలగుత్తి, చేతికి వేసుకునే పూలకంకణం:

"పందెపు శ్రీవెంకటేశ పడుచు లేడ యిట్టి యా

సందడి నీ గజరులు చల్లేవు గాక" 25-368

పులకలు, నలిగిపోవుటలు:

"నిజము నెరపరాదా నేఁడు మాతోను

గజరులు దెలిసితే కాఁతాళించేవు" 18-323

మదము:

"కంటకము నా కున్నదా గజరుఁగాంతలఁ బొంది

అంటుకొని నా మేను అలమేవుగాక" 13-410

ఈ పదం గదురునకు రూపాంతరం కావచ్చును. దుర్గంధమని యర్థము. గజరుఁ గాంతలనగా చెంచు, గొల్ల మొదలగు జాతుల స్త్రీలు కాగలరు. అని సం.ప.స. (13 సం. 1 అను. 3 పు.) కాని ఈ అర్థం కన్నా పైన పేర్కొన్న అర్థాలే సముచితంగా ఉంటాయేమో!

గజరుఁజేతలవాఁడు: వి. ఉదుటు చేతలవాడు.

"తక్కక గజరుఁజేతలవాఁడు నీ మగఁడు

యెక్కడా లేనిదా యందు కే మాయనే" 18-7

గజరుఁదనము: వి. కోరిక, కామము, మదం

"కందువ మర్మములంటి గజరుఁదనముల చూపి

యెందరితో నవ్వు నవ్వి యెలయించేవు" 19-78

గజరుచేతలు: వి. ఉదుటుచేతలు.

"గుజగుజఁబొయ్యేవు కొంకి కొంకి నీకు నీకే

గజరు నీ చేతలకు కమ్మరా నే మందురా" 21-510

గజస్నానము: ప.బం; వి. వ్యర్థం, నిరర్థకం, ఏనుగు బాగా నీళ్లలో మునిగినా పైకి వచ్చి తిరిగి ఒళ్లంతా దుమ్ము చల్లుకుంటుంది. అందుపై ఏర్పడిన పలుకుబడి.

"గరిమల నమ్మేతు వినని కథలు భువి

గజస్నానములు" 2-235

గజ్జలపేరు: వి. గజ్జెల హారం.

"దొంగిలి గజ్జలపేరు తొలఁగఁబెట్టఁగఁబోతే

వెంగలితనమె కాక వినకమానేరా" 1-45

**గజ్జులు:** వి. 'గజ్జెలు'కు వ్యావహారికరూపం.
"అందిన కటిహస్తము నభయహస్తమువాఁడు
అందెల గజ్జలఁ బాదా లమరువాఁడు" 7-116
"గజ్జల గరుడునిపై కలికి విభునిఁగూడి
ముజ్జగములఁ దిరిగి మొగి నలసితివి" 5-273

**గటియించు:** స.క్రి. 'ఘటియించు'కు వ్యావహారికరూపం. కలిగించు.
"గటియించి శ్రీవేంకటపతి నీ దాసు
లిటువలె ఘనులైరిదివో నీ కృపను" 4-366

**గట్టిపీట:** వి. బల్లపీట.
"కలసి నీవద్ద నేను గట్టిపీటపైఁ గూచుండి
మొలబంటి యాయరా యిమ్ముల వలపు"
8-190

**గట్టిరాళ్లతో మలిగండ్లేరు:** నానుడి; అనుచితమగు పనికిపూను.

**గట్టివాయ:** వి. గట్టి నోరు గలవాడు, ధూర్తుడు.
"శాంతుఁడవో గట్టువాయ జాణతనమో యిట్టె
మంతుకెక్కించే నామీఁది మన్ననో యిది"
8-175

**గట్టివాయి:** (గట్టి + వాయి) వి. మాటకారి, (గట్టి నోరుగలది అని వ్యుత్పత్తి) ధూర్తుడు. రూపాం. గట్టువాయి
"గట్టివాయి వౌదువు గద్దరీఁడ వౌదువు
యిట్టి కాని కిచ్చితిమి యిఁక రావయ్యా"
14-109

**గట్టివాయితనము:** వి. గయ్యాళితనం, ధూర్తత్వం.
"కన్నెముద్దరాలు నీతో గట్టివాయితనము దా
సన్నల చాయలనే చలపాదిఁజేతురా" 25-199

**గట్టువా:** వి. ధూర్తురాలు.

**గట్టువాయ:** ఇది 'గట్టివాయి' కావచ్చు. చూ: గట్టివాయి.
"యిట్టె శ్రీవేంకటేశుతో నెన్ని మాటలాడేవే
గట్టువాయవై నోరఁగాయ వేయక" 22-270
"యెంత గట్టువాయ యిది యేడఁ గలిగె నీకు
యింతి యెందుండి వచ్చెను యెవ్వతెయ్య"
12-431

**గట్టువాయతనము:** (13) వి. ఇది గట్టివాయితనము కావచ్చు. గయ్యాళితనం, ధూర్తత్వం.
"ఎంత గట్టువాయతన మి దేమే వీఁడు
అంతకంత కేమన్నా నస మీఁదే వీఁడు" 11-182

**గట్టువాయవాఁడు:** వి. ఇది గట్టివాయవాడు కావచ్చు. గట్టినోరుగలవాడు, గయ్యాళివాడు, ధూర్తుడు.
"ఎంత గట్టువాయవాఁడ వేమి చెప్పేది
కాంతసేవలల్లా నీవు కనుగొనరాదా" 14-587

**గట్టువాయి:** (3) ఇది 'గట్టివాయి' కావచ్చు. చూ: గట్టివాయి. ధూర్తుడు, ధూర్తురాలు.
"పొలసి నీవు నన్నుఁ బూవులను వేయఁగాను
కలఁగక వుండితేనే గట్టువాయినా" 23-516

**గడకుఁగట్టిన పాఁత:** ప.బం; వి. చంచలమైనది, కట్టెకు పైన కట్టిన గుడ్డ గాలికి ఎప్పుడూ కదలుతూనే ఉంటుంది అనే దానిపై వచ్చిన పలుకుబడి.
"గడకుఁగట్టిన పాఁతగతి దోచే మనసు
అడుసులోపలి కంబమై తోచె మనసు" 1-337

**గడసాము:** వి; ప.బం. వెదురుగడపై చేసే సాము.
"బీరపు సాములు మాని పెద్ద గడసాము నేర్చి
తోరపుఁబగతు లెల్ల దొమ్మరు లైరి" 2-246

**గడాట:** (గడ + ఆట) దొమ్మరులు ఆడే ఒక ఆట.
"గడాటాడె వానిం గంటె కన్నవారికి వేడుక
అడుగడుగు ప్రయాస మటు వానికి" 15-286

**గడిచీటి:** (3) వి. గడి = సీమ, పొలిమేర, పరిహద్దు అని సూ.ని. గడిచీటి అంటే ఒక హద్దు పూర్తి అయిందని తెలిపే చీటి. 1. ఈనాడు ఉద్యోగవిరమణకు ముందు ఆ విషయాన్ని తెలియజేస్తూ పంపే చీటి వంటిది.
2. రహదారిపత్రం, విడుదల పత్రం.
"గడిచీటి వాపవు సరమేదో చూపవు

ఆముకొని నన్నే లప్పణడిగేవు నీవు" 14-491

గడ్డాయము: (2) వి. బలాత్కారం. రూపాం. గడ్డెము.

"చెనకి గడ్డాయముగాఁ జేసిన బాసలెల్ల
అనువుగా నడవఁగ నల్లాడఁబడెనా" 10-2-63

గడ్డివయసు: వి. అల్పకాలపు వయసు.

"బొడ్డుతామెరలోన గడ్డివయసు పెద్ద
బిడ్డఁ గన్నట్టివాఁడు పిన్నవాఁడు" 4 అను. 36

గడ్డెము: వి. గడ్డాయం, ఖడ్డాయము, బలాత్కారం (వ్యు.) బ్రౌణ్యం లో ఈ పదానికి see కడ్డాయము అని ఉంది. కడ్డాయమునకు బ్రౌణ్యం లో compulsion, force, exaction, forcing people to pay the price set up on articles వర్ల గడ్డాయము, ఉప్పు కడ్డాయము అని కలదు.

"ఎంత చులుకఁగఁ జూచేవయ్యా నీవు
కొంత నీపై వలపులు గడ్డెము వేసీనా" 25-309

"జిడ్డు దేర నీ వేల చేతులు పైఁజాచేవు,
గడ్డెము వొద్దని నీకుఁగమ్మ లంపనా" 21-168

గణికె: వి. (?)

"చూపరాని సంసారమే సూత్రపుగణికె
కోపుల నాలికెలోనఁ గుచ్చినట్టి తాడు" 3-467

గతచన్న పితరులు: వి; బహు. గతించిన పితరులు; గత, చన్న అనేవి ఇట సమానార్థకాలు.

"గతచన్న పితరు లక్కడ నెవ్వరో
హితవై యిప్పటి పుత్రు లది యెవ్వరో" 4-382

గతచన్న వేదాలు: వి; బహు. అపహరింపబడిన వేదాలు.

"గతచన్నవేదాలు కమలజునకు నిచ్చి
అతని కరుణచేత నన్నియుఁగని" 1-162

గతజలంబుల అడ్డకట్టు: ప.బం; అ.క్రి. నిరర్థకం, వ్యర్థం, గతజలసేతుబంధనం.

గతజలముల కట్టగట్టు: ప.బం; అ.క్రి. నిరర్థకం, వ్యర్థం. నీరంతా పోయిన తరువాత కట్టగట్టడమని వాచ్యార్థం.

గతజలసేతు బంధనం: ప.బం; వి. నిరర్థకం, వ్యర్థం. (నీరంతా పోయిన తరువాత సేతువును నిర్మించడం వ్యర్థమే కదా!)

"అన్నియు నిన్ని వెనక ననఁగా నేమి
చెన్నుమీరె గతజల సేతుబంధాలు" 9-154

గతమగు: అ.క్రి; ప.బం. మరణించు.

"అనంతుఁడు శ్రీవేంకటేశుఁడు జనియించె
ఘనశిశుపాలాదులు గతమైరి" 4-20

గతముసేయు: ప.బం; స.క్రి. 1. పారఁద్రోలు 2. చంపు.

"కదిమి దుష్టులను గతముసేసితివి
త్రిదశులఁ గాచిన దేవుఁడవు" 28-490

గతిగా: క్రి.విణ. ఉపాయంగా.

"గతిగా శ్రీవేంకటేశ కలిసితి విటు నన్ను
యితవరి యిది యెంత యిచ్చకురాలనరో" 11-447

గతిలేని కూటికిఁగన్నదే కూడు: సామెత; గతిలేనప్పుడు దొరికిందే గొప్ప.

"పతి లేని భూమికి బలవంతుఁడే రాజు
గతిలేని కూటికిఁగన్నదే కూడు" 2-63

గతుగతుకు: (గతుకు + గతుకు) నాకి తాగడం.

"యీవల వాన గురిసి యే రెంతబంటి వారినా
కావరపు జీవునకు గతుగతుకే" 2-33

గతులు: వి. నాట్యప్రక్రియలు (?)

"వొగి శ్రీవేంకటగిరినుండి వచ్చి మాడుపూర
గుత్తము నెగసిగసి గతుల కిటు లాడేవా" 3-179

గత్తము: వి. ఎరుపు, గొర్రెపెంట అని తె.వ్యు.కో.

"హత్తుకొని మోహంబులను ప్రధానుల యెదుట
గత్తంపు మొగసాలఁగల దించవలసి" (?) 4 అను. 27

గదరుఁబిల్లి: వి. (?)

"కమ్మని మా మయిపూఁత గదరుఁబిల్లుల గబ్బు
యెమ్మెల మా పట్టుచీర యేపెనార" 5-121

గదరుకొను: తిరస్కారంతో కోపపడు, కోపగించుకొను, కసరుకొను, చీదరించుకొను. (ధర్షించు అని ఆం.ధా.మా.)
"కన్నుల దప్పక చూచి గదరుకొన వేమే
మన్నన నాతో సరి మన్నించు డనుచు " 9-99
"యెదురాడేనా నేను యేమని తాఁజెప్పినాను
గదరుకోఁజోలేది కటకటా" 26-167

గదుములు గట్టు: అ.క్రి; ప.బం. బొప్పులుగట్టు, నెట్టులుగట్టు; ఇది కదుములు గట్టు అనుదానికి వ్యావహారికరూపం కావచ్చు. కదుము = దెబ్బ తగిలినచోట రక్తం పేరుకొని వాచే వాపు (తె.వ్యు.కో.)

గద్దరి: (6) విణ. 1. పొగరుగల 2. దుష్టం 3. నిపుణుడు 5. నేర్పుకత్తె 6. దిట్ట 7. దట్టమైన (వ్యు.) గడుసైన (బ్రౌన్) నేర్పరి, గడుసరి.
"గద్దరివై నన్ను శ్రీవేంకటనాథ కూడితివి
అద్దో పరివారకురా లందుకు నోపుదునా" 10-211

గద్దరికన్నులు: (2) వి; బహు. దిట్ట (నేర్పుగల) కన్నులు, గడుసుకన్నులు.
"ఇద్దరి కిద్దరే సరి యీడుకు జోడుకుఁదగు
గద్దరికన్నులఁ జూడఁగలిగెఁగా మనకు" 24-125

గద్దరికాఁడు: (2) (గద్దరి + కాఁడు) వి. నేర్పరి, నిపుణుఁడు, గర్వి, పొగరు గలవాఁడు (వ్యు.) గడుసువాఁడు (బ్రౌన్)
"కలికి గుట్టుతోడిది గద్దరికాఁడవు నీవు
వలసినట్టు సేసితే వద్దనేవా రెవ్వరు" 29-510

గద్దరితనము: (2) (గద్దరి + తన) వి. పొగరు, ధైర్యం, నేర్పు, గడుసరితనం, తుంటరితనం.
"పెద్దరికానఁ జెలియ పీఁట మీఁదఁగూ
గద్దరితనాన నీవు కాఁతాళించేవు" 25-262
"ఇద్దరుఁ గూడుండుతే నేకచిత్తమౌఁ గాక
గద్దరితనా లింతేసి కడుఁ దగదయ్యా" 20-421

గద్దరివాఁడు: వి. 1. నేర్పరి, నిపుణుఁడు, గడుసరి
"గద్దెమీఁద నున్నవాఁడు కరుణా నిధైనవాఁడు
గద్దరివాఁడు గదె యీ ఘనుఁడు వో చెలియ" 28-435

గద్దరీఁడు: (4) (గద్దరి + ఈఁడు) వి. నేర్పరి, నిపుణుఁడు, గడుసరి, దిట్ట.
"గట్టివాయ(యి) వౌదువు గద్దరీఁడ వౌదువు
యిట్టె కాని కిచ్చితిమి యిఁక రావయ్యా" 14-109

గద్దెన: వి. 'గద్దన'కు రూపాం. గద్దింపు.
"పంతమాడి నీ మోవిఁ బచ్చిసేఁత సేసితేను
కాంత నేల దూరేవు గద్దెనతోను" 19-153

గద్దెపీఁట: (4) వి. ఎత్తుగా ఉండే పీట, బల్లపీట.
"అర్ధమ రేతిరికాడ నాతఁడింటికి విచ్చేసె
గద్దెపీఁట పెట్టరే కాంతలాల" 28-29

గద్దెరాతి కనుమ: వి. ఇది నేడు 'సుద్దరాతి కనుమ' అనే పేరుతో వ్యవహరింపబడుతుంది. ఇది తాళ్ళపాక సమీపంలో ఉంది. (చూ: ఎఱ్ఱశిల కనుమ)
"కలికి నీ పిఱుఁదనే గద్దెరాతి కనుమ
మొలనూళ్ల లతలనే ముంచుకొన్నది" 5-115

గన: (4) అవ్య. 'కనుక'కు వ్యావహారికరూపం. ఈ 'గన' తెలంగాణామాండలికంలో 'గిన' అనే రూపంలో ప్రయోగంలో ఉంది. నేను గిన. (= నేను గనుక)
"కడు ముద్దరాలు గన కక్కసింప నోపదు" 11-101

గనము: (17) విణ. 'ఘనము'నకు వ్యావహారికరూపం. గొప్పది.
"కలగూరా వల పేమి గనముగాఁ గొసరఁగ
పలుకుఁబంతము నొకపాటి గావలదా" 25-226

గనమె: వి. 'గనిమె' కావచ్చు. మడికి చుట్టు ఏర్పడ్డ చిన్న కట్ట, గట్టు (శ.ర.) రూపాం. గనెము.
"ఘనమైన పిరుదుపై కట్టేవు మొలనూళ్ళు
గనమెలు జవ్వనాన కొనరించేవా" 13-93

గన్నెర: వి. 'గన్నేరు'కు రూపాం. గన్నేరు అనే పూవు.

"సంపెంగనూనె యంపేవు పారెసారె నందుతోనె
అంపవైతి గన్నెరలు అప్పుడైనాను" 5-87

గబుకః వి. కబళం.

"చిబికివేసిన గింజ చేతఁబట్టఁగ నేల
గబుక కెంగిలిబూరె గడుగఁగ మరి యేల"
2-494

గబ్బిః విఱ. 1. గర్వి, దుష్టుడు 2. నిక్కినది, నిగిడినది 3. గొప్పవాడు, ఘనుడు 4. ధీరుడు. వి. 1. గాంభీర్యాన్ని బట్టి కుక్కకు పెట్టినపేరు. 2. కపటం, దుష్టత్వం.

"శ్రీవేంకటేశ నిన్నుఁ జెనకితే గబ్బి నాదు
యీ విధాన నా పొందు నీ కితవైతేఁ జాలునూ"
12-64

"నెట్టన నిన్ను రమ్మంటే నిండు రాజసమందురు
గట్టిగా నే వచ్చితేను గబ్బి నందురు" 20-574

గబ్బికుత్తికః వి. ఘనమైన కుత్తికె.

"మంచముపై నిద్దరము మంతన మున్నంత వడి
కంచువలె వాఁగెను నీ గబ్బికుత్తికె" 11-562

గబ్బిటొళికాఁడుః వి. రూపం స్పష్టంగా లేదు. బింకంకల విటుడు అని కావచ్చు.

"పలచని కొనగోరి బదనికలు సోఁకించి
కళలు రేఁచి చొక్కించే గబ్బిటొళికాఁడు"
26-362

గబ్బితనముః వి. గర్వం, పెద్దతనం, ధైర్యం, కాపట్యం, దుష్టత్వం.

"కాంతలకుఁ బతులతో గబ్బితనమే వన్నె
కొంతపుఁ జూపుతోడి మంకుఁదనమే వన్నె"
21-254

"కన్నెపాయపుదానికి గబ్బితనమే ఘనము"
13-508

గబ్బిదిః (గబ్బి + అది) గర్వం కల స్త్రీ, అభిమానం కల స్త్రీ, ధీరురాలు, గొప్పది.

"సిగ్గువడవుగదా! చెలులఁ దారుకాణించే
కగ్గి కల్ల కోరువని గబ్బిదానను" 11-585

గమ్మిః వి. బంగారు లోనగువాని పొగదీసిన కమ్మి. బంగారుగమ్మి + ఔగాక = బంగారుగమ్యోగాక అని విలక్షణమైన సంధి.

"బలిమి నీలానకు బంగారుగమ్యోగాక
నెలవై శ్రీవేంకటేశ నీలము గమ్యోనా" 7-372

గరగరనిః విఱ. చక్కని, నునుపైన, రుచ్యమైన, చక్కనైన, పరిశుభ్రమైన.

"గరగరని కురులతో కస్తూరివాసనలు
విరితావులతోడ విసరఁగాను" 5-54

గరగరికః వి. 1. విధం 2. నైర్మల్యం 3. చక్కదనం 4. సింగారం, అలంకారం 5. శృంగారరసం (తె.వ్యు.కో.) విఱ. 1. సుందరమైన 2. పరిశుభ్రమైన 3. ఒప్పులు 4. అందములు, శోభలు. (పర్యాయ.)

"నెరవుగ శ్రీవిష్ణుభక్తి నిలుకడైన మిరకదా
గరగరికలనె శ్రీవేంకటనాథునిఁ జేరుటా" 10-4

"గరగరికలన్నియును కలసినందాఁకా
విరసంబులన్నియును విసుగునందాఁకా"
1-249

గరగరికెః వి. 'గరగరిక'కు వ్యావహారికరూపం. చూః గరగరిక.

"సరుగున మేలుకొని సరసపుఁగౌఁగిట
గరగరికెల నన్నుఁ గలసీని" 5-338

గరడిః వి. ఇది 'గరిడి'ఐ ఉంటుంది. సాముచేసేచోటు.

"కలఁచకున్నా భోగాలు తనువుతోఁబెనఁగీని
చెలరేఁగి 'గరడి'లో జెట్లవలె" 2-331

గరబుః వి. ఇది 'గరవు' కావచ్చు. 'గరవు' అంటే కానుక. గరవు = To draw the whole forwards oneself; to take any or seize all. సర్వాకర్షణ అని కిట్టెల్. అదియే గరబు కావచ్చు. కౌగిలింతతో సర్వము నాకర్షించుట అని ప్రకరణ భావమునకు సరిపోవు చున్నది. (సం.ప.స. 22 సం.)

"కసరుల నానాగరబులు నమ్మి
పొసఁగ నీ కాఁగిట బోయతి" 22-90

గరువము: వి. గర్వమునకు వ్యావహారికరూపం. 'గర్వ'లో ముఖ్య ఆకారాగమం. నిఘంటువుల్లో గరువము అనే రూపమే కాని గరవము లేదు.

గరి: వి. రెక్క.
"కొంతపెత మీదలలో గూరుసుండు మనమే
నింతునిపులిగరులు నెత్తికెక్కెను" 11-93

గరి: విశి. వాడి. వి. వాడిమి.
"గరుడడే తనకును గరియగు బాణము"
"కక్కసించీ మరునంప గరులు
యిక్కువేఁ జెయిదాఁచర యివె కుచగిరులు"
7-390

గరింతు: స.క్రి. 'గర్హించు'కు వ్యావహారికరూపం. నిందించు.
"వన్నెలు గట్టులంటాను సారె గరింతుము గాని"
29-427

గరిడీ: వి. అభ్యాస స్థానం, సాము చేసే చోటు.
"కరఁగించకు మనసు కడపరాయ నాకు
గరిడీ నీ కాఁగిలి కడపరాయ!" 18-403

గరితె: వి. 'గరిత'కు వ్యావహారిక రూపం, పతివ్రత, రాణి, భార్య.
"రాసికెక్కిన గరితె రవ్వ సేసి మాటాడదు
మూసినముత్తెమువలె ముచ్చటలే యాడును"
23-49

గరితెతనము: వి. పాతివ్రత్యం.
"పోటి గరితెతనాన బువ్వము గలయవచ్చె
చోటిచ్చి తొడపైఁ బెట్టి సుద్దు లడుగవయ్యా"
29-118

గరిపడు: అ.క్రి. గరుకగు, కలియబడు, ఢీకొను, స్పర్ధించు, గడ్డకట్టు; తగుల్కొను, చిక్కువడు అని వేటూరి ఆనందమూర్తి. 444 పు.
"మూలనున్న నిట్టూర్పు ముంగిట నేల వేసేవే
గాలిగొట్టె యధరము గరిపడీని" 7-44

గరిమె: వి. 'గరిమ'కు రూపాం. గొప్పతనం, లావుదనం, (విధం, రీతి) అన్నమయ్య 'గరిమ' అనే రూపాన్ని కూడా వాడినాడు.

గరివడు: అ.క్రి. కరుకుపారు, మోటువారు కావచ్చునని సం.ప.స. వ్యర్థమగు. చిక్కువడు, తగుల్కొను.
"గరివడ్డ పెసరు కందువకొసరు
యెఱిగిన పనులే యేమిటికి" 23-476
"తెలిసియుఁ దెలియని తెగడీ చిక్కే మిటా!
కలకాల మిందుననే గరివడీ బ్రదుకు" 3-398
"తిరువేంకటాద్రిపై దేవునిఁ గొలువక
గరివడె భవ మెల్ల కర్మశేషం" 1-113
గరివడు = గడ్డకట్టు అని సూ.ని. (ఇక్కడ గరివడునకు గూడ దాని గౌణార్థమైన శుష్కమైన అనుట తగును అని సం.ప.స. 13 వా. 3పు.) కాని ఇది సరి కాదని 'గీతలు పడు' అనే అర్థమే సరియైనదని గంగప్పగారి అభిప్రాయం. (ఆ.సం.పా. రా.మాం. పుట 73) దీనికి ఉదాహరణంగా ఈ కింది కీర్తనను ఉదాహరించినారు.
"యేకటతో నుండేటి ఇచ్చకపురమణుని
కాకల నీవు నవ్వితే గరివడదా
పీకతో నీ నాయకుని వెసఁ జన్నులనొత్తేవు
తేకువ నాతని మే నొద్దిక గాయగాయదా"
26-322

గరివడు: నిలిచిపోవు. (వ్యు.) తగుల్కొను, చిక్కువడు అని వేటూరి ఆనందమూర్తి. 444 పు. గడ్డకట్టు అని సూ.ని.

గరివి: వి. 'గర్వి'కి వ్యావహారికరూపం. గర్వం కలవాడు.
"ముంపు నే గరివినైనా మొదల వినయి వాఁడు
పెంపునఁ దానెవచ్చీఁ బిల్వరే వాని" 11-188

గరిసించు: (44) అ.క్రి. 'ఘర్షించు'కు వికృతి కావచ్చు. ఎదిరించు సూ.ని. కరిసించు అని గ్రహించి ఘృష ధాతుభవము = ఎదిరించు అను అర్థమిచ్చినది. అని సం.ప.స. 13 వాల్యూమ్ 3 పుట.
"కనుఁగొంటే సవతులు గరిసించకమానరు"
23-447

అం.క్రి. మ. దీ. లో ఈ పదానికి అతిశయించు, జయించు అనే అర్థాలు చూపబడ్డాయి.

**గరుడఁడు**: (5) వి. గరుడుఁడు, డకారం మీది అకారానికి ఉత్వం రాకపోవడం విశేషం. నన్నెచోడుడు కూడా ఈ రూపాన్ని ప్రయోగించినాడు.

"ఇటు గరుడని నీ వెక్కినను
పట పట దిక్కులు బగ్గనఁ బగిలె" 1-92

**గరుడగంభము**: (3) వి. గరుడస్తంభం, తిరుమలలో గరుడకంబము, ప్రస్తుతం బేడిఆంజనేయస్వామివారి వద్దనున్న స్తంభం.

"గరుడగంభమువద్ద గల శ్రీవేంకటపతి
వరుస సేవించరో వర మిచ్చీని" 15-180

"గరుడగంభముకాడ కదుఁబ్రాణాచారులకు
వరములొసఁగీని శ్రీవల్లభుఁడు"

3-511 & 1-320

"గరుడగంభము కాడ కాసుకొక్క వరమిచ్చి
గడియించఁదెలిసె మీ సంపద" (శేషాచార్యుల వ్రాతప్రతి)

**గరుడపచ్చఁబూస**: వి. పచ్చవన్నెల మాణిక్యం.

"కాంతుల మూఁడు లోకాల గరుడపచ్చఁబూస
చెంతల మాలో నున్న చిన్ని కృష్ణుఁడు" 9-288

**గరుడాచలము**: వి. శ్రీవెంకటేశ్వరస్వామి నెలకొన్న సప్తగిరులలో ఒకటి.

"గరుడాచలంబనఁగా శ్రీవేంకటశైలంబనఁగా
గిరులకు నేలికెయగు ననంతగిరి దా నీగిరి
యనఁగా" 15-160

**గరుడి**: వి. గరుడుడు. (శ.ర.)

"ఆపె గరుడిఁ జదివినటువంటి మాఁటలు
రాపుల నిదివో నేఁడు రచ్చకెక్కెను" 21-351

**గరుపా(టు)రు**: ప.బం. అ.క్రి. గగుర్పాటు చెందు, మీదికి తూలిపడు.

"మందలించి యా డేడ మడుగులు చొచ్చితివో
యిందు నీ మై గరుపారె నిటువలె గలదా"

11-332

"వింటే మేను గరుపారీ వినోదపు నీ సుద్దులు"

21-125

"మందలించి యా డేడ మడుగులు చొచ్చితివో
యిందు నీ మై గరుపారె నిటువలెఁ గలదా"

11-332

**గరువతనము**: వి. గర్వం. 'గరువ' శబ్దంపై స్వార్థంలో తనప్రత్యయం.

"తరుణులు నీతో జాణతనములాడఁగా
గరువతనాన మాటకారివైతివి" 10-2-36

**గరువము**: వి. గర్వం అనేదానికి వికృతిరూపం.

"సొరిది గుబ్బల నొత్తి చొక్కించవలెఁగాక
గరువానఁ గూడితేను గరివడదా" 23-70

**గరువించు**: అ.క్రి. గర్వించు.

"కాంత నితరుల కింద గరువించు కంటె (?)
మతిఁ
జింతఁగందుచు నలయు సిలుగె మేలు" 5-212

**గలభి**: వి. అల్లరి, గలభా, గొడవ.

"వెలఁది పాటవాఁడఁగా వింటా నున్నాఁడాతఁడు
గలభి సేయకురే కాంతలాల" 23-2

**గళబెళము**: వి. (?)

"వొప్పుగ నుయ్యాలమీఁద నూగుకొంటా
నుంటిరి
కప్పుకొంటిని రెంటెము గళబెళము" 23-15

"అరిమురి గళబెళమను పయ్యెదతో
విరుల నే లతని వేసేవే" 28-98

**గళువు**: వి. గడువు (?)

"పెంచక పెరగే నవె పెనుఁజీఁకటితీగెలు
అంచె నీ యారచి కత కారు నెల్లు గళువు"

29 అను. 11కీ.

ఇందులో ఈ పదం మూడుసార్లు ప్రయోగించబడింది.

**గవాక్షి**: వి. గవాక్షము, కిటికీ. గవాక్షము అనుటకు బదులుగా 'గవాక్షి' అని ప్రయోగించడం విలక్షణం.

"తొలఁగక గవాక్షుల తొంగిచూచెనో నిన్ను
వెలినుండే తనెలుఁగు వినుపించెనో" 27-516

గవిశన: వి. 'గవుసెన'కు వ్యావహారికరూపం;
1. వీణ, విల్లు మొ॥ వాటిని తొడిగే గలీబు
2. నిండు ముసుగు.
"రతిరాజు నమ్ములవి రంట దెప్పరపువేళ
కటుకున నాఁటుఁజేసు గవిశన నిడరే" 11-221
"కంతువిండ్లు నా బొమ్మలు గవిశన తన మేను
పొంత నిండి చూచుకొంటే పొందులే కదే"
7-562

గవుక: (?) ఇది 'గవుత' కావచ్చు. ప్రా. గవిత్త అంటే కసవు, తృణం, పశువులు మేసేగడ్డి అని అర్థం. 'గవిత్త'కు గవుత వికృతి రూపమై ఉంటుంది.
"పట్టి దున్నే యెద్దుఁదెచ్చి బంతి గట్టి నురిపితే
నట్టి గవుక మేసి మల్లాడినట్లు"
"బంతి గట్టి నురిపేటి పసురము లెడనెడ
బొంత నొక్కొక్క గవుక వుచ్చుకొన్నట్లు" 4-201

గసిక: వి. 1. బాణం 2. శలాక 3. తవ్వుట
కనువుగా కొన చెక్కిన కొయ్య. (శ.ర.)
"గద్దిరాతి కొండ వింట గసికయై చెలఁగ నేర్చు
సుద్దులెల్ల మందులనఁగ సొంపు మిగుల
నేర్చును" 5-233

## గా

గాఁటము: (8) 1. కష్టం 2. కాఠిన్యం
(తె.వ్యు.కో.) వి.ణ. 1. సాంద్రం 2. అధికం
4. గట్టి 5. కష్టమైన.
"గాఁటాన శ్రీవేంకటేశ కలిసితి విట నన్ను"
14-31
"గాఁటమాయఁ గోరికల కలగలపు" 29-447
కఠినమైన:
"ఏఁటికి వేగిరించేరే యింతులాల
గాఁటపుదొర యాతఁడే కరుణించీఁగాక" 27-582

గాజుఁబదనులవారు: వి; బహు. గాజు వాడితనం
కలవారు. (పదను = వాడి)
"యీ జాడ శ్రీవేంకటేశ యేలి తలమేల్మంగను
గాజుఁబదనులవారు కాంతలు సుమ్మీ" 29-270

గాజుగట్టు: అ.క్రి. రంగు మారు.
"కప్పురమే తిని మోవి గాజుగట్టఁగా
కప్పిన పారిటాకులు కళబెళమనఁగాను"
22-210

గాటారించు: స.క్రి. ఊరించు కావచ్చు.
"తేటపడ నింతి నిన్ను తిట్టు తిట్టదుగాని
గాటారింపుమాటలనే కల్లలాడెను" 25-312

గాటారింపు: వి. ఊరించడం (?)
"కూటమికి గురి లేదు కోరికకు కొద్ది లేదు
గాటారింపు లేలే శ్రీవెంకటేశుతోను" 23-341

గాట్రము: వి. ఇది గాఁటము కావచ్చు. గాటాన =
మిక్కిలిగా, గాఢంగా.
"యాటున శ్రీవేంకటేశ యే నలమేల్మంగను
గాట్రా(టా)న నన్నేలితివి గరిసించనేలా"
26-268

గాడ: వి. మోహం; అది గాడ పట్టిందని వాడుక.
'గాఢ' శబ్దభవం కావచ్చు.
"అలిగితే నీతోడి అంకకత్తె నందువు
యెలమి నీతోడి గాడ కేమి సేతురా" 25-213
మాండలిక పదకోశం కూడా మోహమనే
అర్థాన్నే సూచిస్తుందనీ, ఇది గాఢ
శబ్దభవమన్నా ఎక్కువదనము అర్థము
కావచ్చును అనే పరిష్కర్తల అభిప్రాయం
సరికాదని గంగప్ప గారి అభిప్రాయం.
(ఆ.సం.పా.స. రా.మాం. పుట. 27)
"యేడఁజూచి నను బుణ్య మెక్కు డాయ నని
నమ్మి
గాడలెల్లాఁ బాసితిమి కర్మమా" 4-332

గాడఁబెట్టు: స.క్రి. క్షోభపెట్టు.
"కూడిన సంతోసము కోమలికి నుండఁగాను
గాడఁబెట్ట నేల శ్రీవేంకటేశుఁడవు" 23-482

గాడిగుంజ: వి. గొడ్లకు మేత వేసే స్థలం.
కొట్టంలో పశువులకు మేత వేయడానికి
ఏర్పరచిన అర – ఈ చోట పాతిన గుంజ.
"కావించి కల్పవృక్షము గాడిగుంజగాఁ బాతి
ఆవల దుర్మదదేహి అజ్ఞాని అవుటా" 15-71

గాడిదె: వి. 'గాడిద'కు వ్యావహారికరూపం.

"కాయకపుగాడిదెకు కవణమువెట్టి మరి
వీయపు చుట్టాలెల్ల వీడువెట్టరో" 3-461

గాడిపట్టు: వి. 1. గాడిదగ్గర పశువులను కట్టివేసే చోటు 2. నివాసస్థలం 3. కొట్టు (వ్యు.)

"అంత యేల వొరసేవు అప్పటి నన్ను
కాంతలను నీ మోవి గాడివట్టు గాదా" 25-451

గాణ: వి. పాటకాఁడు, పాటకత్తె, గాయకుడు, గాయకురాలు.

"జాణల మిద్దరమును చనవునఁ బెనఁగితే
జాణలు మెరసిన కాతర మందురు" 20-445

గాత: (8) వి. కథ, గాథ కు వికృతిరూపం.

"గాతల తమ పొందులు కవెల వ్రాసుకొ నీవే
జాతిగా తమకేనేను సాకిరయ్యేదానను" 14-36

గాతలాడు: వ.బం; అ.క్రి. దెబ్బలాడు.

"మేలు గలవాఁడు గాన మేనదాన వంటా నిన్ను
కాలుదొక్కఁగా నేల గాతలాడేవే" 13-361

గాతసేయు: (3) వ.బం. గొడవచేయు.

"ఆతఁడిచ్చిన చనవే అన్నిటా నీకు
గాతసేయ కింతట మొక్కఁగరాదా నీకు" 7-136

గాతి: వి. ఘాతికి వికృతిరూపం, దెబ్బ, గాయం.

"ఓ యమ్మ నీ గాతికి నోరుచునా యెవ్వతైనా
పాయలు వడినఁబోదు పట్టకు మా చెయిఁగు"
21-322

గాదము: వి. పైరులోని కసవు, ఆకు, కలుపుమొక్క, గడ్డితోపాటు మొలచి పెరిగే పిచ్చిమొక్కలు.

"గక్కునఁ బైరు విత్తఁగా గాదము మొలచినట్లు
చిక్కిన కర్మములెల్లాఁ జెలగెఁ గాక" 2-170

గాదిలి: వి.ణ. ప్రేమపాత్రమైన. వి. 1. ప్రేమ, కూర్మి 2. భర్త 3. చుట్టం.

"గాదిలి శ్రీవేంకటపతి కాగిట
సేదలు దేరను చెలియకును
మోద మిప్పుడుగా మొనకొనె మనకును
యే దెస నుంటిమి యిందాఁకాను" 23-598

గాదెఁబోయు: (21) స.క్రి; వ.బం. ఒక్కచోట చేర్చు, కూడఁబెట్టు.

"కట్టఁగడ వావులెల్లా గాదెఁబోయవచ్చునా
దట్టమైన నీ యాసలు తలఁగించవచ్చునా"
26-417

గాదెలఁగొలుచు: వ.బం; వి. అసంఖ్యాకం, అందుబాటులో ఉన్న అపూర్వభాగ్యం. కొంగుబంగారం వంటి మాట.

"అమృతమథను మహిమదె మా గాదెల
కొలుచు" 14-51

గాదెలఁబోయు: (3) స.క్రి; వ.బం. కూడఁబెట్టు.

"తాటించి పేనఁగ మనతరములా యాతఁడు
తేటల నేరుపులు గాదెలఁబోసీని" 23-500

గాదెలలెక్కలు: వి; బహు. ధాన్యపు లెక్కలు.

"వేదపారాయణలతో వెసఁజూచెఁ గపిలను
గాదెల లెక్క లడిగె గడేరాలు వినెను" 7-473

గాబు: వి; మాం. పిచ్చిమొక్క, కలుపు.

"ఏ బలిమి నమ్మి వెర, పెరగరు దేహులాల
గాబువలెఁ బెరిగేరు కాలము మీ చుట్టమా" 4-28

గామిడి: విణ. 1. దుష్టమైన 2. గయ్యాళి అయిన 3. బలిసిన 4. శ్రేష్ఠమైన; సూ.ని. దీనిని గ్రామణీ శబ్దభవంగా చూపింది.

శ్రేష్ఠమైన:

నేమంత నేరుతుమా నేరుపులు తనతోను
గామిడిసతులయందే కనుఁగొనుమనవే"
26-228

దుష్టమైన:

"గామిడి మాయే కర్త యిందుకును
సోమరి మమ్మంటఁజోటేది" 4-254

"గోముననీ సుద్దులకు గొల్లెత లెట్టోరిచిరో
గామిడివిద్యలకెల్లా ఘనుఁడవు గావా" 23-525

"గామిడిదాని తల్లి విటకంటకి యి ల్లెడలింప" అని విప్ర. ప్రయోగం. (3-42)

గామిడిచేతలు: వి; బహు. పెద్దపనులు.

"ఏమి దలఁచుకొంటివి యేమిపని సేసితివి

గామిడి నీ చేతలకు కాంతాళాలు రేఁగవా"
7-430

గామిడితనము: వి. శ్రేష్ఠత్వం. (దుష్టత్వం, గయ్యాళితనం. వ్యం.)

"మోముదప్పక చూచేది ముందట నిలుచుండేది
గామిడితనా లీమెకుఁ గంటివా వోయి" 16-6

గామిడిది: (గామిడి + అది) వి. గయ్యాళిది, దుష్టురాలు, శ్రేష్ఠురాలు.

"గామిడి టొక్కొక్కతె కనలించుకొనుఁగాని
జామినుల మోములు కళదేరేవే" 16-576

గామిడివాఁడు: (గామిడి + వాఁడు) వి. దుష్టుఁడు, ధూర్తుఁడు.

"గాలిగొట్టి తిరిగిన గామిడివాఁడో యమ్మ
గోలవలె నుండుఁగాని కోడెకాఁడమ్మా" 22-69

"నిన్నలూరకె సేసేవు సందులకు లాచేవు
కన్నవారెల్లా నిన్ను గామిడివాఁడనరా" 28-297

గాము: వి. 1. పిశాచం 2. సూర్యాది గ్రహం 3. విరహబాధ 4. తాపం.

"ఏమరించి యింటివారి నెడపి నే రాఁగాను
గామైన చిత్త యెడ్సెఁ గదలనీక" 5-324

గాముల మోచిన గంప: వ.బం; వి. ప్రతిబంధకరం. (వ్యం.)

"పాము చెలిమి రంపపుసంసారము
గాముల మోఁచిన గంప యిది" 1-180

గాములు వారెడి పొద్దు: వి. చీకటిపడే సమయం.

"గాములు వారెడి పొద్దు కావలికాండ్లాల
జాము జాము దిరుగరో జాలి" 4-166

గాయగంటివాఁడు: వి. కాయగాచిన కన్ను గలవాడు.

"సేయరాని చేతలెల్లాఁ జేసితి నేను నీ
గా(కా)యగంటివాఁడ నేను గతి చూపవయ్యా"
3-311

గాయగంట్లు: వి; బహు. గాయములు (= క్షతములు) అనే అర్థంలో జంటపదం. (గంటి. ఏ.వ.)

"హత్తి గాయగంట్ల కాని అంతేసి నేరరు
యిత్తల నెట్టు పూకొందు నిట్టె నవ్వేఁగాకా"
11-358

గారడించు: అ.క్రి. మాయచేయు.

"కమ్ముకొన్న యింద్రియాలు గారడించఁగా జీవుఁ
డెమ్మెలఁ దొరలక మరేల మానును" 10-8

గారబము: వి. గారవము, గౌరవం, గొప్పతనం, ప్రేమ.

"కోరి యూపై నిన్ను నిట్టె కూడి కెంగేలు పట్టఁగా
గారబానఁ గంకణము కట్టేవు నీవు" 12-508

గారవించు: స.క్రి. గౌరవించు, ప్రేమించు.

"చేరి చేరి నీ మేని చెమట దుడిచితేను
గారవించెంతలో నెంత కాఁగిలించేవు" 28-66

గారాపుతనము: వి. గారవం, ప్రేమ, వాత్సల్యం.

"కూరిమిఁగాఁగిట నీవు కూడేటివేళ యూపె
గారాపుతనమునఁ గలసీ నిన్ను" 22-575

గాలపువేఁట: వి; వ.బం. చేపల వేట.

"పంచల నందరికిని పాయరాని పొందులకు
కంచపుఁబొత్తులే కావా గాలపువేఁటలు" 21-226

గాలప్పుడు: గాలి వచ్చినప్పుడు.

"తొడరి గాలప్పుడు తూర్పెత్తక తాను
విడిచి మఱచిన వెనక వెదకి తేఁగలదా" 1-449

గాలప్పుడు తూర్పెత్తు: వ.బం; అ.క్రి. గాలివచ్చినప్పుడు తూర్పారబట్టు, అవకాశమున్నపుడే కార్యమును నెరవేర్చు.

"తొడరి గాలప్పుడు తూర్పెత్తక తాను
విడిచి మఱచిన వెనక వెదకి తేఁగలదా" 1-449

గాలిఁబుచ్చు: వ.బం; అ.క్రి. వ్యర్థం చేయు.

"కాకరిమతము లెల్లఁ గాలిఁబుచ్చి పరమిట్టే
పైకొనఁగఁ గరుణించె భాష్యకారులు" 1-162

గాలిఁబోవు: వ.బం; అ.క్రి. వ్యర్థమగు, తొలగు, నశించు.

"తాలిమిలో హరిఁదలఁచక యెఱుకెల్ల
గాలిఁబోవుట పూర్వకర్మశేషం" 1-113

"అంగనలు దిట్టితేను ఆయములు గరఁగేవే

కంగి మగవాని తిట్టు గాలిఁబోయ్యేదే" 17-21

"నాలుకను మంచి హరినామ మొక టుండఁగా

గాలిఁబోయెటి వూరగాథ లేల" 3-187

**గాలింపుచక్రము :** వి. శోధించేచక్రం.

"వాలిన మాధవుఁడంటే వసంతుఁడవా! కాదే

గాలింపుచక్రము చేతఁగలవాఁడ నేనే" 21-487

**గాలికూటిపేరి గట్టు :** వి. శ్రీవేంకటేశ్వరుని నివాసమైన శేషాద్రి; (గాలికూడు = సర్పం, ఆదిశేషుడు) అతని పేరుతో ప్రసిద్ధమైన కొండ శేషాద్రి అని వ్యుత్పత్తి.

"గాలికూటిపేరిగట్టు మీఁదటి వాఁడ

నేల సోద్యము పేరి నెలఁతయె నిన్ను మెచ్చె"

10-117

**గాలికూటిపేరిగట్టు మీఁదటివాఁడు :** వి. వెంకటేశ్వరస్వామి; శేషాద్రిపై నెలవున్నవాడని వ్యుత్పత్తి. చూ : గాలికూటి పేరి గట్టు. (గాలికూడు = సర్పం, ఆదిశేషుడు; అతనిపేరుతో ప్రసిద్ధమైన కొండ శేషాద్రి అని వ్యుత్పత్తి.)

"గాలికూటిపేరిగట్టు మీఁదటివాఁడ

నేల సోద్యముపేరి నెలఁతయె నిన్ను మెచ్చె"

10-2-117

**గాలికూటివాఁడు :** వి. పాము (ఇట కాళియుడు) గాలి ఆహారంగా తీసుకునేవాడని వ్యుత్పత్తి.

"గాలికూటివాని మెట్టి గాలిరాకాసునిఁ గొట్టి

గాలిబిడ్డ తమ్ముని సంగడినాడె నితఁడు" 7-87

**గాలిగలట్టే తూరుపెత్తు :** ప.బం; అ.క్రి. గాలి ఉన్నపుడే తూర్పారబట్టు, అవకాశం ఉన్నపుడే పనులు నిర్వర్తించు. చూ : గాలప్పుడు తూర్పెత్తు.

"చెలియా మఱవకువే చెప్పితి బుద్ధి

తొలుతే గాలిగలట్టే తూరుపెత్తు మందురు"

23-17

**గాలి గలట్టే తూరుపెత్తుమనుట :** నానుడి; అనుకూలతను బట్టి ప్రవర్తించడమనుట.

"చెలియా మఱవకువే చెప్పితి బుద్ధి

తొలుతే గాలిగలట్టే తూరుపెత్తు మందురు"

23-17

**గాలిగలప్పుడే తూర్పు :** ప.బం; వి. గాలి ఉన్నప్పుడే తూర్పారబట్టడం.

"గాలి గలప్పుడే తూర్పు గాక

యేలి నన్నుఁగూడెనే నిరవైనదాఁకను" 22-95

**గాలిగొట్టు :** ప.బం; వి. 1. గాలికి తిరిగేవాడు, ఆకతాయి 2. హీనం 3. నిందావాచకం. నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.

"గాలిగొట్టై తిరిగిన గామిడివాఁడో యమ్మా"

22-69

"మెలుత నెరిఁదురుము మేఘమువంటిది

అలరు గాలిగొట్టది గాదు" 26-137

**గాలిదాగువాఁడు :** వి. సర్పం. ఇట ఆదిశేషుడు అని అర్థం. గాలిని తాగేవాడు, వాతాశనుడు అని వ్యుత్పత్తి.

"పాలివారియింటి పిన్నవాఁడై తిరిగినాఁడు

గాలిదాగువానిమీఁదఁ గాలు సాఁచినాఁడు"

6-156

**గాలిదిను పెనుబాము :** వి. ఆదిశేషుడు, గాలిని ఆహారంగా తినే పెద్దపాము.

"మోలనున్న నిట్టూర్పు ముంగిట నేల వేసేవే

గాలిగొట్టై యధరముగ గడివడేని" 7-44

**గాలిదెచ్చి ముడియగట్టు :** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను.

**గాలి దెచ్చి ముడియగాఁ గట్టు :** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను, గాలిని మూటగా కట్టు.

"అల గాలి దెచ్చి ముడియగాఁ గట్టరాదట

వెలయఁగాలము గంటువేయరాదట" 2-262

**గాలినె పోవు :** ప.బం; అ.క్రి. వ్యర్థమగు. చూ : గాలిఁబోవు.

"బాలనాటి పుట్టు గిది భ్రమయో నిజమో

గాలినె కాలముఁ బోయ కత లాయను" 4-407

**గాలిపడగ :** ప.బం; వి. రూపాం. గాలిపడిగె. గాలిపటం.

"కన్నచోట్ల గాలిపడగవై నీవు
పన్ని మా దీవెన నిట్టె బదుకవయ్యా" 17-13

**గాలిపడిగె:** వ.బం; వి. రూపాం. గాలిపడగ. గాలిపటం, పిల్లలు గాలిలో ఎగురవేయటానికి కాగితం మొ॥ వాటితో కట్టిన పటం.

"కామిని యెవ్వతో లోన గాలిపడె గాడించఁగా
కామించి యానందాన గరఁగితివి" 25-104

**గాలిబిడ్డ:** వి. హనుమంతుడు, గాలి కుమారుడు.

"గాలికూటివాని మెట్టి గాలిరాకాసునిఁ గొట్టి
గాలిబిడ్డ తమ్ముని సంగతి నాడె నీతఁడు" 7-87

**గాలిబుడియలు:** వి; బహు. గాలిబుడగలు.

"గాలిబుడియలు గట్టి కలికితనాలు చూపి
ఓలిగొంటివి గదే పుదుటున నీవు" 28-554

**గాలిమంటపము:** వి. దేవాలయం ముఖద్వారం వద్ద ఉండే మంటపం.

"పురిగొనంగ నిన్నుఁబాసి పొద్దు గడపలేక కెరలి
సరుగ గాలిమంటపమున సాము
శాయఁదొడఁగెను" 28-4 & 17-541

**గాలిమండపము:** వి. దేవాలయం ముఖద్వారం వద్ద ఉండే మంటపం. చూ : గాలిమంటపము.

"అల గాలిమండపమునందు నిద్దిరించఁగానో
పొలసి నిట్టూరుపుల బుసకొట్టే విపుడు" 7-414

**గాలి ముడిగట్టు:** ప.బం. అ.క్రి. వ్యర్థమైన పని చేయు, అసాధ్యమైన పనులు చేయు.

"గట్టువాయతనమున గాలి ముడి గట్టితివి
వట్టి యపకీర్తి గద్దా వనితలతోఁడను" 14-558

**గాలి ముడియగట్టు:** ప.బం; అ.క్రి. వ్యర్థమైన పనిచేయు, గాలి మూటగట్టు.

"కాకరివాఁడవు మాతో గాలి ముడియగట్టేవు
చేకొని నీ చెలి మెట్టు చేసిరయ్యా సతులు"
21-20

**గాలిమూట:** వి. శరీరం, ప్రాణవాయువుతో నిండిన మూట.

"గాలిమూటఁ జిక్కితిమి కన్నచోటే తొక్కితిమి
ఆలించి యేమిటి వారమయ్యేమో కాని" 3-532

**గాలి మూటగట్టు:** ప.బం. అసాధ్యమైన కార్యాలు చేయు.

"కతకారితనాలనే గాలి మూటగట్టేవు
రతి మొయిలు లేని వాన రప్పించేవు" 29-464

"గాలి ముడిగట్టినట్టు కాయము మోచితిమి"
3-556

**గాలిమూట చిక్కు:** అ.క్రి. శరీరధారియగు. (శరీరాన్ని గాలిమూట అని వేదాంతులంటారు.)

"గాలిమూటఁ జిక్కితిమి కన్నచోటే తొక్కితిమి"
3-532

**గాలిరాకాసుఁడు:** వి. (?) 7-87

**గాలి లేక తూరుపెత్తు:** ప.బం. వ్యర్థప్రయత్నం చేయు. గాలిలేనపుడు ధాన్యాన్ని తూర్పార బట్టడం వ్యర్థప్రయత్నమే కదా!

"నీ రతికిఁ జేయిచాచి నిట్టూర్పుల నిండెఁ జెలి
కోరి యాస గాలి లేక తూరుపెత్తెను" 7-402

**గాలివీడు:** వి. కడపజిల్లా లోని ఒక మండలకేంద్రం. పాకాల - ధర్మవరం రైలుమార్గంలోని కురబలకోట రైల్వేస్టేషన్ కు 25 కి.మీ. దూరంలో ఉంది. ఇట ఒక పాడుబడిన ప్రాచీన దేవాలయం ఉంది. ఇందులోని మూర్తి శ్రీవేంకటేశ్వర స్వామి. అన్నమయ్య ఇక్కడి స్వామిపై ఒక కీర్తన రచించినాడు.

"గాలివీటి కాపురానఁ గసుగందగా
కోలుపుచ దినమూ నీ కొండమీఁది నాయకులు
తేలుపర చేరుగనే తిమ్మినాయఁడా" 4-41

**గావుపట్టు:** స.క్రి. నాశంచేయు, చంపు.

"ఏవంకఁజూచినా యిట్లనే ధర్మంబు
గావుపట్టితివిగా కలికాలమా" 1-206

**గాసి:** వి. 1. వ్యథ 2. శ్రమ విశ. 1. వ్యర్థమైన, పనికిమాలిన 2. నష్టమైన.

"గాసి బంధమేల మానుఁ గాముఁడు లో
నుండఁగాను
వేసలు సంసారమై వెన్నడించుఁగాక" 4-61

**గాసిఁబడు:** అ.క్రి. కష్టపడు, బాధపడు.

"ఉన్నతోన్నతబుద్ధి నొనగూర్పకది దేహి

కన్నచోటికిఁ బఱపి గాసిఁబడెఁ బ్రాణి" 1-159

గాసిఁబెట్టు : స.క్రి. కష్టపెట్టు, శ్రమపెట్టు, బాధించు. (గాసి = బాధ, కష్టం.)

"మక్కువ నీవు చూపఁగా మాటలాడితిఁ గాక
కక్కసమై తోఁచితేను గాసిఁబెట్టీనా" 27-84

గాసిచేయు : స.క్రి. కష్టపెట్టు, బాధించు.

"ఏల మము గాసి సేసే రింకా మీరు
కాలముతో నిలిచెను కైవల్యపదవి" 6-145

## గి

గింటెపుఁజీర : వి. జమిలి పోగుల నేతచీర.

"కట్టిన గింటెపుఁజీర గళబెళ మనఁగాను
యిట్టె వచ్చి కానుక నీ కిచ్చీ నెవ్వతో" 12-495

గింటెలనవ్వులు : (గింటెము = విణ. దట్టమైన 2. అధికమైన - వ్యు. (బ్రౌన్) దట్టమైన నవ్వులు.

"కంటకములాడ నిన్ను ఘనుఁడ నేనోప నోప
గింటెల నవ్వులలోన గిలిగింతలా" 7-303

గిండి : వి. సన్నని మెడ గల చెంబు.

"గిండివట్టే యాపె కుచగిరులపై నొరుగక
అండనే చల్లని పన్నీరారగించేవు" 13-317

గిండివట్టే యాపె : సన్నని మెడగల చెంబును పట్టుకొనే స్త్రీ.

"గిండివట్టే యాపె కుచగిరులపై నొరుగక
అండనే చల్లని పన్నీరారగించేవు" 13-317

గిజిగాఁడు : వి. పక్షివిశేషం, పచ్చపిట్ట.

"తెచ్చి గిజిగాండ్లు సయిత మెంతో గూఁడువెట్టి
తెచ్చి మిణుగురుఁబురువు దీపమువెట్టు" 3-468

గిజిగిజిగా : క్రి.విణ. నలగిపోయేట్లుగా.

"జంటైన చుట్టరికాన సహాయము నెరపితే
గెంటక నా చీర గిజిగిజిగాఁజేసితివి" 25-215

గిజిగిజిసేయు : స.క్రి. నలగి పోవునట్లు చేయు, కలవరం కలిగించు.

"ఎంత గిజిగిజిసేసే వింతిని నీవు
మంతనానఁజేయరాదా మతి చేఁతలెల్లను"
23-153

గిజ్జడి : వి. షడ్రుచులు కలగలిసిన అన్నం, చిత్రాన్నం (పులిహోర), కదంబం అనే అన్నం.

"కలయవే మా పొత్తు కలికీ - వోరి
కలగలపు గిజ్జడి గాదటరా" 7-484

గిజ్జిడి : వి. చూ : గిజ్జడి.

"తానేలి వేడుకొనీనే తడిసీఁ జెమట చేయు
ఆని విరహాన గిజ్జిడై వుందానను" 7-467

గిజ్జిడిగొను : ప.ఖం. (?)

"చక్కలు మోవిఁబొడమె చూపులుఁగెంపు
దడమె
కిక్కిరించిన కళలు గిజ్జిడిగొనె" 12-389

గిటగిట : అవ్య. పండ్లు గీటడంలోని అనుకరణం.

"గుటగుటరవములు కుత్తికఁ గులుకుచు
గిటగిటఁ బండ్లు గీటుచును" 1-68

గిడిబిడి : వాద్యవిశేషం.

"కిన్నెర మీటఁగాను గిడిబిళ్లు వాయింతురా
పన్ని నీవు నుతిగూడి పాడుటగాక" 18-416

గిరవు : 1. కానుక, ఉపాయనం 2. కుదువ, తాకట్టు.

"గరిమ నా హృదయాకాశమునఁ దలఁచుటే
గిరవై యబ్బినయట్టి ఖేచరత్వము" 2-258

గిరవుపెట్టు : వి. 1. కానుకగా పెట్టు 2. కుదువబెట్టు, తాకట్టుపెట్టు.

"గిరిగుచములవిగో కేశవా నీకు
గిరవుపెట్టుకున్నదాన కేశవా" 14-233

గిరువు : స.క్రి. ముడుచు.

"మూఁతులే గిరువంగ మోము నొచ్చీనంత
బాఁతి మీఱఁ బకపక నవ్వకురా" 6-103

గిఱికొను : అ.క్రి. వ్యాపించు, పారు, స్థిరపడు, అతిశయించు, కమ్ము, చుట్టుకొను, ఆవరించు, కప్పు.

"గిఱికొన మన్నించి కోరిఁతి బొందుదుఁగాక
యెఱిఁగించితి నిన్ను యేమి సేసేదిఁకను"
20-598

గిలిగించు: స.క్రి. గిలిగింతపెట్టు, గిలిగింత కలదానినిగా చేయు.
"సిరసు వంచితి నింతే చేతుల మొక్కితి
కెరలి నన్నేల గిలిగించ నింతే తాను" 11-146

గిలుకొట్టు: స.క్రి. 'గిలకొట్టు' కావచ్చు; 1. వేళ్లతో చిలుకు 2. కలుపు, రంగరించు 3. వేళ్లతో పుణుకు. (వ్యు.)
"చెలఁగి తపసు చేసే చిత్రకూటగిరి కాదు
గిలుకొట్టు నా కుచగిరులు కాని" 7-119

## గీ

గీటించు: స.క్రి. పళ్లు కొఱుకు, కన్నుగిలుపు.
"మాయలాడవచ్చుఁగాని మర్మములు నాటితేను
గీటించి మీఁదటఁ బెల్లగించరాదు" 24-328

గీదపోరు: అ.క్రి. ఒకే వేధింపు వేధించు.
"కాదనేదానఁగాను కైకొలిపేదానఁగాను
గీదపోరి యేల సాకిరి గోరేవు" 27-192

గీరు(ఱు)దిరుమణి: వి. గోటితో గీరి తీర్చే తిరుమణి. (తిరుమణి = తిరుమన్ను, వైష్ణవులు నొసట నుంచే ధవళమృత్తిక.)
"తిద్దిన నొసలి గీరుఁదిరుమణి గానరాఁగా
కొద్దిఁజిగుళ్లు వెళ్లిన కొప్పుతోడ
అద్దపు నెమ్మోము చూపి అతని మైగరఁగించి
ముద్దుమోమిచ్చి మోహమున ముంచితివె
చెలియా" 17-378

గీరునామము: వి. గోటితో గీరి తీర్చెడి బొట్టు, గోఱుబొట్టు, గోఱునామము.
"కెంపు గనుగవ మీర గీరునామము జార
తెంపుతోడ నున్నదదె తెలివా?" 27-152

గీరులుకొను: అ.క్రి. పడు, గీతలు కలుగు.
"గీరులుకొనీ సొమ్ములు కాఁగిలించకువే"
29-457

## గు

గుంగిలి సరసాలు: వి; బహు. పచ్చిసరసాలు (?)
"గుంగిలిసరసాలకు కొంతైనా మరఁగు వద్దా
సంగతి గాదని నీతో సన్నసేసే నదివో" 3-102
(గుంగిలి = వ్యర్థము అని జాస్తి.
తా.అ.సం.భా.వి. 90 తె.వ్యు.కో.

గుంగిలిసేయు: స.క్రి. నిఘంటువులో ఈ పదం కానరాదు. పరిహసించు, నవ్వులపాలు సేయు కావచ్చు.
"ఇంగిత మే నెరఁగ నింతుల గోడునకేల
గుంగిలిసేయక కూడవయ్యా ఆపెను" 27-255

గుంటిమీఁదటి వాన: ప.బం; వి. నిలువనిది, అస్థిరం, ఉండనిది. పర్వతంమీది వాన అని వాచ్యార్థం.
"గుంటిమీఁదటి వాన కొనబు సరసవుదాన
వెంటవెంట తోడినీడ వేడ్క తగులు" 7-231

గుంటిమీఁది తోఁడబుట్టు: ప.బం. పార్వతి, కొండమీది (కైలాసం మీది) తోబుట్టువని వాచ్యార్థం.
"మింటిమీఁది కంటిచూపు కంటలేని కూడు నీకు
గుంటిమీది తోఁడబుట్టు గొల్లవారి కలిమి" 5-297

గుండు: వి. 1. గుండ్రని పెద్దరాయి 2. పర్వతం.
"కొండపొడవులైన ఘోరవానరబలము
గుండుగా వారిధి దండఁగూడ బెట్టి" 4-503

గుండు: విశే. గుండ్రని.
"దిండుకట్టి యాసలు తీగెలు సాగేకాలాన
గుండుఁజేతుల తీగెలు కొమ్మ కొప్పు నిదివో"
28-476

గుండుగండఁడు: వి. గర్వాన్ని అణచినవాడు, వీరుడు.
"మారీచబాహుమద మర్దన తాటకాహార
క్రూరేంద్రజిత్తుల గుండుగండా" 2-220

గుండె గరఁగు: ప.బం; అ.క్రి. దయ కలుగు.
"దండ నేనే వుండఁగాను దయదలఁచితిగాక
గుండె గరఁగి నీయంతఁగూడితివా" 11-376

గుండె రాయి అగు: ప.బం; అ.క్రి. గుండె కఠినమగు, దయాహీనుడగు.
"కొండవంటి దొర దాను గోవిందరాజూ తన
గుండె రాయి గాదా తొల్లి గోవిందరాజూ" 25-307

**గుండె రాయి సేసుకొను :** ప.బం; అ.క్రి. అతికష్టంగా గుండెనిబ్బరం చేసుకొను.
"వండ వండ నట్లాయ వలచిన వలపెల్ల
గుండె రాయిసేసుకొంటేనుఁ గొసర నేమున్నది"
8-50

**గుండెలోని అమ్ము :** వి. మిక్కిలి బాధను కలిగించేది, హృదయశల్యం.
"తఱి నీ మనసును దలఁచినట్లుండు
గుఱిగా నదివో నాకు గుండెలోని అమ్ము"
11-247

**గుండెవగులు :** (గుండె + పగులు) మిక్కిలి భయం కలుగు.
"చిత్తరుపటముమీఁదఁ జెలియ నెమ్మోము వ్రాసి
గుత్తపుఁజందురుఁడని గుండెవగిలె" 17-511

**గుండెవట్టు :** అ.క్రి. ధైర్యం తెచ్చుకొను.
"వెక్కసపు శార్ఙము వెస చేతఁబట్టఁగాదు
పక్కన గుండెవట్టిరి బ్రహ్మాదులు" 15-163

**గుంతదోషము :** వి. ఇతరులకు చెడుపు చేయదలచిన వాడు, ఎవరికి చెడుపు చేయ దలచినాడో వారి ఇంటిలో గుంత తీసి ఏదో ఒక వస్తువు పాతిపెడతారట. దానివలన కలిగే దోషం (?)
"బూ(పూ)తకి జంపినవాఁడే బూతకి వాకట్టు రక్ష
పాతాళానఁగూర్మమైన పతి గుంత దోషరక్ష"
6-54

**గుంపించు :** (6) అ.క్రి. (ఈర్ష్యచేత వికారపు మాటలాడు అని ఆం.ధా.మా. ) విజృంభించు, కుప్పవేయు, అతిక్రమించు.
"ఇంపు గలిగిన చోట నెగ్గులు వట్టఁగనేల
గుంపించి మీరేల ఆడుకొనేరే సవతులు"
18-214
"గుంపించినదానఁగాను గొణఁగినదానఁగాను
తెంపున నేరా నన్ను దీకొనేవు" 27-178

**గుంపెన :** వి. విజృంభణ (ఆం.ప.ని.) గంతు, పోటు, దెబ్బ.
"వోపి సరి వెనుగుదు రొట్టెల్లాఁ బెట్టుదురు
పైపై గుంపెనలే కాని పల్లదాలు గావు" 28-303

**గుంపెనలాడు :** అ.క్రి. గునిసియాడు, నర్తించు, కులుకు.
"ఊరకుండవుగా ఓసి మాయ నిన్ను
జేరఁబిలువము గుంపెనలాడేవు"
113 భా 41 & 1-11

**గుక్కు :** అనుమానించు, తొట్రుపడు, మాటలు మొ॥ తడుముకొను.
"గుక్కక మనసు నేఁడు కోరక వుండఁగలేదు
తక్కి బ్రహ్మప్రళయానఁ దా నెట్లుండెనో" 3-428
"గుక్కక మూడులోకాలు గొలిచితివని నీకు
మొక్కుదురు పరులకు మొక్కకుండరు" 4-251

**గుక్కొను :** అ.క్రి. 'గుదిగొను'కు రూపాం. కావచ్చు. మూటకట్టుగా కూలబడు.
"నిక్కి చూచితే నెంత నీటు చూపేనందువో
గుక్కొని నాలో నేనే గుట్టుతో నుందానను"
22-425

**గుగురుఁజిగురు :** వి. గుబురుగా నున్న చిగురు, దట్టమైన చిగురు.
"గుగురుఁజిగురునకు కుత్తికె కోవిలఁజూపు
పొగరుఁజంద్రపుమోము పున్నమ
మారుకుఁజూపు" 9-82

**గుగురుగా :** క్రి.విశ. నిండుగా, గుబురుగా.
"గుగురుగాఁ బులకించె కొప్పువిరు లటు చిందె
సొగసి బిగయనీకుఁ జోటేదే యిఁకను" 19-359

**గుజగుజఁబోవు :** ప.బం; అ.క్రి. గుసగుసలాడు, రహస్యంగా మాట్లాడు.
"గుజగుజఁబొయ్యేవు కొంకికొంకి నీకు నీకే
గజరు నీ చేతలకు కమ్మరా నేమందు రా"
21-510

**గుజగుజలాడు :** ప.బం; అ.క్రి. గుసగుసలాడు, గోప్యంగా మెల్లగా మాట్లాడు.
"ఆలోచించి గుజగుజ లాడుకొంటి మనుచును
పాలించేవు నీ వేడ పొంచు వింటివయ్యా"
13-235

గుజగుజలు : వి; బహు. గుసగుసలు, గజిబిజి తొక్కటాలు.
"నిజమరి నంటూ వచ్చి నిలుమన్నాఁడాతఁడు
గుజగుజ లే లాతని గుణము చూచుకోవే"
13-251

గుజ్జనగూడు : (2) వి.బం. చూ: గుజ్జనగూళ్లు.
"గుజ్జనగూడు వండెనే కోమలి నేఁడు
గొజ్జు తెప్పలుగాయలు గొమ్ములుఁదాను"
10-2-101

గుజ్జనగూళ్లు : (3) వి.బం; బహు. బాలికలు చిమ్ములు పెట్టి ఆడుతూ చిన్న గురిగిలలో వండే వంటకం, గుజ్జుతో సమానంగా ఉండే వంటకం. (గుజ్జు + ఎన + కూళ్లు) 2. బాల్యక్రీడావిశేషం.
"కూరిమి నెసరుపెట్టి గుజ్జనగూళ్లు వండి
వేరు లేని మాటలనే విందువెట్టివే" 14-363

గుటుక : వి. 1. ఒకసారి నోట పోసుకొని మింగే నీళ్లు మొ॥ వాటి కొలది. 2. ఒక్కసారిగా మింగటం. (వ్య.)
"ఘటన శ్రీవేంకటేశ కైకొంటి నిన్నట్లానె
గుటుకల మోవీవయ్యా కొసరుగా నీవు"
18-552

గుట్టు ఇచ్చు : ప.బం; అ.క్రి. రహస్యం చెప్పు, రహస్యం అందజేయు.
"ఇంతులకు నింత గుట్టు యిత్తురా నీవు
పంతము మెరసేయట్టి బలువుఁడవు" 23-354

గుట్టు చేసుకొను : ప.బం; అ.క్రి. మోసం చేయు, రహస్యంగా ఉంచు.
"గుట్టు చేసుకొందురా కోరి నే నీకు మొక్కఁగా
నెట్టన నీవే నవ్వేట నేరుపు గాదా" 18-337

గుట్టుతో వాఁడు : వి. గుట్టుగలవాడు.
"గుట్టుతోవాఁడవు నీవు కూడితి వంటూ నేను
రట్టు సేసితిని మోవి నెట్టన నిన్ను" 18-328

గుట్టుపడు : అ.క్రి. రహస్యమగు.
"అట్టె శ్రీ వేంకటేశుఁడలమేలుమంగను
గుట్టుపడ నన్నుఁగూడెఁ గోరి మెచ్చఁగదవే"
25-108

గుట్టువాఁడు : వి. రహస్యం కలవాడు.
"గుట్టువాఁడ వంటూఁ గొసరితి
యిట్టి నో వంటేది యెఱఁగముగ" 9-13

గుట్టువెట్టు : ప.బం; స.క్రి. రహస్యంగా ఉంచు.
"మాటలాడి మాటలాడి మంతనాన సన్ననేనే
నేఁటికి గుట్టువెట్టెనో యెంత మర్మమో" 20-211

గుట్టుసేయు : (గుట్టు + చేయు) అ.క్రి. రహస్యంగా ఉంచు, మోసం చేయు.
"నేరుపుతో బత్తి గడు నీమీఁదఁ జేయఁగాను
యీరీతి గుట్టు సేసే నిది జాణతనమా" 23-544
"నీ వల్ల దోసము లేదు నేనే వయోమదమున
సేవలు సేయక గుట్టు సేసితిఁగాని" 25-322

గుట్టె : వి. ఇది 'గుట్టు' కావచ్చు.
"యెట్టకేల కాప నీతో నిటు మాటలాడఁగాను
గుట్టెతోడ నీవేల కొంకఁజూచేవు" 25-350

గుడిగొను : (18) అ.క్రి. వ్యాపించు (పద., వ్యు.ప.కో.) క్రమ్ముకొను, పరివేష్టించు, చుట్టుకొను అని వేటూరి ఆనందమూర్తి.
"కడుఁజెమటకు చల్లగాలి యింపు
గుడిగొన్నఁ గాఁగిటికి కూటము లింపు" 24-551
ఇట పరివేష్టించు, చుట్టుకొను అనే అర్థం యుక్తం.
"గుడిగొన్న యేటెంత కొంకరవంకర లైనా
పుడమికి లోఁగొనక పోవుటయ్యా" 2-507
వ్యాపించు :
"గుడిగొని యీతని మై గురుతులెన్నుండినాను
చిడిముడి నిచ్చకమే సేయవే యీతనికి"
28-253

గుడిమీఁది తరువు : ప.బం; వి. ప్రమాదకరం (?)
"తడిపాత మెడఁగోత తలఁపు విషయాసక్తి
గుడిమీఁదితరువు అలకులము (అలుగులము) ప్రాణులకు" 1-104

గుడిశ : వి. 'గుడిసె'కు వ్యావహారిక రూపం.
"గుడిశలోన నొక కుక్కిమంచమున
వొడలు సగమునను వుండెడిదింత" 4-242

గుడుసువడు : అ.క్రి. శూన్యమగు, హీనమగు, తగ్గు.
"ఎడమపురి వెట్ట పరహితవివేకములోన
గుడుసువడెఁ జదువు మెరుగులువారెఁ జలము"
1-315

గుడ్డము : వి. 1. కొండ 2. చేను 3. చేనిపంపు.
"గుడ్డముపై నున్న కోనేటిరాయని
నడ్డగించుకొంటి వత్తయ్యా" 5-313

గుడ్డికన్ను తెఱచెనేమి మూసెనేమి : వ్యర్థం, నిష్ప్రయోజనం అనే అర్థంలో వాడబడే లోకోక్తి. (గుడ్డికన్ను తెరచినా ఒక్కటే మూసినా ఒక్కటే అని వాచ్యార్థం.)
"యెదిరిఁ దన్నుఁ గానని యెడపుల గుడ్డికన్ను
మొదలఁ దెఱచె నేమి మూసె నేమి" 1-456

గుత్తగొను : అ.క్రి. సొంతం చేసుకొను, గుత్తగా పుచ్చుకొను.
"కొండవింటి వాని గుత్త గొనినయట్టి
కొండుక పాయపుఁ గూతురు తండ్రి" 5-235

గుత్తము : (3) విశ. బిగువైన, కచ్చితమైన, కఠినమైన.
"చిత్తము నీరై కరఁగి చెమటలై వెళ్లఁ జొచ్చె
గుత్తపు వయసు చనుగుబ్బ లాయను" 28-395
"హత్తుకొని మోహంబులను ప్రధానుల యెదుట
గుత్తంపు మొగసాలఁ గలదించవలసె"
4 అను 27

గుత్తి : వి. అనంతపురం జిల్లాలోని 'గుత్తి' తాలూకా గ్రామం. ఇది రఘురాముడు వెలసిన క్షేత్రం.
"సౌమిత్రిసహోదర దశరథరామా
చేముంచి గుత్తిలో వెలసిన రఘురామా" 3-499

గుదిగుచ్చు : స.క్రి. 'గుదిగ్రుచ్చు'కు వ్యావహారికరూపం; ఒకచోట చేర్చు, ఒకగుదెకు - సూదికి గ్రుచ్చు.
"కొచ్చి కొచ్చి తమకము గుదిగుచ్చవలెనా"
7-480

గుదిగొను : వ.బం; అ.క్రి. 1. అతిశయించు (2. దట్టమగు, స్థూలమగు 3. తడబడు 4. మూటకట్టుగా కూలబడు)
"గుదిగొను హరిభక్తుల కోట్లలో
వెదకు నొకఁడు శ్రీవేంకటపతి" 4-1-3
"కదిసిన రుద్రుని గర్వ మడఁచితివి
గుదిగొని దివిజులు కొలుచుట యెట్టు" 8-236
"ఉదుటైన యింద్రియాల - నొడిసి
వంచుకొనుట
గుదిగొన్న తనలో - కోరికెలుడుగుట"

గుద్దిచెప్పు : వ.బం; గట్టిగా చెప్పు, బల్ల గుద్ది చెప్పు అని ఇప్పటికిని వ్యవహారం.
"ఇన్నిటా జాణవు నీకు యెవ్వరు గుద్ది చెప్పేరు
యెన్నికె కెక్కిన నీ యింటిలోనివారము" 27-73

గుద్దిరము : (4) వి; బహు. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు. "కుద్రగేడితనము అని కన్నడ వ్యవహారం. Envy - అసూయ అని కిట్టెల్, క్షుద్రశబ్దభవము కావచ్చు" అని (సం.ప.స. 16సం 428 పు.).
"నీవు నన్ను మన్నించఁగా నెలంతలు గుద్దిరాన
వేవేలు నాడుకొంటే వినవోపను" 16-381
"కడవారు నవ్వేది కానవు గాక
గొడవల మమ్ముఁజూచి గుద్దిరము లేటికే"
11-297

గుద్దులాట : వ.బం; వి. జగడం, తగవు, యుద్ధం.
"ఇద్దరికిఁబోరువెట్టి యేమి చూచి నవ్వేవయ్యా
గుద్దులాట వెలిగాను కోపగించీ నీపై" 13-372

గునిమగు : అ.క్రి. (?)
"తచ్చితేను పెరుగులో తానే వెన్న వొడమదా
కుచ్చి కౌగిలించుకుంటే గునిమయ్యీ నతఁడే"
29-426

గునియు : అ.క్రి. 1. నర్తించు, ఆడు 2. చలించు 3. కులుకు 4. చెదరు 5.గొణగు 6. బాధపడు (ఆందోళించు. ఆం.ప.ని.)
"ముద్దుటుంగరంబుల కరములతో
ముద్దులు గునియుచు మొక్కెరి నీకు" 5-214

గునిసాడు: (గునిసి + ఆడు) అ.క్రి.
గునిసియాట = విలాసచేష్ట అని ఆం.ప.ని.
ఎగురుతూ ఆడు, గెంతుతూ ఆడు.
"గోవింద హరిగోవింద గునిసియాడుదం బిటు
రారో" 3-109

గుబ్బతిలు: (3) అ.క్రి. 1. అతిశయించు
2. ఉడుకు 3. పరితపించు 4. మండు
5. ఉప్పొంగు 6. పొంగు.
"గుక్కుకొంటా వలపులు గుబ్బతిలే వది యేమే
చెక్కురమోవి చూపి సన్న సేయఁగాను" 29-407

గుబ్బలాఁడి: (గుబ్బలు + ఆఁడి) వి. గుబ్బలు =
లావైన స్తనాలు కల స్త్రీ, గుబ్బెత, యువతి.
"రాకుంటి మానఁగాక రంతులేటికె
వేకపు గుబ్బలాండ్ల విటుఁడాతఁడు" 5-5

గుబ్బలికొండ కనుమ: వి. నందలూరు
దగ్గరనున్న కనుమ. దీనినిప్పుడు
'లంకెకనుమ' అని వ్యవహరిస్తారు. చూ:
ఎఱ్ఱశిల కనుమ.
"వంతపు నీ గుబ్బలే గుబ్బలికొండకనుమ
మంతనాల కనుమాయ మగువ నీ పతికి"
5-115

గుబ్బున: క్రి.విశే. శీఘ్రంగా. (శ.ర.)
"గుబ్బున నెవ్వతో నిన్నుఁగూడని
పుడుకునకుమ
గుబ్బ లొత్తె నని నీవు గుంపించేవు గాక"
13-525

గుమిగట్టు: అ.క్రి. అధికమగు, చాలామంది
ఒకచోట గుంపుగా చేరు.
"గుట్టువేఁచె మదనుఁడు గుమిగట్టె గోరికలు
అట్టయితే నీ చేత లాఁటికెక్కఁగదరా" 8-122

గుమితము: వి. "గుంభిత" శబ్దభవము
కావచ్చును. కన్నడము – గుమిత,
రహస్యవార్త, ఆడుకోలు (వదంతి) అని అర్థం"
అని సం.ప.స. 13 వాల్యూం 4 పుట.
"గుమితాన రేపుమాపుఁ గోసి రాపించఁగనేల
సముకాన దాని నన్ను జగడించ విడరా"
11-227

గుమ్మడికాయంత: ప.బం; వి. మిక్కిలి పెద్దదైన.
"గుమ్మడికాయంతముత్తెము" 17-241

గుమ్మడికాయలన్న బుజాలువట్టి చూచుకొను:
సామెత; ఎవరో ఏదో అనగా అది తనను
గూర్చే అని భావించేవారి యెడ ఉపయోగించే
పలుకుబడి – దీనికి ఆధారమైన కథ. ఒకచోట
గుమ్మడికాయల దొంగతనం జరిగిందట.
అందరినీ చేర్చి రాజుగారు దొంగతనాలు చేస్తే
చేసినారు, బుజాలమీదే పెట్టుకోవాలా
అన్నాడట. అనగానే అసలు దొంగతనం
చేసినవాడు బుజాలు తడిమి చూచుకున్నాడట.

గుమ్మడికాయలన్న సుద్ది: ప.బం; వి.
గుమ్మడికాయల దొంగంటే భుజాలు
వెదుక్కున్నట్టు అనే సామెత.
"గుమ్మడికాయలన్న సుద్ది దడవితే
పన్ని నేడు నీ బుజాలు పట్టి చూచుకోకురా"
17-79

గురిగింజపేరు: వి. గురిగింజల హారము.
"కోమలి గుబ్బలమీఁది గురిగింజపేరు
నీ మెడ వేసుకొంటివి నేరుపుతోను" 26-404

గురిగింజ సరిదూగు: ప.బం; అ.క్రి. చిన్నదగు.
3-519 old

గురిగి: వి. ఒక రకపు చిన్న మట్టిపాత్ర, చిన్న
చెంబు వంటిది.
"గుబ్బల మెఱుఁగుల గురుగులలోపల
నుబ్బు నానఁబాలొగి నించి" 6-63
"గోమున సేవంతిపువ్వు గురుగులలోపల
యేమరక పూఁదేనె నెసరువెట్టి" 10-2-101

గురు(ఱు)తుపడు: (2) ప.బం; అ.క్రి. గుర్తు
తెలియు, విదితమగు, తెలియు.
"పొదుగుకొన్న దిదే కర్మమె యందురు
పొడచూపుట లే దెక్కడను
యెదిటిది మాయాకల్పితమే యట
యెట్లు గురుతుపడు మాకును" 15-403

గురుమ[1]: వి. పెద్దరికము, తేజము ఇత్యాది
అర్థములు కావచ్చును. చూ: 25 పీఠిక 12

సం. 'గరిమ' శబ్దవికారం కూడా కావచ్చు. కురుమై luster, Brightness అని తమిళ నిఘంటువు.

"గట్టిగాఁ దెలుసుకుంటే కన్నదే కందిగురుమ" 2-276

**గురుమ²:** వి. విత్తు, గింజ. (బ్రౌన్)

"పొన్నలలో వేగఁ బొద్దుపోనీవే యింక
కన్నదే కందిగురుమ కానీవే యింక
అన్నిటికి నేరుతువు అవునయ్యా
కన్నదే కంది గురుమ కంటిమయ్యా" 23-130

"చుట్టి వరిగురుమతో జొన్నగింజ సరిదూఁగు
తెట్టెలై మేలొకటి తీలొకటి కాయ" 3-14

**గురుమంత్రము:** వి. గొప్పమంత్రం, గురువు ఉపదేశించిన మంత్రం.

"మగువమాటలే గురుమంత్రము నీకు
వెగటు దీర నివి విన్నవించ దాయనా" 13-360

**గురులు:** వి; బహు. గొప్పలు (?) భారము. (బ్రౌన్)

"ఇమ్ముల నన్నేలితివి ఇంతలోనే
కుమ్మరించితే రతులు గురులాయ నీకు" 27-15

**గురులువేయు:** భారం వేయు.

"గుట్టుతోడ నవ్వు నవ్వి గురు లేల వేసేవు
పట్టరాదా నీ తొల్లి పాయము నేడు" 28-269

**గుబ్బిమువంటి కొడుకు:** వి. సాహసికుడైన కొడుకు.

"విచ్చనవిడిని తడుపు విడిచి పారెడిని
రచ్చలనె యింత గుబ్బిమువంటి కొడుకు
దిచ్చరీఁడై యిట్లు దిరువేంకటేశ్వరుండు
నిచ్చనిచ్చలును గడుఁబెచ్చు పెరిగీని" 6-62

**గులగులలు:** వి; బహు. ముక్కలు ముక్కలు, పొడిపొడి.

"పట్టి పిసుక నిఁక బనిలేదు
గుట్టు దెలిసితే గులగులలు" 3-137

**గులిమి కొలుచు:** గరిసె (బొట్ట) లోని ధాన్యం.

"గులిమికొలుచు దీరఁ గుడువనియ్యక కొత్త
కొలుచు మీఁదమీఁదఁ గొలవఁగా" 1-168

**గులుగు:** వి. కులుకుదనం. (మోహం, కామవాంఛ అని రా.సీ. మాం. పుట 286)

"వెలి యాసలనే దండు విడిసిన కోటా
గులుగై యింద్రియములు కొల్లగొన్న కోటా" 2-84

**గుల్ల:** వి. శంఖం.

"గుల్లసేతఁబట్టి కొండపై నిలుసుండి
వల్లెవాటువేసి వరములిచ్చెను" 24-13

**గుల్ల గుల్లే రాయి రాయే:** నానుడి; విలువలేనిది విలువలేనిదే, విలువగలది విలువగలదే. శంఖం శంఖమే రాయి రాయే అని శబ్దార్థం.

"గుల్ల గుల్లే రాయి రాయే గురియెంత వేసినాను
అల్ల నాడే అడియాస లవి యేల విడుతు" 4-83

**గుల్లసంకుఁజక్రములు:** బోలుగా ఉన్న శంఖం మరియు చక్రం.

"గుల్లసంకుఁజక్రముల గోవిందుడు
గొల్లవారింటఁ బెరిగె గోవిందుడు" 9-257

**గుల్లసంకుదుబ్బు:** వి. (?)

"గుల్లసంకుదుబ్బును కొలచి పోయిమనేవు
యిల్లిదె యిప్పుడె మా యింటికి రావయ్యా" 7-474

**గుళగుళ:** అవ్య. కురవడం లోని ధ్వన్యనుకరణశబ్దం.

"ఫళఫళ వీరవిభవరసరుధిరము
గుళగుళ దిక్కుల గురియించితివి" 1-85

**గుళిగ:** వి. ఘుటిక, ఉండ, గుళిక. (వ్యు.)

"చప్పుడుగా పన్నీటను జలకములాడే వేల
గొప్ప నవరసముల గుళి గైనాఁడు" 17-499

## గూ

**గూఁటవేయు:** ప.బం; స.క్రి. కుదుటపఱచు. (పద.)

"గుట్టునఁ బయ్యెదలోన గూట వేసుకుండఁగాను
తొట్టుకున్న పాయానకు దోసము రాదా" 25-268

గూటఁబెట్టు: ప.బం; స.క్రి. కుదుటపఱచు. (పద.)
"ఎఱిఁగిన పనులకు నేల గుట్టుసేసేవు
గుఱి లేని కోరికలు గూటఁబెట్టేవా" 19-72

గూటవేయు: ప.బం; అ.క్రి. కుదుటపరచు.
"కోరి యంతలో గురుఁడు గూటవేసె మనసు "
4-335

గూన: వి. బాన, పెద్ద కుండ, లోతుఉన్న కుండ, ఇండ్లపై కప్పే కప్పు.
"కుత్తుకబంటిదాఁకా గూనలో పాలెల్లాఁ దాగె
యెత్తుకవున్నాఁడు మొగ మిందుదాఁకాను"
20-450

గూళెపుసతులు: వి; బహు. గూడెపుసతులు, (?) గొల్లపల్లెలోని సతులు కావచ్చు.
"గోలయై వేల గొండెలెత్తె గోవిందుఁడు
గూళెపుసతులఁదెచ్చె గోవిందుఁడు" 9-257

## గె

గెంటసము: వి. పరుషవాక్యం, న్యూనతపఱచు మాట, నిష్ఠురోక్తి, కట్టివిరుపు మాట, స్ఖలితోక్తి. విణ. తీక్షమైన, వాడియైన.
"గెంటసంబులను కెలసేవూ
నంటున నాతఁడు నవ్వఁగనూ" 24-245

గెంటపొలాడు: అ.క్రి. పరుషోక్తులు పలుకు, పరిహాసములాడు.
"నంటున నాతఁడు నీతో నగఁగానే వేరవేరే
గెంటపొలాడే వేలే వెంగెములుగాను" 11-213
పద. లో ఈ పదానికి హాస్యమాడు, న్యూనతపరచు మాటలాడు అనే అర్థాలు చూపబడ్డాయి.

గెంటు: (3) వి. చలనం. (శ.ర.)
"గెంటులేని వేంకటగిరిమీఁదను వాఁడె
పెంట పెట్టుకున్నవాఁడు పెండ్లికొడుకు" 5-186
"నంటుమీఁజి సెలవుల నవ్వులేల వుమిసేవే
గెంటులేని కన్నులను కెంపు లెక్కిని" 7-44
"అరుదుగ గెంటు లేని ఆచారవంతుఁడఁ గాను
హరి నీ కరుణ నాపై నంటు టెల్లయ్యా" 3-181

గెత్తు: (?)
"చిత్తజు నమ్ములు శిరసున ముడువఁగ
గెత్తుకెట్ల దాఁకెనో గాని" 24-9

గెర: వి. (మాం.) గీత, అవధిని తెలియజేసే గీత.
"గెర వ్రాసితినట యాకె ఇంటికి నేఁగకుండా"
23-401

గెరదాటు: అ.క్రి. అవధి దాటు.
"వెగ్గళమై గెరదాఁటే విచారమేలే" 20-135

గెరసు: వి. గెర, గీత, అవధిని తెలియజేసేగీత.
"గెరసు దాటకువోయి కేశవా మంకు
గెరలించేవు వలపు కేశవా" 14-233

గేస్తురాలు: (గేస్తు + ఆలు) గృహస్థురాలు, కులస్త్రీ, భార్య.
"నయగారి మాటలెల్ల నాకుఁగా నేరిచితివి
క్రియలెరుఁగు కొంటివి గేస్తురాండ్లకు" 27-531

## గొ

గొంగ: వి. శత్రువు. (సంహారకుడు, చావు)
"చెంట రాకు మని కృష్ణు వెరపించి యశోద
వొంటి మందలో గొంగ వున్నాఁడనె" 4-258

గొంజ: వి. గొడ్డుటావు.
"గొంజ సుకృతములు కుమ్మరించి హరి
రంజించెను సర్వజనులకు" 4 అను 43

గొంజగొడుగు: వి. దేవుని గొడుగు, ఆతపత్రం ప.బ.పా. ఆతపత్రమని అర్థమిచ్చినది. గొంజగొడుగులు చిన్నవి కాక పొడుగాటి స్తంభములపై నిలచినవి. ఆ గొడుగు కంబమును ఆలయపరిచారకులు నడుముకు చుట్టిన గుడ్డల మోపున బొడ్డుకడ ఆనించుకొని నిలుపుదురు. "గుంజగల గొడుగు గుంజగొడుగు. అదే గొంజ గొడుగయినదా!" అని వేటూరి ఆనందమూర్తిగారి అభిప్రాయం.
"వింజామరలును విసనకఱ్ఱలును
గొంజగొడుగులే కొండెల్లా" 1-119

గొంటరి: (గొంటు + అరి) వి; విణ. 1. కఠినుడు,

దుష్టుడు 2. దుష్ట మైన 3. దిట్ట. (వంచకుడని ఆం.ప.ని.)

"జంటై కూడితి నింతలో సరుగ శ్రీవేంకటేశ
గొంటరివై యాపె వీణ గోరనేమి మీటేవు"
22-306

"గొంటరై యిందుకు నాపె కోపగించినాఁ గోపించీ
అంటిముట్టి సరసము లాడకురా యికను"
7-451

**గొంటరితనము:** (2) వి. 1. కాఠిన్యం 2. దుష్టత్వం 3. దిట్టతనం.

"గొంటరితనాన నీవు కొంగు వట్టుకొని పతి
నింటికి రప్పించుకోఁగా నేలంటినా" 18-190

"వెంటనే చుట్టరికాలు వీరెల్లాఁ జెప్పఁగాను
గొంటరితనాన నేను గొరబుసేసేనా" 26-342

**గొంటరియాపె:** (గొంటరి + ఆపె) వి. 1. కఠినురాలు 2. దుష్టురాలు 3. దిట్ట.

"నంటు సేసుకొని నీతో నయమువనే నవ్వి
గొంటరియాపె యేల కోపగించీని" 25-254

**గొంటరివాఁడు:** విణ. 1. కఠినుడు 2. దుష్టుడు 3. దిట్ట.

"అంటిముట్టి చనుగవలందు గురుతులు నించీ
గొంటరివాఁడు గదమ్మా గోవిందదేవుఁడు"
29-55

**గొంటి:** (?)

"పాముపుట్ట గొంటిమీఁది పదుమటి తెరువు
చీమకడొంతరలోని చిన్న తెరువు" 1-244

**గొంటు:** విణ. నేర్పరి, దుష్టుడు, వంచకుడు.

"గొంటవై శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
దంటతనమున నవి తలఁచుకో నీవు" 11-11

**గొంటుఁదనము:** (గొంటు + తనము) 1. కాఠిన్యం 2. దుష్టత్వం 3. వంచన 4. నైపుణ్యం.

"రట్టుగాను నీవు మాటలిట్టె నాతో నాడఁగాను
గుట్టుతోడ నుండితేనే గొంటుఁదనమా" 23-516

"ఇంటిలోన ఆపెను నేమంటివో కాని
గొంటుఁదనమున నట్టె కూచున్నది" 20-421

**గొంటుతనము:** చూ: గొంటుఁదనము.

**గొంటెత:** (2) (గొంటు + త) వి. 'గొంటు'కు స్త్రీలింగరూపం. 1. కఠినురాలు 2. క్రూరురాలు 3. వంచకురాలు 4. దుష్టురాలు 5. దిట్ట.

"గొంటెత యెవ్వతోకాని కొద లేని తమకి తా
నంటఁగాక నిన్నుఁగూడె నదిరిపాటునను"
5-149

**గొంతిదామెర:** వి. ఒక నోము.

"కొమ్మ చలిమందులకు గొంతిదామెర నోమె
కమ్మదావులకు మును గౌరినోమె" 5-127

**గొందిసంది:** సందిగొంది, సంది మరియు మూల. (గొంది = మూల)

"మందలించఁజాలఁగాక మనసు నొచ్చీ నంటా
గొందిసంది తన మేని గురుతు లెల్లా" 25-23

**గొజ్జంగ:** గొజ్జంగి కావచ్చు. 1. పెద్ద చేమంతి 2. పచ్చపువ్వుల మొగలి.

"కొప్పుదువ్వి నీ కాతఁడు గొజ్జంగులు ముడువఁగా
అప్పుడే గోరుదాఁకె నంటూ ఆడేవే" 25-442

**గొట్టు:** వి. 1. దౌష్ట్యం 2. అల్లరి 3. మూర్ఖత. (వ్యు.) (బాధ – సారంగ.)

"యిట్టె శ్రీవేంకటేశ నీ వెనయఁగ
గొట్టుగెలిచి సిగ్గునఁ బొదలీని" 27-264

**గొట్టెవాటు:** వి. (?)

"కొట్టేటి వుట్లకింద గోవిందా నీతో
గొట్టెవాటై పెనఁగేరు గోవిందా" 16-325

**గొడఁగు:** అ.క్రి. 1. ఎదుటివారికి స్పష్టంగా వినబడకుండా నోటిలో ఉచ్చరించు, గొణుగు 2. కూయు 3. కసరు 4. ఆడు, కసరు.

"గొడఁగుచును బొమ్మలనె గొబ్బునను గోపించి
అడఁగి తలవంచె నీ వపు డేమిసేసితో" 9-124

**గొడగు:** (5) వి. 'గొడుగు'కు రూపాం.

"గొడగు పట్టినవానిఁగోరి యడిగిన తలఁపు
తడఁబడక విప్రులకు దానమిడు తలఁపు" 1-356

గొడవపోఁడు: వి. గొడవ చేసే స్వభావం కలవాడు, కలహశీలుడు.

"అడియాసల నూరకే అందనుంటి మంతెకాక

గొడవపోఁడితఁడు కూడనీఁడు పదవే" 14-271

గొడసిలి తప్పు: (?)

"[illegible]

[illegible]" 2-113

గొడియలు: వి; బహు. గొడియ, గొడి అంటే [illegible] బంధనసాధనం, [illegible] బంధాలు.

"[illegible]

[illegible]"

4-208

గొడుగుమల్లి: వి. కడపమండలంలోని ఒక గ్రామం. ఇది చెన్నరాయుడు వెలసిన క్షేత్రం.

"చిత్తగించు నీవాపెను చెన్నరాయ!

యీపె చిత్తిణి గొడుగుమల్లి చెన్నరాయ!"

27-328

గొడుగుమల్లి చెన్నరాయఁడు: వి. కడపమండలంలోని గొడుగుమల్లి గ్రామంలో నెలకొన్న చెన్నరాయడు.

"చిత్తగించు నీ వాపెను చెన్నరాయ! యీపె

చిత్తిణి గొడుగుమల్లి చెన్నరాయ!" 27-328

గొడ్డలి నానఁబెట్టు: ప.బం. వ్యర్థమైన ప్రయత్నం చేయు.

"మేనె దాచేవు మెస్తిర గొడ్డలి

నానంబెట్టేవు నయమున నే" 6-58

గొడ్డలివంటి చిత్తము: వి. కఠినమైన మనస్సు.

"నానితేఁ గొంత వలపు నయమౌఁగదే – (వోరి)

నానునా గొడ్డలివంటి నాదైన చిత్తము" 7-484

గొడ్డువోవు: (2) ప.బం. 1. పౌరుషహీనుడగు 2. గొడ్రాలగు 3. వ్యర్థమగు.

"వెడ్డువెట్టి కూడెను శ్రీవేంకటేశుఁ డింతులను

గొడ్డువోని వరముల గోవిందరాజు" 26-126

గొడ్డేరు: (4) వ్యర్థం, దండుగ, ఆశ్రయం లేకుండా.

"అర్థగించుకొంటివి నా కప్పులనాఁడ వా వోరి

గొడ్డేరు నీ కొద్దిగాదు కోపము నాకు" 11-237

"బొడ్డునఁబుట్టిన పూఁపనితే నిన్ను

గొడ్డేరు తెస్తినే కోడల" 12-312

"జిడ్డులేని హరికథ చవి లేకుండిన నిట్టే

గొడ్డేరె గొడ్డేరె గొడ్డేరే సుండి" 5-373

గొణఁగులు: వి; బహు. గొణుగుటలు.

"అడివి గొణఁగులు అమ్మెవి సణఁగులు

యీడనే మా పొందు నీకు నితవయ్యీనా"

14-204

గొదలు: అ.క్రి. కొదలు (= తడబడు) అని కన్నడము. సంకోచించు అనే తాత్పర్యార్థమిందులో కానవస్తుంది. 'ఇంత గొదుల్తా వేమిరా, కొతుకుతావేమిరా' అని వ్యవహారం ఉంది. (సం.ప.స. 14 సం.)

"నంటున నే నెంతైన నాకుఁగా వగవనీ

గొంటు చందమునకే గొదిలేనమ్మా" 14-389

గొనకొను: రూపాం. కొనకొను 1. సమ్మతించు 2.ఉద్యమించు 3. అతిశయించు 4. సంభవించు 5.నెలకొను 6. బయలుదేరు.

"మనసులో తలపోఁత మరి యేమీ నెంచదు

గొనకొన్న రతికేళి కొల దెంచదు" 26-380

గొనబు: వి. మనోజ్ఞత, సొగసు, విలాసం. విణ. 1. సొగసైన 2. పరిమళంకల 3. మధురమైన 4. మృదులమైన, లేతనైన.

గొబ: వి. గుహ, గొంది.

"వుండనియ్యక జీవనోపాయమున మమ్ము

కొండలను గబల తతిగొని తిప్పు ఫలము"

1-200

గొబ్బునన్: క్రి.విణ. గొబ్బున, శీఘ్రంగా.

"అలుమేలుమంగనై అయవరు లంటఁగా

బలిమి వేడుకల గొబ్బునఁ బదనాయ" 18-554

గొబ్బిపాటలు : వి. మార్గశీర్షమాసంలో యువతులు, బాలికలు ఇండ్లముందు గుంపులు కట్టి వలయాకారంలో తిరుగుతూ చప్పట్లు కొడుతూ పాడేపాటలు. ఈ పాటల్లో 'గొబ్బిళ్ళో' అనే పదం ఆవృత్త మౌతుంది.

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు
కుల స్వామికిని గొబ్బిళ్లో" 5-98

గొబ్బిళ్లు : వి. గొబ్బిపాట, బాల, బాలికా క్రీడావిశేషం, నమస్కారం.

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు
కుల స్వామికిని గొబ్బిళ్లో" 5-98

గొరబుగా : క్రి.విశ. వింతగా, అల్లరిగా.

"గొరబుగా మగనాండ్లఁ గొప్పువట్టి తీసేవు
నెరుసు లేనివారిపై నిందవేతురా" 14-177

"గొరబుగా నవ్వితేను కోపగించుకొనక
సరిగా నీవు నవ్వితి చాలదా ఇది" 19-379

గొరబుమాటలు : వి; బహు. వింతమాటలు, అల్లరిమాటలు.

"కొప్పు వెట్టఁగా సతిని గొరబుమాట లాడేవు
చెప్పరాని సేత యేమి సేసే నని" 16-214

గొరబుసేయు : (23) గొరబు = గోరబు, గోరగు అని కన్నడము a clock made of leaves of grass అని కిట్టెల్. వికారవిశేషము ఇత్యాది కావచ్చు అని సం.ప.స. 22 సం లో సూచింపబడింది. దీనిని బట్టి వేటూరి ఆనందమూర్తి గారు ఈ పదానికి వింతసేయు, వింతగ ప్రవర్తించు అనే అర్థాలను ఊహించినారు. (సం.పా.ప; భా.ప్ర.వి. 446, 447 పు.) తా.పె.కృ.ప.ప. అన్న గ్రంథంలో దీనికి అల్లరి సేయు అనే అర్థం చెప్పబడింది. సందర్భానుగుణంగా వింతసేయు, అల్లరి చేయు అనే రెండర్థాలు చెప్పుకోవచ్చు.

"గుట్టుతోడిదాన నన్ను గొర బేల సేసేవు"
28-297

"గుట్టుతోడ నున్న నన్ను గొరబేల సేసేవే"
25-90

"గొంటరితనాన నేను గొరబుసేసేనా" 24-882

"గొరబుసేయకు మమ్ము గుట్టున నుండగ
నిమ్ము" 25-402

"గొరబైన ఉంగరాలు" (18-323)

"గొరబుమాట" (16-314)

అనే చోట్ల గొరబు శబ్దానికి 'వింత' అనేఅర్థం సముచితంగా ఉంటుంది.

గొరబైన ఉంగరాలు : వి; బహు. వింత ఉంగరాలు.

"గొరబైన వుంగరాలు కొంకక నీ వేళ్ల నివె
యిరవాయఁ బనులెల్లా నేల లోఁగేవు" 18-323

గొరసరాయఁడు : వి. చూ : గొరిశరాయఁడు.

"అట్టె గొరసరాయఁడాయఁగా నీ వలపు
నట్టుక కంబము మాటు నవ్వులాయ వలపు"
27-390

గొరియలలోన పులి చొచ్చినట్లు : నానుడి; బలమైన వ్యక్తి బలహీనులపై పడినట్లని భావం.

"పొదరి గొరియలలోన పులిచొచ్చినట్లాను"
1-64

గొరిశరాయఁడు : వి. వరాహమూర్తి. (గొరిస = కాలిగిట్ట; కాలిగిట్టలు గలది వరాహం) రూపాం. గొరసరాయఁడు.

"ఆతురాన గొరిశరాయడికి నోపఁగలేరు
చేతిగోరు మీటితేనే ఛిన్నభిన్న మవుదురు"
3-186

గొరుపులు : వి; బహు. (?)

"చిప్పిలె నిట్టూరుపులు సిగ్గు లివె గొరుపులు
యిప్పుడిట్టె యీ సతి నేమిసేసితో" 9-137

గొల : వి. గెల; పండ్లు, కాయలు మొ॥ వాటి గుత్తి, వరుస.

"బెట్టుగా నొకచేతఁ జూపెడి తన ప్రతాపము
పట్టుకున్నాఁడొక చేతఁ బండ్లగొల" 3-232

గొల్లకత్తె : (గొల్ల + కత్తె) వి. గొల్లస్త్రీ.

"ఎంత యెడ గొల్లకత్తె వేమే నీవు
జంతవై వలపులట్టి చవులు గొనేవు" 18-112

గొల్లకొసరు : ప.బం; వి. 'గొల్లసుద్ది' వంటిది కావచ్చు.

"గొల్లబారి బాలి తెచ్చి శ్రీవేంకటేశుఁడు గూడె
కొల్లున నవ్వఁగదటే గొల్లకోమలు" 7-489
"బిజూటి సొగఁగదివ్వి మిక్కుటపు రతులను
కొలకొలఁ దెల్లఁగదె గొల్లకోమలు" 7-489

గొల్లతల్ల: వి. పుల్లనితల్ల (?)
"పోపో నీ గొల్లతల్ల పుల్లనే కాదా" 19-505
"గొల్లతల్ల పుల్లన గుఱ్ఱదింత చల్లన
వొల్లని మా పొందులకు నోవుదువా" 7-209

గొల్లజాణతనము: వి. వ్యతిరేకలక్షణంచే తెలివిలేనితనం అని అర్థం. (?)
"గొల్లజాణతన మెల్ల కోరి నీయందే కంటి
పెల్లుగా పదారువేల పెండ్లిట్లా నాడితివో" 16-119

గొల్లదోమటి: వి. గొల్లవాని అన్నం అని శబ్దార్థం. (దోమటి = అన్నం) అనుభవింపరానిది అని భావం. కంబళిలోని గొల్లవాని అన్నం తినడానికి వీలులేనిది కదా! గొల్లవారి మడ్డితనము (?)
"గొల్లదోమటాయ నేఁడు కోరి నీతో సరసాలు
చల్లవేఁడి సేసుకొంటే చాలు లేవోయి" 24-161

గొల్లమంకు: (2) వి; ప.బం. మిక్కుటమగు మంకు, మూర్ఖత, మొండి పట్టు.
"కడఁగి మావంటివారిఁగ్రై కొనేవా గొల్లెతలు
బెడసు గొల్లమంకుతోఁబెంచిరి నీ గుణము"
11-509 & 16-82

గొల్లమంకుది: (గొల్లమంకు + అది) మిక్కుటమగు మంకు, పట్టుదల గలది, మొండిపట్టు గలది.
"కూర వండి కస వేరే గొల్లమంకుదాననా
నేరిచి బతికేననే నీ దేవిఁగాక" 20-559

గొల్లముంజు: వి. గొల్లల తలవెంట్రుకలలో చెమటవల్ల చేరిన మురికి, తలమడ్డి. (ముంజు – తలవెంట్రుకలలో చెమట వల్ల చేరిన మురికి, తలమడ్డి.)
"అందముగ నిన్ను వారి యంగములు
సోఁకితేను
విందువలె గొల్లముంజు వేయకుండీనా" 15-172

గొల్లలెక్కలాడు: ప.బం; అ.క్రి. లెక్కలు సరిగా తెలియకుండా అవతలివారిని ఇబ్బందిపెట్టు.
"చిల్లర చెమటలతోడ చిక్కని పూర్పులతోడ
గొల్ల లెక్కలాడేవు కోప మేఁటికే" 9-117

గొల్లు: ఇది 'గొల్ల' కావచ్చునేమో!
"గొల్లు వెన్నదొంగిలఁగ గోవిందా నిన్ను
కొల్లున నవ్వేరు వీరె గోవిందా" 16-325

గొల్లు: వి. కలకల ధ్వని.
"కూటమిలో గొల్లవారి గొల్లు నీకు నితవాయ"
23-391
"గొల్లువేసి యలకల కొప్పుననే ముడిచిన
మల్లెపూవు లేల నీకు మనసాయ నిపుడు"
5-152

## గో

గోతము: వి. ఒకవిధమైన చిన్న గోనె.
"గోమునఁ గాగిలించేవు గోతమా మేను"
23-217

గోటారించు: (2) స.క్రి. సం.ప.స. (21 సం) లో దీని వివరణమిట్లున్నది. "బాధపెట్టు, పైకొను అను నర్థములలో గోడాడించు శబ్దము వ్యవహారములో నున్నది. ఇదే గోడాడు శబ్దముగా నిఘంటువులలో నున్నది. ఈ యర్థములోనే గోటారించు శబ్దము గోటాడించు అని కొన్ని ప్రాంతములలో కలదు. అదియే ఇది కావచ్చును".
"పాటించి ఇంతి చెలెలిఁ బట్టి తెచ్చి నాయకుఁడు
గోటారించి భంగించఁగా కొమ్మ వేడుకొనెను"
21-142 & 21-149

గోటారించు: అ.క్రి. తె.వ్యు.కో. లో గోటరించు అనే పదం ఉంది. గోటారించు అనే పదం లేదు. గోటరించుకు 'గోండ్రించు' అనే అర్థం చెప్పబడింది.
"పాటించి ఇంతి చెలెలిఁ బట్టి తెచ్చి నాయకుఁడు
గోటారించి భంగించఁగా కొమ్మ వేడుకొనెను"
21-142

గోడఁబూసిన సున్నము: ప.బం; వి. ఉపయోగించుకునే వీలు లేనిది, వ్యర్థమైనది.

"గోడఁబూసిన సున్నము కూడఁబెట్ట నేరనోప
ఆడుకోలు మాట దప్పె ననియెంచేనా"
19-427

**గోడకడుగు**: ప.బం; అ.క్రి. వ్యర్థమైన పనికి పూను.

**గోడ గడుగఁగఁ బోతేఁ గొనదాకా రొంపే**: బురదతోనే కట్టిన గోడను ఎంత కడిగినా బురద బురదే ఔతుంది. గొంగడిలో వెండ్రుకలు ఏరినట్టు వంటి మాట.

"గోడ గడుగఁగఁ బోతేఁగొనదాఁకా రొంపే
ఆడుకోలు తర్కవాదా లటువంటివే" 3-568

**గోడచేర్పు ప్రతిమ**: ప.బం; వి. అప్రధానుడు, వ్యర్థుడు, పనికి రానివాడు, ఉత్సవవిగ్రహం వంటివాడు.

"అలరి పెరసతుల నంటఁగా నివ్వెఱఁగంద
బలువైన గోడచేర్పు ప్రతిమలనూ" 17-150

**గోడపై సున్నము**: (2) వి. తిరిగి రానిది, వ్యర్థమైనది.

"నీడలోపల యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొద లేని యెఱుక" 1-104

**గోడమీఁది సున్నము**: (3) ప.బం; వి. ఉపయోగించుకో వీలు లేనిది, తిరిగి రానిది, అశాశ్వతం.

"గోడమీఁది సున్నమైతి కొండలరాయా
కోడెవయసు వో నీకు కొండలరాయా" 17-360

"గోడపై సున్నంబు గీఁకినఁ బనికిరాదు"
నీ.శ. 71

**గోడమీది మన్ను**: వి. ఉపయోగించుకునే వీలు లేనిది. చూ: గోడమీది సున్నము.

"మానని పుంటికి మందుమంతరము లేని సంది
గోనెబట్టినట్టి బంక గోడమీఁది మన్ను" 15-462

**గోడ లేని చిత్తరువు**: ప.బం; వి. ఉండనిది, ఆధారం లేనిది, మూలం లేనిది, అసంభవం.

"వేడుకకు వెల లేదు వెంగెమాడేదానఁ గాను
గోడలేని చిత్తరువు కొసరేనా నేను" 29-448

**గోడ లేని చిత్రము**: ప.బం; వి. ఉండనిది, అసంభవం.

"గోవిందునికటు మొక్కని మొక్కులు
గోడ లేని పెను చిత్రములు" 2-235
చూ: గోడ లేని చిత్తరువు.

**గోడాడు**: అ.క్రి. బాధపడు, దుఃఖించు, విలపించు, గోడువెట్టు.

"తలపోఁత బ్రాఁతె తలఁపులకుఁ దమ
కొలఁదెఱుంగ నియతి గోడాడఁగా" 1-41

**గోణము**: వి. (గోణము. త.) కౌపీనం, గోచి.

"కొప్పు చక్కఁబెట్టుకో గోణము చక్కఁగట్టుకో
అప్పటి మేను గిజిగిజియై వుందురా" 21-424

**గోణాము**: వి. 'గోణము'నకు రూపాం. గోచీ.

"అంచలఁ గప్పురకావు అంగముల మెత్తుకొని
కొంచక నిలుచున్నాఁడు గోణాముతోడను"
17-532

**గోద**: వి. వెద, కొద.

"మనసులోపలి వేద మాటలలోపలి పూద
కనుఁగొనలనే గోద కానరాదా" 20-253

**గోదము**: వి. 'క్రోధము'నకు వికృతి కావచ్చు. కోపం.

"పాదాలు సేవసేసితే పైపై నిందరితోడాను
గోదాన చెప్పేవు బెట్టి గుద్దితినంటా" 21-73
"కేవలనువర్ణముపై సరళాదేశము వీరిలో అపురూపము. పూర్వపాదాంతనువర్ణము పక్క బిందువు ప్రమాదమున తొలగెనా" అని సంపాదకులు. (21 సం; 50 పుట)

**గోదిలి మోహము**: వి. 'గోదిలి' గూఢ శబ్దభవంగా కనిపిస్తుందనీ, అర్థమూ అదే కావచ్చునని సం.ప.స., గూఢమైన మోహం.

"ఆదట జలకమార్చేనంటా నొరసుకొనేవు
గోదిలిమోహాన నెంత గుబ్బతిలేవే" 18-112

**గోదిలు**: (5) శ.ర., తె.వ్యు.కో. మొ॥ నిఘంటువుల్లో కానరాదు. నిరాదరించు, బాధపడు అనే అర్థాలు చెప్పవచ్చు. గోదరిల్లు (= బాధపడు) అనే పదానికి రూపాం. కావచ్చు.

"ఆదరించేవారితోడ నంటి పొందవలెఁగాక

గోదిలేటి మగవాని కొంగు పట్టవచ్చునా"
11-274
"మేదరింటి లంజ వోయి మేదినీశుఁ దగులఁగ
గోదిలు విటులెల్లఁ గుల్లినయట్టు" 4-31

గోనాలగొందులు: (2) వ.బం; వి; బహు. ఉండిగొందులు (కోణాల గొందులు = మూలల్లోని సందులు) (కోణాల గొంది = మిక్కిలి ఇరుకైన చీకటిమూల అని తె.వ్యు.కో.) చూ. పొందు. 5-296
"తెలిసితి నీ పొందులు తెరవిడురు విందులు
నలి నుట్లు గొట్టిన గోనాల గొందులు" 29-509

గోనెఁబట్టిన బంక: (2) వ.బం; వి. గట్టిగా పట్టుకొని వదలనిది, జిగురువలె వదలనిది. గోనెసంచికి పట్టిన జిగురు గట్టిగా అంటుకొని తీయడానికి వీలులేకుండా ఉంటుంది కదా!
"మానని పుంటికి మందుమంతరము లేని సంది
గోనెఁబట్టిన బంక గోడమీది మన్ను" 15-462
"వాన చేతకములవలె నాయ మనసు
గోనెఁబట్టిన బంక గుణమాయ మనసు" 1-337

గోనెమీఁది తౌడు: వ.బం; వి. వదలనిది, తీయరానిది, గోనెసంచికి అంటుకుపోయిన తౌడును తీసుకోలేము కదా!
"కూరిమి సేసితి నేను కొంగువట్టినాఁడు తాను
కోరుకో నీవే సిగ్గు గోనెమీఁది తౌడు" 25-381

గోపాలకిసునరాయఁడు: వి. 'గోపాలకృష్ణరాయడు' అనడానికి జానపదవ్యవహారం.
"రారా గోపాలకిసునరాయ నీ వది గొల్ల
వారి మగువల సూవు(పు) వల్లెవేయఁగా" 5-15

గోపాళులు: వి; బహు. గోపాలశబ్దానికి బహువచనరూపం. గోపాలురు, గొల్లవారు.
"కొట్లు గొట్టుచు గోపాళులుఁ దాను
అట్లు తోడనే యారగించీని" 23-331

గోమంతము: వి. గోమంతపర్వతం. (వాచ)
"యెన్నికతో గోమంత మెక్కి జయము చేకొని
మన్ననతో మథురకు మరలినట్లు" 3-433

గోము: (4) వి. 1. గారాబం, అతిలాలనం, శ్రమ ఎరుగనితనం 2. గౌరవం 3. గర్వం, మదం, పొగరు 4.విధం 5. వికాసం 6. సౌకుమార్యం 7. గుట్టు.
"యేమి వొడఁబరచేవు యేల నిలుచున్నాఁడవు
గోమున నావద్ద నిట్టే కూచుండరాదా" 12-19

గోరంటగోళ్లు: వి; బహు. గోరంటాకు పెట్టుకోవడం వల్ల ఎఱ్ఱబారిన గోళ్లు.
"జీరల భుజాల కేలే చెమటలు నీ
గోరంట గోళ్ల కేలే కొనవాండ్లు" 5-125

గోరఁబోవుటకు గొడ్డలి: వ.బం; వి. సులువుగా నెరవేరే పనికి చేసే పెద్ద ప్రయత్నం, ముందే జాగ్రత్తపడితే సులువుగా అయ్యేపనికి ఆలస్యం చేస్తే మహాప్రయత్నం కావలసి రావడం.
"నారాయణ నీ నామమహిమలకు
గోరఁబోవుటకు గొడ్డలి దగునా" 3-573

గోరగించు: అ.క్రి. ఉదయించు, మొగ్గదొడుగు; భయంకరమగు.
"కోపములిద్దరిలో గోరగించీఁ జూడరే
పైపైనె జవరాలు పంపెడి నింతులను" 5-8
"కూరిమి వేంకటపతిఁ గూడిన తమకమున
గోరగించీ నదివో చకోరముల పిల్లలు" 5-331

గోరడి: (2) వి. గోటినొక్కు, నఖక్షతం.
"గోరడి నన్నేలకొని గుంపించి పైకొను కాక"
26-397

గోరనూదు: (9) స.క్రి. గోరితో నొక్కు.
"నెమకి గోరనూఁదితే నేరము లెంచఁగరాదు
ప్రమదానఁ జే చాఁచితే పంతమాడరాదు"
26-500

గోరపడు: (5) అ.క్రి. బాధపడు (వా.ని.), ఆశపడు, విసుక్కొను, రోతపడు.
"గోరపడి గడించేవి కోట్లకొలదులు
తారితూరి నోటికిఁ దగ్గంత కాదు" 3-538

గోరపెట్టు: స.క్రి. బాధపెట్టు (ఆశపెట్టు, విసుగు కలిగించు)

"నేరుపునంజన్నియ్యంగ నెత్తురెల్లఁ దాగి తాగీ
గోరపెట్టి చరపె నిట్టి కొత్త లెందుఁగలవా" 6-6

గోరము: వి. ఘోరమునకు వికృతిరూపం, భయంకరం (ఆపద అని ఆం.ప.ని.) ఉదా :- గోరపు వెన్నెల, గోరపు రుధిరము 4. అను 2

"అలవోక తెలువులును అబ్బురపు మరపులును
కొలఁదిమీరులు మిగుల గోరమని కాక" 5-356

"చిత్తమెల్లా నిగిరించెఁ జెక్కులెల్లాఁ జెమరించె
కొత్తవలపు సతికి గోరమాయను" 26-4

గోరవంక: వి. 'గోరువంక'కు వ్యావహారికరూపం.

"బెట్టి మాటలాడుమంటూ పెంపుడు నా గోరవంక
గొట్టఁబోయి బోఁదే కోలఁ గుచ్చి తానను" 17-34

గోరసేయు: అ.క్రి. బాధించు, దుడుకు సేయు, ఆగడము సేయు.

"చక్కని శ్రీవేంకటేశ సమ్మతిఁ గూడితివి
చిక్కిన సతులు గోరసేయరా నన్ను" 20-12

"వలపు రచ్చల వేసేవారు గలరా
కులమునాండ్ల నింత గోరసేయవలెనా" 11-447

"కులికి మమ్మేల యింత గోరసేసేవయ్యా" 11-50

రోతపడు:

"కొమ్మల సణుఁగులకు గోరసేసేవారె కాక
సమ్మతించి మెచ్చుమెచ్చే జాణ లెవ్వరు" 11-16

ఆగడముసేయు:

"కోడెతనమున నింత గోరసేయనేటికి" 23-403

గోరాటలు: (గోరు + ఆటలు) వి. గోరితో ఆటలు.

"గుబులైన యతనిపై గోరాట లదె నీకు
అరుదైన ప్రియమైన మాతనికిని" 6-89

గోరాదిగొను: (గోర + ఆది + కొను) అ.క్రి. ఘోరమైన మనోవ్యాధి పొందు కావచ్చు.

"ఏమోయి మాతోనే యేల గోరాదిగొనేవు
దీముపలె నున్నవారి దీకొనేవు" 21-49

గోరిచేతలు: వి; బహు. నఖక్షతాలు.

"మొగము చూచిన లోలో ముసుగు వెట్టుకొనేవు
చిగురు గోరిచేతలు చెక్కులంటెనో" 7-509

గోరితాఁకులు: వి; బహు. నఖక్షతాలు.

"కందువ శ్రీవేంకటేశుఁ గలసిన మర్మము
గొందినె యీతని గోరిగురుతులె పో" 9-126

గోరి మదనరేకలు: వి. నఖక్షతాలు.

"కోపములకు గురి నీ గోరి మదనరేకలు
చేపట్లకు గుఱి నీ చెట్టాపట్టాలే" 20-302

గోరిరేకలు: వి; బహు. నఖక్షతాలు.

"గట్టి గోరిరేకలు కంతు ముద్రరేకలు
తొట్టిన యీ కౌఁగిలిరతుల లోఁగిలి" 12-266

గోరివాత: వి. నఖక్షతం.

"చేసినా అంగన నీకు చేసన్న లెల్లాను
వ్రాసినా చెక్కుల గోరివాత లెల్లాను" 7-515

గోరివెచ్చ: ప.బం; విణ. గోరువెచ్చ, కొద్ది వేడి గల.

"కదియఁగాఁ జన్నులు కాయమెంత వొత్తునో
గుదిగొనఁ గాంతునదే గోరివెచ్చ కౌఁగిటా" 13-353

గోరిసోఁకులు: వి; బహు. నఖక్షతములు.

"తెరమాటున నుండే తేటలమాటలు చవి
సురతపువేళ గోరిసోఁకులు చవి" 7-49

గోరుచు: అ.క్రి; మాం. కొంచెము కొంచెము గోకిగోకి చేర్చు. బాధపడు అని కూడా ఉంది.

"నేరుపుతోఁ జెప్పినట్టె నేము నిట్టె సేయఁగాను
గోరిచీని వలపులు గోవిందరాజు" 25-308

గోరుచుట్టుపై రోకటిపోటు: ప.బం; వి. ముందే బాధ భరింపలేక ఉండగా దానిపై మరింత బాధ ఏర్పడే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"కాఁకల నడుము చిక్కెఁగదె గోరుచుట్టుపై
రోఁకటిపో టాయ నమ్మరో తరుణి" 5-238

గోరుపడము: కంబళి. (నల్లనిది)

"కొత్తకోక నల్లనైతే గోరుపడ మనలేవు" 5-152

గోరుపోవు: ప.బం; అ.క్రి. మొక్కపోవు, తప్పిపోవు, పొల్లుపోవు.
"మాట గోరువోయీ నంటా మౌనాన
నీటున ముచ్చటాడక నేమానరా నుందువుగాని"
17-78

గోరూఁదు: (3) ప.బం; అ.క్రి. నఖక్షతం చేయు, గోరుతో నొక్కు.
"అన్ని రతులకు లోనై అట్టే చొక్కించఁగాను
చన్నులేల గోరూఁదేవు సారెకు నన్ను" 8-183

గోరొత్తులు: (6) (గోరు + ఒత్తులు) వి; బహు. నఖక్షతాలు.
"తావుకొన్న వలపులు తారుకాణలైన చోట
కావరపు గోరొత్తులు కమ్మఁబూవుతాఁకులే"
13-198

గోల: వి. కష్టం, ఇబ్బంది.
"ఈతనిఁ గొలిచితేనే యిన్ని గోలలునుఁదీరు
చేతనంబెట్టు పుణ్యాలు చేరువనే కలుగు" 2-57

గోలతనము: (3) వి. ముగ్ధత్వం, బేలతనం.
"అమితపు గోలతనా లాసలెల్లా రేఁచునా"
22-185

గోలవాఁడు: (గోల + వాఁడు) వి. అమాయకుడు, తెలివి మాలినవాడు.
"వేడుకకాఁడైనయట్టి విభుఁడు గాక
కోడెతనాలు సేసీని గోలవాఁడా యితఁడు"
24-596

గోళిగ: వి. 'గోడిగ' కు రూపాం.ఆడుగుఱ్ఱం.
"యెక్కె గుఱ్ఱము గోళిగ నెనసి పైకొంటే రౌతు
తక్కక దానిఁ జీకటితప్పు గొనవచ్చునా" 2-214

గోవజవ్వాది: వి. గోవానుండి వచ్చిన సంకుమదం.
"గొల్లెతలకేలరా గోవజవ్వాది నీకు
చెల్లుఁగాక యెటువలెఁ జేసినా నన్ను" 5-103

గోవరుదనము: వి. గోవర్ధనము. (గోవర్ధన పర్వతం) అనేదానికి జానపదవ్యవహారరూపం.
"గోవరుదన మెత్తిన గోవిందుఁడీతఁడు
గోవులఁగాచినయట్టి గోవాళుఁడు" 28-492

గోవాళవిద్యలు: వి; బహు. యౌవనవిద్యలు.
"ఒక్కటికి నురి గట్టే వొంటికి దాయిగట్టే
వెక్కువ గోవాళవిద్య లీడఁజేయవలెనా" 24-31

గోవాళితనము: వి. యౌవన చేష్టలు, విట చేష్టలు.
"గోవులఁగాచి యలసీ గోవిందుఁడు
గోవాళితనాలు సేసీ గోవిందుఁడు" 18-414
"విట నామధేయమౌ విటకాఁడు, వేడుకకాఁడు, బొజుగు, ననుపుకాఁడు, లంజకాడనఁగ, నివియుగాక గోవాళ్లనఁ గా నొక్క శబ్దంబు గలదు బహుత" ఆం.భా. 2-116 దీనిని గోవాళుడని ఏకవచనంగా వాడటం విశేషం.
"యీ వేళ శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁ గూడితివి
గోవాళుఁడ తలఁచుకో గొల్లవారి పొందులూ"
23-114

గోవాళుఁడు: వి. యౌవనవంతుడు, విటుడు.
"తావు లొక్కటిగాఁ జేసి వన్నెకాఁడవై తిరిగి
గోవాళుఁడ వైతివి గోవిందరాజా!" 18-516

గోవాళు: వి. యౌవనం కలవాడు, అమాయకుఁడు, పసివాడు అనే అర్థాలుకావచ్చు (?)
"గోలవై యజ్ఞఫలము లిచ్చితివి
గోవాళు సేసేటి పనులివియా" 3-277

గోవిందరాజు(లు): వి. దిగువతిరుపతిలో వెలసిన గోవిందరాజస్వామి. ఇట ఆలయంలో స్వామి శ్రీరంగనాథస్వామివలె పడుకొని ఉంటాడు.
"చాటుమ నవ్వులు నవ్వి సన్నలు కన్నులఁజేసి
వేఁటలాడీ వలపు గోవిందరాజు లిదివో" 20-526
"తెంకిని శ్రీవేంకటాద్రి దిగువ తిరుపతిలో
కొంకక వరములిచ్చే గోవిందరాజు" 1-478

గోసనాస: వి. ఘోషణ, ఊరంతా గుప్పుమనుట అని పద.
"గోసనాసఁబతినేమీఁ గోసరకురే" 28-36
"గోసనాసతోడ మరి కొప్పు దువ్వనేల నన్ను"
19-234

"యితరులెరఁగఁగాని యిచ్చిన నీ బాసలు
తతి సవతులకు సదా గోసనాసలు" 7-392

"చెల్లని చేతలు మీరు సేసేరు గాక
గొల్లెతలు హరితోడ గోసనాస యేఁటికే" 22-70

"గోసనాసగా వేడుకొన నేలయ్యా" 27-120

"బాసలే నిజములైతే తగవుకుఁ బనిలేదు
గోసనాసగాఁబతిని గుంపించవచ్చునా" 28-470

**గోసనాసగొను :** ప్రకటితమగు (?)

"గోసనాస గొనకుంటె గుణవంతుఁడౌనె" 11-89

**గోసనాసచేయు :** అ.క్రి. ప్రకటనచేయు, చాటించు, ఘోషించు.

"వేసరించి వెడ్డువెట్టి వెక్కసానఁ బెనఁగుచు
గోసనాస చేసి యేల గోరసేసేవే" 14-138

"ఆసల నెవ్వతైనా నంటక నీవుండలేవు
గోసనాస చేసి నిన్నుఁ గోపించఁజాలను" 17-96

"మాసటీలా మీ రేమైనా మగిడి మగిడి నేఁడు
గోసనాస చేసి యేల కొంచేవు నీవు" 26-529

"యీ సరి శ్రీవేంకటేశుఁ డిందరిఁగూడిన మీఁద
గోసనాస సేయఁబోతే కోప మేలే నీకు" 11-313

"ఎంత గోసనాస సేసేవేల మమ్ముఁ గొసరేవు"
19-95

"వాసికే బతికేవారు వనితలెల్లా
గోసనాస సేతురా కొండవంటి దొరవు" 13-283

## ఘ

**ఘంటాకర్ణుఁడు :** వి. పిశాచనాథుడు, కుబేరుని బంటు. శ్రీకృష్ణుని నామసంకీర్తనంచే ఈతడు శ్రీకృష్ణుని దయకు పాత్రుడై పిశాచరూపాన్ని వదలి దివ్యరూపం పొందుతాడు.

"యిచ్చెను వాయుజునికి యిటమీఁది
బ్రహ్మపట్ట
మిచ్చెల ఘంటాకర్ణుని కిచ్చెఁ గుబేరత్వము"
4-255

**ఘటముగ :** క్రి.విణ గాటముగా.

"నూటొక్క బుసుషు లిడిన నూటొక్క
సంతలందు
ఘటముగా సోదించి కనుకొండో" 15-113

**ఘడన :** వి. 'గడన'కు రూపాం. ఇందులో 'గ'కు బదులు 'ఘ' వాడడం విలక్షణం. సంపాదన.

"కాయము మోచితి ఘడన గడించితి
చేయారఁ బుణ్యము సేసితినా" 3-156

**ఘడియించు :** స.క్రి. గడియించు కావచ్చు. సంపాదించు.

"పలు లంపటములఁబడి
ఘడియించేటి బహుధన మిది యేల" 4-102

**ఘనురాలు :** వి. గొప్పస్త్రీ. (వింతప్రయోగం)

"ఎంతైనా నాతఁడు నీకు నెక్కుడు గాదా
కాంతుఁడు మన్నించఁగానే ఘనురాలవైతివి"
19-26

## ఘో

**ఘోరకుడుచు :** ప.బం; అ.క్రి. కష్టదశ అనుభవించు.

"ఘోరకుడువఁగఁ ద్రిశంకుని నంత్యజునిఁ జేసె
పేరుఁడగు నలుఁబట్టి విద్రూపుఁజేసె" 1-134

## చ

**చంకగుదియ శరణార్థి :** ప.బం. నమ్మదగనివాడు, తగని ప్రవర్తన కలవాడు. పైకేమో అభయం కోరుతూ వచ్చినట్లు నటిస్తున్నా నిజంగా కొట్టడానికి కఱ్ఱ తీసుకొని వచ్చినట్లు అని భావం. చూ : చంక దుడ్డు శరణార్థి. ఇట శరణార్థి (శరణు కోరేవాడు) అనేది 'శరణార్తి' అని వాడబడింది.

"చంకగుదియ యిదే శరణార్తి నేనిదే
తెంకి నా భావము దేవుఁడే యెరుఁగు" 3-389

**చంకగుదియ శరణు :** ప.బం. నమ్మదగనివాడు, తగని ప్రవర్తన గలవాడు. చూ :
చూ : చంకగుదియ శరణార్తి.

"అలరి చంకగుదియ నట్టే శరణనేటి
నిలుకడయిన మాట నిజమాయ నీకు" 7-560

**చంకగుదె శరణార్తి :** చూ : చంకగుదియ శరణార్తి.

"జవ్వనాన చంకగుదె శరణార్తిఁ దనకేల

వువ్వుళ్ళూరించక నన్ను నుండనీరాదా" 20-83

చంకదుడ్డు శరణార్థి : ప.బం. నమ్మదగనివాడు, అయోగ్యమైన ప్రవర్తన గలవాడు.
చూ : చంకగుదియ శరణార్థి.
"సాకిరి చంకదుడ్డు శరణార్థి రెండు నేల
మేకొని యీ మాట వింటే మెత్తురా నిన్నును"
4-203

చంకలెత్తి మొక్కు : ప.బం. చేతులెత్తి మొక్కు.

చంగనన్ : క్రి.విణ. చంగున, వేగంగా.
"చంగనఁ బొగడరాదు సారెసారె నన్ను నీవు
వెంగెమో నిజమో యంటా విచారించేవు"
27-248

చంగు : అ.క్రి. చెంగు, వెనుదీయు.
"చంగని పాపజాతిని సారె నీవు మొక్కఁగాను
వుంగిటి గొనఁదిట్టి వూరకే నిన్నును" 16-120

చంచలపడు : అ.క్రి. చాంచల్యమునొందు, చంచలుడగు.
"చంచలపడఁగవద్దు సారెసారెఁ గోరవద్దు
పొంచుకున్న దైవమే బుద్ధులు నేర్పని"
15-273 & 3-336

చంచలము : (20) చాంచల్యం, ధర్మివాచకానికి బదులుగా ధర్మివాచకప్రయోగం చేయడం అన్నమయ్యకు అలవాటు.
"చిక్కు చంచలము పెనచుక తిరుగక
చొక్క సుఖంబో టురుసుఖము" 3-545

చంచలించు : (4) అ.క్రి. కదలు, చలించు, చాంచల్యం పొందు.
"పొంచి పొంచి యాపె నన్ను పూవులను
వేయఁగాను
చంచలించి యట్టె నీవు సన్నసేసేవు" 19-139

చంచు(లు) : (17) (?)
"పొంచి వేరొక్కతె నిన్ను బొమ్మల జంకించితే
చంచులఁబాడినందుకే సతమై కరఁగుదురు"
6-105
"చంచుల మోవి చూపి సన్నచేసేవు" 7-117

"చంచున నూరకుండితే సమ్మతించె నందురు
వంచిన చేయెత్తితేను వచ్చేననే నందురు"
17-41

చండ : వి. పోట్లాట. (త. శండై)
"చలము సాధించె వాడై చండకు
వచ్చియుండఁగా
తలవంచు కొమ్మనేవు తగునే నీకు" 17-24

చండి : (3) వి. మొండితనం, క్రూరత్వం, తీవ్రత, తీక్ష్ణత.
"చలపాది దొక్కటె చండితోడ నుండుఁగాని
లలనల మనసులు లక్కవంటివి" 21-576
"నిండుకొని శ్రీవేంకటనిలయుఁడు నన్నుఁగూడె
చండితోడ నీ వేమి సాదించేవే" 28-156

చండిగా : క్రి.విణ. తీవ్రంగా.
"పండే వాతని పక్కను బంగారువంటి నీ మేను
చండిగాఁ గాకలు సేసీఁ జాలు నుండఁగదవే"
26-320

చండిచేయు : అ.క్రి. మొండికి వేయు, మొండికెత్తు.
"చండిచేసి పెనఁగడు సన్నలనే మోవి చూపి
నిండుఁగాగిటఁగూడఁగా నివ్వెరఁగేలే" 26-542

చండితనము : (3) వి. మూర్ఖపుపట్టు, మొండితనం, క్రూరత్వం. (వ్య.)
"వుమ్మగిలుఁజెమటతో నుడివోని పంకెనలు
సమ్మతించక వినేటి చండితనాలు" 12-328

చండిపారు : ప.బం. మూర్ఖత్వంతో ప్రవర్తించు, చండివడు వంటిది. తెల్లఁబాఱు, వెలవెలఁబాఱు – మొదలైన వానివలె ఇక్కడకూడా పారు – అగు, పరిణమించు, వర్తించు అనే అర్థాన్ని ఇస్తుంది. లేదా ఈ పదం చండిపోరుకు పొరపడిన వ్రాతకూడా కావచ్చు.

చండిపెట్టు : (21) అ.క్రి. మొండికి వేయు, కోపించు, ప్రతిఘటించు, కోపగించు, కలహించు.
"దండనే కూచుండఁగాను తప్పక చూచితిఁగాక
చండిపెట్టి వెంగెముగా సాదించితివా" 27-107

**చండిపోరు:** అ.క్రి. మొండికెత్తు.

"సతినీవు పొందైతే సగఁబాలిదాన నేను
అతనితో చండివోరే యట్టిదాననా" 23-415

**చండివడు:** (10) అ.క్రి. మొండికెత్తు (పద.), కోపపడు.

"చెక్కులు నీవు నొక్కఁగా సిగ్గులెల్లాఁ దొలఁగెను
చక్కఁగ నీవు మెచ్చఁగ చండివడెను" 21-221

**చండివెట్టు:** చూ: చండిపెట్టు.

"దండనే నే వుండఁగాను దయఁజూడవలెఁగాక
చండివెట్టి పెనఁగుతా సాము సేతురా" 18-534

**చండిసేయు:** (23) మొండిచేయు, మొండికెత్తు, కోపించు.

"చన్నుఁగొండలనే వొత్తి చండిసేయ నేటికే
యెన్నికతో వేడుకొంటే నియ్యకొనీఁగాక"
28-324

(సం.ప.స. 14 సం. 350 పు.) 25-14

**చందనపుకొండ గాలి:** వి. మలయమారుతం. (చందనపుకొండ = మలయపర్వతం)

"చందనపుకొండ గాలి చాయ నీ వూర్పు
చందమామ పోలిక సకియ నీ నెమ్మోము"
28-182

**చందమామ గుటుకలు:** (11) ప.బం. అలభ్యం, దొరకనిదానికై ఆశపడి నోరూర్చుకోవటం, వట్టి ఆశ, చందమామ గుక్కిళ్ళు. చందమామను చూచి గుటకలు వేయటం, పిల్లలకు చందమామను చూపుతూ వట్టి చేతులతో తినిపించగా తినునట్లు వారు నటింతురని సూ.ని. సరియని తోచదని, గుటకలు వేయుటయే ఇక్కడ అని పద.

"అంది వెన్నెలనవ్వుల అల్లంతఁజల్లితే
చందమామ గుటుకలంటా జాలిగొనేవు"
12-502

**చందమామ పిల్లలు:** వి; బహు. నఖక్షతాలు, గోరిగీతలు. అర్ధచంద్రాకారంలో ఉండేవని వ్యు.

"చన్నులపై నిండినవి చందమామ పిల్లలు
పన్నీటి కాలువలు పారీఁ జెక్కులు" 28-447

ఈ అర్థంలో క్షేత్రయ్య 'చందురు పిల్లలు' అని ప్రయోగించినాడు.

"సందిట నున్నయీ చందురుపిల్లలు"

**చందము:** (3) వి. అందము. చందములోని చకారం లోపించగా ఏర్పడ్డ పదమే అందము.

"చందపు శ్రీవేంకటేశ చన్నులొత్తి కూడితివి
పందెములు గొంటినా పదరితినా" 23-488

**చందురులు:** వి; బహు. నఖక్షతాలు.

"జాడల నా చన్నులపై చందురులఁజూడవయ్యా
యేడలేని చలముల ఇంత సేసితి" 23-394

**చంద్రకళలు:** వి; బహు. నఖక్షతాలు.

"నాటుకొని (కొనీ) చెక్కులపై నవచంద్రకళ లుండఁగాను
గాటపుఁగస్తూరెంత కడు మెత్తేవే" 18-7

**చంద్రగోళి:** వి. చంద్రపుగిన్నె, అంచు లేని గుండ్రమైన గిన్నె, పక్షులు నీరు తాగడానికి, మనం చేతులు కడుగుకోవటానికీ అందులో నీరు ఉంచుతారు.

"క్షాళనోచితచంద్రగోళి యనఁగ" పాండు – 5-24

**చంద్రవంకబొట్టు:** వి. చంద్రవంక ఆకారంలో ధరించే ఒకరకపు బొట్టు.

"కట్టిన బొమ్మలపట్టు కన్నె చంద్రవంకబొట్టు
మెట్టిన పాదాలమీఁద మెరసేగుట్టు" 16-82

**చంద్రవంకలు:** (13) వి; బహు. నఖక్షతాలు.

"పతి కంఠమునఁ జంద్రాభరణము వెట్టియే
సతి చంద్రవంకలంటా సాదించీని" 26-113

**చంద్రాభరణపు సొమ్ములు:** వి; బహు. కంఠాభరణ విశేషములు.

"గక్కనఁగాగిట నిన్నుఁగలసి యీ మానిసి
చొక్కి చంద్రాభరణపు సొమ్ములు వెట్టె" 21-415

**చంద్రాభరణము:** (2) వి. కంఠాభరణ విశేషం.

"అంది నీ కంఠమునఁ జంద్రాభరణము వ్రాసి
సందేహించి చూడఁజాలక పొగులును" 17-433

**చంద్రులు:** వి; బహు. చంద్రాకారమైన నఖక్షతాలు.

"చన్నుల చంద్రులు నిక్కి సమరతు లివె
చొక్కి మునుసెల్లాఁ గంటిమిఁక మన్నించవయ్యా" 27-502

చక్కటి: వి. దోటు, దంత, వైపు, దిక్కు, ఎదురు, సూటి.
"దాయల నీ పొత్తూ మాను
చక్కటిగాలుపులేసి
పొయుదాని చుట్టబుట్టి పనిగొంటివే" 23-91

చక్కముక్క: విశే. చిందరవందర. (వ్య.)
"చొక్కరిగాలిది తిట్టు కొడిగట్టె దిల్లాను
చక్కముక్క చాలిక్కా చవికింతే కా" 2-69

చక్కముక్క సేయు: వ.బం; స.క్రి. చిందరవందర చేయు. (వ్య.)
"యెక్కడి పగయొకో ఇంద్రియాలు నన్నుఁబట్టి
చక్కముక్కసేసి యొంచి సాదించీని" 2-105

చక్కురము: వి. 'చక్రము'నకు జానపదవ్యవహారం.
"నిక్కి చేతులు సంకుఁజక్కురాలై వున్నవి" 7-218

చక్కురవర్తి: వి. చక్రవర్తి అనడానికి జానపదవ్యవహారం.
"దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి
రమ్మన్నచోటికి వచ్చి నమ్మినవాఁడు" 1-151

చక్కెరదీబలు: వి; బహు. చక్కెరదిబ్బలు.
"చతురతఁబిరుఁదులు చక్కెరదీబలంటా
తతిగొని యంటీని దామోదరకృష్ణుఁడు" 17-206

చక్కెరపెదవులు: వి; బహు. తియ్యనిపెదవులు.
"చక్కెరపెదవులతో సకియ మాటాడవే
నెక్కొని సుద్దు లడిగీనీ రమణుఁడు" 28-424

చక్కెరబొమ్మ: వి. మనోజ్ఞురాలు, చక్కెరబొమ్మ వలె ఇష్టమైంది.
"మానైన చక్కెరబొమ్మలు మేనుదీగెలు
లేనగవు మెఱుఁగులు లేఁతవెన్నెలలు" 6-33

చక్కెరమోవిది: (చక్కెరమోవి + అది) తీయని పెదవి గల స్త్రీ.

చక్రపుబిల్ల: ఆడుకునే ఒక బిళ్ల.
"అరసి నా పిరుఁదిది ఆడే చక్రపు బిల్లంటా
సరుసఁబట్ట నిమ్మనీ సన్నమా వీఁడు" 17-173

చక్రాంకితాలు: వి; బహు. శ్రీవైష్ణవులు ఆచార్యునిచే తప్తముద్రచే వేయించుకునే విష్ణువు ఆయుధమైన చక్రపుగుర్తులు. ఇవి వేసుకున్నవాడే శ్రీవైష్ణవుడు.
"చక్రాంకితాలు వ్రాతలు చక్రాంకితాలే వహికెక్కె
ముద్రలు" 3-415

చట్టి: వి. మూతి వెడల్పుగా ఉండే చిన్న మట్టిపాత్ర, అటిక, చిన్నకుండ.
"పుట్లమీద నున్న పాలు
వెన్నా చట్లతోడనే సాదించీ" 23-331 & 1-122
"బలు హిరణ్యాక్షుఁడు ప్రహ్లాదుని బట్టి
జలధి వేసిన నీరుచట్టి తేలె" 4-372

చట్టుపడు: వ.బం; అ.క్రి. నశించు, అణఁగు.
"చట్టుపడఁదోలె నాఁడు సముద్రాలపైఁ దేరు
ముట్టుగాఁదోలెను పౌండ్రకునిపై నదే తేరు" 6-110 old

చట్టురాతినార: వి; వ.బం. అతికష్టసాధ్యం. చట్టురాతిపై నార తీయడం అసాధ్యమని వాచ్యార్థం.
"చుట్టరికము సేయుచు సూడువట్టగ రాదు
చట్టురాతినారిది విచారించుకోవయ్యా" 23-231

చట్రాత నారొలుచు: వ.బం. అసాధ్యమైన కార్యానికి పూనుకొను. (చాపరాతిపై నార ఒలుచు అని వాచ్యార్థం.)
"సడఁగులు చల్లి చల్లి చట్రాత నారొలిచేవు
తడయక సిగ్గులనే దడి గట్టేవు" 29-464

చతురతనము: (చతుర + తనము) వి. చాతుర్యం, నేర్పు. కేవలతత్సమశబ్దంపై 'తన' ప్రత్యయం చేర్చి ప్రయోగించడం విలక్షణం.
"చతురతనంబుల సందడిసేయఁగ
యితవగు కాఁగిట నెడ మీరెరి" 24-88

చతురుఁదనము: వి. చతురత్వం, నేర్పు. రూపాం. చదురుఁదనము.

"పదరి సంసారమనే బహురూపమే కాని
చతురుఁడనాన నందు సమర్థుఁడఁగాను" 2-255

**చతురులాడు:** ప.బం; అ.క్రి. ఛలోక్తులాడు, ఎగతాళి మాటలాడు. చతురులు అనే పదం ఎగతాళిమాటలు, ఛలోక్తులు అనే అర్థాల్లో మాండలికంగా ప్రసిద్ధమని అధోజ్ఞాపిక - 26 సం 368 పు.

"చతురులాడేచోట జగడాలు పనిలేవు" 26-530

**చదరంగము:** (3) వి. ఒకవిధమైన ఆట, Chess.

"యితవు గాకుంటే నానతియ్యరాదా వొకమాట
చతురతనాడీఁ గాని చదరంగమైనను" 23-418

**చదురంగము:** (16) వి. ఒకవిధమైన ఆట, Chess. ఇది చతురంగమునకు తద్భవరూపం. చదరంగమని వాడుక.

అన్నమయ్య సంకీర్తనల్లో మూడుచోట్ల మాత్రమే 'చదరంగము' అనే పదం కనిపిస్తుంది. తక్కిన చోట్లెల్లా చదురంగమే.
(22-194, 23-438, 29-4)

**చదురము:** వి. చతురస్రమైనది, చదరమునకు వ్యావహారికరూపం, చదునైనది.

"తుద నిది సుఖమును దుఃఖము తోలును
గింజయి ముదురుక
చదురము వలయము తోఁచీ సంసారఫలము"
1-482

**చదురాఁడి:** (చదురు + ఆఁడి) వి. నేర్పుకత్తె, చదురు శబ్దం చతుర శబ్దభవం. దీనిపై 'ఆఁడి' రావడం విశేషం. చతురంగా మాట్లాడే స్త్రీ.

"వుదుటన నవ్వుతాను వోరచూపులు
చూచేవి(ది)
చదురాఁడు లైనవారి సహజమిది" 13-79

**చదురాలు:** (6) (చదురు + ఆలు) చతురతగల స్త్రీ, చతురురాలుకు తద్భవంగా కనిపిస్తుంది.

"వోజతోడ చదురాలు వోవరిలో నుండఁగాను
రాజసానఁబచ్చిదేర రతిఁగూడేవు" 28-24

**చదురుఁడు:** వి. 'చతురుడు'కు తద్భవం. నేర్పరి, సమర్థుఁడు.

"అదనెరిఁగి తిరువేంకటాధీశ పొందితివి
చదురుఁడవు నినుఁబాయజాల దొకమారు"
5-70

**చదురుఁదనము:** (8) (చతుర + తనము) వి. నేర్పరితనం, సామర్థ్యం, చతురత్వం.

"చదురుఁదనము రాజసము గలవాఁడంటివి
యెదటికిఁదానెప్పుడెపుడు వచ్చీనే" 28-49

**చదురుంబదురు:** ప.బం. సల్లాపాలు

"అదనూఁబదనూ నెఱిఁగి అండనుంటేఁ జాలు
చదురుఁబదురు నొక్క సమ్మతానే" 17-32

**చదురులాఁడి:** (చదురులు + ఆఁడి) వి. నేర్పుగల స్త్రీ, చతురురాలు, చతురోక్తులు మాట్లాడునది.

"చక్కని జాణవు నీవు చదురులాఁడి యాపె
పక్కన మిమ్మెట్టు వొడఁబరచేము" 27-77

**చదురులాడు:** (5) వి. చతురోక్తులాడు, పరిహాసమాడు.

"చేరి నన్నుఁదానె కూడె శ్రీవేంకటేశుఁడు
సారెకుఁబొగడేఁగాక చదురులాడేనా" 27-521

**చదురులు:** వి; బహు. చతురోక్తులు.

"చలివేఁడి సటకాఁడ చదురుల జాణకాఁడ
మొలకనవ్వులతోను మొక్కేమయ్య" 11-57

**చద్ది:** వి. నిన్నటి అన్నం, చల్లటి అన్నం.

"తెలతెలవారఁగానే తెఱవమొగము చూచి
వలపు చద్దిఁగట్టుక వచ్చితివి" 24-592

**చద్దికన్ను:** వి. చల్లనికన్ను.

"ముద్దులాఁడికొడుకుచేత ముజ్జగములు
దిప్పనేర్పు
చద్దికంట వేఁడికంటఁ జక్కఁజూడ నేర్చును"
5-233

**చద్దికర్మములు:** వి. పూర్వకర్మలు, సంచితకర్మలు.

"నిద్దిరించువాని చేతి నిమ్మపంటివలెనే
చద్దికర్మములు తానే జారితే జాలె" 1-431

**చద్దికి పండిన పంటలు:** ప.బం; వి; బహు. (?)

"అద్దములోపలి నీడలు అందరి దేహరూపులు
చద్దికి పండిన పంటలు జంటఁగర్మములు"
2-133

**చద్దికి వేడికి :** పొద్దునా - మధ్యాహ్నమూ.
"ఇద్దరి గుణంబులివి యింతులాల
చద్దికిని వేడికిని సంగడించీని" 24-1
"చద్దికి వేడికి వచ్చి సనకాదులు పాడేరు" 1-311

**చద్దికూటిమీద ఉమిసినట్లు :** నానుడి; పనిని చెడగొట్టడమని అర్థం.

**చద్దికూళ్లపొద్దువేళ :** వి. అంబటివేళ, చద్దన్నం తినే వేళ.
"చాలునిఁక నిద్దురలు చద్దికూళ్ల పొద్దు
వేళాయ నా తండ్రి వేగ లేవే" 3-543

**చద్దిగురుతులు :** వి; బహు. ఉదయం కనిపించే (నఖక్షతాది) చిహ్నాలు (?)
"ఇద్దరుఁగూడి యున్నపు డెరఁగడాయనో కాని
చద్దిగురుతులకే సాధించీ నిపుడు" 11-153

**చద్దిజగడాలు :** వి; బహు. పాతజగడాలు.

**చద్దిమూఁట :** ప.బం; వి. అవసరానికి పనికి వచ్చేది, అనుభవింపక తప్పనిది. (చద్దిఅన్నం కట్టిన మూట అని వాచ్యార్థం.)
"పొద్దనే పెక్కుగాలము పూనిన పురాకృతము
చద్దిమూఁటై యనుభవించఁగఁ జేసీ మానదు"
3-216

**చద్దివలపు బీరాలు :** వి; బహు. వేడి తగ్గిపోయిన ప్రేమవ్యవహారాలు.
"పెద్దరికా లాలి తోత తెరయించేవా వోరి
చద్దివలపు బీరాల జట్టికాఁడ రారా" 5-145

**చద్దివేఁడి :** పొద్దునా, మధ్యాహ్నమూ.
"చద్దివేఁడి కింక నిట్ట చవిగొంటి నేను" 24-81

**చద్దివేడిపొందు :** వి. పాత మరియు కొత్త సంగమం.
"గద్దించి చెక్కు నొక్కితే కాఁగలించి విడువఁడు
చద్దివేఁడి ఏని పొందు చాలు (ల?) నమ్మనేను"
7-283

**చద్దివేడి రతులు :** వి; బహు. పాత మరియు కొత్త రతులు.
"చద్దివేడి రతులలో సరసాలింతే" 21-252

**చద్దివేడి వలపు :** వి. పాత మరియు కొత్త ప్రేమ.
"నిద్దరించి నీవు నాకు - వొద్ద నుండఁగల గంటి
చద్దివేడి వలపాయరా" 8-223

**చద్దిసంసారము :** ప.బం. వేడితగ్గిన సంసారం.
"చద్దిసంసారమున సరుస సుఖదుఃఖములు
యెద్దు యెనుపోతునై యేకంబు కాదు" 1-486

**చనవరి :** (4) (చనవు+అరి) వి. ప్రేమతోగూడిన స్వేచ్ఛ గల(ది)వాడు, స్నేహితు(రాలు)డు.
"సంగడిఁగూచుండితేనే చనవరి వైతివా
అంగాలు సోఁకించితే నొయ్యారి వైతివా"
23-100

**చనవరికత్తె :** (చనువు+అరి+కత్తె) వి. చనవు (ప్రేమతోగూడిన స్వేచ్ఛ) గల స్త్రీ, స్నేహితురాలు.
"చనవరికత్తెలము జగడాలాడుదుమా
చెనకి నీకే ప్రియాలు చెప్పేము కాక" 27-182

**చనవరితనము :** (చనవు + అరి + తనము) వి. అధికారం (చనవు = అధికారము అని శ.ర.) (చనవరి = రాజుకడ నుండు ఒకానొక అంతరంగికుడైన ఉద్యోగి, రాజపురుషుడు - ఆం.శ.ర.) చనవు = అవకాశము అని.వా.ని. అని సంపా. 24 సం. 228 పు. చనవు గలిగి యుండటం, స్నేహం.
"చనవరితనమున సాధింపుకంటెను
వినయముతో విభుని వేఁడుట మేలు" 24-338

**చనవరిది :** వి. (చనవు + అరి + అది) చనవుగల స్త్రీ, ఆప్తురాలు, స్నేహితురాలు.
"ఇంచుకంతా శ్రీవేంకటేశు మీరేనటవే
వంచనసేయని చనవరిదాన నేను" 7-341

**చనవరివారు :** వి; బహు. చనువుగలవారు, ఆప్తులు.
"చనవరివారము సరికిబేసికి మిమ్ము
పెనఁగులాడించేమా బీరముతోను" 16-33

**చనవిమనవులు :** (2) వి; బహు. చనవుతో కూడిన మనవులు.
"చలమొ పలమొ చనవిమనవు లింక
గలిగిన పోటే చాలుఁగా నీవయ్యా" 26-7

మనవిపోలికతో 'చనువు'ను చనవిగా వాడినట్లున్నది.

చనిగెః వి. సలిగె (?)

"పాపపుణ్యాలిరువంక పైడివెండి మనుసులు
పైపై గుత్తికె మేటిపై చనిగె" 3-467

చనుగొంగుః (చను + కొంగు) వి. వక్షస్థలంపై ఉండే కొంగు, ముంగొంగు.

"చనుఁగొంగు జారెనంటాఁ జక్క దొబ్బవచ్చేవు
చనవున నన్నిటాను జాణవా నీవు" 11-158

చనుపకముః వి. 'చంపకము'నకు వ్యావహారికరూపం, సంపెంగ.

"కలికి నాసిక చనుపకము తావికి కురుల
అళులు వోకుండ వల లమరించుగతిని" 7-413

చనుమానముః (3) వి. 1.స్నేహం, దయ 2. అధికారం, పెత్తనం (తె.వ్యు.కో.) చనవు (సారంగ.)

"ఘనుఁడ శ్రీవేంకటేశ కలిసితి విద్దరిని
చనుమానాలిచ్చి మమ్ము సరిగాఁజెంచేవు"
13-117

చనుముక్కుః వి. చనుమొన, చూచుకం, కుచాగ్రం, చనుమోము.

"జక్కవలఁబోలిన చనుముక్కులు
ఇక్కడ నిన్ను నాటితే నేమి సేసేవిఁకను" 27-79

చనులచంద్రులుః వి; బహు. అర్ధచంద్రాకారం గల నఖక్షతాలు.

"చనులచంద్రులు నిక్కె సమరతులివె దక్కె
మనసెల్లాఁగందిమీఁక మన్నించవయ్యా"
27-502

చన్నకాలముః వి. గడిచినకాలం, భూతకాలం.

"చన్నకాలమున నున్నకాలము
నున్నవాఁడు యీ వుపేంద్రుఁడే" 3-289

చన్నమన్నవారుః ప.బం; వి. బహు. అందరూ. (చనిపోయినవారూ, బ్రదికి ఉన్నవారూ)

"ఎన్నఁగ సంసారధర్మ మిదివో మోక్షము చూప
చన్నమన్నవారికెల్లా సాధనము గాదు" 3-205

చన్నిచ్చుః (చన్ను + ఇచ్చు) ప.బం. తల్లి శిశువుకు పాలిచ్చు.

"నేరుపునంజన్నియ్యంగ నెత్తురెల్లఁ దాగి
గోరపట్టి చంపె నిట్టి కొత్తలెందు తాఁగఁగలవా"
6-60

చన్నీళ్ళకు వేన్నీళ్లు తోడుః ప.బం; వి. ఒకదానికొకటి తోడుగా ఉండడం.

"ఒకరికొకరు దాపు వోపనంటేఁబోదు యిఁక
వెకలి చన్నీళ్ళకు వేన్నీళ్ళు దోడు" 5-14

చపచపః విణ. వ్యర్థం, రసహీనం. 'చప్పచప్ప'కు రూపాం. (పర్యాయ.)

"ఘనుఁడ శ్రీవేంకటేశ కరుణ యింత గాకున్న
చనవరితనానకు చపచప నందురు" 25-153

చప్పః వి. తొడ.

"చప్పలు వట్టుక సన్నపుబాలుని
నుప్పరమెత్తకురో యమ్మా" 5-97

చప్పటః వి. వేళ్లు చాచిన అరచేయి (తె.వ్యు.కో.), చఱపు, చతురస్రం.

"చప్పటై నీ వీఁపుమీఁద చన్నులట్టె వొరయఁగా
కొప్పు నీకేమి దువ్వీని కొలువులోను" 17-149

చప్పన ఉప్పననుః ప.బం; అ.క్రి. ఏదో దోషాన్ని - లోపాన్ని ఆరోపించు.

"చప్పన వుప్పననుచు జగడాలు దియ్యక
అప్పుడే విడెమిచ్చె నది చాలదా" 23-118

చప్పనుప్పనః విణ; ప.బం. చప్పన, ఉప్పన.

"చాటువ (నీ) గుణములు చప్పనా నుప్పనా నాయ
బూటకాన నీవెంత బుజ్జగించేవయ్యా" 14-116

చప్పరమంచముః వి. పందిరిమంచం.

"చప్పరమంచముపై నీ సరుసఁ బెట్టుకొనేవు
చిప్పిల నెవ్వతె నీతోఁ జెందియున్నదో" 29-22

చప్పరమాళిగః వి. గృహాంగణంలోని మాళిగ, గది.

"చప్పరమాళిగెలోన సరిఁబవళించే నీకు
నప్పుడే తాఁదొడ చాఁచీ నదిగో వమ్మా" 7-589

చప్పరమాళిగ : వి. పందిరి వేసిన మేడ.
"వొప్పగు దోమతెరలో నున్నదో కాక
చప్పరమాళిగెలోన సరి వొంటి నున్నదో"
19-432

చప్పుచాడుసేయు : ప.బం; అ.క్రి. సారాన్ని పీల్చి పిప్పిచేయు. శప్పుచ్చవళ్ అనే తమిళపదానికి నిస్సారము, నిస్సారభూమి, చవిటినేల అని అర్థం. చప్పుచాడు దాని వికృతరూపం కావచ్చునని సం.ప.స. (14 వా. 350 పు.)
"ఉన్నతిఁ దలవంచక వుండఁగానె మోవితేనె
సన్నలఁబరచి చప్పుచాడు సేసితివి" 14-94

చప్పుచారు : వి. సారాన్ని పీల్చగా ఏర్పడిన పిప్పి.
"దప్పిదేరి నీ మోవి దగదొట్టి నిందువంక
చప్పుదారై యలసేవు చాలుఁ జాలునిఁకను"
27-301
"మక్కువ మగనితోడ మంచి మాటాడుదువు గాక
చక్కెరమోవి నేలే చప్పుచారులు" 21-120

చప్పుచారుసేయు : చూ: చప్పుచాడు సేయు.
"జంగిలి పదారువేలఁ జప్పుచారు సేసినట్టి
యెంగిలిపొత్తులవాఁడు యేమి చూచీనే"
21-160

చప్పుడించు : అ.క్రి. 'చప్పిడించు'అని ముద్రింపబడింది. చప్పుడించు కావచ్చు. చప్పుడుచేయు, ధ్వనిచేయు. విలక్షణమైన క్రియారూపం.
"చెప్పరాని మనసులోని సేసుకొంటి బాసలెల్లా
చప్పి(ప్పు)డించ కాపె నాతో సన్నసేసెను"
23-226

చబుకుసేయు : ప.బం; స.క్రి. కొరడాతో కొట్టు. (పద.)
"ఎగసిన గరుడుని ఏపున ధా యని
జిగిదొలఁక చబుకు చేసినను" 1-92

చమట : వి. 'చెమట'కు వ్యావహారికరూపం.
"మూఁగుచు శ్రీవేంకటేశ ముంచి మనవంటివారు
తోఁగుఁజమటలచేత దొమ్మ యాటఁగాదు"
27-157

చమరించు : అ.క్రి. 'చెమరించు'కు వ్యావహారికరూపం. చెమట కలదగు.
"కందువ మై చమరించి – గందపొడి చల్లుకొని
పొంద నిన్నుఁ దలఁచితిరా వెంకటేశా!" 7-223

చమరు : స.క్రి. 'చమురు'కు వ్యావహారికరూపం. రాచు, పూయు. (తె.వ్యు.కో.)
"వీడిన నా తురుమున విరులు నిండా ముడిచె
వాడుదేర మోమున జవ్వాది సమరె" 27-538

చమరుకొను : అ.క్రి. పూసుకొను, రాచుకొను.
"ఒప్పుగ జవ్వాదిచేత వొక్కింత చమరుకొని
కప్పి నీవైనా కీలుగంటు వేయరాదా" 13-323

చమురుదీసిన దివ్వె : ప.బం; వి. ఆరిపోయిన దీపం, చంచలం, వెలుగు లేనిది.
"జమునోరిలో బ్రదుకు సంసారము చూడ
చమురు దీసిన దివ్వె సంసారము"

చమ్మాళిగలు : (3) వి; బహు. రూపాం. సమ్మాళిగలు, సంబాళిగలు, చమ్మాళిగెలు ; పాదుకలు.
"కనకపుఁజమ్మాళిగలు మెట్టి యల జ
వ్వని గర్వమున నిట్టె వచ్చి వచ్చి" 5-93

చమ్మాళిగెలు : వి. చూ: చమ్మాళిగలు.
"కమ్మర నాసలతోడ కారేటి చెమటతోను
చమ్మాళిగెలు వట్టిన సతిఁజూచి" 21-17
"జమళిముత్యాలతోడ చమ్మాళిగ లిడరో
రమణికి మణుల నారతు లిత్తురో" 5-73

చయ్యాటము : వి. రూపాం. సయ్యాటము, సహక్రీడ.
"సరసమాడేవు నీవు చన్నుల నొత్తి నాపె
యిరవైన మీ చయ్యాటా లెట్టు దెలుసు" 28-352

చర : వి. చెర కావచ్చు. చెరసాల, నిర్బంధం.
"పంచభూతాలకుఁ జర బ్రదికేటి బ్రదుకెల్ల
యించుకంత దయఁజూడ నీక నెవ్వరో" 4-202

**చరమశ్లోకము :** "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అన్న భగవద్గీతా శ్లోకం.

"కాచే నన్న చరమశ్లోకము నాకుఁబూఁటకాఁపు
చూచి నీ వేడ నుండినాఁ జూపి ఇచ్చీని" 15-419

**చరమార్గం :** వి. స్వప్రయత్నాలన్నింటినీ వదలివేసి ఆత్మ సమర్పణ చేయడం.

"ఆనతిచ్చె దొల్లె యాత డది చరమార్థమందు
మేని దోసమెల్ల చాపి మేలొసఁగే ననుచు" 3-521

"చరమార్థమందు నీవు చాటితివి గాన
ఇరవిది నమ్మితి నా కెదురెందు లేదు" 3-462

**చరిత :** (3) చరిత్ర. చూ : సరిత.

"అప్పటినుండి నీవు ఆపెతోనే మాటాడేవు
చొప్పుగ నీ చరితలు చూచి వెరగయ్యీని" 22-173

**చరిసేయు :** ప.బం; స.క్రి. ఇది నేతవృత్తికి సంబంధించిన పదం. పడుగును గంజివేసి కుంచెతో దారాలన్నింటినీ నిడుపుగా ఒకదానికొకటి కలియకుండా గట్టిపడేట్లు చేయు (చరి = గంజి) సరిచేయు అని నేటి వ్యవహారం.

"పంచభూతము లనెడి పలువన్నె నూలు
చంచలపుగంజి వోసి చరిసేసి" 1-275

**చలనచిత్తుఁడు :** వి. చపలచిత్తుడు.

"కలదట మునులకుఁ గడు రాగద్వేషాలు
చలనచిత్తులము మా జాడ యికనేది" 3-124

**చలపట్టు :** అ.క్రి. పగబూను.

"చలపట్టితేఁ జాలు సర్గమేమి బాఁతా
చలివేఁడి నాలికపై సత్యములో నున్నాఁడు" 2-7

**చలపదము :** వి. 'చలపాదము'నకు వ్యావహారిక రూపం (?) గర్వం, మాత్సర్యం.

"ముక్తికి శ్రీవేంకటేశ మూలము నీ పాదములు
సక్తులయి నమ్ముటగాక చలపద మేటికి" 1-497

**చలపాదము :** వి. గర్వం, మాత్సర్యం; చలము, చలపాది, చలపాదితనము సహజములు కాని చలపాదము విలక్షణరూపమే.

"చదివితి ననియెడి చలపాదమింతే కాని
అదన నందులోని అర్థమెఱఁగ" 2-255

**చలపాదితనము :** (14) వి. పట్టుదల, మాత్సర్యం.

"చెలఁగి – పతి ముట్టితే చేతికి లోనౌట గాక
చలపాదితనమే జవరాలికి" 18-195

**చలపాదివాఁడు :** (7) వి. మాత్సర్యశీలుఁడు, పట్టుదల కలవాడు.

"ఉప్పనై నే జంకించితే తెమలవేమిటా నీవు
యెట్టి చలపాదివాఁడ వేమి చెప్పేది" 8-175

**చలమరి :** (చలము + అరి) వి. మాత్సర్యశీలుఁడు.

"తెలియక వూరక తిరిగేము
చలమరి కగునా సంతతసుఖము" 1-432

**చలమరితనము :** (చలము + అరి + తనము) వి. మాత్సర్య స్వభావం, పట్టుదల.

"పిలువఁగఁ బిలువఁగ బిగిసేవు పతితోను
చలమరితన మేలే సతికి" 25-38

**చలమరిది :** (2) (చలము + అరి + అది) వి. మాత్సర్యశీలం గల స్త్రీ.

"చలమరిదానఁగాను సరిదానఁగాను" 20-408

**చలమరివాఁడు :** (చలము + అరి + వాడు) వి. మాత్సర్యం కలవాడు, పట్టుదల కలవాడు. (వ్యు.)

"చలమరివాఁడవు చనవేల యిచ్చితివి
వలవఁగ నాడే నీవు వద్దనరాదా" 13-479

**చలముకొను :** (3) ప.బం; అ.క్రి. చలపట్టు, పట్టుదల వహించు, పగవూను.

"వలరాయఁడపుడు తన
వాఁడిపువ్వుటమ్ములను
చలముకొని మిమ్ము ముంచక మానునా" 5-211

**చలమో పలమో :** ప.బం. మంచో చెడో.

**చలిగొను :** అ.క్రి. చలి వైచు.

"మలసి యంతేసి దిమ్మరితిట్లు దిట్టేవు
చలిగొనఁ బన్నీరు చల్లెనంటా నీపెను" 26-230

"చలిగొనీ నంటాను సరియ నీ పచ్చడము
నిలువుగప్పులు గప్పీ నీతో నటు" 27-291

**చలిదీరు:** అ.క్రి. సంకోచం తీరు.
"జవ్వనపు మేనుబ్బి చలిదీరె సిగ్గులు
రవ్వలుగాఁగూడఁగాను రతివేళను" 21-114

**చలినెల:** వి. శిశిరర్తువు.

**చలిమంచికాలాలు:** వి; బహు. మంచి చలికాలాలు. ఇలా విశేషణాన్ని మధ్యలో చేర్చడం అన్నమయ్యకు సహజమే.
"చలిసిగ్గులెల్ల ముంచె పులకలమంచు ముంచు
చలిమంచికాలాలు సతికి నేఁడే" 19-519

**చలిమందులు:** (13) వి; బహు. శీతలోపచారాలు. విరహంలో నున్న నాయిక తాపాన్ని పోగొట్టడానికి చేసే శీతలోపచారాలు.
"తలపో తలచేతఁ దతిగొన్న విరహము
చలిమందులచేత జడిసీనా" 13-248
'నా కీ చలిమందులేమిటికి' అని కావ్యా. ప్రయోగం. (2-79)

**చలిమి:** (15) వి. 'చెలిమి'కి వ్యావహారికరూపం, స్నేహం.
"చలిమి నీతఁడే చూపె శరణాగతి" 2-372
"చలిమీ బలిమీ సాదించీనా
యెలమి నిన్నాళ్లదాఁకా నెందుండె తాను"
26-41

**చలిమిరించు:** అ.క్రి. చల్లఁబడు.
"చల్లని నీ ప్రియముల చలిమిరించెను మేను
యిల్లిదె కారపువీడెమియ్యఁదగదా" 17-293

**చలివాపు:** ప.బం; అ.క్రి. సిగ్గుసంకోచాలను తొలగించు, బుజ్జగించు, భయాన్నితీర్చి బుజ్జగించు అని ఆం.ధా.మా.
"చలివాపి ఆపె నిడ సరిబేసు లాడుకొంటూ
కలిసితివిటు నన్ను కాదా మరి" 17-130

**చలివాయు:** (11) (చలి+పాయు)
అ.క్రి.సిగ్గుసంకోచములు పోవు, జంకుపోవు.
"చలివాయఁ బొగడితే సారె మెచ్చె వేమే"
26-584

"పలుమారు గురుసేవఁ బరఁగఁగా బరఁగఁగా
చలివాసి యాత్మవిజ్ఞానము బొడచూపు"

**చలిపుట్టు:** (చలి+పుట్టు) అ.క్రి. జంకుపుట్టు, భయంపుట్టు.
"రవళి మగవానితో రారాపులఁబొందు సేసే
సవతి గలిగితేనే చలిపుట్టును" 14-547

**చలివేఁడి:** వి. సుఖదుఃఖాలు. (?) (శీతోష్ణాది ద్వంద్వాలు)
"ఎవ్వరి భాగ్యం బెట్టుండునో
జవ్వనభారము చలివేఁడాయ" 27-252
"చలివేఁడిఁబొరలకే – సర్వేశుపాదాల కింద
తలకొన్న తన్నుఁదానే తలఁచఁగవలెను" 2-198

**చలివేఁడినాలిక:** ద్వంద్వప్రవృత్తి గల నాలుక.
"చలపట్టితేఁ జాలు సర్గమేమి బాఁతా
చలివేఁడినాలికపై సత్యములో నున్నాఁడు" 2-7

**చలివేఁడివిందులు:** (?)
"జవరాలిపొందులు చలివేఁడివిందులు" 2-7

**చలివేఁడిసటకాఁడు:** ఎల్లవేళలా మోసం చేసేవాడు (?)
"చలివేఁడిసటకాఁడ, చదురుల జాణకాఁడ
మొలకనవ్వులతోను మొక్కేమయ్య" 11-57

**చలివేండ్లు:** (చలి + వేఁడి) చలి మరియు వేడి. వేఁడి శబ్దానికి 'వేండ్లు' అనే బహువచనరూపం విలక్షణం.
"కిన్నెరమీట్లలోని గిలిగింతలూ నీ
సన్నల చాయలలోని చలివేండ్లు" 19-412

**చలిసేయు:** (చలి + చేయు) అ.క్రి. జంకు కలిగించు, సిగ్గు కలిగించు.
"యెంగిలైన నీవే కావా యెంత రతిఁగూడినాను
సంగతిగా మాకు నెట్టు చలిసేసేవు" 25-299

**చలువకు వేఁడికి సరికి సరి:** ఒకదాని కొకటి సరి.
"ఆలయపథ్యమున కొపథము గొనుట
చలువకు వేఁడికి సరికి సరి" 4-213

**చలువరాయి:** వి. చంద్రకాంతమణి.
"మించి చలువరాయనే మెచ్చుల పొరగంటిపై

నించినట్టి వేడుకల నీ దేహము" 10-2-95

**చలువలోపలి వేఁడి:** ప.బం; వి. సుఖంలోని దుఃఖం.

"చలువలోపలి వేఁడి సంసారము చూడఁ
జలపూతబంగారు సంసారము" 1-199

**చల్ల:** వి.-చల్లదనం.

"ఒల్లని సతులమాట నొప్పులునుఁ దప్పులవు
చల్లని చూపులయిన చల్ల వేఁడవు" 24-115

**చల్లఁగా బతుకు:** ప.బం; అ.క్రి. సుఖసౌఖ్యాలతో జీవించు.

"చల్లఁగా బతుకవయ్య జాణతనాలు నేర్తువు
యెల్లచోట నీకఁ దప్పు లెంచేమా నిన్ను"

26-251

**చల్లఁజేసుకొను:** స.క్రి. చల్లార్చుకొను, మనసున కూరట కలిగించు.

"నిన్ను నాకె మారుగా మనసున నిలుపుకొని
చెన్నుమీరఁగాక చల్లజేసుకొను" 7-146

**చల్లచాడి:** వి. చల్లకుండ, రూపాం. చల్లచాడె.

"మూయకువే చల్లచాడి ముచ్చుగొల్లెతా వోరి
పోయవే పోవో మా చల్లపులు సేల నీకు" 6-113

**చల్లచాడె:** (6) వి. చల్లకుండ.

"వాడికగా నొండొరులు వావెరుగనేల చల్ల
వాడె దించుకొన్నప్పుడే సతతమాయను" 14-6

**చల్లజంపు:** వి. చల్లగా గొంతుకోయడం, తడిగుడ్డతో కుత్తుక కోయడం వంటిది. ఇట చల్లఁజంపు అని అరసున్న లేకపోవడం విలక్షణం. చల్లగా గొంతుకోసేవాడు. భయంకరుడు అని ఆం.ప.ని.

"చల్లజంపు భువిలోన చాపకింది వెల్లువని
యెల్లవారు నాడేది యెన్నికకు వచ్చేను"

14-305

"భయంకరునకు చల్లజంపన జెల్లెను సారసాక్ష"

(ఆం.ప.ని.)

**చల్లజంపు దిప్పకాయ:** వి. ఒకతిట్టు, చల్లగా గొంతు కోసేవాడు, భయంకరుడు, అల్లరివాడు, కొంటెవాడు.

"చందనపుఁగొండఁ బుట్టి చల్లజంపుదిప్పకాయ
అందివచ్చి రేఁచకుండా సద్దుపెట్టమనవే"

19-327

**చల్లజంపులాఁడి:** వి. చల్లగా గొంతుకోసే స్త్రీ, క్రూరురాలు.

"మల్లాడే కోపకత్తెను మట్టుకుఁదేవచ్చుఁగాని
చల్లజంపులాడి నైతే సాదించరాదు" 23-107

**చల్లదుత్త:** వి. చల్లకుండ. (దుత్త = చిన్న మూతి గల కుండ)

"చల్లదుత్త లంటాను చన్నులపైఁజేయి చాఁచి
కొల్లగొంటిని మానము కోమలుల నెల్లను"

19-76

**చల్లుఁగూటము:** వి. జలక్రీడ.

"వెల్లవిరి శ్రీవేంకటేశ మన
చల్లుఁగూటమే సంకేసెను" 24-16

**చల్లులాడు:** ప.బం; అ.క్రి. జలక్రీడలాడు.

"భవనాశిలోని నీరు పైఁజల్లులాడుకొంటాను
నవకపుసిరులను నవ్వుకొంటాను" 4-511

**చల్లువలపుబేరము:** ప.బం; వి. మాటలతో మాత్రమే ఆగిపోయే ప్రేమ. (ఆం.శ.ర.)

"వెల్లిగా నన్నుఁగూడితి వేంకటేశుఁడా వోరి
చల్లువలపుబేరాల జట్టికాఁడా రారా" 5-145

**చల్లువెదలాడు:** ప.బం; స.క్రి. వెదజల్లు, విత్తు.

"సరులు చన్నులమీఁదఁ జల్లువెదలాడఁగాను
విరులకొప్పుననుండి వెస రాలఁగా"

"చాటువైన వరములు చల్లువెదలాడుచు"

11-2 భా-69 old

"లంపటము ఘనమైన లక్ష్మీకటాక్షములు
సంపదలు తోడనే చల్లువెదలాడు" 1-358

**చల్లువెదలు:** (2) వి. విత్తనాలను మడిలో పిడికిలితో ఎత్తి చల్లే చల్లకం.

"కల్లగాదు నా మాట కదిసి చూడఁగదయ్యా
చల్లువెద లిద్దరికి సగఁబాలు సుమ్మీ" 13-431

"వాడల వాడలనెల్లా వనితలమీఁద నీకు

వేడుకవలపు చల్లువెదలాయను" 13-473

చవి: వి. 1. ఉప్పు 2. అనుభవం, ఆస్వాదం 3. రుచి 4. సౌఖ్యం 5. ఆశ, తీపి 6. ప్రేమ, అనురాగం విణ. ఇంపైన, ప్రియమైన, రుచిగల (వ్యం.)

"కోమలులు మీఁదమీఁద కోపగించినాఁజవి
దీమసానఁ బెదవులఁ దిద్దీనాఁ జవి" 7-65

చవిగొన్న కూరలకు మేలుంగీడు కొనియాడు: వ.బం. తిన్న ఆహారాన్ని గూర్చి చింతించడం, వ్యర్థమని భావం.

"చాలుఁజాలు నాడే చవిగొన్న కూరలకు
మేలుంగీడు గొనియాడ మీఁదమీఁదను" 5-331

చవిచదువులు: వి; బహు.నామవిద్యలు, శృంగారవిద్యలు.

చవిదారము: వి. రుచివైనము, ప్రేమవైనము.

"చవిదార మెఱఁగవా జాణ నందువు
యివి యెల్ల నాపెకు నీ విచ్చిన చనవులే"
21-101

చవిదీయు: వ.బం; అ.క్రి. రుచించు.

"చవిదీసుక యిటు జరగెదము
అవచాటుకురో సంసారులార" 3-542

చవియగు: వ.బం; అ.క్రి. తగు.

"నగినవారితో మూరు నగంబాడి యెవ్వరికి
జగడించేవారితోడ చవిగాదు గాని" 3-156 old

చవిసేసుకొను: (2) వ.బం; అ.క్రి. రుచిచూచు, అనుభవించు.

"దొంతిఁబెట్టి యీ బత్తి తోడఁదోడ దాఁచుకొని
సంతోసించి సంతోసించి చవిసేసుకోవయ్యా"
29-272

చవులిచ్చు: వ.బం; అ.క్రి. ఇష్టం కలిగించు.

"అలమేలుమంగ నీ వభినవరూపము
జలజాక్ష(క్షు) కన్నులకు చవులిచ్చెనమ్మా"
5-160

చవులుకొను: వ.బం; అ.క్రి. రుచిచూచు.

"తివిరి మోవిసన్నలఁ దేనియలు గురిసీని
చవులుకొనుచు నీవు చన వియ్యవయ్యా"
28-349

చవులుగొను: అ.క్రి. 1. రుచిచూచు 2. అనుభవించు 3. పానంచేయు 4. తిను.

"భ్రమఁబడి మాయవుఁబడతుల తమ్ములు
నమలి చవులుగొనె నా జిహ్వ" 1-56

## చా

చాఁగలమఱ్ఱి చెన్నుఁడు: వి. కర్నూలుజిల్లా చాగలమఱ్ఱిలో నెలకొన్న చెన్నకేశవుడు, రూపాం. చేగలమఱ్ఱిచెన్నుడు.

"కందువఁ గూడితివి చాఁగలమఱ్ఱి చెన్నుఁడవై
అందపు శ్రీవేంకటేశ అరుదా నాకు" 17-12

చాకిమణుగులు: వ.బం; వి; బహు. అస్థిరాలు (చలువచేసి మడత పెట్టిన వస్త్రాలు కొద్దిసేపటికి మడతలు చెరగిపోయి మామూలు అవుతాయి కదా!)

చాటువ: (3) వి. ప్రసిద్ధి, ఉదాహరణం, దృష్టాంతం.

"చాటువ నీ గుణములు చప్పనుప్పనా
బూటకాన నీ వెంత బుజ్జగించేవయ్యా" 14-116

చాటువకెక్కు: వ.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు.

"మాటలెల్లా మంచివే మనసు లెనసితేను
చాటువకెక్కు పొందులు సమ్మతించితే" 28-571

చాడికాఁడు: (చాడి + కాఁడు) కొండెములు చెప్పేవాడు.

"చాడిక శ్రీవేంకటేశ వనితఁగూడితి విట్టె
చాడికాండ్ల బ్రతుకు సతములయ్యీనా" 14-305

చాడిచెప్పు: అ.క్రి. ఒకరిపై కొండెం చెప్పు.

"చనవున నీ ముఖచందురుని వంక నీ
చనుజక్కువలె పో చాడిచెప్పీని" 5-281

చాడె: వి. కుండ. (ద్రవం)

"వీది వీదిఁ బాలువెన్న వెసఁ గొల్లలాడినాఁడు
ఆ దెసఁ జాడెలు నిండీ అట్టె వున్నవి" 18-29

చాతు: స.క్రి. ధరించు, సమర్పించు.

"తామెరకొలనువలెఁ దగఁ దిరుచేల చాతి" 14-

**చాతుకొను :** స.క్రి. ధరించుకొను.

"మగువకాంతులు నిన్ను మచ్చికతో నొరయఁగా
సొగసుగాఁ జాతుకొన్న సొమ్ము లాయనో" 23-498

**చాతుపడి కైంకర్యము :** వి. భగవంతుని విగ్రహానికి వివిధ సుగంధద్రవ్యాల లేపనం చేసే సేవ.

"సకలకర్మానుష్ఠానముల యితని
కిచ్చుటఁ జాతుపడి కైంకర్య మిదియే" 2-132

**చానపి :** వి. చానిపి, పేడనీళ్లు.

"చిక్కి విత్తొకటి వెట్ట చెట్టొకటి మొలచునా
అక్కర చానపి చవి అడుగ నే మున్నది" 15-154

**చానిపి :** వి. పేడనీరు, పేన్నీళ్ళు, కల్లాపి.

"చానిపిఁజవి వేడితేఁ జప్పనైనట్టి
చానిపిలోపలఁ జవి గలదా" 3-430

**చాపకింది నీరు :** ప.బం; వి. తెలియకయే ఆపద తెచ్చునది, మెల్లగా అంతటా వ్యాపించునది. చూ : చాపకింది వెల్లువ.

"పాపముఁబుణ్యము పైపైఁగూడుకొని
చాపకిందినీరు సంసారము" 3-105

**చాపకింది వెల్లువ :** (2) వి. తెలియకయే ఆపద తెచ్చునది. మెల్లగా అంతట వ్యాపించునది. చాపకింద నీరు పోసినప్పుడు ఆ నీరు పైకి కనిపించదు. కాని కిందినుండి అంతటా వ్యాపించును.

"చల్లజంపు భువిలోన చాపకిందివెల్లువని
యెల్లవారు నాడేది యెన్నికకు వచ్చెను" 14-305

**చాపకూడు :** వి; ప.బం. కులగోత్రాల నిర్బంధం లేకుండా కలిసి భుజించే కూడు, దొడ్డికూడు. (మాం.)

"బూటకపుసురలతోఁ బున్నమ కప్పురమున
కూటువగాఁ జాపకూడు గుడిచినవాఁడు" 6-43

**చాయకత్తె :** (2) (చాయ + కత్తె) వి. వన్నెకత్తె, వన్నెలాఁడి.

"చాయకత్తెనదానికి సాదించి పోరఁగూడదు
చేయివట్టి తియ్యఁగదే చెనకి యీతనిని" 24-528

**చాయకాఁడు :** (7) (చాయ + కాఁడు) వన్నెకాఁడు.

"ఆయములు సోఁక మాటలాడి యంత కొసరిన
చాయకాఁడవె కాక సమ్మతించేవా" 11-45

**చాయకుఁదెచ్చు :** ప.బం; స.క్రి. దారికితెచ్చు, మాట వినేట్లు చేయు.

"యీయెడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
చాయకుఁదెచ్చినది యీ సరసమే కాదా" 27-106

**చాయకు వచ్చు :** (3) ప.బం; అ.క్రి. దారికివచ్చు, మాట విను.

"సేయఁగల చేతలెల్లా సెలవు సేసితేఁజాలు
చాయకు వచ్చి తానే సతమయ్యీని" 28-30

**చాయ నల్లనివాఁడు :** వి. నల్లని చాయ గలవాడు.

"శరధి గట్టినవాఁడు చాయనల్లనివాఁడు
యిరవై సుగ్రీవాదుల నేలినవాఁడు" 3-233

**చాయపాటు :** వి; ప.బం. సైగలు మొ॥ వాటితో మొఱఁగు, అన్యాపదేశం.

"చాయపాటై నన్నుఁగూడి సరిమేను మరచితే
నేయెడ నారతి చేత లెచ్చరించవా" 24-10

**చాయపాటుఁదనము :** వి. అన్యాపదేశంగా పలుకడం.

"ఇంతి చనవు చెల్లించు యెగ్గులుపట్టకు నీవు
సంతసించి మెచ్చుటే చాయపాటుఁదనము" 20 (26) 460

**చాయపాటువారు :** వి; బహు. సైగలు మొ॥ వాటితో అన్యాపదేశంగా పలుకువారు (?)

"పాయరాని యట్టివారు భ్రమసి లోనయ్యేరు
చాయపాటువారెల్లా చక్కనుండేరు" 25 (31) 406

**చాయలాడు :** అ.క్రి. వన్నెలు చూపు.

"మాయదారి యాటది నేమములు
మాపఁగవచ్చు
చాయలాడి యాఁటది సన్నసేసును"
12 (18) 334

**చాయవాటు** : వి. చూ : చాయపాటు, మెఱుగు.
"వియ్యము లుప్పొంగెను కందువులఁజెనకఁగా
చాయవాటు సతులెల్లా జంట సేయఁగలరా"
25-363

**చాయ సంధైతే చావడి చంకఁ బెట్టుకున్నమాట** : సామెత ; కొద్ది అవకాశం లభిస్తే చాలు పెద్దానికే ఎసరుపెట్టడ మన్నమాట.
"చాయ సంధైతే చావడి చంకఁబెట్టుకొన్నమాట
యీ రీతి నీ యండ పున్నదిఁక నేటి
మాటలు" 9-272

**చాయ సేసుకొను** : (16) వి.బం; అ.క్రి. ముఖాభావం కల్పించుకొను.
"చాయసేసుకొని నీతో సరసము లాడితేను
ఆయము లే లిత్తీని అప్పటిఁదాను" 25-254
(చాయ = మరుఁగు) మరుగు చేసుకొను.
"సంగతి గాదని నేము చాయసేసుకుండితేను
అంగడివేసి తానే ఆనవెట్టుకొనీని" 14-554

**చారువాకము** : వి. పిడివాదము, మొండివాదము.
"జాతులకు నీ వాడెటి చారువాకా లింతే కాక
ఆతలి నిన్నుఁ గొసరనంత పొందులా" 11-503

**చాలు** : వి. వరుస, రీతి, వంశము, సంప్రదాయము, సాలు
"అందరికిఁగల చాలే యంగనలాల
పొందుసేయవలెఁగాక పోరాడ నేటికే" 26-443

**చాలుకొను** : (27) అ.క్రి. వరుసకట్టు, వరుసగా ఏర్పడు.
"తోలియాడీఁ దిరుతేరు దుష్టులెల్ల నణఁగఁగ
చాలుకొని శిష్యులెల్ల జయవెట్టఁగ" 4-178

**చాలుమానిసి** : ప.బం; వి. సమర్థుఁడు, ముఖ్యుడు (పద.)
"యేలికయై మన్నించు నిష్టుఁడై బుద్ధిచెప్పు
చాలుమానిసియై యంచలఁదిరుగు" 2-417

**చాలుమూల** : వి. క్రమవిధానం, పద్ధతి, దారిడొంక.
"చదరపు సరసాలు చాలుమూల నడవఁగా
గుదిగొన్న నగవు లగ్గువాయను" 14-276

**చాళికుఁడు** : వి. (?)
"నవ్వేమఁ జాళికుఁడు తనాచారి (?) ముడిచిన
పువ్వులెట్లు ముడిచితి పొంది దొరవు" 17-415

**చావివోయ** : (?) చవి (= రుచి) పోయెను అని అర్థం కావచ్చు. 'చవి' లోని అకారం ఛందోనుగుణంగా, సంగీతానుగుణంగా దీర్ఘం కావచ్చు. ఏమైనా "చావివోయ వుమినాకి చవుతమా ఇఁక" అనే వాక్యంలోని పదాలస్వరూపం బోధపడడం లేదు.
"లేవే నేఁ బిలిచితే లెక్కసేసీనా తాను
చావివోయ వుమినాకి చవుతమా ఇఁక" 26-61

## చి

**చింక** : వి. జింక.
"పడి నడవుల జింకవంటిది నా మనసు
బడిబడిఁ బట్టఁబట్టఁ బారీఁగాన" 2-395

**చింకచూపులు** : వి; బహు. జింకచూపులు, చంచలమైన చూపులు.
"లంకెలఁదాఁ జేసినట్టి లచ్చనలు చూచుకొంటా
చింకచూపుల నుండఁగఁ జేసినట్టు సేయనీ"
20-351

**చింకబెదరులాఁడి** : వి. జింకవలె బెదరు స్వభావం కల స్త్రీ.
"చంకల బంగారు చల్లి మెఱుఁగుల
చింకబెదరులాఁడి శిన్నెకా" 5-261

**చించు** : స.క్రి. చంపు, వధించు.
"యితఁడా తాటకిఁ జించె యీ పిన్నవాఁడా
ఆతల సుబాహుఁగొట్టి యజ్ఞముఁగాచె" 1-474

**చింతకాయకజ్జము** : వ్యర్థం, (తె.జా.) ఉపయోగించుకో వీలులేనిది అని పద ; తె.వ్యు.కో.
"పడఁతుల వేడుకలు పచ్చి వడఁగండ్లగుళ్ళు

కడుమోవితీపు చింతకాయకజ్జము" 2-268

**చింతకాయకజ్జాయము :** (3) వి. గుజ్జుగ చింతపండు రసంలో ఉప్పు, కారం వగైరాలు వేసి పుల్లలకంటించి యెండించి రుచిరుచిగ చిటుకుట నేడును కలదు. దీనినే చింతకాయకజ్జాయమని అంటారు. సులభసాధ్యమని అర్థం. 5-214

"చింతకాయకజ్జాయము చెలువునితోడి పొందు" 28-579

పాం.మా.లో ఈ ప్రయోగం కనిపిస్తుంది.

"చింతకాయకజ్జాయము చేరి యిసుమంత వుంటే

అంతటనే నోరూరు నందరికిని" 3-293

**చింతకుంట కంభమురాయఁడు :** వి. కడపజిల్లా పొద్దుటూరు, జమ్మలమడుగు తాలూకాల్లో చింతకుంట పేరుగల గ్రామాలు రెండున్నాయి. చింతకుంట్ల అని నామాంతరం. త్రిభువన మల్లిదేవరాయలవారి ప్రధానియైన అణ్యణచోళ మహారాజు లానాడు రాజ్యమేలే పెద్దన చోళమహారాజుల వారి నగరిలో చింతమ్మ అనే బోనకత్తె కుంట కట్టించి నామకరణం చేసిందని స్థానికచరిత్రగా మెకంజీకైఫీయత్తు 1119-62 సాక్ష్యమిస్తుంది. అలాగే ఒక అత్త చింత పోగొట్టడానికి కోడలు కట్టించిన ఊరనీ మరొక ఐతిహ్యం. జమ్మలమడుగు లోని ఈ గ్రామమందలి చెన్నకేశవస్వామికి కంభంరాయడని పేరు. కంభంరాయ అనేపదం సాధారణంగా నృసింహస్వామిని సూచిస్తుంది. చింతకుంటలో ప్రస్తుతం చెన్నకేశవాలయం ఉంది. అన్నమయ్యకాలంనాటికి అక్కడ కంభంరాయుడు ఉన్నాడేమో! లేదా ఈ ఊరి ప్రాంతంలో మరో కంభంరాయని గుడి ఉందేమో! ఈ విషయం ఇంకాస్త పరిశీలించదగ్గ అంశం. దేవాలయంలోని ఒక స్తంభాన్ని కంభంరాయనిగా స్థానికులు భావిస్తున్నారు. తా.అ.సా. తెలుగునాడు 40 పు.

"ఘనుఁడవు చింతకుంటకంభమురాయ మముఁ గనుఁగొని రక్షించు కంభమురాయ" 23-209

**చింతపులుసు :** వి. చింతపండుతో చేసిన పులుసు.

"సొరిది చింతపులుసు చూచితే నోరూరును

వరుసలం జవిగొన్నవాఁడు గాఁడు" 15-266

**చింతలువంతలు :** చింతలు; చూ: చింతవంతలు.

"చింతలు వంతలు లేవు చేకొన్నవారికి

వింతలుగా నవ్వు నవ్వే వేడుకే కాని" 20-362

**చింతలు సిలుగులు :** ప.బం; వి; బహు. కష్టాలు.

"అంతయుఁజూచిన హరి సంకల్పమే

చింతలు సిలుగులు జీవులవి" 3-126

**చింతవంతలు :** వి; ప.బం; బహు. 'చింతలు' అనే అర్థంలో వాడబడే పదబంధం.

"చింతవంతలిఁక నేల చెలుల దూరఁగ నేల

దొంతులరతులే నీకుఁ దోడాయఁగా" 19-402

**చింతామణి చేతిలో నుండగా గాజుపూస మెచ్చు :** అ.క్రి. అమూల్యమైన వస్తువును కాదని మామూలు వస్తువును కొనియాడు.

"సిరులఁ జింతామణట చేతిలో నుండఁగా

సరి గాజుఁబూస మెచ్చఁగ నదేమిటి" 3-187

**చింతాయకుఁడు :** (3) వి. ఏ నిఘంటువుల్లోనూ ఈ పదం కానరాదు. చింతలను పోగొట్టేవాడు, ఆపన్నివారకుడు అని వే.ఆ., విలక్షణమైన పదం.

"చింతాయకుఁడగు హరి చిత్తములో నుండఁగాను

వింతవింత విచారాల వెట్టి మాకేలా" 3-190

**చింతించిన చింత :** ప.బం; వి. ధ్యానించిన ధ్యానం.

"తిరముగ నినుఁ జింతించిన చింతే

నిరతము ముక్తికి నిధి గాదా" 1 సం. 20 పు old

**చిందనూరు :** ఈ గ్రామం ఎక్కడిదో తెలియడం లేదు. రాయలసీమ జిల్లాలోని గ్రామం కావచ్చు. ఇక్కడ వెలసిన స్వామి శ్రీవేంకటేశ్వరుడు. అన్నమయ్య ఈ స్వామిని దర్శించి ఒక కీర్తన పాడినాడు.

"చిందనూరిలోన నీకు చేయి చాఁచె నితఁడూ

మందెమేళొ మేలె వాని మానలేవు నీవు" 17-126

**చిందరవందర:** వి. భిన్నాభిన్నం.
"పందెము సేసినంటా పాపట దువ్వేనంటా
చిందరవందర చేసి సిగ్గు విడిపించీనే" 17-39

**చిందువందు:** (6) చిందరవందర.
"చిందువందైనదానిఁ జెనకకువయ్య నీవు
కందువ చెప్పంపి మీఁదగలఁతు గాని" 7-28

**చిందువందుర:** ప.బం; వి. చిందరవందర.
"పెట్టిన కస్తూరిబొట్టు బెరసి నీ కురులతో
నట్టునిట్టుం జిందువందురై యుండంగా" 6-142

**చిందుసేయు:** అ.క్రి. వ్యాపించు.
"చల్లు మా పూరుపుగాలి సమరతివేళల
పుల్లమొల్లఁజిందుసేసు నోపుదునా" 11-251

**చింద్రికె:** వి. ఇది 'చంద్రిక'కు రూపాం. వ్యవహారంలో 'చెంద్రికె' అయి వ్రాతలో పొరపాటున 'చింద్రికె' అని పడినదేమో. అర్థమూ అదే అని సం.ప.స. (22 సం. 390 పు.) కాని 'చి' యతిస్థానంలో ప్రయోగింపబడటం గమనించాలి.
"చిన్ని పులకలు చూచి చింద్రికెమోవి చూచి
సన్నల నిన్నాడవారు సారె నవ్వరా" 22-39

**చిక్కపుబుత్తి:** 1.చిక్కములోని చద్దిఅన్నం. 2.చిక్కపుబుట్ట. (చిక్కము = దారంతో అల్లిన సంచి)
"కట్టిన చిక్కపుబుత్తి, కచ్చకాయల తిత్తి
చుట్టిన పించెపుఁబాగ చుంగుల సోగ" 5-96

**చిక్కిన:** విణ. తక్కిన.

**చిక్కినవి:** వి; బహు. తక్కినవి, మిగిలినవి.
"పుప్పొరిగలోన నుండి పువిద నిన్ను రమ్మని
చెప్పి రమ్మన్నది యింతే చిక్కిన వెరఁగము"
11-293

**చిక్కుఁజీరు:** ఇవి జంటపదాలు. (చిక్కు = సంకటపెట్టుట, చీరు = కోపించుట) తమిళము. చిక్కుజీరు శబ్దమును అరసున్న లేకుండ సూ.ని. బహు. తార్పర్యార్థములతో. చూపినది. 'చప్పుచాడు' వంటిది. అని సం.ప.స. (13 సం. 350 పు.) ఈ పదాన్ని సూ.ని. ఈ విధంగా వివరించింది.

**చిక్కు(లు)జీరు:** (చిక్కు + జీరు) వి. తుత్తుమురు. విణ. జీరువాలయినది. (సం.ప.స. 14 సం.) ఇవి జంట పదములు. (చిక్కు = సంకటపెట్టడం, చీరు = కోపించడం) చిక్కుజీరు శబ్దమును అరసున్న లేకుండ సూ.ని. బహుతాత్పర్యార్థములతో చూపినది. 'చప్పుచాడు' వంటిది. ఆవృతము.
"గక్కునఁ గలసితి నీ కాఁగిట నేను
దక్కితి శ్రీవేంకటేశ దయగంటిని
చిక్కుఁజీరు నింటివారు సేయనీ నన్ను
మొక్కలానఁగీడు నిన్ను ముట్టుకున్నఁ
జాలును" 14-356

**చిగురుఁగొమ్మ చేఁగలగు:** అ.క్రి. మొలకలోనే చేవదేరు.
"చింది చింది యెత్తఁబోతే చేరి మాపుదాఁకాఁ
బట్టు
చెందితేఁ జిగురుఁగొమ్మ చేఁగలవు నయ్యా"
18-194 & 23-260

**చిగురుఁగొమ్ము:** వి.చిగిరించిన లేఁతకొమ్ము, అప్పుడప్పుడే మొలచు కొమ్ము. 3-308

**చిగురుఁజేవయగు:** ప.బం; అ.క్రి. బలహీనమైనది బలవంతమగు, మృదువైన వస్తువు కూడా చేవ కలది యగు.
"చిగురుఁజేవయగు శ్రీవేంకటేశుఁడు
అగువరము లొసఁగు నటుగాన" 4-333

**చిగురుఁబెదవులది:** వి. పల్లవాధరకు దేశ్యపదం, చిగుళ్లవలె మృదువైన పెదవులు గల స్త్రీ.
"చిగురుఁబెదవులది చిన్నారి పాదములది
నిగనిగమేనిది నీకే తగును" 22-526

**చిగురుచింతలు:** వి. చిగిరించే చింతలు.
"చిగురుచింతల చేఁజిక్కు చేరిచిన చేయి
పగటున నేఁడు చెట్టపట్టఁగఁ బాలాయఁగా"
19-442

**చిగురుమేఁతకాఁడు:** వి. కోకిల; చిగుళ్ళు మేతగా కలది అని వ్యుత్పత్తి.

"చిగురుమేతకాండ్లెల్ల చెలంగి మావికొమ్మలెక్కి
మగువమీఁదఁ గూఁత రేచి మరునిఁగూడిరే"
5-315

**చిగురుమేనిది:** (చిగురుమేను + అది) వి. చిగురువలె మృదువైన శరీరం కల స్త్రీ.
"చిగురుమోవిదాన చిగురుమేనిదాన
చిగురు చిత్తముదాన చెప్పేదేమి" 20-592

**చిగురుమోవిది:** (చిగురుమోవి + అది) వి. చిగురువలె మృదువైన పెదవి గల స్త్రీ.
"చిగురుమోవిదాన చిగురుమేనిదాన
చిగురు చిత్తముదాన చెప్పేదేమి" 20-592

**చిగురులోపలి చేఁగ:** వి. కఠినమైనది. (విజయ) చిగురులోనే ఏర్పడ్డ చేవ.
"చిగురులోపలి చేఁగ చెప్పరే మీరు
ఇగురులోపలి నిప్పు నిలుపరాదె" 19-421

**చిగులు:** అ.క్రి. ఈ పదం ప్రధాన నిఘంటువుల్లో కనిపించదు. వృద్ధిపొందు, విజృంభించు, ఉద్రేకించు కావచ్చు.
"చిగులుతా మమ్ము నింత సేయ
నేర్చినవాఁడవు
యెగనెక్కవు మా కోపా లిముడుకోఁజాలవా"
11-364
"నగనే యాతఁడు నీ నటనకుఁ దగినట్టు
చిగులుతా సారెసారెఁ జెప్పినట్టు సేయఁగా"
11-329

**చిచ్చ(చ్చు)ర(ఱ)కోల:** వి. నిప్పు గల కోల, ఆగ్నేయాస్త్రం.
"పచ్చిదేరు నగ్గి బగబగ మండేటి
చిచ్చరకోలల చేతల
వెచ్చియు వేఁపని వేదనఁ బొరలుచు
అచ్చపుటాసల నలసీ తరుణి" 5-204

**చిటకము:** వి. శ.ర.లో చిట్టకము అనే పదం ఉన్నది. దీనికిది వ్యావహారికరూపం కావచ్చు. శృంగారచేష్ట, లీల (కపటం) అని అర్థాలు.
"చిటకానఁ జెనకియు చేతులును దనివోవు
పూటువగూడి గోల్లకొన నుంది మోహము"
27-272

**చిటికె:** వి. నెటిక, చేతినడిమి వేలును బొటన వేలుతో చేర్చి చేసే ధ్వని. (బాలక్రీడావిశేషం)
"తవిలి యొకతె పై పాదము నీవు చాఁచఁగాను
తివిరి వేళ్ళ చిటికె దియ్యవచ్చీ నీకును" 7-174

**చిటిపొటి:** వ.బం; విశే. మిక్కిలి అల్పమైన, చిన్నచిన్న.
"చిటిపొటి యలుకల చిందువందై యుండుకంటె
తటుకునఁ దెగువైన తలపోఁతే మేలు" 24-98

**చిటుక:** వి. 'చిటికె'కు రూపాం. చూ: చిటికె.
"మెటుపున వద్దనుండి మేను విసుకనేరుచు
తిలకించి చిటుకలు దియ్యనేరుచు" 18-176

**చిటుకురను:** క్రి.విశే. చిటుక్కని మోగు.
"విటతనముల వాని నే మారుఁ గోసరరాదు
చిటుకురంటే సేవ సేయవలెఁ గాని" 23-182

**చిట్టంటుఁజెమట:** వి. నఖదంతక్షతాది విలాసచేష్టల వల్ల కలిగే చెమట.
"చిట్టంటుఁజెమటలతో సిగ్గువడేవు నీవు
దట్టమైన పాయపు మదములా ఇది" 25-58

**చిట్టంటుఁదనము:** వి. నఖక్షతాది శృంగారచేష్టల లక్షణం.
"అట్టె నీవద్ద నుండిన యద్దము చూడుమంటేను
చిట్టంటుదనాల నీకు సిగ్గు లేమిటికి" 28-66

**చిట్టంటుఁబులకలు:** వి; బహు. శృంగారపుపులకలు.
"గుట్టుతోడ నిలుచుండి కొలువుసేసి యుండాకా
చిట్టంటుఁబులకలను చిమ్మిరేఁగేవే" 28-462

**చిట్టంటు:** వి. శృంగారం.
"పుట్టినదే నగ్నత్వము బూతో బండో
యెరఁగము
చిట్టంట్ల వాచవులగు జీవుల మ్రింగెదము"
3-340

**చిట్టంటుచేతలు:** వ.బం; వి; బహు. నఖక్షతాది బాహ్యశృంగారచేష్టలు, హొయలు, విలాసచేష్టలు.
"జట్టిగొనెర నిన్ను జవరాలు
చిట్టంటుచేతల జెలఁగితివపుడు" 5-326

**చిట్టంటులు:** వి; బహు. చిలిపిచేష్టలు, నఖదంతాది క్షతములు.

"మొనసి చెలులతోడి ముసగసలు

చెనకుల కొనగోరి చిట్టంటులు" 28-526

**చిట్టకపుకాంతలు:** వి; బహు. శృంగారచేష్టలుగల కాంతలు, కపటంకల కాంతలు.

"పట్టలేక నీ వాడిన పంతము దప్పినాఁడంటే

చిట్టకపుకాంతలలో సిగ్గు గాదా నీకు" 14-370

**చిట్టకము:** (6) వి. 1. శృంగారచేష్ట 2. లీల 3. కపటం (శ.ర.) 4. పరిహాసం 5. మోసం 6. ఆట. రూపాం. చీటకము.

"చిట్టకాన కింకా నేమి సేయుమనేరే" 11-314

**చిట్టకీఁడు:** (చిట్టకము + ఈఁడు) పరిహాసమాడువాడు, కపటి, బూటకీడు.

"చిట్టకీనివలెఁ దాను చిన్న చేతలెల్లాఁ జేసీ

మెట్టు దెలియఁగవచ్చు నెఱఁగనే నేను" 23-470

**చిట్టిబొట్టు:** వి; బహు. చిన్నబొట్టు, ముత్తైదువలు అక్షతలు మొ॥ వాటితో ధరించే బొట్టు, దృష్టి దోషపరిహారంకోసం ధరించే చిన్న బొట్టు. (వ్యు.)

"చెదరు గంధమునకు చిట్టిబొట్టు నోమె" 5-127

**చిట్లు:** (చిట్టి + లు) వి. చిన్న కొలపాత్రలు, గిద్దెలు.

"జిగి నుప్పమ్మాఁగొందరు చిట్లు

మోయఁగొందరు

నగు నీతో సరసమరగదు మాకును" 14-429

**చిడిపి:** విణ. అల్పము, క్షుద్రము.

"చిడిపిరాయి చింతామణి చేయు" 2-282

**చిడిపిరాయి చింతామణి చేయు:** ప.బం. మామూలు వస్తువును ఒక విలువైన వస్తువుగా చేయు. చిన్న మామూలు రాయిని విలువైన చింతామణిగా చేయు అని వాచ్యార్థం. 2-182

**చిడియు:** అ.క్రి. కందు, చిరాకుపడు.

"బడి విభీషణునిఁ జేపట్టితే రక్కసులెల్లా

విడిసి మల్లెపట్టిరి శ్రీవెంకటరామా" 4-281

**చిడుక్కని:** అల్పధ్వనికి అనుకరణం.

"పలుమారు పుట్లపండుగను,

చిలుకు చిడుక్కని చిందఁగను" 5-57

**చిడుముడి:** వి. 'చిడిముడి'కి వ్యావహారికరూపం, త్రొట్రుపాటు, చీకాకు, కోపం, ఈర్ష్య, సంభ్రమం, వ్యాకులత, తొందర.

"నడుమ శ్రీవేంకటేశ నన్నేలితి విపుడట్టి

చిడుముడిఁ గదిమితే సిగ్గుపడేవు" 18-323

**చిడుముడిపడు:** అ.క్రి. కోపపడు, తొందరపడు, త్రొట్రుపడు, నిరాసక్తంగా ఉండు, కలతచెందు, చీకాకుపడు, భయపడు.

"అదరి శ్రీవేంకటేశుఁడట్టె నిన్నుఁగూడఁగాను

చిడుముడిపడి నవ్వఁ జెల్లునే నీకు" 14-286

**చితుకెక్కు:** అ.క్రి. తొక్కుడుపడు, నలుగు, పగులు.

"పొప్పుగ మేనులు పొరయఁగ మీకును

చిప్పిలుఁజెమటల చితుకెక్కే" 11-12

**చిత్తడి:** వి. 1. మిక్కిలి తడి 2. చిత్తకార్తె వాన.

"తమ్ములపు రసము చిత్తడిగాఁ గురియుచు

చిమ్మిరేఁగ రాగము నించితివిగా నీవు" 5-116

**చిత్తడిచెమట:** వి. మిక్కిలి చెమట.

"చిత్తరుపటము చూచి చెలి లోలో దలపోచి

చిత్తడిచెమటతోడ సిగ్గువడెను" 7-398

**చిత్తణి:** (2) వి. 'చిత్తిని' అనే స్త్రీ జాతికి చెందిన స్త్రీ. స్త్రీజాతి భేదం.

"సెలవుల నవ్వితేను చిత్తిణి ఇదెననో

సొలసి పాదా లొత్తితే జాలురెనునో" 23-9

"యెక్కువతోఁ దిరువేంకటేశుండ నిన్నుఁగూడి

చెక్కు నొక్కి కౌగిలించె చిత్తణి యొవ్వతెరా" 6-42

**చిత్తము చిల్లులగు:** ప.బం; అ.క్రి. మనస్సు కకావికలగు.

**చిత్తము చిల్లులువోవు:** ప.బం; అ.క్రి. మనసు వికలమగు.

"చేరి మాటలాడఁగానే చిల్లులువోయఁ జిత్తము"
23-410

**చిత్తము వచ్చినట్టు:** మనస్సుకు తోచినట్లు, ఇష్టంవచ్చిన రీతిగా.

"సేయవయ్యా నీవు నీ చిత్తము వచ్చినట్లల్లాను
యీయెడ నీ మతకము లెట్టు గాఁగలదా" 8-32

**చిత్తమువచ్చు:** (2) అ.క్రి. ఇష్టమగు, ఇష్టపడు.
"చిత్తము వచ్చినపుడు చేకొని మన్నించనీ
తత్తరము తనమీఁదఁ దరవువెట్టితిని" 16-220

**చిత్తరి:** వి. వర్షాకాలం, (సూ.ని.) చిత్తడి.
"చనవు నీ వొసఁగఁగా జంకించితే నేమి
తని వంది రతులు చిత్తరిఁ జేయరాదా" 27-484

**చిత్తరుపటము:** (2) వి. చిత్రపటం, బొమ్మ గీసిన పటం.
"చిత్తములోని రూపు చిత్తరుపటాన వ్రాసి
హత్తి కాఁగిలించుకొను నంగన నిన్ను" 16-284

**చిత్తరుపతిమ:** (3) వి. చిత్రపటంలోని బొమ్మ.
"చిత్తరుపతిమవంటి చెలికిఁ బ్రాణము వచ్చె
హత్తి నీవు చేచేత నంటఁగాను" 16-335

**చిత్తరువాఁతపటము:** వి. చిత్రంలో రాసిన పటం, వ్రాతలో రేఫం లోపించింది. వ్రాత, క్రొత్త శబ్దాల్లోలాగా రేకులు వ్రాయబడిన కాలంలో రేఫ లోపించిన 'వాత' వాడుకలో ఉండి ఉంటుంది.
"చెలి నీ యింటఁ బెట్టిన చిత్తరువాత పటము
కొలఁదితో నాపె మునిగోడ నున్నది" 14-466

**చిత్తరువ్రాఁత:** వి. నిశ్చలంగా ఉండేది.
"అందీనందని బొందులు ఆమనికాలపుఁ బొల్ల
చెందియుండని రతి చిత్తరువ్రాఁత" 17-187

**చిత్తశాంతము:** వి. చిత్తశాంతి.
"చీకాకుపడిన చిత్తశాంతము సేయ
లేక కానీవు బహులీల నన్ను, కాకునేసెదవు"
1-24

**చిత్తాఇత్తము:** వి. చిత్తాయత్తము, చిత్తమునకు అధీనం.
"ఎట్టు దలఁచినాఁ జిత్తాఇత్తమై వున్నాఁడవు"
3-524

**చిత్తానఁబెట్టు:** ప.బం; స.క్రి. మనస్సులో ఉంచు.
"చిత్తానఁబెట్టకుమీ మాట శ్రీరమణ మరవకు"
2-337

**చిత్తారు:** వి. 'చిత్తరువు'కు వ్యావహారికరూపం.
"గోడలేని పెద్దకోరిక చిత్తారు
వాడుచ లోలోనె వ్రాసేఁ దరుణి" 5-204

**చిత్తాహరి:** వి. చిత్తమందున్న హరి (?), చిత్తహరి సాధురూపం, గాన సందర్భంలో అకారం దీర్ఘమై ఉంటుంది.
"చిత్తాహరి నా దిక్కు చేకొని యవలోకించవే
యిత్తల సంసారవార్ధి యీఁదుచున్నాఁడ" 2-106

**చిత్తిణిది:** (చిత్తిణి + అది) వి. చిత్తిని జాతికి చెందిన స్త్రీ.
"చిత్తిణిది యని కాకుసేయవా నీవు" 13-444

**చిత్తిణివాఁడు:** వి. ఐంద్రజాలికుడు, మోసగాడు.
"చిత్తిణివాఁడనకురే శ్రీవేంకటేశుఁడు
యెత్తుక యీరేడు లోకా లేలీని బిడ్డఁడు" 5-218
"చెప్పనా నే నప్పుడే చిత్తిణివాఁ డితఁడని
చిప్పిల నెందో పొందుసేసి వచ్చెను" 13-3

**చిత్తిణివిద్యలు:** వి; బహు. ఇంద్రజాల విద్యలు, మాయ విద్యలు, మోసపు విద్యలు.
"చిత్తిణివిద్యల నేల చిమిడేవే" 18-174
"చిత్తిణివిద్యలు మానఁజెప్పరమ్మ శిర
సెత్తి యెవ్వరిని జూడఁడెటువంటి వలపో"
6-125

**చిత్రగుప్తుని లెక్కలు:** ప.బం; వి; బహు. ఒకపట్టున తేలని లెక్కలు, తప్పుడు లెక్కలు.
"యెదరై నీ మంత్ర జపమెంచుకొన్నయపుడే
కదుఁ జిత్రగుప్తుని లెక్కలు గడచె" 3-12

**చిత్రపలక:** (2) వి. చిత్రఫలకం, చిత్రాలు గీసే పలక.
"పొద్దువోక నీ రూపు వ్రాఁచి చిత్రపలకపై
కొద్దిమీర వ్రాసి పరాకున నుండఁగా" 27-109

**చిత్రపుపటము:** వి. చిత్రపటం, బొమ్మ గీసిన పటం.
"చెంది తన రూపు వ్రాసిన చిత్రపు పటము
కందువగా నీవు లెస్స కనుఁగొంటివా" 28-263

**చిని:** చిన్న.

"చెనకి దశముఖుని చేతులుఁ దలలును
చినకండలు గోసిన యతఁడు" 4 అను 40

**చినికండలు:** వి; బహు. చిన్నముక్కలు.
"చెనకి దశముఖుని చేతులు దలలును
చిని కండలు గోసిన యతఁడు" 4 అను 40

**చినుకు లేని చిత్తడి:** ప.బం; వి. అసంభవం.
చినుకు లేని వర్షాకాలం ఉండదుకదా!
"తనిసితి నుండ నీవే తన వలసినయట్లు
చినుకు లేని చిత్తడి సిగ్గు లేలే యిఁకను" 19-393

**చినుమయము:** వి. చిన్మయము; 'న్మ'లో నకారమకారాలకు మధ్యలో అకారాగమం.
"చినుమయపు బ్రహ్మము చిక్కించి మాయ గప్పితే
నిరుపమపరిశుద్ధ మనఁగనేలా" 15-290

**చిన్నఁబోయు:** అ.క్రి. చిన్నబోయెను; పోయెన్ మొ॥ భూతకాలిక - ఏకవచనరూపాలను అన్నమయ్య ఎక్కువగా 'పోయ' ఇత్యాదిగానే వాడినాడు. కళావిహీనమగు, అవమానంతో మొకం చిన్న చేసుకొను.
"లలిఁగొప్ప గొప్పగాని లాచి మోము చిన్నఁబోయ
బలిమి చూపఁగ నీతోఁ బంతకత్తెనా" 11-118

**చిన్నపడు:** అ.క్రి. చిన్నబోవు (?)
"సగము సాయనంపి సడిఁబెట్టి విడిశిన
బగిడికాఁడు సిన్నపడునటె వీఁడు" 5-378

**చిన్నెక:** వి; బహు. చిన్నక్క (?)
"శ్రీవేంకటేశ్వర జిగి నీ మహిమలు
సేవించగలరా చిన్నెకలు" 13-78

**చిబికివేయు:** (?)
"చిబికివేసిన గింజ చేతఁబట్టఁగ నేల
గబుక కెంగిలిబూరె గడుగఁగ మరియేల" 2-494

**చిమడఁబెట్టు:** స.క్రి. ఉడికించు, కలతపెట్టు.
"చింతచే నీ మనసు చిమడఁబెట్టేవు" 5-203

**చిమిడించు:** స.క్రి. బాధించు, బాగా ఉడికించు, వేడెక్కించు, కాల్చు.
"చెమటవుట్టఁ జెనకి సిగ్గున నున్నాఁడవు
చిమిడింతురా మనసు చెలియకును" 7-401

**చిముడు:** అ.క్రి. అమితంగా ఉడుకు, అమితంగా ఉడికి ముద్దగు, చెడు, పాకం చెడు, కాలు, తప్తమగు, బాధపడు, చితికిపోవు.
"చెనకి నే మాటాడితే చిమిడీ వలపులు" 14-41
"చెదరని వలపులు చిమిడితేఁ గొర యౌనా
పదను దప్పకుండాను పాలింతువు గాక" 8-17

**చిమ్మనఁగోవి:** వి. చిమ్మనగ్రోవి, జలక్రీడయందు నీళ్ళు చిమ్మెడి గొట్టము, శృంగము.
"చిమ్మనఁగోవులఁ జిమ్మి చేతఁ జూప బాగాలు
పమ్మి పచ్చడము కొంగుపట్టవోయి" 29-24

**చిమ్మనగోవాటలు:** (చిమ్మనగోవి + ఆటలు) వి; బహు. చిమ్మనగోవితో ఆడే ఆటలు.
"చిలుపచెమట లెల్లా చిమ్మనగోవాట లాయె"
23-573

**చిమ్మిరేఁగు:** అ.క్రి. మిక్కిలి విజృంభించు.
"విన్నపములిఁక నేల వేడుకో నేల
చిన్ననాటి సిగ్గు లెల్ల చిమ్మిరేఁగె నిఁకను" 11-62

**చిమ్మిరేఁచు:** (3) ప.బం; అ.క్రి. చెలరేఁగునట్లు చేయు, విజృంభింపజేయు మొ॥ భావచ్ఛాయల్లో ప్రయోగింపబడే పదబంధం.
"మోపరాని మోపయి ములుగనియ్యదు మమ్ము
చేవ సంసారముపైఁ జిమ్మిరేఁచీని" 3-352

**చిమ్మిలిబొమ్మ:** వి. నువ్వుపప్పు, బెల్లమును కలిపి దంచిన ముద్దతో చేసిన బొమ్మ.
"కావరాన నీవు గూడి కౌఁగిటనే పిసికేవు
శ్రీవేంకటేశుఁడు చిమ్మిలిబొమ్మ" 7-97

**చిమ్ముఁగాగిలి:** వి. (చిమ్ము = మీటు, ఆడించు, విక్షేపించు)
"తమ్మితూఁడులను తను బిగిసితిఁబో
చిమ్ముఁగాఁగిలని చెలఁగీని" 20-258

**చిమ్ముఁజీకటి:** వి. చిమ్ముచీకటికి రూపాం. దట్టమైన చీకటి.

"ముమ్మాటికి నీ బాసలే నమ్మి వున్నదాన నేను
కుమ్మరించరా నీ కరుణ వేంకటేశ,
చిమ్మఁజీకటెల్లఁ బాయను" 7-223

**చిమ్ములఁగొలువువారు :** వి; బహు. ఊడిచే కొలువు చేసేవారు.

"చిమ్ములఁగొలువువారు సిగ్గున లోనికేగిరి"
9-278

**చిమ్ముల సేవ :** వి. సమ్మార్జనం చేసే సేవ, తుడిచే సేవ.

"నెమ్మది శ్రీవేంకటేశ నీవు గూడితివిగ సన్ను
చిమ్ముల నీసేవ నాచేఁ జేయించుకోవయ్యా"
11-396

**చియ్యను :** (ఛీ + అను) ప.బం; అ.క్రి. 'ఛీ' అను, అసహ్యించుకొను.

"నెయ్యపుహేయము నిచ్చలుఁ గడిగెద
చియ్యని రోయను సిగ్గూఁబడను" 2-283

**చిరిఁజెమటలు :** వి. 'చిఱుఁజెమటలు' అనే దానికి వికృతిరూపం.

"చిరిఁజెమటలతోడి శ్రీవేంటేశుఁడ నేను
మెరసె నీ నా పొందు మితిమీరి యిపుడు"
28-58

**చిఱుతవాఁడు :** వి. బాలుఁడు, చిఱుతప్రాయపు వాడు.

"చిఱుతవాఁడవై నీవు చీరలు దొంగిలుకొని
కొఱతలు మాన్పితివి గోవిందరాజ" 18-516

**చిలిమి :** వి. ఇది 'చలిమి' అయి ఉంటుంది. యతి స్థానం దీనికి సమర్థకం, చలిమి చెలిమికి వ్యావహారికం కావచ్చు. స్నేహం.

"చలిమి బలిమి సాదించీనా
యెలిమి నిన్నాళ్లదాఁకా నెందుండెై తాను"
26-41

**చిలుకకువలె బుద్ధిచెప్పు :** ప.బం; అ.క్రి. మిక్కిలి గారాబముతో నీతి బోధించు.

"చిలుకకువలె బుద్ధిచెప్పినఁగానలేక
పలుమారుకే తోజాఁ బాడేవుగా" 1-350

**చిలుకచదువు :** ప.బం; వి. అర్థం తెలియని చదువు.

"తెలిపే గురుఁడుండఁగ తెలియగనేరవు
చిలుకచదువు లేలో జీవుఁడా" 10-1-14

**చిలుకపదాలు :** వి; బహు. భగవంతుడు చిలుక రూపంలో ప్రత్యక్షమై రామాయణ మహాభారతాలను గానం చేసినాడనీ, మళయాళకవి యళుత్తచ్చన్ ఆదివృద్ధి పద్ధతిలోనే వ్రాసినాడని అంటారు. 'చిలుక' శబ్దానికింత ప్రాధాన్యం ఉండడం వల్ల 'చిలుకా' అనే సంబోధనతో పదకవులు పదాలను రచించినారు. వీటినే చిలుకపదాలని అంటారు.

ఉదా :-

"జీవాతుమై యుండు చిలుకా – నీ
వావలికి పరమాత్ముఁడై యుండు చిలుకా" 1-50

తమిళంలో ఈ పదాలను 'కిళిపాట్టు' అంటారు.

**చిలుకపలుకులది :** వి. చిలుకవలె మనోహరమైన పలుకులు గల స్త్రీ.

"అలివేణి జవరాలు అన్నిటానుఁ జక్కనిది
చిలుకపలుకులదీ చెలియ" 28-363

**చిలుకపలుకులు :** ప.బం; వి; బహు. చిలుకపలుకుల వంటి మనోజ్ఞమైన మాటలు, విన్నమాటలు, స్వఆలోచనా రహితములైన మాటలు, అర్థజ్ఞానం లేని మాటలు.

"పడతి నోరఁ జిలుకపలుకులు వెడలెఁగె
తడవి కొప్పునఁ దుమ్మెదలు మూగెను"
28-249

**చిలుకలకొలికి :** (3) ప.బం; వి. చిలుక కంఠంవంటి మధురకంఠం కల స్త్రీ, సుందరి. (కొలికి = కంఠం)

"చిలుకలకొలికి సిగ్గులు వడనేటికే
పలుకఁగదవే నీ పతితోను" 7-114

**చిలుకలతెర :** వి; ప.బం. చిలుకబొమ్మలు గల తెర.

"చిలుకల తెర యేల చేరి కట్టించె నడుమఁ
జిలుకలు వాత రొట్లు (?) చిమ్మిరేఁచును"
14-214

చిలుకకోటు: వి. చిలుకగాటు.
"చిలుమారు వనములోఁ బాయక వుండఁగానో
చిలుకకోట్లు మోవిఁ జిలరేగెను" 12-414
"మొలకనవ్వు నవ్వుచున్న ముదిత
ముద్దుమోవి
చిలుకకోటు చూచి సన్నసేయ నెట్లు వచ్చురా"
5-136

చిలుకు: వి. బాణం, బాణాగ్రం.
"చలివాసి నీ ముద్దులు సకులతోఁ జెప్పఁగాను
చిలుకుల బయ్యలఁ దీసే విదేమయ్యా"
12-494

చిలుకుఁజూపులది: వి. బాణాగ్రాల్లాంటి
వాడిచూపులు గల స్త్రీ.
"చిలుకుఁజూపులదాన సిగ్గరితనాలదాన
పలుమారు నెంత వొడఁబరచేవయ్యా" 29-476

చిలుకుఁదేరు: అ.క్రి. (?)
"చిలుకుఁదేరెను మోవిఁ జిందీ ననుచు నీవు
పలుకవదేమే పతితోను" 27-176

చిలుకుగాలము: వి. కొలికి గల గాలం.
"నలినాక్షిరూపు మనసునఁ దలఁచబోతే
చిలుకుగాలమై తోఁచెను మరుఁడు" 18-157

చిలుకుగుబ్బలి: వి. మందరపర్వతం.
"వెల లేని వేదములు వెదకి తెచ్చిన చేయి
చిలుకు గుబ్బలికిందఁ జేర్చు చేయి" 1-334

చిలుకుగోరు: బాణాగ్రంవలె వాడియైన గోరు.
"చిలుకుగోళ్ల నన్నుఁ జెనకుచు నీ పజ్జ నా
నలు వెట్ట వచ్చేవు నారసింహుఁడా" 10-218

చిలుపాలు: వి. చిఱువాలు, బాగా మీగడ
గట్టునట్లు ఇగురఁ గాచినపాలు
అనవచ్చు.(సం.ప.స.) చణ్వాలి, చీళ్వాలు,
శిరుపాల అని తమిళం. జున్ను అని తెలుగు.
16-77

"జిడ్డు గాకుండ చిలుపాలుఁ దేనె
తెడ్లతోఁ దినీ దేవి దేవి" 23-331

చిల్లర: వి. 1. చెడ్డపని. (2. సత్రకాయబాపతు
3. చింతపండు, మిరపకాయ మొ॥ సరకు
4. చిలుకు)
"పల్లదమాడితినటె పైడివంటి మాటనైన
చిల్లరే మానఁడాయ శ్రీవేంకటేశ్వరుఁడు"
25-478

చిల్లరచెమట: వి. చిరుచెమట.
"చిల్లరచెమటతోడ చిక్కని వూర్పులతోడ
గొల్లలెక్కలాడేవు కోపమేఁటికే" 9-117

చిల్లరపని: వి. 1. వ్యభిచారం 2. చిన్నచిన్నపని.

చిల్లరమనుజులు: వి; బహు. అల్పులైన
మనుష్యులు.
"దేవుఁడు గారణము తెలిసినవారికెల్లా
జీవుఁడు గారణము చిల్లరమనుజులకు" 1-470

చిల్లాపొల్లు: వి. చిందరవందర.
"చిల్లాపొల్లాయ నీ మెయి జెమట ముత్తెములెల్ల
పెల్లురేగి నీవె చక్కఁబెట్టుకొనరాదా" 17-158

చిల్లుకడవలో దీపము: ప.బం; వి. చంచలం.

చిల్లున: క్రి.విశ. చిమ్ముట మొ॥ వానియందు
ప్రయోగించే అనుకరణశబ్దం.
"వెడలెఁజిల్లున వాని వేడి నెత్తురు నింగికి
పొడివొడి యాయ శత్రుభూషణము లెల్లను"
4-513

చిల్లుల కడవలోపలి దీపము: ప.బం; వి. అస్థిరం,
నిలుకడ లేనిది.
"తెలియఁజిల్లుల కడవలోపలి దీపమువలెనే
అలరి వెలిఁగిడి చూడఁజూడఁగ హరిప్రపంచపు
మాయ" 4-115

చిల్లో యంటే పొల్లో యను: ప.బం; అ.క్రి. ఒకటి
అంటే దానికి బదులుగా మరొకటి అను.
"చిల్లో యంటే పొల్లో యని సిగ్గు విడిచినవాఁడు"
11-235

"పోపో చిల్లో యంటె పొల్లో యనేవు
యీపాటిదానవేట యెఱుగమే నిన్ను" 17-49

చివచివ: అవ్య. తొందరగా.
"చివచివ నీటికడవలోని నీరై

కవకవ నవియుచుఁ గారీని" 1-124

చివన: క్రి.విశ. 'చివ్వన'కు రూపాం.శీఘ్రంగా.
"జవళిగెమ్మోవులు సన్నలఁ జూపుకొంటాను
చివన నిందిర నంటె శ్రీ నరసింహుఁడు" 4-511

చివ్వున: (2) విశ. శీఘ్రంగా, తొందరగా.
"చివ్వున నాతఁడు నిన్నుఁ జేయివట్టి తీసితేను
రవ్వగా నేల చెప్పేవే రమణులతో" 14-546

చిహ్న: వి. చిహ్నము, 'ము' విభక్తి లేని రూపం. ఈ రూపం శివకవుల్లో సాధారణం.
"జిగి నిన్నుఁగూడెనటె శ్రీవేంకటేశుఁడు
నిగిడి రతిచిహ్నాలు నిలువెల్లా నిండెను" 28-39

## చీ

చీఁకటి ఏర్పై పారు: ప.బం. చీకటి దట్టంగా వ్యాపించు.

చీఁకటికూబ: వి. చీకటిగూబ, చీకట్లో తిరిగే గుడ్లగూబ.
"చీఁకటి బెడబాపేటి చేరువ సూర్యోదయము
చీఁకటికూబలకైతే చిమ్మి రేఁచును" 15-136

చీఁకటిగొను: అ.క్రి. చీకటిపడు. 'చీకట్లుగొను' అని కళా. ప్రయోగం. 4-89
"తలఁపే చీఁకటిగొంటే తగ దన నెట్టు వచ్చు"
28-580

చీఁకటితప్పు: (14) ప.బం; వి. వ్యభిచారం, జారత్వం.
"చేరి గొల్లెతలు నీతో చీఁకటితప్పు సేసితే
ఆరితేరి నవ్వితివి అది దగవా" 11-39
"పుడికి సతిఁ గైకొంటి పురుషోత్తమా
పొడమెఁ జీకటితప్పు పురుషోత్తమా" 2-283

చీఁకటిదవ్వు: (6) ప.బం; అ.క్రి. వ్యర్థప్రయత్నం చేయు. అంధకారంలో కొట్టుమిట్టాడు. చీకటిలో వెదకడం వ్యర్థప్రయత్నమే కదా!
"జీవులు నిన్నెఱుంగక చీఁకటిదవ్వఁగ నేల
శ్రీవెంకటేశ్వర నిన్నుసేవించేదే నేరుపు" 6-53
వ్యర్థాలోచనలు చేయు:
"చీకటి ద్రవ్వేద వేలె?
చీంకి నశ్రులుక వదేలె" 6-53
"కడలేని యాస చీకటి ద్రవ్వుకొనుట"
"కలకాలము చీకటిద్రవ్వుకొనెడి
వలల భ్రమల నెవ్వరు పడరిట్లా" 1-260
"చీకటి ద్రవ్వమగ నిధానమబ్బె" 5-118
"కడు మమతవలన చీకటి దవ్వఁగలిగె" 1-129

చీఁకటిదొడ్డి: వి. వెలుతురు లేని దొడ్డి.
"కలసిన కాఁగిలి కామశాస్త్రపుదొడ్డి
చెలఁగే పరవశము చీఁకటి దొడ్డి" 16-69

చీఁకటి ద్రవ్వు: (3) ప.బం; అ.క్రి. వ్యర్థప్రయత్నం చేయు, నేరాలు వెదకు (తె.వ్యు.కో.), వ్యర్థాలోచనలు చేయు.
"కలకాలము చీఁకటి ద్రవ్వుకొనెడి
వలలభ్రమల నెవ్వరు వడరిట్లా" 1-260
"చీఁకటి ద్రవ్వెదవేలే చీటినఁ బలుక వదేలే"
4-53 old

చీఁకటిపడు: ప.బం; అ.క్రి. చీకటియగు.
"విడువవు భవముల వెంటవెంటనే
చిడుముడిఁ జిత్తము చీఁకటిపడెను" 3-50

చీఁకటిపాలగు: ప.బం; అ.క్రి. వ్యర్థమగు, పాడగు.
"చిందరాని నా బుద్ధి చీఁకటిపాలాయె" 3-50

చీఁకటిపొద్దు: వి. చీఁకటి సమయం.
"నీ నెలవెఱఁగక నెమకిరొ తాము
తోనే చీఁకటిపొద్దున వచ్చితి" 16-290

చీఁకటిభూతము: వి. నల్లని రూపంగల భూతం. తామస ప్రవృత్తిగల వరాహమని భావం. హిరణ్యాక్షుణ్ణి సంహరించడానికై భగవంతుడు వరాహావతారాన్ని ధరించినాడు.
"కనలి కవియు చీఁకటిభూతము" 1-109

చీఁకటిమాను: వి. తమాలవృక్షం.
"సొలసి చీఁకటిమాను చుక్కలతో మాటాడఁగా
ఏల మెరుఁగుఁజంద్రుఁడు వెన్నెల గాసె" 7-435

చీఁకటివడు: ప.బం; అ.క్రి. నిస్తేజమగు, శూన్యమగు, సాయంత్రమగు.

"విడువవు భవములు వెంటవెంటనే
చిదుముదిఁ జిత్తము చీకటి వడెను" 3-50

**చీఁగు:** (?)
"చీఁగక కూడితి నన్ను వేగమె శ్రీవేంకటేశ
తోఁగి సేసవెట్టితేనే తోడోపు లేలరా" 20-46

**చీకటితురుముది:** (చీకటితురుము + అది) వి.
చీకటివలె నల్లనైన కొప్పు గల స్త్రీ.
"చీకటితురుముదాన చేరకు నన్ను
చీకటి నల్లనిమేని చెలువుఁడను" 5-350

**చీకటిని దప్పుకొనుట:** ప.బం; వి. ఎప్పటికీ
పూర్తికాని శ్రమ.
"ఎడతెగని మమత వేయఁగరాని పెనుమోపు
కడ లేని యాస చీకటి దప్పుకొనుట"

**చీకురువాయి:** వి. గబ్బిలం, చీకురాయి,
ఇలకోడి, చిమ్మట.
"సాకిరి వయసు సంసారము గోరు
చీకురువాయులు జాతిమాను గోరు" 4-102

**చీటకపు చెంచెత:** వి. (?) శృంగారలీల గల
చెంచెత, కపటురాలైన చెంచెత. (చిట్టకము
యొక్క రూపాంతరం చీటకము)

**చీటకపు చెమట:** వి. శృంగారలీలకు
సంబంధించిన చెమట.
"చీటకపుచెమటలు చిట్లు గందాలట
మేటి దొరఁ బిలువరే మెరసేనటా" 11-183

**చీటి:** వి. చిట్టీ అనే హిందీ పదానికి వికృతి.
"మాటలెన్నిలేవు నీవు మంతనాన నాడేవి
చీటు లెన్ని లేవు నీవు వ్రాసి చేతికిచ్చేవి"
23-353

**చీటికిమాటికి:** (21) ప.బం. మాటిమాటికి,
ప్రతిచిన్నదానికి, అల్పవిషయాలకు.
"చీటికి మాటికిఁ జెనకేవే వట్టి
బూటకాలు మాని పోవే బావ" 5-163

**చీమంత:** (చీమ + అంత) ప.బం; విణ.
కొద్దిపాటి.
"చీమంత మాటైన చెవిలో నీకు బోధించు
కోమలి నీ కిన్నాళ్ళకు గురుతాయఁగా" 11-482

**చీమకదొంతర:** వి. చీమలబారు, (ఇట ఇది
నూగారుకు ప్రతీకగా చెప్పబడింది)
చీమలదొంతర?
"చీమక దొంతరకొన సింహపుఁగౌదమ వాలె
యేమని పొగడవచ్చు నింతి సింగారములు"
26-363

**చీమ దుమ్ము:** (?)
"మోసపోతి ననసేల మురుగవగవసేల
చేసుఁగాక పుణ్యాలు చీమ దుమ్మెనా" 4-50
అను.

**చీమలు మై వాకినట్లు:** నానుడి; మిక్కిలి బాధను,
చీదరను కలిగించినట్లు.
"చీమలు మై వాకినట్టు చిమ్మిరేఁగె వలపు"
5-324

**చీరకొంగు మాయు:** ప.బం; అ.క్రి. ముట్టగు.
"మూసేవే గుబ్బలఁ గొంగు మురిపెంపుగొల్లెతా
మాసినది చీరకొంగు మందకేఁగనియ్యరా" 5-72

**చీర చిక్కు:** (2) ప.బం; అ.క్రి. గర్భం ధరించు,
నెలలు నిండినకొద్దీ కడుపు పెరుగడం వల్ల చీర
తక్కువపడడం అనే దానిమీద వచ్చిన
పలుకుబడి.
"యిందరితో నీ మాఁట యేమని చెప్పుదునమ్మ
చెంది యీ క్రిష్ణుఁడు చీరచిక్కించెను" 11-258

**చీరికిఁగైకొను:** ప.బం; స.క్రి. లక్ష్యపెట్టు.
"కలుషరౌద్రదుఃఖముల కించుకా
కలఁగను చీరికిఁగైకొను" 2-181

**చీరుమూరగు:** అ.క్రి. చిందరవందరయగు.
"సారె సారెఁ జెలరేఁగి సరసము లాడఁగానో
చీరుమూరై మేనెల్ల జీరలాయను" 18-135

**చీరుమూరాడు:** ప.బం; అ.క్రి. చిట్టుముట్టాడు,
చిందఱవందఱ చేయు, పెనగులాడు,
చీల్చిచెండాడు.
"మూరెడుగొప్పుతోడి ముద్దరాలికి
చీరుమూరాడీ వలపు చిత్తగించవయ్యా"
24-404

"చేరువ సంతోషమబ్బె శ్రీధరా
చీరుమూరాడీ(?) దమి శ్రీధరా" 15-245

**చీరుమూరుగా :** క్రి.విణ. (చీఱుమూఱు = confusion తాఱుమాఱు. ill treatment ) అని తమిళం. అర్థమాకలు లేక అని ఛాయార్థం.
"చేరి విన్నవించవే సిగ్గువడ నీకేటికి
చీరుమూరుగా వలచినదానవా" 18-31

**చీలమండ :** వి. కాలిమడమలకు రెండు ప్రక్కలా ఉండే కీలు, గుల్ఫం.
"చింతలు చెక్కులబంటి సిగ్గులు పెందొళ్లబంటి
మంతనాలన్నియుఁ జీలమండలబంటి" 23-536

## చు

**చుంగు :** వి. రూపాం. చెంగు, అంచు, కచ్చభేదం, కుచ్చె.
"చుంగుల పించెపుగూడ చుట్టుఁబాగతోడ" 6-26

**చుంచు :** (?)
"ముంచినది విరహము మోచినది జవ్వనము
చుంచునఁ బతి నేమని సొలసేనే" 20-219
"ముంచిన నీ చెక్కులద్దముల మించులు
పంచమోవి చుంచులు బింబపుటంచులు"
13-155 old

**చుంచు :** పిల్లజుట్టు.
"మంచానకుఁ దియ్యకుమీ మరి తురుము చెదరి
చుంచుల మా యత్తవారు చొప్పు వట్టేరు"
26-169

**చుంచుఁబాపము :** వి. బలమైన పాపం.
"పొంచి సింగారపు భోగములుడిగిన
చుంచుఁబాపములు సుకృతములే" 1-371

**చుంచుల కళ :** వి. పిల్లజుట్టుల కళ.
"మంచి నీ కరములను మఱుఁవెట్టు కోకువే
చుంచుల నీ మెయికళలు చూపేదే మేలు"
12-493

**చుంచుల చుట్టము :** వి. చెంచువారి చుట్టము.
"చుంచుల నా చుట్టములో సూడుబంటవో నీవు
అంచల నన్నియు నాయ నప్పటి నంటకురా"
11-228

**చుంచుల మోవి చవి :** (?)
"పొంచి మరెవ్వతో నిన్నుఁ బొందుగా మాఁకునఁ జేసి
చుంచుల నీ మోవి చవి చూడఁబోలును" 7-275
"ముంచిన నీ చెక్కులద్దముల మించులు
పంచ మోవి చుంచులు బింబపుటంచులు"
7-155

**చుంచులహరి :** 1. చెంచువారి హరి. పిల్లజుట్టుగల విష్ణుమూర్తి, బాలకృష్ణుడు.
"యెంచఁగ నేటికి యింద్రియ మహిమలు
చుంచుల హరి నీ సూత్రము లివియే" 4-264

**చుక్కబొట్టు :** (8) ప.బం; వి. చుక్కరూపంలో పెట్టుకునే బొట్టు.
"చుక్కబొట్టు పెట్టికొని సుదతి నీ పాదాలకు
మొక్కి యంటించెను తన ముద్రగాను" 12-427

**చుక్కలరాజు :** వి. చంద్రుడు, చుక్కలకు ప్రభువు.
"చూడమ్మ అల్లవాఁడే చుక్కలరాజు
వేడుకలు వెదజల్లే వెన్నెలరాశి" 27-549

**చుక్కలరాయఁడు :** వి. చంద్రుడు, నక్షత్రాలకు అధిపతి.
"చక్కని వదనమది సారెకు నీ వెత్తఁగాను
చుక్కలరాయఁని సూటి దరిగె" 17-300

**చుక్కలలో చంద్రుఁడు :** ప.బం; వి. ఎందరిలోనో ప్రధానుడు.
"నిక్కి దేవుళ్లు ముత్యాల నీపై సంతమాడంగా
చుక్కలలో చంద్రుఁడవై చూపట్టితివి" 7-169

**చుక్కలు మోవఁబెరుగు :** ప.బం; అ.క్రి. మిక్కిలి ఉన్నతంగా పెరుగు.
"చుక్కలు మోవఁ బెరిగి సూర్యుఁడు దా నైనాఁడు
చిక్కు బాతాళము దూరి శేషుఁడైనాఁడు" 4-167

**చుక్కలు లెక్కించినట్లు :** ప.బం. అసాధ్యమైన పనికి పూనినట్లు.
"చూడఁగ మా అన్నములు, చుక్కలు లెక్కించినట్లు
పుక్కిట గర్భములకు నోడిగట్టితిమి" 3-556

**చుక్కలు లెక్కించినట్లు :** ప.బం. అసాధ్యమైన పనికి పూనుకొన్నట్లు.
"చుక్కలు లెక్కించినట్లు చూడఁగ మా అన్నములు
పుక్కిట గర్భములకు నోడిగట్టితి(మి?)" 3-556

**చుక్కలూరి చెన్నుఁడు :** వి. కడపజిల్లా చుక్కలూరు గ్రామంలో నెలకొన్న చెన్నకేశవుడు.
"యిక్కువతోఁ గొలువు సేయించుకొంటా నున్నాఁడు
చుక్కలూరి చెన్నునిఁ జూడరమ్మ చెలులు" 29-2

**చుక్కలెంచుకొను :** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనికి పూనుకొను.
"దిమ్మరివిభునితో డీకొనే వాదు లేల
యిమ్ములఁ జుక్కలైనా నెంచుకొనేఁగాక" 7-247

**చుట్టపుఁబగ :** ప.బం; వి. జ్ఞాతివైరం. 5-199

**చుట్టపువరుస :** (19) ప.బం; వి. బంధుత్వం, చుట్టపురీతి.
"చుట్టపువరుస మిమ్ముఁజూచి నేరవలెను" 23-200

**చుట్టపువిరోధము :** వి. జ్ఞాతివైరం, పాలిపగ (?)
"ఎట్టుఁజేసినఁజేసె నేమి సేయఁగవచ్చు
చుట్టపువిరోధంబు సూనాస్త్రుచెలిమి" 1-104

**చుట్టపుసూడుది :** (చుట్టము + సూడు + అది) బంధుత్వం కల శత్రురాలు, జ్ఞాతివైరం కలది.
"వెట్టి చేతలాడినైనా వీఁకకుఁ దేవచ్చుఁగాని
చుట్టపుసూడుదానిఁ జొక్కించరాదు" 23-107

**చుట్టము :** వి. బంధువు అని సామాన్యార్థంలో ప్రయోగం. కానీ రాయలసీమలో చుట్టము, చుట్టమురాలు అనే పదాలకు ఉంచుకొన్నది, ఉంపుడుగత్తె అనే అర్థంలో వాడుక ఉన్నది.
బంధువు :
"నీవంటి చుట్టము నాకు నిండు నిధానము గాదా
పూవుల నీ పాదము పూజింతుగాక" 27-34
ఉంపుడుగత్తె :
పాయని చుట్టమువలె పక్కఁబండి యాతని
మాయలఁ బెట్టేవేమే మాటిమాటికి" 28-576

**చుట్టరికపుఁదనము :** (చుట్టము + ఱిక + తనము) వి. బంధుత్వం, చుట్టరిక శబ్దంపై స్వార్థంలో తన ప్రత్యయం.
"చుట్టరికపుఁదనాలు చూపులలో నవ్వులు
గుట్టునఁ జేకొంటివి కొంకనేలే నీకును" 24-361

**చుట్టరికేలు :** వి; బహు. 'చుట్టరికము' శబ్దానికి బహు.వ. రూపం.
"సుదతికి నీకును సూటుల చూపులవల్ల
కదిసెఁజుట్టరికేలు కతలేఁటికి" 19-188

**చుట్టాలసురభి :** ప.బం; వి. ఆదరణ చూపువాడు, బంధుప్రియుడు, చుట్టాలకు ఆశ్రయమైనవాడు, చుట్టాలకు కామధేనువు వంటివాడు.
"చుట్టాల సురభి తాను చొక్కులనేల పెట్టీనే
గుట్టుతోడ నా కాఁగిటఁ గూడుఁగాక" 29-326
"నీవూ నాపె చుట్టాలవుత నే నది యెఱఁగనా
యీవల నాముందర నీవెంత పచారించేవు"
28-514

**చుట్టాలు పక్కాలు :** ప.బం; వి. బంధువర్గం అనే అర్థంలో వాడబడే పలుకుబడి.
"అంచెలఁజుట్టాలు పక్కా లాడుకొనేరు" 26-169

**చుట్టుఁగైదువ :** వి. చక్రాయుధం, గుండ్రని ఆయుధమని వ్యు.
"వాఁడె శ్రీవేంకటేశుఁ డనేవాఁడె వీఁడు
వాఁడీ చుట్టుఁగైదువ వల చేతివాఁడు" 1-121

**చద్దులు :** వి; బహు. సుద్దులు, ముచ్చట్లు.
"చెయివట్టి చెయివట్టి చెలి చద్దులు చెప్పఁగా

యేయడ పరాకు నీకు నేమయ్యా" 29-390

**చుప్పనాతి :** (6) వి. 'శూర్పణఖ'కు జానపదుల వ్యవహారం.

"చెలఁగి చుప్పనాతి గర్వమడఁచి

దైత్యసేనలఁ జంపిన రాఘవా" 1-392

**చురచురన్ :** క్రి.విశ. కోపంతో.

"వెరగంది వున్నదాన విభునేమీ ననలేక

చురచురఁ బంతాలాడీ చోద్యమయ్యీనే" 25-20

**చురుచూండ్లు :** (చూండ్లు + చూండ్లు) వి; బహు. మిక్కిలి కాల్పుటలు.

"చూచిన మోహపుఁ జూపులఁ జురుచూండ్లే కెడమియ్యని

రాచటికపు నెరజాణఁడు రసికుండాతఁడె పో"

1-229

**చుల్లరపుటాగడాలు :** (చుల్లరము + ఆగడాలు) వి; బహు. హింసతో కూడిన ఆగడాలు, బాధతో కూడిన ఆగడాలు, దుడుకుతనంతో కూడిన ఆగడాలు.

"చుల్లరపుటాగడాలు చూపఁబోతే గంపనిండా

పెల్లు మాణికాలున్నవి బేలుపోయ మాఁటా"

26-156

**చుల్లరవెట్టు :** స.క్రి. బాధపెట్టు, హింసించు.

"చుల్లరవెట్టుఁజేతలఁ జొక్కనాథుఁడు

వుల్లముతో నీ నెలఁదలూరి చొక్కనాథుఁడు"

10-2-20

**చుల్లరి :** విశ. బాధించు నట్టి, కఠినమైన, దుడుకుతనం కల.

"పల్లదపు రుద్రుఁడును బాణుని వాకిలిదొక్కె

చుల్లరి రాక్షసమూక సురసుర సుక్కె" 4-365

**చుల్లరితనము :** వి. దుడుకుతనం.

**చుల్లరీఁడు :** (చుల్లరము + ఈఁడు) వి. బాధించువాఁడు, హింసించువాఁడు.

"చుల్లరీఁడవై యెందైనా జొరఁబారేవు కెరలి

పల్లటీఁడవై పడుచుపనుల దిరిగేవు" 13-170

**చువ్వన :** క్రి.విశ. శీఘ్రంగా, చివ్వున.

"యెవ్వతె కస్తూరిబొట్టో ఇదె నీ నొసలనంటె

చువ్వన నద్దములోన చూచుకోవయ్యా"

21-239

## చూ

**చూడు :** స.క్రి. దహించు, కాల్చు.

"ఒప్పుదువో యింక కొరవులంజూడేవు నా

కొప్పు లెఱుంగవు యింక నొగిలించే వేలరా" 6-8

**చూపఁజెప్పఁగలుగు :** ప.బం; అ.క్రి. మాటకూ, కంటికీ గోచరుడగు.

"చూపఁజెప్పఁగల భక్తసుజనుఁడవు మాకు"

2-60

**చూపరి :** వి. ఈ పదం చూచేవాఁడు, చూడబడేవాడు, చూడదగ్గవాడు మొ॥ అర్థాల్లో ప్రసిద్ధం. కాని ఇక్కడ ప్రకరణాన్ని బట్టి 'చూరగా రాలే పొడి' అనే అర్థంగా కానవస్తుందని సం.ప.స. (21 సం, 387 పు.)

**చూపుదుఁబూట :** ప.బం; వి. పూటకాపు, పూటపడిన వాఁడు, ఒకరికి బదులుగా మరొకరిని పూటవెట్టి అప్పు తీసుకోవడం అలవాటు. అవసరమైనపుడు ఋణగ్రస్తుణ్ని చూపించడానికి అచ్చుకొన్నవాడు, ఆ ఋణగ్రస్తుడు పాఱిపోయి కనబడనిచో వాడీయవలసిన సొమ్ము తానే యివ్వడానికి పూచీ పడినవాడు, ప్రతిభువు, జామీను ఉన్నవాడు. (ఆం.శ.ర.)

"కోపుల రాజులనెల్ల కొలిచి కొన్నాళ్లు మేను

చూపుదుఁబూటవెట్టి సొగిసి నేను" 4-142

**చూపులకొనలు :** వి; బహు. అపాంగములు.

"చూపుల కొనలనుండు చొక్కులమాకుమ

తీపుల మోవిపైఁ గారు తేనియలు" 28-555

**చూమరలు :** వి; బహు. (?)

"కాముని యమ్ములకు చక్కని గుఱి నీ వని

చూమరల నిందరికీఁ జూపి చెప్పినట్లు" 17-159

**చూమరసేయు :** (చూమర + చేయు) అరమరసేయు.

"ఏమి సేసితివో చెలి ఇంత నీకు మోహించె

చూమరసేయక ఇంతిఁజూతువు రావయ్యా"
27-595

చూర(ఱ)కాఁడు : వి. కొల్లకాడు.
"గక్కన శ్రీవేంకటాద్రిఘనుఁడు కొగిటను
చొక్కులఁబెట్టిది నిన్ను చూరకాఁడు కృష్ణుఁడు"
5-270

చూర(ఱ)గొను : దోచుకొను, కొల్లగొను.
"నీవు నిర్మించినవే నీకే సమర్పణసేసి
సోవల నీ కృపయెల్లఁ జూరగొంటిమి" 3-49

చూరాడు : ప.బం; స.క్రి. చూరనాడు,
కొల్లగొను. (వ్యర్థంచేయు)
"సుదతుల సిగ్గులు చూరాడి" 10-2-82

చూఱలుగొను : చూ: చూరగొను. 4-35

## చె

చెంగు : అ.క్రి. పాము, తొలఁగు, చలించు,
విసర్జించు, విడుచు.
"అంగన నీకు నేఁడు అప్పణ ఇయ్యఁగఁబోలు
చెంగక మాయింటికి విచ్చేసేవటే" 20-209
ఎగరడం మొ॥ వాటిలో అనుకరణం :
"కొంగువట్టి తీసినాను కూరిమిఁజేకొందుఁగాక
చెంగి చెంగి పానుపుపై సిగ్గువడఁగలవా" 17-67

చెంచలము : వి. చాంచల్యం, చంచలత్వం,
ధర్మవాచకానికి బదులు ధర్మివాచక ప్రయోగం.
'చంచలము' కు బదులు 'చెంచలము' అని
ప్రయోగించటం ఉచ్చారణానుసారి కావచ్చు.
లేదా యతి మైత్రికోసం కూడా కావచ్చు.
"చంచలము లేటికిచ్చుటఁ జేతికి లోనైతే" 27-228
"మానదు కోపము మతి చెంచెలమును
కాని కర్మమిది కలదాఁకా" 4-449

చెంచెలుఁడు : వి. చంచలుఁడు.
"మట్టుపడి యొకచోట మ(న)సెందు నిలువదు
యిట్టి చెంచెలుఁడ నాకు నెన్నడో నిశ్చయము"
4-361

చెండు : స.క్రి. ఖండించు.
"చెండిన రావణు శిరోమాలికల
దండల పూజల తఱచుగను" 2-516

చెండుకొను : స.క్రి. ఖండించు.
"అక్కడివారినే నీవు అటు చెండుకోరాదా
మక్కువతో నీవేల మాకు మొక్కేవయ్యా"
17-465

చెంత నిండు చెరువుండ చెలమలేల : సామెత;
కోరుకున్న వస్తువు పెద్దదే లభించగా
చిన్నవస్తువును కోరుకుంటామా అని భావం.
"యింతలోని పనికిఁగా యిందునందుఁ జొరనేల
చెంత నిండుచెరువుండ చెలమలేలా" 1-466

చెంద్రికదట్టి : వి. సింధూరవర్ణపు దట్టి.
"చెక్కుల జవ్వాదితోడ చెంద్రికల దట్టితోడ
చొక్కమైన మాణికపు సొమ్ములతోడ" 29-2

చెంద్రుఁడు : వి. చంద్రుడు, 'చెంద్రుడు' అనడం
ఉచ్చారణానుగుణం కావచ్చు.
"రెప్పలెత్తి చూడనేర్చె రేసీఁ జెంద్రునందు పగలు
గొప్ప సూర్యునందు నింకఁ గొత్త నేర్పనేఁటికే"
2-387

చెంబుమీఁది కనకపుఁబూత : ప.బం; వి. పైపై
మెఱుఁగు, అశాశ్వతం.
"శ్రీకాంతునిపైఁ జేయని భక్తులు
చెంబుమీఁది కనకపుఁబూఁత" 2-235

చెకోరము : వి. చకోరపక్షి, 'చెకోరము' అని 'చె'
కారంతోడి ప్రయోగం ఉచ్చారణానుసారి
కావచ్చు.
"బంతిఁ జెకోరములఁ దప్పక చూచే నీ రీతి
కాంత కన్నులతోఁ దారుకాణ వచ్చెనా" 7-75

చెక్కిట చేయిడుకొను : ప.బం; అ.క్రి.
ఆశ్చర్యపడు, చింతించు.

చెక్కులతోడి చింతలు : చెక్కిట చేయి వేసి చేయు
చింతలు.
"చేవదేరి చెక్కులతోడి చింత లివే" 20-352

చెట్టపట్టాలాడు : ప.బం; అ.క్రి. సరసాలాడు.
(చెమ్మచెక్కలాడు)

"చేలలంటి గోపికల చెట్టపట్టాలాడితివి
యీలీల మాఁడుపూరిలో యిట్లాడేవా" 3-179

**చెట్టవట్టు:** ప.బం; స.క్రి. పెండ్లిచేసుకొను.
"చేయివేసె చెట్టవట్టె సిగ్గు నీ కొప్పగించె
చాయల నీకిది యైనా సమ్మతా నేఁడు" 19-472

**చెట్టాపట్టాలు పట్టు:** ప.బం; అ.క్రి. చేతులు చేతులు కలుపుకొను.
"పడచులు నేను చెట్టాపట్టాలు పట్టుకాడఁగా
నడుమనే నన్నుఁజూచి నవ్వితివి గదరా"
20-45

**చెట్టుకట్టు:** ప.బం; అ.క్రి. స్థిరపడు, వర్ధిల్లు.
"చెప్పరాని రతులను చెట్టుకట్టు వలపు" 18-228
"వుడివోదే కాలము వొకతతి రావద్దు
చెడని శ్రీహరిభక్తి చెట్టు కట్టితేను" 3-300

**చెట్టునఁచేటెడు:** ప.బం. మిక్కిలి అధికం.
"ముట్టి తేనె ముయివో నీ మొక్కులు
చెట్టునఁజేటఁడు వో నీ చిక్కులు" 9-116

**చెట్టులమందులు:** వి; బహు. మూలికారూపములైన మందులు.
"చెట్టుల మందులు దెచ్చి చిలుకల కిచ్చేవేమే
పట్టిన వసంతుని పంటలు గావా" 22-217

**చెడనాడు:** ప.బం; స.క్రి. నిందించు.
"ఇట్టునట్టుఁదిరిగాడి యేమైనా జెడనాడి
పెట్టరంటాఁ బోయరంటాఁ బెక్కులాడి"

**చెతురుఁడు:** వి. 'చతురుఁడు' అనడానికి వ్యావహారికరూపం.
"అతివ గుట్టున నున్న దండాఁకాను
చెతురుఁడ వికనైన సంగడి కేఁగరాదా" 26-50

**చెదరు:** వి. చెదరడం.
"తిలకపు మోమునకుఁ దేంట్ల రానీక నీ
యలకల చెదరె పో యదలించేని" 5-281

**చెనకులు:** వి; బహు. నొక్కులు.
"అలరు చెనకులచే నంగములు జీరలాయె
మలసి యిందుకు నీక మంత్రమేదో" 3-356

**చెన్నకేశుఁడు:** వి. 'చెన్నకేశవ' శబ్దంలో వకారం లోపించగా మిగిలిన శబ్దం. వ్యావహారికరూపం.
"చెల్లునానీ కీ పనులు చెన్నకేశా
కొల్లకాఁడ వౌర గండికోట చెన్నకేశా" 20-50

**చెన్నుఁడు:** (3) వి. అందమైనవాఁడు.
"అన్నిటా శ్రీవేంకటేశుఁ డాదరించి నిన్నుఁగూడె
చెన్నుఁడంటూ నితనిఁ జెలితో మెచ్చేవే" 8-171

**చెప్పంపు:** (3) (చెప్పి + అంపు) స.క్రి. ఒకరి ద్వారా వర్తమానం పంపు.
"యెప్పుడు వచ్చునో మా యింటికిఁ దాను
చిప్పిలఁ గాంతలచేత చెప్పంపినాఁడు" 12-150

**చెప్పల్లి:** వి. కడపజిల్లా కమలాపురం తాలూకాకు దక్షిణదిక్కుననున్న పెద్దచెప్పల్లి గ్రామం.
7-307

**చెప్పల్లి శ్రీ వెంకటరాయఁడు:** కడపజిల్లా కమలాపురం తాలూకాకు దక్షిణదిక్కున ఉన్న పెద్దచెప్పల్లి గ్రామంలో వెలసిన చెన్నకేశవుడు. చెప్పలి అనే పేరుగల వ్యక్తితో ఈ ఊరు వెలసినట్లు స్థానికుల చరిత్ర.
"ఆగి కూడితివి నన్ను అలసితి రతులలో
వీగేవు చెప్పల్లి శ్రీవేంకటరాయ" 7-307

**చెప్పుడుబుద్ధులు:** (2) వి; బహు. ఇతరులు బోధించిన బుద్ధులు.
"చెప్పుడు బుద్ధులకును చేయెత్తి మొక్కేఁగాక
తప్పులు నేఁబట్టేనంటే తానా యెదురు" 25-459

**చెప్పుడుమాటలు:** వి; ప.బం; బహు. చాడీలు.
"చెప్పుడుమాటలు చెప్పుకొనుట గాక
చెప్పినట్లుఁ దాము సేయ రెవ్వరును" 1-230

**చెమట చిత్తిడిది:** (చెమట చిత్తిడి + అది) చెమట వాసన కలది.
"చిఱునవ్వుతో నుందాన చెమటచిత్తడిదాన
యెఱుఁగుదు వన్నియును యేమి బాతి నేను"
14-130

**చెమ్మఁజెమటలు:** (6) (చెమటలు + చెమటలు) వి; బహు. మిక్కిలి చెమటలు, ముచ్చెమటలు.
"కమ్మి శ్రీ వేంకటపతి గక్కున నన్నుఁగూడి

చెమ్మఁజెమటల నన్నుఁ జెక్కులేల నొక్కేవే"
14-345

చెమ్మటూరు: వి. సమ్మటూరు కావచ్చునేమో?
"యేపున శ్రీవేంకటేశ యేలఁగా ఇల్లాలనైతి
యీపై చెమ్మటూరఁ జూపేవేమి బాఁతినేను"
23-256

చెయి: వి. 'చేయి'కి వ్యావహారికరూపం.
"చింతలెల్లఁ బెడబాసె, చెక్కు చెయి
దియ్యవమ్మ" 11-113

చెయిచాచు: ప.బం; అ.క్రి. అడుగుకొను, కోరు.
"చేరి శ్రీవేంకటేశుఁడు కోరి నాకు విడెమీఁగా
పోరచివారు చెయిచాఁచఁ బొసఁగునటే" 18-247

చెయివేయు: ప.బం; అ.క్రి. చేతితో ముట్టుకొను, కొట్టు, పనిలో సహాయం చేయు.
"ఎందరు లేరు నీకు నేనేమి బాఁతెయ్యా
అంది నాపైఁ జెయివేసేవు అట్టె కానీవయ్యా"
14-378

చెయ్యార: (9) ప.బం; క్రి.విఙ. సంతృప్తిగా, చేతులార.
"పయ్యద కొంగేమిటికే పట్టితియ్య వచ్చేవు
చెయ్యార నానతీవయ్యఁ జేసే నూడిగములు"
22-337

చెయ్యి మీఁదగు: ప.బం; అ.క్రి. అధికుడగు.
"నీ చెయ్యే మీఁదాయె నీకుఁ జెల్లురా నిన్ను
యేచి వలపుల బయలీదించనైతిరా" 11-331

చెయ్యొగ్గు: (చెయ్యి + ఒగ్గు) అ.క్రి. దోసిలిపట్టు, అంజలించు, ప్రార్థించు.
"నాకు నాకే సిగ్గయ్యీని నన్ను జూచుకొంటేను
చేకొని నీవె మన్నించఁ జెయ్యొగ్గే గాని" 4-2

చెరకు పండిన పండు: ప.బం; వి. మిక్కిలి తీయనిది(?) (అసంభవం)
"చిక్కెను నాకుఁదొల్లి చెరకు పండినపండు
పెక్కుమారులు మీరు పెనఁగేరు గాని" 18-269

చెరకు పిప్పి చవిగొను: ప.బం; అ.క్రి. వ్యర్థమైన పనికి పూనుకొను.
"చెయ్యార నాతని కొప్పుసేయని భోగములెల్ల
చయ్యన చెఱకుపిప్పి చవిగొనుటా" 15-75

చెరకు పోలికి వెదురు నమలుట: ప.బం. అతి కఠినమైనదానిని సులభసాధ్యం చేయడం.
9-151

చెరపు: వి. చెరవ సంబంధియై యుండవచ్చు. 'తళిగ' లకు పర్యాయపదం. ఈ పదం నేటికి తిరుమలపై వాడుకలో నున్నదట. (పీఠిక. 15 సం. 11 పు.)
"దినసంభ్రమములతో దేవదుందుభులు మ్రోఁయ
తన చెరపులు పైపై దాసులు సేయ" 15-189

చెరిత: వి. 'చరిత'కు వ్యావహారికరూపం.
"ఏడకేడ నీ చెరిత లేమీని పొగడవచ్చు
యీడులేని మహిమల యినవంశరామా"
4-274

చెరితము: వి. చరితము, చరిత్రము.
"ఏడకేడ నీ చెరిత లేమని పొగడవచ్చు
యీడులేని మహిమలయిన వంశరామా"
4-274

చెరిత్రము: వి. 'చరిత్రము' అనడానికి వ్యావహారికరూపం.
"అరుదు నీ చెరిత్రము హరి నేని దియే
తలఁచుకొని" 2-321

చెరువుముయ్య మూకుడడుగు: సామెత; అసాధ్యమైన పనికి పూనుకొను, పెద్దపనికి చిన్నసాధనాన్ని అడుగు.
"అయ్యయ్యో భూమిమీఁద నన్నియుఁగంటిఁ జెరువు
ముయ్య మూకుడడిగేటి మూఢులు గలరుగా"
11-181

చెఱఁగు మాయు: ప.బం; అ.క్రి. బహిష్ఠు అగు, దూరముండు.
"సిరులతోఁ జెఱగు మాసినదానిఁ జేరరాకు
సొరిది నల్లంత నుండి చూతువు గాని" 7-28

చెఱఁగు మాసినది: ప.బం; వి. ముట్టైనది, బహిష్ఠైనది.

"చేరి నన్ను నంటకురా చెఱఁగు మాసినదాని
అరసి మాఁట చెప్పరా అల్లంతనుండి" 20-9

**చెఱకుఁబిచ్చె :** (చెరకు + పిచ్చె) వి. చెరకుముక్క, చెరకుఒరం.

"చెలరేఁగి యాపె మోవి చెఱకుఁబిచ్చె
యంటాను
చలువగా వేడకతోఁ జవిగొనేవు" 22-191

**చెఱకునఁబండు :** ప.బం. అపురూపమైనది, అసంభవం.

"చేప లేక యిటు చెఱకునఁబండై
భావంబిటువలె పరగెను నేఁడు" 15-63

**చెఱకునఁబండు పండినట్లు :** ప.బం. చెఱకే తియ్యనిది. దానికి పండు పుడితే ఇంకెంత తియ్యగా ఉంటుందో అనే దానిపై ఏర్పడ్డ పలుకుబడి. ఇలాంటిదే బంగారానికి తావి అబ్బినట్లు అనేది. చెఱకుకు పండ్లు లేకపోవటం ప్రసిద్ధం. అసంభవ విషయం చెప్పడం. (విజయ)

"చనవై శ్రీవేంకటేశు శరణను టొక్కటే
పనివడి చెఱకునఁబండు పండినట్లు" 4-80

**చెఱకున పండున్నట్టు :** ప.బం. అపురూపంగా.

"చేముంచి శ్రీవేంకటేశ చెఱకున పండున్నట్టు
కామించి నీ వురమెక్కి ఘనురాలినైతిని" 11-51

**చెఱకు పండిన పండు :** ప.బం; వి. అపురూపం, అతిమధురం.

**చెఱువుకు మూకుడు మూయు :** ప.బం; అ.క్రి. అసంభవమైన పనికి పూనుకొను.

"అందాలు నేమెరిఁగితే ఆయములు దాఁచేవు
గొందినే చెఱువుకు మూకుడు మూసేవే" 7-206

**చెలప చెమటలు :** (7) వి; బహు. చెలమ యందు నీరూరినట్లు ఊరే చెమటలు. "చెలమ శబ్దము యొక్క సామాసికవిశేషణరూపము చెలప అగునేమో" అని సం.ప.స. 13 వా. 4 పుట.

"వలపు నీపై నించె వడిఁబులకలు వెంచె
చెలపచెమట లవె చెక్కున ముంచె" 9-121

**చెలిమికత్తె :** (చెలిమి + కత్తె) వి. చెలికత్తె, సఖురాలు.

"ఎలమిఁ గేళాకూళిలో నీదులాడిన నేర్పులు
చెలిమికత్తెలతోడఁ జెప్పుకొందునా" 22-245

**చెలిమికాఁడు :** (చెలిమి + కాఁడు) మిత్రుడు.

"చెలిమికాఁడ నీవేల సిగ్గువడేవు యేమో
వెలఁది విన్నవించీని వినరాదా" 19-214

**చెలియించు :** అ.క్రి. 'చలియించు'. చలించు. యతి కోసం 'చ' కారం 'చె' గా వాడబడి ఉండవచ్చు. లేక ఉచ్చారణానుసారి కావచ్చు.

"చేతనుఁడై సర్వగతుండై చెలియించడేమిటను"
2-419

**చెలువరాయఁడు :** (చెలువము + రాయఁడు) వి. అందగాడు.

"అంతలోనే పైకొని అధరపుఁదేనెలిచ్చి
చెంతఁ జొక్కించితివిగా చెలువరాయా" 23-456

**చెలువరి :** (చెలువము + అరి) వి. అందగాడు, సొగసుకాఁడు, ప్రియుడు.

"వొక్కటి మాఁటల నొడఁబరచి నా
చెక్కు నొక్కకువోయి చెలువరీ!" 10-2-21

**చెలువుఁడు :** వి. అందగాఁడు, ప్రియుడు, భర్త.

"చలము సాదించకువే సారె సారెను
చెలువుఁడు వేడుకొని చెక్కు నొక్కిని" 14-151

**చెల్లఁబెట్టు :** (2) స.క్రి. నశింపజేయు. (తె.వ్యు.కో.)

"చెల్లఁబెట్టేవు సుద్దులు చింత యేఁటికే" 26-472
"చేసిన నీ చేత లెల్లాఁ జెల్లఁబెట్టేకొరకే
మూసి దించి కాఁగిలించి మొక్కితి నీకు"
21-190

**చెల్లఁబో :** ప.బం. ఆక్షేపం మొ॥ అర్థాల్లోనూ, ప్రశంస, సంతాపం మొ॥ అర్థాల్లోనూ ఉపస్కారకమైన పదం.

"చింతతో ధరించరాదు చెల్లఁబో మేనైనఁ బోదు
ఇంతటఁ జెలులకైన యొఱుక లేదు" 5-267

**చెల్లఁబో:** అవ్య. ప్రశంసాద్యర్థాల్లో ఉపయోగింపబడే అవ్యయం.

"చెల్లఁబో తపసు పండి జడవేలయ్య్యా
కొల్లగా వలపు లమ్మెఁ గొనుకొనవయ్యా" 26-400

**చెల్లని మాడకు దొడ్డ ముద్ర:** ప.బం; వి. వ్యర్థమైనది. చెల్లని నాణేనికి పెద్దముద్ర వేసితే మాత్రం ఏం ప్రయోజనం అని భావం. పనికిరానిదానికి ఆర్భాటమెక్కువ, చెల్లని పైసకు గీతలెక్కువ అనే సామెత వంటిది.

"చెల్లని మాడకు దొడ్డ ముద్ర వేసిన
బల్లిదాన దొడ్డ దొడ్డ బాసలెల్లఁ జేసేవు" 24-71

**చెల్లపిళ్ళలు:** వి. ముద్దుబిడ్డలు. (త.సెల్వం = అందం, పిళ్ళ = సంతానం)

"తల్లిదండ్రి గలవారు తమ లేము లెఱఁగక
చెల్లపిళ్ళలై యాటలఁజెందినయట్టు" 3-54

**చెల్లాటము:** వి. ఉత్సాహంతో ఆడటం, చెర్లాటం, క్రీడ.

"నెలకొన్న ఇంటిలోన నెమళ్లతో నేమాడేవు
చెలి హంసవంటి దీపె చెల్లాటా లాడరాదా" 23-327

**చెల్లినంతా చేత:** ప.బం; వి. పట్టినదే పంతం, ఆడిందే ఆట వంటిది.

**చెల్లుబడితనము:** (చెల్లు + బడి + తన) వి. సాగుబడి, సాగుపాటు, అధికారం, దక్షత.

"వెల్లవిరై గద్దెమీఁద వెస నీవుండఁగా నాపె
చెల్లుబడితనమునఁ జెనకీ నిన్ను" 14-575

**చెల్లెతోడు:** చెల్లెసాక్షిగా, ఒకరకమైన ప్రమాణవాక్యం.

"ఓసికొట్టు గొట్టి కంచుటుంగరాల చేయి
తీసేవు నీ చెల్లెతోడు తియ్యకురా నన్నును" 5-103

**చెవిఁబట్టు:** ప.బం; అ.క్రి. వినబడు.

"సొలసి సొలసి నీకు సుద్దులెల్లాఁ జెప్పి పంపే
చెలియమాటలు నేఁడు చెవిఁబట్టెనా" 16-562

**చెవులఁబెట్టు:** ప.బం; స.క్రి. సావధానంగా విను.

"పన్నెలమాటలు చెవులఁబెట్టక
వాసి విడువకుమి వో మనసా" 1-188

**చెవులపండుగ:** (6) ప.బం; వి. వినుటకు ఇంపైనది, శ్రోత్రపర్వం, కర్ణపర్వం, సంతోషం సూ.ని., శ.ర., బ్రౌన్‌లలో లేదు.

"చెప్పేరా నీ కొక సుద్ది చెవుల పండుగగాను
ఇప్పుడొకతె వెదకె నిండాఁకా నిన్ను" 19-432

**చెవులు చిల్లులగు:** ప.బం; అ.క్రి. వినడం దుర్భరమగు.

"చెప్పకువే వాని సుద్ది చెవులెల్లాఁ జిల్లు లయ్యీ" 9-102

## చే

**చేకట:** వి. హస్తభూషణవిశేషం.

"చేరి యాల పట్టేవు నా చేకట
యేరా యెంత లేదు నీ యేకట" 7-389

**చేగలమఱ్ఱి చెన్నుఁడు:** వి. కర్నూలు జిల్లాలో మండలకేంద్రమైన చాగలమఱ్ఱి గ్రామంలో వెలసిన చెన్నకేశవస్వామి. ఈ స్వామిపై అన్నమయ్య ఆరు కీర్తనలు చెప్పినాడు. చాగలమ్మ అనే గ్రామదేవత మూలంగా ఈ గ్రామానికి చాగలమఱ్ఱి అనే పేరు ఏర్పడిందని కథ.

"ఇచ్చలోనిదాన నేను ఇన్నిటా నీకు
గచ్చు లేమిటికిరా చాగలమఱ్ఱిచెన్నుఁడా" 19-162

**చేతకు చేత సేయు:** ప.బం; వి. మారుకు మారు చేయు.

"చేతకుఁ జేత సేసితే చిక్కు లెన్నైనాఁ గలవు" 18-91

**చేతలాఁడి:** (చేతలు + ఆఁడి) వి. చేయు ధాతువు భావార్థక కృదంత రూపమైన 'చేత' అనే శబ్దం బహువచన రూపమైన 'చేతలు'పై ఆఁడి ప్రత్యయం వచ్చి చేతలాడి అనే రూపం ఏర్పడుతుంది. 'చేతలు కల స్త్రీ' అని అర్థం. ఇట్లే వేసాలాఁడి అనే పదం కూడా.

"చేరి యంటుకొంటేనే చేతలాఁడి వైతివా

దారకాన దక్కఁ గొనఁ దగుఁగాక పతిని" 24-104

చేకట్టు: వి. చేతి ఆభరణం.
"అంచితపుఁ జేకట్లు హస్తముల ధరియించె
యెంచఁ జిగుళ్లుఁ దామర లెనసినట్లు" 18-138

చేకానిక: వి. చిన్న బహుమతి.
"ఆకెఱుఁగు నీవూ నెఱుఁగు దదియె మాట
చేకానిక నీకిమ్మనె చెలియ నన్నిపుడు" 7-112

చేకానికె: వి. చిన్నబహుమతి; 'కానికె' కానుకకు వ్యావహారికరూపం.
"చన్నులు నేల మోవ సాగిలి మొక్కి రావే
వున్నతిని చేకానికె వొద్దఁబెట్టి రావే" 7-215

చేకానుక: వి. చిరుకానుక.
"చెయ్యి చాఁచఁగదయ్య చేకానుకొకటి ఇచ్చే
ఆయ మెరిగెంత ముదమందేవో కాని" 7-216

చేకూడు: ప.బం; అ.క్రి. చేకూరు, సిద్ధించు.
"భామ నీ నోమిన నోము ఫలము చేకూడెను
ప్రేమతో నిన్నీతఁడు పెండ్లాడెను" 28-155

చేకొను: స.క్రి. 1. గ్రహించు 2. ఆదరించు 3. జయించు.
"చేకొని వెల్లా విరులు సేయఁగాక" 23-518

చేకొలదిది: (చేయి + కొలది + అది) వి. అందుబాటులో నున్నది.
"చేకొలఁదిదానఁ గాన సిగ్గులు పడితిఁగా" 16-345

చేగడియ: వి. చేతితో తీసుకోదగిన గడియ 11-176

చేగదేఱు: అ.క్రి. చేవదేరు, గడిదేరు.

చేగమీరు: అ.క్రి. చేవదేరు, గడిదేరు.
"చేగ మీరిన కోపము చెలులకుఁ జెల్లుఁగాక
భోగములో బిగువులు పురుషుల కేటికి" 16-204

చేగలమట్టి చెన్నుఁడు: వి. చూ: చాగలమట్టి చెన్నుడు.

చేచేత: (45) క్రి.విణ. స్వయంగా (పద.)
"చేచేతఁగూడి దయసేయవలెఁ గాక
చేరి నేఁ జేచేతఁ జేయని పాపమేది" 4-119

చేటకాళ్ల భూతము: వి. త్రివిక్రముడై మిక్కిలి పెద్దవైన అడుగులతో భూమ్యాకాశాలను ఆక్రమించిన భూతము. (వామనావతారము)
"కాళ్లు చేటకాళ్ల మించిన భూతము" 1-109

చేటకాళ్లు: వి. మిక్కిలి వెడల్పైన కాళ్లు.
"చేటకాళ్ల మించిన భూతము
పోటుదొరల పెద్దభూతము" 1-109

చేటవేలుపు: వి. చేటలో పెట్టి తిప్పుతూ ఆరాధించబడే దేవత.
"అరుదు నీ కింతైతే నందువొయ్యే పనులకు
వెరపుతోడఁ జేటవేలుపులఁ జూడరా" 11-212

చేడవెట్టు: బాగానీరుపెట్టు. సేఱు = బురద(త.)
"బొద్దుచెర్ల బొమ్మిరెడ్డి పొలమెల్లఁ జేడవెట్టి
గుడ్డనుండి పైరువిత్తి కాచుకుండఁగా" 4 అను. 41

చేతకము: వి. చాతకపక్షి; 'చా బదులు 'చే' ప్రయోగింపబడటం విలక్షణం.
"వానచేతకములవలె నాయ మనసు
పండుగాయ సేయఁబనిలేదు మనసు" 1-337

చేతన: వి. బుద్ధి.
"ఈతనిఁ గొలిచితేనే యిన్ని గొలలును దీరు
చేతనఁబెట్టు పుణ్యాలు చేరువనే కలుగు" 2-57

చేతనగు: ప.బం; అ.క్రి. చేయుటకు సమర్థుడగు, శక్తమగు.
"చేతనైతే మీరు పతిఁజేకొని లోఁగొనరాదా
ఘాతల నందరి సొంపు గానవచ్చీఁ గాని" 13-424

చేతనము: వి. చైతన్యం; ధర్మవాచకానికి బదులుగా ధర్మివాచకప్రయోగం విలక్షణం.
"ఆతుమలోనుండి యలరి నీ వొసఁగిన
చేతనమున నిన్ను జెలఁగి చేరనైతి" 1-31

చేతన్యము: వి. చైతన్యము; ఈ అర్థమున చేతన్యమనే పదం విలక్షణం.

"చేతన్యమీతనిది సృష్టి యీతని ఘటన
ఆతుమ శ్రీవేంకటేశుఁడంతర్యామి" 3-264

**చేతికబ్బు:** ప.బం; అ.క్రి. దొరకు.
"కొమెరవయసుదే చేతికబ్బెను కొంకనేమిటికి "
17-124

**చేతికి చేయే దిష్టము:** నానుడి; ద్రవ్యం మారకం వల్ల కలిగే నష్టం, వట్టం.
"చేసినట్టి చేతలెల్లా చేతికిఁ జేయేదిష్టము
యీతల నీ సన్నలింకా నేల సేసేవు " 27-147

**చేతికి వచ్చు:** ప.బం; అ.క్రి. వశమగు, లభించు.
"చింతించఁ జింతించఁ జేతికి వచ్చె మనసు
అంతలో శ్రీ వేంకటేశుఁడంది కాచెను " 4-219

**చేతిది:** (చేతి+అది) ప.బం; వి. చేతిలోనిది, అధీనమైనది.
"చలివాయ లాలించేది చనవులు చెల్లించేది
నెలకొని మన్నించేది నీ చేతి దీకను" 18-43

**చేతినిధానము:** ప.బం; వి. అందుబాటులో ఉన్న అమూల్య వస్తువు.
"చేతినిధానము శ్రీవేంకటపతి
యేతలఁజూచిన నిందరికి" 2-43

**చేతిపైఁడి:** ప.బం; వి. అందుబాటులో ఉన్న అమూల్యవస్తువు, కొంగుబంగారం వంటి పదం.
"వెక్కసానఁ జేతిపైఁడి వెలవెట్టి కొనవద్దు
చిక్కులెల్లాఁ బాపెటి సంజీవి వున్న దిదివో"
10-1-54

**చేతిమీఁద చేయివేసి చెప్పు:** ప.బం;స.క్రి. ప్రమాణం చేసి చెప్పు.
"చేతిమీఁదఁ జేయివేసి చెప్పె నీకుఁ బ్రియములు
నాతిరో నీ వితనితో నవ్వు నవ్వవే" 28-482

**చేతిమీఁదికి వచ్చు:** ప.బం; అ.క్రి. సమీపించు.
"చెప్పరాని నా చింత చేతిమీఁదికి వచ్చె
తప్పక నన్నేమి చూచి తడవేవయ్యా" 19-475

**చేతిమీద చేయివేయు:** ప.బం; అ.క్రి. ప్రమాణం చేయు.
"చేతిమీఁదఁ జేయివేసి చెలి నిన్ను మెచ్చి మెచ్చి
యేతులకు నవ్వు నవ్వె నేఁటికో కాని" 18-501

**చేతిలోనివాఁడు:** ప.బం; వి. అధీనంలో ఉన్నవాఁడు, వశంలో ఉన్నవాడు.
"అదన మన్నించఁగానే ఆసఁ జేచాఁచితిఁ గాక
చెదరక నాఁడే నాకుఁ జేతిలోనివాఁడవు" 3-269

**చేతిలో నుండు:** అ.క్రి; ప.బం. సులభంగా లభించు, స్వాధీనమై ఉండు.
"యీతల నేర్పరులకు నిందే యిహపరములు
చేతిలో నున్నవి యిది చింతించరో జనులు "
3-104

**చేతిలో మాణికము:** (3) ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్యవస్తువు, 'మాణిక్యము' నకు మాణికము వ్యావహారికరూపం.
"యీవేళ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చేవదేరిన వలపు చేతిలో మాణికము " 27-105

**చేతివాఁడు:** వి. అధీనుడు.
"యింతటి దైవమవు నిన్నింక నెందు వెదకేను
చెంత శరణాగతుల చేతివాఁడవు" 3-18

**చేతులొక్కరియందు చిత్తమొకరియందు:** నానుడి; మనసు ఒకచోట – చేత ఒకచోట.
"అతఁడెట్టు యిదియెట్టు అందరూ నెఱిఁగినదే
చేతులొక్కరియందు చిత్తమొకరియందు"
15-148

**చేతెడు:** విశే. చేయి ప్రమాణంకల.
"తనకు నాకెంత దవ్వు దగ్గరఁ జేతెడు గడ్డు
మొనసి నా కాలు దన్ను మోఁచె నసీని" 21-412

**చేదివ్వె:** వి. దీపం, కరదీపిక.
"చేదివ్వె తెచ్చిన నా చెలి చన్నులమీఁద
నా దెననేమో వా(వ్రా)సితి నౌనా వోయి"
26-334

**చేదీపము:** వి. చేతిలోని దీపం, కరదీపం.
"యేఁకట శ్రీవేంకటేశుఁడు వాపెను
చీఁకటి వాసెను చేదీప మేలే" 20-226

**చేనిపంట కోయిలకాలే చెప్పీ :** సామెత; పంటకోయగా భూమిపై మిగిలిన ధాన్యపు కళ్లిలను కొయిలకాలు అని అంటారు. తెలంగాణా ప్రాంతంలో వీటిని కొయ్యలు అని అంటారు. ఆ కొయిలకాలను గమనిస్తే చేనిలో ఎంత పంట పండిందో ఊహించుకోవచ్చునని భావం. అంటే ఒక వస్తువు కనబడకపోయినా దానికి సంబంధించిన మరో వస్తువుచే దాన్ని ఊహించడమన్నమాట.

"చేయారఁదన మేని చిన్నెలివె చేనిపంట
కోయిలకాలే చెప్పఁ గోప మేటికనవే" 26-139

**చేనిమ్మపండు :** ప.బం; వి. స్వాధీనంలో ఉన్నవాడు - ఉన్నది, వశంలో ఉన్నవాడు - ఉన్నది.

"క్రమ్మర నిదె వెంకటేశ నీ చే
నిమ్మపండైన నీ బంటు" 41-67

**చేపట్టుఁగుంచము :** (4) ప.బం; వి. (అభీష్టకామ ప్రదాయి అని ఆం.ప.ని "క్షోణిఁదెనుఁగున చేపట్టు కుంచమన, నభీష్టకామప్రదాయికి పేరు జెల్లె" 3-1-29) ఈ పదానికి శ.ర.లో ఎవ్వరేది కోరినను దానిని నెరవేర్చువాఁడు అనీ, సూ.ని.లో 'చేతిలోని కుంచము వంటివాడు, ఎవరేది కోరిన అది యిచ్చువాడు" అనీ చెప్పబడింది. శ.ర.కారుడు "చేపట్టు కుంచమక్షీణ రంగదభంగ శృంగారశాస్త్రి ప్రసంగలోలుఁడమ్మహారాజ దేవేంద్రుఁడుఁ చేపట్టుఁ గుంచమైన చెలువు నొకనిఁ జేపట్టి" అనే శు.స. (1. ఆ.) పద్యభాగాలను ఉదాహరించాయి. కాని దీపాల వారు తమ సాహిత్యసమీక్షలో ఈ పదం అర్థాన్ని గురించి ఈ కిందివిధంగా చర్చించినారు. "చేతిలోని కుంచము ఎవరేది కోరినా అది ఇచ్చునది కాదు. అట్టి గుణము దానికి లేదు కావున సూ.ని. చెప్పిన వ్యుత్పత్త్యర్థము సరియైనది కాదు. చేపట్టుకుంచము ను నుడికి చేతపట్టుకొనుట కనువైన (చేతిలో నిముడునట్టి) కుంచము, అని అవయవార్థము. ప్రాభవాదులచేత మహోన్నతుడయ్యును - సులభుడైనవాడు అని ఆ అర్థమునుబట్టి యేర్పడు భావము. అది యేలాగంటే - కుంచము ఆకారము చేత చాలా పెద్దది. అది శేరువలె చేతకరపునది కాదు. అంతేకాక ధనముగాని, ధాన్యముగాని విస్తారముగా పట్టునది. (14 శేర్లు = కుంచము) కావున మిక్కిలి బరువు కూడాను. అందువల్ల ఆకార విపులతచేత, ద్రవ్యభారముచేతను కూడా కుంచము చేపట్టున కందుట అసంభవము. అందెనేని ఆశ్చర్యజనకమును, ఆనందదాయము నగు విశేషము. అట్లే ప్రాభవాదులచేత నున్నతుడైనవాడు, ఆశ్రితులకు సులభుడగుట అరుదు. సులభుడయ్యేనేని అది గొప్పవిశేషము. ఆశ్రిత సులభుడైన మహారాజుకు - చేపట్టు కుంచముతో పోలిక. కాబట్టి సూ.ని. చెప్పిన అవయవార్థము, భావము గూడా తప్పే. చేపట్టుకుంచము - చేతిపట్టున ఇముడు కుంచము - (ఔపమ్యావాచకము) ఆశ్రిత సులభుడని భావము అని చెప్పుట ఒప్పు" ......... కనుక దీనికి వశుడు, సులభుడు అని అర్థం చెప్పడమే ఉచితం. వా.ని. ఈ అర్థాలనే చూపింది. అందుబాటులో ఉండి కోరిక తీర్చే అమూల్యవస్తువు. (వ్యు.) చేతికి లోనైన కొలపాత్ర, పరాధీనుడు ధ్వాయార్థము కావచ్చు. (సం.ప.స. 19నం.) ఎవరేది కోరినా దానిని నెరవేర్చు వాడు (?)

"చేపట్టుఁగుంచమవై చేరి ఇట్టె నాతోను
కాఁపురము సేయవోయి గండికోటకేశవా"
18-367

**చేపట్టు :** ప.బం; వి. కొట్లాట, చేయి పట్టుకొని గుంజులాడడం.

"సరసాలు ముదిరితే సారెఁ జేపట్లకు వచ్చు
దొరలఁజేఁబట్టఁబోతే దూరు వచ్చును" 11-438

"చేపట్లు కావచ్చునా మీలో మీకు" అని క్షేత్రయ్య

**చేపట్టు :** ప.బం; స.క్రి. గ్రహించు, పెండ్లియాడు, అవలంబించు.

"చేపట్టి తీదీపులను చేయిదాఁకుఁ గాలుదాకు
ఆపె మాట మాటగానె ఆడరా నాతోను" 11-155

**చేపడు :** అ.క్రి. 1. దొరకు 2. అగు, కలుగు 3. వశమగు 4.పట్టువడు.

"చేపడిన మాత్రమున చేటులేని పదవుల
యేపున నెవ్వరున్నారో యెరుఁగరయ్యా" 3-134

**చేమకూర శైత్యాలు:** ప.బం; వి; బహు.
అసంభవాలు (పద.) పైకి తోచునదే కాని
అనుభవానికి వచ్చేది కాదు అని అర్థము
చెప్పుట సమంజసము. (వే.ఆ.మూ.)
తలమున్కలువలె, పూర్తిగా పనిలో దిగి అనే
అర్థంలో ప్రయోగించినట్లున్నది అని.
(సం.ప.స. 16 సం.)

"చెలువపు విషయాలు చేమకూర శైత్యాలు"
2-268

**చేమపూవు కడియాలు:** వి; బహు. ఒకరకపు
చేతికడియాలు.
"చేమపూవు కడియాల చేయి"
4 అను 20, 5-148

**చేమిరివెట్టు:** అ.క్రి. పాలలో తోడుపెట్టు.
"చెంతఁబంటెడు పాలలో నొక చల్లబొట్టు చేమిరి
వెట్టినట్టు
అంతటికిని శ్రీహరి శరణాగతి యది యొక్కటే
నాకు" 4-77

**చేముంచి:** ఈ పదం నిఘంటువుల్లో కానరాదు.
బుద్ధిపూర్వకంగా, నిజంగా, ప్రమాణంగా,
యథార్థంగా అనే అర్థంలో
ప్రయోగించినట్లున్నది. సత్యమును
ప్రమాణపూర్వకముగా వాక్రుచ్చ వలసినపుడు
సలసలకాగు నూనెలో చేతిని ముంచియు,
విషసర్పాదులున్న కుండలలో చేతి నుంచియు,
ఎఱ్ఱగా కాల్చిన యినుప కడ్డీలను చేతితో
ముట్టియు ప్రమాణము చేయుట ఆనాటి
ఆచారముగా తెలియుచున్నది. దానిమీద
చేముంచి = ప్రమాణము చేసి, సత్యముగా
అను నర్థమున ఈ ప్రయోగ మేర్పడినట్లున్నది"
అని శ్రీ వేటూరి ఆనందమూర్తిగారి
అభిప్రాయం. (సం.వా, పద. భాషా.వి, 449
పు.)

"కామాంధకారము నీకుఁ గన్నులఁ గప్పివున్నది
చేముంచి నీ వుద్దండానఁ జెనకవద్దా" 17-140
"చేముంచి గుత్తిలో వెలసిన రఘురామా" 3-499

"నా మనసే చక్కనైతే నాకుఁ బ్రత్యక్షము గావా
చేముంచి నేరమేమి చేసితినో కాక" 2-175

**చేముంచు:** ప.బం; అ.క్రి. అధీనంతప్పు,
చేయిదాటిపోవు.
"అడుగవే చేముంచే దెప్పుడో యిప్పుడో" 7-31
"ఏమే నమ్మితిఁ గదే యింకా నేల దాఁచేవు
చేముంచితివేమో నాకుఁ జెప్పేవే యీ కతలు"
23-24

"చూమరల రావని సొలసితి మింతే కాని
చేముంతు వనుచు సంతోసించితిమి నాఁడే"
29-404

**చేముట్టు:** (60) స.క్రి. చేయి వేయు, స్పృశించు,
చేతితో ముట్టు.
"చేముట్టి యాతని నీవే చెనకఁగరాదా" 18-546
"చేముట్టి సరసమాడి చెక్కునొక్కి వేడుఁకొందు
నేమముతో జొక్కించనేరను నేను" 28-592

**చేయార:** క్రి.విశ. చేతులార; తనివితీరా,
మనసార, కడుపార, కన్నులార వంటి
ప్రయోగం. మనఃస్ఫూర్తిగా.
"చేయార నీవే యింత సేసినవాఁడవు మరి"
13-403
"పాయమెల్ల సంసారముపాలే పడితిఁగాని
చేయార నీసేవ నేఁ జేసుట లేదు" 3-60
సోరార:
"ఏమని చేయార నీ బంటునని చెప్పుకొనేను"
10-9

**చేయి:** (3) 'చేయు' ధాతువుకు లోట్ మ.ప;
ఏ.వ. రూపమైన చేయుము అనడానికి
వ్యావహారికరూపం.
"వన్నెగా నీ సొమ్ము నీవు వలసినట్టు సేయు
ఎట్టు సేసినాఁజేయి యేమనఁగలను నిన్ను"
27-28

**చేయిచాచు:** ప.బం; అ.క్రి. ఒకరిని యాచించు,
వేకారు.
"పాయపుమదముతోడఁ బట్టి నేఁబెనఁగఁగాను

"సేయరాని పనులకు చేయిచాఁచేవు" 26-434

**చేయి చేసుకొను :** ప.బం; అ.క్రి. తన్ను, కొట్టు అని పద. కాని అన్నమయ్య చేతితో స్పృశించు, తట్టు అనే అర్థంలో వాడినట్లుగా కనిపిస్తుంది.

"చెనకి చేయి చేసుకొంటే సిగ్గుపడవలెనా"

20-151

**చేయిచ్చు :** (3) (చేయి + ఇచ్చు) ప.బం; అ.క్రి. ఆసరాయిచ్చు, సాయపడు . (పద.)

"నవ్వునవ్వి ఆపె దిక్కు
నాటఁగఁజూచేయప్పుడు
అవ్వల నీకుఁ జేయిచ్చి అండనుండనా"

16-170

**చేయి మీఁదగు :** ప.బం; అ.క్రి. తాను ఇచ్చేవాడగు.

"పాయక శ్రీవేంకటేశ పైకొని కూడితి నన్ను
చేయి మీఁదాయఁ బనులు సేయవయ్య
చేతలు" 27-218

**చేయిమీఁద చేయి వేయు :** ప.బం; అ.క్రి. స్పృశించు, తాకు .

"చేయిమీఁదఁ జేయివేసి చెక్కు నొక్కేవు విభుని
చాయల నాతఁడింతేసి చనవిచ్చెనా" 18-468

**చేయి మీఁదై వుండు :** ప.బం; అ.క్రి. చూ : చేయి మీఁదగు.

"యీరాయెడ శ్రీ వేంకటేశుఁడెరిగెనా మీ భావము
చేయి మీఁదై వున్నదాన చెలఁగరే ఇపుడు"

27-519

**చేయి ముంచి చేయు :** ప.బం. బుద్ధిపూర్వకంగా చేయు.

"చేయవలసినప్పుడే చేయి ముంచి చేసేఁగాక
యీయెడ నుండియుఁ బంతాలేలే నీకు"

11-160

**చేయిముంచు :** చేయికలుపు ?

"ముందే యెఱుఁగవలె మోచి వచ్చే పనులు
చెంది చేయిముంచితేను సిగ్గు లేద నుండును"

25-291

**చేయిముట్టు :** (?)

"నరులెల్లఁ జిక్కువడి చల్లు వెడలైన వివే
సిరుల నిన్నెంతాపె చేయిముట్టెనో" 11-401

**చేయివేయు :** (3) ప.బం; అ.క్రి. అనురాగంతో ప్రియురాలి పై చేయి విసరు.

"వెన్నెలబాయిటఁ జేయివేయఁగా నప్పటి నీకు
కన్నుల నే మొక్కనా కడుఁదమకమున" 19-49

**చేరఁడేసి కన్నులు :** వి; బహు. చేర అంటే కొద్దిగా వంచబడిన చేయి. ఆ ప్రమాణం కల కన్నులని అర్థం. చారెడు అని వ్యవహారం.

"చేరఁడేసి కన్నులఁ జెలి నిన్నుఁ జూచెను
కోరి నీకు వలచి ఇక్కువ నున్నది" 22-205

**చేరుగొండి :** వి. చెడ్డది, చేరివచ్చినది (వాచ.) తగులాటకత్తె (చి.ని.) అని శ.ర., చేరవచ్చిన భార్య (బ్రౌన్) 18-241

**చేరుగొండితనము :** వి. తగులాటము, కామసంబంధము, జారత్వము.

"చేరుగొండితనముల చెలిమికత్తె వాదువు
యీరు దియ్యఁ బేను వచ్చు నితఁడు నా
మగఁడు" 18-241

**చేరుముత్యాలు :** వి; బహు. హారంలోని ముత్యాలపేట లోని ముత్యాలు. (చేరు - హారము యొక్క పేట, సరము, క్రోవ - సూ.ని.)

"చేరువఁ గాఁగిటిలోనఁ జెమరించే నిది యేమె
చేరుముత్యాలు నిటునటుఁ జిందునట్లు" 9-120

**చేలపచ్చలు :** ప.బం; బహు. ఆకర్షకములు. చేలపచ్చదనాలు అని వాచ్యార్థం.

"అచ్చలాన నీవు చూపే ఆసలందరికిఁజేల
పచ్చ లాయ నిదివో నీ బయకారిచేతలు"

21-340

**చేలాగు :** (3) ప.బం; వి. చేయూత, చేయిచ్చి లాగుకొనుట కావచ్చు.

"కామధేనువు వచ్చె కనుఁగొనుటకై నీకు
శ్రీమహాదేవి నీ చేలాగు కదివో" 2-436

**చేవదేరు :** ప.బం; అ.క్రి. బలపడు, సత్వం కలదగు.

"ఆవటించి నాపై యాస లదేల పెట్టుకొనేవు
చేవదేరే నీ వలపు చిత్తజుఁడెరగఁడా" 29-9 అను
చేవల్లకు : (5) ప.బం. సమీపానికి, చేతివైపుకు.
"చేవల్లకు వచ్చి యాప చేరి విడె మియ్యఁగానే"
29-463
"నీవల్ల నింతేసి నివ్వెరగందితి
చేవల్లకు రావే చెప్పేను నేను" 23-174
చేసు : (4) 'చేయు' ధాతువు తద్ధర్మార్థక ఏ.వ.;
క్రియారూపం.
"యేమైనాఁ జేసునాపె
యెమ్మెలెరఁగని దాపె" 23-253
చేసుక : (2) 'చేసుకొని' అనడానికి
వ్యావహారికరూపం.
"చుట్టముఁ జేసుక తన్ను సుద్దులెల్లా నడిగితే
పెట్టుకుండె నెపాలంటా బీరాలెంచీనె" 8-230
చేసుకొంట : వి. చేసుకోవడం. (తలపోయుట,
పశ్చాత్తాప పడుట అని సంపా.)
"ఇంతలోనె యెచ్చరేది ఇంతలో మోసపోయేది
చెంత వలసినట్లు జేసుకొంట దేహికి" 3-349
చేసుకొను : ప.బం; స.క్రి. పెండ్లాడు.
"చేసుకొన్న రమణుఁడు చేతికి లోఁగాకుండితే
వేసరించి కొసరేది వీరిడి గాదా" 14-550
"చేసుకొన్నయట్టివాఁడు చెప్పినట్టే సేసుఁగాక
మూసిదాఁపిరము లేలే మొరఁగు లేలె" 11-90
చేసుకొన్న మగఁడు : (2) ప.బం; వి. తాళికట్టి
పెండ్లాడిన మగడు.
"చేసుకొన్న మగఁడవు చిత్తము కొలఁది ఇక
రాసికెక్కె నా పంతము రవ్వసేయ నేటికి"
20-355
చేసుట : వి. 'చేయుట'కు జానపద
వ్యావహారికరూపం.
"తన పుణ్యస్థలములు దైవము కొసఁగుట
పనివడి యతనిపై భక్తి చేసుట" 3-212
"చెప్పినట్టల్లా మరి చేసుట గాక" 12-164

చేసూటి : (5) వి. చెప్పినట్లుగా, చేతితోచేసే సంజ్ఞ,
చేతిగురి, చేతితో చూపించే లక్ష్యం.
"చేసూటి కెల్లా వచ్చి చెలగించవలెను" 16-442
"చేసూటికి లోనై చేతువుగాక" 14-580
చేసూటి మగఁడు : వి. చెప్పినట్లు వర్తించే
మగఁడు.
"సేసవెట్టి పెండ్లాడి చేరి నిన్నులమేల్మంగ
చేసూటి మగనిగాఁ జేసుకొనెను" 14-552

## చై

చైతన్యుఁడు : వి. చైతన్యం కలవాడు,
చైతన్యవంతుడు లేదా చేతనుడు అనేది
సాధురూపం.

## చొ

చొకటాలు : వి; బహు. 'సొగటాలు'కు రూపాం.
ఒక ఆట, పగడసాలాట.
"మంతనములే యాడితి మాపుదాఁకాఁదనతోను
వింతగాఁ జొకటాలాడి వేగించితి" 23-28
చొక్కిలి : వి. చొట్ట, నొక్కు.
"మొలకల నవ్వులు మొక్కిళ్ళు
సొలపుల వేడుకలు చొక్కిళ్ళు" 28-419
చొక్కుఁదనము : వి. పారవశ్యం, మోహం.
"జోడుజోడు గూడదాయ చొక్కుఁదనము
మానదాయ" 1-186
చొక్కుమందు : వి. మత్తుమందు.
"కందువమై చమరించి గందవొడి చల్లుకొని
పొంద నిన్నుఁ దలఁచితిరా – వెంకటేశా!
అంది చొక్కు మందులాయిరా" 7-223
చొతుకు : వి. 'చొదుగు'కు రూపాం. చెమ్మ, తడి.
"తటుకున లోలోఁదనువు లంటఁగా
జొట జొటఁ జెమటలు చొతుకులాయ" 18-554
చొదుకు : వి. చూ : చొతుకు.
"పొదలిన వీడెపుఁబుక్కిళ్ళ తమ
చొదుకుక చెమటల చొక్కిళ్ళ" 5-31
చొప్పువేయు : (?)

"కొప్పువిరులు రాలఁగ కొమ్మ నీతోడఁ బెనఁగి
చొప్పువేసె నీవు దన సొమ్ముగాను" 12-427

## చో

**చోటుచేయు:** ప.బం; అ.క్రి. స్థానమిచ్చు.
4-157 old

**చోడుముట్టు:** స.క్రి; అ.క్రి. వ్యాపించు, నసాళమునంటు.
"వీడియు వీడని తురుములోని విరులు వెల్లనె రాలఁగాను
చోడుముట్టుచు వీనుల జవ్వాది సొరిది జారఁగా" 27-589

## చౌ

**చౌక:** వి. చులకతనం, తిరస్కారం, లాఘవం.
"కైకొని యీ మాయలు నీ కల్పితమై వుండఁగాను
చౌక లేకనే వేరే సంకల్పించితిని" 1-427

**చౌకళించు:** స.క్రి. కుప్పించు.
"సందడిలోపలనే సంగడి దేరులు నిల్పి
కందువతో చౌకళించి కాగలించేరు" 18-138

## ఛా

**ఛాంగుభళా:** అవ్య. ప్రశంసార్థకం, ఛాంగురే, బాపురే.
"చక్కని తల్లికి ఛాంగుభళా
చక్కెరమోవికి ఛాంగుభళా" 5-10

**ఛాయాపహారము:** వి. పూర్వకవుల కవితల్లోని భావాన్ని యథాతథంగా అపహరించడం. నీడను దొంగిలించడం అని వాచ్యార్థం.
"అమరఁగ ఛాయాపహారము నేసుక
తమ మాట గూర్చితే దైవము నగడా" 2-494

## ఛి

**ఛిన్నభిన్నము:** విణ. చెల్లాచెదరైనది.
"ఆతురాన గొరశరాయడికి నోపఁగలేరు
చేతిగోరు మీటితేనే ఛిన్నభిన్నమవుదురు"
3-186

## జ

**జంకె:** వి. జంకెన, బెదరింపు, కోపంతో కూడిన చూపు.
"జంకెలు బొమ్మలఁగాని చలములోపల లేదు
వంకలు దీరుచవయ్యా వడిఁగురులు" 20-532

**జంకెన:** వి. బెదరింపు.
"సరసము నెరిచితే జంకెనలైనా సుఖమే
తరితీపు లెరిఁగిన తరుణులకు" 21-22
"పొందినదాఁకా నింతే పొరపొచ్చము లెల్లాను
సందుసుడి నీ కేలే జంకెనలు" 21-23

**జంకెనచూపు:** వి. బెదరింపుచూపు.
"జంకెనచూపులు సరసపుమాటలు
లంకెలఁ బెట్టీ లలితాంగి" 16-388

**జంకెనబొమ్మ:** వి. బెదరింపు కనుబొమ, కోపం ప్రకటించే కనుబొమ.
"సన్నలనే యాసరేచి జంకెనబొమ్మలు వంచి
అన్నువతోఁ గొసరీని అలమేలుమంగ" 7-21

**జంగ:** వి. పాదం, పంగ, పిక్క, తొడ, అశ్వప్లుతగతి విశేషం.
"పసలుగా జంగవెట్టి పండ్లగుత్తి చేతఁబట్టి
అసురల నెల్లఁగొట్టీ హనుమంతుఁడు" 4-272

**జంగాళము:** వి. నిడువాటు. (శ.ర.)
"జంగాళమై చేలఁదూగి జడిగొనీఁ జెమటలు
చెంగట నెచ్చరికగాఁ జెప్పరే చెలులు" 17-398

**జంగిలి:** వి. స్వల్పబుద్ధి అని సూ.ని., సమూహ సామాన్యమని కన్నడం. మోటుది, అనాగరికం, గోసమూహం, పశువులమంద, మృగసమూహం.
"జంగిలికేల తెచ్చేవు సొరెకు నీవూ మా
ముంగిటికి వచ్చితే నే మొక్కులు మొక్కేము"
20-8
"జంగిలిలో నీతోడ సరసము నాడీఁగాక
అంగమంటి ఇంతసేయ నరుహమా ఇతఁడు"
27-135
"పెనఁగి జంగిలిలోనఁ జేరుకొనవలెనని

వొనర నొక్కతె నీ పురమెక్కె నిదిగో" 13-62
"జంగిలిలోనే నిన్ను చండి సేతునా" 13-116

**జంగిలికడుపు:** వి. అల్పపుకడుపు.
"సరసములాడితేను జంగిలికడుపులోన
దొరలితే నది కడుదోసమనీ సుమ్మీ" 8-249

**జంగిలికాంత:** వి; గొల్లస్త్రీ.
"జంగిలికాంతల నెల్లా సంగతులెంచక నీవు
యెంగిలి సేసేవు మోవి యేకముగాను" 7-185

**జంగిలికృష్ణుడు:** వి. ఆలమందలోని కృష్ణుడు.
"పాలు దనపైఁ గారఁగా పడఁతులు నవ్వఁగాను
గేలికి లోనాయను జంగిలికృష్ణుఁడు" 9-173

**జంగిలికొసరులు:** వి; బహు. గొల్లకొసరులు.
"అంగమాయ శ్రీవేంకటాధిపతి ఇందువంక
జంగిలికొసరులెల్ల చాలుఁజాలు నీకను"
27-301

**జంగిలిగా:** (3) మోటుగా.
"అంగన వొకతెటు నీవాసపడి పెనఁగఁగా
జంగిలిగా వేరొక్కతె కొంగువట్టీని" 25-466
"కొంగువట్టుకొని నిన్ను గొసరితినంటాను
జంగిలిగా దూరి యేల సాధించీని" 23-406

**జంగిలిగోపికలు:** వి; బహు. ఆలమందలోని గోపికలు.
"జంగిలిగోపికల సంగాతాలు నీకు
సంగడి బండికండ్లాయ సంగాతాలు" 22-138

**జంగిలితిట్టు:** వి. మోటుతిట్టు, క్రూరంగా తిట్టే తిట్టు.
"కొంగువట్టి తియ్యఁగాను కోపగించి నే నిన్ను
జంగిలితిట్టు దిట్టితే సంతోసమా నీకు" 25-176

**జంగిలిదూరులు:** వి; బహు. అల్పపునిందలు.
"జంగిలిదూరులు దూర జంకెనబొమ్మలు చూపి
వెంగెములనే సడివేసేము నేము" 19-185

**జంగిలిపదారువేలు:** పదహారువేల గోపికలు.
"జంగిలి పదారువేలు చనవిత్తురా" 20-485

**జంగిలిమనుజుఁడు:** వి. అల్పమానవుఁడు.
"జంగిలిమనుజునకు సరుసఁబాప మే చవి
అంగవించవలదంటే నగ్గలమౌను" 3-290

**జంగిలిమాయలు:** వి; బహు.
అల్పపుమాయలు.
"జంగిలిమాయలు సేసి జట్టిగొన (నె?) నిన్ను నాపి
కంగువెట్టుకోము నేము గరితెలము" 27-285

**జంగిలివలపులు:** వి; బహు. సమూహంలోని ప్రేమలు. (జంగిలి = సమూహం)
"సంగడిజాణతనాలు సతులెల్ల నాడఁగాను
జంగిలివలపు లేల చల్ల వచ్చేవు" 11-3

**జంగిలివాఁడు:** వి. పశువుల కాపరి, గొల్లవాడు. (అల్పుడు)
"వూరి పసులను మేపి వొప్పగించి యిండ్లకు
చేరి జంగిలివాఁడు నిశ్చింతుడై వుండు" 15-424

**జంగిలివిడేలు:** వి; బహు. (?)
"సరుసఁ గూచుండేఁగాని జంగిలివిడేలలోన
వొరిమెకుఁ జేయి చాఁచ నోపరా నేను" 11-214

**జంగిలివేసాలు:** వి. అల్పపు నటనలు.
"సంగతిగా మొక్కనా సరసము లాడనా
జంగిలి వేసాలిటు చల్లేవు గాక" 25-264
"సంగతిఁ గొప్పేల వీడె సతిచేయి దాఁకకుంటే
జంగిలివేసాలు నాతో చవిగాదు నీవు" 20-24

**జంగిలిసటలు:** వి; బహు. అల్పపుమోసాలు.
"అంగడిఁబడెను వాదు లతివకు నీకుఁబోదు
జంగిలిసటలు మాతోఁ జాలు రారాదా" 26-177

**జంగిలిసతులు:** (6) వి; బహు. గొల్లెతలు, గోపికలు.
"జంగిలిసతుల నీవు సారెసారె మెప్పించగా
అంగడిఁబడీనవె నీ అన్నమాటలు" 8-151

**జంగిలిసరసములు:** వి; బహు.
మోటుసరసములు, అల్పపు సరసములు, గుంపులోని సరసాలు.
"కొంగువట్టి తియ్యకువే గురిగా నీవు
జంగిలిసరసములు చవి పుట్టీనా" 25-200

**జంగిలిసవతులు:** వి; బహు. అల్పపుసవతులు.
"వుంగరాలు నాకు నిచ్చి వొడఁబరతచితి వంటా
జంగిలిసవతులకు సరి నెచ్చరించీని" 13-155

**జంటఁగర్మములు:** (?)
"అద్దము లోపలినీడలు అందరి
దేహపురూపులు
చద్దికి వండిన వంటలు జంటఁగర్మములు"
2-133

**జంటచవులు:** వి; బహు. దాంపత్యపు రుచులు, సంభోగములు, రెట్టిరపైన రుచులు.
"జంటచవులు పుట్టించి చనవు లిప్పించితివి
ఇంటనే సంతోష మిచ్చే నేమి సేతునే" 14-49

**జంటలుసేయు:** (?)
"అరసి శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
సారె నన్నేలి యాపెను జంటలుసేసేవు" 24-262

**జంతతనము:** వి. గయ్యాళితనం, దుష్టత్వం.
"సంతడిగితే నాపెకు జంతతనమౌను"
24-253, 28-142 & 29-45

**జంతమాటలు:** వి; బహు. గయ్యాళిమాటలు, అంకులాడి మాటలు.

**జంధ్య(ద్య)ము:** వి. జందెము.
"కుచ్చివాని పేగులు జంధ్యములుగ
విచ్చి వేసుకొనె విష్ణుసింహము" 3-239

**జంధ్యా(ద్యా)లు:** (3) వి; బహు. జందెములు అనడానికి వ్యావహారికరూపం.
"పేగుల జంద్యాలు వేసి పెంచపు నమలిపురి
పాగఁగాఁ జుట్టిన నా బాఁపనయ్య వీఁడివో"
5-254
"వెక్కసపు జంధ్యాలుగా వేసుకొన్నాఁడు"
(4-505)
అనే పాదంలో జంధ్యాలు అనే ప్రయోగం కనిపిస్తుంది.

**జంపు:** (1) వి. ఆలస్యం, జాగు, తూగు, నిద్రమత్తు.
"యింపులు నెఱఁగము యెగ్గులు నెఱఁగము
జంపులనిదురే సకలసౌఖ్యము" 2-465
ఆలస్యం, జాగు:
"ఘనుఁడ శ్రీవేంకటేశ కలిసితి మింతలోనె
చనవుల రతులలో జంపులు మరున్నవా"
7-260
"జంపు సేయక చెప్పరే సతులు మాకిపుడు"
13-152
"సరసమాడే యప్పుడు జంపులకు పని లేదు"
26-395
సంభాషణలు:
"వట్టి జంపులీఁక మాతో వద్దు వద్దయ్యా" 29-51
అనుశాసనం, ఆజ్ఞ:
"చలము సాదించితివా జంపులు నడపితివా
నలువంకఁ జూచి యేల నవ్వులు నవ్వీనే"
25-40

**జంపు:** విణ. స్నిగ్ధం, నున్ననిది.
"జంపైన గుబ్బలనొత్తే సాదించి నేఁ దనుదూర
నింటికాడ నన్నుఁగూడె నిట్టె కానీవే" 14-478

**జంపుగొల్లెత:** వి. నిద్రమత్తు గల గొల్లెత, ఆలస్యం చేసే గొల్లెత. 6-113

**జంపువలపు బేరము:** ప.బం; వి. కాలహరణం చేసే ప్రేమ వ్యవహారం. 5-145

**జక్కవకుచ:** వి. చక్రవాకాలవంటి కుచములు గలది.
"జక్కవకుచ గనక సరిఁదాపరవి మేలు
నిక్కి వెల్లని మేని వెన్నెలఁ గూడదు" 24-120

**జగడగాఁడు:** (జగడము + కాఁడు) వి. కలహశీలుడు, జగడాలమారి.
"తగవులేమి కెదిరి ధనమే తన సొమ్ము
జగడగానికి విరసమే కూడు" 2-63

**జగడపు చనవులు:** వి; బహు. ప్రణయకలహాలు.
5-274

**జగడాలగంప:** ప.బం; వి. రచ్చలాడు వ్యక్తి.
4-105

**జగడించు:** (25) అ.క్రి. కలహించు, జగడమాడు.

"జగడించవద్దు గాక చనవు గలుగుచోట
సిగము చూపులు చూచి సాదించరాదా" 21-171

జగద్ద్రోహి: వి. గొప్పద్రోహి.

"అరయ జగద్ద్రోహి నౌదు నైనా నీ నామము
గరిమె నుచ్చరించగఁ గరఁగకపోదు" 1-501

జగవీరుడు: వి. "వీరాధివీర బిరుదముండినా అనాథ వలె ఆక్రోశించువాడు" అని వద. కాని ఈ అర్థము అన్నమయ్య ప్రయోగంలో యుక్తంగా కనిపించదు. సమర్థురాలు, నిశ్చితము కలది, గొప్ప శూరురాలు.

"అక్క వచన్నుల జగవీరుదా
మొక్కఁగదవే మొగనికి నీవుదు" 29-306

జజ్జరించు: అ.క్రి. భయపడు, 'దద్దరిల్లు' కు వ్యావహారికరూపం కావచ్చు.

"దండి శ్రీవేంకటపతి దాడి ముట్టి సదియది
బండుబండై జజ్జరించి పారరో దైతేయులు" 2-79

జట్టి: 1.బేరం 2.ధనాది నిమిత్తమైన జగడం. (జట్టి= బానిస. నీ.శ.21)

"జట్టిఁదన దండనల్లా సంసారమై చూపు" 4-244

"జట్టి మిమ్ము ధ్యానించి సాయుజ్యమందుట కంటే
అట్టే నీ నామఫల మందు టెక్కుడు" 2-483

జట్టి: వి. 'జెట్టి'కి వికృతిరూపం కావచ్చు. శ్రేష్ఠుడు.

"జట్టి శ్రీ వేంకటేశుఁడు శరణంటేనే కాచె
యిట్టె యింతటివారు యెవ్వరును లేరు" 3-344

జట్టికాఁడు: (జట్టి + కాఁడు) వి. 'జెట్టికాడు' కు వికృతి పదం కావచ్చు. జెట్టి (శ్రేష్ఠుడు) శబ్దంపై స్వార్థంలో 'కా' ప్రత్యయం.

"దిట్టవు శ్రీవేంకటేశ తెగువింత లేకుండితే
జట్టికాఁడ నీకు నేను సతమవుదునా" 24-110

జట్టికాఁడు: వి. 1.వర్తకుడు (2.కొనేవాడు 3. ఓడనడిపేవాడు 4. జూడమాడేవాడు)

"పెద్దరికాలాకె తోడ బెరయించేవా వోరి
చద్దివలపుబేరాల జట్టికాఁడ రారా" 5-145

జట్టిగా: క్రి.విఙ. సాటిగా, సమానంగా. (తె.తె.ని.)

"జట్టిగాఁ గౌగిటఁ గూడి సమరతిఁ గొసరితే
తిట్టులు తిట్టుదురా తెఱవలను" 27-67

"జట్టిగా మీ ముందరను సరివిడేలు వెట్టితే
నట్టనడుమ నూరకె నవ్వు నవ్వేవేమే" 26-584

జట్టిగొను: (44) స.క్రి. వశపఱచుకొను.

"పాయపు మదములేల పచారించేవు
దాయలా సన్నలా నిట్టి జట్టిగొనరాదా" 19-217

"జట్టిగొన్న దాసులకు శాంతసింహము
పట్టపు శ్రీవేంకట యోభళనారసింహము"
4-415

"చల్లని మాటలాడి జట్టిగొనవలెఁగాక
చెల్లుబడి గలదంటా చెనకుదురా" 27-55

జట్టిబేరగాఁడు: వి. వెలయిచ్చి సరుకులు కొనే బేరగాడు, గుత్త వ్యాపారస్థుడు.

"ఇట్టె కూడినందుకును యిచ్చగించవలెఁగాక
జట్టిబేరగానివలె సటలేఁటికే" 8-96

జడధిలోపలి యీఁత: వ.బం; వి. అసాధ్యమైన పని, ప్రమాదకరం.

"సరిబెట్ట గటకటా సంసారము చూడ
జడధిలోపలి యీఁత సంసారము" 1-199

జడను: వి. జాడ్యం, సోమరితనం.

"పాలిపడి నిన్నుఁజేరి పట్టి కొలచినవారి
జాలిపాటు తొలగించి జడనువాపి" 4-328

జడల బింకపుభూతము: వి. తండ్రి ఆజ్ఞచే అరణ్యవాసంలో జడలు దాల్చిన వీరుడైన రాముడు.

"గాటపుజడల బింకపుభూతము" 1-109

జడిగొను: అ.క్రి. అతిశయించు, ఎక్కువగు, నిరంతరమగు

"జడిగొన్న రతులలో సరసము లాడితేను
వెడవెడగాఁ గొంకే వెగటా యిది" 25-355

జడియు: అ.క్రి. ప్రకటమగు.

"కడుఁబుణ్యాలను పాపకర్మలను సరిగావ

జడియు శ్రీవేంకటేశ్వరు నామమొకటే" 2-1

**జడివట్టు:** అ.క్రి. ముసురుపట్టు. (పట్టుపట్టు) (పద.)

"జవ్వనము తతివచ్చె జడివట్టు నవ్వులెల్లా" 20-571

"వలచిన వలపులు వడియుచుఁ జెక్కులను
జలజలఁ జెమటలై జడివట్టె నదివో" 7-319

**జడ్డు:** (3) వి. 1. జడను, అలసత, మాంద్యం 2. కష్టం, బాధ 3. తగులం, అనుబంధం 4. పారవశ్యం, తగులం.

"జిడ్డు లేని జీవాత్మ సర్వసమమే" 15-48

**జడ్డుపడు:** అ.క్రి. జడతనొందు, మాంద్యమునొందు.

"వొడ్డుకోఁగా నీ వేల వూరకే కాఁగలించేవు
జడ్డుపడీఁ దమకము సటలేఁటి కసనా" 21-168

**జడ్డువాఁడు:** వి. సోమరి, జడుడు, మందుడు.

"పాయపుమద మెవ్వతె పంచనుండెనే యిన్నాళ్ళు
చాయలు నన్నెరఁగని జడ్డువాఁడు తాను" 8-159

**జత్తాఇత్తమగు:** అ.క్రి. సిద్ధమగు (పద.) వ్యు.

"జత్తాఇత్తమై యుండరే సకియలాల
చిత్తముగా నూడిగాలు సేయరే యిందరును" 52-242

**జన్నె:** వి. దేవతాకార్యనియమం, నియమం (సూ.ని.) (నోము, వ్రతం) ముడుపు.
1. దేవతాదులనుద్దేశించి యథేచ్ఛగా విడిచిన ఆవు లేక ఎద్దు. 2. దేవతాదులను ఉద్దేశించి ఎత్తి ఉంచిన స్వేచ్ఛానువర్తిని యైన వస్తువు. 3.నియమం.

**జన్నెపట్టుకొను:** వ.బం; అ.క్రి. మీదుకట్టు, నియమంగా ఉండు, దేవతాదులనుద్దేశించి యేదోనొక వస్తువును నెత్తియుండుంచు.

"పలచని మోవి జన్నెపట్టుకున్నది" 26-359

"సంతతము నా వయసు జన్నెపట్టితి నీకు
యెంతైనా నా విన్నప మీడేరించవయ్యా" 9-270

"జవ్వాది యెత్తినది తన
జవ్వనమే జన్నెపట్టినది" 5-316

**జమళి:** వి. జంట, కవ.

"అమరుల జన్మములు నసురల జన్మములు
జమళిఁబుట్టినంతలో సరియౌనా" 2-44

**జమళిపాన్పు:** వి. జంటపాన్పు, ఇద్దరు పడుకోవడానికి వీలైన పాన్పు, Double Bed.

"జమళిపాన్పు మీద సరసాన నాపె నన్ను
దమి రేచిననాఁడు తాఁ గాదా" 26-558

**జమునోరిలో బ్రదుకు:** వ.బం; వి. ప్రమాదకరం.

"జమునోరిలో బ్రదుకు సంసారము - చూడ
చమురు దీసిన దివ్వె సంసారము" 1-199

**జయంతి:** వి. పుట్టినరోజు.

"పురాణపురుషుఁడు భువి నవతరించెను
సిరుల జయంతి నేఁడు సేయరో పండుగలు" 12-383

**జయలిడు:** వ.బం; అ.క్రి. జయజయధ్వానాలు చేయు.

"మొక్కరే మొక్కరే మీరు ముందే జయలిడి
దక్కి శ్రీవేంకటేశుఁడే తానైన దేవునికి" 2-379

**జయలువెట్టు:** వ.బం; అ.క్రి. జేజేలు పలుకు.

"సంతతము నందరును జయలువెట్టగ నీకు
కాంతలిక వేరి నిమ్నోఁ గాదనేరా" 8-286

**జయవెట్టు:** జేజేలు పలుకు.

**జరపు:** వి; బహు. కాలయాపనం, కాలం గడపటం.

"పాయపువారమట పండి పొల్లవోయినా
చాయల మెలఁగవోయి జరపు లేమిటికి?" 20-587

"జరపులనే పొద్దువోయ" 19-108

**జరపులఁబెట్టు:** (?)

"గురుతైసేవ సేసేము కుచములు గట్టు
జరపులఁబెట్ట కిక సతినైతి నీకును" 19-249

"ఆసపడ్డవారిని అలయింతురా
పోసరించి యేల జరపులఁబెట్టే వీఁకను" 19-108

**జరయు:** స.క్రి. కూడు, చేరు (?)

"ఎన్నెన్ని మేళ్ళు గలవో యింకా నాపెవల్ల
సన్నసేసి యేకతాన జరయవయ్యా" 23-328

**జఱ(ర)యు:** (35) స.క్రి. నిందించు, సమీపించు, వాగు, అధికంగా మాట్లాడు అని జాస్తి. ఈ పదం జరయు, జఱయు అని రెండు రూపాల్లో ప్రయుక్తం. ఇది ఏ నిఘంటువులోనూ కానరాదు. బండి ఱా తో గూడిన ఈ అర్థంలోనే జఱి, జఱె అనే కన్నడ ధాతువు ఉందని సం.వి.స. (13 వా.) లో చెప్పబడింది. ఈ అర్థం అన్ని ప్రయోగాల్లో కుదరటంలేదు. ముసలియగు అనే అర్థం కొన్నిచోట్ల కుదురుతుందా? నీతి శతకంలో ముసలియగు అనే అర్థంలో జరయుధాతురూపమైన 'జరసి' ప్రయోగింపబడింది. దీనికి రాయు అనే అర్థం కూడా చెప్పవచ్చు.

"గుట్టున నీ వాకిటవద్దఁ గూమండఁగా నెచ్చరించి
అట్టుగాఁ జన్నులనే జఱసీ నొకతె" 18-425

"జరసి పతివ్రతాజనకాముఁడు గాక
వాడిమిన గరఁగొండీడు గాక" (9 ప.)

"యెఱుఁగడా తా నేమైనా యేల నన్ను జరసీని
మెఱసీ తన గుణాలు మెచ్చుకొందుఁగాకా" 12-277

"తమకించి పైకొంటేఁ దప్పులు వెదకరాదు
సముకానఁ గొసరితే జరయరాదు" 26-500

**జఱయు:**

"జఱయుచు వచ్చి వచ్చి చనవులెల్లా నొసఁగి
మెఱసి తొరలనాడీ మఱేమందు నీకను" 13-530

**జఱపు:** వి. (?)

"మఱవకురా నీ మాటలు యీ
జఱపులలోనే సరి చూపేను" 24-12

**జఱపులఁబెట్టు:** (?)

"జఱపులఁబెట్టఁగానే సరివొద్దులాయను
మఱి పచ్చడము గప్పి మన్నించరా" 23-495

**జలజపువదన:** వి. పద్మముఖి, విలక్షణసమాసం.

"జలజపువదనకు చాయలకన్నులు
జలజపురేకులు సహజములే" 7-298

**జలజముపేరిట సతి:** వి. పద్మావతీదేవి. జలజము (పద్మము) పేరుగల సతి అని వ్యుత్పత్తి.

"బలిమి మరుని పేరి పండు చేఁబట్టి
జలజముపేరిటి సతి నిన్నుఁజూచె" 10-2-117

**జలధిలో వానలు:** ప.బం; వి; బహు. వ్యర్థమైనవి. సముద్రంలో పడే వానలు వ్యర్థమే కదా!

"శిరలి మీఁద మిక్కిలి నీ సేవలు
వరుస జలధిలో వానలు" 3-403

**జలపూఁత బంగారు:** ప.బం; వి.అశాశ్వతం (పోతబంగారం, పూతగా పూసిన పూసిన బంగారం ఎప్పటికీ ఉండదు కదా!) వెండి - బంగారముల నీటి మొలాము. రూపాం. జలపోతబంగారు.

"చలువలోపలి వేడి సంసారము – చూడ
జలపూఁతబంగారు సంసారము" 1-199

**జలపోత:** వి. స్వర్ణలేహ్యము.

**జలములోనున్న చంద్రుని నీడ:** ప.బం;వి. చంచలం.

**జలసూత్రపువాడు:** వి. ధారాయంత్రం నడిపేవాడు, అటూ ఇటూ నీరు రావడానికి రెండు బానలలోనికీ వదలిన తాడు గలవాడు.

"జడిగొని మొదలఁ దా జలసూత్రపువాఁడు
వెడమాయలుగ బారివిద్యలవాఁడు" 4-352

**జలుకు:** వి. 'అలుకు'కు జంటపదంలో వాడినపదం.

"అలుకేది జలుకేది ఆకె యింటనున్న నన్ను
సొలసి చూచిన మారు చూఁడనా నేను" 9-32

**జల్లి:** వి. 1. సవరము 2. చామరము 3. కర్ణాభరణవిశేషం 4.జాలరు 5. కొప్పుపై నుంచుకొను ఆభరణవిశేషం 6.చమరమృగము 7. కుచ్చు 8. తోకకుచ్చు.

"మించిన జల్లి యొకటి మీఁద నుండు దొడ్డవెల్ల
చంచుల సన్నములెల్లా సందులఁగారు" 4-267

**జల్లెడలో పోకలు :** ప.బం; వి; బహు. స్థిరంగా, స్పష్టంగా కనిపించేవి.

"జల్లెడలో పోకలు మా సంగాతాలు
యెల్లవారు నెఱిఁగిరి యీ సంగాతాలు" 22-138

**జవకట్టు(కొను) :** అ.క్రి. జతపఱచు, కూర్చు, పొదుగుకొను, స్వాధీనం కావించుకొను, భద్రపరచుకొను.

"భవరోగములు వీడి పారఁగఁ బెద్దలు మున్ను
జవకట్టికొనిన నిచ్చలమైన మందు" 1-237

**జవళిన్ :** (23) వి. 'జమలి'కి రూపాం.జంటగా, జమలిగా.

"జవళిఁజన్నుమొనలు సారె సారెఁదాఁకఁగాను"
22-355

**జవ్వనగర్వము :** వి. యౌవనగర్వం. విలక్షణ సమాసం. 5-54

**జవ్వనధర్మము :** వి. యౌవనధర్మం.

"యెప్పుడు జవ్వనధర్మ మెఱఁగనివాఁడవా"
27-444

**జవ్వనపాయపు సతి :** యౌవనవయస్సులో నున్న స్త్రీ.

"జవ్వనపాయపు సతి చలము సాదించితేను
యెవ్వరు బుద్ధులు సెప్పేరింక మరి" 7-448

**జవ్వనపాయము :** వి. యౌవనవయస్సు.

"జవ్వనపాయముతోడ జారినతురుముతోడ
యెవ్వతెనో కూడివచ్చి యీడనున్నాఁడే"
29-193

**జవ్వనపుఁబోడి :** వి. 'జవ్వనపు పోడిమి' కావచ్చు. పోడిమిలోని 'మి' వర్ణానికి సమాసంలో లోపం.

"నవ్వుల ముత్యాలు రాలీ నలినాక్షిచేతలను
జవ్వనపుఁబోడి చిందీ చన్నుఁగవను" 28-3

**జవ్వనపువాఁడు :** (3) వి. యౌవనంలో ఉన్నవాడు.

"జవ్వనపువాఁడవు నీ సరివారము నేము
దవ్వులనుండి మొక్కితే దగ్గరఁ బిలిచేవు"
11-499

**జవ్వనభారము :** (2) వి. యౌవనభారము - వింత సమాసం.

"తిన్నని నా మోవినిండా తేనెలే పూరించితివి
పన్నిన నా జవ్వనభారమెల్లా నీది" 24-307

**జవ్వనభావము :** వి. యౌవనభావం.

"జలజవదన మేని జవ్వనభావాలు సోకి
పొలుపొంద నీ బొడ్డు పూవక పూచెను" 7-82

**జవ్వనమదము :** (15) వి.యౌవనమదం. విలక్షణసమాసం.

"చెలియకుఁ జెమటలు చెక్కులఁ గారీ
మలయుచు జవ్వనమదమువలె" 28-400

**జవ్వనసామ్రాజ్యము :** వి. యౌవన సామ్రాజ్యం.

"కొప్పు దువ్వి నీవు కొనగోరు సోకించితేను
అప్పుడే జవ్వనసామ్రాజ్యము చెలరేఁగెనూ"
12-102

**జవ్వాదివంకి :** వి. జవ్వాదితిత్తి.

"పక్కన నాతఁడు నవ్వీ భావించి చూడవమ్మా
చక్కని చంద్రవదన జవ్వాదివంకి" 29-159

## జా

**జాగు :** వి. ఆలస్యం, జంపు.

"ఈ గతి శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితి నీ
జాగులు చుప్పనాతికే చల్లి చూపరాదా" 20-592

**జాజర :** వి. ఒకరకం పాటలో వాడబడే ఊతపదం, జాజర అనే ఊతపదం కల ఒకరకపు జానపద గేయం.

"జగడపుఁజనవుల జాజర
సగినలమంచపు జాజర" 5-274

"చల్లువలపులచేత జాజరకాడేవారము
వుల్లము గరఁగ నిన్ను నొరసేటి వారమా"
24-413

**జాజర :** (2) వి. 1. వంచన 2. హోళీనాడు జరిగే రంగుల ఉత్సవం.

"నిలుచున్నదిదె చూడు నీ వేల సిగ్గుపడేవు
వలపుల జాజరకు వాసివంతు లెంతురా"
24-351

జాజరకాఁడు: (17) వి. మోసగాడు, దొంగ, వేషములు కట్టి ఆడేవాడు. (న.శ.), తస్కర శబ్దభవ మనిపించుచున్నది అని సంపాదకులు 27-334 f.n. ఉన్న బలమునంతా దోచుకునే వాడని తాత్పర్యార్థం. వేడుకకాడు (?)
"సన్నపుగాలిఁ జూచి జాజరకాఁడనఁగాను
విన్నవించేమా నేము వెలఁదికిని" 27-334

జాజరకాలము: వి. వసంతకాలం (?)
"వింత జాజరకాలము వేడుకతోఁ దలఁపించె
సంతోసపు చిరునవ్వు చల్లులాడరయ్యా" 18-8

జాజరజాజి: వి. జాజరపాటల్లో చివర చేర్చే ఊతపదం.
"చల్లరే హూరపై జాజరజాజి
చల్లఁగా సరసపు జాజరజాజి" 28-319

జాజరపాట: (3) వి. జాజర, జాజర అనే ఊతపదం ఆవృతమయ్యే ఒక జానపద గీత విశేషం. శ్రీనాథుడు "జాదుర జాదురంచు మృదు చర్చరి గీతులు వారుణీరసాస్వాద మదాతిరేకములఁ జంద్రిక గాయఁగ దక్షవాటికా ........." అనే భీమఖండ పద్యంలో (5-102) ప్రసక్తమైన పాట ఇదేనేమో!

జాజరమాటలు: వి. మోసపు మాటలు.
"చల్లని మెల్లని జాజరమాటలు
చెల్లఁబో యెందాకఁ జెప్పేనే" 4-38

జాజరలాడు: (3) ప.బం. జాజరపాటలు పాడుతూ ఆడు.
"జవ్వనము రాసివోసి జాజరలాడినట్టు
చివ్వన సరసమాడి చేనకీని గోళ్ళను" 13-503

జాజరలాడు: అ.క్రి. మోసములు చేయు, వంచనలు చేయు.
"కాంతుఁడిదె నీ కొరకే కాచుకున్నాఁడు
సంతోసము లెక్కలేదు జాజరలాడేవు" 29-142

జాజరలోవాఁడు: వి. మోసగాఁడు.
"సంతలోని జాణవు జాజరలోవాఁడవు
వింత లేదు నాకు నీకు విన్నపమిదయ్యా"
7-209

జాజరాడు: (5) జాజరపాట పాడుతూ ఆడు.
"పొదలె నిండుఁగళల పున్నమ నేడు
అదను దప్పక జాజరాడుదువు రావయ్యా"
29-434

జాజు: వి. జాజి.
"జాజు జాజే కాక దిరిశపుఁబువ్వౌనా
నీ జాడెంతయిన నీవు మానేవా" 5-368

జాజుకొను: (1) అ.క్రి. ఎఱ్ఱబడు.
"మొక్కలానఁజివురులు మోవిమీఁద జాజుకొనీ"
22-356

జాజుకొను: (2) అ.క్రి. 'జాదుకొను'కు రూపాం.ఉద్భవించు, దట్టమగు, తుటుకుకొను.
"సారె సారెఁ బులకలు జాజుకొని మేనుల
యీ రీతి మీ తమకము లెటీఁగించీ నవియె"
22-277

జాజుజాజే కాక దిరిశపుఁబువ్వౌనా: సామెత; (?)
5-368

జాడగా: క్రి.విశ. ఉపాయంగా, సైగగా, యుక్తంగా.
"వేడుకతోనే మాట వినే దెబుఁగుదును
జాడగా బొమ్మలనే సైఁ జంకింతుఁగాను"
20-353

జాడుపడు: విఫలమగు (జాడు = గింజపట్టని జొన్నకఱ్ఱ) విరళమగు.
"యీడులేని శ్రీవేంకటేశ్వరుఁ గొలిచితేను
జాడుపడ్డ పనులెల్లా సఫలమౌను" 14-42

జాణఁడు: (7) వి. నేర్పరి, రసికుఁడు. రూపాం. జాణ.
"చలమేల వద్దు వద్దు జాణఁడవు యీ పొద్దు
యెలుగెత్తి విన్నవించే ఇంటికి రారాదా" 26-336

జాణ: వి. నేర్పరి, రసికుడు, రసికురాలు; చూ: జాణఁడు.
"చాపలాన నీవే కడుజాణవు గావోయీ" 13-50

జాణకత్తె: (3) (జాణ + కత్తె) వి. నేర్పుకత్తె, ప్రౌఢురాలు, రసికురాలు.

"ఔనే జాణకత్తెవు అన్నిటా నీవు
యేనిగె గుజ్జొఁగదే యెక్కినవారికిని" 7-239

**జాణకాఁడు:** (10) (జాణ + కాఁడు) వి. నేర్పరి, ధూర్తుఁడు, రసికుడు.

"ఎటువంటి జాణకాఁడే యీతఁడు
చిటుకలు వేసీని సెలవి నవ్వులను" 13-90

"సరసురాలవు నీవు జాణకాఁడాతఁడు
సరవు లిద్దరికిని సమకూడెను" 29-316

**జాణతనము:** (జాణ + తనము) వి. నేర్పరితనం, రసికత్వం, ప్రౌఢత్వం.

**జాణతనాలాడు:** అ.క్రి. చతురోక్తులు పలుకు, ధూర్తత్వం చూపు.

"చన్నులంట వచ్చేవు జాణతనాలాడేవు
ఇన్నేసి చేతలకు నీకే మొదునోయి" 28-297

**జాణరాయఁడు:** వి. మిక్కిలి నేర్పరి, మిక్కిలి ప్రౌఢుడు.

"చలము సాధించకురా జాణరాయ నీకు
మొలకచన్నులనాఁడే మొక్కితి నేను" 14-19

**జాతి(గా):** (7) క్రి.విణ. ఉత్తమం (గా), శ్రేష్ఠం (గా), సొగసు (గా), ఒప్పు. (గా)

"జాతిగా మా తోడుతను సరసమాడకుమని
చేతుల నెవ్వతెనా లచ్చెనవెట్టెనో" 10-2-32

**జాతికర్త:** కులకర్త, కులపెద్ద (?)

"ఏతులమాటలాడి యిట్టె నవ్వించే వతని
జాతికర్తవా నీవు జాణతనా లాడను" 7-397

**జాతినాలిక:** వి. మేలైన నాలుక.

"జాతినాలిక వొకటే చవులు కోటానఁగోటి
రీతి హరినామ ముచ్చరింప వేళ లేదు" 2-461

**జాతియ్యము:** వి. 'జాతీయము'నకు రూపాం.

"నిరతి హేమవర్ణాకె నీవు పీతాంబరుఁడవు
సరవి నిద్దరికొక్క జాతియ్యము" 20-201

"ఎటువంటి జాతియ్యమో యేరుపరచఁగ రాదు
కుటిలకుంతలులాల కొమ్మఁ జూడరమ్మ" 16-37

**జాతియ్యాహారాలు:** వి. తమ జాతికి సంబంధించిన ఆహారాలు.

"కోరి పక్షుల కొరులు గూండ్లు వెట్ట నేరిపిరా
సారె జాతియ్యాహారాల చవి నేర్పిరా" 2-333

**జాతుర:** వి. జాతర శబ్దానికి వ్యావహారికరూపం. శక్తి ఉత్సవం, ఉత్సవం.

"కాంతల నెన్నడుముల కఱవు దీఱ
దొంతిమోవిబోనాల జాతుర సేయవయ్యా" 13-137 & 6-149

**జాతులఁబెట్టు:** (?)

"గాఁటముగ నాపన్నులు కన్నవారితోఁ జెప్పి
చాటుచు సారె సారె జాతులఁబెట్టీని" 23-362

**జాతులు:** వి; బహు. ఈ పదం మామూలు అర్థాల్లోకాక ప్రకరణాన్ని బట్టి సైగలు, ఎగతాళి ఇత్యాద్యర్థాలు గలదిగా తోస్తుందని సం.ప.స. (11 సం. 387 పు.)

"కాతరాన నీవు నాకు గందపుబొట్టు వెట్టఁగా
జాతులు సేసేరు సారె సారెఁ జెలులు" 21-355

"యెరవులవారితోడ యెమ్మెలు చెప్పుకొంటేను
సరి సవతు లెల్లాను జాతులు సేయరా" 29-341

**జామటనుండి:** జామునుండి, జాము శబ్దము యొక్క ఔపవిభక్తికరూపం.

"గోమునసే పొద్దు నీకుఁ గొలువులు సేయఁగాను
జామటనుండి యిట్టె సంతోసించేవు" 18-10

**జామెక్కు:** వ.బం; అ.క్రి. సమయం అతిక్రమించు. 6-25

**జారతనము:** వి. జారత్వం.

"సొరుచి మెచ్చుల జాజరజాజ
జారతనంబుల జాజరజాజ" 28-319

**జారించు:** స.క్రి. జారజేయు, జారునట్లుచేయు, తొలగించు. (వ్య.)

"పొంచి నా చన్ను లంటేవు పోకముడీ జారించేవు
నించే నీ పొందులకు నేనూఁ బైకొనరా" 7-185

**జారుఁగొప్పు:** వి. కొనముడి (పద.), దువ్వముడి, జారుచుండే ఒకరకపు కొప్పు.

"చనవు నా కిచ్చినది జారుఁగొప్పు దువ్వినది
తనివోని యాసలకు తరవాయఁ గదవే" 14-252

**జారు:** (3) వి. జారడం, స్రవించడం.
"పయ్యద జారులవల్ల భావము గరఁగీఁగాని"
14-591

"పెనఁగిన రతికేళి పెంజెమట జారులు
పెనఁగొని యెక్కడివే ప్రియుఁడు నీ కెవ్వఁడే"
14-274

"కలికికరముల చక్కని గోరులు
నిలువున మొలనూలి నీవి జారులు" 28-537

**జారుదురుము:** వి. జారుకొప్పు, కొనముడి, దువ్వుముడి.
"సారెజారుదురుము నిలిపి చనుమొనలఁ దాకించి
నోరికొల్ల దన వుదుటు చూపి" 17-65

**జాఱువడు:** అ.క్రి. తొలగు, చ్యుతమగు.
"మాఱుమో మదేటికి మంకుఁదన మేటికి
జాఱువడనే నవ్వితే సంతసించవలదా" 7-43

**జాలి:** వి. ఆశ, బాధ.
"ఆలించు పాలించు ఆదిమపురుష క్షమ
జాలిదీర నీకే శరణు చొచ్చితిమి" 4-338
"గాలపు టెఱ్ఱలఁగంటే కమ్మి నీటిలో మేలు
జాలి నాపసలఁ జిక్కి చావకుండీనా" 4-66

**జాలిఁబడు:** అ.క్రి. 1.కనికరించు, దయచూపు 2.దుఃఖపడు, కష్టపడు.
"జాలిఁబడ్డ చెమటల సరితెప్ప లెక్కేవే" 7-44
"వట్టిజాలిఁబడుకంటే వచ్చినంతే చాలు" 1-114
దుఃఖపడు, కష్టపడు:
చదివి చదివి వట్టి జాలిఁబడు టింతే గాని
యెదుట నిన్నుఁ గానఁగ నితరుల వశమా"
4-121

**జాలిఁబెట్టు:** స.క్రి. దుఃఖపెట్టు, కష్టపెట్టు, బెదిరించు.
"వలవ నేర్చినవాఁడు వట్టి జాలిఁబెట్టడు
పలుకనేర్చినవాఁడు బాసదప్పఁడు"
7-382 & 300

**జాలిదీరన్:** క్రి.విఱ. బాధతీరగా.
"ఆలించు పాలించు ఆదిమపురుష క్షమ
జాలిదీర నీకే శరణు చొచ్చితిమి" 4-338

**జాలిపాట:** వి. జాలిపదం ఊతపదంగా ఉన్నపాట. ఈ పాటలో రెండో పాదాంతంలో జాలో జాలి అని ప్రతిచరణంలో చివర జాలి అనే మాటలు ఊతపదాలుగా కనిపిస్తాయి.
"మితిమీరెఁ జీకట్లు మేటి తలవరులార
జతనము జతనము జాలో జాలి
యితవరులార వాయించే వాద్యాలకంటే
నతిఘోషములతోడ ననరో జాలి" 4-166

**జాలిపాటు:** వి. దుఃఖం, కష్టం. (కనికరం, దయ)
"పాలిపడి నిన్నుఁజేరి పట్టి కొలచినవారి
జాలిపాటు తొలఁగించి జడను వాపి" 4-328

**జాలె:** వి. బొంగరపుతాడు.
"చాలుఁజాలు నున్నవెల్లాఁ జాలదా యిది
జాలెలా నిందునే పోసెఁ జాలదా యిది" 19-379

**జాళె:** వి. నాణేలు పోసుకొనే ఒకరకపు సంచి.
"ఇంకా నిట్లానె గడియించుకొనవయ్య ధనము
సంకె లేక చిత్తమనే జాళెఁ బోసుకొందువు"
23-355

"దవ్వులనుండి యేమి తరితీపుసేసేవు
జవ్వనము చిందకుండా జాళెఁబోయరాదా"
14-63

## జి

**జిగురుగండె:** వి. జిగురుచుట్టిన కండె (కండె = దారపు చుట్ట), వేటలో పక్షులను పట్టుకోవడానికి ఉపయోగించే జిగురు (బందన) రాసి పెట్టి తయారు చేసిన దారపు చుట్ట, ఉచ్చు, త్వరగా వదిలించుకోలేనిది. ఈ పదం తాళ్ల.ప.లో 'చిగురుగండె' యని చూపబడింది. బ్రౌన్: జిగురుగండె = N.S. bird lime, జిగురుగండెలు – limed twigs to catch birds.

"తగల కుండఁగవలె తగిలితే భోగములు
జిగురుగండెఁ బక్షులు చిక్కినట్లు" 15-420

**జిగురు చుట్టిన కండె :** వి. జిగురు = వేటలో పక్షులను పట్టుకోవడానికి పుల్లలు మొ॥ వాటికి బందన పూసి తయారుచేసిన దారపుచుట్ట.
"చిలునవ్వు నీ పలుకు జిగురుచుట్టినకండె"

**జినుగు :** వి. జిలుగు, అల్పము, మందము.
"నినుపు విరహమున నివ్వెరగ్గై నేఁడు
జినుగాయఁదాలిములు చిత్తగించు చెలిని"
24-78

**జిన్నులు :** వి; బహు. 'మీఁగడలు' కావచ్చును.
"చొక్కమైన కొప్పెరల జున్నులు జిన్నులును
చిక్కిన విడుతురా చిన్నబిడ్డలు" 5-253
ఈ కీర్తనలో పాల నుండి ఏర్పడే నేయి, వెన్న, పెరుగు మొదలైన పదార్థాలు పేర్కొబడడం వల్ల 'జిన్ను'కు మీగడ అనే అర్థం ఊహింపబడింది.

**జిబ్బడాయి :** వి. గబ్బిలం, జిబ్బటీ.
"నిక్కి మేక ఆకుమేయు నిండ నదే తపమా
చిక్కి తలకిందు వేలే జిబ్బడాయి సిద్ధుఁడా"
15-56

**జిరుకు :** వి. 'జీరుకు' కు రూపాం. జారటం.
"సందడించి పైపైఁ జల్లలమ్మఁగా
చిందుచు నీ మేన జిరుకులాయ" 18-554

**జిలిబిలితనము :** వి. కొద్దితనం, మాంద్యం.
'జిలిబిలి సిగ్గు' అని ప్రయోగం.
"చెలఁగి చెలఁగి నీవు చేతలెల్లాఁ జేయఁగాను
జిలిబిలితనముతో సిగ్గుపడీని" 23-413

## జీ

**జీటకపువాఁడు :** వి. జాణడు, జిత్తులమారి.
"ఏఁటిమాట యేదులటీట
జీటకపువాని సుద్ది చెప్పకురే మీరు" 24-152

**జీతముసేయు :** స.బం. జీతమిచ్చు (వ్య.), ఉద్యోగం చేయు.
"నరయక నరసేటి నల్లతెల్ల జల్లివాఁడ
యిరవై జీతముసేసి యేలుకోవే శ్రీహరీ !"
15-39

**జీనువ :** వి. పక్షివిశేషం, లిక్కువపిట్ట.
"సుదతి వుండిన యింటిచుట్టూఁ దిరుగునమ్మా
చెదరిన మతితోడ జీనువవలెను" 10-2-115

**జీర :** వి. గీర, రేఖ. (శ.ర.)
"జీర మేన నున్నందుకే శ్రీవేంకటేశ్వరుని
నేరము లెంతు రటవే నెట్టుక నీవు" 13-516

**జీరవారు :** రేఖ ఏర్పడు.
"చేరి నను నిపుడే జీరవారఁదీసేఁదాను
మేర నే నందుకుఁ దా మీకుఁ జెప్పరాదా"
14-436
"మొనసి శ్రీవేంకటేశు నెదురుగాఁ గొసరేవు
చెనకితే మేనిమీఁద జీరవారె నటవే" 7-236

**జీరుకుబండ :** వి. జారుడుబండ, బాలక్రీడావిశేషం.
"మేరమీరె కోరికల మిసిమి చూడకు మవి
జీరుకుబండలోయి చిత్తమా" 10-1-12

**జీరువారు :** అ.క్రి. 1. ప్రసరించు, వ్యాపించు 2. జారు 3.వేలాడు (జీరుకు ..... బండలు)

**జీలుగుబెండగు :** వి. బయలగు, చాలా తేలికగు.
"సోకి నీ సింగారాలే చొప్పులెత్తి ఇయ్యఁగాను
జీలుగుబెండాయ గుట్టు సిగ్గుపడవలదా"
23-365

**జీవము :** వి; మాం : మేక మొదలైన జంతువు.
"తనివోక జీవము తలకాయ నంజుడు
పనివడి తిన్న తిన్న బ్రాహ్మఁడు" 1-209

**జీవాతుమ :** వి. జీవాత్మ, సమాసంలో కూడా ఆతుమ శబ్దప్రయోగం.
"జీవాతుమై యుండు చిలుకా నీ
కావలికి పరమాత్ముఁడై యుండు చిలుకా" 1-50

**జీవాలు :** వి; బహు. పశువులు (అడవిజంతువులు), మేకలు, గొఱ్ఱెలు.
"సిడిదల లియ్యవద్దు జీవాలఁ జంపవద్దు
బడిబడి పగ్గాలఁబారవద్దు" 4 అను. 62

## జు

**జుంజు :** వి. జుట్టు.

"వన్నెమేన జుంజు రేఁగె వాడు మోవి గడు
మాఁగె" 9-137

**జుంటీగకత :** వి. (?)

"భూమెల్ల మేసినా నాఁబోతుకు బందె లేదు
నేమపు(బసన్నునికి నింద లేదు
యీ మేర శ్రీవేంకటేశ్వరుని శరణని
సోమరి కర్మ మంటితే జుంటీగకతవును"

**జుట్టవేలు :** వి. చూపుడువేలు, తర్జని. రూపాం. జుట్టనవ్రేలు, జుట్టివ్రేలు, జుట్టెనవ్రేలు, జుత్తనవ్రేలు, జుత్తెనవ్రేలు.

"గుట్టున మనోరథాలు గోరుకొంటా
ముక్కుమీఁది
జుట్టవేలితో నున్నది చూతువు రావయ్యా"
19-102

**జుట్టుడేశడుగులాపె :** వి. జానెడేసి అడుగులు గల స్త్రీ.

"జుట్టెడేశడుగులాపె సోయగపుఁజేతులాపె
చుట్టరికపువావు లెంచుకొమ్మనె నిన్నును"
28-511

**జుట్టెఁడేసి పాదాలాపె :** వి. జానెడేసి అడుగులు గల స్త్రీ.

"పట్టెఁడేసి గుబ్బలాపె బాగాలిచ్చీ నీకు
జుట్టెఁడేసి పాదాలాపె సురటి వట్టే" 16-558

**జుట్టెడు :** (జుట్టు + ఎడు) విణ. చాపబడిన బొటన వ్రేలికి, చూపుడు వ్రేలికి మధ్య కొలత ప్రదేశం, జానెడు.

"జుట్టెడు యినుమునమ్మి సొరిదినొక్కఁడు
భూమి
గట్టిడి భయములెల్లఁ గడవఁగాను" 1-429

**జుట్టెడేసి పాదముల జోటి :** వి. జానెడేసి పాదములుగల స్త్రీ.

"జుట్టెడేసి పాదముల జోటి నీపద్దికి రాఁగా
పట్టెడేసి చన్నులపై పయ్యెద జారె" 24-458

**జుణుఁగు :** (3) అ.క్రి. భయాదులచే ఒదుగు, సందేహించు, మఱుగుపడు, దాగుకొను, జంకు, వెనుదీయు, తప్పించుకోజూచు. రూపాం. జునుగు.

"గుట్టుతో మెలఁగేవారు కొసరఁగ నేమిటికి
చుట్టములైనవారు జుణుఁగనేల" 24-346

**జునుగు :** (6) చూ : జుణుగు.

"చుట్టము వరుసలెంచి చూచి నీతో నవ్వేగాక
అట్టునిట్టు జునిగేవు ఆస గలదా?" 19-308

**జుఱ్ఱుసేయు :** స.క్రి. తాగు, జుఱ్ఱున తాగు.

"రీతి జిగురువంటిది రేకలు నీ మేన నివే
జాతిచన్నుల నెత్తొత్తి జుఱ్ఱుసేసెవే" 8-231

## జూ

**జూజగాఁడు :** (జూజము + కాఁడు) వి. జూదగాడు, మోసగాఁడు.

"సొగసి నీ వెంతేసి జూజగాఁడ వైనాను
తగులు విరి పందేలు తరుణు లాడుదురా"
23-517

**జూజమాడు :** (12) అ.క్రి. జూదమాడు.

"కడఁగి జూజమాడితే గడచీని కాలము
నడుమ వేఁటలాడితే నడచీని కాలము" 15-270

**జూజము :** వి. జూదం, మోసం.

"వేడుక పుట్టవలసి విభుఁడు జూజాన నిన్ను
సోడించెఁగాక నీతో వొరటువాఁడా" 21-206

అన్నమయ్య జూజమనే పదాన్నే బహుళంగా వాడినాడు. జూదమనే పదం ఒక్కసారి మాత్రమే ప్రయుక్తం. (24-485)

**జూజరి :** (జూజము + అరి) వి. జూదగాఁడు, మోసగాఁడు.

"శ్రీవేంకటేశ నీవు చేరి కూడఁగానె కాని
సోవలుగా మొరఁగితే జూజరి నేను" 9-3

"దున్నేవానికి మనసు తొలుతఁ జాలుపై నుండు
పన్ని జూజరికి నాటపై నుండును" 15-377

**జూజాలాడు :** (23) జూదములాడు, అబద్ధములాడు.

"చుట్టిచుట్టి యాపె నాతో జూజూలాడి యోడఁగాను
రట్టుగా నెత్తులు చెప్ప ఇట్టె వలెనా" 25-8

**జూటరి:** (10) (జూటు + అరి) వి. మోసగాఁడు, జిత్తులమారి. (జూటు = మోసం; శ.ర.)
"చూడవే యప్పటి నేనే జూటరి నట
జాడలు తాఁగట్టిన పచ్చడమే యెరుఁగు"
11-246

**జూటరితనము:** (2) (జూటు + అరి + తనము) వి. మోసగానితనం.
"జూటరితనాల నన్ను సుద్దులెన్ని యడిగినా
మాటలు వెలుచుకొని మచ్చరించేనా" 7-588

**జూటరిది:** (జూటరి + అది) వి. వంచకురాలు, అబద్ధాలు చెప్పే స్త్రీ.
"అట్టే శ్రీవేంకటేశ అలమేలుమంగ యీకె
చుట్టమై నిన్నుఁగూడె జూటరి దందురా"
12-421

**జూటరివాఁడు:** వి. మోసగాఁడు, వంచకుడు.
"చూపనా నేనపుడే జూటరివాఁడితఁడని
దాపుగా మై గుఱుతులు దాఁచుకొనెను" 13-3

**జూటుఁదనము:** (జూటు + తనము) వి. మోసం, వంచన.
"చుట్టమవై మొక్కెనంటే జూటుఁదనమై యుండు
గుట్టున నుండేనంటే సిగ్గులై యుండు" 28-584

**జూటుఁదనములవాఁడు:** వి. మోసగాఁడు.
"జూటుఁదనములవాఁడు సుదతులు నవ్వితేను
పాటించి యారజమని పచ్చిసేసును" 17-254

**జూటు:** వి. మోసగాఁడు, జిత్తులమారి.
"అన్నిటాను కడు జూట వౌదువే నీవు
సన్నలాతఁడు చేసితే జంకించేవు నీవు" 25-178
"చూడరమ్మ చెలులాల! జూటితఁడు" 20-452

**జూటుది:** (జూటు + అది) వి. మోసకత్తె, వంచకురాలు.
"కైకొని నలమేల్మంగ నెదపై నుండఁగాను
జోకతోఁ జెనకే వేమే జూటుదానవే" 29-408

**జూబులకొప్పు:** వి. చలించే వెంట్రుకల కొప్పు. (జూబులు = చలనములు నీ.శ. 71) గుత్తులకొప్పు.
"చుట్టుకొన్న వెంట్రుకల జూబుల కొప్పువాఁడ
వెట్టి మా యిల్లువరుస వెదక నేమిటికి" 9-57

## జె

**జెడ:** వి. 'జడ'కు వ్యావహారికరూపం. ఉచ్చారణానుకూలమైన రూపం.
"చొల్లెపుజెడ వీపున సోయగమై వేలఁగాను
చిల్లరవుట్లు గొట్టీఁ జిన్నబాలుఁడు" 21-386

**జెడగట్టు:** ప.బం; అ.క్రి. జడగా రూపొందు, జడగట్టు. ఇట 'జెడ' అనే ఎత్వ సహితరూపం నిర్ధారక ప్రయోగం.
"చిగురుఁబాదాల నిగ్గు జెడగట్టెనో అప్పటి
తగి యల్లదె తులసిదండవలె నున్నది" 7-218

**జెలనిధి:** వి. 'జలనిధి'కి వ్యావహారికరూపం. ఉచ్చారణానుకూలమైన రూపం.
"నిండు జెలనిధి గట్టి నిగిడి లంక సాధించె
అండనే రాముఁడు నరుఁడనవచ్చునా" 4-503

## జే

**జేగురుఁదొడి:** వి. (జేగురు + తొడి) ఎఱ్ఱని అలంకారం. (తొడి = నగ, అలంకారం)
"కుంకుమ మా కిపుడు జేగురుఁదొడి నుదుటికి
బింకపుఁదిట్లె మా ప్రియములు" 5-121

**జేడుమోహము:** వి. (7)
"వేడుకలే వేలు వీడు దోడాడే చోట
జేడుమోహపువిభుఁడ చిత్తమింతే యిఁకను"
24-174

## జొ

**జొత్తుఁబాపములు:** వి; బహు. దట్టమగు పాపములు.
"నెత్తురు జలదుర్గాన నిలచినవాఁడ నింతే
జొత్తుఁబాపములు యేల చోటడిగేరు" 3-334

జొత్తు[1]: వి. ఎఱుపు, కృత్రిమ రక్తం.
"చిత్తము నొచ్చీనంటాఁ జెప్పఁ గాకీ నా మోవి
జొత్తు లద్దములోనైనాఁ జూచుకోరాదా" 20-307

జొత్తు[2]: వి. జుట్టు.
"చిత్తములోపలి మాట చెప్పి సిగ్గువడీ యదె
జొత్తువలెఁ జెమరించె సుదతి మేను" 26-27
"చిత్తరువు వ్రాసి చెలఁగి వచ్చె నొళ
జొత్తు మాని యిటు చూపరుగా" 12-38

## జో

జోఁక: వి. సౌందర్యం.

జోక: వి. 1. సామ్యం 2. బాగు 3. జత 4. విధం 5. ఉత్సాహం 6. మొత్తం 7. స్వరూపం 8. వేడుక.
"వాకిటఁ గాచుకున్నది వచ్చినదాఁకా నీవు
జోకతోడుత నెదురుచూచీ రావయ్యా" 14-492
జత:
"ఆకడ నావుఁ గొంటే నావు వెంట దూడయును
జోకలఁగొన్నట్టివారి సొమ్మే కాదా" 2-441

జోకవాఁడు: వి. జతగాఁడు.
"జోడు సేతమా మొగము సొరిదిఁ జంద్రునికిని
జోడుగాదు దిన మొక జోకవాఁడు" 27-579

జోగిలు: అ.క్రి. తూగు.
"కన్నులార్చ కంత నీవు కడు నేల జోగిలేవు
కన్నెల మదాలు నీపైఁ గప్పెను నేఁడు" 27-352

జోడుకోడెలు: వి; బహు. జంటకోడెలు, జంటయెద్దులు, జతకాండ్లు, సమానులు.

జోడుబెట్టు: (?)
"వేరు లేని మహిమల వేంకటేశుఁడతని మై
చూరగొంటి వప్పుడేమి జోడువెట్టుకుండెనా"
5-171

జోతాలు: వి; బహు. దండాలు. (జోత = నమస్కారము – సూ.ని)

జోలి: (2) వి. 1. విషయం, సంగతి 2. గాథ 3. సంబంధం 4. కార్యం, పని 5. వెరవు 6. రీతి 7. ముచ్చట 8. భార్యాభర్తల సంబంధం 9. వూను. (వ్యు.కో.)
"వలవని జోలింక వద్దనరే! తన
తలఁపులోన నేఁదగిలితిని" 20-206

జోలిఁబెట్టు: అ.క్రి. అనవసరమైన విషయాలు చెప్పు, భాషించు, ముచ్చటపెట్టు.
"పోలికవలని వేరూపులు పూచిన కొలఁదులే పూఁపలు
జోలిఁబెట్టక పతిఁ జొక్కించవే" 29-424
"ఎంత కథ నడిపితి వేమి జోలిఁ బెట్టితివి
చింతింప లోకములు నీ చేతివే కాదా" 2-315

జోలికాఁడు: వి. సంబంధం కలవాడు.
"సాలు సాలు మాటలు సక్కనుండవు
జోలికాఁడ మమ్ము నేల సొలసేవు" 17-127

జోలినిత్యాలు: వి; బహు. (?)
"అట్టయిన సత్యాలాఱడి జోలి నిత్యాలు
యిట్టివె నేరుచుకొంటి విపుడు నీవు" 8-275

జోలిమొక్కులు: వి; బహు. మొక్కు.
"చుట్టి చుట్టాతఁడు నన్ను (నిన్ను) జూడవలె నంటానే
యిట్టే జోలిమొక్కులు మొక్కే వేలే చలము"
7-57

జోలిసేయు: (5) వ.బం; అ.క్రి. సంబంధం పెట్టుకొను.
"ఇరవైన శ్రీవేంకటేశ నీ రతుల నేను
మరిగి మెచ్చితిఁగాక మరి జోలిసేతునా"
20-214

## జ్వా

జ్వాలానరసింహము: వి. ఎగువ అహోబలానికి మూడు మైళ్ళదూరంలో ఎత్తైన ప్రాంతంలో నెలకొన్న స్వామి.-నవనారసింహుల్లో ఒక స్వామి.
"సతతప్రతాపరౌద్ర జ్వాలానారసింహా" 1-453

## డ

డంబు: వి. దంభం, దర్పం, మానావమానములు.

"మాని డంబు విడుచుట పూని హింసకు
జొరక యోరుపు గలుగుటయు" 4-346

## డా

డాగు: వి. చిహ్నం, లాంఛనం.

"కోరి మా భుజముల డాగులు
మోచుకున్నారము
ధారుణిలోపల మమ్ము దయఁజూచుఁ గాక"
6-101 old

"గుట్టున అయిదు ప్రాణాలకు డాగు వెట్టేము
వట్టి దేహముల విడుఁబట్టు లివిగో" 15-128

## డి

డింగరీఁడు: (డింగరి + ఈఁడు) 1. సేవకుఁడు 2. భక్తుఁడు.

"యే విధులఁ బడలేక యిటు నీకె శరణని
దేవులతో విఙ్ఞపీగే డింగరీఁడవు" 15-222

## త

తంగివచ్చు: అ.క్రి. ఆగివచ్చు.

"ఎవ్వఁడో వీఁడేల తంగివచ్చి
నవ్వీనవ్వీ నాతోనే" 5-176

తంగు: అ.క్రి. ఆగు. (వ్యు.)

"తంగని శ్రీవేంకటేశ తలఁపు చేప్పే నన్ను
బొంగుచుఁగూడి యిట్టె పోవనేవయ్యా" 7-312

తంగెటఁబెట్టిన జున్ను: వి; ప.బం. అందుబాటులో నున్నది. తంగేడు చెట్టు ఎత్తు తక్కువ. అందులోని తేనెతెట్టె చాలా అందుబాటులో ఉంటుంది. అందుపై వచ్చిన పలుకుబడి.

"తళుకు మోవితీపు తంగెటఁబెట్టిన జున్ను
తలఁచుకో ఆసెబాసి దరిశించఁ గలవా" 19-244

తంగెటిజున్ను: వి; ప.బం. అందుబాటులో నున్న అమూల్యవస్తువు, సులభసాధ్యం, సులభగ్రాహ్యం, సులభంగా చేయగలిగిన పని.

"వన్నెల మాటల వాకిటి తంగెటి
జున్నుకు వడగాలి సోకినది" 5-354

తంగేటిజున్ను: (5) వి. అందుబాటులో ఉండే అమూల్య వస్తువు. చూ: తంగెటఁబెట్టిన జున్ను.

"తనివోని తమకము తప్పక కన్న ధనము
కినియని వలపు తంగేటి జున్ను" 17-187

తంగేటిపై జున్నులు: ప.బం; వి; బహు. చూ: తంగేటి జున్ను.

తంగేడుజున్ను: ప.బం; వి.అందుబాటులోఉండే అమూల్య వస్తువు. చూ: తంగేటి జున్ను.

"తరుణి పలుకులె తంగేడుజున్ను
బెరసేటి విన్నపము పెల్లిచెట్టు" 23-318

తండు: అ.క్రి. ఇవ్వవలసిన ధనాన్ని వెళ్లి అడుగు, (శ.ర.) బాకీలు వసూలు చేయు, చందాలు అడుగు.

"కొండల శ్రీవేంకటాద్రిఁ గోరి నన్నుఁ గూడె
తండిన వలపువాఁడు కానే కాఁడా"
24-142, 650 old

తండుముండు: వి. తొట్రుపాటు, (పద.) దుందుడుకుగా ముందుకు దూకడం. ఈ పదం గడ్డీ గాదము, పిల్లాజెల్లా వలె జంటపదంగా తోస్తుందనీ, ఇంకను అర్థము విచార్యము అని సం.ప.స. 2-380 పు.

"కొండో నుయ్యో కుమతులాల తండుముండు
తట్టుముట్టు తాఁకైనఁ గనుఁడీ" 1-160

"కొండవంటి యాసతోడ కోరక తా నుండితేను
తండుముండై లంపటాలు తగిలీనా తనకు"
10-30

తండుముండుపడు: ప.బం. దుందుడుకుగా ముందుకు దూకు. తడబడువారు అని ప్రకరణముతో తోచుచున్నది అని సం. ప. (2సం. 380 పు.)

"కొండలవంటి కరళ్లు కోరికె లెందు చూచినా
తండుముండు వారు పడేవారే దాట
లేరెవ్వరును" 2-56

**తండుమోఁడు :** వి. తండుముండు, తడబాటు, తికమక.
"మెండు కానవలెఁగాని మించి వారి వలలకు
తండుమోఁడై చిక్కుకొని తలవంచు టరుదా"
21-71

**తంపి :** వి. కలహం.
"తంపి నీ చుట్టరికము తామెరకంటి దంపర
యింపు నీ వలపె యారడిన్నిటిలోఁగాని" 9-89

**-త :** ప్ర. భావార్థకప్రత్యయం. ఉండుత, మాటాడుత, పొగడుత (పొగడుట) మొ॥
"కొప్పు వీడు తెలుఁగదు కొంగు జారు టెఱుగదు
బొమ్మల జంకించితేనే పూఁచి మాటాడుత"
26-13
"సంగడిఁ గూచుండితేనే సమరతి యౌత గాతా
జారుత" 26-123

**తకపికలగు :** అ.క్రి. కిందుమీదగు.
"ప్రకృతి కాతుమ దాను పరమాత్ముఁడాతఁడు
తకపికలై మరియుఁ దనకేల" 3-132

**తకపికలుగ :** క్రి.విణ. కిందుమీదు అయ్యే రీతిగా, తారుమారుగ.
"ప్రకటించి రమ్మనుచు పాదాలు పట్టునా ఆపె
తకపికలుగాను ముందట పట్టఁబోలు" 9-267

**తకమక :** ప.బం; వి. తికమక కావచ్చు. (కలత, త్రొటుపాటు, అంగముల అస్వాధీనత)
"సకల పురాణములు చాటి నినుఁబొగడఁగా
తకమకలుగా నల్లార్థము చెప్పఁదగునా"
10-1-58

**తక్కరించు :** అ.క్రి. టక్కరితనం చూపు, మోసగించు. తక్కరి శబ్దంపై ఏర్పడిన నామధాతువు.
"తక్కరించె నిన్నటి తగవరి తానె కాఁడా
మక్కువైనా చిలుక మానీనా గుణము"
10-2-118

**తక్కరితనము :** (6) (తక్కు + అరి + తనము) వి. మోసం, మాయ.
"తక్కరితనాల యెడతాఁకులు" 26-100
"చెక్కులు నొక్కకురా చిత్తమెల్లాఁ జల్లులై
తక్కరితనాల యెడతాఁకులే చాలు" 26-100

**తక్కరివిద్యలు :** వి; బహు. మోసపువిద్యలు.
"తక్కరి నీ విద్యలే దంటఁజేసేఁగాక నన్ను
గక్కనఁ దొల్లి కయ్యాన కాలుదవ్వేనా" 10-2-37

**తక్కు :** వి. టక్కు, మోసం, విలాసచేష్ట, కులుకు.
"కన్నప్పుడే మొక్కుటాను కానకున్నఁ
దక్కులును" 11-452

**తక్కరీఁడు :** (తక్కు + అరి + ఈఁడు) మోసగాడు.
"తక్కరీఁడు తనచేత మనసే యెరుఁగు"
26-235

**తక్కుఁదనము :** వి. టక్కరితనం, మోసం.
"ఎవ్వరు సాకిరి చెప్పిరివే నీ తక్కుఁదనాలు
వువ్విళ్ళూరేటి బాస లొల్లరా నేను" 20-259

**తక్కులఁబడు :** అ.క్రి. మోసపోవు.

**తక్కులఁబెట్టు :** స.క్రి. చిక్కులలో పెట్టు, మోసపుచ్చు.
"తక్కులఁబెట్టక ఇంతట రావయ్య" 23-361
"మక్కువ సేసితిఁగాన మానలేము గాక నిన్ను
తక్కులఁబెట్టఁగ మాకుఁ దగవేది" 11-521

**తక్కులుఁదెక్కులు :** (తక్కులు + తెక్కులు) ప.బం. మోసాలు అనే అర్థంలో జంటపదం. టక్కులు టెక్కులు. ఇట తక్కులు దెక్కులు అని కావచ్చు.
"తక్కులఁదెక్కులు నాడి తగులఁదీసుక నా
యిక్కువ లంట (టే?) నంటే నియ్యకొనదా"
24-23

**తగ :** వి. నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. ఇది 'దగ' కావచ్చు. దగ అంటే దప్పి, తాపం, బాధ, ఆయాసం, అలసట అని అర్థాలు.
"గనివంటిది యీ సంసారము
తనిసి తన్పినాఁదగ లేదు" 1-492

**తగవరి:** (తగవు + అరి) వి. తీర్పరి, న్యాయాధిపతి. విణ. న్యాయశీలుఁడు.
"ఎటువంటి తగవరి వేమోయి నీవు
ఇటువంటివాఁడవా యేమోయి నీవు" 21-256

**తగవు:** (2) వి. 1. యుక్తత 2. న్యాయం 3. కలహం 4.వివాహాదుల్లో ఇచ్చే కానుక 5. తీర్పు 6. మేలు 7. రీతి విణ. తగిన.
"ఎప్పుడూ నావాఁడవే యెంత వొడఁబరచేవు
తప్పు లేదు నీవల్ల తగవు నీ చేతిది" 14-477

**తగవు:** వి. న్యాయం, నీతి.
"కులకాంతలకుఁదమ గుణములతోనే పతి
తలఁపులో మెలఁగుటే తగ వింతే కాకా" 18-27

**తగులమి:** వి. అసక్తత, నిస్సంగత్వం.
"తగులమి గలిగితే తలఁపు గలుగుఁగాక
మొగము చూడకుండితే మోహ మే దుండునే" 25-28

**తగులవేసుట:** వి. పాడుచేయడం.
"తక్కరి జాణతనాలే తగులవేసుట గాదా
ఇక్కువఁ బే రడుగుటే ఇంపు రేచఁగాదా" 26-107

**తగులాయము:** (11) వి. తగులాటం, సంబంధం, కామసంబంధం. తె.వ్యు.కో. లో సంబంధి, కావలసినవాడు అనే అర్థాలు చూపబడ్డాయి. కాని ఇక్కడ తొలి అర్థాలే పొసగుతున్నాయి.
"తప్పక చూచితేనే తగులాయములు పుట్టు
చిప్పిలఁగ నవ్వితేనే చిత్తములంటు" 28-451

**తగులు:** వి. బంధం, సంబంధం.
"దైవముతోడిదే తన తగులు సంబంధం
జీవుఁడిది యెఱిఁగితే చిక్కనీదు తగులు" 2-204
"ఇంటికి రానివాఁడవు యేడనైనా నవ్వనేల
వెంటనే మాతో తగులు విడువరాదా" 7-45

**తగులువిరికాఁడు:** వి. సంబంధం కలిగించే మన్మథుడు (?) (విరికాఁడు = పుష్పములు కలవాడు, మన్మథుడు)
"వగల శ్రీవేంకటేశ్వరు మాయ లీ వలపు
తగులు విరికానివలెఁ దగిలించు వలపు" 3-401

**తగులు విరితనము:** వి. తగులుతనము, విరియు (= విడియు) తనము కావచ్చు. సందర్భానుసారంగా తగులుట = చేరుట, విరియుట = విడియుట లేక తగులు యొక్క విరి (= వికాసము) దానిపైన తన వర్ధకమూ కావచ్చు. రాగము హెచ్చిన తనము అని అర్థము. (సం.ప.స. 18 నం 430 పు.)
"తనివోని యాసలతో తగులువిరితనాన
పెనఁగులాడుతా నీపై ప్రేమమూ చల్లీని" 18-4

**తగులువిరులాడు:** పరస్పరం స్పృశించేట్లుగా పూలతో ఆడు.
"తచ్చనకాఁడవు నీవు తగులు విరులాడేవు
నచ్చుల గొల్లెతలెట్టు నమ్మీరయ్యా నిన్నును"
21-20

**తగులై ఉండు:** అ.క్రి. సంబధించి ఉండు.
"తానును ఆ పరిణామంబులకు
తగులై వుండును యీతఁడు" 3-306

**తగ్గుముగ్గు(లు):** (4) ప.బం; వి. హెచ్చుతగ్గు(లు), 'మొగ్గు' ముగ్గుకు వికృతిరూపం కావచ్చు.
"తగ్గుముగ్గులైన వేళ తలఁచినవారెల్ల
సిగ్గుఁబాటే కాక తమ్ముఁ జేరవచ్చేరా" 1-210
"దయగలవాఁడవు తగ్గుముగ్గు లెరఁగవు"

**తగ్గుమొగ్గు:** (11) ప.బం; వి. హెచ్చుతగ్గులు, తక్కువ - ఎక్కువ. (మొగ్గు = హెచ్చు)
"వొగ్గి తానేమి సేసినా నూరకే యమరుఁగాక
తగ్గుమొగ్గు లేని నాకు తమకించవచ్చునా"
23-199

**తచ్చన:** (19) వి. 1. కపటం 2. పరిహాసం, గేలి 3. సాకు 4. మోసం 5. అసత్యం.
"యిచ్చట శ్రీ వేంకటేశుఁడే నలమేలుమంగను
తచ్చన లేక యేలెఁదలఁపు లీడేరెను" 12-252

**తచ్చనకాఁడు:** (7) (తచ్చన + కాఁడు) వి. మోసగాడు, కపటి.
"తచ్చనకాఁడవు నీవు తగులు విరులాడేవు
నచ్చుల గొల్లెత లెట్టు నమ్మీరయ్యా నిన్నును"
21-20

**తచ్చు:** (24) స.క్రి. 'త్రచ్చు'కు వ్యావహారికరూపం, మథించు, సానఁబెట్టు.
"తచ్చి తలపోసుకునీఁ దగ జీవుఁడు" 2-58
సానఁబెట్టు:
"తచ్చి తచ్చి వింటినారి దనుజులనెల్లాఁ జెండి
పచ్చిదేఱి వేంకటాద్రి పానువుఁగాఁ బండె" 5-48
ఈ ధాతువు ఎక్కువ ప్రయోగాల్లో 'తచ్చి' అని క్త్వార్థకంగానే ప్రయోగింపబడింది. ఒకచోట మాత్రమే 'తచ్చిన' (తచ్చిన నీ కరములు) అని భూతకాలిక విశేషణంగా కనిపిస్తుంది. (9-92) కొన్నిచోట్ల ఈ అర్థాలు సరిపడడం లేదు.

**తటుకున:** క్రి.విశ. తటుక్కున, శీఘ్రంగా, వెంటనే.
"తటుకున నీ కీరితి వొగడుదురు తలకొని
యిందరును" 2-297
"ఘటన శ్రీవేంకటేశ కౌఁగిటఁ గూడితివాకె
తటుకున మీకె కావ ధర నేది వలపూ" 17-102

**తట్టు:** అ.క్రి. గట్టిగా కొట్టు, తాడించు.
"తట్టెడి నీ మట్టెల మోఁతలు చూపవలసి
పట్టుఁ బట్టఁగానే వుప్పరిగెక్కేవు" 5-248

**తట్టుపడు:** అ.క్రి. బాధపడు (శ.దీ.) వెనుకబడు. (వ్యు.)
"ఘనుఁడ శ్రీవేంకటేశ క్రమ్మర నీ కృపచేతఁ
దనిసి యే విధులను తట్టుపడనైతి" 2-27

**తట్టుపుణుఁగు:** (తట + పుణుగు) వి. కరిగి బెత్తికలు కట్టిన ప్రశస్తమైన పునుగు. (పునుగు = పునుగుపిల్లి వలన లభించే గంధద్రవ్యం)
"తట్టుపుణుఁగు శిరసుమీఁద దైలువారనంటి
నొసలఁ
బట్టవెట్టు కోరి నన్నుఁ బట్టనెట్టు వచ్చునా"
5-136

**తట్టుపునుఁగు:** వి. తట్టి యొత్తిన మేలైన పునుగు. (పునుఁగు = ఒకానొక సుగంధద్రవ్యం)
"ఇంద్రనీలపు గనుల యిలధరుఁడవు గాన
తంద్రలేని యేపె చూపే తట్టుపునుఁ గాయను"
2-280

**తట్టుపులుగు:** వి. గరుత్మంతుడు (తట్టు = వాహనం, పులుగు = పక్షి) 12-197 old

**తట్టుముట్టు:** (4) వి. తొట్రుపాటు.
"గట్టిగా శ్రీవేంకటేశు కైంకర్యమే సేసి
తట్టుముట్టు లేనిదే తగ నిజభక్తి"
2-469 & 1-160

**తట్టుముట్టువడు:** (తట్టుముట్టు + వడు) తొట్రుపడు.
"దక్కనివి గోరనేల తట్టుముట్టువడ నేల
చిక్కినంతకే సంతసించరాదా" 4-426

**తట్టువడు:** (4) (తట్టు + పడు) తొట్రుపడు, సక్తమగు, వెనుకబడు, ఆగు, డీలుపడు, నిస్సత్త్వమగు. బాధపడు. (శ.ర.)
"ముట్టుకొన్న యింద్రియాల ముదిసీ ముదిసి
రాఁగా
తట్టువడి తన మేను తానే మరచె" 2-380

**తడతాఁకులు:** (4) వి; ప.బం. నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. తాకులు + తాకులు = తడతాఁకులు కావచ్చు. తాఁకు అంటే వేసట, అడ్డు, బాధ, గాయం అని అర్థాలు. మిక్కిలి బాధలు, మిక్కిలి తొట్రుపాట్లు అనే అర్థం చెప్పవచ్చు. తె.జా.లో దీనికి కష్టాలు అనే అర్థం చూపబడింది.
"జడిసి వుండిన నీతో చనవు చెప్పుటకంటే
తడతాఁకులఁ బొరలే తడవకు మమ్ము" 11-327

**తడమారి:** (?)
"కడలేని సాహసాల గట్టి వాయివాడమ్మా
తడమారి ఇందరిలో తాటఁగట్టమ్మ" 22-69

**తడిపాఁత మెడగోఁత:** ప.బం; వి. తడిగుడ్డతో గొంతులు కోయడం, మెత్తగా ఉంటూ ద్రోహం చేయడం, నయవంచన చేయడం.
"తడిపాఁత మెడఁగోఁత తలఁపు విషయాసక్తి"
1-104

**తడియొత్తు:** వి. తడి తుడుచుకునే గుడ్డ.
"యెపెడయని యాకె పయ్యెద కొంగే
తడియొత్తు

అడియాలపు మజ్జన మవధరించవయ్యా"
18-558

**తడియొత్తులాపె:** (తడియెత్తులు + ఆపె) వి. స్నానం చేసిన తరువాత శరీరంమీది తడిని తుడుచుకోవడానికి కావలసిన గుడ్డలను అందించే స్త్రీ.

"పడఁతి చెమట నీకు పన్నీటి జలకాలు
తడియొత్తు లాపె యందపు గుబ్బలు" 29-538

**తడిసూడు:** (5) ప.బం; వి. తడిబుత్తు, తడి తుడుచుకునే బట్ట.

"అన్నిటా నిన్నుఁ గూడి ఇంతి జలకమాడితే
కన్నెలము తడిసూళ్ళు కడు నొత్తఁగా" 23-387

"తరుణికి జిలుగారుఁ దడిసుడు లిచ్చి" అని చిన్నన్న ప.యో.వి. లోని ప్రయోగం.

**తడిసూళ్ల ఒత్తులు:** వి; బహు. తడిని తుడవడానికి పొడి గుడ్డలతో ఒత్తడాలు.

"మెల్లనె నీవు రూపుల(?) మించుల రవలు రేఁగి
వొల్లనె తడిసూళ్ల వొత్తు లాయను" 7-137

**తతి:** (13) వి. సమయం, యుక్తసమయం, అదను. క.త. (తతి = సమయం)

**తతికాలము:** (4) వి. యుక్తసమయం.

"యేలితి శ్రీవేంకటేశ యీడేరించేవు గాక
కాలమెల్లాఁ గోరఁగాను కలిగేదేమి" 23-494

"చెట్టుల కెవ్వరు బుద్ధి చెప్పేరు తతికాలానఁ
బుట్టి కాచి పూచి నిండాఁ బొదలుమని" 2-45

**తతిగొను:** ప.బం; అ.క్రి. 1. సమయం కనిపెట్టు 2. మందవేయు, అధికమగు, కుప్పపడు.

"తతిగొని యేమఱక తలఁచఁగవలెఁగాక
హితవై నీ నామ మున్నదిఁక నేల చింతా"
15-281

"తతిగొన్న నీ వలపు దాఁచి పెట్టవచ్చునా"
29-494

"దగ్గరినయంతలోనే తతిగొనె నూరుపులు"
20-468

"తనువెల్లాఁ బులకించె తతిగొనెఁ జెమటలు
యినుమడించెఁ దమకమే సేతునే" 27-27

**తతిదప్పు:** అ.క్రి. అదనుతప్పు.

"తారి చూడకుండితే నిమిషములోననే
తతి దప్పెనా వయసు" 22-76

**తతిమీరు:** అ.క్రి. సమయందాటు.

"యిప్పుడైనా నామాట కియ్యకొంటేఁ జాలుఁ గాక
తప్పిపోయినా వలపు తతి మీరీనా" 11-471

**తతి లేదు మతి లేదు:** (?)

"తగులఁ బెట్టినంటే తతి లేదు మితి లేదు
పగటు లాడఁగరాదు పట్టినదే పంతము" 8-296

**తతివచ్చు:** ప.బం. యుక్తసమయం వచ్చు.

"తగులాయ వాపులు తతి వచ్చె జవ్వనము
యెగసక్కేలకు నేల యెడమాఁట లాడీనే"
29-243

**తత్తరపువాడు:** (తత్తరము + వాఁడు) వి. తొట్రుపాటు గలవాడు.

"కొత్తగా శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
తత్తరపువాఁడవా దయ ఇదిగాక" 20-556

**తత్తరీఁ(తీ)డు:** (తత్తర(అ)ము + ఈఁడు) వి. ఆకులపాటు గలవాడు, తొందరపాటు గలవాడు.

"వొత్తి శ్రీ వేంకటేశుఁడు వొడివట్టి నన్నుఁగూడె
తత్తరీఁడు మాట చెప్పె దగ్గరి రమ్మనవే" 8-57

**తదియ్యులు:** (4) వి; బహు. 'తదీయులు'కు వ్యావహారిక రూపం, శ్రీవైష్ణవ పారిభాషికపదం – భాగవతులు. (అతనికి = భగవంతునికి సంబంధించినవారని వ్యుత్పత్తి.)

"చెంతలఁ దదియ్యుల చేతి యనుజ్ఞ వడసితి
సంతతం శ్రీ వేంకటేశు శరణము చొరరో" 1-148

"ఇట్టి బ్రాహ్మణ్యమొక్కడు యిన్నిటిలోన
దట్టమై తదియ్యులకె తగును బ్రాహ్మణ్యము"

"వెదకవో చిత్తమా వివేకించి నీవు
అదన దదియ్యసేవ అంతకంటె మేలు" 3-415

**తద్విష్ణోః పరమం పదమ్:** ఋగ్వేదం విష్ణుసూక్తంలోని వాక్యం. వైకుంఠం విష్ణువుకు పరమమైన స్థానమని అర్థం.

"వైకుంఠపతి నిన్ను వడిఁగానవలెఁగాక
పైకొని తద్విష్ణో: పరమై యుండఁగను" 15-223

**తన చిత్తము నా భాగ్యము:** నానుడి; 'ఆయన దయ నా అదృష్టం' భారమంతా ఆతనిదే అనే సందర్భంలో వాడబడే పలుకుబడి, 'నీ చిత్తము నా భాగ్యము' అని కూడా ప్రయోగం.
"చెలితమాటలాడీ నంటే దొయ్యఁదాఁకాఁ
తిరుగబడు
నిజముఁ తన చిత్తము నా భాగ్యము" 7-160

**తన నా సంది పొందు:** వి. మనిద్దరిమధ్య పొందు.
"తడితోడ నేకతాన తన నా సంది పొందులు
మడవక యడిగెనా మందితనాన" 29-130

**తనివోని:** విశే. తనివి పొందని.
"తనివోని కోరికలు తగులాయములు సేయు"
12-255

**తనుతువు:** 'తనియుదువు' అనే గ్రాంథిక రూపానికి వ్యావహారికరూపం.
"చలాన నే నలిగితే జడిసేవా నీ వేమైనా
తలపోఁతనైనాఁ గొంత తనుతువు గాక" 24-592

**తపస్యుడు:** వి. తపస్సు చేసినవాడు.
"పెక్కు తపస్యులు పెద్దలు"

**తపారము:** వి. రూపాం. తప్పరము, ఒక విధమైన కుళాయి.
"చుట్టుఁదపారవు చుంగుల నడుమను
పెట్టితి వింపున ప్రియసతిని" 6-91

**తప్పఁబారు:** ప.బం. తప్పి పరుగెత్తు.
"తఱుఁగుకోలేని జీవి యెడ్డ గాక
గుఱితంయినాఁ గోఁతికొమ్మ దప్పఁబారునా"
15-154

**తప్పకచూచు:** స.క్రి. తదేకంగా చూచు, నిశ్చలంగా చూచు, (వ్యా.) విధిగా చూచు. (ఆం.క్రి.మణి.)
"తప్పక చూచితేను తలవంచుకొందురా
చెప్పినట్టిల్లా నీవుసేయఁగదవే" 29-10

**తప్పితారి:** అ.క్రి. రూపాం. తప్పిదారి. పొరపాటుగా, దైవవశాన, ఒకవేళ, పొరపడి, చెదరిపడి, గురితప్పి.
"తప్పితారి నీ చన్నులు తగ నా చేయి దాఁకితే
ముప్పిరి నాపై బొమ్మలు ముడివెట్టేవే" 17-2

**తప్పితారు:** అ.క్రి. పొరపాటగు.
"తప్పితారిన పనికి తగ నేమి సేయవచ్చు
చిప్పిలనేఁ గంటినయా సిగ్గువడ నేటికి"
26-209

**తప్పుఁదెరువు:** వి. తప్పుదారి. (వ్యా.)
"ఏలా యీ యనుమానము లింతి మనంబునఁ బాయని
తాలిమి తప్పుఁదెరువన దాఁగెఁ గదో యమ్మ"
5-306

**తప్పుఁదోపు:** వి. తప్పుగా దోచుకోవడం, కొల్లగొట్టడం. (వ్యా.)
"తారుమారు తాకుసోకు తప్పుఁదోపు లన్నియు
వోరపారు లేని వెల్ల వొక్కటికా నిజము" 1-149

**తప్పుదారు:** ఇది తప్పిదారు యా? తప్పిఁదారు అంటే ప్రమాదపడు అని అర్థం.
"తడసి యొక్కొకవేళ తప్పుఁదారుఁగాక నీవు
కడదాకా నీ పంతమే కైకొంటివి" 24-50

**తబ్బిబ్బుచేతలు:** వి; బహు. వ్యత్యస్తమైన చేతలు, పొరపాటు చేతలు.
"గబ్బితనాన నీ వొళ్ళఁ గలిగినయట్టి యా
తబ్బిబ్బు చేతలేటివో తలఁచుకోవయ్యా"
20-366

**తమకించు:** (తమకము + ఇంచు) అ.క్రి. త్వరపడు, తొందరపడు, ఉత్సహించు, యత్నించు, జంకు, మోహించు.
"తెరలోనుండఁగా గుట్టు దెటుసుకొనుంటేను
తరకానివలె నేల తమకించేవే" 13-126

**తమకి:** (తమకము + ఇ) వి. లోభి, స్వార్థపరుడు (శ.ర.) (తమకము = ఉత్సాహము, ఉత్కంఠ, కాంక్ష, మోహం. శ.ర.) త్వర కలవాడు.
"నే నెంత తమకినైనా నీకు నోరువకపోదు"
20-114

**తమ్మ :** వి. నమలి పుక్కిట పెట్టుకొన్న తాంబూలపు ముద్ద.
"యెవ్వతె తిట్టు దాఁకెనో యిదె నీకు నీ నా తమ్మ
పవ్వళించివుండఁగా పైఁబడెను" 7-424
"నాఁటఁగ నాపైఁ దిట్టుతా నా తమ్మ నీపైఁ బడితే
పాటించి తుడువనైతిఁ బంత మియ్యనైతి" 12-42

**తమ్మపడిగము :** వి. తాంబూలం ఉమ్మి వేసే పాత్ర. రూపాం. తమ్మపడిగె.
"పతివదనము తమ్మపడిగ మాయ నీకు" 9-106

**తమ్మి :** వి. తమకం, మోహం. (పద్మం, పద్మవ్యూహం)
"గక్కన నలమేల్మంగ కాఁగిలించుకొనఁగాను
తక్కక నీ కపుడెంత తమ్మి పుట్టెనో" 21-261

**తమ్మిచేతుల నాతి :** వి. తామరలవంటి చేతులు గల స్త్రీ.
"ననిచి తమ్మిచేతులనాతి విడెమియ్యవే" 28-424

**తమ్మిబొడ్డు :** వి. బొడ్డులోని తామెరతూడు.
"పోలింప నీదు తమ్మిబొడ్డుకంటెఁ బొడవున
కాలు దొక్కి నిలచెను కమలాలయ" 11-164

**తమ్మిరేకుగన్నులు :** వి; బహు. తామరరేకులవంటి కన్నులు.

**తమ్మిలోని మగువ :** వి. లక్ష్మీదేవి (తామర నిలయంగా కల స్త్రీ అని వ్యుత్పత్తి) అలర్మేల్మంగకు, కమలాలయకు తెనుగుపదం.
"తమ్మిలోని మగువతో ధరణీధరుఁడా
మిమ్ము నే నమ్మితి నాకు మీరే గతి" 3-438

**తమ్మివాటు :** వి. తామరతో వేయు దెబ్బ.
"రమ్మనరే చెలులాల రమణుని నీడకు
తమ్మివాట్లకు నేలే తనివోని సిగ్గులు" 14-514

**తరకసము :** వి. అమ్ములపొది, తూణీరం. (తరకస. మూ (వ్య.) రూపాం. తరకసా)
"పదిలముగ నిరువంక పసిఁడిపింజల యంప
పొదుల తరకసము లొరవులు నెరపఁగ" 5-210

**తరకాఁడు :** (3) వి. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు. ఇది తరికాడు కావచ్చునేమో ! తరికాడు అంటే మథించేవాడు, చిలికేవాడు అని అర్థం. (తరవుకాడు = నిర్బంధించేవాడు)
"మనసనే మోపు నెమ్మది నీకు నప్పగించితి
ఘనదుఃఖముల తరకాండ్లేలయ" 15-111
"తరుణి కూటమి గంటే దప్పిదేర్చనే వలె
తరకానివలె నుంటే తమి యాడది" 7-227
"తెరలోనుండఁగా గుట్టు దెలుసుకొనుంటేను
తరకానివలె నేల తమకించేవే" 13-126

**తరతమ్యము :** వి. 'తారతమ్యము'నకు వ్యావహారికరూపం కావచ్చు.
"దగ్గరి కొలుతు నా తరతమ్య మెంచుకోను
సిగ్గువడ నిట్టే నిన్నుఁ జేరి పాడుదు" 2-323

**తరపువెట్టు :** ప.బం. (?)
"పాటించి శ్రీవేంకటేశ పాయము తరపువెట్టి
మేటి పంతములు చూపీ మేలమాడరా" 19-215

**తరవాతి పనులు :** (8) (?)
"తరవాతి పనులింకఁ దనకో నాకో" 7-301

**తరవాయి :** వరుస.
"పురుషజంతువులెల్ల పొంచి యాఁడుజంతువుల
తరవాయిగొని వెంటఁ దగులు గాని" 4-134

**తరవాయిగొను :** స.క్రి. వెన్నంటు, వరుసబెట్టు
"పురుషజంతువులెల్ల యాఁడుజంతువుల
తరవాయిగొని వెంటఁ దగులుఁగాని" 4-134

**తరవు :** వి. నిర్బంధం, ప్రేరణ.
"జవ్వనమే తరవైతే సకు లేమి సేతురే
ఇవ్వల మీరేల నేరాలెంచుకొనేరే" 28-426

**తరవులువెట్టు :** ప.బం; అ.క్రి. ఇది తరువులు పెట్టు కావచ్చు, నిర్బంధాలు పెట్టు.
"సాహసభూతము మన హింసలకే చూపించి జేయి
దాహపుటాసలు వెనకముందరల తరవులు వెట్టీని" 2-300

**తరితీపు:** వి. 1. మోహం, వలపు 2. కీర్తి, సంతోషం 3.తమకం, తహతహ 4. బాధ 5. అపేక్ష, అతిశయం, చెలిమి, కోరిక, శృంగారచేష్ట. (అపేక్ష అని అం.వ.ని.)

"ఇన్నిటా శ్రీవేంకటేశ! యేలితివి వేడుకతో
యెన్నసి తరితీపుల నింపు పుట్టించేవయ్యా!" 27-532

**తరితీపులఁబెట్టు:** స.క్రి. సంతోషపెట్టు, వలపించు, బాధపెట్టు.

"ఘాటుపుఁగాంతలనెల్లా జొక్కించి దొక్కించి తరి
తీపులఁబెట్టీ నిదే తిరువేంగళనాథుఁడు" 18-229

**తరితీపుసేయు:** స.క్రి. 1. సంతోషపెట్టు, వలపించు 2.బాధపెట్టు 3. గర్వించు. (తరితీపు = ధృతి ఉపేక్ష - అం.వ.ని.)

"దంటతనముల నెంత తరితీపుసేసేవే" 26-548

"తలవంచుకోనేల తరితీపు సేయనేల
పలికితే నీతో మారు పలుకగవలదా" 14-475

సంతోషపెట్టు, వలపించు:

"తప్పక చూచుకొంటా తరితీపు చేసుకొంటా
అప్పటి మేకులు సేసీ నంగన నీతో" 14-587

**తరివట్టుకొను:** అ.క్రి. అవకాశాన్ని జారవిడుచుకోకుండా కాచుకొను. (F.N 23 సం, 215 పు.)

"తలఁప మోవితేనె తరివట్టుకున్నది
పిలుపు మానె రావయ్యా పెనఁగక ఇపుడు" 23-321

**తరివెన్న:** వి. అప్పుడే తీసిన వెన్న, హైయంగవీనం.

"తిరిగి కవ్వపుఁ గొలదిక్కఁ గాగిలించి పట్టి
తరివెన్న వెట్టుమనీ తగునే యీ కృష్ణుఁడు" 16-420

**తరువరివాఁడు:** (తరువు+అరి+వాఁడు) నిర్బంధించేవాఁడు, బాధించేవాఁడు (తరువు = ఈయవలసిన ధనాధికము నిమ్మని చేయు నిర్బంధము), నిర్బంధము సూ.ని.

"తాలిమి యించుకా లేని తరువరివాఁడమ్మ
ఆలరీఁడు నీ బిడ్డఁడదె బుద్ధి చెప్పరో" 22-69

ఈ పదం తఱువలి కావచ్చు. తఱువలి అంటే ఉద్ధతుడు (వ్యు.) గౌరిపెద్దివారు దీనికి ఉత్తరువు కలవాడని, ఉత్తరువులతో లేక ఆత్రముతో నితరుల నుపద్రవపరచు వాడని భావమని చెప్పినారు. (22 సం. పీఠిక 7 వ పుట.)

**తరువలి:** వి. తరుణవయస్కుడని సం.వ.స. (13వాల్యూం)

"ఘనయాచకునకు కనకమే బ్రహ్మము
తనువే బ్రహ్మము తరువలికి" 1-457

**తఱఁగరితనము:** వి. దళారితనం.

"ఎఱుఁగుదు మిందరము నీ వలపు
తర(ఱఁ) గరితనముతో దాచ నేమిటికే" 21-357

**తఱగరివాఁడు:** వి. బేరగాడు, జట్టిగాడు 'తఱుగరి'కి వ్యావహారికరూపం.

"తఱగరివానివలె తచ్చితచ్చి మాటాడేవు
యెఱఁగవా నా గుణ మింతకతొల్లి" 23-170

**తఱచు:** వి. బాహుళ్యం, ఆధిక్యం.

"మానాపతులము నీ మర్మములెత్తేమా
తానకపునిట్టూర్పుల తఱచులే సాక్షి" 13-15

**తఱమీ:** (?)

"తఱి నా హృదయము తగ వికసించిన
తఱమీ నజ్ఞానతను మదినాకు" 1-447

**తఱవాత:** క్రి.విశ. 'తరువాత'కు వ్యావహారికరూపం. వ్యావహారికంలో బండి ఱ ఉండడం విశేషం.

"ఎఱఁగక కొసరితి నెఢ్డనయ్యా తఱవాత
నన్నియును తానే వచ్చీనయ్యా" 14-236

**తఱవు:** (?)

"తఱవు రతికి రేఁచె తనువెల్లా నెచ్చరించె
వొఱపైన కొనగోరు వొప్పదా యేమి" 19-470

**తఱి:** తరువాత, అదను, తెరపి, అవకాశం, సమయం, ఈడు, వయస్సు, సమీపం.

"తఱి నిహపరము లితని దాసులిచ్చిరి" 3-99

అదను :

"తటితో నా మాఁట తానే తలఁచుకొమ్మ నీవే" 20-135

**తలఁజుట్టు :** పబం; స.క్రి. బలవంతంగా అంటగట్టు.

"పలు లంపటములచేఁ బడుట దుఃఖంబులు

తలఁజుట్టుటే కాక తనకేమి కలదు" 1-150

**తలఁబాలు :** (తలన్+ప్రాలు) తలంబ్రాలు, వివాహ సమయంలో వధూవరులు ఒకరి తలమీద మరొకరు పోసుకొను మంగళకరమైన పసుపు కలిపిన బియ్యపుగింజలు.

"తెలినవ్వు సిగ్గులనే తెరలు వట్టించితివి

తలఁబాలు వోసితివి తమకము" 27-179

**తలకిందగు :** ప.బం; అ.క్రి. తారుమారగు, వ్యత్యస్తమగు.

"కోవిల పలుకదు కొమ్మావిలతల

దైవిక మిదివో తలకిందాయ" 5-44

**తలకిందుగ పడు :** ప.బం; అ.క్రి. తలకిందులగు.

"బలువునఁ బారంగ మోహపుపాశము తన మెడఁ

దగిలిన తలకిందుగఁ బడు టెల్లను తన కిది

ప్రియమౌనో" 1-306

**తలకూడు :** అ.క్రి. 1. సిద్ధించు, నెరవేరు 2. కలుగు, సంభవించు.

"గుణములెల్ల నిర్గుణముకాక

తలకూడదు శాంతంబు" 1-451

**తలకెక్కు :** (తలకు+ఎక్కు) ప.బం; అ.క్రి.1.ముమ్మరించు, అతిశయించు 2. మనసుకు అంటు, బోధపడు.

అతిశయించు :

"కలసినప్పటికి కడదొడమ లేక

తలపోఁత వలపులు తలకెక్కును" 17-399

"తడవుగా నవ్వఁగాను తలకెక్కె వలపులు

యెడయక యిందులో నీ వెందుకయ్యేవే" 22-511

**తలకెత్తుకొను :** (తలకు + ఎత్తుకొను) ప.బం; స.క్రి. నెత్తిన వేసుకొను, భారం వహించు.

"వసముగాని పని వడిఁ దలకెత్తుక

అసురుసురు గానిదది సుఖము" 3-545

**తలకొలుపు :** స.క్రి. లగ్నంచేయు.

"తలఁచేటి తలఁపులు ధరణీధరుపై

తలకొలుపుదురా తదీయులు" 1-402

**తలగడ :** వి. తలకింద ఎత్తుగా ఉంచుకునే దిండు. (పడుకునేప్పుడు తల ఉంచుకునే దిక్కు, తల ఉంచుకునే ప్రదేశం.)

"మొలనూలిగంటలాపె ముంచి నీ పాదాలు గుద్ది

తలగడ వెట్టి మోముతావి నలయ" 22-187

**తలగడబిల్ల :** (2) వి; ప.బం. దిండు, మెత్త చూ : తలగడ.

"తరుణి గుబ్బలు నీకు తలగడబిల్లలుగా

నొరగుకొన్నాఁడవు వుబ్బున నీవు" 18-139

**తలగాచు :** స.క్రి. రక్షించు.

**తలగుండుగండ :** వి. చూ : తలగుండుగండఁడు.

"సోదించు మారీచుని తలగుండుగండ" 4-3

**తలగుండుగండఁడు :** (2) వి; ప.బం. శత్రువు, భయంకరమైనవాఁడు, ప్రాణాంతకుడు.

"ఘోరరావణుని తలగుండుగండఁ డీతఁడు

వీరాధివీరుఁడైన విష్ణుఁడీతఁడు" 28-503

"దావతి నరకాసురు తలగుండుగండఁడు

శ్రీవేంకటాద్రిమీఁదఁ జెలఁగే కృష్ణుఁడిదివో" 17-144

**తలతల :** ప.బం. తలకు, ఒక్కొక్కరికి. (పద.)

"పులకలే చూపేవు పొంది కరఁగితినంటా

తలతల అందు కేమి తగదా నేఁడు" 11-356

**తలతిక్క :** వి. పట్టిన పట్టు వదలక పోవడం.

**తలదీసుకొను :** ప.బం. మిక్కిలి పరితపించు.

"తవిలి నవ్వితే నే తలదీసుకొనేవు" 13-169

**తలదోఁక :** ప.బం; వి. మంచీ చెడ్డా, ఒక పద్ధతి.

"కలవోసినను(నీవు)ట్ల కడ యేలె?

తలదోఁక యేరువడె తగులింక నేలె" 22-30

**తలదోఁకలేని:** విణ; ప.బం. ఒక పద్ధతి లేని, ఒకరీతి లేని, మొదలు తుద లేని.
"తలదోఁక లేని చిత్తమున వలపులఁబొరలు
పొలఁతులింతకు మున్ను పుట్టరో చనరో"
5-356

**తలనీలాలు:** ప.బం; వి; బహు. తలవెంట్రుకలు.
"తలపోఁత లన్నియును తలనీలాలై నించి
తెలిఁగప్పుకొని పెనుఁజీఁకటు లాయను"
12-434

**తలపట్టు:** వి. తలనొప్పి వచ్చినపుడు తలకు వేసుకునే మందిగంధం మొ॥ వాటి పట్టు.
"తలపట్టుతో సుందాని దగ్గరకు రాకురా
తలపట్టి నీమీదఁ దగులాయెనే" 15-48 old

**తలపిడి కొలుపిడి:** ప.బం. ఈ పదానికి సంపాదకులు సం.ప.స.లో (2 సం.381 పు.) ఈ విధమైన వివరణ ఇచ్చినారు. "తలపిడి, కొలుపిడి – ఈ పదముల కర్థము నిఘంటువులలో కానరాలేదు. సొమ్ము శబ్ద సాహచర్యంతో నే నిట్లూహించుచున్నాను. దండలు మొదలైనవి చేయించునపుడు, ఇన్ని పిళ్ల (పిడుల) కొలత అని చేయించుట నేటికిని సంప్రదాయము. అట్లు చేయించిన సొమ్మును ఎవరైన దొంగిలించి, వారివద్ద పట్టు పడినచో తలపిడి = తొలుత చేయించిన పిళ్ళకొలత, కొలుపిడి = (ఇప్పుడా సొమ్మును పట్టుకున్నప్పుడు) కొలువగా వచ్చిన పిళ్లకొలత ఒకటేఐనచో ఇది నా సొమ్మే అని నిర్ధారించి తీసుకొనునట్లు అనే అభిప్రాయము తోచుచున్నది. ఈ శబ్దమింకను విచార్యము.
"యిలమీఁద తమ సొమ్ము లెవ్వరి వద్ద నుండినా
తలపిడి కొలుపిడి తగిలినట్టు
తొలుత పంచేంద్రియపు దొంగలవద్ద నున్నాఁడ
వెలయ నీ సొమ్మనుచు విడిపించుకొనవే" 2-5

**తలపువ్వువాడని:** విణ. కొంచెంకూడా శ్రమ పొందని.
"తలపూవాడని తరుణినే నేను
నే నలరుఁ జవికలోన యాకెనే కదే" 6-105

**తలపూవాడని తరుణి:** ప.బం. సుకుమారురాలైన స్త్రీ. 6-105

**తలపోయు:** ప.బం. రెండు కొలపాత్రల కొలత సరిచూచు. ఇది రేనాటి ప్రయోగం.
"పొంకాన నదె తలపోసేవు నాతోను
పంకించక నీ కన్నియుఁబొజు చూపేఁజుమ్మీ"
14-89

**తలమరకాఁడు:** వి. ప్రధాననావికుఁడు.
"సరిఁ బాపపుణ్యముల సరకులు నించుకొని
దరిచేరె జీవుఁడనే తలమరకాఁడు" 3-388

**తలము:** వి. చేతుల కిందిభాగం. (కాళ్లకింది భాగం)
"వెలనుండి కలఁకలు వెదకేవు మాఁటలకు
తలములు సోకించి తమకించేవు" 27-554

**తలము:** వి. తావు, ప్రదేశం. (శక్తి)
"తల మేల కుల మేల తపమే కారణము
యెలమి హరిదాసులు యే జాతియైన నేమి"
15-285

**తలమునుకలు:** ప.బం; అ.క్రి. అధికం, అతిశయించినది.
"మొనసి చెమటఁదలమునుకల నీటిలోన
పనివడి నీకుఁదపము చేసీని" 7-380

**తలమొల:** (3) ప.బం; వి. మొదలూకొనా; తలాతోకా అన్నట్లు.
"దైవమా నీ మాయ తలమొ లెఱుఁగనీదు
కావరపువిషయాల కట్లు వదలవు" 2-4
"తలమొల యెఱుఁగక తఱి నిద్రించేవేళ
వెలి నోళ్లెఱఁగనిది వెఱ్ఱి గాదా" 15-67

**తలమోఁపు:** ప.బం; వి. ఎక్కువ, మోపెడు. (పద.)
"తండోపతండములై తలమోఁపులు పనులు
చండిపెట్టీ పనిగొను సంసారము" 3-111

**తలమోచు:** ప.బం; అ.క్రి. శిరసావహించు, నెత్తిన పెట్టుకొను (భక్తిశ్రద్ధలతో), ఒప్పుకొను.

"తలమోచి కాపురము ధాన్యములు గూడపెట్టు
యిల సంసారము దనకిఁక నెంత గలదో" 3-468

**తల రాయి యగు :** ప.బం; అ.క్రి. బాధాకరమగు. (పద.)
"తల రాయిగాఁగ నెందరికి మొక్కెడిని
తెలివిమాలిన యట్టి దేహి" 1-201

**తల ఱాయిసేసుకొను :** ప.బం. ఎన్నికష్టాలు వచ్చినా ఎవరేమన్నా నిర్వికారంగా ఉండు.
"తలచిన వేళ నెంతవడి నేఁ గోపించినాను
తలఱాయి సేసుకొని తగులుదుగాక" 11-553

**తలలూఁచు :** ప.బం; అ.క్రి. ఆశ్చర్యపడు.
"ఇంతవాఁడవు గాకున్న యేది దూరతనము
వింతకు తలలూఁచేరు వీధికట్టువారలు" 13-171

**తల లేదు తోక లేదు :** నానుడి; మొదలేదో తుద ఏదో తెలియనంత కలగాపులగంగా ఉందనే అర్థంలో వాడబడే పలుకుబడి. (పద.)
"తల లేదు తోక లేదు దైవమాన మాయలకు
తెలిసియుఁ దెలియక తిరిగేము నేము" 4-368

**తలలోఁ బూరిగట్టు :** ప.బం. అపవాదు కలిగించు.
"తగ వెఱఁగవద్దా తమకించి చెనకేవు
మగువల తల నేల మహిఁ బూరిగట్టేవే" 18-247

**తలవంచుకొను :** ప.బం; అ.క్రి. లొంగిపోవు, అవమానపడు.
"నీ వేల సిగ్గుపడేవు నెట్టన దలవంచుక
భావించి భావించి నన్నుఁ బైకొని మెచ్చేని"
8-34

**తలవంపు :** వి; ప.బం. అవమానం.
"తలవంపులే చెప్పే టగ నీ సుద్దులెల్లా
పలికే యానతి చెప్పే బలునిందలు" 26-506

**తలవయ్యా :** క్రి.ప. తలచుమయ్యా.
"తలవయ్యా మమ్ము నేల తడవేవయ్యా" 11-167

**తలవాకిటికి తెచ్చు :** ప.బం; స.క్రి. అవసానదశకు తెచ్చు.
"తెలిఁగనున చూపు దీని చేతలనె పో
తలవాకిటికిఁ దెచ్చెఁ దరుణి ప్రాణములు" 6-135

**తలవాకిలి :** వి; ప.బం. ఇల్లు మొ॥ వాటి ప్రవేశద్వారం, ముఖద్వారం, ఇంటి వెలుపలి స్థలం.

**తలవీడు మొలవీడు :** ప.బం; అ.క్రి. తలమీది వెంట్రుకలూ, మొలమీది బట్టా వీడిపోవు.
"తల వీడి మొల వీడి దంతపుటోవరిలోన
అలమి నాపెయు నీవు నట్లుండఁగా" 20-500

**తలవెంట్రుకలందరు :** ప.బం; బహు. అసంఖ్యాకులు.
"తలఁచి మొక్కే సురలు తలవెంట్రుకలందరు
తలఁచి వరము లడిగేవారలు
తలవెంట్రుకలందరు వారే" 3-538 & 2-301

**తలారికము :** వి. అధికారం, రక్షణ.
"ఈల గద్దమూఁకలోన యించుక కోడిపిల్లకు
మూలమూలలఁ దలారికములు చెల్లునా"
10-33

**తలుపుమాటుది :** (తలుపుమాటు + అది) వి. తలుపుచాటు స్త్రీ, ఇంటివ్యవహారాలు మాత్రమే తెలిసిన స్త్రీ.
"తలుపుమాఁటుదాన తలవంచుకుండితేను
బలిమి గల దేవులు పంతములు మానునా"
18-340

**తలె :** వి. పళ్లెం, తళియకు రూపాం. రా.సీ.; తెలం. ప్రాంతాల మాండలికం.
"కలది కుక్కిమంచము కన్నవారెల్లాఁ బండేరు
తలెతో దొగ్గి నంబలి దావకూళ్లు" 1-370

**తల్లికిఁగలుగు ముద్దు దాదికున్నదా :** సామెత; బిడ్డమీఁద తల్లికుండే ప్రేమ దాదికి ఉండదుకదా! అని భావం.
"తల్లికిఁగలుగు ముద్దు దాదికున్నదా
బిల్లరప్రియము లేలో చెప్పేము గాకా" 15-98

**తవరులు :** వి; బహు. (?)
"వెంట నీకె తవరులు వేరె వచ్చు టెఱఁగము
యింటికిఁ బిలుచుకొంటి యేడకేడో నేను"
17-59

తవుడు దిండి కడబాల లీల : వ్యర్థమనే అర్థంలో వాడబడే నానుడి. తవుడునే ఆహారంగా తీసుకునేప్పుడు వంటవాళ్ళెందుకు? అనవసరమే కదా!

"కగ్గు లేక గుల్ల గుల్లే కాక మరి రాయవునా
అగ్గమై తవుడు దిండి కడ బాల లీల" 15-154

తవ్వి కట్టుకొను : ప.బం; స.క్రి. దాచుకొను (పద.), తనకై మిగుల్చుకొను, నెత్తిన వేసుకొను, అనుభవించు.

"జవ్వనము మోచేదియు సరి ముడిసేదీ కాని
తవ్వి కట్టుకొనేది దాచేదీది" 2-271

తవ్వి తలకెత్తుకొను : ప.బం; అ.క్రి. అనుభవించు, సంపాదించు, ఒరగఁబెట్టు, పెద్దగా కూర్చు (పద.) మేలుచేయు, లాభం కలుగజేయు. (తె.జా.)

"రవ్వలనే నిన్ను నిట్టే రతిసేసిన వలపు
తవ్వితలకెత్తుకొంటే తరుణి భూమిని" 7-27

"తవ్వితలకెత్తేవు నీ తగవులు మాకును
వువ్విళ్లూర మా మనసు వొడఁబడినా" 23-121

తష్టి : వి. (?)

"నష్టి లేదు నడచేది నడపక మానరాదు
తష్టి గట్టుకొంటిఁగాక తా మానఁబొయ్యీనా"
4-197

తహ : వి. సమ్మతి, అంగీకారం, (వ్య.) తమకం, వ్యసనం, ఉత్కంఠ, వేగిరపాటు, అజ్ఞానం.

"ఇల నీ దాస్యంబిది యొకటే సిలుగుల భవముల
జిలుగు మాన్పనది చిత్తము తహ దీర" 2-376

తహతహ : వి. తమకం, వ్యసనం.

"విన్నదాకా తహతహ విడువదేమో కాని
పన్ని సిగ్గుపడైతే పచారించ నిన్నును" 26-398

## తా

తాఁకనాడు : ప.బం; అ.క్రి. మనసు నొచ్చేట్లు పలుకు.

"దంటమాటలనె నన్నుఁదాఁకనాడేవు వోరి
జుంటితేనె తీపులెల్లఁ జారలాడేవా" 5-3

తాఁకుసోఁకు : వి; ప.బం. ఆటంకం (?)

"తారుమారు తాఁకుసోఁకు
తప్పుఁదోపులన్నియు
వోరపారు లేనివెల్ల వొక్కటెకా నిజము" 1-149

తాఁటతూఁటలు : వి; ప.బం. మోసాలు (తె.తె.ని.) (తాఁట = వంచన. వాచ.)

"తాఁటతూఁటలూ నేల తా వచ్చినట్టే వత్తము
పాటించిన నా వలపు పండి పొల్లయ్యీనా" 7-20

-తా : (77) 'తూ' అనే శత్రర్థంలో వాడబడే మాండలిక రూపం. ఉదా :- నవ్వుతా 11-515, చల్లుతా 7-596, మొక్కుతా 13-307 మొ॥. అన్నమయ్య అంతటా 'తా' అనే శత్రర్థకరూపాన్నే వాడినాడు.

-తా : తాళద్యోతకమైన శబ్దం (?)

"శిన్నెక తేవే శెలువుని తా
వెన్నలు సవిగొను వెన్నుని తా" 5-268

తాకుఁజేయు : ప.బం; అ.క్రి. అడ్డుకొను, మార్కొను.

"కొండలవంటి చన్నులు కుమ్మెలుగాఁ దాకుఁజేసు
అండనేల కాఁగిలించే పతివా" 26-320

తాచు : స.క్రి. 1. తన్ను, పాదతాడనం చేయు 2. అదుము, అణఁగఁదొక్కు 3. తాకఁజేయు 4. కొట్టు.

"మరిగితి నలమేల్మంగను నేనూడిగపు
తరుణుల తొడలపై తాచరాదా పాదాలు"
18-557

"యేది కోపించకతొల్లె యింతిచేసేన చేయించి
తాచి నీ కాఁగిట నీవు తమి రేచవయ్యా"
11-486

తాటకి : (2) వి. 'తాటక'కు వ్యావహారికరూపం, తాటక యనే రాక్షసి.

"రాముఁడుదయించె దశరథునికిఁ దమ్ములతో
గామిడైన తాటకిని ఖండించెను" 4-476

**తాటతూఁటలు :** ప.బం; వి; బహు. అతుకులపనులు.
"ఏటికయ్యీ మాటలు యింకా తాఁటతూఁటలు
యీటువెట్టుకొని నన్ను నే మనేము నేము "
9-233

**తాటలుఁదూటలు :** ప.బం; వి; బహు. మోసాలు, వ్యత్యాసాలు. (అం.ప.ని.)
"ఆఁటదాని యానవేరే అంతరంగాన నుండఁగా
తాఁటలఁదూటలఁ బెట్టి తనియించవలెనా"
14-379
"పోరచి వో రమణుఁడ పొందుదాఁక వినయాలె
తారుకాణ లటుమీఁదఁ దాఁటలుఁదూఁటలునే"
26-87

**తాటించు :** (2) స.క్రి. 1. కొట్టు 2. మీటు 3. ఒకదానితో నొకటి తాకించు, వాయించు, కలిపికొట్టు 4. చిందులు తొక్కు 5. కోపాదులచే దౌడ లొకదానితో ఒకటి కొట్టు, అప్పళించు 6. పొడుచు 7. కదల్చు 8. ఆలోచించు 9.తాపడంచేయు.
"యీటున శ్రీవేంకటేశ యింతి నిట్టే యేలితివి
తాటించు నీ రతులను దైవారీని" 27-30
"బబ్బిలికాయల రవములు పదనూపురములఁ గెలయఁగ
తబ్బిబ్బుగ నునుపాదము తాటించెద వేలే"
5-164

**తాటిమాని నీడ :** ప.బం; వి. లేనిది, అతిస్వల్పమైనది.
"రతులలో మాటలు రావిమాని పువ్వులు
తతి విరహపుకాఁక తాటిమాని నీడ" 2-268

**తాటోటు :** వి. మోసం, వంచన, టక్కుటమారం. (పద.)
"తక్కరి గాదు ఆపె తాటోటుఁగాదు
పెక్కువేసేసి పొగడే యెంత గలదు" 16-183

**తాటోటుకాఁడు :** విణ. మాయావికాఁడు, మోసగాఁడు.
"తప్పులే కూడైనట్టి తాటోటుకాఁడవు నీతో
యిప్పుడు నమ్మి నీ పొందులెట్టు నేఁజేసితిరా"
7-10

**తాడుపడు :** (13) అ.క్రి; ప.బం. బంధితమగు, నిస్సారమగు. తాటిచెట్టువలె నిర్భయంగా నిల్చు - మ్రానపడు వంటిది అని సం.ప.స. (13 – 317) కృశించు, దారమగు.
"తాడుపడ్డ మనసుకు దైవము విష్ణుఁడే యని
పాడి కొలిచిరి తొల్లి బ్రహ్మాదులు" 13-317
"వీడనాడ జాలక నే వీడె మిచ్చేఁగాని నీకు
తాడుపడె నీ మనసు తమకానను" 20-130

**తాడుపై తపసు :** (2) అసాధ్యమైన పని, కష్టసాధ్యం. తాటిచెట్టుపై తపసు అని వాచ్యార్థం.
"పాడి చెప్పనని వచ్చి పక్షపాతమాడరాదు
తాడుపై తపసు నీవే తలుచుకోవయ్యా" 23-231
"తాడుపై తపసు తమ ధనము ప్రాణులకు"
1-104

**తాడుపొడవు :** ప.బం. అధికం, మిక్కిలి.
"యీడనె శ్రీవేంకటేశుఁడేలె నన్ను
తాడుపొడవు గర్వము తన కేలే" 23-270

**తాడుమీది తపసు :** వి; ప.బం. అసంభవం, కష్టసాధ్యం. చూ : తాడుపై తపసు.
"యీడనె నన్ను శ్రీ వేంకటేశ కూడితి
తాడుమీది తపసులు తడవకుమీఁక" 27-209

**తాడు లేని కట్టు :** వి; ప.బం. అసంభవం, తాడు లేకుండా కట్టు కట్టడం ఉండదు అనే దానిపై వచ్చిన పలుకుబడి.
"గోడలేని చిత్తరువు కొలచీనందే
తాడులేని కట్టు పట్టి తగు లేలే యిఁకను"
19-393

**తానకపుఁగానుకలు :** వి. స్థిరమైన కానుకలు.
"తానకపుఁగానుకలు దక్కనో దక్కదో" 23-53

**తానకపు కతలు :** వి; బహు. చమత్కారపు కథలు.
"సోనగా మై చెమరించి చొక్కేయట్టుగాను
తానకపు కతలెల్లాఁ దలఁచుకోవయ్యా" 23-136

**తానకపుజపములు:** వి; బహు. స్థిరమైన జపాలు, నైష్ఠిక జపములు (?)
"అనుక శ్రీవేంకటేశ అలమేల్మంగ పతివి
తానకపుజపములే తగ మీకు నుతులు" 2-272

**తానకపుభోగములు:** వి; బహు. చిరంగా ఉండే భోగాలు.
"నానాముఖములు పుణ్యము లెల్లాను
తానకభోగములై తగిలించీని" 4-154

**తానకపువేదములు:** వి; బహు. శాశ్వతమైన వేదములు.
"యీ నాలుకే కాదా యిందరినిఁ బొగడేది
తానకపువేదములు తడవీఁగాక" 4-44

**తానకము:** (15) వి. నిఘంటువుల్లో దీనికి పాదు, ఉనికిపట్టు, మల్లయుద్ధంలో జెట్లు నిలబడటం లోని భేదం, వినయాభినయం, దండప్రణామం, తులామానంలో దాళా సరిపుచ్చడానికి ఉపయోగించే రాయి, పడికట్టురాయి, ఒక తరహా పాటు అనే అర్థాలు ఉన్నాయి. వీటితోపాటు చమత్కారం అనే అర్థం కూడా తె.తె.ని. లో చూపబడింది. స్థానం అనే అర్థానికి స్థిరం అనే అర్థం ఉంది కనుక దీనికి స్థిరమైన అనే అర్థం కూడా చెప్పవచ్చు.
"తానెంత నేనెంత తగుల నేమాడీనే
తానకమయిన తన దయలోనిదానవు" 28-382
ఇట స్థిరమైన అనే అర్థం సరిపోతుంది.

**తానము:** వి. 'స్థానము'నకు వికృతిరూపం.
"వీనుల నిండాక నేను విని తల యూఁచనా
తానాలు దిద్దీని యట్టే దండ నిడికొనుచు"
17-188

**తాప:** (5) వి. మెట్టు, మణి, రత్నం, నిచ్చెన, ఎక్కడానికి దిగడానికి వీలుగా కట్టిన నిర్మాణం.
"కైవల్యమునకుఁ గనకపుతాపల
త్రోవై శ్రుతులకుఁ దుదిపదమై" 1-117
"తక్కక శ్రీహరిభక్తి తాపలు సేసి యెక్కిరి
చక్కఁగా వైకుంఠము సనకాదులు" 1-490
"తాప లేక మేడ లెక్కఁ దలఁచేము" 1-65

**తాపపుండ్రములు:** వి; బహు. చక్రాంకనములు మరియు ద్వాదశపుండ్రములు, ఇవి శ్రీవైష్ణవ సంస్కారాలు.
"యెంచఁ దాపపుండ్రనామహిత మంత్రయాగమని
పంచసంస్కారము చెప్పె పాంచరాత్రధర్మ మిది" 15-113

**తాప లేక మేడ లెక్కఁదలఁచు:** వ.బం. అసాధ్యమగు పనికి పూనుకొను, మెట్లు లేకుండానే మేడలెక్క దలచడమని వాచ్యార్థం.
"తాపలేక మేడలెక్కఁ దలఁచేము" 1-65

**తాపి:** వి. తాపికత్తె. (సూ.ని.లో ఈ పదానికి సంకేతస్థలమని అర్థం చెప్పబడింది. కాని ఈ అర్థం ఇక్కడ పొసగదు.)
"తీపుల మాటలఁ బోదు తేటల వెన్నెలఁ బోదు
తాపివై నిన్ను బోదించేదానిఁ గంటేఁగాని"
11-355

**తాపికత్తె:** (తాపి + కత్తె) సంధానం చేసే స్త్రీ, కుట్టని. (శ.ర.)
"బాపుబాపు నేఁజేసిన భాగ్యమెట్టిదో
తాపికత్తెఁ జేసి నన్ను దయఁ జూచితివిగా"
27-479

**తాపికాఁడు:** (తాపి + కాఁడు) తార్పుడుకాడు, విటీవిటులను తార్చేవాడు, సంధానకర్త.
"చెల్లెలి నెత్తుకపోను సెలవిచ్చె మరఁదికి
కొల్ల తాపికాఁడు కాని గుణమేఁటిదే" 14-201

**తాపితనము:** (తాపి + తనము) తార్పుడు, సంధానం చేయడం, కుట్టనీత్వం.
"కడనుండి నవ్వుకొంటా గలపే వొకరొకరిఁ
దడవక మానవే నీ తాపితనాలు" 29-462

**తాపు:** స.క్రి. అదుము, నొక్కు, తగులుకునేట్లు చేయు. (శ.ర.)
"శ్రీపతి పంపిటు సేసితి మింతే
తాపీ మమ్ముఁ దగులఁదగవేది" 4-254

**తామర:** పద్మం, అన్నమయ్య 'తామెర' అనే పదాన్నే ఎక్కువగా వాడినాడు. 'తామర' పదం అతివిరళం.

"తామరల విరులపైని తగు శాలిగర్భములు
ఆ మీఁద నరఁటులును అంగజాలేరు" 26-362

**తామరతంపము :** ప.బం; వి. పరంపరాభివృద్ధిగా అభివృద్ధిచెందేది, అభివృద్ధి.
"అరిది విశ్వకుటుంబియైన వీనికి మొక్కరో
పరఁగ దామరతంపముగాఁ జేసీని" 15-180

**తామరలోని కాంత :** వి. లక్ష్మీదేవి.
"గట్టిగఁ దామరలోని కాంత మానితినని
గుట్టుదీర నానవెట్టుకొనక నీన్నొల్లను" 6-166

**తామరాకగు :** ప.బం; అ.క్రి. సుకుమారమగు.
"ఆకడఁ దామరాకైనందుకు నెగడవెట్టి
వాకిటఁదన్ను నాగినా వగపు పోదు" 17-30

**తామరాకునీరు :** ప.బం; వి. అస్థిరం, చంచలం. 2-445

**తామసించు :** (2) అ.క్రి. ఆలస్యం చేయు, జాగు చేయు.
"ఏమమ్మా మగువా నీ వింత సేతురా
తామసించనేటి కిఁక దయఁజూడవమ్మా" 24-198

**తామెర :** (30) వి. 'తామర'కు వ్యావహారిక రూపం. అన్నమయ్య పెక్కుచోట్ల 'తామెర' పదాన్నే వాడినాడు.
"తామెరలవంటి వేమో తరుణి నీ కన్నులు ఆ
తామెరలే మరునికి తగ బాణాలు" 19-523

**తామెరకన్నులది :** వి. తామరల వంటి కన్నులు గల స్త్రీ, పద్మాక్షి.
"తామెరకన్నులదాన తామెరచేతులదాన" 20-592

**తామెరకొలను :** వి. తామరకొలను.
"తామెరకొలనువలెఁ దగుఁ దిరుచేల చాతి
కోమలు లిద్దరుఁ దాను కుచ్చళ్లు వోసి" 14-368

**తామెరచేతులు :** వి; బహు. పద్మమువంటి చేతులు.
"తామెరచేతులఁ దగఁ బూజించీ
నామని సన్నల నతివ" 26-189

**తామెరతొట్టి :** వి. (?)
"తామెరతొట్టిలలోన తగిలి తా నుండుఁగాన
తామెరకన్నులఁబోలి తనరినది" 22-64

**తామెరపాకు :** (తామెర + ఆకు) వి. తామరాకు.
"తామెరపాకుల నీరు తగనందు నంటునా" 2-445

**తామెరమోముది :** (తామెరమోము + అది) తామరలవంటి ముఖం కల స్త్రీ, పద్మముఖి.
"తామెరకన్నులదాన తామెరచేతుల దాన
తామెరమోముదాన తడవే దేమి" 20-592

**తాయిమక్కళాలు :** (2) వి; బహు. (తాయి = తల్లి, మక్కళ్ = బిడ్డలు) తల్లీబిడ్డలు (దోబూచులు, దాగుడుమూతలు) ఇది కన్నడపదం.
"ఆయ లేరే యేమి చెప్పే రాతని సుద్దులు నాకు
తాయిమక్కళాలే కాక దయ గద్దా తనకు" 17-303

**తారము :** వి. నాలుగుకాసుల రాగినాణెము.
"తనుఁగొలువ కూడితే తారము వెట్టఁడేలిక
పెనఁగి కొలువకున్నఁ బెట్టు దేవుడు" 15-52

**తారవిద్య :** వి. కాళి మొదలైన దశమహావిద్యలలో ఒకటి.
"తారవిద్యఁ గంటిమి, తగిలి నాసాగ్రమందు
మేరతో ద్రిష్టి నిలిపి మేలుఁబొందుట" 1-452

**తారసము :** వి. తలపాటు, ఎదుర్కోవటం.
"తార వలచినయపుడె తరుణి రతుల
తారసము లెట్లుండు తగవు లెట్లుండు" 6-27

**తారు(ఱు) :** అడఁగు, మఱుగు, దాగు, మరుగున పడి వెళ్ళు, నక్కుతూ పోవు, చొచ్చు, ప్రవేశించు, కృశించు, చెడు
"నేరమి సేసినవాఁడు నిక్కపుటేలికఁ గని
తారి తారి యిందునందు దాగినయట్టు" 3-107

**తారు :** సమీపించు.
"అరసి నేనడుగఁగ నన్యులిచ్చే యీవులు
తారి పూర్వకర్మాది దైవమే యిచ్చీని" 2-440

తారు:
"తారి బియ్యము దంచితే తవుడు
వెళ్లకుండునా" 7-194

తారు: వ్యాపించు, పుట్టు.
"తారి తారి పయ్యెదెల్లాఁ దడిసెఁ జెమటల"
14-43

తారుకాణ: 'తారకాణ'కు రూపాం. దృష్టాంతం, నిదర్శనం, ప్రమాణం.
"చెప్పఁగదె మీ సుద్దులు చెవులార వినేము
తప్పక వలపులెల్లా తారుకాణ వచ్చీనా" 26-351

తారుకాణ సేయు: సత్యమని చూపు, రుజువుపరచు. (వ్యు.)
"యెంత సేసినాఁ దనపై యిట్టే నిందలు మోపీనా
కాంతల దెప్పేల తారుకాణ సేసీనే" 29-357

తారుకాణించు(కొను): తారకాణించు, నిరూపించు, దృష్టాంతము చూపు, మూదలించు.
"ఎక్కడికిఁ బోనందువు యెవ్వతె నంట నందువు
గుక్కక తారుకాణించుకొందుఁగాని రావయ్యా"
13-436
"ఆ రీతి నీవు దొరవు ఆఁటదాన నేనింతే
తారుకాణించఁగరాదు తలఁపులో వలపు"
26-262

తారుమారు: అ.క్రి; ప.బం. తారుమారగు.
"కూరుములు గొసరుతా గోరఁజెమట చిమ్ముతా
తారుమారై వలపుల తన్నుఁ దానెఱుఁగదు"
17-181

తాలముచేయి: (2) వి. తాళపుచెవి, బీగము.
"ఏల లోఁగీ నేల వీఁగీ నేల మొక్కినే
తాలముచేయి ఉన్నది తన చేతఁగాదా" 28-408

తాళుకొను: అ.క్రి. మాం. ఆలసించు. తెలంగాణంలో కొంచెం 'తాలి' రా అనే వ్యవహారం ఉంది.
"కాల మక్షయము సేయ కర్మము ఫలించజేయ
తాళుకొని మరపించ దలపించ
పాలుపడి శ్రీవేంకటపతియై వేదాలు చేప్పే
యేలిక యొకానొక యీశ్వరుఁడు గలఁడు"
2-319

తాళ్లపాకన్నమాచార్యులు: వి.తిరుపతి వేంకటేశ్వరస్వామిపై సుమారు ముప్పై రెండు వేల సంకీర్తనలు రచించిన తొలి తెలుగు వాగ్గేయకారుడు.
"అమికొన్న తాళ్లపాకన్నమాచార్యులు
వేమరు మెచ్చిన శ్రీవేంకటనిలయా" 2-24

తావళించు: (తావళము = అవకాశము అని సూ.ని.) ఇక్కడ అవకాశం చూచుకొని, యథావకాశంగా, ఆలస్యంగా అనే అర్థాలు కావచ్చునని సం.ప.స. (16-429 పు.)
"కోవరపు రాకాసులఁ గొట్టిన వొరటువాఁడు
తావళించి వొరసీనా తనతో నేను" 21-3
"నీవు విచ్చేసుండఁగాను నే లోన జలకమాడి
తావళించి వచ్చుదాఁకా దడవాయఁగా" 16-259

తావికొను: స.క్రి. వాసనచూచు, రుచిచూచు. కు.సం. లో ఈ ప్రయోగం ఉంది. వ్యాఖ్యలో ఈ పదానికి అటునిటు పొలయించు అనే అర్థం ఇవ్వబడింది.
"కావికన్నుల నాతనిఁ గమ్మటి నాఁటఁజూచేవు
తావికొని యెంత గబ్బితనమే నీది" 21-268

తావిబెల్లములో పంచదార చల్లుట: ప.బం; వి. గుణాధిక్యం కలిగించటం.
"నీవు మాటలాడినట్టె నేనూ మాటలాడితేనూ
తావిబెల్లములోఁ బంచదార చల్లుట" 25-311

తావు: వి. ఆశ్రయం.
"కావించి కోరికలిచ్చే కామధేనువా
మమ్ము తావై రక్షించేటి ధరణీధరా"

తావుఁగుంటెన: వి. అందుబాటులో నున్న కుంటెన. (కుంటెన = తార్చువాడు, తార్చేది)
"శ్రీవేకటపతిఁ జెందెటి యాసలు
తావుఁగుంటెనలఁ దనిసీనా" 9-113

తావుకొను: ప.బం; అ.క్రి. 1.నెలకొను 2.ఉండు 3.కుదిరిక, కలిగియుండు 4.తాళు, ఓర్చు

5.తాల్చు, వహించు 6.చిత్తస్థైర్యంతో ఉండు, వసించు.

"తావుకొని యెప్పుడూఁ దనవాఁడౌటే భాగ్యము
యే వనితల నేరుపు లింకనేమి చెప్పేరే" 24-274

**తావుగా:** క్రి.విణ. (?)

"తావుగా రమించితి తగులంత గలదా" 9-168

"శ్రీవేంకటేశ నేను జిగి నలమేల్మంగను
తావుగాను రమించితి తగులింత గలదా" 9-166

**తావుదావులు:** (తావులు + తావులు) మిక్కిలి సువాసనలు.

"పూవువలె నిద్దరము పొందులు సేసేటి వేళ
తావుదావులు మోవక తప్పించుకొనేనా"
13-246

**తాసు:** (22) వి. త్రాసు (రేఫ లేని రూపం) తరాజు, తూకం వేసే సాధనం, తుల.

"తాసున వేసి చూచితే తనకేమి బాఁతే" 19-479

"వలపు దూఁచే తాసువలె నైతి" 7-183

పాము:

"తాసువలె పెనఁగుచు తలమొల యెఱఁగము
సూసకపుఁబెండ్లి మిమ్ముఁజూచి నేరవలెను"
23-200

"తాసువలె పెనఁగీని తరితీపు సేసేని
మూసినముత్యమువలె మొక్కుమొక్కీ నీకును"
19-255

## తి

**తిక్కవట్టు:** (తిక్క+ పట్టు) ప.బం; అ.క్రి. తిక్కరేఁగు, పిచ్చిపట్టు.

"తిక్కవట్టీ నాకు నాకే దేవతలకెల్లా మొక్కి
వొక్కరివాఁడఁగాకుండు వుస్సురనుకొంటాను"
3-98

**తిక్కు:** (2) అ.క్రి. తిరుగు, మెసలు, మిగులు.

"తిక్కుముత్తేల కుచ్చుల తిరుతేరు
తెక్కుల ప్రతాపించీ దిరుతేరు" 4-320

**తిక్కుముక్కులు:** వి; బహు. దిక్కుమొక్కులు, అండదండలు. (వ్యు.)

"దిక్కెవ్వరు యీ తీదీపులలో
దిక్కుముక్కులకు దేవుఁడె కాక" 1-81

**తిట్టపెట్టు:** (తిట్టము + పెట్టు) తిట్టము = చిత్రం గీయడానికి ముందు రేఖలతో వేసుకునే స్థూలాకారం, దాన్ని వేయు. "పట్టకు నీ వంతేసి బలిమిసేసి
తిట్టపెట్టి నీవు దిద్దిన దానఁగానా" 25-205

"దిట్టము చేసి కావచ్చు. ఈ వస్తువు స్వభావము ఇట్లా అని నిర్ణయించటం. 'తిద్దు' నకు 'దిద్దు' ప్రయోగము ఈ వాఙ్మయమున ఎక్కువగ నుండుటచే దిట్టమును తిట్టముగ వ్యవహరించిరేమో యని నా ఊహ" అని సంపాదకులు (సం.ప.స. 2-381)

"చెట్టుల కెవ్వరు బుద్ధిచెప్పేరు తతికాలాన
బుట్టి కాచి పూచి నిండాఁ బొదలుమని
గుట్టుతో జైతన్యమే గుణము లన్నిటికి
తిట్టపెట్టి రచించిన దేవుఁడింతే కాక" 2-45

**తిట్టము:** వి. చిత్రప్రారంభంలో రాసే స్థూలాకారం. Sketch క. తిట్ట.

"బేడిదపుఁ బెద్దలెల్లాఁ బెట్టిన తిట్టములంటా
యీడుకుఁ జేసేఁగాక యిందేమి గలదు" 2-74

"ఇట్టె శ్రీవేంకటేశ యేలితి విందు వంకనే
తిట్టపు మా గురు నుపదేశమెగ్గుకాడు" 2-483

**తిట్టువాటు:** ప.బం; వి. అపవాదు, నింద (పద. వ్యు.) రూపాం. తిట్టుపాటు.

"కోపగింతువట నీవు కోరి నే నోరువవలెనా
దీపించ నన్నిటా నీకుదిట్టువాటని కాక" 7-138

**తిట్లాడు:** (తిట్లు + ఆడు) ప.బం. వాక్కలహమాడు, తిట్లతో కయ్యంపెట్టుకొను, కొట్లాడు.

"పెనఁగుచు నొండొరులు ప్రియములు నటించఁగా
జయమంది తిట్లాడే చలమెల్లఁ బాసె" 21-381

**తిత్తిదేహము:** వి. తోలుతిత్తి వంటి దేహం.

"మత్తిలి యీతనికంటే మరి లే దితరములు
తిత్తిదేహపు బ్రదుకు తెలిసేటివారికి" 1-502

**తిద్దు:** స.క్రి. దిద్దు 'ద'కారానికి బదులు 'త'కార ప్రయోగం. తీర్చు, చక్కబరచు.
"బుద్ధులెవ్వరు చెప్పిరి పుట్టినట్టి మెకాలకు
తిద్ది చన్నుదాగి పూరి దినుమని" 2-45

**తిద్దుపడు:** వ.బం; అ.క్రి. దిద్దుపడు, శిక్షణపొందు.
"తీపుల నీ పాలఁజిక్కి తిద్దుపడె నీ గుణమెల్ల
మోపుగా వలచితిమి మొక్కేము నీకు" 27-292

**తిద్దుబడి:** వి. దిద్దుబడి, సవరించడం, శిక్షణ. (వ్యా.)
"పొద్దొక బై రూపము పొదలేటి యీ వయసు
తిద్దుబడి గుబ్బము హత్తిన గుణము" 4-24

**తిద్దువడు:** అ.క్రి. దిద్దువడు, శిక్షణపొందు.
"తిద్దువడె నీ గుణాలు తేటతెల్లమిగను" 19-224

**తినఁదిన వేమెల్లాఁ దీపైనట్టు:** ప్రయత్నం చేస్తే ఏదైనా సాధ్యమైనట్లు.
"వెనకఁదలఁచుకొంటే విజ్ఞానములే పెక్కు
తినఁదిన వేమెల్లాఁ దీపైనట్టు" 4-80

**తిప్పకాయ:** వి. శుంఠ, కొంటెవాడు, ఒకతిట్టు. (పద.)
"విప్పక పయ్యెద నెరివిరుగకుండాఁ గప్పి
దిప్పకాయ దీని గుట్టు తెలియరే చెలులు"
12-355

**తిప్పదీరగు:** అ.క్రి. బాధల హద్దు అగు. (త్రిప్పు = బాధ, తీరుల = హద్దు)
"దెప్పరపు భవములఁ దిప్పదీరైతి మిదె
కప్పుకొని కావఁగదో కర్మమా" 4-332

**తిప్పదీరాడు:** వ.బం; స.క్రి. తీర్చిదిద్దు. (పద.)
"జగదేకహితములుగ సరసతలు సౌఖ్యములు
దిగులు వాయఁగ నితఁడు దిప్పదీరాడు" 1-358

**తిప్పపెంటలు:** వి; బహు. (తిప్ప = కొండ అని ఆం.ప.ని.) తిప్ప = దిబ్బ, పెంట = చెత్త చెదారం. దిబ్బల్లాగా ఉన్న చెత్తాచెదారం.
"మక్కువ నింతా నమృతమయమైనఁ గోడికి
తెక్కులఁ దవ్వఁబొయ్యేది తిప్పలపెంటలే" 2-33

**తిప్పటిమూతులవారు:** వి; బహు. తిరుగుడు మూతులవారు.
"తిప్పటిమూతులవారు దేహము దాఁచేటివారు
చెప్పఁబోతే పస లేదు చెల్లఁబో సంసారమా"
17-323

**తిప్పుఁదీరులాడు:** వ.బం; స.క్రి. తీర్చిదిద్దు.
"కప్పి రెండు దునుకలు గూడినవాని
తిప్పుఁదీరు లాడే దేవుఁడు" 1-111

**తిప్పుదీరాడు:** వ.బం. చూ: తిప్పుదీరులాడు.
"జగదేకహితములుగ సరసతలు సౌఖ్యములు
దిగులు వాయఁగ నితఁడు దిప్పుదీరాడు" 1-358

**తిప్పుదీరులాడు:** వ.బం; స.క్రి. తీర్చిదిద్దు.
"కప్పి రెండు దునుకలు గూడినదాని
తిప్పుఁదీరులాడే దేవుఁడు" 1-111

**తిమురు:** (6) అ.క్రి. గర్వించు, త్వరపడు, ఒళ్ళు విరుచుకొను, అతిశయించు, విజృంభించు.
"తమకింటి నీ కతఁడు తమ్ములము వెట్టితేను
తిమురుచుఁ గోపింతురా దేవుళ్ళవొద్ద" 14-546

**తిమ్మట:** వి. 1.తిరగడం (2.ఆపద (శ.ర.) 3.వర్తనం 4.పరివర్తనం 5.జరగడం 6.విపత్తు 7.కాయకష్టం) నడవడి.
"తెంపరాని ఆస లివి తిమ్మటే బోధించుఁగాక
కంచపు నీ దివ్యనామకతలు బోధించీనా"
15-174
"దిమ్మరివై నీవు కడుఁదిరిగే తిమ్మటలకు
యెమ్మెలు మెరసేనంటే యెంత లేదు" 23-225
"దెప్పరాన నీవు లోలోఁదిరిగే తిమ్మటలకు
యిప్పటి మా యలుకలు యేడకెక్కును"
9-224

**తిమ్మటి:** వి. (?)
"అచ్చమైన జ్ఞానికి నంతా వైకుంఠమే
చెచ్చెరఁదన తిమ్మటే జీవన్ముక్తి" 4-264

**తిమ్మప్ప:** (తిరుమల+అప్ప) తిరుమలమీది తండ్రి, శ్రీవేంకటేశ్వరస్వామి, తిరుమలస్వామి,

కన్నడ వాగ్గేయకారుడు పురందరదాసు తన సంకీర్తనల్లో వేంకటేశ్వరస్వామిని తిమ్మప్ప అని పేర్కొన్నాడు. తిరుపతి సమీపంలోని తొండవాడలో ముందు తాను కట్టించిన వేంకటేశ్వరస్వామి దేవాలయానికి తాళ్లపాక చిన్నన్న తిమ్మప్ప దేవాలయమని నామకరణం చేసినాడు.

**తిమ్మరాయఁడు:** వి. తిరుమలరాయడు, తిరుమలేశుడు, శ్రీవేంకటేశ్వరస్వామి. (తిరు + మల = తిమ్మ)

"దిమ్మరి మాటలాడీనే తిమ్మరాయఁడు
కొమ్మని పరము లిచ్చీఁగొండలరాయఁడు"
20-186

**తిమ్మరిపట్టు:** ప.బం; అ.క్రి. తిమ్మిరిపట్టు.

"మితిలేని రతులఁ దిమ్మరిపట్టె దేహాలు
మతివఅచె నిందుకు మందేదొకో" 3-356

**తిమ్మినాయఁడు:** వి. తిమ్మనాయడు, తిరుమలనాయడు, తిరుమలేశుడు, శ్రీవేంకటేశ్వరస్వామి.

"ఒక్కడవె లోకాన కొడయఁడవు నీవె
దిక్కుగా నెవ్వరు లేరు తిమ్మినాయఁడా" 4-41

**తిరముకొను:** అ.క్రి. బలపడు, స్థిరపడు, కుదురుకొను.

"పయ్యదంటీ కొసరితి భామను శ్రీవేంకటేశ
తియ్యఁగానె నిన్నుఁగూడె తిరముకోవయ్యా"
20-508

"వరములెల్ల సారెఁ గన్నవారికెల్ల నిచ్చి యిచ్చి
తిరముకొనెను బలిమితోడ దేవటవె వీఁడు"
17-438

**తిరుకచ్చినంబి:** వి. కంచి నుండి తిరుమలకు వచ్చిన భక్తుడు. కంచి వరదరాజస్వామివారికి వింజామర కైంకర్యం చేసేవాడు. భగవంతునితో సాక్షాత్తుగా మాట్లాడగలిగిన మహానుభావుడు. రామానుజులవారికి భగవద్రహస్యాలు చెప్పినవాడు. వరదరాజాష్టకం ఈతడు రచించిందే. (కచ్చి = కంచి, నంబి = నమ్మినవాడు, భక్తుడు) స్వామి ఈతనిని రెండు పర్యాయములు తిరుమలకు రప్పించుకొన్నాడట.

"కంచిలోన నుండఁ దిరుకచ్చినంబిమీఁదఁ
గరుణించి తనయెడకు రప్పించినవాఁడు"
1-151

**తిరుకొడి యెక్కు:** అ.క్రి. పవిత్రమైన దీపకళిక వెలుగు.

"తిరుకొడి యెక్కె నదె దేవుని కల్యాణానకు
గరుడపటముపె (పై) డి కంబమందును"
25-432

**తిరుగుతిమ్మటలు:** వి; బహు. తిరుగుటలు అనే అర్థంలో జంటపదం (?)

"చెలఁగి నే మును సేసిన చేతలుండఁగా
మలసినేఁ దిరుగుతిమ్మటలుండఁగా" 1-182

**తిరుణామము:** (తిరు + నామము) వి. వైష్ణవులు నుదుట నిలువుగా పెట్టుకునే బొట్టు (ఇందులో తిరు శుభార్థకం. నామము = బొట్టు)

"తెలుపు మణుఁగులిచ్చి తిరుణామము వెట్టి
నిలుచుండఁగానే మీరు నివాళు లెత్తరే" 22-242

**తిరుణాళ్లు:** (తిరు + నాళ్లు) వి. దేవుని ఉత్సవాలు; తిరునాళ్లు అని శ.ర.

"హరుఁడ పోయి రా, అజుఁడ నీవును బోయి
రా
తిరిగి రా మీఁదటి తిరుణాళ్లకు" 1-368

**తిరుతేరు:** (2) వి. పూజ్యమైన రథం, తిరు శ్రీ శబ్దార్థకం.

"పురుషులలో నెల్లా పురుషోత్తముఁడు వాఁడె
తిరుతేరుమీఁద నేఁగీ దేవదేవోత్తముఁడు"
26-119

"తిరువీథు లేఁగీని తిరుతేరు
తిరుపు గొన్నట్లాను తిరుతేరు" 4-320

**తిరునాళ్లు:** చూ: తిరుణాళ్లు.

"వెలయ నిందుమహోత్సవంబు లిన్నియు
నితని విభవంబు లెసఁగు తిరునాళ్లు నాకు"
2-132

**తిరుపండికాపు:** వి. తిరుమణికాపు, వైష్ణవులు నొసట తిరుమణితో నామములు దిద్దుకోవడం.
"ఇయ్యలమేల్మంగ కాంతులెత్తే తిరుపండికాపు
గయ్యాళి మదరాగము కస్తూరికాపు"

**తిరుపట్ల మదనగోపాలుడు:** తిరుపట్లలో నెలకొన్న స్వామి మదనగోపాలుడు. చిత్తూరు జిల్లాలో పుదిపట్ల, వెల్లపట్ల మొదలైన ఊర్లున్నాయి. కాని తిరుపట్ల అనే గ్రామం లేదట. ఇతర రాయలసీమ జిల్లాలలోనూ ఈ గ్రామం లేదట. ఈ గ్రామం ఎక్కడుందో పరిశీలించాలి.
"సంగతిగ సకలసంపదలు నీ వేళ
మంగళము తిరుపట్ల మదనగోపాల"

**తిరుపణి:** వి. భగవంతునికి జరిగే కైంకర్యం.
"తిరుపణి మణఁగెను తిరుగరా దెవ్వరికి
మరల నెలు గియ్యరో మగపారి" 15-118

**తిరుపతి:** వి. ఆంధ్రప్రదేశ్ లోని చిత్తూరు జిల్లాలో ప్రసిద్ధమైన శ్రీవేంకటేశ్వరస్వామి క్షేత్రం. 108 దివ్య తిరుపతుల్లో ప్రధానమైనది.
"తిరుపతిలోనను తిరమై శ్రీవేంకటాద్రిఁ
గురిసీ వరము లెల్ల గోవిందరాజు" 13-168

**తిరుపళచ్చి:** వి. తిరుప్పళ్లి విళుచ్చి, భగవంతుని నిద్రనుండి మేల్కొల్పడం. తొండరప్పొడియాళ్వారు (విప్రనారాయణుడు) చెప్పిన శ్రీరంగనాథుని మేలుకొలుపు స్తోత్రం.
"వేకువఁ దిరుపళచ్చి విష్ణునికిఁ జేయరో
ఆఁకటి కొదిగినట్టి ఆరగింపులు" 3-298

**తిరుపు:** వి. గిరగిర తిరుగుట.
"కందువ తిరుపతి వేంకటపతి మెచ్చఁగ
అందపు తిరుపుల నలమేల్మంగ" 5-24
"తిరుపై యవ్వలవ్వలఁ దిరుగుచుండేటి వేళఁ
దిరిగినట్లు నుండు దిక్కులెల్లాను" 2-75
"తిరుపై యవ్వలవ్వలఁ దిరుగుచుండేటి వేళఁ
దిరిగినట్లనుండు దిక్కు లెల్లాను" 2-75

**తిరుపుగైదువ:** వి. భ్రమించే ఆయుధం, విష్ణుమూర్తి చక్రాయుధం.
"బిరుసైన దనుజుల పీచమణఁచినట్టి
తిరుపుగైదువతోడి దేవుఁడు" 5-244

**తిరుపుగొను:** ప.బం; అ.క్రి. తిరుగు, గిరగిర తిరుగు, వ్యాపించు, తిరిగి అడ్డగించు.
"తిరుపుగొని కమ్మటి తీగెచేతు లటు చాచి
పరఁగ నంగరంగవైభవము మెరసీని" 24-555

**తిరుమంగయాళువారు:** వి. పన్నిద్దరాళ్వారులలో ఒకరు, పరకాలయోగి.
"తీరని వేడుకతో తిరుమంగయాళువారి
ఆరడి ముచ్చిమికూటి కాసపడ్డవాఁడు" 1-121

**తిరుమంత్రద్వయము:** వి. తిరుమంత్రము ('ఓం నమోనారాయణాయ' అనే అష్టాక్షరి మంత్రము) మరియు ద్వయము (శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః అనే మంత్రములు) చూ: ద్వయము.

**తిరుమంత్రము:** (4) వి. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఆచార్యునివలన ముముక్షువు గ్రహించే మహామంత్రాల్లో ఒకటియైన 'ఓం నమోనారాయణాయ' అనే అష్టాక్షరీ మంత్రం, నారాయణమంత్రం. దీనినే మూలమంత్రమని కూడ అంటారు.
"తిరుమంత్రమే నన్నుఁదెచ్చి నీ సొమ్ముగఁజేసె
యెరవులేక కాచుకో యిందులకైనాను" 15-16

**తిరుమజ్జనము:** వి. దేవతావిగ్రహాలకు చేసే అభిషేకం, తిరుమంజనమని కూడా వ్యవహారం.
"తిరుమజ్జనపువేళ దేవునికి నిదివో
పరఁగ నారదాదులు పాడరో యిందరును"
7-473

**తిరుమణి:** (తిరు + మన్ను) వి. శ్రీవైష్ణవులు నొసట ఉంచుకునే తెల్లని మృత్తిక, పుండ్రము.
"కాతరపునుదుటికిఁ గల తిరుమణి గురి
పాతకపు నావలనఁ బట్టకుమీ నేరము"
4-266 & 2-57

**తిరుమణికాపు:** వి. వైష్ణవచిహ్నమైన నామధారణ క్రియ.

**తిరుమలగిరి పట్టణము:** వి. తిరుమలకొండ మీది పట్టణము, ఎగువ తిరుపతి.

"దేవుఁడా నా దేహమె నీకు తిరుమలగిరి పట్టణము
కావింప హృదయపద్మమె బంగారపుమేడ"
15-406

**తిరుమలదేవర**: వి. తిరుమల కొండకు దేవుడైన శ్రీవేంకటేశ్వరస్వామి.

"సాపనీటికింద సతిఁ సంకఁబెట్టుక
తీపుల తిరుమలదేవరైనాఁడే" 24-13

**తిరుమలదేవుఁడు**: వి. తిరుమలలో వెలసిన శ్రీవేంకటేశ్వర స్వామి.

"దేవశిఖామణి తిరుమలదేవునిఁ దలఁచినఁ బాయక
భావించిన యీ కామినిభావము లోపలను"
5-138

**తిరుమలనంబి**: వి. శ్రీవేంకటేశ్వరస్వామికి అభిషేకకైంకర్యం చేసే భక్తుడు. తిరుమల తిరుపతి మెట్లదారిలో ఒక చింతచెట్టు కింద తిరుమలనంబి రామానుజులవారికి ఒక సంవత్సరకాలం రామాయణాన్ని చెప్పినాడట. ఆ సమయంలో తిరుమలనంబికి మధ్యాహ్నంపూజ స్వామికి తప్పిపోతుందనే బాధ పీడించేదట. అతని బాధను గమనించిన స్వామి తన పాదముద్రికలను ఆ ప్రదేశంలో అనుగ్రహించినాడట. వాళ్ళు ప్రతిరోజూ వాటికి పూజ చేస్తూ వచ్చినారు. తరువాత కొంతకాలానికి ఈ పాదాలు హరిజనుల పూజకోసం ప్రత్యేకించబడ్డాయట.

"మచ్చిక దొలఁక తిరుమలనంబితోడుత
నిచ్చనిచ్చ మాటలాడి నొచ్చినవాఁడు" 1-151

**తిరుమాళారు**: వి. లక్ష్మీదేవి దగ్గర అభ్యర్థిస్తున్న విష్ణువు.

"తీరె నీ యలుకలెల్లా తిరుమాళారు
తీరని మోహము తోడి తిరుమాళారు" 17-405

**తిరుమిక్కిళ్లు**: (?)

"అలాగువాఁడ నేనని చిలుకజోడుల
వాలు తిరుమిక్కిళ్లకు (?) వడి నిల్చేవా" 7-181

**తిరుమేను**: వి. పూజ్యమైన శరీరం, శ్రీవైష్ణవుల వ్యవహారంలో పూజ్యార్థంలో శబ్దానికి ముందు 'తిరు' అనే పదం చేరుతుంది. తిరు అంటే శ్రీ అని అర్థం.

"యింతలో సల్లనుండఁగ యిందరు నీ తిరుమేను
పొంతనట్టే నీలాద్రిఁ బోలునందురు" 7-522

**తిరువందికాపు**: వి. తిరువందిక్కాప్పు (త) ఈ పదానికి ఆచార్య సర్వోత్తమరావుగారు తమిళ నిఘంటువులో "తిరుమలైయిల్ ఎళుందరుళి ఇరుక్కిన్ఱ వణక్కు తిరువింది క్కొప్పు సమర్పిక్కై కాగ" అనే దివ్యప్రబంధ వ్యాఖ్యానం ఉదాహరించి ceremonial rules for everting the evil at the close of daily worship or festival in a temple అని వివరణ ఇచ్చినారనీ, దిష్టితీయడమని అర్థం చెప్పవచ్చునని వివరించినారు. (తి. అ. నం ; 47 పు - పీఠిక)

"కప్పురపు టారతుల ఘనచందనముతోడ
తెప్పల ధూపముల తిరువందికాపుతో" 24-209

**తిరువాముడి**: (4) (తిరు+వాయ్+మొళి) అనే తమిళ పదానికి వికృతిరూపం, తమిళంలో ఉన్న తిరువాయి మొళి అనే పేరు గల దివ్యప్రబంధం. (శ్రీయుతమైన నోటిమాట అని శబ్దార్థం) ద్రావిడవేదం. ద్రవిడవేదమగు నాలాయిర దివ్యప్రబంధంలో ఒక భాగం. నమ్మాళ్వారు సాయించిన వేయి పాశురాలు. తిరువాయి = పవిత్రవాక్కు, మొళి = మాట. ద్రవిడవేదం - విష్ణుస్తోత్రాలు 1000 సంకీర్తనలున్న గ్రంథం.

"చదివేరు వైష్ణవులు సారెఁదిరువాముడిదె
కదిసి శ్రీసతి ముందే కాచుకున్నది" 3-484

**తిరువాముడి మంటపము**: వి. తిరుమల స్వామివారి ఆలయంలో తిరువాయి మొళి అనే దివ్యప్రబంధాన్ని చదివే మంటపం.

"వేళవేళఁ బొత్తులను విందు లారగించుకొంటా
వాలి కొలువుండేఁ దిరువాముడి మంటపాన"
14-368

**తిరువాయిమొళి:** వి. ఆళ్వారులు ప్రవచించిన గ్రంథాలను, సూక్తులను దివ్యప్రబంధమని అంటారు. అట్టి ప్రబంధములలో తిరువాయి మొళి ఒకటి. ఇది నమ్మాళ్వారుచే చెప్పబడింది. చూ: తిరువామొడి.

**తిరువారాధన:** వి. శ్రీవైష్ణవ సంప్రదాయంలో భగవంతునికి సమర్పించే షోడశోపచారాలతో కూడిన ఆరాధనం. 'తిరు' తమిళపదం, 'శ్రీ'కి సమానార్థకం, మంగళకరమైన, శ్రేష్ఠమైన అని అర్థం.

"నీ నేమెరిగి సేసేనో తిరువారాధన
అని మున్నిట బ్రహ్మరుద్రాదులు సేయఁగలేరు" 2-273

"తిరువారాధన వేళ తిరువందికాపువేళ
అరిది యప్పాలు నన్నాలారగించు వేళ" 24-119

**తిరువారాధనము:** (తిరు + ఆరాధనము) వి. శ్రీవైష్ణవ సంప్రదాయంలో భగవంతునికి సమర్పించే షోడశోపచారాలతో కూడిన ఆరాధనము.

"నీ నేమెరిగి సేసేనో తిరువారాధన
అని మున్నిట బ్రహ్మరుద్రాదులు సేయఁగలేరు" 2-273

**తిరువీథి:** (తిరు + వీథి) వి. దేవు డూరేగే వీథి, మాఁడవీథి, దేవాలయం చుట్టూ ఉన్న వీథి.

"దేవకామినులు లాడరో దివ్యదుందుభులు మ్రోసే
దేవుఁడు కోనేటిదండఁ దిరువీథి మెరసీ" 12-4

"తిరువీథుల మెరసీ దేవదేవుడు
గరిమల మించిన సింగారములతోడ" 7-192

**తిరువుమురువు:** ప.బం; వి. టికమక కావచ్చునని, ఈ అర్థంలో శకటరేఫంతో ఈ జంటపదం తమిళ నిఘంటువులో ఉందని సం.ప.స. (15నం.)

"తిరువుమురువు సేసే దిమ్మరీఁడవు
పరుగుపెక్కు విద్యల బయకాఁడవు" 1-12

**తిరువెంగళప్పఁడు:** వి. తిరుమలలో వేంచేసి ఉన్న శ్రీవేంకటేశ్వరస్వామి. చూ: తిరువెంగళేశ్వరుడు.

"పట్టిన చలముతోడఁ బైకొనీని
దిట్టగదే పేరువళి తిరువేంగళప్పఁడు" 16-365

**తిరువెంగళేశ్వరుఁడు:** వి. శ్రీవేంకటేశ్వరుడు. తిరువెంగళగిరికి స్వామి అని వ్యుత్పత్తి. 'వెంకట'కు 'వెంగళ' తమిళశబ్దం.

**తిరువేంకటపతి:** వి. శ్రీవేంకటేశ్వరస్వామి.

"మొగమున చిత్తరిచేతలు మును లేనివి చెలి కబ్బెను
మగువయు (కు?) తిరువేంకటపతి మమతల పరిణతులు" 5-352

**తిరువేంకటము:** వి. పవిత్రమైన వేంకటాచలం.

"తిరువేంకటమున దినపెండ్లి గల
తరుణుల పతికినిఁ దలఁబాలో" 17-443

**తిరువేంకటేశుఁడు:** వి. శ్రీవేంకటేశ్వరస్వామి. (తిరు = శ్రీ)

"తిరువేంకటేశుఁ బొందితి నంటినా యతని
దొరతనము నా గరిమ దోఁచనీదు" 5-113

**తిలకించు:** (3) అ.క్రి. ప్రసన్నతనొందు. (వా.ని.)

"తిలకించి యిటు నన్ను దీవించి చూచీని
బలిమికాఁడన్నిటాను పంతమాడేనా" 24-255

"తిలకించి యిద్దరును తెర వేసుకొనరాదా
వలవని జోలి యీడ వద్దు వద్దు ఇఁకను" 26-290

**తిల్లగోవిందరాజు:** వి. తమిళనాడు లోని ఆర్కాడుజిల్లా చిదంబరక్షేత్రానికి తిల్లై అని పేరు. ఇది తిల్లమొక్కల అడవిగా ఉండెనట. అక్కడ వెలసిన గోవిందరాజస్వామి. తమిళులు ఈ స్వామిని తిల్లైచిత్రంబలం అని వ్యవహరిస్తారు.

"అమ్మలాల అక్కలాల అతివలాల
దిమ్మరిగదవే వీడు తిల్ల గోవిందరాజు"

"సారె వలపందరపై జల్లుచున్నాడు
తీరుగా సరసమాడి తిల్లగోవిందరాజు" 13-334

**తిల్లగోవిందుఁడు:** వి. చూ: తిల్లగోవిందరాజు.

**తివియు:** స.క్రి. (మరలు, వెనుదీయు) లాగు, పైకితీయు.
"వఱితంబోయెడివాని వడిఁదీయవలెఁగాక
దరివానిఁ దివయఁగఁ దానేలా" 1-18

## తీ

**తీఁగనవ్వు:** తీగవలె సాగే నవ్వు, మందహాసం.
"తెల్లని మేనితోడ తీఁగనవ్వులతోడ
చల్లని గందముల వాసనలతోడ" 7-129 old

**తీఁగమేను:** వి. తీగవంటి శరీరం.
"చిమ్మల నీ చెమటలఁ జేయవే మజ్జనము
దిమ్మరి నీ మురిపెపు తీగమేనికి" 5-221

**తీఁగెఁబోసినట్లు:** ప.బం. తీగ పారినట్లు.
"మొగిఁ జంద్రముఖి నురమున నిలిపెఁ గనక
పొగరువెన్నెల తీఁగెఁబోసినట్లుండె" 17-485

**తీఁగెమాటలు:** ప.బం; వి; బహు. తీగవలె సాగే మాటలు.
"తీగె మాటలాడుకొంటా జేరి సన్నసేసుకొంటా
బాగుగా నెవ్వతో నీ పక్కనున్నది" 2-363

**తీఁగెయెలుఁగు:** వి. సన్ననిగొంతు, హీనస్వరం.
"తేనెలుగార మాఁటాడీ తీగె యెలుఁగులు
కానుకిచ్చి నీ మనసు గరఁగఁజేసె" 29-226

**తీఁగెలువారు:** ప.బం; అ.క్రి. తీగెవలె వ్యాపించు, వ్యాపించు, వర్ధిల్లు.
"మలసిన కోరికలు మతిలోఁదీఁగెలువారీ
వలపుల చెమటల వానలను" 18-110

**తీఁగెలుపాగు:** (2) ప.బం; అ.క్రి. అభివృద్ధిచెందు, వ్యాపించు.
"తెలిగన్నులఁజూచితే తీఁగెలుసాగ నవ్వితివి" 6-18

**తీఁగెసాగు:** (2) ప.బం; అ.క్రి. కొనసాగు.
"తెరలోనికిటు వచ్చి తీఁగెసాగ మాటలాడి
వొరసేవే రమణుని వూరకే నీవు" 26-250

**తీఁట:** వి. ఉద్రేకం, దురద.
"మరిగించి మరఁగున మాట లేలాడించేవు
తెర దియ్యవయ్య అంత తీఁట గలితే" 11-189

**తీఁటతీగె:** (2) వి. దురదను కలిగించే తీగ, కసింద.
"తీఁటతీగెలు సొమ్మంటా దేహమునిండాఁగట్టి
తీఁటకుఁగాక బాలులు తెగి పోపోఁగా" 2-167

**తీఁడు:** స.క్రి. నులిపెట్టు, మెలిపెట్టు, తిప్పు.
"తీఁడేటి మీసాలతోడి దేవదేవసింహము" 3-153

**తీఁదీపులు:** వి; బహు. (తీపులు + తీపులు) (మిక్కిలిబాధలు) మిక్కిలి మాధుర్యములు.
"తీపులధనములు మీఁది మీఁదనే
తీదీపులు రేఁచీని" 2-300

**తీగెసంసారమత్తులు:** వి; బహు. తీగెవలె వ్యాపించే సంసారంలో మదించి ఉన్నవారు.
"తీగె సంసారమత్తులు తెలియక వీరివలె
వేగినంతా నయ్యేమంటే వెరవులఁబడవు" 3-119

**తీదీపు:** (తీపు + తీపు) ప.బం. మిక్కిలి బాధాకరం.
"సంచితపుఁగర్మము జననలయములట
ముంచిన తీదీపే గాక మోదమున్నదా" 4-129

**తీదీపులు పెట్టు:** మిక్కిలిబాధలు పెట్టు, తీపులనే పదం తెలంగాణంలో శరీరావయవాల నొప్పులను తెలిపే పదంగా వాడుకలో ఉన్నది.
"దేవా! పంచేంద్రియాలు తీదీపులనుఁబెట్టే
నీవే నా యెదలోను నిండుకుండఁగా" 15-5

**తీదీపుసేయు:** ప.బం. మిక్కిలి బాధపెట్టు.
"తిప్పితిప్పి నా యాసలు తెగి వైష్ణవధర్మానఁ
దెప్పలఁ దేలకుండాను తీదీపు సేసె" 3-80

**తీపులఁబెట్టు:** ప.బం; స.క్రి. కుతూహలపెట్టు, తమకింపజేయు.
"తీపులఁబెట్టితి నీవే తిరుగనాడఁగ నేల
శ్రీపతి విన్నిటాను నీ చిత్తమింతే కాక" 26-26

**తీపులమాటలు:** వి; బహు. తియ్యనిమాటలు.
"తీపుల నీ మాటలకు తేరకొన నిన్నుఁజూచి
ఆఁపరాక మెచ్చి మెచ్చి అలముకొనీని" 22-174

తీపులు: వి; బహు. మధురపదార్థాలు, తియ్యనివి.
"తీపులుండఁగాఁ జేదు తిననేటికయ్యా" 23-197

తీపులెక్కు: చవులూరు.
"తేనెల మోవిమాట తీపు లెక్క వుండుఁగాక
వీనులకు దేమూటిన వింత బోదినా" 20-411

తీపులోఁగాతములు: వి; వ.బం. మందిలో
తిటులు.
"తీపులోఁ గాతములేల తెలుపరే విభునికి
యేపున నవపులిచ్చి యేలుకోనుఁగాక"
12-455

తీరుగడ: వి. సమాప్తి, ముగింపు, తెరిపి, పూర్తి.
తు. తీర్గడ.
"జగడమునఁటోలె నలసతలేని మమత దను
తెగి వేచనే కాని తీరుగడ లేదు" 1-307

తీలు: వి. అణగటం, తగ్గటం (వ్యు.) కీడు,
చెఱుపు (అ.మూ.), ఎక్కువ(తనం), స్తబ్ధం
అని 15 సం. పీఠిక.
"మేలు లేదు తీలు లేదు మించీని హరిమాయ"
2-78
"తీలుగా వచ్చితే దేవుని దూరును
యేలో నాఁడే యిది యెఱుఁగడా" 15-53

తీలుగా: నశించేట్లుగా.
"తీలుగా రావణునిఁ జంపి తెగి లంక సాధించి
కాలినసేనలఁగూడి వచ్చెనటమ్మా" 19-495

తీలుపడు: (2) ప.బం; అ.క్రి. 1. దుర్బలమగు,
నిస్సత్త్వమగు 2. నశించు 3. తగ్గు 4. అణఁగు.
"ఏల నన్ను వేడుకొనే విటు నీవే నేఁగాన
తీలుపడనేర నేను తెలిపే కాని" 26-56

తీలుపఱచు: స.క్రి. అణచు, తగ్గించు.
"కొలుపుచు దినమూ నీ కొండమీఁది
నాయకులు
తీలుపరచేరు గదే తిమ్మినాయఁడా" 4 అను. 41

తీవరించు: స.క్రి. త్వరపెట్టు, తొందరపెట్టు
అ.క్రి. కోపపడు, చిరాకుపడు.
"సేవలెల్ల సేసేవు చెక్కులేల నొక్కేవు
తీవరించి మాటలాడ దేవరవు గావా" 21-252

తీసిపెట్టయినచోటు: వి. (?)
"ఆసలకు నడియాల మంపీ నచటనుండి
తీసిపెట్టయినచోట తెలుపచోటేది" 20-568

తీసిపెట్టుగాని: వి. తీయుటకు, పెట్టుటకు
వలనుపడని లేదా తొలగించుటకు సాధ్యపడని
అను అర్థమున నీ ధాతుజ విశేషణము ను
క్వాంతముతో కూర్చి ప్రయోగించినట్లు న్నది.
"జానికపునితులపై పాదాలు దాచుకున్నాఁడు
తీసివెట్టుగాని తమిఁదిల్లగోవిందరాజు" 19-96

తీసు: స.క్రి. తీయును.
"పట్టినందుకెల్లాఁ దీసు పాపమే చవులుసేసు
నిట్టపిడిఁ బోనీదు నీ మాయ" 3-540

తీసుట: వి. తీయు ధాతువునకు వ్యావహారిక,
భావార్థకరూపం. తీయడం.
"అందంద మాటలాడే అలబలము చూడక
కందువఁ దెర దీసుటే కల్ల నా వల్ల" 7-7
"తప్పక చూచినదే తగులఁదీసుట గాదా
అప్పుడే యాకె నిన్ను నదలించెనా" 26-13

## తు

తుంటతనము: (తుంట + తనము) వి.
దుష్టత్వం, అల్లరి. (వ్యు.)
"తుంటతనమున నన్ను దూరనాడ నేలే మరి
గెంటి యంతలోనే తాను కిందుపడనేలే"
19-356

తుండించు: స.క్రి. ఖండించు, నరుకు,
ముక్కలు చేయు. (వ్యు.)
"యెలమి జక్రాయుధున కెదురా దానవులు
తొలఁగ కెందుఁ జొచ్చినఁ దుండించుఁగాక" 3-1

తుందుడుకు: (5) ప.బం; వి. 1. మనోవ్యథ
2. కంపచలనం 3. సంతాపం 4. కలత
5. సంక్షోభం 6. మోసం 7. ఉత్కంఠ
8. అతిశయం 9. తొందరపాటు.
"నిందలేక యేపొద్దు నిన్నే కొలచి పొగరు
దౌర్జన్యానఁ

తుందుడుకు నీ మాయ తొలఁగిపోయీనా"
2-354

**తుకతుకలు :** ప.బం; బహు. 1. ఉడకటం, కాగటం, నవ్వటం మొ॥ వాటిలో అయ్యే ధ్వనికి అనుకరణం. 2.కోపం 3. సంతాపం 4. ఉడుకుబోతుతనం 5. ఈసు, అసూయ. (వ్య.)

"వొకరు రక్షించఁగా వేరొకరి పాలైన నాకు
తుకతుకలే కాక దూరఁగఁ జోటున్నదా" 2-410

**తుచ్ఛమాడు :** (తుచ్ఛము + ఆడు) ప.బం; అ.క్రి. తుచ్ఛమైన మాటలు పలుకు.

"యిచ్చకమాడుదుఁగాని యీసడించ నెన్నఁడును
తుచ్ఛమాడకుండా నానతూరి పెట్టీనే" 8-8

**తుచ్ఛములాడు :** (తుచ్ఛములు + ఆడు) ప.బం; అ.క్రి. నీచపుపలుకులు పలుకు, అల్పపు పలుకులు పలుకు.

"తుచ్ఛములాడక తొల్లె తొయ్యలిచే మొక్కించి
మచ్చికగాఁ గిందుపడి మాటలాడవయ్యా"
11-486

**తుచ్ఛెముసేయు :** స.క్రి. నీచముసేయు < తుచ్ఛము.

"నెచ్చెలులు నీవలె నేరనివారా యేమి
తుచ్ఛెముసేయుట కడు దోసమని కాక"
21-393

**తుటారము :** వి. 1. నింద, తిట్టు 2. దిట్టతనం, దార్ఢ్యం 3.పరుషవచనం, నిష్ఠురోక్తి 4. దిట్టమైన, దృఢమైన, ధైర్యంకల 5. అతిక్రమణం, తుచ్ఛవచనం.

"ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁదుటారాలఁ
బేరుకుచ్చి సొలయుచుఁ బిసాళించేవు" 5-3

**తుటారములాడు :** (తుటారములు + ఆడు) అ.క్రి. తిరస్కరించు, నిరసించు (పద.) నిందావాక్యములు పలుకు, నిష్ఠురోక్తులు పలుకు.

"తొలుత నిన్నింతేసి తుటారములాడినాను
బలిమి వెనక నీకుఁ బంతమియ్యదా" 13-243

**తుటారాలాడు :** చూ : తుటారములాడు.

"ఆకడ నెవ్వతో నిన్ను నట్టె తుటారాలాడఁగ
యీకె సన్నసేసి మాన్పె ని దెలిఁగవా" 23-448

**తుటారించు :** స.క్రి. నిందించు, తిరస్కరించు, అతిక్రమించు. చూ : తుటారము.

"యెవ్వతెకో యీకె యంటా యెంతేసి తుటారించితి
చివ్వన నిందుకుఁగాను చిన్నఁబోకుమీఁకను"
7-352

**తుత్తుమురగు :** (తురుము + తురుము) ప.బం; అ.క్రి. పొడియగు, ముక్కలుముక్కలగు.

"తూపు చేత నంటితేనే తుత్తుమురై పారుదురు
రాపునీలికాళ గంటే రణభీతి గొందురు" 3-186

**తుత్తురుఁగొమ్ము :** చూ : తుత్తురుకొమ్ము.

**తుత్తురుకొమ్ము :** వి. ఊదినపుడు 'తుత్తురు' అని ధ్వనించే వాద్యవిశేషం. తూఁతకొమ్ము, పిల్లనగ్రోవి, మురళి.

"పొంకపు తుత్తురుకొమ్ము పొలుపైన నీ సొమ్ము
వేంకటనగము చాయ విట్టలరాయ" 5-96

**తుదకెక్కు :** (17) (తుదకు + ఎక్కు) ప.బం; అ.క్రి. గట్టెక్కు.

"పూనిన శ్రీవేంకటేశ కొంటి నీకు శరణని
తోనే యా రెండు గడచి తుదకెక్కేఁగాక" 4-44

"ఎదురు చూచితిమి యిందాఁకా నీకు
తుదకెక్కెఁ బనులు సంతోసమాయ నిపుడ"
29-207

**తుదనాలికె :** వి. నాలుక తుది భాగం, నాలుకకు నాలికె వ్యావహారికరూపం.

**తుదమీఁటు :** ప.బం; అ.క్రి. అతిశయించు, అధికమగు.

"చుట్టుఁగన్నీటికి చూపుఁజాతకములివె
కొట్టి యింకమీద నవి తుదమీఁటఁగలవా" 7-1

**తుదమొదలు :** వి. ఆద్యంతాలు.

"చెదరిన నీ (యీ?) కురులు సేసకొప్పున విరులు
తుదమొదల లెఱఁగరు తొలఁగదే" 19-510

**తుదిపదాలు:** వి. చివరి పదాలు.
"కమ్మని తమకములు ఘనముగఁ బట్టించి
దొమ్ములనీ కాఁగిటి తుదిపదాలు" 22-490

**తుదిమీఱు:** అ.క్రి. మితిమీఱు, అతిశయించు.
"కోవిదులమను దొరల కులరాణివాసములు
శ్రీవలనె లంజలై తుదిమీరిరి" 4 అను. 77

**తుదిముట్టు:** ప.బం; అ.క్రి. 1. చచ్చు, ముగియు 2. కడచు, కడచను 3. దృఢమగు 4. నెఱవేరు.
"నగు శ్రీవేంకటపతి నన్నే రక్షించినదాఁక
మొగడై యెరుక తుదిముట్ట రాదాయను" 2-80

**తుప్పుడు:** వి. తుప్పు, చిలుము, ఇనుముకు పట్టిన మలినపదార్థం.
"తొలఁగఁదోసి తుప్పుడు తోడనే లోహంబు
వెలయ బంగారు గావించినగతి" 1-182

**తుమురు:** వి. పొడి, సూక్ష్మఖండం.
"దిట్టమై యేనుగులచే దీకొలిపినవాటి
నట్టి కొమ్ములు తుమురై పోయను" 4-372

**తుమ్మలూరి చెన్నుఁడు:** వి. తుమ్మలూరులో వెలసిన చెన్నకేశవుడు.
-చిగురుమేని తుమ్మలూరి చెన్నుఁడా
శ్రీవేంకటేశ
తగ పంతమిచ్చితే (తేనే) దక్కి మెచ్చితిఁ గాక"
24-179

**తుమ్మిద:** (92) వి. తుమ్మెద, అన్నమయ్య తుమ్మిద అనే పదాన్ని పెక్కు చోట్ల వాడినాడు. తుమ్మెద అనే పదం విరళంగా వాడబడింది. అన్నమయ్య కాలంలో తుమ్మిద అనే పదానికే జనంలో వాడుక ఉండి ఉంటుంది.
"గతిగూడ గుంపుకట్టి కాఁపురము సేసీ నవే
మితిమీరి శిరసుపై మేఁటి తుమ్మిదలు" 2-286

**తుమ్మెదపదాలు:** వి; బహు. తుమ్మెదా! అనే పదం పాదాంతంలో కల పాటలు. ఉదా:
"తొల్లిటివలెఁగావు తుమ్మెదా యింకా
నొల్లవుగా మమ్మునో తుమ్మెదా!" 6-9
అన్నమయ్య తన కీర్తనల్లో ఒక్క తుమ్మెద పదాన్నే చెప్పినాడు.

**తురీయభక్తి:** వి. హరిదాసులను సేవించడం.
"అతిసాహసాల పూజ అది రాక్షసభక్తి
అతని దాసుల సేవే అదియే తురీయభక్తి"
2-469

**తురులు:** వి. వాద్యవిశేషం.
"మురదనుజుని పెద్ద మొదలి యెముకఁదీసి
తురులూదరే తుత్తు తుత్తు తుత్తుత్తు" 1-120

**తులసిపెద్దదండలవాఁడు:** వి. పెద్ద తులసిదండలు గలవాడు.
"నిక్కి చూచినట్టివాఁడు నిన్నటిమొన్నటివాఁడు
తక్కక తులసిపెద్దదండలవాఁడు" 7-595

## తూ

**తూఁకువ:** వి. ఇందులో అరసున్న లేదు. తూకం, బరువు, భారం (వ్యా.)
"వేఁకపు నీ(నా) గుబ్బలతో వెలయ నీ
మనసారా"
"తూఁకువ కాపె చన్నులు తూఁచి చూడుమా"
25-53

**తూఁగుబడు:** తూలిపడు, సిద్ధపడు.
"తూఁగుబడి నన్ను నీవు తోడుతనే కూడితివి"
19-509

**తూఁట:** వి. 1. చెరకు 2. ఖండం, ముక్క.
"తూఁట మోవి గంటైతే దోసమా యేమి"
19-475

**తూఁటతాటలు:** వి; బహు. టుంటరి మోసములు.
"చాటి కూడినదానవు జడియగ నేమిటికి
తూఁటతాఁటల దాఁచకు తోరపు నీ వలపు"
23-340

**తూఁటరి:** (తూఁట + అరి) వి. టుంటరి, దుష్టుడు. (క్రూరుడు అని ఆం.ప.ని.)
"కూటమే నాదిగాక గురుతులు సోకించేటి

తూఁటరివి నీవు గావా దొరసాని విపుడు" 8-101

**తూఁటరితనము:** వి. తుంటరితనం, దుష్టత్వం.

"నీటున నా సిగ్గుదేర నీవు తోపులెత్తి యెత్తి

తూఁటరితనముతోడ తోడాడవయ్యా" 24-133

**తూఁటవిలుతుఁడు:** (తూఁట + విలు + తు) వి. తుంట విలుకాఁడు, చెఱకు విల్లుగా కలవాడు, మన్మథుడు.

"మాఁట నీతో నాడక మనసెట్టుండీరా నాకు

తూఁటవిలుతునిఁ గొంత దూరుదుఁగాక"

14-360

**తూఁటు:** వి. 1. కనుమ 2. రంధ్రం.

"పూడెను జలధులు పారిఁ గోపించిన

తోడ బ్రహ్మాండము తూఁటాయ" 4-17

**తూంట్లు:** (2) వి; బహు. రంధ్రములు; ఏ.వ. తూఁటు.

"ఏడుమడుకల చర్మ మింతయునుఁ దూంట్లై

గాడఁబెట్టుచుఁ జీము గారఁగాను" 1-77

**తూకొను:** (2) (తూకము + కొను) అ.క్రి; ప.బం. తూకము చేయు కావచ్చు అని సం.వ.స. (18 సం. 431) ప్రయత్నించు, సమకట్టు.

"యీకడ నన్ను మన్నించి యింటికిట్టె వచ్చే. వంటా

తూకొని నీ రాకల కెదురుచూతును" 11-480

"తూకొని మాటలెల్లాను దొంతులువెట్టేవు గాక

ఆకెతోడ నేకతము లాడవా నీవు" 18-173

**తూగుమంచము:** (2) వి. తూగుటుయ్యేల. 'తూఁగు' అరసున్న లేకుండ ప్రయోగం, స్త్రీలు విలాసంగా ఊగటానికి ఏర్పరచిన ఉయ్యాలమంచం.

"తూగుమంచ మెక్కుకొని తొయ్యలి లేవదంటా"

11-552

**తూరినంతే వాకిలి:** ప.బం; వి. వెన్నకొద్దీ నెయ్యి వంటిది.

"వేడుక శ్రీవేంకటేశ వెన్నకొద్దే నెయ్యా

తోడ రాఁగా వలపులు తూరినంతే వాకిలి" 8-200

**తూరిపారు:** అ.క్రి. తప్పించుకొని పోవు.

"తొరలఁగ సొలసితే తూరిపారు (?)

మర్మములు" 12-479

**తూరు(ఱు):** అ.క్రి. చొచ్చు, ప్రవేశించు. (ఇందులో శకటరేఫం ఉండాలి)

"ఎదుటఁ గాంతల జాడ యేపాటి మన్నించినాను

తుదకెక్క కుండుదురా తూరి యెంతైనాను"

16-190

"తొల్లె శ్రీవేంకటేశ్వర! తూరి నాలో నున్నాఁడవు

చల్లగా నీ చనవిచ్చి జరుపుట గాక" 3-167

"యిచ్చకమాడుదుఁగాని యీసడించ నెన్నఁడును

తుచ్ఛమాడకుండా నాన తూరిపెట్టీనే" 8-8

**తూరుపెత్తు:** (11) (తూరుపు+ఎత్తు) ప.బం; స.క్రి. వెదజల్లు, విడుచు, ధాన్యాదులను పొట్టు పోయేట్లు చేతులతో పైకి ఎత్తి గాలికి పోయు. (ఎగురగొట్టు, నిందించు, బాధించు .)

"దుమ్ము లెగయఁగ వలపు దూరుపెత్తీఁ జెలియ

నుమ్మగిలుచున్న నిట్టూరుపులను" 28-1

"కుంతనము లేమాడేవే మచ్చికఁ జెలులతోను

దొంతరనవ్వు లెంత తూరుపెత్తేవే" 29-411

**తూఱితూఱి:** అనేక పర్యాయాలు, మాటిమాటికి. ఇందులో సాధురేఫమే ఉండదగును.

"మీఱి మీఱి జంకించఁగా మిక్కుటమాయఁ దగులు

తూఱి తూఱి నవ్వఁగాఁ బొత్తులు గలసె"

28-579

**తూఱిపాఱు:** ప.బం; అ.క్రి. 1.వ్యాపించు 2.తప్పించుకొని పోవు.

"తూఱిపాఱి తెలియకే దొడ్డమేలు రాఁగా రాఁగా

ఆఱడిబెట్టను నేను అంకెకత్తెఁ గానీ" 13-41

## తృ

**తృణము మేరువు సేయు:** ప.బం; అ.క్రి. చిన్నదానిని పెద్దదిగా చేయు.

"యెలమి నే నుపకార మెవ్వరికిఁ జేయలేను

మెలఁగి నీవే తృణము మేరువు సేయుదువు"
8-45

**తృణావర్తుఁడు:** వి. కృష్ణుని చంపడానికి కంసునిచే పంపబడ్డ రాక్షసుడు. ఇతడు సుడిగాలి వలె వచ్చి కృష్ణుని పైకెగురగొట్టగా కృష్ణుడు బరువైనాడు. ఇతని భారంతో రాక్షసుడు కింద బడ్డాడు. అప్పుడు కృష్ణుడు వానిని సంహరించినాడు. భాగ.

"గాలి తృణావర్తునికి కాలయమదండము
పేలరి మద్దులకును బిరుదుకుఠారము" 15-191

## తె

**తెంకాయ:** (7) (తెన్ + కాఁయ) వి. కొబ్బరికాయ.

"నిను తెంకాయకు నీరు నించితిమా" 1-400

**తెంకాయపాలు:** (తెన్ + కాఁయ + పాలు) వి. కొబ్బరికాయ లోని నీరు.

"తేనెలు జున్నులు తెంకాయపాలును
ఆనవాలు వెన్నట్లును" 6-4

**తెంకి:** (18) వి. ఉనికి పట్టు, స్థానం, ఇల్లు, గుడి. (తె.వ్యు.కో.)

"పొంకముగా నేరకుంటే పూనుక నీవే వచ్చి
తెంకినుండి మాతోనుదీకొనఁగరాదా" 25-8

"తెంకికి వచ్చుదాకా సాదింపుజూపులే చవి
మంకు దీరుదాకా నెడమాటలే చవి" 20-22

**తెందేపలు:** (తేపలు + తేపలు) ప.బం; వి; బహు. అపారములు, సమృద్ధులు.

"కోరినవి యెన్ని లేవు కోరఁగల వెన్ని లేవు
తీరని సంపదలతో తెందేపలు" 3-9

**తెక్కలికాఁడు:** (తెక్కలి + కాఁడు) వి. వంచకుఁడు, దొంగ, అపహర్త.

"దిక్కిందరికి నైన దేవుఁడు కడుఁ
దెక్కలికాఁడైన దేవుఁడు" 1-111

**తెక్కు:** వి. ఉబ్బు, పొంగు, పడుచుదనపు టెక్కు, గర్వం.

"గక్కన రావది యేమే ఘనుఁడు నవ్వుతా
నిన్ను
తెక్కులనె చేయివట్టి తియ్యఁగాను" 11-310

**తెగఁజేయు:** స.క్రి. ఖండించు.

"చిగురాకు నా మోవి చిత్తజా నడిదమట
తెగుఁజేసు నీవంత దీప్పించకురా" 9-86

**తెగవేయు:** స.క్రి. నఱుకు.

"మొరపి పుట్టుగులల ముచ్చుఁ బౌజుల కురికి
తెరలి నడుములకుఁ దెగవేసి" 2-25

**తెగిన:** విఱ. ఖండింపబడిన, నశించిన.

"తిలకింపఁగ నాహారంబునకును
తెగిన కొలుచులవి యెన్నెన్నో
యిలపైనే బ్రదికిన కాలము యెంతని
వ్రాసెనో చిత్రగుప్తుఁడు" 6-189

**తెగిన గాలిపడగ:** ప.బం; వి. దారీతెన్నూ లేనిది, నీతినియమాలు లేనివాడు, స్వేచ్ఛావర్తనం కలవాడు.

"కన్నచోట్లఁ దెగిన గాలిపడగవై నీవు
పన్ని మాటీవేన నిట్టె బ్రదుకవయ్యా" 5-563 old

**తెగుదారి:** (తెగువు + దారి) వి.
1. వందాన్యురాలు 2. దాత వదాన్యుడు
3. సాహసికురాలు, సాహసికుడు. (పద.)

"అడ్డాక లేడవి అన్నిటాఁ దెగుదారివి
ఒడ్డారాన నెట్టుండినా వొరపే నీకు" 21-328

**తెగుదెంపు:** వి. 1.తీర్పు 2.సాహసం 3.ఫలితం, సంబంధం తెగిపోవడం. (పద.)

"లంపటము విరియించ లావు చాలక తుదిని
దింపనొక కొంతైన తెగుదెంపు లేదు" 1-178

**తెట్టఁదెరువు:** ప.బం; వి. తెట్టతెన్ను, నడివీథి, ఘంటాపథం. (పద.)

"తెట్టఁదెరువున నే దిక్కులవారు చూడఁగ
చుట్టుకుండుటెట్లు చంద్రసూర్యలోకములా"
15-353

**తెడ్డు చవులెఱుంగునటయ్యా:** సామెత; తెడ్డుకు వంట రుచితెలుస్తుందా?

**తెడ్డువంటివాఁడు:** వి. లోపలా బయటా ఉండేవాడు, ఇద్దరిపక్షాల ఉండేవాడు.

"తెఱఁగొప్ప రెంటికిని తెర్డువంటివాఁడ నింతే
పఱచుఁగర్మములాల పట్టకురో మమ్మును"
1-464

**తెప్పతిరుణాళ్లు:** వి; బహు. తెప్పోత్సవం, స్వామిని తెప్పపై ఉంచి కోనేటిలో తిప్పే ఉత్సవం.

"అప్పుడు పదారువేలంగనల చెమటల
తెప్పలఁదేలిన తెప్పతిరునాళ్ళు"
6-143 & 2-143

**తెప్పలఁదేలుకొను:** అ.క్రి. తేలు, రా.సీ. మాండలికంలో కొన్ని ధాతువులమీద కొను చేరుతుంది.

"దేవులుఁ దానుఁ దెప్పలఁదేలుకొని
వోవరిలో సంతోసాల నొనరుకొని" 28-493

**తెప్పలకోనేటమ్మ:** వి. తిరునాళ్ల సందర్భంలో తెప్పలు గల కోనేరు తల్లి.

"దేవునికి దేవికిని తెప్పల కోనేటమ్మ
వేవేలు ముక్కులు కోకపావని నీకమ్మా" 7-192

**తెప్పి(అ)రన్:** క్రి.విణ. ఆదమరవగా, నిశ్చింతగా.

"తెప్పిర సురటి వీచితే జంకింతురా
కొప్పుగా నాపె రూపు వాగర వ్రాసినది" 7-371

**తెమ్మ:** (3) వి. తడి, ఆర్ద్రత, చెమ్మ; రూపాం. తేమ (రాశి). తెమ్మల్ అనే శబ్దానికి కన్నడంలో గుంపు అని అర్థం. ఈ అర్థమే ఇక్కడ సరిపోతుందని సం.ప.స. గుంపు, అధికం (పద.)

"కమ్మరఁదన వేళలు గాచుకున్నారము నేము
తెమ్మలుగఁ దన నేర్పు తేటపడీ నిఁకను"
14-161

"తెమ్మలుగ నందరికి తెలుపవయ్యా నీ సుద్ది"
20-498

"చిమ్మి చిమ్మి నీ యింటికి చేతులే చాఁచీని
తెమ్మల ఆ సన్ననీవు తెలుపవంటా" 20-187

**తెయిఁదెరువు:** వి. ఉపాయం?

"మంచుఁబులకల చాటు మగనాలి గుబ్బలు సో
ధించి చూచే వేర తెయిఁదెరువునను" 6-96

**తెరఁకువ:** వి. 1. వివేకం, తెలివి 2. ఉపాయం, వెరపు.

"తెగువలు వుట్టితేను తెరఁకువాఁ బుట్టును"
13-59

**తెర(అ)చి రాజను:** ప.బం; స.క్రి. తోసిరాజను.

"తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుఁడు" 12-243

**తెరచిరాజు:** ప.బం. అడ్డుతొలగించు.

"తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచిరా జన్నట్టి దేవుఁడు" 5-243

**తెరచీర:** వి. 1. తిరస్కరిణి, యవనిక 2. వేట సాధనంగా ఉపయోగించే యవనిక, అడ్డువల.

"పరిమళము లతఁడు పైపైఁ బూయఁగ బూయగ
తెరచీరఁ దుడిచీని తీసి తీసి యదివో" 17-326

**తెరదీయు:** ప.బం; అ.క్రి. బయల్పరచు.

"పొరుగువారెల్ల పొరచి చూచిరి
తెరదీసె నిదె తెగనానలు" 17-106

**తెరనాటకము:** వి. తెరకట్టి ఆడే తోలుబొమ్మలాట మొదలైనవి, వీథినాటకం.

"ఒక్కటి తరువాత వేరొకటై కాచుకుండు
చక్క దెరనాటకము సంగతి సంసారము" 3-111

**తెరమరుగుదినాలు:** ప.బం; వి; బహు. మాయలో పడిన రోజులు.

"తెరమరుగు దినాల దేవుఁడ నీ కల్పితమే" 3-8

**తెరమరుగుమెకము:** వి. కానరాని ప్రమాదం.

"ఇరవైన యట్టుండు యెఱఁగనీ దీ మాయ
తెరమఱుఁగు మెకమువలెఁ దిరుగు నీ బ్రదుకు"
1-486

**తెరళ:** వి. ముద్ద; కన్నడం లో తెరళ అంటే గుండ్రటిముద్ద అని అర్థం.

"దేవుని ప్రసాదము తెరళ లందుకోరో
యీవేళ నారగించె యీశ్వరేశ్వరుఁడు" 15-189

**తెరువుఁబోవు:** ప.బం; అ.క్రి. జోలికి పోవు. ఈ మాండలిక పదం తెలంగాణంలో కూడా వాడుకలో ఉంది.

"ఎలమి నా చింతతోడ ఎవ్వరి తెరువుఁబోక
తలవంచుకుండఁగాను తడవుదురా" 13-378

**తెరువుపెసరు :** ప.బం; వి. దారిలోనుండు పెసరచేను పంటను ఆ తెరువున వచ్చిపోయే తెరువరులు ఎవరో కోసుకొని పోతూ ఉంటారు కనుక చేను యజమానికి దక్కేది కొంచెమే. ఒకవస్తువును నమ్ముకొని ఉండేవానికి దక్కేది కొద్దిమాత్రమే అనే భావంలో వాడే పదబంధం.

"చిఱునవ్వు నీ పలుకు జిగురుజొట్టిన కండి
తెలివలకు నీ మోవి తెరువు పెసరు" 5-75

**తెరువువచ్చు :** (7) ప.బం; అ.క్రి. 'జోలికివచ్చు'. ఈ మాండలికపదం తెలంగాణంలో కూడా వాడుకలో ఉంది.

"ఇంతలో నీ తెరువురా మందు కేల కోపము
తిట్టుదుఁ జుమ్మీ నా తెరువు వచ్చితేఁగన"
11-302 & 15-375

**తెలివి :** వి. పుట్టుకతో వచ్చిన వివేకం. (నేరుపు = అభ్యాసంతో కలిగిన లోకజ్ఞత)

"చిప్పిలఁజెనకితేను చిరునవ్వు నవ్వవద్దా
నెప్పునఁదెలివి గల నేరుపరిదానికి" 25-83

**తెలివినిద్రలు :** వి; బహు. మెలకువ మరియు నిద్ర.

"తెలివినిద్రలు గల దేహమా నీ
పొలము పంచభూతాల పొత్తు దేహమా" 1-416

**తెలుఁగుఁగాంబోది :** వి. ఒకానొక సంగీతరాగం.
12-493

**తెలుఁగువాఁడు :** వి. తెలుగుమాట్లాడేవారి జాతికి చెందినవాడు.

"వొగి నొడ్డభాషలాడి వొడ్డెవాఁడనైతి
తెగి తెలుగాడ నేర్చి తెలుగువాఁడ నైతి" 3-379

**తెలుకపిండి :** వి. గానుగపిండి, తెలిక (తెలక, తెలగ) పిండి.

"అని కస్తూరి నల్లనంటేఁ దెలుకపిండి
యీ నెపాన నల్లనంటె నే మందునే" 9-58

**తెలుకపిండి కస్తూరి చేయు :** ప.బం; అ.క్రి. మామూలు వస్తువును ఎంతో గొప్పవస్తువుగా చేయు.

"దిక్కు లెఱుఁగఁగఁ గష్టదేహిని నన్నుఁదెచ్చి
గక్కునఁ దెలుకపిండి కస్తూరి సేసె" 1-282

**తెలుసుట :** (2) వి. 'తెలియుట'కు వ్యావహారిక రూపం.

"ఏమీ ననఁగఁజాల మింత నిన్ను
దీమసాన నీకు నీవే తెలుసుట గాక" 23-296

**తెల్లనాకులు :** వి; బహు. లేత తమలపాకులు.

"పట్టితివి పిడికిట బాగాలూ దెల్లనాకులు
నెట్టనఁ జివిఁ బునుఁగు నిండా నించుకొంటివి"
29-135

**తెల్లనివెల్లా పాలను :** అ.క్రి. అమాయకత్వంతో ప్రవర్తించు.

"పరఁగఁ దెల్లనివెల్లాఁ బాలంటూ నుండకురా
గరిమె శ్రీవేంకటేశ కాఁగిటఁగూడితి నిట్టె" 11-214

**తెల్లవారించు :** స.క్రి. తెల్లవారేట్లు చేయు, కాలం గడుపు.

"యెగసక్కెల నేమీ నెఱఁగనిదాన నన్ను
తెగరాని బాసలిచ్చే తెల్లవారించితివి" 27-98

**తెల్లవారు :** ప.బం; అ.క్రి. 1. వ్యర్థమగు 2. క్షీణించు 3.మందగించు 4. తెల్లనగు 5. ముదియు.

"తెలుసుకో యిఁక నీవు తెల్లవారె నీ మాట
బలువుఁడ వీ రెంటి పంతము నీ చేతిది" 20-60

"గుట్టున శ్రీవేంకటేశ కూడితివే నన్నునిట్టు
దిట్టతనపు మా రతి తెల్లవారకుండీనా" 12-16

**తెవులుపడు :** అ.క్రి. వ్యాధితుడగు, రోగపడు.

**తెవ్వని కాలము :** వి. (?)

"చివ్వని నా లోకములు చేరి కాలము గడపు
తెవ్వని కాలము నిద్రాఁ దెలివినై ముంచును"
2-346

## తే

**తేఁకువ :** వి. 1. బింకం, బెట్టు 2. భేదం 3. భయం, జంకు 4.సందేహం 5. మర్యాద 6. ఓర్పు 7. వివేకం 8.ఉత్సాహం 9. ధైర్యం 10. దృఢసంకల్పం 11. ప్రసిద్ధి 12. హద్దు 13.పూర్ణత 14. దర్పం 15. విధం, రీతి.

"కాఁకల విటుల చూపు కాంతలపై నుండినట్లు
తేఁకువ నుండవలదా దేవునిమీఁదటను" 15-46
"తేఁకువతో నీవు నన్ను దిష్టించి చూడవలసి
పోఁకపూఁబాల వేసితి పొంచి వోరుచుకోమీ్మ" 29-362

**తేఁటల చూపులు :** వి; బహు. ప్రసన్నమైన చూపులు.
"తేఁటల చూపులు చూచి తీపులు పైఁబడనిచ్చి
నాటించీ గోరు నీపై నాలికత్తె" 26-254

**తేకుటాకు :** (తేరు + ఆకు) వి. టేకుచెట్టు ఆకు, ఉత్తమజాతి కలపనిచ్చే ఒక టేకుచెట్టు.
"ఇంపుల వెలఁగపండ్లిందవయ్యా కానికె
గుంపుఁదేకుటాకు మరఁగున నున్నవి" 5-35

**తేఁగరాయఁడు :** వి. త్యాగం కల రాజు.
"వరవసంతములరాయ వనితల విటరాయ
గురుతైన తేఁగరాయ కొండల కోనేటిరాయ" 2-459

**తేజము :** వి. ఒప్పు.
"తిట్టఁగవచ్చునా నిన్ను తేజాన నన్నుఁ గూడితే
యిట్టె శ్రీవేంకటేశ యెనతుఁగాక" 25-394

**తేజరాసి :** వి.'తేజోరాశి'కి అన్నమయ్య యథేచ్ఛప్రయోగం.

**తేజిగుఱ్ఱము :** వి. గుఱ్ఱం అనే అర్థంలో వాడబడే జంటపదం. తేజి, గుఱ్ఱం – ఈ రెండూ సమానార్థకాలే. ఉత్తమాశ్వమని కూడా కావచ్చు.
"దిట్టయైన చిత్తమనే తేజిగుఱ్ఱమునకు
వొట్టుక రేవంతుఁడ వుపమింప నీవు" 2-274

**తేను :** స.క్రి. తెచ్చుటకు.
"వంకకు సంజీవని దేను వాయుజుని పంపినట్టు
వేంకటాద్రిపొంతనుండ వేగ మమ్ము నంపవే" 3-432
"ఘనకిరీటము దేను గరుడని నంపినట్టు
అనుఁగుఁగపుల నిండ్ల కంపినట్టు" 3-432

**తేనెపండు :** వి. పెదవి?
"ప్రియమైన తేనెపండు బేటులెత్తీ నూర్పులను
దయతోడ నీ యింతి దండ చేరవయ్యా" 27-175

**తేనెపెదవులాపె :** వి. తియ్యని పెదవులు గల స్త్రీ.
"తలకొని తేనెపెదవులాపె విలిచీని
పలుమారు నూఁకొని పలుకవయ్యా" 29-13

**తేనెమోవి :** వి. తియ్యని పెదవి.
"యీ నెపాన శ్రీవేంకటేశ యింతిఁగూడితివి
తేనె మోవెఱుఁగుఁ గాని తెగువ యెఱఁగదు" 23-469

**తేనెలోపలి యీఁగ తెఱుగు :** ప.బం. ఇబ్బందిలో చిక్కుకోవటం, బయటకురాలేని స్థితి, తప్పించుకోలేని స్థితి.
"తేనెలోపలి యీఁగ తెఱఁగాయ మనసు" 1-337

**తేప(లు) :** వి. తడవ(లు), పర్యాయం(ములు)
"పైపై శ్రీవేంకటేశ పచ్చిమోవి సోఁకి కదా
తేపలైన రతుల నీ దేవినై వుందాన" 7-439

**తేప :** వి. తెప్ప, పడవ.
"పాపా లడఁపఁగ భవపయోధులకు
తేపై యున్నాఁ డీతఁడిదే యీతఁడు" 1-117
"శ్రీపతి యొక్కఁడే శరణము మాకును
తేప యితఁడె మఱి తెరఁగేది" 3-573

**తేపగా :** క్రి.విణ. వరుసగా.
"ఆపెతో నన్నియుఁ జెప్పి దదెఱఁగను
దేపగాఁ దన గుణాలు తెలిసెఁగా నాకునూ" 12-60

**తేరకత్తె :** (తేర + కత్తె) వి. సంబంధం లేని స్త్రీ, అన్యురాలు, పరస్త్రీ, విటురాలు.
"యీరీతి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁ గూడితివి
తేరకత్తెల నే గతి దిద్దేమో నేము" 27-319

**తేరకాఁడు :** (4) వి. 1. పరపురుషుడు 2. విటుడు 3.కొత్తవాడు 4. సంబంధం లేనివాడు 5. అన్యుడు.
"తెట్టఁదెరువున నేల తేరకాఁడా
యెట్టువలసిన నయ్యా నింటికి రావయ్యా" 7-474

**తేరకాడు:** క్రి. (తేరకు + ఆడు) వృథాగా మాట్లాడు, ఊరక మాటాడు.
"పోరి నింటి కాంతలను చలము సాదించనేల
తేరకాడు మగువలు దేశములో లేరా" 25-391

**తేరకు:** సూం. ఊరకే.
"పూరకే యెప్పుడో పాదాలొత్తించుకొంటి వంటూ
తేరకే వేసాలు సేసీ దిక్కులని నొక్కై" 26-285

**తేరకొను:** వి.బం; అ.క్రి. తదేకదృష్టి కలిగి ఉండు.
"సోరెఁ జొట్టి పట్టితివి జారిన పయ్యెదకొంగు
తేరకొన నిది యేమో తెలిసెనె నేను" 11-222

**తేరపనులు:** వి; బహు. శ్రమలేని పనులు.
"మీర మీరే వేరా మెల్లనే తొల్లి
తేరపనులకునుఁ దెగువేలే" 26-65

**తేరు:** వి. రథం.
"కదిసి చుక్కలు మోచే కనకాద్రివలెను
తిరిగి తిరిగినదె దేవదేవుని తేరు" 4-55

**తేరువీథి:** వి. రథమును ఊరేగించే వీథి, రథ్య.
"తేరువీథి నల్లవాఁడే దిమ్మరై సతులఁ బిల్చి
నే రమ్మనీ చీకటింట్లో విట్టలుఁడు" 17-289

**తేర్పాముడి:** శ్రీవైష్ణవులకు పవిత్రమైన "తిరుప్పావై" దివ్యప్రబంధము.
"రాగమునఁ దేర్పాముడి రంతుసేసి చదువఁగ
జాగుతోడ నారగించె సర్వలోకేశ్వరుఁడు"
15-189

**తేవ:** వి. ఉత్సవవిశేషం (శ.ర.), తెప్పోత్సవం.
"తావున శ్రీహరిదాసుల సంపద
తేవల నెన్నఁడుఁ దీరనిది" 3-292
సమూహం:
"తేవల నిట్టూర్పులకు తీగె నవ్వె మరఁగు
యీ విధాలు గంటి నాతోనిఁక నేల మరఁగు"
9-127

## తొ

**తొంగిడు:** అ.క్రి. మోకాళ్ళపై పాకు.
"చెంగట నిద్దిరించేటి చెలువంపు గొల్లెతల
దొంగిడుచు వచ్చి వచ్చి తొడలంటీనే" 19-174

**తొంటిపొందు:** ఇది తొంటిపొందు కావచ్చు. ముందటి పొందు.
"వెక్కసించేమి నవ్వేవే విరులనేల రువ్వేవే
తక్కక నీ తొంటిపొందు తలపించుకొంటాను"
29-224

**తొంటివినుకులు:** వి. వేదాలు, తొలుతగా విన్నవి అని వ్యు.
"కంటిమి మిమ్మందరిని కన్నుల తుదల నేడు
తొంటి వినుకులకు సంతోసమాయ నయ్యా"
13-106

**తొండకు వెలుగు సాకిరి:** సామెత; తెలియని సాక్ష్యం, అస్పష్టమైన సాక్ష్యం. (వెలుగు = పొలమునకు చుట్టూ వేసే కంచె)
"అవ్వలఁదొండకు వెలుగు సాకి రంతేకాక
యెవ్వ రెఱుఁగుదురు మీ యిద్దరిలో పనులు"
20-376

**తొండమాంజక్కురవర్తి:** వి. ఒకప్పుడు తిరుమలలోని పుష్కరిణి దగ్గరలో ఒక చింతచెట్టు ఉండేదట. దానికింద శ్రీ వేంకటేశ్వరస్వామి స్వయంభూవిగ్రహం తొండమాన్ చక్రవర్తికి దొరికిందట. అప్పుడు స్వామి తొండమానునితో నేను నీ ఇంటివాడనయ్యాను. కాబట్టి నా కొక ఇల్లు, గోశాల, కోశాగారం, ఏడు ద్వారాలు, మూడు ప్రాకారాలను రాతితో కట్టించి దానికి రాగి, బంగారాన్ని అలంకరించి తనకు ఇవ్వాలని కోరినాడట. అందుకు తొండమాన్ చక్రవర్తి అంగీకరించి స్వామివారికి దేవాలయాన్ని నిర్మించినాడట.
"దొమ్ములు సేసినయట్టి తొండమాంజక్కురవర్తి
రమ్మన్న చోటికి వచ్చి నమ్మినవాఁ డమరు" 1-151

**తొండమారేగుళ్ల గోపీనాథుడు:** వి. తొండ మారేగుళ్ళలో వెలసిన శ్రీకృష్ణుడు. ఈ తొండమారేగుళ్ల గ్రామం ఎక్కడ ఉందో గమనించాలి.
"కొండల శ్రీవేంకటాద్రి గోపీనాథా

పొందు తొండమారేగుళ్ల దొర గోపీనాథా"
26-187

**తొక్కు :** (1) వి. తొక్కుడు, సమ్మర్దం.
"తొక్కిన పాదపుఁదొక్కు తుదకెక్కెను" 11-106
"ఇందరిలోఁ గూడితివి యిట్టె శ్రీవేంకటేశ
సందడించీఁబాదముల సరసపుతొక్కులు"
7-390

**తొక్కు :** (1) వి; మాం. పచ్చడి, ఈ పదం తెలంగాణంలో కూడా వాడుకలో ఉంది. ఉదా :- మామిడికాయ తొక్కు మొ॥
"చింతకాయతొక్కు చూచితేనే నోరూరు
యెంతకెంత దవ్వ యేడకేడ సూత్రము" 2-234

**తొక్కుడువడు :** ప.బం; అ.క్రి. 1.ఒత్తిడినొందు 2.తొట్రుపడు 3.అదుముడుపడు.
"తోడఁదోడ నైతేను తొక్కుడువడీఁ బంతము"
13-408

**తొక్కుతొక్కులాడు :** (తొక్కులాడు + తొక్కులాడు) ప.బం. మిక్కిలి ఎగురులాడు, మిక్కిలి గంతులు వేయు (వ్యు.), మిక్కిలి తొందరపడు (పద.) రాయలసీమలో ఈ అర్థంలో ఎక్కువగా వినిపిస్తుంది.
"ఆ రీతుల దొక్కుతొక్కులాడఁగా గాలు దాఁకెనో
సారె నందుకేమి దోసము గాదు రావయ్యా"
24-418

**తొక్కుమెట్టు చెమటలు :** వి; బహు. తొక్కు, మెట్టు అనే రెండు ధాతుజవిశేషణాలు అతిశయార్థంలో ప్రయోగించినట్లున్నదని సం.ప.స. (18 సం. 431 పు.) పెల్లుబ్బి వచ్చు చెమటలు కావచ్చు.
"మక్కువలు చల్లుకొంటా మాటలాడఁజూచి
తొక్కుమెట్టు చెమటలఁ దొప్పఁదోఁగిని" 18-258

**తొక్కుమెట్టుసందడి :** ప.బం; వి. (?)
"మిక్కిలి విచ్చి చెప్పితే మేడివంటి బోనమిది
తొక్కుమెట్టు సందడెల్ల తోఁదోపులే కావా"
21-192

**తొక్కులఁబడు :** ప.బం; అ.క్రి. కష్టాల పాలగు (పద.)
"ఎక్కడ నున్నారో సురలెవ్వరు భూమికి దిక్కో
తొక్కులఁబడె జీవుఁడు దుండగీలచేతను" 3-64

**తొక్కులాడు :** (2) ప.బం. ఎగురులాడు, గంతులువేయు, తొందరపడు. ఈ అర్థం రా.సీ.లోను, తెలం, లోను ఎక్కువ ప్రచారంలో ఉన్నది.
"తక్కుల మొన్న నా మఱఁదలితోడ నీవు వోరి
తొక్కులాడితివి చాలు గట్టకురా" 6-134
"తోడ నద్దము చూడఁగాఁ దొక్కులాడ వచ్చేవు"
14-184

**తొక్కుపడు :** (తొక్కు + పడు) నలుగు.
"కొప్పుఁగదుఁ జిక్కువడె కుచములు తొక్కువడె
అప్పటి నేమిసేసితి వయ్యో అయ్యో" 9-137

**తొట్టిన :** విణ. పరిపూర్ణుడైన.
"తొట్టిన సుజ్ఞానికి దుఃఖము లేదు
గట్టియైన మౌనికి కలహమే లేదు" 2-307

**తొట్టు :** అ.క్రి. నిండుకొను, పరిపూర్ణుడగు.
"తొట్టిన సుజ్ఞానికి దుఃఖము లేదు
గట్టియైన మౌనికి కలహమే లేదు" 2-307

**తొట్టు :** వి. సంబంధము.
"చుట్టమవై వున్నాఁడవు చూచినవారికిఁజూడ
తొట్టు దీరిచేవు యింత దోసమేల యిఁకను"
14-198

**తొట్టు :** స.క్రి. స్పృశించు, ప్రాపుగొను, మొదలుకొను, మెండుకొను.
"తొట్టి నిన్ను దగ్గరినా దూరమున నుండినాను
పుట్టించి నీ గర్భములోఁ బొదలించకుండవు"
3-387
"గుట్టున వేంకటేశ కూడితివి నన్ను నిట్టె
తొట్టి నిన్ను వెంగమాడే దోస మేల యిఁకను"
16-198

స్రవించు, ప్రవహించు :
"నిండిన తమకమెల్లా నిలువునఁ దొట్టఁగాను"
12-286

వ్యాపించు, నిండుకొను :

"ముక్కున నూరుపుదొట్టె, మోమెల్లా వాడు
పుట్టె" 21-491

**తొట్టుకొను:** అ.క్రి. వ్యాపించు, ఎక్కువగు, ఉబుకు (వ్య.) చూ: తొట్టు.

"తొడరి నీకైతే నిద్ర తొట్టుకొనెఁగా" 21-506

"తొట్టుకొన్న సవతుల తొడుసు లేల" 20-468

"పట్టపుదేవులు గద్దు పసులెల్లాఁ జక్కనాయ
తొట్టుకొంటివయ్య మేలుకొమ్ము నీకును"
23-489

**తొట్ల:** వి. 'తొట్లు'కు వ్యావహారికరూపం.

"పసుదేవుఁ డిక్కెను శ్రావణబహుళాష్టమిని
పసగాఁ దొట్ల నూఁది పొడఁగలిగా" 4-27

**తొడపై తొడవేయు:** ప.బం; అ.క్రి. ఏమాత్రం పని చేయకుండా హాయిగా ఠీవి చూపు. చూ: తొడమీద తొడ వేయు.

**తొడమీఁద తొడవేయు:** ప.బం; అ.క్రి. ఏమాత్రం పని చేయకుండా హాయిగా, ఠీవిచూపు; ఈ అర్థంలో కాలిమీద కాలువేయు, కాలిమీద కాలు తీయకుండా అనే పదబంధాలు కూడా వాడుకలో ఉన్నాయి. డాబుగా ఉండు, సంభోగింపబూను.

"తొడమీఁదఁ దొడవేసి దొరతనాలు చూపఁగా
కడఁగి నీ మోవి యాకె గంకిసేయఁగా" 28-443

"తొడమీఁదఁ దొడవేసి తొరలించి వలపులు
జడివానలుగ నీపైఁ జల్లీ సరసము" 28-472

**తొడమె:** వి. 'తొడిమె'కు వ్యావహారికరూపం. చూ: తొడిమ.

"తుంచి తమలపాకుల తొడమెలు నీ మీఁద
ఇంచుకించుకె వేస నిందరుఁజూడ" 7-62

**తొడయెక్కు:** ప.బం; అ.క్రి. సంభోగింపబూను.

"కమ్మటి గర్వమున నాగడము లాడి యతని
దొమ్మిసేసి పెనఁగుతా తొడయెక్కేవు" 26-406

**తొడలసాము:** వి. రతిక్రియ.

**తొడసు:** వి. 'తొడుసు'కు వ్యావహారికరూపం. 1. సంబంధం 2. చిక్కు 3. దోషం 4. విసుగు.

"యెక్కడ దిష్టి దాకునో యిందుకే చింతించి నీకు
గక్కన నేడ తొడసు గలిగెనో తాను" 12-507

"చెంతల నీతని సేవకులకు మరి
దొంతికర్మముల తొడసేఁక నేలా" 4-324

**తొడిఁబడు:** అ.క్రి. 1. తొట్రుపడు 2. చిందు, చెదరు 3.చలించు 4. ఇటునటుపర్చు, వ్యాపించు 5.తొందరపడు, శీఘ్రంగాపోవు 6. బాధపడు (సారంగ.) 1. పూర్తిగా 2. ఊతపడంగానైనను గ్రహించవచ్చునని సాహిత్య సమీక్ష. 168 పు.

"తొడిఁబడ ముద్దులు భూమిపైఁ గూలఁగ
దొబ్బి యఘాసురునిఁ జంపితివి" 3-277

**తొడికిపట్టు:** స.క్రి. ఒడిసిపట్టు, అంకించిపట్టు.

"పగలఁగోపము పాపమువలె నలుక చాచఁగ
పగటుతోడఁ దొడికిపట్టఁగ నేరుతునా" 17-268

**తొడిమ:** (3) వి. 'తొడిమె'కు వ్యావహారికరూపం కావచ్చు. పూవు మొ॥ వాటి తలలో ఉండే కాండం, వృంతం.

"పనివి తొడిమ నూడి పండు తీఁగె నంటదు"
2-288

"వొడిసి తొడిమ వండి వూడిన ఫలములు
అడరి క్రమ్మర నందు నంటఁబోయీనా"
15-129

**తొడుకు:** (2) వి. 1. దొంగమేత 2. ఆవు.

"తొడుకు మేయఁగరాదు తూర్పెత్తితేఁ
బొల్లువోదు
బడినే శ్రీహరి భక్తి పంట పండితే" 3-230

**తొడుకు:** (5) స.క్రి. 1. పట్టు 2. ఒడిసిపట్టు 3.ఒడియు 4.గ్రహించు అ.క్రి. తెగించు, సాహసించు 5. త్రాగు, గ్రహించు.

"దొమ్మికాఁడ గొల్లెతలఁ దొడికిన యలవాటు
ఇమ్ముల నెవ్వరిఁ గన్నా నేల మానునయ్యా"
14-32

"నే మటువంటివారమా నీ వెరగవింతే
దోమటి యెందైనానుఁ దొడికేవు గాక" 14-32

"బాలుడ శ్రీవేంకటేశ పయ్యెదేల తొడికేవు
పాలు దొలఁకీ నోయి పంతగాఁడ" 7-474
"తోడనె వెన్నదుబ్బలు తొడుకనేల వచ్చీని
వేడుకకాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు" 7-134

**తొడుసు:** వి. 1.సంబంధం 2.చిక్కు 3.తప్పు 4.అన్యాయం 5.బాధ, పరితాపం 6.విసుగు 7.చెప్పులకు, కాళ్లకు అంటుకొన్న బంకమట్టి.
"పెంచఁగాఁ బెంచఁగాఁ దిమి పెనుఁదొడుసు వంటివి
నించ నించ సిగ్గులు వన్నెలవంటివి"
"వసముగాని ధనంబు వట్టి తొడుసు" వే.శ. 54

**తొడ్డవాఁడు:** విణ. ఘనుఁడు, మంచివాడు.
"తొట్టెల పాపఁడ వింతె తొడ్డవాఁడ వూచల
పట్టి నా తొడలమీఁదఁ బవ్వళించేవు" 6-54

**తొత్తుఁకాఁడు:** (తొత్తు + కాఁడు) దాసుడు, విటుడు.
"నీవు నాకుఁ గాఁచి నే నీ యాధీనము
తోవల పరధర్మపు తొత్తుకాండ్లేలయ్యా" 15-111

**తొప్పఁదోగు:** (3) (తోఁగు + తోఁగు) ప.బం; అ.క్రి. మిక్కిలిగా మునుగు, మిక్కిలి తడియు.
"తొప్పఁదోగ నొసలి కస్తూరి బేటులు రాల
ముప్పిరిగొన సారెకు మొక్కేఁగా నీకు" 22-187
"కప్పకురో చెఱఁగు వేంకటరాయ చెమటలఁ
దొప్పఁదోఁగి యెవ్వతో పొందులకు నేఁ గితివి" 5-52
"చివ్వన నై చెమరించి చిత్తడి చెమటతోడ
దువ్వటపుఁబయ్యెదెల్లాఁ దొప్పఁదోఁగెను" 7-144

**తొప్పఁదోచు:** ప.బం; స.క్రి. ముంచు.
"తొప్పఁదోఁచి యిందరిలో దొరఁజేతు నిన్నును" 20-202

**తొప్పర(ఱ)లాడు:** అ.క్రి. క్షోభపడు.
"తుమురుగ దనుజులఁ దోలి తొప్పరలాడె
అమరఁగ గెలిచితి నందువు" 10-2-107

**తొబుకకవిత్వాలు:** వి; బహు. నిస్సారమైన కవిత్వాలు.
"తొబుకకవిత్వాల దోషాలఁ బొరలితే
దిబుకార నవ్వఁడా దేవుఁడైనాను" 2-494

**తొమ్మిదిగంతల మేను:** వి. తొమ్మిది రంధ్రాలు గల శరీరం.
"తూడరి మోచినమోపు తొమ్మిదిగంతల మేను
కడుసందిఁ గట్టినది కర్మపుఁదాడు" 15-83

**తొరలు:** ఎదుర్కొను, తొడరు.

**తొరుగు:** అ.క్రి. 'తొరగు'కు రూపాం. 1. జారు, గళితమగు 2. పడు, రాలు 3. కురియు 4. ప్రవహించు స.క్రి. విడుచు.
"పిడుగులు దొరిగెను పెనుగాలి విసరె
తొడిఁబడి బాణము దొడిగినను" 4-518

**తొర్లుఁబూట:** వి; ప.బం. పూటలలో ఒకవిధమైనది. (పద.)
"ఏపున సంసారమున ఇది గాక కమ్మటాన
దాపుగ తొర్లుఁబూట తగిలించుకొంటిని" 4-142

**తొలలింపుఁ గోరికలు:** వి; బహు. పుట్టే కోరికలు.
"చిరునవ్వు లూరకే సెలవి నణఁచేగాని
తొలలింపుఁగోరికలు తూరిపారీని" 16-490

**తొళ్లుపెసలు:** వి; బహు. బోలుపెసలు, లోపల అంతా రంధ్రంగా ఉండే పెసలు.
"మిణ్ణుఁబల్లములకుఁ దెచ్చి మెరసి
భూతజాలములకు
దొళ్లుపెసలు గొలచినట్టి దోస మేల పాయును" 1-171

**తొళ్లుపెసలు గొలుచు:** ప.బం; అ.క్రి. వృథాప్రయత్నం చేయు, వృథాప్రయాసపడు.
"మిణ్ణుపల్లములకుఁ దెచ్చి మెరసి
భూతజాలములకు
దొళ్లుపెసలు గొలచినట్టి దోసమేల పాయును" 1-171

**తొలఁగా:** క్రి.విణ. తొలగగా. ('గ' లోపించిన రూపం)
"కన్నులఁ జూచుచు నందరితోనేఁ

గాదని తొలఁగా నొల్లను" 1-463

**తొలతొల:** నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.

"వలపు చల్లుదుఁగాని వాడిక నే నొల్లనయ్యా
తొలతొల యింతేసి లోఁతుకు నే వెరతురా"
21-508

**తొలరో:** తొలగరో: క్రి.ప. ఇందులోని 'గ' లోపించింది. 'కలితే' అనే పదంకూడా ఇట్టిదే.

"దోసము దోసము తొలరో శ్రీహరి
దాసానదాసుల దగ్గరక" 1-241

**తొలసి:** వి. తులసి.

"ములువాడి కొనగోళ్లు ముంచి కొప్పు దువ్వి
దువ్వి
తొలసితో మొల్లలట్టే తురిమీఁ జూపును"
19-404

**తొలసిదేవి:** వి. తులసీదేవి.

"నేను తొలసిదేవిని నీ పాదాలు పూజింపించి
ఆనుక తా విఱ్ఱవీగే నాపికేమి" 27-435

**తొలసిపూస:** వి. తులసిపూస.

"తొళసిపూసల పెద్దపేరు" 6-170

**తొలియాడు:** అ.క్రి. (?)

"దొమ్మిసేసి తుమ్మిదలు తొలియాడ వైరులా
నమ్మించి బాస దప్పిన నాథుఁ డింతె కాన"
10-49

**తొలిసమరుతాడు:** అ.క్రి. మొదటిసారి ఋతుమతియగు.

"ములకవలపులే మొదలు సేసుకొని
తొలిసమరుతాడితే దొరసితివి" 19-171

**తొలుకరించు:** అ.క్రి. వర్షించు.

"తొలుకరించె వనితపై నిదె నేఁడు
చెలువుఁడ వింతట విచ్చేయవయ్యా" 20-101

**తొలుకరికాలము:** వి. వర్షకాలం.

"బలువుగా నప్పటిని పన్నీట వసంతమాడి
తొలుకరికాలమువలె నుంటివి" 26-389

**తొలుతరాళ్లువేసి తోడ పూవులవేయు:** ప.బం; అ.క్రి. మొదట అవమానించి తరువాత గౌరవించు.

"తొలుత రాళ్లువేసి తోడఁబూవులు వేయఁగ
కలదా అందేమైన కానీవే తాను" 26-143

**తొలులు తొమ్మిదగు తోలుతిత్తి:** వి. శరీరం, నవరంధ్రాలు గల శరీరం.

"తొలులు తొమ్మిదగు తోలుదిత్తికిని
పిలువఁగఁ బేరునుఁ బెంపునుఁ గలిగె" 2-251

**తొల్లిటితిత్తి:** వి. ముందుజన్మలోని శరీరం.

"పారీ ముందటి భవపాశములు
తీరీఁదొల్లిటి తిత్తిలో పుణ్యము" 3-46

**తొల్లిటిదొంగ:** వి. శ్రీకృష్ణుడు, పూర్వకాలపుదొంగ అని వ్యుత్పత్తి.

"యొల్లయినా వేంకటేశుఁడిదె
తొల్లిటిదొంగ వచ్చె దోబూచి" 5-227

**తొల్లె:** ముందు, వ్యతిరేక క్త్వార్థకాలమీద సాధారణంగా చేరే 'ముందు'కు బదులుగా అంతటా, ఇంతకు, అంతకు మొ॥ పదాల మీద 'తొల్లె' పదమే కనిపిస్తుంది. 'తొలుత' కూడా అక్కడక్కడా కనిపిస్తుంది. వినకతొల్లె, పిలువకతొల్లె, తలచకతొల్లె మొ॥

**తొళశమ్మ:** (తొళసి + అమ్మ) తులసమ్మ.

"చింత దీరఁ దొళశమ్మ శిరసుపై నుండఁగాను
వంతుకు నన్నలమేవు వడ్డిబేరమా" 21-87

"సింగారపుఁదొళశమ్మ శిరసుపై నుండఁగాను
ముంగిట నెవ్వరికోయి మోహించేవు" 21-282

## తో

**తోఁకచిచ్చు:** వి; ప.బం. 1. తోఁకలాగా దీర్ఘంగా వ్యాపించి ఉండే నిప్పు 2. నిప్పులు తగిలించిన పిడుకల వరుస.

"వేఁకపుఁగోపము నేఁడే విడువమంటే నేల విడు
తోఁకచిచ్చయిన యాసఁ దుంచినఁగాక" 1-204

**తోఁకచుక్క:** వి. జ్వాలామయమైన తోక ఉన్న చుక్క, ధూమకేతువు. (అరిష్టసూచకం)

"చీఁకటిలోపల మించు చిన్ని చిన్ని వెన్నెలలు
తోఁకచుక్కలై చూడఁ దొంగలించీనే" 5-334

**తోఁగు:** అ.క్రి. తొంగు.

"సరిఁగొండ లెక్కకొని సరసము లాడుకొంటా
సొరిదిమోములు తోఁగి చూచుకొంటాను" 4-511

**తో:** వెంటనే.
"నీవు మాటలాడఁగాను నెలఁత తో మాటలాడీ
యేవేళ నీవాపె నేమంటివో" 20-531

**తోకు:** అ.క్రి. తూగు. (తోఁగు కావచ్చు. తోఁగు అంటే మునుగు)
"తొయ్యలి యెవ్వెత్తైనాఁ దోకినా నవ్వేటి నీవు
యియ్యెడ నే మొక్కినాను యేవగించేవు" 10-2-5

**తోఁజుఁబాడు:** అ.క్రి. వంతపాడు.
"చిలుకకువలె బుద్ధి చెప్పినఁ గానలేక
పలుమారుకే తోఁజుఁబాడేవుగా" 1-350

**తోటకూరవంటిది:** వి. త్వరగా వాడిపోయేది. (మార్దవం కలదని భావం.)
"సూటికిఁ రాకున్న సొలతురు మలతురు
తోటకూరవంటి నన్ను దూరుసేసేవా" 14-241

**తోడంటు:** (3) వి. పెరుగు తోడుకోవడానికి పాలల్లో వేసే మజ్జిగ, చేమిరి.
"పగటునఁ బెనఁగితే పట్టి సాములు సేసేవు
బిగువులు తోడంటి పేరఁబెట్టిరా" 25-384

**తోడంటుపె(వె)ట్టు:** (2) అ.క్రి. పెరుగు కావడానికి పాలల్లో మజ్జిగవేయు.
"పేరని పాలఁదోడంటు పెట్టితేను పేరునా" 7-254
"ఆసలు తోడంటువెట్టి యట్టె కాఁగలించీ నిన్ను
సేసవెట్టితివి ఇఁకఁ జెనకవయ్యా" 28-439

**తోడఁబెండ్లి కూఁతురు:** (2) వి; ప.బం. పెండ్లిలో పెండ్లి కూతురుకు తోడుగా ఉంచే చిన్న పెండ్లికూతురు.
"తోడఁ బెండ్లికూఁతురవా తొయ్యలి నీవు
బేడుకోలవై సందడిఁ బెండ్లాడవచ్చేవు" 29-352

**తోడట్టు:** తోడ, తో.
"యెంతకెంత యేమయ్య నిన్నే మాకూఁ
జెనకఁగ
బంతివారి తోడట్టు పాలించేవు గాక" 21-201

**తోడనే:** వెంటనే.
"తోఁగిన చెమటలార తోడనే శ్రీవేంకటేశు
రేఁగి నవ్వించుటగాక రిచ్చపడేదా" 8-61

**తోడినీడ:** వి; ప.బం. 1. తోడునీడ 2. విడువక వెన్నంటి ఉండేది 3. సహాయకమైనది.
"ఇక్కడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నిక్కి తా నెనసి తోడినీడ నీ కాయను" 22-398

**తోడు:** 'తోడుబోతు' అంటే చేతబడి. నాలుగు వీధులు కలిసేచోట నిమ్మకాయలు మొదలైన తీసివేసిన వస్తువులు పారబోస్తారు. వాటినెవరైనా తొక్కితే వారెండిపోతారు. దీనికి వైద్యంలేదు. ఈవిధమైన చేతబడే తోడుకావచ్చు.
"యిలఁ దోడుదొక్కితేను
యెండించకుండునా(?)
చెలుల యిండ్లకుఁ బోతే చిక్కించకుండునా" 3-278

**తోడుకవచ్చు:** స.క్రి. తీసుకొనివచ్చు.
"చూతమువో తన మోము సొమ్ము లేమి
దెచ్చీనో
దూతిక యిక్కడికే తోడుకరావే" 23-20

**తోడుతోడుత:** క్రి.విఖ. అతిశీఘ్రంగా, వెనువెంటనే.
"వుూడిగము సేసి నన్ను వొగిఁదొడపై నిడక
తోడుతోడుత నీవిట్టే దొరఁజేసేవు" 25-319

**తోడుదొక్కు:** అ.క్రి. చేతబడి తొక్కు. దీనికి సంపాదకుల వివరణమిట్లున్నది. "చేతబడికి తోడుబోతు అని రా.సీ.లో వ్యవహారము కలదు. ఆ తోడుబోతు చేసి నాలుగువీధులు కలిసేచోట నిమ్మకాయలు, అక్షతలు, బొగ్గులు, వెంట్రుకల చుట్ట వగైరా తీసివేసిన పదార్థములు పారబోయుదురు. దాని నెవరైన తొక్కితే వా రెండిపోవుచుందురు." దీనినే తోడు శబ్దము తో వాడినాడా? (అధోజ్ఞాపిక - 3 సం. 185 పు.)
"యిలఁ దోడుదొక్కితేను యెండించకుండునా
చెలుల యిండ్లకుఁబోతే చిక్కించకుండురా" 3-273

**తోడునీడ:** (8) వి; ప.బం. చూ: తోడినీడ.
"అంది శ్రీవేంకటేశ నన్నంతలోఁగని కూడితి
నిందలేక నీకు తోడునీడనై నే నుండనా"
16-170
"కమ్మని నీ కనులును కలువపూవులును
నెమ్మదిని వొక్క తోడునీడ లందురు" 13-266

**తోతో:** (3) క్రి.విశే. తోడుతో అనేదానికి రూపాం. వెంటబడి, వెంటనే.
"తో తరుణి యేసిన వాఁడుండఁగ మమ్మేమి
సేయు
తోతో నీకును నాకు దొమ్ములింకానా" 26-12

**తోతోయ:** తోయము అంటే తడవ (శ.ర.) దాని ద్విరుక్తరూపం. మాటిమాటికి అని అర్థం.
"నీతిలేని మంకుదాన నీవు చెప్పిన పనులు
తోతోయ నీ పాదమునఁ దోసితిగా నేను"
16-120

**తోదోపులాడు:** ప.బం; అ.క్రి. మిక్కిలిగా ఒకరినొకరు తోసుకొను, (పద.) ప్రవేశించు.
"తుమ్మెదలే తురుమై తోఁదోపులాడఁగాను
నమ్మితిఁ జీకటితోడి నడ్మమేఁటికే" 7-166

**తోదోపులు:** (తోపులు + తోపులు) ప.బం; బహు. మిక్కిలిగా ఒకరి నొకరు తోసుకొనుటలు.
"తోదోపుల నీ తొడపైఁ దొడవేసి" 28-139
"చీఁగక కూడితి నన్ను వేగమె శ్రీవేంకటేశ
తోఁగి సేస వెట్టితేనే తోదోపు లేలరా" 20-46

**తోపుతిత్తి దాఁపురాలు:** ప.బం; వి; బహు. కొలిమితిత్తితో సమానమైనవి.
"తొలుతే మా కాఁపురాలు తోఁపుతిత్తి
దాఁపురాలు
తిలకించి మా వొడి సోదించకువయ్యా" 11-344

**తోపునూకుడు:** వి. తోసివేయడం.
"తోపునూకుడైనవారి తోడి సుద్దులిట్లానే
చాపలానఁ దమనేఁ గొసరఁబని లేదే" 13-485
"తోపునూకుడుగ తొలఁగఁ జూచితే
నీపైఁ బుక్కిటి నీ రుమిసె" 13-234

**తోపునూకుడుసేయు:** అ.క్రి. త్రోసివేయు.
"తోపునూకుడు సేయవు దొరవు ఇన్నిటా నీవు
చాపలపువారివలె జరయఁగగలదా" 13-42

**తోయపుంగురులు:** వి; బహు. అందమైన కురులు, గుంపుగా నున్న కురులు.
"తోయపుంగురులతోడఁ దూఁగేటి శిరసు చింత
కాయలవంటి జగడములతోడ" 6-1

**తోయపుగుబ్బలు:** వి; బహు. జతగా గుండ్రంగా నున్న స్తనాలు.
"తోయపుగుబ్బల చన్నుదోయి మీద వాఁడొత్తిన
పాయపుఁ జంద్రుల జూచి భ్రమసితి నమ్మా"
5-46

**తోయపునిట్టూర్పు:** వి. వింతనిట్టూర్పు.
"పాయపు మదముల పరవశము చెప్పిన
తోయపునిట్టూర్పు తొట్టీని" 22-105

**తోరణకట్టు:** (తోరణము + కట్టు) అ.క్రి. తోరణం కట్టు, (వశపఱచుకొను, తిరస్కరించు) తోరణములు కట్టు, అలముకొను.
"యింతలోనే తాను నీ యౌవనరాజ్యమెల్ల
రంతులలోఁ జిగురున తోరణకట్టినట్లు" 17-159

**తోరణగంభములు:** (తోరణము + కంభములు) వి; బహు. పుష్పమాలాదులు కట్టడానికి గృహాదులకు వెలుపల రెండువైపులా నిలిపిన స్తంభాలు, తోరణకంభములు.
"తొలఁకు నీ హస్తములే తోరణగంభములు
చెలి రాజ్యమే నీవు శ్రీవేంకటేశుఁడా" 21-152

**తోరము:** విశే. 1. స్థూలము, లావు 2. అధికం 3. దట్టం 4. బలంకలది 5. ఎదిరింపరానిది 6. పొడవైన 7. గొప్పదైన 8. పెద్దదైన 8. చక్కని 9. సుందరమైన.
"తోరపు నీ కన్నుల యేతులె చూపవలసి
సారెకు చూపులఁబగ చాటే వాతనిని" 5-248

**తోలిబొమ్మ:** వి. తోలుబొమ్మ.
"పాలువోసి పెంచిన నా పాలి వేంకటేశ నే
తోలిబొమ్మఁ జుమ్మీ కాతువుగాని దైవమా"
1-286

**తోలుఁదిత్తి :** (తోలు + తిత్తి) వి. శరీరం.
"నేలాఁ దడియదు నీరూఁ దివియదు
తోలుఁదిత్తికే కొలఁది దొరకొన్నమాయ" 3-303

**తోలుకవచ్చు :** స.క్రి. తొడ్కొనివచ్చు, తీసుకొనివచ్చు.
"ముందు నేఁ జేసిన కర్మములు దోలుకరాఁగాను
అంది మరఁగుఁ జొచ్చితి నందుకే నీకు" 4-484

**తోలుతిత్తి :** వి. శరీరం. చూ: తోలుఁదిత్తి.
"ఏల వచ్చీ యేల పోయీ నెందుండీఁబ్రాణి
తోలుతిత్తిలోనఁజొచ్చి దుంకదూరనా" 1-299

**తోలుదేహి :** వి. శరీరధారి, ప్రాణి.
"నేమముతో నడచేటి నేరుపేది మా వల్ల
దీముతో మోచిన తోలుదేహులము" 3-249

**తోలుబొంత :** వి. శరీరం.
"తోలుబొంత గట్టుకొన్న దొరనింతే నన్ను నీవు
కూళసంసారమా యేల కొసరేవు" 3-334

**తోలుబొక్క :** (తోలు + పొక్క) వి. తోలురంధ్రం, శరీరరంధ్రం.
"తోలుబొక్కలోనఁ జొచ్చి తూలేటి యాకలిచేత
పాలుమాలి యిందరికి బంటుబంటవై" 1-215

**తోళసిపూస :** వి. తులసిపూస.
"తోరమైన ముత్యాల తోళసిపూసల పెద్ద పేరు
దన వురముపైఁ బెట్టినవాఁడు" 6-170

**తోసును :** 'తోయును' అనడానికి వ్యావహారికరూపం.
"యెక్కుడిది వివేకమెవ్వరు గెలిచినారు
చక్కఁబొడ వెక్కించు చరిఁదోసును" 3-398

## త్ప్రి

**త్ప్రివి :** వి. శిశువు చేసే ధ్వనికి అనుకరణశబ్దం.
"ఆఁగి పాలజలధిలో నందమైన పెనుఁబాము
తూఁగుమంచము శిశువు
త్ప్రివిత్ప్రివిత్ప్రివి" 5-220

## త్రా

**త్రాణ :** వి. గౌరవం, మర్యాద, బలం, శక్తి, జాగరూకత, మెలకువ.
"విన్నపము లేక నేల వేగినంతాను
మన్నించకిఁక నుంటే మఱి యేది త్రాణ" 8-62

## ద

**దంగుడుఁబంతములు :** వి; బహు. అలవాటైన పంతములు.
"అంగవించి శ్రీవేంకటాధిపుఁడు ననుఁగూడె
దంగుడుఁబంతములాడఁ దన కేటికే" 21-502

**దంగుడుబియ్యము :** వి. దంచు అనే ప్రేరణార్థక క్రియారూపానికి 'దంగు' అనేది మూలరూపం. 'దంగు' అనే రూపం ఈ నాటికీ 'బియ్యం దంగినాయ్' ఇత్యాది వ్యవహారాల్లో వినవస్తుంది. దంచిన బియ్యమని అర్థం. (దంగు ధాతువునకు దంగుడు అనేది భావార్థకరూపం)
"చెంగలించి వెసఁజేతులు విసరుచు
దంగుడుబియ్యముగా దంచీ మాయ" 1-130

**దంచనపురాయి :** వి. ఫిరంగిగుండు.
"మాయనుగ్గులు సేయ మాధవుని దంచనపు
రాయివో వైరాగ్యరచన జీవులకు"

**దంచనున్న రోలిపిండి :** ప.బం; వి. సిద్ధంగా ఉండేది.
"పొంచిన యాసలవెంటఁ బొరలఁ బోయెదమింక
దంచనున్న రోలిపిండి తలఁపాయ బతుకు" 1-90

**దంచిదంచి చెప్పు :** ప.బం; స.క్రి. గట్టిగా నొక్కి చెప్పు.
"పంచమహాపాతకాల బారిఁబడ్డ చిత్తమిది
దంచిదంచి చెప్పినాను తాఁకి వంగీనా" 1-287

**దంట :** వి. జంట, యుగ్మం.
"దంటలైన చెమటలచేఁ దడిసిన పచ్చడము
అంటించి చేతికియ్యఁ గా నందుకు నవ్వు రాదా" 7-376

దీనికి పచ్చడము అనే పదంతో అన్వయం.

**దంట:** వి. సమర్థుఁడు.

"దంట శ్రీవేంకటేశుఁడు తా నలమేలుమంగను
జంటాయ మీరవచ్చునా చవులు సోదించవా"
11-507

**దంటతనము:** (26) (దంట + తనము) వి. 1. నేర్పరితనం, సామర్థ్యం 2. దిట్టతనం 3. గయ్యాళితనం 4. ప్రౌఢత్వం 5. ధైర్యం.

"ఇంతి లేత చెలియా కతకారి నీ చేతలు
దంటతనమున నింతా తారుకాణించ నేలే"
29-329

"దంటతనంబులు తగు తగులా" 21-459

**దంటవయసువాఁడు:** వి. ప్రౌఢవయస్కుడు.

"నంటున శ్రీవేంకటేశ నా మతక మెఱఁగవు
దంటవయసువాఁడవైతే తప్పొప్పు లేదా"
21-367

**దంటవాయువు:** వి. జమిళివాయువు, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు అనెడి జంటవాయువు లేక బలమైన ప్రాణవాయువు.

"ముంటిపై సుఖమందుట ముక్కున నూరుపు వట్టి
దంటవాయువు గెలువఁ దలఁచేదెల్లా" 2-49

**దండగట్టలు:** వి; బహు. చీలకట్టలు, చెదరిపోకుండా కళ్ళెంచుట్టూ వేసే కట్టలు.

"బడినింద్రియముల బంతులు నురిపి
కడురతుల దండగట్టలతో" 1-387

**దండ-దాపు:** ప.బం; వి; దరి-దాపు, ఆధారం.

"తన నిజభక్తియె దండయుదాపును
మనసు నిలుపుటే మరి శుభము" 4-173

**దండదాయి:** వి. తోడునీడ. చూ: దాయిదండ.

"చెక్కిటఁబెట్టిన చేయి చిత్తములోనికి
తక్కిన సిగ్గులెల్లా దండదాయి" 19-380

**దండయుదాపును:** ప.బం; వి. జంటపదం. ఆధారం, దరిదాపు.

"తన నిజభక్తియె దండయు దాపును
మనసు నిలుపుటే మరి శుభము" 4-173

**దండవారు:** వి; బహు. పక్కనున్నవారు.

"తన తలఁపుతో రతి దండవారితోఁ జెప్పఁగ
తనువునఁ బులకలు దట్ట మాయను" 26-525

**దండవెట్టు:** ప.బం; అ.క్రి. కొట్టు, నమస్కరించు. (పద.)

"దండవెట్టె నల్లవాఁడె దైవాలరాయఁడు
దండి నెట్టెపుఁజట్ల తపారచుంగులవే" 2-487

**దండి:** విణ. గొప్ప.

"దండి విభుఁడవు నీకుఁ దగదయ్యా" 26-91

"దండి నీ వినయములు తరితీపులే" 21-435

"దండిసిగ్గుతోఁ జెలి తలవంచితే నేమాయ"
27-324

**దండిగా:** క్రి.విణ; ఎక్కువగా, సమృద్ధంగా, గొప్పగా అనే అర్థంలో వాడబడే రా.సీ. మాండలికం.

"దండిగా నే పొద్దూను తపము సేసీ నీకు
మెండుకొన్న కరుణతో మెలుఁతఁ
జూడవయ్యా" 22-205

**దండె:** దండియ. తంబుర, వీణ, దండాకారంలో ఉండే ఒక వాద్యం.

"జీవునికి దండె సేసినవాఁడవు నీవు
వావాతి మాటలే నీపై వన్నెపదాలు" 3-467

జీవునికి కరణకళేబరాదుల నిచ్చినవాడని అర్థం.

**దండెకాయ:** వి. వీణె ఉండే బుఱ్ఱకాయ, కిన్నెరకాయ.

"తనువే ఒళవు తలయే దండెకాయ
ఘనమైన వూర్పులు రెండు కట్టిన తాళ్లు"
3-467

**దండెన:** వి. 'దండన'కు రూపాం. (?) శిక్ష.

"కప్పురపు మేడలోనఁ గదసే నీ రమణుని
దెప్పరపుమేననే దండెన వేయరాదా" 21-144

**దండెము:** వి. 1. వస్త్రములు ఎండవేయడం మొ॥ వాటికై అడ్డంగా కట్టేకఱ్ఱ. 2. గరిడి

సాధనాల్లో ఒకటి 3. వీణె, కిన్నెర 4. దండాకార వాద్యం 5. తంబుర 6. పల్లకీలో బొంగు 7. తాసుకోల మొ॥ (వ్యా.)
"పలుకుఁజిలుకకు మోవిపంజరపు దండెంబు
నలిఁగుంతలములు కాణాచి పెనుఁగొప్పు "
27-591

**దంతపుటిల్లు :** (3) (దంతము + ఇల్లు) దంతముతో నిర్మించిన ఇల్లు. చూ : దంతపుటోవరి.
"దారకానఁ గొంగువట్టి దంతపుటింటికిఁ దీసి
మేరగదె వెట్టుకొంటి మేలు మేలునే" 20-217

**దంతపుటోవరి :** (6) (దంతము + ఓవరి) దంతంతో నిర్మించిన లోపలిగది, చంద్రశాల, శిరోగృహం, చలువకోసం నీటిమధ్యలో నిర్మించిన దంతపు భవనం.
"దంతపుటోవరిలోన తానే పని నుండఁగానో
కొంతనేఁ బిలిచితే నూఁకొనెఁగా తాను " 9-83

**దంతపుమేడ :** వి. దంతంతో నిర్మించిన మేడ.
"బంతి నెదురురేవుల పైకొని లోఁతరసేవు
దంతపుమేడకు నిట్టె దాఁటి రావయ్యా" 25-536

**దంతియాన :** వి. దంతి (= ఏనుగు) నడకవంటి నడక గల స్త్రీ.
"తమతోడ నీపె ముందె దంతియాన గనక యీ
సమయాన మదములు జారినట్లున్నవి "
20-218

**దంతెనపుఁజేయి :** వి. పెద్దదూలంవంటి చేయి.
"చేరి నిన్నుఁ బూజించని చేయి దంతెనపుఁజేయి
తారి నీకు మొక్కనట్టి తలయే పెడతల" 2-450

**దంతెనాలకోట :** వి. పెద్ద దూలాలతో కట్టిన కోట. (దంతెనము = పెద్దదూలం వ్యా.)
"తలవాకిలి దంతపుతలుపుల కోటా
తలిరుఁజేతుల పెద్ద దంతెనాల కోటా" 2-84

**దంతెనాలు :** వి; బహు. మిద్దెంటింటికి అడ్డంగా వేసే పట్టెలు.

**దందు :** (?)
"యిందుకే శ్రీవేంకటేశ యిదే గోపికలున్నారు
దందువంటి రాజసపుదాన నీకుఁ బ్రియమా"
8-220

**దందుపసరము :** వి. ఇది 'దండుపసరము' కావచ్చు. గుంపులోని పసరము (?) ద,డ లకు ప్రాస.
"సందుసుడి వలపుల సదమదమై వుండఁగా
దందుపసరము వలె తానేల వచ్చీని" 7-237

**ద, ఇందు :** రా, (దీనిని) తీసుకో.

**దక్కఁగొను :** స.క్రి. లోగొను.
"చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు ముంగిటవేసె"
5-28

**దక్కిళ్లు :** వి; బహు. లాభాలు < దక్కు.
"అలమేల్మంగకు నా వేంకటపతి
తలఁపు లోసంగిన దక్కిళ్లో" 5-31

**దగ :** వి. 1. పిపాస, దప్పి 2. ఆయాసం 3. తాపం.

**దగదొట్టు :** (4) మాం; అ.క్రి. దప్పిగొను, దాహముగొను. దగ = తాపం, దప్పి, (శ.ర., ఆం.ప.ని.) అలసట. (వ్యా.)
"కదుఁ జెనకఁబోతేను కంకణాలు వాఁగఁజొచ్చె
తడవి తిట్టఁగఁబోతేఁ దగదొట్టెను" 22-511
"జగములో వారిఁజూచి సారె సారె
నాసలనె పెనుదప్పు దగదొట్టె నీకుఁదొల్లి"
9-42 old
"దగదొట్టఁ జని రెట్ట వడఁగొట్టె నుడు
వీథి బెళగువ్వ నొక్కయణుజా" మనుచరిత్ర 4 ఆ.

**దగ్గరించు :** అ.క్రి. సమీపించు. (శ.ర.) దగ్గర శబ్దంపై ఏర్పడిన క్రియారూపం.
"తగవులు చెప్పెనటా దగ్గరించి మా వలపు
తగిలించుకొంటివిగా తక్కరికాఁడా" 11-589
"నిలువుటద్దము లోని నెలఁత నీడరూపు
చెలువుఁడు దగ్గరించినఁ జెలి నగెను" 23-600

**దగ్గరు :** అ.క్రి. సమీపించు.
"మేరతో దగ్గరు తానె మెచ్చె నిన్నిట్టా నీక

ఆదివృద్ధి రతి నీ వెరుఁగుదు నధికుఁడవు"

11-101

దడిగట్టు: అ.క్రి. ఇంటినిగాని, గుడిసెనుగాని రెండు భాగాలు చేస్తూ తడిక అడ్డం కట్టు.

"పడఁతి విషయముల బయలుపందిలి వెట్టి తడబాటుసిగ్గు లను దడిగట్టెను" 28-463

దడిబియము: వి. 'దడిబియము'నకు రూపాం. పఱుపు మెత్త, తల్పం, శయ్య. (బ్రౌన్)

"మెప్పులుగ దడిబియముమీఁద నుంటివి మాయ కిప్పుడేఁగ ముట్టి తమకించకుండఁ గలవా"

13-66

దధిబాండుగంప: వి. పెరుగు కుండలుగల గంప.

"కాదనక దధి బాం(డు)డ గంపకిందీగినవాఁడ నీదెస శ్రీవేంకటేశ యిందుకుఁ గొంకేవా"

25-160

దప్పము: వి. సాంద్రత, బెట్టు, బలుపు, లావు.

"దప్పము చెడినవాని తరుణి కాఁగిటఁ జేర్చి అప్పటిప్పటికి నుస్సురనినయట్టు" 1-240

దప్పికి ఎండమావులు దాగ దగ్గరబోవు: వ్యర్థప్రయాసపడు.

"దప్పికి నెండమావులు దాగ దగ్గరఁబోవుట తప్పుఁజదువులోఁ దత్వము నెంచుట" 2-49

దప్పికి నెయ్యి దాగు: (2) అ.క్రి. నిష్ప్రయోజనమైన పని చేయు. (దప్పి కలిగినప్పుడు నేయి తాగితే దాహం తీరకపోగా దప్పి అధికమవుతుంది అనే దానిని బట్టి ఏర్పడిన పలుకుబడి.)

"చిప్పిలు మోవి చేకొంటే చింత దీరెఁగదవె దప్పికి నెయ్యి దాగు తగపరి తాను" 7-72

దప్పికి నేయి దాగినట్లు: నానుడి; చూ: దప్పికి నెయ్యిదాగు. 1-1

దప్పిదేరు: (3) ప.బం; సంతృప్తి చెందు, తనివితీరు.

"దప్పిదేరే మోముతోడ దగదొట్టి వున్నాఁడవు యిప్పుడిట్టి యీపె నిన్ను యేమి చేసెనో"

27-31

దయఁజూచు: (2) ప.బం; స.క్రి. కరుణించు, కటాక్షించు.

"తడవి నే మొక్కఁగాను దయఁజూచితివి నీవే చిదుమిడి నింత రట్టుసేతురా వోయి" 23-346

దయదలచు: (4) ప.బం; స.క్రి. కరుణించు, అనుగ్రహించు.

"గొప్పలాయఁజన్నులు కొనగోరు గుఱుతాయ దప్పిదేర మమ్ము దయదలఁచరాదా" 27-198

దయదలపు: వి. 'దయదలచు' అనే క్రియ ప్రసిద్ధం. దయదలపు అని నామవాచకంగా ప్రయోగం విలక్షణం. కరుణించడం, అనుగ్రహించడం.

"చేచేత నీ దేవులను శ్రీవేంకటేశుఁడవు తాచియున్నదాన దయదలఁపు నీ చేతిది"

18-297

దయవెట్టు: (2) (దయ + పెట్టు) ప.బం; అ.క్రి. అనుగ్రహించు, దయచూపు.

"యీ దెస శ్రీవేంకటేశ యీ సమ్మందాననే నన్ను
నీ దయవెట్టి రక్షించు నెమ్మది భూరమణా"

3-127

దయసేయు: ప.బం; అ.క్రి. 1. దయచూపు, అనుగ్రహించు 2. వచ్చు 3. వెళ్ళు 4. ఇచ్చు.

"గోరపడక నాయంత గుట్టున నే నుండఁగాను చేరి దైవమైన దయసేయకుండీనా" 14-120

దయిలువారు: అ.క్రి. పొంగిపొరలు, అతిశయించు, ఒప్పు; చూ: దైవారు, దైలువారు.

"మచ్చిక దయిలువార మన్నించుమనియెఁ జెలి అచ్చమైన నీ దేవుల ననియెఁ జెలి" 28-331

దయివము: వి. దైవము, దేవుడు.

"సిరి వురమున నించి శ్రీవేంకటేశుఁడయి శరణాగతులఁ గాచే సతమయిన దయివము"

1-422

దయివారు: విణ. అతిశయించు, పొరలిపొఱు. రూపాం. దైవాఱు.

"బయట నవ్వులు మరీఁ బైపై నవ్వీనాపె
దయవారుఁజూపులఁ గొఁతాళించీ నాపె"
23-328

దయ్యపువాఁడు: వి. భూతమైనవాడు.
"కన్నెలు ముద్దాడఁబోతే గంటి సేసి మోవులెల్ల
తన్నుఁ గానట్టున్నాఁడు దయ్యపువాఁడమ్మా"
10-2-87

దరదరి: 'దరిదరి' కావచ్చునేమో? ధైర్యవతి (?)
"దరిదరిఁగాక నే దగ్గరి కూడఁగఁబోతే" 11-498

దరిదాపు: ప.బం; వి. దిక్కుమొక్కు, సమీపం, అంతూపొంతూ, హద్దు, ఆశ్రయము, రక్షకుడు.
"దరిదాపు ఇతఁడేకా తగవెనుక వేసుకో" 3-417
"దాసవర్గములకెల్లా దరిదాపు మీరె కాని
వాసికి నెక్కించరాదా వసుధలో మమ్మును"
3-267
"సొరెకు సంసారం బను జలనిధులీదుచు నలసిన
వారికి నీఁక దరిదాపగువాఁడిఁక నెవ్వఁడొకో"
1-353

దరిద్రదుఃఖము: వి. దారిద్ర్యదుఃఖము.
"తగఁదా స్వతంత్రుఁడైతే దరిద్రదుఃఖము లేల"
2-419

దరిద్రము: వి. దారిద్ర్యము, ధర్మవాచకానికి బదులు ధర్మివాచకం వాడబడింది.
"వైపగుఁ గాణాచి గలవాఁడు దరిద్రము బాసి
పైపై సంపదలతో బ్రదికేనటా" 3-375

దరిద్రహతపు నిధానము: వి. ఇట దరిద్రశబ్దం భావార్థకం. కనుక దారిద్ర్యంచే హతమైన నిధి అని అర్థం చెప్పవచ్చు. 'హతము' అనే శబ్దాన్ని సామాన్య నపుంసకశబ్దంగా గ్రహించాలి.
"చింతాతిమిరముఁ జెరిచేటి సూర్యుఁడు
అంతట దరిద్రహతపునిధానము" 4-16

దరిశనకానిక: వి. 'దర్శన' అనేపదానికి 'దరిశన' వికృతిరూపం. దర్శనం అంటే కానుక. కనుక ఇది కానుక అనే అర్థంలో జంటపదమని భావించాలి.

దరిశనము: వి. దర్శనం, దర్శించడం.
"దరిశనములు మిము నానావిధులను
తలఁపుల కొలఁదుల భజింతురు" 2-393

దరిసించు: స.క్రి. 'దర్శించు'కు వ్యావహారికరూపం. కానుకగా ఇచ్చు. (సారంగ. 127 పు.)

దరుశనము: వి. 'దర్శనము' అనడానికి వ్యావహారిక రూపం, దర్శించడం.
"పరమభాగవతపాదాంబుజముల
దరుశనమే నా స్నానము" 1-51

దళ్ళాళితనము: వి. మోసగాని లక్షణం, దలారితనం.
"వెల్లవిరి నింత యాల వెనకముందరి పాటు
దళ్ళాళితనము మాని తల వంచకోరాదా"
10-31

దవ్వుచుట్టతికము: వి. దూరపు చుట్టరికం.
"తలపోసి అదియును దవ్వుచుట్టతికమని
యిలఁదేరి మీఁద నేఁగీ నిందిరావిభుఁడు" 1-424

## దా

దాఁచఁబెట్టు: స.క్రి. దాచు.
"వెన్నుఁడ నన్నునిట్టె విడెము దెమ్మనేవు
యెన్ని దాఁచఁబెట్టితివి యేరా నీవు" 10-2-99

దాఁపిరము: (4) వి. దాపురము, మఱుగుపుచ్చడం, గోపనం, దాచిన సొమ్ము.
"అలరి మాచేత నీకు నంపిన యెడమాటలు
తలపోఁత ధనానకు దాఁపిరము సుమ్మీ"
27-498

దాఁపురము: (4) వి. 1. నిధి, నిక్షేపం 2. దాచుకోవడం, సంచయం చేయడం 3. రహస్యం 4. దాచినసొమ్ము (సూ.ని.) 5. ప్రాప్తి, లాభం, పొందు.
"చన్నులను దాఁపురాలు సరసానఁ గాఁపురాలు
పన్నుక యెంత సేసేవే పతితోను" 28-80

"దాపుర మేల సేసేవు తరుణితో నిందాకా
కాఁపురము సేయవా కంటిలో నేను" 24-582

దాక: వి. ఒకానొక తీగ, వెడల్పు నోరుగల అటిక. బోగిణి; వై. ద్రాక్ష.
"ఆకెతోడ మాటాడితి వంటానే వో
దాకతోడఁ గంకణానఁ దాకచేసెను" 17-143

దాకాలు: వి. ఎడమకాలు. (దా = దాపలయొక్క లుప్తశేషం)
"దాకాల మోఁకాల దాటించెఁ గొందరి
ఆకాశవీధినుండి హనుమంతుఁడు" 3-302

దాకొను: అ.క్రి. దాగుకొను, ఇతరులనుంచి చాటుచేసి తప్పించుకొను, సంభవించు, ప్రయత్నించు.
"వాకిట నేమి సేసేవు వనిత నీకు మేలుది
దాకొని నీ వొడఁబాటు తప్పకువయ్యా" 29-355
"నీకంటే ముందు కప్రము నెలఁతకు మీఁదుకట్టి
దాకొని మిగిలించేల ధరియించేవు" 13-506

దాగిలిముచ్చిములు: వి. బాలక్రీడావిశేషం, దాగుడుమూఁతలు.
"చాపులుఁ బుట్టుగులాడెడి సరి
దాగిలిముచ్చిములు" 1-445
"దాగిలి ముచ్చిములాడే దాయగాఁడవైన నిన్ను
తోఁగి చూచెట్టు నీరతి దొమ్మికి లోనైతిరా" 7-10

దాగిలిముచ్చులు: వి. బాలక్రీడావిశేషం, దాఁగిలి మూతలు, దాగుడుమూఁతలు రూపాం. దాగిరి ముచ్చులు.
"తరుణి తురుము నీకు దాగిలిముచ్చులాడ
నిరవాయ రమణుఁడ యిదివో నీకు" 23-573

దాడింబపూవు: వి; దానిమ్మపూవు.
"దాడింబపూవుల వన్నె తళుకుఁబయ్యెద
కొంగు వేడుకతో వల్లెవాటు వేశి" 6-42

దాడివోవు: (దాడి + పోవు) అ.క్రి. దండెత్తు.
"చూడరో చూడరో నేఁడు సురలార నరులార
దాడివోయి దనుజుల దండించి తా వచ్చె"
3-512

దాతపుదైవతము: వి. శుద్ధదైవతము.
"శ్రీతరుణీశ శ్రీవేంకటపతి సేవారతి నిను నే భజియించెద
దాతపుదైవమ వైననుఁ గావుము తలఁచెద
మిదియె తత్వంబు" 4-450

దాతపుదైవము: వి. పవిత్రమైన దైవము.
"దాతపు దైవమవైననుఁ గావుము
తలఁచెద మిదియే తత్వంబు" 4-450

దాతుమాతు: వి. ధాతువు మరియు మాతువు; ధాతువు అంటే గేయం, మాతువు అంటే వాక్కు. పదకవితలు ధాతుమాతువులతో కూడినవి. "వాఙ్మాతురుచ్యతే గేయం ధాతు రిత్యభిధీయతే" అని లక్షణం.
"ఆతని మాటకు మీరు నందాలు చెప్పేరుగాక
దాతుమా తెఱిఁగి యింకా తగవేఁటి తగవే"
17-399

దాదాత: (13) ప.బం; వి. ఈ పదం ఏ నిఘంటువుల్లోనూ కానరాదు. "ఆయా స్థలాల్లో గట్టిగా, ఇంచుమించు ఇత్యాది అర్థములయందు ప్రయోగించినట్లు కానవచ్చు చున్నది ఇంకను విచార్యము" అని సం.ప.స. (2 వా. 382 పు.) లో పేర్కొనబడింది.
"యీదెస శ్రీవేంకటేశ యిన్నియు మాని కొందరు
దాదాత నీ శరణని దాసరులైరి" 2-246
"వేదతో వెన్నవట్టి నేయి వెదకఁబోయిన యట్టు
దాదాత నా తెలివి యితరుల నడిగేను" 2-518

దాపు: 1. రక్షణ. (2. సమీపం)
"పైకొని చక్రాయుధుఁడే మా దాపు
భయములిన్నిటాఁ బాసితిమి" 3-371
"శరణాగతులకు సరి దాపెవ్వఁడు
యిరువుగ శ్రీపతి యెవ్వఁడు" 4-403

దాపుదండ: (11) ప.బం; వి. తోడునీడ, తోడు, సహాయం. (దాపు = ఆశ్రయం, దండ = రక్ష) రూపాం. దండదాపు.
"తమితోడ వైష్ణవులు దాపు దండై వుండఁగాను

తెమలి తీర్థాలెల్లా ద్రిప్పించవలెనా" 3-219
"చదివించి బుద్ధులిచ్చి చైతన్యమైనవాఁడు
పొదిగి నా దాపుదండై బోధింపఁడా" 7-243

**దామెనకట్టుగా గట్టు :** వి. బందెవేయు. ఎద్దులు మొదలైన పశువులను జంటలు జంటలుగా కట్టు.
"పామరపు టింద్రియాలబారిఁదోసితివి నన్ను
దామెనకట్టుగాఁ గట్టి తత్వమా నీవు" 2-59

**దామెనకోడెలు :** వి; బహు. దామెన అంటే పెక్కు తలుగులు (పలుపులు) గల నిడివి త్రాడు అని శ.ర. ఇట్టితాడు గల కోడెలు, బందెవేసిన కోడెలు.
"పాముఁ బట్టీఁ బట్టరమ్మ పసిబిడ్డఁడే మెఱుఁగు
దామెనకోడెలఁ గొట్టీఁదానే వీఁడు" 26-50

**దామెనతిట్లు :** వి; బహు. దామెన అంటే పెక్కుతలుగులు గల అని శ.ర. కాని ఈ అర్థం ఇక్కడ సరిపోదు.

**దామెనప్రియాలు :** వి; బహు. బంధమైన ప్రియాలు (?)
"ఏమంటే నేమంటి నింతే కదే
దామెనప్రియాలు నేరఁ దనకేలే యలుక"
20-315

**దామెనవేట :** వి. అక్కడక్కడా దామెనలు అమర్చి వేటాడేవేట.

**దామెనసంసారము :** వి. బంధమైన సంసారం.
"ఏమిసేతు దైవమా యెన్నఁడు గరుణించేవో
దామెనసంసారములోఁ దట్టువడీ మనసు"
2-105

**దామెరకొలను :** వి. తామరకొలనుకు వ్యావహారికరూపం.
"దామెరకొలనిలోన దప్పిదేర నీఁదుటాను
దోమటిరతుల లోలో దొరసితివి" 17-179

**దాయకపాయక :** (2) ప.బం; దగ్గరికిరాకుండా - దూరంపోకుండా.
"దాయకపాయక తలఁచుకొంటివా
యీయెడ నా కాన తియ్యవయ్యా" 23-508

**దాయగత్తె :** (దాయ + కత్తె) వి. శత్రురాలు, జ్ఞాతి, సగోత్రురాలు.
"దాయగత్తైన యాఁటది తగిలి పెనఁగవచ్చు
పూయక దూలైనాఁటది పొంచులే వినును"
12-33

**దాయగాఁడు :** (10) (దాయ + కాఁడు) వి. 1. జ్ఞాతి 2. శత్రువు.
"కాయములు సోఁకితేనే కరఁగకమానీనా
దాయగాఁడింతే తాను తలవే నీవు" 20-244

**దాయము :** (4) వి. 1.పాచికలు గవ్వలు మొ॥ వాటియందలి పందెం. 2.గవ్వలాట 3.విపత్తు 4.పంచుకోదగిన తండ్రి సొత్తు 5.ఈవి 6.అరణం 7.కట్నం 8.ఉల్లికుట్టుమాట, (శ.ర.) 9.స్వచ్ఛత, శుద్ధి.
"చాయలకె మాటలాడీ సన్నలకె పాటపాడీ
దాయముగాఁ జూడరే సంతసపుఁజూపు" 9-213

**దాయి :** వి. పెంపుడుతల్లి. (దాకలి)
"బాయిటఁ జెలులతోడ పచారించి నీతోడ
దాయిగాఁగఁ బవళించీఁ దనకెంత చెల్లునో"
21-185

**దాయికొను :** అ.క్రి. సమీపించు (?)
"దాయికొని రమణుఁడు దగ్గర గూచుండితే
పాయక అవ్వలిమోమై పవ్వళించేవు" 7-24

**దాయిగట్టు :** (?)
"ఒక్కటికి నురిగట్టే వొంటికి దాయిగట్టే
వెక్కువ గోవాళవిద్య లీడఁ జేయవలెనా" 24-31

**దాయిదంటగు :** ప.బం. ఇది 'దాయిదండగు' కావచ్చు. దాయి= (క. = తల్లి, త. తాయి = తల్లి) తల్లి, దండ = ప్రాపు, రక్షణ; తోడునీడ అని అర్థం కావచ్చు. 'దాయి' ధాత్రీ శబ్దభవమని కిట్టెల్. దాయిదండ అంటే తల్లివలె రక్షకురాలని అర్థం కావచ్చు. (సం.ప.స. 16సం. 429 పు.)
"తరుణుల కీపాటి దాయిదంటైన జాలు
గరిమెలన్నియుఁ దొల్లె కైవశమైనవి" 16-404

**దాయిదండ :** (9) చూ : దాయిదంట, తోడునీడ.

'దాయి' ధాత్రీ శబ్దభవమని కిట్టెల్. దాయిదండ అంటే తల్లివలె రక్షకురాలని అర్థం కావచ్చు. (సం.ప.స. 16 సం. 428 పు.)

"పాయపు శ్రీవేంకటేశ పచ్చిగా గూడితి
దాయిదండై వుండుమేల తడబడ నిపుడు"
21-424

**దాయిమాను:** వి. రూపాం. దాతిమాను. కర్రపనివాడు ఉపయోగించే బల్ల, చాకలి ఉపయోగించే రాయి. (వ్యు.)

"అగ్గలమై నీవు గడునంత నన్ను రేఁచితేను
తగ్గని నీ మే నన్నిటా దాయిమాను గాదా"
25-457

**దారకపుఁదనము:** వి. బాల్యం.

"దారకపుఁదనాల నే దండ నుండి బిగిసేవే
బీరము లింకా నెన్ని పెంచేవో కాని" 28-576

**దారకపు(నీ) చేత:** పిల్లచేష్ట, బాల్యచేష్ట.

"చేరఁడేసి కన్నులాపె చేరి నిన్నుఁ జూడఁ గాను
దారకపు నీ చేతలు దాఁచఁగలవా" 27-18

**దారకపువారు:** వి; బహు. (?)

"దారకపువారికి దండితనా లేటికి
చేరవచ్చి బుద్ధులెల్లా జెప్పలేనే చాలదా"
25-296

**దారకము:** (5) వి. 1. దారకము అనే శబ్దానికి మజ్జిగలో అన్నం పిసికి అన్నం తీసివేసిఁ జ్వరం తగ్గిన వారికి తాగించేది. 2. కొర్ర అంబలిని చిక్కగా కలిపిన గంజి. 3.ఆహారం అనే అర్థాలు ఉన్నాయి. ఇవి ఇక్కడ కుదరవు.

"చేరి నన్నునేలినాఁడు శ్రీవేంకటేశుఁడు తొల్లె
దారకపు నీ బోఁటికి దక్కునా యీతఁడు"
29-457

**దారకుఁడు:** వి. బాలుడు.

"చేరి వారి మాటలకు వెఱపింత గలవాఁడు
దారకుఁడై వుండుఁగాక దగ్గరి రా నేటికే"
19-508

"అరయ శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడిలివి
దారకుఁడ వింతసేయఁ దగవే కాదా" 21-129

**దారకురాలు:** (దారకు + ఆలు) వి. బాలిక.

"చేరి పాయనట్టివాఁడు సిగ్గులెల్లా రేఁచనీవే
దారకురాలనై తన్నుఁ దగదనేనా" 28-180

**దారగట్టు:** ప.బం. 'దారముగట్టు'కు వికృతిరూపం కావచ్చు. దారముగట్టు అంటే తాళిగట్టు, పెండ్లిచేసుకొను అని అర్థాలు.

"మొగసూటి వలపూ మోహపు రమణి నవ్వూ
తగవుతో మదనుఁడు దారగట్టెను" 20-517

**దారణ:** వెల, క్రయం (శ.ర.)

**దారణలు:** వి; బహు. సాహసాలు.

"కంటిమి నీ సుద్దులెల్ల కడపరాయ
ఇంటింట దారణ లెక్కనేమి చెప్పేదయ్యా"
13-68

**దారతప్పు:** (15) ప.బం. (దార = విధము, రీతి, సరి, మార్గము, మర్యాద ) రీతి తప్పు, క్రమము తప్పు.

"దారతప్పి మగవాఁడు తన యిచ్చఁదిరగాఁడీ"
11-177

"మీరైనా బుద్ధిచెప్పరే మెలుఁతలాల
దారతప్పనివానికి తగవు లౌనటవే" 26-409

**దారాసుద్దపు మాటలు:** వి; బహు. ధారాశుద్ధి గల మాటలు కావచ్చు.

"దారాసుద్దపు మాటలు తాఁకనాడి మదనుని
నారసాలు సేయకు నారసింహుఁడా" 10-2-18

**దారితప్పు:** అ.క్రి. సరియైన మార్గం తప్పు.

"దారి తప్పినందుమీఁద దగ్గరి రాఁబనిలేదు
సారెకు నన్నుఁ బిలిపించకు మనరే" 11-277

**దావకూళ్ళు:** వి; బహు. దొంగతనపుకూళ్ళు (దావ = దొంగతనం. బ్రౌన్.) లేదా 'దోవకూళ్లు' అని కావచ్చు. మాండలికంలో 'దో' దా గా మారి ఉంటుంది.

"కలది కుక్కిమంచము కన్నవారెల్లాఁ బండేరు
తలతో దొగ్గినంబలి దావకూళ్ళు" 1-370

**దావతి:** (13) వి. శ.ర., పర్యాయ, బ్రౌన్, సూ.ని. ల్లో ఈ పదం కానరాదు. పద. లో దావతిపడు అనే పదం ఉంది. దానికి అత్యాసక్తి

చెందు అనే అర్థం చూపబడింది. త్వర, ఆరాటం, ఆయాసం, అత్యాసక్తి అనీ. ఈ దావతే నేటి దావంతం కావచ్చు అని పద.

"శ్రీవేంకటపతి చేత జీవులము
దావతి నితరము తగు లేలా" 4-214

**దావతి:** విణ. ఉద్ధతమైన.

"దావతిజలనిధి దాటినవారికి
తోవల మరియును వో డేలయ్యా" 4-260

**దావతిఁబడు:** చూ: దావతిపడు.

"ఏవీ నుపాయాలు గావు యెక్కువ భక్తేకాని
దావఁబడక యిది దక్కితే సుఖము" 2-49

**దావతికర్మము:** (2) దుఃఖకరమైన కర్మము.

"దైవముపై భక్తిలేక తనకు నెన్నాళ్ళుండే
దావతికర్మపు పాటు తనకుఁబోదు" 1-505

**దావతికుడుచు:** ప.బం; అ.క్రి. దుఃఖపడు, ఆయాసపడు, ఆరాటపడు.

"దావతికుడువక తప్పులఁ బొరలక
భావము సంతసపఱచుట తెలివీ" 15-77

**దావతిజలనిధి:** వి. ఉద్ధతమైన సముద్రము.

"దావతి జలనిధి దాఁటినవారికి
వోవల మరియును కోడేలయ్యా" 4-260

**దావతిపడు:** (9) అ.క్రి. అత్యాసక్తి చెందు అని పద. ఈ పదానికి త్వరపడు, ఆరాటపడు, ప్రయాసలకు గురియగు, శ్రమపడు అనే అర్థాలుకూడా చెప్పవచ్చునేమో! కిట్టెల్ నిఘంటువులో దావతి (దావంత) శబ్దానికి "labour, toil, pains, exertion, trouble, grief, అనీ, దావతిపడెను అనే పదానికి to cause or give trouble అనీ, దావతిమాడు పదానికి to exert one self, to take pains అనీ అర్థాలు చూపబడ్డాయి. పద. లో దీనికి 'అత్యాసక్తి చెందు' అనే అర్థం ఉంది. కానీ దీనికి త్వరపడు, ఆరాటపడు, ఆయాసపడు అనే అర్థాలు పొసగుతున్నాయని ఆనందమూర్తిగారు పేర్కొన్నారు. (సంకీర్తన. భాషా. 452 పు.)

"శరణన వెరవయ్యీ సామజముఁ గాచినట్టు
వరుస దావతిపడి వచ్చేవంటా" 15-25

"భావించి మొక్కక వేరె బద్ధులైన జీవులను
దావతిపడుదు నేల తగిలేవో మనసా" 3-196

**దావతిమనసు:** వి. ఆసక్తి గల మనస్సు, ఆరాటము గల మనస్సు.

"దావతిమనసు తన కర్మమూలము
వేవేలైనా విడువఁగ వశమా" 3-296

**దావతిరాజసాలు:** వి; బహు. దుఃఖాన్ని కలిగించే రాజసాలు.

"యీవల నీ దాసుఁ డయ్యేది ఘనముగాని
దావతిరాజసా లంతటా నున్నవి" 3-201

**దావతిలంపటాలు:** వి; బహు. ఆసక్తిని కలిగించే లంపటాలు, ఆత్రాన్ని, దుఃఖాన్ని కలిగించే లంపటాలు.

"భావించి నీ దాసులనే భజించుమంటివి గాక
దావతిలంపటాలలోఁ దడఁబడుమంటివా"
10-40

**దావతిసంసారము:** వి. ఆసక్తిని (దుఃఖాన్ని) కలిగించే సంసారం.

"దైవమును నొల్లము ధర్మమును నొల్లము
దావతిసంసారముతో తగులే కాని" 3-58

**దావతిసుఖము:** వి. దుఃఖాన్ని కలిగించే సుఖం, ఆసక్తిని కలిగించే సుఖం.

"దావతిసుఖమీల దారి దెలిసియు
సేవగించలే మేమెుకో" 10-5

**దాష్టీకము:** వి. ధృష్ట శబ్దభవమైన ధార్ష్టికమనే భావార్థకానికి వ్యావహారికరూపం కావచ్చు. పొగరుబోతు తనం అని అర్థం. 'దార్ఢీకం' అనే ప్రయోగం కూడా ఉంది.

"అమర శ్రీవేంకటేశ! అట్టె నన్నుఁ గూడితివి
సముకాన నీకె కెంత సంగడి దాష్టీకము"
18-143

**దాష్టీకుఁడు:** వి. 'ధృష్టుఁడు'కు తద్భవరూపమైన 'ధార్ష్టీకుడు'కు వ్యావహారికరూపం. పొగరుబోతు.

"పట్టకుమా చన్నులు పైపై బెరిగేపొద్దు
అట్టె దాష్టీకుఁడ వైతే నౌదువుగాని" 28-270

దాసరితనము : వి. భక్తిలక్షణం.
"దాసరితనమువల్లఁ దగ నారదాదులైరి
వాసి నిందెవ్వరెక్కుడో వడి నెంచుకొనుఁడీ"
15-379

దాసరిపల్లె : వి. ఈ పేరుతో ఉన్న గ్రామం కడపజిల్లా జమ్మలమడుగు, కమలాపురం మండలాల్లోనూ, కోలారు సమీపంలోనూ ఉన్నట్లుగా తెలుస్తుందనీ, కానీ ఈ రెండుచోట్ల రఘురాముని ఆలయం లేదని అన్నమయ్య దర్శించిన దాసరిపల్లె ఎక్కడిదో తెలియదనీ డా॥ దాశెట్టి శివప్ప పేర్కొన్నారు. (తా.అ.సా. తెలుగునాడు - 103 పు.)
"శ్రీవేంకటాద్రిమీది శ్రీరామచంద్ర
యీవల దాసరిపల్లె నిరువుకొని మీ
సేవకుల మమ్ము నేలే శ్రీరామచంద్రా" 3-157

దాసానదాసుఁడు : (2) వి. దాసానుదాసుడు అనడానికి వ్యావహారికరూపం, దాసులకు దాసుడు, వైష్ణవుల వ్యవహారంలో దీనికి ఎక్కువ వాడుక.
"మరిగి యలమేలుమంగ మగఁడవు నీవందురు
ధర నన్ను నీ దాసాన(ను?) దాసుఁడందురు"
18-246

దాసానుదాసి : వి. దాసులకు దాసి.
"దంటనై యాతని దాసానుదాసినై
వొంటినుండెడ నేమి నొల్ల నో యయ్య" 1-235

దాసానుదాస్యము : వి. దాసులకు చేసే దాస్యం.
"ఏవిధమును నేఁటికి నా కిఁక యెందెందని
తగిలెద నేను
దైవికమగు నీ దాసానుదాస్యము దక్కినదే
నాకు" 1-384

దాసి : (2) వి. దాసుఁడు, స్త్రీవాచకమైన 'దాసి' పదానికి 'దాసురాలు' అని అర్థం. కాని ఇట దాసుడని పుంలింగార్థంలో వాడబడింది.
"కేశవ నీ దాసినైతి గెలిచితి నన్నిటాను
యీ శరీరపు నేరా లిఁక నేలా వెదక" 2-482
"తక్కక శ్రీవేంకటేశ తప్పులెల్లాఁ జేసివచ్చి
యిక్కడ నీ దాసినైతి నింకఁ దోయరాదు"
1-501

దాసోఽహము : (దాసః + అహమ్) వి. దాస్యం. (నేను దాసుణ్ణి అని వాచ్యార్థం)
"నీ ముద్రలూ నొల్లరు నీ దాసోఽహము నొల్లరు
కామించి నీమీఁది భక్తి కడు నొల్లరు" 3-52

దాహము : వి. వేడి, తాపము.
"వూహల నా భోగమెల్లా వొళ్లఁబట్టి నంటానుంటే
దాహముతోడ నినుము దాగిన నీ రాయఁగా"
3-41

## ది

దిండు : వి. అతిశయం. (తలగడ, దట్టి, చుట్ట, గోడదీపం)
"యెండగాసే బయటనే యెక్కువ వెన్నెల గాసే
దిండు రేయిఁబగలొక్క దినమైనట్టు" 4-93

దిండుకొను : అ.క్రి. ఆలింగనాదులతో కలుసుకొను.
"దిండుకొని పానుపుపై తెల్లవారు లెరుగరు
నిండుకున్నారు రతుల నేరుపులఁదాము"
7-441

దిండువడు : అ.క్రి. అజ్ఞానం మాసిపోవు అని సంపా.
"కందువ నీ దేహి కనియుం గానఁడు
దిండుపడ (?) నొరులు తెలిపెడి దేది" 3-120
"కందువ శ్రీ వేంకటాద్రి ఘనవరము లొసఁగె
దిండుపడ్డ లోకులకు ద్రిష్టమిదే కాదా" 3-345

దిక్కమెకము : వి. ఇది దిక్కమొకము గావచ్చు. వెఱ్ఱిగల మృగము, భయాదులవల్ల దిక్కు తోచక పారిపోయే వాడు, కాందిశీకుడు, మొండిపట్టు పట్టు.
"చిక్క డెంతయిన మోక్షమార్గమున
జీవుఁడిందుకే లోలుఁడు
దిక్కమొకమువలెఁ గిందికిమీఁదికిఁ దిప్పెడు
గర్మము దేహమును" 3-88

దిక్కరించు : (4) స.క్రి. ధిక్కరించు, లెక్క చేయకుండు, తిరస్కరించు;

వ్యవహారంలో 'ధ' 'ద' గా మారింది.
"చెక్కు నొక్కఁగా నీతో సెలవి నవ్వితిఁగాక
దిక్కరించితే వోజకుఁ దేగలమా" 23-411

**దిక్కుదెస :** (8) మాం; వి. రక్షకుఁడు, ప్రాపు, ఆధారం, అండదండ.
"దేవ నే నీ యాధీనము దిక్కుదెస నాకు నీవే
సేవ సేయకుండినా రక్షించ నీకు భారము "
2-214

**దిక్కుప్రాణము :** ప.బం; వి. రక్షకమైన ప్రాణం.
"దేవుడవై పూజలొందు దిక్కు ప్రాణమౌదువు
కావలసిన నట్టౌదు కామించినట్లు" 15-142

**దిక్కుముక్కులు :** ప.బం; వి; బహు. శరణం అనే అర్థంలో జంటపదం.
"దిక్కెవరు యీ తీదీపులలో
దిక్కుమొక్కులకు దేవుఁడె కాక" 1-81

**దిక్కుమొక్కు :** ప.బం; వి. గతి, ఆశ్రయం అనే అర్థంలోని జంటపదం. 2-82

**దిగఁగారు :** ప.బం; అ.క్రి. రక్తం స్రవించు.
"కాముని యేట్లదిగఁగారేటి దేహాలు
దోమటీ తమ బదుకే దొడ్డదనేరు" 2-261

**దిగఁబోయు :** అ.క్రి. కిందికి వ్యాపించు. (దిగఁబోత కిందికి వ్యాపించుట - శ.ర.)
"అట్టడి మొదలినె యాఁడి కింకఁ లోఁగీనా
తిట్టులును దీవెనలు దిగఁబోసుఁగాక" 11-92

**దిగపోత :** వి. దిగువకు వ్యాపించడం.
"మొగమునఁ జూచేవు మోనానఁ దలవంచేవు
యెగదిగపోఁత లైతే నేడ చొచ్చేదే" 20-271

**దిగవిడుచు :** ప.బం; స.క్రి. వదలిపెట్టు. (వ్యా.)

**దిగుళ్ళు :** వి; బహు. దిగులు శబ్దానికి బహువచనరూపం.
"శశి వొడచె అలసంబులు గడచె
దిశల దేవతల దిగుళ్ళు విడిచె" 5-361

**దిగువతిరుపతి :** వి. తిరుమల కొండ కింది తిరుపతి పట్టణం. ఇట గోవిందరాజస్వామి ఆలయం ఉంది.
"వొగి నొరగుఁబెరుమాళ్ల వునికిపట్టయి వెలయు
దిగువతిరుపతి గడవఁగాను" 1-227

**దిగువపట్టణము :** వి. దిగువ తిరుపతి (?)
"మగటిమి గల హనుమంతరాయ
దిగువ పట్టణములోని దేవ హనుమంతరాయ "
2-250

**దిగ్గుడి :** వి. 'దిగ్గుడు' కావచ్చు. తక్కువ.
"ఈటువెట్టితే నితరు లిందుకంటే దిగ్గుడి
నాటుకొని యెట్టుండేది నానాలోకములా "
15-353

**దిగ్గుడు :** వి. న్యూనత, తక్కువ.
"గక్కున మీలో మీరు కాఁగిలించుకొన్నమీఁద
దిక్కులవారి కాఁగిలి దిగ్గుడేకాదా" 16-255
"సరి నీకు మనసు దాఁచగరాదు గాక
తెరవేసి కూడితేను దిగ్గుడా యేమి" 7-383

**దిగ్గుడుకు దిగ్గుడు :** ప.బం. చాలా తక్కువ.
"శ్రీవేంకటేశ్వర నీ సేవే ధ్రువపదము
దేవతాంతరమెల్లా దిగ్గుడుకు దిగ్గుడు" 3-201

**దిచ్చ(రి)భోగము :** వి. మాయ భోగము. (జూదం)
"నిక్కినిక్కి నీళ్లలో నీడ చూచినట్లానే
దిక్కుల కర్మఫలము దిచ్చభోగములు" 15-59

**దిచ్చరి :** వి. దిమ్మరి, 'దిక్చారి'కి వికృతి కావచ్చు, వ్యభిచారిణి, మాయలాడి.
"కచ్చువెట్టి వలపాడిఁ గట్టుకొన్నవాఁడవు
దిచ్చరివై మమ్ము సమ్మతించఁజేయనేరవా "
26-213

**దిచ్చరికోపము :** మాయకోపం.
"దిచ్చరికోపము మాని తెర దియ్యరాదా
చొచ్చి వచ్చి రమణుఁడు చూచీ నిదే" 13-49

**దిచ్చరితలపులు :** వి; బహు. మాయతలపులు.
"మచ్చికసేసిన చెలి మాటలాడక మానీనా
దిచ్చరి నీ తలపులు దెలిసీఁగాక" 8-294

**దిచ్చరిపనులు :** మాయపనులు.

"పచ్చిదేరె మేనితోడి పాయపువిభునిఁ గంటి
దిచ్చరిపనులన్నియుఁ దేరీ(రె?) నేఁడు" 13-7

**దిచ్చరిమనసు :** వి. చంచలపు మనసు, మాయమనస్సు.
"చంచలపుఁగనుదోయి సతుల జారికిఁ జిక్కి
చంచలమందెను నా దిచ్చరిమనసు" 1-401

**దిచ్చరివాఁడు :** (దిచ్చరి + వాఁడు) వి. వ్యభిచారి, మాయలాఁడు. చూ : దిచ్చరి, దిమ్మరి.
"పచ్చిదేరవిచ్చేవు జాణలెవ్వరికినైన
దిచ్చరివాఁడవు నీకు దేవుళ్ళు జాఁతా" 13-18

**దిచ్చరీఁడు :** (దిచ్చ + అరి + ఈఁడు) దిచ్చ శబ్దంపై స్వార్థంలో అరి, ఈ ప్రత్యయాలు, వ్యభిచారి, మాయలాడు.
"పచ్చిపాలు దాగ మరిగి పసులగాసె నిన్నాళ్ళు
దిచ్చరీఁడు వీఁడు మంచి దేవరటనే వీఁడు"
17-438

**దిట్టతనము :** (2) (దిట్ట + తన) వి. 1. ధైర్యం 2. శక్తి, సామర్థ్యం 3. చాతుర్యం 4. మహిమ.
"గుట్టుతో ముందర పతి కొండవలె నుండఁగాను
దిట్టతనమున నేల తిట్టు దిట్టేవే" 25-446

**దిట్టవాఁడు :** వి. సామర్థ్యం కలవాఁడు, ధైర్యశాలి, చాతుర్యం కలవాఁడు.

**దిట్టించి చూచు :** స.క్రి. దృష్టించి చూచు, జాగ్రత్తగా చూచు.
"చెలియ సిగ్గులతోడఁ జిత్తరువు వ్రాసి కొంకి
నిలిచి తను దిట్టించీ నీవు చూడఁగా" 12-465

**దిడము :** విణ. 'దృఢము'నకు వికృతిరూపం, గట్టి. దిడము అనే పదం సాధువు కాదనీ, దృఢము లేక దిటము అని ఉండవలెననీ, 'డ'కారప్రాసకోసం దిడము స్థిరము చేయబడిందనీ 15సం. పీఠికలో చెప్పబడింది. (పుట.14)
"కడుఁజింతైతే నీవు గలవని వుందుఁగాని
దిడముగా నా బుద్ధి తిప్పఁగలేను" 15-396

**దిడు(డ)వు :** వి. ఇది 'దిటవు' కావచ్చు. దిటవు, అచంచలుడు, స్థిరుడు, శక్తి, ధైర్యం. ప్రాసకోసం 'ట' 'డ' గా ప్రయోగింపబడిందేమో!
"దిడువై శ్రీహరి నీవు తిద్దితే నేమో కాని
వెడఁగు నా గుణమిది విడువ దెంతయినా"
15-121
"అదరి వైరాగ్య ధనమార్జించ నోపనా
దిడువై జితేంద్రియ స్థిరుఁడాతఁడు" 2-452

**దినకొత్త :** వి. నిత్యనూతనం, ప్రతి దినమూ క్రొత్తగా ఉండేది. (వైరిసమాసం)
"కోపములైతేను కోటానగోట్లు
దీపనములైతేను దినకొత్తలు" 4-307

**దినదినకొత్త :** (2) ప్రతినిత్యమూ కొత్తగా ఉండేది.
"అనరాదు వినరాదు ఆతని మాయలు నేఁడు
దినదినక్రొత్తలాయ ద్రిష్టమిదే మాకు" 2-167

**దినదిన బెంబడి :** బెంబడి బెండడికి రూపాంతరమా? బెండడీ = గచ్చు, గార అని" అని సంపాదకులు.
"వద్దు వద్దు వలపులు వాటములు సేయక
తిద్దుకో మా గుణము దినదిన బెంబడి" 23-396

**దినదిన సుద్దులు :** వి; బహు. ప్రతి నిత్యపు మాటలు.
"కంచపుపొత్తు గలిసి కడలేని నీ సుద్దులు
దించరాని మోపులాయ దినదిన సుద్దులు"
29-189

**దినపెండ్లి :** వి. నిత్యకల్యాణము, ప్రతినిత్యమూ జరిగే పెండ్లి. (ఇది వైరిసమాసం)
"తిరువేంకటమున దినపెండ్లి గల
తరుణుల పతికినిఁ దలఁబాలో" 17-443

**దినమత్తులు :** వి; బహు. నిత్యమత్తులు.
"ఘనసిద్ధగంధర్వులు కడ గానలేరట
దినమత్తులము మా తెలివేఁటిది" 3-124

**దినములు దొబ్బు :** ప.బం; అ.క్రి. దినములు గడుపు, దినములు నెట్టు.
"పనిగొంటే జవ్వనము బంగారువంటిదె పో
దినములు దొబ్బితే వన్నె దీసుఁగాని" 8-59
"తుంచరాదు నీ మదము దొబ్బరావు దినములు
యించుకంతె నా సిగ్గు యేమి సేతురా" 8-122

**దినలెక్కలు :** వి; బహు. ప్రతిదినపు లెక్కలు. ఇది వైరిసమాసం.
"దినలెక్క లూరుపులు తెచ్చితెచ్చి వొప్పించఁగ
యెనలేని జన్మముల కెవ్వరు గురి" 4-302

**దినసంత లెక్కు :** ప.బం; అ.క్రి. ఎక్కువగు, సమ్మర్దమగు. (వ్యు.)
"కొనేవారుఁ దినేవారు కూడికూడి మూఁకలై
దినసంత లెక్కె నిది దేహులాల రారో" 3-170

**దిబుకార :** క్రి.విశే. సశబ్దంగా. (దిముకు - మృదంగశబ్దం)
"తొబుక కవిత్వాల దోషాలఁ బొరలితే
దిబుకార నవ్వడా దేవుఁడైనాను" 2-494

**దిబ్బలువెట్టు :** ప.బం. కుప్పపోయు.
"దిబ్బలువెట్టుచుఁ దేలినదిదివో
ఉబ్బునీటిపై నొక హంస" 1-16

**దిబ్బాలు :** వి. తిన్నెలు.
"కలిసితి నేను శ్రీవేంకటపతి నిపుడని
తొలుత నీ చనుదిబ్బాలు దొడికేఁ గాని" 7-181

**దిబ్బెము :** వి. దీపము.
"ఇంత చాలదా నీకు యిసుక దిబ్బెములంటా
రంతులుగాఁ గడు నేల రాఁపుసేసేరే" 9-210
"కలిగినది యొక్కటే కమలాపతి సేవ
తెలుప కొంగిచ్చేను దిబ్బెము దొడికేను" 1-442

**దిబ్బెముదొడుకు :** అ.క్రి. ప్రమాణంచేయు.
"కలిగినది యొక్కటే కమలాపతిసేవ
తెలుప కొంగిచ్చేను దిబ్బెము దొడికెను" 1-442

**దిమ్మరితనము :** (3) వి. భ్రమ, మత్తు.
"దిమ్మరితనము గొంత దిట్టరాజసము గొంత
యెమ్మెకాఁడ వైనాఁడ వేమిసేతు నయ్యా"
19-219

**దిమ్మరితిట్టు :** వి. మత్తు కలవాని తిట్టు.
"మలసి యంతేసి దిమ్మరితిట్టు దిట్టేవు
చలిగొనఁ బన్నీరు చల్లెనంటా నీపెను" 26-230

**దిమ్మరివాఁడు :** (2) వి. మత్తెక్కినవాఁడు, భ్రాంతుడు.
"దిమ్మరివాఁడవు నీవు దీకొని పన్నసేసితే
అమ్మరో గరితలకు నాగడాలు దగునా" 21-238

**దిమ్మరివిద్య :** (2) వి. భ్రమగల వాని విద్య.
"సమ్మతించి యిన్నిటాను చనవు చెల్లించితేను
దిమ్మరివిద్యలఁ గూడి తెర వేసేవు" 27-300

**దిమ్మరీఁడు :** (దిమ్మరి + ఈఁడు) దిమ్మరి పై స్వార్థంలో "ఈ" ప్రత్యయం. భ్రమ కలవాఁడు, మత్తెక్కినవాఁడు.
"దిమ్మరీఁడయిన వాఁడు తిరుగ మాటాడవద్దా
దొమ్మి నా గబ్బితనముతోడ వినుఁగాని"
25-184

**దిమ్ము :** (3) వి. 1. మదం 2. మత్తు 3. సమూహం, గుంపు.
"యెమ్మెల నీవిటు నన్ను నెంత వొల్లకుండినాను
దిమ్ముల నీ పతి ననే తేజము లేదా" 24-184
సమూహం, గుంపు :
"దిమ్ముల యాసలు రేఁచి తేనెలు మోవి నూరించె
యెమ్మెల జవ్వన భారమెట్టు మోచేవే" 17-324

**దిరిశపుఁబువ్వు :** వి. దిరసెన పువ్వు.
"జాజు జాజే కాక దిరిశపుఁ బువ్వౌనా
నీ జాడెంతయిన నీవు మానేవా" 5-368

**దిరిశము :** వి. దిరసెన.
"అర్ధమరాతిరి గాక అదె దిరిశము పూచె
సుద్దులెల్ల మాని చెలి జూడవయ్యా" 26-91

**దివము :** వి. పగలు, దినం. (ఆకాశం, అడవి, స్వర్గం)
"దివములు సరియే దినరాత్రులును సరే
యీవల సుఖదుఃఖాలు హెచ్చుకుందు లేలయ్యా" 3-422

**దివెపంజులు :** వి; బహు. దివిటీలు. 4-166 old

**దివ్యపదము :** వి. కైవల్యం, మోక్షం.

దివ్వెత్తుఁబొద్దు: (దివ్వె + ఎత్తు + పొద్దు) వి. సాయం సంధ్యాసమయం, దీపంపెట్టే సమయమని వ్యుత్పత్తి.
"దివ్వెత్తుఁ బొద్దుదాఁకా తిరిగివచ్చి యింటిలో
పువ్వెళ్ళూరుచు నసురుసురై వున్నాఁడు"
8-189

దివ్వెన: వి. 'దీవెన'కు రూపాం. ఆశీర్వాదం.
"నవ్వులనె నొకమాట నటనల నొకమాట
దివ్వెనల నొకమాట తిట్టేవేమే" 8-73

దివ్వెయెత్తు: ప.బం; అ.క్రి. దీపంపెట్టు, కాపురం నిలబెట్టు.
"దివ్వె యెత్తిన ఫలము దేవర దింతె కదవె"
1-89 old

దివ్వెలపండుగ: వి. దీపావళి పండుగ.
"తానకమాయ నిదిగో తగు దివ్వెలపండుగ
పాని నీ కరుణఁజూచే పచ్చిమాపులు" 9-88
"దివ్వెల పండుగో యనన్" అని కొరవి గోపరాజు ప్రయోగం. సిం.ద్వా.

దివ్వెలెత్తు: (దివ్వెలు+ఎత్తు) 1. దీపాలు పెట్టు 2. ప్రమాణం చేయు.
"ఎవ్వరి మాటలు నేనేల వినేను
దివ్వెలెత్త నియ్యవయ్య తేనెలు నించేను"
27-206

దివ్వెలెత్తుఁబొద్దు: (6) వి. సాయంసంధ్యా సమయం, దీపాలు పెట్టే సమయమని వ్యుత్పత్తి. చూ: దివ్వెత్తుఁబొద్దు.
"రవ్వలాయ నీ చేతలు రాజసమే నెరపఁగా
దివ్వెలెత్తుఁబొద్దులకు తిరమాయఁబనులు"
7-575

దిష్టదైవము: వి. దృష్టదైవము, కనిపించిన దైవం, భాగ్యదేవత.
"దేవశిఖామణివి దిష్టదైవమవు నీవు
నావల నీ బంట నాకు నెదురింక నేది" 3-418

దిష్టపు జన్మము: భాగ్యపుజన్మము.
"ఆవల నా కర్మమున కాచార్యుఁడే గురి
దేవ నీ శరణు గురి దిష్టపు జన్మానకు" 4-224

దిష్టపు నాలిక: వి. అదృష్టం కలిగిన నాలుక (?)
"పరమపదమే గురిపట్టిన వ్రతమునకు
తిరుమంత్రమే గురి దిష్టపు నాలికకు" 4-224

దిష్టపు పదార్థము: వి. కనిపించే పదార్థం.
"తీపు వలెనే వుండు దిష్టపుఁబదార్థాలు
మేపుగొంటే మీసాలమీఁద తేనెను"

దిష్టపు మన్నన: వి. భాగ్యపు కానుక, కనిపించే కానుక.
"తేఁటలఁ గతలు చెప్పి దిష్టపు మన్ననలిచ్చి
యిాటునఁ గోపము దీర్చె నిదివో విభుఁడు"
11-500

దిష్టపు రతి: వి. అదృష్టపురతి.
"రెప్పవేసే యంతలోనే రేసులెక్క నీ మనసు
తెప్పలఁదేలఁగరాదా దిష్టపు మీ రతులు"
19-485

దిష్టము: (62) విశ. ఉపదిష్టము, చూడబడినది. వి. భాగ్యం, 'దృష్టము'నకు వికృతిరూపం.
"చేప్పేటివారిచేత దిష్ట మాయ నదె
నెప్పున నింత కాఁగిట నీ వుండఁగా" 16-362

చూడబడినది:
"తెల్లనికన్నుల తేట దిష్టమైన యా చెమట
చెల్లఁబెట్టుకొని యాపె చింత వాపగలవా" 8-4
"అనుమానించఁగ నేలా అవిగో నీ చేతలు
దినదినకొత్త లెల్లా దిష్టమాయ మాకు" 28-286
"యీవేళ శ్రీవేంకటేశుఁ డింతియుఁ గూడఁగాను
దేవిదేవరవలె దిష్టమాయ నిదివో" 19-370
"యేపున గోనాలగొంది నిద్దరు మేలమాడఁగ
దీపమేల తెచ్చేవే దిష్టము చూడ" 17-178

దిష్టసంపద: (2) వి. అదృష్టసంపద లేదా భాగ్యసంపద.
"భోగించవయ్యా మంచి భోగములెల్ల
తీగెసాఁగిన మోహము దిష్టసంపదాయను"
23-498

**దిష్టాంతము :** (3) వి. 'దృష్టాంతము'నకు వికృతి రూపం. నిదర్శనం.
"ఇందరికి నీవె గుటీ యిదివో దిష్టాంతము
కందువతోఁ జేయవయ్య కాపురములూ" 17-142

**దిష్టించి చూచు :** (22) స.క్రి. జాగ్రత్తగా చూచు.
"తేరకొని నా దిక్కే దిష్టించి చూడఁగాను
మేరమీరి నా పంతము మెరసేదేమి" 27-10 సం

**దిష్టించు :** (6) స.క్రి. 'దృష్టించు'కు వికృతిరూపం. చూచు.
"సరసము లాడఁగానే సరి వయసు వోయీని
తెరమఱఁగీఁక నేల దిష్టించరాదా" 19-330
"వుమ్మ పన్నీటి చెమట నుసురనుకొంటూ
దిమ్మరేచీ వలపులు దిష్టించరాదా" 26-122

**దిష్టించుకొను :** స.క్రి. 'దృష్టించుకొను'కు వికృతిరూపం. చూచుకొను.
"తిలకించి సారె సారె దిష్టించుకోఁడా తాను
నెలవైపెద్దరికాలు నెరపీఁ దా నీడను" 18-560

**దిష్టి :** వి. దృష్టిదోషం.

**దిష్టిదాఁకు :** (8) ప.బం; అ.క్రి. దృష్టిదోషం తగులు.
"కడు దిష్టిదాఁకకుండా కప్పేవు పై పచ్చడము
తడయక లోలో నెంత తగులాయమో" 24-291
"తేరకొనఁ జూచితేనే దిష్టిదాకె నంటాను
కోరి కొంగువట్టేవు కొమ్మను నీవు" 18-62

**దిసంతులాడు :** ప.బం; అ.క్రి. నిందలాడు, దూషించు.
"అక్కున నా చన్నులు నీ కచ్చులుగా నొత్తితేను
తెక్కులుగా నిన్ను నెంత దిసంతులాడుదురో" 18-260

## దీ

**దీకొను :** (5) అ.క్రి. ఉత్సహించు, పూనుకొను స.క్రి. ఎదిరించు, ఢీకొను, అంగీకరించు.
"రట్టుసేసి యిదిగాక గుట్టున నవ్వేనంటే
దిట్ట యిది యన్నానను దీకొందుఁ జుమ్మీ" 25-394

**దీనకపుఁదనము :** వి. దైన్యము (?)
"మోనాన శ్రీవేంకటేశ మోవి పిప్పిసేసితివి
దీనకపుఁదనమేల తిరమైన చోట" 24-600

**దీనకుఁడు :** వి. దీనుడు, ఆశగలవాడు.
"పెట్టించె ఆసలను పెడకొడములఁ దన్ను
తిట్టించె నిజద్రవ్యదీనకులచేత" 1-185

**దీపనము :** విణ. రగులుగొల్పునట్టిది, ఆకలి నివృత్తి చేయునది, ప్రేరేపించునది.
"దీపనపు జంతువునుఁ దెచ్చి పావనుఁజేసితి
చేపట్టి నన్ను రక్షించు శ్రీవేంకటేశుఁడా" 3-37

**దీపము వట్టి నూతఁబడు :** ప.బం; అ.క్రి. వ్యర్థమగు పని చేయు.
"వున్నతి దీపము వట్టి వోగి నూతఁబడనేల
పన్ని నీ దాస్యము గల్ల బహుకర్మ మేల" 3-413

**దీపాళిపండుగ :** వి. దీపావళి పండుగ, దీపావళికి 'దీపాళి' జానపదవ్యవహారం.
"తివిరి వేగుదాఁకా దీపాళిపండుగసేసె
జవకట్టి నినుఁబాసి జాగరాలను" 11-184

**దీమపువిజ్ఞానము :** (దీమము + విజ్ఞానము) దీమునకు రూపాం. మృగాదులను వశం చేసుకోవడానికి వేటకాడు ఏర్పాటు చేసుకొన్న ఎరకు సంబంధించిన జ్ఞానం.
"ఏమియుఁ జేయఁగవద్దు యింతలోనె మోక్షము
దీమపువిజ్ఞానమే దివ్వెత్తు ఫలము" 1-430

**దీమసము :** (15) వి. 1. ధైర్యం 2. ఉపాయం 3. మర్యాద. (సారంగ.)
"దీమసాన నీ దాసుల దీప్తి మెరుఁగుట గాని
యీ మేర నీ దైవిక మెరిఁగే వారెవ్వరు" 2-303
ఈ అర్థంలో తాళ్లపాక తిరుమలాచార్యుల శృంగారదండకంలో ప్రయోగం ఉంది.
"దీమసం బింతయున్ లేదు సంతాప మింతేటికే"

**దీము :** వి. 'దీమము'నకు రూపాం. మృగాదులను వశపరుచుకోవడానికి వేటకాడు

ఏర్పాటు చేసుకొన్న పశువు లేదా పక్షి, బోనులోని ఎర, ఎర ఉంచిన బోను, గృహం, ఇల్లు.

"అంచవంటి నడలది అంగజు దీము వంటిది
మించుఁదీగెవంటి దలమేలుమంగ" 28-228

"రామ రామ రామ కృష్ణ రాజీవలోచన నీకు
దీమువంటి బంటు ననే తేజమే నాది" 15-26

**దీముప్రతిమ :** కృత్రిమమైన బొమ్మ, మాయ బొమ్మ. దీము = పక్షిమృగాదులను పట్టుటకై వేటకానిచే పెంపబడిన పక్షి, మృగము లోనగునది. (శ.ర.)

"ఏమి చెప్పేదిది యీశ్వరమాయలు
దీముప్రతిమకును త్రిజగము గలిగె" 2-251

**దీముభోగము :** దీము (వేటకాడు పక్షి మృగాదులను పట్టుకోవడానికి ఎర కోసం పెంపబడిన పక్షి, మృగం మొ॥) వలె ఆశపెట్టే భోగాలు.

"వెఱ్ఱి దెలిసి రోఁకట వెసఁ జుట్టుకొన్నట్టు
యిఱ్ఱి దీముభోగముల నెనసేము" 3-174

**దీవిసంకు :** దీవిలోని శంఖం.

"పూవు గట్టిన జవ్వాది పూసితే వాసన లేదు
దీవిసంకు ముత్యమైతే తెలిసెఁగాని" 16-293

**దీవె :** వి. దివ్వె, దీపం < దీవియ.

"ఎలమి నీ రాకల కెదురులు చూడఁగాను,
వెలయఁగ దీవె లేకే వెలుగు గాన్పించెను"
17-402

**దీవెత్తుఁబొద్దు :** (దీవె + ఎత్తు + పొద్దు) వ.బం. దీపం పెట్టే సమయం, సాయంసంధ్యాసమయం.

"యీరీతి నింత గలితె యింటికైనాఁ దోడి తేవె
తీరవు మీ ముచ్చటలు దీవెత్తు బొద్దాయను"
11-190

చూ : దివ్వెత్తుఁబొద్దు, దివ్వెలెత్తుఁబొద్దు.

**దీవెన :** వి. 'దీవెన'కు రూపాం. ఆశీర్వాదం.

"తిట్టులు గొన్నని దీవెన గొంతని
నెట్టుకొనిదే నీ పూజ" 3-320

"యెప్పుడు నీ దీవెన యిదె నన్ను మన్నించుట
కప్పి వలపెల్ల నొక్క గాదిఁ గట్టవద్దురా" 11-214

**దీవెపంజు :** వి. దివిటీ.

"దీమనపు పారివార దీవెపంజులు చేఁబట్టి
యేమరక మీలో మీరు యియ్యరో జాలి"
4-166

## దు

**దుంక :** రంధ్రం.

**దుంకదూరు :** రంధ్రంలో దూరు.

"ఏల వచ్చి యేల పోయి నెందుండీఁ బ్రాణి
తోలుతిత్తిలోనఁ జొచ్చి దుంకదూరనా" 1-299

**దుంపవెంట్రుకలు :** వి; బహు. జడలు గట్టిన వెంట్రుకలు, గడ్డల్లాంటి వెంట్రుకలు.

"దుంపవెంట్రుకల దొడ్డతురుము గల
గుంపెననడపుల గొల్లెత" 5-92

**దుత్త :** వి. చిన్న కుండ.

"ఆలదొడ్డివారము నేమంతేసి యెఱఁగము
పాలదుత్త దుత్తెఁడేసి పట్టవయ్య వలపు" 7-180

"చెంబెడు దుత్తెడు చెరవెడు బిందెడు"
(అప్ప. 572)

**దుత్తెడు :** విణ. చిన్న కుండెడు.

"జిడ్డుదేరి దుత్తెఁడు చిత్తములోని రతులు
తెడ్డెడేసి మోవితీపు తెలుసుకోవయ్యా" 7-209

**దుత్తెడేసి :** కుండెడేసి.

"ఆలదొడ్డివారము నే మంతేసి యెఱిగము
పాలదుత్త దుత్తెడేసి పట్టవయ్య వలపు" 7-180

**దున్నని నేలను విత్తినట్లు :** నిష్ప్రయోజనమైన పని చేసినట్లు.

"తలపులు చక్కఁగాక దైవముఁదలఁచఁబోతే
వెలి దున్నని నేలను విత్తినట్లు" 15-106

**దుబ్బ :** వి. పాత్రవిశేషం. (క. దుబ్బ = మట్టికుండ)

"తోడనె వెన్నదుబ్బలు తోడుక నేల వచ్చీని
వేడుకకాఁడు శ్రీవేంకటేశుఁడు" 7-134

**దుబ్బెడేసి**: (దుబ్బ + ఎడు + ఏసి) దుబ్బ= పాత్ర విశేషం, దుబ్బెడేసి = ఆ పాత్ర విశేషమంత పరిమాణం.

"గొల్లెతల మెఱుగము గొప్ప జాణతనములు
చల్ల దుబ్బెఁడేసి చల్లేము వలపు" 7-180

**(చల్ల)దుబ్బెడేసి**: (చల్లదుబ్బి + ఏడి +ఏసి) ఇది దుత్తెడేసి కావచ్చు, కుండెడేసి (దుబ్బి = చల్లదుత్త, చల్లకుండ, దుబ్బి - కన్నడం)

"వెలవెట్టని వలపు, వెసచల్లదుబ్బె(త్రె) డేసి
సొలసి గొల్లెత లెల్లాఁ, బోసిరి నీకు" 15-89

**దుమ్మలు**: ఇది దుమ్ములు కావచ్చు. ధూళులు.

"పోటు మీరిన యసురపురము లన్నియుఁ
జొచ్చి
వీటిబుచ్చి దుమ్మలుగా వేసినవాఁడు" 6-43

**దుమ్ము తూరుపెత్తు**: అ.క్రి. దుమ్ము వెదఁజల్లు, చెడఁదిట్టు, దూషించు. (పద.)

"ఇంతే మరేమి లేదు యిందుమీఁదను
దొంతులకర్మాలు దుమ్ము దూరుపెత్తుట"
1-398

**దురదుర**: (2) అవ్య. శీఘ్రంగా, వేగంగా వెళ్లడంలోని అనుకరణ.

"దురదురఁ బారితేఁగా తురుమెల్లా నిదె జారె
గరిమల నిట్టే కీలుగంటు వేయరాదా" 14-553

**దురాపేక్ష**: వి; 'దురపేక్ష' అనే పదానికి వ్యావహారికరూపం. చెడ్డకోరిక.

"తెగి దురాపేక్షఁ బడ తివియ గతి లేదు గన
పగగొన్న వగల కూపములఁ బడవలసె" 1-221

**దులాలు**: వి; బహు. దూలాలు.

"చూడ చూడఁ బౌజులాయ సుదతి
కనుచూపులు
వోడఁగట్టు దులాలాయ వొడఁబాటులు" 29-402

**దువాళపుతిరుపు**: వి. పరుగుతో గంతుతో తిరుగుట (దువాళము = అశ్వముల ప్లుతగతి, సమవేగం. తిరుపు = నడక)

"వరుస పూర్వదువాళపు తిరుపుల
హరిఁగరఁగింపుచు నలమేల్మంగ" 5-24

**దువ్వటపుఁబయ్యెద**: విలువగల సన్నని వలెవాటు.

"చివ్వన మై చెమరించి చిత్తడి చెమటతోడ
దువ్వటపుఁబయ్యెదెల్లాఁ దోపఁదోగెను" 7-144

**దువ్వటపు చీర**: వి. విలువగల సన్నని వస్త్రం.

"దువ్వటపు చీర యిది తొల్లే కడు నునుపు
పువ్వువలె జారీ నిట్టె పోపో విడవోయి" 17-120

**దువ్వటము**: వి. విలువగల సన్నటి వస్త్రం.

"దువ్వటపుఁబయ్యెదపైఁ దోఁగిన తట్టుపుణుఁగు
పువ్వటమ్ము బాసటమై పొక్కె నేమి సేతునే"
5-267

**దువ్వు**: వి. 'దువ్వు' ధాతువు కృదంతరూపం. దువ్వుట.

"పాపటదువ్వులు పయ్యెదమాఁటులు
పైపై నెటువలె పనుపడెనే" 29-340

**దుష్టుఁదనము**: (దుష్టు + తనము) దుష్టత్వం, చెడ్డతనం.

"పెరుగుతోడఁ బెట్టిరి దుష్టుఁదనము
పెరుగఁబెరుగ నాఁడె ప్రియురాండ్లెల్లా" 7-415

## దూ

**దూఁటు**: స.క్రి. పొడుచు, కుమ్ము. (సూ.ని.)

"పీఁటమీఁద గూచుండి ప్రియములు చెప్పి చెప్పి
దూఁటి చన్నుల నొత్తెను తొలుతాతని" 8-140

**దూతికె**: (2) దూతిక, దూతి; దూతిక అనడానికి దూతికె అని ప్రయోగించడం కన్నడప్రభావం వల్ల కావచ్చు.

"కాతరాన నీ గుణాలు కడుఁగడుఁ గొసరీని
దూతికవలెనే మాట దొమ్మిసేసెనో" 8-92

**దూప**: వి. దప్పి, తాప శబ్దభవం. ఇది మాండలికపదం. తెలంగాణంలో కూడా వాడుకలో ఉన్నది.

"పోపో యిదేడ సుద్ది పొద్దువోదా తనకు
దూపకు నేయి దాగేటి దూరు గాక" 11-505

**దూపకు నేయి దాగు**: ప.బం; అ.క్రి. ఆశించిన

ఫలితం లభించకపోగా దానివలన మిక్కిలి బాధ కలుగు.

"దూపకు నేయి దాగేటి దూరు గాక" 11-505

**దూపిలు:** (2) అలసట పొందు, దప్పికపొందు.

"దూపిలేవు నీ చేతకుఁ దొరలకుందాన నంటా
దాపలాన నీ వాపెను సమ్మతింపించరాదా"
18-197

**దూరగు:** (దూరు + అగు) అ.క్రి. దూరమగు. దూరమనే శబ్దం కన్నడంలో 'దూరు' అనే రూపంలో ఉన్నది.

"తుద మీఱిదాననా దూరై యెంత దిరిగినా
మదమునఁ దానే మారుమలసీఁగాక" 13-136

**దూరతనము:** (దూర + తనము) దూరంగా ఉండే లక్షణం.

"ఇంతవాఁడవు గాకున్న యేది దూరతనము
వింతకు తలలూఁచేరు వీదికట్టువారలు" 13-171

**దూరశ్రవణము:** దూరంనుండే శబ్దాన్ని వినడం.

"మంచి పరమహంసనామము ప్రాణులచే వింట
చంచల వినేటి దూరశ్రవణము" 2-258

**దూరించుకొను:** స.క్రి. నిందింపజేసుకొను, తిట్టించుకొను.

"రారే ఆతని నేల రవ్వ సేసేరు
దూరించుకోఁడు వచ్చి సంతోసపెట్టీ నిపుడు"
8-41

**దూరు(ఋ)(లు)గట్టు:** అ.క్రి. 1. నింద(లు) ఆపాదించు 2. తగవు(లు) పెట్టు.

"యెమ్మెలకాఁడవు గావా యిందుకు రాజవు
గావా
దొమ్మికాఁడ నైతే నీకు దూరు గట్టవలెనా"
20-550

"వలవేసి సతిమీఁద వట్టి దూరులుగట్టకు
నిలువుఁబతిమవలె నీ ముందర నున్నది"
27-195

**దూరు(ఋ)కెక్కు:** (దూఋకు + ఎక్కు) ప.బం; అ.క్రి. నింద పొందు.

"దూరుకెక్కిరి నీచేత తొల్లే గొల్లెతలెల్లా
యీ రీతి విద్యలు నీకు నింకా నెన్ని గలవో"
12-226

**దూరుకట్టుకొను:** ప.బం; అ.క్రి. నిందపొందు.

"కటకటా వట్టి దూరుకట్టుకొందురా
సటలు సేయఁగ నేలే జవరాలికి" 27-48

**దూరుసేయు:** స.క్రి. నిందించు.

"సూటికిఁ బతి రాకున్న సొలతురు మలతురు
తోటకూరవంటి నన్ను దూరుసేసేవా" 14-241

**దూలతనము:** వి. కండూతి, దురద.

"నియ్యంత నే నేరనా నీవే బత్తి గలవా
పుయ్యక దూలతనాల పోరకువే ఇపుడు"
27-260

**దూళి:** వి. 'ధూళి' శబ్దానికి జానపద వ్యవహారరూపం. అన్నమయ్య వాడిన పదాల్లో మహాప్రాణాలు ఎన్నో అల్పప్రాణవర్ణాలుగా వాడబడటం కనిపిస్తుంది.

"నుదురెల్ల జెమరించె నూఁగు దూళిమేనితో"
26-10

**దూసకము:** ప్రసిద్ధమైన శబ్ద రత్నాకరాది నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. దూషకము కావచ్చు. దూషణం, నిందించడం అని అర్థం కావచ్చు.

"వట్టి దూసకములేల వాదులేల నాకిఁక
దట్టముగ నీకు మంచిదాననై వుండేను" 20-350

## దె

**దెత్తి:** వి. పిశాచం, భూతం.

"తత్తరించి తలఁచక దవ్వువోయి పరులకు
దెత్తివై యేల సోళ్లు దెరిచేవో మనసా" 9-196

**దెత్తిగొను:** అ.క్రి. (?)

"నెత్తికన్ను మానినవాని పెండ్లికి
దెత్తిగొన్నయట్టి దేవుఁడు" 1-111

**దెప్పరము:** వి. (1.దుష్టవచనం 2.ఆపద 3.అతిశయం 4.విధం, రీతి) విశే. 1.విషమమైన 2.అధికమైన 3.ఆపత్కరమైన, కష్టదాయకమైన.

"దెప్పరపు నీ బాస తెలిసేకొఅకుఁగాక
చప్పుడుసేయకుందాన జడిసి వుందాన"
14-100

"దెప్పరపువయసే దిమ్మురేచ దొరకొంటే
కొప్పులోని విరులైన కొంతముులై తోచను"
29-589

## దే

**దేవగన్య:** వి. దేవకన్య. 'క' కారం 'గ' కారంగా మారడం జానపద వ్యవహారానుగుణం.

"తనలోనె తలపోసి తప్పక చూచేవేళ
వనితను దేవగన్య యనవచ్చును" 9-56

**దేవతాంతరాలు:** (దేవతా + అంతరాలు) వి; బహు. ఇతరదేవతలు.

"తప్పుఁదెరువుల దేవతాంతరాలు(లఁ)
దడవకు వో వోయి జీవుడా" 10-1-3

**దేవపట్టు:** వి. దేవతల నివాసస్థానం. (వైరిసమాసం) యక్షరాక్షసాదులుండే స్థలం కావచ్చు నని సంపాదకులు.

"తేలుగాని పాముగాని దేవపట్టయినఁగాని
గాలిగాని ధూళిగాని కాని యేమైనా
కాలకూట విషమైన గక్కన మింగిననాటి
నీలవర్ణుఁడే మా నిజదైవము" 1-214

**దేవరలేని పూజ:** ప.బం; వి. వ్యర్థం, నిష్ప్రయోజనం.

"వట్టి జోలితో నూరక దేవర లేని పూజవంటిది
వొట్టుక ఫలములు లేని పంటలకు వొడిగట్టే
యటువంటిది" 2-320

**దేవరహస్యము:** వి. ఎవ్వరికీ తెలియగూఁడని రహస్య విషయం.

"నీ చిత్తమాపె యెఱుఁగు నీ వెఱుఁగుదువు
యేచి నీ దేవరహస్యా లెవ్వఁడెఱుఁగు" 21-36

**దేవరాహుత్తరాయఁడు:** వి. శ్రీవేంకటేశ్వరస్వామికి గల బిరుదు. (రాహుత్తుఁడు = గుఱ్ఱపురౌతు)

"వొట్టుకొని దేవరాహుత్తరాయ బిరుదు నీదే
కిట్టి రాతిగుఱ్ఱము నెక్కితివి గాన" 2-142

**దేవరొజ్జలు:** వి; బహు. శ్రేష్ఠులైన గురువులు, దేవతాగురువులు.

"దేవరొజ్జ లొకవంక దిక్కులలోఁ బొలగూడు
దీవనతో నారగించి తీపుమరిగి" 2-70

**దేవళ్ళు:** వి. వేలుపులు, దేవతలు.

"చూడఁజిన్నవాఁడు గాని సుద్దు లెన్నైనాఁగలవు
వీడుదోడైన దేవళ్లు విట్ఠలేశుఁడితఁడు" 29-479

**దేవుఁడిచ్చినా పూజరి వరమీడు:** అసలువాడు అనుగ్రహించినా అంతకు కిందివాడు కానివ్వడనే పట్ల ఉపయోగించే పలుకుబడి.

"పొసఁగ దేవుఁడిచ్చినా పూజరి వరమీఁడు
విసిగి నే విడిచినా విడువరు లోకులు" 3-220

**దేవులచెరువు:** వి. కోనేరు, స్వామి పుష్కరిణి. (కోన్ = ప్రభువు, స్వామి; కోనేరు = స్వామి పుష్కరిణి) చిత్తూరు జిల్లాలో ములకల చెరువు మండలంలోని గ్రామం. దీనికి దేవుల్చెరువని వ్యవహారం. ఇది తిరుపతి గుంతకల్లు రైలు మార్గంలోని బత్తులాపురం రైల్వేస్టేషన్‌కు ఇదు కిలోమీటర్ల దూరంలో ఉంది. ఇక్కడ శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం ఉండినట్లుగ అన్నమయ్య పేర్కొన్నాడు. ప్రస్తుతం ఈ ఊళ్లో చెరువు సమీపంలో నాలుగు దేవాలయాలున్నాయి. కానీ వాటిలో వేంకటేశ్వరస్వామి ఆలయం లేదు. ఐతే గ్రామ నామం దేవుళ్ల చెరువు కావడం వల్లా, ఇప్పటికీ నాలుగాలయాలు ఒకే ఊళ్లో ఉండడం వల్లా, పూర్వం ఇక్కడ వేంకటేశ్వరస్వామి ఆలయం ఉండి ఏ కారణంవల్లనో శిథిలమై ఉండవచ్చునని ఊహించవచ్చు. (చూ: తా.అ.సా.లో తెలుగునాడు – 104 పు.)

"ఏవంక నేరిచితివో యింతేసి నీవు
దేవులచెరువు యేలే తిరువేంకటేశా" 23-217

**దేవులతనము:** వి. దేవీత్వం, రాజ్ఞీత్వం, రాణిగా ఉండటం. అన్నమయ్య పట్టపురాణి అనే అర్థంలో దేవులు (దేవి శబ్దానికి బహువచనరూపం) అని వాడడం కనిపిస్తుంది.

"కందువఁ బాన్పుపైనుండి కాఁపురాలు సేసేవు
చెంది దేవులతనము చెల్లునే నీకు" 26-244

"దేవులతనమున తెఱవ నిన్నోరసి
శ్రీవేంకటేశుఁడ చింతించకు" 23-207

**దేవులమ్మ:** (దేవులు + అమ్మ) వి. పట్టపుదేవి, భార్య. దేవీ శబ్దానికి 'దేవులు' బహువచన రూపం. ఇట బహువచనం గౌరవార్థకం. దేవిర్థైన అమ్మ, లేదా అమ్మ యైన దేవి.
"దేవులమ్మ యిందిర మాదిక్కై విన్నవించరాదా"
"దేవులమ్మ విలిచీని దేవుని రమ్మనరే
అవల నివ్వతెకు లోనాయెనో యని" 5-8

**దేవులసాని:** (2) వి. పట్టపుదేవి, పట్టపురాణి.
"దండితోడ మూడిగపుదాన నయ్యే నంటి నేల
చండిపోరి నీ దేవులసానిఁ జేసెవయ్యా" 11-504

**దేవులు:** (120) వి; బహు. 'దేవి' శబ్దానికి బహువచన రూపం. ఇది గౌరవసూచకమై ఏక వ్యక్తిపరంగా 'నేను నీ దేవులు', ఇత్యాదిగా వాడుకలో నిల్చి బహుత్వార్థాన్ని పోగొట్టుకున్నది. భార్య, పట్టపురాణి, దేవి. అన్నమయ్య 'దేవి' అనే ఏకవచన ప్రయోగానికి బదులు అంతటా 'దేవులు' అనే పదమే ప్రయోగించినాడు. దీనికి సుమారు 120 ప్రయోగాలు కనిపిస్తున్నాయి.
"యిట్టె నీ దేవులు చేతికిచ్చిన యీ కానుక
జట్టిగొన్న కాఁగిలే లంచము లాయను" 22-451

**దేవుళ్ళు:** (26) వి; బహు. 'దేవి' శబ్దానికి బహు.రూపమైన దేవులు శబ్దానికి బహువచనరూపం. భార్యలు, పట్టపురాణులు అని అర్థం. చూ: దేవులు.
"వొరయుచు నీ దేవుళ్ళు వూడిగాలు సేయఁగాను
కరుణతో నీ వాకెను కాఁగిలించేవు" 26-408
"ఇద్దరు దేవుళ్ళుఁదాము నెదురుదేరులమీఁద
కొద్దిమీర నిమ్మపండ్లఁ గుచ్చి చిమ్మేరు"
18-138
"నాలి నిద్దరు దేవుళ్ళనడుమ నిలుచుండి
కైలాటాలు చల్లీ నదె కనుఁగొనల" 14-368

**దేశమువారు:** స్థానికులు.
"తెలిపించుకొనవే దేశమువారి చేతనే
కులికి సోకు నా కొంగేల పట్టీనే" 11-239

**దేశాంత్రులు:** వి; బహు. 'దేశాంతరులు' (ఏక. దేశాంతరి) కు వ్యవహారరూపం. పరదేశపువారు.
"అగణితంబైన దేశాంత్రుల మఠంబులును
నధికమై చెలువొందఁగాను" 1-227

**దేహరము:** వి. దేవగృహం.
"లింగము లేని దేహరములు లెక్కలేని
క్రియములు"

**దేహాతుము:** వి. దేహాత్మ. దేహరూపంలో ఉన్న ఆత్మ. అన్నమయ్య ఆత్మశబ్దాన్ని అంతటా 'ఆతుమ' అని ప్రయోగించినాడు.
"పరఁగ యోనిసంభవమగు దేహాతుమ
పెరిగి యందుకే ప్రియపడును" 4-404

## దై

**దైతతనము:** వి; మాం. గయ్యాళితనం, జగడాలమారితనం (దైత = గయ్యాళి, జగడాలమారి)
"నీతితో నడవఁగాను నిన్ను దూరేనా నేను
దైతతన మెవ్వరందో తలఁచుకో పనులు"
27-440

**దైన్యపడు:** అ.క్రి. దీనస్థితిలో నుండు.
"చిక్కి దైన్యపడఁగాను చెలఁగి ఖండించరాదు
చక్కగా నా ద్రోహులు సైరించరాదు" 2-434

**దైలు:** వి. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు.
"యీలీల శ్రీవేంకటేశుఁడిటు తానే నన్నుఁగూడె
దైలతోనేఁ గొసరేనా తనతో నేను" 21-3

**దైలువారు:** అ.క్రి. దైవారు, పొంగిపొరలు, అతిశయించు, ఒప్పు.
"యెంతని చెప్పేనేను యేమని వినేరు మీరు
సంతతము దైలువారి చల్లు వెదలాడేనే" 12-287
"తమి రేచఁగా వలపు దైలువారఁగా నవ్వి
సమరతికిఁ బెనఁగీ సమ్మతించవయ్యా" 12-357
"తలవంచే నిన్నుఁజూచి దైలువారెనా చెమట
చెలరేగి ఆపె నిన్నుఁ జేసే చేఁతకు" 8-128

**దైలువాఱు:** ప.బం; అ.క్రి. అతిశయించు.

"తమి రేచఁగా వలపు దైలువాఱఁగా నవ్వి
సమరతికిఁ బెనఁగీ సమ్మతించవయ్యా" 12-357

**దైలువోయు:** ప.బం. (?)
"మొగము నేను చూచితే మోసులువార నవ్వేవు
తగు వసంతపు నీట దైలు వోసేవే"
"మొగము నేము చూచితే మోసులువార
నవ్వేవు
తగువసంతపు నీట దైలు వోసేవే" 7-206

**దైవారు(ఱు):** (దైలు + పాఱు) అ.క్రి.
1. పొంగిపొరలు 2.అతిశయించు 3. ఒప్పు.
"మనసు మర్మాలు సోక మాటలు విన్నాడేదెల్లా
తనివోని కోరికల దైవారుతాఁగాదా" 12-293

**దైవారు:** వి; ప.బం. 'దైవాఱు' ధాతువుకు భావార్థక కృదంతరూపం. ఒప్పుట, అతిశయించుట.
"యెలమి శ్రీవేంకటేశ యీకె మన్నించఁగాను
తలపోఁత కళలతో దైవారులు వారీని" 12-429

## దొ

**దొంగరికము:** (దొంగ + ఱికము) వి. దొంగతనం, చౌర్యం.
"సుద్దులే దొంగరికాలు మద్దులు విఱిచి వాఁడు
సుద్దులు మద్దులుఁ జెప్పి చూపరో హరిని"
17-445

**దొంగల ధర్మాసనము:** అన్యాయానికి స్థానం.
"ధీరత చెడి తాను జీవుఁడు తెలియక
నేరకయుండిన
ధారుణిలోపల దొంగల ధర్మాసనమాయె"
1-72 & 1-189

**దొంగలసానికనుమ:** వి. ఇది సిద్ధవటం తాలూకా ఓబుళందగ్గర ఉన్న కనుమ. (చూ: ఎఱ్ఱశిలకనుమ)
"కాంత నీ చిత్తమే దొంగలసానికనుమ
యింతటి వేంకటపతి కిరవైనది" 5-115

**దొంగాడు:** అ.క్రి. 'తొంగాడు'కు వ్యావహారికరూపం. దోగాడు; బిడ్డ నేలపై చేతులు మోపి మోకాళ్లతో నడచు, దాగుడుమూతలాడు. నిఘంటువుల్లో ఈపదం కానరాదు. ఇది 'తొంగాడు' కూడా కావచ్చు.
"అల్లన దొంగాడవయ్య హరి కృష్ణ" 28-495
"చలపాదిగొల్లెతల చనుగొండలతోడుత
తులఁదూచీ దలపులు దొంగాడు కృష్ణుఁడు"
26-278

**దొంగు:** అ.క్రి. మఱుఁగుపడు.
"చెంగలించి చేతులెత్తి చెలఁగుచును వీఁడె
దొంగిదొంగి తిరిగీని తోలరమ్మా" 5-257

**దొండి:** వి. రంధ్రం.
"చక్కిలాల కుండలెల్లా చలాన దొండ్లు వొడిచి
దిక్కన దోఁటికోలల దీసెనమ్మా" 4-161
"పండ్లు గాయలును బానలు వీదుల
దొండ్లుగాఁ జేసి దొబ్బిదొబ్బి" 23-331

**దొండివోవు:** ప.బం; అ.క్రి. చిల్లుపడు, తూటుపడు. (తె.వ్యు.కో.)
"ఆసలచే వేగేది నీకింత వేడుకైతేఁ జాలు
దోసమా నాపై వణకు దొండివోయీనా"
12-255 old

**దొండెము:** వి. (?)
"తుత్తుమురై కోరికెల దొండెము రేఁగఁగఁ జొచ్చె
జొత్తుల వెరగుపడి చూచీఁబుట్టుగులు"

**దొండ్లువోవు:** అ.క్రి. చిల్లులుపడు.
"గొందినున్నఁ బోనీక కోలలు చాఁచి చాఁచి
పొందుగ దొండ్లువోవఁ బొడిచీ మీ బాలుఁడు"
21-386

**దొంతరకొండ:** వి. రాళ్లు వరుసగా ఒకదానిపై నొకటిగా నున్న కొండ.
"అగ్గమై శ్రీవేంకటేశుఁడలమేలుమంగఁగూడె
తగ్గు లేని మొత్తపు దొంతర కొండవలెను" 4-55

**దొంతరకొడుకు:** వి. (?)
"పంతుకు యశోదకు నవ్వల నందగోపునికి
దొంతరకొడు కైనాఁడు తొల్లి వీరే పుణ్యాలో"
2-509

**దొంతరచుట్టరికము:** వి. పరంపరగా వస్తున్న చుట్టరికం.
"ఇంతలో శ్రీవేంకటేశ యెనసి మీరుండఁగాను
దొంతరచుట్టరికానఁ దొప్పఁదోఁగే వలపు" 7-421

**దొంతరతామెర:** వి. పరంపరగా అనేకదళాలతో వికసించిన తామర.
"చెంతఁజెక్కునఁ బెట్టిన చేతితోడ నుండఁగాను
దొంతరతామెర ఆయఁదొయ్యలి మోము"
14-150

**దొంతరనేరుపులు:** వి. అధికమైన నేర్పులు.
"ఇంత గలితే నీవు మా ఇంటికి వచ్చేవేళ
దొంతర నా నేరుపులు తోడు చూపేఁగాని"
23-460

**దొంతరబాసలు:** వి; బహు. వరుస బాసలు.
"వింతవారు నవ్వేరని వెరపు మానితేఁ బోనీ
దొంతర నీ బాసలకు దోసమైనా ముట్టదా"
7-430

**దొంతరబోనము:** వి. వరుస భోజనము.
"వనితా కౌఁగిట రతి వాడనిపువ్వు
తనివోని మోవి దొంతరబోనము" 23-318

**దొంతరమాటలు:** వి; బహు. పరంపరగా వచ్చే మాటలు.

**దొంతరమెచ్చులు:** వి; బహు. మెప్పుల పరంపరలు.
"రంతుల శ్రీవేంకటేశ రతుల మమ్మేలితివి
దొంతరమెచ్చులు మెచ్చ దొడ్డవారమా" 13-65

**దొంతరవలపు:** వి; బహు. అధికమైన వలపు.
"దొంతరవలపు చల్లి దోమటి దోడుకవచ్చి
యెంత గద్దో చుట్టరిక మీపెకు నీకు" 28-471

**దొంతర విద్యలు:** వి; బహు. విద్యల పరంపరలు, అనేక విద్యలు.
"చెంతల పరుసవేది చేతిలోనే వుండఁగాను
దొంతరవిద్యలతోడి దోవ మాకేలా" 3-190

**దొంతరవేడుకలు:** వి; బహు. వేడుకల పరంపరలు.
"చింత యేమి సేసేనే శ్రీవేంకటేశుఁగూడితే
దొంతర వేడుకలెల్లా దొరకీఁగాక" 29-431

**దొంతిఁబెట్టు:** (5) స.క్రి. ఒకదానిమీద ఒకటి వరుసగా పేర్చు
"ఇంతయు నీ మాయామయమే గతిఁ
దెలియఁగవచ్చును
దొంతిఁబెట్టిన కుండలు తొడరిన జన్మములు"
2-133

**దొంతి:** (2) ఒకదానిపై ఒకటిగా పేర్చిన వస్తువుల వరుస, పరంపర.
"దొంతులాయఁ గూరిములు దూరులాయ
నేరములు
వంతులు వాసులు నింక వద్దనవే" 9-109

**దొంతికర్మములు:** (2) వి. అధికమైన కర్మములు, వరుస కర్మములు.
"చెంతల నీతని సేవకులకు మరి
దొంతికర్మముల తొడసిీక నేల" 4-325

**దొంతిపులకలు:** అధికమగు రోమాంచములు.
"దొంతిపులకలు రేఁగఁ దొడతొడ వెరగందీ
చెంత నీవు సేసినట్టి చేసన్నలు దలఁచి" 18-470

**దొంతిబోనాలు:** వరుస బోనాలు.
"వంతులు వెదకుదువు వాసికిఁ బెనఁగుదువు
దొంతిబోనా లివిగో పొత్తుల నుండరాదా"
26-435

**దొంతిమదము:** అధికమైన మదం.
"అంతట నరగొర లన్నియుఁ దీరెను
దొంతిమదములకుఁ దుద లేదాయ" 7-295

**దొంతివిషయములు:** అధికమైన విషయాలు.
"దొంతివిషయములాల దొరలాల
చెంత మీఁదటిబుద్ధి చెప్పరో మాకు" 2-407

**దొంతివెట్టు:** (3) వరుసగా పేర్చు.
"నవ్వుల దొంతివెట్టితి నడుమంత్రమున నీవు
కువ్వఁగానేల చూపేవే కూరాకు మోవి" 7-431

**దొంతివేసాలు:** వి. అధికమైన వేషాలు.
"ఎంత వేగిరకాఁడవు యేమోయి

దొంతి వేసాలిట్టె వెన్నతోడఁ బెట్టరా" 25-384

**దొంతులకర్మాలు :** వి; బహు. వరుస కర్మలు.
"ఇంతే మఱేమి లేదు యిందుమీఁదను
దొంతులకర్మాలు దుమ్ము దూరుపెత్తుట"
1-398

**దొంతులకెక్కు :** అ.క్రి. వరుసకెక్కు.
"అలమె శ్రీవేంకటేశుఁడంటిన మాపొడఁబాటు
తొలుత మీ నవ్వులెల్లా దొంతులకు నెక్కవా"
7-41

**దొంతుల బుద్ధులు :** అధికమైన ఆలోచనలు
"మంతనాన నీవు నాకు మనసిచ్చి
యుండఁగాను
దొంతుల బుద్ధులు యేమి దోచే నీకు" 11-108

**దొంతులయాసలు :** వరుస ఆశలు
"చెంత మాటలఁ దనిపి చేయివేయఁ గోరుదు
దొంతుల నా యాసలకు తుద యెందు లేదు"
19-447

**దొంతుల వేడుకలు :** అధికమైన వేడుకలు.
"దొంతుల వేడుకలను తొల్లె తా మోలలాడిరి
యింతలోనఁ జల్లారిన యీ చవింతే కాక"
11-505

**దొంతులువెట్టు :** (3) ఒకదాని మీద ఒకటి పేర్చు.
"వింతవింత మాటలు వేడుకతో పాటలు
దొంతులు వెట్టేరు నీవై తొయ్యలు లెల్లా" 14-76

**దొగ్గినంబలి :** అర్థం విచార్యం. (పద.)
"కలది కుక్కిమంచము కన్నవారెల్లాఁ బండేరు
తలెతో దొగ్గినంబలి దావకూళ్లు" 1-370

**దొడ్డ తోలుఁగోట :** వి. శరీరం. (వ్యు.) పెద్ద తోలు
గల కోట అని వ్యుత్పత్తి.
"తొమ్మిది గవనులైన దొడ్డతోలుఁగోటా
కొమ్మల చవుల మూల కొత్తళాల కోటా" 2-84

**దొడ్డిఁబెట్టు :** ప.బం; అ.క్రి. దొడ్డిని తోలు.
"మాడలవలె సతుల మారుపెళ్లాడేవు
తోడ నిట్టె యెందటిని దొడ్డిఁబెట్టేవో" 11-41
"నాముకొన నాతనితో నవ్వు నవ్వవచ్చుఁ గాక
దోమటిగా సిగ్గులెల్ల దొడ్డిఁబెట్టవచ్చునా" 25-138

**దొడ్డికట్టుది :** (దొడ్డికట్టు + అది) గొల్ల స్త్రీ
కావచ్చు. దొడ్డికట్టు వాడకట్టువంటి పదం.
దొడ్డికట్టు = పశువులకొట్టం కలది – గొల్ల స్త్రీ.
"ఇంతులు నీకు బాఁతా యెంత సేసేవు
దొంతిఁబెట్టేవు ప్రియము దొడ్డికట్టుదాన" 21-87

**దొడ్డిపట్టు మానినుల దొమ్మికాఁడు :** గొల్ల
పల్లెలలోని గోపికలను అల్లరి పెట్టువాడు,
శ్రీకృష్ణుడు.
"దొడ్డిపట్టు మానినుల దొమ్మికాఁడా
అడ్డములేని చేఁతల యాతఁడవా నీవు" 24-59

**దొడ్డిపట్టు మానినులు :** వి. గొల్లపల్లెల్లోని
గోపికలు.
"దొడ్డిపట్టు మానినుల దొమ్మికాఁడా
అడ్డము లేని చేఁతల యాతఁడవా నీవు" 24-54

**దొడ్డివాఁడు :** వి. గొల్లవాఁడు.
"పిసికితే నవ్వులఁ బేరి పెరుగులై
దొసఁగుల కపటపు దొడ్డివాఁడవా" 12-447

**దొడ్డు :** 'దొడ్డ'కు రూపాం. గొప్పది.
"ఆడ నీ వదినెలైతే ఆపె నీకు దొడ్డుగాక
యీడుజోడు సవతులు యింత కోపఁగలరా"
26-245

**దొడ్డుగొంచము లెంచు :** ప.బం; అ.క్రి. హెచ్చు
తగ్గులు ఎన్ను. 'కొంచెము' అనే రూపానికి
బదులు 'కొంచము' అని ప్రయోగించడం
వ్యావహారికతాలక్షణం.
"సరవితో దొడ్డుగొంచము లెంచవు
సరుసఁగూచుండేఁ జాలు చలపట్టి కూడుదువు"
23-444

**దొడ్డెడు :** దొడ్డినిండా ఉన్న.
"దొడ్డెడు పసులఁ గాచి దొరవు నేఁ డైతివి
జడ్డుగొల్లెతలఁ బొంది జాణ వైతివి" 12-540

**దొబ్బు :** (14) మాం; స.క్రి. తోయు, కోస్తాంధ్రలో
దీనికి అశ్లీలార్థంలో ప్రయోగం ఉంది.

"దొబ్బిన చేతులనే దోసిలించి మొక్కి నాకె
అబ్బురా లేటికి విడె మందియ్యవయ్యా"
20-366

"కాయమంటి నిన్నాతఁడు కలయఁగ రాఁగాను
చేయివట్టి దొబ్బేవు చెలఁగి నీవు" 13-174

గడువు:
"పూరకే దినదినాల యుగాలు దొబ్బితీఁగాని
నేరిచి వివేకము నిలుపనైతి" 3-283
"తుంచరాదు నీ మదము దొబ్బిరావు
దినములు
యించుకంతె నా సిగ్గు యేమి సేతురా" 8-122

**దొమ్మ:** వి. అవయవవిశేషం.
"నమలెడు నానావవులకు నానావిధభక్షణములు
కమలిన దుర్గంధపు శాకమ్ములు దొమ్ములును"
1-151

**దొమ్మి:** వి. పెనగుట.
"అంచెల శ్రీవేంకటేశుఁ డాతఁడిదె నిన్నుఁగూడె
మంచపు దొమ్ములలో మంకులేక నేటికే"
20-370

**దొమ్మికాఁడు:** (దొమ్మి+కాఁడు) వి. జగడీఁడు, అల్లరికాఁడు, సందడి యుద్ధం చేసేవాఁడు, దౌర్జన్యం చేసేవాఁడు.
"కొమ్మ తీరునఁ గుదురైన కోట
దొమ్మికాండ్రైదుగు రుందురు" 1-61
"దొమ్మికాఁడ గొల్లెతలఁ దొడికిన యలవాటు
ఇమ్ముల నెవ్వరిఁ గన్నా నేల మానునయ్యా"
14-32

**దొమ్మికాంతలు:** వి. జగడించే స్త్రీలు.
"కమ్మటి నవ్వితివంటా కన్ను గిరిపితివంటా
దొమ్మికాంతలతోడఁ బొత్తు గలతురా" 7-361

**దొమ్మిచేయు:** అ.క్రి. దౌర్జన్యంతో ఒకరిమీద ఒకరు పడు, దౌర్జన్యం చేయు.
"తొలమంటే కాఁగిలించి దొమ్మిసేసేవు
జలకమాడేటివేళ సంగడికి వచ్చేవు" 11-262

**దొమ్మినవ్వులు:** వికటపు నవ్వులు, వికటాట్టహాసాలు.
"నమ్మి శ్రీవేంకటేశ్వరు నన్నుఁ
గూరుచుమంటేను
దొమ్మినవ్వులు నవ్వేవు దొరవౌదువే" 26-383

**దొమ్మిపూజ:** వి. అందరూ ఒకేసారి కలసి చేసే పూజ.
"పారి నా పాదాలమీఁదఁ బూవులెల్ల రాలఁగాను
దొరతనానకు రాఁగా దొమ్మిపూజ లాయఁగా"
11-600

**దొమ్మివాఁడు:** వి. అల్లరివాఁడు, దౌర్జన్యం చేసేవాఁడు.
"సొమ్ములు నించుకోఁగానే సోలియుచుఁ దిట్టేవు
దొమ్మివాఁడ వౌదుఁగాని తొలరా నీవు" 14-362

**దొమ్మిసరసము:** వి. సందడి సరసం.
"చిమ్మి రేఁగినటువలె సేసినదే చేతగాక
దొమ్మిసరసములోన తొలఁగఁ జోటున్నదా"
24-351

**దొమ్ముల కర్మములు:** వి. జగడపు పనులు, కష్టాలు కలిగించే పనులు.
"నెమ్మది శ్రీవేంకటేశ నీ చిత్తమే కాక
దొమ్ముల కర్మము లివి తోయవచ్చునా" 1-397

**దొరకత్తె:** (దొర + కత్తె) దొరసాని, గొప్పది.
"తోడివారిలో నన్ను దొరకత్తెఁ జేసేవేళ
అడ వచ్చి బుద్ధిచెప్పి అడ్డగించవలదా" 25-33

**దొరకాలువ నెత్తురు:** వి. దొరకాలువ నెత్తురు కావచ్చు అని సంపాదకులు. ఎఱ్ఱనైన కాలువ నెత్తురు.
"కాంచనదైత్యుఁడు దొరకాలువ నెత్తురు వార
చించెను గొల్ల నరసింహదేవుఁడు" 2-228

**దొరకోలు:** వి. లభించడం, చిక్కడం, సంభవించడం, పూనిక.
"తొలఁగక నన్నుఁగూడి దొరకోలు సేసుకొని
చెలఁగీ శ్రీవేంకటాద్రి చిన్న బావఁగారు" 11-355

**దొరదొంగ:** వి. దొరయైన దొంగ.

"వెరవున్నా (వున?) దన విధము దాచుకొని
దొరదొంగ వచ్చె దోబూచి" 5-227

దొరపాటివాడు: వి. దొరతో సమానమైనవాడు, ప్రభుతుల్యుడు.
"దొరపాటివాఁడాతఁడు దొమ్మిసేతురా
తరుణులాల మీరు తరవు పెట్టుదురా" 13-24

దొరముని: వి. ఆదివన్ శఠకోపుడు ; అన్నమాచార్యుల వారికి అహోబిలంలో నరసింహమంత్రాన్ని ఉపదేశించిన గురువు.
"చూడుఁ డిందరికి సులభుఁడు హరి
తోడునీడయగు దొరముని యితఁడు" 1-117

దొరవాఁడు: వి. దొర, రాజు, సేనానాయకుడు, గొప్పవాడు
"అదరి తెరమాటున నానలువెట్టే ఇంతిఁ
దొడికి పట్టుదురా దొరవాఁడవు" 21-285

దొర్లాడు: స.క్రి. అనుభవించు, తిరస్కరించు, కలియు.
"విన్నపాలు వినేనే వీఁడు దొర్లాడేనే
యిన్నిటాఁదా శ్రీవేంకటేశ్వరుఁడే" 12-156

దొసకులు: (2) వి. దొసగులు, కష్టాలు.
"రసముబ్బి నవ్వులను రాసివడీ మొక్కులను
దొసకులేమని దూరే నిన్ను" 23-315

## దో

దోఁగిపోవు: ప.బం; అ.క్రి. ఒరసికొని పోవు.
"వున్నతి దొలఁగ వాని వొళ్లెల్లా దోఁగిపోయ
కన్నెలార యీ కృష్ణునిఁ గంటిరటరమ్మ" 2-165

దోఁగు: అ.క్రి. దోగాడు, పాకు.
"మచ్చిక దోఁగెడు తాను ముద్దులు విరిచినాఁడు
పిచ్చిలఁ బూతకి చన్ను పీరిచినాఁడు" 3-235

దోబూచి: వి. చిన్నపిల్లలు ఆడుకునే ఒక ఆట. బూచి అంటే భూతమని అర్థం. వ్యవహారంలో బూచిగాడు, దొంగ అనే అర్థాలు ఉన్నాయి. చిన్నపిల్లలు ఏడుస్తున్నప్పుడు వారిని భయపెట్టి ఏడుపు మాన్పించడానికి, అదిగో బూచి, అద్దో బూచి అంటూ చెప్పే పదమే 'దోబూచి' అయి ఉంటుంది. తల్లులు సాధారణంగా తమ కండ్లకు అడ్డంగా చేతులుంచుకొని బూచీ అంటూ ఉన్నట్టులుండి కండ్లు తెరచి ఏడుస్తున్న బిడ్డల ఏడుపు మాన్పించి ఆశ్చర్యపరుస్తుంటారు. ఇలాంటి ఆటను దోబూచి అని, దాగిలిముచ్చులాట అని అంటారు. అన్నమయ్య ఈ పదాన్ని ఉపయోగిస్తూ కొన్ని పాటలు రాసినాడు. వాటిని 'దోబూచి పాటలు' అంటారు.
"బండి విరిచి పిన్నపాపలతో నాడి
దుండగీఁడు వచ్చె దోబూచి"

దోమటి: ఈ శబ్దానికి సూ.ని. వాచస్పత్యం, శ.ర. నిఘంటువులు అన్నం అనే అర్థాలు పేర్కొన్నాయి. నిఘంటువులు 'దోమటి' అనే 'టి' వర్ణంతో కూడిన పదాన్నే ప్రథమాంతంగా గ్రహించినట్లు భావించవచ్చు. కాని తె.వ్యు.కో. 'దోమడి' శబ్దాన్ని ప్రథమాంతంగా గ్రహించి 'వివాహ విందుభోజనము'నే అర్థాన్ని సూచించి "దొడ్డమేక పొలగూడు దోమటి దాడికినాడు" (6-43) అనే అన్నమయ్య ప్రయోగాన్ని ఉదాహరించింది. దీనిని బట్టి దోమటి అనేది దోమడి శబ్దానికి ఔపవిభక్తి రూప మని భావించాలి. కాని అన్నమయ్య 'దోమటి' శబ్దాన్నే ప్రథమాంతంగా గ్రహించిన ప్రయోగాలు కూడా కనిపిస్తున్నాయి. ఉదా :-
"తోడులు నీడలు నొక్క దోమటాయను" 7-273
"తొట్టిన వలపులెల్ల దోమటాయను" 21-308
అంతేకాక అన్నమయ్య 'దోమ(టులు)ట్లు' అనే శబ్దాన్ని పెక్కుచోట్ల ప్రయోగించినాడు. ఉదా :-
"తోడనే రతులకు దోమటులాయను" 29-258
"గోమున శ్రీవేంకటేశుఁ డిట్లానే
కూడి దోమట్లు గలయఁ గలిగితే" 28-149
"మతి యేటి సుద్దులు మమ్మడిగేవు నీవు
మెలసి మీ యిక్కువలు మించెను దోమట్లై"
8-174

పై ఉదాహరణవల్ల 'దోమటి'యే ప్రథమాంత రూపమనీ, దోమడి కాదని స్పష్టమౌతుంది. శృం.సం. 28 వ సంపుటం పీఠికలో శ్రీ కామిశెట్టి

శ్రీనివాసులు గారు దోమడి అంటే ఉత్సవ విందు అని తెలిపినారు. (పుట. 35) ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు ఈ పదం అర్థాన్ని చర్చిస్తూ ఈ కింది ప్రయోగాలను బట్టి ఇది ఔపవిభక్తికముగా తోచుచున్నది. కాని ప్రథమాంత రూపమునకు ప్రయోగములు కానరావు అని తెలిపినారు. (తా.క.ప; భాషా.వి; పుట 451) వారు చెప్పినట్లు 'దోమడి' అనే ప్రథమాంత ప్రయోగం కానరాదు. కాని పైన చెప్పబడినవిధంగా దోమటి అనే శబ్దమే ప్రథమాంతంగా వాడబడడంవల్లా, దోమట్లు అని బహువచనాంతంగానూ ప్రయోగాలు ఉండడం వల్లా 'దోమటి' శబ్దాన్నే ప్రాతిపదికంగా భావించవలసి ఉంటుంది. గొరిపద్ది సుబ్బరామశర్మ గారు శ.ర; సూ.ని; ఇచ్చిన అన్నము అనే అర్థం ఇక్కడ సరిపోదని 'దోమటి' శబ్దానికి మడ్డితనము, మొరటుతనము, దొమ్మి వంటివి కావచ్చునని సూచించినారు. (సం.ప.స. 24 సం. 431 పుట) బ్రౌన్ నిఘంటువులో దోమటి, దోమడి అనే రెండు శబ్దాలను చూపి దోమటి శబ్దానికి food, అన్నము అనీ, దోమడి శబ్దానికి a marriage feast attended by certain ceremonies and which only married people whose partners are alive can join అనే అర్థాలు చూపబడ్డాయి. దోమటిశబ్దం విశేషణంగాకూడా వాడబడింది. దీనికి సందర్భానుగుణంగా 'కపటస్వభావం కల' అనే అర్థం యుక్తంగా కనిపిస్తుంది.

"సాము సేసి సేసి మా చన్నులేల పిసికేవు
దోమటి బూతకి మీఁద తొడుకఁగ రాదా"
20-592

"దోమటి రాక్షసులు" 2-208

**దోమడి:** వి. వివాహపు విందుభోజనం. 4-423

**దోయడు:** (2) (దోయి + ఎడు) విణ. దోసెడు, అంజలి ప్రమాణంకల. (విచిత్రమైన ప్రయోగం)

"దోయఁడు చేతుల మొక్కి తూఁగుజెమటలతోడ
సోయగపుఁజూపులఁ జూచి చొక్కెని" 16-528

"దూపిలిన రతితోడఁ దోయఁ(యె)డు
చేతులతోడ
యేపున మున్నాఁడ విపు డేమయ్య విట్ఠల"
5-201

**దోసకారి:** (3) విణ. తప్పు చేసినవాడు.

"యీ సుద్దులకె కా నే నీయింటికి రాను వెఱతు
దోసకారి చెలికత్తెతోడి తెచ్చెఁగాని" 7-2

**దోసాలుగట్టు:** (3) అ.క్రి. నేరాలు మోపు, తప్పులు అంటగట్టు.

"యింతులచే మొక్కించి యేల దోసాలు గట్టేవు
చెంతల నేమి చెప్పిన సేసేనయ్య నీకు" 14-439

**దోసిటిపాలపెండ్లి:** వి. దోసిటి పెండ్లిపాలు కావచ్చు. దోసిలి నింపుకున్న పెండ్లి తలంబ్రాలు కావచ్చు. అవి చల్లడానికి అర్థములు.లేక దోసిటిపాల = దోసెడు తలంబ్రాలు గల, పెండ్లిన్ = వివాహంలో అనైనా కావచ్చు.

"దోమటిసతులతోనే దోసిటిపాలపెండ్లి
నీ మీఁదఁ జల్లఁగానీ చిత్తమిఁకను" 25-190

**దోసిలించు:** స.క్రి. దోసిలిగా చేర్చు, అంజలిగా కూర్చు.

"తూలెటి నెరులతోడ దోసిలించి మొక్కఁగాను
పాలుపడి దోసానకు భయమేల పుట్టదు" 8-292

**దోహాళజ్జుఁడు:** వి. (?)

"కంతుని తోట పూఁదీగె గాలి యనే దోహాళజ్జు
డంతటఁ బుట్టించఁ జేసినటువలె నున్నది"
7-410

## ద్రా

**ద్రావిడము:** వి. తమిళభాష.

"వరుసతో విణ్ణాపఁజీవారు తాళములంటుచు
సొరిఁబొరి ద్రావిడానఁ బొగడఁగాను" 18-281

## ద్రి

**ద్రిష్టపు మాయలు:** వి; బహు. పైకి కనిపించే మాయలు.

"తిరుగకుమీ విజ్ఞాన మా ద్రిష్టపు మాయలకును లోఁగి
సరి లే దితని పాదసేవకును సనకాదుల బ్రదుకే"
సాక్షి 2-41

**ద్రిష్టపు విరోధము:** వి. పైకి కనిపించే విరోధము.
"తెలియనా ఇంద్రియాలు దిష్టపు విరోధ మాట
తెలిసినాఁబోఁగువలెఁ దెంచరాదు" 3-362

**ద్రిష్టము:** (19) విణ. చూడబడింది.
"యిది మునుపె నీ చిక్కు యిందుకు ద్రిష్టంబొక్కటె
తుదఁదొల్లె నీ దాసులు గలరు తుదఁదొల్లియే నీవుఁ గలవు" 2-121

**ద్రిష్టవరదుఁడు:** విణ. ప్రత్యక్షంగా వరాలను ఒసగేవాడు.
"దేవ శ్రీవేంకటేశ్వర నీవు ద్రిష్టవరదుఁడవగుట
తావైన నీ కోనేటిదండ నొసఁగేయందే కంటిమి"
2-321

**ద్రిష్టాంతము:** (4) వి. 'దృష్టాంతము'నకు వ్యావహారిక రూపం. నిదర్శనం.
"ఇదివో ద్రిష్టాంతము యిచట మాయందే కంటి
యెదిరితే వెనకముందింతాఁ బెడరేచును" 7-194

**ద్రిష్టించు:** (3) స.క్రి. 'దృష్టించు'కు వికృతిరూపం, చూచు.
"తమతోడ వైష్ణవులు దాపుదండై వుండఁగాను
తెమలి తీర్థాలెల్లా ద్రిష్టించవలెనా" 3-219

**ద్రిష్టి:** (2) వి. 'దృష్టి'కి వికృతిరూపం. చూచు.
"నే మెటుల నుండినాను నీకేమీ
వేమరు మా మీఁది ద్రిష్టి విడువవు నీవు"
11-557

**ద్రిష్టిగోచరము:** విణ. దృష్టిగోచరం.
"దేవుఁడై పూజ గొను ద్రిష్టిగోచరమై
శ్రీ వేంకటాద్రిమీఁద సిరులొసగు" 2-417

**ద్రిష్టిదాకు:** (2) అ.క్రి. దృష్టి దోషం కలుగు.
"అలకించి చూడఁబోతే ద్రిష్టిదాఁకే నందువు
పలికితేనే బహుభాషి దందువు" 7-485

**ద్రిష్టిమంత్రము:** వి. దృష్టిదోషం పోవడానికి వేసే మంత్రం.
"ఘాతఁగరుణాకరుఁడై కరుణ ద్రుష్టివాఁడే
మా తరతరము ద్రిష్టిమంత్రము రక్ష" 4-54

## ద్రో

**ద్రోణము:** వి.(?)
"కమ్మటి బుసకొట్టేవు గరిడా నా జవ్వనము
దొమ్మిఁబట్టి తీసేవు ద్రోణమా జడ" 23-217

## ద్వ

**ద్వయము:** వి. ద్వయమంత్రం.
"శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే"
"శ్రీమతే నారాయణాయ నమః" అనే ఈ రెండు మంత్రములు. ఇవి క్రమంగా తిరుమంత్రంలోని నమః, నారాయణాయ అనే రెండు పదాలకు అర్థాన్ని వివరించడంవల్ల వీటికి ద్వయమంత్ర మని వ్యవహారం. పపన్నులగు వైష్ణవులకిది ముఖ్యమైనది. దీనికి మంత్రరత్నమని పేరు.
"తదియ్యగురుప్రసాదపురోడాశమిచ్చి
కొదదీర ద్వయమను కుండలంబులు బెట్టి"
2-148
"వెతలేని వీరల సాత్వికమే బ్రాహ్మణ్యము
తతి ద్వయాధికారులే తప్పరు బ్రాహ్మణ్యము"
2-486

## ద్వా

**ద్వాదశనామములు:** వి. (1) శ్రీమహావిష్ణువు యొక్క ప్రసిద్ధమైన పన్నెండు పేర్లు. అవి.
1. కేశవుడు 2.నారాయణుడు 3. మాధవుడు
4. గోవిందుడు 5.విష్ణువు 6. మధుసూదనుడు
7. త్రివిక్రముడు 8. వామనుడు 9.శ్రీధరుడు
10. హృషీకేశుడు 11. పద్మనాభుడు
12.దామోదరుడు. (2) వైష్ణవులు మేన ధరించే పన్నెండు ఊర్ధ్వపుండ్రాలు.
"తావుగ దేహమందు ద్వాదశనామములకు
పావిపోని సంకల్పమే శరణాగతి" 5-324

**ద్వాసుపర్ణ:** ద్వా సుపర్ణా అనే మంత్రం. "ద్వా సుపర్ణా సయుజా సఖాయా, సమానం వృక్షం

పరిషస్వజాతే, తయోరేకః పిప్పలం స్వాద్వత్త్యనశ్నంశ్చాన్యః అభిచాకశీతి" అనే జీవాత్మ పరమాత్మలను గురించిన ఋఙ్మంత్రం. (2.3.17) ఇది అనేక ఉపనిషత్తుల్లో కూడా ఉన్నది. ఎప్పుడు కలిసి ఉండే, పరస్పరం స్నేహం కలిగి ఉండే ఆత్మపరమాత్మ రూపమైన మంచి రెండురెక్కలు గల పక్షులు శరీరమనే ఒక వృక్షము పైననే కూర్చుని ఉన్నాయి. ఆరెండింటిలో ఒకటి (జీవాత్మ) కర్మతో గలిగిన శరీరం అనే చెట్టుయొక్క పండును బాగా తింటుంది. రెండోపక్షి (పరమాత్మ) ఆ కర్మలనుండి దూరంగా ఉంటూ అంటే ఫలాన్ని అనుభవించకుండా కూడా సంతోషంగా వెలుగుతుంది" అని దీని భావం.

"నిండిన యీ జీవులు నీవేయన వెఱతును

దండనే బద్ధులు వీరు ద్వాసుపర్ణ వున్నది గాన" 2-121

## ధ

**ధనుర్మాసము :** వి. శ్రీవైష్ణవులకు అత్యంత విశిష్టమైన మార్గశీర్షమాసం.

"పులుగాలు పచ్చళ్లు బోనము వెట్టినదిదే

వెలయు ధనుర్మాసవేళయు నిదే" 3-484

**ధర్మదార :** వి. యుద్ధం పూర్తి అయిందని సూచించడానికి ఊదే బాకా.

"ఈడనే ధర్మదార మీ కీఁకనైనాఁ బట్టవో" 2-40

**ధర్మపుణ్యము :** (2) వి. ధర్మము, పుణ్యము, ద్వంద్వసమాసమైనా బహువచన ప్రత్యయమైన 'లు' చేరనిరూపం.

"చేరి ధర్మపుణ్యము నీ చేతిదిగాక

యీరసాన నిందరిలో నేమనేదిరా" 13-63

**ధవళము :** వి. ధవళగీతం. ఇది ఒక మంగళగీతం. జయ శబ్దాన్వితంగా ఉండడం, ఆశీర్వాదాత్మకంగా ఉండడం, వివాహసమయంలో పాడబడడం, షష్ఠ్యంతంగా ఉండడం ధవళలక్షణంగా భావించవచ్చు.

"కమలారమణికిఁ గమలాక్షునకు

మమతల జయజయ మంగళము

అమరజననికిని అమరవంద్యునకు

సుముహూర్తముతో శుభమంగళము" 1-448

## ధా

**ధావతి :** వి. త్వర, ఆరాటం, ఆయాసం.

"ధావతులేఁటికి మానుఁదనుభోగాలుండఁగాను

మోపరాని చింతలతో ములుగుఁగాక" 4-61

**ధావతి :** వి. ప్రేమ, భయం, అత్యాసక్తి.

ప్రేమ :

"ధావతిఁదలిదండ్రులు తమ బిడ్డల తనువులఁ బంకములంటనను

యే విధముల నీరార్చి వెంతురటు ఇన్నిట నీవే

గతి నాకు"3-392

భయం :

"భావించి చక్రమీతఁడు పట్టితే నసురలెల్ల

ధావతితోడుతను పాతాళము వట్టిరి" 7-220

**ధావతి :** విణ. దుడుకైన.

"ధావతికర్మము-తప్పఁదీసినా

దైవము గావక తలఁగీనా" 4-60

**ధావతియాసలు :** వి; బహు. ఆరాలుపెట్టే ఆశలు.

"గోవిందుఁడ నినుఁ గొలువఁగనేరకే

ధావతియాసలఁ దగిలితిని" 3-182

## ధ్రు

**ధ్రువపట్టము :** వి. స్థిరమైన స్థానము.

"కట్టెను ధ్రువపట్టము కమలజుకంటే మీఁద

కట్టె విభీషణునకు లంకారాజ్యము" 4-255

"శ్రీవేంకటేశు దాసులు చేసినదెల్లా సృష్టి

యేవంకా ధ్రువపట్టమే ఇటువారికి" 3-119

**ధ్రువమండలము :** వి. ధ్రువనక్షత్ర విశేషము గల మండలము.

"వుదయాస్త శైలములు వొక జంగగాఁజూచె

అదివో ధ్రువమండల మందె శిరసు" 4-509

## న

**నంగతనము :** వి. సాహసపు పని చేసి తెలియనట్లుండే స్వభావం, నంగనాచితనము .
"అంగజు శరమువంటి అతివె నీకు
నంగతనమిది యాల నవ్వనమ్మా" 26-112

**నంజుపంటి పాము :** వి. విషపుకోరలు గల పాము. (నంజు = విషం)
"నల్లని నా యారు యిది నంజుపంటి పామట"
3-375

**నంటు :** (35) వి. స్నేహం (స్నేహితుడు, సంపర్కం, తాకుడు, బంధువు, ఆసక్తి, శ్రద్ధ, నాణెము, నాణ్యత, నాగరికత.)
"నంటున శ్రీవేంకటేశ నామ తక మెరగవు
దంట వయసువాఁడవైతె తప్పొప్పు లేదా"
21-367
"నంటున నీవు నవ్వఁగా నడుమ నీకొజ
జంటయైన పతినేల జంకించేవే వీడే" 25-129

**నంటుమాటలు :** వి; బహు. స్నేహపుమాటలు.
"నవ్వులకు నీతోను నంటుమాట లాడితేను
రవ్వగాఁ జెప్పేవు తోడిరమణులతో" 25-210

**నంటువాడు :** వి. స్నేహితుడు .
"పానుపుపై నీవు నన్నుఁ బాయకుండితేఁ జాలు
నానారతుల నాకు నంటువాఁడవే" 20-489

**నంటువావి :** వి. స్నేహపు సంబంధం.
"కంటిమి నీ జాడలెల్ల కడు దిష్టమాయను
నంటువావులు ముమ్మడి నాఁగు కిచ్చేవు"
23-355

**నంటుసేయు :** (11) అ.క్రి. స్నేహంచేయు .
"నగే వంతలోనె నిన్ను నంటుసేసుక
సొగసి యాపె గుట్టు సోదించరాదా" 28-442

**నందలూరు :** వి. నెందలూరు కావచ్చు. 20-175

**నఖచంద్రులు :** వి; బహు. నఖక్షతాలు. (అర్ధచంద్రాకారంలో ఉండే గోటి గుర్తులు)
"తప్పక నఖచంద్రులు తనువులపై నించఁగా
విప్పుచు చిరునవ్వుల వెన్నెలలు గాసెను"
18-187

**నగజవరదుఁడు :** వి. విష్ణుమూర్తి (నగజము = గజం, నగంలో = పర్వతంలో, జ = పుట్టింది అని వ్యుత్పత్తి) గజేంద్రునికి వరమిచ్చినవాడు.
"నగధర నందగోప నరసింహా వో
నగజవరద శ్రీ నారసింహా" 1-259

**నగరి :** వి. చిత్తూరు జిల్లాలోని తాలూకా కేంద్రం. ఇట నృసింహస్వామి దేవాలయం ఉంది.
"నగరిలో గద్దెమీఁది నరసింహము వీఁడె
నగుచున్న జ్వాలానరసింహము" 4-182

**నగళ్ళవారు :** వి; బహు. అంతఃపురాల్లోనివాళ్లు .
"విచ్చనవిడియైనట్టి వేడుక నగళ్ళవారు
అచ్చమైన నీ సేవ సేయ నందమౌనయ్యా"
29-115

**నగవుసేయు :** అ.క్రి. నవ్వు.
"తగవెరిఁగినవాఁడు తారుకాణించఁగ నాతో
నగవుసేసుక నన్ను నమ్మించరాదా" 11-244

**నగవు సేసుకొను :** అ.క్రి. నవ్వు.
"నగవుసేసుకొని నలినాక్షి గోరంటితే
తగవులఁబెట్టే వేల తరుణులతో" 23-351

**నచ్చికలు బుచ్చికలు చేయు :** స.క్రి. మాటలతో బేలు పుచ్చు, నమ్మికలు చేయు అని తె.జా.

**నచ్చు :** (6) వి. 1. బాధ 2. ఆలస్యము, మాంద్యము .
"నచ్చు నా మనసొట్టు నమ్మించేవు" 12-3
"వచ్చితివి వలచి మా వాకిటికి నీవు నేఁడు
నచ్చులఁబురసతులు నవ్వకుండేరా" 27-249

**నచ్చుకొట్టు :** (8) అ.క్రి. బాధపెట్టు.
"కొచ్చి చూడ దొరకొంటి కొద్దివెట్ట వచ్చునా
నచ్చుకొట్టి మర్మాలెల్లా సాటుఁగాక" 29-529
"విచ్చనవిడాయ నీకు విభుఁడింటికి రాఁగాను
నచ్చుకొట్ట నేల యిఁక నవ్వఁగదవే" 29-78

**నచ్చుకొను :** స.క్రి. ఇష్టపడు, ఇట 'కొను' అనుబంధక్రియ చేరడం విశేషం.

"మచ్చికతోడుత నీవు మాటలాడఁగాఁజూచి
నచ్చుకొని కొంతగొంత నవ్వీ నాపె" 13-76

నటన: వి. నటించుట, కృత్రిమప్రవర్తన.
"అటుగననే రోయఁగదగదా
నటనల శ్రీహరి నటమింతే" 2-71

నటము: వి. నటనము ; నట్ ధాతువుపై భావార్థంలో అచ్‌ప్రత్యయం రాగా ఏర్పడిన విలక్షణ ప్రయోగము.

నట్టింటి వైరము: వి. అందరికీ తెలిసిన శత్రుత్వం. 2-72
"వెట్టిమోపరిలాగు వెత్తివోయిన వోక
నట్టింటివైరంబు నగుఁబాటుబ్రదుకు" 1-71

నట్టుకొట్టు: (11) అ.క్రి. సంకోచించు, సందేహించు, వెనుదీయు, ఆలస్యంచేయు. స.క్రి. అడ్డుకొను, నిరోధించు. 26సం. పీఠికలో దీనికి 'వివరించు' అనే అర్థం సూచించినారు. (పుట 9) ఈ అర్థం అంత సమంజసంగా కనిపించదు.
"నిట్టూర్పు నించినది నిండాఁ జెమరించినది
నట్టుకొట్టి ఆకెఁగొంత నవ్వించరాదా" 26-70

నట్టుకొను: (3) అ.క్రి. నెలకొను (పద.) తావు విడువక ఉండు (ఆం.ధా.పా.), నివసించు.
"నట్టుకొన్న రెండువేలు నాలుకల శేషుఁడు
నెట్టన హరిఁబొగడ నేరుపరి శేషుఁడు" 3-365

నడగొండ: (నడ + కొండ) వి. నడక గల కొండ.
"నానావర్ణముల నడగొండవలెను
దానవారి తే రదె తగ తిరువీథుల" 4-55

నడచే కాలము: వి. వర్తమానకాలం.
"యెంచి నడచేకాలమే యిందరికి నుంబళి
తెంచి యెచ్చుకుందు లిందుఁ దెలుప నేముంది" 2-310

నడపు: (3) (నడచు + పు) నడక.
"నునుపు నడపుల యేనుక పెద్ద యడవి
చెనకు నట్టనడిమి సింహపుటడవి" 5-153

నడమ: 'నడుమ'కు వ్యావహారికరూపం.
"కడుఁగాంక్షలు నా సొమ్ము కర్మములు
నడమ నంతర్యామివి నాకు నీవు" 3-200

నడిమిగోపురమాడ: నడిమి గోపురం దగ్గర. గోపురం దగ్గర అనే అర్థంలో గోపురమాడ అని ప్రయోగించడం విలక్షణం. ఇట్లే 'నీడ దిరుగని చింతాడ' అనే ప్రయోగం కూడా.
"చేరువయై కృపసేసీ నిదివో
కూరిముల నడిమిగోపురమాడ" 2-320

నడిమిగోపురము: వి. తిరుమల లోని శ్రీవేంకటేశ్వరస్వామి ఆలయం మూడుగోపురాల్లో రెండవది.
"చేరువయై కృపసేసీ నిదివో
కూరిముల నడిమిగోపురమాడ" 1-320

నడివీదిపెసర: (2) వ.బం; వి. నడివీధిలో నుండే పెసర. నిలువనిది. నడివీధిలో నుండే పెసరు పంట ఆ వీధిన వచ్చిపోయే వారికే చెల్లుతుంది. కాని చేను గలవానికి దక్కేది కొద్దిమాత్రమే. నిరర్థకమన్నమాట
"గడిరాజు బదుకాయ కడిలేని మనసు
నడివీదిపెసరాయె నయమైన మనసు" 1-337

నడుకొత్తు: (నడుకు+ఒత్తు) అ.క్రి. అందరికీ లభ్యమయ్యేది అని తె.వ్యు.కో., నిర్భయుడగు అని వావిళ్ల. సరిగా ఉన్నట్లు లేదు. ఇంకా విచార్యం అని పద.
"యెడయక శ్రీవేంకటేశ యీకెఁ గూడితివి
నడుకొత్తి నిచ్చకల్యాణమువలె నున్నది" 7-464

నడుమంతరము: వి. మధ్యకాలం.
"వడిఁ జంకించేనంటా వచ్చి నీ మాటలు విని
నడుమంతరాలనే నవ్వె నిపుడు" 21-241

నడుమంతరములవారు: వి; బహు. మధ్యకాలంలో వచ్చినవారు.
"నవ్వే దెలిఁగడు నడుమంత్రములవారు
చివ్వనఁ దనలోని సిగ్గువడవలదా" 20-47

నత్తు: అ.క్రి. తడబడుతూ మాట్లాడు
"అత్తి శ్రీవేంకటపతి ఆదరించి కూడితివి
పొత్తు నత్తఁ గూడె నీఁక బూటకమేలయ్యా" 26-7

**న దైవం కేశవాత్ పరమ్ :** విష్ణుమూర్తి కంటే పరదైవం లేదు అని అర్థం.
"వాదుల 'న దైవం కేశవాత్ పర'మని తొల్లి
వేదవ్యాసులనిన విభుఁడీ హరి" 15-237

**ననుచు :** (2) అ.క్రి. ప్రీతిచెందు, ఇష్టపడు, ప్రియమగు.
"మనసు వచ్చితే మాటాడుటే మేలు
ననుచకున్న మోనము మేలు" 7-16
"ననుచనిచోటను నంటు సేయఁదలఁచితే
అనుమానమె కాని అమరిక రాదు" 7-366
2. వృద్ధినొందు, అతిశయించు :
"ఘనబంధమోక్షులకుఁ గారణమిఁక నెవ్వరు
ననిచిన జ్ఞానాజ్ఞానములే కాక" 2-174

**ననుపు :** వి. ఇంపు, అతిశయం.
"పెనఁగులాడుతా నీతో బిగిసేదాననా
ననుపులసరసాల నవ్వితేఁగాక" 16-444
"ననుపుగాని పొందు నవ్వించ వసమా
అనఁగొపెనఁగుమని యందురుగాక" 27-189
2. అనురాగం :
"ననుపు గలిగితేనే నవ్వు లింపులౌ గాఁక
మనసొకచోట నుంటే మరి యేఁటికే" 14-484

**ననుపుకత్తె :** (ననుపు + కత్తె) వి. ప్రియురాలు, విటురాలు.
"ఏమే విచారించే వెంతవని గద్దు నీకు
నాములు వార నవ్వేటి ననుపుకత్తెలము"
27-195

**నప్పు :** స.క్రి. నడపు, ప్రవర్తింపుజేయు.

**నప్పుట :** వి. సరిపోవడం.
"కపటము లేఁకనేల కన్నుల నప్పుటగాక
యెపుడును నావంటి యిల్లాలికి" 12-36

**నమకచమకాలు :** వి; బహు. రుద్రదేవతాకములైన మంత్రాలు.
"నమకచమకహిత నారసింహా వో
నముచిసూదనవంద్య నారసింహా" 1-259

**నమలిపురి :** వి. 'నెమలిపురి'కి వ్యావహారికరూపం, నెమలిపింఛం.
"పేగుల జంద్యాలు వేసి పింఛపు నమలిపురి
పొగగాఁజుట్టిన నా బాపనయ్య వీఁడివో" 5-254

**నమలీక :** (నమలి + ఈక) వి. నెమలి యీక
"కొప్పు గేదఁగులు మాకు కొన నమలీకలు
గొప్ప ముత్యాలివి మాకు గురిగింజలు" 5-121

**న మే భక్తః ప్రణశ్యతి :** భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యం. నా భక్తుడైనవాడు నశించడు అని అర్థం.
"న మే భక్తః ప్రణశ్యతి" యను మాట
అమోఘమై నీ వానతియ్యఁగా" 15-45

**నమ్మికె :** (2) వి. నమ్మకం (క. నంబికె)
"చుట్టమైనవాఁడు తన చోటికి నమ్మికెగాక
వెట్టివాఁడు సతమౌనా వేగినంత తాను" 15-446

**నయగారము :** వి. విలాసం, ప్రియవాక్యం, మనోజ్ఞత, అలంకారం, మంచితనం, మృదుత్వం.

**నయగారి :** (4) వి. మృదుత్వం కలవాడు, మృదువుగా మాట్లాడేవాడు.
"చిన్న చెక్కులమీఁదటి చెనకులు కొనగోర
మిన్నక చిమ్మీనెంత మేఁటినయగారి" 29-524

**నయగారితనము :** (9) వి. మృదుత్వం, మృదువచనం.
"నియతిఁబరపు చూచి నీవని పాదము చాచు
నయగారితనాల సన్నలు సేసి కొందరు"
28-521

**నయగారిమాటలాడు :** అ.క్రి. మృదువైన మాటలు పలుకు.

**నయగారివాడు :** (4) వి. మృదుత్వం కలవాడు, మృదువుగా మాట్లాడేవాడు.
"నయగారివాని మతి నాఁటదు నిష్ఠూరము
క్రియగూడఁ దనకు మొక్కితి ననరే" 25-250

**నయమెక్కు :** అ.క్రి. వృద్ధిచెందు. (వ్య.)
"మోనమున నుండనేలే మొకము వంచఁగనేలే

నానఁబెట్టితే వలపు నయమెక్కినా" 20-317

**నరకమే కురియు :** ప.బం; అ.క్రి. ఎక్కువగా కష్టాలువచ్చు.

"దరి చేరుటా లేదు తగులు లేదు
నానాఁడు నరకమే కురిసీని నా బ్రదుకు" 3-110

**నరమిగొను :** (?)

"అరగునా దుర్వ్యలున కరుణైన యున్నంబు
కురుచబుద్ధులను నరమిగొనుఁగాక" 1-242

**నరమృగదేవుడు :** వి. నృసింహస్వామి, నరమృగముల రూపాలుకల దేవుడు.

"చెనకి యహోబలాన శ్రీవేంకటాద్రిమీఁద
ననిచె శ్రీ మహాలక్ష్మి నరమృగదేవుని" 9-217

**నరుమగు :** అ.క్రి. నలినలియగు.

"నసికొట్లఁ గోడెచేత నరుమాయెను
శిశువింతయు" 12-238 old

**నఱకము :** వి. నరకము. బండి 'ఱ' విలక్షణం.

"నెటి నఱకములో నాని తివియుఁ గొన్నాళ్లు
తఱవాయి తెలుసుకో దానికేమి" 3-331

**నఱుజు :** వి. చిన్నది, అణువు.

"గురిగా నేఁ బాడఁగాను కొనగోరఁగిలిగించి
నఱుజుగా నెలవుల నవ్వింపించీనే" 23-50

**నలఁకువ :** వి. ఆపద, కష్టం, శ్రమ, బాధ.

"ఇల దుర్గుణముల కీ జన్మంబున
నలఁకువ సేసీఁబో నా వ్రాఁత" 1-189

**నలినలిగా :** క్రి.విశే. నుజ్జునుజ్జుగా.

"తలవంచుకొని నీ దగ్గర నే నుండఁగానే
నలినలిగా నన్ను నవ్వించేవా" 21-154

**నలినలిసేయు :** ప.బం; స.క్రి. నుజ్జు నుజ్జు చేయు.

"నలుగడఁజూచి చూచి నరహరి మోవి
నలినలిసేతురా నరహరి" 7-229

**నలిరేఁగు :** ప.బం; అ.క్రి. విజృంభించు.

"సొలసి సొలసి నిన్నుఁ జూచిన యా చెలిచూపు
నలిరేఁగి నీ మతిలో నాటకుండీనా" 9-200

**నలుమడి :** (నలు + మడి) వి. నాలుగింతలు. (ఇనుమడి వంటిది)

"మెచ్చితిమి నీ కూటమి మీఁదమీఁద
మేలాయను
పెచ్చురతి నలుమడి బేరమాడేవు" 23-355

**నలువు :** వి. 1. ఒప్పిదం 2. సామర్థ్యం విశే. ఒప్పిదమైన.

"పలుప్రియములు చెప్పి పదివేలగా నీకు
నలువునఁదనమూరు నన్నే మొక్కుమనేను"
27-520

"చెలఁగి పాపములు మించినవేళ హరి
నలువు నామోచ్చారణంబు గలుగుమీ" 2-416

**నల్లఁదెల్ల :** నల్లదనం – తెల్లదనం(?)

"నలువైనా కన్నులందు నల్లఁదెల్ల గలిగిన
నెలకొని మెచ్చు మెచ్చ నీకుఁబోదుగా" 23-507

**నల్లఁబూసలు :** వి; బహు. నల్లపూసలు. కొందరు ముత్తైదువలు గ్రుచ్చి మెడను గట్టుకునే చిన్న నల్ల గాజుపూసలు. (శ.ర.)

"చేరి చేరి యేఁటికిఁ జేసేవు బాసలు
నారుకొనఁగట్టితివి నాకు నల్లఁబూసలు" 18-531

**నల్లఁబ్రజ :** వి. ఆటవికజనం, కిరాతులు, సైన్యంలోని బోయవారు. వీరంతా కాయకష్టం చేయడం వల్ల నల్లగా ఉంటారు కనుక వీరికి నల్లఁబ్రజలనే వ్యవహారం వచ్చి ఉంటుంది.

"కాముఁడు గురు లేయఁగా కడనుండి నల్లఁబ్రజ
దోమటి నెఱుకరాను తొడఁగినట్లుండె" 23-157

"నల్లప్రజలు లక్షకున్ను నెలనెలకు తప్పక సంబళం
దిద్దుమని వొక కర్దీకం యేర్పాటు చేశి" అని రాయవాచకప్రయోగం. (31 పు. 3 లైను)

"పార్శ్వభాగముల నల్లప్రజ గ్రుమ్ముకొనన్ - - - జెంచు
పాళెగాఁడమ్మను జేంద్రుకొల్వునకు - - - వచ్చె" అని శు.స. ప్రయోగం.

**నల్లతిండి :** వి. చిరుతిండి.

"నల్లతిండౌ మరి మీఁద మరగితే రోఁతతా

వుల్లమిచ్చే వేంకటేశు వొద్ది కిటువంటిది" 1-189

**నల్లతెల్ల జల్లివాఁడు :** వి. నలుపు తెలుపు రంగు గల కుచ్చు గలవాడు.

"అరయ నరసేసి నల్ల తెల్ల జల్లివాఁడ

యిరవై జీతముసేసి - - - -" 15-39

**నల్లదీవి :** వి. జంబూద్వీపం.

"తిరముగ నల్లదీవిఁ దెచ్చిన యర్థ మిదివో

విరజ వోడరేవున వెళ్ళినర్థము" 2-3

**నల్లబల్లి చెన్నుఁడు :** వి; చూ : నల్లబల్లి చెన్నకేశవుడు.

"నల్లబల్లి చెన్నుఁడా నవ్వేవు సారె సారె

ఇల్లిదె చూతువుగాని యిందు రావోయి" 24-161

"నగు శ్రీవేంకటగిరి నల్లఁబల్లిచెన్నుఁడా"

**నల్లబల్లి చెన్నకేశవుఁడు :** (3) వి. కడపజిల్లా నల్లబల్లి అనే గ్రామంలో వెలసిన చెన్నకేశవస్వామి. ప్రస్తుతం ఆలయం పునాదులు తప్ప మరేమీ లేవు. స్థానికుల అభిప్రాయం ప్రకారం ప్రధానాలయం పూర్తిగా పాడుబడిపోయిందట. కొన్ని వందల సంవత్సరాలుగా వృథాగా ఉన్న ఈ మధ్యప్రదేశంలో ఇల్లు కట్టుకున్నారు. అన్నమయ్య నల్లబల్లి చెన్నకేశవుపై ఐదు కీర్తనలు చెప్పినాడు.

"చేకొనుమీ నల్లబల్లి చెన్నకేశవా

యీకడ నీ కిన్నిటి మొక్కేను స్వామి" 7-534

"నల్లబల్లిచెన్నుఁడా నవ్వేవు సారె సారె

ఇల్లిదె చూతువుగాని యిందు రావోయి" 24-161

**నల్లముసుఁగు భూతము :** వి. నీలాంబరధారి యైన బలరాముడు.

"జూంటరి నల్లముసుఁగు భూతము" 1-109

**నల్లెడంత :** (నల్లె + ఎడు + అంత) జానెడంత, నాలుగు అంగుళాల పరిమాణమంత.

"నడుమ నే నల్లెడంత నాలికెవాఁడ నింతె

వుడివోని సుద్దులెల్లా నుగ్గడించేను" 2-427

**నల్లెడ :** వి. కడుపులో మేతపొట్టకు పైన ఉండేది, నెండె, అది వాచి ఊపిరితిత్తులకడ్డం పడి శ్వాస ఆడక పశువు చనిపోతుంది.

"పొదలుచు మృత్యువు పందివోటై నల్లెట నాడఁగ

పదిలముగాఁ గింకరులను చొప్పరులఁ బరవిడిచీ" 1-298

**నల్లెడు :** విణ. జానెడు (నల్లె = జేన అని శ.ర.)

"పూని నల్లెడునాలికలో నుండు శ్రీవేంకటేశుఁ

డానుకొని బత్తితోడ నటు నిల్పిరో" 4-475

అని తిక్కన ప్రయోగం. (ద్రోణ. 5-317)

**నల్లెడేసి గోళ్లాపె :** వి. జానెడంత గోళ్లుగలిగిన స్త్రీ.

"నల్లెడేసి గోళ్లాపె ననుపులు నీకుఁజేసీ

ముళ్ళెడేసి నవ్వులాపె మోము చూపీని"

16-558

**నవకము :** (2) వి. మృదుత్వం.

"నవకమై లాలించితే నవ్వులు నవ్వనేరుచు

నివిరి ఇంకా నేమైనా నేరుపు మీ దెక్కును"

22-186

**నవనారసింహుడు :** వి. తొమ్మిదిరూపాల్లో దర్శనమిచ్చే అహోబల నృసింహస్వామి. ఆ తొమ్మిది రూపాలు : 1. జ్వాలా నరసింహుడు (ఎగువ అహోబలానికి మూడుమైళ్ళదూరంలో ఎత్తైన ప్రాంతంలో నెలకొన్న స్వామి.) 2. వీర నరసింహుడు. (ఈ స్వామి కొండపై ఒక గుహలో చక్రాకారంగా కొండనీటిధార అడుగు భాగంలో ఒక అరుగుమీద పదిభుజాలు కలిగి ఉన్నాడట) 3.యోగానంద నరసింహ స్వామి. (చిన్న అహోబలానికి ఆగ్నేయదిశలో రెండుమైళ్ల దూరంలో వెలసిన స్వామి.) 4.కానుగుమాని నరసింహస్వామి. (దిగువ, ఎగువ అహోబల మార్గం మధ్యలో వెలసిన స్వామి. కానుగమాను కింద ఉండటంవల్ల కానుగమాను నరసింహుడుగా ప్రసిద్ధుడైనాడు.) 5.మట్టెమళ్ల నరసింహస్వామి. (పెద్ద అహోబలానికి నాలుగు మైళ్లదూరంలో ఉన్న మట్టెమళ్ల అనే ఊరిలో బీభత్సమూర్తిగా వెలసిన స్వామి.) 6.భార్గోటి నరసింహస్వామి. (చిన్న అహోబలానికి సుమారు మూడుమైళ్ళ దూరంలో భార్గవతీర్థం అనే క్షేత్రం ఉంది. అక్కడికి సమీపంలో ఒక

కొండపై ఈ స్వామి వెలసి ఉన్నాడు.) 7. ప్రహ్లాద నరసింహస్వామి. (ఎగువ అహోబలంలో శ్రీ నరసింహస్వామికి ఉగ్రస్తంభానికి మధ్యలో వెలసిన స్వామి.) 8. లక్ష్మీనరసింహ స్వామి. (శ్రీ వరాహస్వామి సన్నిధికి ఎగువగా సుమారు రెండుమైళ్లదూరంలో ఉన్న స్వామి.) ఈ స్వామికి మాలోల నరసింహస్వామి అనే వ్యవహారం ఉంది. మాలోలుడంటే లక్ష్మీప్రియుడని అర్థం.
9.వరాహనరసింహస్వామి. (ఎగువ అహోబలం నరసింహస్వామి ఆలయానికి వెళ్ళే దారిలో భవనాశిని తీరం ఒడ్డులో వరాహరూపుడై దర్శనమిస్తుంటాడు. "జ్వాలాహోబల మాలోల క్రోడకారంజ భార్గవా, యోగానంద ఛత్రవట పావనా నవమూర్తయః" అని నవనారసింహులను పెద్దలు కీర్తించినారు.
"నవనారసింహ నమో నమో
భవనాశితీర యహోబలనారసింహ" 1-453

నవ్వుఁబాటు: వి. నగుఁబాటు, నవ్వుల పాలగుట.
"ఘనుఁడ శ్రీవేంకటేశ కైకొంటివి ఇంతిని
ననుపు చెలుల పొందు నవ్వుఁబాటు సుమ్మీ"
19-483

నవ్వులకైనా: వి.బం. ఏమాత్రమైనా, కొద్దిపాటిదైనా, పరిహాసానికైనా.
"నవ్వులకైనాను నా మాట మీరని నిన్ను
యెవ్వతెరా నిన్ను నింతగాఁ జేసినది" 10-2-97

నవ్వులు చేయు: ప.బం; స.క్రి. పరిహసించు, అపహసించు.
"ఎవ్వరినైనను యీవ్రాత నను
నవ్వులు సేసెఁబో నా వ్రాత" 1-233
"నవ్వుసేసుకొంటేనే నానును వలపులెల్ల
చివ్వనఁ గోపించుకొంటే చేరుఁగూళతనము"
21-257

నవ్వులుమియు: ప.బం; అ.క్రి. నవ్వులు వెదజల్లు.
"నంటు మీఁజే సెలవుల నవ్వులేల వుమిసేవే
గెంటు లేని కన్నులను కెంపులెక్కని" 9-44

నవ్వులు సేసుకొను: ప.బం; అ.క్రి. అపహసించు, నవ్వులపాలుచేయు. (వ్య.)
"నవ్వులు సేసుకొనక నాతులతో జగడించి
పువ్వుమొన వాడి సేసే పురుషుడూఁ గలడా"
7-54

నస: వి. 1. దురద, ఉపద్రవం, కామం.
"నసతో శ్రీవేంకటపతి నన్ను నిటు గూడె
నస చేసి నాతోను నవ్వీనటా" 11-183

నసకాఁడు: వి. కామోద్రేకం కలవాడు.
"కన్నెలు దన్నెత్తుకొంటె కాఁగిటి చవులు చూపీ
యెన్నిట తా నసకాఁడె యీ కృష్ణుఁడు"
11-121

నసగొంటు: వి. కామోద్రేకము కలవాడు.
"చెనకనేమో మీపై చేతులు చాఁచఁగ నీదే
ననిచి వుండరే మీరు నసగొంటు వీఁడు"
25-365

నసికాట్లు: వి; బహు. కామోద్రేకపు కాట్లు.
"బెట్టుగాఁగాఁగిట నిన్ను బిగియించుకొంట గాక
నట్టుకొట్టి మోవిమీఁది నసికాట్లా" 7-303

## నా

నాఁగు: వి. ధాన్యమునకు వడ్డిగా ఇచ్చు ధాన్యము.
"నాగులెల్లఁ దీర మాచనవోలి చెన్నుఁడవై
మూఁగితి శ్రీవేంకటేశ మోవి యిచ్చేఁ గాక"
21-495

నాఁగువారు: (11) ప.బం; అ.క్రి. వృద్ధిచెందు, అతిశయించు, వడ్డీవాఋ వంటి శబ్దం.
"చేఁగదేరఁగూడితివి శ్రీవేంకటేశు నిట్టె
నాఁగువారు మీ గుణాలు నమ్మ నెట్టు వచ్చునే"
22-103

నాఁగేలు: (3) వి. 'నాగలి'కి మాండలికరూపం.
"వేవేలు దొడ్లకాడ వెలుఁగులు వెట్టిపెట్టి
కేవల మితనికి నాఁగేలూ వొకటే" 21-156

**నాటకీఁడు:** (నాటకము + ఈఁడు) వి. నాటకమాడువాడు, నటనలు చేసేవాడు. ఇందులోని అరసున్న పొరపాటేమో ?
"నాకెంత ప్రియము చెప్పీ నాటకీఁడు
కైకొని పొదిగీ నట్టే కాతరీఁడు" 13-501

**నాటకుఁడు:** (7) వి. నాటకీఁడు, కపటోపాయాలు పన్నేవాడు, నటనలు చేసేవాడు.
"యేఁటికి నవ్వితివయ్యా యెఱఁగము నే మా పని
నాఁటకుడ వే మందుకునైనా వచ్చును" 23-208

**నాఁటించు:** (4) స.క్రి. నాటఁజేయు, నాటు, ఒత్తు.
"ఏఁటికిఁ జేరీ నే మితఁడు
నాఁటించు రతి నన్నేలె" 5-100
"నాఁటించేవు చన్నులను నవ్వేవు సెలవులను
యేఁటికే యీ పగటులు ఇరుదెసలా" 27-169

**నాఁటుఁజేయు:** (2) స.క్రి. పాతుకొనునట్లు చేయు.
"రతిరాజు నమ్ములివి రంటదెప్పరపు వేళ
కతుకున నాఁటుఁజేసు గవిశన నిడరే" 11-221

**నాకు నాకే:** స్వయంగా, ఇతరుల ప్రమేయం లేకుండా.
"నన్నుఁజూచి నాకునాకే నవ్వు వచ్చీని
మిన్నక నా జవ్వనమే మేరలు మీరఁగను"
28-367

**నాగముపేరిటి నాఁతి:** వి. గజలక్ష్మి(?)

**నాగవల్లిపెండ్లి:** వి. పెండ్లిలో నాలుగవరోజు జరిగే తంతు.
"సతికి నీ కూటమి సారె నాగవల్లి పెండ్లి
మతకపురతులకు మానని జిడ్డు" 23-327

**నాగవల్లి సోబనము:** వి. నాగవల్లి శుభకార్యము.
"వంటుతోడి సరసాలు నాగవల్లి సోబనాలు
పెంటలైన సమరతి పెట్టిన పేఁ(పీఁ)ట" 19-199

**నాగవెల్లి:** (2) వి. 'నాగవల్లి'కి వ్యావహారికరూపం. పెండ్లిలో నాల్గవరోజు జరిగే ఒక శుభకార్యం. 'నాకబలి'కి వికృతిరూపం.
"నేఁడే నాగవెల్లి నేఁడే యిల్లునింపులు
పోడిమి గోవిందపతి భోగించీ నిదివో" 20-558

**నాగవెల్లి కట్నాలు:** వి; బహు. నాగవెల్లి సందర్భంగా పెట్టే కట్నాలు ; చూ: నాగవెల్లి.
"చందనకావులు నీకు సరిగట్ట నంపె నమ్మ
యిందు నాగవెల్లి కట్నా లింతలోనే వచ్చెనా"
7-55

**నాగశయనపువాఁడు:** వి. విష్ణుమూర్తి, సర్పశయనంపై పవ్వళించేవాడు.
"నాలుగు చేతులవాఁడు నాగశయనపువాఁడు
బేలుఁదనమున సరి పెనఁగేనా" 21-3

**నాచారి:** వి. దేవత, అమ్మవారు. రూపాం. నాంచారు, నాచ్చారు, నాచ్చియార్.
"తల్లి దండ్రి దాత గురువు తానై యైన నాచారి
వల్లభుండు నాకు మేలువంటి దాయ జన్మము"
1-186 & 1-121

**నాచారు:** వి. దేవత, అమ్మవారు (స్త్రీ) రూపాం. నాచారి, నాచ్చారు, నాంచారు.

**నాచుఁబాము:** వి. పసరికపాము (వ్యు.)
"నాలు కవియెడి గుహను నాచుఁబామది యొకటి
గాలి అన్నతపువిషము గ్రుక్కుచుండ" 3-426

**నాచు:** వి. దొంగ. (బ్రౌన్)
"యేచి నీవు నవ్వితే నదేమని యడుగనేల
నాచుల మారుకు మారు నవ్వేటిలింతె కాక"
9-104

**నాచుబొమ్మచారితనము:** వి. దొంగ బ్రహ్మచర్యం.
"చూచితేనే దోసమా నే చొక్కి యెదుట నుండఁగా
నాచుబొమ్మచారితనము దప్పీనా" 26-68

**నాటకపుఁబ్రియము:** కృత్రిమపు ప్రేమ.
"యేఁటికిరా తిరువేంకటేశుఁడ బొంకఁగ నీ

నాటకపుఁబ్రియముతో నన్నుఁ గలసితివి" 5-357

నాటకపుది: (నాటకము + అది) మాయలాడి, కపట ప్రవర్తన గల స్త్రీ, ఇందులో అరసున్న విచార్యం.
"యేఁటికయ్యా నీవు మాతో యేలాటాలాడేవు
నాటకపుదానవా నవ్వేదానఁగాక" 12-278

నాటకపు మతములు: వి; బహు. బూటకపు మతములు, మోసపు మతములు.
"నాటకపు శ్రీవేంకటేశుఁగని కొలిచినఁజాలు
నాటకపు మతములు నవ్వులలోనివే" 4-235

నాటకపుసతి: వి. బూటకపు సతి, మోసపు సతి
"నాటకపు సతులు నయగారాలు సేసినా
యీఁటెల వోట్లేకాక యింత కోపినా" 11-213

నాటకము(లు) నడపు: (2) ప.బం; అ.క్రి. వ్యవహారం నడపు. (నిందార్థం)
"తనతమే నిజమైతే తనివి గలుగునా
ననుపుగా నాటకము నడపీఁగాక" 22-6

నాటకము: (5) వి. నటన, కపటప్రవర్తన, వంచన.
"నగవౌతా నెరఁగము నాటకమో యెరఁగము
తగవు నన్నడిగేవా తరుణి మాట" 14-395
"నాలి సేసి నాఁటకము నడపఁగ వద్దుగాక
మనసారా మాటాడితే మంచిదే కదే" 28-356

నాటకములాల!: వి; బహు. మాయోపాయాలు పన్నేవారా!
"ఏటికి నెవ్వరి పొందు యిస్సిరో చీ చీ
నాటకములాల చీ చీ నమ్మితిఁగా మిమ్ము" 1-95

నాటకసాల: (5) వి. నాటకశాల, ప్రేక్షాగారం.
"అలరి నాటకసాల యాలలు చూచెనంటా
వెలయ నేడెంతలేసి వెంగేలాడేవే" 28-466

నాటకాలు: (3) వి; బహు. నటనలు, కపటప్రవర్తనలు.
"నమ్మి కడుగ వెరతు నాటకాలకు వెరతు
యిమ్ములఁదనకునే మోహించితి నిదే" 14-387

నాటికి నాడు కొత్త నేటికి నేడు కొత్త: నానుడి; నిత్యనూతనమైనది, Everfresh.
"నాటికి నాఁడు కొత్త నేటికి నేఁడు కొత్త
నాటకపు దైవమవు నమో నమో" 2-85

నాటిమాట నాటికగు: నానుడి; అప్పటిమాట అప్పటికఅగు.

నాటుఁజూపు: వి. గట్టిగా చూచే చూపు.
"నాటుఁజూపే కలిగితే నవ్వులు రాకుండునా
మేటి లాసయిచ్చినట్టి మేర కింతేకాక" 22-26

నాదించు: అ.క్రి. శబ్దించు.
"ఈ దెస నీ భావమయ్యో యెదుటి చందురునందు
నాదించే కన్నులు తన నలుపు లెంచీనా" 22-17

నానఁబాలు: వి; బహు. నానబియ్యం, నానబెట్టిన కొత్త చేరుడు బియ్యం. కోతల సమయంలో చేలవద్ద చేసే బొమ్మదేవర సమయంలో, నానబెట్టిన సజ్జలు లేదా బియ్యం, బెల్లం కలిపినవి పిల్లలకు, పెద్దలకు పంచి పెడతారు. ఇవే నానబాలు. "నానబాలు పెట్టమంటే ఏసేను సజ్జలన్నా" డన్నది సామెత. (రా.మాం.)
"ఎగసక్కెఁడవు నిన్ను నేమి చెప్పేము
నగితేనే సెలవుల నానఁబాలు చూపేవు" 7-156

నానుకొను: అ.క్రి. చాలాకాలముండు.
"మొగము చూచేనంటే ముప్పిరిగొనీ సిగ్గులు
నగితే మందెమేళాలు నానుకొనీని" 27-535

నానుడిబాసలు: ప.బం; వి; బహు. చూ: నానుడిమాటలు.
"మానకురా యిటు మాటాడీని
నానుడిబాసలు నమ్మితిని" 2-57

నానుడిమాట: వి; ప.బం. 'నాడు'కు సంబంధిచిన నుడి నానుడి. నానుడులు, పలుకుబళ్ళు, జాతీయములు అన్నీ ఒక జాతికి చెందినవే. ఒక సీమయందు వాడుకునే మాట అనవచ్చు. 'నానుడి' కి అనుబంధంగా మాట సామాన్యంగా ప్రయోగింపబడింది. నానుడియైనమాట అని అర్థం.

"సరిగాడు వీడనవలదు జగమున రాజు
వలసినది దేవులు
యిరవుగ నందరు లోకములోపల యిది
నానుడిమాట" 2-298

**నా భాగ్యము నీ చిత్తము :** (2) ప.బం; నా అదృష్టం – నీ దయ, భారమంతా నీదే అనే సందర్భంలో వాడబడే పలుకుబడి. 'నీ చిత్తం – నా భాగ్యం' అనే వాడుక కూడా ఉంది.

"ఎవ్వరిఁబోలుదు నేను యిందరిలోన
నివ్వటిల్ల నా భాగ్యము నీ చిత్తముగాక" 18-276

**నాము(లు)వారు :** ప.బం; అ.క్రి. నామురోగం వచ్చినట్లు నాలుక పిడుచ కట్టు.

"ఏమే విచారించే వెంతవని గద్దు నీకు
నాములువార నవ్వేటి ననుపుకత్తెలము".
27-195

"నామువారఁ గల్లలాడి నాలిక గొంత పాపము"
3-327

**నాము :** వి. విషం (జొన్న లోనగువాని కొయ్యగాలున చిగిరించిన మొలక – దీనిని తింటే పశువులు చనిపోతాయి.) అసూయ, పొగరు (నాము బొగరు అని క.చొ.), ధాన్యం అప్పుగా ఇచ్చి ధాన్యరూపంగా తీసుకునే వడ్డీ.

"యిది పుణ్య మిది పాప మెట్టని తెలిసేమయ్య
అదన నన్నపు నామే యన్నువట్టెను" 4-253

"నాములాయఁ గదవే నీ నవ్వులు
కామించి యాతని మోము కళలెక్కెను"
12-176

**నాముకొను :** అ.క్రి. నామురోగం వచ్చినట్లు నాలుక పిడుచ కట్టు.

"నాముకొన నాతనితో నవ్వు నవ్వవచ్చుఁగాక
దోమటీగా సిగ్గులెల్ల దొడ్డిఁ బెట్టవచ్చునా"
25-138

**నాములుగా :** క్రి.విశ. అధికంగా, అసూయగా.

"యేమి చేసి వచ్చినాను యెదురాడఁజాలనే
నాములుగా సెలవుల నవ్వేదుఁగాని"

**నాములెక్కు :** ప.బం; అ.క్రి. అధికమగు.

"నాములెక్కి నీ సిగ్గు నవ్వులై వెడలఁజొచ్చె"
28-395

**నామువలపు :** వి. అధికమైన వలపు.

"ఏమి మాయ సేసితివో యెవ్వఁడెఱుఁగుర
నిన్ను
నామువలపుఁదలకు నాకు నెక్కెరా" 24-130

**నామువేయు :** ప.బం; అ.క్రి. 1. అధికమగు.

"తా నొకటి నే నొకటి తలపోఁత ఇన్నాళ్లు
నానాట మోహములు నామువేసీఁగాక" 26-61

"జవ్వని పువ్వువంటిది సడిఁబడ నోపదు
నవ్వితేనే వసివాడి నామువేసును" 14-99

**నాయఁడు :** వి. నాయకుఁడు, ప్రభువు, శ్రేష్ఠుడు, కొందరి పేర్ల చివరలో ఉండే బిరుదు.

"దొమ్మి సరసాలాడితే దొరతనాలు సెల్లునా
వుమ్మడినే సక్కనాయ నుండవయ్య
నాయఁడా" 17-128

**నాయంత నేనుండు :** ప.బం; అ.క్రి. ఎవరిజోలికి పోకుండు.

**నాయగాఁడు :** వి. 'నాయకుడు' శబ్దానికి వికృతరూపం.

"నాయగాఁడవు గనక నమ్మించవలశో
యిా యెడ నిట్టె నీవు నన్నేలుకొనే విధమో"
26-203

**నాయమాడు :** అ.క్రి. న్యాయం పలుకు, న్యాయం చెప్పు.

"యింటికి రమ్మని నిన్ను యిటు నటు
కొంగువట్టి
నంటు చూపితిఁగాక నాయమాడేనా" 16-318

**నాయము :** (35) వి. న్యాయమునకు వికృతిరూపం.

"మగువ గుణము లెంచి మరి నీ గుణము లెంచి
నగుమా వోరిచీ నాపె నాయమైన పనికి" 7-488

**నాయాలు వెట్టు :** ప.బం; అ.క్రి. పంచాయితీ పెట్టు.

**నారణి :** వి. తీగె.

"కేరడమైన కిన్నెరలో యిా

నారణి ముట్టుచు నలుగడను" 5-283

నారసము : వి. బాణం.

"దారాసుద్ధపుమాటలు తాఁకనాడి మదనుని

నారసాలు సేయకు నారసింహుఁడా" 10-2-18

నారాయణాష్టాక్షరము : వి. 'ఓం నమో నారాయణాయ' అనే ఎనిమిది అక్షరాలు గల మంత్రం.

"జతనమై ప్రహ్లాదుఁడు చదివినట్టి చదువు

గతిగా నారాయణాష్టాక్షర మిదియే" 4-33

"ఆదికాలపు వైష్ణవులందరి నోటి చదువు

గాదిలి నారాయణాష్టాక్షర మిదియే" 4-33

నారికడపుఁగాయ : వి. నారికేళపు కాయ, కొబ్బరికాయ, టెంకాయ.

"కమ్మటి చన్నుల నారికడపుఁగాయలు గాచె

పమ్మి మోవి తేనెల పంటలు పండెను" 18-152

నారికడపుఁగాయకు నీరు వచ్చినయట్లు : ప.బం; క్రి.విణ. తెలియకుండా వచ్చినట్లు, స్వయంగా వచ్చినట్లు.

"అల నారికడపుఁగాయకు నీరు వచ్చినయట్టు

తలఁచి రాఁగల మేలు తన్నుఁదానే వచ్చురే"

2-140

నారికళపుఁగాయ : నారికేళపుకాయ, కొబ్బరికాయ.

"అంది నారికళపుఁగాయకుఁ బైనె కట్టిగాక

కందువలోనూ నట్టి గట్టి యయ్యీనా" 9-75

నారుకొను : (45) మొలకలెత్తు. (నాఱు = నాటడానికి గాను తఱచుగా విత్తులు పోయగా మొలచిన మొలకలు) శకటరేఫకు బదులుగా ఇట సాధురేఫమే కనిపిస్తుంది.

"నారుకొని యాతఁడు నాతో మాటలాడకుండ

నేరిపితి బుద్ధులు నీవే కాన" 14-231

2. లోపలనే స్వల్పరూపమున నిలిచిపోవు (వ్య.)

"మేర మీరె నా వేడుక మెరసెను నీ చలము

నారుకొనెఁ గోరికలు నాకు నీకును" 27-72

"వూరకే నన్నేల యింకా నొడివట్టేవు

నారుకొన్న సతులు శేనలు గారా" 16-250

నారుపోయు : అ.క్రి. నాటుటకు ఒత్తుగా విత్తనాలు చల్లి మొలకలు మొలిపించు.

"నలువంక వలపులు నారువోయవలెనా"

13-220

"నారువోసినట్టు నేము నవ్వు లిట్టి నవ్వుకోఁగా

దూరుగాని నీ వేటికి తోడు నవ్వేవే" 21-59

నాలి : వి. పరిహాసం, కపటం, వేళాకోళం, (తె.వ్యు.కో.) అల్పకృత్యం.

"నవ్వులు నవ్వఁగరాదు నాలి నూరకుండరాదు

యివ్వలి నీతో సరస మెటుఁబోరాదు" 11-404

నాలిఁబడు : అ.క్రి. నగుబాటున పడు.

"అనరే యీ మాఁటే మీరు అతనితోను

ననుపు చూపితే నవ్వ నాలిఁబడదా" 21-407

నాలిక : (27) వి. 'నాలుక'కు వ్యావహారికరూపం. అన్నమయ్య నాలుక, నాలికె అనే పదాలను కూడా ప్రయోగించినాడు.

నాలికత్తె : (6) (నాలి + కత్తె) వి. మోసకత్తె.

"అవ్వలి నీ రమణుని నాఁడఁగలవెల్లా నాడి

నవ్వితినవే వవునే నాలికత్తెవు" 26-317

నాలికను ముక్కంటుకొను : ప.బం; అ.క్రి. ఒట్టుపెట్టుకొను.

"చూతము నీ నిజమెల్ల సొరిది నేడందులోనే

ఆతల నాలికను ముక్కంటుకొనరాదా" 3-142

నాలికాఁడు : (13) (నాలి + కాఁడు) వి. మోసగాఁడు, వంచకుఁడు, అల్పుఁడు, మందుఁడు, నీచుఁడు, కుత్సితుఁడు.

"నాలుకరెప్పలు వంచినమాత్రములోనె

నాలికాఁడ నీ తనువు నాఁటె ననేవు" 11-363

"చన విచ్చి శ్రీవేంకటేశ్వరుఁడు తానె నన్నేలె

ననుపు తానెంత సేసీ నాలికాఁడు" 13-501

నాలికూళలు : వి. కుత్సితపు మూర్ఖులు, కుత్సితపు క్రూరులు.

"మాయలు నేర్చినవారు మహిలోన జాణలు

నాయాలు నడచేవారే నాలికూళలు" 11-86

**నాలికె:** (24) వి. 'నాలుక'కు వ్యావహారికరూపం. అన్నమయ్య నాలుక, నాలిక అనే రూపాలను కూడా ప్రయోగించినాడు.

"అరిది దుర్భాషల నలవడ్డ నాలికె
హరినామములయందు నలవడదు" 4-325

"సత్తెపు నాలుకెల్ల చవులకమ్మితిఁగాని
మత్తిలి నీ కీర్తనము మరపుటా లేదు" 3-60

**నాలితనము:** (7) వి. కాపట్యం, వంచకత్వం, కుత్సితపుపని, అల్పత్వం, నైచ్యం, మాంద్యం.

"నాలితనాననే నీవు నాతులను వలపించి
వేలసంఖ్యలను లోన వేసుకొంటివి" 21-374

**నాలిమగఁడు:** వి. కుత్సితపు మగడు.

"ముచ్చటలాడఁగవలె మొగము చూడఁగవలె
మచ్చరమేటికి నాలిమగనికి" 26-253

**నాలిమొగదాకిరి:** వి. (?)

"మేలములాడఁబోతే మీఁదఁజెయి వేయవలె
నాలిమొగదాకిరైతే నాయంత నే నుండవలె" 7-5

**నాలివనిత:** వి. కుత్సితపు వనిత, కపటపు వనిత.

**నాలివెంగేలు:** వి; బహు. కుత్సితపు వ్యంగ్యపు మాటలు.

"నవ్వులకయినా నీతో నాలి వెంగేలాడదు
యివ్వలి మోమై విడెమిచ్చుఁగాని" 23-180

**నాలిసంసారము:** వి. పాడుసంసారం, నీచపుసంసారం.

"నాలిసంసారము బ్రహ్మ నాటనుండి జేసేఁగాని
మేలిమి మోక్షముతోన మెలఁగనైతిని" 3-283

**నాలిసేయు:** అ.క్రి. కుత్సితపు పనిచేయు (కూలినాలి చేయు అనే పదంలోని నాలి ఈ అర్థంలోనే) పరిహాసంచేయు, వేళాకోళంచేయు, వంచనచేయు, అల్పత్వం చూపు.

"మేలములు పచరించి మేనెల్లా జెమరించి
నాలిసేసి యంతలోనే నవ్వులు నవ్వేవు"
22-209

"నాలిసేసి పానుపుపై నవ్వులు నవ్వేవు నీవు
కొలుముందైన మీఁదఁ గొంకనేఁటికే" 8-100

**నాలుక కొనలనె నాను:** ప.బం; అ.క్రి. ఎప్పుడూ గుర్తుండి పోవు.

**నాలుక కొన వేదమై నిలుచు:** ప.బం; అ.క్రి. నోట్లో నాను, ఎప్పుడూ గుర్తుండిపోవు.

**నాలుక చవులకమ్ము:** ప.బం; అ.క్రి. రుచులకు లోబడు.

"సత్తెపునాలుకెల్ల చవుల కమ్మితిఁగాని
మత్తిలి నా కీర్తనము మరపుటా లేదు" 3-60

**నాలుక తుదనుండు:** ప.బం; సర్వదా నోట నాట్యమాడు.

"నాలుకతుదనే యీతఁడుండఁగా
నలుగడ నెవ్వరి వెదకేము" 3-371

**నాలుకబెల్లాలు చూపు:** ప.బం; అ.క్రి. మాటలోనే తీపి చూపు, నోటిమాటలతో మరపించు.

"వేలువెట్టి యిమ్మగొనె వెనకనే చాలదా
నాలుకబెల్లాలు చూప నాయము గాదమ్మా"
26-148

**నాలుకలోన బెల్లాలు యెదలోనఁ గత్తులు:** నానుడి; మాటల్లో తీపి - హృదయంలో క్రౌర్యం.

"నాలుకలోన బెల్లాలు యెదలోనఁ గత్తులు
నెట్టుకొని నీవలె నేరనే నేను" 19-383

**నాసికము:** (9) వి. నాసిక, ముక్కు; 'ము' వర్ణకంతో 'నాసికము' అనే రూపం విలక్షణం. శైవకవుల్లో ఈ రూపం ఎక్కువగా కనిపిస్తుంది. నాసిక అనే రూపాన్ని కూడా అన్నమయ్య ఒకచోట ప్రయోగించినాడు. (చూ. 7-413)

"నలినాక్షి కన్నులనడుమ నీ నాసికము
చెలఁగి యమరెనె వో చెలులాల" 7-405

## ని

**నించు:** స.క్రి. నింపు.

"నించేవు కాఁగిటను నిన్నుఁజూచి నవ్వితేను
మంచముపైకిఁ దీసితే మన్నించేవు" 8-40

**నించుకొను** : స.క్రి. నిండించుకొను, ఆవరించుకొను, ముంచుకొను, ఉంచుకొను, కలుపుకొను, చేర్చుకొను

"నీకు మొక్కఁగాఁ గాఁగిట నించుకొంటివి గాక
దాకొని రతికి నీవు తమకించితివా" 14-506

**నిండిన చదువులు** : వి; బహు. వేదాలు, నిండుచదువులు, పూర్ణవిద్యలు.

"నీటఁగలిసినట్టి నిండిన చదువులు
తేటపరచినట్టి దేవుఁడు" 5-244

**నిండుకుండ** : ప.బం; వి. గంభీరుఁడు, గంభీరురాలు.

"ఏల నాతో నానవెట్టే వెవ్వ రేమనిరి నిన్ను
నీలో నే నొకతెనై నిండుకుండ నైతినా" 14-440

**నిండుకుందు** : (3) (నిండుక + ఉందు) అ.క్రి.
1. తనివి చెంది ఉండు 2. ఖాళీయగు
3. వ్యాపించు 4. అతిశయించు (పద.)
5. సంతోషించు.

"నిడివి హరిఁగొల్చితే నిండుకుందుఁగాలము"
15-270

"అట్టి శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను గూడి
నెట్టన పైడిమేడలో నిండుకుండగా" 9-191

**నిండుజెఱకునఁ బందు నిలుచు** : ప.బం; అ.క్రి. అదనపు అతిశయం కలుగు.

"అంద నిండుమీఁదనే పాటైన నీవు నవ్వితేను
నిండుఁజెఱకునఁ బందు నిలుచుట గాదా"
14-334

**నిండునిధానము** : (4) ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్యవస్తువు.

"నీ వంటి చుట్టము నాకు నిండునిధానము గాదా
పూవుల నీ పాదములు పూజింతుఁగాక" 27-34

**నిండుబండికిఁజేట** : ప.బం; వి. (?)

"వేసరకు వీడేల యనకుము విడువ నిన్నింక
శరణు జొచ్చితి
నీ సరెవ్వరు లేరు వెదకిన నిండుబండికిఁ
జేటవేఁగా" 2-35

**నిండురొంపిలో కంబము** : ప.బం; వి. అస్థిరం.

"అంద సరసము నే నాడినట్టే యాడేవు
నిండు రొంపిలో కంబము నీ వలపు" 27-340

**నిందలాడు** : (2) (నిందలు + ఆడు) అ.క్రి. నిందావాక్యాలు పలుకు.

"నీ గుఱు తెలియఁగలేక నిందలాడిరి చెలులు
యీగతి నేఁటికి వంచే వెత్తవయ్యా శిరసు"
19-211

**నిందలుగట్టు** : (4) ప.బం; అ.క్రి. నిందలు మోపు, నిందలు వేయు.

"మందెమేళములు నేర మనసు సోదించ నేర
నిందలు గట్టఁగనేర నిన్నుఁజూచి" 22-206

**నికలంకుఁడు** : వి. నిష్కళంకుడు, కళంకం లేనివాడు.

"ఒకటంటే వొకటని వొట్టు లేల పెట్టేవు
నికలంకుఁడవే యైతే నీకేల వెఱపు" 20-410

**నిక్కిడి** : వి. ఉన్నతి, నిక్కుట.

"కయ్యపుఁగౌఁగిటఁ గలికి రచనలను
నెయ్యపుఁబులకల నిక్కిళ్లో" 5-31

**నిక్కిళ్లు** : వి; బహు. నిక్కుటలు, నిటారుగా నిలవడాలు. 'నిక్కిడి'కి బహువచనరూపం.

"కయ్యపుఁగౌఁగిటఁ గలికి రచనలను
నెయ్యపుఁబులకల నిక్కిళ్లో" 5-31

**నిక్కుఁగొప్పు** : వి. వెండ్రుకలను పైకి దువ్వి కూర్చిన కొప్పు.

"నెమ్మదిఁదాను నాకు నిక్కుఁగొప్పు వెట్టీని
యెమ్మెలదానవా నేను యేమైనాను" 29-455

**నిక్కము** : (5) వి. 'నిక్కము'నకు వ్యావహారిక రూపం. నిజం, నిశ్చయం, యథార్థం, సత్యం.

"యెమ్మెలెల్ల దక్కె నేఁడు యేవంక చూచితేను
నెమ్మది మా యింటికి నిక్కము రావయ్యా"
13-6

**నిగరము** : వి. కాంతివిశేషం. (బిల్ల, విశ. శ్రేష్ఠమైన, పెద్ద, గొప్ప)

"నిగరాలు బాసలు నెరుసలు మాయలు
మగువలు నీకే యెట్టు మరుపుదురో" 27-472

నిగ్గులు చల్లు: కాంతితో వికసించు .
"మలయు చెక్కుల నవ్వుల నవ్వు
మకరకుండముల
నలర నిగ్గులు చల్లే యాతఁడు" 1. సం. 31 పు.

నిచ్చఁబండుగ: వి. నిత్యకల్యాణం జరిగే పండుగ.
"నిచ్చఁబండుగలు సేసే నెలఁత ఇదివో నేఁడు
తచ్చిన పులక పూవుదండలతోను" 24-145

నిచ్చఁబెండ్లి: వి. నిత్యకల్యాణం.
"కొచ్చి శ్రీవేంకటేశుఁడ కూడితివి అందుకేమి
నిచ్చఁబెండ్లాయను లోనికి నేఁగరాదా" 8-165

నిచ్చకల్యాణము: (10) వి. నిత్యకల్యాణానికి వికృతిరూపం.
"ఇచ్చగించి నావద్ద నేకతాన నీ వుండితే
నిచ్చకల్యాణము లిట్టే నెరవేరెను" 21-394
"ఎలమితోఁ దిరువేంకటేశు కౌఁగిటఁగూడి
లలితాంగి నిచ్చకల్యాణంబు నోమె" 12-127

నిచ్చకల్యాణి: వి. నిత్యకల్యాణంగా వర్ధిల్లినది .
"నెట్టనఁ బెక్కిండ్లవిందు నిండుకొన్న యాఁకలి
వొట్టి నిచ్చకల్యాణి కామోద్రేకము" 4-24

నిచ్చకొత్తలు: (4) వి; బహు. నిత్యనూతనాలు .
"వినయముతో రెప్పలువేయక చూచి తాను
నినుపులై మమతలు నిచ్చకొత్తలు" 22-155

నిచ్చన: వి. 'నిచ్చెన'కు వికృతిరూపం.
"నిచ్చనలవంటివి నా నిండుఁగోరికలు నీకు
హెచ్చిన వలపు తలకెక్కఁ జేసేయందుకు"
11-414

నిచ్చనిచ్చ: అవ్య. ప్రతినిత్యం, ఎల్లప్పుడు.
"నిచ్చ నిచ్చ వాదు లేల నీ చిత్తము
యెచ్చుకుందు లాడనేల యింకా నీ చిత్తము"
19-364

నిచ్చనిచ్చ(లు): (5) ప్రతినిత్యం. (నిత్య శబ్దానికి 'నిచ్చ' వికృతిరూపం)
"నిచ్చనిచ్చ సోబనాలు నెల మూడుసోబనాలు
హెచ్చె నీకు నింతలోనె ఇవి గదవయ్యా"
20-412
"దిచ్చరీఁడై యిట్లు దిరువేంకటేశ్వరుండు
నిచ్చనిచ్చలును గదుఁ బెచ్చువెరిగేని" 6-62

నిచ్చనిచ్చ కొత్తలు: నిత్యనూతనాలు .
"అమ్మలాల అక్కలాల అవిగో వింత సుద్దులు
నెమ్మది వింటిరటే నిచ్చనిచ్చ కొత్తలు" 29-321

నిచ్చన్: అవ్య. ఎల్లప్పుడు, ప్రతిదినం; దీనిని ద్రుతాంతంగా ప్రయోగించడం విలక్షణం.
"నిచ్చన్ గూడియున్నారము" 11-513
"తచ్చి తాఁగలప్పుడే దైవము నెఱఁగఁడు
నిచ్చ నాచార్యునివల్ల నేఁడెఱిఁగె" 2-380

నిచ్చపంట: వ.బం; వి. ప్రతినిత్యమూ వచ్చే ఫలితం.
"యెన్నఁడు కలఁగనట్టి హితుఁడవు నీవె
పన్నినట్టె వుండె నిచ్చపంటా నీవె" 10-186

నిచ్చపండుగ: వి. నిత్యం జరిగే పండుగ, నిత్యోత్సవం.
"నిచ్చపండుగలు సేసె నీతోడి మాటలనె
నెచ్చెలి యల్లంతనుండి విన్నమాపె" 11-184

నిచ్చపెండ్లి: (2) వి. నిత్యకల్యాణం .
"నిచ్చపెండ్లి యెంత లేదు నీకు నేము సేసవెట్టి
మచ్చిక చల్లేముగాక మాకొఱకు" 27-475

నిచ్చపెండ్లికూతురు: వి. ప్రతినిత్యమూ పెండ్లికూతురు అయిన స్త్రీ.
"యిమ్ముల శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
నెమ్మి నీ రతి వెలసె నిచ్చపెండ్లికూతురా"
12-78

నిచ్చపెండ్లికొడుకు: వి. నిత్యమూ పెండ్లి కొడుకైన వాడు, నిత్యమూ సుఖంగా ఉండేవాడు.
"నిచ్చపెండ్లికొడుకుతో నిష్ఠురము చెల్లునా
ఇచ్చకములే యాడవే ఇప్పుడే నామారు"
27-545

నిచ్చలము: వి. 'నిశ్చలము'నకు వికృతిరూపం.
1.నిశ్చయం 2. నిశ్చలం 3. నిర్దోషం
4. నిరంతరం.

"నిచ్చలాన మోవితేనె నీ వియ్యఁగాను
"భవరోగములు పీడి పారఁగఁ బెద్దలు మున్ను
జవ కట్టికొనిన నిచ్చలమైన మందు" 1-237

**నిచ్చళము:** వి. నిశ్చలము. 'ణిచ్చల' ప్రాకృతం.
"ఇచ్చకపుమాటల యెలఇంచేవు మమ్ము
నిచ్చళపుసరసము నెరపే వందు" 25-259

**నిచ్చళించు:** అ.క్రి. నిశ్చలంగా ఉండు.
"నెలవై శ్రీవేంకటేశ నిచ్చళించ నెట్టువచ్చు
కులికేటి నీ వలపుకొలఁదె కాక" 11-140

**నిచ్చసోబనాలు:** వి; బహు. నిత్యశోభనాలు.
"కమ్మక యెందరినైనాఁ గాఁగిలించి కూడేవు
యిమ్మల నిచ్చ సోబనాలితవే నీకు" 26-475

**నిజపట్టు:** (4) (నిజము + పట్టు) వి. సత్యమని నమ్మి.
"ఊరకే వున్నాఁడదె వోపిక చూపఁగవద్దా
నేరుపున నా మాట నిజపట్టుఁగాని" 25-184

**నిజపొంతువులు:** వి; బహు. (?)
"ఇన్నియుఁగూడెను యింతికిని
నిన్నటి మాటలు నిజపొంతువులు" 23-597

**నిజమరి:** (11) (నిజము + అరి) సత్యశీలుడు.
"ఆనలేల పెట్టుకొనీ నంతలోనె లేదంటా
నేనిట్టే యిందుకు తన్ను నిజమరి అనేనా"
11-201

**నిజమరితనము:** వి. సత్యశీలత.
"తప్పని నీ నిజమరితనము మెచ్చేఁగాని
చెప్పె నీ యేకతములు చెవియొగ్గ నోపరా"
21-508

**నిజము నిష్ఠూరము:** (5) ప.బం. సత్యమెప్పుడూ కఠోరంగానే ఉంటుందనడం. వాడుకలో నిజమంటే నిష్ఠూరం అని ఉంది. నిష్ఠురము అని సాధురూపం.
"నెప్పున మాతోడి పొందు నిజము నిష్ఠూరము
తప్పులు నేఁ బట్టితేను తా నోపఁగలడా" 7-465

**నిట్టచరులు:** వి; బహు. ప్రవాహాలు కల లోయలు.
"సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ"
3-471

**నిట్టమాపు:** వి. నిటారుచూపు.
"లక్కవంటి మనసులో లలి నిట్టమాపుతోడ
నక్కరలెల్లాఁ జల్లే వౌనయ్య నీవు" 16-431

**నిట్టతాడు:** వి. నిలువుగా ఉన్న తాటిచెట్టు.
"వెట్టగా రావణురొమ్ము విరుగఁ జేతనే గుద్దె
నిట్టతాడువంటివాఁడు నీ బంటు" 1-69

**నిట్టనీలుగు:** (నీలుగు + నీలుగు) అ.క్రి. విఱ్ఱవీగు, ఒళ్ళు విరిచికొను, బిఱ్ఱబిగియు.
"నీవు గాఁగిలించుకోఁగా నిఱ్ఱనీలిగి వుంటేను
యీ వనిత గర్వియని యేమందువో" 20-394

**నిట్టపిడిమేనిది:** వి. నిఘంటువుల్లో ఈ పదం కనిపించదు. ప్రకరణాన్ని బట్టి 'నిలువైన పిడివంటి శరీరము కలది' అని తోచుచున్నది. సౌందర్యము లేకుండుట దీనిలో అభివ్యక్త మగునేమో అని సం.ప.స. (19 సం.) పిడికిలి లోకి అందిన నిటారైన శరీరం గలది. (?)
"పట్టి తెచ్చిన చెరలు పదారువేలుండఁగాను
నిట్టపిడి మేనిదాన నే నేల నీకు" 19-435

**నిట్టపిడిసేయు:** ప.బం. (?) 4-64

**నిడివిఁబెట్టు:** స.క్రి. దూరమున నుంచు.
"తడవఁగఁదడవఁగఁ దప్పించుకోఁజూచేవు
నిడివిఁబెట్టుదురా నెలఁతలను" 7-76

**నిత్తెపు జ్ఞానము:** వి. స్థిరమైన జ్ఞానము.
"మత్తుఁడై వుండేదే మనుజుని స్వభావము
నిత్తెపు జ్ఞానమిచ్చేది నీ స్వభావము" 3-515

**నిత్తెము:** (13) వి. 'నిత్యము'నకు వికృతిరూపం, ప్రతిదినం, ఎల్లప్పుడు, స్థిరం.
ప్రతిదినం:
"నిత్తెము నిదురలోన నేఁగలలు గనేనాఁడు
యెత్తి యీ కాఁపురము లివి యెందునుండెనో"
15-49

స్థిరం:
"హత్తి నీ నామమనే అమృతము గలవారు

నిత్తెమైన పదవుల నిలుతురయ్యా" 2-309
"పొత్తుల మగువలము పూనుకొని వచ్చితేను
నిత్తెమైన అలవాటు నిన్ను సోకిరాదా" 27-458

**నిత్యకొత్తలు :** వి; బహు. నిత్యనూతనాలు, ఎప్పటికీ కొత్తనైనవి ; వైరిసమాసం.
"ఆతుమ తొల్లిటిదే అంతరాత్మ తొల్లిటిదె
నీతితో యీ దేహములే నిత్యకొత్తలు" 3-104

**నిత్యశూ(సూ)రులు :** వి; బహు. ఇది నిత్యసూరులు కావచ్చు. అనంత గరుడ విష్వక్సేన శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ ఘంటాది నిత్య నివాసం కలవారు.
"అదివో శ్రీవేంకటేశుఁ డక్కున నలమేల్మంగ
అదివో నిత్యశూరులు ఆళువారులు" 2-111

**నిది :** వి. నిధి. అన్నమయ్య మహాప్రాణవర్ణానికి బదులు అల్పప్రాణం వాడడం పెక్కుచోట్ల కనిపిస్తుంది.
"నిదుల శేషాచలము నిక్కి పైపైఁ బొడచూపె
యిదివో కొలువున్నాఁడు
హృదయాంతరాత్ముఁడు"16-1-11

**నిదివిధానాలు :** వి; బహు. నిధులు అనే అర్థంలో జంటపదం.
"నిదినిధానాలవలె నిచ్చ వానపడలను
సదమదమై నవ్వీని చతురత మెఱసి" 28-35

**నిద్దర :** వి. 'నిద్దుర'కు వ్యావహారికరూపం.
"పొలయలుక నిద్దరలు భోగించ దొరకొంటి
అలర వడి మేల్కొనవె అఖిలేశ్వర" 6-173

**నిద్దిరించు :** (8) అ.క్రి. 'నిద్రించు'కు. వికృతిరూపం.
"నిద్దిరించువాని చేతి నిమ్మపంటివలెనే" 4-414

**నిద్దిరించువాని చేతి నిమ్మపండు :** ప.బం; వి. జారిపోయేది, నిలువనిది.
"నిద్దిరించువాని చేతినిమ్మపంటివలెనే
చద్దికర్మములు తానే జారితే జారె" 1-431

**నిద్దురఁగంటఁబెట్టు :** ప.బం; అ.క్రి. నిద్రపోవు.
"అద్దమరాతిరి వోయ నమ్మలాలా – అయ్యో
నిద్దురఁగంటఁబెట్టదు నిన్నటనుండి" 5-32

**నిద్దురించువాని చేతి నిమ్మపండు :** ప.బం; వి. తెలియకుండానే జారిపోయేది.
"నిద్దురించువాని చేతి నిమ్మపంటివలెనే
బుద్ధితోఁగర్మములు గొబ్బున జారిపోవును"
4-414

**నిధినిక్షేపములు :** వి; బహు. నిధులు అనే అర్థంలో వాడబడే జంటపదం.
"ఘన నిధినిక్షేపము లిచ్చేటి
వుపకారబంధువుఁడీశుఁడు" 2-392

**నిధినిధానము :** వి. నిధి అనే అర్థంలో జంటపదం.
"వంచుక శ్రీవేంకటేశ వారివారి బ్రదుకులు
నించి నీవే యైతివి నిధినిధానమవై" 2-358

**నినుపు :** (2) విణ. సమృద్ధము వి. జలపూరము.
"నినుపుఁదెంకాయకు నీరు నించితిమా
వొనర వేమునఁజేదు నించితిమా" 1-450

**నిప్పంటే నోరువొక్కు :** ప.బం. మిక్కిలి వేడియగు.
"చెప్పనీవే నావంక సేసిన కల్ల లేమయినా
నిప్పంటే నోరు వొక్క నేరదుగదే" 17-46

**నిప్పటి :** వి. నిప్పట్టు (నిప్పు + అట్టు) కు రూపాం. ఆకులు మీద కప్పి నిప్పులో వేసి కాల్చేడి భక్ష్యవిశేషం. (రాయలసీమ మాండలికంలో నిప్పట్టి అంటే అరిసెలు, అతిరసాలు అని అర్థం.)
"నెలకొన్న పిండెంత నిప్పటీ నంతే"

**నిప్పుల నేయి పోయు :** ప.బం. వర్ధిల్లజేయు.
"తలఁచకుండఁగవలె తలఁచితేఁగామాదులు
పొలుచు నిప్పుల నేయి పోసినట్లూ" 15-420

**నిప్పులమీఁదఁజల్లిన నూనెలు :** ప.బం; వి. శాంతిపరచక వృద్ధి చేసేవి, భగ్గున మండేవి.
"నిప్పులమీఁదఁ జల్లిన నూనెలు
నిగిడి తనివి లేనివి యాసలు" 1-1

**నిప్పులమీద నేయి చల్లు :** ప.బం; అ.క్రి. ప్రజ్వలింపజేయు, అత్యధికం చేయు.
"ఒప్పదు మానుపరమ్మ ఉప్పతిలఁ బలుమారు

నిప్పులమీఁదటఁ దెచ్చి నేయి చల్లీఁ దరుణి"
6-163

**నిమిష మేడగు:** వి.బం; అ.క్రి. కాలము కష్టమై గడచు.

"భ్రమయించే విళ్లే పదిమారులు
నిమిష మేడాయె నీచేత నాకు" 6-103

**నిమ్మపంట వేసితే రాత వేయు:** వి.బం. ఉపకారం చేసినవారికి అపకారం చేయు అనే అర్థంలో వాడబడే పదబంధం.

"తెప్పలెత్తి చూచేవు రేసులు నీ కేల పుట్టె
తిప్పి నిమ్మపంట వేసితే రాత వేతురా" 16-355

**నిమ్మలము:** (5) వి. మాం. క్షేమం, నిశ్చింత, నెమ్మది.

"నీ మగని తోడితెచ్చే నిమ్మలాన నుండవే"
26-534

"సమ్మతి నీతోడ సరసమాడేటి వేళ
నిమ్మలాన నా మోముచూడ నీవు మఱచితివా"
22-172

**నియ్యంత:** (నీ + అంత) నీఅంత. వింత త్రికసంధి.

**నియ్యందు:** నీయందు అని అర్థం. వింత త్రికసంధి. నియ్యాజ్ఞ (నీ + ఆజ్ఞ) కూడా ఇటువంటిదే.

"యియ్యెడ నేమరిపాటు ఇటు నాకు ముడిచితి
నియ్యంత నీవేఱఁగవు నిన్నింక నేమందును"
24-336

**నియ్యాజ్ఞ:** (నీ + ఆజ్ఞ) వి. నీ ఆజ్ఞ. వింత సంధి.

"నియ్యాజ్ఞ దేహము నే మోఁచితి నింతే
యియ్యెడ విజ్ఞాన మేల యియ్యవయ్యా"
1-412

**నియ్యాన:** (నీ + ఆన) నీ ఆజ్ఞ. వింత సంధి.

"నియ్యానకు భ్రమసితినటరా" 16-121

**నియ్యిచ్చ:** (నీ + ఇచ్చ) నీకోరిక. వింత త్రికసంధి. నియ్యాజ్ఞ, నియ్యందు మొదలైనవి ఇలాంటివే.

"నియ్యిచ్చ తెలిసిది పో నివ్వెరగు నీకు నిండె
అయ్యెడనుండి పాయవు అయ్యో
నాయకుడా" 19-497

**నియ్యెడ:** (నీ + ఎడ) నీపై అని అర్థం. వింత త్రికసంధి. నియ్యాజ్ఞ మొదలైనవి ఇలాంటివే.

"మొగమోడితిఁ జాలదా మొక్కలీఁడ
నియ్యెడకు
వొగరులాడ వచ్చేవు వోపము నేమిందుకు"
20-199

**నిరాభారి:** వి. 'నిరాబారి'కి వ్యావహారికరూపం. ముని. (శ.ర.) నిరాహారి

"జవనమందినయప్పుడు
దేహి సన్యాసికంటే నిరాభారి" 1-440

**నిరుఁబేద:** వి. నిఱుపేద, మిక్కిలి పేదవాఁడు. అరసున్న చింత్యం.

"దిన మహోరాత్రములు తెగి ధనాఢ్యున కొకటే
వొనర నిరుఁబేదకును నొక్కటే అవియు" 2-385

**నిరుమోహి:** వి. 'నిర్మోహి'కి వికృతరూపం. మోహం లేనివాడు.

"నీవంటి గుండె లేదు నిరుమోహి నేఁగాను
కావరించి చూచి యింకాఁ గన్నులఁ గాఁకారదు"
14-360

**నిరుహరణము:** వి. 'నిర్హరణము'కు వికృతరూపం. మధ్యలో ఉకారాగమం; తొలగించేది.

"పరమపదంబును భవనిరుహరణము
పరమాత్మ చింతే ప్రపన్నులకు" 1-439

**నిరుహరణుఁడు:** వి. 'నిర్హరణుఁడు'కు వికృతరూపం. మధ్యలో ఉకారాగమం; తొలగించేవాడు.

"కలిదోషనిరుహరణ కైవల్యాకర హరి
తలఁచినవారిది నేరుపు" 4-259

**నిరుహేతుకము:** (10) విణ. 'నిర్హేతుకము'కు వికృతరూపం. మధ్యలో ఉకారాగమం. కారణం లేనిది.

"నీకుఁ దొల్లే యలవాటు నిరుహేతుకపు దయ

జోక నురుత మెచ్చిన సులభుఁడవే కా" 3-451

**నిర్గుణాయ గుణాత్మనే:** నిర్గుణుడూ, గుణాత్ముడూ ఐన విష్ణువు.

"అగణిత స్వతంత్రుఁడవు గాన అల వాల్మీకి ఇట్టిట్టనకే
అగు నిర్గుణాయ గుణాత్మనే యని ఆనతి ఇచ్చుటే" 2-412

**నిర్భరుఁడు:** వి. పెద్ద, గొప్పవాడు.

"నించిన దైవము నమ్మిన నిర్భరుఁడయిన
యెంచుక యే మార్గంబుల నెట్టుండిన నేమి" 2-55

**నిర్మాల్యపు దండ:** వి. భగవంతునికి ధరింపజేసి తీసిన మాల. ఇది శ్రీ వైష్ణవులకు పరమపవిత్రము.

"మంచి నిర్మాల్యపుదండ మంగళసూత్రము నాకు
కాంచనపు రాసి నీ చక్కనిరూపు నా మతికి" 3-393

**నిలచిన కాలము:** వి. ఉన్నంత కాలము, బ్రతికినంత కాలము.

"యెలిమి శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
నిలిచిన కాలమెల్లా నీ సేవే చేసితి" 2-215

**నిలుగు:** వి. ఒళ్లు విఱుచుకోవడం.

"కలిసి శ్రీ వేంకటేశుఁ గాఁగిలించుకొందుఁగాక
నిలుగుల మేన నేలే నిండు సిగ్గులు" 21-120

**నిలుచుకొను:** (2) అ.క్రి. నిలబడు; రాయలసీమ వ్యవహారంలో కొన్ని ధాతువులపై 'కొను' అనుబంధం చేరడం సహజం.

"నిలుచుకున్నది తానే నిలువననే సిగ్గు
మెలుపున నెటువలె మెదలఁగవచ్చును" 3-225

**నిలువ నీడలు గలుగు:** ప.బం; అ.క్రి. ఆశ్రయమేర్పడు.

"మలసి యితఁడొకనాఁడు వొడమఁగఁగదా యిందరికి
నిలువనీడలు గలిగె నిధినిధానములై" 1-116

**నిలువిచ్చు:** ప.బం. నిలువుదోపిచ్చు.

"ఎవ్వతెరా నిన్ను నెలయించి తన
జవ్వనము నిలువిచ్చి జట్టిగొన్నది" 5-67

**నిలువు:** వి. చెయ్యి పైకెత్తుకొని నిలుచున్న పురుషుని పరిమాణం, అంతస్తు, ఎత్తు, ప్రమాణం, కొలది, పొడుగు.

"ఏడు నిలువుల పైఁడిమేడ మీఁదినుండి నన్నుఁ
జూడ వేడుకైన మించుఁ జూపులాఁడి" 5-63

**నిలువుఁగస్తురిబొట్టు:** వి. కస్తూరితో నిలువుగా పెట్టుకొను బొట్టు.

"నిలువుఁగస్తురిబొట్టు నిండుచెమటఁ గరఁగ
కులికి శ్రీవేంకటేశ కూడె నిదె యవురా" 17-482

**నిలువుఁగొప్పు:** వి. నిలువుగా ముడిచే ఒక రకపు కొప్పు.

"మంతనపుఁగోరికల మట్టు మీరి చూడఁగానే
వింతైన నిలువుఁగొప్పు వీఁపుమీఁద వ్రాలెను" 29-537

**నిలువుఁగొలువు:** (2) వి. నిలువు జీతం, నిలుచుండి చేయు సేవ.

"నిలువుఁగొలువు సేసి నిన్నుఁ గడు నెలయించీ" 28-162

**నిలువుఁదురుము:** వి. నిలువు కొప్పు, నిక్కుడు కొప్పు.

"నిలువుఁదురుముతోడ నీవు కపటాలు చూసి
అలరి పంతాల చూప నాతఁడింత నేరఁడా" 27-303

**నిలువుఁబతిమ:** వి. నిలువు ప్రతిమ, ఎత్తైన ప్రతిమ.

"వలవేసి పతిమీఁద వట్టి దూరులు గట్టుకు
నిలువుఁబతిమవలె నీ ముందర నున్నది" 27-193

**నిలువుకు నిలువు:** పూర్తిగా.

"నిలువుకు నిలువే నిన్ను నేరాలెంచేనా
వెలి నెంత నవ్వినా నవ్వితివి గాక" 21-61

**నిలువుగోణము:** వి. నిలువు కౌపీనము, నిలువు గోచీ (గోణము = గోవణము యొక్క రూపాం. గోవణము = కౌపీనం)

"నిలువుగోణము గట్టి నిలుచుండి పన్నీట
జలకమాడె నదీ సర్వేశుడు" 13-363

**నిలువున నూరు పండు :** ప.బం; అ.క్రి. సమృద్ధిగా కలుగు, నేత్రపర్వంగా జరుగు, దిట్టంగా కలుగు, నిట్టనిలువున పరిణతస్థితికి వచ్చు.
"చెలరేగే ముంజేతిచిలుకవో వలపు
నిలువున నూరు వండేటి మొలకవో వలపు"
13-212

**నిలువున ముంచు :** ప.బం; స.క్రి. పూర్తిగా నష్టం కలిగించు, గొప్ప ఆపద కలిగించు.
"వలెనని శ్రీవేంకటపతి వడదేరిచి నను(గూడెను
నిలువున ముంచెను మరపులు నేరము
లెంచకురే" 17-40

**నిలువునామము :** వి. నిలువుగా పెట్టిన బొట్టు.
"కలికి కస్తూరిబొట్టు కాంతుని నొసలి నంటె
నిలువునామము పైపై నెలత కంటె" 20-309

**నిలువు నూరువండు :** ప.బం. సమృద్ధిగా కలుగు, నేత్రపర్వంగా జరుగు.
"నిలువు నూరువండీని(?) నిచ్చలు నీ
దేహమైతే
వాలినీ దుఃఖములకు నోరువలేదు" 3-248

**నిలువు నూరూ(బండు :** (9) ప.బం; అ.క్రి. సమృద్ధిగా కలుగు, నేత్రపర్వంగా జరుగు, దిట్టంగా కలుగు. (విణ. దిట్టమైన.)
"వెలయ నాతఁడె నిన్ను వెల్లవిరిగా(గూడె
నిలువు నూరూ(బండె నీకేలె వెరవూ" 11-335
"నీ మై గురుతులు నిండె నిలువు నూరువండె"
28-86

ఈ పదానికి 'మనిషి పొడవే నూరు విధములైన పంటలు పండుతుంది' అని అర్థమా? అని సంపా. 3 సం. 168 పు. f.n.

**నిలువుల మేడ :** వి. ఎత్తైన మేడ, పెక్కు నిలువుల (మనుష్యప్రమాణాల) ఎత్తు గల మేడ.
"నిలువులమేడలో నిలుచున్నా(డిదె
పిలువవే రమణుని(బ్రేమముతోడ" 20-321

**నివాళిపాట :** వి. తమిళంలో 'నీదువాళి' అంటే 'చిరాయువై వర్ధిల్లుము' అని అర్థం. ఈ అర్థంలో మంగళాశాసన పురస్సరంగా పాడే పాట. 'మంగళహారతి' కి నివాళి అనేది పర్యాయపదం. కనుక మంగళహారతి ఇచ్చేప్పుడు పాడే పాట అని భావించవచ్చు. 'దిష్టి తీయుటకై సారాణిపళ్లెము నెత్తుతూ పాడేపాటలే నివాళిపాటలు' అని డా॥ వేటూరి ఆనందమూర్తిగారు అభిప్రాయపడ్డారు. అన్నమయ్య కీర్తనల్లో నివాళిపాటలు రెండు కనిపిస్తున్నాయి. వీటిలో నివ్వాళి లేక నివాళి అనేపదం ప్రయుక్తమౌతుంది. ఉదా:-
"నెలత మోమునకు నీ కనుచూపులు
నిలువున ముత్తెపు నివాళి
కొలదికి మీరిన గురుకుచములకును
తొలకు నీ మనసు దువాళి" 7-292

**నివ్వరిముల్లంత :** ప.బం. అతిసూక్ష్మమైనది, అతిస్వల్పమైనది, నివ్వరిగింజ ముల్లంత.
"నిలువెల్లా నెంచుకొంటే నివ్వరిముల్లంత లేను
బలువుఁడ నీవైతే బ్రహ్మాండము" 3-45

**నివ్వరిముల్లు :** నివ్వరిగింజ కొన, అతి స్వల్పమైనది.
"నిలువెల్లా నెంచుకొంటే నివ్వరిముల్లంత లేను
బలువుఁడ నీ వైతే బ్రహ్మాండము" 3-45

**నివ్వెఱ(గుఁదనము :** వి. 1. మిక్కిలి భయం 2.దుఃఖాదుల వల్ల కలిగే నిశ్చేష్టత 3. భ్రాంతి 4. అత్యాశ్చర్యం.
"నీ మనసులోని వెల్లా నీ వెరుగుదు నాకు
నేమ మాయ నిన్ను(గూడి నివ్వెఱ(గుఁదనము"
20-97

**నిశ్చయతాంబూలము :** వి. వివాహం నిశ్చితమైనపుడు వధూవరుల పక్షంవారు పరస్పరం వక్కాకులు మార్చుకోవడం.
"నీవు వెట్టిన విడెమె నిశ్చయతాంబూల మాయ
వేవేగ సింగారించుక విచ్చేయవయ్యా" 16-549

**నిశ్చింతము :** (3) వి. నిశ్చింత, నిమ్మలము.
"ఆతఁడే యజమానుఁడు ఆదినారాయణుఁడు

ఆతని బంట్లము మాకు నన్నిటా నిశ్చింతము"
2-237

**నిష్ఠూరపుఁదనము:** (నిష్ఠూరము + తనము) వి. చూ: నిష్ఠూరము.
"అవ్వలఁదమ చేత లవి చూచుకోరు
నివ్వటిల్లీ నేఁడు నా నిష్ఠూరపుఁదనము" 20-97

**నిష్ఠూరము:** వి. 'నిష్ఠురం'అనే దానికి వికృతరూపం. ఏదేని ఒక మేలు చేయునపుడు ఎదుటివారినుండి కలిగే బాధ, అపవాదం.
"కూడినమీఁదను కొసరేలే
ఆడకు నిష్ఠూర మప్పటివలెను" 14-369
సైకొని నీవు బాసలు సేయఁగనేల
నీకు నిజమే కలితే నిష్ఠూరమేల" 13-347

**నిష్ఠూరము కట్టు:** అ.క్రి. దోషము ఆరోపించు.
"కాంతమీఁద నిష్ఠూరము కట్టకువయ్యా
వింత లేదఁ జేసీని విచారించవయ్యా" 21-31

**నిష్ఠూరాలాడు:** అ.క్రి. నిష్ఠురోక్తులు పలుకు.
"ఇంగితాన నిష్ఠూరా లెన్నఁడూ నాడఁడాతఁడు
అంగనలాల నా మాట లటువంటివా" 13-456

**నిష్ఠూరము:** వి. కాఠిన్యం, పారుష్యం. నిష్ఠురత అనేది సాధురూపం.
"హత్తిన నీ గుండెవంక నవి రాఇకొనెఁగాని
విత్తెపుఁగోమలులము నిష్ఠూరము చూపము"
27-452

**నిష్ఠూరములాడు:** అ.క్రి. నిష్ఠురోక్తులు పలుకు.
"నెట్టుకొని వొకవేళ నిష్ఠూరము లాడినాను
అట్టి ప్రియము చెప్పుదు రంతలోననే" 12-524

**నిష్ఠూరి:** కఠినోక్తులు పలుకువాడు.
"నేనంత నిష్ఠూరిఁగాను నీయెడకు
కానున్న పనులే నీపై గట్టి యాయఁజుమ్మీ"
27-505

## నీ

**నీ చిత్తము నా భాగ్యము:** (9) నానుడి. నీ దయ నా అదృష్టం.
"నీ చిత్తము నా భాగ్యము నే నెంతటివాఁడను
యేచి నీవు రక్షించేదే యెక్కుడు పుణ్యమింతే"
2-263

**నీచ:** వి. నీచుడు, వృద్ధాదిగణంలో చేరిన 'నీచ' శబ్దానికి పుంలింగంలో పాక్షికంగా 'డు' లోపం విధింపబడింది. కాని ఈ పదమిక్కడ స్త్రీలింగంలో కనిపిస్తుంది. ఇది విశేషమే.
"యెక్కువ శ్రీవేంకటేశుఁడిటు నా వంటి నీచఁ
బక్కనఁ గాచెను యిట్టి పరులూఁగలరు"
14-341

**నీట ముంచు పాల ముంచు:** (4) ప.బం. రక్షించినా, శిక్షించినా నీవే దిక్కు అనే సందర్భంలో వాడబడే పదబంధం.
"నీట ముంచు పాల ముంచు నీ చిత్తమికను
యీటగు నీ పతిభావమిది గలది" 9-39

**నీటిపేరి పాన్పు:** వి. సముద్రశయనం.
"పొరి నీటిపేరి పాన్పున శ్రీవేంకటేశ
విరిమీఁది బిడ్డ పేరి వెలఁది నిన్నుఁగూడె"
10-2-117

**నీటిపై వ్రాఁత:** ప.బం; వి. అస్థిరం, నిలువనిది, నమ్మరానిది.
"లలనల జవ్వనాలు లక్కపూసకపురులు
నెలకొని సేసే బత్తి నీటిపై వ్రాఁత" 2-268

**నీటిలోని ముల్లు:** చూ: నీళ్లలోని ముల్లు.
"నీటిలోని ముల్లువంటి నీ గుణము దెలియ
యేటఁబెట్టి హెచ్చుకుందు లెంచనోప" 27-518

**నీటిలో వ్రాఁత:** ప.బం; వి. అశాశ్వతం.
"గరిమె నివి లేకున్నఁ గలకాలములుఁ జేయు
నిరతంపుఁదపమెల్ల నీటిలో వ్రాఁత" 1-364

**నీడకన్ను:** ప.బం; వి. సుఖం.
"యెండకంట నీడకంట నేల చూచేవే యాతని
పండువంటి మోవి చూచి పాలార్చీ నిన్నును"
20-243

**నీడ దిరుగని చింత:** వి. తిరుమలలోని శ్రీవేంకటేశ్వర స్వామి ఆలయ మహాద్వారం దాటిన తరువాతి ప్రదేశంలో ఉన్న చింతచెట్టు. ఇది అతి విశాలమై ఉండడం వల్ల దాని నీడ

తిరిగే స్థితి కనిపించదట. ఈ చింతచెట్టు శేషాంశమట. సేవాశ్రమం, వేంకటాచల మహాత్మ్యం, పరమయోగి విలాసం – ఈ గ్రంథాల్లో దీని ప్రస్తుతి ఉన్నది. ఇది నేడు జాడలేదు.

"ఇదిబడి నొసఁగుదు(ను?) బ్రాణదారులకు
కడిమి నీడదిరుగనిచింతాడ" 1-320

**నీడరూపు:** వి. ప్రతిబింబం.

"వెలుపుబద్ధములోని నెలంత నీడరూపు
తెలుపుఁడు దగ్గరిందిదిఁ జెలి నగను" 23-600

**నీడలోని (లోపలి) యెండ:** ప.బం; వి. అసంభవం.

"నిద్దురలో తెలివంటా నీడలోని యెండంటా
వుద్దువుద్దులై లేని వొద్దిక నున్నారము" 1-199

"మిత్తిపలెఁ జెలరేగి మీఁదఁ గాసీ యెండకంటే
నెత్తిమీఁది చిచ్చు గాదా నీడలోని యెండ" 5-199

"నీడలోపలి యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొద లేని యెజుక" 16-2-38

**నీడలోపలి యెండ:** ప.బం; వి. అసంభవం, అంతర్గతంగా ఉండేది. (?)

"నిడుపులోపలి కురుచ నీడలోపలి యెండ
వడి మంచి తరువు విడువని తమకము" 6-70

**నీడవంటివాఁడు:** ప.బం; వి. ఎల్లప్పుడూ వెంటనుండు వాడు.

"యీడనె శ్రీవేంకటేశుఁడిట్టె నన్నుఁగాచెఁగా
నీడవంటివాఁడ నేను నేరు పింక నేదో" 3-354

**నీడవెట్టు:** ప.బం; అ.క్రి. ఆశ్రయమిచ్చు.

"దట్టపుఁదమకపు మై దావానలానకు
నిట్టూరుపులె పో నీడవెట్టీని" 5-281

**నీడానెండావలె నుండు:** ప.బం. సుఖదుఃఖాల్లాగా ఉండు.

"నిగ్గుల వయోమదము నీడా నెండావలె నుండు
యెగ్గులెంచాఁ బని లేదు ఇంటికి రావయ్యా"
21-58

**నీ తలనే వేగెనా:** నానుడి; నీ తలనే పొద్దుపొడిచిందా? అని శబ్దార్థం. నీదే ఆధిపత్యమా? నీ వనుకున్నట్టే అన్నీ అవుతాయా? మొదలైన అర్థాల్లో ప్రయోగింపబడుతుంది. నీతోనే ప్రపంచమంతా ఉందా? నీ నుదుటనె పొద్దు పొడిచిందా? అని కూడా వ్యవహారం.

"నీ తలనే వేగెనా నిన్ను దూరఁబని లేదు
జాతిఁబుల్లఁదీగెలకు సొరి నలుగుదురు" 7-50

"బగ్గడికిఁ గాని పత్తిపంతము లీడేరవు
వెగ్గళించ నీ తలనే వేగె నటవే" 18-184

"నీ తలనే వేగెనా నెట్టుకొన్న వలపులు" 7-514

**నీమయము:** వి. నీతో నిండినది, సంస్కృత పదాలపై చేరాల్సిన మయ(ట్) ప్రత్యయం నీ అనే తెలుగుపదం మీద చేరడం విలక్షణం.

"జగమంతా నీమయము సర్వం
విష్ణుమయయంబు గాన" 2-387

**నీరగు:** (నీరు (నివురు) + అగు) బూడిద అగు, భస్మమగు.

"మనసులో పాపబుద్ధి మరియెంత దలఁచినా
నినుఁదలఁచినంతనే నీ రౌను" 3-377

**నీరాటరేవు:** (నీరాట + రేవు) వి. స్నానంచేసే రేవు.

"నీరాటరేవులఁ బొంచేనమ్మా నిక్కనిక్కి తానె
చూచేనమ్మ
వేరులేక యెట్టు దగ్గరుదము
గోవిందకృష్ణరాయని" 10-2-111

**నీరాడు:** అ.క్రి; ప.బం. స్నానం చేయు.

"నీరాడే చోటులెల్ల నిలచీ వీఁడు" 16-555

**నీరాడు:** వి. కాగు.

"నీరాటిలోనఁ దన నీడ చూచి బాలుఁడంటా
రారమ్మని పిలిచి రాకుండఁగా" 17-95

**నీరాడు వచ్చి ముంతఁజొచ్చు:** నానుడి; కాగువచ్చి ముంతలో ప్రవేశించు, అసంభవమగు.

"యేడఁగా నాకునిట్టె యిచ్చకాలాడేవు నీ

రాడువచ్చి ముంతచొచ్చె రారాదా లోనికి"
8-214

**నీరాడు వచ్చి ముంతచొచ్చు :** ప.బం; అ.క్రి. పెద్దవస్తువు చిన్నవస్తువులో ప్రవేశించు. నీరాడు = కాగు వచ్చి ముంతలో ప్రవేశించు అని వాచ్యార్థం.
"యేడగా నాకు నిట్టి యిచ్చకాలాడేవు నీ
రాడు వచ్చి ముంతచొచ్చె రారాద లోనికి"
8-214

**నీరార్చు :** ప.బం; స.క్రి. స్నానం చేయించు.
"దావతిఁ దలిదండ్రులు తమ బిడ్డల తనువులఁ బంకము లంటినను
యే విధముల నీరార్చి పెంతు రటు యిన్నిట
నీవే గతి నాకు" 3-392

**నీరుకొద్దీ తామర :** నానుడి; చూ: నీరుకొద్దీ దామెర. నీరు ఎంతవరకుంటే తామర అంతవరకు ఉంటుంది. పిండికొద్దీ రొట్టె వంటిది. ఎదుటి శక్తిసామర్థ్యాలకు తగినట్లు, ఎదిరి హృదయాన్ని తెలుసుకొని తదనుగుణంగా ప్రవర్తించడం.
"యీరీతి శ్రీవేంకటేశ యీకె యలమేలుమంగ
నీరుకొద్దీ తామరాయ నేడు మెచ్చవయ్యా"
24-458

**నీరుకొద్దీ దామెర :** ప.బం; వి. నీరు ఎంతవరకుంటే తామర అంతవరకు ఉంటుంది. పిండి కొద్దీ రొట్టె వంటిది. ఎదుటి శక్తిసామర్థ్యాలకు తగినట్లు, ఎదిరి హృదయాన్ని తెలుసుకొని తదనుగుణంగా ప్రవర్తించడం.
"మాఱిన నీరుకొద్దీ దామెర యింతె యెంచి చూడ
జాలివిడిచి దేవుని శరణను జీవుఁడా" 2-157

**నీరుకొలఁది తామర :** (2) చూ: నీరుకొద్దీ తామర.
"నెలకొన్న దెఱఁగవా నీరుకొలఁది తామర
చెలియరో నే నేమని చెప్పనే నీకు" 12-423

**నీరుకొలఁది తామెర :** (3) ప.బం; వి. చూ: నీరుకొద్దీ తామర.
"నీ వలనఁ గొరతే లేదు మరి
నీరుకొలఁదిఁ దామెరవు" 2-393

**నీరుగప్పిన నిప్పుక :** ప.బం; నివురు గప్పిన నిప్పు, లోపల శక్తి కలిగి పైకి కనిపించనిది.
"తారి యెవ్వారికిఁ గానరాకుండ"

**నీరుచిచ్చు :** వి. 1. బడబాగ్ని 2. నీటిదాహం.
"నీరధిలోఁబుట్టినట్టి నీరుచిచ్చైన పూవు
నూరిపోసినట్టి పామునోరిలో కడి" 7-324
నీటిదాహం :
"నెట్టన వేసవిలోన నీరుచిచ్చు గొనెఁ దీగె
పట్టి విచారించకుంటే బాపమయ్యా" 26-91

**నీరుబుగ్గ రాతి బరణిపెట్టు :** ప.బం; అ.క్రి. శక్యంకాని పనికి పూనుకొను; నీటిబుగ్గను రాతి బరణిలో పెట్టడం సాధ్యం కానిదే కదా!
"పొంచి పొంచి యిందుకుఁగా పొడిఁబడ నేటికి
పంచ నీరుబుగ్గ రాతి బరణిఁ బెట్టనేలా" 10-1-56

**నీరుబుగ్గ వంటిది :** (3) నీటిబుడగవలె చంచలమైనది, వర్ధిల్లునది. వి. గెలుపువారి పక్షం వహించేది.
"నీరువంక తుంగవలె నిన్ను నిట్టె భోగించఁగా
సారపు తరితీపులు చప్పనాయను" 21-80

**నీరువంకతుంగ విధము :** (12) ప.బం; వి. నవనవలాడేది, వర్ధిల్లేది.
"కదిసి చేకూరితేను ఘనమై హర్షించు
వెద నీరువంకతుంగవిధమాయ మనసు" 4-417

**నీరువంకపొలము :** ప.బం; వి. నిగనిగలాడేది, వర్ధిల్లేది.
"నిండినట్టి మడుగుల నీరువంక పొలము
కొండలు మోచిన పెద్ద గొబ్బరపుఁబొలము"
4-52

**నీరువట్టు :** వి; ప.బం. దప్పియగు, ఎండిపోవు.
"నీరువట్టితే నేయి చేతికివచ్చి మరి
అవ్వలఁదఁ బన్నీరిచ్చితే అనువౌనా తాను"
26-143

**నీఱుపైఁ గోపాలు చూపు :** ప.బం. బలవంతునిపై కోపాలు చూపు.
"వేతే నే మూరకుండిన వెంగెమే కాదా
నీఱుపైఁ గోపాలు చూప నీయంతవారమా" 7-17

**నీలములు:** వి; బహు. నీలాలు, వెంట్రుకలు. 'తలనీలాలు' అని వ్యవహారం.

"తలనీలములు దించి తగువారి సిరులు
తలకొట్టి యనుచు వింతల మొమ్మెకాఁడు"

**నీలాలకొండ:** వి. నీలమణుల కొండ.

"గురుతైన నీలాల కొండవలె నీవు నీవు
జరుగుచునున్నారు జయమేమి గడమా"
14-386

**నీలాల పెండెము:** వి. నీలపు మణులు పొదిగిన కాలి ఆభరణం.

"చేరి కాఁగిటఁగూడి శ్రీవేంకటేశుఁడు మెచ్చి
పేరు కల నీలాలపెండె మిచ్చెను" 23-462

**నీలిబిడ్డఁడు:** వి. నల్లనిబిడ్డడు, బాలకృష్ణుడు.

"ఓయమ్మ నీలిబిడ్డఁడోయమ్మ
యీ యెడ యశోద నీవెట్టు గంటివమ్మ" 22-69

**నీలిమచ్చవురము:** వి. శ్రీవత్సలాంఛనం కల వక్షస్థలం.

"నిక్కిన కర్దములవె నీలిమచ్చ వురమదె
చుక్కల మొలపూసల నొక్కరూ పదె" 2-379

**నీళ్లతీఁగలు:** ప.బం; వి; బహు. (?)

"నీళ్లతీఁగెలు నిగుడఁగ నోర
నుచ్చిళ్లు గమ్మఁగ నెట్లుండితివో" 1-68

**నీళ్లలోని ముల్లు:** వి. పైకి కనబడని ప్రమాదం, తెలియ రానిది, బాధించేది. నీళ్లలో పడిన ముల్లు రూపు కానరాక నీటిలో అడగి అడుగున పడిపోవును. కప్పుపడిపోవుట అని తె.జా. (119 పు.)

"అల్ల నీళ్లలోని ముల్లయినది యిది
యిట్టులనుచు నిశ్చయింపరాదు"
అని సారంగ. 2-255

**నీళ్ళలో నీడ:** ప.బం; బహు. సత్యం కానిది.

"నిక్కి నిక్కి నీళ్లలో నీడ చూచినట్లానే
దిక్కుల కర్మఫలము దిచ్చ భోగములు" 15-59

**నీళ్లాడు:** (నీళ్లు + ఆడు) ప.బం; అ.క్రి. స్నానంచేయు.

"దరిఁ జీరలు వెట్టి బిత్తలే నీళ్లాడఁగాను
సరసమాడకుండునా చంకఁ బెట్టుక" 14-455

**నీళ్లాడు:** (4) ప.బం; అ.క్రి. స్నానం చేయు.

"నెలఁతల దోఁచీని నీళ్లాడఁగానే
కొలనిదరిని దొంగ కూగూగు" 6-56

**నీళ్లు నములు:** ప.బం; అ.క్రి. బదులు చెప్పలేక తికమకపడు, సంకోచించు.

"నీవు నీళ్లు నమలితే నిండెను వేదములు
యీవలఁ దలిర్చితేనే యింద్రపదవులు మించె"
2-156

"నీళ్లే నమలేవు నీలోని సన్నల
వేళ్లే చూపేవు వెలుపలికి" 6-58 & 2-156

**నీవి:** వి. పందెమొడ్డిన ధనం.

"తనుఁదానె చేరె హరి దధివిభాండకునకు
కొనకెక్కఁబోయి నీవి కొంచవడెఁదొల్లి" 2-94

**నీ వేపూరో తా నేవూరో:** ప.బం. పరస్పరం సంబంధం లేనివారు అనే అర్థంలో వాడబడే పదబంధం.

"నిట్టచూపులతోడ నీ మొగము చూచీ నాపె
వొట్టి నీ వేవూరో తా నేవూరో కాని" 18-15

## ను

**-నుంటె:** ప్ర. 'నుండి' అనే పంచమీవిభక్త్యర్థంలో వాడబడే ప్రత్యయం.

"పొదిగిన మా యిద్దరికిఁ బొత్తుల నీ వాడనుండె
యిదివో వలపు చల్లే వెరఁగనా నేను" 14-437

**నుక్కిళ్లు:** వి; బహు. 'నొక్కిళ్లు'కు వ్యావహారికరూపం. నొక్కిడికి బహు. రూపం. నొక్కడాలు.

"మొలకలే నగవుమోముల గోళ్ల
నులిమేటి వదనపు నుక్కిళ్లో" 5-31

**నుచ్చిళ్ళు:** వి; బహు. ఉమ్మనీరు, నురుఁగు, ఫేనం. (శ.ర.)

"నీళ్లతీఁగెలు నిగుడఁగ నోర ను
చ్చిళ్ళు గమ్మఁగ నెట్లుండితివో" 1-68

**నుడుగుల వడ్డివాఁడు:** వి. వాయాడి, ఎక్కువగా మాట్లాడేవాడు, వదరుబోతు.

"శ్రీవేంకటాద్రిమీఁది సేతల యేతులవాఁడు
వావాత నుడుగుల వడ్డివాఁడు" 22-69

**నుదుగులు దప్పినా నోము ఫలమిచ్చు :** సామెత; ఒకటి రెండు పొరపాట్లు జరిగినా చేసిన మంచిపనికి ఎప్పుడూ ఫలితం ఉండు.

**నుదుట వ్రాసిన వ్రాత :** ప.బం; వి. అదృష్టం.
"నుదుట వ్రాసిన వ్రాఁత నూఁటికి నీ తిరుమణి
యెదురేది మాకు నేఁడు యేఁడులోకాల" 3-580

**నుయ్యో కొండో :** ప.బం. ఏది గతో అని భావం.
"నిక్కము నాతని కింక నేనేలే నీవు
నొక్కకువే నా చెక్కు నుయ్యో కొండో" 5-341

**నురుగు :** వి. పొడి.
"నువ్వులుఁ జిటిబెల్లాలు నున్నని చిమ్మిలులు
నువ్వుటిడియునుఁ జిన్నినురుగులును" 1-256

**నురుగులు :** (2) వి. భక్ష్యవిశేషం.
"చక్కిలాలు నురుగులు సతులు దాఁచినవెల్ల
అక్కరఁ గైకొంటివట అది దగవా" 11-39

**నులిగురులు :** (నులి + కురులు) వి; న. చిక్కులు పడిన వెండ్రుకలు.
"తరుణి నినుఁబెడఁబాసి తపముశాయఁగఁ
దొడఁగె
విరహంపు నులిగురుల విరిజడలతో" 7-290

**నులిపచ్చి :** (2) విణ. కొద్దిపచ్చి.
"యెలమి శ్రీవేంకటేశు నిట్టె నేఁగాఁగిలించితే
నులిపచ్చితో నేల చన్నుల నొత్తేవే" 18-70

**నులివాఁడి :** విణ. కొద్దివాఁడి.
"వలపించినవాఁడవు వంకలానే రుతువు
నులివాఁడి గోరఁజెక్కు నొక్కఁగనేల" 20-485

**నువ్వుగింజంత :** విణ. మిక్కిలి కొద్ది.
"కోటులైన వేదములు కొనాడీ నిన్నందులో నా
నోటి విన్నపము లొక్క నువ్వుగింజంతే" 3-42

**నువ్వుటిడి :** (నువ్వు + ఇడి) వి. భక్ష్యవిశేషం.
"నువ్వులుఁజిటిబెల్లాలు నున్నని చిమ్మిలులు
నువ్వుటిడియునుఁ జిన్నినురుగులును" 1-256

**నుసికిలు :** అ.క్రి. నిఘంటువుల్లో ఈపదం కానరాదు. జారు, అంటీ అంటనట్లుండు.
"చెనఁటి యే పుణ్యమైన జేయని
యోగేశ్వరుఁడు
నూనె గొల్పిన కుంచమై నుసికిలును"
8-375 old

**నుసుగు :** అ.క్రి. మాం. తిరస్కరించు, తొలగించు.
"నొసలి వ్రాసిన వ్రాలు నుసిగితే మానీనా
కొసర జగము నాకే కొత్తలయ్యీనా" 3-7

## నూ

**నూఁగురులు :** వి; బహు. సన్నని కురులు.
"నున్నని గోరు దీసి నూఁగురుల కొప్పు దీసి
యిన్ని నే రట్టుసేసితే నేమి సేసేవే" 8-83

**నూఁగులెక్కు :** మృదువగు (?)
"అన్నియుఁ జక్కనయ్యీని అందుకేమి
లేవయ్యా
నున్నని వలపే కాదా నూఁగులెక్కఁగాక"
21-174

**నూఁటికి నొక్క నూలిపోగే యగు :** (2) ప.బం. నూరు అపరాధాలను ఒకనూలుపోగు సమర్పించి తొలగించుట అగు.
"ఎన్నియైనాఁ జేయనీవే యింత చాలదా నాకు
నున్నఁగా నూఁటికి నొక్క నూలిపోగే కాదా"
14-349

**నూఁతులు తవ్వఁగబోతే బేతాళములు పుట్టె :** నానుడి; మంచి చేయఁబోతే చెడు జరుగు. చూ : నూతిలోనే బేతాళములు పుట్టు.
"నూఁతులు దవ్వఁగబోతే బేతాళములు పుట్టె
కాఁతాళపు లోకులాల కంటిరా యీ సుద్దులు"
2-8

**నూకు :** స.క్రి. తోయు, గెంటు.
"నాకుఁ జెప్పరె వలపు నలుపో తెలుపో
నూక పోవఁగరాదు నుయ్యో కొండో" 5-193

**నూటికొక్కటే నూలిపోగని :** సామెత; నూరు అపరాధాలను ఒకనూలుపోగు సమర్పించి తొలగించుకోవడం.

"నూటికొక్కటే నూలిపోగని
కూటువలై కైకొనుటేకఁ గాక" 20-226

నూతి కొలఁది చేఁతాడే యెరుఁగు : సామెత ; కొన్నింటికి సంబంధించిన వివరాలు కొందరికే తెలుసు అని భావం.
"చేరువ నూతి కొలఁది చేఁతాడే యెరుఁగుఁగాక
సారె మిమ్ము నంత మాకు సాధించ నేఁటికి" 20-376

నూతిలోని బేతాళాలు పుట్టు : నానుడి ; అ.క్రి. ముందికి పోతే దెయ్యు జరుగు, నీళ్ళకోసం పోతే అందులోంచి దయ్యం లేచి వచ్చిందనడం.
"దవ్వుగా మాటలాడేవే తగునటవే జోలి
దవ్వకు నూతిలోని బేతాళాలు పుట్టీని" 17-283

నూనెఁ గొలిచి కుంచము నుసికిలినట్లు : (?)
"పూని హరిఁ జేతులారాఁ బూజించుటొకటే
నూనెఁగొలిచి కుంచము నుసికిలినట్లు" 4-80

నూనెకుంచము : వి. నాలుగు మానికల ప్రమాణంకల నూనె పాత్ర.
"అన్నియు వింటానే అట్టే వాసన గొంటానే
వన్నెల నూనె కుంచమువలె నున్నాఁడు" 2-232

నూరిటికి రుణ మొక నూలిపోగు : ప.బం; వి. చూ : నూటికొక్కటే నూలిపోగని.
"తీరుచు నతఁడే దినకర్మంబది
నూరిటి రుణ మొక నూలిపోఁగునా" 9-170

నూరిపోయు : (2) ప.బం; అ.క్రి. లేనిపోని మాటలు బోధలు చేసి ఎదుటి వారిపై నెపం మోపు.(పద.) ఊరికే బోధలు చేయు, బాగుగా బోధించు.
"పూసగుచ్చినట్టు చెప్పి బుద్ధులెల్లా నీకు నూరి
పోసిఁగా చెవిలోనను పొద్దు నీకును" 19-109
"వాలిక చూపులు నీకై వంచె నొక్కమాట నేఁడు
పోలికలు నాఁడె నూరిపోసితివేమో" 26-201

నూరునిండు : ప.బం; అ.క్రి. ఆయుర్దాయం తీరు, చనిపోవు.
"పటుకున దెగె దైత్యభామల మెడతాళ్లు
మటుమాయదైత్యులకు మఱి నూరు నిండెను" 4-520
"నోవితోడఁ గంసునికి నూరునిండెఁ జూడఁగాని
భూమికెల్లా నోర నూరి బోసినవాఁడు" 11-3-55 old

## నె

నెంజిరి : వి. నెంజిలి కావచ్చు. నెంజిలి అంటే మనోవ్యథ అని అర్థం.
"చిత్తము నెంజిరి దీర శ్రీవేంకటేశ నన్ను
హత్తించిరి మేలు అయ్యో మీరు" 26-86

నెంజిరివి : (2) 'నెంజెరివి' కావచ్చు. మనస్తాపం.
"అగడుఁజేఁతలు సేసి యమరఁ జెప్పేవాని
నిగిడి పంగించక నెంజిరివి దీరునా" 26-376

నెంజిలి : వి. మనోవ్యథ, ఖేదం, విచారం.
"కూరిమి నా పతి నిట్టి కుచములఁ గుమ్మినాను
తీరదు నా నెంజిలి దీని కేమి సేతువే" 17-30

నెంజెరివి : (నెంజి + విరివు) ఎదలోని తాపం, మనోవ్యథ అని తమిళం. అదియే ఇది కావచ్చు నని. (సం.ప.స. 14-352 పుట.)
"కోమలపువాఁడంటాఁ గొంకి యున్నదానఁగాక
నేమాన నేమి సేసినా నెంజెరివి దీరునా" 14-170

నెగులు : వి. బాధ, దుఃఖరూపమైన విచారం.
"నే నిదె నీ విదె నెగు లేలే, నానాఁడొ
తగులాయ నవ్వులింకా నేలే" 20-260
"ధీరత వేంకటగిరిదేవుడైన వానికి నా
నేరుపెల్లఁ జూపక నా నెగులేల తీరునే" 5-47

నెటికలు దీయు : ప.బం; అ.క్రి. వేళ్ళసందులను విఱుచు.
"సిగ్గులు వడుతా నీ చేతి నెటికలు దీస
అగ్గమై నీలోని యాయాలు ముట్టెనో" 12-359

నెట్టన : క్రి.విశే. 1. అవశ్యం 2. తప్పక 3. మిక్కిలి అధికంగా 4. తెగించి, సాహసించి 5. నిజంగా 6.న్యాయంగా 7. అనాలోచితంగా 8. చక్కగా 9. నిండుగా, సమృద్ధంగా.
"నెట్టన సూర్యులోని నెలకొన్న తేజమా

గట్టిగాఁ జంద్రునిలోని కాంతిపుంజమా" 2-329

**నెట్టుకొను:** (2) ప.బం; అ.క్రి. 1.కడగు, పూను 2.చెలరేగు 3.అభినివేశం కలిగి ఉండు 4.పట్టుపట్టు 5.స్థిరపడు 6.నివసించు 7.అతిశయించు 8.కలుగు. (తె.వ్యు.కో.)

"నేరుపుగలయందుకు, నెట్టుక మాటాడవలె
వోరుపుగలయందుకు వొడఁబడి వుండవలె"
28-199

**నెట్టెము:** వి. 'నెట్టియము'నకు రూపాం. చుట్టకుదురు, గుండుపాగ.

"జట్టిగొన్నవాఁడవు చన విచ్చినవాఁడవు
నెట్టెపు మోహపు గురి నీవే నాకు" 7-567

**నెడుమధ్య:** మాం. నడమధ్య, రెండింటికీ నడుమ, ఇద్దరికీ నడుమ.

"యేచి రెంటికి నెడ మధ్య మీ మేను
తాచి వొకఁడే గురి తానాయ నాత్మ" 2-386

**నెత్తిఁబెట్టుకొను:** ప.బం; స.క్రి. గౌరవించు, ఆదరించు.

"నెలకొని యే పొద్దు నెత్తిఁ బెట్టుకొందువు
వలపుల నోము నీకు ఫలియించె నయ్యా"
13-80 & 11-225

**నెత్తికెక్కు:** (నెత్తికి + ఎక్కు) ప.బం; అ.క్రి. తగని పెత్తనం చెలాయించు, మిక్కిలి చనవు ప్రదర్శించు. కూడని వారిని గౌరవిస్తే ఇక నీ మాట వినక నీపైనే పెత్తనం చెలాయిస్తారు అనే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి.

"సలిగ గద్దంటాను సారె నెత్తికెక్క రాదు
పిలిచే వంటా నీతో బిగియరాదు" 23-234

**నెత్తికెత్తుకొను:** ప.బం; స.క్రి. పైన పెట్టుకొను, గౌరవించు.

**నెత్తిమీఁది చిచ్చు:** ప.బం; వి. సన్నిహితమైన ఆపద, నిత్యబాధాకరం.

"మిత్తివలెఁజెలరేఁగి మీఁదఁగాసే యెండకంటే
నెత్తిమీఁది చిచ్చు గాదా నీడలోని యెండ"
5-199

**నెత్రుపట్టము:** వి. నెత్తురు కూడు వంటిది, రక్తపాతం వల్ల గెలిచిన ప్రాభవం.

"ఆసపడి వరదాన మడిగిన పొలము
బాసలతోఁ గడు నెత్రుపట్టమైన పొలము" 4-52

**నెప్పు:** వి. నేర్పు, కౌశలం, ఉపాయం, (తె.వ్యు.కో.) స్థైర్యం.

"నెప్పున మా యింటికి నీవు రానివాఁడవా
అప్పటినే చుట్టాల మాటాడుతా నీకుండిరో"
7-342

**నెమలిగరులు:** వి. నెమలి యీకలు.

"కొండపడ మేడలలో గూరుసుండు మనవే
నిండు నెమలిగరులు నెత్తినెక్కను" 11-93

**నెమ్మళ్ల వ్రాసిన చీర:** వి. నెమళ్ళు చిత్రింపబడిన చీర.

"పన్నుకొని మేఘునకుఁ బరిణామ మవుఁగాని
చిన్న నెమ్మళ్ల వ్రాసిన చీర గట్టరే" 24-545

**నెయ్యపు చేతలు:** వి; బహు. స్నేహపుపనులు.

"నెయ్యపు నీ చేతలకు నీతోఁ బెనగఁగాను
చయ్యన గొప్పతురుము జారె నిట్టెకాక" 7-186

**నెరఁతనీఁడు:** (నెరతనము + ఈఁడు) వి. నెరతనము గలవాఁడు, నేర్పు గలవాఁడు.

"నెరతనీఁడవు నీవు నేరనిదాన నేను
పొరసి నన్ను నడపే పుణ్యము నీ చేతిది"
27-240

**నెరజాణఁడు:** వి. మిక్కిలి నేర్పరి, వగలమారి.

"పలికి బొంకనివాఁడు పంతగాఁడు తానన్నిటా
నిలువు నూరు వండేటి నెరజాణఁడు" 13-374

**నెరయన్:** క్రి.విఠ. పూర్తిగా.

"నెరయ రూపములెల్ల నీ రూపమే కా
నరయని యది నా యపరాధము" 1-271

**నెరవాది:** వి. సమర్థుడు, శక్తిమంతుడు (తె.వ్యు.కో.) ఈ పదం పుష్పవతి, రజస్వల అనే అర్థాల్లో కూడా ప్రయుక్తం. సూ.ని. లో నెఱవాది, అనే శకటరేఫయుక్త పదానికి నేర్పరి, జాణ, సమర్థుడు అనే అర్థాలు ఇవ్వబడ్డాయి కానీ ఈ అర్థం ఇవ్వబడలేదు. అయితే అన్నమయ్య దీన్ని సాధురేఫయుక్తంగానే రెండర్థాల్లోనూ ప్రయోగించినాడు.

"ఇయ్యకొంటి గానీవె యిందుకేమి
నెయ్యపు మాటలకెల్లా నెరవాది తాను" 7-72
"నెరవాది వైతేను మరుపుకోవలెఁ గాక
తెరవ నీ నేరుపెల్లాఁ దేటపడీఁ గాక" 28-78
"అట్టి నెరవాదివి నీ వలమేలు మంగవు
నెట్టన నీ రమణుఁడు నిన్ను మెచ్చీ నిందుకు"
28-123
"వచ్చి వచ్చి యాపె నెరవాదిఁ జేసినవాఁడవు
నిచ్చలును గొనియాడనేరవా నీవు" 26-213
"కలువరేకులవంటి కన్నుల నాడె చూడఁగా
నిలుచున్నది యెదుట నెరవాది తాను" 26-213

**నెరవాదితనము:** (నెరవాది + తనము) వి. సామర్థ్యం, నేర్పు.
"మురిపెము లెల్లా నీ ముందరనే పచరించు
నెరవాదితన మెంత నేరుచునో తాను" 28-459

**నెరవేసాలు:** వి; బహు. (?)
"నిగ్గుల నిక్కి చూచితినే నింటిలోని కేఁగితి
వెగ్గమంతకు నెరవేసా లేలే" 26-5

**నెరసు:** వి. దోషం, చిన్న తప్పు, లోపం .
"నిర్మితము నీ దింతే నెరసు లెంచఁగనేల
ధర్మమందు నింక గజదంతపరీ క్షేటికే" 1-497

**నెరుస:** వి. 'నెరసు' కావచ్చు. నలుసు, దోషం, కళంకం, తప్పు, గొండ్లవాడు కత్తులు నూరే పొడి.
"నిగరాలు బాసలు నెరుసలు మాయలు
మగువలు నీకే యెట్టు మరుపుదురో" 27-472

**నెఱజాణఁడు:** వి. చూ: నెరజాణఁడు. 16-179

**నెఱతనము:** (1) వి. కుశలత, జాణతనం, ధర్మం, న్యాయం, వైశాల్యం, శక్తి, సామర్థ్యం , నేర్పరితనము, నిండుదనము .
"నెఱతనములు చూపి నీవు మా ఇద్దరిలోనా
వొఱగులు దిద్దేవు వువిద నీవు" 25-276
"నెఱతనాలూరకె నెరపుచు యిట్టి
చిఱునవ్వు నవ్వేవు చెలువరా" 10-2-21

**నెఱవు:** వి. హెచ్చు, సమృద్ధి .
"వెఱవకు మనసా విష్ణుని యభయము
నెఱవుగ నెదుటనె నిలిచినది" 3-276

**నెలదలూరి చొక్కనాథుఁడు:** వి. కడపజిల్లా రాజంపేట తాలూకాలో కోడూరు దగ్గర నందలూరు గ్రామం ఉంది. ఇట బాహునదీ (చెయ్యేరు) తీరంలో చొక్కనాథస్వామి ఆలయం ఉంది. తాళ్ళపాకవారు పేర్కొన్న నెలదలూరి చొక్కనాథుడు నందలూరి చొక్కనాథుడే కావచ్చును. ఈ ఆలయం నిర్మాణంలో ప్రత్యేకత కలదనీ, సూర్యోదయ సమయంలో సూర్యకిరణాలు స్వామివారిపై పడతాయని ప్రశస్తి. ఈ ఆలయం పురాతనమైనది. నెందలూరు అని సంపా.
"చల్లరవెట్టుఁజేతల చొక్కనాథుఁడు
వుల్లములో నీ నెలదలూరి చొక్కనాథుఁడు"
10-2-20

**నెలవరి:** (నెలవు + అరి) వి. 'నెళవరి'కి రూపాం. 1.కాపురం ఉండేవాడు 2. పరిచయం కలవాడు 3. గుట్టుతెలిసినవాడు
"వాసుదేవ నీవు నెలవరివి మగుడ నేల
యీసరి నీవద్దనుండే యె(నె)ట్టినఁ
జేయవయ్యా" 4-43

**నెలవుకొను:** వ.బం; అ.క్రి. 1. ఉండు 2. ప్రకాశించు 3.స్థిరపడు 4. నెలకొను 5. వ్యాపించు 6. కీర్తికలుగు.
"యీతల శ్రీవేంకటాద్రి నీటు విజనగరాన
నీతితో నెలవుకొని నెగడితివి" 4-274
"అలమేలుమంగ నురమందు నెలవుకొలిపి
తలకొన నంతటా బూదండలు వేసి" 23-376

**నెలవుకొలుపు:** స.క్రి. 1. నిలుకడగా నుంచు 2. నిలుపు.
"తొలఁగఁదోసి జగములెల్లఁ దొల్లిటట్ల
బహువిధముల
నెలవుకొలిపి దొంతివేర్చ నేర్చుఁగాన
యీతఁడు" 5-231

**నెల్లిచెట్టు:** వి. మాం. ఉసిరికచెట్టు .
"నెల్లిచెట్టు మందు గాదు పెద్ద కొండలెక్కి తెచ్చే

నెల్లిచెట్టు చవిగాక నేమేల మీకు" 19-435

**నెల్లూరి శ్రీవేంకటనాథుఁడు :** వి. జిల్లాకేంద్రమైన నేటి నెల్లూరులో వెలసిన వేంకటనాథుడు.

"చేరవచ్చి నెల్లూరి శ్రీవేంకటనాథుఁడిట్టె
యీ రీతినె ననుఁగూడె యిందిరనా నేను"
10-89

**నెళనెళన:** అవ్య. విరవడంలో జరిగే ధ్వనికి అనుకరణశబ్దం.

"నెళనెళన విరిచె నిక్కి వాని గొనుకులు
పెళపెళ నారిచి పెచ్చుపెరిగె హరి" 4-513

**నెవ్వ:** వి. దుఃఖం, లేమి, దారిద్ర్యం.

"నెవ్వ దీర నిదె నిను విశ్వరూపుఁ
డెవ్వల నవి శ్రుతులెంచీఁ గాక" 4-418

## నే

**నే:** వి. నేయి.

"గోమున హేయపు గుండకూడు నించితినట
గామిడి నేగారే తిత్తిఁ గానోపనా" 1-169

**నేతబేహారి:** వి. నేతనేసి బట్టలు సిద్ధంచేసి వాటిని అమ్ముకునే వ్యాపారి.

"వాడల వాడల వెంట వాఁడెవో వాడెవో
నీడనుండి చీరలమ్మే నేతబేహారి" 1-275

**నేగారే తిత్తి:** వి. నేయి కారే తిత్తి (?)

"గోమున హేయపుఁ గుండకూడు నించితినట
గామిడి నేగారేతిత్తిఁ గానోపనా" 1-169

**నేతిబీరకాయ:** వి; ప.బం. సార్థకం కాని పేరు, డాంబికమైనది, ఒకరకం బీరకాయను 'నేతి బీరకాయ' అని అంటారు. కాని అందులో నేయి ఏమాత్రమూ ఉండదు. నేతి అనే పదానికిక్కడ సార్థకత లేదుకదా! పేరుకు తగినట్లుగా ప్రవర్తించని వారిపట్ల వాడే పదబంధం.

"నేతిబీరకాయ నెట్టనఁ గర్మబంధము
బూతు చిల్లి నేస్తమెప్పుడును మనసు" 15-325

**నేతిబీరకాయ నేయి:** సార్థకం కానిది.

**నేమము:** (6) వి. 'నియమము'నకు వికృతి రూపం.

"బలు నీ నేమము చూచి ప్రత్యక్షమయితి నీకు
అలమి నీ కాఁగిటనే అనుభవించవయ్యా"
7-265

**నేమస్థుఁడు:** వి. 'నియమస్థుఁడు'కు వికృతిరూపం. నియమంలో ఉన్నవాడు.

"ఇట్టి వదలితేను యెందైనాఁ బారు మనసు
కట్టుక నేమస్థుఁడైతే కైవసమై యుండును"
2-341

**నేమినా తప్తముద్రాం ధారయేత్:** నేమి అంటే లక్షణయా చక్రమని అర్థం. చక్రంతో వేడి ముద్రలను వేయించు కోవాలి అని భావం.

"మును నేమినా తప్తముద్రాం ధారయే త్తని
వెనువెంట శ్రుతి యదె వెల్లవిరి సేసీని" 2-485

**నేము:** (23) వి; బహు. 'నేను' కు బహువచనరూపం. మేము.

"కడనుండి నే మేల కరఁగేమో నేము" 3-9

"నేము నీవారమె యిందు నెరుసు లేవి
చే మీఁదయిన మీఁద చెప్పనేల పనులు" 7-69

**నేరుపరివాఁడు:** వి. నేర్పరి.

"నీటుతోడివాఁడవు నేరుపరివాఁడవు
యేటికైనా వెరవవు యీడా నాడను" 8-250

**నేరేడుఁబండులమ్ము:** (?)

"ముచ్చట నేమడిగితే మెఱఁగు మొఱఁగు
మాటలాడేవు
వంచించి యాల నేరేడుఁ బండులమ్మేవే" 7-206

**నేర్పుఁదనము:** (నేర్పు + తనము) వి. నేర్పు. భావార్థకంమీద మళ్ళీ భావార్థకప్రత్యయం.

"గుట్టుతోడ నున్న సతి గొల్లునను నవ్వించి
నెట్టనఁ గాఁగిలించుటే నేర్పుఁదనము" 20-460

**నేలకు మంటికి:** ప.బం. భూమికీ ఆకాశానికీ ఏకంగా.

**నేల మిన్ను నొకటగు:** ప.బం; అ.క్రి. భూమ్యాకాశాలు ఒక్కటగు.

"నేలమిన్ను నొకటై నిలుచున్న రూపుతోడ
పాలువడి మెరసీని ప్రత్యక్షదైవము" 4-359

నేలపోద్యము పేరిటి నెలంత : వి. భూదేవి.
"గాలికూటిపేరి గట్టుమీఁదటివాఁడ
నేలపోద్యముపేరి నెలఁతయె నిన్ను మెచ్చె"
10-2-117

నేవళము: వి. నిగనిగలాడే, ఏపుగా పెరిగిన (మణులు గుచ్చిన హారం - అం.ప.ని.)
"నేవళపు నీ యూరు నీలాహిఁబోలితేను
యీవల మేను మెఱుపునేల పోలెనే" 24-204

నేస్తకాఁడు : (నేస్తము + కాఁడు) వి. మిత్రుడు, స్నేహితుఁడు.
"ఘటన నెవ్వతె నేస్తకాఁడ వైతివయ్యా
అటుమటా లెల్లా దిద్ది అప్పుడే వేసరితి"
23-506 & 29-23

నేస్తగత్తె: (3) (నేస్తము + కత్తె) వి. స్నేహితురాలు. రూపాం. నేస్తగత్తె.
"పొరుగుపోరచి వచ్చి పొలసీ నీ నేస్తగత్తె
గరిమ నీ పచ్చడము గప్పఁగరాదా" 26-267

నేస్తము : (2) వి. చెలిమి, స్నేహం.
"నను నేలితివి ముందే నంటున శ్రీవేంకటేశ
నిన్నుఁజెనకీ దానూ నేస్తము గాబోలు"
"నెలఁతకు మగనితో నేస్తమే మంచిది గాక
అలుకలు నెరపితే నట్టే విసుగరా" 7-363

## నొ

నొక్కిళ్ళు : వి; బహు. నొక్కుళ్ళు, అదుముటలు.
"నను గోరికొనలు నొక్కిళ్ల
పొనుఁగని తములము పుక్కిళ్ల" 28-419

నొగులు : వి. కీడు, హాని, బాధ, కష్టం, కోపం, విరోధం, పగ, దుఃఖం, విచారం, ఇడుము, ఆపద. (వ్యు.)
"పుక్కిటి తమ్ములమిడి పొదిగొన్న కాఁగిటిలో
నొక్కినఁగాని నా నొగు లేల తీరునే" 5-147

నొడుగు : (8) స.క్రి. 'నుడుగు'కు రూపాం. పలుకు.
"నీవల్లఁ గొరత లేదు నీ పేరు నొడిగితే
శ్రీవేంకటేశ యిట్టె చేరి కాతువు" 3-18

నొప్పులుసేయు : ప.బం; అ.క్రి. బాధించు.
"పొడవుఁజందురుఁడు నొప్పులుసేయు విరహులను
పెడమొకము చేసి నొప్పించేవు" 6-111

నొసలివ్రాలు తుడుచు : ప.బం; అ.క్రి. నొసటి వ్రాత మార్చు, విధిని మార్చు.
"తుడువఁడా కపటదైత్యుల నొసలివ్రాలు" 1-126

నొసలు బత్తుఁడు నోరు దోఁడేలు : ప.బం; వి. పైకి సాధువుగా కనిపించే క్రూరుడు. గోముఖ వ్యాఘ్రం, పయోముఖ విషకుంభం వంటిది.
"తులదూఁగ నొసలు బత్తుఁడు నోరు దోఁడేలు
మెలఁగిన యట్టయితే మెచ్చునా దేవుఁడు"
15-225

## నో

నోడలఁబెట్టు : స.క్రి. (?)
"వీడెము నా చేతికిచ్చి విందుల మోవియ్యఁగాను
నోడలఁబెట్టి పతికి నోరూరే వేమే" 26-471

నోరికతలు : వి. నోరిమాటలు, పైపై మాటలు, నిజంకాని మాటలు.
"కప్పురాలు నీ నోరికతలె కావా" 7-332

నోరునిండా నుతియించు : ప.బం; స.క్రి. మనసారా స్తుతించు, తృప్తిదీర స్తుతించు.
"అరసి పెద్దల నన్ని నడుగుచుండవలె
నోరునిండా నుతియించవలెను" 8-228

నోరునిండా మాట్లాడు : ప.బం; అ.క్రి. బాగా (తృప్తిగా) మాట్లాడు.
"నోరునిండా మాటలాడె నుడుగరాదందరిలో
చేరి పతి నడుగరే చెలులాల"

నోరుసేయు : ప.బం; అ.క్రి. ఎక్కువగా మాట్లాడు, గట్టిగా కేకలు వేయు.
"పంతమాడి పగచాటి బలిమి నోరుసేసేవు
యింతలోనే నేఁడు నీకు నివి గొత్తలా" 16-373

నోరూరించు : ప.బం; అ.క్రి. ఆశకలిగించు.

**నోరూరు:** (3) ప.బం; అ.క్రి. తిన బుద్ధివేయు, అనుభవింప కోరిక కలుగు, ఆశ పుట్టు, తినదగిన వస్తువు కనబడినప్పుడు నోటిలో నీరూరడం సహజం. దానిపై వచ్చిన పలుకుబడి.

"నొక్కుచు మో వియ్యఁగానె నోరూరెను" 8-159

**నోరెత్తు:** ప.బం; అ.క్రి. మాటలాడు.

"ఎందును నీ కతఁడు నోరెత్తకుండ మంత్రాలు
మందులు నేరుతువుగా మా యమ్మా" 5-359

"పడఁతి నోరెత్తితేను పగడాలే రాసులయ్యీ
యెడపు నిన్నుఁదిట్టితే నేమాయనయ్యా"

20-167

**నోళ్లు దెరచు:** ప.బం. అత్యాశపడు, మాటలాడు.

"యే కొలఁతని యిఁక నాసపడుచు
నే మెవ్వరికి నోళ్లు దెరచెదము" 9-82

**నోవి:** (3) 1. నొప్పి 2. బాధ 3. వ్యాధి.

"భావంబు తలపోఁత బతి మెట్టిదో కాని
నోవి దోఁపనిచోట నొచ్చెద ననవలసె" 5-255

## ప

**పంకించు:** దీనికి నిఘంటువుల్లో ఈ కింది అర్థాలు చెప్పబడ్డాయి. 1.బురదగ చేయు 2.సరిచేయు (సూ.ని.) 3.రుద్దు, చరుము 5.నూనె మొ॥ జుట్టుకు పట్టించు, రాచు, వాటిని బురదలాగా పట్టించు, అంకితమొనర్చు, (తె.వ్యు.కో.) 6.చలించు, భయపడు 7.సరిచేయు, హెచ్చుతగ్గులు కాకుండా చేయు 8.ఊగించు, ఊపు. పై అర్థాలు ఈ కింది కీర్తనల్లో సరిపోవడం లేదు. గౌరవించు, పెద్దగ చూచు అనే అర్థాల్లో ప్రయోగించినట్లున్నదనీ, 'నిన్నెవరు పంకిస్తారురా' ఇత్యాది వ్యవహార మీ నాటికీ ఉందనీ, తలపంకించు లో గూడ దీని తాత్పర్యమే అగపడుతుందని సం.ప.స. (16 సం. 429 పు.)

"పీడెము నీ చేతికిచ్చు విజ్ఞపీఁగితేఁదనకు
తోడి సతులు పంకింతురా యిపుడు" 16-4

**పంగించు:** (35) స.క్రి. కోపించు, ఆగ్రహించు, చిడముడి పడు, వెనుక చేసిన పొరపాట్లను చూపి ఏడిపించు, దెప్పు, ఎత్తిపొడుచు అను అర్థముగ తోచుచున్నదని సం.ప.స. 16 సం.

"పలుమారు నిన్ను నింత పంగించేదానవా
తలఁగక సేవసేసేదానఁ గాక" 14-157

"యిదివో శ్రీవేంకటేశ యీకె నెట్టె యేలితివి
పదిమారులు నిన్నుఁ బంగించఁదగునా"

14-586

ఇది మాండలికపదమనీ, బలే పంగిస్తావు, నీ పంగెనలు నాకెందుకు ఇత్యాది జనవ్యవహార మీ నాటికీ ప్రసిద్ధమే అనీ భంగించు శబ్దభవం కావచ్చుననీ సం.ప.స. చెప్పబడింది. (16సం. 429 పు.)

"రవ్వగా నా పొకవేళ రాజసముతో నలిగి
యెవ్వరి ముందరనైనా యిట్టె పంగించదా"

16-258

**పంగు:** వి. భయం.

"పొంగుచుఁ దూరుపెత్తంగఁ బొలివారె నివ్వెరగు
పంగుల గోరువట్టు నీ భాగ్యము కొలఁదయ్యా"

11-442

**పంగెన:** (14) వి; మాం. ఎత్తిపొడుపు, హేళన, పట్టుదల, బింకం, (మోసం అని పీఠిక) శ.ర.లో, ఆం.ప.ని; ఆం.భా.మ. లో అవపాతం, ఓదం అనే అర్థం చూపబడింది. కాని ఈ అర్థం ఇక్కడ కుదరదు. పట్టుదల, సంకోచం, ద్రోహి అనే అర్థాల్లో శృం.శ. (తాళ్లపాకవారిది) లో ప్రయోగాలు కనిపిస్తున్నాయి.

"పంగెన కోపుదువా గోపాలకృష్ణ
కొంగు వట్టే వదేమోయి గోపాలకృష్ణ మా"

"పంగెనగాఁ బ్రియములు పదివేలు చెప్పఁగాను
యెంగిలి నీ మోవి యేల యియ్యే ననేవే"

16-358

"యింగితపు శ్రీవేంకటేశ ని న్నెనసె
పంగెన సురతపు పల్లవాధరి" 26-293

**పంగెము:** (8) వి. ఈ శబ్దం సూ.ని. మొదలైన ప్రసిద్ధనిఘంటువుల్లో ఎందులోనూ

కనిపించదు. ఇది 'భంగము' నకు వికృతి పదమా? అప్పుడు దీనికి 'భంగపడుట' అనే అర్థం చెప్పవచ్చు. ఈ క్రింది కీర్తనపాదాల్లో ఈ అర్థం కొంతవరకు పొసగుతుంది.

"పాయపుమదములకు పంగెమైనవాడు
యీయెడ నీవాడనని యెట్టు గొలిచేనయ్యా"

2-480

"ఆవల నిశ్చలబుద్ధి అది యెడ నే నేడ
భవము చంచలమనసు పంగెమే యెపుడు"

2-408

ఆనందమూర్తిగారు ఈ పదానికి స్వాధీనం, సంబంధం అనే అర్థాలు సూచించినారు. (సంకీ.వా. 456 పు.) ఈ అర్థములుకూడా పై ప్రయోగాల్లో పొసగుతున్నాయి.

**పంచచెట్టు మందు గాదు :** సామెత; పెరటిచెట్టు మందు గాదు అని అర్థం. చూ: పెల్లిచెట్టు మందు గాదు.

"పంచకువే శిరసు వలవని నెరుసు
పంచచెట్టు మందుగాదు పలుకు లింకేలే"

20-233

**పంచబంగాళమగు :** ప.బం; అ.క్రి. చెల్లాచెదరగు, అదృశ్యమగు

"పారరో యసురులు పంచబంగాళమై
పారిరి దానవులెల్లా పంచబంగాళమైరి" 4-21

**పంచబేరములు :** వి; బహు. శ్రీవేంకటేశ్వరస్వామి వారి ఐదు ప్రతిమలు. 1. ధ్రువమూర్తిబేరం (మూలవిరాట్టు) 2.కౌతుకబేరం (భోగశ్రీనివాసమూర్తి పంచలోహ విగ్రహం) 3. స్నపనబేరం (ఉగ్రశ్రీనివాసమూర్తి పంచలోహ విగ్రహం) 4. ఉత్సవబేరం (ఉత్సవమూర్తి మలయప్పస్వామి) 5. బలిబేరం (కొలువు శ్రీనివాసమూర్తి; పంచలోహ విగ్రహం)

"పరఁగి నీ ముందరను పంచబేరములుండఁగా
గరిమఁ జక్రము నీకుఁ గాపై వుండఁగా" 2-364

**పంచమవేదము :** వి. ఐదవవేదం. పరమ ప్రామాణికం.

"పంచమ వేదము నీకు పడఁతి మాటలెల్ల
సంచల నెవరిమాట చవులయ్యీని" 16-142

**పంచమహాపాతకాలు :** ఐదు మహా పాపాలు. అవి 1.బంగారాన్ని దొంగిలించడం 2. సురాపానం 3.బ్రహ్మహత్య 4. గురుపత్నీ సంగమం 5. స్త్రీ హత్య.

"పంచమహాపాతకాలే పట్టుకొనే యింద్రియాలు
పంచమహాపాతకాలే బారిఁదోయకేల మాను"

4-18

**పంచలఁదోయు :** స.క్రి. పారఁదోలు, పాడుచేయు.

**పంచల సంసారము :** వి. దీనమైన బ్రతుకు.

3-288

**పంచసంస్కారములు :** వి; బహు. తాపం, పుండ్రం, నామం, మంత్రం, యాగం - ఇవి వైష్ణవులకు విధింపబడిన సంస్కారాలు, ఇవి పొందిన వైష్ణవులు పరమైకాంత్యస్థితిని పొందగలుగుతారు.

"తాపః పుండ్రం తథా నామ
మంత్రో యాగశ్చ పంచమః
అమీ పరమ సంస్కారాః పారమైకాంత్య
హేతవః"

"యెంచఁ దాప-పుండ్ర-నామ-మహిత-మంత్ర
యాగమని
పంచసంస్కారములు చెప్పే పాంచరాత్రధర్మ
మిది" 15-113

**పంచామృతము :** వి. ఆవుపాలు, నేయి, పెరుగు, చక్కెర, తేనె అనే ఐదు మధురపదార్థాలను, కలిపిన పదార్థం. దేవాలయాదుల్లోనూ, శుభకార్యాలలోనూ ఇది వినియోగింపబడుతుంది.

"పంచామృతములతోడ పన్నీట మజ్జనమాడె"

7-473

**పంచారూఢిపత్రము :** వి. పంచాయితీనామా వంటి పత్రం, పత్రం వ్రాసినవాడు, వ్రాసియిచ్చేవాడు, ముగ్గురు సాక్షులు - మొత్తం ఐదుగురు ధ్రువీకరించే అప్పుపత్రం.

పంచరూఢీపత్రమే వ్యవహారంలో పంచారూఢీపత్రం కావచ్చు. పంచ + ఆరూఢీ పత్రం కూడా కావచ్చు.

"ఎలమి నందుకు సాక్షి యిరుమేలా నున్నవారు
బలిమిఁబంచబాణాలు పంచారూఢీపత్రము" 23-455

**పంచేంద్రియపదిలములు:** వి; బహు. పంచేంద్రియముల యొక్క నిర్భయమైన పనులు కావచ్చు. వైరిసమాసం.

"కడుపు నిండితే ఘనమై నిండును
బడిఁబంచేంద్రియపదిలములు (?)" 4-213

**పంజు:** వి. 1. కరదీపం, దివిటీ 2. రత్నం 3. ఒకవిధమైన కర్ణభూషణం 4. ఒకవిధమైన బాణసంచా.

"వుదయచందురుఁ జూచి అదె నీ పంజని సవి
యెదురుకోనే వచ్చితిరా" 7-223

"వెలయ నీ పంజుల వెలుఁగు చూచి అంతలో
పులకాంకురాలచేతఁ బొదలుచునున్నది" 14-593

**పంటకెక్కు:** ప.బం; అ.క్రి. ఫలోన్ముఖమగు.

"పంటకెక్కి పాలవెల్లిఁబండిన పాలపండు
తొంటి గొల్లెతల మోవి దొండపండు" 7-284

**పంటపండు:** (?) ప.బం; అ.క్రి. అదృష్టం ఫలించు.

"పంటపండే జవ్వనము ఫలియించే కాలమున
పంటమోవి యింతికి ఫలియించెను" 28-476

**పంటి:** వి. కడవ, కుండ.

**పంటెడు పాలలో నొక చల్లబొట్టు చేమిరి పెట్టినట్టు:** ప.బం; మంచి ఎంత ఉన్నా చెడగొట్టడానికి కొంచెమే చాలు అన్నట్లు, పాలు ఎన్ని ఉన్నా చేమిరి ఒక్క బొట్టు చాలుగదా!

"చెంతఁబంటెడు పాలలో నొక చల్లబొట్టు చేమిరి
వెట్టినట్టు
అంతటికిని శ్రీహరి శరణాగతి యిది యొక్కటె
నాకు" 4-77

**పండబడేవి:** వి; బహు. పండుకునేవి. స్వార్థంలో 'పడు' అను ప్రయోగం.

"యిల నేఁబండఁబడేవి యీశ్వర నీకు
మొక్కులే" 2-201

**పండరంగి:** వి. మహారాష్ట్రలోని పండరిపురం.

"పండరంగినుండి వచ్చి పామరులనెల్ల మెచ్చి
యెండలేని నీడలోన యెచ్చి యెచ్చి" 6-26

**పండరంగినాథుఁడు:** వి. పాండురంగక్షేత్ర నాథుడైన విఠ్ఠలుఁడు.

"రసికుఁడవౌదు పండరంగినాథా నీ
పసలఁ జిక్కితిమిదె పండరంగినాథా" 11-127

**పండరంగిరాయఁడు:** వి. పాండురంగక్షేత్రస్వామియైన విఠలుడు. 7-219 old

**పండరంగి విఠ్ఠలుడు:** వి. మహారాష్ట్రలోని పండరిపురక్షేత్రంలో వెలసిన విఠ్ఠలుడు.

"చలువ నీ మోవితేనె చవి గొన్న యందాకా
పలుకులు చాలించు పండరంగివిఠ్ఠలా" 21-513

**పండరిరమణుఁడు:** పండరిక్షేత్రానికి అధిపతి యైన విఠలుడు.

"పండరిరమణ రామ బలరామ పరమపురుష
చండభార్గవరామ శరణు శరణు" 4-321

**పండినపంటలు:** ప.బం; వి; బహు. ఆనందదాయకములు.

"పండిన పంటలు పరమాత్ముని విరిఁ
బండయి తెరిగిన బడలికలు" 1-24

**పండిన పసిఁడి:** ప.బం; వి. అబ్బిన మహాభాగ్యం, అబ్బిన మహాసంపద, మిక్కిలి ఆనందదాయకం.

"అండనున్న హరి నాత్మఁదలఁచిన
పండిన పసిఁడే బ్రతుకరో ప్రజలు" 1-101

**పండి పొల్లపోవు:** ప.బం; అ.క్రి. చేతికి వచ్చినది నోటికి అందకపోవు, పంట పండి కూడా వ్యర్థమై పోయిందనడం.

"పండి పొల్లవోయానా పట్టరాని మనసు
యెండకు నీడకుఁ దీసి యింత కోపఁగలనా" 8-49

**పండిరాసులగు:** ప.బం; అ.క్రి. ఎక్కువగు.

"పండిరాసులాయెఁ గీర్తిప్రతాపములెల్ల" 1-3 old

**పండుండు:** (2) (పండి + ఉండు) అ.క్రి. పడుకొని ఉండు.

"పని నీకుఁ గలిగితే పానుపుపైఁ బండుండవే" 24-273

**పండు:** (4) అ.క్రి. పడుకొను, శయనించు. అన్నమయ్య అంతటా 'పండు' అనే రూపాన్నే వాడినాడు కాని నేటి 'పడుకొను' అనే రూపాన్ని వాడలేదు. తెలంగాణంలో ఎక్కువగా పండుకొను పదమే వాడుకలో ఉంది.

"అక్కరతో సరిపార నాలవట్ట మిడఁగాను
పక్కఁ బండుమని యెంత బాతిపడేవు" 28-275

"కదిమి వొత్తఁగరాదు కాలు చేయి వేయరాదు
పదపడి నేనెట్టు పక్క బండేనే" 26-391

**పండు గాయసేయు:** ప.బం; అ.క్రి. ఎక్కువదానిని తక్కువచేయు.

"ఎండలోని నీడ యీ మనసు
పండు గాయసేయఁ బనిలేదు మనసు" 1-337

**పండుజవ్వని:** వి. నిండుజవ్వని.

"పండుగలు గాఁగ నిట్టె బాపురె శ్రీవేంకటేశ
పండుజవ్వనిఁ గూడితి పవ్వళించరాదా" 11-372

**పండ్లగెల:** వి. పండ్లగుత్తి.

"యెడమచేతఁ బట్టె నిదివో పండ్లగొల
కుడిచేత రాకాసిగుంపుల గొట్టె" 4-167

**పంత(క)గత్తె:** (14) (పంతము + కత్తె) వి. ప్రతిజ్ఞ చేసిన స్త్రీ, పట్టుదల గల స్త్రీ, పౌరుషం కల స్త్రీ, పోటీపడే స్త్రీ.

"చెచ్చెర నింకా నీవు సేసినట్టె సేతుఁ గాక
పచ్చితిట్టు దిట్ట నీతో పంతగత్తెనా" 27-227

**పంతగాఁడు:** (12) (పంతము + కాడు) పోటీ చేయువాడు, ప్రతిజ్ఞ చేయువాడు, పౌరుషం కలవాడు.

"పంతగాఁడయితే నేమి బయలీఁదించితే నేమి
యింతేసి నమ్మికలు నా కిచ్చెఁగా తాను" 29-210

**పంతగారితనము:** (పంతము + గారి + తన) వి. పౌరుషశాలిత్వం.

"పంతగారితనమునఁ బదరే వదేమి నీవు
మంతనాన నెవ్వతెచే మాటఁబడినావో" 24-582

**పంతగారివాఁడు:** (2) (పంతము + గారి + వాడు) వి. పంతగాడు, అందగారి శబ్దంవంటిది. 'పంతగాడు'కు పంతగార అని కన్నడం.

"పంతగారివానిని పచ్చిగా నాడఁగరాదు
అంతరంగమైనవాని నణఁచరాదా" 23-182

**పంతగారిసతి:** (పంతము + గారి + సతి) పంతకత్తె 'గార' అనేది కలవాడు, కలది అనే మత్వర్థంలో చేరే కన్నడప్రత్యయం. అందగార మొ॥ ఇట్టి రూపాలే.

"పంతగారి నిన్నుఁబట్టినదెల్లాఁదప్పే" 23-539

**పంతనాలు -పొంతనాలు:** వి. ప్రాతికూల్యాలు - ఆనుకూల్యాలు (?)

"పవ్వళించే వేమే నీ పంతనాలో పొంతనాలో
యివ్వల శ్రీవేంకటేశుఁ డెడ మియ్యఁగా" 11-341

**పంతపుది:** (పంతము + అది) పంతకత్తె.

"పంతపుదానికిఁగాని పల్లదము లెల్ల రావు
జంతకుఁగాని కడుఁ జలము లేదు" 16-561

**పంతపువేసాలు:** వి; బహు. మొండివేషాలు.

"పంతపువేసాలు మాని పయ్యె దెడలించరాదా
చెంత శ్రీవేంకటేశ్వరుఁడు చేయి చాఁచీని" 13-49

**పంతమిచ్చు:** ప.బం; అ.క్రి. ప్రతిజ్ఞచేయు, కానీ యీ వాఙ్మయంలో అంతటా పట్టుదల వదలు, తప్పు అంగీకరించు ఇత్యాద్యర్థాల్లో ప్రయోగించినట్లు కనబడుతుందని సం.ప.స. (16 సం. 430 పు.)

"పంతమాకె కిప్పించి నీ పాదాలకు మొక్కించి
సంతోసాలు రేచిరి యీ సతుల కెల్ల మీకు" 16-34

"పన్ని నీతో నలిగిన ఫలమెల్లా నేఁగంటి
ఇన్నిటికి నీకుఁబంతమిచ్చేము కోవయ్యా" 19-475

**పంతమో పాడో:** ప.బం. పట్టుదలలో పాడో. విసుగును తెలిపే పదబంధం.

"పంతమో పాడో తనకు బాలకి నన్నింత సేయ
రంతులఁదానూ రాఁడు రానివాఁడు గాఁడు"
20-220

**పంతాలు సానఁబట్టు:** ప.బం; పంతాలు తీక్ష్ణంచేయు.

"మానవయ్యా మాతోడి మందెమేళాలు
సానఁబట్టేవు పంతాలు సతులపై నేలయ్యా"
20-59

**పందదనము:** (పంద + తనము) వి. పిరికితనం, సోమరితనం. రూపాం. పందతనము.

"యెందైనను యీ మనసు
పందదనంబునఁబారీఁగాక" 10-1-10

**పందిలివెట్టు:** (3) ప.బం; అ.క్రి. కప్పిపుచ్చు, పైకి అందంగా కనబడునట్లు చేయు, చల్లఁబఱచు.

"మచ్చికఁ బందిలివెట్టే మాయకాఁడ
కుచ్చితపు నేరుపుల కుశీలికాఁడ" 10-2-83

**పందెగాఁడు:** (పందెము + కాఁడు) పందెంవేసే వాడు, పెద్ద శ్రేష్ఠుడు. పందెకాడు అని సూ.ని.

"ఎందాకా మూసిమంతనా లేల సేసేవు
పందెగాఁడవై నీవే పడితలించరాదా" 25-8

**పందెమాడు:** (2) అ.క్రి. ప్రతిజ్ఞచేయు, చలపట్టు, పంతమాడు.

"పందెమాడుతా నున్నాఁడు పతివీఁపునఁ
జన్నులు
సందడి నేల వొత్తేరే సతులెల్లా" 14-481

**పందెముమోచు:** ప.బం; అ.క్రి. పందెము వేయు.

"పరఁగ నాపెమీఁద పందెము మోఁచెనంటా
సారిది నీ వేల వచ్చి సూడువట్టే విపుడు"
17-222

**పంద్యాలు:** వి; బహు. పందెము శబ్దానికి బహువచనరూపం. పందెములు, పందాలు.

"చొక్కపు రతులనే జూజములాడీ నాపె
వెక్కసమేల పంద్యాలు వేయవయ్యా" 29-223

**పంపుడుఁజిలుకలు:** వి; బహు. పెంపుడు చిలుకలు. 'పెంపుడు' అనడానికి బదులుగా 'పంపుడు' అని ప్రయోగించడం యతికోసం కావచ్చు.

"పలికి మటాడఁగాను పంపుడుఁజిలుకలంటూ
నిలువున వెరగంది తలవంచుకొంటిని" 7-316

**పంపుడుచెలి:** వి. అరణముగా పంపబడ్డ చెలి.

"పంపుడుచెలుల మింతే పలుకవిదేమమ్మా
చెంప జారిన తురుము చెరుగుకోవమ్మా"
19-468

**పంపుడుదయ్యము:** వి. ఇతరుల పైకి ప్రయోగించే భూతం.

"పంపుడుదయ్యమై బాధవెట్టెడు యా
కొంపలోన నుండ నీఁగోరీనా" 1-186

**పంపుడుదేవత:** వి. (?)

"యింపుల శ్రీవేంకటాద్రి నిరవై వున్నాఁడు వీడె
పంపుడుదేవతలతో బ్రతి లేని దైవము" 4-359

**పంబు:** అ.క్రి. అతిశయించు, విజృంభించు, ఒప్పు, వ్యాపించు.

"అంబరాన నున్న ధ్రువు నజ్ఞానమెల్లఁ బాపి
పంబి నీచేత నుండిన పాంచజన్యము" 3-434

**ప(పె)లుచుఁదనము:** వి. పౌరుష్యం, వైరస్యం. యతిని బట్టి ఇట 'పెలుచుఁదనము' అని గ్రహించవలెను.

"పెలుచుఁదనాన రతిఁ బెనఁగులాడుకొంటాను"
24-447

**పక్కలించు:** అ.క్రి. నిఘంటువుల్లో ఈ రూపం కనిపించదు.

"కడు వేకువను లేచి కన్నులు పులుముకొంటా
కడు పక్కలించి యాఁకలయ్యీ నవి" 16-420

**పక్కులుగట్టు:** అ.క్రి. కురుపు మానుతూ పైన గట్టిపడు.

"పక్కులుగట్టెను మోవి పైకొనెఁ గన్నులకావి
తక్కన నాతో నీక తా నే మనీనే" 25-20

పక్కెర: వి. ఏనుగుకు తొడిగే కవచం, జీడా.
"తొక్కిన పాపములవె తోడనే శ్రీవేంకటాద్రి
పక్కెర నరసింహపు ప్రళయనరసింహునికి"
2-379

పక్కొమ్మ: (పక్క + కొమ్మ) వి. పక్కనుండే కొమ్మ, ఉపశాఖ, రెమ్మ.
"వేవేలు పక్కొమ్మలు వెసఁబెట్ట నేరిపిరా
యేవలఁజూచినా నీ మహిమ అంతే గాక"
2-333

పక్షులు పొరిడిపొద్దు: వి. సాయంకాలం.
"బాయటఁ బెట్టకురే పక్షులు పొరిడిపొద్దు
వో యమ్మ బాలులకు నొవ్వ దండురు" 5-247

పగటు: (50) వి. 1. ప్రకాశం, ప్రాకట్యం 2. కాంతి, శోభ 3.సౌందర్యం 3. విధం, రీతి 4. విప్రలాపం 5. వైరం (తె.వ్యు.కో.) 6. మురిపెం 7. గర్వం (బ్రౌన్) 8. ద్వేషం.
"గాటపుఁగస్తూరి బొట్టిక్కడ మాయకుండా మొక్కి
జూటరి దీని పగటు చూడరే వో చెలులు"
12-355
"జగమెల్లా మాయలైనా సరి నీకే శరణంటే
పగటున నదే తపఫలమౌను" 2-351

పగటుఁదనము: వి. 1. మనోజ్ఞత 2. ఉద్ధతి. (తె.వ్యు.కో.)
"పగటుదనాలు సేసి పంతము చూపేనా"
29-296

పగటుచీకటి: వి. నల్లనివాడు, పగలే చీకటి.
"కల్పించు సంతతి నలుపు అనడం
సిరి దొలంకెడి పగటు చీకటా యితఁడేమి"
1-25 old

పగటులాడు: స.క్రి. దూషించు.

పగడవాతెర: (7) వి. పగడం వంటి పెదవి.
7-221 old
"పొగరుఁగెమ్మోవి గిరుపుల పగవులాఁడి నీ
పగడవాతెర దెరచి పలుకవమ్మా" 5-181

పగడసాలు: (10) వి. 1. పాచికలు, సారెలు గల సొగటాల పలక 2. జూదపు పలక 3. పాచికల ఆట 4. నెచ్చెలులాడే ద్యూతం 5. ఇష్టజనద్యూతం. (త. పగటైచ్చాలై)
"పొడితోఁబందెము వేసి పడగసాలాడఁబట్టె
ఆడనే పరపుమీఁద నలపారే దేవుఁడు" 8-208
"పగడసా లాడుదువు పక్కన నవ్వింతువు
మొగముచూ పితనికి మొక్కఁగదవే" 17-158

పగపాడు: (2) పగవాడా?
"మొగతాఁ గామినులెల్లా మేలిలోని వారు గాక
పగపాడి యేమైనా పంతము నెరపను" 14-545

పగలుచీకటి: వి. నల్లనివాడు.

పగవట్టు: (పగ + పట్టు) వ.బం; అ.క్రి. వైరంపూను, ద్వేషించు.
"పోడిమిఁ బగవట్టేవు పున్నమచందురుమీఁద
నేడే యీతని పాదాలు నీవు పట్టుకోరాదా"
26-331

పగసే(చే)యు: (పగ + చేయు) అ.క్రి. శత్రుత్వం వహించు.
"ఊరకున్న నన్ను నేల వుడికించవచ్చేవు
చేరి నీకు యెంత పగసేసితినో కాని"
11-265 & 11-230

పగిడికాఁడు: (2) (పగిడి + కాడు) ధనం కలవాడు, కానుకలు గలవాడు. (వ్యు.)
"బదుకవయ్యా ఇంత పగిడికాఁడ వైతివి
పదరి వొకరికొకరు పైకొనఁగాను" 23-185
"వెల లేని వలపుల వేడుకకాఁడ
పలుసరసంబుల పగిడికాఁడ" 23-471

పగిడివెట్టు: వి. అధికంగా ధనం ఇచ్చు.
"సం.ప.స.లో పగిడి = పరిహాసము, వెక్కిరింపు అని తమిళము" అని వివరిస్తూ ఈ పదానికి పరిహసించు, వెక్కిరించు అనే అర్థాలు సూచింపబడ్డాయి.
"తెగువ నీవలె నాకు దేవ రియ్యఁడాఁగాక
పగిడివెట్టి నవ్వితేఁ బదరవా నీవు" 14-245

పగులించు: స.క్రి. పగులగొట్టు.
"పక్కన బ్రహ్మాండము బగులించె బెనువేల
వెక్కసపు దైవమైన విష్ణుని నెఱఁగరా" 3-535
పచరించు: ప్రసరించు.
పచారము: (4) వి. నడవ, నటన, అంగడి (ఆపణము అని ఆం.ప.ని.)
"విచారించుకోవు గాక వెనకముందు
పచారాలవలె బట్టబయటఁ బెట్టుదురా" 27-460
'పచారించు' అనే పదానికి పలుకు, చెప్పు అనే అర్థాలున్నందువల్ల 'పచారము' అనే మాటకు పలుకు, మాట అనే అర్థం కూడా చెప్పవచ్చు. ఈ కింది సంకీర్తనపాదంలో ఈ అర్థం పొసగుతుంది.
"విచారించు హరి నా విన్నప మవధరించు
పచారమే నాది గాని పనులెల్లా నీవే" 2-1
"చెలియరో నీ మగఁడు చెప్పినట్టు మెలఁగఁగా
పలు పచారము లేలే భాగ్యవంతురాలవు"
28-283
పచారించు: స.క్రి. 1. ప్రసరింపఁజేయు 2. చేయు 3.పుట్టించు 4. కలిగించు 5. ప్రకటించు 6. చూపు 7.తిరస్కరించు 8. పంతమువట్టు 9. నడపు. 'పచరించు'కు రూపాం. 1. చాచు, చాపు 2. సవరించు, సిద్ధపరచు 3.చేయు, పడునట్లుచేయు 4. ఉపాయం నెరపు 5.అభినయించు 6. బాణంవేయు 7. లగ్నంచేయు. అ.క్రి. ప్రవర్తించు, మెలగు, విహరించు, చూపు.
"కులికి కులికి కొనగోరి గురులు సోఁకఁగ
పలురతుల చవులు పచారించీని" 13-121
"యిన్నిటా శ్రీవేంకటేశ యిందే ఎనసేముగాని
పన్నిన మీ వలపులు పచారించరయ్యా"
26-497
పచ్చ: వి. పసిమి కావచ్చు. (సంపా.)
"పాయపు నీ జవ్వనము పచ్చ గందీనని నీవు
చేయిచ్చి దగ్గర వేమే శ్రీవేంకటేశు" 27-176
పచ్చగందు: అ.క్రి. పసిమి కోల్పోవు. (ఎండిపోవు)
"పాయపు నీ జవ్వనము పచ్చగందీనని నీవు
చేయిచ్చి దగ్గరవేమే శ్రీవేంకటేశు" 27-176
పచ్చగరికె కాలము: ప.బం; వి. అశాశ్వతం, కొంతసేపు మాత్రమే ఉండేది.
"పచ్చగరికెకాలము ప్రపంచములో బ్రతుకు
తచ్చి చూచెటి సూత్రము తన జ్ఞానము" 4-24
పచ్చదోరణము: (3) వి. పచ్చతోరణము.
"బంతెనఁగూళ్లు నేఁడు పచ్చదోరణాలు నేఁడు
చింతదీర భోగించి చిత్తగించవయ్యా" 20-343
పచ్చని అలము: వి. తులసి కావచ్చు. F.N.
"కూరిమి నీవే దక్కించుకొంటిఁ వడవులవెంట
చేరి పచ్చని అలమై శిరసు నిండితివి" 27-407
పచ్చనిదెల్లా పసిఁడి: ప.బం. తెల్లనివెల్లా పాలు వంటిది.
"సారెకు దిక్కులనుఁ బచ్చనిదెల్లాఁబైఁడైతే
కోరి యవి యెంత సేసుకొనరాదు" 24-21
పచ్చలకడియము: వి. పచ్చలు (మరకతాలు) తాపిన కడియం.
"ఇచ్చకములు సేయఁగా యీతఁడే అందుకుమెచ్చి
పచ్చల కడియము లప్పటి నిచ్చెను" 23-462
పచ్చలమేడ: వి. మరకతమణులు తాపిన మేడ.
"విచ్చనవిడైనఁగాని వెలయవు కోరికెలు
పచ్చలమేడలోనఁ బవ్వళించరయ్యా" 13-420
పచ్చలు: వి; బహు. నాణెములు, రూకలు.
"తచ్చన తరితీపుల తగవరివాఁడవు
పచ్చలాయకట్టే లాబపువాఁడవు" 19-17
పచ్చారు: అ.క్రి. 1. పచరించు, ప్రవర్తించు 2. విహరించు 3. పచారు, అనవసరంగా అటునిటు తిరుగు.
"పలుమారుఁ దన్ను చూచి పచ్చారుకంటేను
తలవంచుక తన ముందర నుండుతే మేలు"
12-109
"ముచ్చట మాటలఁ గడు మోహముపైఁ జల్లితేను

పద్మారుచమఁ జెలులేల పచ్చి సేసేరే" 9-198

పచ్చి : వి. శృంగారాదిరసస్ఫురణం, రసం పైకి స్ఫురించడం, ఆఱడి, బూతు.

"ఒడినున్న మాకైతేఁ బచ్చి దోఁచెఁబనులు
అడరి శ్రీ వేంకటేశ అడిగి కొంతోపుదువో"
14-401

"పచ్చితోడ తనమీఁది పాటలెల్లాఁ బాడఁగాను
పచ్చడము కొంగు నాపైఁ గప్పేను" 23-462

పచ్చికస్తూరి : వి. మిక్కిలిగా మూరిన కస్తూరి.

"పచ్చికస్తూరి నుదుటఁ బట్టువెట్ట నేఁటికే
మచ్చిక నీ రమణుఁడే మన్నించీ గాక" 19-466

పచ్చిగా : (2) క్రి.విణ. బహిరంగంగా, ముసుగులేక.

"పచ్చిగా పానుపుమీఁద పాదము లొత్తినందుకు
కుచ్చితివిగా కాఁగిట గురుతుగా నన్నును"
26-237

పచ్చిగాఁజేయు : స.క్రి; ప.బం. ఆఱడిచేయు.

"పరవుపై నిన్ను నేను పచ్చిగాఁజేసేనంటే
యిరవుగా వేడుకొనేవేమి సేతును" 8-28

పచ్చిగా నాడు : ప.బం; అ.క్రి. బూతుగా మాట్లాడు.

"నెట్టన శ్రీవేంకటేశ నీకుఁదన నేర్పు చెప్పి
బట్టబయలుగా దిట్టి పచ్చిగా నాడుదురా"
28-13

పచ్చిగాలి : వి. చల్లగాలి.

"పడఁతికి నీ రాక పచ్చిగాలిరై వీచె
విడుముడిఁగోరికలె చిగురించెను" 19-464

పచ్చిగొంటులు : వి. (?)

"పాయపు వెరఁగుల పచ్చిగొంటులమ్మీ
చేయారఁగ వెల సేయవమ్మా" 22-90

పచ్చి గొంతా వెచ్చి గొంతా : స్పష్టంగా కొంత, అస్పష్టంగా కొంత.

"మచ్చిక నాతఁడు నేఁడు మా యింటికి వచ్చెనంటా
పచ్చి గొంతా వెచ్చి గొంతాఁబలికే వేమే"
11-194

పచ్చిచేయు : ప.బం; స.క్రి. ఆఱడిచేయు. (పద.)

"ముచ్చట నీవును నేను మోహించిన చేఁతలెల్లా
పచ్చిచేసెఁ జెలులతోఁ బైపై నాపై" 20-540

పచ్చిజవ్వనము : (3) వి. నిండు జవ్వనం.

"ఇచ్చకములాడరే యింతులాల
పచ్చి జవ్వనమింతలో పదను దీసినా" 7-20

పచ్చితనము : (పచ్చి + తనము) వి. శృంగారాది రసస్ఫురణం, రసం పైకి స్ఫురించడం.

"మెచ్చిరే యందరూఁ దన మేకులెల్లాను
పచ్చితనమెల్లా బంగారాయనే" 23-467

పచ్చితిట్టు : (3) వి. బూతుతిట్టు.

"మలసి మలసి నీతో మంచిమాట లాడఁగాను
తిలకించి చూచి పచ్చితిట్టు దిట్టనేఁటికి" 28-354

"పయ్యెదపైఁ జెయివేసి పచ్చితిట్టు తిట్టితేను
నెయ్యమునఁ గరఁగితి నిదేమో కాని" 9-147

పచ్చిదేరు : (27) అ.క్రి. పచ్చియగు, బూతుగానుండు, ఆఱడియగు.

"పక్కనఁజూచిన చూపు పచ్చిదేర వలపించు
నెక్కొన్న రతులలో నేరుపులివి" 28-288

పచ్చినవ్వు : వి. మఱుగు లేని నవ్వు.

"పయ్యెద మఱఁగుననే పచ్చినవ్వు నవ్వనేల
చయ్యనఁగూడి మోవి చవి చూపవే" 12-382

పచ్చినెత్తురు : వి. చిక్కని నెత్తురు.

"పగగొని మానక పచ్చి నెత్తురెప్పుడును
తెగికొనుఁ దానె త్రిత్తి తిత్తి తిత్తితి" 1-170

పచ్చిపాపాలు : వి; బహు. ఘోరమైన పాపాలు.

"పచ్చిపాపాల రొంచ నీ ప్రసాదమే చాలు
యెచ్చుకుందు వుపాయాలు యిఁక నేల వెదక"
7-243

పచ్చిపాలలోని వెన్న : ప.బం; వి. అంతటా వ్యాపించి ఉండేవాడు, అంతర్లీనంగా ఉండేవాడు.

"పచ్చిపాలలోని వెన్న పరమాత్ముఁడు

బచ్చనవాసిన రూపు పరమాత్ముఁడు" 1-410

**పచ్చిమాటలాడు:** (2) ప.బం; అ.క్రి. బూతుమాటలాడు.

"పచ్చిమాటలాడి ఇంతి భావము గఁరఁగఁజేసి
ఇచ్చట సిగ్గులెల్లా బాయిటవేసేవు" 26-387

**పచ్చివడగండ్ల గుళ్లు:** ప.బం; వి. అస్థిరములు, అశాశ్వతములు, మంచుగడ్డలతో కట్టిన గుళ్లు స్థిరంగా ఉండవుగదా!

"పడఁతుల వేడుకలు పచ్చి వడగండ్లగుళ్లు
కడుమోవి తీపు చింతకాయ కజ్జము" 2-268

**పచ్చివెచ్చి:** (9) ప.బం; విణ. అపరిపక్వమైన, ఉచ్చిపచ్చి.

"పగడపు మోవివంటి పచ్చివెచ్చి కొండ" 19-519

"నిచ్చలుఁగోరినయంతే నిజమైన లోకము
పచ్చివెచ్చి చదువుల భ్రమయఁగ నేలా" 4-220

"పచ్చివెచ్చిరై యుండు పడఁతులకెల్లాను
యెచ్చినీ వాడినట్టి యియ్యకొంటిగాక" 23-423 old

**పచ్చివేఁడి:** వి. మిక్కిలివేఁడి.

"నగవులోపలి యలపు నంపైన పొలయలుక
పగటులోపలి వెరగు పచ్చివేఁడి" 6-70

**పచ్చివొళ్లు:** వి. రక్తాదులచే ఆర్ద్రమైన శరీరం, చీము నెత్తురులచే కూడిన దేహం. (?)

"పచ్చివొళ్లు మోచితిమి పాపమెల్లాఁ జేసితిమి
హెచ్చిన మీఁదటి సుద్దు లేఁటివో కాని" 3-532

**పచ్చిసింగారము:** వి. బట్టబయలు శృంగారం.

"మచ్చికతో నేలనయ్య మదనసామ్రాజ్యలక్ష్మి
పచ్చిసింగారాలచేత బండారాలు నిండెను" 19-281

**పచ్చిసేఁతలు:** ప.బం; వి; బహు. ఆఅడి చేతలు, చాటులేని చేతలు, బూతుచేతలు.

"పయ్యెదచెరఁగు జారఁ బచ్చిసేత లిన్నియును
ముయ్యఁజూచీ నిటువంటి మోహమెందుఁ గలదా" 5-328

"పచ్చిసేతలు చెక్కిళ్లపై నీ కేడవిరా" 5-222

**పచ్చిసేయు:** (58) (పచ్చి + చేయు) ఆరడి చేయు.

"చెలితో మాటలాడఁగ చెక్కులెల్లాఁ బులకించె
పలుమారు నిందరిలోఁ బచ్చిసేతురా" 20-131

"భజన మెరయ నన్నుఁ బచ్చిసేసేవు ఇంత
గజరుఁజేతల కోపఁగలనా యిఁకను" 5-243

**పటవాళి చీరలు:** నిలువుగనో, అడ్డముగనో పట్టెలు గల చీర, పద.లో పటాపటి చీర అనీ, పటాపటీ చీర అనీ పేర్కొనబడింది. ఇది పేకకు ఒక రంగు, పడుగుకు మరొక రంగు పెట్టి నేసిన ఒకరకం గళ్లచీర. ఇదే పటావళి చీర కావచ్చు.

"కుటిలంపుఁజేఁతలు కుచ్చులుగాఁగట్టి
పటవాళిచీరె లమ్మె బలుబేహారి" 1-275

**పటుకున:** క్రి.విణ. తటాలున.

"ఇట మీఁడి కడమెల్లా నిఁక నీవు దీర్చవయ్యా
పటుకునఁ జెలి నీకుఁ బాలు వెట్టీ నిదిగో" 20-95

**పట్టఁబట్టఁగానే:** పట్టగానే, పట్టగానే.

"తట్టెడి నీ మట్టెలమోఁతలు చూపవలసి
పట్టఁబట్టఁగానే వుప్పరి గెక్కేవు" 5-248

**పట్టదేవి:** వి. పట్టపుదేవి, పట్టపురాణి.

"పట్టదేవైన నేను పానుపుపై నుండఁగాను
మట్టుమీరి పెనఁగఁగ మర్మములు దాకును" 20-328

**పట్టంపుదేవులు:** వి. పట్టపురాణి.

"యెరవులో సతులెల్ల యీడుజోడు వచ్చేరా
తిరమైన పట్టంపుదేవులకును" 21-214

**పట్టపగటి వెలుఁగు:** ప.బం; వి. స్పష్టంగా కనిపించేది.

"పట్టపగటి వెలుఁగు పరమాత్ముఁడు
యెట్టనెదుటనే వున్నాఁడిదె పరమాత్ముఁడు" 1-410

**పట్టపగలు చీఁకటి పంటపండు:** ప.బం; అ.క్రి. పట్టపగలు మిక్కిలి చీకటి యగు.

"వట్టివేసఁగిని గాలివానలు గురియఁగఁజొచ్చె

పట్టపగలు చీఁకటిపంట పండెను" 24-560

**పట్టపుతొయ్యలి:** వి. పట్టపుదేవి, పట్టమహిషి, పట్టపుదేవి, పట్టపురాణి.

"గారవించి నేఁడు శ్రీవేంకటేశ నన్నేలితివి
దూరఁజూచీ నీ పట్టపుతొయ్యలులుఁదాను"
26-285

**పట్టపుదేవి:** (2) వి. పట్టపురాణి.

"గుట్టుతోడ లోలోనే గుబ్బితిల్లిపున్నాఁడవు
పట్టపుదేవి నిన్నెంత పనిగొనెనో" 27-31

**పట్టపుదేవుఁడు:** వి. పట్టాభిషిక్తుడైన రాజు.

"గట్టిగా శ్రీవేంకటాద్రి కమలాదేవితోడి
పట్టపుదేవుఁడే కాక పరులిఁకఁగలరా" 2-98

**పట్టపుదేవులు:** (36) వి. పట్టపుదేవి, పట్టపురాణి. ఇట ఏకవచనార్థమే అయినా బహువచన రూపాన్ని ప్రయోగించడం విశేషం. విడిగా కూడా అన్నమయ్య దేవి అనే అర్థంలో 'దేవులు' అనీ బహువచనాంతంగాకూడా ప్రయోగించినాడు.

**పట్టపుదేవుళ్లు:** వి; బహు. పట్టపురాణులు. ఇట దేవులు (దేవి శబ్ద బహువచనరూపం) శబ్దంపై మళ్లీ బహువచన ప్రత్యయం.

**పట్టబద్ధము:** (2) వి. పట్టాభిషేకం.

"కాంత వురమే నీకు కందువ సింహాసనము
పంతపు కూటములే పట్టబద్ధము" 25-318

వైష్ణవులు నుదుట ధరించే పట్టెవర్ధనాలు, పుండ్రము:

"అనువై నీకు మొక్కగ నంటిన నొసలి మన్ను
పనివడి నాకు పట్టబద్ధమ" 3-393

**పట్టమెక్కు:** ప.బం; అ.క్రి. రాజ్యాభిషిక్తుడగు.

"ఎక్కెను ధ్రువుఁడు పట్టము యిదివో
నిన్నుఁగొలిచి
చిక్కెను నీ శరణాగతి నేఁడు శ్రీవైష్ణవులచేతను"
4-217

**పట్టమేలు:** ప.బం; అ.క్రి. రాజ్యమేలు.

"నమ్మితే నితఁడే మన్ననఁగాచు
ఇమ్ముల ధ్రువునిఁ బట్ట మేలించినట్టు" 4-336

**పట్టరాని జవ్వనము:** వి. వశంలో లేని యౌవనం, నిండు జవ్వనము.

"పట్టరాని జవ్వనము పరసిపోవే ముదిమి
నెట్టుకొల్పి వుబ్బుఁడఁచీ నీ మాయ" 2-180

**పట్టరాని వయసు:** వి. యౌవనం.

"పట్టరాని వయసున బయలీఁదవచ్చునా
పట్టిన నవ్వులెల్లా నానఁబెట్టవచ్చునా" 26-417

**పట్టవర్ధనము:** వి. 'పట్టెవర్ధనం'అనే దానికి వ్యావహారిక రూపం. పట్టెనామం, మగవాళ్లు మిక్కిలి వెడల్పుగాను, దళముగాను పట్టెవలె తీర్చిన నొసటిబొట్టు.

"అట్టే కొందరు మతములన్నియు నేకమని
పట్టవర్ధనము నెత్తిఁబెట్టి చూపిరి" 2-270

**-పట్టి:** అన్నంతక్రియలపై హేత్వర్థంలో చేరే ప్రత్యయం.

"ఈతఁడే ముక్తి దోవ యీతఁడే మా యాచార్యుఁ
డీతఁడు గలుగఁబట్టి ఇందరు బదికిరి" 3-183

**పట్టితే పసిఁడి రాలు:** ప.బం; అ.క్రి. చేపట్టినదెల్లా సఫలమగు, పట్టినదెల్లా బంగారమగు.

"పట్టితే పసిఁడి రాలీ బచ్చనసంసారము
గుట్టు దెలియఁ బ్రాణము కూటిచేతిది" 3-248

**పట్టినదెల్లాఁబైడి:** ప.బం; వి. అదృష్టం కలిసి రావడమనే సందర్భంలో వాడే పదబంధం. చూ: పట్టినదెల్లా బంగారు.

"పండెను నీ తపమూ పట్టినదెల్లాఁబైడి
అండనే నన్నుఁగూడితివా యను పని" 21-328

**పట్టినదెల్లా నీడేరు:** ప.బం; అ.క్రి. చేపట్టినదెల్లా ఫలవంతమగు, సర్వమూ అనుకూలమగు.

"భాగవతులైనవారు పట్టినదెల్లా నీడేరు
చేగదేర వారలు సేసినదే చేఁత" 3-119

**పట్టినదే కందిగురుమన్న కత:** నానుడి; (?)

"గరిమఁ బట్టినదే కందిగురుమన్న కత
ఇరవు చూపనేల ఇంటికి రారాదా" 25-378

**పట్టినదే చలము:** ప.బం; వి. పట్టిందే పంతం.

"పట్టుఁబట్టఁ బాములాయ పంతపుఁ గోరికె లెల్ల

పట్టినదే చలమైతే పలుక నేమున్నది" 8-50

పట్టినదే పంతము: ప.బం. పట్టినదే పట్టు.

"పట్టినదే పంతమా పడఁతిఁ బిలువరాదా" 17-328

పట్టినదే వ్రతము: ప.బం. పట్టినదే పంతం వంటిది.

"పట్టినదే వ్రతము పడఁతులకుఁ జలము అట్టి పతులకుఁ జేయక పోరాదు" 18-205

పట్టినవారి చేతి బంగారము: ప.బం; వి. అందుబాటులో నుండి కోరినవారి కోరికలు తీర్చేది.

"నెట్టనఁదలఁచేవారి నిండు నిధానమవు పట్టినవారి చేతి బంగారమవు" 9-219

పట్టినవారి చేబిడ్డ: ప.బం; వి. సులభంగా స్వాధీనమయ్యేవాడు. కొందరు చిన్నబిడ్డలు తమను పిలిచినవారందరి దగ్గరకు పోయి వారి లాలనకు పాత్రులౌతారు. దీనిపై వచ్చిన పలుకుబడి.

"పట్టినవారి చేబిడ్డ పరమాత్ముఁడు బట్టబయటిధనము పరమాత్ముఁడు" 1-410

పట్టినవెల్లా బంగారములు: ప.బం; వి. అదృష్టకాలమనే సందర్భంలో వాడబడే పలుకుబడి. అనుకున్న వన్నీ సానుకూలం కావడం.

"యిట్టె యిన్నియు నీకెకు నితనికి పట్టినవెల్లా బంగారములు" 24-45

పట్టిపట్టి చూచు: ప.బం; స.క్రి. మిక్కిలి జాగ్రత్తతో చూచు.

"అట్టిడివి మిగులాను జాతిగుండెవాఁడవు పట్టిపట్టి చూచి యేల భ్రమసేవయ్యా" 14-175

పట్టుఁబస: వి. పట్టులోని సారం.

"వలపు దెలిపి నిన్ను వంచుకొనఁజూచితేను పలచనే కాని మరి పట్టుఁబస వున్నదా" 16-413

-పట్టు: (25) ఒక కార్యాన్ని మొదలిడి, అందులోనే నిమగ్నమగు, ఒక కార్యంలో ఉన్ముఖుడై అందులోనే నిమగ్నమగు అనే అర్థంలో ధాతువుపై చేరే అనుబంధక్రియ. దీనికి భూతకాల క్రియారూపంలోనే ప్రయోగం.

ఉదా:- చూడనె(నే)పట్టె, చేయనె(నే)పట్టె మొ॥

"కన్నులఁజూడనెపట్టె కాఁకలు సేయనె పట్టె" 6-115

"సరసమాడనేపట్టె చవులు చూడనేపట్టె ఇరవై పతితో పొందులెప్పుడే నీకు" 28-236

పట్టుగొమ్మ: (2) ప.బం; వి. ప్రాపు, ఆశ్రయం, ఆధారం, ఊతకోల, ఉనికిపట్టు.

"పట్టుగొమ్మ యా పడఁతి దేహలత గట్టిగా శ్రీవేంకటపతికి" 24-45

పట్టుపగటి వెలుగు: వి. మిక్కిలి ప్రకాశవంతంగా ఉండేవాడు. 'పట్టుపగటి' అనేది పట్టపగటి కి వ్యావహారిక రూపమా!

"పట్టుపగటి వెలుఁగు పరమాత్ముఁడు యెట్టయెదుటనే వున్నాఁడిదె పరమాత్ముఁడు" 1-410

పట్టెమంచము: (5) వి. నవారుతో అల్లిన మెత్తటి మంచం.

"యెట్టు మొక్కెదవె చెలి యిందాఁక పట్టెమంచముమీఁదఁబవళించి నీవు" 5-184

పట్టెము: వి. 1. ఖడ్గం, కృపాణం 2. కోల 3. ఆయుధం, ఆయుధవిశేషం.

"మోవితేనియలను గమ్మికొని యాసగించేవు భావజుని చిగురాకుఁ బట్టెమున్నది" 26-407

పట్ణము: వి. మాం. పొట్లం; రా.సీ. వ్యావహారికరూపం.

"తనువిది మూలమంత్రంబులు దాకొని యుండిన పట్ణము" 3-340

"చెప్పనేల నీ సుద్దులు చెల్లుబడై వుండఁగాను కప్పిన పట్ణాలు వారు గందమిత్తురా" 18-374

పఠన: (2) వి. చదవడం. పఠనం అని అమహదేకవచన ప్రత్యయరహితంగా 'పఠన' అని వాడడం విలక్షణం.

"కరివరదుని పేరు గలసిన తిట్లతో పరదేవతల మంత్రపఠనలు సరియా" 2-405

నరసింహశతకంలో 'పఠన' అనే ప్రయోగం కనిపిస్తుంది.

"పరమమగు వేదాంతపఠన దొరకియు సదా

హరిభక్తి లేని సన్యాసికంటె" 1-318

**పడఁతితనము:** (పడఁతి + తనము) వి. స్త్రీత్వం.

"వసము గాక నీతో వాదులడు వఁగ లేదు

పస ఇంతే కలది నా పడఁతితనము" 27-186

**పడఁదొబ్బు:** స.క్రి. పడద్రోయు.

"అండ నూఁటుకొన్న కాయ లద్దె నేఁబరాకైతే

పండెనంటాఁ బడఁదొబ్బి పట్టనియ్యఁడే" 7-420

**పడగ:** వి. 1. టెక్కము 2. పాముపడగ. (3. స్త్రీ కర్ణభూషణావిశేషం.)

"తేరుపడగ లవే తెల్లగొడుగు లవే

తోరణంబు లవే సారథి వాఁడే" 12-402

**పడగె:** (5) వి. 'పడగ'కు రూపాం. టెక్కం. (పాముపడగ, స్త్రీ కర్ణభూషణావిశేషం)

"కూరిమి మట్టములు గోపురంబులును

తేరుపడగెలే తెరువెల్లా" 1-119

**పడపు:** వి. 1. వ్యభిచారం చేసి చేసీ ఆర్జనం 2. ఆర్జితవిత్తం, సంపాదన, ఆర్జనం.

"ఎన్నటి కెన్నటి సుద్దులిఁక నేటికి తమ

కన్నెనాఁటిపడపులు కంటివిగా కొత్తలు" 16-323

**పడిగము:** వి. 1. తములము ఉమిసే పాత్ర 2. కాళాజి పళ్లెం (క. పడిగ, త. పటిక్కమ్)

"పమ్మిన నవ్వులకెల్లా పడిగమ వైతివి" 21-274

"తలపోసే కాంతల చిత్తములకు నీ వయసు

కలగంపై పడిగముగతి యాయను" 25-398

**పడిగాలుపడు:** (పగి + కాపులు + పడు) వ.బం; అ.క్రి. ఇది 'పడిగాపులు' కావచ్చు. దర్శనార్థమై పంచలు కాయు, నిరీక్షించియుండు.

"పడిగాపులు పడియున్న ప్రాణాచారముల

పడఁతుల నధములఁ బాలించితి" 1-280

**పడిగె:** (7) వి. 'పడగ'కు వ్యావహారికరూపం.

"వేయి పడిగెలతోడ వెలసిన శేషుఁడు

చాయమేని తళుకువజ్రాల శేషుఁడు" 3-365

"పడిగె నాఁబడగ నాస్ఫుట దనరారు"

ఆం.భా.1-148

**పడిగెపుది:** (పడిగెము + అది) వి. ఉమ్మి ఊసే పాత్ర పట్టుకుని వచ్చే స్త్రీ.

"వింతలుగ నిన్నంత వేసరించఁజాల నన్నా

పంతానఁ దమ్మ వెట్టేవు పడిగెపుదాననా" 21-87

**పడిగెము:** వి. 'పడిగము'కు వ్యావహారికరూపం. 1. తముల ముమ్మివేసే పాత్ర 2. పాత్ర 3. తాంబూలం అని పారంగ.

"పాయపుమదాన నీ పడిగెము పట్టేదాన

రాయడించి నిన్నింత రవ్వసేసేదాననా" 25-222

**పడితళించు:** (4) స.క్రి. ఈ పదం ఏ నిఘంటువుల్లోనూ కానరాదు. చరచు, కొట్టు. జూదమాడునపుడు కిందవేయుటకై పాచికలను చేతనుంచుకొని యిటునటు తిప్పు అనే అర్థం ఎక్కడినుండో గ్రహించినాను.

"పందెగాఁడవై నీవే పడితళించరాదా" 25-8

అన్ని ప్రయోగాల్లో పై అర్థం సరిపడడంలేదు. బహుశః ఈ పదం 'పరితళించు' కు రూపాంతరం కావచ్చునేమో! 'పరితళించు' అంటే సూ.ని.లో విచారించు, ఆలోచించు అని అర్థాలు చూపబడ్డాయి. ఈ అర్థం కొన్ని ప్రయోగాల్లో కొంతవరకు యుక్తంగానే ఉంది.

"పాయని చుట్టరికాలు పడితళించఁగవచ్చు

చాయల నీ గురుతులు సరివచ్చి వున్నవి"

7-216

"పందేలాపెతో నాడఁగా పడితాళించితి గదే"

28-348

"పట్టి విడిచిన మాట పడితాళించె నిదివో"

24-146

లేదా 'పటితళించు'కు రూపాంతరం కావచ్చునేమో! 'పటితళించు' కు అప్పళించు, చప్పటించు, చమరు, చఱచు, తట్టు, దబ్బడించు, ఆస్ఫాలించు, ఆస్ఫోటించు అనే అర్థాలు చూపబడ్డాయి. కొన్ని ప్రయోగాల్లో ఈ అర్థాలు కుదురుతున్నట్లుగా కనిపిస్తుంది.

"పంతపు సవతులము పడి తళించుకొంటేను
కొంత గొంత నీవు నవ్వుకొంటా నుండరాదా"
23-329

"బంతినే యిందరిలోనా బడితళించము గాని"
పడితరమునకు రూపాంతరమా?
వ్యావహారికమా! పడితరము = భాగ్యము, వంతు, దాని ఛాయార్థముగ వరుసలేర్పాటు చేసుకొనుట కావచ్చు నని సం.ప.స. (23-329)

"పంతపుసవతులము పడితళించుకొంటేను
కొంత గొంత నీవు నవ్వుకొంటా నుండరాదా"
23-329

పడిత్తళ్ అంటే తమిళంలో పరవశము అని అర్థం. అదియే ఇది కావచ్చును. పరవశించు అని అర్థం.

"పరవుపై నీవు నేను పడితళించినఁగాక
సరుగ నీ వేల వోజకు వచ్చేవు" 22-345

**పడితాళము**: పారవశ్యం.

"బడిబడి రతులలో పడితాళాలు
కడఁగి సరసాలలో గబ్బితనాలు" 29-387

**పడితాళించు**: (3) స.క్రి; చూ: పడితళించు.

"బంటు బంటుతనమా పడితాళించవచ్చీని
దంటఁజేసితివి నీవే తరుణి నింతేసి" 25-254

"పట్టివిడిచిన మాట పడితాళించె నిదివో"
24-146

**పడిదె(ద)ము**: వి. రూపాం. పడిదియము.
ద్రవరూపమగు భక్ష్యవిశేషం, (శ.ర., సూ.ని.) ద్రవరూపమగు వ్యంజన విశేషము, a certain decoction అని బ్రౌన్.

"అప్పడంబులు, వడియములు, దాలింపులు
పలుచని నును వెచ్చ పడిదెములును"
అని జైమినిభారతం (3 ఆ)

"పడిదెంబులాకవాల్ పరిపక్వ ఫలములు" అని కవిరా.

"బిసకిసలయముల వరుగులుఁ
జిరుగడములు బడిదెములు" అనీ కాశీ. 7-185

కానీ జయప్రభగారు తమ అన్నమయ్య పదపరిచయంలో నూనెలో వేచే వస్తువు. అప్పడం, వడియం, బజ్జీ ఇలాంటిది అని అర్థం చెప్పినారు. జైమినిభారతంలో పడిదెములకు వాడిన 'పలుచని' అనే విశేషణం ఇది ద్రవరూపమైన భక్ష్య విశేషమనే ఊహను సమర్థిస్తుంది. 5-163

"పింతబొమ్మ జంకెనలే వేఁడి పడిదాల విందు
అంత సేసీ నీ దేవి యారగించవయ్యా" 21-529

**పడుక**: వి. 'పడక'కు రూపాం.

"పాలవెల్లి కూఁతురుఁ జేపట్టి పెండ్లాడఁగాను
పాలసముద్రము నీకుఁబడుకాయను" 7-82

**పడుచఁడు**: వి. పడుచువాఁడు.

"పాలదొంగవై గొల్లపడుచడవైతి వంటా
పాలజలనిధిలోనఁ బడఁతి వుట్టె" 20-5

**పడుచుమాట**: వి. బాలుని మాట.

"పడుచు మాటనకా ప్రహ్లాదునకు
పొడచూపె నాదిపురుషుడు" 1-394

**పడుచులాట**: వి. పిల్లచేష్ట.

"తహతహలఁగర్మబంధములఁదగిలినయపుడే
అహహ దేహికిఁ బడుచులాటవో బదుకు" 1-473

**పడుమటజాము**: వి. అపరాహ్ణము.

"పంతము లాడఁగానే పడుమట జామాయ
మంతనమాడే కొద్దికి మద్దేనమాయ" 14-145

**పడెగె**: వి. పడగ.

"మేటియైన గొంతిదేవి మేనల్లుఁడీతఁడా
కోటికిఁ బడెగెగాను కొండ యెత్తెను" 4-6

**పడెచ్చు**: వి. 'పడచ్చు'కు వ్యావహారికరూపం?
కంసాలి పనిముట్టులలో ఒకటి. ఏదైనా రూపం తొలిచి దానిలో బంగారం వేసి కొడితే ఆరూపు పడేట్లు తయారు చేసిన అచ్చు. (పడియచ్చు = ప్రకృతి ముద్ర సాధనం అని ఆం.ప.ని.)
పోతపోయు దిమ్మె.

"ఎనలేక చూచేవు యేపొద్దు నాపెమోము
గొనకొని లక్కఁబడెచ్చున వేసుకోవయ్యా"
18-61

"బచ్చెనరూపులు పెక్కు పడెచ్చుల వేసినట్లు
నిచ్చల నినుచున్నది నీ మాయ" 2-180

పడెడు: (పడి + ఎడు) రెండు సోలల పరిమాణం కల.
"మిగిలిన దీక మీఁదట దేహికి
అగపడు నొక పడెడన్నంబు" 3-557

పతి: ప్రతి, బదులు, మారు.
"సన్నపు బొమ్మల జంకెన చీకటి
పన్ని నీవేటికి పతి జల్లేవు" 26-189

పతిజ్ఞలాడు: (ప్రతిజ్ఞలు + ఆడు) 'ప్రతిజ్ఞ'కు వ్యావహారిక రూపం. పంతములాడు, బాసలుచేయు, బిరుదులాడు, సమ్మతులాడు.
"చూడరే యీతని మాట సుదతులాల
పాడిపాడి నాతో నెంత పతిజ్ఞలాడీని" 14-479

పతిన: వి. ప్రతిజ్ఞకు వ్యావహారికరూపం.

పతిమ: (5) వి. 'ప్రతిమ'కు వికృతిరూపం. (క. పతిమె) ప్రతికృతి, బొమ్మ.
"నీ రూపు పతిమ" 4-112
"బంగారుపతిమవంటి పడఁతి నీ మైఁదీగె
ముంగిటివేయక యిట్టి ముయ్యవే తరుణి"
6-120

పతిమాటలాడు: అ.క్రి. ఎదురు మాటలాడు, బదులుగా మాటలాడు.
"పతినంటా నీవు నాతో జాణతనాలాడితేను
పతి మాటలాడే నా బాసగానేనా" 27-265

పతిమె: (3) వి. ప్రతిమ, ప్రతికృతి, బొమ్మ. (క. పతిమె) చూ: పతిమ. అన్నమయ్య ప్రతిమ అనే అర్థంలో పతిమ, పతిమె అనే రెండు రూపాలనూ వాడినాడు.
"బతిమితోడుతఁబైఁడి పతిమెఁ గైకొంటివి
రతికక్కౌ నీ చలము రామచంద్ర" 19-165

పతివాది: వి. 'ప్రతివాది'కి వ్యావహారికరూపం. మాఱుపలికేవాడు, విరుద్ధంగా పలికేవాడు.
"ఎదుట మా కళ్లా నిజ మేరుపరచఁగ వచ్చి
అదె పతివాది వయ్యే వప్పటి నీవు" 11-287

పతివెట్టు: (2) స.బం. రక్షణయిచ్చు.
"సతమై శ్రీవేంకటేశ సతులయినవారి
పతివెట్టవలెఁ గాక పచ్చిసేయవలెనా" 17-80

పత్రసాలము: వి. ఈ పదం ప్రసిద్ధమైన తెలుగు నిఘంటువుల్లో కానరాదు. సాలపత్రము కావచ్చు. ఋణపత్రమని అర్థం. కన్నడంలో సాలం అంటే ఋణం అని అర్థం.
"మొలచు జనలోకమునకు నుదుట వ్రాసి
బలుఁడ నీచే నేఁ బత్రసాలమందుకొంటి" 4-421

పదకము: కంఠాభరణవిశేషం.
"పెట్టుకొన్న పదకము పెద్ద అడపమాపెది
నెట్టన నీ సింగారాలు నే నెరఁగనా" 7-432

పదము: వి. సంకీర్తన, కీర్తన. (కాలు, శబ్దం)
"పదములు చెప్పుతాను పాడి యా
యర్థములెల్లా
సుదతులకెల్లాఁ జెప్పి చూపును సుండీ" 26-384

పదరు: అ.క్రి. 1. తొందరపడు 2. తహతహపడు 3.కోపించు 4. క్షోభించు 5. చలించు 6. మత్సరించు 7.పలుకు 8. ప్రేలు 9. దంభాలు పలుకు 10. కూయు 11.అరచు 12. దడ, వణకు. అప్పకవి దీనిని శకటరేఫ యుక్తంగా గ్రహించినాడు. శ.ర.లో సాధురేఫ సహితంగానే ఉంది. నిర్ధారక ప్రయోగాలు లేవని సూ.ని.
"పదరుచు లేచి నీ పంజని యెదురేఁగు
ఉదయచందురుఁడని వూహించఁడు" 13-142
వి. 1. త్వరితోక్తి 2. పలుకు, మాట.
"చాయల సన్నల పదరులు సరిఁదెర కాల్చిన నేగ్గులు
పాయని నీ వూడిగముల పడఁతుల కమరె"
7-131
"సిగ్గుతో నవ్వుటకుంటే చిమ్ముదిట్టులే ఇతవు
బగ్గన నీకు మొక్కేము పదరకుమయ్యా"
26-132

పదారంగుళాల ప్రాణము: వి. శరీరం సాధారణంగా పదహారు అంగుళాల పొడవు

వుంటుందని అంతపొడవు గల శరీరమనే అర్థంలో వాడబడింది.

"లచ్చనఁ బదారంగుళాల ప్రాణమింతే
కుచ్చి కాలపుదినాలు గొలచీని" 2-427

**పదిఃబది(గా)**: (2) మాం. తప్పక, సరిగా, ఖండితంగా, పదిగా, (పదికి పదిమార్లు అని వాచ్యార్థం.) "పదీపదిగా చెప్పినానని చెప్పు" అని రాయలసీమ వాడుక. రూపాం. పదియుఁ బదియుఁ గాను, పదింబది.

"పదిఃబదిగా నీ నోము ఫలియించె నిపుడు"
22-249

**పదిటిలోపల పదనకొండు (పదునొకం?)**: ప.బం; సర్వ సామాన్యుడు, అందరితోపాటు ఒకడు. అంతయినప్పుడు మరికొంచెమైతే ఏమి ? అని భావం. తెగింపు; రూపాం. పదుగురిలో పదునొకడగు.

"పదిటిలోపల నేము పదనకుం (దునొకం)డు
యెదుట నుండఁగాఁగాక యెంత లేదు" 13-467

**పదియుఁ బదియుగాను**: క్రి.విణ; ప.బం. తప్పక, సరిగా, ఖండితంగా.

"పదియుఁబదియుగాను పతి నీకె వలచెను
పొదిగి నీ రమణుని భోగించవమ్మా" 26-89

"ఏటిదే మా వలపు యింతా నీదే వలపు
రోఁటితేఁ బదియుఁ బది రొక్క మాయ వలపు"
27-390

**పదిలించు**: పదిలపరచు.

**పదివేలు**: ప.బం; అదృష్టం, భాగ్యం, అమూల్యం.

"యిచ్చకాన నీకు నాకు నేఁటి మొగమోటమింక
వచ్చినదే పదివేలు వాదులాటే చాలును"
11-579

**పదివేలు వచ్చు**: (2) ప.బం; అ.క్రి. కావలసినదంతా సంతృప్తికరంగా వచ్చు.

"పోపో యింకా నేఁటికి పొద్దువోదా
పైపై నీకు మొక్కేము పదివేలు వచ్చెను"
16-201

**పదుమనాభుఁడు**: వి. పద్మనాభుడుకు వ్యావహారికరూపం. విష్ణుమూర్తి. 'ద్మ' లో మధ్య ఉకారం చేరింది.

"పాటిగంపనీళ్లు నించేవు పదుమనాభ
బాటలాయె నీ గుట్టు పదుమనాభ" 15-247

**పద్దేలు**: వి; బహు. 'పద్యాలు'కు వ్యావహారికరూపం.

"నాడొడి మాటని నా పే రేలడిగేవు
చేడెలపైఁ బద్దేలు చెప్పుదువో నీవు" 10-2-34

**పద్మిణి జాతి**: వి. పద్మిని యను స్త్రీ జాతి విశేషం. ఇట 'న' కారానికి బదులు 'ణ' కారాన్ని ప్రయోగించడం విలక్షణం.

"సొరెకు నతనితో చల్లలమ్మెడిని
భారపుటలపుల పద్మిణిజాతి" 5-92

**పనికివచ్చు**: ప.బం; అ.క్రి. ఉపయోగపడు.

"అనుమానమైనందుకు అన్ని యాసలు వెట్టిన
పనికివచ్చునో రాదో భావించరాదు" 11-394

"భావించి యెవ్వతెకైనాఁ బనికివచ్చేవా నేఁడు
నీ వోజ నిలుచుఁగాక నేర్పులు వచ్చీనా" 25-24

**పనిగొను**: ప.బం; స.క్రి. 1. వశపఱచుకొను 2. ఆజ్ఞాపించు 3. సేవింపజేసుకొను 4. పూనుకొను 5. సేవించు 6. నడపు అ.క్రి. అతిశయించు, విజృంభించు.

"తడఁబడి మాటాడేవు తలడెక్కడి పరాకో
బడిఁబెట్టు కెవ్వతెనా పనిగొనెనో" 23-261

**పనిపాటలు**: వి. పనులు అనే అర్థంలో జంటపదం.

"చిమ్ముచు నాతఁడు నేమించిన పనిపాటలలో
వుమ్మడిఁజేసేటి వట్టి వూడిగాలే కాక" 2-484

**పనిపూని**: ప.బం; అదేపనిగా, పనిమీద

"పనిపూని కరముతో పాంచజన్యము వట్టి
అనిశముఁ గరుణించీ నాదినారాయణుఁడు"
3-523

**పనిమంతుఁడు**: (పని+మంతుఁడు) వి. పనిలో నేర్పు గలవాడు. పని అనే దేశ్యశబ్దంపై సంస్కృత సమాసాలపై చేరదగిన మతుప్

ప్రత్యయం రావడం వ్యాకరణనియమ విరుద్ధం. ఈ పదం తెలంగాణంలో ఎక్కువ వాడుకలో ఉంది. చిన్నన్న కూడా ఈ పదాన్ని ప్రయోగించినాడు.

"కొనగోరు నిన్ను సోఁకె కూటములందె కలిగె
పనిమంతుఁడవు వొడఁబాటు లేల" 27-311

"కనకాంబరుని మెచ్చఁగను పనిమంతు"
అ.చ. 27 పు.

**పనిమాలిన:** విణ. ఉపయోగం లేని, పనికిరాని.

"పనిమాలిన యీ పలు లంపటముల
తనువు వేచు టెంతటి పని యిట్లా" 1-260

**పనిమాలిన పని:** (2) ప.బం. లాభంలేని పని.

"పనిమాలిన పనికి భ్రమతువు నీవును
అనిశము మీ సుద్దులే ఆడుకొనే రిందరు"
25-79

**పనిమాలు:** ప.బం; అ.క్రి. అనవసరమగు.

"పనిమాలిన యీ పలులంపటముల
తనువు వేచు టెంతటి పని యిట్లా" 1-280

**పనిలేదు:** క్రి.రూ. లాభం లేదు, ఉపయోగం లేదు.

"నిజమాడరా నాతో నీకు నీవే
బజనచెడ్డ వలపు పనిలేదు రా" 19-529

**పనిలేదు పాటలేదు:** (2) ప.బం; ఏమాత్రం పనిలేదు అనే అర్థంలో వాడబడే పదబంధం.

"తనకేమే సారె సారెఁ దడవీ నన్ను
పనిలేదా పాటలేదా పంతగారివాఁడు" 29-96

**పనిలేని పని:** (10) ప.బం; వి. లాభంలేని పని, వ్యర్థమైన పని.

"పనిలేని పనికి పరుల సొమ్ములు దెచ్చి
నినుపుగా నా కిచ్చేవు నీ చిత్తము కొలఁది"
27-245

**పనిలేని పనిది:** వి. నిష్ప్రయోజనమైన పనులు చేసేది.

"పనిలేని పని దాపె పంతము లొల్లని దాపె"
23-253

**పనిలేని పాట:** (2) వి. నిష్ప్రయోజనమైన పని.

"వట్టి యాసలనే యిటువలెనే పోయినాళ్లు
బట్టబయలీఁదితిమి పనిలేని పాట" 1-218

**పనిలేని పిలుపు:** వి; ప.బం. ప్రయోజనం లేని పిలుపు.

"పనిలేని పిలుపు బయలీతవలపు
వొనర నెంత సేసినా వొల్ల నొల్లనే" 26-211

**పనిలేవు:** ప.బం; క్రి.రూ. ప్రయోజనం లేనివి.

"మనసునఁ బుట్టిన మంకుఁగామక్రోధాలు
పనిలేవు తనకంటేఁ బాపమంటదు" 2-228

**పనివడు:** ప.బం; అ.క్రి. 1. పనికలుగు 2. పూనుకొను 3. యత్నించు 4. కోరు 5. వాక్యాలంకారం 6. సాహసించు 7. పనికల్పించుకొను 8. అక్కరపడు.

"పనివడింటికి వచ్చి పరాకు సేసుకుండఁగ
కనుదాఁకా మంచము సంగడి నున్నది" 25-81

**పనివనిగా:** క్రి.విణ. పనిలోపనిగా.

"అప్పుడే బలిమి సేసేవందుకేమి
చిప్పిలఁ బనివనిగాఁ జెప్పర నాతో" 11-155

**పనివాటలు:** (పని + పాటలు) ప.బం; బహు. పనులు అనే అర్థంలో వాడబడే జంటపదం.

"చిమ్ముచు నాతఁడు నేమించిన పనివాటలలో
వుమ్మడిఁజేసేటి వట్టి వూడిగాలే కాక" 2-484

**పనివి:** ఇది పనికి కావచ్చు. పనుకు ధాతువు క్త్వార్థకరూపం. 'కోపించి' అని అర్థం. పనుకు (?)

"అనలము శీతో భవ యన నేరిచిన సీత
పనివి (పనికి?) రావణ హతో భవ యన నేరదా"
15-263

**పనుపడు:** అ.క్రి. అలవాటుపడు, పూను.

"అనయముఁ దిరువేంకటాధీశ్వరుని
పనుపడి తనలోఁ బాడుచును" 1-130

**పన్నఁబన్నపందిలి:** (?)

"పన్నఁబన్న పందిలాయ బయలు
నిన్ను నాసెఁ జూచుకొంటె నేరము లే మున్నవి"
8-50

**పన్నగపు దోమతెర**: వి. ఆదిశేషుని రూపంలోని దోమతెర.

"విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమతెర పై కెత్తవేలయ్యా" 6-25

**పన్నారుకాఁగులు**: వి. పన్నారులు = చిన్నపిడుతలు, కాగులు = పెద్ద మట్టిపాత్రలు.

"కతలుగా పన్నారుకాఁగులలో
సతులపై సేసలు చల్లీ వాఁడే" 14-456

**పన్నారు దొంతులు**: వి. బాలికలాడుకునే చిన్న పిడుత (గురుగు)ల దొంతులు. (బ్రౌన్. పన్నారు = A pot or vase)

"పన్నారు దొంతులెక్కి బానల పెరుగునేయి
చెన్నుమీర నారగించి చేరి నవ్వీని" 24-267

**పన్నిద్దరు**: (పన్ + ఇద్దరు) వి. పన్నెండుమంది.

"చెంగట నాళువార్లు చేరి పన్నిద్దరు గొల్వ
సంగడిఁ దాఁగొలువిచ్చీ జయనరసింహము"
11-375

**పన్నిద్దరు ఆళువార్లు**: వి. పండ్రెండుమంది ఆళువార్లు. (ఆళువారు = ద్రావిడప్రబంధకర్త యగు విష్ణుభక్తుడు) వీరిని దివ్యసూరులనియు, నిత్యసూరులనియు వ్యవహరింతురు. వీరు: 1. పూదత్తాళ్వారు (భూతయోగి) 2. పొయిగైయాళ్వారు (సారయోగి) 3. పేయాళ్వారు (మహాయోగి) 4. తిరుమలీశాళ్వారు (భక్తిసారయోగి) 5.నమ్మాళ్వారు (శఠకోపయతి) 6. మధురకవి 7.కులశేఖరాళ్వారు 8. పెరియాళ్వారు (విష్ణుచిత్తుడు) 9.ఆండాళ్ (గోదాదేవి) 10. తొండరడిప్పొడి యాళ్వారు (భక్తాంఘ్రిరేణువు) 11.తిరుమంగైయాళ్వారు (పరకాల యతి) 12.తిరుప్పాణాళ్వారు (యోగివాహయతి)

**పన్నిన దొంతులపై నొక్క గుదియపెట్టు**: ప.బం. ఎన్నో మంచిపనులు చెఱుపుటకు ఒక్క చెడ్డపని చాలు ననుట.

**పన్నుకొను**: 1. ఒప్పు కలుగు 2. గట్టిపడు 3. కలుగు 4.పుట్టు 5. జాగరూకత కలుగు 6. నిశ్చయమగు 7.అతిశయించు 8. కమ్ముకొను 9. ధరించు 10. పెట్టుకొను 11. చేసుకొను 12. సిద్ధంచేసుకొను.

"ఎన్నఁటికి జీవుఁడిక నీడేరేది
పన్నుకొనేటి చింతలే బలిసీఁగాని" 2-188

"పన్నుకొన్న వేడుకలు పచరించీఁగాని" 12-81

"పన్నుకొన్న వలపులు పసలబారిఁబడితే
వెన్నెలలు గాసినాను వెట్టయై తోఁచు" 28-589

"యెన్నిక సేసుకొంటివి యింతగా మన్నించితివి
పన్నుకొన్న నీ కరుణే పదివేలు నాకు" 12-485

"పన్నుకొంటి సంపదలు పంచభూతాల లోనైతి
యిన్నిటా నీ పంపుననే యిఁకనో బుద్ధి" 3-270

**పబ్బు**: అ.క్రి. 'ప్రబ్బు'కు వ్యావహారికరూపం. 1. పెరుగు, వర్ధిల్లు, అతిశయించు 2. వ్యాపించు, పర్వు 3. నిల్చు 4.సంధిల్లు, కూడు.

"వుబ్బున నీవు గోరనూఁదినది నెఱఁగదు
పబ్బినది యెటువంటి పరాకో నీమీఁదను"
12-439

**పమ్మని**: ఇది 'పమ్మిన' కావచ్చు. అతిశయించిన అని అర్థం.

"కుమ్మరావమునఁ జెంబు కోరి వెదకనేల
పమ్మని(న) శ్రీపతిఁగొల్చి బదుకరో ప్రజలు"
4-135

**పమ్ము**: (13) వి. అతిశయం.

"బొమ్మల జంకించుతాను పొంచి యాసలు వెట్టుతా
పమ్ముఁజూపు పంతాలు పచారించుతా" 23-40

**పమ్ము**: అ.క్రి. 1. అతిశయించు 2. విజృంభించు 3. కలుగు. స.క్రి. 1. కవియు 2. నిర్మించు 3. కత్తి మొ॥ విసరు 4.వర్ణించు 5. అంచులు మడిచి కుట్టు.

"వుమ్మడి మెడనూళ్లు వుయ్యాల సరపణులు
పమ్మి శ్రీ వేంకటేశ నీ భావమే భోగము" 9-299

"ఉమ్మడి పంతాలు వొక్కరొక్క రాడుకొంటేను
పమ్మి అవి దిద్ద నీ పాల నుండును" 21-210

పయికొసరు: వి. ఏదైనా వస్తువు కొన్న తరువాత అదనంగా ఉచితంగా అడిగే వస్తువు.
"దయతో నాపై నేలి మంతనమాడితి విందాకా
భయము దీర్చితి పెట్టి పయికొసరా నేను" 21-72

పయిపచారములు: వి; బహు. (?)
"పవ్వళించి మాతో పని పయిపచారము లింతే
నివ్వటిల్లు నీతో పొందు నే నెఱఁగనా" 27-168

పయిరుసేయు: అ.క్రి. సాగుచేయు, పైరుచేయు. 13-83

పయ్యరగాలి: (3) వి. పైరగాలి, దక్షిణపుగాలి, చల్లగాలి. రూపాం. పయరగాలి, పైరగాలి.
"బలువూరుపులు దాఁగె పయ్యరగాలి రేఁగె
కులుకుమాట లణఁగె కోవిలలు గొణఁగె" 22-29

పయ్యాడించు: ప.బం; స.క్రి. సం.ప.స. లో ఈ పదానికి ఈ విధమైన వివరణ కనిపిస్తుంది. పయ్య = విభాగము అని కన్నడము. పయ్య + ఆడు = వేరుపడు; పయ్యాడించు = వేరుపరచి కావచ్చును. 547వ పాటలో పయ్యాడితే అను పలుకుబడి గలదు. అక్కడ కూడ నీ యర్థము సరిపడును.
"అలరీఁడ రుక్మిణిఁ బయ్యాడించి తెచ్చి
నలవాట
పొలిమి (మీ)తో నంటుఁగాక పోనిచ్చుటయా" 14-32

పయ్యాడినవారు: (పయి + ఆడినవారు) వి; బహు. వేశ్యలు.
"పయ్యాడినవారి చేతి బాగా లందుకో నీవే
యియ్యకోలై అకు మడిచిచ్చేఁగాని"

పయ్యాడు: (6) వేరుపడు, ఆవహించు. చూ: పయ్యాడించు.
"పయ్యాడి యలమేల్మంగపతి శ్రీవేంకటేశుఁడు
వొయ్యనే రతుల న న్నోలలారిచీనే" 29-470

పయ్యాడువారు: ప.బం; బహు. వేశ్యలు.

పరఁదు: వి. పద్దు, లెక్క. (వ్యు.)
"నరహరి కరుణే నమ్మినవారికి
పరఁదున నిక భయపడఁజోటేది" 4-380

పరఁదుకొను: అ.క్రి. దాగుకొను (?), వ్యాపించు (?)
"యెంతని పరఁదుకొనే విందిరానాథుఁడా
అంతరంగముల నుండె అందరిలోన" 10-41

పరంజోతి: వి. 'పరంజ్యోతి'కి వ్యావహారికరూపం, ఉత్కృష్టమైన జ్యోతి.
"పైకొని వెలిఁగేటి పరంజోతియై(యౌ)
లోకుమారునకు శరణ్యము" 4-376

పరంపరము: వి. పరంపర. స్త్రీలింగ శబ్దమైన పరంపర శబ్దానికి 'ము' విభక్తి చేరడం విలక్షణం.
"నిరతంబును నీ మాయే పరం
పరములాయ పాపవే నీ మాయ" 4-67

పరకట: పరస్థలంలో, ప్రక్కన, (పరకడ = ఇతరస్థలం, పార్శ్వం) రేపకడ, ఉదయాన్నే.
"పాపముఁబుణ్యము పరకట నున్నది
చేపట్టుము నీ చేతిది ప్రాణి" 3-394

పరకళ్లు: ఈ పదం నిఘంటువుల్లో లేదు. ఇది 'పరగడ(లు)' కావచ్చు. పర(అ)గడ అంటే పరిసరం, పార్శ్వం, ఇతరస్థలం, ఊరిబయటి బీడు, బయలు అనే అర్థాలు ఉన్నాయి. ఉదాహృతకీర్తనలో ఈ అర్థం సరిపోతుంది.
"గొందిఁ బంటసేయువాఁడు కొలుచులు పరకళ్లఁ
జిందకుండా గాదెఁబోసి చేరి కాచీని" 4-437

పరకాయప్రవేశము: వి. ఇతరుల శరీరంలో ప్రవేశించడమనే ఒక విద్య.
"పరమాత్మునిపై నాత్మ ప్రవేశింపఁజేయుటే
పరికింపఁ బరకాయప్రవేశము" 11-258

పరగడుపు: (పరము + కడుపు) వి. ఉదయం నుండీ ఏమీ తిండిలేని కడుపు, ఖాళీ కడుపు. రూపాం. పడిగడుపు. (తె.)
"పట్టి విడె మడిగేవు పరగడుపున వచ్చి
వొట్టి యాపె వూడిగాల కూరటా నేను" 27-317

పరచు: కులట, వ్యభిచారిణి.
"శిరసుండ మోకాల సేసవెట్టిన యట్లు
పరమధర్మము మాని పరచు (?) గా వలసె" 15-120

"చేతలు యీ గుణమైన సిగ్గుపడవలదా
బాఁతిపడి విషయాలఁ బర చయ్యీఁగాక" 9-147
"కాంతుఁడ యిటు గాకున్న కన్నవారి వెంటనెల్లా
పంతపు నీ మనసిది పరచై తిరుగుఁగా" 3-436

**పరచుఁదనము :** (పరచు + తనము) వి. జారత్వం, వ్యభిచారం, దుష్టత్వం, కాఠిన్యం.
"మరలి పద్మజుని మనుమని నైనఁ జంపీనే
పరచుఁదనమున వృథా పాలుమాలీనే" 6-22

**పరతంత్రము :** వి. పారతంత్ర్యం, ఇతరుల అధీనంలో ఉండడం. ధర్మవాచకానికి బదులుగా ధర్మివాచకం ప్రయోగింపబడింది.
"బలిమి స్వతంత్రముఁ బరతంత్ర మొకరికి
యెలమి నిందులోఁజెల్లే హీనాధికములే" 2-78

**పరభారము :** వి. 'పెద్దబాధ్యత' అని అర్థము కావచ్చును. సం.ప.స. 16 సం.
"నెలఁత పరభారము నీది కాదా
పలుమారు నిది యాల పచ్చిసేసేవయ్యా"
16-532

**పరభారాలు :** వి; బహు. ఎక్కువైన బరువులు, పరలోకపు భారములు.
"యేవల మా పరభారాలంతయు నీ కెక్కినది
ఆవటించి నే నీ శరణన్నదే మా వ్రతము" 2-512

**పరభావము :** వి. పెద్ద బాధ్యత.
"నెలఁత పరభావము నీది కాదా
పలుమారు నిది యాల పచ్చి సేసేవయ్యా"
16-532

**పరమాతుము :** వి. పరమాత్మ. ఆత్మ శబ్దాన్ని అన్నమయ్య ఆతుమ అనే ప్రయోగించినాడు. చూ: ఆత్మ.
"పరమాతుమ పరమాణురూప శ్రీ
తిరువేంకటగిరిదేవ శరణు" 1-155

**పరవంజుకొను :** స.క్రి. కమ్ముకొను, వ్యాపించు, ఆవరించు, ప్రసరించు, క్రమ్ము. (బ్రౌన్)
"చూపరఁబసురము తొరలువోయినను సొమ్ము
గలుగువాఁడే పరవంజుక
పైపైఁ దానే వెదకి తెచ్చి కాపాడఁగ నతనికి
భారముగాన" 3-392
"బాదల సంసారము పరవంజుకొని తొల్లి
యేది నమ్మి వాటువడె నీ జీవుఁడు" 3-79

**పరవశము :** (36) వి. పారవశ్యం. ధర్మార్థకానికి బదులుగా ధర్మివాచకపదం వాడబడింది.
"వనితలు రతిపరవశమున మురిపెపు
కనుఁగవ చూపులఁగరఁగుచును" 5-293

**పరవిడుచు :** స.క్రి. వదలివేయు.
"పొదలుచు మృత్యువు పందిసోటై నల్లట
నాడఁగ
పదిలముగాఁ గింకరులను చొప్పరులఁ
బరవిడిచీ" 1-298

**పరసిపోవు :** అ.క్రి. మాసిపోవు, నశించిపోవు, క్షీణించు.
"పట్టి మదనుభూతము పరసిపోయను బుద్ధి
వట్టిపెద్దతనాలను వచ్చే దేమీ" 2-176
"పరగి నాలుక సొం(యిం)పు పరసిపోయ
పరులనే నుతించి పలుమారును"
"బత్తి సేసితేఁ జలము పరిసిపోవు
పొత్తు గలసితే పొరపొచ్చ మేడది" 29-57
చి.సూ. ధాతుమాలలో ఉపద్రవం తప్పిపోవు అనే అర్థం చూపబడింది.

**పరాకు :** వి. 'పరాఙ్ముఖ' శబ్దభవం. పరవశత, మగ్నత.
"బగివాయ కాపెమీఁది పరాకున నున్నవేళ
నగినదే చాలదా నాతో నీవు" 19-189

**పరి(ఱి)గలేరు :** కోసినప్పుడు చేలో రాలిన ఎన్నులను ఏరుకొను.
"పరిగలేరేటివానిఁ బట్టపురాజుగా
నిరతభోగము లిచ్చి నిలిపినట్లు" 1-282
'పఱిగయేరితే పాతర నిండుతుందా' అని సామెత.

**పరి(ఱి)గ లేరేటివాఁడు :** వి. చేలో రాలిన ఎన్నులను ఏరుకొని జీవించే బీదవాడు.
"పరిగలేరేటివానిఁ బట్టపురాజుగా

నిరతభోగములిచ్చి నిలిపినట్లు" 1-282

**పరి(ఱి)వోవు:** ప.బం; అ.క్రి. నిఘంటువుల్లో ఇది బండి 'ఱ' తో కనిపిస్తుంది. బండి 'ఱ'తో కూడిన పదాన్నికూడా అన్నమయ్య ప్రయోగించినాడు. 1. కొల్లవోవు 2. నశించు 3. కొఱతపడు 4. చెడిపోవు.

"పాలుమావి వుండినాను పరివోవు(గాలము
కూళగోష్ఠి నుండినాను కొంచపడు(గాలము"
15-270

**పరి:** అవ్య. అనేకపర్యాయాలు.

"పలు జన్మములే నన్ను పరి అరికట్టుకో(గా
తొల(గ(దోసి నాకు( దోడైతివి" 1-475

**-పరి:** పర్యాయం, మాఱు, వరుస

"పలుజన్మములే నన్ను పరి అరికట్టుకో(గా
తొల(గ(దోసి నాకు( దోడైతివి" 1-45

**పరికరములు:** వి; బహు. శ్రీ వైష్ణవమున చిదచిత్తులు. భగవంతుని క్రీడార్థం ఆకృతులు కల్పింపబడి, సృష్టింపబడిన పదార్థములు. ఈ పదార్థములకు సంప్రదాయంలో పరికరములని వ్యవహారం.

**పరికెలువెట్టు:** ప.బం; అ.క్రి. నిందలువేయు, ఆక్షేపణలు చేయు

"దొరకొని దైవముతో మాటలాడ(గ
పరికెలువెట్ట(గ( బాడౌనా" 6-93

**పరిగె లేరేవానిని పట్టపురాజు చేయుట:** ప.బం. ఒక సామాన్యుణ్ణి గొప్ప స్థానంలో ఉంచడం.

**పరిచారకపుది:** (పరిచారకము + అది) పరిచర్య చేసేది, పరిచారకురాలు. ఇట పరిచర్య అనే అర్థంలో పరిచారకము అని ప్రయోగించడం విలక్షణం.

"పరిచారకపుదాన( బైకొని నన్నేలితివి
యిరవైన మగువ నన్నెట్టు నవ్వేవో" 14-25

**పరిచ్ఛిన్నుడు:** వి. దేశకాలాదులకు లోబడినవాడు.

"పరిపూర్ణు(డగు నిన్ను( బరిచ్ఛిన్నుని(గా
నరయుట యది నా యపరాధము" 1-271

**పరిచ్ఛేది:** (?)

**పరిజించు:** స.క్రి. పరుజుతో (కత్తిపిడి) పట్టు.

"వాఁడి బిల్లకత్తి వలచేత( బరిజించి
పోఁడిమి బాలడ సంకుపోచి నాడించి (?)"
17-230

**పరిఠవించు:** స.క్రి. ధరించు, పూయు.

"దొరకొని హేయమే తోడేటివాఁడు
పరిఠవించును మేన( బరిమళము" 4 అను. 26

**పరిణతలు:** వి; బహు. ఇది 'పరిణతులు' కావచ్చు. నమస్కారాలని అర్థం.

"బలసి మునుల యాపదలు వాపుటకు
బలునృపభంజను పరిణతులే" 1-335

**పరిణమించుకొను:** అ.క్రి. సంతోషించుకొను.

"పంతమిచ్చి నవ్వించగ( బరిణమించుకొంటిని
యెంత లేదు నీ సుద్దులు యెంచవచ్చునా" 7-8

**పరిణామము:** (2) వి. క్షేమం, సంతోషం.

"ఎక్కడి దిక పరిణామము యీ
మదనానలమున"

"పక్కన సీతకు( బరిణామమాయ
నిక్కేము రావణ నీకో బ్రదుకు" 3-31

**పరిణామించు:** సంతోషించు, సుఖించు.

"పచ్చి నీ గుణములకు పరిణామించుట గాక
కెచ్చురేఁగి బొమ్మల జంకించవచ్చునా" 9-5

**పరిణాము:** వి. పరిణామశబ్దభవం. తీర్మానమని అర్థం. పరిణాపుమాలు ఇత్యాదుల సామాసిక పుంప్వాదేశములు గూడ గలవు. (సం.ప.స. 14 సం. 352 పు.)

"అన్నిటా( బరిణామైతే నదే చాలు
వున్నతపుసంతోసాన నున్నాఁడవా" 14-37

"పాయపు(బతికిని( బరిణాము చెప్పి
మోయును( దనకిటు మొక్కితి నవవే" 19-334

**పరిపరి జవ్వనము:** వి. బహుప్రకారమైన యౌవనం.

"పరిపరిజవ్వనముపై పరవశమో
మరుసముకములోని మాటల తేటలో" 24-139

**పరిబాస**: వి. 'పరిభాష' శబ్దానికి వికృతిరూపం. సంకేతం, నియమం.

"అలివేణి మదిలోని అడియాసలు
పలుకుల వినయపు పరిబాసలు" 29-389

**పరియంకము**: (2) వి. 'పర్యంకము'నకు వ్యావహారిక రూపం. మంచం.

"పరియంకంబునఁ బవళించెదవో
సిరుల విభవములఁ జెలఁగెదవో" 5-19

**పరివిడుచు**: స.క్రి. పాఱవిడుచు.

**పరిసరుఁడు**: వి. సమీపంలో ఉండేవాడు, సమీపస్థుడు, పరిజనుడు.

"సతులు సుతులుఁ బరిసరులు బాంధవులు
హితులు గొలువఁగా నిందరును" 1-346

**పరిహరము**: వి. పరిహారము, విడుపు.

"నెత్తమ్మి తావుల నిట్టూర్పుగములు
కొత్తగు బడలికకును పరిహరము" 24-45

**పరుజు**: వి. (కత్తి)పిడి.

"వాడివో కంటి రటవే వన్నెలవాఁడు
పైడిమోలము కటారుపరుజులవాఁడు" 17-116

**పరుబోఁకి**: వి; మాం. పనికిమాలినవాడు, నీచార్థంలో తిట్టు. బోకి అంటే కుండపెంకు. నీచార్థంలో వ్యక్తిని తిట్టడంలోనూ బోకి అని తిట్టడం ఉంది. 'పోరంబోకు' అనే పదానికి వికృతిరూపం.

"పుట్టుమాలిన పరుబోఁకిని నన్ను
దిట్టే వదే మోసి దిమ్మరిమాయ" 1-107

**పరువతము**: వి. పర్వతము. ఈ విధంగా సంయుక్తాక్షరాల నడుమ అచ్చు చేరడం శివకవుల ప్రయోగాల్లో కనిపిస్తుంది.

"పరువతమేగిన బత్తుఁడనైతి" 1-19

**పరు(స)షః** (18) వి. తీర్థయాత్రలు చేసేవారి సమూహం, తిరునాళ్లకు వెళ్లేవారి గుంపు, తైర్థిక సమూహం. (పరుస = బాటసారుల గుంపు అని వాచ; శ.ర.)

"పరుస యనఁ దైర్థిక సభాఖ్య పరుగుచుండు"
అని ఆం.భా. 2-171

"పరుసనే జనులకు స్వప్నములో మాటలాడి
పరుషలకు వరాలు పైపై నిచ్చీని" 15-436

కళాపూర్ణోదయంలో 'పరుసవారు' అనే ప్రయోగం కనిపిస్తుంది. (6-6)

"గరుడధ్వజంబెక్కె కమలాక్షు పెండ్లికి
పరుస లదివో వచ్చె పైపై సేవించుచును" 3-21

"కోవరమై యేఁటనేఁటాఁ గోరి వరములకుఁగా
కావించి పరుష వచ్చే కత చూచుకోరయ్యా"
3-134

సంత అనే అర్థంలో 'పరుష' అనే పదం రా.సీ. లో నేటికీ వ్యవహారంలో ఉంది. పశువుల పరుష మొ॥

**పరుసము**: (11) వి. పరుసవేది, లోహాలను బంగారు చేసేది, స్పర్శవేది.

"పక్కన లోహముఁ బరుసము దాఁకిన
యెక్కువ నంతా హేమమే కాదా" 3-539

"పరుసము సోకిన బంగారము వలె
పరమభాగవతపట్టములు" 4-381

**పఱగడ**: ఇతరస్థలం, పార్శ్వం.

**పఱచ**: వి. ధూర్తురాలు, కులట, వ్యభిచారిణి. (వ్యు.)

"పఱచైన జవరాలు పరులెల్ల మగ లంట
వొఱపు నిలిపి నట్లోహో నేము" 1-94

"తఱచు మాఁటలాడితే తప్పు లెన్నైనా దొరలు
పఱచై తిరిగితేను పాపమంటును" 4-516

**పఱపు**: వి. పడక.

"పఱపుపై నీకు నాపె పాదములు గుద్దఁగాను
తఱితోడి వలపులు దైవారవా" 26-335

**పఱివోవు**: ప.బం; అ.క్రి. వెనక్కిపోవు, మరలు, వెనుదీయు, నశించు, కొల్లపోవు, క్షీణించు.

"పఱివోని యాస దనుఁబట్టుకొను భూతమని
వెఱచినది యదిగదా విజ్ఞానమహిమ" 1-181

**పలు**: వి. పల్లు.

"సుడిగొని నీ పలు సోఁకఁగ సోఁకఁగ
వడిగొని మై మరవక మరచె" 7-304

పలుకుఁదేనెల తల్లి : వాఙ్మాధుర్యం కల తల్లి, సరస్వతి.
"పలుకుఁదేనెల తల్లి పవళించెను
కలికితనముల విభునిఁ గలసినది గాన" 6-74
పలుకు పంతము చెల్లు : ప.బం.; అ.క్రి. మాట చెల్లు.
"పిలిచి శ్రీవేంకటేశ పెనఁగి నన్నుఁగూడితివ
పలుకుఁబంతాన నీ నా బలువింతే కాక" 11-253
పలుకుల కొనవాఁడు : వి. ఉపనిషత్తుల్లో ప్రతిపాదింపబడినవాఁడు. (పలుకులకొనలు = ఉపనిషత్తులు)
"పలికి చూచినాను పలుకక మానినాను
పలుకుల కొనవాఁడు దైవమొక్కఁడే" 3-380
పలుగాకి : వి; ప.బం. దుష్టుఁడు, తుంటరి.
"తల్లిదండ్రి వెంచనట్టి తగుఁబలుగాకి
చల్లుఁబుప్పొడి దొంగిలిన జాజరకాఁడు" 7-324
పలుపు : వి. పసుల మెడ గట్టెడి తలుగు, ఆబంధము.
"పలు పొకచో నుండఁగా భావమెట్టు గరఁగీని
బలిమి నే నెటువలెఁ బైకొందునే యతని" 28-21
పలుసోఁకు : వి. దంతక్షతం. చూ : పల్లుసోకు.
"ముంచిన పలుసోఁకులె ముయికి ముయి" 9-129
"మోవిపై పలుసోఁకులు మోపకు నీవంత మమ్ము
యీవేళ నన్నుఁ గూడితి వింత చాలదా" 12-11
పల్లకట్టు : వి. పల్లవన్నె చూపేది, పల్లవన్నె కలిగి కనబడేది.
"వలపు చప్పఁజేసేటి వగకాఁడ నీ
బలిమి నా మనసుకుఁ బల్లకట్టవలెనా" 11-159
పల్లటీఁడు : వి. పల్లటి, విలాసకాడు.
"పంతమాడనేర నా పల్లటీఁడు నాయకుఁడు
అంతరంగము దెలిసెననీ కాక" 8-189
పల్లదనము : (6) వి. 'ప్రల్లదనము'నకు వ్యావహారికరూపం. 1.అప్రియవచనం, పరుషవచనం, దుర్భాషణం 2.పౌరుష్యం 3. దౌష్ట్యం 4. దుష్కార్యం 5. వ్యర్థభాషణం. విణ. గర్వంతోకూడిన.
"బల్లిదురాలకె గొన్న బాస దప్పినాఁ దప్పీని
పల్లదాన నీక నీవు పట్టకురా నన్ను" 7-45
పల్లదము : వి. పౌరుష్యం, ధూర్తత్వం, దౌష్ట్యం, వ్యర్థభాషణం, గర్వం. విణ. గర్వంతో కూడిన.
"పల్లదపుజవ్వనము పంచపాలై మరి
నుల్లసాన నవ్వులాను ఊడిగాలు సేసీవే" 16-53
పల్లదీఁడు : (3) (పల్లదము + ఈఁడు) వి. పౌరుష్యం కలవాడు, చెడ్డవాడు, వదరుబోతు, దుష్టుడు, పరుషవాక్యాలు పలికేవాడు.
"బాలుఁడటవే సాదటవే వీఁడు పల్లదీఁడు గాక
కీలుముంది తనమాఁటలే గొలువ గొబ్బునఁ
దగవు చెప్పీనమ్మా" 10-2-111
"పల్లదీఁడైనవాఁడు పచ్చిమాఁట లాడితేను
వుల్లములో నుడి(డు) కెత్త దువిదకును" 27-66
పల్లదొరలు : వి; బహు. సందర్భాన్ని పట్టి ఒకానొక ఎల్లని ఫలవిశేషమని తోస్తుంది.
"పండెబో నీ కెమ్మోవిఁ బల్ల దొర లింతలోనె
నిండెబో చల్లనిగాలి నీ వూర్పుల" 26-42
పల్లవరాయని మటము : వి. తిరుపతిలో పల్లవరాయడు (వానె దుత్తై యలగియార్) కట్టించిన మఠం. కపిలతీర్థం వద్దనున్న నమ్మాళ్వారి గోపురకుడ్యం పైని శాసనంలో దీని ప్రసక్తి ఉంది.
"అక్కజంబైన పల్లవరాయని మటము" 1-227
పల్లాండు : వి. శ్రీవైష్ణవులు పాడే ఆశీర్వచనగీతం. పల్లాండు పల్లాండు అని ప్రారంభమౌతుంది.
"పచ్చవిలువాని తల్లి బంగారుదోసిట నీపైఁ
బచ్చకప్పురము చల్లీఁ బల్లాండు పల్లాండే" 5-188
పల్లించు : స.క్రి. జీనుకట్టు (శ.దీ.) ఆయత్తంచేయు – సాధించు, దిద్దు (ఆ.మూ.)
"పల్లించిన నీ పసిఁడి గరుడని కెల్లున నీ వెక్కిన యపుడు" 1-92
"తొల్లిట జన్మాదుల గాని నరరూపు
పల్లించుకొన్న యీ బ్రదుకు"

పల్లుసోఁకు: (2) వి. దంతక్షతం.
"యెల్లగా శ్రీవేంకటేశ యేలితివి మమ్మునిట్టె
పల్లుసోఁకు మా గురుతు బాగౌనా నీకు"
14-162

పళావళి: వి. ఈ పదం నిఘంటువుల్లో కానరాదు. 'పాలవెల్లి'కి వ్యావహారికరూపం కావచ్చు. (f.n. 22-240)
"చక్కిలాలు సురుగులు సరిఁ బళావళి గట్టి
మొక్కరో యీ బాలునికి ముద్దుగారీని" 22-239

పళి: వి. నింద అని తమిళం. తెనుగు ప్రయి ఇదే. (సం.ప.స. 14 సం. 352 పు.)
"చిగురువంటివారము చివికేవారము గాము
పగ నీమీఁదనే వచ్చి పళియై నిలుచును"
14-276

పళువరించు: స.క్రి. ఇది పశువరించు కావచ్చు. బలిపెట్టు. (పశువుగా చేయు)

పళ్లి: వి. ఇది కన్నడపదం. బడి అని అర్థం.
"కూపుదాఁకా నేరుపులే మాతోఁ బచరించేవు
యే పళ్లిఁ జదివితివో యింతేసి నీవు" 29-237
"వొద్దికనేఁ జెనకితే నొడ్డించుకొనేవు యీ
విద్దెలు యే పళ్లిఁ జదివితివయ్యా" 28-547

పళ్లిభోగము: వి. దేవునికి చేసే భోగాలు, భక్ష్యభోజ్యాది కైంకర్యాలు.
"పదివేలు పళ్యాల పళ్లి భోగము నీ
వదన నారగింతు వప్పాలతో" 5-198

పళ్లెములో కూడు: ప.బం; వి. సిద్ధాన్నం, సులభంగా లభ్యమయ్యేది.
"పూఁత నీ గర్వముల చూపులే వారకములు
లేఁత నీ నగవులే పళ్ళెములో కూడు" 5-206

పవడపుమోవిది: (పవడము + మోవి + అది) వి. పగడము వలె ఎఱ్ఱనైన పెదవి గల స్త్రీ, స్త్రీ.
"పవడపుమోవిదాన భారపుగుబ్బలదాన
సవరపుఁగొప్పుదాన చక్కనిదాన" 29-409

పవడవాతెర: (పవడము + వాయ + తెర) వి. పగడము వంటి పెదవి.
"పువిద మోము కళలుప్పతిలీ నివె
పవడ వాతెరయుఁ బండె యిదె" 28-168

పస: (2) వి. సారం, నిగ్గు, కాంతి, సత్త, సారస్యం, సమృద్ధి, చాతుర్యం.
"పానుపుపై నుండఁగాను పసలుగా నన్నుఁగూడె
యే నెలఁతల నేలెనో యితఁడు" 13-44

పసని వజ్రము: వి. ఎఱుపు మించిన పసుపు వన్నె గల వజ్రము.
"పలికినవెల్లాఁ బసని వజ్రములు
నిలువునఁ దురుమే నీలములు" 24-47

పసపుఁజీరవాఁడు: వి. పీతాంబరుడు, విష్ణుమూర్తి, పసుపువర్ణం కల వస్త్రం ధరించినవాడు అని వ్యుత్పత్తి.
"పసపుఁజీరవానిఁ బట్టుమని యాడితేను
దెసల మాబోఁటి కెట్టు దెలియఁగవచ్చునే"
24-86

పసిఁడి చీరవాఁడు: పీతాంబరుడు, విష్ణుమూర్తి. పసిఁడి వర్ణం కల వస్త్రం ధరించినవాడు అని వ్యుత్పత్తి.
"పసిఁడిచీరవాఁడవు పాలు దచ్చితివి గాన
పసిఁడిఁ బోలినది చేపట్టెను నీ కరము" 22-64

పసిఁడిలో పరిమళమగు: ప.బం; అ.క్రి. బంగారానికి తావి అబ్బు, గుణాధిక్యం కలుగు, అపురూపమగు.
"అలరి శ్రీవేంకటేశ ఆదరించినది
ఫలియించి పసిఁడిలోఁ బరిమళమాయ"
21-445

పసిగొను: ప.బం; అ.క్రి. తావిని గ్రహించు, వాసన పట్టు, మూర్కొను. (వ్యు.)
"పసిగొని ఋణానుబంధము కొలఁదే
పసులునుఁ బడతులు బహుసుతులు" 2-422
"పరమపదంబును చేనికి పసిగొను
నరమృగములకును
తరమిడి సంసారపుటోదములనె యాగించ"
1-298

పసిచల్ల: వి. ఆవుచల్ల. 'పసి'అనే పదానికి ఆవు అనే అర్థంలో ప్రయోగం ఉంది. (79 పుట. 12 పం.)

"పసిచల్లమ్మే గొల్లపడుచా నీవె
పసివడి తిరిగేవు బడివాయక" 5-197

పసిడిబద్దలవారు: వి; బహు. బంగారు వేత్రములు హస్తములందు ధరించినవారు.

పసిబాల: వి. పసిబిడ్డ, శిశువు.

"చూతఁ బసిబాల గాని జాటు గడెమ్మా తా
నాడిసట్టి ఆడుకుంటే సగ్గల మయ్యీని" 24-60

పసిబాలనాఁడు: పసిబిడ్డవయస్సులో, శైశవంలో.

"పసిబాలనాఁడు నీవు బండికిఁ బాదము చాఁచి
దెసల నర్జును బండితేరు నెక్కితి" 20-332

పసిరికాయ: వి. పసిడికాయ, పొత్తినూలుకాయ.

"చుట్టుకొంటిఁగర్మములు సొరిదిఁబసిరికాయ
నట్టనడిమి పురువు నడకవలె" 3-338

పసిరికాయ పురువు: పొత్తినూలుకాయలోని పురుగు.

"పాపపుణ్యకర్మదేహి పసిరికాయపురువు
కూపములోని కప్ప దుర్గుణబద్ధుఁడు" 15-378

పసివడు: ప.బం; అ.క్రి. కామాతురయగు.

"పసిచల్లమ్మే గొల్లపడుచా నీవె
పసివడి తిరిగేవు బడివాయక" 5-197

పసురము: (2) వి. పశువు, గోమహిషజాతి. రూపాం. పసరము.

"నెలకొని నీవద్ద నిలుచుంట చాలదా
బలిమి పైపడునా పసురమువలెనా" 25-214

పసురు: వి. ఆకు మొ॥ వాటిరసం. రూపాం. పసరు.

"అసమున నండవారు అందాలు సేసేమంటే
పీసికితే పసురై పిప్పిరేఁగఁ జొచ్చెను" 7-19

"వొలసీ నొల్లనిచోట నొరసితే విసుపౌను
బలిమి సేయఁగఁబోతే పసు రౌను" 19-328

పసురువయసు: వి. లేఁత వయస్సు, పసివయస్సు.

"పసివాఁడుతనవముల వల పెంటైనాఁ గద్దు
పసురువయసుతోఁడఁ బదరదు గాని" 14-64

పసురువేయు: (3) (?)

"రసికులైనవారు రాముల నలఁగించితే
పసురువేసి నందురు పట్టకుమీ విభుఁడా"
20-130

"పిలిచితే రానివానిఁ బెనఁగులాటకుఁ జొచ్చి
బలిమిసేయఁగఁబోతే పసురువేసు" 25-261

పసురెక్కు: అ.క్రి. దృఢపడు, బలవంతమగు.

"కొసరి యెప్పుడు నిన్నుఁగోపెంచినది యెల్లా
పసురెక్కఁగాక యిఁకఁబంతమిచ్చేనా" 11-234

పసులు: వి; బహు. పశువులు.

"పసుల యేలిక నేల పసులకు మారు దెచ్చి
పసులఁ గాచినయట్టి బాలుఁడీతఁడు" 7-87

## పా

పాఁగు: (52) అ.క్రి. పొంగు అని తమిళ శబ్దం. క్షేమము అని అర్థం. ఇక్కడ క్షేమకరమైన అని అర్థము కావచ్చు. తెలుగులోని బాగు కూడ నిదియే కావచ్చు. అని సం.ప.స. (16 సం.) ఈ పదం ఏ నిఘంటువుల్లోనూ లేదు. సందర్భాన్ని బట్టి దీనికి వృద్ధిచెందు, పెంపొందు, పొంగిపోవు అనే అర్థాలు చెప్పుకోవచ్చు.

"పాఁగినగుబ్బలు సోరె పయ్యెదను
మూసుకొంటా" 22-529

"పాఁగిన యింతి కుచాలెపై తరవు కాక" 9-112

"పాఁగిన వోవరిలోనఁ బవళించుచున్నాఁడు"
ఇక్కడ అర్థం కుదరడంలేదు.

"అన్నిట కర్మపుఁ బంకమంటిన దీ యాతుమ
మున్ను కోపదుర్గంధములఁ బాఁగె నీ యాత్మ"
4-446

ఈ ప్రయోగాల్లో అర్థాలు కుదరడం లేదు.

పొంగిపోవు:

"పాఁగిన శ్రీవేంకటపతి నన్నుఁ గూడితివి"
11-360

"కాఁగిలిదే కందువిదే కాదుగూడ దనరాదు
పాఁగితిఁ దన రతులఁ బదపదవే" 20-199
ఆ.మూ.గారు అనురూపమగు, యోగ్యమగు
అనే అర్థాన్ని సూచించినారు.

పాఁగెన: వి. (?)
"పలుకుల చిలుకలు పడఁతి నీకును నాకు
కులము పాఁగెన నొక్క గూడి వాయ సుమ్మీ"
26-199

పాఁతగిలు: అ.క్రి. పాతదియగు.
"మోఁత నీటిమడుగులో యీఁత గరచినవాఁడు
పాఁతగిలే నూతికిందఁబాయనివాఁడు" 5-295

పాఁతర: (పాఁతు + అర) వి. ధాన్యముంచడానికై
తవ్విన పల్లం, నిధి.
"కాంతలు నవ్వుచునైనాఁ గన్నుల
చూచినచూపు
పంతమున నలుగుల పాఁతర నుండి" 2-26

పాఁతరబెట్టు: స.క్రి. అణచు, తొక్కిపెట్టు,
శిక్షించు.
"పెనఁగి నే బిలువఁగా బిగిసి రాకుండే వాఁడు
తన తమి యెక్కడఁ బాతరబెట్టీనే" 28-557

పాఁతు: వి. వైశాల్యం.
"లోఁతుకొలఁదే పాఁతు లోన నేల జంకించేవు
చేఁత నీవు సేసినంతే చేరి మా పొందు" 16-256

పాఁతుమాకు: వి. స్థిరంగా నిలచినవాఁడు.
"చేఁతలు దవ్వేటివాఁడు సిగ్గువడ నేర్చునా
పాఁతుమాకై వుండేవాఁడు పైకొనీనా" 11-475

పాఁపరేని మేను దన పానుపు సేసినవాఁడు: వి.
విష్ణువు, ఆదిశేషుని పానుపుగా
చేసుకొన్నవాడు.
"పాఁపరేని మేను దన పానుపు సేసినవాఁడు
మోఁపరయి సకలము మోచినవాఁడు" 5-216

పాఁపసెజ్జ: (పాము + సెజ్జ) వి. పాముపడక.
"యెడయక పాఁపసెజ్జ నిద్దరునుఁబెనఁగుచు
కొడుకుఁగంటివిగా గోవిందనాంచారి" 17-315

పాంగెము: వి. 1. సంబంధం 2. ఒక కులపు
కట్టుబాటు, చుట్టరికం (వ్యా.) రూపాంతరం
పాగెము, పంగెము.
"మోము చూచి నవ్వి నాపె ముచ్చట నీతో నాడె
భామిని యెవ్వరితోడి పాంగె మేల" 16-212
"బచ్చెనల నతఁడు నీ పాంగెములోవాఁడై
నెచ్చెలి నీకుఁ గొంకి నే నీకు వెరతునా"
17-194 old

పాంచరాత్రధర్మము: వి. పాంచరాత్రులు పాటించే
ధర్మం. పాంచరాత్రులకు ధర్మానుసారం తాప,
పుండ్ర, నామాది పంచసంస్కారాలు
ఉంటాయి.
"యెంచఁదాపపుండ్ర నామహిత
మంత్రయాగమని
పంచసంస్కారము చెప్పె పాంచరాత్ర
ధర్మమిది" 15-113

పాండవసరసి: వి. పంచపాండవ తీర్థం. దీన్నే గో
గర్భతీర్థం అని అంటారు. ఇది తిరుమలలోని
ఒక పవిత్రతీర్థం. కౌరవపాండవులకు జరిగిన
యుద్ధంలో అనేక క్షత్రియులతో పాటు
బ్రాహ్మణులు కూడా చనిపోతారు.
బ్రహ్మహత్యాపాతకం పోగొట్టుకోవడం కోసం
పాండవులు ఈ తీర్థంలో స్నానం చేసి
బ్రాహ్మణులకు గోదానం చేయాలనుకుంటారు.
కానీ ఆ సమయంలో బ్రాహ్మణు లెవ్వరూ
కనిపించరు. అప్పుడు పాండవులు శ్రీకృష్ణుని
ప్రార్థించగా కృష్ణుడు ఒక వృద్ధబ్రాహ్మణుని
రూపంలో వచ్చి ఈ పాండవసరస్సు దగ్గర
గోదానాన్ని స్వీకరించినాడట. కాబట్టి ఈ
ప్రాంతానికి గోగర్భతీర్థం, పంచపాండవతీర్థం
అనే పేర్లు వచ్చాయని చెపుతారు.
"తా మహిఁ గోరికలిచ్చుఁ గుమారధారయు
పాండవసరసీ" 15 అను 460

పాగకాఁడు: వి. తలపాగా ఉన్నవాడు.
"పంతాన నా మోము తప్పక చూచేవది యేమీ
వంతుకుఁబాగకాఁడ వీవల నీవే కావా" 13-151

పాటపాట: కొంచెం కొంచెము, (బ్రౌన్)
మాటిమాటికి; క్వచిత్తు అని ఆం.ప.ని.
"పాటపాట సిగ్గులతో పడఁతి నీవు నవ్వఁగ

తేటతెల్లమాయను మీ తెఱఁగు లెల్లా" 21-368

"చిటపొట మని పాటపాట చినుకులు

పడఁజొచ్చుట యాదిగాఁగ" అని కళా. (4 ఆ.)

"వేసవి పాటపాట నరవెంద్రుకలతోఁ

దిలతండులాన్వయశ్రీ నటియించ" అని కాశీ. (7-160) పాఠం.

**పాటమగు:** అ.క్రి. విరివియగు, యోగ్యమగు. (బ్రౌన్)

"కొంతక శ్రీవేంకటేశ కూడితివి నన్నునిట్లె

పంతపు నీ మన్ననలు పాటమాయఁ గదరా" 8-122

"పాటమైన నీ పేరు పదములలోనఁ బెట్టి

కూటువ నిన్ను నంకించు కోమలి నిన్ను"

**పాటముగొను:** (4) ప.బం. నేర్చుకొను, పాఠముగొను, తనకు తానే వల్లించుకొను. (సం.ప.స.)

"పైపై నే మవి యెల్లా పాటముగొంటిమి నేఁడు

చాపలాన నే పొద్దూ జపము సేసేవూ" 21-351

**పాటము సేసుకొను:** పఠన చేసుకొను, ఉచ్చరించుకొను.

"ఇదె యలమేలుమంగ నేలితివి ననువుగా

పదిమారు లీకె పేరు పాటము సేసుకోవయ్యా" 24-589

**పాటి:** వి. (1. సామ్యం 2. ప్రమాణం విణ. 1. సమము 2.సామాన్యం 3. న్యాయం 4. కొలఁదిది) 5. శక్తి.

"యెదురు మాటాడితే యెగసక్యమౌ పొందు

పదరితే కడుఁగడుఁ బాటి చాలదు" 7-225

**పాటిగంప:** వి. చిన్నగంప, తగిన పరిమాణం కల గంప.

"పాటిగంప నీళ్లు నించేవు పదుమనాభ బండి

బాట లాయె నీ గుట్టు పదుమనాభ" 15-247

"మెల్లనె నీవే కాదు మేలుమేలు అంటే నీళ్లు

బల్లిదులైనవారు పాటిగంప దెత్తురు" 7-50

**పాటివట్టు:** స.క్రి. లక్ష్యపెట్టు.

"బలిమిసేయఁగఁబోతే పాటివట్ట రెవ్వరును

తలఁపు సరివచ్చితే దగ్గరి రారాదా" 21-112

**పాటుసేయు:** వీలు కల్పించు, వీలుచేయు.

"ఆయములెత్తి యాడి యతివ నిన్ను దూరితే

చాయగా పాటుసేసుకొని సొరె నవ్వేవు" 29-52

**పాడిఁబంతాలు:** ప.బం. న్యాయాన్యాయాలు (తె.వ్యు.కో.)

"యింతులెల్లఁ గూడితిరి యియ్యకోలు సేసితిరి

యింతలోనె పాడిఁబంతా లెన్ని కాయనె" 15-243

**పాడూరిలో బ్రదుకు:** వి; ప.బం. పనికిమాలిన, దుర్భరమైన బ్రదుకు. పాడూరు ఒక పనికిరాని ఊరై ఉంటుంది. లేదా పాడు + ఊరు అని విభజిస్తే పనికిరాని ఊరని అర్థం. అట్టి ఊరిలో బ్రదుకు పనికిమాలిందే కదా!

"పాడూరిలో బ్రదుకు పాపకర్మపు బుద్ధి

తాడుపై తపసు తమ ధనము ప్రాణులకు" 1-104

**పాతాళముల నిధానములు:** ప.బం; వి. వ్యర్థములు. పాతాళములో ఉండే నిధులు వ్యర్థములే కదా!

"పాతాళముల నిధానములు

పరమాత్మునికిఁగాని తపంబులు" 2-235

**పాతురలాడు:** అ.క్రి. పాతరలాడు, నాట్యంచేయు, నర్తించు, చిందుతొక్కు, సంతోషాదులచే గంతులు వేయు. (వ్యు.)

"పుట్టుగుకెల్ల సుఖము పొల్లు లేని నీ భక్తి

తొట్టికాళ్ల సుఖము పాతురలాడుట" 4-78

**పాతురాడు:** అ.క్రి. నాట్యం చేయు, పాతు(త)రలాడు. (తె.వ్యు.కో.)

"పంతపు నా కాఁగిటిలోఁ బాతురాడితివో కాని

దొంతివెట్టి రతులెల్లఁ దోడు చూపితి" 24-95

"చేతులెత్తి మొక్కఁగాను చిటికెన వేలుపట్టి

పాతురాడించినయట్టు పట్టి తీసేవు" 27-513

**పాత్రకత్తె:** వి. నర్తకి, నటి.

"పరఁగ గద్దెపై నుండి పాత్రకత్తెలచేత

గరిమ నాడించుకొంటా కడుఁ జొక్కని" 24-268

**పాదచింతకొమ్మ:** వి. పాదములనే చింతకొమ్మ, పాదము లందలి చింత అనే కొమ్మ - చింతకొమ్మ చాలా గట్టిది కనుక మోక్షానికి హరిపాదములు అంత గట్టివని చింతకొమ్మ అనే అర్థమే సముచితమనీ సంపా.

"ఘనమోహపాశముల గాలిఁబొయ్యెడి నాకు
కొనల నీ పాదచింతకొమ్మయే దిక్కు" 2-146

**పాదపుఁబరము:** వి. పాదమనే పరమపదం. (?)

"పంకజపుఁజేయి చాచి పాదపుఁబర మిచ్చిన
వేంకటేశు కృపతోడ వెలయఁదానే" 1-162

**పాదపుగోరితోఁ బోలు:** ప.బం. కొంచెమైనా సాటి రాకుండు.

"ఎంత నా సుద్దులు చెప్పి నిందరితోను
కొంతైనా తన పాదపుగోర బోలఁగలనా" 23-75

**పాదరము:** వి. పాదము.

"పక్కన నేనైతేను పాదరము తొక్కుడులనే
చొక్కించి నా యింటికిఁ దెచ్చుకొంటి నే నితని" 28-422

**పాదరసము బోలిన మనసు:** వి. చంచలమైన మనసు. (పాదరసం చంచలంగా ఉంటుంది)

**పాదాంగుటము:** (2) (పాద + అంగుటము) వి. కాలి బొటనవ్రేలు.

"పరఁగిన పాదాంగుటమున బ్రహ్మాండము
నగిలించిన
పరమాత్ముఁడీతఁడే పో పతివేంకటవిభుఁడు" 1-80

**పాదాలగంగ:** వి. విష్ణువు పాదాలలో ఉద్భవించిన గంగ.

"ననిచి బ్రహ్మాదుల నాభిఁ గన్న దేవుఁడు
జనించెఁ బాదాలగంగ సంగతైన దేవుఁడు" 4-297

**పాదాలు గుద్దు:** (11) ప.బం; అ.క్రి. పాదాలు పిసుకు, పాదసంవాహనం చేయు, ఈ అర్థంలో అన్నమయ్య అంతటా 'పాదాలుగుద్దు' అనే పదబంధాన్నే ప్రయోగించడం గమనించవచ్చు.

"నెట్టుకొని జవరాలు నీ పాదాలు గుద్దఁగాను
చుట్టి యెవ్వతె కెదురు చూచేవయ్యా" 26-303

**పాదించు:** పూను, వహించు అని అర్థం కావచ్చు.

"చలము పాదించరాదు జంకించి చూడఁగరాదు
యెలిమి నింతలో నేరా యెగ్గువట్టేవు" 19-50

**పాదికెత్తు:** (పాదిక + ఎత్తు) పాతికెత్తు, పాతిక ప్రమాణం.

"పాదికెత్తు మెరుగారు బంగారు గుండు
సేదదేర మెడఁగట్ట చిత్తగించితి" 5-219

**పాదుపడు:** ప.బం; అ.క్రి. నెలకొను, స్థిరపడు.

"పాదుపడక నడుమనుఁ దిరిగాడెడి
ప్రపంచముదే నేరమి
యె దెస నొకచో నిజ మేరువడక యిటువలెఁ
దిరిగాడెడిఁగాన" 3-396

**పాని(ను)పట్టు:** (32) అ.క్రి. 'పూనిపట్టు'కు వ్యావహారిక రూపం. ప్రయత్నించు (వ్యు.) పూనుకొను. ఇది 'పనిపట్టు'కు బదులుగా వ్యావహారికంగా వాడిన రూపం కావచ్చునని సం.ప.స. లో పేర్కొనబడింది. (సం.22) ఆనందమూర్తిగారు దీనిని పేనిపట్టుకు వ్యావహారిక రూపంగా భావించి 'పురి యెక్కించు' అనే అర్థం చూపినారు. (సం.వా.పద. 458)

"పానిపట్టి నీవె నా బంటు వయ్యేవా" 10-2-88

"నానాదేవతలకు నరసింహ కంభములో
పానిపట్టి చూపినట్టి ప్రహ్లాదవరదుఁడు" 11-135

"పానిపట్టి సర్వవిధబంధుండు విష్ణుఁడుండఁగా" 10-1-55

**పాను:** (8) అ.క్రి. ప్రసిద్ధనిఘంటువుల్లో ఈ పదం కానరాదు. తె.వ్యు.కో.లో దీనికి పూను, వహించు అనే అర్థాలు చూపబడ్డాయి.

"పానిన చదువుల పఠనలుండఁగా
మానిన దుర్భాషమాటలే హితవు" 4-96

"ధ్యానమే మా ధనము దయే మా ధనము
పానిన శ్రీ వేంకటాద్రిపతియే మా ధనము" 2-457

"యీ నెపాన దొరవైతి వింతేసె నాతఁడు
పానిన చలము చెల్లె బతుకవే యిఁకను" 21-378

**పానుకొను :** అ.క్రి. పూనుకొను, యత్నించు.
"పానుకొని దనుజుల బలుకిరీటములు
సొనలఁదీరిన వో చక్రమా" 1-183

**పాపమంటాఁ బాలు వోయఁబోతేను, వొళ్ల నోకిలించె :** నానుడి; మంచి చేయబోతే చెడు చేయు అనే అర్థంలో సామెత.
"పాపమంటాఁబాలువోయఁబోతేను
వొళ్ల నోకిలించె నన్ను వూహా నిజమాయఁగా"
22-8

**పాపమని :** ప.బం. దయాపూర్వకంగా, మేలుచేద్దామని.
"పాపమంటాఁ బాలువోయఁబోతేను వొళ్ల
నోకిలించె నన్ను వూహ నిజమాయ" 22-8

**పాపవినాశనము :** వి. తిరుమలకొండమీద నున్న ఒక తీర్థం. ఈ తీర్థంలో స్నానం చేస్తే చేసిన పాపాలన్నీ తొలగి పోతాయని భక్తుల విశ్వాసం. పాపాలనన్నింటినీ నాశనం చేసేది కనుక దీనికి గల పేరు సార్థకం.
"పామరులా అమరులఁ జేయును
పాపవినాశనమూ" 15 అను 460

**పామరి :** వి. పామరుడు అనేదానికి వ్యావహారికరూపం కావచ్చు. అజ్ఞుడు.
"పామరివై దుర్వ్యాపారమునకు పలుమారునుఁ బొయ్యేవు
వేమరు దుర్జనసంగాతంబులు విశ్రామమనుచ నుండేవు" 1-184

**పామఱితనము :** వి. (పామఱి=పామరుడు) పామరుతనము కావచ్చునని సంపా. అజ్ఞానం, పామరత్వం. బండి 'ఱ' ప్రయోగం విలక్షణం.
"పామఱితనమున బహువేదనలను
నా మనసెంబో నా వ్రాత" 1-233

**పామిడికోరిక :** వి. అడ్డులేని - ఉద్దండమైన కోరిక, సాధారణమైన కోరిక.
"పామిడికోరికలకు బంటైనవారలు
గామిడితనాలఁదామే కర్తల మనేరు" 2-261

**పామిడి గొల్లెతలు :** వి; బహు. ఉద్దండంగా తిరిగే గొల్లెతలు.
"బూమెల నీ వాడుకొన్న బొమ్మ వారితనమెల్ల
పామిడి గొల్లెతలందే పచ్చిదేరఁ బదరా" 22-13

**పామిడితురగపుఁబాదము :** వి. అడ్డమూక లేక ఉద్దండంగా తిరిగే గుఱ్ఱము గల పాదం.
"ప్రేమపు శ్రీసతి పిసికెడి పాదము
పామిడితురగపుఁబాదము" 1-191

**పాముకొల :** పాముబాధ.
"పట్టి కాళింగునిఁ దోలి పాముకొల దీర్చినాఁడు
బట్టబాయిటనే రేపల్లెవారికి" 2-57

**పాముచెలిమి :** ప.బం; వి. ప్రమాదకరం.
"పాము చెలిమి రంపపు సంసారము
గాముల మోఁచిన గంప యిది" 1-180

**పాముతోడి పొత్తు :** ప.బం; వి. ప్రమాదకరం.
"బలు సంసారపు పొత్తు పాముతోడి పొత్తు సుండి
వెల లేని వలపులు విషము సుండి" 1-494

**పామునోరి కడి :** ప.బం; వి. ప్రమాదం తప్పనిది, పులినోటి కండ వంటిది.
"పామునోరికడి మీ ప్రాణపుటూరుపుగాలి
జాము జాము మేలుఁగడు చక్కఁ జేయఁగనుడు" 1-160

**పాముపడుకవాఁడు :** వి. విష్ణుమూర్తి, శేషశయనుడు.
"పాముపడుకవాఁడ పట్టుకురా ఆ
పాముపంటి యారు నీకుఁ బాయదు గదే"
9-108

**పాములు వెళ్ళేటి పొద్దు :** వి. సాయంకాలం.
"పంచలఁ దిరుగకురే పాములు వెళ్ళేటి పొద్దు
కొంచెపు బాలులఁ బైకొను నందురు" 5-247

**పామేటి సుఖములు :** వి; బహు. (?)
"దోమటి నా మతిలోనఁ దోడునీడవై యుండి
పామేటి సుఖములనే భ్రమయించవలెనా" 2-59

**పాయను:** క్రి.ప. 'పోయెను' అనుటకు వ్యావహారికరూపం.

"ముమ్మాటికి నీ బాసలే – నమ్మివున్నదాన నేను
కుమ్మరించరా నీ కరుణ – వెంకటేశ
చిమ్ముఁజీఁకటెల్లఁ బాయను" 7-223

**పాయపుఁజంద్రులు:** వి. యౌవనంలోని నక్షత్రాలు.

"తోయపుగుబ్బల చన్నుదోయి మీఁద వాఁడొత్తిన
పాయపుఁజంద్రులఁ జూచి భ్రమసితి నమ్మా" 5-46

**పాయపుఁబడుచు:** వి. యౌవనంలో ఉన్న స్త్రీ.

"బచ్చనరూపుల పాయపుఁబడుచులు
నిచ్చలు గొలువఁగ నెమ్మదిని" 6-144

**పాయపునడపు:** వి. యౌవనపు నడక.

"పగటుగుబ్బలు పాయపునడపులు
తగులుమాఁటలు తమకయ్యా" 5-358

**పాయపు వయసు:** వి. యౌవనం.

"పాయపు నా వయసే కా పాసినప్పుడెల్ల నిన్ను
తోయపుమాటల నిన్ను దూరించెను" 12-52

**పాయము:** (14) వి. ప్రాయం, వయస్సు, యౌవనం.

"పట్టినదె పంతమో పాయమిది సంతమో
యిట్టి శ్రీవేంకటేశుఁ డేమనీనే" 7-301

"పాయము పిడికిటఁబట్టుచు నుండేటి
కాయధారులకుఁగలదా విరతి" 1-432

**పాయమువచ్చు:** అ.క్రి. పెండ్లియీడు వచ్చు, వయసు వచ్చు.

"ఈ యలమేలుమంగ ని న్నెనసిన వినకనె
పాయము వచ్చి యీరీతి బరగినది" 18-257

**పాయవట్టము:** (2) వి. ఆభరణవిశేషం, కాలి అందె.

"అందెలుఁబాయవట్టాలు అట్టె గల్లు గల్లనఁగ
యిందుముఖి వచ్చెను నీ యింటికి నేఁడు"
28-441

**పారఁబట్టు:** స.క్రి. బిగియబట్టు, ఆపుకొను, నిరోధించు.

"ఇంత మమ్మిట్లా నెలయించకురా నీ
పంతములన్నియుఁ బారఁబట్టింతు నోరి" 5-10

**పారవెళ్లు:** వ.బం; అ.క్రి. పరుగెత్తుకొని పోవు.

"పారితెంచి యెత్తివేసి పారవెళ్లితివి
నీరసపు టెద్దవైన నీకు ముద్దా" 1-87

**పారవైచిన పుల్లాకు బండి కల్లగు:** నానుడి; పనికిరాని వస్తువు విలువైన వస్తువగు.

"పారవేసిన పుల్లాకు బండికల్లై మించి నట్లు
కోరి నీ ముద్రలు మోచి కొండగొంటి నిదివో"
3-466

**పారాడించు:** స.క్రి. పొర్లాడించు, పరుగెత్తించు

"పంచల నరులవెంటఁ బారాడించే మనసు
కొంచక శ్రీవేంకటేశుఁ గొలిపించలేదా" 3-139

**పారాయణ:** వి. పారాయణం, అంతయు చదువుట, వేదపారాయణ మొ॥

"వేదపారాయణలతో వెసఁజూచెఁ గపిలను
గాదెల లెక్కలడిగె గడేరాలు వినెను" 7-473

**-పారి:** అవ్య. పర్యాయం, తడవ. ఇది మాండలిక పదం. తెలంగాణంలో దీని వాడుక ఉంది.

"ఒక్కపారే . . . . . ." 8-158

"ఒకపరి వ్యాఘ్రమై తోచు నొక్కపారి . . . . ."

**పారిఘంట:** వి. ప్రహరిగంట.

"మదనుఁడుండెడి హేమమందిరము దిరిగిరాఁ
గదిసి మ్రోసెదీ పారిఘంటలో కాని" 5-259

**పారిటాకు:** (3) వి. పాఱుటాకు, పండుటాకు.

"పట్టుచీ రేటికి నాకు పారిటాకులె చాలు
దట్టి గట్టుకొమ్మనవే తన మొలనే" 6-108

**పారితెంచు:** అ.క్రి. పరుగున వచ్చు, వ్యాపించు, ప్రసరించు, ప్రవహించు. ఇది పాఱిపోవు కు వ్యతిరేకరూపం. 'ఱ' కు బదులు 'ర' వాడబడింది.

"పారితెంచి వేసాలకు బడలికె దెచ్చుకొంటే
ఆ రీతి విసరుచు నలపార్చ వసమా" 13-192

**పారితేరు**: అ.క్రి. పారివచ్చు.
"దురదురఁ బారితేఁగా తురుమెల్లా నిదె జారె
గరిమల నిట్టే కీలుగంటు వేయరాదా" 14-553

**పారియాడు**: అ.క్రి. శిశువు జోగాడుటకుముందు ఒకరి చేతిసహాయంతో ముందుకు జరుగు, తిరుగు, పాఱాడు.
"సురలు నీవు రేపల్లె చొచ్చి పారియాడఁగాను
ఇరవై నీ వెంట నెట్లా దిరిగిరో" 15-36

**పారివారు**: విణ; బహు. సేవకులు.
"దీమసపు పారివా రీ దీవెపంజులు చేబట్టి
యేమరక మీలో మీరు యియ్యరో జాలి"
4-166

**పారిశము**: వి. 'పార్శ్వము'నకు వికృతిరూపం, పక్క. చూ: పారిశెము.
"పడఁతి వొక్కతె నిన్ను పక్క పారిశాన వచ్చి
తొడల జోడించి పట్టి తొలఁగఁదీసె" 21-325

**పారిసము**: వి. 'పార్శ్వము'నకు వికృతిరూపం, పక్క.
"ఎడ చొచ్చి వేరొకతె ఇవ్వలి పారిసమున
అడియాలమైన మాట లటు విన్నవించెను"
21-325

**పారుఁజేసు**: (?)
"బండివంటి మా పిరుఁదు బడి నీకుఁ దగిలితే
అండ నీపైఁ బారుఁజేసు నందుకోఁపుదువా"
11-251

**పారుపత్తెము**: వి. 1. ఆయవ్యయాదులపై అధికారం, అధికారం, యోగక్షేమం.
"ఇంతేసి పారుపత్తే లేమీ నీకు
అంతంతకు గరిపించే వత్తునా నే నీకు" 10-2-34

**పారుపత్యము**: (5) వి. 'పారుపత్తెము'కు వ్యావహారిక రూపం. దొరతనంవారి కివ్వవలసిన ధనాన్ని ప్రజలనుండి రాబట్టే అధికారం, అధికారం (శ.ర.) 'పిల్ల పారుపత్యము పెట్టని వక్క పొద్దు' అని రా.సీ. సామెత.
"పొలఁతి నీవద్దనుండి బుద్ధులెల్లాఁ జెప్పఁగాను
చెలఁగి పారుపత్యాలు సేయవయ్యా" 7-110
"పాడితోఁ బగర గెల్చి పారుపత్యాలు సేయఁగా
యీడనే సరిగద్దె నెదురెక్కెను" 25-328

**పారుబడి వడ్డి**: వి. ఒకరకం వడ్డీ.
"ముందటి జన్మములెల్లా దుంచెఁ బారువడి వడ్డి
యెందుఁజొచ్చినానుఁ బోనియ్యఁ దీ రుణము"
1-469

**పారెటాకు**: వి. పాఱుటాకు; మునులు లోనగువారు వస్త్రమునకు మాఱుగా కట్టుకునే ఒకరకపు ఆకు.
"పలచని పారెటాకు పయ్యెదేఁటికే అల
మత్తికు పానుపు అది నీకు నేలరా" 19-418

**పారెబండికిఁ గాలు చాఁచు**: వ.బం. అవివేకంతో స్వయంగా ఆపద కొనితెచ్చుకొను, వ్యర్థప్రయత్నం చేయు.
"అబ్బురపు వేడుకల నలసేవు పలుమారు
గబ్బివై పారెబండికిఁ గాలు చాఁచేవా" 10-1-14

**పారె బండికింద పాదము చాఁచు**: వ.బం; అ.క్రి. కావాలని ఆపద తెచ్చుకొను, నడిచే బండికింద కాలు చాచు అని వాచ్యార్థం. చూ: పారెబండికి కాలు చాఁచు.
"పారె బండికింద పాద మేల చాఁచవలె
జారువడి మరి యాల జడియవలె" 10-1-49

**పాఱాడు**: 1. శిశువు దోగాడుటకు ముందు ఒక చేతి సాయంతో ముందుకు జరుగు 2. తిరుగు.
"పాయక యశోద వెంటఁబాఱాడు శిశువు"
4-1 old

**పాలంటే గుటుకన్న మాట**: నానుడి; ఇష్టమైన దానిని గూర్చి వినగానే దానిని అనుభవించడం.
"ఆఁక శ్రీవేంకటేశ పాలంటే గుటుకన్నమాట
యేఁకట నీ జాడలాయ నికనేటి మాటలు"
9-272

**పాల ఉట్లపండగ**: వి. కృష్ణాష్టమి నాడు పాలముంతలను ఉట్లలో పెట్టి పైకి, కిందికి దింపుతూ చేసుకునే పండుగ. 12-17

పాలకూడు : (8) వి. పాయసం, పాలతో వండిన అన్నం.
"బంతినాతఁడును నేను పాలకూళ్లారగించఁగా
అంతటనుండి నీ వేల అట్టే చూచేవే" 21-59
"ననుపున సెలవుల నవ్వి నీ నవ్వులు
గొనకొనఁగఁ బాలకూళ్లాయ" 19-18

పాలకొండమల : కడపజిల్లా కడప తాలూకాకు చెందిన నంది మండలానికి దక్షిణంలో ఉన్న పర్వతం. ఈ పర్వతం కోనలో చెన్నకేశవస్వామి నెలకొనిఉన్నాడు.
"మందల పాలకొండమలకు నట్టనడుమ
విందగు దాసులతోడ విహారించీ దేవుఁడు"
4-375

పాలగిరి : వి. పాలకొండ; కడపజిల్లా కడపతాలూకా లోని నంది మండలానికి దక్షిణంలో ఉన్న పర్వతం. ఇట చెన్నకేశవస్వామి నెలకొని ఉన్నాడు. చూ : పాలగిరి రాయఁడు. 24-182

పాలగిరిరాయఁడు : వి. కడపజిల్లా, కడపతాలూకాకు చెందిన నందిమండలానికి దక్షిణంలో కల పాలకొండ పర్వతం కోనలో నెలకొన్న చెన్నకేశవస్వామి. ఇతడు చెన్నరాయడని కూడా కీర్తింపబడినాడు.
"కంటిరా నీ గుణమెల్ల కడగడనే
పంట మోవితేనె కాఁడ పాలగిరిరాయఁడా"
24-182
"చెల్లబో పాలగిరిచెన్నుఁడే వీడు కొమ్మా" అనే క్షేత్రయ్య పదంలో పాలగిరిచెన్నుని ప్రసక్తి కనిపిస్తుంది.

పాలచాడె : వి. పాలకుండ.
"చెక్కులు నొక్కితే నీసెలవులఁ బాలుచిందీ
చక్కని రేపల్లె పాలచాడే(?) దొంగవా" 12-447

పాలతో(డ)పోయు : ప.బం; స.క్రి. చిన్నతనంలోనే నేర్పు.
"ఎంతపని కెంత పని యిది యేఁటిదే
పంతమె సతుల కిది పాలతోడఁబోసిరో" 11-306
"చెల్లు లేవే యాతఁడు నీచేతఁ జిక్కనే
పల్లదమే తల్లి నీకుఁ బాలతోనె పోసెనే" 11-522

పాలదుత్త : వి. చిన్న పాలబుంగ, పాలకుండ.
"ఆలదొడ్డివారము నే మంతేసి యెఱఁగము
పాలదుత్త దుత్తేఁడేసి పట్టవయ్య వలపు" 7-180

పాలపండ్లు : వి; బహు. పాలు తాగే పిల్లలకు వచ్చే దంతాలు, ఒకరకం తెల్లని పండ్లు.
"జాతితోఁబాలపండ్లు సంగడి నే వుండఁగాను
ఘాతఁబెరిగే బూరుగుకాయలు చూపట్టును"
13-483

పాలపొంగలి : వి. పాయసం, పరమాన్నం.
"పొలపసిగ్గుల పాలపొంగలిగాఁబెట్టి
వెలయఁ గాఁగిలి నీకు విడిది సేసె" 22-320

పాలమీఁది మీఁగడ : వి. సర్వత్రా వ్యాపించి ఉండేది.
"కైవశము నేను శ్రీ వేంకటేశ్వరుఁడు తాను
భావించ నీవే మేలు పాలమీఁది మీఁగడ"
25-332

పాలమీఁది మీఁగడ పాయము : ప.బం; వి. నవయౌవనం.
"పాలమీఁది మీఁగడ పాయములోని మదము
జాలువారీఁ జెమటలై చన్నులఁగదే" 25-332

పాలలెక్కు : అ.క్రి. వరి మొ॥ పాలు పోసుకొను. (వ్యా.)
"యింటిలోనే శ్రీవేంకటేశుఁడుఁ గూడితి నేను
పంటలై పులకపైరు పాలెలెక్కెని" 7-44

పాలలో(న)పులుసు : ప.బం; వి. అనుచితమైంది. ఒకదానిలో దానికి సాటిగాని వస్తు వుండడం అనుచితమనే భావాన్ని తెలియజేసే నానుడి.
"మూల నాకచేత నాకు మొక్కించఁ బిలిచీని
పాలలోనఁబులుసేల పదవమ్మా" 7-309

పాలలోని పాపఁడు : ప్రహేళిక, వెన్న అని అర్థం.
"పాలలోని పాపఁడన్న ప్రాణమైనవాడు" 5-216

పాలలో పులుసేల : నానుడి. ఒకదానిలో దానికి సాటిగాని వస్తు వుండడం అనుచితమనే భావాన్ని తెలియజేసే నానుడి.

"మూల నాకె చేత నాకు మొక్కించఁ బిలిచీని
పాలలోనఁ బులు సేల" 7-309

**పాలవంటి కులము :** వ.బం; వి. నిష్కళంకమైన కులము.

"పాలవంటికులము మా భావము నిచ్చలము
నాలి మమ్ముఁ జూచి యేల నవ్వీని తాను"
9-114

**పాలవంటి వయసు :** వి. నిర్మలమైన వయస్సు.

"పాలించి శ్రీవేంకటేశ పకపక నవ్వేవు
పాలవంటివయసు నీ పాలికిట్టె దక్కెనా" 20-54

**పాలవారి యింట పిన్నవాఁడు :** వి. గొల్లవారి యింటి పిన్నవాడు, బాలకృష్ణుడు.

"పాలవారి యింటి పిన్నవాఁడై తిరిగినాఁడు
గాలి దాగువానిమీఁదఁ గాలు సాఁచినాఁడు"
6-156

**పాలవారు :** (2) వి; బహు. గొల్లవారు.

"పాలమీఁదఁ బవ్వళించి పాలవారి యింటఁబుట్టి
పాలు దొంగిలించినట్టి బాలుఁడీతఁడు" 7-87

**పాలవుట్టి :** వి; బహు. పాలు నింపిన ఉట్టికుండలు.

"వుల్లసాన నీవు పాలవుట్టెక్కుదువు గాక
పిల్లఁగోవిరాగాలఁ బిలువనేలా" 11-268

**పాలవెల్లికూఁతురు :** వి. లక్ష్మీదేవి, పాలసముద్రపు కూతురు.

"పాలవెల్లికూఁతురుకు పసపులు నలఁచరే
చాలించరే జోలి వీడు చదివేవేళ" 20-182

**పాలసుఁడు :** వి. 1. మూర్ఖుఁడు 2. దుర్జనుడు.

"తాలిమితో నాతో నిన్ను ధ్యానము సేసేవంటే
పాలసుఁడ నేను నీపాటి వాఁడనా" 2-336

**పాలార్చు :** స.క్రి. పాలు + ఆఱుచు = పాలార్చు, నశింప జేయు అను అర్థము స్పష్టమే. కానీ ఆ అర్థమిచ్చట సరిపడదు. పాలు + ఆడించు = పాలార్చు. తన పాలిదిగా చేయు అను అర్థము సరిపడును. దీనికి 475, 498 కూడ చూమనది" అని (13 సం. సం.ప.స. 5 పు.) లో వివరింపబడింది. వేటూరి ఆనందమూర్తిగారు దీనికి చన్నిచ్చు, ఉగ్గుపెట్టు, హితమైన ఆహారమిచ్చి పరిరక్షించు అనే అర్థాన్ని సూచించినారు.

"పంతగాఁడ వీక మమ్ముఁ బాయకువయ్యా
బంతిఁబెట్టుకొని మమ్ముఁ బాలార్చవయ్యా"
13-112

"అగపడి శ్రీవేంకటాధిప! నన్నేలితివి
బగివాయ నెట్ట వద్దు పాలార్చఁగాను" 13-475

"ఇట్టే శ్రీ వేంకటేశ యెనసితి విట్టు నన్ను
పట్టముగట్టి నన్నెంత పాలార్చినా మంచిదే"
13-498

బడలికచెందు, అలసిపోవు :

"వాలాయించి రాతి గుండెవాఁడ వౌత
యెఱుగుదు
పాలుమాలిన నా యాస పాయనీదు గాని"
11-45

కాని పద.లో 'పాలార్చు' పదానికి పోషించు అనీ, బ్రౌన్ లో ఉపేక్షించు అనీ, సూ.ని. లో బాధించు, క్రీడింపజేయు, చంపు, ఉపేక్షించు, ఎక్కువగా విమర్శించు అనే అర్థాలూ, తె.వ్యు.కో. లో సూ.ని. అర్థాలతోపాటు పోషించు అనే అర్థాలు చూపబడ్డాయి. పైన చూపిన అన్నమయ్య కీర్తనల్లో సం.ప.స. లో సూచించిన అర్థం సరిపోయినా ఈ కింది అన్నమయ్య కీర్తనల్లో ఆ అర్థం సరిపడదు.

"పాలార్చి తొట్టెలలోఁ బండఁబెట్టు యశోద
నీలవర్ణుఁ దొంగి చూచె నిద్దురో యని" 4-258

ఇక్కడ చన్నిచ్చు, ఉగ్గుపెట్టు అనే అర్థాలే సరిపోతాయి.

**పాలికిచ్చిన రాసి :** వి. కౌలు కిచ్చిన పొలంలోని పంట, తప్పక వచ్చేది అనడం.

"పండిన కర్మఫలము పాలి కిచ్చిన రాసి" 3-281

**పాలుకొను :** (3) అ.క్రి. పంచుకొను అనే నిఘంటువర్థం సరిపోవడం లేదు. దీనికి అతిశయించు అనే అర్థం బాగుంటుందేమో ?

"నీ వాసలు వెట్టితేను నిలువు నూరు వండీని
భావించ నీ సింగారాలు పాలుకొనీని" 13-392

"పైడి మోలము కటారు పరుజులవాఁడు" 7-116

**మోవనాడు :** ప.బం. మనసుకు తగులునట్లుగా మాట్లాడు, తాకనాడు. 6-37 & 12-241

**మోవిగిరుపు :** వి. పెదవివిరుచుట.

"నీ విన్నిటా నేర్పరివి నే నంతేసి నేరను
మోవి గిరిపే నింతే ముంచి యేమి సేసేరా" 11-1

**మోవితే(వియ)నె :** (40) వి. అధరామృతం.

"నీ రూపుపటాన వ్రాసు విన్వెరగుతో నిలుచు
సారె నీ మోవితేనెకు నోరూరును" 29-469

**మోవిదిష్టము :** వి. (?)

"మాపుదాఁకా వట్టిమాట లేమిటికి నీఁక
తీపులకు గుతి మోవిదిష్ఠంబులే" 7-35

**మోవిపంటి బోనము :** ఒకజాతిపండు భోజనము.

"వేవేలుగ నీకు దానే విందులు వెట్టీనంటా
మోవిపంటీ బోనాలు మోచుకున్నది" 29-534

**మోవిపండు :** (17) వి. పండువంటిపెదవి. (?)

"చేవదేరి మోవిపండు చిప్పిలి తేనె గారఁగా
పూవుల నేల వేసేనే పొద్దువోని వాఁడు" 29-96

ఒకజాతి పండు :

"మంచి మాటలాడఁగాను మధురాలు సోఁకి సోఁకి
ముంచి నీ పెదవి నంటె మోవిపండు" 12-175

"మోవిపండు నీకు మోవి నిచ్చినదఁట (?)
మోవికింద నీవు మలయఁగాను" 5-102

**మోస :** (10) వి. ప్రమాదం, వంచన, దొంగతనం, అడ్డు, అసత్యం, ఆపద.

"రాసికెక్క నీ వలపు రతులను మెప్పించి
మోస లేక వేఁడుకొని మొక్కు మొక్కవమ్మా" 29-297

"పాసి వుండి నినుఁ బలికిన పలుకులు
మోసదీర నిదె మొక్కేనయ్యా" 16-132

**మోసపెట్టు :** స.క్రి. మోసంచేయు.

"ఆసపెట్టు మోసపెట్టు నంతలోనే వాసిపెట్టు
గాసిల నీ సిరులకు గలదిది" 4-223

**మోసు :** వి. అందం. (మొలక)

"మొలక చన్నుల మొనలమోసుల నూఁది
మనసు
చెలఁగించినఁగాక చెప్పినట్టు సేసునా" 23-172

**మోసువారు :** ప.బం. వర్ధిల్లు.

"తలవంచీ నేల తాను తగిలికూడు మనవే
మొలచి నాపై బత్తీ మోసువారెనా" 13-480

**మోహినీగజము :** వి. పెద్ద మోహకశక్తియా అని సంపా.

"జాలి మోహినీగజము సంసారమిది
లోలుఁడఁ గాకపోదు లోకము సహజము" 3-132

## య

**య(హొ)చ్ఛ యింద్రే యచ్ఛ సూర్యే :** (?)

"యచ్ఛ యింద్రేయని యచ్ఛ సూర్యేయని
అచ్ఛగ తుదకెక్కె(క్కు)నదే పొగడీ శ్రుతి" 2-485

**యద్దృష్టం తన్నష్టమ్ :** కనిపించేదెల్లా నశించేదే.

"ఎదుటఁగన యీ జగము యిది నీవన
వెఱతును
అది విపరీతజ్ఞానము యద్దృష్టం తన్నష్టము
గాన" 2-121

**యద్భావం తద్భవతి :** దేన్ని భావించుకుంటుందో అదిగా మారిపోతుంది.

"ఇదివో సుజ్ఞానము సూత్రే మణిగణా యివ
గాన
మది నితరమే లేదు మాయల యద్భావం
తద్భవతి" 2-121

## యా

**యాఁకరు :** అ.క్రి. 'ఏకరు'కు జానపదవ్యవహారం. మిక్కిలి అపేక్ష కలిగి ఉండు. రూపాం. యాకారు.

"ఎంత యాఁకరేవు నీవు ఇంతి చెలువము చూచి
వింతలుగా జోడుగూడ విచారించేవా" 22-257

**యాకట :** వి. 'ఏకట'కు వ్యావహారికరూపం. అపేక్ష, మిక్కిలి కోరిక.

"పాలుకొనెఁ బులకలు పమ్మె సిగ్గు మొలకలు
గోలదానవా యేమి గుట్టు దాఁచేవే" 28-585

పాలుగారు: ప.బం; అ.క్రి. మృదువగు.
"పంతపురతులనే పాలుగారీ వలపు
బంతిమోవులనె కడుఁబచ్చిదేరీ వలపు" 7-421

పాలు దాగినమీద పై కుడుపులా?: నానుడి; కడుపారా తిన్న తరువాత చిఱుతిండి యెందుకు? వ్యర్థమనుట.
"యీలాగుననె లోకమింతాఁగాతువు గాక
పాలుదాగినమీఁదఁ బైకుడుపులా" 1-280

పాలుదీయు: ప.బం; అ.క్రి. మృదువగు, దేహబలం తగ్గు. (సం.ప.స. 14 సం. 353 పు.)
"కన్నియ పూఁపవంటిది కాఁకలకు నోపదు
పన్ని చేతఁబట్టితేనే పాలుదీసును" 14-99

పాలుపడు: (2) ప.బం; అ.క్రి. పూనుకొను.
"మేలమ్మా నీ నేరుపు మెచ్చితి మిందరమును
పాలుపడి వూడిగాలు పయికొని సేసేవు" 16-14

పాలుపుఁగోపము: (?)
"పాలుపుఁగోపవు చూపు పగడాలు యివి
మేలు మేలు మీలో మేకే తెలియును" 7-296

పాలుపెట్టు: స.క్రి. విభాగించు, పాలుపుచ్చు.
"ఎట్టు సేసినాఁజేయి యే మనఁగల నిన్ను
పట్టిన వ్రతము నీకు పాలుపెట్టేఁ గాక" 27-28

పాలుమాలు: (2) అ.క్రి. 1. ఆశపడు, కక్కుర్తిపడు 2.బద్ధకించు 3. లొంగు 4. అలయు, శ్రమనొందు.
"తోలుబొక్కలోనఁ జొచ్చి తూలేటి యాఁకలిచేత
పాలుమాలి యిందరికి బంటుబంటనై" 1-215
"పాలుమాలే వేల గొల్లపడుచ, మా
పాలు నీకేలయ్యే పాలవారివాఁడవు" 5-197

పాలు వాలే నీరు నీరే: నానుడి; రెండిటికీ భేదం ఎక్కువ అనే అర్థంలో వాడబడే పలుకుబడి.
"ఏల మేకులు సేసేవు ఇందరిఁ జూపి మమ్మె
పాలు వాలే నీరు నీరే పలుకు లేమిటికి" 21-214

పాలువెట్టు: ప.బం; అ.క్రి. భాగించు, పంచు, ప్రత్యేకించు.
"తాలిమి నాపె నీచేతఁ దమ్ముల
మిప్పించుకోఁగా
పాలువెట్టు కందరును పంచవచ్చునా" 22-362

పాలువొంగినట్లు: క్రి.విణ. అకస్మాత్తుగా.
"నీలోని వారమే నే మెల్లాను
పాలువొంగినట్లనే బతుకవే యిఁకను" 21-378

పాళగాఁడు: వి. దొర, ప్రభువు, సేనాపతి. రూపాం. పాళెగాడు.
"అట్టి శ్రీ వేంకటనాథుఁడు మరుల నెల్లనుఁజే
పట్టి దైత్యులఁ జంపించే పాళగాఁడు" 10-22

పాళము: వి. 1. విధము, రీతి 2. సమయము 3. కొలఁది.
"వనిత నీ జవ్వనము వలపుల కొటారు
పసుపడ్డ తుమ్మెదపాళము కొప్పు" 28-266

పావా: వి. పాదరక్ష.
"దంతపుఁబావాలు మెట్టి పంతాన నేను రాఁగాను
యింతలో బలిమిఁబట్టేవు వేంకటేశ" 7-223

పావురముపెట్టె: వి. పావురాన్ని ఉంచే పెట్టె.
"శ్రీ వేంకటేశ్వరుఁడు చేరికూడి వుండఁగాను
పావురముపెట్టె మీఁద బత్తి సేసేవు" 7-443

పాశము: వి. పాయసము అనే శబ్దానికి వ్యావహారికరూపం. జానపదులు నేటికీ పాయసాన్ని పాశమనే వ్యవహరిస్తారు. రూపాం. పాసెము. దీనికి 'పాశాలు' అనే బహువచనరూప ప్రయోగం ఉంది.
"కూరలు పాశాలు దొంతిఁగూడఁ బెట్టితే
"యీవేళ మందాఁబాలు యింటాఁ బాశమాయ"
2-165
"వారము సేసేమనుచు పడి నింటివారమెల్లా
మతకరినవ్వులనె మంచిపాశాల విందులు"
9-199 & 1-22

పాసిక: వి. 'పాచిక'కు వ్యావహారికరూపం.
"వెలయఁ బాసిక చక్కవేయనేర దంటాను"
17-222

"అంతలోనే పగడసాలాడు మనేవాకెను
యింతి యలసెఁ బాసిక లెత్తియ్యరాదా" 7-151

**పాసికవిద్యలవారు:** వి; బహు. పాచికలాడేవాళ్లు, జూదగాండ్లు.
"పాసికవిద్యల వారి పక్షపాతివైన నీవు
బాసలెన్ని చేసినాను పాటిలేవు" 14-155

**పాసి కూడు:** అ.క్రి. దూరమై మళ్లీ కలియు.
"వేసాలెల్లఁ జేసేవు ఏంతవానివలెనే
పాసి కూడి వలపించ పంతమా నాకు" 24-269

**పాసు(ను):** (4) 'పాయును'అనే తద్ధర్మ క్రియారూపానికి జానపద వ్యావహారికరూపం. ఇట్లే చేసును మొ॥ ప్రయోగాలెన్నో ఉన్నాయి.
"చెప్పితే నెవ్వరికైనా సేసిన దోసము వాసు
చిప్పిల నీవిందుకుఁగా సిగ్గువడకు" 16-2

## పి

**పించెము:** (6) వి. 'పింఛము'నకు వికృతిరూపం. 1.నెమలిపురి 2. నెమలిపురికన్ను. రూపాం. పించియము
"మంచఁగుందానఁ గొలిచె మరఁది వీఁడె
పించెపుశిరసు పాగ పిన్ననాటి మరఁది" 5-260

**పించెము:** వి. 'పించము'నకు వ్యావహారికరూపం, మదం.
"పించెపుఁబయ్యెదలోని పెనుగుబ్బలు మూయుచు
చెంచెత యేల యేఁచేవే" 6-96

**పిండంతే నిప్పటి:** (2) ప.బం; వి. పిండికొద్దీ రొట్టె వంటిది, డబ్బెంత ఉంటే అంత బాగా ఖర్చు చేయడం, నీరుకొద్దీ తామర. వెన్నకొద్దీ నెయ్యి, తూరినంతే వాకిలి మొ॥ ఇలాంటివే. ('నిప్పటి' నిప్పట్టుకు రూపాం. ఆకులమీద కప్పి నిప్పులో వేసి కాల్చే ఒక భక్ష్యవిశేషం.)
"ఎంత మాత్రమున నెవ్వరు దలఁచిన
అంతమాత్రమే నీవు
అంతరాంతరము లెంచి చూడఁ
బండంతే నిప్పటి యన్నట్లు" 2-393

**పిండతుండాలు:** వి; బహు. ముక్కలుముక్కలు.
"యేతుల రావణాసురుఁ డిటువంటివాఁడే కాఁడా
కాతరాన నొంటిఁజిక్కి పిండతుండా లాయెను" 15-269

**పిండికూర:** వి. తెల్లని పూలతో ఉండే ఒకరకపు ఆకుకూర, పిండిబొద్దికూర.
"భోగించ కేల పోవుఁబుట్టిన జన్మఫలము
లోఁగుచుఁ బిండికూరలోన నలు పెంచనేల" 4-135

**పిండికూరలో నలుపులు ఏరు:** ప.బం; అ.క్రి. లేనిదానికై ప్రయత్నించు, పిండికూర (పిండిబొద్దికూర) తెల్లపూలతో ఉంటుంది. అందులో నలుపులు ఉండవు. వాటికోసం ప్రయత్నించడమన్నమాట.
"పిండికూరలో నలుపులు నేఁబెనఁగి యేరఁగ
నోప తన్ను
చండిసేయఁగరాదు యిఁక సరుగఁ
గూచుండుమనవే యమ్మా" 11-449

**పిండికూరలోన నలుపెంచు:** ప.బం; అ.క్రి; అనవసర ప్రయత్నం చేయు, పిండికూర తెల్లగా ఉంటుంది. వాటిలో నలుపును ఎంచడం అనవసరమే కదా! చూ: పిండికూరలో నలుపులు ఏరు.
"భోగించకేల పోవుఁ బుట్టిన జన్మఫలము
లోఁగుచుఁ బిండికూరలోన నలు పెంచనేల" 4-135

**పికిలి:** వి. పక్షివిశేషం.
"ముదిత యెలుఁగు వింటే మొక్కలాన వాలునమ్మా
బెదరని పెంపుడుఁబికిలివలె" 10-2-115

**పిచ్చుకపై బ్రహ్మాస్త్రము:** చిన్నపనికి పెద్ద ప్రయత్నం చేయడం. ముఖ్యంగా చిన్నవానిపై పెద్దకోపం తగ దనేచోట ఉపయోగించే పలుకుబడి.
"పరఁగిన పిచ్చుకపై బ్రహ్మాస్త్రము
దొరకొని పూరకె తొడిగినయట్లు" 3-574

**పిచ్చుగా:** క్రి.విశే. (?)
"ముచ్చటలాడి వచ్చితి మొదలి నందరితోడ
పిచ్చుగా ముద్రలువెట్టి బెదవి యేదయ్యా"
17-100

**పిట్టపిడుగగు:** (పిడుగు + పిడుగు)
కడుభారమగు, మిక్కుటమగు,
హఠాత్సంఘటనమని (పద.)
"పుట్టుభోగి సిగ్గుల చూపుల పూవుఁదీఁగెలపై
పిట్టపిడు గాయ నతిప్రేమము నేఁడు" 5-108

**పిడికిలించు:** (3) అ.క్రి. గుప్పిలిపట్టు స.క్రి.
పిడికిట పట్టు.
"పెక్కు పండ్లగోలలు పిడికిలించినవాఁడు
మిక్కిలి లంక సాధించి మించినవాఁడు" 3-519

**పిడిగుండు:** వి. గట్టిగుండు.
"వువిద చన్నుల నొత్తి పూరడించఁజూచితేను
యివె పిడిగుండ్లయితే నేమి సేసును" 8-293

**పిడితెడు:** (పిడత + ఎడు) చిన్న మంటికుండ
ప్రమాణం కల, 'పిడతెడు' కు వికృతిరూపం.
"నడివిడి (పీది) మాటలు నాయమా నీకు
పిడితెడు చల్లవోసేఁ బెనఁగకు వోయీ" 22-304

**పితరలు:** వి; బహు. 'పితరులు' కావచ్చు.
పితృదేవతలు.
"నీయందె పితరలు సిద్ధసాధ్యులు
నీయందె ద్వాదశాదిత్యులు" 3-222

**పితాళ్లు:** (3) వి; బహు. పితరులు అనడానికి
వ్యావహారిక రూపం. పితృదేవతలు, మృతి
చెందిన పితృవర్గంవారు.
"ఇచ్చ నెవ్వరిఁ దలఁచి యిత్తురు పితాళ్లకు
ముచ్చట నెవ్వని నామములనే సంకల్పము"
3-358

**పితురార్జితము:** (2) వి. తండ్రిచే
సంపాదింపబడింది. ఈ అర్థంలో పిత్రార్జితం
(పితృ + ఆర్జితమ్) అనేది సాధు రూపం.
పితురార్జితం అనేది విలక్షణరూపం. లేదా పితుః
(తండ్రినుండి) ఆర్జితమ్ (ఆర్జింపబడింది)
పితురార్జితమ్ అని పంచమ్యలుక్ సమాసమైనా
చెప్పుకోవచ్చు.
"నమ్మిన దిదివో నా పితురార్జిత
మిమ్మహిఁ జూడరో యిది మీది గాదు" 4-385

**పిన్నవయసుఁదనము:** (పిన్న + వయసు +
తనము) వి. పిన్నవయస్సు, బాల్యం, ఇట
పిన్నవయస్సు అనే శబ్దంపై స్వార్థంలో 'తన'
ప్రత్యయం.
"మన్నించి గూడఁగరాదా మగఁడవు
పిన్నవయసుఁదనము పెట్టెఁబెట్టేవా" 19-72

**పిప్పిగట్టు:** (3) అ.క్రి. తడిఆరు, నీరసమగు,
ఎండిపోవు.
"దప్పిదేరుచును తన పెదవుల
పిప్పిగట్ట నిన్నుఁ బలిచీని" 23-480

**పిప్పిగా:** క్రి.విశే. గట్టిగా.
"పిప్పిగా మోవి యానఁ బెనగేది బుద్ధిగాదు
కుప్పలుదెప్పలుగాఁ గూడవలెఁ గాని" 18-6

**పిప్పి చవి యడుగు:** ప.బం; అ.క్రి.
వ్యర్థప్రయత్నం చేయు.

**పిరరేచు:** స.క్రి. 'పెరరేచు'కు
వ్యావహారికరూపమా? 'పెరరేచు' రూపమేనా?
ప్రేరేచు, ప్రేరేపించు.
"పిరరేచి యాతనినేఁ బిలిపించవచ్చునా" 12-35

**పిరితియ్యు:** (పిఱుదు + తీయు) అ.క్రి.
'పిఱుదీయు'కు వ్యావహారికరూపం.
వెనుదీయు, పరాఙ్ముఖమగు.
"బిగువుఁ జన్నుల నొత్తి పిరితియ్యదు పంతము
మొగి నీ వలనేవంటా మెరగఁగేఁగాని" 27-530
"చలువ నీ మోవితేనెగవి దొరకెఁగనక
పెలుచుఁదమకములఁ బిరితియ్యనైతి" 18-336

**పిరితీయు:** (పిరి + తీయు) అ.క్రి. వెనుదీయు.
"బిగ్గెఁగాఁగలించుకోవే పిరితీయక
నిగ్గుల యాతని మేను నేఁడే నొచ్చీనా" 5-264

**పిరిదూరు:** అ.క్రి. వెనుకదూరు.
"సారె సారెఁ బిరిదూరి సాకిరులు చెప్పఁగాను

తీరిచేటి చెలులెల్లా దీవించకుందురా" 10-2-50

పిరివీకు: వి. బాధ, పెనగులాట.

"చనవు లేని చోటి జగడాలు
పెనఁగఁబోతే వట్టి పిరివీకులు" 16-265 old

"పెనఁగి పంచేంద్రియాల పిరువీకుల
య్యీనాఁడు
అనుభవింపఁగఁజేసి అందుకు లోనైతివి" 15-29

పిరువీకుసేయు: (పిరువీకు = బాధ) 1. బాధించు, పీడించు. 2. పెనగులాడు, పట్టీలాగు 3. వెనుకంజవేయు.

"పేరడి నింతేసి పిరువీకు సేయనేఁటికి" 14-487

పిఱుఁదుకొను: స.క్రి. వెంబడించు, అనుసరించు.

"వంతుల నూరేండ్లుండే వట్టి యాసలకు నే
పంతపు బ్రంహ్మాండము పిఱుఁదుకొనేది"
15-226

పిలిచి పీటవెట్టు: ప.బం; అ.క్రి. మిక్కిలి గౌరవించు.

"పిలిచి పీటవెట్టి ప్రియములెల్లా చెప్పి
వలచి వలపించేటి వనితను నేను" 16-574

పిలిచి బిడ్డనిచ్చు: ప.బం; అ.క్రి. అడుగకుండానే మేలు చేయు.

"వలరాయని గరిడి వంటిదివో వలపు
పిలిచి బిడ్డనిచ్చిన ప్రియమిది వలపు" 7-212

పిలుచు: వి. పిలవడం, పిలుపు.

"పలుకుల చిలుకల పాటకోవిలలు
పిలుచులుగా చెలి పెంచెనదే" 8-7

పిలువకతొల్లి: పిలువకముందు.

"పిలువకతొల్లె వచ్చి పీటమీఁదఁగూచుండేవు
బలిమి తమకములు పచ్చిదేరె నీకు" 26-475

పిలువనంపు: (3) ప.బం; స.క్రి. రప్పించు.

"పడఁతిఁ బిలువనంపి పగడసాలాడేవు
వుడుగ కీ పరాకుల కోపునా ఆపె" 7-251

పిలువని పేరటము: (10) వి; ప.బం. అనవసరమగు జోక్యం.

"చలపట్టి యెన్నేసి సరసము లాడినాను
పిలువని పేరటము ప్రియమయ్యీనా" 25-19

"పిలువని పేరటాలు పెనగొన్న మోహాలు
నలువంక నేనే నీపై వడపేఁగాని" 16-283

పిల్లఁగోవి: (8) వి. పిల్లనగ్రోవి, మురళి.

"బింకపుమోఁతల పిల్లఁగోవివాఁడు
సింకసూపులవాఁడు సిన్నెకా" 5-182

పిల్లఁగోవివాఁడు: వి. శ్రీకృష్ణుడు, మురళిగలవాడు.

"బింకపుమోఁతల పిల్లఁగోవివాఁడు" 5-182

పిల్లఁగ్రోవి: వి. పిల్లనగ్రోవి, మురళి.

"పిల్లఁగ్రోవి పట్టుమంటాఁ బెరరేఁచీని మా
గొల్లవారి పిల్లఁగ్రోవి కోరో చల్లా" 6-109

పిల్లంగోవి: వి. పిల్లనగ్రోవి.

"పూచిన మానికింద పోఁటివెట్టుక తా నుండీ
యేచి పిల్లంగోవి యూదీ యేటికే వీఁడు"
11-179

పిల్లగోట్లు: వి. 'పిల్లగోట్లు'కు రూపాం. కఱ్ఱలతో బాలురు ఆడుకునే ఒకరకపు ఆట, బిల్లగోట్లు, దూరగోల.

"పట్టపగలే కొందరు పడుచులఁ గూడుకొని
అట్టుగపైఁ బిల్లగోట్లాడుచున్నాఁడు" 14-456

పిల్లగోవి: వి. పిల్లనగ్రోవి, మురళి.

"కొమ్మమోవి నీకుఁ బిల్లగోవి గాఁగ నిడుకొని
కుమ్మరించుఁగుత్తుకలోఁ గులుకుచును" 5-116

పిల్లదీపులు: వి; ప.బం; బహు. బాలక్రీడావిశేషం.

"పిన్నవై గోపాలులతోఁ బిల్లదీపు లాడితివి
యెన్నిక మాడుపూరిలో యిట్లాడేవా" 3-179

పిల్లదొరులు: వి. పిల్లన గ్రోవులు. రూపాం. పిల్లదురులు.

"గొల్లెతల మానముల కొల్లకాఁడు
పిల్లదొరు లూఁదేటి పిన్నవాఁడు" 23-92

'పిల్లదురులమోఁత' అని క్రీడాభిరామం. 64 పు.

పిస: వి. కామం.

"పిస లేనివారిఁ బేరఁ బిలువఁబోవుటకంటె
కొసరి కొండసిలకు కుయ్యుటే మేలు" 16-237

**పిసిపిసి:** (2) ప.బం; విశ. మెల్లమెల్లని.
"ముసిముసి నవ్వులతో ముందర నిలచి చెలులఁ
బిసిబిసియెలుఁగులఁబిలిచేవు" 18-202

## పీ

**పీటవెట్టుకొను:** ప.బం; అ.క్రి. స్థావరం కల్పించుకొను.
"గెంటు లేని వెంకటగిరిమీఁదను వాఁడె
పీట వెట్టుకొన్నవాఁడు పెండ్లికొడుకు" 5-186

**పీరుచు:** స.క్రి; మాం. పీల్చు.
"లయించక భోగము జలగవలెఁ బీరుచగా
నియమించి మట్టువెట్ట నేఁడు నాకు వసమా"
3-208
"పిచ్చిలఁబూతకి చన్ను బీరిచినాఁడు" 3-235
ఈ పదం జానపదగేయాల్లో కూడా కనిపిస్తుంది.
"పాలు నల్ల పీర్చి పాణము
పోపడ గూల్చి పట్టి పడదన్నినాడు"
(రా.మాం. 84 పు.)

**పీర్చు:** స.క్రి. పీల్చు. చూ: పీరుచు.
"పాలియఁబీర్చితి వొకతిఁ బురిటిమంచముకాడ"
1-294

**పీలిచుంగు:** వి. నెమలిచుంగు.
"పచ్చని చీర గట్టిన బలుదొర నంటానే
కుచ్చుల పీలిచుంగుల కొంగువట్టేవు" 8-194

**పీలిపించము:** వి. నెమలిపింఛము.
"పమ్మిన పీలిపించపు పాగ చూచి నీ వనుచు
దిమ్మ విడిచి వొయ్యవె తెప్పిరిలె నిపుడు"
10-2-105

## పు

**పుంగుడగు:** అ.క్రి. వంచితుడగు, దిగజారిపోవు.
'బ్రుంగుడు' వ్యావహారికంలో పుంగుడు కావచ్చు.
"మృదువైన తరుణుల మెఱఁగు బాహులతల
పొదలెల్ల దూరితూరి పుంగుడగయ్యేరయ్యా"
1-234
"పూపసంసారము నమ్మి పుంగుడై యిన్నాళ్లదాకా
దాపులేక బ్రతికితి దానికేమి" 3-331
"అలరి బంగారుగంటే సందరి మనసులూను
పోలిమి నా పసఁజిక్కి పుంగుడు గాకుండునా"
4-166
"పొదిగొన్న యాసలోఁ బుంగుడై సతతంబు
సదమదంబై పడయు చవులు దనకేలా" 1-302

**పుంటినొవ్వు:** వి. గాయంవల్ల కలిగిన బాధ.
"అంటుకొని మరుఁడొంటి అతివ నేఁపుటకంటె
పుంటినొవ్వుల విరుల పోట్లె మేలు" 5-42

**పుంటినోవి:** వి. గాయం వలన కలిగే నొప్పి.
"మాననీడు పుంటినోవి మరఁది వీడే
మానముపైఁ జేయి చాచీ మందవారి మరఁది"
1-435

**పుండ్లుబూచులు:** వి. పుండ్లు అనే అర్థంలో జంటపదం; లేక పుండ్లు అంటే దైహిక రోగాలు, బూచులు (= దయ్యాలు) అంటే మానసిక రోగాలు అని కూడా చెప్పవచ్చునేమో!
"పురుషోత్తమా! యంటేఁ బుండ్లు బూచులు మాను
పరమౌషధ మీతఁడే పాటింప మాకు" 1-461

**పుక్కట:** (8) వి. పుక్కట, పక్కటె, పుకసాటి అని కన్నడరూపములు. తేరగా, వ్యర్థముగా అని అర్థము. దీని రూపాంతరములు పుగసాటి, పూసాటి మొదలగునవి అనేకములు కలవు. పుక్కిటిపురాణము లోని తొలిపద మిదియే కావచ్చును. అసందర్భమైన ప్రసంగమని అర్థము అని సం.ప.స. (13 సం.) లో పేర్కొనబడింది. వేటూరి ఆనందమూర్తిగారు ఊరకనే, సునాయాసంగా అనే అర్థాలు సూచించినారు.
"పుక్కట దొరకె పొట్టబొరుగుననూ
కౌగిలి పుక్కట దొరకె" 6-96

**పుక్కటకాఁడు:** (పుక్కట + కాఁడు) వి.
1. సంబంధం లేనివాడు 2. వ్యర్థుడు
3. అన్యుడు, తేరకాఁడు రూపాం.
పుక్కటికాఁడు.
"పోసఁగఁగ నిది గని యధికుఁడు పుక్కటకాండ్ల నందరిఁ
బసమారిచి మొదలికర్తఁ బాలించిన గతిని"
1-72

**పుక్కటికత్తె:** వి. అన్యురాలు, తేరకత్తె (?)
"చెక్కు నొక్కవలెఁగాక శ్రీవేంకటపతితోడ
పుక్కటికత్తవై యేల పొంచుకుండేవే" 27-233

**పుక్కటికాఁడు:** వి. చూ: పుక్కటకాఁడు.
"తక్కక పెద్దలు గాఁగ తల వణఁకుటే కాని
పుక్కటికాండ్లు హరిఁ బూజించనేరరు" 3-262

**పుక్కిటఁబెట్టు:** ప.బం; స.క్రి. ఆపోశనపట్టు, సర్వమూ ఆకళించుకొను.
"చుక్కలు మోవఁబెరిగి సూర్యువద్ద వేదాలు
పుక్కిటఁబెట్టఁ గలశాపురహనుమంతుఁడు"
4-167

**పుక్కిటఁబోసిన బుద్ధులు:** ప.బం; బహు. సర్వమూ ఆకళించుకొన్న బుద్ధులు.
"పుక్కిటఁబోసినయట్టి బుద్ధులు నీ కవి సుమ్మీ"
20-535

**పుక్కిటికొలఁది పొగడు:** ప.బం; స.క్రి. నోరార పొగడు.
"యెక్కువ తక్కువ మాటలేమీ ననరాదు నిన్ను
పుక్కిటికొలఁది నిన్నుఁ బొగడేమయ్యా"
13-109

**పుక్కిటి పురాణమగు:** అ.క్రి.
లోకాభిరామాయణమగు, వృథాకాలక్షేపమగు.
"యెక్కడి కెక్కడ సూత్రమెంత నేరిచె మరుఁడు
పుక్కిటిపురాణ మాయ పొందుల మీ చేఁతలు"
20-507

**పుక్కిటిబంటిగ:** (పుక్కిలి + బంటిగ) క్రి.విణ. పుక్కిలి నిండుగా, నోరారా.
"సందడి వింజామర సారెసారె వేయఁగాను
పొంది నిట్టూర్పులు రేఁగీ పుక్కిటిబంటిగాను"
18-497

**పుక్కిలి:** వి. బుగ్గలోపలి భాగం.
"పుక్కిట సన్నలు సేసి బొమ్మలను జంకించి
చక్కని యీతని నెంత సాదించేవే" 26-386

**పుక్కిలిబంటి:** (పుక్కిలి + బంటి) పుక్కిలి నిండుగా.
"పుక్కిలిబంటియ నీతో పొందుల మాటలు నాకు
పిక్కటిల్లె వలపులు పెక్కులేల చాలురా" 12-8

**పుచ్చుఁబుచ్చ పున్నమగు:** అ.క్రి. (?)
"పుచ్చుఁబుచ్చ పున్నమాయ పూఁచిన నీ సరసాలు
వచ్చీరాని పాటలాయ వట్టి ప్రియాలు" 19-445

**పుచ్చకాయలోర్చు:** అ.క్రి. శ్రమను సహించు.
"పొంచి యేమి సేసినాను
పుచ్చకాయలోర్చుఁగాక
యెంచి వేలఁ జూపితేను యితరము లోర్చునా"
8-131

**పుచ్చినపోక:** ప.బం; వి. వ్యర్థం.

**పుటగా:** క్రి.విణ. అధికంగా.
"పుటగా నీరాలు దొబ్బుచు పెనుమడుగెల్లా
అటునిటు బూడిసి యాతఁడు" 24-150

**పుటజయము:** వి. దశమహావిద్యల్లో ఒకటైన తారవిద్యకు సంబంధించిన సాంకేతికపదం. పుణ్యపాపాల్లో కుటిలము లైన కోరికలను తుంచివేయడం.
"పుటజయమాయ నిట్టె పుణ్యపాపములందులో
కుటిలపుఁగోరికల కొనలు దుంచుట" 1-452

**పుటమెక్కు:** ప.బం; అ.క్రి. 1. వేడెక్కు 2. మెరుగెక్కు.
"పొలఁతుల కాఁకలే పుటమెక్కె మనసు" 4-335

**పుటమెగయు:** అ.క్రి. వన్నెయెక్కు, పైకెగురు, లంఘించు అని ఆం.ప.ని.
"వడిగొని మనసిజవాయువు విసరఁగ

పొడవగు నెఱుకలు పుటమెగొసి" 3-19

పుటుగు: వి. పుట్టుగు, పుట్టువు, జన్మ.

"భూమిరమణా యని పుటుగులు గెలిచితి

వేమరు నితరులకు వెరవ నే నింకను" 15-169

పుట్టచెండులు: ప.బం; వి. ఒక ఆట. చూ: పుట్టచెండ్లు.

పుట్టచెండ్లు: (5) వి. బాలక్రీడావిశేషం, బంతియాట, గుడ్డతో చేసిన చెండ్లు (బంతులు), బాల్యంలో ఇలాంటి పుట్ట చెండ్లతో ఆడుకోవడం ప్రాచీనకాలంలో పరిపాటి. ఈనాడు మామూలు బంతిని కూడా పుట్టచెండు అనడం పరిపాటి.

"బొమ్మలచెండ్ల చేత పూచి చూపుల యమ్ముల

కుమ్మరించి వెలి నీపై గురులేసీ

సమ్మతించి యిరువంక చన్నులకాంతులు పారె

జిమ్ము పయ్యదలోఁ బుట్టచెండ్లాడీని" 8-149

పుట్టించిన హరి పూరి మేపునా?: సామెత; మనకు జన్మ నిచ్చిన భగవంతుడే మన పోషణను చూస్తాడని అర్థం. 1-495

పుట్టుకాశ: వి. పుట్టుకతో వచ్చిన కాసె. (కాసె = కుచ్చెళ్లు ఎక్కువగా వచ్చేట్లు గోచి బిగించి కట్టే కట్టు)

"నించినాఁడు రౌద్రము నిడుపాటి దవడల

కాంచనపు పుట్టుకాశ కడు బిగియించెను" 3-301

పుట్టుపగ: వి. జన్మవైరం.

"పొట్టిపొట్టి యడుగుల బోయనాయఁడు

యెందుఁ

బుట్టుపగ సాధించే బోయనాయఁడు" 1-460

పుట్టుపగ సాధించే బోయనాయఁడు: వి. పరశురాముఁడు.

"పొట్టిపొట్టి యడుగుల బోయనాయఁడు

యెందుఁ

బుట్టుపగ సాధించే బోయనాయఁడు" 1-460

పుట్టుపూర్వాలు: వి; బహు. పుట్టుపూర్వోత్తరాలు, అన్నివివరాలు.

"కల దీ యింటికి గర్వాలు యెత్తి

పొలసీ నీ పుట్టుపూర్వాలు" 25-265

పుట్టుమాలిన బరుబోఁకి: పుట్టుకతో వ్యర్థమైన పనికిమాలిన వాడు.

"పుట్టుమాలిన బరుబోఁకివి నన్ను

దిట్టేవదే మోసి దిమ్మరిమాయ" 1-107

పుడమిధరుడు: వి. పర్వతుడు, ఆదిశేషుడు, భూమిని ధరించేవాడు.

"వెడమంత్ర మిఁక నేల వేరు వెల్లంకులు నేల

పుడమిధరుఁడు మాకు భువనౌషధము" 1-461

పుణుఁగుకాపు: వి. పునుగు అంటే పునుగుపిల్లి నుండి వచ్చే ఒకరకపు సుగంధద్రవ్యం. దానితో భగవంతుణ్ణి పూయడం.

"నేడె సుక్కురారము నెలఁతలాల

పోడిమిసేవ సేయరే పుణుఁగుకాపు" 8-153

పుణుగు పువ్వు గట్టినట్లు: ప.బం; అ.క్రి. పునుఁగు రాచి పువ్వ గట్టినట్లు, పునుగు తీసినదారంతో పువ్వులు మాల కట్టుట మైసూరులో నుండినదట. (సం.ప.స. 14 సం. 353 పు.)

"బాపు బాపు నీ మేలు పక్కన నన్నంటుకొనె

కైపగు పుణుఁగు పువ్వుగట్టినట్టే ఆయను"

14-418

పుణ్యపువాఁడు: వి. పుణ్యం చేసినవాడు, పుణ్యాత్ముఁడు.

-కౌరవులఁ బాండవులఁ గడుఁ జుట్టాలనెల్ల

పోరువెట్టి యంపినట్టి పుణ్యపువాఁడే" 9-134

పుణ్యము కట్టుకొను: (3) ప.బం; అ.క్రి. ఏదైనా మేలు చేసి ఆ పుణ్యాన్ని పొందుమని చెప్పేప్పుడు వాడబడే పదబంధం. (పద.)

"నేమాన నే పుణ్యమైన నీవే కట్టుకొందుగాక

యేమనిన నీ మాట కెదురాడేమా" 11-398

పుణ్యావాజన: వి. 'పుణ్యాహవాచనం' అనే శబ్దానికి వ్యావహారికరూపం. దైవాదికర్మ ప్రారంభంలో మంగళం కోసం పుణ్యాహమనే శబ్దాన్ని మూడుమార్లు చెప్పే శుభకర్మ. (శ.ర.)

"పురుఁడు వెళ్లెను మరి పుణ్యావాజన సేసిరి

మురిపేన గొల్లెతలు ముద్దాడిరి" 3-509

**పుణ్యేఁడు:** వి. బహు. పుణ్యవంతుడు. ఈ అర్థంలో ఇది విలక్షణ ప్రయోగం. పుణ్య శబ్దం నపుంసక లింగ శబ్దం, పుణ్యమని భావార్థం. కాని ఇట పుణ్యం కలవారని ధర్మివాచకంగా ప్రయోగం. పుణ్యపువాఁడని కూడా ప్రయోగం ఉంది. 9-134

"వేమరువో పుణ్యేలాల వినరో యీ కతలు"

**పునుకతల:** వి; మాం. తలపుఱ్ఱె.

"పరఁగ పునుకతల పావనము సేసే మంటూ
నిరతితోడ దినము నీట ముంచేము" 3-174

**పునుకవీఁపు పెద్దభూతము:** వి. చిప్పవీపుగా గల భూతం. క్షీరసాగర మథన సమయంలో మందరపర్వతాన్ని ధరించడానికై కూర్మావతారాన్ని ధరించిన భగవంతుడని భావం.

"కినిసి వోడ మింగెడి భూతము
పునుకవీఁపు పెద్ద భూతము" 1-109

**పునుకవీఁపు భూతము:** వి. కూర్మము; క్షీరసాగరమథన సమయంలో మందర పర్వతాన్ని ధరించడానికి భగవంతుడు కూర్మావతారం తాల్చినాడు.

"కినిసి వోడ మింగెడి భూతము
పునుకవీఁపు పెద్ద భూతము" 1-109

**పున్నమమాసలు:** వి; బహు. మంచి చెడులు.

"పున్నమమాసలు పుడమిలో
బదుకులు పోయివచ్చేవి వో మనసా" 1-188

**పుప్పించుకొను:** స.క్రి. పుప్పిబట్టు.

"పుడిసెఁడౌను సిగ్గులు పుప్పించుకొనే వేళను
పిడికెడేసి కలవు పెట్టేసేసవేళను" 27-329

**పుయ్యుట:** వి. 'పూయుట'కు వ్యావహారికరూపం.

**పురపురమను:** ప.బం; అ.క్రి. నొప్పిపొందు, బాధనొందు, దుఃఖించు.

"పుక్కిట నీ ముచ్చటలు పురపురమనఁగాన
మొక్కలపుగుట్టుతోడ మోనమేల చూపేవు" 28-548

**పు(ర)ఱవేదనలు:** వి. బహు. సం.ప.స. (14 సం. 353 పు.) లో ఈపదం ఈ విధంగా వివరింపబడింది. పురువేదనలా? 'పురు భూయిష్ఠమ్' అని అమరము. ఇక్కడ తొందర, ఆత్రము అని చెప్పవచ్చును. బండి 'ఱ' ఈ వ్యుత్పత్తికి కొంత బాధకము. మిక్కిలి వేదనలు అని అర్థం చెప్పవచ్చును.

"జఱసి నీతో నేను సరివొట్టు పెట్టుకొని
పుఱవేదనలతోఁడఁ బొగులఁగాను" 14-337

"బరువైన మదన తాపంబునకు వెరవకిటు
పురవేదనలను నేఁ బొరలఁగాను" 2-258

ఇట 'ర' ప్రాసస్థానంలో ప్రయోగింపబడింది.

**పురాణపత్రికలు:** వి; బహు. పురాణాలకు చెందిన పత్రాలు.

"పారి నీ సుద్దులవే పురాణపత్రికలై
పెరుగుచు వ్యాసుల పెట్టెలలో నున్నవి" 15-416

**పురుఁడు:** వి. స్పర్ధ, పోటీ.

"పుక్కటసతులు నాతో పురుఁడుకు రాఁగాను
దక్కనా నీ పంత మది తగఁజూచేవు" 11-409

**పురుండ్లు:** వి; బహు. పురుడుకు బహువచనరూపం, పోటీలు, స్పర్ధలు, సాటులు. (సాటి ఏ.వ.)

"పురుండ్లకుఁ జేరేవు పొత్తుల మాటలాడేవు
సరుసఁ గూచుండఁగ నా సరిదానవా" 18-64

**పురుటిల్లు:** (పురుడు+ఇల్లు) వి. ప్రసవగృహం.

"పొసఁగఁబొత్తులమీఁదఁ బురుటింటిలోపల
శిసువై మహిమ చూపె శ్రీకృష్ణుఁడు" 4-1

**పురుడు:** వి. 1. స్పర్ధ 2. పోలిక విణ. సాటి సమానుడు.

"నిక్కి చందురుఁడే మోమై నిండుఁగళలు దేరఁగ
పుక్కట నద్దముతోడి పురుడేఁటికే" 9-166

"పురుషులకు పురుషుఁడవు పురుషోత్తమా
పురుఁడు లేదికఁ నీకుఁ బురుషోత్తమా" 2-283

**పురుడువెట్టు:** (4) ప.బం; స.క్రి. సమానంచేయు, సాటిచేయు.

"ఆపెతోఁ బురుడువెట్టి ఆడక వుండినఁగదా
నాపై నీ వలపెల్ల నమ్ముకుందును" 10-2-56

పురుషసూక్తము : వి. ఋగ్వేదంలోని పదహారు ఋక్కుల (మంత్రాల) సముదాయం. 10 వ మండలంలోని 90 వ సూక్తం. నారాయణమహర్షిచే దృష్టం. పురుష దేవతాకం. యజ్ఞయాగాదుల్లోనే కాక దీని వినియోగం భారతదేశ మంతటా ముఖ్యంగా ఆంధ్రదేశంలో షోడశోపచారపూజా విధానంలో మిక్కిలి ప్రచురంగా ఉంది. ప్రకృతి కతీతమైన సచ్చిదానందస్వరూపుడైన పురుషుని తత్త్వం ఈ సూక్తంలో ప్రతిపాదింపబడింది. అన్ని మతాలవారు ఈ సూక్తాన్ని వినియోగించుకుంటారు. ఈ సూక్తంలో పురుషశబ్దం ఎక్కువసార్లు ప్రయోగింపబడింది. కనుక దీనికి పురుషసూక్తమనే పేరు వచ్చింది. "సహస్రశీర్షా పురుషః" ఇత్యాదిగా నున్న మంత్రం ఇందులో తొలిమంత్రం.

"అందుక పురుషసూక్త మర్థముఁ జెప్పుదురు
కందువ నప్పటి నిరాకారమందురు" 3-33

పురుషామృగము : వి. తల పురుషరూపంలోనూ మొండెం మృగరూపంలోనూ ఉన్న రూపం. (పద.), రూపాం. పురుషమృగము.

"సారెకు భీముఁడు పురుషామృగముఁ
దెచ్చుచోట
నీ రోమములు గావా నిఖిలకారణము" 4-458

ఒకప్పుడు ధర్మరాజు చేసిన యాగ సందర్భంగా బ్రాహ్మణులు భోజనం చేసిన ప్రదేశం అపవిత్ర మౌతుంది. ఆ అపవిత్రతను తొలగించడానికి ధర్మరాజు అడవిలో పురుషమృగాకారంలో ఉన్న పురుషమృగమనే జంతువును తీసుకొని రమ్మని భీముణ్ణి ఆజ్ఞాపిస్తాడు. భీముడు హనుమంతుణ్ణి ఆశ్రయించి ఆయన అనుగ్రహంతో రోమములు సంపాదించి వాటి సాయంతో పురుషామృగాన్ని బంధించి తీసుకు వస్తాడు. ఈ కథ ఈ కీర్తనలో ప్రసక్తమైంది. పుష్పగిరి తిమ్మన సమీరకుమార విజయ కావ్యంలో ఈ కథ వర్ణింపబడింది. (7ఆ. 106 - 143 పద్యాలు)

పురుషామృగముల వేట : వి. పురుషుల వేట. (పద.)

"మిన్నక పురుషామృగముల వేటలు
పన్నక యాడేరు పడఁతులు భువిని" 3-295

పురోడాశము : వి. యజ్ఞంలోని ప్రసాదం.

"తదియ్య గురుప్రసాదపు పురోడాశమిచ్చి
కొదదీర ద్వయమును కుండలంబులు పెట్టి"
2-148

పులకబియ్యము : వి. పులగానికి ఉపయోగించే బియ్యం.

"పులకబియ్యాలఁ బొంగలివెట్టి
చలివలపుల చన్నులను" 8-10

పులకమోసులు : వి; బహు. పులకాంకురములు. (వైరిసమాసం)

"పులకమోసులు గాని పుష్పబాణములు గావు"
17-25

పులకససులు : వి; బహు. రోమాంచముల పైరులు.

"చాలై మేనఁ బులకససులు నిండీ
మేలు నీ మేని వలపు మిక్కిలి పండీ" 18-32

పులిగాయ : (పులి + కాయ) వి. పుల్లనికాయ.

"వినుకలిచదువుల సదలో వేమరు మాఁగఁగఁ
బెట్టిన
ఘనకర్మపుటొగ రుడుగదు కమ్మర పులిగాయై"
1-482

పులిగూడు : వి. పులిహోర. (పుల్లని అన్నం)

"పులిగూడు దిన్నవాని పొందొక్కటే సేసెఁగాని
నలువంక లక్ష్మీనాథుఁడితఁడే" 1-454

పులిజూజము : (2) వి. పులిజూదము, జూదాలలో ఒక భేదం.

"మదనమందిరమే మచ్చిక పులిజూజము
వుదుటు మొగపు వజ్రాలొడ్డిన రాళ్లు" 7-167

పులియు : అ.క్రి. 1. మురియు, గర్వించు 2. బిగియు, బింకంతో ఉండు 3. కొవ్వుమదించు 4. దెబ్బలవల్ల శరీరం నొప్పిపెట్టు 5. అలయు 6. జ్వరం వచ్చు.

"పులియుచుఁ జూచేవేమే పొంచి పొంచి"
28-522

అలయు:
"ఇంక నా దైన్యము చూచి యెటు రక్షించెనో కాని
సంకెదీరఁ బులిసితి సర్వేశ్వరా!" 3-265

**పులివిందల:** వి. కడపజిల్లా లోని పులివెందుల గ్రామం.

**పులివిందల శ్రీరంగదేవుడు:** వి. కడప జిల్లాలోని పులివెందుల గ్రామంలో వెలసిన శ్రీరంగదేవుడు.
"చెలఁగి పులివిందల శ్రీరంగదేవుఁడవని
కలసితి మిదె శ్రీ వెంకటరాయ నేము" 14-15

**పులుఁగము:** వి. బెల్లం కలిపి పెసరపప్పు, బియ్యంతో వండిం న వంటకం.
"పట్టపుదేవుళ్లు తాను బంతిసాగి వున్నవాఁడు
అట్టే సేయరో పులుగమారగింపులు" 5-298

**పులుఁగాలు:** వి; బహు. 'పులుగము'కు వ్యావహారిక బహువచనరూపం.
"వింతగా చెలి నవ్వులే వెన్నెలబాయలు నీకు
పొంత నధరామృతమే పులుఁగాలు" 14-408

**పులు కడిగిన ముత్యము:** (3) ప.బం; వి. మాలిన్యాన్ని కడిగివేసిన శుభ్రమైన ముత్యం, పాత్రలు, విగ్రహాలు మొ॥ వాటిని చింతపండు పులుసుతో తోమి శుభ్రం చేయడం అలవాటు. దానిమీద వచ్చిన పలుకుబడి.
"ముంగిటఁ బులు కడిగిన ముత్యమువలె
నున్నాఁడు
కుంగని రాజసముతో కొండవంటి దేవుఁడు"
3-125
"కప్పుర కాపామీఁదఁగడుఁ బూసుకొన్నవాఁడు
ముప్పిరిఁ బులుకడిగే ముత్యమువలె" 17-498

**పులుకడుగు:** అ.క్రి. మాలిన్యం కడుగు.

**పులుగు:** వి.అబద్ధం, అసత్యం. త. పులుహు అని సంపా. గుర్తు, జాడ.
"పులుగు చెప్పెడి నది పొంచి మా గురుఁడు
నీకు
తలఁచుకో నేఁడు నీవు దాఁచినర్థము" 2-5

"పులుసువేసి నీ చెంత పురుషోత్తమా! నేము
పులు గరసితి మింత పురుషోత్తమా!" 15-252

**పులుగుకాపు:** వి. చూ: పుళుగుకాపు.
"పాలజలధిపై నీలిపట్టు నిండాఁ గప్పినట్టు
కాళిమతోడ పులుగుకాపమరెను" 17-501

**పులుగుదోషము:** వి. అసత్యదోషము.
"పులుగు నెక్కినవాఁడే పులుగుదోషపు రక్ష
బలు బాలుఁడైన వాఁడే బాలగ్రహరక్ష" 4-54

**పులుమానిసి:** వి. అల్పమానవుడు (వాచ.) ప్రాభవం కోల్పోయినవాడు. (పద.)
"చిత్తములో నిన్నుఁ జింతించనేరక
మత్తుఁడనై పులుమానిసి నైతి" 1-19

**పులుసరమెంచు:** వి; అ.క్రి; ప.బం. పాసినట్లు గుర్తించు.
"సందడించి మరునాఁటి చవులకే కూడఁబెట్టు
పొంది మింగిన కళ్ల పులుసర మెంచఁడు" 3-206

**పుల్లఁదీగెలు:** వి; బహు. సన్నని పుడక తీగెలు.
"నీ తలనే వేఁగెనా నిన్నుఁ దూరఁబని లేదు
జాతిఁ బుల్లఁదీగెలకు సారె నలుగుదురు" 7-50

**పుల్లాకు:** (పుల్లె + ఆకు) వి; మాం. తిని పారవేసిన విస్తరాకు, ఎంగిలి విస్తరాకు.
"పారవైచిన పుల్లాకు బండికల్లై మించినట్లు
కోరి నీ ముద్రలు మోచి కొండగొంటి నిదివో"
3-466

**పుళుగు:** వి. పునుగు, పునుగుపిల్లినుండి వచ్చే గంధద్రవ్యం.

**పుళుగుకాపు:** (2) వి. పునుగు అనే సుగంధ ద్రవ్యాన్ని అలదిన శ్రీవేంకటేశ్వరస్వామి. పునుగుకాపు, పుళుకాపు. (పునుగు = పునుగుపిల్లినుండి వచ్చే గంధద్రవ్యం)
"అంగంపుఁబుళుగుకాపు అలమేలుమంగఁగూడి
సింగారా లాయను మంచి సిరు లాయను"
7-137

**పువ్వకపూచు:** (3) అ.క్రి. అవ్యక్తంగా ఉంటూనే వ్యక్తమగు.

"పువ్వుఁబోణుల కొలువే పుష్పయాగము
పువ్వక పూచె నీకిట్టే పుష్పయాగము" 14-396

**పువ్వారుఁబోణి:** వి. స్త్రీ, పువ్వువలె మనోహరంగా ఉన్న శరీరం కలది.

"సుద్దులు చెప్పఁగదమ్మ చొప్పాణి ముత్తెమా
పొద్దువొద్దు నీ పతికి పువ్వారుఁబోణి" 23-71

**పువ్వు:** అ.క్రి. పూచు.

"పువ్వఁగఁబువ్వఁగఁ బూపలె కావా" 22-451

**పువ్వుకొను:** ప.బం; అ.క్రి. పుష్పించు.

"చివ్వనను సంపెంగ చిగురుపైఁ బూచుఁగాక
పువ్వుకొనఁ జిగురు దాపుగ నుండునా" 7-372

**పువ్వుగట్టు:** అ.క్రి. పువ్వులు ధరించటం వల్ల వాసన కలుగు.

"పువ్వు గట్టినట్టి మేనఁ బుక్కిలించీఁ జెమట నా
జవ్వనపు మదమె పో చలపట్టీని" 5-281

**పువ్వును పిందెవలె:** ప.బం. అన్యోన్యంగా.

**పువ్వుమొన వాడిచేయు:** ప.బం; అ.క్రి. అసంభవమైన దానికి పూనుకొను.

**పువ్వులందించిన చేత రాలందించినట్లు:** నానుడి; గౌరవించిన చేతితోనే అవమానించు.

"పువ్వు లందించిన చేతఁ బూఁచి
రాలందించినట్లు
జవ్వని కుచాల నొత్త జగడా లేలే" 20-31

**పువ్వుల చెండు:** (3) వి. పువ్వులతో చేసిన బంతి.

"జవ్వనమదాన నాకె జంకించి చూచితేను
పువ్వులచెండునఁ దాఁకఁ బూఁచి వేసెవు"
26-444

**పువ్వులవంక తుంగ తలకెక్కు:** ప.బం; అ.క్రి. పెద్దవారి ఆశ్రయంతోపై స్థానం పొందు. (మామూలు తుంగ పూలమాలద్వారా తలమీద ధరింపబడుతుంది కదా!)

"గరిమ సంతతిలోనఁ గలసితే నిద్దరికిని
తొరలి పువ్వులవంక తుంగ తలకెక్కును"
16-265

**పువ్వుల వేసినవారి పూపల వేయు:** నానుడి; ఆదరించిన వారిని ద్వేషించు.

"పువ్వుల వేసినవారిఁ బూపల వేతురటవే
నివ్వటిల్ల మీలో మాట నీవే యెఱఁగవా" 18-96

**పువ్వులు ముడిచిన తల పూరిమోవ వచ్చునా?:** సామెత; గొప్పసుఖాలు అనుభవించిన చోటే దుఃఖాలు అనుభవించడం బాధాకరం అని భావం.

"పువ్వులు ముడిచిన తల పూరి మోవ వచ్చునా
యెవ్వతెఁదాఁ బొగడినా నేల వినేనే" 27-512

**పువ్వు వేసినవారి రాత వేయు:** ప.బం; అ.క్రి. ఆదరించిన వారిని ద్వేషించు.

"పువ్వుల వేసిన వారిఁ బూఁచి రాత వేయలేక
నవ్వంగనె నీతో నే నవ్వేఁగాక" 22-151

**పువ్వుసజ్జ:** వి. పూలపాన్పు, పూల పడక.

"ఎవ్వరిని దూరవచ్చు నెవ్వ రున్నారిఁకను
పువ్వుసజ్జమీఁదఁగాఁగె పొలఁతికి దేహము"
5-41

**పుష్పయాగము:** (3) వి. తిరుపతి శ్రీవేంకటేశ్వరస్వామికి రకరకాలైన పుష్పజాతులతో జరిగే యాగం. బ్రహ్మోత్సవాలు తొమ్మిదిరోజులు జరిగిన తరువాత పదోరోజున బ్రహ్మోత్సవంలోని లోపాలకు ప్రాయశ్చిత్తంగా ఇది నిర్వహింపబడుతుంది. "ధ్వజారోహణ తీర్థాంత ప్రాయశ్చిత్తం తు యద్ భవేత్, తస్య దోషవిఘాతార్థం పుష్పయాగం చ కారయేత్" (కపింజలసంహిత) ప్రస్తుతం ఈ యాగం కార్తికమాసంలో శ్రవణానక్షత్రం (స్వామి అవతార నక్షత్రం) నాడు నిర్వహింపబడుతుంది. ఈ యాగప్రసక్తి తిరుపతి శాసనాల్లో కూడా కనిపిస్తుంది. (1-220, 15-47) 16 వ శతాబ్దిలో ఆగిపోయిన ఈ ఉత్సవం ఇటీవలే (1980 సం.) తిరిగి ఉద్ధరింపబడింది. (తాళ్ళ. ఉ. వి. 156-163 పుటలు) తిరుమలకు పుష్పమండపమనే పేరు కూడా ఉంది.

"పూవుఁబోణుల కొలువే పుష్పయాగము
పూవక పూచె నీ కిట్టె పుష్పయాగము" 7-60

## పూ

**పూఁచిపట్టు:** అ.క్రి. మునుముపట్టు, వరుసపట్టు.
"పూఁచిపట్టి యీ యింతిఁ బొగడరమ్మ
కోఁచక మేఘములోని క్రొమ్మెఱుఁగువలె "
20-218

**పూఁచు:** అ.క్రి. పూను, స్థాపించు. (శృం.మం.)
"పూవుల గుత్తులఁగొని పూఁచి యేల వేసేవే
పూవుల నొకతెమీఁద పూఁచి వేసెను" 20-596

**పూఁట:** వి. ఒక డీయదగిన ద్రవ్యానికి మరొకడు పూచీపడటం.
"పాయరాని మోహముల బలువై నిలుపుటకు
సోయగపు మీలోని చూపులే పూఁట" 17-313

**పూఁటకాఁపు:** (పూఁట + కాఁపు) వి. బాధ్యత వహించేవాడు, బాధ్యుడు. (పద.)
"పూని శ్రీవేంకటేశ్వర పూఁటకాఁపు లిందరును
వీనులతో నీకుఁ దామె విన్నవించేరు" 15-419
"కాచేనన్న చరమశ్లోకము నాకుఁ బూటకాఁపు "
15-419

**పూఁటకూటిమీఁదఁ దమ్మ ఉమియు:** మంచిదానిని చెడగొట్టు, వృథా చేయు, కష్టపడి సంపాదించుకొన్న వస్తువును అనుభవదూరం చేయు, అనుచితమైన పనిచేయు.
"బొమ్మరపోయెడి నవ్వులఁ బూఁటకూటిమీఁదఁ
దమ్మ వుమియఁగాదా తరుణి" 5-238

**పూఁటపూఁటకు:** ప్రతిరోజు, రోజురోజుకు
"బుద్ధి నేము చెప్పేమా పూఁటపూఁటకు
గద్దరీఁడు తానె యెరఁగవలెఁగాక" 7-556

**పూఁటవడు:** అ.క్రి. ఒకరు ఇవ్వవలసిన బాకీని నే నిస్తానని పూచీపడు, బాధ్యత వహించు.
"అట్టె తా పూఁటవడి ఆరవననఁగరాదు
పట్టి చవిగొంటా రోతపడఁగరాదు" 23-231

**పూఁటవెట్టు:** (2) ప.బం; స.క్రి. పూఁచీ వహింపఁజేయు.
"మంచి చిగురుమోవి నీ మోవి మోడెనని చెప్పి
పొంచి వసంతుని నీకుఁ బూటవెట్టినట్లు" 7-62

**పూఁతమాటలు:** వి. పైపై మెఱుగు మాటలు.
"పూఁతమాటల సొలపు బొంకులనె దూరేవు
యీఁతలేని చల్లులాట యేమి సేసేవే" 5-196

**పూఁపకము:** (పూఁపు + అకము) వి. పూనిక, ఉద్యమం.
"ఆన లేలయ్యా నీ వాడినసట్టె ఆడేము
పూనిన నీ మనసులో పూఁపక మేదయ్యా"
20-177

**పూఁపకొడుకు:** వి. బ్రహ్మ, పూఁబిందె కొడుకని వ్యుత్పత్తి.
"నీ పాదతీర్థము నెత్తి మోచె నొకఁడు
పూఁపకొడుకై యొకఁడు బొడ్డునఁబుట్టె" 3-76

**పూఁబరపు:** (పూ + పరపు) వి. పుష్పశయ్య.
"పవళించ వచ్చేవని పట్టెమంచముమీఁదట
వివరించి పూఁబరపు వేసుకున్నది" 19-42

**పూఁబానుపు:** (పూ + పానుపు) పుష్పశయ్య.
"లీలఁ బన్నీటికిని లేఁతా చెలిచెమట
లోలిఁ బూఁబానుపున నుడికెఁగాక" 6-7

**పూ:** వి. పూవు.
"వెదపడి పుత్రులు పౌత్రులే విత్తులు లోలో మొలచియు
పొదిఁ గర్మపు పూ మారదు పూ పిందెయిన దిదే" 1-482

**పూచిన తంగేడువంటి పుత్తడిబొమ్మ:** వి. కనులకింపుగా నుండే అందమైన స్త్రీ, బాగా అలంకరించుకున్న స్త్రీ, సిరిసంపదలతో కూడింది.
"రాచిలుక పలుకుల రవళితోడి కొమ్మ
పూచిన తంగేడువంటి పుత్తడిబొమ్మ" 13-239

**పూచిన తంగేడువంటి పొలఁతి:** వి. లక్ష్మీకరమైన స్త్రీ, ఆభరణాలతో నిండైన పొలఁతి, బాగా అలంకరించుకున్నస్త్రీ.
"పూచిన తంగేడువంటి పొలఁతి నీ వురమున
నేచినది నీ సింగార మేమి చెప్పేది" 14-386

**పూచిన రేలా తంగేడు పొసఁగినట్లు :** తంగెడు, రేలచెట్లు సమృద్ధిగా పరస్పరం రంగులతో (తెలుపు, పసుపుతో) పూసినట్లు.

**పూజగుండలు :** వి; బహు. అయిరేని కుండలు.
"సన్నలా చాయలని సరుస నీ కాలుదొక్క
చన్నులఁబూజగుండలు సారెఁ
బూజించవయ్యా" 29-289

**పూజరి :** (పూజ + అరి) వి. అర్చకుడు.
"పొసఁగి దేవుఁడిచ్చినా పూజరి వరమీఁడు"
3-220

**పూజెకుండలు :** వి; బహు. అయిరేని కుండలు. రూపాం. పూజెగుండలు.
"పొంచి నా చేతికి పెద్ద పూజకుండ లిమ్మంటేను
వంచనతో నిట్టే యాల వంచీనే శిరసు" 12-243

**పూజెగుండలు :** వి. అయిరేనికుండలు.
"దొంతిఁ బెట్ట వలపులు తోరపుఁబూజెగుండలా
పంతాలు సంగడిఁబార బండికండ్లా"
"పూజెకుండలు నిల్పెఁ బువ్వుఁబోడి యొకర్తు
శుభవితర్దిక చతుష్కోణములను" శివ. 256

**పూతకి :** వి. పూతన.
"సరసమాడఁగ నీకు పతి శూర్పనఖ గద్దు
పోరిఁ జన్నిచ్చి పెంచఁగఁ బూతకి గద్దు" 7-317
"బొమ్మరపోవఁడు పూతకిఁ బొరిగొని
అమ్మరో గయ్యాళి శిశువు" 6-151

**పూనికె :** వి. పూనిక. (క.పూనికె) ప్రయత్నం.
"నేనే తమకింతుఁగాని నీవు తమకించవేర
పూనికె లొక్కటిగావు బుద్ధి యేదుకో" 24-180

**పూనిపట్టు :** (?) పట్టుదల వహించు.
"పూనిపట్టి నేనిప్పుడు పొంచి యెచ్చరించే
దేమి" 24-445

**పూప :** విణ. నిస్సారమైన.
"పూప సంసారము నమ్మి పుంగుడపై
యిన్నాళ్లదాఁకా
దాపులేక బ్రతికితి దానికేమి" 3-331

**పూరిజీవులు :** వి; బహు. పూచికపుల్లవంటి జీవులు, తృణప్రాయులు, నికృష్టజీవులు.
"ఊరకైతే నిన్నుఁగాన మొక కారణానఁగాని
పూరిజీవులము నీవు పురుషోత్తముఁడవు"
2-161

**పూరిపుల్ల మేరువుసేయు :** ప.బం; అ.క్రి. సామాన్యమైన వస్తువును పెద్దదిగ చేయు. (గడ్డిపుల్లను మేరుపర్వతం చేయు అని వాచ్యార్థం.)
"చెల్లుఁ గాగిట నీకే చింతింపఁగా పూరి
పుల్ల మేరువుసేయ భూమిలో నిపుడు" 1-182

**పూవక పూచు :** (?)
"పూవుఁబోణుల కొలువే పుష్పయాగము
పూవకపూచె నీకిట్టి పుష్పయాగము" 7-60

**పూవు :** అ.క్రి. పూచు, పుష్పించు.
"తీవెలకుఁజుట్టి చుట్టి దిక్కులఁబాక నేర్పిరా
తావులఁదతికాలానఁ బూవ నేరిపిరా" 2-333

**పూవుటేట్లు :** (పూవు + ఏట్లు) వి; బహు. పూలదెబ్బలు.
"పోహణించి యేల నాకుఁ బుట్టించేవు తరితీపు
ఈహల మరుని పూవుటేట్ల గురుతు" 27-295

**పూవు పరిమళమై :** అన్యోన్యంగా.
"మీవంటి దానసటె మీరఁగనేనను
పూవుఁబరిమళమై పొదిగేఁగాక" 21-420

**పూవు పిందెవలె :** ప.బం. కలసిమెలసి.

**పూవులగాలము :** వి. పూవులు పూసే కాలం, వసంతకాలం.
"పూవుల గాలమవై పురుషునిఁ దగిలేవు
వేవే యెంత రాజ్యమేలితివిది నీవు" 14-83

**పూవులవల్ల తుంగ తలకెక్కినట్టు :** సామాన్య వస్తువైనా ఉత్తమవస్తు సంయోగంతోపై స్థానాన్ని ఆక్రమించినట్లు.
"దోపుచుఁ బూవులవల్ల తుంగ దలకెక్కినట్టు
దాపగు నాలికె నిన్నుఁదలఁచఁగవలసె" 3-440

**పూవుల వాసనవలె నుండు :** అ.క్రి. అంతర్లీనంగా ఉండు.

**పూవుల వేసినవారిఁ రాల వేయు :** ప.బం; అ.క్రి. గౌరవించినవారిని అవమానించు.

"పూవుల వేసినవారిఁ బొంచి రాల వేసినట్టి
భావము నీయందె కంటి భళిభళి గుణములూ"
11-310

**పూవులు ముడిచిన సిరసున కట్టెలు మోచు :** నానుడి; ముందు భాగ్యమనుభవించిన చోటనే కష్టాల పాలగు.

"మునుకొని పూవులు ముడిచిన సిరసున
కనలి కట్టెలు మోచి కాకయ్యేదా" 3-456

**పూస గుచ్చినట్టు :** ప.బం; క్రి.విశే. వివరంగా.

"పూసగుచ్చినట్టు నీకు బుద్ధులు నేఁ జెప్పితేను
ఆసతో నా మోవి మోవి నందుకొనేవు" 11-564

"పూసగుచ్చినట్టు నీకు బుద్ధులు చెప్పీ నాకె
వేసరక వినవయ్యా వేమారును" 27-136

**పూసగుచ్చిన దారము :** ప.బం; వి. అన్నింటినీ కలుపుతూ అనుస్యూతమై కలసిపోవునది.

"పూసగుచ్చిన దారము పోనీఁడు తానన్నను
వాసితో వీరి వారి వెనువెంట వలలఁదిరుగుట
చాలదా" 11-449

**పూసగొండి :** (పూశల్ + గొండి) ప.బం; వి. కలహస్వభావం కలవాడు. ఇతరుల పనులు నెత్తిమీద వేసుకొనేవాడు. (తె.వ్యు.కో; పద.) (త. పూశల్ = కలహం, గొండి = తచ్ఛీలార్థక ప్రత్యయం) తనకు లేని సంబంధం కల్పించుకోవటం? తె.వ్యు.కో. లో 'పూసిగొండి' అనే పదం చూపబడింది. దీనికి తనకు లేని సంబంధం కలిగించుకొనేవాడు, అనావశ్యకంగా ఇతరుల కార్యం తనపై వేసుకునేవాడు అనే అర్థాలు చూపబడ్డాయి.

"బిట్టు వాగెలఁబెండ్లిపేరటము వోతిని
ఇట్టి పూసగొండివి నీకేమి బాఁతి సతులు"
21-151

**పూసగొండితనము :** (పూసగొండి + తనము) వి. తనకు లేని సంబంధం కల్పించుకోవటం.

"పుక్కటవలపుతోడి పూసగొండితన మేల
పక్కన మొఱఁగితేను పగలు రేయౌనా" 14-292

**పూసగొండిమాటలు :** ప.బం; వి; బహు. లేని సంబంధాన్ని కల్పించుకొని మాట్లాడే మాటలు.

"వొగరుఁదీవుగా నీవు వోరగండ్లఁ జూచిన
మగటిమిఁ బూసగొండిమాటలెల్లా నాడుదూ"
12-34

**పూసల దారమువలె :** ప.బం; అన్యోన్యంగా, కలసిమెలిసి.

"చెనకి మాయకు మాయై జీవునికి జీవమై
మొనసి పూసలదారమువలె నున్నాఁడు" 2-232

**పూసల దారమై ఉండు :** ప.బం; అ.క్రి. అన్నింటినీ కలుపుతూ అనుస్యూతంగా ఉండు, అన్యోన్యంగా ఉండు.

"చెనకి మాయకు మాయై జీవునికి జీవమై
మొనసి పూసలదారమువలె నున్నాఁడు" 2-232

**పూసలలో దారము :** (3) ప.బం; వి. అన్నింటా అనుస్యూతమై కలసిపోయినది, అన్యోన్యంగా ఉండేది.

"పూసలలో దార మీ పురుషుఁడు నీకు నాకు"
7-459

**పూసుకవాసుక వచ్చు :** పూసుకొని, పాసుకొని. యథేచ్ఛగా (పూసుక + పాసుక)

"పొందు గలదానవు పూసుకవాసుక వచ్చి
గందము పూసేవు మేన కడుబత్తితోను" 26-219

"పూసుకవాసుక వచ్చే పొరుగులదానవా
రాసికెక్కె పట్టపురమణి నేను" 23-546

**పూసుగోడు :** వి. సం.ప.స. లో ఈ పదం ఈ విధంగా చర్చింపబడింది. "అస్థిరం, తప్పు కప్పిపుచ్చుట అను అర్థములలో పూసిన గోడ, పూసిన గోళ్లు వంటిది కావచ్చు. పూసుగోళ్లు అనుటకు బదులుగా పూసుగోడు అను ఏకవచనరూపము అపురూపమే. కన్నడమున సాధించవచ్చునేమో" (16-430 పు.) ఇట అస్థిరం అనే అర్థం యుక్తంగా ఉంది.

"సేసతోఁ బెండ్లాడినదే చెల్లుబళ్లాగాక

పూసుగోఁడై అంటుకొన్న పొందులు
నిజమౌనా" 16-9

## పె

**పెంచము:** వి. పింఛము. రూపాం. పెంచెము.
"పేగులజంద్యాలు వేసి పెంచపు నమలిపురి
పోగగాఁ జుట్టిన నా బాఁపనయ్య వీడివో" 5-254
"చుట్టు నెమలిపెంచము చుంగుల నల్లని కాంతి
అట్టె అంగముల నెల్లా నలమెనో కాని" 23-148

**పెంచు:** (3) వి. పెనం; రొట్టె మొ॥ కాల్చడానికి వాడే గుండ్రని పాత్ర విశేషం.
"పెంచు దెచ్చి మాణికపు బిల్ల సేసె
తోలుబిల్ల మాడకంటె దొడ్డసేసె" 4 అను. 44
"కాలిన పెంచై వుండి కప్పెర దివ్యాన్నమిచ్చె"
1-455
"ఇల నిందరి నుతియించి పెంచువలె
నలినలిరైయెనది నా జిహ్వ" 1-56

**పెంచెపుటాకసము:** (పెంచెము + ఆకసము) వి. విశాలమైన ఆకాశం.
"పెంచెపుటాకసము నీ పిడికిటిలోనిది
యెంచరాని వెడదైన్య మేలే నీకు" 20-260

**పెంచెపుటురము:** (పెంచెము + ఉరము) పింఛము గల వక్షస్సు, వక్షఃస్థలం, తోక, తోకకుచ్చు గల వక్షస్సు.
"నించి శ్రీవేంకటేశుఁడు నీ కౌఁగిటఁగూడినాడు
పెంచెపుటురాన నిన్నుఁ బెట్టుకొనేఁగా" 7-130

**పెంచెము:** వి. పింఛం, తోక, తోకకుచ్చు.
"యెంచుకో నీ సొమ్ములలో యిది
దాఁచవచ్చునేమో
పెంచెపు మా గురిగింజ పేరడిగేవు" 7-583
"పెంచెపు శ్రీ వేంకటేశ పెండ్లి ముత్యాలసేస
వంచికూడి చెలి మానవచ్చు నటయ్యా"
20-167

**పెంజమాటలు:** వి. 1. తేలికైన మాటలు
2. తుచ్ఛమైన మాటలు.
"అంగపుఁజెఱుఁజెమట లర్ఘ్యపాద్యాచమనాలు
సంగతిఁబెంజమాటలె జలకములు" 12-273

**పెంజెమటలు:** (పెను +చెమటలు) వి. మిక్కిలి చెమటలు.
"ఇచ్చకమాడ నెఱఁగ నేమి సేతునే
హెచ్చీఁ బెంజెమటలు యేమి సేతునే" 9-71

**పెంట:** వి. కుప్ప, పిండం. (గోవులు గడ్డిమేసిన తావు, అశితము పట్టు)
"పెచ్చుపెరిగి కోరికలు పెంటలై పెరుఁగఁగాను
హెచ్చిన దీమసములు యేడనుండు నిఁకను"
28-187

**పెంటగా:** (2) క్రి.విఆ. కుప్పగా.
"పెంటగా నీ కెంత ప్రియమాయెనో" 24-583
"పెంటగా నిద్దరము నీ పెండ్లి చవికెలోన
వుంటిమిగా ఆడకేల వొద్దయ్య సోదించను"
16-82
"అంటుచు నీ చన్ను లటు గని మొక్కఁగ
పెంటగా నానలు పెట్టుదురా" 26-323

**పెంటపట్టు:** వి. పెంట = అంగడి, పట్టు = చోటు, పెంటపట్టు = బజారీ.
"పెంటపట్టు సరసాలఁబెనఁగనేలా" 15-231

**పెంటపట్టు బీరము:** వి; ప.బం. తగనిచోట చూపే బీరం, వ్యర్థమైనదని భావం. పెంటపట్టు అనగా పశువులు నిలిచి పేడవేయు చోటు. అక్కడ చూపే బీరము అనేదానిని బట్టి వచ్చినది.
"పిలిచి నీకు నాకు పెంటపట్టు బీరమేల
కలతము వలపుల కలి(ల)నికి రారా" 14-272

**పెంటపులకలు:** వి; బహు. అధికమైన గగుర్పాటు.
"అంటితే శ్రీవేంకటేశుఁ డట్టె నిన్నుఁ గూడుఁగాక
పెంటపులకలు నీకుఁ బెరుగనేలే" 21-124

**పెంటపెట్టుకొను:** అ.క్రి. అంగడిపెట్టుకొను.
"గెంటు లేని వేంకటగిరిమీఁదను వాఁడె
పెంటపెట్టుకున్నవాఁడు పెండ్లికొడుకు" 5-186

**పెంటపెరుగు:** వి. ఆవుపెరుగు, గడ్డపెరుగు.
"పెంటపెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమిఁ
బెంటిపోతులఁ గూరిచెఁ బెండ్లికొడుకు" 5-186

"పెంటపెరుగే పెంటపెరుగే
పెంటమంద పెనుఁబెంటపెరుగే" 5-176

**పెంటపెరుగుల దొంగ:** వి. ఆవుపెరుగుల దొంగ.
"పెంటపెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమిఁ
బెంటి పోతుల యారిచెఁ బెండ్లికొడుకు" 5-186

**పెంటమంద:** వి. ఆలమంద.
"పెంటపెరుగే పెంటపెరుగే
పెంటమంద పెనుఁబెంటపెరుగే" 5-176

**పెంటల పూజలు:** వి; బహు. సమృద్ధములైన పూజలు కావచ్చు.
"జంటల నిద్దరివిని జాజులుఁ గలువలునై
పెంటలపూజలై కడుఁ బిక్కటిల్లీ మేనను" 18-70

**పెంటలు:** కుప్పలు, మిక్కుటములు, గుంపులు, పేటలు, చెత్తలు, బాధలు.
"పెంటలాయ సేసలు పెనగొనె నాసలు" 19-177
"పెరుగఁబెరుగఁదానే పెంటలయ్యీ వలపు"
16-352
"కంటిమయ్య నీ చేతలు కన్నులపండుగగాను
పెంటలైన ముచ్చటులే ప్రియము నీకు" 19-136
"నంటున నీతో నవ్వఁగఁజూపులు
పెంటల నూరక బెదరీని" 20-212
"పెంటలై వున్నా రిదివో పేరటాండ్లిందరును
గొంటరివి యని యాడుకొనేరు గదయ్య"
14-140
"పేరఁ బేరవలపులు పెంటలయ్యీని
నేరుపులు లోలోనే నింతముగాని" 26-81

**పెంటవెట్టుకొను:** తగవు పెట్టుకొను, (వ్య.) కలహించు.
"పెంటవెట్టుకొని పెనఁగీ నింతలో
వెంట రానమరు యింటిదానికి" 26-495

**పెండిలి ఆడేవారు:** వి; ప.బం. పెండ్లి చేసుకొనేవారు.
"పెండిలి ని న్నాడేవారు పీటమీఁదనే వున్నారు
నిండువాని మేనవారు నిలుచున్నారు" 22-316

**పెండిలిపీఁట:** వి. పెండ్లిలో వధూవరులు కూర్చునే పీట, పెండ్లిపీట.
"పెండిలిపీఁటెక్కితివి ప్రేమఁజెక్కు నొక్కితివి
అండనే సతికిఁ బతివైతివయ్యా" 26-424

**పెండెము:** (5) వి. 1. గండపెండారము 2. వలుగాడి తలుపు. రూపాం. పెండియము. శూరులు బిరుదుగా కాలికి ధరించే అందె.
"పెట్టిడి నా పెండెమిది పెట్టుకొంటి నిందరిలో
ముట్టి నాకు నిది గొంత మోచిదింపులా"
23-563

**పెండెము:** వి. 1. రొట్టెలు, దోసెలు మొ॥ కాల్చడానికి వాడే గుండ్రని మట్టిపాత్ర. వి. 1. పొలంచుట్టూ వేసిన కంచెకు కొయ్యేలతో అమర్చిన ద్వారం 2. పాదాంగదం 3. కంప మొ॥ వాటితో ఏర్పరచిన తలుపు.

**పెండ్లాడి పొంతనాలు చూడు:** నానుడి; వ్యర్థమైన పనికి పూనుకొను, పెండ్లికి ముందు చూడవలసిన పొంతనాలు పెండ్లి తరువాత చూడడం వ్యర్థమే కదా!
"పొలుపుగాఁ బెండ్లాడి పొంతనాలు చూడనేల
చెలరేగి తెరదీసి సిగ్గు మరేల" 16-470

**పెండ్లిపీట:** (16) వి; ప.బం. పెండ్లిలో వధూవరులు కూర్చునే పీట. చూ: పెండిలి పీట.

**పెండ్లిపేరటము:** వి. పెండ్లి మొ॥ శుభకార్యం.
"బిట్టు వాగెలఁ బెండ్లిపేరటము వోతిని
యిట్టి పూసగొండివి నీకేమి బాతి సతులు"
21-151

**పెండ్లిపోబనము:** వి. (?)
"ప్రేమాన మీకిద్దరికి పెండ్లిపోబనము
యీ మగువలునుఁగూడి రేమి సేతురయ్యా"
26-512

**పెందలకాడ:** (5) ప్రొద్దున, ఉదయాన, పెందలకడ, పొద్దుపోకముందు.
"అంది విడేలిచ్చుకొంటా ఆయాలు గరఁగు
కొంటా
పెందలకాడను మీరు పెండ్లిండ్లాడరా" 29-1

**పెంపుడుఁగుచాలు:** వి; బహు. పెరిగిన స్తనాలు.
"పెంపుడుగుచాల నిన్నుఁ బెద్దసేసేఁ బో నే
నింపులరతుల నిన్నెచ్చరించేనే" 9-59

**పెంపుడులేడు:** వి. 'పెంపుడులేడి' కావచ్చు.
"యేపున మన సనియేటి మా పెంపుడులేడు
పాపమనే యడవిఁబడినది" 1-506

**పెక్కిండ్ల విందు:** వి. జారుడు.
"అందగాఁడ తిరువేంకటాధీశ పెక్కిండ్ల
విందవై నీ వొకతెపై వెచ్చఁదన మున్నదా" 5-1

**పెగడతనము:** (పెగడ + తనము) వి.
గొప్పతనం. (బ్రౌన్)
"తెగువగల దొకతె తిట్టదాయ నందులోన
పెగడతనాలెల్లఁ బ్రియముతో విందుము"
27-254

**పెచ్చు:** వి. ఆధిక్యం, అతిశయం.
"ఇంత పెచ్చు లేని వలపేటికమ్మా" 6-121

**పెట్టనికోట:** ప.బం; వి. రక్షకం.
"ముంచిన సిగ్గయితేను మొదలఁబెట్టని కోట
మించి కాంతలకే పోద్దూ నీ మీఁదిదే యాట"
16-69

**పెట్టనెమలి:** (2) వి. ఆడునెమలి. (పెట్ట = ఆడుపక్షి)
"చుట్టితి పెంచము సోగనెమలివలె
పెట్టనెమళ్లను బెరసేవు సుమ్మీ" 23-183

**పెట్టరు పోయరు:** ప.బం; క్రి.ప. పోషించరు, అన్నం పెట్టరు – నీరుపోయరు ద్వారా ఏర్పడిన పదబంధం.
"ఇట్టునట్టుఁ దిరిగాడి యేమైనాఁ జెడనాడి
పెట్టరంటాఁబోయరంటాఁ బెక్కులాడి" 1-59

**పెట్టరు పోయరు:** క్రి.ప. కానుకలతో ఆదరించరు అనే అర్థంలోని పదబంధం. పెట్టిపోతలని కూడా వ్యవహారంలో ఉంది. (పెట్టడం = వస్త్రాదులు పెట్టడం, పోయడం = సారె పోయడం)
"ఇట్టునట్టుఁ దిరిగాడి యేమైనాఁ బెడనాడి
పెట్టరంటాఁ బోయరంటాఁ బెక్కులాడి" 2-59

**పెట్టుఁజెట్టు:** (6) ప.బం; వి. 1. తాను వృద్ధిలోకి తెచ్చినది 2. కల్పవృక్షం. (పర్యాయ)
"చెందువడి నీ వొకరి పెట్టుఁజెట్టువా యేమైనా
నిందుదొర వవ్వటిని నీ కేల వెఱపు" 23-192

**పెట్టెలో సొమ్ము:** ప.బం; వి.
కొంగుబంగారంవంటి పలుకుబడి,
అందుబాటులో నున్న ధనం.
"పెట్టెలో సొమ్ము గదవే ప్రియురాలు నీ వయసు
కట్టిన ముడుపు గదే కాఁగిటిరతి" 28-505

**పెట్లుప్పు:** (పెట్లు + ఉప్పు) వి. బద్దలయ్యే ఒకరకపు ఉప్పు.
"కప్పురము సుమ్మీ యది కంతు పెట్లుప్పు గాఁదు
పుప్పొడి సుమ్మీ చొక్కుబూడిదె కాదు" 28-582

**పెడఁబాయు:** ప.బం; స.క్రి. విడుచు, త్యజించు.
"సిగ్గులెల్లా పెడఁబాసి చేరి యెవ్వరు నవ్వినా
యెగ్గుపట్టదు మనసు యెఱుకతోనే" 2-4

**పెడగంత:** (పెడ + కంత) వి. తప్పుత్రోవ.
"పెద్దతెరు వుండఁగాను పెడగంతలు దీసుకో
పొద్దువోక యడవులఁ బరిగుడయ్యేరు" 3-383

**పెడతటి గండఁడు:** వి; ప.బం. ఒరుల మాట వినని మూర్ఖుడు, పెడసరపు మనిషి. (పద.)
"పెంచుకోవిల నోరు పెడతటికిఁ బోదాయె" 6-92

**పెడమరలు:** అ.క్రి. పక్కకుగాని, వెనుకకుగాని తిరుగు.
"పెడమరలుండఁగాను పేరునఁ బిలవకురా
వడిమురిపెముల గర్వపువారమా" 11-155

**పెడమరు:** స.క్రి. వీడిపోవు.
"కాయము గడపల గనుదాఁక యీ
మాయయు తన్నుఁ బెడమరు గాక" 1-212

**పెడమళ్లు:** అ.క్రి. పెడమరలు.
"పెడమళ్లి చూచె నంటా పెద్దకొప్పు పెట్టెనంటా
పడఁతికై నేటికి నెపాలు వేసేవు" 29-350

**పెడమొకము వెట్టు:** ప.బం; అ.క్రి. విముఖత కనబరచు.

**పెడరేచు:** ప.బం; స.క్రి. మిక్కిలి ప్రోత్సహించు, పురికొల్పు.
"నేరఁగల దొక్కటే నిశ్చలబ్రహ్మవిద్య
వారివారి యంతర్యామి వచ్చి పెరరేఁచీని" 2-184

**పెడవాడఁబెట్టు:** ప.బం; స.క్రి. బహిష్కరించు.
"వెట్టి సంసారమిది వెంకటేశునిఁ గొలువని
వట్టి మనుజుల పెడవాడఁ బెట్టుఁగాక" 1-177

**పెడవాడ:** వి. ఇలువరుస మార్పు లేక వరుసమార్పు. (సంపా.)
"సేసవెట్టి పెండ్లాడి చెలియను మగవాఁడు
వేసటతోఁబెడవాడ వేయ దగునా" 24-260

**పెడపెడ:** విణ. మిక్కిలి పెద్ద.
"పెంటల గోపికలెల్లా పెడపెడ మేడలెక్కి
నంటునఁ జూచి సిగ్గుతో నవ్వులు నవ్వేరు" 18-73

**పెదయౌబళపుఁగొండ:** ఎగువ అహోబలపుకొండ. ఇట వెలసిన నృసింహస్వామిని లక్ష్మీనృసింహుడని అంటారు. దిగువ అహోబలంలోని నృసింహస్వామిని ఉగ్రనృసింహుడని అంటారు.
"పెదయౌబళపుఁగొండఁ బెరిగీ నదే
వదలక గొలిచితే వరము లిచ్చీని" 11-13 old

**పెదవి గొణఁగుకొను:** పెదవితో ఏదో అస్పష్టంగా లోలోన పలుకుకొను.
"పెదవి గొణఁగుకోంగా ప్రియుఁడాకెఁ జెక్కు నొక్కి
చెదర నాడుక లోనై చిక్కెఁజెలి" 17-478

**పెదవితేనె:** వి. అధరామృతం, మోవితేనె.
"అదిమి నిన్నుఁగాఁగిట నట్టే కాఁగిలించుకుండఁ గాను
పెదవితేనెకు నేల పెనఁగేవు నీవు" 17-221

**పెదవిపై మాటలు:** ప.బం; వి; బహు. పైపై మాటలు.
"పెదవిపై మాఁటలకే పెద్దగా వలచితివి
యెదిరించి యాల యెలయించ వచ్చేవు" 29-323

**పెదవిమీఁదటి తేనె:** వి. అధరామృతం, సులభం.
"పెదవిమీఁదటి తేనె పేరుకొనేనీ జపము
అదన మాకు నదివో అక్కరలేదయ్యా" 3-580

**పెదవివిఱుచు:** ప.బం; అ.క్రి. నిరాశను సూచించు.
"కొసరి కొసరి నిన్నుఁ జూచి కోపగించఁజాలకా
విసువుతోడ గొణఁగి పెదవి విఱుచుకొనఁగఁ జాలదా" 17-467

**పెదవులవుడు కఱచు:** అ.క్రి. కోపావేశం చేత కిందిపెదవి కొఱుకుకొను.
"తోరంపుఁబెనుచేతుల మల్ల చఱచి
దారుణలీలఁ బెదవులవుడు కఱచి" 1-211

**పెదవులు పిప్పిగట్టు:** అ.క్రి; ప.బం. పెదవులు వాడివత్తలగు.
"పెచ్చురేఁగి యేకతాన పెదవులు పిప్పిగట్ట
మచ్చిక నీతనితోను మాఁటలాడవా" 28-145

**పెదాలు పుక్కిటఁబెట్టు:** అ.క్రి. మిన్నకుండు.

**పెద్దకంభమురాయఁడు:** (?)
"కరుణించవయ్య మమ్ముఁ గంభమురాయ
పెరదేవుని కాలువ పెద్దకంభమురాయ" 18-420

**పెద్దతెరు వుండఁగా పెడగంతలు తీయు:** ప.బం. పెద్దమార్గముండగా సందుగొందులు వెదకు.

**పెద్ద దంతెనాల కోట:** వి. దంతెన = a large rake (బ్రౌన్)
"తలవాకిలి దంతపుతలుపుల కోటా
తలిరుఁజేతుల పెద్ద దంతెనాల కోటా" 2-84

**పెద్దరికము:** (3) (పెద్ద + ఱికము) పెత్తనము, ఇట 'ఱికము' అని శకటరేఫ ఉండాల్సి ఉండగా సాధురేఫ ప్రయుక్తం.
"అదియు నాపెద్దరిక మన్నిటాఁగాదా
పదరినా యిందరును బలఁగమే కదవే" 7-78

**పెద్దరికెము:** (పెద్ద + రికము) పెద్దరికము'నకు వ్యావహారిక రూపం. పెత్తనం.
"పొద్దువోదా నీకదేమి పోరు లేలే
పెద్దరికెము సేసితే బిగిసే వేమే" 7-77

**పెనపరాలు :** వి; బహు. వివాదాలు.
"కొనవేసి మరికొంత కొసరఁగఁబోతేను
పెనపరాలకు వచ్చి పిప్పిగట్టును" 23-251

**పెనపరి :** (పెనవు + అరి) వి. 'పెనుపరి'కి వ్యావహారికరూపం కావచ్చు. అధికుడు, గొప్పవాడు, వృద్ధిపొందించేవాడు. 7-141

**పెనపు :** వి. 1. వివాదం, తగవు 2. భేదం.

**పెనపులఁబెట్టు :** వివాదాలు పెట్టు.
"ననుపులు చూపితేనే నగవులు వచ్చుఁగాక
పెనపులఁ జట్టితేను ప్రియములవునా" 12-474

**పెనపుల బెట్టు :** అ.క్రి. వివాదాలుపెట్టు.
"యెనసి శ్రీవేంకటేశ యిటు నీ వాదరించఁగా
పెనపులఁ బెట్టవుగా ప్రేమపు వలపులు" 9-7

**పెనవులఁబెట్టు :** అ.క్రి. వివాదాలు పెట్టు

**పెనుగాలిమూట :** వి. అశాశ్వతం, క్షణికం

**పెనుపండుగ :** వి. సంక్రాంతి; తెలుగువారికి పెద్ద పండుగ సంక్రాంతి.
"పెనుపండుగలు సేసి పిలిపించె నిన్న మాపె
పెనఁగి చిత్తపు చింత పెనులంపటములు"
11-184

**పెను లోకదిమ్మరి :** పెద్ద లోకదిమ్మరి.
"తీరువడ్డ పెను లోకదిమ్మరివి నీకు నేను
ఆరితేరి నేఁడు నీకు నాల నెట్టైతినా" 7-10

**పెనువాములు :** వి; బహు. అధికం

**పెరఁబెట్టు :** తేనెపట్టు పెట్టు.
"యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
బెట్టి(ట్టు) మోవి తేనిచ్చితే పెరఁబెట్టనేలా"
7-178

**పెరయు :** అ.క్రి. పెనఁగు.

**పెరరేఁగు :** అ.క్రి. విజృంభించు.
"యిరవై శ్రీవేంకటేశ యదె నన్నుఁ గూడితివి
పెరరేఁగిన రతులు పెంటలు గాఁజొచ్చును"
7-19

**పెరరేఁచు :** స.క్రి. విజృంభింపజేయు, ప్రేరేపించు.
"నీవేమిసేతు వాపె నిన్నుఁబెరరేఁచఁగాను
తావుల సోకిరిగోరఁ దగదా నిన్నును" 10-2-50

**పెరరేఁపన :** వి. ప్రేరేపణశబ్దానికి వికృతిరూపం.
"చలమున నిది నా సహజపు గుణమో
పెలుచగు శ్రీహరి పెరరేపనలో" 4-75

**పెరరేఁపు :** (5) వి. ప్రేరేపించడం, పురికొల్పడం.

**పెరరేపకుఁడు :** (2) వి. ప్రేరేపకుడు, ప్రేరేపించువాడు.
"భావములోపలి పెరరేపకుఁడై
భక్తి చేరుకొనును యాతఁడు" 2-392 &1-403

**పెరరేపణ :** వి. 'ప్రేరేపణ'కు వ్యావహారికరూపం.
"దైపమా నీ పెరరేపణలు
అవి తప్పక వున్నవి జీవులకు" 2-190

**పెరిమ :** వి. ప్రేమ, అనురాగం, పెద్దరికం, గొప్పతనం, అతిశయం. గౌరవం అని అం.ప.ని.
"పెరిమ యజ్ఞభాగాలు పెద్దవై ఆరగించేవు"
8-227
"ప్రియమున్నెరుగను పెరిమన్నెరగను
ద్వయాధికారము దగిలినవాఁడ" 4-212

**పెరిమె :** వి. 'పెరిమ'కు రూపాం.
"ఘనత లేమీఁదప్పుదు కాగిలించినంతలోనే
పెనఁగించె ఆపెచేత పెరిమె వోదు" 11-151

**పెరియాళువారి బిడ్డ :** వి. ఆండాళ్‌దేవి. ఈమె పెరియాళువారి (విష్ణుచిత్తుని) కూతురు.
"పెరియాళువారి బిడ్డ పిసికి పై వేసిన
విరుల దండల మెడవేసినవాఁడు" 1-121

**పెరుగుతోఁబెట్టు :** ప.బం; స.క్రి. చిన్నతనాననే కలిగించు.
"పెరుగుతోఁబొదిగి పెట్టిరి దుష్టుఁదనము
పెరుగఁ బెరుగ నాఁడె రాండ్లెల్లా" 7-415

**పెరెదేవుని కాలువ పెద్ద కంభమురాయఁడు :** (?)
"కరుణించవయ్యా మమ్ము గంభమురాయ
పెరెదేవుని కాలువ పెద్ద కంభమురాయ" 18-420

**పెర్గుచిప్ప :** వి. పెరుగు చిప్ప.

"నే యమ్మే వారము నవ్వనేరము పోసిమిదే
చేయి చాచు పెర్గుచిప్పఁ జిప్పిడేసి వలపు"
25-232

**పెఱిమ:** వి. చూ: పెరిమ. ఇట శకటరేఫ ప్రయోగం విలక్షణం.
"పెఱిమకు నగితే బెదవులు కదలెను
తఱివిందుకుఁ బతి తా నేమనునో" 24-138

**పెలుచుఁదనము:** (12) (పెలుచు + తనము) వి. పెంకెతనం, అల్పత్వం.
"కలసిమెలసి వుంటే కాపురమీడేరుఁగాక
పెలుచుఁదనాన నుంటే ప్రేమపుట్టునా" 7-363
"పెలుచుఁదనాన నీవు పెడచేత మొక్కినదే
తలఁచుక రమణుఁడు తమకించునే" 25-197
"చలము మానినఁగాక సమ్మతింపించ వచ్చునా
పెలుచుఁదనపు నీతోఁ బెనఁగేఁ గాక" 9-241

**పెలుచు:** విణ. (పెలుచు) విరసం, పరుషం, అతిసులభంగా విరిగేది.
"బిగిసితే నీకే నాకు పెలుచుఁగోపము రాదా
మగువలాల నాయందు మఱి తప్పులున్నవా"
7-74

**పెలుచుగుణము:** వి. మూర్ఖలక్షణం, మూర్ఖత్వం, పెంకెతనం.

**పెలుచు చూపు:** వి. అల్పపుచూపు, అతిశయం నిండిన చూపు.

**పెలుచు మాట:** వి. విరసమైనమాట, పరుషమైన మాట.
"వెలలేని సోయగపువిభుని చల్లనిమాపు
పెలుచుమాటలనే మరపించేరు సతులు" 6-173

**పెలుసుమాటలు:** వి. విరసపుమాటలు.
"పిల్లఁగోవిరాగాలు పెలుసు నీ మాటలు
కొల్లగా మఱి పికకూఁతలు మావి" 17-127

**పెల్లి:** వి. పెరడు. చూ: పెల్లిచెట్టు.
23-318, 19-435 & 19-376

**పెల్లిచెట్టు:** వి. పెరటిచెట్టు.
"తరుణి పలుకులె తంగేడుజున్ను
బెరసేటి విన్నపము పెల్లిచెట్టు" 23-318
"పెల్లిచెట్టు మందు గాదు పెద్ద కొండలెక్కి తెచ్చే
నెల్లిచెట్టు చవిగాక నేమేల నీకు" 19-435
"పెచ్చువెరిగే వాలేరా పెల్లిచెట్టు మందుగాదు
యిచ్చకము సేయవచ్చే వీఁకనేల మాటలు"
19-376

**పెల్లిచెట్టు మందు గాదు:** సామెత; పెరటిచెట్టు మందుగా భావింపబడదు.
"పెల్లిచెట్టు మందుగాదు పెద్ద కొండలెక్కి తెచ్చే
నెల్లిచెట్టు మందు చవిగాక నేమేల నీకు" 19-436

**పెళ్ళు:** వి. (?)
"యిట్టె యీపె యిచ్చలో నెనసితే నే మాయ
బెట్టుగా నీ పెండ్లి వచ్చి పెళ్ల విడిశున్నదా"
21-246

**పెళ్ళు:** పెరడు మాం. దొడ్డి.

## పే

**పేఁడు:** స.క్రి. దారం మొ॥ వాటిని పేను.
"నారలు నావి వొలిచి నమ్మికలదాడు వేఁడి
పోరచినీ వల్లెవేసే పొట్టివాఁడవు" 3-365
"పెనచి యింద్రియములఁబేఁడిన భవము
పనివడి చింతలకే పాలైన భవము" 4-39
"పేఁడుచు మాటలఁ బెరతేనె నీపైఁ
బోఁడి మాపె బూయఁగానె" 11-383

**పేఁడుక:** పేఁడుకొని కి వ్యావహారికరూపం. కూడుకొని. 3-492
"పీఁడుగదే శేషుఁడు శ్రీ వేంకటాద్రిశేషుఁడు
పేఁడుక గరుడునితో పెన్నుద్దైన శేషుఁడు"
"వీఁడిగో నిలుచున్నాఁడు విజనగరములోన
పేఁడుకొన్న ప్రతాపానఁ బెద్ద హనుమంతుఁడు"
3-519

**పేఁడుకొను:** కూడుకొను.

**పేగుంజంధ్యములు:** పేగుజందెములు.
"కడలేని చలిగాలిఁ గలని లోపలఁ గెల్చి
వేడఁ బేగుంజంధ్యములు వేసితివో యనఁగ"
22-18

**పేనిపట్టు:** (4) ప.బం. కొన్నిచోట్ల 'పానిపట్టు' అనే రూపం కూడా కనిపిస్తుంది. 'పూనిపట్టు' అని అర్థం కావచ్చు.
"తానే సన్నలు సేసి తగవులఁబెట్టితేను
పేనిపట్టుక నీ వేల పెనఁగాడేవే" 19-186
"లోనై వుండినదాన లోఁగి రట్టు సేసేనా
పేనిపట్టి మాఁట మఱపించ నేఁటికి" 27-227

**పేయ:** వి. పెయ్య, లేగ.
"ఆవులఁబేయల నందరి యిండ్ల
వావిరిఁ గాచినవాఁడా వీఁడు" 4-289
"పేయలఁ బిలుచుకూఁత పిల్లఁగోవి బలు
సేయరాని గొల్లెతల సిగ్గుల మోతచేఁత" 5-96

**పేరటాలు:** వి. పేరటానికి వచ్చిన ముత్తైదువ, సువాసిని.
"అనయముఁ బేరఁటాండ్లారతు లెత్తఁగాను
పనివూని వరాలిచ్చీఁ బ్రహ్లాదవరదుఁడు" 28-16

**పేరడగు:** అధికమగు.
"తగిన వయసువారి తలనే వేగ నీపని
బిగువుల బింకాలు పేరడయ్యీనా" 27-336

**పేరడి:** (3) పెద్దఅడుగు, ఎక్కువ అని అర్థమని సం.ప.స.
"పేరడిగా తన్నునెట్లు పెండ్లాడెనే" 26-391
"పేరడిగా జగడాలు వెంచకుండేనా" 10-2-41
"పేరడి నీ కివి యెల్లాఁ బ్రియమైతే నౌఁగాక
మేరలు దప్పిన పని మేము సేసేమా" 27-359

**పేరడిఁబెట్టు:** (పేరడిన్ + పెట్టు) (?)
"అనుమానము లేదని ఆన నీపైఁ బెట్టఁగాను
పెనచి నీ వా మాఁట పేరడిఁబెట్టేవు" 11-423

**పేరడి కన్నీరు:** వి.అధికమైన కన్నీరు, సాంద్రమైన కన్నీరు.
"కూరిమి గలుగు సతి కోపగించుకొంటేను
పేరడి కన్నీరు నించు ప్రియునితోను" 7-256

**పేరడిగా:** క్రి.విశ. అధికంగా.
"ఆ రీతి తాము భోగించిన దెవ్వ రెరుఁగుదురు
పేరడిగాఁజుట్టాలకుఁ బెట్టినదే యెక్కుడు" 27-275

**పేరడి చుట్టరికము:** వి. సాంద్రమైన చుట్టరికము.
"సారెకుఁదఱచుగాను సరసములాడీని
పేరడి చుట్టరికము పెనచుకొంటాను" 28-127

**పేరడిన్:** (పేరు + అడి) పెద్దఅడుగు, ఎక్కువ అని అర్థం. ఆధిక్యం.
"నేరక లంపటములు నేనే కొన్ని గట్టుకొని
పేరడిఁ బరులనందుఁ బెట్టరంటాను" 3-98
"యీ రీతి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
పేరడి నింకా నెంత పెనఁగీ రతులకు" 26-236
"పేరడి నాచారము పెంచేవు గాక" 11-323
"పేరడిగా సొలగవు పెద్ద కోరికెఁ
జల్లలమ్మేరు యెలుఁగులతోడ గొల్లెతలు" 13-207

**పేరడి పెనపులు:** వి; బహు. సాంద్రమైన తగవులు.
"పేరడి నీ పెనపులు ప్రియములనె నన్ను
కూరిమి గొసరేటి వో కోనచెన్నరాయఁడా" 11-2-9

**పేరడి మహిమలు:** వి; బహు. అధికమైన మహిమలు.
"నేరుపరి వౌదువమ్మ నిజలక్ష్మి
పేరడి మహిమలను బెరసితివి" 20-385

**పేరుకుచ్చి తిట్టు:** పేర్కొని తిట్టు.
"ఊరకుంటే నన్ను నుండనియ్యవు ఇంత
పేరుకుచ్చి తిట్ట నన్నుఁ బ్రియమా నీకు" 5-243

**పేరుకుచ్చు:** ప.బం; స.క్రి. పేర్కొను. 12-3 old
"ఊరివారి యింతి నన్ను వుద్దండపుఁదుటారాలఁ
బేరుకుచ్చి సొలయుచుఁ బిసాళించేవు" 5-3

**పేరుకొను:** స.క్రి. స్తుతించు, పొగడు, పిలుచు, ఉచ్చరించు, వంచించు, తలపెట్టు, స్మరించు. అ.క్రి. ప్రసిద్ధినొందు, పేరుపెట్టు, అతిశయించు, గడ్డకట్టు.
"పేరుకొని యట్టె పిలిచీఁ గమ్మర
మేరతో నగఁదగదు మేనదానికి" 16-495

**పేరుపడు:** (పేరు + పడు) అ.క్రి. ప్రఖ్యాతికెక్కు, ప్రసిద్ధినొందు, నామం వహించు. (వ్యు.)
"జక్కవపులుఁగులు నీ చన్నులకు నోడినాను
పెక్కుదేశముల నెల్లాఁ బేరుపడెఁగా" 7-130
"నారదాది సనకసనందనాదులవలె
పేరుపడి నిన్నుఁ బాడి పెద్దలైనట్టి"

**పేరుపు:** వి. మట్టిపాత్రవిశేషం.
"తొరలఁ గాచినప్పుడు తోడంటు వెట్టినప్పుడు
పెరుగుఁబాలును నొక్క పేరుపునే గాదా" 9-222

**పేరుపెంపు:** ప.బం; వి. పేరుప్రతిష్ఠలు, నామసమృద్ధి.
"ఊరు లేని పొలిమేర పేరుపెంపు లేని బ్రతుకు
గారవంబు లేని ప్రియము కదియనేటికే" 5-55

**పేరుబలము:** వి. వివాహసమయంలో రాశిఫలాలు చూసేప్పుడు చూసే పేరుమీది బలం.
"వామనుఁడందు రతని వామనయనవు నీవు
ప్రేమపు (మీ) యిద్దరికి పేరుబలమొకటే" 7-280

**పేరువడ్డవాఁడు:** వి; ప.బం. ప్రసిద్ధి పొందినవాడు.
"స్వామికార్యమునకే సరిఁ బేరువడ్డవాఁడు
ప్రేమముతోఁ బూజగొనీఁ బెద్ద హనుమంతుఁడు"

**పేరువళి:** పేరు గలవాఁడు. ప్రకరణవశంగా పశస్తవాచకం కావచ్చు.
"పట్టిన చలముతోడఁ బైకొనీని
దిట్ట గదే పేరువళి తిరువెంగళప్పఁడు" 16-365

**పేరువాఁడు:** అ.క్రి. యుద్ధాదుల్లో శౌర్యసూచకంగా ప్రకటించు. స.క్రి. పేర్కొను, వాక్రుచ్చు. (వ్యు.)
"పేరువాడి పేరువాడి బిరుదులు మెరసేవు
చేరఁగలవా నా చేవల్లకు" 21-388

**పేరువారు:** పేర్కొను (వ్యు.) పేరు కలుగు, పేరుపెట్టి అని సంపా.
"పెంచి యీ కతలు నాకె పేరువారి వున్నవా
అంచెలను నాకు ప్రసాదించేవు గాని" 27-444

**పేరువేర:** (పేరు + వేర) ఒక్కొక్కరిని విడివిడిగా, ప్రత్యేకంగా.
"పిలువకు మిద్దరిని పేరువేర
వలచితే వలపులు వడ్డికిఁబారించుము" 27-212

**పేరెముదోలు:** ప.బం. స.క్రి. పరుగెత్తించు.
"బిరుసుగ గరుడని పేరెము దోలుచు
బెరసి నీవు గోపించినను" 1-92

**పేరెమువారు:** ప.బం; అ.క్రి. పఱుగెత్తిపోవు, పరుగులువాఱు.
"పేరెమువాఱఁగ"

**పేరెలువారు:** ప.బం; అ.క్రి. పరుగెత్తు.
"పెలుచ లంకముంగిట పేరెలువారెను తేరు
చెలఁగె దిగ్విజయపు శ్రీహరి తేరు" 2-227

**పేరెవరమోబుళేశుఁడు:** వి. పేరెవర మనే గ్రామంలో నెలకొన్న నృసింహస్వామి కావచ్చు. (ఓబుళేశుడు = అహోబలంలో నెలకొన్న స్వామి - నృసింహస్వామి)
"నిచ్చ నిచ్చఁ జేకొను నివాళి
యిచ్చఁ బేరెవరమోబుళేశ నివాళి" 22-129

**పేలకురితి చెన్నుఁడు:** వి. పేలకుర్తి గ్రామంలో వెలసిన చెన్నకేశవుడు. బేలకుర్తి, బేరకుర్తి అని కూడా వ్యవహార ముండవచ్చు అని సంపా.(f.n. 28 సం.)
"పేలకురితి చెన్నుఁడిదె పెనఁగీ నే మొక్కగాను
చేలకొంగు వట్టి నన్నుఁ జెక్కు నొక్కీనే" 28-561

**పేలరి:** (3) (పేలు + అరి) వి. వదరుబోతు.
"యీలాగుల శ్రీవేంకటేశ ఆకెఁ గూడితివి
పేలరివై జాజరాడఁ బిలచీఁ బోవయ్యా"
11-172

**పేలరితనము:** (పేలు+అరి+తనము) వి. వదరుబోతుతనం.
"వోలి పట్ట వచ్చినది వొడిపట్టవలదా
పేలరితనాన నేల పెనఁగులాడేవు" 28-184

**పేలరీఁడు:** (పేలు + అరి + ఈఁడు) వదరుబోతు. రూపాం. పేలరి.

"చాలుఁజాలు నూరకుండు సతులెల్లా నవ్వేరు
కేలు చాఁచి తిట్టేటి పేలరీఁడు గలఁడా" 23-402

## పై

**పైడంతే తూనిక**: నానుడి; పిండంతే నిప్పటి లాంటిది. బంగారమెంత ఉంటుందో దాన్ని బట్టి తూనిక ఉంటుంది అని వాచ్యార్థం. డబ్బెంత ఉంటే అంత బాగా ఖర్చు చేయు.

"అడరి శ్రీవేంకటేశుఁ డంతలోనే నన్నేలె యీ
యెడఁ బైడెంతే తూని కేమనే నీకూ"

**పైఁడికత**: (4) (?)

"ఒక్కరికిఁ జెప్పరాదు వూఁకొనరాదు
పక్కననే మనినాను పైఁడికతవంటిదే" 7-235

"ఉమ్మడినే వుండినట్లే వుండనియ్యరా
కమ్మి యేమైనఁ బైడికతవో నా పొందులు"
26-210

**పైడికాశ**: వి. బంగారు కాసె, బంగారు దట్టి.

"కట్టినది పైడికాశ కంబములోన వునికి
నెట్టుకొన్న నవ్వులు నీ లోనివే" 4-164

**పైడికి వాసనవచ్చు**: ప.బం. అదనపు శోభ కలుగు, బంగారానికి తావి అబ్బు.

"ఎదుట శ్రీవేంకటేశ యింతలో నన్నేలితివి
. . . . . . . .నఁ బైడికి వాసన వచ్చె నిదివో"
15-293

**పైడిగొండెల పచ్చడము**: వి. బంగారుఅంచుల వస్త్రం.

"కొండికపాయ మమరెఁ గోనేటిరాయ పైడి
గొండెల పచ్చడముతోఁ గోనేటిరాయ" 26-299

**పై**: వి. శరీరం, బహిర్భాగం, వెలుపల – సూ.ని.

"పంచేంద్రియములు ముదియక పై ముదిసిన
నేమి" 2-55

**పైకుడుపులు**: వి; బహు. పైతిండ్లు, చిఱుతిండ్లు.

"యీలాగుననే లోకమంతాఁ గాతువు గాక
పాలు దాగినమీఁద పైకుడుపులా" 1-280

**పైకొసరు**: ప.బం; వి.కొన్నదానిపై అదనంగా అడిగే కొసరు.

"పలుకు లేకములైనఁ బైకొసరు మరి లేదు
తెలుపు లేకములైన తెగువలే లేవు" 19-484

**పైడికొండలలో బచ్చుబేరాలు**: ప.బం; వి; బహు. అనుచితమైన కార్యం.

"భారపు పైడికొండలలో బచ్చుబేరా లమరునా
వూరకే నీ మేలు గోరకుండు టింతే కాక"
15-156

**పైడిగొండెల పచ్చడము**: బంగారపు అంచులుగల వస్త్రం.

**పైతరవు**: పైవిధం, పైదారి. (వ్యా.)

"యీతల శ్రీ వేంకటేశ యిద్దరి మేనులు దాని
పైతరవై మిమ్ముఁ గరయఁ బాడిగాదు మాకూ"
12-345

**పైపచారాలు**: వి; బహు. పైపై మెఱుఁగులు.

"సుడిసి పైపచారాలే చూచి సురతసుఖాన
పడఁతులఁబొంది పొంది పరిణామించేను" 3-37

**పైరుకాలము**: వి. శరత్కాలము.

"పడఁతి మైపులకల పైరుకాలము వచ్చె
కడుఁగోరికల మంచుఁగాలము మీరె" 29-300

**పైరులు చేయు**: ప.బం. వృద్ధిచేయు, సేద్యం చేయు అని వాచ్యార్థం.

"పంచేంద్రియములకే పైరులు సేసితిమి
అంచెలఁ బ్రాణులకిఁక నాజ్ఞ లేలయ్యా" 3-487

**పైవచ్చు నైవచ్చు**: అ.క్రి. కీడు కలుగు.

"బలువుల తోడి పొందు పైవచ్చు నైవచ్చు
చలము సాదించరాదు చాలు నోప నందుకు"
11-536

## పొ

**పొంచు**: వి. దేనినైనా ఉద్దేశించి మఱుగువడి కనిపెట్టి ఉండడం, రహస్యంగా పొంచి ఉండి వినే మాట.

"చెప్పరాని మాటలెల్లా చేరి మీ రాడుకొనఁగా
యిప్పుడే పొంచులు వినీ ని దెవ్వరోయి"
18-388

"మంతనాన నీవు నేను మాటలాడుకొనఁగాను
యింతలోఁ బొంచులు వినీ నిదివో యీకె"
18-569

"దాయగత్తైన యాఁటది తగిలి పెనఁగవచ్చు
పూయక దూలైనాఁటది పొంచులే వినును"
12-334

**పొంతకూటికుండ :** వి. సమష్టిది, ఎవరికీ చెందనిది, పొయ్యి దగ్గర ఉంచుకునే నీళ్లకడవ.
"దొంతులకడవలోనఁ దొరలి దాఁచిన పెద్ద
పొంతకూటికుండ గొంటఁబోయె నెవ్వఁడో"
15-155

**పొంతపొరుగు :** 'దగ్గర' అనే అర్థంలో జంటపదం.
"పొంతపొరుగున నుండే పొందుసతివని కాక
మంతనాన నందరితో మాటలాడ వచ్చేమా"
20-143

**పొందుకొను :** స.క్రి. పొందు. రా.సీ. వ్యవహారంలో కొన్ని ధాతువులపై ఈ 'కొను' చేరడం మామూలే.
"సరసములాడి యాడి చదువులెల్లా రేఁచితివి
పొరుగున నుండి వుండి పొందుకొంటివి"
29-401

**పొందులమాటలు :** వి; బహు. (?)
"పొందులమాటలఁ బొనఁగు ముచ్చటలు
చనవుల మీరేటి సరసపుఁజేతలు" 22-477

**పొందువాడు :** వి. పొందు కలవాడు.
"వెస మాటలాడించితే వెన్నముద్దలే రాలీని
పొనఁగ గోపికలతో పొందువాఁడవా" 12-447

**పొక్కాలు :** 'పోకాలు'కు వ్యావహారికరూపం. (?) పోవు, కోపం, దుఃఖం కలిగినప్పుడు వాడే మాట.
"చిక్కెఁగదె మీవాఁడే చేరి పెరుగుదొంగ
పొక్కాలదే మోసి బొంకు గొల్లెత" 24-165

**పొగబాణము :** వి; ప.బం. ఒకరకమగు యుద్ధసాధనం. (సూ.ని.)
"కదిసి పెటలు గుండ్లు కంఠనాళమున మరుఁ
డెదిగించఁ బొగబాణ మెడచొచ్చినట్లు" 7-405

**పొగరుఁబువ్వులు :** వి. తీక్ష్ణగంధముగల పువ్వులు.
"తగులున ఇద్దరిని తతిగొని మదనుఁడు
పొగరుఁబువ్వుల నేసి పొందుసేసినా" 26-408

**పొగరు మాఁకులు :** వి. గాటు మాకులు.
"పొగరు మాఁకులమీఁది పువ్వుల పొగరే కాదా
తెగడి పేరఁబెట్టితే తేనె లయ్యేవి" 7-84

**పొగరుముంపు :** వి. గర్వాతిశయం.
"మొగము చూచి నాకు ముందట
నిలుచుండఁగా
పొగరుముంపున నిన్నుఁ బొమ్మందునా"
11-590

**పొగరుమూఁపుదనము :** వి. పొగరుబోతుతనం.
"వెగటైన విషయాల వేడుకపడకు మవి
జిగరుగండెలు సుమ్మీ చిత్తమా
పొగరుమూఁపుదనాలఁ బొరలకు మవి యెల్ల
తగులు విరిపందేల దారి పంటివి" 10-1-12

**పొట్టఁబొరుగు :** (27) (పొరుగు + పొరుగు) వి. పట్టపగలు వంటిది, సమీపం, మిక్కిలి పక్కన, ఇట అరసున్న చింత్యం. అంతస్సారములు, గింజ పొట్టపట్టింది అనుటలో ఉన్న పొట్టలాంటిదే ఇది. అతిసమీపస్థానం అని సూ.ని.
"పొట్టఁబొరుగున వలపులు తీపులఁబడె"
26-385

"పొట్టఁబొరుగు లివె పుణ్యపాపములు
నట్టనడుమనె నా బదుకు" 3-578
"పొట్టఁబొరుగుననుండి పొంచి నీకు మోము
చూపె
గుట్టుతోఁదాఁబండే ఇంటి గురుతు చెప్పె"
22-162

**పొట్టఁబొరుగు చుట్టము :** మిక్కిలి దగ్గరి చుట్టము.
"పొట్టఁబొరుగుచుట్టాలు భోజన సహాయులె
నెట్టన నీవైతే మాకు నిర్వాహకుఁడవు" 2-306

**పొట్టఁబొరుగు నీటు :** వి. (?)

**పొట్టఁబొరుగు సతులు :** వి. ఇరుగు పొరుగున నున్న సతులు, ఇట అరసున్న విలక్షణం.

"పొట్టఁబొరుగు సతులు పొంచి సేవసేయఁగా
పట్టపుదేవులమీద బాఁతి వున్నదా" 18-514

**పొట్టపొంకము**: ప.బం; వి. (పొంకము + పొంకము) మిక్కిలి కాంతి, మిక్కిలి కుదిరిక.

"బుద్ధి మానిన చింత పోని యూరికిఁదెరువు
పొద్దుపోవని వలపు పొట్టపొంకంబు" 1-96

**పొట్టిపొట్టి యడుగుల బోయనాయఁడు**: వి. వామనావతారమూర్తి.

"పొట్టి పొట్టి యడుగుల బోయనాయఁడు
యెొందు
బుట్టుపగ సాధించే బోయనాయఁడు" 1-460

**పొట్టుపొరలు**: (పొరలు + పొరలు) ప.బం; అ.క్రి. మిక్కిలి పొరలటం, మిక్కిలి దొర్లటం.

"నీఁగని నా మరులిదె నీవు చుట్టుకొననేల
ఆఁగి నేనె పొట్టుపొరలయ్యేఁగాని" 19-152

**పొడపుఁజందురుఁడు**: (పొడుపు) వి.ఉదయించే చంద్రుడు.

"పొడపుఁజందురుఁడు నొప్పులుసేయ
విరహులను
పెడమొకము చేసి నొప్పించేవు" 6-111

**పొడమని చందము**: వి. జన్మరాహిత్యస్థితి.

"పరపీడ లొసఁగు భవమునకంటే
ధరఁ బొడమనిచందము సుఖము" 4-455

**పొడలమొకము**: వి. దుప్పి. (పద; శ.ర.)

"పొడలమొకము నేసి పొడవాటి రాకాసి
గొడవలఁదీసె నట కోరి నీ మగఁడు" 20-230

**పొడలువెట్టు**: (3) అ.క్రి. ప.బం. ఆయాసపడు (పద.), దొర్లు, బోరగిలపడు. (పాకులాడు, పొరలాడు అని తోచుచున్నది వే.ఆ.మూ.)

"పొత్తులలోపల నేను పొడల పెట్టేనాఁడు
యిత్తల జవ్వనమద మెందుండెనో" 15-49

"పొడలు వెట్టెడి పొగులు పొందువాసిన దిగులు
పడఁతికి నిదియెల్ల బరికించ దిగులు" 4-20

**పొడవగు పదవులు**: వి; బహు. పెద్ద పదవులు, మేలైన పదవులు.

"బడిబడి లక్ష్మీపతికి దాసులై
పొడవగు పదవులఁ బొందరొ ప్రజలు" 1-101

**పొడవాటి**: విశ. పొడవైన, పొడుగాటి.

"పొడవాటి కాళ్లు" 22-98

"పొడల మొకము నేసి పొడవాటి రాకాసి
గొడవలఁ దీసెనట కోరి నీ మగఁడు" 20-230

**పొడవు**: వి. ఆధిక్యం, గొప్పదనం.

"ఇందరి నేలిన యీ వేంకటపతి
పొందగు మహిమల పొడవే చాలు" 1-98

**పొడవుకు పొడవైన**: విశ. మిక్కిలి గొప్పదైన.

"పొడవుకుఁ బొడవైన పురుషోత్తముఁడు నేడు
అడరి తొట్టెల బాలుఁడాయనమ్మా" 3-17

**పొడవుకెక్కు**: ప.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు, పేరుకెక్కు. (వ్యు.)

"పూని దేవేంద్రాదులు పొడవుకెక్కినవారు
శ్రీనాథ మిమ్ము నే పూజించినవారు హరి"
1-411

**పొడవులు చూపు**: ప.బం; అ.క్రి. కన్పడు, తోచు, ప్రత్యక్షమగు.

"నుడిగితే నెంతయినాఁ బొడవులు సూపేవు"
18-102

**పొడవెక్కించు**: ప.బం; స.క్రి. పైకి ఎత్తిపెట్టు, అభివృద్ధి లోనికి తెచ్చు, ఎక్కువచేయు.

"పుట్టించఁ బెంచగ పొడవెక్కించ దేహుల
గట్టిగా మాటలాడించఁ గదలించ" 2-319

**పొడిఁబడు**: (పొడిన్ + పడు) అ.క్రి. పరిష్కర్తలు దీనికి చిన్నతనం పొందు, చులకనగు అనే అర్థాలను సూచించినారు. అట్లే ఈ పదం పొడివడి యుండునేమో అని సందేహించినారు. శుష్కించు, నిస్సారమగు (వ్యు.)

"మతిలోఁ బొడిఁబడేవు మాటిమాటికి" 24-69

"కొమ్మ నీతో నెఱఁగక కోపగించుకొంటి నంటా
వుమ్మడిఁ బొడిఁబడుచు నుసురనీని" 23-221

**పొడుపుకథ**: వి. గూఢభావాలున్న చిక్కుప్రశ్న.

"మొగి నొక్క తామరలోనె మోవిపండు పండెనట
జిగిఁదేనె వావాతఁ జిందెనట" 24-4

**పొడుపుగత:** వి. చూ: పొడుపుకథ. 24-8

**పొడుపుడుఁగత:** (2) వి. పొడుపుకథ, గూఢమైన భావం కల సమస్య.

"కానీ లేరా పొడుపుడుఁగతలు వొడువు మని
ఆనవెట్టి నన్నేల అడ్డగించేవు" 10-2-88 & 24-4

**పొడుపుడుకత:** వి. పొడుపుకథ.

**పొత్తర:** వి. ఆకులు లోనగువాని కట్ట. (శ.ర.) పొట్లం, సంచి, పొతక. (పితృకర్మల్లో విస్తళ్లలో ఉంచి బ్రాహ్మణులకిచ్చే ఆమద్రవ్యం.)

"పొదల పువ్వులు గోసి పొత్తర గట్టుకుండఁగా
వెదఁజల్లుదురా నాపై వేసాలవాఁడా" 7-167

**పొత్తల:** దగ్గర, స్నేహం, అనుకూల్యం.

"పొత్తల నాపె వుండఁగా బువ్వానకు రమ్మనేవు
కొత్తలుగా నిదియేమి గొల్లదోమటా" 14-203

**పొత్తులకాఁపు:** ప.బం; వి. ఉమ్మడి రక్షకుడు. (పద.)

"ఇంతట విడిచేవా నన్నింద్రియాలఁ గట్టివేసి
పొంతఁజూచే విటు నాకుఁ బొత్తుల కాఁపవుగా" 3-458

**పొత్తులకూటమి:** వి. వేశ్యల కూటమి.

"పొత్తులకూటమి నీకే పుణ్యము గట్టుదుగాక
బత్తి గొట్టాన బెట్టేటి పంతము నాకేలా" 26-179

**పొత్తుల కూడు:** వి. పంక్తిభోజనం, సమష్టి భోజనం.

"ఉట్టిపై చెరలాట మూరఁ బొత్తుల కూడు
పట్టుచాలని కొమ్మ బహునాయకము" 1-71

**పొత్తుల కూరిమి:** వి. వేశ్యలస్నేహం.

"చిత్తము వచ్చినట్టెల్లాఁ జేయుమ
పొత్తుల కూరిమితోడ బోదించవలె" 18-562

**పొత్తులచుట్టాలు:** వి; బహు. ఉమ్మడి బంధువులు.

"పొత్తులచుట్టాలు మీరు భోగములు మాకు
నబ్బె
కొత్తలాయ నవ్వులు కొంటెతయ్యీనా" 26-86

**పొత్తుల బోజనపాల:** వి. సమష్టిగా భోజనం చేసే శాల.

"పొత్తుల బోజనపాల పొలంతి నీ వదనము
హత్తిన కొలువు కూటాలాయఁ దొడలు" 18-58

**పొత్తులమగఁడు:** (5) వి. ఉపపతి, జారుడు.

"తగిలిన నాసేవ తలఁచుకొ మ్మనఁ గదే
మగఁటిమితో పొత్తులమగఁడు కాను" 23-458

**పొత్తులమగువ:** వి. జారిణి, కులట, వ్యభిచారిణి.

"పొత్తులమగువలకుఁ బోవునా యింక
యిత్తలఁగూడుండుదము యీడ కిట్టే రావే" 17-249

**పొత్తులమాటలు:** వి. ఇద్దరికీ నచ్చే మాటలు, అనుకూల్యపు మాటలు, స్నేహపు మాటలు.

"హత్తి నేము తగవు ని న్నడుగఁగ వచ్చితేను
పొత్తుల మాటలాడి పొదివేవు" 26-436

**పొత్తులమొగడు:** వి. ఉపపతి, జారుడు. చూ: పొత్తులమగఁడు.

"హత్తి నీకె దక్కెనటె ఆతఁడు నేడు
పొత్తుల మొగఁడాతఁడు పొలఁతులకు" 22-410

**పొత్తులయెంగిలి:** వి. మరొకరితో పాటు సమానంగా అనుభవించేది.

"యిత్తల నీ కూడిగాలు యెన్నియైనఁ జేసేఁ గాని
పొత్తుల యెంగిలితోడి బోగము సయించదు" 11-556

**పొత్తులల్లుఁడు:** (పొత్తుల + అల్లుడు) వి. వేశ్యాలంపటుడు, విటుడు, పెక్కుమందికి అల్లుడైనవాడు.

"అత్తనంటాఁ బిలిచేవు అక్కడనిక్కడ నీకు
అత్త లెవ్వరోయి వూరఁబొత్తులల్లుఁడా" 5-323

**పొత్తులవిభుఁడు:** వి; ప.బం. ఉపపతి.

"బత్తి నీకెక్కడ నని భావించి నమ్మఁగవచ్చు
పొత్తుల విభుఁడవై పొదిగేవు నీవు" 26-372

**పొత్తులసుఖము:** వి. కామసుఖం.

"బత్తిసేయుట యేమి పాసిపోవుట యేమి

పొత్తుల సుఖంబులకు పొరలుటలు గాక" 1-328

**పొదచాటుమృగము**: ప.బం; వి. అదృశ్యమైనట్టిది, వెదకదగింది.

"ఎదురుచూచి చూచి యెలయించి యెలయించి
పొదచాటుమృగమై పోయెఁ గాలము" 1-48

**పొదటూరి చెన్నరాయఁడు**: వి. కడప జిల్లాకు పశ్చిమంగా పెన్నాతీరాన ఉన్న మండల కేంద్రమైన పొద్దుటూరులో వెలసిన చెన్నకేశవుడు. పొదటూరుకి ప్రొద్దుటూరు, పొదలపల్లె, బంగారు ప్రొద్దుటూరు, ప్రఖ్యాతపురం అనేవి నామాంతరాలట. అన్నమయ్య ఈ చెన్నకేశవునిపై ఒక కీర్తన చెప్పినాడు.

"గారవించి యిందునందు కందువలు మెరసిరి
వూరటగా నీకుఁ బొదటూరి చెన్నరాయా"
7-537

**పొదరులాడు**: అ.క్రి. ప్రసిద్ధనిఘంటువుల్లో ఎందులోనూ ఈ పదం కానరాదు. వికటోక్తులు పలుకు(?)

"పొదిగి మమ్ము రేచక పోపో నీవు
పొదరులాడక నీవు పోపో నీవు" 11-291

**పొదలు**: విణ. 1. స్థూలమగు, పొంగు 2. అతిశయించు 3.పెరుగు 4. ఉద్రేకించు 5. పుట్టు 6. వ్యాపించు 7. అగు 8.ఒప్పు 9. నీరసించు 10. క్రీడించు 11. తోచు 12.విఱ్ఱవీగు 13. ఫలించు 14. ప్రకాశించు.

"పొదలు గుబ్బలు వలపుల బోనపు దొంతులు
కదలు కనుచూపులు క్రపవిడేలు" 18-50

**పొదిగొను**: (3) స.క్రి. 1. కప్పు 2. కమ్ము, ఆవరించు 3.ఖచితం చేయు, చెక్కుఁగుంపుగూడు 4. పరివేష్టించు (శ.ర.) అ.క్రి. కలియు, సైబడు.

"గొదిగొన నీ వాపె బుజముపైఁ జేయివేసి
యెదుట నా మోము చూచే వి దేమయ్యా"
12-480

"మొదలనుండి ప్రపంచమును తథ్యమగుటకు
పొదిగొన్న యాగములే భువిలో సాక్షి" 3-287

**పొదుగు**: స.క్రి. కమ్ము.

"ఇదివో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పొదిగాకెఁ జెప్పవయ్యా బొంక నీక నేఁటికి"
27-38

**పొద్దు**: వి. 1. సూర్యుడు 2. దినం (దినం - సమయం) 3.సమయం.

"పొద్దు పొడుచునదే పొద్దుగుంకినదె
తిద్దిన జగముల దినదినము" 4-412

"కదిసి యే పొద్దు వద్ద గాచుకుండనా" 7-294

ఉదయం:

"పొద్దున నెవ్వరింటికో పోవలసి ఇంటివారి
నిద్దురలు వొమ్మనేవు నెమ్మది నీవు" 25-1

**పొద్దుకుఁబొద్దు**: వి. రోజురోజుకు, ప్రతిరోజు.

"వెలయఁగ సాలీఁడు వేసిన కండెయై
పొలసీఁగాలము పొద్దుకుఁ బొద్దు" 15-63

**పొద్దుకొక కొత్తలుగా**: క్రి.విణ. నిత్యనూతనంగా, ఎప్పటికప్పుడూ కొత్తగా

"ఇద్దరిఁ గూరిచితిమి మేము చెలికత్తెలము
పొద్దుకొక కొత్తలుగా భోగించరయ్యా" 22-539

**పొద్దుగాని పొద్దు**: ప.బం; వి. సమయం కాని సమయం.

"అద్దో నాతో నీవు అలిగి యందు చేరిన
పొద్దుగాని పొద్దనక పొందులు సేసేరా" 7-30

**పొద్దుగూఁకు**: అ.క్రి; ప.బం. సాయంకాలమగు, సూర్యుడస్తమించు.

"అలుకలఁ బొద్దుగూఁకె ఆసలనే తెల్లవారె"
16-468

**పొద్దుగూఁకు పొడపులు**: వి; బహు. సాయంకాలంలో ఎక్కువగా ఉండే నీడపొడవులు.

"ముద్దు చూపె దవ్వులనే మొఱఁగులు చల్లితేనే
పొద్దుగూఁకు పొడపు లిప్పుడే మఱచితివి"
19-482

**పొద్దుగూకుఁ దెల్లవారు**: వి. రాత్రింబగళ్లు.

"పొద్దుగూకు దెల్లవారు పురుషుని చిత్తమింతె
వొద్దివారే యిట్టైతే వోరువనేఁ గలనా" 16-261

**పొద్దుపొడ(డు)పు:** వి. సూర్యోదయం.
"పొద్దుపొడపు గోళ్లపొలఁతి నన్నుఁగూడితి
విద్దరికి శ్రీవేంకటేశ వోపేవా" 19-504

**పొద్దుపొడవక ఎండకాయు:** ప.బం; అ.క్రి. జరుగనిది జరగడమని భావం.
"వెదకుతానే నిన్ను వెలఁది కాఁకలబొంది
యెదుటఁ బొద్దువొడవ కెండ గాసెను" 17-402

**పొద్దులు వేళలు:** వి; బహు. రోజులు, సమయాలు.
"పెద్దగా నే వొజ్జలనై పెండ్లి మీకుఁ జేసేవా
పొద్దులు వేళలు నన్నే పూఁచి యడిగేవు"
14-600

**పొద్దువొడుచు:** ప.బం; అ.క్రి. సూర్యోదయమగు.
"పొలిఁతి నీవు చూచితే పొద్దువొడుచు నప్పుడే
పొలయలుకల నెండ పొడచూపును" 13-427

**పొద్దు(పొ)వొద్దు:** (7) వి. ప్రతినిత్యం.
"వద్దువద్దు తడవితే కాదులే సుమ్మీ నీవు
పొద్దువొద్దు వారి వీరి పోడులే సుమ్మీ" 21-433

**పొద్దువోక:** వి; ప.బం. 1. కాలక్షేపం 2. ఆలస్యం.
"పొద్దువోక కిటు పొలసితివి
అద్దము నీడల నాగేవా" 20-156

**పొద్దువోత:** (పొద్దు + పోవు + త) వి. పొద్దుపోవడం, కాలక్షేపం. (పోత= పోవుట, భావార్థంలో 'త'ప్రత్యయం; ఇట్టి రూపాలు అన్నమయ్య సంకీర్తనల్లో ఎన్నో ఉన్నాయి.)
"యివ్వల శ్రీవేంకటేశ యిట్టే నన్నుగూడితివి
పువ్వుల పులకలతో పొద్దువోత గాక" 17-358

**పొద్దువోనివారు:** వి; ప.బం. కాలక్షేపం జరుగనివారు.
"పొద్దువోనివారు గాకపోరే మీరు
యిద్దరము గూడినపు డీడకు రాఁగదరే" 14-250

**పొద్దువోయి వచ్చు:** అ.క్రి. ఆలస్యంగా వచ్చు.
"పొద్దువోయి వచ్చినాను పొదిగి చేకొందుఁగాక"
17-67

**పొద్దువోవు:** (9) (పొద్దు + పోవు) అ.క్రి. కాలక్షేపమగు, సమయం గడచు.
"పొంతనుండి నవ్వేవు పొద్దువోదా నీకు" 21-81
"పోపో యింకా నేటికి పొద్దు వోదా?
పైపై నీకు మొక్కేము పదివేలు వచ్చెను"
16-201
"కొలువు విరిసె నిదె గోవిందుఁడు పొద్దువోయ
వెలుపట నుక్కళాలు వేగుదాఁకా నుండరో"
3-525

**పొద్దుసేయు:** ప.బం; అ.క్రి. కాలక్షేపం చేయు, సమయం గడుపు.
"వరుసకు వచ్చి యాపె వాకిట నిలుచుండఁగా
పొరుగువారితో నెంత పొద్దుసేసేవు" 28-357

**పొద్దెక్కు:** (పొద్దు + ఎక్కు) ప.బం; అ.క్రి. వేళ మీరు, సూర్యుడు పైకివచ్చు, ఎండెక్కు.
"వేగినంతా నీతోడ వెలఁది మాటలాడి
భోగించీ నిద్దుర అదె పొద్దెక్కినంతా" 7-37

**పొనుగు:** (8) అ.క్రి. కుంగిపోవు, క్షీణించు, శూన్యమగు, పాడుబడు, కష్టపడు, బాధపడు, కాంతివిహీనమగు, వికలమగు, అస్వస్థమగు (వ్యు.) ఇవి పొనుగుడుపడు కు అర్థాలు.
"పొనిఁగి చంద్రమతికిఁ బూవుదండాయ" 2-85
"చెనకక నీవుంటె చెలి పూవుల వేసునా
పొనిగి మాతో లేదని బొంకేవు గాక" 10-2-35
"పొనిఁగి చెలులఁగంటే పురుషుల చూపులెల్లా
ననిశము నందుమీఁద నంటఁ బారకుండున"

**పొనుగు:** పూనిక వహించు.
"పొనిగితే పాపమేది పుణ్యమేది కర్మమందు"
2-19

**పొయిఁబాలవంటిది:** ప.బం; వి. ఉవ్వెత్తుగా పొంగి వెంటనే చల్లారే స్వభావం కలది. పొయ్యిమీద పెట్టిన పాలు పొంగుతుంటాయి అనే దానినుండి వచ్చిన పలుకుబడి.
"పొయిఁబాలవంటిది పూఁచిన తన మోహమెల్లా
నయముల నెందాఁకా నానఁబెట్టవచ్చునే"
21-323

**పొరఁటు**: వి. భక్ష్యవిశేషం.
"సుడిగొను నప్పాలు సుకినప్పాలును
పాడిబెల్లముతోఁ బొరటులును" 6-4

**పొరచి**: విణ. చేబదులుగా అడిగి తెచ్చుకొన్న ధనాదికం.
"పొత్తులమగఁడవట పొరచి కాఁపురమట
యిత్తల నాపై భక్తి యింకా నీకుఁ గలదా" 9-166

**పొరపొచ్చము**: (4) వ.బం; వి. 1. కపటం 2. దోషం 3.అవమానం 4. భేదం. విణ. కుత్సిత కల్మషాదులున్న. రూపాం. పొరపొచ్చెము.
"కొల్లగా శ్రీవేంకటేశ కొసరుచు నింతెకాక
పొల్లు లేని నీ గుణాల పొరపొచ్చమున్నదా"
11-106

**పొరపొచ్చెము**: చూ: పొరపొచ్చము.
"కాఁకలు రేఁగకుండఁగఁ గానుక లిచ్చితిఁగాక
యేఁకట నీ పొరపొచ్చె లెన్ని లేవు" 11-59

**పొరయు**: స.క్రి. అనుభవించు. (అ.క్రి. కలుగు, జనించు)
"కరఁగించి కరఁగించి కౌఁగిట నిన్నుఁ గూడఁగా
పొరయించవలదా పొందుల నేడు" 18-150

**పొరి**: అధికం, ఆధిక్యం, దృఢంగా, క్రమంగా.
"పొరి నెరుకే జ్ఞానము పొంచి మరపే సమాధి
సొరిది నేఁడింతకంటే సుఖమున్నదా" 4-246

**పొరుగాపె**: (పొరుగు + ఆపె) వి. పొరుగింటి స్త్రీ.
"కలికిఁ బొరుగాపెనుఁ గని నా మోము చూచేవు
వలచి తెచ్చుకోఁగాను వద్దనేనా"
26-570 &2-291

**పొరుగాలు**: (పొరుగు + ఆలు) వి. పొరుగింటి స్త్రీ, పొరుగాపె.

**పొరుగింటి పోరచి**: పొరుగింటి పడచు (వ్యు.)

**పొరుగిరుగు(ల)వారు**: (3) వి; బహు. ఇరుగుపొరుగుల వారు. 'పొరిగిరుగువారు' అని హంస. ప్రయోగం (5-114)
"పొరుగిరుగులవారి పొందులు మరిగెనంటా
పురిగొన నిమ్మపంటఁ బూచి యేల వేసేవే"
28-416

**పొరుగిరుగులు**: (3) వి; బహు. ఇరుగుపొరుగు వారు.
"పొంచి లోనఁబెట్టుకొంటే పొరుగిరుగుల నింద"
11-258
"బొంకులను నోపఁగాని పొరుగిరుగుల మెచ్చ
సంకిలేక నీ యిచ్చల సాదించరా" 23-409

**పొరుగిరుగువారు**: (2) ఇరుగుపొరుగువారు.
"పొరుగిరుగువారు నీ బూటకాన కోపుదు
గొరబుల నీ వనిత కొత్తపెండ్లికూఁతురు"
18-373

**పొరుగుపొంతలు**: (2) వ.బం; వి; బహు. చుట్టుపక్కలు.
"పొరుగుపొంతలనుండి బుద్ధులు చెప్పీనదె
గరిమల మించీఁ గలికితనమునను" 21-54

**పొరుగు పొరచి**: పొరుగింటి పడుచు. (వ్యు.)
"సరి వెనఁగేమా నీతో సాములు సేయఁగ నేము
పొరుగుపొరచా నిన్ను బూమెలు సేయ"
21-201

**పొరుగు పోరచి**: (3) వి. పొరుగింటి పడచు. (వ్యు.)
"బుద్దులెఱుఁగుదునంటా పొరుగుపోరచి
యంటా
ఉద్దండానఁ జన్నులంటీనో యక్కరో వీఁడు"
7-96
"కరఁగించేవు మనసు కదలఁదనిసి వచ్చి
పొరుగు పోరచులైతే పొందుకోపమయ్యా"
20-503
"బుద్ధు లెరుగుదునంటా పొరుగు పోరచి
యంటా
ఉద్దండానఁ జన్నులంటేనో యక్కరో వీఁడు"
7-96

**పొరుగులు**: వి; బహు. పక్కభాగాలు.
"బుద్ధులు చెప్పీఁ బొరుగులు మెట్టి

గద్దులే తనకుఁ గలిగినవే" 16-215

**పొరుగువారిరుగువారు:** ఇరుగు పొరుగువారు, చుట్టుపక్క యిండ్లవారు.

"పొంచి శ్రీవేంకటేశ్వర పొరుగువారిరుగువా

రెంచ నీకు మంచముపై నిందరు సరే కా"

14-142

**పొరులు:** వి; బహు. పొరపొచ్చాలు.

"పుచ్చరో మీ మదిలోని పొరులెల్లాను"

**పొరెవొడుచు:** (పొరె + పొడుచు) అ.క్రి. అతిశయించు.

"పావనమతిఁ బొరెవొడిచి పరమానందము

బొందుచు శ్రీవేంకటపతి మనమునఁ జింతించీ

నరమృగము" 1-298

**పొఱపొచ్చము:** చూ: పొరపొచ్చము.

**పొలగూడు:** (పొల + కూడు) వి. మాంసాహారం.

"దొడ్డమేక పొలగూడు దోమటి దొడికినాఁడు

గడ్డువయసగు బిడ్డ గన్నవాఁడు" 4-43

"దేవరొజ్జ లోకవంక దిక్కులతోఁ బొలగూడు

దీవెనతో నారగించి తీపు మరఁగి" 2-70

**పొలగూడు:** వి. మాంసపుతిండి.

"దేవరొజ్జ లోకవంక దిక్కులలోఁ బొలగూడు

దీవెనతో నారగించి తీపు మరిఁగి" 2-70

**పొలపవేడుక:** వి. (?)

"తలపోసి చూడరాదా తనివి మనసులో

పొలపవేడుకలెల్లాఁ బొదపొనా నీకు" 14-162

**పొలమురాజు:** వి. వరాహం. (పొలానికి రాజు)

"పొలమురాజవు నీవు పురుషోత్తమా నీ

పొలఁకువదే కంబమునఁ బురుషోత్తమా" 2-283

"పొలమురాజై తిరిగే బోయనాయఁడు

వెలయ మోటున నుండే వేఁట బోయనాయఁడు"

1-460

**పొలమేర:** వి. 'పొలిమెర'కు రూపాం. ఎల్ల, సీమ, బలిని తీసుకొని తిరుగవలసిన గ్రామపు ఎల్ల, పొలాల మేర, కూతవేటుదూరం. (వ్యు.)

"పుట్టుచు సాదురేఁగితే పొలమేర నిలువఁడు

నెట్టన ననేటిమాట నిజమాయ నేఁడు" 14-305

**పొలమోర:** వి. పొలిమేర కావచ్చు.

"యెండఁదాఁకితివి కడు నిచ్చల రచ్చలుసేసి

కొండచరిఁ బొలమోరఁగూరుచుంటివో" 6-41

**పొలయలుక:** (4) వి. ప్రణయకలహం.

"యెండమావుల నీరు యేకతపు పొలయలుక

వండఁగ వండఁగ నట్లు వలపులెల్ల" 7-231

**పొలయాట:** (2) వి. ప్రణయకేళి.

"చిందులపాటల శిరి పొలయాటల

అందెలమోఁతల నాడెనదే" 5-24

**పొలయు:** అ.క్రి. 1.సంచరించు 2. వ్యాపించు 3.సమీపించు 4. ప్రవేశించు 5. అతిశయించు 6. ప్రకాశించు, కనిపించు, తొలగు.

"పొలసి మీ కృపాంబుధి చేరితి మిదె

తెలిసి నా దాహము తీర్చవే" 3-19

**పొలవోవు:** అ.క్రి. 1. నశించు, చచ్చు 2. వ్యర్థమగు 3.భంగమగు 4. ఉడుగు.

"పాపపుపసురము బందెలు మేయఁగ

పోపుల పుణ్యము పొలివోయ" 3-19

**పొలసిపోవు:** అ.క్రి. సంచరించు, తిరుగు.

**పొలసు:** వి. 1. మాంసం 2. చేపమీదిపొట్టు, చేపకంపు.

"పొలసు పైఁబారెనట బురుద మేనంటెనట

యిల మన్నుమోఁచెనట యీ దేవుఁడు"

19-335

**పొలసుమేనివాఁడు:** వి. చేపశరీరం కలవాడు, మత్స్యావతారుడైన విష్ణువు.

"పొలసుమేనివాఁడు బోరవీఁపువాఁడు

సెలసుమోరవాఁడు సిన్నెకా" 5-182

**పొలసులాడు:** (పొలసులు + ఆడు) వి. మత్స్యావతారుడైన విష్ణువు. (పొలసులు = చేపమీది పొట్లు. అవికలది = చేప)

"పొలసులాడవు నీవు పురుషోత్తమా

బులిసి లోఁగఁగనే పురుషోత్తమా" 2-283

'ముద్రిత ప్రతిలో పొలసులాడకు' అని ఉంది.

తరువాతి పాదాల్లోని 'పొలము రాజవు' అనే పదం వల్ల ఇది పొలసులాడవు ఐ ఉంటుందని ఊహింపబడింది.

**పొలసులాడు :** అ.క్రి. 1. సంచరించు, తిరుగు 2. మోసపు మాటలు పలుకు 3. కుటిలత చూపు. (పొలసు = కుటిలత)

"చలపట్టి యప్పటిని సలిగెలు నెరపఁగా

పొలసులాడవచ్చునా పొరుగువారికి" 23-1

**పొలిఁతి :** (13) వి. 'పొలఁతి'కి వ్యావహారికరూపం, స్త్రీ.

"పొలిఁతి నవ్వితే నీవు బొమ్మల జంకించేవు

మలసి యేమైనా నాపె మర్మమెత్తె నో" 14-498

**పొలియు :** అ.క్రి. మరణించు.

"పొలిసిన ధ్రువునకు పున్నతలోక మిచ్చె

అల బ్రహ్మలోకమున కది మీఁదెఱఁగరా" 2-405

**పొలివారు :** ప.బం; వి. తూర్పెత్తు.

"వెలిధాన్యంబులు విషయపురాసులు

పొలివారేటి వూరుపుగములు" 1-387

**పొలిపోవు :** ప.బం; అ.క్రి. 1. క్షీణించు 2. వ్యర్థమగు 3. చెడు 4. భయపడు.

"పాపపు పసురము బందెలు మేయఁగ

పోపులపుణ్యము పొలివోయ" 3-19

**పొలిసిపోవు :** ప.బం; అ.క్రి. ఉడుగు, శమించు.

"అంది నిన్ను నొకమాటు హరియని నుడిగితే

పొందిన పాతకమెల్లాఁ బొలిసిపోయ" 2-51

**పొలుగు :** అ.క్రి. ఇది 'పొలుచు' కావచ్చు, కనబడు, గోచరించు.

"పెంచఁ బెంచ నెంతైనాఁ బెరుగుచు నిడువలపు

వంచించి పొలుగనీదు వలపు" 28-408

**పొలుపు :** వి. 1. శోభ 2. ఉల్లాసం 3. రూపు 4. స్థైర్యం, ప్రతాపం 5. వృద్ధి 6. సువాసన 7. పట్టు, విషయం 8. జాడ 9. పదినిమిషాల ఎండవేడిమి. విణ. 1. అధికం 2. ఇరపైనది 3. నియతం, న్యాయం.

"పొలుపుగాఁ బెండ్లాడి పొంతనాలు చూడనేల

చెలరేఁగి తెరదీసి సిగ్గు మరేల" 16-470

**పొలుపు దాంట్ల పెద్దభూతము :** వి. గుఱ్ఱాన్ని ఎక్కి మిక్కిలి వేగంగా దాటిపోతూ శత్రువులను చెండాడే కల్క్యవతారం.

"పొలుపుదాంట్ల పెద్ద భూతము" 1-109

**పొల్ల :** వి. బొత్తిగా గింజపట్టని ధాన్యం, పొల్లు. విణ. వ్యర్థం, తోపుడైనది.

"బాసదవ్వి నీవలె పదరనే నోపఁగాక

వీసమంత పొల్ల గల్లా విడుతువా నీవు" 14-245

**పొల్లకట్టు :** (4) ప.బం; వి. తూర్పారబోసేప్పుడు మేలు రాశి పక్కన పడే తాలుగింజలు.

"వుల్లములో నెంచనెంచ నుద్యోగము తీపెక్కు

పొల్లకట్టు దంచదంచఁ బోగులైనట్టు" 4-80

"మొల్లమి గాలియొకటె ముంచి తూరుపెత్తు చోట

పొల్లకట్టు కడఁబడె పోగువడె గట్టివెల్లా"

4-26 & 1-398

**పొల్లకట్టు దంచి దంచి పోగుసేసుకొను :** ప.బం; అ.క్రి. నిష్ప్రయోజనమైన పనిని చేయు.

**పొల్లసేయు :** ప.బం; స.క్రి. 1. అలక్ష్యంచేయు 2.వ్యర్థంచేయు 3. పొల్లుచేయు 4. నశింపజేయు.

"పరసతుల మానములు పొల్లసేసిన చేయి

తురగంబు బరపేటి దొడ్డచేయి" 1-334

**పొల్లువోవు :** ప.బం; అ.క్రి. అసత్యమగు.

"కెల్లురేఁగె దేహమందే కమ్ముల చుట్టరికాలు

పొల్లువో దెన్నఁడు భూమి పుట్టఁగాఁ బుట్టినది"

2-490

**పొస్తకము :** (3) వి. పుస్తకమునకు వికృతిరూపం.

"వా(వ్రా)సుకో పొస్తకాన నివ్వల

మఱవకుండాను

యే సుద్దులకైనాను యెచ్చరిక వలెను" 18-386

## పో

**పోఁక :** వి. పోకముడి.

"వలపులు చల్లేవు వావులు గలసెనా

లలిఁబోఁకముడిచిరా లలనలెల్లా" 27-38

**పోఁకందుకొను :** అ.క్రి. ఆహ్వానమందుకొను .
"మాటులేని మందు నూరీ మగఁడు నవ్వులనే
చాటుకుఁ బోకందుకొని సమ్మతించవే" 7-103

**పోఁకకుఁ బుట్టెడగు :** వ.బం; అ.క్రి. ధాన్యం అతి చౌకగా లభించు, సమృద్ధమగు. ఒక పోకకు పుట్టెడు ధాన్యం లభిస్తుంది అనడం. ఇది సుభిక్షానికి సూచకం.
"పొలఁతికి నీతో పొందు పోకకుఁ బుట్టెడాయ"
23-66
"ధారణ పోఁకకుఁబుట్టెఁడయ్యె" అని జైమి. 69
"అమ్మరో పోఁకకుఁబట్టెడాయను సిగ్గులు నేఁడు
యెమ్మెల సతుల భాగ్యాలేమి చెప్పేదయ్యా"
13-68

**పోఁకముడి :** వి. చీర చెంగు తొలిచుట్టులో వేసుకునే ముడి. రూపాం. పోంకముడి .
"చెనకుచు నీ వంతలో చేతులు చాచఁగానూ
వనిత పోఁకముడి వదలఁగఁ జొచ్చెను" 13-228

**పోఁకవెట్టు :** వ.బం; అ.క్రి. నిశ్చయతాంబూలం పెట్టు, (వ్య.) బహుమానమిచ్చు.
"వారము వజ్జమనక వాకిట నన్ను నాఁగేవు
పోరచి మా వారు నీకుఁ బోఁకవెట్టిరా" 10-2-38
"పెండిలాడేనని పోఁకవెట్టి నాఁడు మొదలనే
అండనుండి యెచ్చరించరమ్మ సారెఁ జెలులు"
28-409

**పోఁకులు :** వి; బహు. పోకిళ్ళు, మాయాప్రవర్తనం, కపటచేష్ట, చేష్ట, నష్టి, దొంగతనం, చరిత్ర.
"పోపో నీ కతలు పోకుల నీ గతులు
మాపుల రాపుల నే నోపుదునటే" 9-133
"నిక్కపుఁబోకులు నీకేలే
నిక్కల గంటివి నీ కేలే" 6-66

**పోఁగు :** వి. జందెం .

**పోఁగుపోఁగు పొందు :** వ.బం; అ.క్రి. కలసి మెలసి ఉండు, నేతలో దారం దారం కలియు అని శబ్దార్థం.
"పొఁగిన శ్రీవేంకటాద్రిపతి నన్నుఁ గూడితివి
పోఁగుపోఁగు వొందినట్లు పురిగొంట గాక"
11-369
"వీఁగము శ్రీవేంకటేశ విన్నవించేమిఁక నీతో
పోఁగువోఁగుఁ బొంద మమ్ము బొందించుమీ
నీవు" 8-241

**పోఁగువెళ్లు :** పోగువలె వ్యాపించు. (?)
"నిగిడి కూటములకు నీయంతనే పోఁగువెళ్లి
వగదీరె నాతనిని వలపించవమ్మా" 20-482

**పోఁగువోయు :** (పోగు + పోయు) సంతనకోసం తిన్నగా పోగు పారించి కుట్టు, రప్పుతీయు, పచ్చినూలుతో మంగళసూత్రాన్ని పేని సిద్ధంచేయు.
"పొందుల కోరికె లింత పోఁగు వోయనేటికే"
27-576

**పోఁగెత్తేటివారు :** వ.బం; వి; బహు. నేతవారు.
"చేవలఁబత్తి ముదుగు చేని ముదుగూ లేదు
వావిరిఁ బోగెత్తేటివారివారి నేరుపు" 2-90

**పోఁగెత్తేటివారు :** ప్రస్తావించేవారు, ఊసెత్తేవారు.
"చేవలఁ బత్తిముదుగు చేని ముదుగూ లేదు
వావిరిఁ బోగెత్తేటి వారివారి నేరుపు" 2-90

**పోంకముడి :** వి. పోఁకముడి .
"లలిఁ బోంకముడి వట్టి లాసుకొంటా నందరిని
గిలిగించీ శ్రీవేంకటగిరి కృష్ణుఁడు" 13-216

**పోకు :** వి. చూ : పోకులు.
"యేకతాలు సమకూడె నియ్యకోళ్లే మనకు
వాకులు పోకులు వొక వావి గూడెను" 8-32

**పోకులఁబోక :** వ.బం; వి. పోకిళ్లు పోవుట, మాయలు పన్నుట, దుర్మార్గంలో ప్రవర్తించడం.
"కాకరివై దూరేవు గక్కన విడె మీ సంటా
పోకులఁబోక నీ వాపెఁ బూటవెట్టరాదా" 8-197

**పోకులఁబోవు :** వ.బం; అ.క్రి. డాబులకు పోవు, పోకడలకు పోవు.
"పోని తెరువుల పోకులఁబోయేవు

కాని రాయేటి వంకలు తిద్ద వశమా" 6-58

**పోగులు:** వి; బహు. కుప్పలు, రాసులు.

"వేగమె రావయ్యా నీవు వెలఁది దినదినము
పోగులైన సంతోసాలు పోదిఁబెట్టుకున్నది"
28-310

**పోగులు పోయు:** (పోగులు + పోయు) వ.బం. అ.క్రి. రాశులుపోయు, కుప్పలుపోయు.

"పున్నమ వెన్నెలనెట్టు పోగులు వోయఁగవచ్చు
సన్నలఁగొండలనెట్టు జరుపవచ్చు" 14-585

**పోగువడు:** (పోగు+పడు) రాశిగా పడు, సందడించు.

"మొల్లమిగాలి యొకటే తూరుపెత్తుచోట
పొల్లకట్టు కడఁబడె పోగువడె గట్టి వెల్ల" 4-267

**పోచిల్లు:** వి. ఉపశ్రుతులు. (బ్రౌన్)

"పొంచీ యెలుఁగు గోవిల పోచిళ్లు దెలుపవే"
28-365

**పోచిల్లు:** వి; బహు. శకునం చూడటానికి ఇరుగుపొరుగు ఇండ్లమీద నీళ్ళతో చల్లే అక్షతలు. (వ్యు.) శుభాకాంక్షలు తెలియుటకై చల్లే అక్షతలు. (ఆం.ప.కో.)

"యెంచఁగ శ్రీవేంకటేశుఁ డింతలోనే నిన్నుఁ గూడె
పోరచి నీ పొరుగునఁ బోచిళ్లు చల్లరా" 11-212

**పోటిదొర:** వి. స్పర్ధగల ప్రభువు.

"తీపు నీ కా మాఁటలైతే తిట్టించుకొందు గాని
పోపో నేనెందుకోప పోటిదొర వౌదువు" 11-287

**పోటుఁబాటు:** వి; వ.బం. కుమ్ములాడుపడుట.

**పోటుదారల భూతము:** వి. ఇది పోటు దొరలపెద్దభూతమని కావచ్చు. యుద్ధ నిపుణమైన భూతమని శబ్దార్థం. ఇట ఇరువదిఒక్క పర్యాయాలు క్షత్రియులను యుద్ధరంగంలో తునుమాడిన పేరుడెన పరశురామావ తారమని గ్రహించాలి.

"పోటుదా(దొ?)రుల పెద్దభూతము" 1-109

**పోటుబంటు:** వి; వ.బం. శూరుడు.

"పొంచి సత్యభామకుఁగా పువ్వుల మోకుకు మోచితి
పొంచి సత్యభామవద్ద పోటుబంటవై మించితి"
27-399

**పోట్లదొరితి:** వి. రూపాం. పోట్లదుర్తి, పొట్లదొరితి. కడపజిల్లా యఱ్ఱగుంట్ల మండలం లోని గ్రామం. ఈ గ్రామానికి పోట్లదురితి, పోట్లదుర్తి అని నామాంతరాలు. ఇట చెన్నకేశవస్వామి ఆలయం ఉంది.

"భోగపు శ్రీవేంకటేశ పోట్లదొరితిలోన
నీ గతి చెన్నుఁడవైతే నెనసితిగా" 21-499

**పోడి:** వి. ఒప్పు, చక్కన, అందం.

"వద్దువద్దు తడవితే వాదులే సుమ్మీ! నీవు
పొద్దు పొద్దు వారి వీరి పోడులే సుమ్మీ" 21-433

**పోతరము:** (3) వి. పొగరు, మదం, గర్వం, ప్రభావం. (తె.వ్యు.కో.)

"యీతల శ్రీవేంకటేశ యిందరిఁగూడితి నిట్టె
పోతరముగా మీకు పోగువోసె దదివో" 14-76

**పోతరించు:** (4) అ.క్రి. గర్వించు, మదించు, పోసరించు.

"నీతులు నేరుచుకొంటే నీవె నడతువుగాక
పోతరించి నీవు మాకు బుద్ధి చెప్పనేఁటికే"
24-272

**పోతరీఁడు:** (పోతరము + ఈఁడు) మదం కలవాడు, గర్వం కలవాడు.

"రాతిరేడ నుంటివంటే రతికేల పిలిచీనే
పోతరీఁడు వీని కేల పొద్దువోదో యమ్మ"
20-225

**పోది:** (24) వి. 'ప్రోది'కి వ్యావహారికరూపం. పోషణం, వైభవం, రక్షించడం.

"పోదితో నప్పటి నేల పొదిగి వేఁడుకొనేవు
సాదించేవా నీతో చలము లింకాను" 25-320

**పోదికత్తె:** (ప్రోది + కత్తె) వి. ప్రోదికత్తె, పోషకురాలు, రక్షకురాలు.

"రాఁపుగ శ్రీవేంకటేశు రతినెట్టు గూడితివే
పూఁప జవ్వనముతోడి పోదికత్తెవు" 23-43

**పోదికాఁడు:** (2) (పోది + కాఁడు) ప్రోదికాడు, పోషకుడు, వైభవం కలవాడు.

"అంది నిన్నుఁబొగడితి నొఁగదవయ్యా
పొందుల రతుల మంచి పోదికాఁడవు" 18-540

**పోదిమాని కన్నగతి :** (?)
"వీదుల వీదులనెల్లా విష్ణుఁడు సంచరించీని
పోదిమాని కన్నగతై పొండి మీ రసురలు"
3-487

**పోదియెక్కు :** ప.బం; అ.క్రి. అతిశయించు, వర్ధిల్లు.
"పోదియెక్కె వైరాగ్యబోధలచేఁ బలుమారు
పాదుకొని వేరువారె పంచసంస్కారాలను"
2-222

**పోదిసేయు :** (పోది + చేయు) ప్రోదిచేయు, అతిశయింప జేయు, వర్ధిల్లజేయు, పోషించు, సంరక్షించు. (వ్యు.)
"తానె శ్రీవేంకటేశుఁడు తగిలి నేఁగూడితేను
పూని యలసినందు పోదిసేయవలదా" 19-202

**పోనియూరికిఁ దెరువు :** ప.బం; వి. ఎటూ తీసుకొని వెళ్లనిది
"బుద్ధిమానిన చింత పోనియూరికిఁ దెరువు"
1-96

**పోపు :** వి. ప్రోపు, పోషణ.
"పాపపు పసురము బందెలు మేయఁగ
పోపులపుణ్యము పాలివోయ" 3-19

**పోయ :** (25) క్రి.ప. 'పోవు' ధాతువు భూతార్థకైక వచన క్రియయగు 'పోయెన్' కు వ్యావహారికరూపం. వెళ్లెను అని అర్థం. అన్నమయ్య ఎక్కడో ఒకచోట 'పోయె' అనే రూపాన్ని ప్రయోగించినా, ఎక్కువ చోట్ల 'పోయ' అనే రూపాన్నే ప్రయోగించినాడు. ఇట్లే అణఁగిపోయ, లేకపోయ, అమ్ముడుపోయ, పొద్దువోయ మొ॥ రూపాలు ప్రయుక్తాలు.
"కుప్పలుదెప్పలు నైన కోరికెలు మతిలోన
యెప్పుడుఁ బాయకపోయ నెన్నిలేవు రోఁతలు"
1-206

**పోయిన నీళ్లకుఁ గట్ట :** వి; ప.బం. గతజలసేతు బంధనం, వ్యర్థమనుట.
"పోనీ పోనీ ఇఁకనేల పోయిన నీళ్లకుఁగట్ట
నేనే యింతకుఁ జొచ్చితే విన్నిఁ బారనిత్తునా"
20-282

"బుద్ధులు తప్పె నేమిటికి బోయిన నీళ్లకుఁగట్ట పెట్టనీ
యద్దములోని నీడకొటు లాసపడం
బొసఁగుందలోదరీ" అని ఉ.హరి.ప్రయోగం.
(5-157)

**పోరచి :** కానుక అని వాచ్యార్థం. కట్నం, చేబదులు. (ఆం.ప.ని.) కానుక. (ఆం.భా.చ. 521 పు.) ఇట ఘనత అనే లక్ష్యార్థం.
"ధారుణి శ్రీవేంకటేశు దాసుల సంగతినుంటే
పోరచి నే జీవులైనఁ బుణ్యులు గాకుందురా"
"యెసఁగి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
అసమున నాపె పోర చెందుకొనవయ్యా"
29-222

"పొట్టఁబొరుగున నుండి పోరచి వెట్టంపి నేఁడు
గట్టిగా నింత కరుణ గలదుగా నాకు" 11-149

**పోరచి :** విణ. 1.నిస్సారమైన 2.వ్యర్థం 3.అలక్ష్యం 4.విపరీతం. (వ్యు.)
"పొరుగున నున్నవాఁడు పోరచి యడుగవద్దా
సరుస నా మోవితీపు చవి చూచుఁగాని"
25-184

**పోరచికూడు :** వి. యాచితకపు కూడు.
"పొందుగ బాపనవారి పోరచికూ ళ్లారగించి
బందుకలవాఁడవై బలియరాదా" 20-584

**పోరచి కోరికలు :** వి. కానుకల మీది కోరికలు, వ్యర్థమైన కోరికలు.

**పోరచి చెలులు :** వి. అరణంగా వచ్చిన చెలికత్తెలు
"పోరచిచెలుల నెల్లా బొమ్మల జంకించీనే
చేరి తన సుద్దులెల్లాఁ జెప్పేరంటాను" 22-278

**పోరచితనము :** వి. వ్యర్థత, నిస్సారత.
"తీరిచి అనేకములు తిద్దితిద్ది చెప్పేవు
పోరచితనాన నీకు పూఁటలంటెనో" 21-79
"పొందులాపెతోఁ జేసి పోరచితనాన నాపై

నందిపచ్చడము గోప్ప వౌనయ్యా" 12-480

**పోరచిన్ :** ఘనతతో అని లక్ష్యార్థం. (పోరచి = కానుక)

"ధారుణి శ్రీవేంకటేశు దాసుల సంగతి నుంటే
పోరచి నే జీవులైనఁ బుణ్యులు గాకుందురా"
4-66

**పోరచి పెట్టేవారు :** (2) కానుక పెట్టేవారు.

"పోరచి పెట్టేవారు పొరుగున నుండఁగాను
మేరతోడి కామినుల మేకొనేవా" 16-29

"పొత్తుల మా యిద్దరికి పోరచివెట్ట వచ్చేవు
యిత్తల నీ పెద్దరిక మెంత గలదే" 21-268

**పోలించు :** స.క్రి; పోల్చు.

"పోలించి చూచితేను పొసఁగు నిద్దరికిని
మేలువారు తొల్లె మీరు వోలలాడరయ్యా" 18-8

**పోలింపు :** స.క్రి. పోల్చు.

**పోలికె :** (3) వి. 'పోలిక'కు వ్యావహారికరూపం.

"మేలు మేలు జాణ కాదు మెస్తిరా నిన్ను
పోలికెకు నవ్వితేనే బూమెలు సేసేవా" 26-6

**పోలిమి :** (పోలు + ఇమి) వి. పోలిక.

"బాలుఁడాయ పరబ్రహ్మము వీడంటూ
పోలిమితోఁ గరిపురజను లనిరి" 23-547

"పొలిమితోఁ జూడవచ్చె పొరుగున నాపె"
26-284

**పోళిమి :** వి. 'పోడిమి'కి రూపాం. 1. ఆదరం, గౌరవం 2.ఒప్పు, చక్కన, అందం 3. అవధానం, హెచ్చరిక 4. లక్షణం, చిహ్నం. (వ్యా.)

"మూలనున్నవారి మమ్ముఁ ముంగిట వేసితివి
పోళిమినాఁడు వారు నీ పొరుగవుటే దోసమా"
17-175

"నాలి నాయెదుట నీవు నవ్వు నవ్వేవేమే నిన్నుఁ
బోళిమితోఁబొంది నన్నుఁబొందె నంటాను"
15-99

**పోవవు :** క్రి.ప. పోవు ధాతువు వ్యతిరేక తద్ధర్మార్థక మధ్యమపురుషైకవచనరూపం. 'పోవు' (= వెళ్లవు) అనేది సాధురూపం. 'పోవవు' అనేది విలక్షణరూపం.

**పోసపుబాస :** వి. (?)

"మాసినట్టిపై చెఱఁగు మంతనములో కరంగు
పోసపుబాస పోఁకకుఁ బుట్టిదేసి" 19-479

**పోసపోవు :** అ.క్రి. మదించు, గర్వించు.

"పోసపోని వారయితే ముయికి ముయిసేతురు
వాసి మానాపతులనె వంచుకొంటేఁ జెల్లునా"
8-270

**పోసము :** వి. ఇది 'పోసనము' కావచ్చు. క్షీరం, పాలు. (కాంతి, పైపూత)

"నెలఁత దక్కితినని నీ వీడెపురసము
చలివాయ నిపుడు పోసము దాగేనే" 15-90

**పోసముదాగు :** ప.బం; అ.క్రి. తీర్థమువలె భక్తితో ఆపోశనము పట్టు.

"నెలఁత దక్కితినని నీ వీడెపు రసము
చలివాయ నిపుడు పోసము దాగేనే" 9-90

**పోసరము :** వి. పోతరము, గర్వము, మదం.

"రాసి సేసేవు వలపు రతులలో నెల్లా నీవు
పోసరపువేడుకకు భోగమా యిది" 23-181

**పోసరించు :** (42) అ.క్రి. పోతరించు, మదించు, గర్వించు.

"పోసరించి వుండే నన్ను పొందుగా యింతేసేసి
పోసరించిన బుద్దులు పోరచివెట్టేరా" 20-572

**పోహణించు :** స.క్రి. కూర్చు, గుంపించు, పొగడు.

"మోహము గలవాఁడవు మొక్కించుకో ఆపెచేత
పోహణించి నన్నేమి బుద్దెడిగేవు" 19-90

## పౌ

**పౌఁజు :** వి. సైన్యం. ఇది ఉర్దూపదం. (బారు. పీఠిక 12 -)

"విడిసెఁ గపిబలము వెస సముద్రముదరి
నడచె లంకపైఁ బౌజు నానాగతుల" 4-279

## ప్ర

**ప్రతాపించు:** అ.క్రి. శౌర్యం చూపు.
"వసుధఁ బ్రతాపించి వడిఁదోఁక గదలించి
దెసలెల్లాఁ బాలించీ దివ్యహనుమంతుఁడు"
4-272

**ప్రతిచంద్రుఁడు:** (2) వి. మాఱుచంద్రుడు.
"సతి నింత తాపాన చందురుఁడేపఁగఁబో
ప్రతిచందురుండాయ పడఁతి మోము" 5-375

**ప్రతిపెట్టుకొను:** స.క్రి. ఎదుట ఉంచు, సమానంగా ఉంచు.
"నీవే కావఁగఁ గర్తవు నేనే శరణాగతుఁడను
కైవశమగునను ప్రతివెట్టుక నా కథలు
యెంచనేలా అయ్యా" 2-514

**ప్రత్తెక్షము:** వి. 'ప్రత్యక్షము'నకు వికృతిరూపం.
"హత్తి యింద్రియములందుఁ బ్రధానులు
ప్రత్తెక్షరాజ్యము ప్రకృతియుఁ గలిగె" 3-272

**ప్రముఖము:** వి. ముఖము.
"చక్రాయుధ రవి శతతేజోంచిత
సక్రోధ సహస్ర ప్రముఖా" 2-81

**ప్రహేళిక:** వి. గూఢార్థం కలిగిన శ్లోకం లేక కావ్యం.

## ప్రా

**ప్రాణచారి:** వి. అభీష్టసిద్ధికి దీనప్రయత్నం చేసేవాడు, విడువక అతిదీనంతో ఒకరిని అర్థించేవాడు.
"బడిబడి నొసఁగుచు (ను!) బ్రాణచారులకు
కడిమినీడ దిరుగని చింతాడ" 1-320

**ప్రాణచారి:** వి. ప్రాయోపవేశం చేసేవాడు, స్వచ్ఛందంగా మరణించేవాడు.
"బడిబడి నొసఁగుచుఁను బ్రాణచారులకు
కడిమి నీడ దిరుగని చింతాడ" 1-320

**ప్రాణపుటూరుపు:** (ప్రాణము + ఊరుపు) వి. ప్రాణవాయువు.
"ప్రతిలేని తనలో ప్రాణపుటూరుపైన
రతి నలసినవేళ రంపమై తోఁచు" 7-333

**ప్రాణప్రతిష్ఠ:** వి. దేవతల విగ్రహాల్లో ప్రాణాన్ని ఆవహింప జేయడం.
"మొదల నంతర్యామిమూర్తి వయిన నీకు
పదవి మీర నదియే ప్రాణప్రతిష్ఠ" 4-46

**ప్రాణప్రాణనేస్తము:** వి. మిక్కిలి ప్రాణస్నేహితుడు.
"నీకు నీకుఁబ్రాణ ప్రాణనేస్తమైనచో
చౌకగాకతనికి నిచ్చకమాడఁ దగదా" 20-241

**ప్రాణబందుగుఁడు:** వి. ప్రాణబంధువు.
"యిన్నిటాను శ్రీవేంకటేశుఁడు యీ కాంతఁగూడె
పన్ని యీతఁడే యింతి ప్రాణబందుగుఁడు"
17-429

**ప్రాణబందుగురాలు:** వి. ప్రాణబంధువైన స్త్రీ.
"బాగాలిచ్చీ నీ ప్రాణబందుగురాలు
చేవదేర నీ వేల చే యొగ్గవు" 25-460

**ప్రాణబంధువుఁడు:** వి. అత్యంతసన్నిహిత బంధువు.
"పాయరాని చుట్టమైన ప్రాణబంధువుఁడు
వేయైనాఁ దనచేఁతకు వేసరే దానునటే" 16-83

**ప్రాణవల్లభుఁడు:** వి. ప్రియుడు, భర్త. ప్రాణేశ్వరుడని వ్యుత్పత్తి.
"ప్రాణవల్లభునిఁ బెడఁబాసి మరుబాణముల
ప్రాణబాధల నెగులు పడుటేటి వలపే" 5-230

**ప్రాణవిభుఁడు:** (2) వి. భర్త.
"నీఁటునఁ బ్రాణవిభుఁడ నీ వేమి సేసినా
వాఁటమై మొక్కదుఁగాక వాసివట్టేనా" 11-213

**ప్రాణాచారాలువడు:** అ.క్రి. అభీష్టసిద్ధికి ప్రయత్నాలు చేయు, విడువక ఒకరిని అతిదీనంగా అర్థించు, ప్రాయోపవేశం చేయు. (వ్యు.)
"పరులఁ గొలిచి వచ్చి ప్రాణాచారాలువడితే
సిరుల వరాలిచ్చేవు శ్రీవేంకటేశా" 3-128

**ప్రాణుఁడు:** వి. జీవుడు.

"విడిచెనా తన పాపవిధులు ప్రాణుఁడు మున్ను
అదరి మానుషరూప మైనంతనే" 4 అను. 18
"తనవారని యాసఁ దగిలి భ్రమయనేల
తనువుఁ బ్రాణునికంటె తగులేది" 1-222

ప్రాణేశుఁడు : (2) వి. భర్త, ప్రియుడు.
"అవధారు చిత్తగించు మంగన ప్రాణేశుఁడవు
యివల నీ కింతలోనే యెక్కడ పరాకు" 12-299

ప్రాణేశ్వరి : (3) వి. భార్య, ఇది సంస్కృత పదమే యైనను సంస్కృతంలో దీనికంతగా వాడుక లేదు.
"అలిగి ప్రాణేశ్వరి అవ్వలి మోమైనవేళ
వలపుతో బుజ్జగించేవాఁడు వో జాణ" 11-220

ప్రాణేశ్వరుఁడు : వి. భర్త, ప్రియుడు; ఇది సంస్కృతపదమే యైనను సంస్కృతంలో దీనికంతగా వాడుక లేదు.
"ప్రాణేశ్వరుఁడు దన్నుఁ బాయఁ జూచినయపుడు
ప్రాణంబు మేనిలోఁ బాయంగవలదా" 5-230

ప్రాప్తవ్యమర్థం లభతే : ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః అని పూర్తివాక్యం. మానవుడు తాను పొందదగిన వస్తువును తప్పక పొందుతాడు అని భావం.
"తలఁపేల చిక్కుపడీ ధనము కొఱకుఁగాను
అలమి ప్రాప్తవ్యమర్థమనఁగాను" 15-223

ప్రాయము : (3) వి. వయస్సు, యౌవనం.
"ఎవ్వరికిఁ గలదయ్యా యిటువంటి వలపు
పువ్వువంటి ప్రాయమున భోగించీఁ జెలియ"
16-495

## ప్రి

ప్రియపడు : (9) (ప్రియము + పడు) స.క్రి. ఇష్టపడు.
"నియతి శ్రీవేంకటేశ నేఁడిట్టే పెండ్లాడితివి
ప్రియపడి యింత సేయ బిరుదులదానవా"
13-407

ప్రియవాదితనము : వి. ప్రియం పలికేవాని లక్షణం.
"పెనఁగులాటకు లంకె ప్రియవాదితనములు
పొనరి మమ్మిక నేల వుప్పతించేవయ్యా"
28-454

## ప్రే

ప్రేమసేయు : (ప్రేమ + చేయు) ప్రేమచూపు, ప్రేమించు.
"సెలవి నవ్వినవాఁడు చేయి చాఁచకుండునా
పిలువనేలే తానే ప్రేమసేసీని" 25-238

## ప్రొ

ప్రొద్దుప్రొద్దు(లు) : వి. బహు. (ప్రొద్దులు + ప్రొద్దులు) ప్రతినిత్యం.
"ప్రొద్దుపొడుపుల దొకటి ప్రొద్దుగ్రుంకుల దొకటి
ప్రొద్దుప్రొద్దులకు రహిపొయ్యేటి దొకటి" 6-57

## ప్రో

ప్రోడ : వి. 'ప్రౌఢ' శబ్దానికి వ్యావహారికరూపం, ప్రగల్భుడు, నిపుణుడు, వివేకి.
"యీడనె శ్రీవేంకటేశ యెంతకెంత సేసేవు
ప్రోడవౌదువు నీకిఁక బొద్దువోదా" 7-581

ప్రోడదొర : వి. ప్రౌఢుడైన యజమానుడు.
"యెగ్గు లేని ప్రోడదొర వెఱుఁగరాదు నీకైతే
వొగ్గేవు నీవెందుకైనా వోయమ్మ వెరవవు"
27-170

## ప్రౌ

ప్రౌఢవాఁడు : (ప్రౌఢ + వాఁడు) వి. ప్రౌఢుడు, దిట్ట, నిపుణుడు, వివేకి. 'ప్రౌఢ' అనే కేవలతత్సమ శబ్దంమీద 'వాడు' శబ్దప్రయోగం. ప్రౌఢప్రయోగమే. ఇట్టి ప్రయోగము లీ పదవాఙ్మయమున కలంకారములని సంపాదకుల వివరణ.
"కన్నెపాయ మటుగాన కాంత పలుకఁగ వుంటే
పన్ని యేలపైఁకొనవు ప్రౌఢవాఁడవు" 27-141

**బీరకాయలోని చిక్కు :** ప.బం; వి. మిక్కిలి చిక్కు.
"పెట్టిన దైవమెరుఁగు బీరకాయలోని చిక్కు
దిట్ట కూళప్రాణులమై తిరుగుత గాకా" 3-313

**బీరగాఁడు :** (బీరము + కాఁడు) వి. పరాక్రమవంతుడు.
"తనకు వలచినట్టి తరుణి సూర్పనకను
పెనుముక్కు గోసిన బీరగాఁడే" 9-134

**బీరమాడు :** ప.బం; అ.క్రి. గర్వోక్తులు పలుకు.
"నీ రాక దెలిసియు నిద్దిరించెఁ జాలదా
బీరమాడితి విన్ను రతి బెండుసేయవలెనా"
20-248

**బీరముసేసుకొను :** అ.క్రి. శక్తి కలుగజేసుకొను (?)
"నీతితోడ వీసులను నీ కతలు వినేయాస
రాతిరిఁ బగలును బీరము సేసుకున్నది"
20-474

**బీరుపోవు :** (బీరు + పోవు) ప.బం; అ.క్రి. సత్వ విహీనమగు, సారహీనమగు.
"మనసెంత గరఁచినాను మచ్చికెంత రేఁచినాను
పెనగొన్న రతులిఁక బీరువోయీనా" 21-290

## బు

**బుంగుడగు :** అ.క్రి. మునుగు.
"పొదిగున్న యాసలోఁ బుంగుడై సతతంబు
సదమదంబై పడయు చవులు దనకేలా" 1-302

**బుగందించు :** అ.క్రి. ఇది ఒక అపురూపమైన పదం. సం.ప.స లో 'పువు+గందించు' అనే పదాల సంగ్రహ రూపంగా తోస్తుంది అనీ, ప్రకరణాన్ని బట్టి 'వాసనకొట్టు' అని అర్థమనీ వివరింపబడింది. (21 సం. 387పు.)
"ముందు నన్నుఁగూడెను ముడిచివేసిన పువ్వు
పొందుగా వీది నుండితే బుగందించకుండునా"
21-341

**బుగులుకొను :** అ.క్రి. 1. పరిమళించు 2. పైకి లేచు 3.వ్యాపించు 4. విస్తరించు 5. విజృంభించు 6.అతిశయించు.
"తావితో బుగులుకొనేటి పూవులు దాఁపగ
నవియె వాడిన పిమ్మట
భావించి చూచితే నందలి తొల్లిటి పస
యెందుండు" 10-1-50

**బుగ్గ :** వి. నీటిబుడగ.
"నీటిలోన నొక బుగ్గ నిమిషలోనఁ బుట్టి
కోటిసేసినట్లుండు గొంతవడి" 2-360

**బుజ :** వి. హంసపాదం, కుండలీకరణం, సున్న. (బ్రౌన్; శ.ర.)
"చెలి చెమటల నాని చిత్తములో వలపులు
పులకలై మొలచెను బుజగలిగే" 11-442

**బుజము :** వి. 'భుజము' నకు వికృతిరూపం.
"సందిగట్టుకొన్నవి చంద్రవంక తాయతులు
అందపు వల్లెవాటు పయ్యెద బుజాన" 29-106

**బుజమెక్కు :** ప.బం; అ.క్రి. పెత్తనం చెలాయించు, నెత్తికెక్కు వంటిది, మిక్కిలి చనువు గలిగినదగు.
"వూడిగము సేసేయట్టి వువిదలతో నవ్వితే
యీడుజోడై నీ బుజమెక్కకుందురా" 26-255

**బుజవేయు :** చేయివేయు, (శ.ర.) సిద్ధంచేయు. (వ్యు.)
"పూఁపల స్వర్గము త్రోవ బుజవేయరో"

**బుజవైచు :** స.క్రి. ముద్రలువేయు, సున్నమెట్టు, కుండలీకరించు, సిద్ధంచేయు.

**బుడిబుడి :** విశ. అల్పము, కపటం.

**బుడిబుడిమాయలు :** వి. దొంగనటనలు, దొంగమాయలు.
"బుడిబుడిమాయలఁ బొరలేటి దేహికి
కడవరాని బంధము కాంతలు" 3-361

**బుడుగు :** బుడిగ, బుడిగె, పిడత, సిద్దె, చిన్న మట్టిపాత్ర.
"పొడవాటి పుట్లెక్కి బుడుగులతోడి వెన్న
తొడికివెట్టీఁ దన తోడివారికి" 24-267

**బుద్ధి :**(5) వి. 'బుద్ధి' కి వికృతిరూపం. ఇట మంచిది, యుక్తం అని అర్థం.
"పొద్దువొద్దుకును వలపుల నేఁచేవు వద్దు

బుద్ధిగాదు నీకు నేప భువనమోహినిని" 5-16

**బుద్ధి చెప్పు :** ప.బం. హితం చెప్పు, నీతి చెప్పు .

"బుద్ధి చెప్పవయ్య నీవు పొరుగులవారి కెల్లి

పొద్దువోదా అటువంటి పొలఁతులకెల్లాను"

25-323

**బుద్ధి(ద్ధి)చెప్పు :** ప.బం; అ.క్రి. హితం చెప్పు, బుద్ధిచెప్పు, సత్ప్రవర్తన మెరిగించు, మంచి నడవడిని బోధించు.

"చెక్కు నొక్కి నీకు బుద్ధిఁజెప్పడా ఆతఁడు

దొల్లి" 20-447

"సొరిదిఁ దనకు నేఁ జుట్టమయ్యేదానా

దరిచేర్చి బుద్ధిచెప్పఁదానే కాక" 24-399

**బుద్ధులు నూరిపోయు :** ప.బం; అ.క్రి. అదేపనిగా హితబోధ చేయు.

"బోదించి యెట్లా నాపె బుద్ధులు నూరిపోసెనో

సాదువలె నేమనినా సమ్మతించేవు" 17-180

**బుద్దెరుగు :** (6) (బుద్ధి + ఎరుగు) ప.బం; అ.క్రి. తెలిసి వచ్చు, జ్ఞానం వచ్చు.

"బుద్దెరఁగక బాలుఁడై పొత్తులలో నున్నపుడు

కొద్ది లేక తానెవ్వరి గురుతెరుఁగు" 3-268

**బుద్బుజము :** వి. ఈ పదం ఈ రూపంతో నిఘంటువుల్లో కానరాదు. నిఘంటువుల్లో బుద్బుదము, బుబ్బుదము అనే రెండు రూపాలు కనిపిస్తున్నాయి. బుద్బుదమనే పదానికి నీటిబుడగ అని అర్థం. బుబ్బుదమనే దానికి భక్ష్యవిశేషమనే అర్థం ఉంది. పరిష్కర్తలు కొంచెము గుండుగా సుమారుపాటి పొడవైన భక్ష్యవిశేషమైతే ప్రకరణానికి సరిపోతుందనీ, పెద్దనదులందు, సముద్రము లందు పొడవుగా ఏర్పడే బుడగ కూడా సరిపోతుందని పేర్కొన్నారు. కనుక ఇట భక్ష్యవిశేషమనే అర్థాన్నీ, నీటిబుడగ అనే అర్థాన్నీ చెప్పుకోవచ్చు.

"సారె నీ ముద్ర లేని భుజములు

బుద్బుజములు

తేరి నీ దాస్యము లేని దేహము సందేహము"

2-450

**బురి :** వి. ఉత్సాహం (?)

"నీవు మాకు బురిగాక నేరము లెందేమున్నది

ఆవటించి మనసులో నొఁగాము లున్నవా"

27-118

**బుఱ్ఱటకొమ్ము :** ప.బం; వి. నీరు చిమ్మే గొట్టం, చిమ్మనగ్రోవి. నాచన సోమన ప్రయోగం ఉంది.

**బుఱ్ఱటకొమ్ముల వసంతము :** వి. చిమ్మన గ్రోవులతో ఆడే వసంతం. (చిత్తుడుగొట్టం)

"వుడుకుఁజెమటలనే వూర్చి కొనగోరఁ జిమ్మి

కొడిసాగ బుఱ్ఱటకొమ్ముల వసంతము" 18-389

**బులియు :** అ.క్రి. మురియు.

"కలయ వేడుక నీకుఁ గలిగితే గనకిట్టే

బులియక లోనికేగి భోగించరాదా" 13-149

**బులిసి లోగు :** అ.క్రి. మొదట ప్రాపంచికసుఖాల్లో మునిగి తరువాత దుఃఖించు.

"బులిసి లోఁగఁగనేల పురుషోత్తమా" 2-283

**బులుపు :** (2) వి. సుఖం, వేడుక, వాంఛ, ఉబలాటం.

"బులుపుఁబిలుపుల మేను పులకించ కేలుండు

మొలకనగవుల యా(నా)స మొలవకేలుండు"

5-101

**బువ్వపుఁబాలకూళ్లు :** వి. విందులోని పాయసాలు.

"పొత్తుల మోవితేనెలే బువ్వపుఁబాలకూళ్లు

బత్తితోడి నవ్వులే కప్రపుబాగాలు" 21-417

**బువ్వము :** (7) వి. వివాహంలో బంధువులైన మగవారు, ఆడువారు అందరూ ఒకటిగా కూర్చుండి వేడుకగా చేసే భోజనం, బూవం, అన్నం.

"పొరుగుదానికేల బువ్వానఁగూచుండ" 23-48

"పొలఁతులు వడ్డించఁగా బువ్వానఁ గూచుండి

చెలఁగి సరసమాడీ శ్రీదేవితో" 28-16

**బుసకొట్టు :** (14) వి. బుసకొట్టడం.

"ముక్కున నీ బుసకొట్టు ముసిముసి

నవ్వులగుట్టు

దిక్కులవారి నడిగి తెలుసుకోరాదా" 19-465
"సారె విసరుకొనేవు చప్పుడుగా నింతలోనె
ఆ రీతి బుసకొట్లు నీ కాఁడయ్యీనా" 27-434

## బూ

**బూఁజి:** వి. బూజు, దుర్గంధం, ఎండ సోకకపోవడం వల్ల తడివస్తువులమీద పట్టే మకిలి.
"పుచ్చినట్టి పండు బూఁజిలోననే వుండు
బచ్చనకవితలు బాఁతిగావు యెందు" 2-494

**బూక:** (6) వి. మాయ, బూటకం, అసత్యం, బొంకు.
"పలుమారు నలయించు పరవశంబొకకొంత
పొలయలుకలను బొడము బూకలొక కొంత"
5-312

**బూజకుండ:** వి. బిరేనికుండ.
"గొప్ప కుచముల బూజకుండలుసుఁ బట్టితివి
పిప్పిగాఁగ రతులను పెండ్లాడితివి" 27-179
"పొందైన కుచములను బూజగుండలు దెచ్చె
అందముగఁ గాఁగిలించే నంటా నిన్ను" 18-422

**బూటకీఁడు:** (బూటకము + ఈఁడు) వి. మాయావి, మోసగాడు.
"అందునిందు నిచ్చకము లట్టి యేల చూపేవు
పొంది నన్నుఁ గోపించేనా బూటకీఁడ" 27-287

**బూడిది:** వి. 'బూడిద'కు రూపాం.
"ఏడ సుజ్ఞాన మేడ తెలివి నాకు
బూడిదిలో హోమమై పోయఁగాలము" 1-48

**బూడిదిలో కచ్చక:** ప.బం; వి. అంటీ అంటక ఉండేది. బూడిదలోని కచ్చకాయకు బూడిద ఏ మాత్రమూ అంటదు కదా!
"ఏడ సుజ్ఞాన మేడ తెలివి నాకు
బూడిదిలో కచ్చకయై పొరయఁడెందు" 2-374

**బూడిదిలో హోమము:** వి; ప.బం. వ్యర్థం.
"ఏడ సుజ్ఞాన మేడ తెలివి నాకు
బూడిదిలో హోమమై పోయఁగాలము" 1-48

**బూడిదె:** వి. 'బూడిద'కు రూపాం.
"బూడిదెలో వసంతమా" 26-32

**బూడిదెలో వసంతము:** వి; ప.బం. వ్యర్థం.
"ఆడనుండి మోవిఁ దిట్టే వంతేకాదా వలపు
బూడిదెలో వసంతమా పోపో అంతేకాదా"
26-32

**బూతకి:** అడుభూతము, ఇట పూతన లేదా పూతక యే పూతకిగా వ్యవహరింపబడి క్రమంగా 'బూతకి' ఐనదేమో? "బొమ్మరపోవడు పూతకి బొరిగొని" అనే (6-149) కీర్తనలో పూతకి అనే ప్రయోగం కనిపిస్తుంది.
"వగపు లేక చంపవచ్చిన బూతకి
పగ సాధించినవాఁడు పసిబిడ్డ"
10-2-11 & 1-126
"బూతకిఁ జంపినవాఁడే బూతకి వాకట్టు రక్ష
పాతాళానఁగూర్మమైన పతి గుంతదోషరక్ష"

**బూతాల పొంగలి:** వి. భూతబలి.
"భూతాల పొంగటికే పొడమిన పంటలెల్లా
కోతవేత చూచుకొని కోరుకొంటారు" 3-464

**బూతు:** (2) వి. కుత్సితపు తిట్టు, అసత్యం.
"పొలఁతి యంపిన లేక బూతులు దొరలఁబోలు
వెలయ నే మడిగినా వెళ్లనాడవు" 10-2-40

**బూతుచిల్లి నేస్తము:** కామసంబంధమైన స్నేహం, యోనిసంబంధమైన స్నేహం (?)
"నేతిబీరకాయ నెట్టనఁ గర్మబంధము
బూతు చిల్లినేస్త మెప్పుడు మనసు" 15-325

**బూతుజన్మము:** వి. అసహ్యకరమైన పుట్టుక.
1-129

**బూతుబండుఁడు:** ప.బం; వి. తిట్లమారి.
"నిండు బూతుబండుఁ దిట్టు నెరపిన దెవ్వతే
వొండేమి నెఱుఁగక వూరకుండే బాలుని" 17-94

**బూతుబండు:** (2) వి. బండుబూతు, ఆకతాయిమాట.
"యెలమి శ్రీవేంకటేశ యెనసి మెచ్చితిఁ గాక
పలుకులలో నే బూతుబండునఁ దిట్టితినా"
23-240

**బూతుమాట:** వి. అసహ్యాకరమైన మాట
"కొంకి తిట్టేదే కాని గురియైన రతిదాఁకా
పొంకపు బూతుమాటలఁ బూఁచుకున్నది"
12-210

**బూతురేవు:** వి. నింద్యమైన సంసార వ్యామోహమనే రేవు.
"జగతిఁబుణ్యపాపపు సరకులు దెచ్చినాఁడ
దిగితి బూతురేవునఁ దీరుచరో సుంకము"
3-324

**బూతుల యెంగిలి:** వి. నింద్యమైన సంసర్గం.
"బూతుల యెంగిలిఁబుట్టిన దేహము
బొఁతిగ శుచియై పరఁగీనా" 3-430

**బూతో బండో:** ప.బం; వి. నీచమైనది అనే అర్థంలో జంటపదం.
"పుట్టినదే నగ్నత్వము బూతో బండో
యెరఁగము" 3-340

**బూపతిచెరువు:** ఇదొక చెరువు పేరై ఉంటుంది. ప్రస్తుతం ఇది ఎక్కడ ఉందో తెలియదు. గౌరిపెద్దివారు చెరువు అంటే కోనేరు అనే అర్థం ఉంది. కోన్ అంటే తమిళంలో ప్రభువు అని అర్థం. కోన్ + ఏరు = కోనేరు - స్వామి పుష్కరిణి అన్నారు. అన్నమయ్య ఈ భూపతి చెరువు శ్రీవేంకటేశ్వరస్వామిపై ఎనిమిది కీర్తనలు పాడినాడు
"పోదితో శ్రీవేంకటేశ బూపతిచెరువుకాడ
ఆదిగొని నిన్నుఁగూడె ఆకె నీకుఁదగును"
25-157

**బూమి:** (10) వి. 'భూమి'కి జానపదవ్యవహార రూపం.
"బుద్ధులఁబోయేవు మెట్టి బూములెల్లాఁ దిరిగేవు"
9-84

**బూమిదేవులమ్మ:** వి. భూదేవత.
"బూమిదేవులమ్మ నీ బుజముపై నుండఁగాను
వేమారు నాతో నవ్వేవు వింతొక చవే" 21-87

**బూమివారు:** వి; బహు. భూమిలోనివారు, ప్రజలు.
"వుండుండి బూమివారెల్లా వూరకే నీ కన్నులను
పుండరీకముల నిట్టే పోలునందురు" 7-522

**బూమె:** వి. కపటవేషం, మాయ, (అం.ప.ని.) వంచకుడు.
"పొరుగు పోరచా నిన్ను బూమెలు సేయ"
21-201

**బూమెట:** భూమికా శబ్దభవమా అని సంపా.
"పొంతల నవ్వే వేల బూమెటవలెను
ఎంత మాయకాఁడవో యేమని చెప్పుదు నిను"
21-125

**బూమేటులఁబెట్టు:** స.క్రి. వంచించు. మాయల బడదొబ్బు.

**బూరుగుపై చిలుక:** వి; ప.బం. నిరాశచెందిన చిలుక, బూరుగుపండును పండని భావించి చిలుక బూరుగుచెట్టు పైకి వస్తుంది. కాని బూరుగు పండు దూదితో నిండి ఉంటుందేకాని అది నిజంగా పండు కాదు.
"శ్రీవేంకటాధీశ్వరు సేవించక మోక్షానకుఁ
బోవలె ననేటివాఁడు బూరుగుపై చిలుకా"
15-378

'బూరుగమాను కాసించి పొంచి చిలుకచంద మాయె' అని క్షేత్రయ్య.

**బూరుగుమాకున చెందిన కీరము:** ప.బం; వి. లాభం లేనిదానిని చేరినట్టిది. (బూరుగు మాకున ఉన్న ఫలాన్ని చూచి అది ఫలమనే భ్రమచే చిలుక బూరుగు వృక్షాన్ని ఆశ్రయించి బూరుగుపండులో కేవలం దూదే ఉంటుంది కనుక నిరాశచెందుతుంది.)
"బూరుగుమాకున చెందిన కీరము చందమున
ఆరయ నిష్ఫలమగు మరి యన్యుల జేరినను"
1-194

**బూవపువారు:** వి; బహు. వివాహాది సమయంలో కలిసి భోజనం చేసే బంధువులు.
"శ్రీవేంకటేశ్వర చెలఁగి నగేమా
బూవపువారము భోగులము" 19-8

**బూవము:** వి. 'బువ్వము'కు రూపాం. వివాహంలో బంధువులైన మగవారు అందరును

ఒకటిగా కూర్చుండి వేడుకగా భోజనం చేయడం.

"బూవానఁబెట్టుకొపెను బోగించరాదా" 23-435

## బె

**బెంగ:** వి. 1. కలవరం, మనోవ్యాకులత 2. విరహం, వ్యథ. (వ్యు.)

"అంగన గెలిచితి వనవయ్య వొక్కమాఁటే
బెంగవలెఁగోరివచ్చి పెనఁగీ నీతో" 25-230

**బెంగతనము:** (బెంగ + తనము) వి. చూ: బెంగ.

"అంగడిఁబెట్టే వయసు అడియాల మానునే
బెంగతనాన నుండినాఁ బెడరేఁచుఁగాక" 21-404

**బెండ:** వి. (?)

"అందకురావచ్చుఁ గాని అలుక మానుపరాదు
బెండ నాతో నేల పెనఁగాడీనే" 25-63

**బెండువంటివారు:** వి; బహు. బెండువలె తేలికైన వారు, శక్తిలేనివారు.

"కొండలరాయఁడ మమ్ముఁగోరి పుట్టించఁగా నీవు
బెండువంటివారము మా బిగువేటి బిగువు" 4-126

**బెండువడు:** (బెండు + పడు) బలహీనుడగు, తేలికపడు, నీరసపడు.

"పెనఁగి పెదవులైతే బెండుపడీని" 26-35

**బెండ్లు ముంచి గుండ్లు తేలించు:** ప.బం; అ.క్రి. అసాధ్యమైన పనిని సుసాధ్యం చేయు.

"తెంకి బెండ్లు ముంచి గుండ్లు దేలించేది నీ విద్య
వంకలొత్తి యాటదాని వంచేది నీ విద్య" 3-213

"మజ్జంత్యలాబూని శిలాః ప్లవంతే" అని సంస్కృతసూక్తి.

**బెంబడి:** అవ్య. వెంబడి, వెంటనే.

"కరఁగి వారెల్లా శ్రీ వెంకటనాథ కూడఁగాఁ
పరువపు నారతి బెంబడి నోడవైతివి" 10-2-36

"నరపతి భూమేలఁగ భూవరు భజియింపఁగ నొల్లక
పరిసరవర్తుల బెంబడిఁ బని సేసినయట్లు" 1-362

**బెంబాడి చేతలు:** ప.బం; వి. (?)

"పేరు నారాయణుఁడవు బెంబాడి చేతలు నీవి
నోరు మూసుకున్నఁబోదు నున్నని నీ సుద్దులు" 2-162

**బెట్టి:** వి. రూపాం. బెట్టు, (?) గట్టిగా, దృఢంగా.

"ఎట్టి పరవశమో యెటువంటి తమకమో
బెట్టి ముంజేతిచిలుక పిల్చినా నెఱఁగదు" 24-442

**బెట్టిమాట:** వి. గట్టిమాట, బెట్టు శబ్దానికి 'బెట్టి' అనేది విలక్షణమైన ఔపవిభక్తికరూపం.

"కందువలు చూపి నీకుఁ గనుసన్న సేసితేను
అంది బెట్టిమాటల నేల అడిగేవు" 16-119

**బెట్టుగా:** క్రి.విణ. గట్టిగా, దృఢంగా.

"బెట్టుగాఁజేరఁబిలిచి ప్రియములు చెప్పఁగాను" 25-446

**బెడగు(లు):** వి. తప్పు(లు), దోషము(లు)

"కడుపులోపలి శిశువు కన్నతల్లిఁ దన్నితేను
బెడగులెంచక కని పెంచీనట" 3-437

**బెరయు:** అ.క్రి. సంభవించు, కలుగు.

"పెనుగులాడేటివేళ బెరసిన చెమటల
పనుపడి నీ తమికిఁ బదనాయను" 7-132

**బెరయు:** స.క్రి. చేరు, చలించు, ఒరయు. (శ.ర.)

"పెక్కు పురుషులలోన బెరసొక సతి యుంటే
యిక్కువై యందే నాఁటు నిందరి చూపు"

**బెల్లించు:** (6) వి. స.క్రి. 1. వంచించు 2. ఉబ్బించు 3.ముఖస్తుతి చేయు 4. సాంత్వనం చేయు. (ఆం.ధా.మా.) (బెల్లింపు = మోసం ఆం.ప.ని.)

"పట్టెడేసి గుబ్బలపై పయ్యెదింమక జారించి
బెట్టుగా సరసాలాడి బెల్లించేఁగా" 22-536

"యెనసి వుండినవారి నెఱుక సేసుకోనేల
పెనఁగులాడేవారి బెల్లించనేల" 27-542

"వెగళించి ఇంతలో శ్రీవేంకటేశ కూడితివి
బొగ్గరపు(జింతలెల్ల పోపో మెచ్చాయనా" 24-77

**బొట్టనవేలు:** (2) వి. బొటనవ్రేలు, అంగుష్ఠం.
"చేరి తూఁగుమంచ మూఁచే చెలియ చనుమొనలు
తారుచు బొట్టనవేలఁ దాకించనా" 7-123
"అందలమెక్కిన నిన్ను ఆకె గొలిచిరాఁగాను
పొందుగాఁజన్నులొత్తేవు బొట్టనవేల" 7-117

**బొట్టులమెకము:** వి. లేడి, జింక . (మచ్చలు గల మృగమని వ్యు.)
"బొట్టులమెకము నేసే బోయనాయఁడు
పట్టపునెమలి చుంగల బలుబోయనాయఁడు"
1-460

**బొట్టులమెకము నేసే బోయనాయఁడు:** వి. శ్రీరాముడు. (లేడి రూపంలో నున్న మారీచుణ్ణి బాణంతో కొట్టినవాడు.)
"బొట్టులమెకము నేసే బోయనాయఁడు" 1-460

**బొడుక:** వి. బాలుడు, పిల్లవాడు. (తె.వ్యు.కో.)
"లెక్కించ నితనికైన లెంకలకు బొడుకల
కొక్కట విధి నిషేధా లూహింపలేవు" 2-511
"సరిఁ గర్మములకెల్ల చనవరి బొడుకను
పొరలే జన్మముల యప్పులవాఁడను" 2-480

**బొడ్డుతామెర:** (2) వి. నాభికమలం.
"దనుజాంతకు బొడ్డుతామెర కాదా
జననకారణము సర్వమునకు" 4-133

**బొడ్డుపూపకొడుకు:** వి. బ్రహ్మ, విష్ణువు నాభికమలంలో పుట్టినవాడని వ్యుత్పత్తి.
"బొడ్డుపూపకొడుకుతో పుక్కిటి తమ్ములముతో
నొడ్డిన రతులతోడ నోలలాడీని" 5-141

**బొడ్రాయి:** (బొడ్డు + రాయి) వి; ప.బం. కలరా, మశూచి మొదలైన సాంక్రామిక సాంఘిక వ్యాధులు, పశువ్యాధులు సోకకుండా గ్రామవాసులు పూజించే నిలువున నాటిన పెద్దరాయి.
"ఇంతటి శ్రీవేంకటేశ ఇట్టె నన్నుఁగూడితివి
పొంతలనే శిరసిది బొడ్రాయి గాదా" 25-451

**బొత్తుగా:** క్రి.విశ. బొత్తిగా, పూర్తిగా.
"బొత్తుగా నీ వాపచేత బుద్ధులు వినఁగాఁగాక
హత్తి నీతోనేఁదొల్లి అలిగితినా" 12-409
"బొత్తుగా మిమ్ము గెలిచెఁ బొగడరో మెచ్చీని"
2-245

**బొద్దులు:** వి; బహు. శిశువుల చేతి ఆభరణవిశేషం.
"ముద్దుల వ్రేళ్లతోడ మొరవంక యుంగరాల
నిద్ధపుంజేతుల పైడిబొద్దులతోడ" 6-1

**బొమ్మఁబెట్టు:** ప.బం; అ.క్రి. అవమానం చేయు, తిరస్కరించు. జయించినందుకు సూచనగా అరివీరుల బొమ్మలను కాలియందెలపై చెక్కించడమే బొమ్మపెట్టడం దీనిపై వచ్చిన పలుకుబడి గౌణార్థం తిరస్కరించడం.
"మహి నా పుట్టుగులకే మరి బొమ్మఁబెట్టినాడ
విహితమిందుకు నేది విధి చెప్పవయ్యా" 3-311

**బొమ్మంచు మోవి:** వి. ఎఱ్ఱని పెదవి.
"పులకజొంపాలతోడ బొమ్మంచుమోవితోడ
కొలచినందె కొలచి కొంక నేఁటికే" 9-117

**బొమ్మచారి:** (4) వి. బ్రహ్మచారికి వికృతిరూపం. పెండ్లి కానివాడు, బ్రహ్మచర్యమందున్నవాడు.
"బిత్తలై పరువులిడి పిన్న బోడి తలతోడ
కొత్త బొమ్మచారియై గోచి గట్టెను" 4-254

**బొమ్మచారితనము:** (2) వి. బ్రహ్మచర్యం. చూ: బొమ్మచారి.
"బూమెల నీ వాడుకొన్న బొమ్మచారితనమెల్ల
పామిడిగొల్లెతలందే పచ్చిదేరీఁ బదరా" 22-43

**బొమ్మజంకె:** (4) వి. కనుబొమలతో బెదిరించడం. (జంకె జంకెనకు రూపాం.)
"వొద్దనున్న ఇల్లాలి నురముపైఁ బెట్టుకొంటే
గద్దించి బొమ్మజంకెలఁ గైకొని కూడె (?)" 5-20

**బొమ్మజంకెన:** (2) వి. కనుబొమలతో బెదిరించడం.

"బొమ్మజంకెనలు పొలంతి చూపఁగా
నమ్మికలిచ్చీ నాయకుఁడు" 29-79

**బొమ్మపెండ్లి:** వి. బాలికల క్రీడావిశేషం, బొమ్మలను పెండ్లికూతురుగా, పెండ్లికొడుకుగా చేసి ఆడుకునే ఆట, బొమ్మలపెండ్లి.

"పిన్నదాననై బొమ్మపెండ్లి నేఁజేయఁగాను
నన్నుఁ జూచి నీవు నాఁడే నవ్వితివి గదరా"
20-45

**బొమ్మరపరపు:** స.క్రి. ఆశ్చర్యపఱచు, భ్రమపఱచు.

"వలరాయని చి(చీ)రు నమ్ములు (?)
వడిఁదాకిన గంటవలెఁ
బొలుపుగఁజూచినవారల బొమ్మరపరపెడిని"
5-122

**బొమ్మరపోవు:** ప.బం; అ.క్రి. దిగ్భ్రమచెందు, ఆశ్చర్యపడు, బమ్మెరపోవు, విస్తుపోవు.

"బొమ్మరపోవఁడు పూతకిఁబొరిగొని
అమ్మరో గయ్యాళిశిశువు" 6-149

**బొమ్మరము:** (2) వి. బొంగరం. (బాలక్రీడావిశేష సాధనం)

"పొంచి నీతో జాళిలేక బొమ్మరాలు వేసేవారు
ముంచి చేతులు చాచేరు మొగిఁజూడవయ్యా"
7-264

**బొమ్మలపెండెము:** వి. ఓడింపబడిన వారి బొమ్మలను కూర్చి చేసిన కాలిఅందె.

"మగువ పాదమున బొమ్మలపెండె మున్నది
నిగనిగ మనీ నదే నీ విచ్చినదా" 12-436

**బొమ్మిరెడ్డిచెర్లహరి:** బొమ్మిరెడ్డిచెర్ల గ్రామంలో వెలసిన నృసింహస్వామి. ఈ గ్రామం ఎక్కడిదో తెలియదు. బహుశః కడప మండలంలోనిది కావచ్చు. (తా.అ. తెలుగునాడు – 109 పు)

"పొంది లకిమమ్మతోడ బొమ్మిరెడ్డిచెర్ల హరి
యిందరి శ్రీవేంకటేశుఁ డేలుచున్నాఁడు" 17-449

ఈ కీర్తనలో ప్రహ్లాదవరదుడు, శ్రీనరసింహుడు అని ఉండడంవల్ల ఇట హరి శబ్దం నృసింహస్వామి వాచకమే.

**బొమ్మె:** వి. మూర్ఛ.

"కుమ్మరించి యాపెలోని కోరిక దీరుచరాదా
బొమ్మెల నింతలో వెలిఁబుట్టీనా యీ సుద్దులు"
20-580

## బో

**బోంసేయు:** స.క్రి. భోజనంచేయు అనే అర్థంలో జానపదవ్యవహారం. విలక్షణప్రయోగం.

"బువ్వాన నాతఁడు నిన్ను బోంసేతము
రమ్మంటే
పువ్వుల వాటుల నేల పూఁచి వేసేవే" 27-226

చూ: భోంసేయు.

**బోయతి:** (12) వి. 'బోయెత'కు రూపాం. బోయస్త్రీ.

"పొదిగొన్న పెనుఁగొప్పు బోయతి మించు
బొదిలిన గుబ్బల బోయతి" 5-175

**బోయనాయఁడు:** వి. శ్రీవేంకటేశ్వరస్వామి. తిరుమల ఒకప్పుడు పెద్ద అటవీప్రాంతం. కనుక బోయవాళ్లు అక్కడ ఎక్కువగా నివసించేవారేమో. అందువల్ల వేంకటేశ్వర స్వామి 'బోయనాయఁడు'గా వర్ణింపబడిఉంటాడు.

"పొడవైన శేషగిరి బోయనాయఁడు
విడువ కిందరిఁగాచు వెడ బోయనాయఁడు
పొలసి మీసాల పెద్ద బోయనాయఁడు
మలిగి వీపున గట్టే మంకు బోయనాయఁడు"
1-460

**బోయిఁడు:** వి. సారథి.

"అందపుబోయిఁడవుగా నర్జుని బండి గద్దు"
7-319

**బోరవీఁపువాఁడు:** వి. వక్షస్సు వీపుగా గలవాడు. కూర్మావతారుడైన విష్ణువు.

"పొలసుమేనివాఁడు బోరవీఁపువాఁడు
సెలసుమోరవాఁడు సిన్నెకా" 5-182

**బోరునన్:** క్రి.విణ. శీఘ్రంగా.

"పూని నేఁదలఁచఁగానే బోరున వచ్చితివి"
12-318

**బోలుఁగొప్పు :** (2) వి.ఒకరకం కొప్పు, లోపల ఏమీలేకుండా వేసుకున్న కొప్పు.
"పొడవుగ నేడ లేని బోలుఁగొప్పు పెట్టితివి
విడుపులు సాగీనటే నీ నెరులు" 18-292

## బ్ర

**బ్రహ్మాత్య :** వి. 'బ్రహ్మహత్య'కు వాడుకరూపం కావచ్చు.
"సేసిన నా బ్రహ్మాత్యలు శిశుహత్యలు గోహత్యలు
ఆసల నెన్నో యెన్నో ఆయా జాడలను" 1-134

## బ్రా

**బ్రాహ్మఁడు :** వి. 'బ్రాహ్మణుడు' అనే శబ్దానికి వ్యావహారిక రూపం.
"పాపమెరంగని బ్రాహ్మఁడు యెందుఁ
జూపరాని చోటు చూపీనయ్యా"
1-209 & 1-135

## భ

**భంగపడు :** అ.క్రి. అవమానపడు, ఓడిపోవు.
"అడర నీ విధికి విధియగు వేంకటేశుకృప
పడయకుండఁగ భంగపడకపోరాదు" 1-134

**భంగించు :** స.క్రి. మోసపుచ్చు.
"భంగించి పదారువేల బలిమిఁ బట్టినట్టే
చెంగట నన్ను నీవు చేయి వట్టితివి" 13-467

**భయభక్తి :** వి. భయం మరియు భక్తి. ఇది ద్వంద్వసమాస పదం. కనుక 'భయభక్తులు' అని బహువచనాంతంగా ప్రయోగించే బదులు ఏకవచనాంతంగా ప్రయోగించడం విశేషం.
"యిందలి యాసలనే పో యేచిన నా భయభక్తి
యెందును నావల్ల నీకు నించుకంతా లేదు"
2-468

**భయస్తుఁడు :** వి. 'భయస్థుడు' అనే రూపానికి వ్యావహారిక రూపం. భయస్వభావం కలవాడు.
"నిలిచి భయస్తుఁడనై నీ యెదుట దైన్యమే
పలుకఁగఁగావకుండఁబాడిగాదు నీకు" 1-501

**భల్లూకులు :** వి; బహు. భల్లూకములు, ఎలుగుబంట్లు.
"కూలిరి భల్లూకుల ఘోషములకు
వాలిరి వాయుజవాలహతి" 4-523

**భవంతిమేడ :** వి. నాలుగిండ్లు కలిపి కట్టిన పెద్దమేడ.
"భవంతిమేడలో నిన్నుఁ బారితెంచి కాఁగలించి
దువాళివలపు చెల్లె తొయ్యలి నీకు" 7-530

**భవనాశి(యేరు) :** వి. అహోబలం పైనుండి పారే నది పేరు.
"పంచలఁబంతాలు మీరి భవనాశియేరు వార
చెంచెతలఁగోరీ నరసింహదేవుఁడు" 2-228
"పరిపరివిధ విధముల భవనాశిదరులను
సరసములాడీని సాటికి బేటికిని" 28-35

## భా

**భాగించుకొను :** స.క్రి. భాగము చేసుకొను, పంచుకొను.
"పరిమళమొక్కటే భాగించుకొనుటే వేరు"
3-238

**భాగ్యమంతురాలు :** (2) వి. భాగ్యం కలిగిన స్త్రీ, భాగ్యవంతురాలు అనేది సాధురూపం.
"నేనే భాగ్యమంతురాల నిన్నేమని పొగడేను
పూని నేఁదలఁచఁగానే బోరున వచ్చితివి"
12-318

**భారకుఁడు :** (7) వి. భారం వహించేవాడు, పోషకుడు. ఈ అర్థంలో ఇది విలక్షణప్రయోగం.
"తిరువేంకటాచలాధిపుఁడు దానె యుండె
పరిపాలనము సేయ భారకుండితఁడు" 1-170
బాగకుఁడనే ప్రయోగం కూడా ఉంది.

**భారపెట్టు :** స.క్రి. భారం కలిగించు.
"భారపెట్టి దేహమెల్లా బడలించిన యాన
పారి మమ్మేఁచితి వింతి బదుకవో యాసా"
4-456

**భారీతనముది :** (భారీతనము + అది) వి. గొప్పతనం కల స్త్రీ, పెద్దతనం కల స్త్రీ.

"మేరతో నున్నదానికి మిక్కిలి కీర్తి గలుగు
భారీతనముదానికి పరులెల్లాఁ జుట్టాలే" 17-257

**భార్గోటినరసింహుఁడు :** వి. చిన్న అహోబలానికి సుమారు మూడుమైళ్లదూరంలో భార్గవతీర్థం అనే క్షేత్రంలో వెలసిన నృసింహస్వామి. నవనారసింహుల్లో ఒక స్వామి.

'మరలి బీభత్సపు మట్టిమళ్ల నరసింహ
నరహరి భార్గోటినరసింహా" 1-453

**భాలాక్షము :** వి. ఫాలము (నుదురు) నందలి కన్ను. భాలము ఫాలమునకు రూపాం.

"భాలాక్షముతో బ్రహ్మాండకోట్ల
కేలికవై నీ వెట్లుండితివో" 1-68

**భాష్యకారులు :** (4) వి; బహు. శ్రీభాష్యాన్ని రచించిన భగవద్రామానుజాచార్యులు.

"దొడ్డఁజేసె భాష్యకారులు, ప్రతిపాలించఁగలిగె
భాష్యకారులు
పైకొనఁగఁ గరుణించె భాష్యకారులు,
పంకమెల్లఁబోఁగడిగె భాష్యకారులు" 1-162

## భు

**భుజవేయు :** (?)

"కోపులఁ బుణ్యములెల్ల గోవిందుని కిచ్చితిమి
పూఁపల స్వర్గముత్రోవ భుజవేయరో" 2-145

**భువనేశ్వరము :** వి. గృహవిశేషం, చుట్టుభవంతి.

"పువ్వుల తోఁటలనీడ భువనేశ్వరములోన
జవ్వనపు మనుజకేసరి వీఁడె" 4-512

## భూ

**భూపతి చెరు (ర్వు)వు :** వి. కోనేరు. కోన్ అంటే ప్రభువు. కోనేరు అంటే స్వామి పుష్కరిణి అని సంపాదకులు. భూపతిచెరువు మరొకటున్నదా ఆలోచించాలి.

"మేరతో భూపతిచెరువు మేటి శ్రీవేంకటేశుఁడు
యీరీతి నన్నుఁగూడఁగా నీడ నాపె వుండెనా"
19-175

"చెప్పవయ్య నాతోను చెలి నీకెంత చుట్టమో
తెప్పల భూపతిచెర్వు తిరువెంగళప్పడా"
26-281

"చెన్నలర భూపతిచెరువుకాడ నున్నాఁడు
వెన్నెలబాయిట నాడీ వేఁకటేశుఁడు" 24-368

**భూపతిచెర్వు తిరువెంగళప్పఁడు :** వి. కోనేటి రాయడైన శ్రీవేంకటేశ్వరస్వామి; చూ: భూపతిచెరువు. 26-281

## భో

**భోఁసేయు :** స.క్రి. 'భోంచేయు' పదానికి వ్యావహారిక రూపం. (?)

"యింట నే భోఁసేసేవేళ యెంగిలి ముట్ట వచ్చేవు
అంటకు మన్నంతలోనే అలిగేవు" 11-262

**భోగరాయఁడు :** వి. భోగముల ననుభవించే రాయుడు.

"గద్దెమీఁద నల్లవాఁడె కంటిరటే చెలులాల
పొద్దొక సింగారాల భోగరాయఁడు" 20-186

## భౌ

**భౌష్యము :** వి. భవిష్యము, అదృష్టం. విలక్షణప్రయోగం.

"శ్రీవేంకటపతి సే విది యొకటే
భావించు నాయుష్యభౌష్యములు" 4-385

"అనంతుని పాదములే ఆయుష్యభౌష్యములు
దనుజారి పాదములే ధనధాన్యధర్మములు"
4-149

## భ్ర

**భ్రమత :** (4) వి. ప్రేమ, మోహం.

"నాకు నాకే వెరగయ్యీ నన్నుఁజూచి
పైకొని మరుఁడు సేసే భ్రమతఁగాఁబోలును"
9-98

**భ్రమయించు :** (4) స.క్రి. మోహపెట్టు, భ్రమ కలిగించు.

"వూరకే వద్దఁగూచుండి వొళ్లిమీఁదఁజెయి వే
భారపుఁదురుమువట్టి భ్రమయించఁగా" 16-102

"అలర నుతించరో హరిని
యెలయించి మిము భ్రమయించీని( గాలము "
1-338

**భ్రమసు :** భ్రమయును అనేదానికి వ్యావహారికరూపం.

## భ్రా

**భ్రాంతి :** వి. ప్రేమ (?)

## మ

**మంకు(దనము :** (16) (మంకు+తనము) వి. మొండితనం, మూర్ఖత్వం, గడుసుదనం.

"అంకెలో మెల(గవలె ఆయములంట(గవలె
మంకుదనమింత యేలే మగువలకు" 26-476

"జంకెన చూపుల నిన్ను సాధించదడవా
మంకుదనమేటికనే మాటకుగాక" 26-402

**మంకు :** (4) విణ. మొండి, మూర్ఖుడు, గడుసు వి. అవివేకం, మొండితనం.

"తెగరాని మంకులకు తెలిపి చెప్పుట మేలు
తగులైన యెడకు నాదరించ(బాడి" 24-282

"దీనికి అవివేకం, మొండితనం మొదలైన అర్థాలు ఉన్నాయి. కాని ఈ అర్థాలు ఈ కింది కీర్తనభాగంలో కుదురవు. ఇట అర్థవం, మంచితనం అని చెప్పుకోవాలి అని సం.ప.స. (14 సం. 354)

"మక్కువ నేర్చితి(గాని, మంకు నేరనైతి"
14-548

**మంకో మరులో :** మూర్ఖత్వమో మరులో.

"మంకో మరులో మదమో ముదమో
జంకో లంకో జగడమో" 3-77

**మంగలాన జాజులు వేచు :** ప.బం; అ.క్రి. లలితమైన వాటిని పాడుచేయు, అనుచితమగు పనిచేయు. (పెనం మీద జాజిపూలను వేచు అని వాచ్యార్థం.)

"సంగతెఱి(గవు చీ జాణనందువు
మంగలాన జాజులు వేమారు వేచేవు" 5-4

**మంగలోజు :** వి. మంగలి.

"కా(పుటూరి మంగలోజు గడెమీది రాజు గా(గా
కా(పులెల్లా( బనిమాసి కందినయట్టు"
4 అను. 31

**మంగళసూత్రము :** వి. తాళిబొట్టు గల సూత్రం, పెండ్లిలో వరుడు దీన్ని వధువు మెడలో కడతాడు.

"మందగొల్లెతల కెల్లా మంగళసూత్ర మీత(డు"
4-526

**మంగళాష్టకము :** (3) వి. వివాహసమయంలో వధూవరుల శ్రేయస్సుకోసం పురోహితులు చదివే ఆశీర్వచనశ్లోకాలు.

"పలుకుల సరసాలు బలు మంగళాష్టకాలు
మలసి యవె మదనమంత్రాలు" 16-439

"మునులు మంగళాష్టకములు చదువుచుండ(గ
పెన(గుచు సేసలు పెట్టే రదే" 14-110

**మంగాంబుధి హనుమంతుడు :** మంగాంబుధి (= మంగ సముద్రము) అనే గ్రామంలో వెలసిన హనుమంతుడు. ఈ మంగసముద్ర మెక్కడున్నదో తెలియరాదు. చంద్రగిరి సమీపంలో ఉన్న మంగాపురం అలమేలు మంగాంబ పేర ప్రఖ్యాతిచెందిన తాళ్లపాక వారి అగ్రహారం. మంగాంబ సముద్రరాజతనయ కనుక మంగాపురమే మంగాంబుధి కావచ్చునేమో! (సం.వా.ప.) నేటి మంగాపురంలో ఆంజనేయవిగ్రహాలు లేకపోలేదు.

"మంగాంబునిధి హనుమంత నీవే కాలము
చెంగట శ్రీవేంకటాద్రి శ్రీరామరక్ష" 4-459

"బలిమి శ్రీవేంకటేశు బంటై మంగాంబుధి
నిల యీ హనుమంతుని కెదురా లోకము"
4-462

**మంచముకిందే నుయ్యి(నూయి) :** (6) ప.బం; వి. కనబడని పొంచి ఉన్న ప్రమాదం.

"మదినింత విచారించ మంచముకిందే నుయ్యి
కదిసె నంతటి మీద(గా పనులు" 22-9

"మఱి విచారించ( బోదే మంచముకిందే నూయి
మెఱయ(గ హరి(గొల్చి మించరో ప్రజలు"
4-135

**మంచముకోడు:** వి. మంచముకాలు.
"మంచి పువ్వుదండ లాపె మగనికి నంపితేను
కొంచ కేల నీ మంచముకోటఁ జుట్టేవు" 26-272

**మంచము చెంతనే నుయ్యి:** ప.బం; వి. కనబడని పొంచి ఉన్న ప్రమాదం. చూ: మంచము కందే నుయ్యి.
"చింతించితేను మంచము చెంతనే నుయ్యి"
28-67

**మంచమువంచు:** ప.బం; అ.క్రి. మంచం వేయు, పడక వేయు.
"ముంగిటనే పాలుగాచి మూలఁ దోడంటు
సంగతిగా నప్పుడే మంచము వంచేవు" 8-198

**మంచుకాలము:** వి. హేమంతఋతువు, మంచుపడే కాలం.
"పలికే నీ మోవి పక్కులుగట్టె నేడు
కలికి యిప్పుడు మంచుకాలము గాదు" 26-94

**మంచుకుఁబెట్టిన మైనపుఁ గుళ్లాయ:** ప.బం; వి. (?)
"మంచుకుఁ బెట్టినయట్టి మైనపుఁ గుళ్లాయలు
అంచెల లవుడి(టి)సెట్టు లానఁబోయీనా"
10-1-33

**మంచు గుంచానఁ గొలుచు:** ప.బం; అ.క్రి. అసాధ్యమైన కార్యాలను నిర్వర్తించగలుగు. (మంచు కరిగిపోయే వస్తువు. దాన్ని కుంచంతో కొలవడం సాధ్యంకాని పని కదా! దీన్నిపై వచ్చిన పలుకుబడి.)
"మంచుఁ గుంచానఁ గొలిచే మరఁది వీఁడే"
5-260

"మంచు కుంచానఁబోసి కొలువగనేర్తు" అనే జానపదగేయంలో కూడా ఈ పదబంధం కనిపిస్తుంది.

**మంచునీరు కుంచాలఁ బోయు:** ప.బం; అ.క్రి. మంచునీటిని కుంచాలతో కొలుచు. అసాధ్యమైన దానికి పూనుకొను.
"మాయలఁబెట్టుచు నీవు మంచునీరు కుంచాలఁ
బోయుచు నన్నేపక పోయేవో పోవో" 5-285

**మంటఁగలిసి పోవుట:** ప.బం; వి. నశించడం.
"కలుషబుద్ధులఁ బ్రజ్ఞగల దింతయును మంట
గలిసిపోవుటే పూర్వకర్మశేషం" 1-113

**మంటఁజేసిన బొమ్మ:** ప.బం; వి. అస్థిరం. మట్టితో చేసిన బొమ్మ అస్థిరమే కదా!
"మంటఁజేసిన బొమ్మ మనికి సంసారంబు
రెంటికిని గాని వీరిడి కొలువు బ్రదుకు" 1-104

**మంటమారి:** (మంట + మారి) వి. కోపిష్ఠి.
"నగినందుకుఁ బతితో నాఁటఁ గోపించుకొంటేను
మగువా అది మంటమారి గాక" 12-393

**మంటికి:** నిరుపయోగము.
"అందిన శ్రీవేంకటేశుఁడంతరాత్ముఁడొక్కఁడింతే
మందలించి కొలువరు మంటికా మీ జ్ఞానము"
3-65

**మండాటము:** (4) వి. బ్రతిమాలుట, దైన్యంతో యాచించడం, పరితాపం అని ఆం.ప.ని.
"మా మండాటాలకు నీకు మన్నన లొసఁగవమ్మ
నాముదేర మగనితో నవ్వవమ్మా" 28-137

**మండాడు(కొను):** అ.క్రి. దైన్యంతో యాచించుకొను.
"ఇవల నీ సేవ సేసి ఇన్నిటా మండాడుకొంటి
అవి యేల తలఁచేవు ఆ సుద్దులు" 26-229
"మన్నించనేర్తువు నీతో మండాడేవారమా"
21-77
"మానరే ఆతని నేల మండాడేరు
కానుక మా మొక్కులివి కడ్డాయము గాదు"
7-593

**మండెము:** వి. కడపజిల్లా రాయచోటి మండలం లోని చినమండెం అనే గ్రామం, ఇది నృసింహస్వామి వెలసిన క్షేత్రం.
"చెలఁగి మండెములోన శ్రీవేంకటేశ కూడితి
నలువంక చెలులతో నవ్వే నేను" 27-360

**మండెము నారసింహుడు (నృసింహుడు):** చూ: మండెమురాయడు.
"నవగుణి వేంకట నారసింహా వో

నవమూర్తి మండెము నారసింహా" 1-259

**మండెమురాయఁడు :** (5) వి. కడపజిల్లా రాయచోటి మండలంలోని నేటి చినమండెం అనే గ్రామంలో వెలసిన నృసింహస్వామి. ఈతడు నవమూర్తి నారసింహుడని కీర్తింపబడినాడు.

"యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టే
మారుని తండ్రివి నీవే మండెమురాయఁడవు"
7-513 & 10-2-66

**మండ్రాడు :** అ.క్రి. 1.పెనఁగులాడు, మల్లాడు 2.శ్రమపడు, బాధనొందు.

"మండ్రాడి తల్లిపైఁ జేసే మచ్చికెల్లా నీది
నింద్రు(?) దల్లిలో వాఁడవు నీవె కనక" 15-144

**మంతిరించు :** స.క్రి. మంత్రించు, రహస్యంగా చెప్పు.

"మగువకుఁ జెవిలోన మంతిరించినవే కావా
పగటున నందరినిఁ బరచుమని" 13-491

**మంతు :** (3) వి. ప్రసిద్ధి.

"మంతుకు వలపుపూసి మఱి నేరేడులమ్మీని
సంతసపుటిసుకలో చద్దివేఁడి పండులు" 17-336

**మంతుకెక్కు :** (27) ప.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు, వార్తకెక్కు. సం.ప.స. లో ఈ పదవివరణ ఇట్లా ఉంది. 'మంతు' అనగా మాట. మాటామంతీ అనే జంట పదంలోని 'మంతి' కూడా 'మంతు' వికారమే. 'పదిమంది చెప్పుకొను మాటలలోనికి వచ్చు' అనే అర్థంలో ఈ పలుకుబడి యేర్పడింది. 'వార్తకెక్కు' ఇలాంటిదే.

"ఇంతకంటెఁ జెలులాల యేమి చెప్పె రతనికి
మంతుకెక్కె తన్నుఁదానె మంచిదయ్యీఁ గాక"
21-16

"చెంతనుండి కొంతవడికి సిగ్గుపడవచ్చుమగాని
మంతుకెక్కిన వలపు మఱవరాదయ్యా"
29-5 అను.

"మంతుకెక్కిన ద్రౌపదీమానరక్షకుఁడీతఁడు
చెంతనే వుద్ధవుపాలి చింతామణి యీతఁడు"
4-526 & 2-506

**మంత్రాలు మందులు :** ప.బం; వి; బహు. మాయలు - మందులు అనే అర్థంలో జంటపదం.

"విందును నీ కతఁడు నోరెత్తకుండ మంత్రాలు
మందులు నేరుతువుగా మా యమ్మ" 5-359

**మంత్రించుకొను :** వశం చేసుకొను.

"చిత్తగించి తగవులు చెప్పె దిందులోనేమి
మత్తిలి పచ్చిమాటల మంత్రించుకోవయ్యా"
13-428

**మందగొల్లెత :** వి. గొల్లపల్లెలోని గొల్ల స్త్రీ.

"అందపు శ్రీవేంకటేశ! అండ్లు గారా తాము నీకు
మందగొల్లెతల నెల్లా మర్మాలెత్త నోపనా"
25-257

**మందటలాడు :** (3) (మందటలు + ఆడు) అ.క్రి. 1.తగవులాడు 2. ఎదిరించు 3. కలియు.

"మనసిచ్చి యాపె నీతో మందటలాడితేను
చొనిపి నన్నేల నీవు చుట్టుకొనేవు" 21-94

"యిందు రమ్మని పిలువ యేలుకొన్నదాననా
మందటలాడి పెనఁగ మంకుదాననా" 27-268

"కందువకు రాఁగాను కాఁగిటఁ గూడితిఁ గాక
మండటలాడఁబోతేను మత్సరించేనా" 27-84

**మందటాడు :** (3) (మందట + ఆడు) అ.క్రి. జగడమాడు. (మందట = కలహం)

"మందటాడ నేమిటికి మచ్చికసేయఁదగును
అంది పదారువేలఁ బెండ్లాడినందుకు" 18-352

"మాకు మీకే మందటాడి మీరు మీరే మీలోన
ఏకమై కూడితిరి మీరిందుకా యిది" 5-106

**మందడిసాని :** వి. గొల్లస్త్రీ, గొల్లభామ.

"మందడిసానుల కమ్మని మోముఁదమ్ములకు
చెందిన తుమ్మెదవో మా శ్రీకృష్ణుఁడు" 11-343

**మందడీఁడు :** (మందడి + ఈఁడు) గుబ్బపువాడు, మందురకుడు.

"మందడీఁడవా వోయి మంకులెల్లా నెరపేవు
విందు చెప్పి చెక్కు నొక్కి వేఁడుకొనఁగాను"
23-551

**మందపిలు:** అ.క్రి. ఈ శబ్దం సూ.ని. లో కానీ శ.ర. లో కానీ లేదు. ఇది 'మందటిలు' కావచ్చునేమో! మందటిలు కు 1. ఉడుగు, నిలచిపోవు, క్షీణించు 2. మిన్నకుండు, ఊరకుండు 3. మెండుకొను, అతిశయించు అని అర్థాలు. వీటిలో మొదటి రెండర్థాలు అన్నమయ్య కీర్తనల్లో పొసగుతాయి.

"పట్టరాని విషముల పాముఁ దెచ్చి తలకిందఁ

బెట్టుకొన్నా నది మందపిలివుండీనా" 1-177

**మందపెండ్లికూఁతురు:** వి. గొల్లపల్లెలోని పెండ్లికూతురు, గొల్లపెండ్లికూతురు. (మంద = గొల్లపల్లె)

"సందడిఁ జేతులు చాఁచి జవ్వనములంటి యంటి

మందపెండ్లి కూఁతులను మరగించేవు" 17-7

**మందప్రోయాలు:** వి. గొల్ల ఇల్లాలు, గొల్ల స్త్రీ.

**మందబోయిరాలు:** వి. గొల్లస్త్రీ.

"మందబోయిరాండ్లను మానముపైఁదిట్టుకొంటా

అంది పోకముడి విడి చాడుకొంటాను" 21-327

**మందమిరియాలు:** (4) వి; బహు. వ్యర్థం, ఎవరికీ ఉపయోగపడనివి.

"మాటలాడఁబోయి చెలి మందమిరియాలు చల్లె" 23-583

"మందమిరియాలు వో నీ మాటలు

నిందలకు గురివో నీ నీటులు" 9-116

**మందమిరేలు:** వి; బహు. మందమిరియాలు.

"అందరివలెనే చూచేవప్పటి నన్ను నీవు

సందడి మందమిరేలు చల్లఁగా నేను" 23-428

**మందవారము:** వి. శనివారము; ప్రసిద్ధమైన ఈ పదం ప్రసిద్ధములైన శ.ర; సూ.ని., ఆం.వా., మొ॥ నిఘంటువుల్లో ఎందుకో ఎక్కడా చేరలేదు.

"జగతి వైశాఖశుద్ధచతుర్దశి మందవార

మగణితముగఁగూడె నదె స్వాతియోగము"

14-285

**మందవారి మరది:** వి. గొల్లవారి మరది, శ్రీకృష్ణుడు.

"మానసీఁడు వుంటి నోవి మరఁది వీఁడే

మానముపై చేయి చాఁచీ మందవారి మరది"

5-260

**మందవారు:** వి; బహు. గొల్లవారు.

"జంకెనలవారమా సరసపువారమూ

మంకుమంకుమాటల మందవారమా" 6-83

**మందావు కల్లలు మావులెల్లా మొగ్గలు:** (?)

18-259

**మందుమంతరము:** ప.బం; వి. రోగాన్ని మాన్పే మందూ మంత్రం అనే అర్థంలోని జంటపదం.

"మానని పుంటికి మందుమంతరము లేని

గోనెఁబట్టిన బంక గోడమీఁది మన్ను" 15-462

**మందులాఁడి:** (మందులు + ఆఁడి) మగ్లు మందులు పెట్టేది, వశ్యౌషధాలు పెట్టేది. మందులమారి అనడం సహజం. 'మందులాడి' ప్రయోగం విలక్షణం.

"ముప్పిరి నది యంతటి మొగమాయ మందులాఁడి

విప్పుచు నీతో విన్నవించరాదు గాక" 29-171

**మందులు నూరు:** (3) ప.బం; అ.క్రి. ప్రతికూలపరిస్థితులు కల్పించు, విరోధం కల్పించుకొను.

"మాటకు మునుపనే మందులు నూరేవుగాని

గాఁటపు గుబ్బల దగ్గర వేలరా" 19-428

"దూరి మాటాడ నోప మందు లట్టె నూరకురా"

11-365

**మందులు మంత్రాలు:** (2) వి; ప.బం; బహు. రోగాలను పోగొట్టే మందులు మంత్రాలు అనే అర్థంలో జంటపదం.

"మందులో మంత్రాలో నీకు మరి పంపు చేసుకొనె

సందడి నీపెండ్లాడి నీ సగినాలు మంచివే"

25-64

**మందులు మాయలు :** (2) ప.బం; వి; బహు. మందులు – మంత్రాలు అన్న అర్థంలో జంటపదం.

"మందులు మాయలు మఱచితివో యిప్పు
డిందూ నామీఁద నింకాఁ జేసేవో" 6-69

**మందెమేళము :** (51) వి. 1. చనవు, అతిపరిచయం, జంకు కొంకులు లేకపోవడం 2. స్నేహం 3. ఉపేక్ష 4. గర్వం 5. గేలి, పరిహాసం.

చనవు :

"మందెమేళాలు సేసుక మలసి సొలసి నవ్వి
సందుసుడిఁ దన మోవి చాటు చూపీని" 17-4

పరిహాసం :

"మగనితో నేల మందెమేళాలు,
సొగిసి యిచ్చకములే చూపవలెఁగాక"

ద్వేషం అని ఆం.ప.ని.

**మందెమేళములది :** వి. చనవుగలది, స్నేహం కలది, గర్వం కలది.

"ననుపున నీతోను నవ్వులు నవ్వమనేవు
మునుకొని మందెమేళములదానవా" 25-228

**మందెమేళములాడు :** (2) అ.క్రి. పరిహాసమాడు

"విందుల మోవి చూపి విడె మడిగేటివాని
మందెమేళములాడుచు మారుకొందురా"

19-38

**మకరాల చీర :** వి. మొసలిబొమ్మలు గల చీర.

"వినుకలిఁ జొక్కఁగాను వెస మరుఁడేఁచితేను
ఘనమకరాల చీర గట్టె నతివ" 14-528

**మక్కళము :** వి. నక్షత్రం (?), (అధికం)

"వెలుపట మక్కళాలు వేగుదాఁకా నుండరో"

3-525

"మక్కళింపు మంకులతో మాటలాడ రిద్దరును
వొక్కటై యుండుండి మీకు నొరటులు వచ్చెఁగా"

17-304

**మక్కళించు :** స.క్రి. 1.ఉబికించు 2.సరిచేయు, సమానం చేయు 3.కూర్చు, అమర్చు 4.పెంపొందించు (తె.వ్యు.కో.) అ.క్రి. 1.జ్వరాదిరోగం తిరుగబెట్టు 2.కలియు 3.వ్యాపించు (సూ.ని.) అనువుపడు, పోల్చు, వ్యాపించు(పర్యాయ.) ఆవర్తించు, సవరించు, సదృశము (ఆం.ప.ని.)

"మక్కళించి మక్కళించి మాటలు
నీవాఁడఁగాను
గక్కన నా మనసెల్లఁ గరఁగెనిదె" 21-289

**మక్కు :** వి. మాలిన్యం (తుంటీ, లప్పం, గాయం) (అ.క్రి. 1. కాంతివిహీనమగు 2. నవయు 3. చచ్చు శ.ర.) విణ. మలినమైన.

"మక్కుఁజెమటలు గాని మదనరసాలు గావు"

17-252

**మక్కువేయు :** ప.బం; స.క్రి. అతుకు.

"గుక్కక నా దీమసము గోడవంటిది యెంతని
మక్కువేసి తానే చూచి మమ్ముఁ గాచీఁగాక"

12-261

"మొక్కు మొక్కవచ్చుఁ గాక మొగముపై
నగవులు
మక్కువేయవచ్చునా మాపుదాఁకాను" 27-39

**మగఁటిమి :** వి. శక్తి, సామర్థ్యం. (శౌర్యం, పౌరుషం, మగతనం)

"మగఁటిమి మీ వాదులు మానుపఁగద గదా"

27-382

**మగఁడులేని మనువు :** ప.బం; వి. మగడు లేని పెండ్లి, అసంభవం.

"మక్కువ మగడు లేని మనువు గలుగునా"

2-130

**మగఁడు లేని సింగారము :** ప.బం; వి. వ్యర్థం.

"మరుగురునికిఁగాని పూవులపూజలు
మగఁడు లేని సింగారములు" 2-235

**మగఁడు విడిచినా మామ విడువనియట్టు :** నానుడి; అసలువాడు వదిలిపెట్టినా పైవాడు వదలనట్లు, ఒకబాధ తప్పినా మరో బాధ తప్పనట్లు.

"మగఁడు విడిచినా మామ విడువనియట్టు

నెగడిన నేమి సేయు నేనే రోయఁగాని " 2-476

**మగండ్లు:** వి; బహు. 'మగఁడు' శబ్దానికి బహువచనరూపం. ఇది విలక్షణరూపం. మగలు అని వ్యాకరణసిద్ధ రూపం.

"తెగువ సేసి నీకుఁ దెచ్చిరి బోనములు
మగండ్ల మాటదోసి మానిసతులు" 3-198

**మగనాలు:** (6) (మగని + ఆలు) వి. మగడున్న స్త్రీ, ముత్తైదువ.

"మగనాండ్లము మమ్ము మన్నించవయ్యా
అగడు సేయకువయ్యా అప్పటిని మొక్కేము"
12-540

**మగపాడి:** వి. శౌర్యం, మగటిమి, ఉపరతి, పురుషధర్మం.

"యొగసక్కేలు విన్నాడి ఇంతలోనె పంతమిచ్చి
మగువ గాఁగిలించుటే మగపాడి సుమ్మీ" 23-68

**మగపారి:** (?)

"తిరుపణి మణఁగెను తిరుగరా దెవ్వరికి
మరల నెలుగియ్యరో మగపారి" 15-118

**మగుటవర్ధనుఁడు:** వి. (?)

"మగుటవర్ధనులు మండలేశ్వరులు
జగదేకపతులుఁ జతురులు" 1-346

**మచ్చము[1]:** (29) వి. మచ్చ (క. మచ్చ, త. మచ్చె) గుఱుతు, కళంకం, మాలిన్యం, మఱక.

"తచ్చి తనపై మచ్చము తాఁజూచుకోరాకుంటే
అచ్చలాన నద్దమైనా నట్టె చూడుమనవే"
21-217

"కాయముపై మచ్చములు కడు సింగారమా"
21-320

**మచ్చము[2]:** (2) వి. మత్స్యమునకు వికృతిరూపం. చేప.

"చెక్కుల మకరాంకము జిగిఁగన్నుల
మచ్చములును
మిక్కిలి శంఖము మెడను మీఁగాళ్లఁ
గచ్ఛపములు" 9-201

"వారధిలో మచ్చకూర్మావతారము లైననాడు
నీరులో జంతువులైనా నీవు గాతువుగా" 15-6

**మచ్చమువట్టు:** వి. గుట్టుపట్టు, జాడపట్టు.

"మలసి వాడుఁజూపుల మచ్చమువట్టీనా"
11-361

**మచ్చికసుద్ధి:** వి. మోహపుమాట, ప్రేమవాక్యం.

"పచ్చిదేర నప్పటిని పానుపుపైఁ గూచుండి
మచ్చికసుద్దులు విని మరుగఁజేసితివి" 26-557

**మచ్చికె:** (12) వి. 'మచ్చిక'కు వ్యావహారికరూపం, మోహం, ఆసక్తి, వలపు, స్నేహం, చనవు, భ్రమ.

"ఇచ్చకమాడితిమీ యింతగా నోడితిమీ
మచ్చికె లింకా మాతో మానవా అయ్యా"
11-560

**మచ్చు:** వి. చొక్కుమందు, వశ్యౌషధం, పరవశం చేసే భస్మవిశేషం, మృగాలు మొ॥ వలలో పడడానికి వలకు దగ్గరగా ఉంచే ఆహారం, ప్రలోభం.

"ఏఁటి బుద్ధులు చెప్పేరే యింకా నీకు
మాఁటలాడుట గాక మచ్చు చల్లేదా" 8-61

**మచ్చుమేపు:** (3) వి. మరులుమందుల ఆహారం.

"మంచిమాటలే కావా మచ్చుమేపులు" 21-226

**మచ్చుల పాయము:** వి. యౌవనం (?)

"మచ్చులపాయములోని మంపు నా మతి"
26-210

**మచ్చెము:** (3) వి. మచ్చము, గుర్తు, చిహ్నం.

"మచ్చెము నీ మై యుండఁగా మరియేల
జంకించేవు" 29-98

"మెలుపు మచ్చెములు నీ మేన నిండివుండఁగ
తలమోచి యెన్నెన్ని తప్పులు వట్టేను" 23-404

**మచ్చెము:** మిక్కిలి (?)

"మచ్చెము చిక్కెను నీ మనసు నామీఁదను
వొచ్చెము లెల్లాఁదీరె నొడఁబాట్లేలయ్యా" 8-226

**మచ్చెము:** వి. మత్స్యము శబ్దానికి వికృతి రూపం. చేప.

"పొంచి మచ్చెమైన నాఁటి పొలసుకంపులు వాయ
సంచులఁ బన్నీట మజ్జనమార్చరే" 7-198

**మజ్జనమిల్లు:** (మజ్జనము + ఇల్లు) వి. స్నానగృహం. (bath room)
"జలజాక్షి నీ పతి మజ్జనమింట నున్నవాఁడు
జలక మందియ్యవే సంతోసానను" 24-401

**మజ్జాతి:** వి. ప్రకరణాన్నిబట్టి వంచన కావచ్చు అని సంపా.
"పలువుఁడిగాలు సేసే భామలకందరికి
చలివాసి కూడేది మజ్జాతి నీకు నయ్యా"
25-346

"మాతో నింకానా మజ్జాతా యను మాకు (?)
చేతికి లోనైనమీఁదఁ జెప్పవలెనా" 8-151
"నవమై శ్రీవేంకటేశ నాకె మజ్జాతి గాక
నివిరి వేరొక్కతైతే నీతోఁ బొందుసేసెనా"
11-347

**మటమాయతనము:** వి. మటుమాయతనమునకు రూపాం. మిక్కిలి మోసం, మిక్కిలి టక్కరితనం.
"మటమాయతనమున మగువలు మగవారి
సటకారితనమున సాధింతురు" 18-201

**మటమాయము:** (2) వి. 'మటుమాయము'నకు రూపాం. మిక్కిలి మోసం, టక్కరితనం.
"మటమాయపుచవి మానేనా" 4-69

**మటమాయలు:** (మాయలు+మాయలు) మిక్కిలిమోసాలు, టక్కరితనాలు.
"మటమాయలకు నీవు మరి వలపు చల్లేవు
తటుకున చెమటల తడి చూపవయ్యా" 18-551

**మటము[1]:** వి. 'మఠము'నకు జానపదుల వ్యవహారం. సన్యాసులు నివసించే స్థానం.
"కూరిమి మటములు గోపురంబులును
తేరుపడగెలే తెరువెల్లా" 1-119

**మటము[2]:** వి. మొండితనం, పంతం. శ.ర. లోనూ, తె.వ్యు.కో. లోనూ దీనికి కూర్చునే తీరు అనే అర్థం ఉంది. ఈ అర్థం క్రింది ఉదాహరణల్లో పొసగదు.
"మటము లేల నన్ను మన్నించుమనవే"
17-227

**మటుమాయములు:** వి. మిక్కిలి మోసములు, మిక్కిలి మాయలు.
"అటువంటి సతిఁగాని యాదరించవు
మటుమాయముల మాటు మందులే నీకు"
7-82

**మట్టమధ్యాన్నము:** వి. మిట్టమధ్యాహ్నం. (మధ్యాహ్నము నకు 'మధ్యాన్నం' అనేది జానపద వ్యవహారం.)
"మట్టమధ్యాన్నపువేళ మలయుచు నింటిలోనే
చట్టుల పెరుగు వేఁడీ చాలఁబెట్టరే మీరు"
24-160

**మట్టము:** వి. అల్పము, కొద్ది, సమానము.
"మట్టపు మలపుల మట్టెల కెలకుల
తట్టెడి నడవుల దాటెనదె అలరులు గురియగు"

**మట్టిన చోటు:** వి. తిరిగినచోటు.
"నెట్టన శ్రీవేంకటేశ్వర నీతోఁగూడఁ జగములు
మట్టిన చోటే మట్టే మనుజాలమిదె నేము"
3-340

**మట్టినచోటే మట్టు:** ప.బం; అ.క్రి. తిరిగిన (తొక్కిన) చోటే తిరుగు.
"నెట్టన శ్రీవేంకటేశ్వర! నీతోఁ గూడఁగ జగములు
మట్టినచోటే మట్టే మనుజాలమిదె నేము" 3-340

**మట్టు:** (20) వి. 1.మితి 2.పరిమాణం 3.ప్రదేశం 4.అందం 5.విధం 6.కుదురు 7.అమరిక 8.మర్యాద 9.ఆధారం 10.పర్యంతం, పాంతు 11.తొక్కుడు (సూ.ని.) 12.హ్రస్వం, తక్కువ. (ఆం.ప.ని.)
"ఆఁటది గర్వించితేను అంతట మట్టెరఁగదు"
24-382

"మట్టున నిండాకా నాపి మంకులు దెలిపితిమి"
25-350

"మట్టు లేని రామానుజమతము చేకొనుటే"
2-334

"మనసిల్ల నడ్డవెట్టి మట్టున నుండేనంటే
మనసు కోరికలు నీ మతకాలు" 1-466

**మట్టు:** స.క్రి. 1.తొక్కు 2.అణగదొక్కు 3.అధఃకరించు 4.బాధించు 5.చుట్టుముట్టు 6.పడవేయు 7.ప్రవేశించు.

"మట్టినచోటే మట్టే మనుజులమిదె నేము"
3-340

**మట్టుకుమట్టు:** ప.బం; వి. మితికి మితి, మేరకు మేర.

"కలసేనంటా మేను కడుఁబిప్పిసేయరాదు
వొలసి మట్టుకు మట్టే వుండవలెఁగాని" 23-234

"తరితీపు సేసేనంటా దండకు రాకుండుదురా
మరిగిన మగనితో మట్టుకుమట్టే కాక" 27-526

**మట్టుకువచ్చు:** అ.క్రి. దారికి వచ్చు, కుదురుకు వచ్చు, మాటవిను. మట్టుమర్యాద లోని మట్టు ఇది.

"మంకుదీరి తనుఁదానె మట్టుకు వచ్చును"
11-177

**మట్టుకొను:** అ.క్రి. కుదురుకొను, నెలకొను.

"మట్టుకొని వేణురవమున గొల్లెతల చీర
లట్టునిట్టు వదలించి నాతఁడౌదో కావో" 5-180

**మట్టుపడు:** ప.బం; అ.క్రి. కుదురుకొను.

"వొరసి దుర్గుణములను నూనిన నా చిత్తము
మరలి మంచిగుణాన మట్టుపడీనా" 4-345

**మట్టుమీరు:** (2) మితిమీరు, అతిశయించు, అతిక్రమించు.

"మట్టుమీరఁ జనవిచ్చి మన్నించితివయ్యా"
12-41

**మట్టుమేర:** ప.బం; వి. అడ్డు, సరిహద్దు.

"ఎదురులేక చరింతు రెట్టైనా శ్రీవైష్ణవులు
మదించి నేనుగులకు మట్టుమేర వున్నారా"
3-401

**మట్టెమళ్ల నరసింహము:** వి. చూ: మట్టెమళ్ల నరసింహుఁడు.

"నాటుకొన్న భార్గవూటు నరసింహము వీడె
నాటకపు మట్టెమళ్ల నరసింహము వీఁడె"
4-182

**మట్టెమళ్ల నరసింహుఁడు:** వి. పెద్ద అహోబలానికి నాలుగు మైళ్లదూరంలో ఉన్న మట్టెమళ్ల అనే ఊరిలో బీభత్స రూపంలో వెలసిన నరసింహస్వామి. నవనారసింహుల్లో ఒక స్వామి.

"మరలి బీభత్సపు మట్టెమళ్ల నరసింహ
నరహరి భార్గోటి నారసింహో" 1-453

**మడమె:** వి. మడమ, గుదికాలు, పాదంవెనుక భాగం.

"మడమెలదాఁకా వీడె మగువ నెరిఁగురులు
తడవి యెంత సదమదము సేసితో" 23-426

**మడిదున్నుకొని బ్రదుకు:** ప.బం; అ.క్రి. పొలం దున్ని జీవించు. 11-2-27 old

**మడిదొసకులు:** వి; బహు. (?)

"మడిదొసకులు గావు మధుసూదనా నాకు
మడుకపన్నాయె మేలు మధుసూదనా" 15-242

**మడుఁగు:** అ.క్రి. 1. అడఁగు 2. నమ్రతనొందు 3. వంగు.

"యిరవై యలమేల్మంగ నేలిన శ్రీవేంకటేశ
మడుగనివారికి మట్టుతో నుండుదువు" 15-397

**మడుఁగులుబ్బు:** వి. వస్త్రాలు పొంగు. (వ్య.)

"కులికి శ్రీవేంకటేశ కూడితివి వయోమద
మెలమి మడుగులుబ్బె నెంత బంటో యిఁకను"
8-190

**మడుక:** వి. జేన. ఏడు జేనల దేహమని అన్నమయ్య వర్ణిస్తుంటాడు. కనుక ఇట 'మడుక' అంటే జేన అనే అర్థం యుక్తంగా కనిపిస్తుంది.

"ఏడు మడుకల చర్మ మింతయునుఁ దూంట్లై
గాడఁబెట్టుచుఁ జీము గారఁగాను" 1-77

**మడుగుఁజీర:** వి. తెల్లనివస్త్రం, పరిశుభ్రమైన వస్త్రం, వస్త్రం.
"మడుగుఁజీర మడిచి మడిచి కట్టుకొంటివి
తొడిఁబడఁ, బిరుదిది దొడ్డాయ నటవే" 18-292

**మడుగులోపల మైల:** స్వచ్ఛమైన వస్తువుకు ఏర్పడిన మైల.
"కడు వేంకటేశ్వరుని కౌఁగిటను పరవశము
మడుగులోపలి మైల మానదీ చెలికి" 6-70

**మడ్డు:** వి. ఇనుపగుండు.
"దోసిట మడ్డెత్తే వేళ తోడై వచ్చే దైవము"
15-319

**మడ్డువట్టు:** ప.బం; అ.క్రి. తనయెడ అపరాధం లేదని నిరూపించుకోవడానికి ఎఱ్ఱగా కాలిన యినుపగుండును పట్టుకొని ప్రమాణం చేయు. పూర్వం ఇలాంటి ప్రమాణాలు చేయడం అలవాటు. నేటికీ ఎఱుకలు మొదలైన ప్రాచీనజాతుల్లో ఈ అలవాటు కానవస్తుంది. (పద.) (మడ్డు= గుండు) ఇట నాలుక కాల్చుకొని ప్రమాణం చేయు అని అర్థం కావచ్చు.
"ఎనసి యెవ్వతెకో మోహింతువని నీ మోవి
మనసార నాలిక మడ్డువట్టేరా" 5-90

**మతంగగిరికాడి హనుమంతుఁడు:** వి. హంపీలోని మతంగగిరి దగ్గర నున్న హనుమంతుడు, మతంగగిరి కాడ నున్న హనుమంతుడు. ఇట 'కాడ' అనే శబ్దంమీద సంబంధార్థంలో 'ఇ' చేరింది.
"అందరిలోనా నెక్కుడు హనుమంతుఁడు
కందువ మతంగగిరికాడి హనుమంతుఁడు"
2-207

**మతంగపర్వతమాడ:** హంపీలోని మతంగపర్వతం దగ్గర. ఆడ అనే పదాన్ని స్వతంత్రంగా కాక ఒక పదానికి అనుబంధపదంగా వాడడం విలక్షణం.
"మరిగి రేయుఁబగలు మతంగపర్వతమాడ
బిరుదులతోడను బెరసీ వాఁడే" 4-158

**మతంగపర్వతము:** వి. హంపీలోని మతంగపర్వతం. 4-158

**మతకములు:** వి. మాయలు.
"మనసెల్ల నడ్డపెట్టి మట్టున నుండేనంటే
మనసు కోరికలు నీ మతకాలు" 1-466

**మతకరితనము:** (2) (మతకము + అరి + తనము) మాయావి లక్షణం, మాయలమారితనం, కపటం.
"మతకరితనములు మాతో నేమిటికి
తతి వచ్చినందుమీఁద దాఁచవచ్చునా" 26-409

**మతకరివాఁడు:** (2) (మతకము + అరి + వాఁడు) మాయావి.
"మతకరివాఁడవు మాయదారి ఆపె నీకు
ఇతవుగ మరుఁడు మిమ్మెట్టు గూర్చెనయ్యా"
20-577
"సన్నలేల సేసీనే తా జాణ శ్రీవేంకటేశుఁడు
మన్నించుమనవే మతకరివాఁడు" 12-535

**మతిఁబెట్టు:** స.క్రి. భావించు, ఆలోచించు.
"సందడి నీతో సరసములాడఁగ
మందెమేళమని మతిఁబెట్టుదువో" 20-365

**మతించు:** స.క్రి. తలఁచు, ఊహించు (సూ.ని.) ఇట అంగీకరించు, గౌరవించు అనే అర్థాలు ఉచితంగా ఉంటాయి.
"మతించిన కౌస్తుభమణి నిలువుటద్దము
మితి లేని శ్రీవత్సము బండారుముద్ర" 9-299

**మతిచొచ్చు:** అ.క్రి. మనసులో చొచ్చు.
"ఇతరులవలె నన్ను నెంచకురా నీ
మతిచొచ్చి నీ మేను మఱపింతు నోరి" 5-10

**మతిపరవశము:** వి. మతిపారవశ్యం.
"ఇంతలో శ్రీ వేంకటేశ ఇట్టె నన్నుఁగూడితివి
మంతనాలకెల్లా గురి మతిపరవశమే" 20-302

**మతిమాలు:** ప.బం. అ.క్రి. భ్రంశమగు. 1-63

**మత్తాయిగొను:** అ.క్రి; ప.బం. మదించు, మత్తెక్కు.

"యెక్కుడిని నానాఁటికి మదమెంతైనా నజ్ఞానమున
యెక్కుడి నీ సంసారమే హరి యెదుటనే మత్తాయిగొన్నట్లు" 3-88

**మదనచిన్నలు :** వి. మన్మథచిహ్నాలు, నఖక్షతాదులు.
"నీ వలమేలుమంగవు నిన్నేలె శ్రీవేంకటేశుఁ
డీవల మదనచిన్నలే గంపగమ్మెవే" 29-360

**మదనముద్ర :** (3) వి. మన్మథముద్ర, నఖక్షతాదికం.
"దాఁపరాని మదనముద్రలు మేన నవె నీకు
నేఁపుచు భ్రమలఁబెట్టి యెవ్వతె సేసినవో" 5-29

**మదనమెత్తు :** అ.క్రి. మత్తెక్కు.
"సన్నపుఁజెమట నొసలఁబొడమ
మిన్నక మదనమెత్తె ననుచు
మెలుఁత తమ్మిల ముమియున" 6-50

**మదనరసము :** వి. శృంగారరసం.
"వెదకి వెదకి నిన్ను వెలఁది కంగేలు వట్టి
మదనరసము చింది మరి సిగ్గువడెను" 14-351

**మదనరేకలు :** వి. మన్మథరేఖలు, మన్మథచిహ్నాలు.
"కడుఁగాక తన మేను గాఁగిలించఁబోతేను
యెడసి మదనరేక లేఁడ రేఁగునో" 20-255

**మదనవిద్య :** వి. కామశాస్త్రం.
"చిక్కితి వెక్కడికి విచ్చేసేవు నిన్ను నే
దక్కగొని మదనవిద్యలనే చొక్కింతువా" 5-81

**మదనవేదము :** వి. రతిశాస్త్రం.
"మదనవేదాలెల్లా మాటల నమలఁజొచ్చె
అదె శారికల కెందు నాజ్ఞ లేదు" 26-533

**మదనుని చదువు :** వి. రతిశాస్త్రం, కొక్కోకం.
"పెదవులు గదలియుంగదలని మదనుని
చదువులు నాడవి చదువవుగా" 6-130

**మదమత్సరము :** వి. మదమాత్సర్యములు; ద్వంద్వంలో ఏకవచనం.
"మదమత్సరము లేక మనసు పేదై పో" 1-59

**మదిమదినుండు :** ప.బం; అ.క్రి. నిశ్చింతగా నుండు, నెమ్మదిగా నుండు.
"మదిమదినుండే కాయక్లేశము
మాఁటికి మాఁటికి దన కేలా" 2-236

**మదిరాక్షి :** (2) (మదిరా + అక్షి) మదం కప్పిన కన్నులు గల స్త్రీ, స్త్రీ.
"కదసి యాతనితో నేకతాలు నీవాడఁగాను
మదిరాక్షులతో నేల మాఁటలాడీనే" 29-19

**మద్దులు మారేళ్లు మోచు :** ప.బం. చెట్లను కొనిపోవు అని లాక్షణికార్థం.
"వద్దు వద్దు మాఁటలనే వలపుల యేరువారి
మద్దులు మారేళ్లు మోఁచె మానరాదా యిఁకను"
20-233

**మద్దెలలోని యెలుక :** (2) ప.బం; వి. ఒకచోట నిలువక తిరిగేది. మద్దెలలో ఉన్న ఎలుక తానున్న పరిధిలోనే అటూ ఇటూ తిరుగుతూ ఎక్కడా నిలువలేక ఉంటుంది.
"మతిచంచలపువాఁడు మద్దెలలోని యెలుక
ప్రతియై కోరెడువాఁడు వలలో మీను" 15-378
"మద్దెలలో నెల్క మర్యాద" అని హం.విం. ప్రయోగం.(1-22)

**మద్దేనము :** వి. 'మధ్యాహ్నము' అనేదానికి జానపద వ్యావహారికరూపం.
"పంతము లాడఁగానే పడుమటజామాయ
మంతన మాడేకొద్దికి మద్దేన మాయ" 14-145

**మద్యాన్నము :** (2) వి. 'మధ్యాహ్నము' అనేదానికి జానపద వ్యావహారికరూపం. పట్టపగలు.
"పొద్దు మద్యాన్నమాయను భోగాలు మరిఁగితివి
అద్దో లోకము మెచ్చ నణకు వొద్దా" 27-426

**మధురము :** (3) వి. మాధుర్యం. ధర్మివాచకానికి బదులు ధర్మివాచకం.
"మాటల తేనెలలోన మధురము గురియఁగ
గాఁటపు నీ బిగువులు కారమయ్యానే" 11-179

**మధ్యరాతిరి :** వి. మధ్యరాత్రి.

"రాముని మెప్పించి మధ్యరాతిరి సంజీవి దెచ్చి
ఆముకొని యున్నాఁడు హనుమంతుఁడు "
3-143

**మధ్యాన్నము:** వి. 'మధ్యాహ్నము' అనేదానికి జానపద వ్యావహారికరూపం.
"యిచ్చట శ్రీవేంకటేశుఁ డింతేసిసి కూడెనింకా
మచ్చికెతో రమ్మనవే మధ్యాన్నమెక్కె " 8-64

**మధ్యాన్నమెక్కు:** అ.క్రి. మధ్యాహ్నమగు.
"యిచ్చట శ్రీవేంకటేశుఁ డింతేసిసి కూడెనింకా
మచ్చికెతో రమ్మనవే మధ్యాన్న మెక్కెను "
8-64

**మనకితపడు:** అ.క్రి. శోకించు.
"వెంగేన నిమ్మపంటను వేసేల వేసితినంటా
కంగి మనికితపడి కరఁగీఁ జెలి" 7-221

**మనయిది:** (మన + ఇది) ఇందులోని ఇది శబ్దం 'నాకు చాలా ఇదైంది' ఇత్యాది వాడుకలో ఉన్న 'ఇది' శబ్దమే. ఈ ఇది శబ్దం ప్రాకరణికమైన ఏదో అర్థాన్ని చెప్పుతుంది. అన్నమయ్య జనుల వాడుకలోని ఇలాంటి పదాల నెన్నింటినో ప్రయోగించినాడు.
"ఇద్దరి యెలుఁగులకు యీ యాకసమె గురి
అద్ది మన యిదియె మాటాడుట గాఁదా"
20-301

**మనసగు:** (మనసు + అగు) ప.బం; అ.క్రి. ప్రియమగు, ఇష్టమగు, కోరిక పుట్టు.
"నీ వేల వత్తువయ్య నెలఁతఁబాసి
మావంటివారు నీకు మనసయ్యేనా" 10-2-51

**మనసరి:** (మనసు + అరి) వి. మంచి మనస్సు గలది.
"అంత మనసరివని ఆడెనా నిన్ను
చింతించే నీ యాసలనే సిగ్గుకింతే కాక "
10-2-60

**మనసార:** ప.బం; క్రి.విణ. మనఃపూర్తిగా, నిండుమనస్సుతో.
"మనసార నే నీతో మాటలాడే నంటేను
వినేయందు నీకైతే వేళ లేదు" 23-257

**మనసిచ్చు:** (7) ప.బం; అ.క్రి. ఇష్టపడు, ప్రేమించు, రహస్య మెఱిగించు.
"మనసిచ్చి మాటాడితే మాటాడఁ గరఁగించెను
చెనఁకఁగ వచ్చితేను చిక్కించుకొనెనే" 18-250
"మనసిచ్చి యప్పటిని మాటలు నీతో నాడే
వెనకతియ్యకువే వెలఁదీ" 18-71

**మనసు కరచు:** ప.బం. మనస్సును ఆకర్షించు.
"చెంతనుండి యీకె సెలవుల నవ్వి
కాంత నీ మనసు కరచెను " 26-518

**మనసుకు మనసే సాక్షి:** నానుడి; తనకు తానే సాక్షి.

**మనసు చిముడఁ బెట్టు:** అ.క్రి. మనస్సును బాధపెట్టు. 12-202 old

**మనసు చిల్లులగు:** ప.బం. మనస్సుబాధపడు.
"చివ్వన బూతులు విని చిల్లులాయ మనసు "
7-98
"విని విని చిల్లులాయ మనసు " 7-97

**మనసు చిల్లులువోవు:** ప.బం; అ.క్రి. మనస్సుబాధపడు.
"పూఁచిన యొరపుల బొమ్మముడి జంకెనల
లోఁచకువే మనసు చిల్లులు వోయీని " 6-8

**మనసు(నఁ) దాగిన పాలు:** (2) ప.బం; వి. నిజం కానివి.
"గొనకొన్న మానినుల కూటముల సుఖములివి
మనసు దాగినపాలు మట్టు లే దెపుడు" 1-486
"మనసునఁ దాగినపాలివి మదిఁగల
కోరికలిన్నియు" (2-133)

**మనసునఁబాలు దాగు:** ప.బం; అ.క్రి. నిజం కానివి.
"మనసునఁ బాలుదాగి మదియించి వున్నట్టు
ననిచి గిలిగింతకు నవ్వినట్టు" 2-37

**మనసుపట్టు:** (3) ప.బం; అ.క్రి. నిగ్రహించు, మనస్సును ఆపుకొను.
"మచ్చరించఁగఁ గదా మనసుపట్టఁ దిరిగే

నిచ్చకము లాడుకంటె యిదె మేలు" 7-8
"వినయముతో నీకు విరులు ముడువఁగాను
మనసుపట్టఁగలేక మర్మము లంటేవు" 29-238

**మనసుపెట్టు:** (5) ప.బం; అ.క్రి. శ్రద్ధ ఉంచు, కోరు, ఏకాగ్రతతో ఉండు, ఏకాగ్రతతో శ్రద్ధపెట్టు. (పద.)
"మచ్చిక నీ కౌఁగిటికి మనసు పెట్టుకున్నది
కుచ్చి కుచ్చి కౌఁగిటఁగూడవయ్యా" 12-298

**మనసుపేద:** ప.బం; వి. సున్నితమైన మనస్సు కల(వాడు)ది, ధైర్యం లేని(వాడు)ది.
"పెక్కు లంపటాల మనసుపేద వైతివి నీకు
నెక్కడా నెవ్వరు లేరు యేమి సేతువయ్యా"
1-125

**మనసు పొక్కు:** ప.బం; అ.క్రి. మనసు బాధపడు.

**మనసు మంగళము:** ప.బం; వి. హృదయ విహీనుడు. 17-278

**మనసు రాయి సేయు:** ప.బం; అ.క్రి. మనస్సును కఠినం చేయు.
"పిలిచితే రాఁడట్టే బిగిసీ నీ పాటివాఁడు
చెలఁగి మనసు రాయిసేయకుండీనా" 13-144

**మనసులోన పాలు దాగినట్లు:** ప.బం. తృప్తిని కలిగించనట్లు, అసాధ్యమగునట్లు.
"పక్కన మనసులోన పాలు దాగినట్లనే
చక్కని మాయలలో సంసారభోగములు"
15-59

**మనసువచ్చు:** (4) ప.బం; అ.క్రి. ఇష్టపడు.
"మట్టు మీర నేఁడు నీ మనసు వచ్చితేఁజాలు
గట్టిగా నెంగిలిపొత్తు గలసేమయ్యా" 18-198

**మనసువారు:** (మనసు + పారు) ప.బం; అ.క్రి. మనసుపోవు, ఇష్టమగు.
"మరిగి యాపెపై నీకు మనసు వారితేను
వరుసతోఁ బెండ్లాడఁగా వద్దనీనా నిన్ను"
29-350

**మనసువిఱుగు:** ప.బం; అ.క్రి. విరక్తి పుట్టు.
"విరుగదు మనసు"
"బలిమి నిందులకెల్లా పడిగెమట నీ మోవి
వెలయ నీకిది విని విరుగదు మనసు" 26-401

**మనికితము:** వి. 1.సందేహం 2.దుఃఖం, మనోవ్యథ 3.జాలి, కరుణ.
"మాటలాడితేఁజాలు మట్టుకుఁదెచ్చే నతని
యేఁటికి మనికితము ఇంతిరో నీకు" 26-445

**మనిమని:** మిక్కిలి వృద్ధిచెంది, మిక్కిలిగా వర్తించి.
"మనిమని యేకతాలు మర్మములు గరఁగించు"
18-145

**మనుఁగావుఁజేయు:** ప.బం; స.క్రి. రక్షించు.
"వినవయ్య యిదివో శ్రీవేంకటేశ నా మనవి
మనుఁగావుఁజేసితివి మన్నించవయ్యా" 4-208

**మన్నమనువు:** వి. బ్రతికిన బ్రతుకు.
"మన్నమనువు దిమ్మరితనమే" 1-19

**మన్మనా భవ:** ఇది భగవద్గీత లోని శ్లోకభాగం.
"మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు, మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః" 9-34 (అని పూర్తి శ్లోకం.) "మనస్సును నామీదే నిలబెట్టుము. నా భక్తుడవగుము. నన్నే పూజించుము. నాకే నమస్కారం చేయుము. ఈవిధంగా చిత్తం నామీదే నిలిపి నేనే పరమగతి యని సేవించుచు ఆత్మనైన నన్నే చేరుతావు" అని ఈ శ్లోకతాత్పర్యం.
"మన్నించి యాతఁడే 'మన్మనా భవ' యని
అన్నిటా నందరి కానతిచ్చెఁ గాన" 4-71

**మబ్బువయసు:** వి. యౌవనం.
"మబ్బువయసు మదము మాపై నేల కప్పీనే
నిబ్బరపు తన తమి నేనే యెఱుఁగుదునే"
27-457

**మమకరించు:** (3) అ.క్రి. మమకారం చూపు. మమకారములోని 'కా' హ్రస్వం చేసి దానిపై నామధాతువు చేసిన రూపమా? (f.n. 22-236)
"మమకరిం చలమేలుమంగ శ్రీవేంకటేశుఁడు

సమరతి న న్నేలే యీ జాణఁడే నా విభుఁడు" 12-394

**మయి:** వి. మై, శరీరం.

"కుప్పలుగాఁ గస్తూరియు కుంకుమయు మయి
నిండ నప్పళించుకొని యున్న యాతఁడు
నిండ" 5-89

**మయిపూఁత:** వ.బం; వి. చందనాదుల పూఁత.

"కమ్మని మా మయిపూఁత గదరుఁబిల్లుల
గబ్బు
యెమ్మెల మా పట్టుచీర యేపెనార" 5-121

**మయిల:** మైల, మురికిగల, మాలిన్యం (కల)

"మదిలో చింతలు మయిలలు మణుఁగులు
వదలవు నీవవి వద్దనకా" 2-475

**మయివడి:** వ.బం; వి. 1. సమ్మతి
2. అనుకూల్యం 3.విధం 4. సౌమ్యత
5. నేర్పు. (వ్యు.) విణ. అనుకూలం.

"నలువొందఁ జంద్రకిరణములు మయివడిఁ
బొక్కె" 5-161

**మర:** వి. కొలపాత్ర, చేరకు మించినది.

"తారుకాణ లిప్పు డేలే, తన సుద్ది చెప్పఁజెప్పఁ
జేర మరా యని చెల్లఁబెట్టేఁ బదవే" 25-479

**మరకాఁడు:** (మర + కాఁడు) వి. కర్ణధారుఁడు,
సరంగు, ఓడ నడిపేవాడు.

"అడిబరవుగ మాయ అందునిండా నించుకొని
యెడతాఁకె జీవుఁడనే యీ మరకాఁడు" 3-388

**మరకుండు:** స.క్రి. మరవకుండు.

"దొరవైన నీతోడి పొందులు యెట్టయినా వచ్చు
మరకుండఁగ రాదు మరగారాదు" 21-262

**మరగాళ్లు:** వి; బహు. కృత్రిమపాదాలు.

"వున్నతి నీకడకు రాకున్న కాళ్లు మరగాళ్లు
సన్నుతి సేయని జిహ్వ సరి నుపజిహ్వ" 2-450

**మరపుకొను:** మరచిపోవు.

"దువ్వటంపుచెఱఁగు మెఱయ తోడుదోడ
సురటి విసరి
ఇవ్వల నతని మరపుకొనఁగ నెందు
నేర్చుకొంటివే" 27-587

**మరపుట:** వి. మరచిపోవడం.

"సత్తెపు నాలుకెల్ల చవుల కమ్మితిఁగాని
మత్తిల నా కీర్తనము మరపుటా లేదు" 3-60 new

**మరవ:** వి. చెరువులు నిండిన వెనుక నీళ్లు
పొర్లిపోవడానికి చెరువుకు అటునిటు చివర
తక్కువ ఎత్తులో కట్టిన కట్టడం. తూము;
రాయలసీమ మాండలికం.

"యెలమి సింగారరస మేరులు నిండాఁబారి
తలపోఁత చెరువుల దైవారె మరవలు" 18-47

**మరుగుడి:** వి. స్త్రీల గుహ్యావయవం.

"నెట్టన నీవు నన్నాడే నిందలెల్లాఁ దప్పదని
చుట్టి మరుగుడి వాసి చొచ్చి వెళ్లేవా" 7-181

**మరుగురుఁడు:** వి. మన్మథుని తండ్రియైన
విష్ణువు.

"పరమసుజ్ఞానులకు ప్రపన్నులకు
మరుగురునిమీఁదట మన సుండవలదా" 15-46

"మరుగురునికిఁ గాని పూవుల పూజలు
మగడు లేని సింగారములు" 2-235

**మరుచావడి:** మన్మథుని కొలువుకూటము.

"పనివడి మన చేతి పచ్చి చేఁతలె నావా
ఘనమై మరుచావడి కళలు దించేవి" 7-67

**మరుచిలుకు:** వి. దంతక్షతం, మన్మథబాణం.

"దిట్టిన యది యెవ్వతెర నీ యధరమంది
కొల్లఁగొన మరుచిలుకు లొత్తినది" 5-159

**మరుతండ్రి:** వి. విష్ణుమూర్తి (మన్మథుని తండ్రి)
చూ: మరుగురుఁడు.

"మరుతండ్రిఁ జూచిన మంచికన్నులను
మరొకరిఁ జూచిన నింపౌనా" 2-313

**మరుతేరు:** వి. మన్మథుని రథం, చిలుక.

"ఇంతుల మనోవీథి నేఁగీఁ మరుతేరి మీఁద
నంతటా రతిప్రియుఁడటుగాన" 1-424

**మరుసాము:** వి. మన్మథక్రీడ, మరుపోరు.

"ఉదుటుఁదమకమున నోపిక కలిగితేను
యెదుటి మరుపాముున కియ్యకొనరాదా"
8-125

**మర్నాడు:** (మరు + నాడు) వి. శబ్దార్థంప్రకారం మరుసటి దినమైనా రాయలసీమలో 'ఎల్లుండి' అనే అర్థంలో వాడుకలో ఉన్నది. మర్నాడు - మన్నాడు - మొన్నాడు

"నవ్వినప్పుడు నవ్వక నాతో మర్నాడు వచ్చి
ఇవ్వల సరసమాడీ నేటికే నాకు" 26-143

**మర్మగాఁడు:** (మర్మమ + కాఁడు) వి. మర్మాలు తెలిసిన వాడు.

"అన్నియు నడుగవే నేనే మఱచితి నని హరి
నీకే తెలిసినవి
మన్నించి నా కీ జన్మమొసఁగితివి మర్మగాఁడు
మన్మథుఁడొకఁడు" 2-189

**మఱఁగా:** (?)

"మాటలాడే యందుకు మఱఁగా నీ గుబ్బలకు
మాటు పయ్యెదైతే నమరుఁగాక" 20-268

**మఱఁగు మొఱఁగు:** వి. మఱగు = చాటు అనే అర్థంలో జంటపదం (?)

"మచ్చికెంత గలిగినా మఱఁగు మొఱఁగు లేదా
ఇచ్చయెఱిఁగి లోలోనే యెనయుట గాక" 28-24

**మఱస్తి:** క్రి.వ. మఱచితిని అనడానికి వ్యావహారిక రూపం.

"పడఁతి చే కానుక పట్టి నా చేయి చాచి
అడియాలాలు మఱస్తి ననఁడు గదా" 12-171

**మఱుఁగున బదుకు:** అ.క్రి. శరణుపొంది బదుకు, చాటున బదుకు.

**మఱులుదేహి:** వి; బహు. ఇట 'రు' కావచ్చు. అజ్ఞానం, మోహం, వలపు, ప్రేమ, పిశాచం.

"మఱులు దేహినైయె మఱచి వున్నయెడ
తఱచుటూరుపులఁ దలఁచీనా" 1-304

**మఱ్ఱిమాని పంట:** ప.బం; వి. మఱ్ఱిచెట్టు ఎంత పెద్దదో మఱ్ఱికాయ అంత చిన్నది. అందుపై వచ్చిన పలుకుబడి. (పద.) ఎక్కువపంట అని తె.వ్యు.కో.

"కలిమికామిని తోడ కారుకమ్మిన పంట
మలయుచుఁ దమలోని మఱ్ఱిమానిపంట"
4-342

**మలఁగు:** (3) వి. మెత్తదిండు, బాలీసు.

"మలఁగుపై నొరగుండి మాటలాడి దేవులతో
వలపులు చల్లుకొంటా వాడవాడల" 18-321

**మలగొను:** (3) ప.బం; అ.క్రి. (మలక + కొను) మెలిగొను, వ్యాపించు.

"మచ్చికతోఁ బులకలు మలగొన్న వాకె మేన
పచ్చి సరసాలెదురుబడి నాడరాదా" 26-596

**మలఘుని నిన్న పెరుమాళ్లు:** వి. సందిగ్ధపద సమీక్షలో ఈ పదం అర్థం ఈ విధంగా చెప్పబడింది. మలై + కునియ + నిన్ర + పెరుమాళ్లు = కొండ క్రుంగునట్లు నిలుచున్న దేవుడు. వేంకటేశ్వరుని మూలమూర్తి. మలైకినియ అని, తిరుమలై ఒళుగు అను గ్రంథమున నున్నదట. ఇందు 'కినియ' కు వ్యాపించు అని అర్థం.

"మలఘుని నిన్నపెరుమాళ్లు వీడే
వెలయ రాజసమున విఱ్ఱవీగేవాఁడే" 14-367

**మలయు:** అ.క్రి. 1. వ్యాపించు 2. విజృంభించు (3.కదలు 4. చలించు 5. సంచరించు 6. బాధపడు 7. మండు 8.తొలగు 9. పోరాడు 10. యత్నించు 11. ఉత్సహించు)

"సొలసి చల్లగాలికి చోట్లెన్ని గలిగినా
మలయఁ బేరైన చోటు మలయాద్రి గాదా"
7-197

**మలిగండ్లు:** (3) వి; ప.బం; బహు. (మలి + కండ్లు) కండ్లు అనేది 'కల్లు' (= రాయి)కు బహువచన రూపం. బియ్యం మొదలగునవి బాగుచేసినపుడు మలిచి తీయదగిన రాలు.

"చెప్పనేల రాళ్లు చక్కఁజేసి మలిగండ్లేరీ
నిప్పు డిట్టె నే నిందు కేమందునే" 9-58

**మలిగినవానికి మొనవాడి:** ప.బం. (?) 2-431

**మలినము:** (5) వి. మాలిన్యం, ధర్మవాచకానికి బదులు ధర్మివాచకం.

"వలవని మోహావస్థలఁ బొరలెడి
మలినంబెన్నఁడు మానును" 1-174

**మల్లడిపొందులు:** వి. మిక్కుటమైన పొందులు.
"చల్లలమ్మేదానవు అచ్చపు మగనాలవు
మల్లడి మా పొందులేల మరిగేవు నీవు" 5-322

**మల్లపాల:** వి. 'మల్లశాల'కు వికృతిరూపం.
1. సాముగరిడీ లేదా కసరత్తు చేసే చోటు
వ్యాయామశాల 2. భోజనశాల.
"కన్నుల చూపులనే కాంత నీ కారతులెత్తీ
మన్నించి రావయ్యా లోని మల్లపాలకు"
22-336

**మల్లాడు:** (10) (మల్లు + ఆడు) వ.బం; అ.క్రి.
1.పెనగాడు 2. పోరాడు 3. అతిశయించు
4. క్రీడించు.
"తొల్లిటి మాటలకుఁగా తొడరి సూడువట్టేవు
మల్లాడి రాతికి మారుమలసేవు" 7-170
తిరుగాడు: (మాం.)
"తగు మోహసలిలంబు దాఁట మతి లేదుగన
మగుడఁబడి భవముతో మల్లాడవలసె" 1-221

**మల్లువాఁడు:** (మల్లు + వాఁడు) వి. జెట్టి.
"మల్లువారితోడి పోరు మానవింత చాలదా"
5-297

**మల్లెవట్టు:** అ.క్రి. నశించు, చీడపట్టు అని
శబ్దార్థం.
"బడి విభీషణునిఁజేపట్టితే రక్కసులెల్లా
చిడిసి మల్లెవట్టిరి శ్రీవేంకటరామా" 4-281

**మసి కస్తూరగు:** వ.బం; అ.క్రి. అల్పవస్తువు
మహావస్తువగు.
"శునకసూకరాదులు సుకమందే పొందినట్లు
ఘనముగా నిక మసి కస్తూరాయ నాకు" 15-41

**మస్తరించు:** స.క్రి. 1. వశపరచుకొను
2. ప్రోత్సాహపరచు 3. అస్ఫాలనంచేయు
4. చేతులప్పళించు.
"మందెమేళపుటింతిని మస్తరించవలెఁగాని
ఇందరిలో జంకించితే యీసు రేఁగును" 26-426

**మహనియ్యము:** విణ. 'మహనీయము' (=
గొప్పనైన) అనే పదంలో 'నీ' లోని దీర్ఘానికి
హ్రస్వమూ, యకు ద్విత్వమూ వచ్చినరూపం.
గొప్పనైనది. ఇట్టే తదియ్య (తదీయ) అనే
రూపం.

**మహరుషి:** వి. మహర్షి, గొప్ప ఋషి.
"కనుకలిగి హరిఁగొలచి ఘనులైరి గాక
మును మనుజులే కారా మహరుషులును"
1-404

**మహాచరులు:** వి; బహు. (?)
"చనుఁగొండలను మహాచరులఁ బడుటొండె"
1-159

## మా

**మాఁకుపడు:** (2) వ.బం; అ.క్రి. మ్రానుపడు,
స్తంభించు, కొయ్యవారు, నిశ్చేష్టుడగు.
"ఆఁకట నాసేల మాను అన్నిటాను యిందరికి
మాఁకుపడి తత్తరము మఱచుంటేఁ గాక" 1-204

**మాఁగు:** (3) అ.క్రి. బాగా పండు, పరిణతి
చెందు, కవియపండు.
"ఆగి ముచ్చటాడవమ్మ అట్టె నీవద్ద నుండఁగా
మాఁగినరతుల మేను మఱచియున్నాఁడు"
19-586
"మాఁగిన మనసు నీకు మనసే సాక్షి" 26-160

**మాఁజు:** నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.
'మాఁగు' ధాతువుకు రూపాం. లాగా
అనిపిస్తుంది అని సం.వ.స.
"మాఁజితేను జవ్వనము మట్టున నిలుచునా
రాఁజి రాఁజి వలపు లాఁటడిఁబెట్టుఁగాక" 20-85

**మాఁట:** (112) వి. మాట, శబ్దం మొ॥
అన్నమయ్య సంకీర్తనల్లో ఈ శబ్దం మాఁట,
మాట అనే రెండురూపాల్లో కనిపిస్తుంది.
మాటలో అరసున్న ప్రాచీనకాలంలో
ఉన్నదేమో! సబిందుక, నిర్బిందుకప్రాస
సాంకర్యానికి అనంతుడు ఛందోదర్పణంలో
ఇచ్చిన "మాట లేటికి మేటి తాఁబేటి కనఁగ"

అనే ఉదాహరణను బట్టి మాట శబ్దం నిర్బంధుక మని తెలుస్తుంది.

"యిత్తలఁదన నా సంది యీ రెండుఁ
దెలియుదాకా
పొత్తులనె వుండనీరె పొరుగుల మాఁటా"
11-126

**మాఁటపలుకు:** ప.బం; వి. వాగ్వాదం, తాను మొదట పల్కరించుట మాట. అడిగిన దానికి బదులిచ్చుట పలుకుగా ఈ నుడికారము పుట్టియుండవచ్చును. (f.n. 22-508)

"మగనికి నాలికి మాఁటపలుకైతేను
తగవులు దిద్దేవారు దండచెలులా"
25-204 & 29-358

**మాఁటపలుకులాడు:** వాగ్వాదం చేయు.

"మచ్చికనే నితనితో మాఁటపలుకులాడఁగా
ఇచ్చటికి వచ్చి నీ వేమి వినేవే"
29-58 & 29-358

చూ: మాటపలుకు

**మాఁటమాఁటగా:** (?)

"గాఁటమున రమణుని గడవనాడుట కంటె
మాఁటమాఁటగా బొగడే మచ్చికే మేలు" 28-43

**మాఁటలపందిలి వెట్టు:** ప.బం; అ.క్రి. వట్టిమాటలతో సరిచేయు, వట్టిమాటలతో భ్రమగొలుపు.

"మాఁటల పందిలివెట్టు మానిని యందురు గాని
మాఁటల గూళ్లు కట్టి మమ్ము నింతోసేసేవు"
8-178

**మాఁటల మూటలుగట్టు:** ప.బం; అ.క్రి. వట్టి మాటలు పలుకు.

**మాఁటలలోనే తేనెలు మనసులోనే నూనెలు:** ప.బం; వి. మాటలు తియ్యన మనసు మాత్రం దుష్టం.

"మాఁటలలోనే తేనెలు మనసులోనే నూనెలు
యేఁటికి నీ పతి యెడ కింత వలెనా" 25-441

**మాఁటు:** వి. 1. తగులము 2. మాఁతు.

"వదలకింతకుఁ దలవాకిలైనది
మదనుని బారికి మాఁటువో నీ పతికి" 5-115

**మాఁటువెట్టు:** (మాటు + పెట్టు) స.క్రి. మఱుగుపరచు, దాచు, మఱుగుపుచ్చు. (వ్యౕ.)

"పీఁటమీఁద నొండొరులు పెనఁగుతా నన్నుఁగని
మాఁటువెట్టు నన్ను నెంత మన్నించితివి"
26-586

"ఇరవైన ఆసలతో నెప్పుడు వత్తువో యంటా
సురటి మాఁటువెట్టుక చూచీ నిన్ను" 24-321

**మాఁడు:** (?) 1. శుష్కించు 2. చెడు 3. దగ్ధమగు.

"వేఁడినిట్టూర్పుల వెసఁగారముల
మాఁడనేల నీకు మంకు గద్దా" 11-383

**మాఁడుకూరి మాధవరాయఁడు:** వి. మాడుకూరిలో వెలసిన మాధవుడు. చూ: మాడుపూరు.

"మంచివాఁడవంతే పో మాధవరాయా
మంచు మాయ మాడుకూరి మాధవరాయా"
14-237

**మాఁడుకూరు:** వి. ఒకగ్రామం.

"బడినే శ్రీవేంకటేశ పొరితెంచి మాడుకూర
తడవి యింతోసేసితి దక్కెఁగా నీ పనులు"
14-233

**మాఁపటిచేఁత:** వి. సంభోగం.

**మాఁకు:** వి. చెట్టు. నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. మాను (మ్రాను) కు వ్యావహారికరూపం. మ్రానుకు బహువచన రూపమైన 'మ్రాకులు' అనే దాని అనుచిత విభాగంచే ఏ.వ. లో వ్యవహారంలో 'మాకు' అనే రూపం ఏర్పడిఉంటుంది. మందు-మాకు అని వ్యవహారం.

"మఱచి ముమ్మదముతో మాఁకువలె
నుండినాను
గుఱిగా గోరు సోకితే కోరికలు రేఁగును" 23-297

**మాచనవోలి చెన్నుఁడు:** కడపజిల్లా ప్రొద్దుటూరు తాలూకా లోని మాచనపల్లె యే మాచనవోలు కావచ్చు. అట నెలకొన్న విష్ణుమూర్తియే

మాచనవోలి చెన్నుడు కావచ్చును. మాచనవోలు మాచవోలుగా కూడా పేర్కోబడింది. (26-63)

"నాఁగు లెల్లఁదీర మాచవోలి చెన్నుఁడవై
మూఁగితి శ్రీవేంకటేశ మోవి యిచ్చేఁగాక" 21-495

**మాచనవోలినిలయుఁడు:** వి. మాచనవోలులో వెలసిన చెన్నకేశవుడు. తాళ్లపాక సమీపంలోని మాచుపల్లెయే మాచనవోలు. ఇది ఒంటిమిట్ట, టంగుటూరుల నడిమి గ్రామం. ఇట 'మాచనవోలు' లోని 'వో' వర్ణం 'వొ' గా ప్రయోగింపబడినది. కనుక సంపాదకులు 'ఒలినిలయా' అని విడదీసి ఒలి అంటే శబ్దమని చెప్పి 'ఒలినిలయా' అనే పదానికి 'వేదాధారా' అనే అర్థం చెప్పడం యుక్తం కాదేమో ! ఇందుకు మాచనవోలి చెన్నుడు అనే ప్రయోగం (21-495) కూడా ఆధారం. (చూ: సం.ప.స. 19 సం.)

**మాచవోలి చెన్నుడు:** వి. చూ: మాచనవోలి చెన్నుడు.

**మాటఁబడు:** ప.బం; అ.క్రి. దూషణపొందు, ఒకరిచే తప్పుపట్టించుకొను.

"తొక్కి నీవు మాటఁబడి దూరి నాపై వేయకు
అక్కర అంత గలితే అప్పణ దేరాదా" 7-427

**మాటకారి:** (మాట+కారి) వి. యుక్తిగా మాట్లాడేవాడు, వాగ్మి.

"విన్నపాలు సేయఁదగు వెస మాటకారికి
సన్నలు సేయఁగఁదగు చనవరిదానికి" 24-358

**మాటకు మాట ఆడు:** (3) ప.బం; అ.క్రి. ఎదురుచెప్పు, ఎదురు మాటలాడు.

"ఔనె మాటకు మాట ఆడితివి వోరి
కాని యింకా నేమి గలిగినాఁ జెప్పరా" 9-80

**మాటకు మాటలాడు:** ప.బం; అ.క్రి. ఎదురుచెప్పు, ఎదురుమాటలాడు.

"మాటకు మాటలాడ మరి యంతేసి నేరవు
యేఁటికి మాతో వాదులేల పెంచేవు" 16-224

**మాటకు మాటాడు:** ప.బం, అ.క్రి. ఎదురుచెప్పు, ప్రతిఘటించు.

"మాటకు మాటాడేవాని మారుకొనఁగరాదు
మూఁటకట్టువినయాన మొక్కవలెఁగాని" 23-182

**మాట గోరువోవు:** ప.బం; అ.క్రి. (?)

"మాట గోరువోయినంటా మౌనాన నుందునుగాని
నీటున ముచ్చటాడక నే మానరా" 17-384

**మాటపట్టు:** (5) వి. మాటపట్టింపు, పట్టుదల, (పద.) ఒట్టు, శపథం, మాటఆసరా.

"ఎట్టు గెలువఁగఁగల వీకెను నీవు
యిట్టె మాటపట్టు నీవిచ్చితి విందరికి" 17-171

**మాటపట్టుసేయు:** ప.బం; అ.క్రి. పట్టుదల వహించు.

"చెలియకు మాటపట్టు సేసినాఁడవు గనుక
వెలయ నీ కొత్తి విన్నవించితిమి" 16-550

**మాటపలుకాడు:** (2) ప.బం; అ.క్రి. వాగ్వాదం చేయు. (మాటపలుకు - ఇట జంటపదం)

"వినయముతో నీకు విన్నపాలకు లాచీ
పని గలిగితే మాట పలుకాడవయ్యా" 22-508

**మాటపలుకులాడు:** వాగ్వాదం చేయు. (?)

"పంతము లేదికే మాటపలుకు లాడేవేళ
చెంతనుండే ప్రియములే చెప్పఁగరాదా" 22-514

**మాటయిచ్చు:** (మాట + ఇచ్చు) ప.బం; అ.క్రి. వాగ్దానం చేయు.

"తానే నాకు మాటయిచ్చేఁదన చిత్తము
మోనముతో నలిగేనా ముద్దరాల నేను" 14-473

**మాట యిచ్చుకొను:** ప.బం; అ.క్రి. వాగ్దానం చేసుకొను.

"మఱి యెవ్వతె కీ పొద్దు మాట యిచ్చుకున్నాఁడవో
యెఱుఁగక నీకు పీడె మియ్యవచ్చునా" 12-352

**మాటల కత్తులు నూరు:** తీక్ష్ణమైన మాటలు మాట్లాడు, వాడి మాటలు మాట్లాడు.

"మాటల కత్తులేఁటికి మరి యెంత నూరేవే
చాటుకొట్టుక గుబ్బల సాము లెందాఁకాఁజేసేవే" 29-386

**మాటల దొంతులు వెట్టు :** ప.బం; అ.క్రి. వట్టిమాటలు పలుకు.

**మాటల బెల్లాలు :** (2) వి; బహు. బెల్లంలాగా తియ్యనైన మాటలు, ఆకట్టుకునే మాటలు.
"నిగ్గుల నన్నుఁగూడఁగా నిజాన మెచ్చుఁగఁబోతే
వొగ్గి మాటలబెల్లాల కొడిగట్టీ నితఁడు" 17-33

**మాటల మూటలు :** వి; బహు. వట్టిమాటలు.

**మాటు :** వి. మఱుగు, ఛత్రం, రక్షణస్థానం, రక్షకుడు.
"మాటు లేని నాయకుఁడు మరి కడమ లేలే" 16-70

**మాటుకొను :** అ.క్రి. మఱుఁగుపడు, దాగు.
"కొత్తగాఁగాఁ జెలి మాటుకొని నిలుచుండఁగాను
బత్తితోఁ గప్పురమేల పైఁజల్లేవు" 22-268

**మాటుమందు :** (4) వి. మఱుగుమందు, స్త్రీ పురుషుణ్ణి లోబరుచుకోవడానికి పెట్టే మరులు మందు, మచ్చుమందు, చొక్కుమందు.
"మరఁగి నా పొందె నీకు మాటుమందు
సరస నిద్దరమును సతులమె కామా" 7-146
"కెరలి చేకొనీ నీ కాఁగిటిపొందులు
మరుగకు నీకు నవి మాటుమందులు" 26-319

**మాటొకటి చేతొకటి :** ప.బం; వి. చెప్పేదొకటి చేసేదొకటి.

**మాడాడు :** అ.క్రి. 'మాటాడు' కావచ్చు.
"మగువ నీ కతనితో మాడాడకున్న నేమి!
నొగిలి యాతఁడు నీచే నొచ్చిన నేమి" 24-22

**మాడుగు :** వి. మాళిగ, హర్మ్యం, భవనం. రూపాం. మాడువు.
"కూడి శ్రీవేంకటేశుఁడ కొలువుండ వచ్చేవు
మాడుగులోనికి కమ్మటి వేళ లేదా" 14-184
"మిగుల నున్నతములగు మేడలును
మాడుగులు
మితిలేని దివ్య తపసులున్న గృహములును" 1-227

**మాడుపూరు :** వి. కడపజిల్లా అట్లూరి మండలం లోని సిద్ధవటం తాలూకాలోని గ్రామం. అన్నమయ్య మేనమామ ఊరు. అన్నమయ్య బాల్యం కొంతకాలం ఇక్కడే గడిచింది. మాడుపూరులో చెన్నకేశవస్వామి ఆలయం ఉంది. అన్నమయ్య ఈ స్వామిపై సుమారు ఏడు కీర్తనలు (14-229, 232, 233, 237, 3-179) చెప్పినాడు. దీనికి మాడుకూరు, మాడువూరు అని రూపాంతరాలు.
"వొలిసి శ్రీవేంకటాద్రినుండి వచ్చి మాడుపూర
మలసి నన్నుఁగూడి మన్నించితిగా" 7-47
"చేరి యందెల మ్రోతతో చెన్నకేశవా
యిరీతి మాడుపూరిలో నిట్లాడేవా" 3-179

**మాడువుటిల్లు :** (మాడువు + ఇల్లు) రూపాం. మాడువిల్లు. మేడయిల్లు.
"వేడుకలు మతినిండె వెస వలపిడె పండె
మాడువుటింటిలో తెరమఱఁగునను" 24-504

**మాణికము :** (22) వి. 'మాణిక్యము'నకు వికృతిరూపం. 'మానికము' సాధురూపం. అన్నమయ్య పెక్కుచోట్ల 'మాణికము' అనే వాడినాడు. రెండుమూడుచోట్ల 'మాణిక్యము' అని తత్సమ రూపాన్నికూడా వాడినాడు. 20-21, 7-8, 3-381 "మాణికపుటుంగరాలు" 5-280, "మాణికపుటిల్లు" 19-565, "మాణికము" 15-327, "మాణికపుమట్టెలు" 9-106, "మాణికాల పోగులు" 5-219, "మాణికపు సొమ్ములు" 29-2

**మానఁ జిక్కిన కోల :** తిరిగి పొంద శక్యం కానిది.
"మానఁ జిక్కినకోల మతమాయ మనసు
తేనె లోపలి యీఁగ తెఱఁగాయ మనసు" 1-337

**మానపడు :** అ.క్రి. మానుపడు, చేష్టలుడుగు. 15-125 old

**మానాపతి :** (30) వి. మానవతి, గయ్యాళికి వ్యతిరేకపదం. ము.ప్ర. లో అంతటా ఈ పదం 'మానాపతి' అనే రూపంలో కనిపిస్తుంది. కాని ఇది మానావతి కావచ్చు. అన్నమయ్య మానవతి శబ్దాన్ని అంతటా 'మానాపతి' అని ప్రయోగించడం విలక్షణం. సం.ప.స. లో "మానవతు లనుటకు వ్యావహారికరూపము నేటికిని కడపమండలంలో గలదు" అని

తెలుపబడింది. (13 సం. సం.ప.స. 6 పుట.) ఈ పదం సంకీర్తనల్లో సుమారు ముప్ఫైచోట్ల వాడబడింది. రెండుచోట్ల మాత్రం 'మానావతి' అనే రూపంలో కనిపిస్తుంది. (21-205, 28-456) ఈ విషయంలో రాగిరేకుల పాఠం చూడవలసి ఉంది.

"ఎఱిగివుందువుగాని యిందరివలెఁగాక
మఱవరానియట్టి మానాపతి సుమ్మీ" 9-248

"మలసి గుణము గల మానాపతి యైనాను
కలసి నిన్ను గూడితే గయ్యాళి యౌను"
12-224

**మానాపతితనము:** వి. అభిమానం కలిగి ఉండే లక్షణం, మానవతీత్వం.

"మానాపతితనాన మాటలాడకుండఁగాను
ఆనుకొని యాడో కత లడిగీఁదాను" 20-466

**మానాపతిది:** (మానాపతి + అది) మానవతి, అభిమానవతి

"రాయడింవేదానఁగాను రచ్చలఁబెట్టకు నీవే
పాయముతోడి మానాపతిదాన నేను" 26-280

**మానావతి:** వి. 'మానవతి'కి ఆనాటి వ్యావహారికరూపం. పెక్కుచోట్ల 'మానాపతి' అనే ప్రయోగం కనిపిస్తుండగా రెండుచోట్ల మాత్రమే ఈ మానావతి పదం కనిపిస్తుంది. నేటికీ ఈ పదం కడపమండలంలో వినపిస్తుందట. చూ : మానాపతి; 'మానవతి' అనే రూపం ఒకచోట కనిపిస్తుంది.
(23-422)

"మందెమేళమైన వారే మారువెనఁగేరు గాక
అందపు మానావతుల మందు కోపేమా"
21-205

"ఇటువంటి మానావతి నింత సేతురా
తటుకున లాలించి దయఁజూడు మిఁకను"
28-456

**మానిపండ్లు రాలితేను మాని కిందనే :** నానుడి; ఎవరి కర్మకు వారే బాధ్యులనడం.

"ఔనే తనకూ నాకు నంత పొందా తిట్టీని
మానిపండ్లు రాలితేను మానికిందనే" 17-44

**మానిబొమ్మ:** వి. చెక్కబొమ్మ.

"తేనెపూసి నీ విట్లఁ దిప్పఁగానే తిరిగేటి
మానిబొమ్మఁ జుమ్మీ నా మతిలోని దైవమా"
1-286

**మానివోడ:** వి. చెక్కతో చేసిన ఓడ.

"మానివోడ నమ్మి వొక్క మనుజుఁడు వార్ధి దాటి
నానార్థములుఁ గూర్చి నటించఁగాను" 1-429

**మానిసిమెకము:** వి. నరసింహస్వామి. (మానవ, మృగ రూపాలు గలవాడు.)

"గండు మీరి దానవుని కండలు చెక్కుచు
నూర్పు
నిండించీ నాకసము మానిసిమెకము" 1-436

**మానుషము:** (2) వి. 1. పౌరుషం 2. మానవజన్మ.

"పుట్టిపడీ మానుషము వొకనాటికొకనాఁడు
వట్టికాంతల యెదుట భంగపడే మిదివో" 3-248

2. మానవజన్మ :

"కామక్రోధముల గడవఁగ లేమట
యీ మానుషములు యెన్నటికి" 3-129

**మాపటంత:** (4) (మాపటి + అంత) సాయంసమయంలో, రాత్రిసమయంలో.

"మందలోన నున్న మేము మాపటంతఁగాని
రాము
దిందుపడఁ గొంగువట్టి తీయ్యకువయ్యా"
11-273

**మాపటిచేఁత:** వి. శృంగారచేష్ట, సంభోగం.

"ఆ పనికి బెట్టుగానన్ను దీవించేవు
మాపటిచేఁతలకె మచ్చిక చల్లేవు" 6-126

**మాపటిపొద్దు:** సాయంకాలసమయం, రాత్రిసమయం.

"మనసు చూడఁగానే మాపటి పొద్దాయెను
చనవిచ్చే ననఁగానే జాముెక్కెను" 14-145

**మాపు:** (8) వి. రాత్రి, సాయంకాలం.

"మఱి యేటి మాటలు, మాపుదాఁకాను
యెఱఁగవా నీ వేమైనా నిఁక నీ చిత్తమయ్యా"
28-331

**మాపురేపు:** వి. రాత్రింబవళ్లు.
"యేపున నన్నెటువలె నేలేవో నీవు
మాపురేపు నీ సుద్దులే మరిగితి నేను" 18-325

**మామంగారు:** వి. మామగారు; ఇక్కడి అనుస్వారం విలక్షణం.
"లోనివారి మొఱగేటి లోకదొంగవు కనిం
గాన నట్టె రాకు మామంగారు వినేరు" 6-54

**మాముపేత్య తు కౌంతేయ:** "మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" అనే భగవద్గీతాశ్లోకభాగం. (నన్ను చేరిన తరువాతమాత్రం పునర్జన్మ ఉండదు అని భావం) శ్రీకృష్ణుని వాక్కు.
"ఘటన మాముపేత్యతు కౌంతేయ మహిని
నటనఁ బునర్జన్మ న విద్యతే" 4-71

**మామేకం శరణం వ్రజ:** భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" అనే శ్లోకభాగం. 'నన్నొక్కణ్ణే శరణు పొందు' అని దీనికి అర్థం.
"నాఁడు 'మామేకం శరణం వ్రజ' యను మాట
పోఁడిమి దిక్కుల నీ వెప్పుడు చాటఁగా"
2-57 old

**మాయకాఁడు:** (4) (మాయ + కాఁడు) వి. మాయావి, వంచకుడు.
"ఎంత మాయకాఁడవో యేమని చెప్పుదు విను
పొంతల నవ్వే వేల బూమెటవలెను" 21-125

**మాయదారి:** (మాయ + దారి) మాయావి, మోసగాడు. విణ. మోసపుచ్చేవాడు.
"మాయదారి విభుఁడెంత మరిగిననే నెంత
ఆయనాయ నను నేల యలయించేవే" 24-54

**మాయదారితనము:** (మాయ + దారి + తనము) మాయావితనం, మోసపుచ్చే లక్షణం.
"మనసు చూడఁగవద్దు మాయదారితనమున
మొనసి విభుని కప్పణియ్యవమ్మా" 27-519

**మాయదారివాఁడు:** (మాయ + దారి + వాఁడు) మాయావి, మోసపుచ్చేవాడు.
"మాయదారివాఁడవౌత మలసి నేనెఱఁగనా
నాయము నడపేవంటా నమ్మితిఁగాక" 25-194

**మాయపుఁబులుగు:** (మాయము + పులుగు) వి. మాయపక్షి.
"మాయపుఁబులుగొకటి మచ్చికె నీ బాలుని
చేయిచ్చి యెక్కిరించుకొనఁ జేరీనట" 5-247

**మాయపుకతలు:** (మాయము+కతలు) వి. మోసపుకథలు, మోసపు విషయాలు.
"నాయమే నడిపితేను నగుతా సమ్మతించుట
మాయపు కతలకెల్ల మరి నే మెరఁగము" 7-520

**మాయపుగుణము:** (మాయము + గుణము) వి. మోసపుగుణం.
"మాయపు నీ గుణాలకు మారుకొందు
నంతలోనె
ఆయములు నీ వంటితే నన్నియు మఱతును"
11-71

**మాయము:** వి. మాయ.
"సోయగంబగు కన్నుచూపు లనియెడు మహా
మాయములఁ బొరలించి మనసు నాటించె"
5-240

**మాయి:** వి. తల్లి.
"మాయి మాయి యలమేలుమంగ నాచ్చారి
మతిఁ
బాయని వేంకటపతి పట్టపురాణి" 6-47

**మారకపురము:** వి. ఒంగోలుజిల్లా లోని మార్కాపురం. 26-100

**మారకపురము చెన్నరాయఁడు:** వి. ఒంగోలుజిల్లా లోని మార్కాపురంలో వెలసిన చెన్నరాయడు.
"రవ్వలాయ మారకపురము చెన్నరాయ నేడు
యివ్వల శ్రీవేంకటాద్రి నిటు నన్నుఁగూడఁగా"
26-100

**మారాడు:** (మారు + ఆడు) ప.బం; అ.క్రి. ఎదురు మాట్లాడు.
"యీతఁడిదె నిను నేలె యింక మారాడకువే
యేతులనైనా నీవు యెడయఁగ నోపవు"
14-160

మారిపిల్లాడించు : ప.బం; స.క్రి. బాధించు.
"కూరిమి నీతఁడు దొల్లి కొనగొనలనే తల్లి
మారిపిల్లాడించెనే మారుదల్లి" 5-48

మారిపిల్లాడు : (2) ప.బం; అ.క్రి. బాధపడు.
"మాడలవలె సతుల మారొపిల్లాడేవు
తోడనిట్టే యందరిని దొడ్డిఁబెట్టేవో" 7-455

మారుఁ బేరు : వి. వేరే పెట్టిన పేరు. 13-56 old

మా(ఋ)రు : వి. ప్రతి, సమానం, బదులు.
"కొమ్మ నీ పయ్యెదలోని కుచముల మారు
సుమ్మీ
నిమ్మపండ్లెగరవేసీ నీ రమణుఁడు" 7-387

మారుకు మారాడు : ప.బం; అ.క్రి.
ప్రతిభాషలాడు, ఎదురు మాట్లాడు. 6-109
"మారుకు మారాడేటి మందవారము మేము
కోరికి నాడేటి చల్ల కోరో చల్ల"

మారుకు మారు : (21) బదులుకు బదులు, మేరకు మేర, మట్టుకు మట్టు, ఎంతకంత, తత్క్షణం, వెంటనే (వ్యు.)
"కానుక నే నంపితేను కమ్మటి మారుకు మారు
లౌనూఁ గప్పురముపెఁ దగవే కదే" 23-205
"చేరి నీవు చెనకఁగా సిగ్గునేఁ బడఁగాను
మారుకు మారుసేయక మానవచ్చునా"
25-236
"చెఱకు దీపంటా నేమి సేయవచ్చునే
మఱిమరి విభునితో మారుకు మారే కాక"

మారుకొను : స.క్రి. ఎదుర్కొను.
"వెక్కసపు వలపుల విఱ్ఱవీగేవు
మక్కువలు మారుకొంటే మఱియేమి సేసేవే"
19-107

మారుగత : వి. సమాధానమైన కథ.
పొడుపుకథకు సమాధానం కావచ్చు.
"అన్నియు నీయందే అమరెనట
కన్నియ ఇందుకు మారుగత చెప్పవే" 24-7

మారుగమ్మ : (మారు+కమ్మ) ప.బం; వి.
సమాధానమిచ్చే జాబు.
"అంగనకు మారుగమ్మ లంపవయ్యా
యింగితము లోనే కంటి మేమందుమయ్యా"
13-454
"అగడుగాఁబువ్వుల గుత్తి యట్టె పైవేసెఁగాని
మగటిమి నీ కమ్మవు మారుగమ్మ వెట్టదు"
26-540

మారుగొండలు : వి. (?)
"చండి హిరణ్యాక్షునితోడ సరసములాడఁగా
అండనుండే చెలి మారుగొండ లెక్కను"
25-328

మారుగోల : (మారు + కోల) వి. (?)
"మలసి మామీఁద నట్టె మారుగోల గోలచేవు
కలిగినదెల్లా నీకె గాదెఁ బోసెఁజుమ్మీ" 14-89

మారుజాతివారు : తక్కువజాతివారు (?)
"చీర వెలిగా నవ్వేవు చెల్లఁబో యెక్కడనైన
మారుజాతివారికైన మానము లేదా" 5-323

మారుత్తరము : (2) (మారు + ఉత్తరము)
ప్రతిజవాబు.
"ఆకెతో మారుత్తరము లాడరాదా విచ్చేసి
పైకొని మమ్మే వొడఁబరచే నీడ" 19-441

మారుదల్లి : (మారు + తల్లి) వి; ప.బం.
సవతితల్లి.
"మారుదల్లి సేతి మాటలఁబడలేక
వూరువిడిశి యడవులకేఁగి" 5-378

మారుబేరాలాడు : (2) (మారుబేరాలు + ఆడు)
మారు బేరములు చేయు. ఒకటి ఒకరు ఇవ్వగా మరొకరు మరొకటి యిచ్చి చేయు బేరము మారుబేరము. ఒక వస్తువును కొని దాన్ని తిరిగి లాభానికి అమ్ముకొను. ఒకచోట కొని మరొకచోట లాభానికి అమ్ము.
"మంచిదయ్యా వలపులు మారుబేరాలాడేవు
పొంచి నెట్టువడినది పొరుగాపెమీఁదను"
18-206

మారుమంచము : (2) వి. వేరుమంచం.
"మగువ నాతో నలిగి మారుమంచ మెక్కినాను

తగిలి నా మనసందు దగ్గరి రాదా" 24-10

**మారు(ఱు)మలయు :** (4) ప.బం; అ.క్రి. ఎదిరించు, ఢీకొను, ప్రతిఘటించు, ప్రతికూలంగా మాట్లాడు.
"తతి నలమేలుమంగపతి శ్రీవేంకటేశ్వర
మతకాన నున్నవారు మాఱుమలసేరు" 2-261

**మారుమాట :** వి. ఎదిరించి మాటాడు మాట.
"మారుమాటలంత నేరమరి విన్నపాలు నే
శ్రీరామచందురుని చిత్తమింతే కాక" 26-38

**మారుమొగమగు :** ప.బం; అ.క్రి. అనిష్టతను సూచించు.

**మారువెలవెట్టు :** తిరిగి ఇచ్చే మూల్యం.
"మరుతంత్రములనే మారువెలవెట్టి నన్ను
ధరలోన నింత యేల దక్కఁగొనేవే" 14-363

**మార్పులాడు :** ప.బం; అ.క్రి. గోత్రస్థలన మొనరించు. (వ్యు.)
"అంగలించి శ్రీవేంకటాధిప నీవు గూడితివి
వుంగరము లాకె వేళ్ల నొగి మార్పులాడెను"
ఈ అర్థం ఇక్కడ సరిపోవడం లేదు.

**మాఱుమాట :** వి; ప.బం. ప్రత్యుత్తరం.
"మాఱుమాటలును మాతో నాడవు
తీఱిక లోవెలిఁదిరిగేవే చెలియా" 19-535

**మాలజీవుఁడు :** వి. నికృష్టజీవుడు, పాడు జీవుడు.
"మరచెనా తన పాటు మాలజీవుఁడు దొల్లి
కొరమాలి బహుయోనికూపముల పొరలి"
4 అను. 18.

**మాలిక :** వి. వరుస (?)
"చెండిన రావణు శిరోమాలికల
దండల పూజల తఱచుగను" 2-516

**మాలిమి :** వి. సరంగు, కర్ణధారుడు, ఓడ నడిపేవాడు. ఓడ నడిపే శాస్త్రం తెలిసినవాడు. (వ్యు.)
"అలర శ్రీవేంకటేశ్వరుఁడని యేటి మాలిమి
నలుదిక్కులకు నోడ నడపఁగాను" 3-388
వరాహ. 5-76

**మాలు :** వి. చెడు.
"మాలు గలసిన బదుకు మాయలోనె కలపి
యేలకొ ఘనసుఖంబియ్యదాయ" 15-51

**మాలు :** ప.బం; వి. శూన్యం కావచ్చు అని సంపా.
"మనసొకటి కోరికలు మాలు గలపుచు(?) నుండు
తనసితే నదియ పరతత్వమై నిలుచు" 3-426

**మాలుగలియు :** అ.క్రి; ప.బం. అందులో ఒకటగు, కలిసిపోవు.
"మాలుగలసిన బదుకు మాయలోనే కలపి
యేలనో ఘనసుఖంబియ్యదాయ" 15-51

**మాలుగలుపు :** ప.బం; స.క్రి. అందులో ఒకటిగా చేయు, కలిపివేయు, కలిసిపోయేట్లు చేయు. (వ్యు.)
"మనసొకటి కోరికలు మాలుగలపుచు నుండ
తనిసితే నదియ పరతత్త్వమై నిలుచు" 3-426

**మాలుగొనివుండు :** ప.బం; అ.క్రి. మనసు మనసున లేకుండు, మనసు మరొకలాగా ఉండు. ఇది రా.సీ. మాం; విడుచు, త్యజించు అని (వ్యు.)
"మాలుగొని వున్నాఁడవు మదమెత్తి
వున్నాఁడవు
అలరి మా విన్నపము లాలకించేవా" 3-576

**మాలె :** వి. 'మాళిగ'కు వ్యావహారికరూపం. మాలియ, హర్మ్యం, మాడుగు. తేనె దీయునపుడు కొండచరుల నడుమ గట్టెడి చిన్న మంచె వంటిదియా? (శ.గ. 1-123 పు.)
"మాలెమీఁద పరువెందాకా నీ మచ్చిక విడువఁగ లేవు" 1-184
మాలెకంబము = హర్మ్యస్తంభం. నీ.శ. 70

**మాలెమీది పరువు :** ప.బం; వి. అపాయకరం. మేడమీది పరుగు అపాయకరమే కదా!
"మాలెమీఁద పరు వెందాకా నీ మచ్చిక
విడువఁగలేవు" 1-184

**మాళిగ :** వి. మేడ.

"వొప్పగు దోమతెరలో నున్నదో కాక నీ
చప్పరమాళిగెలోన సరినొంటి నున్నదో"
19-432

**మావతన్:** (?)

"యీవల నలమేల్మంగని ఇటు నన్ను నేలితివి
మావతఁదెచ్చితివి మన్నించితివేమో" 18-510

**మావిటికి:** మాపటికి, సాయంకాలానికి, రాత్రికి. ఇది 'మాపటికి' అనే పదానికి వ్యావహారికరూపం కావచ్చు. ప్రాస నిర్బంధంతో 'ప' 'వ' గా మారిందేమో!

"ఆవులమందకు రాఁగా నాయము లంటితిగాక
మావిటికి వచ్చి నీవు మమ్ముఁ జేసేవా" 20-306

**మాసటీఁడు:** (?) (మాసటి+ఈఁడు) వి.మాష్టీడు, శూరుడు, మల్లుడు. మాలపల్లెలో మల్లవిద్యా ప్రదర్శనం చేసి వారి నాశ్రయించి జీవించేవారు. విణ. శ్రేష్ఠుడు.

"మంతుకెక్కి యీ పనికి మాసటీఁడు తానె కాన
పంతము లిప్పించీని పడఁతులకు" 27-254

**మాసినది మణుగను:** నానుడి; కశ్మలమే మంచిదిగా తోచు, మాసినబట్టయే నిర్మలమైన వస్త్రమైన దనుట.

"మాసినదే మణుగాయెను మాకు నేఁది
జన్మము" 3-86

**మాసు(సి):** మైల, మావి, గర్భస్థపిండాన్ని ఆవరించి ఉండే పొర. (వ్య.) మాసు = మావి the after birth placenta (kittel)

"పొంచి గర్భమున మాసు పొదిగి
వుండిననాఁడు
యెంచుకొని ముచ్చటలాడ నెవ్వరున్నారు"
3-268

## మి

**మింగిన కడికి చవులా:** సామెత; చూ: మింగిన కడికి చవులెంచు.

"వెనకకి కోపము వేడుక లిప్పుడు
కనుఁగొన మింగిన కడి కిఁకఁ జవులా" 20-226

**మింగిన కడికి చవులెంచు:** సామెత; గడిచిన దానికి వగచు. నాలుకమీద ఉన్న ముద్ద రుచినే గ్రహించగలం కాని మింగిన తరువాత కడుపులోకి పోయిన ముద్ద రుచి ఎటువంటిదో చెప్పలేం అనేదానినిబట్టి వచ్చిన సామెత. వ్యర్థప్రయత్నం చేయు అని భావం. "చీఁకటి వాసెను చే దీపమేలే" అని ఈ కీర్తనలోనే మరో ప్రయోగం.

"మొదల నే నెరుగక మోసపోతి గాకనే
కదిసి యేపొద్దు వద్దగాచుకుండనా!
యిది మింగిన కడికి యింక జవు లెంచనేల!
చెదర నీ పంతమెల్లఁ జెల్లెఁ బదరోరి?" 7-294

**మించుఁజూపులాఁడి:** (మించు + చూపులు + ఆఁడి) వి. మెఱుపు వంటి చూపులు గల స్త్రీ, స్త్రీ.

"ఏడు విలువుల పైడిమేడమీఁద నుండి నిన్ను
జూడవేడుకైన మించుఁజూపులాఁడి" 5-63

**మించు:** వి. పెండ్లి తతంగంలో పెండ్లికూతురుకు మట్టెలు పెట్టినట్లు పెండ్లికొడుకు కుడికాలి రెండోవేలికి పెట్టే మట్టెవంటి వెండి చుట్ట. రాయలసీమలో కొన్ని తెగలలో ఈ ఆచారముంది. పెండ్లితరువాత పెండ్లికొడుకు పీటిని తీసేస్తాడు.

"నెలకొని తనకు మారు నీకుఁ బాదా లొత్తుమని
మెలుపున వజ్రాల మించు లంపెను" 29-239

**మింటితాపలు:** వి; బహు. ఊర్ధ్వలోకపు మెట్లు.

"తొడికి మింటితాపలు తుంచి దూపదాఁకినమ్ము
జదధి మరుదేశాల జలమింకించె" 3-133

**మిండతుమ్మెద:** వి. మగతుమ్మెద.

"తమ్మిపూవుఁగొలనిలో తరుణులుందాము
మిండ
తుమ్మెద లీఁదులాఁడఁగఁ దొంగిచూచి" 6-9

**మిందుఁగిందు:** మంచిచెడులు; మీదా కిందా, తలకిందులు అని శబ్దార్థం. ఇట మీద శబ్దం 'మిందు' గా ప్రయోగింప బడటం విశేషం.

"మేర మీరినాతఁడు మిందుగిందు నెంచఁడు
తారుకాణించగఁబోతే తగవులే కలవి" 21-377

**మిక్కిలిదొర:** వి. గొప్పదొర, గొప్పప్రభువు.

"మిక్కిలిదొరవు నీవు మేనదానసంటా నేను

చిక్కఁగా నవ్వితిని పెలవులను" 18-328

**మిక్కిళ్లు:** వి; బహు. 'మిక్కిలు' శబ్ద బహువచనరూపం. మిగుళ్లు, శేషములు. (మిక్కిలు = మిగులు, శేషం)

"నెఱవగు చూపులు నిక్కిళ్ల

మెఱసెను తమకము మిక్కిళ్ల" 28-419

**మిగులార:** (మిగులు + అర) క్రి.విశ. ఎక్కువగా.

"తగవులు చెప్పఁగాను తప్పులేమీ రావు గదా

మిగులార సరసమాడే మీలోనను" 27-370

**మిట్టించు:** అ.క్రి. 1. ఉబుకు, నిగుడు 2. అతిశయించు, అధికమగు 3. మీదికెగయు, పైకెగురు.

"యీరెండు మిట్టించి యీ యింతి పైకెగురు

తీరుగా నీ చిక్కావ్వరు తీర్చవలెనయ్యా" 7-124

**మిట్టకోల:** వి. తీక్ష్ణమైన కల్తి, తీక్ష్ణమైన బాణం. (శ.ర.)

"మేకొని మరునింటికి మిట్టకోలలై యవి

కూకులువత్తులుగా నీగుందురా" 23-350

**మిడిమాలము:** వి. 'మిడిమేలము' నకు వ్యావహారికరూపం. ఉపద్రవం, కీడు, మిడిసిపాటు. విశ. ఉపద్రవకరం, బాధాకరం.

"మిడిమాలపు నీ మెచ్చు మేలు మేలు కైకొంటి

వడి నోపనన్నాఁబోవు వచ్చి కాఁగిలించేవు"

8-192

**మితిమేర:** వి. మేర (= అవధి) అనే అర్థంలో జంటపదం. ఇందులోని రెండు పదాలూ ఏకార్థకాలే.

"చిత్తం బాకలి దీరదు చింత దలంపునఁ బాయదు

యెత్తిన పరితాపమునకు నేదీ మితిమేర" 1-176

**మినుకు:** విశ. స్వల్పమైన, మినమిన కాంతిగల, మినమిన ప్రకాశించు. 11-3-112 old

**మినుకుల పట్టుచీర:** వి. కాంతివంతమగు పట్టుచీర, చిన్న బంగారు నాణెములు పొదిగిన పట్టుచీర. (?)

"మినుకుల పట్టుచీర మేలు ముసుఁగువెట్టుక

కనుచూపు దవ్వులనే కానవచ్చీ నదివో"

12-495

**మినుకులాఁడి:** (మినుకులు + ఆఁడి) తళతళకాంతులు గల స్త్రీ, స్త్రీ.

"ననుపున మోవి చూపి నానఁబెట్టే నాసలు

మినుకులాఁడివి కడు మేలే నీవు" 29-81

**మిన్నుమన్నుల పొడవులు:** వి; బహు. అత్యున్నతాలు. 9-249 old

**మిన్ను(లు)మోయు:** ప.బం; అ.క్రి. ఆకాశాన్నంటు.

"కదలె కదలె నదె గరుడధ్వజుని తేరు

అదె మిన్నుమోచిన నీలాద్రివలెను" 4-55

**మిన్నులఁబారు:** ప.బం; అ.క్రి. దుముకు, అతివేగంగా పోవు.

"చించుక మిన్నులఁబారే చింకలను బండికట్టి"

1-177

**మిన్నుల పొడవులు:** ప.బం; వి; బహు. అత్యున్నతాలు.

"మించిన కోరికలివి మిన్నుల పొడవులు

కొంచపుదేహము దన కొలఁది కాదు" 3-538

**మిన్నులమోచు:** ప.బం; అ.క్రి. ఆకాశాన్ని అంటు.

"తూరుపునం బొడిచెఁ జందురుఁడు మిన్నుల మోవ

పాఱుతెంచె విరహుల బందికాఁడు" 6-16

**మిరియపుఁగాయలు:** వి; బహు. భక్ష్యవిశేషం.

"కాయపురుచులకు గనియగు

మిరియపుఁగాయలు నేలకికాయలును" 6-4

**మిఱుపల్లములు:** వి; బహు. మిట్టపల్లములు.

5-115 old

## మీ

**మీఁదటెత్తు:** (2) పైఎత్తు.

"ఎచ్చరించ వచ్చితి నీ కితవరిదానవై

కచ్చుపెట్టి మీఁదటెత్తు గనుకొమ్మి యికను"

27-60

**మీఁదమీఁదఁ జవులు :** పైపై రుచులు.
"మేటి వేంకటేశుఁబాసి మీఁమీఁదఁజవులంటా
నాటకపు తెరువుల నడిచేము" 1-94

**మీఁదమీఁద :** (2) అవ్య; ప.బం. పైపైన, వెంటవెంట.
"మీఁదమీఁద వలపెక్కె మేలు మేలోయి
చీఁదర రేచేవు నన్ను చెల్లులేవోయి" 20-91

**మీఁదమీఁద వుందు :** ప.బం; అ.క్రి. తేలికగా ఉండు.
"తాలిమి చక్కన గాని తమక మెంతైనాఁగద్దు
మేలమాడవయ్యె చెలి మీఁద మీఁద నున్నది"
11-298

**మీఁదిమాటలు :** ప.బం; వి; బహు. పైపై మాటలు, ఇచ్చకోలు మాటలు.
"చెప్పరే బుద్ధులు నాకుఁ జెలులాల మిమ్ము
మెప్పించుదాఁకా నుంటి మీఁదిమాట లేటివే"
16-102

**మీఁదు :** వి. పైభాగం, మీదిభాగం.
"భావింప నన్నేలితివి బలిమి తెంకాయ మీఁదు
చేవదేరు లోపలెల్లా జిగి మించుఁ దీపులు"
26-477

**మీఁదుకట్టు :** ప.బం; వి. ఎప్పటికో, ఎవరికోసమో ప్రత్యేకించు (పద.), ఏదేని సందర్భంలో మొక్కుకొని దేవునికి ముడుపు కట్టినది. (రా.సీ. మాం.)
"తొలుత నమ్మించితివి దోసము బుణ్యము నీది
మెలఁగి పాయము నీకే మీఁదుకట్టి గాక"
"ఎంత మీఁదుకట్టినో యింతి నీకు జవ్వనము"
20-144

**మీఁదెదై వుందు :** పైకి ఎక్కి ఉండు. 'మీఁదేదు' అని పూ.ము.పా.
"కోరి శ్రీవేంకటపతి కుక్షిలోనే లోకములు
అరయఁగిందెదు మీఁదెదై వున్న వింతే" 3-14

**మీఁదెత్తు :** ప.బం; స.క్రి. దేవతాదులకు సమర్పించటం కోసం నియమించి ఉంచు.
"గుట్టున నా చన్నులు నీకు మీఁదెత్తినవే కావా
బెట్టుగాఁ బెనఁగి చేతఁబట్టేవుగాక" 12-364

**మీఁదెత్తుట :** మీఁదుకట్టు.
"పాటించి నీ భావము పట్టవశమా
మేటి నా మనసు నీకు మీఁదెత్తు టింతే" 2-261

**మీలకు నీఁతలు గరపు :** ప.బం; అ.క్రి. వ్యర్థమైన పనికి పూనుకొను. చేపలకు ఈదడం నేర్పు అని వాచ్యర్థం.
"నాఁటిరో చూడవే నవ్వుచు మీలకు
నీఁతలు గరపీ నిదె వీఁడు" 5-124

**మీలపిల్లలకు ఈఁతలు నేర్పు :** ప.బం; అ.క్రి. వ్యర్థమైన పనికి పూనుకొను.
"మేఁతలు మరిగిన మీలపిల్లలకు
నీఁతలు నేరిపి(పీ) యీ తరుణి" 5-294

**మీసాలతేనె :** వి; ప.బం. తాత్కాలికం, అశాశ్వతం, అల్పసుఖం.
"ఓ యమ్మ యేడకేడే వోయమ్మా
యీ యెడ మీసాలతేనె యీ వలపు" 19-407

**మీసాలపై తేనె :** ప.బం; వి. అల్పసుఖం.
"తీపువలెనే వుందు దిష్టపుఁబదార్థాలు
మేపుగొంటే మీసాలమీఁది తే నౌను" 2-240

**మీసాలమీఁది తేనె నాకుట :** ప.బం; వి. తాత్కాలికమైనది. అల్పమైనది.
"శ్రీపతి యీతఁడుండఁగాఁ జిక్కినవారి నమ్మట
తీపని మీసాలమీఁది తేనె నాకుట సుండీ" 3-169

## ము

**ముంగమురువు :** వి. ముంజేతికడియం, రూపాం. ముంగాముర్వారి, ముంగైమురారి, ముంగామురువు, ముంగామురుము, ముంగమురుము, ముంగమురాము.
"ముచ్చువలె వచ్చి తన ముంగమురువుల
చేయి
తచ్చెడి పెరుగులోన తగఁబెట్టి" 4 అను. 20
"ముంగాముర్వారి కడియము
ముంగాముర్వును మురుగును ముంగా

మురుమున్
ముంగమురము సూడిగమును ముంగమురా
మనఁగఁగటకమునకు నభిఖ్యల్!"
(ఆం.ప.ని.; మనుష్య. 245 ప.)

**ముంగారుముంపు :** (ముందు+కారు+ముంపు) ప.బం; వి. తొలకరివాన. (వ్యు.)
"ముసిముసి నవ్వుల ముంగారుముంపులు
వసివాడుఁజెమటవానలు" 9-230

**ముంగారు మొయిలు :** (ముందు + కారు + మొయిలు) వి. తొలకరిమేఘం, వర్షాకాలమేఘం.
"బంగారువంటిది చెలి పదారుగళల మించు
ముంగారుమొయిలువంటిది ముద్దుగురుసు" 23-83

**ముంగిటవేయు :** ప.బం; స.క్రి. బయట పారవేయు, బహిర్గతంచేయు.
"చిత్తమెల్లాఁ దక్కఁగొనె సిగ్గులు ముంగిటవేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను" 5-28

**ముంగిట సంపద :** వి; ప.బం. ముంగిటి నిధానం, ముంగిటి పెన్నిధి, అన్ని కోర్కెలను తీర్చేది.
"ముంగిట సంపద ముదిత సింగారము" 29-27

**ముంగిటిధనము :** వి; ప.బం. అన్నికోర్కెలను ఈడేర్చేది.

**ముంగిటినిధానము :** (8) వి. అందుబాటులో నున్న నిధి, పెరటికల్పకము.
"అంగవించి శ్రీవేంకటాధిప కూడితి నన్ను
ముంగిటినిధానమవై ముట్టి నన్నుఁ బాయవూ" 11-430 & 1-133

**ముంగిటి బంగారు :** ప.బం; వి. అందుబాటులో నున్న అమూల్యవస్తువు, ముంగిట నిధానము వంటిది.
"ముద్దుల నవ్వులు ముంగిటి బంగారు
అద్దములోఁ జిగురంటినది" 5-354

**ముంగిటి ముగ్గులగు :** ప.బం; వి; బహు. గృహాలంకారమగు, కళకళలాడు, ప్రకాశించు.
"ముంగిటి ముగ్గు లాయ మునుకొన్న సిగ్గులు" 29-402

**ముంగిటి ముత్యము :** వి. గృహాలంకారం, ముంగిలి యందున్న ముత్యం, నలుగడలవారికి కనబడుతూ చెలువారే ముత్యం, ముద్దుబిడ్డ.
"ముద్దుగారే యశోద ముంగిటిముత్యము వీఁడు
తిద్దరాని మహిమల దేవకీసుతుఁడు" 3-577

**ముంగైమురాలు :** (ముందు + కై + మురము) వి; బహు. ముంజేతికి ధరించే ఒకరకపు కడియాలు. చూ : ముంగమురపు ముంగైమురువులు.
"ముంగైమురాలు వెట్టేవు ముంచి నేఁ
బాదాలొత్తఁగా
అంగాలు నిన్ను దాఁకగా నంద కోరిచేవా" 13-517
"ముంగైమురాలును నవె మొలక తారును నదె
బంగారు నిగ్గులవన్నె పచ్చబట్టదే" 1-133

**ముంగైమురువులు :** (2) (ముందు + కై + మురువులు) వి; బహు. ముంజేత ధరించే ఒకరకపు కడియాలు. చూ : ముంగమురవు, ముంగైమురాలు.
"సంగతిఁ గొలువున్నాఁడు సవరాజ్యమేలుదువు
ముంగైమురువులచేత మొక్కవే నీ పతికి" 26-517

**ముంగోపము :** (ముందు + కోపము) ప.బం; వి. ఓర్పు లేక తటాలున వచ్చే కోపం.
"ముక్కుననే వున్నది ముంగోపమైతేను
యెక్కువ తక్కువలంటే నే మందువో" 14-206

**ముంగోపి :** (ముందు + కోపి) ముక్కోపి, తటాలున కోపపడే స్వభావం కలవాడు.
"ముంగోపులైనట్టి ముదితలనే కాని
కందుదీరి యెందుకును గైకొనరు" 21-338

**ముంగోపితనము :** వి; ప.బం. తటాలున కోపపడే స్వభావం, శీఘ్రకోపం.
"తక్కరి తమ గుణాలు తాము చూచకోరుగాని
మొక్కలమై వున్నది నా ముంగోపితనము" 20-97

**ముంచి :** (5) అవ్య. అతిశయించి.
"ముంచి చెలి నవ్వితేను ముత్తేలే రాలీని,
యించుక గేలిసేసితే నే మాయనయ్యా" 20-167
"ముందరఃజం(దుడు వచ్చి మొక్కితే యశోద చూచి
ముందేలా యంటినో యని - ముంచి వెరగందెను" 4-258
"మూలనెంత ధనమున్నా ముంచి దాన ధర్మములు
తాలిమితో నిచ్చినదే దాఃపురమై నిల్చును"
2-260

**ముంజీతము :** (ముందు + జీతము) వి. పనికి ముందుగానే ఇచ్చే జీతం.
"చుట్టరిక మెంచేవారి చోటికిఁ దల్లిదం(డివి
ముట్టి కొలిచినవారి ముంజీతమవు" 3-508

**ముంజు :** వి. మెదుక, పిసక, మురికి.
"గొల్లముంజు రాచజిడ్డు వోరి బుద్ధుడైన సిగ్గు
చొల్లుగుఱ్ఱపు నూఁగురొచ్చులు మానునా(నగా?)" 7-198

**ముంజూరు :** (ముందు + చూరు) వి. ఇంటిమీది కప్పు ముందు చివర.
"దాకొన్న మోవిగంటి తానే చూచుకొమ్మనవే
లేకలు ముంజూరు నిండె లెక్కించుకొమ్మనవే"
19-477

**ముంజేతి అద్దము :** ప.బం; వి. స్పష్టమైన విషయం.

**ముంజేతి కంకణము :** ప.బం; వి. అందుబాటులో నుండేది, స్పష్టంగా కనిపించేది.
"అందరిని గన్నతల్లి ఆదిమూలమైన లక్ష్మి
కందువ నీ ముంజేతికంకణమాయను" 7-3

**ముంజేతి కంకణాన కద్దమా :** (2) ప.బం. స్పష్టమైన విషయమని అర్థం. ముంజేత నున్న కంకణం స్పష్టంగా కనిపిస్తుంది. దాన్ని చూడటానికి అద్దమవసరం ఉండదు కదా! అతి స్పష్టమైన విషయానికి మరో సాక్ష్యం అవసరం లేదని భావం.

"పద్దే నాతో నింక వట్టి సరసము
అద్దో ముంజేతికంకణాన కద్దమా యింక" 17-44

**ముంజేతిచిలుక :** ప.బం; వి. అందుబాటులో నుండేది, స్పష్టంగా కనిపించేది.
"చెలరేగే ముంజేతిచిలుకవో వలపు
నిలువు నూరు వండేటి మొలకవో వలపు"
7-212

**ముంజేయి :** (4) (ముందు + చేయి) ప.బం; వి. మణికట్టు వరకు గల మోచేతి కిందిభాగం.
"చిలుక ముంజేతఁబట్టి చేరి పలికించనేలే"
29-101

**ముంటికి వాడిపెట్టు :** ప.బం; అ.(క్రి. వ్యర్థమైన పనికి పూనుకొను.
"నంటుసేయ నోపుదుము నగ నీతో నోపుదుము
ముంటికి వాఁడివెట్టఁగ ముందే వోపము"
20-593

**ముంటికొనవాదులు :** ప.బం; వి; బహు. తీక్ష్ణములైన వాదాలు.
"నేఁడు గొత్తలా తన నేరుపు లివి
వాఁడివెట్టి ముంటికొనవాదు లడిచేనా" 8-298

**ముంటిపై సుఖమందుట :** ప.బం; వి. అసాధ్యమైనది, దుష్కరము, కుదరనిది.
"ముంటిపై సుఖమందుట . . . . . .
వెంటఁ గర్మమార్గమున విష్ణుని సాధించుట"
6-49

**ముంతనీళ్లనే మునుగు బతుకు :** ప.బం; వి. అతిసంకుచితమైన జీవితం.
"ముంత నీళ్లనే మునిగే (బదుకు"
1-151 పుట. old

**ముంతల ముంచిన :** విణ. అధికమైన.
"ముంతల ముంచినయట్టి మోహములు చల్లఁగాను
వంతులకుఁ గొసరేటి వనితయుఁగలదా"
22-332

**ముంతలోని నీట మునిగి లేచు :** నానుడి; అతిసంకుచితమైన జీవితం గడపు.

"ఎంత సేసినా నెడయకే పోయ
ముంతలోని నీట మునిఁగి లేచుట" 1-71

**ముందటెత్తు :** (?)
"అందరికొక్కటే చాలు ఆండ్లకు మొగలకు
ముందటెత్తు వేరె నీతో మోవనాడ వలెనా"
22-63

**ముందర నుయ్యి వెనకఁ దగరు :** ప.బం; వి. రెండువైపులా ఆపద పొంచి ఉండడం. ముందర బావి వెనుక పొటేలు అని వాచ్యార్థం.
"ఈ రీతి ముందర నుయ్యి యెంచ వెనకఁ దగరు
యేరా నీతోడి పొందు యేమిసేతు నిఁకను"
21-458

**ముందర పారెడి తేరు ముంచి వెనకా పులి :** ప.బం; వి. రెండువైపులా పొంచి ఉన్న ఆపద.
"ముందర పారెడి తేరు ముంచి వెనకా పులి
యిందిరారమణుఁడే దిక్కు యిఁకఁ జేసేదేమి"
15-94

**ముందర ముసళ్లపండుగ :** ప.బం; వి. ప్రధానమైన విషయం ముందున్నదనుట.
"చెప్పితిఁ జెప్పితిని మాతోఁజెల్లదు నీకింకను
ముప్పిరినున్నది ముందర నిదివో
ముసళ్లపండుగ" 17-88

**ముందరవెనుకలగు :** ప.బం; అ.క్రి. తలకిందులగు.
"వలచి తిరువేంకటేశ్వరునిం బొందిన మరుని
తలఁపులన్నియు ముందరవెనుకలాయె" 4-49

**ముందరి చెవులకంటే వెనక వచ్చే కొమ్ములు వాఁడియగు :** నానుడి; కొత్త స్నేహితులలో, చుట్టాలలో ముఖ్యులైన పాతవారిని మఱచి పోయినప్పుడో, ఉపేక్షించినప్పుడో ఉపయోగించే పలుకుబడి.
"ముప్పిరి నేమి చూచేవే ముందరి చెవులకంటే
గొప్పలై వెనకవచ్చే కొమ్ములు వాఁడాయనే"
17-35

**ముందలపట్టు :** ప.బం; అ.క్రి; మాం. (రా.సీ.) తలవెండ్రుకలుపట్టు.
"ముందలేల పట్టేవు ముడిచేనంటా పూవులు
చెంది నాకు నితవరి చేతవలెనే" 27-122

**ముందు ముందే :** (3) తొలుతనే, మిక్కిలి పూర్వమే.
"ముందుముందే వలపులు మోపులు గావా"
28-260
"ముందుముందే చెనకితే మొగవాటై వుండును"
25-261

**ముందువెనుక :** (6) అన్నివిధాలా, సమగ్రంగా.
"అందెనంది మోక్షము హరిదాసులవల్లను
ముందువెన కెంచితేను మూలమే హరి" 4-221

**ముంబారము :** (ముందు + బారము) వి. ముందరిభారం.
"ముందరనె యెనసెటి శరముల
ముంబారము గడవఁగ వసమా" 10-2-112

**ముంభారము :** (ముందు + భారము) వి. ముందరిభారం.
"చెప్పఁగరాదీ వలపులు చెలివల
నెవ్వరిఁగానము
ముప్పిరి జవ్వనభారపు ముంభారము
గాఁబోలు" 17-390

**ముకుందము :** వి. 1. ఒక నిధి 2. ఒకానొక గంధద్రవ్యం 3.పాదరసం 4. మణివిశేషం 5. ఎఱ్ఱదామర.
"కాఁగిటను శ్రీవేంకటగిరి ముకుందంబు
మూఁగిన వరములెల్ల ముంగిటందు" 9-202

**ముకుచాయ :** ప.బం; వి. ముక్కుసూటి.
"జాడతో భూమెల్లా ముకుచాయనె
యేలినవాఁడు
వేడుకఁగంబసూత్రపు వేసాలవాఁడు"

**ముకుదాఁటఁ గాలు గుచ్చు :** ప.బం; అ.క్రి. అదేపనిగా తగాదాకు పిలుచు. (పద.)
"కావలసిన పనులు రాకమానీనా నీవు
కావరాన ముకుఁదాటఁ గాలు గుచ్చే వేలరా"
26-159 భార. ఉ. 3-220

**ముకెము :** వి. 'ముఖ్యము' నకు వికృతిరూపం.

"ముకెమై వుభయకర్మములు బంధహేతువని
ప్రకటించి వేదాంతపరనమే యెక్కుడు" 4-188

**ముక్కపోవు :** ప.బం; అ.క్రి. మొక్కవోవు, కుంఠితమగు.

"తక్కక పరస్త్రీలఁ దలంచి మనసు బుద్ధి
ముక్కపోయ మాకు నేఁటి
ముందరిపుణ్యములు" 2-61

**ముక్కర :** వి; రూపాం. ముక్కఱ (ముక్కు + ఱాయి) ముక్కుకు ధరించే ఆభరణవిశేషం.

"ముద్దుల పెదవిమీద ముక్కర గదలఁగాను
వుద్దండపు మాటలాడె నువిద నిన్ను" 26-301

**ముక్కలువోవు :** (ముక్కలు + పోవు) ముక్కపోవు, కుంఠితమగు.

"పచ్చివలెనే తోఁచు పండ్లు ముక్కలువోవు
మచ్చికఁగాంతలతోడి మదనసుఖము" 15-47

**ముక్కాలిపీఁట :** వి. మూడుకాళ్లు గల ఒకరకపు పీట. రూపాం. ముక్కలిపీట.

"ఎనసితినే నిన్ను యింతలో శ్రీవేంకటేశ
అనువై ముక్కాలిపీఁట వైతివిగా యిపుడు"

21-229

**ముక్కు తిక్కలు :** వి; ప.బం; బహు. (?)

"ముక్కుతిక్కలకుఁదెచ్చి మోము చూచి నవ్వి నాతో
నొక్కటైతి వింతలోనే వోరీ పోరా" 14-312

**ముక్కునఁగోపము :** ప.బం; వి. తొందరగా వచ్చే కోపం.

"మొక్కళపుఁదుమ్మిదలు మూఁగీఁ గన్నుల తుద
ముక్కునఁగోపము లేలే ముట్టినంతలోననే"

19-434

**ముక్కునఁగోపము నిండు :** ప.బం; అ.క్రి. తొందరగా కోపం కలుగు.

"ముక్కునఁగోపము నిండె ముందరనుండిన యీపె
తక్కించి నీవు పరులఁదప్పక చూడఁగను"

19-579

**ముక్కున కోపముండు :** ప.బం; అ.క్రి. తొందరగా కోపం కలుగు.

"ముక్కున నుండుఁ గోపము ముంచి నీవంటి వానికి
నిక్కి మాతో నవ్వరాకు నీవెన్నఁడు నయ్య"

14-374

**ముక్కున నున్న ముంగోపము :** ప.బం; వి. మిక్కిలి అధికమైన కోపం.

"ముక్కున నున్నది ముంగోపం బిది
ఎక్కువ శాంతం బిందున్నదో" 15-50

**ముక్కున ప్రాణముండు :** ప.బం; అ.క్రి. అవసానదశలో నుండు.

"ముక్కున నున్నది ముందటఁ బ్రాణము
ఎక్కడ నమ్మేదిఁక బ్రదుకు" 4-131

**ముక్కున ముంగోపము :** ప.బం; వి. మిక్కిలి కోపము, అతిత్వరగా వచ్చే కోపము.

"ముక్కునఁదనకే ముంగోపము మరి
తక్కరి రమణుఁడు తగునా తనకు" 20-150

**ముక్కున వయ్యంగ దిను :** ప.బం; స.క్రి. బాగా తిను. ముక్కులో వచ్చునట్లుగా అని కూడా వాడుకలో వినవస్తుంది.

"వెక్కసాన రేపల్లె వెన్నలెల్లా మాపుదాకా
ముక్కున వయ్యంగ దిన్న ముద్దులాఁడు"

6-144

**ముక్కుపై వేలంటుకొను :** ప.బం; అ.క్రి. ఆశ్చర్యపడు.

"అదేల ముక్కుపై వేలంటుకొనేవే ఇందరు
ఇదె యీతని పొత్తున నేసేరంటా" 25-165

**ముక్కుపై వేలిడుకొను :** ప.బం; అ.క్రి. ఆశ్చర్యపడు.

"అక్కడనే విడెము నీ కాపె వోసఁగినదంటా
ముక్కుపై వేలిడుకొను మోనమున నున్నది"

29-68

**ముక్కుమీఁద వేలిడు :** ప.బం; అ.క్రి. ఆశ్చర్యపడు.
"ముక్కుమీఁద వేలిడుక మోనమున నే నుండితే
తక్కె సిగ్గుల మునిఁగే తాఁదానే" 8-36

**ముక్కుమీఁద వేలువెట్టు :** ప.బం; అ.క్రి. ఆశ్చర్యపడు.
"వెరగంది ముక్కుమీఁద వేలువెట్టే వది యేమే
తెరవేసు కాతఁడు నీ దిక్కు చూడఁగాను"
29-407

**ముక్కుమీది వేలు :** ప.బం; వి. ఆశ్చర్యం.
"ముక్కుమీఁదివేలితోడ ముందట నుండేఁగాక"
7-338

**ముక్కుమొకము చూచు :** ప.బం; అ.క్రి. అదరించు.
"ముక్కుమొకముఁ జూడవు ముదితైతేఁ
జేకొనేవు
నిక్కిన తృణగ్రాహినీలము వలె" 23-391

**ముక్కుల చన్నులు :** ప.బం; వి; బహు. చూచుకములు గల స్తనాలు. (ముక్కులు = చూచుకములు)
"చెక్కులు నీకు నొక్కఁగా సేదదేరుదువు గాక
ముక్కుల చన్నుల నేలే మొనపోట్లు" 21-120

**ముక్కువట్టు :** ప.బం; అ.క్రి. నిర్బంధించు.
"ముక్కువట్టినట్లు యీ మోహము నీవు చల్లితే
వొక్క నీసేవ సేసుకవుండేరా నేను" 11-260

**ముక్కువాత నుండు :** ప.బం; అ.క్రి. చివర ఉండు.
"యెనసి ప్రాణవాయువు లవి సొమ్మని నమ్మితి
మొనసి లోనువెలినై ముక్కువాత నున్నవి"
3-41

**ముక్కెము :** వి. 'ముఖ్యము' అనే దానికి వ్యావహారిక రూపం.
"యెంగిలి మోవు లిచ్చేది యిటు
చన్నులఁగుచ్చేది
ముంగిటిరమణులకు ముక్కెమే కాదా" 20-237

**ముఖరము :** (?)
"ముఖరమై మాఁకులకు మొదలఁబోసిన నీరు
శిఖలకు దనువెక్కి చిగిరించినయట్లు" 4-340

**ముగియు :** అ.క్రి. మరణించు, చచ్చు.
"మోవ మూఁతి గిరిపితే మూఁడులోకాలు
మోవిఁబార నవ్వితేనే ముగిసి రసురులు"
2-156

**ముగుదతనము :** వి. (ముగుద + తనము) గోలతనం, ముగ్ధత్వం.
"ముగుదతనాన నాపె మోనముతో నుండఁగాను
నగుమంటా గోరనేల నాటించేవు" 28-38

**ముగుసును :** క్రి.ప. 'ముగియును' అనే గ్రాంథిక రూపానికి వ్యావహారికరూపం.
"ఏది తుద యెన్నఁడు ముగుసును
ఆదికి ననాది హరిమాయ" 15-4

**ముగ్గు :** అ.క్రి. 1. కంకులు పూర్తిగా ముదిరి ఫలించు 2.మాగు, పండు, పక్వమగు.
"బగ్గన నక్కడ నిన్ని పనులు గలిగినాను
ముగ్గిన యీవేళకు మూట గట్టరాదా" 14-63

**ముగ్గుపిండి :** వి. ముగ్గువేయడానికి ఉపయోగించే పిండి.
"బగ్గన శ్రీవేంకటాద్రిపతి నన్నుఁగూడె నిఁక
ముగ్గుపిండి అట్లకు మొదలయ్యీనా" 11-160

**ముగ్గువేయు :** స.క్రి. పండవేయు.
"ముసుగులు వెట్టితేను ముగ్గు వేయదా
పొసఁగ నీ గుణములు పొగడవలెఁగాక" 26-432

**ముచ్చటలచ్చటలాడు :** ప.బం; అ.క్రి. ముద్దు ముచ్చటలాడు.
"ముప్పిరి నితవుతోడ ముచ్చటలచ్చటలాడి
యెప్పుడూఁబాయకుండెడి ఇల్లాలు" 22-524

**ముచ్చటాడు :** ప.బం; అ.క్రి. ముచ్చటగూర్చు.
"మోపైపై విడెపు కెంపు ముచ్చటాడంగ" 5-334

**ముచ్చుము పట్టు :** ప.బం; స.క్రి. గుర్తుపట్టు.
"అలరులు ముడిచేనంటేఁదా లోఁగీని
మలసి వాడుఁజూపుల మచ్చుము వట్టీనా"
11-361

**ముచ్చింత:** వి. ఒకానొక నోము, మూగనోము. (మూగచింతలమ్మ > మూ చింత > ముచ్చింత)
"నెమ్మదిని కన్నీట నిండుఁగొలఁకులు నీమె
ముమ్మడించిన వగల ముచ్చింత నోమె" 5-127

**ముచ్చిమి:** (ముచ్చు + ఇమి) దొంగతనం.
"అచ్చపు శ్రీవేంకటేశ అట్టె నన్నుఁగూడితివి
ముచ్చిమి దీరినమీఁద మొక్కు లేల యిఁకను" 11-551

**ముచ్చిమికూడు:** వి. దొంగకూడు, దొంగసొమ్ము. (ముచ్చిమి = రాత్రి, అర్ధరాత్రి)
"తీరని వేడుకతో తిరుమంగయాళువారి
ఆరడి ముచ్చిమిగూటి కాసపడ్డవాఁడు" 1-121

**ముచ్చిమిపొద్దు:** వి. దొంగలు తిరిగే వేళ.
"చెలిచక్కలన్ని కోరికలతోడ చిత్తము నీకిచ్చు కుండఁగా
పొలసి ముచ్చిమిపొద్దున నెడ పూఁబోడిఁ
బిలిచేవయ్యా" 10-2-106

**ముచ్చుఁగన్న తల్లి మూలకు నొదిగినట్టు:** నానుడి; తన వారి న్యూనత బయటపడుతుందేమో నని దూరంగా ఉండు.
"ముచ్చుఁగన్న తల్లి మూల కొదిగినట్టు
ముచ్చిమినుతులేల మొక్కరో హరికి" 2-494

**ముచ్చో చిచ్చో:** కొండో నుయ్యో వంటి పదం.
"రచ్చ మాని చింతకిందు రాఁపుల కూటమి పొందు
ముచ్చో చిచ్చో మూఢులాల" 1-160

**ముట్టితే మూయగు:** ముట్టినదెల్లా బంగారమగు వంటి నానుడి.(?)
"మోనమున నిందరిలో ముట్టితే మూయాయఁ
యీా నవ్వులలోఁ గంటిమి ఇంటికి రారాదా"
25-378

**ముట్టినదెల్లా ముయి:** ముట్టినదెల్లా బంగారం వంటి ప్రయోగం.
"ముట్టినదెల్లా ముయి పట్టినదెల్లా బంగారు
అట్టుసేయరాదు మేలాఁడి కొక్కనే" 14-80

**ముట్టుపడు:** ప.బం; అ.క్రి. కలతపుట్టు (పద.) సంకటపడు (శ.ర.)
"పట్టియుఁ బట్టఁగరాని పాయములో మర్మము
ముట్టుపడ్డ పతిమీఁది మోహ మిదిగో" 9-126

**ముట్టుపాత:** వి. ముట్టువస్త్రము, ముట్టుబట్ట.
"ముట్టుపాతవలె మురిగిన దేహము
గుట్టునఁ దాఁచితిఁ గొన్నాళ్లు" 4-17 అను.

**ముట్టుపెంచు:** వి. అంటుపడినవారు తాకిన మట్టిపెంకు. ప్రభాకరశాస్త్రిగారు దీనిని మట్టిపెంచు అని భావించినారు. (చూ: తాళ్లపాక అన్నమాచార్యులవారి జీవితచరిత్ర వివేకదీపిక - 6 పుట.)
"మించువంటిది రూపు మేలింతయును ముట్టు
పెంచు వంటిది, దీని ప్రియమేమి బాఁతి" 1-112

**ముడికాఁడు:** (ముడి + కాఁడు) వి. ధూర్తుఁడు. (సాంబ. 9 ప.) సంధానం చేసేవాడు, కూర్పరి.
"ముడికాఁడిద్దరి మీఁద మొకమోటమే తనకు
అడఁచీనా యిద్దరివాడాడకేలే నేను" 26-146

**ముడికారి:** వి. ముడియవిడుపు, దొంగ.
"ముడికారి సట లేలె ముదితా
ముడి నీ సిరసునఁ గొమ్ముడి యిదె కదరా"
9-72

**ముడికారితనము:** (ముడి+కారి+తనము) వి. దొంగతనం, ధూర్తత్వం.
"ముడికారితనముల మునిముచ్చువాఁడమ్మ
బడిబడి నుద్దండపనులు మానుపవో" 22-69

**ముడిగిన మంత్రము:** వి. రహస్యమంత్రము.
"మునికొని వేదముల ముడిగిన మంత్రము
కొననాలికలలోఁ గుదురై నిలిచె" 3-10

**ముడిగొను:** (ముడి + కొను) స.క్రి. ముడుచు. (శ.ర.)
"ఇంకా నో దైవమా యేల వెట్టి దవ్వించేవు
కొంకి తెంచి ముడిగొంటే కుఱుచే కాదా" 3-175

**ముడిచివేసిన పువ్వు:** వి. వాడిన పువ్వు, నిష్ప్రయోజనం.
"ముచ్చటఁ బదారువేలు ముడిచి వేసిన పువ్వు

తెచ్చి నే దాఁచుకొంటి దేవర యెరఁగదా" 14-79

**ముడిదీరు:** ప.బం; అ.క్రి. కోకముడి విడు.

"కడుగుట్టు నేఁజేసితే కాఁగిలించుకొంటి విట్టె

ముడిదీరె నిటమీఁద మొక్కే నిదె" 11-63

**ముడిపువ్వు:** వి. కొప్పులోని పువ్వు. (ముడి = జుట్టుముడి) సిగపువ్వు, ముడిచిన పువ్వు.

"కొమ్మ ముడిపువ్వులు నీ కొప్పులోన నుండఁగా

నే మువ్మ్మాటికి చేతులపై మొక్క వచ్చేవు" 29-334

"ముడువవే శిరసున ముడిపువ్వులూ

కడలేని పవిగొయెకా కంతునమ్ములూ" 21-250

**ముడియ:** (3) వి. మూట.

"చెప్పరాని మాటలు చెవులొగ్గి వినరాదు

విప్పరాని ముడియలు విడువరాదు" 18-60

"కట్టిపెట్ట వశమా గాలిముడియ గాఁగ

వొట్టిన నీ మోహమును నట్టిదే కాదా" 24-169

**ముడియగట్టు:** స.క్రి. మూటగట్టు.

"మొయిలువంటి వయసు ముడియగట్టఁగ రాదు

నయముగ బుద్ధిచెప్ప నా వసమా" 13-31

**ముడియము నారసింహుడు:** వి.కడపజిల్లా జమ్మలమడుగు తాలూకాలో కుందేరునది ఒడ్డున పెద్దముడియము అనే గ్రామం ఉంది. దీనికి పడమటివైపున ప్రాచీనకాలంనాటి దిబ్బ ఒకటి ఉంది. అక్కడ ప్రాచీనమైన దేవాలయాలు ఉన్నాయి. అందులో ఒక దేవాలయంలో వెలసిన నృసింహస్వామి.

"జయమాయె నీకు నాపె సరసములూ

నయగారి ముడియము నారసింహా" 11-139

**ముడియలుగట్టు:** ప.బం; అ.క్రి. మూటలుగట్టు.

"జాలితోడ విరహాన సారెకు నిట్టూర్పులు

గాలిముడియలు గట్టీఁగామిని" 29-356

**ముడివేయు:** స.క్రి. ఒకదానికొకటి కూర్చు.

"గుట్టుతోడ జలనిధిపై గొండలు ముడివేసితి

వెట్టు మఱవఁగ వచ్చునివి రామచంద్ర" 19-165

**ముడుగు:** అ.క్రి. 1. చాపచుట్టుగ చుట్టుకొను 2. తగ్గు, క్షీణించు 3. చేష్టలుడుగు 4. సంకోచించు 5. ముకుళించు 6.చచ్చు, నశించు 7. ముడుతలు పడు.

**ముడుగు:** వి. అవయవసంధి. 5-19

"మ్రొక్కుచును మోకాళ్లముడుగు గడచినమీఁద

నక్కడక్కడ వేంకటాద్రీశు సంపదలు అంతంతఁ గానరాఁగాను" 1-227

**ముడుపు:** వి. దేవునికి మొక్కుకొని డబ్బు మొ॥ వాటిని ఒక పసుపుగుడ్డలో కట్టినది. దీన్నే ముడుపు అంటారు.

"కట్టిన ముడుపగు ఘన కృష్ణభక్తి

ముట్టిన పాపవిమోచనము" 3-564

**ముడుపుకట్టు:** ప.బం; వి. ఉపయోగించక అట్లే ఉంచు దానినిబట్టి వచ్చిన మాట. ముడుపుకట్టిన వస్తువును అనుభవించక అట్లే దాచి ముడితో ఉంచవలెను.ఏ దేవునికో మొక్కుకొని పసుపుగడ్డలో ధనం మొ॥వాటిని ఉంచి దేవాలయంలో ఒకచోట కట్టు.

"పువ్వువంటియాస ముడుపుగఁ గట్టికొంటిఁ గాక

నివ్వటిల్ల బొమ్మముడి నీపైఁ బెట్టితినా"

"కట్టిన ముడుపగు ఘనకృష్ణభక్తి

ముట్టిన పాపవిమోచనము" 3-564

**ముడుపు కొంగున గట్టు:** అ.క్రి. దేవునికి మొక్కుకొని డబ్బును చీరకొంగున కట్టు.

"ముడుపు కొంగున గట్టి మూలమూలల వెదకే

వెడమతినై నే వెర్రుఁడ నైతి" 1-19

**ముడుపుగట్టు:** స.క్రి. దేవునికి మొక్కుకొని డబ్బును చీరకొంగున కట్టు.

**ముడెగట్టు:** ముడియ (మూట) కట్టు. ముడియ 'ముడె' గా మారవచ్చు.

"వడిఁబెట్టి పీరేల పట్టి దూరులు దూరేరె

ముడెఁగట్టి తన నవ్వు ముంగిటనే పెట్టరే" 24-346

**ముత్తరములు:** వి. 1. మూడు వరుసలు 2. మూడువిధాలు 3. మూడు పురుషాంతరాలు.

"ముత్తరపుఁదమకము" 12-42

**ముదల:** వి. చూ: ముదుల.

"అనుమాన మెల్లఁ బోసి అలుక లిన్నియుఁ దేరే

మొనసి కూటమికి నా ముదల గావలెనా"

17-161

**ముదలించు:** స.క్రి. 1. అడుగు 2. మార్కొను. (శ.ర.)

"ఇక్కువతో శ్రీవేంకటేశుఁడు తా నన్నుఁగూడె

మొక్కితిఁ దన నేరుపు ముదలించనేలే" 12-338

**ముదిమదిదప్పు:** (2) ప.బం; అ.క్రి. ముసలితనంవల్ల మతిదప్పు. ముసలితనంలో మనస్సు స్తిమితం తప్పుతుందనడంపై వచ్చిన పలుకుబడి.

"అలరి శ్రీవేంకటేశుఁ డాత్మలో నుండఁగాను

అల ముదిమది తప్పుటది వెఱ్ఱి గాదా" 15-67

**ముదుగు:** దళసరి, ముతకతనం, మోటుమాట, కఠినోక్తి.

"చేవలఁ బత్తి ముదుగుచేని ముదుగూ లేదు

వావిరిఁ బోగత్తేటి వారివారి నేరుపు" 2-90

"పచ్చిదేరే మాటలాడి పల్లె లావువారిఁదెచ్చి

ముచ్చిలి చే చాఁచఁబోతే ముదుగులే కావా"

21-205

**ముదుల:** (3) వి. 'ముదల'కు వ్యావహారికరూపం. 1.అంగీకారంతో ఇచ్చిన డబ్బు 2. ఆజ్ఞ 3. లక్ష్యం, గురి 4.గనిమ చేరికనేల. (సూ.ని.)

"ఆ సతి మరఁగువాఁడవన్నిటా నీవు

మోసపోక నీ వాపె ముదుల దేరాదా" 8-197

**ముదులకించు:** (5) 1.ముదలకించు, ఎత్తిపొడుచు 2.వర్ణించు, ప్రశంసించు 3. ఎదుర్కొను 4. హెచ్చరించు.

"మోసపోక నీమాఁట ముదులకించి

వాసితో తానే యీడకు వచ్చునో యేమో"

16-239

**ముద్దరించు:** స.క్రి. 'ముద్రించు' కు వ్యావహారికరూపం.

"కొద్దిగా మాటాడినాను కోరి నీతోనే కాని

ముద్దరించి పరులతో మోనమే చెలి" 20-144

**ముద్దుగారు:** ప.బం; అ.క్రి. మనోజ్ఞంగా ఉండు.

"వన్నెల నీ కోపమింత వద్దు నీకు నీ యాస

కన్నుల నవ్వుల ముద్దుగారీని బాలుఁడు" 1-57

**ముద్దుగునియు:** ప.బం; స.క్రి. ముద్దులు గుడుచు.

"తల్లిదండ్రి గలవాఁడు తప్పులేమైనాఁ జేసి

తల్లితో ముద్దుగునిసి తప్పించినట్లు" 3-449

**ముద్దుర:** వి. 'ముద్ర'కు వికృతిరూపం.

"వీడక ముద్దురతోనే వున్నవి నే మెరఁగము

జాడతోడ నీకు నీవే చదువుకోవయ్యా" 29-355

**ముద్దులాఁడు:** (ముద్దులు + ఆఁడు) ప.బం. మనోజ్ఞుఁడు.

"మొత్తకురే యమ్మలాల ముద్దులాఁడు వీఁడె

ముత్తెమువలె నున్నాఁడు ముద్దులాఁడు" 6-144

**ముద్దులు గునియు:** ముచ్చటలాడు.

"ముద్దులు గునియువారు ముచ్చటలాడెడివారు

గద్దించి తిట్టెడివారు గలరు నీకు" 5-377

**ముద్రధారి:** వి. శ్రీవైష్ణవులకు విధింపబడ్డ పంచసంస్కారాల్లో ఒకటైన ముద్రలను ధరించినవాడు. చూ: ముద్రలు

"ఒక పనివాఁడనై వూని ముద్రధారినైతి

మొకమోడి యిందుకే గోమున నేలు నన్నును"

2-2

**ముద్రలు:** వి; బహు. శ్రీవైష్ణవులకు విధింపబడ్డ పంచసంస్కారాల్లో ఒకటి. సదాచార్యుని చేతిమీదుగా శిష్యుడు తన భుజములందు ధరించే అగ్నితప్తమైన సుదర్శనచక్ర, పాంచజన్యముల గుర్తులు.

"నిలిపినాఁడీతఁడే కాని నిజముద్రాధారణము

మలసి రామానుజులే మాటలాడే దైవము"

2-372

**ముద్రుంగరము:** (ముద్ర + ఉంగరము) వి. ముద్రగల ఉంగరం.

"పట్టిన ముద్రుంగరపు ప్రధాని కెదురు లేదు

కుట్టిచాతనివారికిఁ గొంకు లేదు" 2-237

**మునికొంగు:** వి. ముందుకొంగు.

"తెరలోనికేగే వేమే దిష్టించి చూచి యాతఁడు
పరఁగ నీ మునిగొంగు వట్టి తియ్యఁగా" 13-409

**మునిమార్గము:** వి. ముందుమార్గము.

"ముదిత నినుఁదలపోసి మునిమార్గమునఁ జెలఁగె
మొదల నివ్వెరపాటు మోసంబుతో" 7-290

**మునిముంగిలి:** (2) ప.బం; వి. ఎట్టయెదుట.

"మునిముంగిటికి వచ్చి ముచ్చటనవ్వులు నవ్వి
తనుఁదానే పాటవాడీ తలుపుదండ" 29-470

**మునిముచ్చువాఁడు:** ప.బం; వి. చూస్తుండగానే మోసగించి దొంగిలించేవాడు, పచ్చెకాడు, పశ్యతోహరుడు. ఇట 'వాడు' అనేది స్వార్థంలో చేరింది.

"ముడికారితనముల మునిముచ్చువాఁడమ్మా
తడమారి ఇందరిలో తాటఁ గట్టమ్మా" 22-69

**మునిరుషులు:** వి; బహు. మునులు, ఋషులు. రెండూ ఒకే అర్థం గలిగిన శబ్దాలు.

"పొదైన మునిరుషులు బహుముఖములే కాని
సోదించి వొకమాట చూపంగలేరు" 3-570

**మునివాఁడు:** వి. ముందఱివాఁడు.

"అనుక శ్రీవేంకటేశ ఆతుమ నీ వుండఁగాను
మోనాన నీకు మొక్కేటి మునివాఁడ నేను"
4-342

**మునుక:** ముందు – 'వెను' వెనుక అయినట్లుగా 'మును' మునుకు అని ఏర్పడి ఉంటుంది.

"మునుక వెనకెంచక ముచ్చట లెట్టాడవచ్చు
ఘనుఁడాతని తలఁపు గనుకొందమే" 27-582

**మునుకొను:** అ.క్రి. ఎదురుబడు, ముందగు, పూనుకొను, జాగరూకుడై ఉండు, ప్రారంభించు, అతిశయించు, ముందుపెట్టుకొను.

"మూరెడు దురుము వంచి మునుకొని మొక్కీ నీకు
తేరకొనఁ జూచాకెను దీవించవయ్యా" 29-359

**మునుపు:** స.క్రి. ముని = మునిపు = ముళిసు = కోపము anger, wrath, passion, rage, enmity ఇత్యాదిగా కిట్టెల్. దాని రూపమే మునిపితే కావచ్చు అని సం.ప.స. (23 సం.) కోపగించు అని అర్థం.

"తనిసితే గోరికలు తప్పక దైలువారు
మునిపితేఁ బంతములు ముప్పిరిగొను"
23-117

**మునుపు వెనుకలు:** వి; బహు. పూర్వాపరాలు.

**మున్నాడు:** ప.బం; అ.క్రి. ముందుకు వచ్చు.

"విడిచిపోవని యాస విజ్ఞానవాసనల
గడచి మున్నాడె నెక్కడి వివేకములు" 1-327

**మున్నిటి వెనకలు:** వి; బహు. పూర్వాపరాలు, ముందు వెనుకలు.

"యిన్నిటా శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
మున్నిటి వెనకల యీ ముచ్చటలే యిఁకను"
11-368

**ముప్పిరి:** వి. మూడురెట్లు. 1-505

"అప్పు దనమీఁద మోచి అది యెన్నాళ్లు వుండె
ముప్పిరి వడ్డి వారక మూలనుండినాఁ బోదు"
1-505

**ముప్పిరిగొను:** ప.బం; అ.క్రి. పెనుగొను, చుట్టుకొను, అతిశయించు, మూడు మెలికలు కలదగు.

"ముప్పిరిగొన్న వయసు ముంచి యాసలు రేచఁగా
చెప్పరాని వలపుల జిమ్మిరేఁగేని" 28-197

**ముమ్మడించు:** (2) అ.క్రి. ముబ్బడించు, ముమ్మడిగొను, మూడురెట్లు కలదగు, ముమ్మడగు.

"ముచ్చట నీ వాడఁగాను ముమ్మడించె నిదే మేలు
ఇచ్చక మాడవమ్మ ప్రాణేశునితోను"
20-482 & 5-237 old

**ముమ్మడినాఁగు:** వి. మూడువంతులు ఎక్కువగా ఇచ్చే ధాన్యరూపమైన వడ్డీ.

"కంటిమి నీ జాడలెల్ల కడు దిష్టమాయెను
నంటువావులు ముమ్మడి నాఁగు కిచ్చేవు"
23-355

**ముమ్మదము :** (మూడు + మదములు)
'ముమ్మఱము'నకు రూపాంతరంగానో, వ్యావహారికంగానో వాడినట్లున్నది. లేక రూప-యౌవన-ఆభిజాత్య మదములు మూడుగానీ, కాయిక - వాచిక - మానసికములగు మూడు మదములు గానీ కావచ్చునని సం.ప.స. (21 సం. 387 పు.)

"వద్ద నున్నారము నేము వాడికవార మెల్లాను
కొద్దిమీరి ముమ్మదము కుంగ దెఁ(దెం)లైనాను"
21-336

"మఱచి ముమ్మదముతో మాఁకువలె
నుండినాను
గుఱిగా గోరు సోకితే కోరికలు రేఁగును" 23-297

**ముయి[1] :** వి. మాట, నింద అని సం.పా. (f.n.)
"చెనకఁగఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
మునిపితే ముయాయ మోహమెందుఁ గలదే"
26-68

"నడచీఁ బరుషలు నానాముఖముల
ముడుపులు చదువరొ ముయిగా నరులు"
(22-96)

ఇట 'ముయి'కి శ్రద్ధ, భక్తి అనే అర్థాలు తోస్తున్నాయి.

**ముయి[2] :** వి. కానుక, పెండ్లినాడు చదివించే కానుక, దేవునికి సమర్పించే మొక్కుబడి.
"నడచీ పరుషలు నానాముఖముల
ముడుపులు చదవరొ ముయిగా నరులు"
28-96

**ముయి :** వి. మూత.

**ముయికిముయి :** ముయి అంటే వివాహాదుల్లో ఇచ్చే కానుక. దానికి బదులివ్వడం ముయికి ముయి. ఇది కన్నడపదం. కూడువ ఉడుగర, వధూవర రిగనంటే రిష్టరు కూడువ, ఒళువళి, ఉడుగర, ప్రతిఫల, పడదుదక్కెప్రతి యాగి కూడువుదు అని కన్నడ నిఘంటువు. రూపాం. ముయ్యికి ముయ్యి.
"నయగారితనముల నవ్వులెల్లా నవ్వేవు,
ముయికి ముయి మల్లించ ముచ్చట గాదా"
14-69

"ముట్టినదెల్లా ముయి పట్టినదెల్లా బంగారు
అట్టు సేయరాదు మేలాఅడి కక్కెనే" 14-80

**ముయికి ముయి వెట్టు :** కానుకకు ప్రతిగా కానుక పెట్టు, మారుకు మారు పెట్టు.
"ముయికి ముయివెట్టేది మున్నిటివారి తగవు
నియతి నీవు మెచ్చిన నేను మెచ్చితి" 24-84

**ముయిముచ్చటలు :** (?)
"ముట్టితేనే ముయి ముచ్చటలూ
అట్టుసేయ నాఅడిదాననా" 13-208

**ముయ్యంచు చంచలము :** వి. ధర్మార్థకామాలనే త్రివర్గాలపై అపేక్ష, మోక్షాపేక్ష కాదనడం.
"అయ్యో నా నేరమికే అట్టే యేమని వగతు
ముయ్యంచుచంచలాన మోసపోతిఁ గాక" 3-39

**ముయ్యంచు మనసు :** వి. ధర్మార్థకామాలనే మూడు అంచులు గల మనస్సు.
"అయ్యో పోయఁ బ్రాయముఁ గాలము
ముయ్యంచుమనసున నే మోహము నైతి"
1-179

**ముయ్యకమూయు :** అ.క్రి. మూయలేక మూయు, బలవంతంగా అనడం.
"ముయ్యక మూసిన రెప్ప మూయుచుఁ
దెరచుఁగాని
నెయ్యమునఁ జూడనేర దేమి సేతమే" 5-68

**ముయ్యెడ :** (మూ + ఎడ) ప.బం; వి. ముయ్యెడ, మూడుదిక్కులు.
"వొయ్యనె చెనకకు వొమ్మదు మాకిది
ముయ్యెడ మాటల ముచ్చటె చాలు" 20-212

**ముయ్యీడువారు :** (మూడు + ఈడు + వారు) వి. యౌవనంలో ఉన్నవారు. (యువకులు, యువతులు)

"ముప్పిరిగొన్న సతులు ముయ్యేడువా రున్నారు
తప్పులు నిన్నుఁ బట్టేటిదానను నే బ్రియమా" 8-220

**మురికిడొక్కు**: వి. మురికితో నిండిన ముసలి శరీరం.
"యెంచి నూరేండ్లమీఁద యెప్పుడో మరణము
ముంచి యిట్టే మోచినదె మురికిడొక్కు" 3-86

**మురువులాఁడి**: (మురువులు + ఆఁడి) సౌందర్యవతి, విలాసవతి, సౌందర్యగర్వం కల స్త్రీ.
"కొత్తలైన మాణికపు కొలువుటోవరి లోన
ముత్తేల చెఱఁగు దూలు మురువులాఁడి" 5-63

**ముఱ్ఱుఁబాలమంకు**: (2) వి. చిన్నతనపు మొండితనం.
"వెత్తివారిఁ దెలుపుట వేవేలు సుకృతము
ముఱ్ఱుఁబాలమంకే కాని ముందు గాన దైవమా"
3-37

**ముఱ్ఱుఁబాలు**: (ముఱ్ఱు + పాలు) వి. బఱ్ఱెగాని, ఆవుగాని ఈనిన రోజున ఇచ్చే పాలు, జున్నుపాలు.
"వెఱ్ఱి మానుప రెవ్వరు వేదురు నాయంత విడువడు(ను?)
ముఱ్ఱుఁబాలలోఁబుట్టిన ముంచిన వెఱ్ఱియ్యా"
3-72

**ములిగించు**: స.క్రి. మూలుగునట్లు చేయు.
"అలిగించు ములిగించు నంతలోనే భ్రమయించు
కొలఁది సంసారపు గుణమిది" 4-223

**ములుక**: వి. 1. మునగ 2. వార్తాకం, ముండ్లవంగ.
"చిగిరించిన వలపు చేగ లెక్కవి(?) యిపుడు
మొగి ముమ్మారు నాటితే ములుక వంగవుఁగా"
7-463

**ములుకు**: ఇది మూలుగు కావచ్చు. మూలుగు, బాధతో ధ్వనించు.

"ముట్టి తన చెనకుల ములుకుచు నుండఁగాను
అట్టి యేల తడవీని అప్పటిఁదాను" 27-92

**ములుగు**: అ.క్రి. దైన్యస్వరూపంతో బాధపడు, బాధతో హీనస్వరంతో శబ్దించు, మూలుగు.
"యెలమి శ్రీవేంకటేశుఁడేపు మీరఁజొచ్చితేను
ములిగి దైత్యసతులు మూలముల చొచ్చిరి"
3-92

"ములిగి భారపు మోపు మోఁచేటివాఁడు
అలసి దింపుకొను నాడాడను" 4 అను 26

**ములుచ**: (2) వి. మూఢుఁడు, అల్పుడు, ధూర్తుడు.
"పులి బందివేఁట వోయి పూరేడు బట్టి తెచ్చి
ములుచ మానవుఁడు ముదమందుటా" 15-71
"యీరీతి శ్రీవేంకటేశ యింతలో నన్నుఁగూడితి
మోరతోపులీఁకఁ జేయ ములుచలమా" 25-237

**ములుచతనము**: వి. మూఢత్వం, ధూర్తత్వం.

**ములువాడి**: విశే. ముల్లువలె తీక్ష్ణమైన.
"ములువాడి కొనగోరు" 23-247, "ములువాడి జాజులు" 23-63, "ములువాడి చెక్కు" 9-61, "ములువాడి విరులు" 23-44

**ముల్లుచూపు**: ప.బం; అ.క్రి. మనసు మొగ్గు.
"ముల్లుచూప తొలుతేల మొక్కి తలవంచనేల
వొల్లనె యప్పటి జాడనుండరాదా" 9-159

**ముల్లుదీసి కొఱ్ఱు మొత్తినట్లు**: నానుడి; క్రి.విశే. తక్కువ బాధను తొలగించుకోవటానికి పోయి మరింత ఎక్కువ బాధను కల్పించుకొన్నట్లు. ముల్లు ఊడబెరికి ఆ గాయంలో ఇనుప కొఱ్ఱు దిగవేసినట్లు అని వాచ్యార్థం.
"కల్ల సుఖములచే కనలి కమ్మర
ముల్లుదీసి కొఱ్ఱు మొత్తినట్టాయ" 1-203

**ముల్లు ముంటనే తీయు**: నానుడి; చెడును చెడుగుతోనే సాధించు.
"ముల్లు ముంటనే తీసి మోసపుచ్చినట్లు"

**ముప్వంకవేదములు**: వి; బహు. మూడువిధాలైన వేదాలు, ఋగ్యజుస్సామవేదాలు.
"ముప్వంకవేదములను ముద్దు మాటలాడ

నేర్చె యెవ్వరూఁ గొంత నేర్పనేఁటికే వీనికి"

2-397

**మువ్వరజాము:** వి. ఒకటిన్నర జాము, మూడున్నరజాము (?)

"అగపడ్డందుకు మేని అడియాలములు గురి
మొగమేది రమ్మనవే మువ్వరజామెక్కెను"

8-64

**ముష్టిమాను:** వి. ముష్టిచెట్టు. (ఇదొక విషపు చెట్టు)

"పుడమిలో ముష్టిమానఁ బొడమిన శాఖలు
బడి ముష్టిపండ్లై పండకుండీనా" 2-389

**ముసగసలాడు:** ప.బం. కోపంతో చిరచిరలాడు, గుసగుసలాడు, క్రిక్కిరియు.

"మోవిపైఁ గెంపులు ముసగసలాడీ
కావిరిమోమునఁ గళదేరీ" 16-440

**ముసగసలు:** (3) ప.బం; వి; బహు. గుసగుసలు, కోపంతో చూపే చిరచిరలు.

"చద్దివేఁడికిఁ గడు చవులు రేఁచీఁ బతికి
ముద్దులమూటల నీ ముసగసలు" 22-490

"వెసఁగాపురము సేయ విచ్చనలి (వి?)డి
ముసగస లేఁటికి ముదితలతోడను" 23-422

**ముసిడికాయ:** వి. ముష్టిచెట్టుకాయ.

"జిగిగల చేఁతి ముసిడికాయ యగు నన్ను
మొగిఁ గల్పకము ఫలముగఁ జేయ వసమా"

1-182

**ముసిడికాయను కల్పకఫలము చేయు:** ప.బం. అయోగ్యమైన వస్తువును మహావస్తువుగా చేయు. ముష్టికాయను కల్పవృక్షం చేయు అని వాచ్యార్థం.

"జిగి గల చేఁతి ముసిఁడికాయ యగునన్ను
మొగిఁ గల్పకఫలముగఁ జేయ వసమా" 1-182

**ముసిడికాయను కల్పకము చేయు:** ప.బం; అ.క్రి. మామూలు వస్తువును అమూల్యమైన గొప్ప వస్తువుగా చేయు.

**ముసిడిమాను:** వి. ముష్టిచెట్టు.

"మిసమిస మెరువఁగ మెల్లన చేరిరి
ముసిడిమానిఫలము చూచి" 4 అను. 4

**ముసిపు:** (3) అధికం.

"పొసఁగ మానుగ నన్నుఁ బుట్టించితేఁ బొగడేనా
ముసిపి సరుఁజేయఁగా మొర యిదేఁగాక"

2-135

"పసిగొని యింద్రియాల బంటై వుండు నొకవేళ
ముసిపితో దైవానకు మొక్కు నొక్కవేళ" 2-97

**ముసిమి:** వి. ప్రేమానుబంధం.

"కసరి సవతులు మొగాలు ముడుచుకొన్నాను
ముసిమి చెప్పి నవ్వించి మొక్కుదు నేను"

12-377

**ముసిమిముచ్చట:** వి. ముద్దుముచ్చట.

"ముగుదలమైన మాకు ముసిమి ముచ్చట లేదా
మొగమెత్తి తనవలె మొక్కులు మొక్కేదా"

20-20

## మూ

**మూఁకగమికాఁడు:** వి. మూకకు అధిపతి, సేనాపతి, మూకకు ముఖ్యుడు. (గమికాఁడు = అధిపతి, సేనాధిపతి)

"మూఁక గమికాఁడ నేను మొక్కెద శ్రీవేంకటేశ
యేఁకటారఁ గడపేవా నెంచుకో మా బొజు"

2-64

**మూఁకొను:** ప.బం; అ.క్రి. మూర్కొను, వాసన చూచు.

"వొప్పుగా నందరి వూర్పు లొక్కటైనందుకు గురి
కప్పురమదే కాక కస్తూరిగా మూఁకొనరా" 2-467

**మూఁట మాటలు:** వి; బహు. పెక్కుమాటలు.

"మూఁటమాట లింతయేల మోవితేనె లూరనూర
మాటలాయఁ దనకు నే నొద్దికైతిఁబదలే" 25-479

**మూఁతిగిరిపు:** స.క్రి. మూతి విరుచు, అసంతృప్తిని ప్రకటించు. 2-156

**మూఁతిమీఁది కత్తికోఁత:** ప.బం; వి. మిక్కిలి బాధాకరం.

"మోఁత నీటిలోని యీఁత మూఁపునఁ బుట్టిన మేఁత
మూఁతిమీఁది కత్తికోఁత మొనగోరి వాఁత"
5-275

**మూఁతులు నాకు :** ప.బం; అ.క్రి. ఎవరిదగ్గరో చేరి పని గడుపుకోవడానికి వా రన్నదానికల్లా తాళంవేస్తూ అవీ ఇవీ చెపుతూ నీచంగా వారి ఇష్టాన్ని సంపాదించుకోవడానికై ప్రవర్తించు, శుష్కప్రియములాడు. (పద.)

"చీరవెలిగా నవ్వేవు సిగ్గు విడిచేవు
మోర నిడుపుచేసుక మూఁతులు నాకేవు" 6-126

**మూఁతులు విరుచుకొను :** ప.బం; అ.క్రి. అసంతృప్తినీ, అనిష్టతనూ కనబఱుచు.

"మొగము తప్పక చూచి మూఁతులు విరుచుకొని
జగడించి ఇట్టే పగ చాటీ నీపె" 13-372

**మూఁపున గట్టిన చద్ది :** ప.బం; వి. కొంగు పసిడి వంటిది. అందుబాటులో నున్న వస్తువు, సులభలభ్యం.

"యేపున నాస విడిచి యేరుపడి వుండేను
మూఁపున గట్టిన చద్దై మోఁపించును" 2-240

**మూఁపులు మూడగు :** ప.బం; అ.క్రి. 1.ఉప్పొంగు 2.భుజములుప్పొంగు.

"యెవ్వరైనా నాపెను నేఁడిటు పేరుకొంటేఁ జాలు
అవ్వల మూఁపులు మూఁడు అవుదువు నీవు"
11-417

**మూటకట్టుగా :** క్రి.విఱ. మూటకట్టినట్లు.

"మూటకట్టుగా వేడుక మొక్కేవాఁడ వీ చేతులు
చాటి యాపె చన్నులపైఁ జాఁచకుండరాదా"
13-504

**మూటగట్టు :** (2) ప.బం; స.క్రి. కూడబెట్టు, ఒకచోట చేర్చు.

"మూసిమంతనాల మేలు మూటగట్టేవా
వాసుల వంతులనే వడ్డీవారీనా" 20-317

**మూఁడామంచులు :** (?)

"ముసుఁగుల సిగ్గుల మూఁడామంచులు
కుసుమై వలపులె కురిసేఁ జెలియా" 15-280

**మూడిఁ జొచ్చివాత వెళ్లివచ్చు :** ప.బం; అ.క్రి. అతి ఉపాయశాలియగు. చూ : మూడిఁ జొచ్చి వాతవెళ్లు.

"ఇంక నేఁడ సుద్దులు యెవ్వరు నేమి చెప్పేరు
వంకలొత్తి మూడిఁజొచ్చి వాతవెళ్లి వత్తునే"
25-34

**మూడిఁజొచ్చి వాత వెళ్లు :** ప.బం; అ.క్రి. అతిఉపాయశాలి యగు. (కొంత నిరసనతో వాడే పదం. ఇలాంటిదే "పొయిలో పెడితే పొంతలో వెళ్లివచ్చు" అనేది.)

"వచ్చివచ్చి మూడిఁజొచ్చి వాతవెళ్ల నేమిటికే
మచ్చిక నీతఁడు నన్ను మన్నించెఁ జూడఁగదె"
29-392

**మూడుగాళ్ల (పెద్ద) ముసలి :** ప.బం; వి. అతివృద్ధుడు, ముసలితనంలో కఱ్ఱ ఊనుకొని నడవడం పై వచ్చిన పలుకుబడి. (పద.)

"మూడుగాళ్ల పెద్దముసలి సవులుగొన్న
పాఁడిమేకల పాలపాశము" 5-378

**మూయికి మూయి :** ప.బం; వి. బదులుకు బదులు అని వ్యు. రూపాం. ముయికి ముయి.

"మూయికి మూ యున్నదింతే మూసి దాఁచితి నీకు
వుడివోని వలపులై వుమ్మగిలీని" 23-299

**మూరట బారట :** మూరలు బారలుగా, దీర్ఘంగా, పొడుగ్గా.

"తోరణము లే దోవెల్లా
మూరట బారట ముంచిన లతల" 1-119

**మూరెడంత కొప్పు :** వి. పొడుగాటి కొప్పు.

"ముంచి మూరెడంత కొప్పు వంచి నీకు
మొక్కెను" 22-205

**మూరెడు నోరు :** వి. పెద్ద నోరు.

"ఆయ నాయ నీ మాటలల్లములు బెల్లములు
మూయ మూయ నీకె మూరెఁడు నోరు" 9-73

**మూలఁబడు :** ప.బం; అ.క్రి. చెడు, నశించు.

"ఎన్నికతో శ్రీవేంకటేశుఁడు గూడఁగ నన్ను

మున్నిటివారి సొంపు మూలఁబడెఁగా" 23-575

**మూలకెక్కు :** ప.బం; అ.క్రి. మూలఁబడు.

"చాలు నే నీ మాఁటలు చాలు మూలకెక్కెరా
వేలఁజూపేవా పదారువేలవాఁడ వౌదురా" 24-217

**మూలదాఁటు :** వి. (?)

"మొదలైన రతులెల్ల మూలదాంట్లు నీకు" 23-73

**మూలనున్న వారిని ముంగిటవేయు :** ప.బం; అ.క్రి. సంబంధం లేనివారికి ఏదో ఒకటి అంటగట్టు.

"మూల నున్నవారి మమ్ము ముంగిట వేసితివి
పోళిమి నాఁడువారు నీ పొరుగవుటే దోసమా" 11-175

"కైలాటాలు నెట్టఁగాఁబో కాఁకల నీ మేను చిక్కె
మూలనున్నవారి నేల ముంగిట వేసెరా" 20-311

**మూలముట్టు :** ప.బం; మొదలు, మూలం.

"వదలక జీవుఁడెవ్వరిని నేమించలేఁడు
పదరక మూలముట్టు భావించుకోఁలేడు" 15-262

**మూసిదాపిరము :** (3) ప.బం; వి. మూసి మరుగు పుచ్చుట, గోపనం, మూసి దాచిన సొమ్ము.

"చేసుకొన్న యట్టివాఁడు చెప్పినట్టు సేసుఁగాక
మూసిదాపిరము లేలె మొరఁగు లేలె" 11-90

**మూసిదాపిరెము :** వి; ప.బం. మూసి మరుగు పుచ్చడం.

"మూసిదాఁపిరెము గాఁగ మోవి యాతఁడడిగితే
రాసికొలువులో నేల రవ్వ సేసేవే" 28-373

**మూసిదాపురము :** వి; ప.బం. మూసి మరుగు పుచ్చడం.

"కప్పు గడు వెడ జారెఁగోపము కన్నుల మీరె
ఇప్పుడు మూసిదాఁపురా లిఁక నేటికే" 21-502

**మూసిన గర్భము :** ప.బం; వి. గర్భంలోని శరీరం.

"ఆస లి వెఱఁగము అలమట లెఱఁగము
మూసిన గర్భమే మును సుఖము" 2-465

**మూసినముత్తెము :** (14) ప.బం; వి. అమాయకురాలు, తెలిసికూడా తెలియనట్లు నటించే వ్యక్తి అనే అర్థాల్లో వాడబడే పదబంధం. అణగిమణగి ఉండటం, ఎక్కువ జాగ్రత్తగా ఉండటం. ముత్యం వెలుగులో ఉంచినపుడే మిలమిలలాడి ముత్య మనిపించుకుంటుంది. మూసిపెట్టినపుడు ముత్యమనే అనిపించక తెల్లగా ముద్దవలె ఉంటుంది. దానిని బట్టి యేర్పడిన పలుకుబడి కావచ్చు. మూసినముత్తెం పాసినపగడం.

"దాసితోఁ బెండ్లాడేవాఁడు వట్టి తరితీపులేల
మూసినముత్తెమైనా మోముచూచుఁ గాక" 12-455

"మూసిన ముత్తెము వలె మొనసి నిన్నుఁ
జూడఁగా
సేసవెట్టిన సతులఁ జెలి యేమి చూపేవు" 28-465

**మూసినముత్యము :** (16) వి. చూ : మూసిన ముత్తెము.

"వేసరించి యేమైనా వెంగెములాడుటకంటె
మూసినముత్యమువంటి మోనమే మేలు" 12-204

**మూసిన మేను :** ప.బం; వి. గర్భస్థశరీరం.

"పుట్టిన చోటంటినా అదిభూతముల నెలవు
నెట్టన మూసినమేను నిఖిలహేయమయము" 4-41

**మూసిమంతనాలు :** (2) ప.బం; వి; బహు. ఈ శబ్దం ఏ నిఘంటువుల్లోనూ కానరాదు. దీనికి గుసగుసలని అర్థం.

"మూసిమంతనాల మేలు మూటగట్టేవా
వాసుల వంతులనే వడ్డివారీనా" 20-317

## మె

**మెంగతనము :** వి. అమాయకత్వం, బేలతనం.

"అంగళ్ల ముంగిళ్ల నల్లారుముద్దు చూపేవు
మెంగతనాలు నీ సొమ్ము మేలుగా నీవు" 14-162

**మెంగది:** (మెంగ + అది) ముద్దరాలు, అమాయకురాలు, బేల.
"ఏల పురుడు మెట్టుక యింత సేసేవు నన్ను
మేలిమివాఁడవు నీవు మెంగదాన నేను" 7-93

**మెంటు:** వి. ప్రసిద్ధ నిఘంటువుల్లో ఈ పదం కానరాదు. శరీరమని అర్థమా?
"అంటుముట్టు అడియాసకే కా
మెంటునఁ జెమటలు మిక్కిలిఁ బొలసె" 20-356

**మెకురు:** వి. మకురు, మంకుతనం.
"మెల్లనె మాటాడరాదా మెకు రేల చేసేరు"

**మెచ్చించు:** స.క్రి. మెప్పించు, సంతోషపెట్టు.
"పంతాలు నెరపఁబోతే పడఁతులు లోఁగేరా
చెంత రతులఁగూడి మెచ్చింతురు గాక" 11-226

**మెచ్చు:** వి. 1. మెప్పు, శ్లాఘ, పొగడ్త 2. సంతోషం 3.బహుమానం.
"వీఁగక శ్రీవేంకటేశ వింతలుగాఁ గూడితివి
రేఁగించేవయ్యా నీవె రేసు లేని మెచ్చులు"
7-452

**మెచ్చులాఁడి:** (4) (మెచ్చులు + ఆఁడి) మెప్పులు పొందిన స్త్రీ, మెచ్చుకోదగ్గ స్త్రీ. (శ.ర.)
"యిచ్చలు శ్రీవేంకటేశు నెదపై నెలకొంటివి
మెచ్చులాఁడివే అలమేలుమంగా" 12-184

**మెచ్చులాఁడు:** (మెచ్చులు + ఆఁడు) ప.బం; వి. మెచ్చుకోదగ్గవాడు.
"ఏల వేగిరపడీనే యింతలోఁదాను
మేలల్లా నొకరూపైన మెచ్చులాఁడు గాఁడా"
27-281

**మెట్టు:** అ.క్రి. అడుగుమోపు.
"మెట్టి పట్టు కాతఁడు మేనవాని పయిమోవ
చుట్టి కాఁగిలించఁగాను సూడు వట్టరాదా"
25-201

**మెట్టుక:** మెట్టుకొని, అడుగుపెట్టి, ప్రవేశించి.
"పట్టెమంచ మెక్కితిని బలువాని చేకొంటిని
మెట్టుక నాతో నింత మెచ్చవలెనా" 9-289

**మెట్టుకొను:** (2) ఒకదాన్ని ఒకటి తాకు.
"మెట్టుకొని కొల్లలాడి మేఁటసేవు వీదులను
పట్టుకొనే రిఁకఁ జూమ్మీ బల్లిదుఁడవైనాను"
20-161
"మెట్టుకొన్నవి రాకాసి మెదడుతోడి తలలు"

**మెట్టె:** (5) వి. 'మట్టె'కు వ్యావహారికరూపం. స్త్రీలు కాలి రెండవవేలికి ధరించే ఆభరణవిశేషం.
"పట్టీఁ జిన్నులట్టే పైపై గోవిందుఁడు
మెట్టెల పాదాల మెట్టే రింతులు" 3-162

**మెడగట్టు:** ప.బం; స.క్రి. అంటగట్టు, బాధ్యత కలిగించు.
"మిక్కిలి సంసారము మెడఁగట్టితివి" 3-20

**మెడగట్టుకొను:** స.క్రి; ప.బం. బాధ్యత నెత్తిన వేసుకొను.

**మెడచుట్టు:** ప.బం; స.క్రి. తప్పించుకోవడానికి శక్యం కాకుండా అలముకొను, తగులుకొను.
"మేరతో పంచేంద్రియములు మెడచుట్టకపోవు
యే రీతుల సంసారముగ"

**మెడవట్టి నూకు:** ప.బం; స.క్రి. అనాదరంతో తోసివేయు.
"ఉడుగనియ్యని మోహముబ్బి పరమార్థముల
మెడవట్టి నూకె నేమిటికింక నెరుక" 1-327

**మెడిది:** వి. పుల్లమజ్జిగ (శ.ర.) పులకడుగు (సూ.ని.) ఇది 'మెడుద' కావచ్చు.
"వలపు రేఁచకుమీ వద్దు వద్దు అంతేసి
మెలఁగి కలి ముదిరి మెడిదయ్యాని" 13-461
"తిరమై పాసి కలిముదిరి మెడిదె యైతే
ధరలో పండ్లు పులిసి తమి రేఁగునపుడు"
20-428

**మెణకు:** వి. చాతుర్యం, నేర్పు.
"మేర మీర రాని నీతో మెణకేల నిన్ను
గారవించఁగా యాడో కత లేల" 11-60

**మెత్తులు వేయు:** ప.బం; అ.క్రి. పూయు.
"పొందుల నదెవ్వరికి పొరసి నీ వియ్యకుండా
కందువ మెత్తులు వేయుగతి సుమ్మీ విభుఁడా"
9-135

**మెనకు**: వి. ఎనచు, మెత్తజేయు ఇత్యాదిగా సూ.ని. దాని ఛాయార్థమే నలచుట, బాధించుట ఇత్యాదిగా ప్రకరణాన్ని బట్టి ఊహించవచ్చు. 'మనసు నొప్పించెడి వాదులాట' కావచ్చు. ఇంకా విచారింపవలసి యున్నది అని సం.ప.స. (22 సం. 391 పు.) లో చెప్పబడింది.

"మనసురాని చోటికి మంతనాలుఁ గొన్నా
మెనకుల వాదులైన మేలుగాక" 22-101

**మెనుకు**: చూ: మెనకు.

"మెనుకు లే కింతులచే మెప్పించుకొంటివి గాన
నినుపుల జాణఁడవు నీదివో జన్మము" 27-349

**మెయి**: వి. శరీరం.

"చింతతో మెయి చెమరించె చెక్కులెల్లాఁ బులకించె
యెంత లేదు తన గర్వమింకా రాఁడా" 20-203

**మెయిలచ్చన**: వి. శరీరలక్షణం, శరీరంలోని గుర్తు.

"మెచ్చితే శ్రీవేంకటేశ మెయిలచ్చన చూపె నాపె
యెచ్చి లోలోనే కూడితి రిద్దరూను జాణలే"
7-109

**మెర(అ)మెచ్చులు**: (మెచ్చులు + మెచ్చులు) ప.బం; వి; బహు. మిక్కిలి మెప్పులు, ముఖప్రీతి కొరకైనవి.

"మెచ్చి నన్నుఁగూడితివి మేలపు శ్రీవేంకటేశ
యిచ్చలు మెరమెచ్చులే యిందాఁకాఁగాదా"
24-71

**మెర(అ)వడికత్తె**: (2) (మెరవడి + కత్తె) ధైర్యం కల స్త్రీ, ఉద్రేకం కల స్త్రీ, నేర్పు గల స్త్రీ, గౌరవం కల స్త్రీ.

"మెరవడికత్తెలైన మెలుఁతలే నీకు బాఁతి
కరకరిఁబెట్టేది కాంతలే బాఁతి" 21-108

**మెరమెర**: వి. బాధ, భేదం, సంశయం, సంభావన, మాలిన్యం, క్రౌర్యం.

"మేలుమీఁదా మేలేకాక మెరమెర లీక నేలే
యేలినవాని తోడి దిది యేఁటిదే" 16-244

**మెరవణి**: వి. మెరవణి = ఊరేగింపు. మెరవణివి అని వ్యక్తి పరంగా నిర్దేశించడం వింత. మెరవణి శబ్దచ్ఛాయార్థమే 'అందరెరిగినవాఁడు' అని కావచ్చు. (సం.ప.స.)

"మాటలనే చొక్కించి మరగించుకోఁగలవు
మేటితనముల మంచి మెరవణివి" 22-405

**మెరుచు**: (2) అ.క్రి. తళుక్కున ప్రకాశించు.

"మించుల చూపుల మెఱుఁగు లిట్టె మెరిచి
అంచెఁగొరికల జల్లవె పట్టెను" 19-281

**మెఱమెచ్చు**: ప.బం; వి. చూ: మెరమెచ్చు.

"తఱి నా చూపు నీ గుండె తమిఁగరఁగించుఁ జూమ్మీ
మెఱమెచ్చులకు మితిమీరక వున్నదానను"
12-11

**మెఱుచు**: అ.క్రి. 'మెఱయు'కు వ్యావహారికరూపం. చూ: మెరుచు.

"మెఱిచిన నుఱుమక మిన్నైన నుండదట
గుఱి నీ చేఁతలు చూచి కోపము రాదా" 24-84

**మెలుఁత**: (46) వి. 'మెలఁత'కు వ్యావహారికరూపం. స్త్రీ.

"మెలుఁత కన్నులు గండుమీలైన ఫలము
తొలఁకు రెప్పల నీరు దొరకె నేఁడు" 5-260

"పూఁతగాఁదెచ్చి చెలియ పులకల వెల్లినించె
మేఁతలాడి రమణుఁడీ మెలుతమైఁ జూడరే"
5-108

**మెలుతుక**: (మెలుత + ఉక) 'మెలతుక'కు వ్యావహారిక రూపం.

"మించిన తొడల మెఱుంగుల మెలుతుక గట్టిన పుట్టము
చించుక వెడలిన నిగ్గుల సిగ్గులు దొలఁకగను"
5-292

**మెలుపుఁగూరిమి**: వి. ఉల్లాసంతో కూడిన ప్రీతి.

"పలచని యెలుఁగునఁబాడీ నీ మీఁది పాట
మెలుపుఁగూరిమి నలమేలుమంగ" 19-355

**మెలుపు**: (5) వి. ఉల్లాసం, మెత్తఁబాటు, భ్రమణం, జాగరూకత, చలింపని. రూపాం. మెలపు.

"సుళువుఁజూపు చూచి సన్నసేసె నీ కాపె
మెలుపు లెట్టివయ్య మీలోనను" 25-271

**మెలుపుమచ్చెములు:** చాతుర్యపు గుర్తులు.
"మెలుపు మచ్చెములు నీ మేన నిండి వుండఁగ
తలమోచి యెన్నెన్ని తప్పులువట్టేను" 23-409

**మెలుపురాలు:** వి; బహు. మార్దవం కల రాళ్లు.
"బలిమికాఁడవు నీవు పాయపుదాన నేను
మెలుపురాలవంటివి మేఁటి చన్నులు" 26-509

**మెసఁగు:** అ.క్రి. మెసవు, తిను.
"గుర్లకొలంది కోరి మెసఁగుచు
దిడ్లకంతల దిరుగాడీని" 23-331

## మే

**మేఁకపిల్ల:** వి. ఇందులోని అరసున్న విచార్యం.
"సరుస మేఁకపిల్లఁ జంకఁ బెట్టుక నుంత
నరయు గొల్లని రీతి నజ్ఞానినైతి" 1-19

**మేఁడివారు:** వి; బహు. (?)
"వంచి పుణ్యముల మేఁడివారము మీ కిచ్చితిమి
మించి నీ కామాదులనే మేర గాండ్లేలయ్య"
15-111

**మేఁడివారు:** వి. మేఁటివారు (?)
"వంచి పుణ్యముల మేఁడివారము మీ కిచ్చితిమి
మించిన కామాదులనే మేరగాం డ్లేలయ్య"
15-111

**మేఁతలాడు:** ప.బం; అ.క్రి. (?)
"పూఁతగాఁదెచ్చి చెలియ పులకల వెల్లి నించె
మేఁతలాడి రమణుఁడీ మెలుత మైఁ జూడరే"
5-108

**మేంట్లు:** వి; బహు. మేటి శబ్దానికి
బహువచనరూపం, శ్రేష్ఠులు, ఉత్తములు.
"అలయించి కూడేది గయ్యాళిమేంట్లకుఁగాక
వలచిన గుట్టుతోడ వనిత కేలే" 26-228

**మే:** అవ్య. మెల్లగా.
"గక్కునఁ బొలయుటలు కాఁకలు సేయుట
గాదా
అక్కరఁ గొనెట (గొనుట) మే గుట్టరయఁగాదా"
26-107

**మేకతాకు:** వి. క్షణికం, అజాయుద్ధం క్షణికమని
వినికి.
"మేడమీఁది పరసాలు మేకతాఁకులు
జాడ లెరుఁగుదు దూరఁ జవిగాదె చెలియా"
14-584

**మేకు:** (19) వి. పెద్దతికం, మాయ (వ్యు.),
గొప్పవినోదం, పరిహాసం, స్పర్ధ, పోటీ అనే
అర్థాన్ని భావిస్తున్నట్లుగా వేటూరి
ఆనందమూర్తిగారి ఊహ.
(1.సం.వా.పద.భాషా. 467 పు.)
"మెచ్చి మెచ్చి నాతో నింతేసి మేకు లేలా
యిచ్చకమునేసి సేసి నన్ను రేఁలఁ జూచేవు"
10-2-14

**మేకు:** ఈ పదానికి కన్నడంలో పెద్దతికము అనే
అర్థం పేర్కొబడింది. Superiority, revelry
(కిట్టెల్) ఇట ఈ అర్థం సరిపోదు. కింది
వాక్యంలో మాయ అన్న అర్థమే
సరిపడుతుంది. (సం.ప.స. 13 సం. 103
కీర్తన)
"ఏలవయ్య యింతుల నెందరినైనా
మేలిమివాఁడవు నీకు మేకులు బాఁతే" 13-18

**మేకుఁగొప్పు:** పెద్దకొప్పు.
"మేకుఁగొప్పు దువ్వితేను మే గోరంటితే తప్పు
వూకించి లోలోన వొరటైన చోటికి" 21-466

**మేకుచూపు:** మాయ చూపు, పోటీపడు.
"మేరతోడి పొందులకు మేకు చూపవద్దు గాని
బీరపు సమరతులఁ బెనఁగఁగవచ్చును" 7-394

**మేకులవాడు:** (2) వి; సం.ప.స.లో మేకు =
పెద్దతికము. కనుక దీనికి పెద్దతికం కలవాడని
అర్థం.
"మేకులవాఁడవని మెత్తురు శ్రీవేంకటేశ
జోకలతో నీడు వచ్చె సొరిది నీ కతలు" 18-380

**మేకులాడి:** వి. మాయలాడి, పెద్దతికం కల స్త్రీ.
"యీకడ శ్రీవేంకటేశుఁడెనసె నన్నును నిన్ను

మేకులాడివి నవ్వేవు మేలే నీవు" 29-81

**మేకులుచేయు:** (19) పరిహాసం చేయు, మాయలు చేయు, మోసం చేయు.

"మెచ్చినట్టివాఁడవు మేకులిఁక జేయకుమీ

అచ్చలాన యిక్కువలే అంటుదుగాని" 7-511

**మేకుసేయు:** (9) మాయచేయు, పరిహాసం చేయు.

"మెచ్చు మెచ్చు నన్నింతలో మేకుసేసి కూడితివి

అచ్చుమోపేవాపె నిను నెచ్చరించదా" 14-70

**మేఘపుష్పము:** వి. 1. ఉదకం (2. తూర)

"మేకొని నీవే నిండుమేఘవర్ణుఁడవు గాన

నీకు మేఘపుష్పాలే పన్నీరుకాపు"

17-497 & 2-280

**మేటానమేటీలు:** వి; ప.బం; బహు. మిక్కిలి మేటియైన వారు.

"చెంగట మేటానమేటీలు సేవ లెల్లాఁ జేయఁగాను

సంగతెఱఁగక యేమి చవులు రేచేవే" 28-206

**మేటానమేట్లు:** (మేట్లు + మేట్లు) వి; ప.బం; బహు. ఎక్కువ కాంతులు, మిక్కిలి మేటైనవారు.

"మాటు లేని మాటుదెచ్చి మరఁగువెట్టుక వట్టి

మేటానమేట్లవలె మెరసేము" 1-73

**మేట్లు:** కాంతులు. (వ్యు.)

"మెలఁగి పరశురాము మేట్లేసిన బాణము

తళతళ మెరసీని తలరో యసురలు" 4-283

**మేట్లేయు:** (మెట్లు + ఏయు) మేటితనములను దెబ్బదీయు. (మేటికి మేట్లు బహువచనరూపం.)

"మెలఁగి పరశురాము మేట్లేసిన బాణము

తళతళ మెరసీని తలరో యసురలు" 4-283

**మేడదేవళ్లు:** వి; బహు. పెద్దపెద్ద గోపురాలు, భవనాలు కలిగిన దేవతలు (?)

"హత్తి తన్నొల్లకపోఁగా నందరి మేడదేవళ్ల

యెత్తి పాదాలందుఁ జూపె నితఁడే విట్ఠలుఁడు"

2-217

**మేడము:** వి. కూడికె, అనుగుణము. (ఆం.ప.ని.) 8-28

**మేడామాడుగు:** వి. మేడ అనే అర్థంలో జంటపదం.

"కూడె ని న్నలమేల్మంగ కొసరేకొరకా మేడా

మాడుగు శ్రీవేంకటేశ మన్నించవయ్యా"

24-501

**మేడిపంటి బోనము:** వి; ప.బం. మేడిపండు చూడడానికి అందంగా ఉన్నా అందులో అనుభవించడానికి ఏమీ ఉండదు కదా! దానిపై వచ్చిన పలుకుబడి. పైకి బాగా కనబడుతూ తినడానికి ఉపయోగపడనిది, నిస్సారము, హేయము.

"మెరసి చెప్పఁగఁబోతే మేడిపంటి బోనమౌను

యెరవేల సతమౌను యేతు లింతే కాక"

17-253

మేడికాయబోనమని కూడా వ్యవహారం. (వి.ప్ర. 2-80)

**మేడిపండు వంటిది:** వి. పైకి బాగుగా కనిపించినా లోపల గుణం లేనిది.

"మేడిపండు వంటిది మెరసే నీ మోహము"

16-254

**మేడిసేయు:** (మేడి + చేయు) (?)

"మేడి సేసేవటే మేడిపండె నీ గుణాలు

వోడ వేమిటాను నీ వా వోడతో దూలముర్రా"

24-217

**మేడెము:** విణ. మేలు, శ్రేష్ఠమైన వి. 1.యుద్ధం 2.కలహం, తగవు 3. గుంపు, సంఘం.

"ఆడనుండి వేరొక్కతె పాడి దిద్దవచ్చితేను

మేడెపుఁగాఁగిట వించి మెచ్చుమెచ్చేవు"

21-162

"మేడెపు గొల్లెతలకు మేఁటి మగఁడతఁడు"

26-577

"మేడెపు దంపతులకు మేర దప్పితే నే మాయ"

20-241

"మేడెపు మేనవాఁని మెడఁ గాఁగిలించుకోఁగా

యాడ నివ్వెరగు లందే విది యేమే నీవు"

22-496

"మేడెపు బ్రహ్మాదులెల్ల మింటనున్నారు" 22-31
"మేడెపు సంసారమున మించినవాఁడు" 15-39
"యీడనుండి సుర లిందరిఁగాచెను
మేడెపు మన లక్ష్మీవిభుఁడు" 4-364
"మేడెపుఁగళలచేత మించేవుగాక" 8-140
గుంపు:
"యెప్పుడూఁ గలవే నీ యింటివాఁడను
కప్పురపు వీడేలు గబ్బిచూపు మేడేలు" 16-246

**మేదకపుకొయ్య:** వి. స్థిరమైన కదలని మెదలని వెట్టిబాగులవాడు.
"వాదు నీతోఁ బెట్టుకొంటే వాడవారిపైఁ బెట్టేవు
మేదకపుకొయ్యఁ వవుదు మేలురా నీవు"
11-187

**మేదకము:** విణ. స్థిరమైనది, కదలనిది మెదలనిది.
"సాదుసేయ వసమా చంచలపుఁగనుచూపు
మేదకాన మేలనుచు మెచ్చుటగాక" 24-181
"వాదు నీతోఁ బెట్టుకొంటె వాడవారిపైఁ బెట్టేవు
మేదకపు కొయ్యవవుదు మేలురా నీవు"
11-187

**మేదరింటిలంజ:** వి. నీచురాలైన కులట.
"మేదరింటి లంజవోయి మేదినీశుఁ దగులఁగ
గోదిలి కువిటులెల్లఁ గుల్లినయట్లు" 4 అను. 31.

**మేదించు:** స.క్రి. 1. మర్దించు, నూరు 2. నేర్పు, అభ్యసింపజేయు, మప్పు.
"మేదించి వలపు లిరుమేలాఁ బూసేవు" 19-12
"మేకొని కస్తూరైనా మేదించక యెనయదు
ఆకడ నీవు కోరి అటువంటివాఁడవు" 7-8

**మేనపడుచు:** వి; ప.బం. మేనకోడలు.
"నయానఁ బందెమువేసి నడుమ మేనపడుచు
ప్రియపడి నిన్ను నిట్టె పెండ్లాడెను" 7-177

**మేనవాఁడు:** వి. తోడబుట్టినవారి దేహసంబంధం కలవాడు, మేనమామ.
"మేనవాఁడవటు గాన మెడగట్టుకొనిపించె
తానె అలమేలుమంగ తమకమేలా" 7-202

**మేనవారి పడుచు:** వి. మేనగోడలు.
"సోయగమై తన మోము చూచినట్టె మోహించి
పాయకుండ మేనవారి పడుచనా నేను"
10-2-89

**మేనవావి:** వి. తోడబుట్టినవారి దేహసంబంధం.
3-258

**మేనిపచ్చి:** వి. శరీరసౌందర్యం.
"యెవ్వతో కాఁగిట నీ యీ మేనిపచ్చి చూచి
యివ్వల నీ కాఁగిలి నీ కెక్కా నిపుడు" 15-77

**మేమఱచు:** అ.క్రి. మైమఱచు, పరవశమగు.
"ఒకమారు తనుఁజూచి వూరికే తలవూఁచు
నొకమారు హర్షమున నొంది యేమఱచు" 5-70

**మేరకు మేర:** సరికిసరి.
"యీరీతి శ్రీవేంకటేశుఁ డిప్పుడిట్టు నిన్నుఁగూడె
కోరి యేలినవారితో మేరకు మేరే గాక" 27-526

**మేరగాఁడు:** (మేర + కాఁడు) వి; ప.బం. ధనరూపంగా కానీ, ధాన్యరూపంగా కానీ ఆయా స్వాస్థ్యాలను చెల్లించేవాడు. (తె.వ్యు.కో.)
"వంచి పుణ్యముల మేఁడివారము మీ కిచ్చితిమి
మించిన కామాదులనే మేరగాండ్లేలయ్యా"
15-111

**మేలము:** వి. పరిహాసం.
"చెలులెల్లాఁజూచి సంతోసించి మెచ్చి పొగడేరు
కలిగె మీకు మేలము కలకాలము" 7-370

**మేలములాడు:** అ.క్రి. పరిహాసములాడు.
"మేలములు నీవాడఁగా మేలుదాననైతి నీకు
యేలుకోవయ్యా చన వియ్యవయ్యా నాకును"
29-347

**మేలుకట్టు:** వి. స్వామివారిని ఊరేగించే వాహనానికి పైభాగంలో చేసే అలంకరణ. (చాందినీ, ఉల్లెడ)
"మెరసి పెండ్లికి వలె మేలుకట్లు గట్టించి
పిఁతిగొన ముత్యాలపేఁట పట్టు వెట్టెను" 12-406

**మేలుగాలము:** మంచికాలము, శరత్కాలము.

"రతుల శ్రీవేంకటేశు రమణి నీవుండితే
మితిలేని జవ్వనపు మేలుగాలము" 17-522

**మేలు - తీలు:** శుభం - అశుభం, మేలు - కీడు.

"మేలు లేదు తీలు లేదు మించీ నది
హరిమాయ
కాలమందే హరిఁగంటి కైవల్యమొకటే" 2-73

**మేలుది:** (మేలు + అది) వి. 1. వలపుకత్తె
2. శ్రేష్ఠురాలు (3.జారిణి) 4. శుభకరురాలు.

"మేలుదాన నని ఇట్టే మెచ్చేవు లాలించి
సోలి నా గుణాలు చెప్పి చూప నే మున్నది"
12-212

**మేలు మీఁద:** పైభాగంలో.

"మేలు మీఁద నవ్వితేను మేనఁబులకలు నిండు"
29-405

**మేలువాఁడు:** (మేలు + వాఁడు) వి. వలపుకాఁడు, శ్రేష్ఠుడు, ఇష్టుడు, శుభకరుడు. జారుడు చూ: మేలుది.

"మేలువాఁడై నన్ను నేలె మించి శ్రీవేంకటేశుఁడు"
29-220

"ఎఱఁగ మిన్నాళ్లదాఁకా నిటువంటి మీ
పొందులు
మెఱసి యెప్పుడూ నాకు మేలువాఁడవు నీవు"
28-506

**మేలుసుద్ది:** వి. శుభవార్తకు అన్నమయ్య కల్పించిన అచ్చతెలుగుపదం.

"మేలుసుద్ది చెప్పితేను మెచ్చవద్దా యిఁకనైనా
కాలు దొక్కుదువు పాన్పుకడకు రావయ్యా"
23-13

**మేలొకటి తీలొకటి:** ఒకటి మేలు, ఒకటి కీడు.

"చుట్టి వరిగురుమతో జొన్నగింజ సరిదూఁగు
తెట్టలై మేలొకటి తీలొకటి కాయ" 3-14

**మేసవారు:** (మేసు+వారు) వి; బహు. పెంకితనం కలవారు.

"మేసవారి పిన్నదాని మేకుసేసి యింటిలోన
దోసుకొంటి వెఱఁగవా దుండగీఁడు"

**మేసు:** (7) వి. పెంకితనం శ్రీ.ని. వ్యు. మేయు ధాత్వర్థమే అనుభవించు అనే ఛాయార్థంగా మారినట్లున్నదని మేసులు అనే దానికి అనుభవములని అర్థమూహింప బడినది. (సం.ప.స. 22-62)

"మేసులఁ బరవశముమీఁద మీఁద నబ్బె నదె
బాసల శ్రీవేంకటేశుఁ బైకొనితే నంటిగా" 22-62

"దొమ్ముల మేసువారికి దొడ్డవారి కేటి మాట
ముమ్మాటికి విను చన్నుమొనలు దాఁకీని"
8-194

## మై

**మై:** వి. శరీరం.

"తరుణి మై చెమరించె" 23-585

"సరసనే శశివర్ణ మైనందు
పురిగొన నించి రదె పుళుగుకాపు" 19-569

**మైకాఁక:** (2) వి. శరీరతాపం.

"ఆలి నా మైకాఁక నాకె మేనికాఁకలను
కాలపువరుసఁ జలిగాయిమనవమ్మా" 7-309

**మైనము సూలమగు:** ప.బం; అ.క్రి. మైనము శూలమగు, మృదువైనది బలవంతమగు.

"దాని కేమే మాటలేల దగ్గరి రావే వోసి
మైనము సూలమౌనటే మాపుదాఁకాను" 7-191

**మైనము సూలము సేయు:** ప.బం; అ.క్రి. శక్తిహీనమైన దాన్ని శక్తిమంతం చేయు, అసాధ్యానికి పూనుకొను.

"దీనికే శ్రీవేంకటేశ తెలివఁగూడితివిట్టె
మైనము సూలము సేసే మగవాఁడూ గలఁడా"
7-54

**మైమరువు:** వి; ప.బం; కవచం.

"అతివకు భూషణజాలంబంతయు
మగునస్త్రములకు
జతనంబగు మైమరువై సరిఁ జెలువొందెడిని"
5-122

**మైలసంత:** వి. మత్స్యమాంసాదులు విక్రయించే బజారు.

"మచ్చిక కర్మమనేటి మైలసంతలోన

వెచ్చపు కర్మధనము విలువచేసి
పచ్చడాలుగాఁ గుట్టి బలువేంకటపతి
ఇచ్చకొలఁదుల నమ్మె ఇంటిబేహారి" 1-275

## మొ

**మొకదాకిరి :** (10) వి. ఈ పదం ప్రసిద్ధ నిఘంటువుల్లో కానరాదు. 'మోమోటం' కావచ్చు. ముఖదాక్షిణ్యం.
"రాక దరచైతే మొకదాకిరి గలుగుగాక" 25-51
"నెమ్మి మొకదాకిరితో ని స్నేహీ ననకుండితే
సమ్మతించె నంటా నెంత సంతోసించుకొనేవు"
18-172

**మొకదాకిరిది :** (3) (మొకదాకిరి + అది) మోమోటం కలది.
"మొదలనే నేనైతే మొకదాకిరిదానవు
యెదురాడఁజాల నీక నే మందునే" 27-566

**మొకబంగము :** వి. ముఖంవిరుపు, కోపం. దీని కీయబడిన ఉదాహరణంలో పెంకితనమనే అర్థం కూడా యుక్తంగా కనిపిస్తుంది.
"పక్కన మీలోన మొకబంగాలు వాసినదాఁకా
వెక్కసపు నీ సణఁగు వినవలెఁగా" 11-483

**మొకమజ్జనము :** (3) వి. 'ముఖమార్జనం' అనే శబ్దానికి వికృతిరూపం. ముఖం కడుగుకోవటం.
"ముందు యెడకె వచ్చె మొకమజ్జనానకు
కందువగా నాపె వచ్చి గడె వెట్టెనే" 7-462

**మొకమజ్జనము :** వి. ముఖమార్జనము; ముఖము కడుగుకొనుటకైన నీరు.
"కనుదెరవు నా తండ్రి కమలాప్తుఁ డుదయించె
వనిత మొకమజ్జనము వడిఁదెచ్చెను" 3-543

**మొకమాయకాఁడు :** (2) ప్రత్యక్షంగా మోసం చేసేవాడు.
"చెలియ నీ యెడ కింత చిత్తిణి గుణముదాయ
మలసి నీ వెంత మొకమాయకాఁడవో" 16-411
"ముచ్చట నీ విటువంటి మొకమాయకాఁడ వౌత
యిచ్చలోన నేము తొల్లె యెరఁగమైతిమిరా"
11-18

**మొకమిచ్చుమాటలు :** వి; బహు. ముఖప్రీతివచనాలు.
"మొకమిచ్చుమాటలే మునుకొని ఆడియాడి
వెకలివైతివి గదే వెలదీ" 25-571

**మొకమిచ్చులాడు :** వ.బం; అ.క్రి; మాం. ముఖస్తుతులు చేయు, ముఖప్రీతికై మాటలాడు.
"ఒక్కటొకటికి నీవు వొరసిటిదానవు
మొకమిచ్చులాడ నేలె మొదలె యాతనిని" 11-5

**మొకము :** (3) వి. 'ముఖము'నకు వికృతిపదం.
"ముచ్చట నెవ్వతెనైనా మొకము దగ్గరఁ బోయ
యిచ్చకములాడేవు యేరా నీవు" 10-2-60
"సకులెల్లాఁ జూడఁగాను చవుల మో వెడిగితే
మొకము వంచి కన్నుల మొక్కుమొక్కిని"
19-270

**మొకమొకములుచూచు :** (9) ముఖం ముఖం చూచు, పరస్పరం ఒకరినొకరు చూచుకొను.
"ఒకరొకరి మనసు లొక్కటాయను
మొకమొకములు చూచి ముచ్చటాడినట్లు"
24-82

**మొకమొకమెదుట :** ముఖం ముఖం ఎదుట, ఎదుటెదుట.
"ఇక నేలయ్యా మా యెడమాటలు
మొకమొక మెదుటనె ముయికి ముయాయ"
9-24

**మొకమొకాలు చూచుకొను :** చూ :
మొకమొకములు చూచు. 29-182

**మొకమోట :** (4) వి. మొగమోట, దాక్షిణ్యం, ఇతరుల మనస్సుకు అనుకూలంగా వర్తించడం, సంకోచం.
"పచ్చిగాదు వెచ్చిగాదు పాయపు నీ సేతలు
ఇచ్చట నీ మొకమోట నేమందురా" 21-505

**మొకమోడించు :** మొగమాటపెట్టు.
"గద్దరి శ్రీవేంకటేశ గబ్బినైన నన్నుఁజూడు
ముద్దుమోము యిచ్చి కూడి
మొకమోడించితివి" 11-338

**మొకమోడు :** (4) అ.క్రి. మొగమాటపడు, సంకోచించు. (దాక్షిణ్యం వల్ల)
"నాకు మొకమోడి యాకె ననుపేల దాఁచేవు
జోకతోడ మాటలాడి సోదించరాదా" 12-373

**మొకరి :** (5) వి. జలసూకరం, అసంబద్ధ వచనాలాడేవాడు, పొసగని మాటలాడేవాడు, మోగేది, అగ్రేసరం, శంఖం ఊదేవాడు. వి. మొకరి. ఊదేవాడు, దిట్ట, చతురుఁడు (వే.ఆ.) మొసలి.
"ప్రకటించి యేలికవై బహుసంపదలై
మొకరిబంధువుఁడై ముందర నున్నాఁడు"
15-101
"మొకరివై భూమెల్ల మోచియుండిన నీవు
అకట నా పరభారా లాఁప ననేవా" 15-1
"మొకరివైయుండి నన్ను మోహించఁజేసితివి"
3-393
"ప్రకటించి బహువేదపఠనఁ జిక్కని నీవు
మొకరివై తిరుమంత్రమునకుఁ జిక్కితివి" 3-56

**మొకసిరి :** వి. ముఖశోభ.
"సకలపతికి సరసపుఁగొమ్మా నీ
మొకసిరి మెరసె చిమ్ముల మురిపెములా" 6-47

**మొకెము :** వి. ముఖ్య శబ్దభవం కావచ్చు.
"వొక శ్రీవేంకటపతి నమ్మియుండలేము
మొకెమో మా బ్రదుకిందుఁ బోలదాయఁగా"
1-388

**మొక్కపోవు :** ప.బం; అ.క్రి. కుంఠితమగు, భంగపడు, నశించు, హాని చెందు.
"తెగి మురాసుర జాడ తెలియఁడా నరకుఁడు
మొగిసి పోటుకుఁబోయి మొక్కపోయను"
2-308

**మొక్కలము :** వి. మోటుతనం, ఉత్సాహవచనం, మూర్ఖత, ధైర్యం, శౌర్యం, ఔద్ధత్యం, అతిశయం. విణ. అప్రతిహతం, ఉద్ధతుడు.
"మొక్కలపు టల్క గొంత మొకదాకిరి గొంత
నిక్కముగా నీకుఁజూపి నివ్వెర గందినది"
7-377

**మొక్కలికాఁడు :** (2) (మొక్కలము + ఇ + కాఁడు) ఉద్ధతుడు, పొగరుబోతు, మూర్ఖుడు, శూరుడు. తద్ధతంపై తద్ధిత ప్రత్యయం.
"తప్పక యేల చూచేవు తపన లేల పెట్టేవు
ముప్పిరిఁ గళలు రేచే మొక్కలికాఁడా" 26-420

**మొక్కలీఁడు :** (2) (మొక్కలి + ఈఁడు) శూరుడు, ధీరుడు, మూర్ఖుడు, ఉద్ధతుడు.
"ఇందు కిట్టె తమయక్క యెరిఁగితే నేమి యను
ముంద రెరఁగడు తాను మొక్కలీఁడు చూడరే"
26-348

**మొక్కళపుఁదనము :** (మొక్కళము + తనము) వి. మొక్కలముపై స్వార్థంలో 'తన' ప్రత్యయం. చూ: మొక్కలము.
"పిక్కటిల్లుఁ జన్నులిట్టె పిసికినంతటిలోనె
మొక్కళపుఁదన మేల మోహించినచోటను"
24-600

**మొక్కళము :** మొక్కలమునకు రూపాం. చూ: మొక్కలము
"మొక్కళమైనాఁగానీ మోహము నీపైఁజల్లీ
అక్కరతో సరసము లాడేఁగా విభుఁడ" 12-470

**మొక్కళితనము :** ఔద్ధత్యం.
"మొక్కళితనాల బొమ్మముడి వెట్టుకోకువే
చిక్కించుక నిన్ను గోరఁ జిమ్మెనంటాను"
29-296

**మొక్కిళ్ళు :** వి. (?)
"మొదలనే తనకు నే మొక్కిలి నేననవే
పదివేలకుఁ దనపై బత్తిగల ననవే" 28-374
"చెలపల చెమటలు చెక్కిళ్ల
మొలకల నవ్వులు మొక్కిళ్ల" 28-419

**మొక్కులాడు :** ప.బం. నమస్కరించు. (?)
"మున్నాడి యొక్కరొక్కరు మొక్కులాడే రప్పటినీ
కన్నచో గోళ్లు దాఁకీనే కడువాఁడి పొద్దు"
18-176

**మొగఁడు :** (3) వి. 'మగఁడు'కు వ్యావహారికరూపం. మగడు, భర్త. ఇట 'మగ'

శబ్దం 'మొగ' గా మారింది. వ్యవహారంలో 'మగడు' శబ్దం 'మొగడు'గా ఉచ్చరింపబడడం సహజమే.

"తగవెఱుఁగనివాఁడు దయ దలఁచనివాడు
మొగఁడైతే మారాడక మొక్కేదే మేలు" 17-225

"నగు శ్రీవేంకటపతి నన్నే రక్షించినదాఁక
మొగఁడై యెరుక తుది ముట్టరాదాయను" 2-80

"జక్కవ చన్నుల జగబిరుదా
మొక్కఁగదవే మొగనికి నిపుడు" 29-306

**మొగకళలు:** వి; బహు. (?)

"ఇప్పట నుండి నేల యెడమాట కానీ కాని
ముప్పిరి నే నవ్వితేఁ గా మొగకళ లెక్కుత"
20-65

**మొగచాటు:** వి. ముసుగు, ముఖపటం, మొగంమొత్తేది, వెగటైనది.

"ముప్పిరి మోవిమీఁదటి మొగచాటు లెన్ని లేవు
కప్పి తములమిడుటే కతలాయఁగాక" 7-486

"ఎన్నఁడులేని గుణము యేల వచ్చె నీకును
మొన్నటి నిన్నటి పొందు మొగచాట్లాయనో"
13-384

**మొగతిరుగు:** ప.బం; అ.క్రి. విముఖములగు.

"అట్టహాసమున నసురలు వారఁగ
ముట్టి వాయువులు మొగతిరుగ" 3-239

**మొగదాకిరి:** (2) వి. 'మొకదాకిరి'కి రూపాం. మొగమోటం.

"అంతరియామివైన ఆ మొగదాకిరికైనా
కంతుగురుఁడ నన్నుఁ గావరాదా" 16-336

**మొగదాకిరివాఁడు:** (మొగదాకిరి + వాఁడు) మొగమోటం కలవాడు.

"మొగదాకిరివాఁడవు మొదలే నీవు
తెగనాడ వేమిటికి దేవరవు నీవు" 7-570

**మొగనాలు:** (మొగని + ఆలు) ప.బం; వి. భర్త గల స్త్రీ, ముత్తైదువ. 'మొగనాలు' అనేది ఉచ్చారణాను రూపమైన రూపం, మగనాలు.

"ఒక్క మొగనాండ్లకు వొరటు లెందాఁకానే
వెక్కసపుఁబొత్తు గూడి వేడుకతో నుందమే"
25-429

"మున్నున్న దయ లేక మొగనాలి యని యెంచక
కన్నుమరుగు గాని చోటుగా జెక్కిలి జీరుమని" అని క్షేత్రయ్య ప్రయోగం.

**మొగబాటు:** వి. ఇది 'మొగచాటు' అయి ఉంటుంది.

"కన్నులఁ దన్నుఁ జూచితి కాంక్షలును దీరవు
సన్నలు సేసితి మొగబాటూఁ గాదు" 12-262

**మొగమాయకాఁడు:** ప్రత్యక్షంగా మోసం చేసేవాడు; చూ: మొకమాయకాఁడు.

"ఎంత మొగమాయకాఁడో యేమో కాని
యింతులార వెర్గైతి మిఁక నేమో కాని" 9-147

**మొగమాయ మందులాఁడి:** వి. ప్రత్యక్షంగా మర్లు మందులు పెట్టే స్త్రీ. మగవారిని మాయలో ముంచే మందులు గలది కావచ్చు అని సంపా. (f.n. 29-171) మందులాడి అనేది విలక్షణప్రయోగం.

"ముప్పిరినది యంతటి
మొగమాయమందులాఁడి
విప్పుచు నీతో విన్నవించదుగాఁక" 29-171

**మొగమాయలాఁడి:** వి. గట్టి మోసకత్తె. చూ: మొగమాయకాఁడు.

"మొగమాయలాఁడివే మొగని నింత సేసితి
చిగురే చాఁగరైతేఁ జెప్పనేటికి" 16-486

**మొగమిచ్చు:** (3) (మొగము+ఇచ్చు) ప.బం; వి. ముఖప్రీతి.

"నగినవాఁడవు నీకు నయములు నేరిపేమా
మొగమిచ్చులను నీవే మొక్కించవయ్యా"
21-37

**మొగమిచ్చులాఁడి:** (మొగము + ఇచ్చులు + ఆడి) ప.బం; వి. ముఖప్రీతి మాటలాడే స్త్రీ.

"మొగమిచ్చులాఁడి గాన మోహములు చల్లీని
జిగి నిన్నెంత మీఁటినాఁ జెల్లునయ్య ఆపెకు"
12-487

**మొగమునఁగట్టు**: ప.బం; అ.క్రి. నిరంతరం జ్ఞాపకానికి వచ్చు, కనిపించు.
"అగపడి నిరంతర మలవాటై జగత్తు
మొగమునఁ గట్టినట్టు మొగి మరవనీదు" 3-216

**మొగమొగము చూడు**: ప.బం; అ.క్రి. ఒకరిముఖం ఒకరు చూడు.
"తెగరానిచోటికి దీమసంబులే మేలు
మొగమొగము చూచితే ముందువెన కౌను" 17-342

**మొగమొగాలు చూడు**: ప.బం; అ.క్రి. ఒకరి ముఖం ఒకరు చూడు. చూ: మొగమొగము చూడు.
"మొగమొగాలు చూచుట మొక్కులకు మూలము
తగవులు కూటమికిఁ దానె మూలము" 21-375

**మొగమోట**: (4) వి. దాక్షిణ్యం, సంకోచం. రూపాం. మొగమోటము.
"అగపడ్డ దొరవు నీ వన్నియుఁ జెల్లు నీకు
మొగమోటే మించె నాకు మోస మేమీ లేదు" 20-510

**మొగమోటకాఁడు**: దాక్షిణ్యం కలవాడు, సంకోచం కలవాడు.
"మొగమోటకాఁడు మోనాన నుండక
బెగడి ఆ నేఁటికి బెట్టీనే" 9-254

**మొగమోటము**: (2) వి. సంకోచం, జంకు, బిడియం, కనికరం, దాక్షిణ్యం.
"అప్పటి మొగమోటాలు అవియే తేవచ్చునా
మెప్పించిన వేళలను మించుఁగాక" 20-432

**మొగమోడు**: ప.బం; అ.క్రి. 1. జాలిపడు 2. సంకోచపడు.
"కమ్మటి నిచ్చకమ్మటు నెరపుడు కైవసము గావలె ననుచు
వుమ్మడి నీ గుణాలు వొగడుదు వూరక మొగమోడుదు వనుచు" 2-296

**మొ(గ)గ్గలెత్తు**: (మొగ్గలు+ఎత్తు) మొగ్గలుదొడుగు, మొగ్గలు గలదగు.
"మాటలు తీగెలు వారె మక్కువలు చిగురించె
మాటలకొద్ది నవ్వులు మొగ(గ్గ)లెత్తెను" 26-337

**మొగవాఁడు**: (4) (మొగ + వాఁడు) వి. మగవాడు. 'మగ' కు 'మొగ' అని వ్యావహారికం.
"ఈవల వలపునూ ఇద్దరికొకటే నీవు
ఆవటించి మొగవాఁడ వాఁటదాన నేను" 21-187

**మొగసిరి**: వి. పౌరుషం. (మొగ = మగ)
"సిరిమగఁడే మొగసిరి రక్ష
మరుగురుఁడే మా మర్మపు రక్ష" 9-54

**మొగసిరిమందు**: పురుషత్వాన్ని కలిగించే మందు.
"ఏమి మొగసిరిమందో యెంత నేరుపరో కాని
నా మనసు గరఁగించి నవ్వీని" 14-229

**మొగసిరిమందులాఁడు**: పురుషత్వాన్ని కలిగించే మందులు కలవాడు.
"మచ్చికల మొగసిరి మందులాఁడ నీ
కిచ్చిన దేహమిది యెట్టయినఁ జేయరా" 5-76

**మొగాలు ముడుచుకొను**: ప.బం; అ.క్రి. అసంతృప్తి ప్రకటించు.
"కసరి సతులు మొగాలు ముడుచుకొన్నాను
ముసిమి చెప్పి నవ్వించి మొక్కుదు నేను" 12-377

**మొగిచాటు**: వి. 'మొగచాటు' కావచ్చు. మొగంమొత్తునది, వెగటైనది.
"ముందరనున్న వలపు మొగిచాట్లాయఁగాక
పందెము వేసితే నా పాటి దయ్యీనా" 26-390

**మొగుడ**: వి. మొగ్గ.
"తరుణి కుచములను తామరమొగుడలు
విరిసేనో యని వెరపునను" 6-17

**మొగ్గు**: వి. హెచ్చు.
"తలవంచుకుండినాను తగ్గు లేదు మొగ్గు లేదు
పలుకక వుండీనాను భయము లేదు" 11-15

**మొత్తగాఁడు**: (మొత్తము + కాఁడు) వి. సేనానాయకుడు.

"నిలువు నీ సింగారము నేఁడు గంటిమయ్యా
మొలకనవ్వులపెను మొత్తగాఁడవు" 18-540

**మొత్తమి:** వి. మొత్తము. (?)
"యెత్తినది మీఁదు దనకె మేనుఁ బ్రాయమునను
మొత్తమి నా కీఁక మీఁదమోనమె చాలు" 9-61

**మొత్తిమోఁదు:** ప.బం; స.క్రి. మిక్కిలిగా కొట్టు.
"తుత్తుమురుగ దైత్యుల దనుజుల నని
మొత్తి మోఁది చలమునఁ జెలఁగి" 1-207

**మొదలగు:** (మొదలు + అగు) అ.క్రి.
ఏమాత్రమైనా ఉపయోగపడు.
"బగ్గన శ్రీవేంకటాద్రిపతి నన్నుఁగూడె నీక
ముగ్గుపిండి అట్లకు మొదలయ్యీనా" 11-160

**మొదలారి:** వి. 1. నాయకుడు 2. అరవశూద్రుల్లో
ఒక తెగవాడు, మొదలియారు.
"నీవె కాఁ చెప్పఁజూప నీవె నీవెకా
శ్రీవిభు ప్రతినిధివి సేనమొదలారి" 1-255

**మొదలికర్త:** వి. బ్రహ్మ.
"పొసఁగఁగ నిది గని యధికుఁడు పుక్కటకాండ్ల
నందరిఁ
బసమారిచి మొదలికర్తఁ బాలించిన గతిని"
1-72

**మొదలియెముక:** వి; ప.బం. ప్రధానమైన
ఎముక, వెన్నెముక.
"మురదనుజుని పెద్ద మొదలియెముకఁ దీసి
తురులూదరే తుత్తు తుత్తు తుత్తుత్తు" 1-120

**మొదలుండఁగొనలకు నీళ్లువోయు:** నానుడి;
వ్యర్థమైనపని చేయు.
"మొదలుండఁ గొనలకు మోచి నీళ్లువోయనేల
యెదలో నీవుండఁగా నితరము లేలా" 1-466

**మొనకత్తిధార:** వి. నిశితమైన కత్తి అంచు.
"మునుప హరిశ్చంద్రుఁడు మొనకత్తి ధారఁదొల్లి
పొనిఁగి చంద్రమతికిఁ బూవుదండాయ" 2-85

**మొనగోరితాఁకు:** వి. గోరికొన తాకు, నఖక్షతం.
"మొగమోట దాని కేలే మొనగోరితాఁకులు
అగడైన రతుల గయ్యాళిదానికిఁ గాక" 26-345

**మొనచూపు:** ప.బం; అ.క్రి. కనిపించు.
"మోహాంధకారముపై మొనచూపే నని పోయి
సాహసము లేక నే జడిసితిని" 3-265 & 2-415

**మొనచేయు:** ప.బం. వాఁడిచేయు, పదనుపెట్టు.
"మన్నించి యెంత గూడినా మందెమేలము
మున్నిటిసుద్దులు మొనసేతురా" 12-27

**మొనపల్లు:** వి. పంటికొన.
"మోవితేనె విందువేళ మొనపల్లు సోఁకితేను
ఆవల చూచి నవ్వేవు అదేమో నీవు" 8-240

**మొనపాదము:** వి. పాదముకొన.
"మొనపాదము చాఁచితే మొక్కేదే తగవు గాక
పెనఁగి అట్టె బటువుబిల్ల వెట్టనేలా" 7-178

**మొనపు:** అ.క్రి. ప్రకాశించు, అతిశయించు.
"ముత్తెపుఁజిప్పల నీరు మున్నిటివలె నుండునా
ముత్తెములై బలిసి లో మొనపుఁ గాక" 2-139

**మొనవాఁడి:** ప.బం; వి. కొనయందుండే వాడి.
"కొలచిన వారల కొంగుపైఁడి
ములిగిన వారికి మొనవాఁడి" 2-431

**మొనవాండ్లు:** 'మొనవాఁడి'కి బహువచనం.
చివరిభాగాల్లో ఉండే తీక్ష్ణతలు (వాండ్లు = వాఁడి
శబ్దానికి బహువచన రూపం. అన్నమయ్య
వాఁడి, వేఁడి శబ్దాలకు బహువచన రూపాలు
వాడడం విశేషం.)
"ముందటి కన్నులకంటే మొనవాండ్లైన చన్ను
లందమాయఁగాక చూపు లప్పటివే కావా"
24-107

**మొనవెట్టు:** ప.బం; అ.క్రి. వాడి కలిగించు,
పదనుపెట్టు.
"ఏ నెపమెఱఁగనాపె నెగ్గులెంచ నేరిపి
నానాట నిందరికి మొనవెట్టితివి" 25-364

**మొప్పె:** వి. 1. మూర్ఖుడు 2. మూర్ఖురాలు.
"వడి నెవ్వతో నిన్ను వాకట్టు గట్టుక యింత
ముడివెట్టి విడిచి తా మొప్పెఁ జేసెఁగాకా"
11-563

**మొయిలు:** వి. మేఘం, మబ్బు.

"మొత్తమిఁ జెలితురుము మొయిలు విరిసె నిదె
హత్తి వెలుతురుఁగాల మది నేఁడే" 19-519

**మొయిలు లేని వానజల్లు:** ప.బం; వి. అసంభవమైనది.

**మొయిలువారు:** అ.క్రి. మబ్బుపట్టు, మేఘావృతమగు.

"జిగిఁ జన్నుఁగొండలపై సెలయేరులు వారీని
మొగముపై జారిజారి మొయిలువారీని"
28-100

**మొయిలైపోవు:** అ.క్రి. విడివడిపోవు, నశించిపోవు.

"అమరపుల సుఖ మందిన పిమ్మట
మొఱఁగుకు మొఱఁగే మొయిలైపోవు" 4-339

**మొరఁగు:** వి. వంచన విశ. వంచకుడు.

"అంది తానె మోవి ఇచ్చెనలమేలుమంగ నేను
ముందువెన కెంచిచూడ మొరఁగిందుఁగలదా"
26-116

**మొరఁగులాడు:** ప.బం; అ.క్రి. అరచు, మోసపు పలుకులు పలుకు.

"అక్కరతో నాతఁడే ఆదరించి నన్నుఁగూడె
మొక్కనైతి నంటా నేల మొరఁగులాడేరే"
11-314

**మొరఁగులు:** వి; బహు. అరపులు.

"మనసులో కరఁగులు మాటలలో మొరఁగులు
వనితకుఁ జూడరే చేవలుదేరీని" 17-143

**మొర ఇడు:** ప.బం; అ.క్రి. మొరపెట్టు.

"బలిమి శ్రీవేంకటపతికి మొరఇడి
వెలసిరి తుదనిదే వెరవిందరికి" 3-255

**మొరమొర:** ధ్వన్యనుకరణశబ్దం.

"మొలనూలి గంటలు మొరమొర మనఁగాను
అలమి పెనఁగులాడీ అంటి నిన్ను" 22-291

**మొరయు:** అ.క్రి. ఉరిమిచూచు. 'ఏమిరా మొరుస్తా' వని చిత్తూరుజిల్లాలో నొక భాగమున వ్యవహారం.

"అనిరుద్ధుతోఁ గూడ నయ్యుషాకన్యఁ
జెరవేయుడని క్రోధచిత్తుఁడై యరిగె
మొరయుచు"
అని చిన్నన్న ఉషాకల్యాణము - 999 వి. పంక్తి. సం.వ.స.

**మొరయు:** అ.క్రి. ధ్వనించు.

"ఒకరిఁ దడవితేను వోరుతురా
మొకము చూడఁగానే మొరతురు గాక" 23-530

**మొరవంక యుంగరము:** వి. వంకరయైన ఉంగరం.

"ముద్దుల వ్రేళ్లతోడ మొరవంక యుంగరాల
నిద్దపుంజేతుల పైఁడిబొద్దులతోడ" 6-1

**మొఱఁగు:** అ.క్రి. అబద్ధమాడు, బొంకు.

"వేవేలు సతులకు వేరే సేసవెట్టి వచ్చి
యీ విధాన మొఱఁగేది యెఱగవు నీవు"
19-186

**మొఱఁగు:** వి. వంచన, మోసం. (మోసపుపలుకు)

"యెక్కుడు శ్రీవేంకటేశ కలిసితి
యిక్కువ మొఱఁగులు యికఁ నేలా" 26-120

**మొఱఁగుమాటలు:** వంచించే మాటలు.

"ముచ్చట నే మడిగితే మొఱఁగుమాట లాడేవు
బచ్చెంచి యాల నేరేడుఁబండులమ్మేవే" 7-206

**మొలకమోవి:** వి. చిగురుమోవి. (మొలకకు చిగురు అనేది లాక్షణికార్థం కావచ్చు)

"చెలియ నీ మోము చూచి సిగ్గులు చల్ల లేక
మొలకమోవిని లోలో ముంచి నవ్వీని" 26-29

**మొలకలనోము:** వి. ఒకరకపు నోము.

"కదియు పులకలకు మొలకల నోము నోమె"
5-127

**మొలకల పున్నమ:** వి. వైశాఖమాసంలో పున్నమినాడు స్త్రీలు చేసే పండుగ. రూపాం. మలకల పున్నమ, ములకల పున్నమ, మొలకల పున్నము, మొక్కల పున్నమ.

"పులకల మొలకల పున్నమతోడనె కూడె
అలివేణి నీ పతితో నాడవే వసంతము" 26-337

**మొలకవయసు**: వి. బాల్యం.

"మొలకవయసుతోడి ముద్దరా లే మెఱుఁగును

నెలకొని రా దిఁక నీది గాదా దోసము" 17-311

**మొలనూలు**: (మొల + నూలు) వి. స్త్రీలు అలంకారార్థం ధరించే కటిసూత్రం.

"అలమేల్మంగకు నీకు నమరెను మొలనూళ్లు

మలసి మీ రిద్దరును మార్చుకొంటిరా" 12-436

**మొలపూస**: వి. మొలతాడులో కట్టే పూస, బాలుర కటిసూత్రంలో గుచ్చే బంగారు మొ॥ వాటి ఘటిక. 2-243

**మొల్లమి**: వి. తఱచు.

"తొల్లి నిన్నుఁ గొలువని ద్రోహముననే కదా

మొల్లమి నానాజన్మములఁ బుట్టితి" 15-99

**మొసగసమాటలు**: వి; బహు. గుసగుసమాటలు. రూపాం. ముసగసలు.

"మొక్కలపుఁజేతలును మొసగసమాఁటలును

యెక్కడ నేరిచితివే యింతేసి నీవు" 29-167

**మొసలిమొకము సొమ్ములు**: ప.బం; వి; బహు. చెవులకు ధరించే మొసలిముఖం ఆకారంగల కుండలాలు, మకరకుండలాలు.

"మొసలిమొకము సొమ్ములు సెవులనుఁబెట్టి

విసవిస నవ్వేని వీఁడు గదమ్మా" 17-230

## మో

**మోఁటు**: వి. పందికి ఎదుట మనుష్యాకారంలో నిలిపిన కపటలక్ష్యం. (శ.ర.)

"చేరువ నా మోఁటునఁ జేరిన నా

మెకముల నేరుపరి నంటా" 5-217

**మోఁటుపడు**: ప.బం; అ.క్రి. మొద్దుబారు, చెడిపోవు (పద.), మ్రాన్పడు.

"కాపురము సేసేనంటే కల్పవృక్షమై తోచు

వోపనంటే మోఁటుపడి వుండు" 23-256

**మోఁతుగు**: వి. మోదుగు, పలాశం. ఇందులోని అరసున్న చింత్యం.

"ముసరీఁజూపులతేంట్లు మోఁతుగై వలపు పూచె

రసికత నాడుదువు రావయ్య జాజర" 18-249

**మోఁపరి**: (మోఁపు + అరి) మోసేవాడు, మోఁపు గలవాడు.

"పాఁపరేని మేను దన పానుపు సేసినవాఁడు

మోఁపరయి సకలము మోఁచినవాఁడు" 5-216

**మోకదాకిరి**: వి. 'మొకదాకిరి'కి రూపాం. కావచ్చు. మొహమాటం కలది.

"మంకుదాన నౌదుఁగాని మనసు మోకదాకిరి (?)

కొంకక యేమి సేసినాఁ గోపగించనమ్మా"

12-312

**మోకాలిచ్చలఁజూచు**: ప.బం; స.క్రి. మొక్కు, నమస్కరించు.

"చేరి వేడుకొంటూనే నీ చెక్కు నొక్కఁగాఁ జూచి

సారెఁదమ మోకాలిచ్చలఁ జూచేరు" 11-124

**మోకాళ్లముడుగు**: వి. మోకాళ్ల ముడుపు కావచ్చు. వేంకటేశ్వరస్వామి తిరుమలకొండకు కాలిబాటన వెళ్లేప్పుడు ఎదురయ్యే చోటు. దీన్నే మోకాళ్ల పర్వతమని అంటారు. తిరుమలకొండలంతా సాలగ్రామ మయం కనుక పర్వతాన్ని పాదాలతో కాకుండా మోకాళ్లతో ఎక్కేవారట. ఒకచోట మెట్లు మోకాలు ఎత్తుకలిగి మోకాళ్లు ముడుచుకొంటూ ఎక్కవలసి వస్తుంది. కనుక ఈ ప్రదేశానికి మోకాళ్లముడుగు(పు) అనే పేరు వచ్చింది.

"చక్కనేఁగుచు నవ్వచరిఁగడచి హరిఁదలఁచి

మ్రొక్కుచును మోకాళ్లముడుగు గడచినమీద"

1-227

**మోచి దింపు**: వి. బరువు దించుట. (?)

"తప్పక చూచేటి చూపు తడఁబాటుతో దోపు

ముప్పిరి శిరసువంపు మోచిదింపు" 26-349

**మోచిదింపులు**: వి; బహు. మోయడం – దింపడం.

"పెట్టెడి నాపెండెమిది పెట్టుకొంటి నిందరిలో

ముట్టి నాకు నిది గొంత మోచిదింపులా"

23-563

**మోటు**: వి. స్తంభం. (?)

"పొలమురాజై తిరిగే బోయనాయఁడు

వెలయ మోటున నుండే వేటబోయనాయఁడు"
1-460

మోటుననుండే వేటబోయనాయఁడు: వి. నృసింహస్వామి, స్తంభంలో ఉండే స్వామి.
"పొలమురాజై తిరిగే బోయనాయఁడు
వెలయ మోటున నుండే వేట బోయనాయఁడు"
1-460

మోటుపెట్టు: (?)
"మాటకు మాటాడఁబోతే మరియెన్నైనాఁ గలవు
మోటుపెట్టి నేము నీకు మొక్కేదే మేలు" 8-91

మోడామోడి: విశ. అందమైన, ఉదాత్తమైన.
"కూడె శ్రీవేంకటేశుఁడు గొబ్బున నిన్నింతలోనె
మోడామోడిసిగ్గుల మూసిపెట్టవే" 21-357

మోడామోడితనము: వి. అందమైన ఉదాత్తశైలి, విధానం. (వ్యు.)
"ఏడ నున్నా నీవారమే ఎరవు సేయకువయ్యా
మోడామోడితనమున మొక్కేము నీకు"
20-293

మోడిసేయు: అ.క్రి. అనాదరం చూపు, (పద; వ్యు.) ఏమార్చు, మోసంచేయు, పంతముపట్టు.
"మోడిసేసి ఇందుకేనా మొక్కేఁ జుమ్మీ" 19-397

మోతనీటిలోని యీత: మిక్కిలి బాధను కలిగించేది.
"మోత నీటిలోని యీత మూపునఁబుట్టిన మేత
మూఁతిమీఁది కత్తికోఁత మొనగోరివాత" 5-274

మోతుగు: వి. మోదుగుచెట్టు
"మోతుగు వూచెనో మొల్ల వూచెనో
కాతరపు చెలి కన్నులను" 20-291

మోదుకట్టు: అ.క్రి. దెబ్బవలన నెత్తురు గడ్డకట్టు
"మోవి మోవి సోఁకితేనే మోదుకట్టీనా" 13-246

మోన: వి. మొన, మీద, పైన అని వ్యు. ఇట మోనముతో (= మౌనముతో) అని అర్థం కావచ్చు.
"కానుక యిచ్చితినని కాంతునికి పూవుదండ
మోనతోఁ జేతికిచ్చి మొక్కరే నామారు" 14-482

మోనదాగెలు: ఒకానొక నోము.
"ముదిత మాటాడకిది మోనదాగెలు నోమె"
5-127

మోనము[1]: అన్నమయ్య 'మౌన' శబ్దాన్ని అంతటా మోనమనే వాడినాడు. ఆనాడు మోనమనే పదమే వ్యవహారంలో ఉండెనేమో! మౌనం.
"ముక్కుమీఁద వేలిడుక మోనమున నే నుండితే
దక్కిసిగ్గుల మునిఁగీ తాఁదానే" 8-36
"ఇంత నే మోనాన నుంటే యేల మాటాడించీ
పంతము చెల్లినమీఁదఁ బలికేఁ గాక" 20-141

మోనము[2]: వి. దురాగ్రహం.
"గడుసుఁదన మేఁటికి కలికి మోనమటే
తడవకున్న దిట్టతనమిది యనఁడా" 8-243
"పూని నిన్ను నుతియించి భోగియాయ నొకఁడు
మోనమున నిన్ను దిట్టి మోక్షమందె నొకఁడు"
4-8

మోపు: వి. భారం, బరువు, పెద్ద ప్రయత్నం.
"కొమరే పాయమింత కూడినాను మోపుగాదు"
12-246

మోపు(లు)గట్టు: వ.బం; స.క్రి. కుప్పలుపోయు, గడ్డి-గాదం మోపుగట్టడంపై వచ్చిన పలుకుబడి.
"రాపులిఁకఁ జేయకువే రతికేలిలోపలను
మోపుగట్టించె వలపు ముదితచే" 7-580

మోపు మోయనే కాని మూలుగఁగఁ బొద్దు లేదు: సామెత. శక్తివంచన లేకుండా బాధతో పనిచేయడమే కాని బాధను తెలియజేయడానికి కూడా సమయం లేదని భావం.
"మోపు మోయనే కాని మూలుగఁగఁ బొద్దు లేదు
శ్రీపతి మా పాటు చిత్తగించవయ్యా" 15-199

**మోపులకొలది:** అత్యధికం, మిక్కుటం
"యేపుల నిన్ను సొలసి ఇచ్చకములే సేసీ
మోపులకొలఁది గావు ముదిత నేరుపులు"
28-141

**మోపులగు:** ప.బం; అ.క్రి. అధికములగు
గడ్డీగాదం వీటిని ఒకచోట కట్టిన పెద్దకట్టలు
మోపులు. దీన్నిబట్టి వచ్చిన పదబంధం.
"మోపులాయఁ గోరికలు ముక్కున నూర్పులు
రేఁగె
పాపము పుణ్యము మా కా పని గాదు సుమ్మీ"
19-463

**మోముచక్కటిన్:** మొగమునకు సూటిగా,
ముక్కుకు సూటిగా.
"చాయల నేపొద్దూ మోముచక్కటీఁ గొలువు
సేసి
పాయరాని చుట్టమవై పనిగొంటివే" 23-91

**మోమెల్లాఁ గన్నులు చేసుక చూచు:** ప.బం;
స.క్రి. మిక్కిలి ఆసక్తితో చూచు, తదేకదృష్టితో
చూచు.
"కతలుగా మోమెల్లా గన్నులు చేసుక చూచె
రతి నీ వింటికి వచ్చే రాకలకును" 28-8

**మోమోము:** (మోము + మోము) ప్రతివారి
ముఖము అనియే కాక ఒకరి ముఖము
నింకొకరు చూచుట (మొగము మొగము
చూచుకొంటే) అను నర్థము కూడా
సరిపోవుచున్నది అని సం.ప.స. (19 సం.)
"రాయుడి దవ్వులనుండే రాజసాలు చెల్లుఁగాక
యీయెడ మోమోము చూచి యెడమాట లేలే"
13-437

**మోయని మోపు:** ప.బం; వి. భరింపరానంత
భారం.
"అయము రెంటికి నన్నపానములు
మోయని మోపిది ములుగఁగ నెట్లొ" 6-167

**మోరకించు:** అ.క్రి. మొండితనం చూపు.
"మోరకించి నీ విభుఁడు మోవితేనె లానీ నదే"
16-244

**మోరతోపు:** (9) వి. వెనుకముందులు
చూచుకొనక పోవడం (పద.), అనాలోచిత
చేష్ట (వ్యా.) నిర్లక్ష్యం, గుడ్డిగా, మూతులు
తిప్పడం, పరాఙ్ముఖత్వం. రూపాం.
మోరత్రోపు. ఈ పదానికి వేటూరి
ఆనందమూర్తిగారు మూతివిరుపు, నిర్లక్ష్యం
చేయడం అనే అర్థాలు సూచించినారు. వారి
వివరణ ఈ విధంగా ఉంది. 'పశ్వాదుల
దీర్ఘముఖమును మోర యందురు. నీ
మొహము, నీ మోర అని వ్యవహారము.
మూతిని విరిచియు, మూరెడు చేసికొనియు
తిరస్కారమును ప్రకటించుటయే మోరతోపు
చేయుట. ఇది మోరతోపే కాని మొరతోపు
కాదనుకుందును. చూ: బ్రౌన్. మోరతోపు =
aversion, turning, away or averting the
face, మూతులు తిప్పడము.
"మోరతోపున నిన్నాళ్లు మోసపోతిఁగా"
1-75 పు.

**మోరతోపుఁదనము:** (4) వి.అనాలోచనం,
అనాలోచనచేష్ట, పెడముఖం పెట్టడం.
రూపాం. మోరత్రోపుఁదనము.
"మొలనూలు వట్టఁగానే మోరతోపుఁదనమేల
చెలువుఁడ మారుమోము సేసుక నవ్వేవు"
18-52

**మోరుఁడు:** వి. అటూఇటూ చెందని స్థితిలో
ఉన్నవాడు, మూర్ఖుడు, మూర్ఖశబ్దభవమైన
మోరకుడు అనేదానికి వ్యావహారికరూపం (?)
లేదా ఇది 'మోరఁడు' కావచ్చును. మోరడు
అంటే మ్రోడు.
"అటు గన తాఁబట్టిన వ్రతముండఁగ
నన్యమతము చేపట్టినను
నటనల నెందునుఁ బొందక జీవుఁడు నడుమనె
మోరుఁడైనట్లు
తటుకన శ్రీవేంకటపతి నొక్కని దాస్యము
భజియించిన నరుఁడు
ఘటనల నాతని కైంకర్యములకు
కడుఁబ్రాత్రుఁడు గాక మానునా" 2-22

**మోలము:** వి. ములాము, బంగారు మొదలైన
వాటి పూత, పుంటికి పూసెడి మందు.

"వాఁకమాయ వలపంటా వన్నెకాఁడ నేనంటా
యాఁకట నలయింతురా అప్పుడే నీవు" 2-796
"అలరి మర్మములంటే యాఁకట మరేటికే"
29-2 అను.

**యా(ఏ)కతమాడు :** అ.క్రి. మంతనాలాడు. ఇందులో ఏ 'యా'గా ఉచ్చరించబడింది.
"గారవించి యాపెతో యాకతము నీవాడగాను
యిారీతి దగ్గరితేను యిది సిగ్గు గాదా" 11-9

**యా(ఏ)కతము :** వి. ఒంటరి, నిర్జనప్రదేశం, ఆలోచనకు తగినచోటు, ఆలోచన, సంప్రదింపు. ఇందులో ఏ 'యా'గా ఉచ్చరించబడింది.
"పిన్నదాన యాకతానఁ బిలిచి ఆనతీవయ్యా"

**యాకాంతములాడు :** అ.క్రి. 'ఏకాంతములాడు'కు జానపద వ్యవహారం. రహస్యంగా మాట్లాడు.
"వేళయేమి చూచేవే శ్రీవేంకటేశు చెవిలోన
తాలిమితోడుత యాకాంతములాడవే" 17-216

**యాకారు :** అ.క్రి. 'ఏకారు'కు జానపదవ్యవహారం. మిక్కిలి అపేక్ష కలిగి ఉండు.
"మిక్కిలి నీ గుణాలకు మెచ్చి మెచ్చిలోలో నవ్వి
వొక్కటై నీ మోవితేనె కూరకె యాకారును"
12-280

**యాచకము :** వి. యాచన. ఇది సంస్కృతపదం. దీనికి 'యాచించునది' అని కర్త్రర్థం. కాని ఇట యాచకత్వం, యాచన అని భావార్థంలో వాడబడింది.
"సకలయాచకమే సరుస నాకుఁబని
సకలరక్షకత్వము సరి నీ పని" 2-53

**యాజకము :** వి. యజ్ఞం చేయడం.
"అది నిజమతంబదిగాక యాజకం
బదిగాక హృదయసుఖగదిగాక పరము" 1-40

**యాదవనారాయణుఁడు :** వి. యాదవరూపంలో ఉన్న విష్ణుమూర్తి. శ్రీకృష్ణుడు.

**యావభావాలు :** వి. 'హావభావాలు' శబ్దానికి జానపద వ్యవహారరూపం.
"అమరీ నమరదు నీ యావభావాలు
గమి నీ వలపు లిందే కానరాదా నాకును"
17-284

## యో

**యోగక్షేమం వహామ్యహమ్ :** భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పిన వాక్యం. 'నా భక్తుల యోగక్షేమాల బాధ్యతను వహిస్తాను' అని అర్థం.
"అల యోగక్షేమం వహామ్యహ'మ్మను మాట పదమైయుండఁగా" 8-2-22

**యోగపట్టెము :** వి. యోగులు జందెంమాదిరిగా వేసుకునే పట్టు మొ॥ వాటితో నేసే పట్టె. రూపాం. యోగపట్టము.
"చిలుకుగోళ్లతోడ సెలవిన నవ్వులతోడ
బలుజిహ్వతోడ యోగపట్టెముతోడ" 2-278

**యోగానంద నరసింహస్వామి :** వి. చిన్న అహోబలానికి ఆగ్నేయదిశలో రెండుమైళ్ల దూరంలో వెలసిన నరసింహస్వామి. నవనారసింహుల్లో ఒక స్వామి.
"అతిశయకరుణ యోగానందనరసింహా
మతి శాంతపు కానుగుమాని నారసింహా"
1-453

## ర

**రంగక్షేత్రము :** వి. తమిళనాడురాష్ట్రంలో రంగనాథుడు వెలసిన శ్రీరంగక్షేత్రం. ఇది కావేరినది రెండుపాయల నడుమ ఉంది.
"కావేరీమధ్య రంగక్షేత్రమల్లదిగో" 15-125

**రంగపతి :** వి. శ్రీరంగం లోని రంగనాథస్వామి
"బ్రహ్మ పూజించే రఘుపతి విభీషణు కిచ్చె
బ్రహ్మణ్యుఁడీ రంగపతిఁ గొలువరో" 15-125

**రంగుపాట :** వి. శ్రేష్ఠమైన పాట, ఇంపైన పాట, మనోజ్ఞమైన పాట.
"రవళి నారదాదుల రంగుపాటకుఁజొచ్చి

చెవులాలించీ సుతలు శ్రీనారసింహుఁడు"
15-132

**రంటదెప్పరపు రచన:** వి. అతుకుల కూర్పు
"రంటదెప్పరపు రచనమా బదుకు" 4-184
"రతిరాజు నమ్మి లివి రంటదెప్పరపువేళ
కతుకున నాటుఁజేసు గవిశన విడరే" 11-221
"రంటదెప్పరము లేల రాకు రాకు పోవయ్యా"
20-192

**రండు:** (15) వి. 'రెండు'కు వికృతిరూపం.
"రాతిరిఁబగలనేటి రంటినడుమఁజిక్కి
వూతఁగాన వెళ్లనీరో వో యాసలాల" 3-442
"వుండేది వొక్కతె యింట పండేది వొక్కతె వద్ద
రండును నడపేవు నీ రాజసమున" 8-38
"రండూ నేరుతువే రమణి నీవు
వెండిపైఁడి వుంగరాలు వేలనే పెట్టితివే" 8-26

**రండు నాడేటివారు:** వి. అవును కాదు అని రెండూ చెప్పేవారు, పట్టు లేనివారు.
"రండు నాడేటివారు రమణులు
అండ నీవే కనుకొనే వడుగకు మమ్మును"
14-417

**రంతు:** వి. 1.రతి 2.ఆట 3.మనవి 4.కలకలం, శబ్దం 5.గల్లంతు 6.కలహం 7.సింహనాదం 8.మిడిసిపాటు 9.ఒప్పిదం 10.విఘ్నం 11.విలాసం అనే అర్థాలు నిఘంటువుల్లో కనిపిస్తున్నాయి. ఈ అర్థాల్లో ఇట ఒప్పిదం, విలాసం అనే అర్థాలు ఒప్పుతున్నాయి.
"రంతున వాల్మీకి చెప్ప రామాయణముగాను
సంతగాఁ దాటకాదులఁ జంపినదెల్లా" 2-162

**రంతుకెక్కు:** ప.బం; అ.క్రి. మిడిసిపడు.
"రంతుకెక్క విరహతాపము కూన
కాంతుల నీ సోయగపు కనుచూపే మందు"
4-273

**రంపపుసంసారము:** ప.బం; వి. కటకటగా నడిచే సంసారం, బాధాకరమైన సంసారం.
"పాముచెలిమి రంపపుసంసారము
గాములు మోఁచిన గంప యిది" 1-180

**రక్తగుండాలు:** వి. రక్తపాత్రలు.
"జగములో రాక్షసుల సంహారముగ నేనె
నిగిడి రక్తగుండాలు నిండ నేసును" 2-107

**రచ్చఁబడు:** వీధిన పడు. 8-27

**రచ్చలఁబడు:** ప.బం; అ.క్రి. వీథుల్లో పడు.
"రచ్చలఁబడె మా గుట్టు రమణుల చేఁతబెట్టు
అచ్చమై యిందుకుఁ బరిహార మేదో కాని"
3-531

**రచ్చలు:** వి; బహు. రట్టులు.
"రతి వినోదమెపుడు రచ్చలఁబొందించును"
3-532

**రచ్చవేయు:** స.క్రి. బజారున వేయు.
"చేఁగదేరఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
రాఁగిన నీ పొందులెల్ల రచ్చవేసెదానవా"
11-276

**రచ్చె:** వి. రచ్చ, రాజమార్గం.
"సారె సారె రచ్చెలోన సరసము లాడితి
కోరి కొలువులు సేసితి గుబ్బతిలితి" 23-28

**రట్టుకెక్కు:** ప.బం; అ.క్రి. అల్లరిచేయు.
"చేముంచి నీవు సారెఁ జెనకఁగానే పో
యేమి నెఱఁగని బాల ఇంత రట్టుకెక్కెను"
18-223
"రట్టుకెక్కె దొర నౌటే నెట్టన మూడో తప్పు
యిట్టె కావు కావకుండ మిదివో తప్పు" 4-208

**రతికెక్కు:** (14) (రతికి + ఎక్కు) ప.బం; అ.క్రి; మాం. బాగుపడు, చక్కబడు, ప్రసిద్ధిచెందు, వర్ధిల్లు.
"యేరా శ్రీవేంకటేశ్వరుఁడా
రార కడపలో రతికెక్కెఁ బనులు" 26-58
"అంగన మంచముమీఁద నభ్యసించిన విద్యలు
రంగుగా మా కౌఁగిటిలో రతికెక్కెను" 21-351

**రతిపరవశము:** (2) వి. రతిపారవశ్యం.
"రతిపరవశములు రాఁగిన మూర్ఛలు సుండీ

మతిలోఁ దప్పించక మనుదురు గాని" 1-494

**రతిరాచవిభవము**: వి. రతిరాజవిభవము అనడానికి బదులుగా రతిరాచవిభమనడం అన్నమయ్య ప్రయోగ స్వాతంత్ర్యానికి లక్షణం. మన్మథ విభవము.

"కలయవే పాన్పుపై కళలు మోమునఁ బొదల

వెలయవే రతిరాచవిభవములను" 28-2

**రతు(కు)**: 'రతి(కి)' అనే అర్థంలో ప్రయోగింపబడిన పదం. ఇందులో 'రతు' అనేది ప్రాతిపదికమా!

"సారె సారె రతుకు సమ్మతించ వేడుకొని

తూరుపెత్తీఁదమక మేతులతోడను" 28-246

**రత్నకోమలి**: వి. రత్నంవలె మృదువైన శరీరం కల స్త్రీ, స్త్రీ. ఈ పదాన్ని ఇతరకవులు ప్రయోగించినట్లుగా కనిపించదు. ఇది అన్నమయ్య విలక్షణప్రయోగం.

"మాట గాఁగ నవ్వితే ముత్యాలు రాలీని

కూటువ నీ సతి రత్నకోమలి గనక" 7-314

**రత్నదీపము**: వి. చంద్రుడు. 'అన్వయస్తు సముద్రః స్యాద్రత్నదీపస్తు చంద్రమాః' అనే నిఘంటువాక్యాన్ని ఉదాహరిస్తూ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు రత్నదీప శబ్దానికి చంద్రుడనే అర్థాన్ని పేర్కొన్నారు. (తెలుగుమెఱుగులు 82 పు.)

"మొలచి రత్నదీపమే మొకమై తా నుండినాను

వెలుగు ఇంటిలో నెల్ల వెలయకుండీనా" 24-184

**రత్నాల కమ్మలు**: వి; బహు. రత్నాలు పొదిగిన కమ్మలు (కమ్మలు = చెవికి ధరించే ఆభరణ విశేషం.)

"కప్పులు దేర నొసలఁగస్తూరిబొ ట్టమరించె

వొప్పుగా రత్నాల కమ్మలొనరించె వీనులు"

27-528

**రథసప్తమి**: వి. మాఘశుద్ధ సప్తమినాడు చేసే వ్రతవిశేషం. ఇది సూర్యసంబంధివ్రతం.

"సతి పిరుఁదుల రథసప్తమి నేఁడె కలిగె

తతి శ్రీవేంకటేశుఁడు తగిలెఁగదె" 29-409

**రపణము**: వి. గర్వం, ఉత్సాహం, సంబరం. విణ. గొప్పది. (సూ.ని.) గొప్ప. (శ.ర.)

"రపణపుభవములు రాట్నపుగుండ్రలు

చపలపు బుద్ధులు జలనిధులు" 3-50

**రపణము**: విణ. మోగేది. వి. భూషణం. ఇది రవణము కావచ్చు.

"రతి చెనకులే నీకు రపణపుసొమ్ములు

సతతపుఁగూటమే సర్వసంపద" 12-76

"ముచ్చటమమత చీచీ ముచ్చు మురిపెమ చీచీ

బచ్చురపణములోని బచ్చన చీచీ" 1-195

**రపము**: (21) వి. చెల్లుబడి, (శ.ర.) గర్వం, ఉత్సాహం, సంబరం, అధికారం. విణ. అధీనం, ప్రచురం. (చనవు అని పీఠిక)

"కపటము లెల్లఁదీర కాఁగిలించుకొంటి నీడ

రపముగ నిట్టి నన్ను రక్షించరాదా"

"జాణఁడవు నీకు నిదే చద్దివలపు

రాణించె నింకెన్నఁడు నీ రపమాయ వలపు" 7-7

"రపమై శ్రీవేంకటేశ రతి నన్ను గూడితివి

వుపమించి చూడనింతా నొక్కటే వలపు" 11-7

"వేసిన కర్మములెల్లా చెప్పరాని మోపులాయ

రాసికెక్కి యింద్రియాల రప మాయను" 3-86

"కొంతపుఁజూపులఁ జూచి గోల దాన నేమి సేసే

రంతుల విభుఁడవు నీ రపమిందే కాక" 27-232

**రమ్మను పొమ్మను**: ప.బం; స.క్రి. పట్టించుకొను, ఆదరించు, గౌరవించు. దీనికి వ్యతిరేకార్థంలోనే ప్రయోగం.

"రమ్మనవు పొమ్మనవు రాజసము నెరపేవు"

20-253

**రళిత**: 'రళిత' అనే రూపం ఏర్పడడానికి వీలుగా 'రల్' ధాతువు కనిపించదు. 'రలయోరభేదః' అనే దాన్నిబట్టి దీన్ని 'లలిత' అనుకోవడానికి వీలున్నా అది సందర్భానికి సరిపోదు. కనుక దీన్ని 'గళిత' గా భావిస్తే సరిపోతుంది. గళిత అంటే జారిన అని అర్థం. కాని యతిభంగ మేర్పడుతుంది. అన్నమయ్య స్వతంత్రుడు

కదా! లేదా 'రళిత'కు జారిన అనే అర్థం చెప్పుకోవాలి.

"ప్రళయానలసంభ్రమ విభ్రమకర

రళిత దైత్యగళ రక్తవికిరణా" 2-81

**రవకత్తె:** (రవ+కత్తె) నింద గల స్త్రీ. రూపాం. రవ్వకత్తె.

"రచ్చలఁ దన్నుఁబొగడి రవకత్తె నేనైతినే

యిచ్చకమే ఆడియాడి ఇట్లయితినే" 25-370

**రవణహీనత్వము:** వి. భూషణం (నగ) లేకుండటం.

"రాజసన్మానమట రవణహీనత్వమట

తేజమట నలువంకఁ దిరొపెంబట" 1-247

**రవరవ:** అవ్య. మెరయుట యందగు ధ్వన్యనుకరణం, శీఘ్రంగా.

"రవరవ చెమటఁ గరఁగి నేడు యిదె

చవులాయను నీ జాజర" 5-332

**రవిపదకము:** వి. ఆభరణవిశేషం.

"రంతుఁ గలువకంటికి రవిపదక మిదేలే

పంతముతోడ చంద్రాభరణము లిడరే" 17-427

**రవ్వ:** వి. అపకీర్తి, నింద. (వజ్రం)

"రవ్వగా శ్రీవేంకటరాయఁడిదే నన్నుఁగూడె"

"రవ్వ మొక్కరో కరము రతిఁ

జొక్కియుండఁగాను నవ్వరేలే" 26-582

"రవ్వ శ్రీవేంకటేశుఁడు రతి నన్ను నిటు గూడె

జవ్వనులు నీవలె సాదించనోపరా" 27-387

**రవ్వకాఁడు:** (రవ్వ + కాఁడు) నింద గలవాడు.

"చివ్వన నింకా నీపైఁ జిత్త మిటువలె వచ్చు

రవ్వకాఁడ మాతోను రాయడించకుమయ్యా"

27-246

**రవ్వకెక్కు:** ప.బం; అ.క్రి. నింద పొందు, నిందకు లోనగు.

"రాతిరెల్లా జాగరాలే రవ్వకెక్కఁ బగలెల్లా

చేఁత లేమి సేయవలెఁ జెప్పరో యమ్మా" 20-29

**రవ్వగా:** క్రి.విణ. (?)

"అవ్వల నెవ్వని కేశవాదినామములే

రవ్వగా నాచమనాలు రచియింతురు" 3-358

**రవ్వపడు:** అ.క్రి. నిందపడు, దూఱుపడు.

"రాతి రొక్కలోకము రవ్వపడెఁ గలలోపల"

2-163

"నవ్వినంతే చాలుఁదాను నాయమేమీ చెప్పకురే

రవ్వపడ్డ మేనవావి రమణిని నేను" 20-87

**రవ్వ(లు)సేయు:** ప.బం; అ.క్రి. రచ్చలు చేయు, అల్లరి చేయు, దూరు, నిందించు, పెద్ద ధ్వని చేయు.

"వూడిగాల చెలులతో వొంటి మాటలాడెనంటా

వాడలోన నేఁటికి రవ్వలు సేసేవే" 28-416

"రవ్వసేయఁజోటు లేదు రాజసానకిమ్ము లేదు

పువ్వువంటి చెలినెట్టు బుజ్జగించేవో" 20-106

**రవ్వలైనవారు:** వి; బహు. నిందపడ్డవారు, అల్లరిపాలైన వారు.

"నవ్వు నవ్వేవారికి నాయములు దగునా

రవ్వలైనవారికి బీరము లేలా" 25-449

**రవ్వెన:** వి. అల్లరి.

"రవ్వెనవాఁడవు గావా రాజవుగావా మున్నే

అవ్వల నెంచి చూచితే నందుకునుఁ దగవా"

8-244

**రవ్వెనవాఁడు:** (రవ్వెన + వాఁడు) అల్లరివాడు. (వ్య.)

"రవ్వెనవాఁడవు గావా రాజవుగావా మున్నే

అవ్వల నెంచి చూచితే నందుకునుఁ దగవా"

8-244

**రసబద్ధము:** వి. రసబంధము కావచ్చునని సంపా. ధర్మవాచకానికి బదులు ధర్మివాచక ప్రయోగం అన్నమయ్యకు సహజమే. ఇంద్రియాలను శరీరంలో పదిలంగా నిలిపి బంధించడం.

"యిదివో రసబద్ధము యింద్రియములు మేనిలో

పదిలముగా నిలిపి బంధించుట" 1-452

## రా

**రాఁగఁజేయు:** స.క్రి. అల్లరిచేయు. 13-22 old

**రాఁగతనము:** (2) (రాగ + తనము) వి. పొగరుబోతుతనం, ఔద్ధత్యం, ధూర్తత్వం.
"గొప్ప రాఁగతన మేల కోరి విడెమియ్యవే
చిప్పిలఁగ వేడుకొని చే యొగ్గీని" 25-252

**రాఁగిలించు:** అ.క్రి. సంతోసించు, రంజిల్లు, అనురాగం కలిగి ఉండు.
"చేయి చాఁచి రాఁగిలించి చిత్తగించి మోము
చూచి"

**రాఁగు:** (11) అ.క్రి. అనురాగం పొందు. (వ్యు.)
"పాఁగిన శ్రీవేంకటాద్రిపతి యిన్నిటా నాతో
రాఁగిన మోవితేనెల రసికు నే మందునే"
19-511

**రాఁగు:** (2) రేగు, కోపంతో మండిపడు బ్రౌన్; to be enraged, perhaps this should be రేగుట.
"రాఁగిన వేళల రంకెలు వేయు"
"వీఁగక శ్రీవేంకటేశ! వేడుక గూడితి నన్ను
రాఁగినా కోపముడిపి రక్షించనే కాదా"

**రాఁపుఁదనము:** (రాఁపు + తనము) వి. సంఘర్షణ, రాపిడి.
"చుట్టమువలెనే నీకు సుద్దులెల్లాఁ జెప్పని
రట్టడీ యి దెవ్వతెయ్యా రాఁపుదనాన" 28-135

**రాఁపు:** వి. నింద, రవ్వ; రాపిడి, సంఘర్షణ. రంపు ఇదియే కావచ్చు. (సం.ప.స. 14 సం.)
"నెమ్మదిఁ దనకొరకే నివ్వెరఁగున నుందాన
రమ్మని తానే నాతో రాఁపు వలదనవే" 26-30
"రాఁగదే యింటిలోనికి రాఁపు సేయక
చేఁగచూపుల మమ్మేల చిమ్మిరేఁచేవే" 14-363

**రాఁపుసేయు:** ప.బం; అ.క్రి. గిల్లికజ్జాలు పెట్టుకొను, ఘర్షణచేయు.
"నీ పలుకులెల్లా వింటి నీవు వేడుకొననేల
రాఁపుసేయ కిప్పుడిట్టే రావయ్య లోనికి"

**రాకాఁబోకలు:** వి. రాకపోకలు.
"రాకాఁబోకల రమణుఁడు దూరీనే తా
జోక సన్నసేయఁగాను చూడనంటా" 20-47

**రాకొట్టు:** (రా + కొట్టు) ప.బం; వి. రారా పోరా అని ఏకవచనాంతంగా పిలవడం.
"యేకతపువిన్నపము లిచ్చకము పుట్టించు
రాకొట్టులై పెనగొను రతివేళ విన్నపము"
12-125
"పోతరించి రాకొట్టఁబొగడుదుమా" 12-276

**రాకొట్టు(లు)గొట్టు:** ప.బం; అ.క్రి. రారా పోరా అని ఏకవచనాంతంగా పిలుచు.
"రాకొట్టులుగొట్టు రాజసము చూపిమోపి"
27-201
"సందడించి నీ యింటికి సారెకు వచ్చీనంటా
గొందినుండి యేల రాకొట్టు గొట్టీవే" 29-382

**రాగిదేరు:** అ.క్రి; ప.బం. ఎరుపెక్కు. చూ: రాగిదేఱు.
"నవ్వులేమి నవ్వేవే నాయకుని మాటలకు
రవ్వలుగా నందేమైనా రాగిదేరెనా" 13-251

**రాగుంజు పోగుంజులాట:** వి. అటువారు ఇటు వచ్చేట్లు, ఇటువారు అటు పోయేట్లు తాడును గుంజుతూ ఆడే ఆట.

**రాచయీవి:** వి. రాజులు చేసే దానం
"దీన నీ విచ్చిన మేను తెగి రోయ నెంతవాఁడ
కావించి రాచయీవికిఁ గడమున్నదా" 4-248

**రాచవిద్దె:** వి. రాజవిద్య. 7-268

**రాచవెట్టి:** వి. రాజులకు చేసే చాకిరి, రాచకొలువు, (వ్యు.) దొంగతనం. (తె.జా.)
"శ్రీపతి యీ సంసారము సేయకుండా నెంతవాఁడ
మాపుదాఁకా రాచవెట్టి మానవచ్చునో" 4-248

**రాజనపుఁబొట్ట:** వి. రాజనపువరి పొట్ట.
"సరి నవంట్లు రాజనపుఁబొట్టలవె
వెరవున తామరవిరులు నవె" 7-281

**రాజు లేని కొలువు:** ప.బం; వి. అసంభవమైనది, వ్యర్థమైనది.

"జ్ఞానము లేని యెఱుక సందుగిందు లేని
యిల్లు
రానిపోనిచోటి యాస రాజు లేని కొలువు"
15-462

**రాజు వలసినది దేవులు :** వి; బహు. ఇట 'వలచినది' అని కావచ్చు. రాజుమెచ్చిందే రంభ వంటి ప్రయోగం.
"సరిగాఁడు వీఁడనవలదు జగమున
రాజు వలసినది దేవులు" 2-298

**రాట్నపుఁజెవులు :** ప.బం; వి; బహు. నిరుపయోగమైనవి.
"నిన్నుఁజూడని కన్నులు నీచల వలకన్నులు
చిన్ని నీ కథలు వినని చెవులు రాట్నపుఁజెవులు"
2-450

**రాట్నపుగుండ్ర :** ప.బం; వి. నిష్ప్రయోజనమైనది. (వ్యు.)
"కోటానఁగోట్లాయ కోరికెలు జన్మములు
కూటువ గూడి రాట్నపుగుండ్రలైనారయ్యా"
2-266

చక్రభ్రమణం :
"ధరలోనఁబుట్టి తగవచ్చినందే వచ్చి
వరుస రాట్నపుగుండ్రవలె నైతి" 3-338

**రాణివాసము :** ప.బం; వి; బహు. అంతఃపురస్త్రీ, అంతఃపురము.
"నీ రాణివాసాలు నీకు మోహించిరి
యేరీతిఁ జనవులిచ్చేవయ్యా" 25-249
"ధర శ్రీవేంకటేశ నీ తావెల్లా రాణివాసాలే
యిరవై మమ్ము నేలితి వేదుగాను సతుల"
13-95

**రాత నార ఒలుచు :** ప.బం; అ.క్రి. అసాధ్యకార్యాలను చేయు. రాతినుండి నారలాగు అని వాచ్యార్థం. బండకు నారలు దీయుట, వట్టి కట్టెకు నారలు దీయుట, రోకండ్లకు నారలు తీయుట అని తెలంగాణంలో వ్యవహారం. (తె.జా.)
"ఆసపడనీవే తాను అంబుధులు పేరఁబెట్టు
కోసి రాత నారొలిచి కూరిము లింతేఁటికే" 8-298

**రాతిగుండె :** (5) వి; ప.బం. కఠినమైన హృదయం, కఠినుడు.
"ముచ్చువలె నిప్పుడుండె మూడులోకములు
నిండె
రచ్చసేసెఁ జూడరే రాతిగుండె" 5-48

**రాతిగుండెది :** (రాతిగుండె + అది) ప.బం; వి. కఠినమైన హృదయం కలది.
"రారాపులదానఁగాను, రాతిగుండెదాన గాను
కోరి నీకు మోహించిన కొమ్మను నేను" 18-67

**రాతిగుండెవాఁడు :** (రాతిగుండె + వాఁడు) ప.బం; వి. కఠినమైన హృదయం కలవాడు.
"వాలాయించి రాతిగుండెవాఁడ వౌత
యెఱుఁగుదు
పాలుమాలిన నా యాస పాయనీదుఁగాని"
11-45

**రాతిగుణము :** వి; ప.బం. కాఠిన్యం.
"ఈ తీరున రాతిగుణము దాకాఁదిప్పఁగవచ్చు
నీతితోడ నీ వలపు నీయంత లేనిది" 16-158

**రాతిగుజ్జము :** వి. నిష్ప్రయోజనమైనది.
"ఒట్టుకొని దేవరాహుత్తరాయ బిరుదు నీదే
కిట్టి రాతి గుజ్జమెక్కి తివి గాన" 2-142

**రాతిటనుండి :** (3) రాత్రినుండి.
"రాతిటనుండియు జాగరములె సేయఁగఁబట్టి
యీ తరుణులఁజూచైన యియ్యకొనవమ్మా"
11-133

**రాతిటి :** (3) రాత్రికి సంబంధించిన. రాత్రి శబ్ద వికృతిరూప మైన 'రాతిరి' పదం ఔపవిభక్తికంగా వాడబడింది. ఇట్లే అన్నమయ్య 'జాముట' అనికూడా వాడినాడు.
"రాతిటి యాకె రతులు రచ్చనేల వేసేవు
కాతరానఁ జిక్కినపుడు గరలియ్యేరాదా"
29-298

**రాతిపై నార :** ప.బం; వి. అసంభవం, రాతిలో నార ఉండదుకదా!
"గునిసి మందలవారి గుణము రాతిపై నార

ననుపెంత గలిగినా నాలిమాలేనా" 7-479

**రాతిమనసు :** ప.బం; వి. కఠినమైన మనస్సు.

"ఎంత రాతిమనసో నీ కెప్పుడీకఁ గరఁగీనో

పొంత సిగ్గువడీ నీతోఁ బొందేటి వేడుకను"

21-374

'ఎంత రాతిమనసుదానవే' అని క్షేత్రయ్య పదం.

**రాతిరింటిపని :** ప.బం; వి. సంభోగం. 'రాతిరింటి' అనేది 'రాతిరి' కి షష్ఠీవిభక్తికరూపం. వ్యభిచారం. (వ్యా.)

"రాతిరింటి నీ పనులు రతికెక్కు రచ్చకెక్కు

యీతల వేగి లేచితే నింటికెక్కును" 7-559

**రాతిరి పని :** ప.బం; వి. సంభోగము, వ్యభిచారం. (వ్యా.)

"రాతిరిపనులాతఁడు రవ్వల కెక్కినతఁడు

భీతిలేక ఆనలెల్లాఁ బెట్టుకోలేఁడా" 8-13

**రాతివీరుఁడు :** వీరుని విగ్రహం. 2-494

**రాతివీరుని బీరము :** వి; ప.బం. అసంభవం.

2-294

**రానిపోని చోటి యాస :** రానిపోని చోటు వ్యర్థమే కదా! వ్యర్థం(?)

"జ్ఞానము లేని యెఱుక సందుగిందు లేని యిల్లు

రానిపోని చోటి యాస రాజులేని కొలువు"

15-462

**రానిలే :** రానీలే (= రానివ్వులే) అనే పదబంధానికి వికృతరూపం. 'నీ' లోని దీర్ఘం హ్రస్వంగా మారింది.

"మాని మాని కమ్మర మగుడ మమ్మేఁచీని

రానిలే చూచుఁగాని రాచగోవిందుఁడు" 5-325

**రాపు సేసి మోఁపుగట్టు :** ప.బం; అ.క్రి. (?)

"ఏఁపుచు నా కాళ్లితఁడేల పట్టీనె

రాఁపుసేసి నాకుఁబెద్ద మోఁపు గట్టినట్లు" 6-167

**రాపుబీరాలు :** ప.బం; వి; బహు. కఠినోక్తులు.

"రాఁగదవే యిఁక నేల రాపుబీరాలు

మాఁగిన మోవితేనెకు మరిగినదానవు" 7-120

**రామరాజ్యము :** వి; ప.బం. సుభిక్షము, మంచి పరిపాలన గల రాజ్యం, ఆనందప్రదమైన రాజ్యం.

"రమణి జవ్వనము రామరాజ్యమిఁక

అమరఁగ నిట గొనియాడా చెలులు" 24-123

**రాయడి :** (3) వి. 'రాయిడి'కి వ్యావహారికరూపం. ఒరయిక, ఉపద్రవం. (వ్యా.)

"రాయడికి నలులేల రాసీనే మాతోను

కాయజుఁడు తానేల కసరీనే" 5-191

**రాయడించు :** (3) బాధించు, ఉపద్రవం కలిగించు. చూ : రాయడి.

"యెంత సంతసమైనగో యిండ్లిండ్ల వెన్నెలు దిని

రంతుతోఁ బడుచులతో రాయడించదు" 24-185

**రాయడికాఁడు :** (రాయడి + కాఁడు) రాయిడికాఁడు, ఉపద్రవం కలిగించేవాడు, హాని చేసేవాడు.

"రాయడికాఁడు గదమ్మా రంతు సేసీని

పాయపుసతులనే గోపాలగోవిందుఁడు" 5-325

**రాయిడిపడు :** ప.బం; అ.క్రి. రాపిడిపడు, బాధపడు.

"చేఁగ చిగురు తన చేఁతే యిటులై

రాఁగినవలపుల రాయిడిపడెను" 24-85

**రాయివంటి మనసు :** వి. రాతివలె కఠినమైన మనస్సు.

"మచ్చరాన రాయివంటి మనసులు గరఁగెనా

గచ్చుల మీ మేనుల కాఁక దీరెనా" 16-235

**రారాఁపుఁదనము :** (రారాఁపు + తనము) వి. మిక్కిలి సంఘర్షణ, మిక్కిలి రాపిడి. ఇట రారాఁపు శబ్దం స్వార్థంలో పై 'తన'ప్రత్యయం చేరింది.

"రారాఁపుఁదనములు రవ్వలవారికిఁగాక

సారె నోజ గలిగిన సతుల కేలే" 26-228

**రారాఁపు :** (5) (రాఁపు + రాఁపు) వి. మిక్కిలి ఒరయిక, ఉపద్రవం, మిక్కిలి రాయిడి.

"రమ్మనఁగ పొమ్మనఁగ రారాఁపు లేటికే

దొమ్మి రేఁగి కాఁకలు తోదోపులాడీని" 10-2-70

"ఇతవైన చోటికి యేమి సేసినా సమ్మతి

రతికెక్కిన మీఁదట రారాఁపు లేదు" 29-370

**రాలుదింటా మలిగండ్లను :** ప.బం. కంబళిలో అన్నంతింటూ వెంట్రుక లెన్నడం వంటిది. పెద్దపెద్ద రాళ్లు తింటూ వాటిలో చిన్న చిన్న రాళ్లు ఏరడమని వాచ్యార్థం.

"మలసి రాలుదింటా మలిగండ్లన నేల

నొలసితే గైకొంట వొల్లకుంటే మానుట" 4-223

**రాలురప్పలు :** ప.బం; బహు. 'రాళ్లు' అనే అర్థంలోని జంటపదం.

"కొండలవంటివి కోమలి కుచములు

బండగు రాలురప్పలుఁగావు" 26-137

**రాళ్లలో మలిగండ్లేరు :** ప.బం; అ.క్రి. కంబళిలో అన్నం తింటూ వెంట్రుకలేరు వంటిది. పెద్దరాళ్లు తింటూ వాటిలో వచ్చే చిన్న చిన్న రాళ్లను ఏరడమని వాచ్యార్థం.

"అట్టె సర్వాపరాధి నపరాధా లెంచనేల

గట్టిరాళ్లలో మలిగండ్లేరనేల" 7-220

**రాళ్లు చక్కచేసి మలిగండ్లు ఏరు :** ప.బం; అ.క్రి. కంబళిలో వెంట్రుకలేరు వంటిది.

"చెప్పనేల రాళ్లు చక్కఁజేసి మలిగండ్లేర

నిప్పుడిట్టి నే నించు కేమందునే" 15-58

**రాళ్లు తింటూ మలిగండ్లేరు :** ప.బం; అ.క్రి. నిష్ప్రయోజన మైన పని చేయు. పెద్దపెద్ద రాళ్లు తింటూ వాటిలో చిన్నచిన్నరాళ్లు ఏరివేయడమని వాచ్యార్థం.

**రావణ! హతో భవ :** ఇది సంస్కృతవాక్యం. 'ఓ రావణా! హతుడవు కమ్ము" (చచ్చిపొమ్ము) అని అర్థం.

"అనలము 'శీతో భవ' యన నేరిచిన సీత

పనివి "రావణ హతో భవ" యననేరదా" 15-263

**రావాడి :** (2) ఆకర్షణ. సం.ప.స. లో ఈ పదాన్ని గురించి ఈవిధంగా ఉంది. రావు + ఆడు రాహుశబ్దభవము రావు. రావు గొట్టే ముఖము అని వ్యవహారము. రావాడు = కటుకుదనమును చూపు అని అర్థము కావచ్చును. (27 వా అనుబంధం 7 పుట.)

"నావంటి సీతను నాఁగేటి కొనఁదెచ్చితి

రావాడి తమకముతో రామచంద్ర" 19-165

"యీ వేళ నితని నిట్టే యెనసితి విదిగాక

రావాడి బింకాన నుంటే రతి సమకొనునా"

13-217

**రావాడు :** (రావు + ఆడు) మోహరించు, బిరుసెక్కు, కళకళ లాడు, ఆకర్షించు, గంభీరంగా ఉండు, రాజసంగా ఉండు. ఇత్యాదులు అర్థములు కావచ్చు. వాని మొగము రావు గలిగినది ఇత్యాది వ్యవహారము నేటికిని గలదు అని సంప.స. (27సం. 192 పుట, అధస్సూచిక)

"కైవశపు మేనికిని కాఁగిలి యటుండఁ గాను

రావాడే చన్నులే కావా రతికెక్కు నడుమ"

27-284

"చేతులు చాచి నన్నుఁ జెనకి కాఁగిట నించీ

రాతిరి పంతములకు రావాడేనటే" 26-287

**రావి జిగురగు :** (?)

"రావిజిగురైనవాఁడు రచియించీ తరితీపు

యేవి వరమో కందము యింత కోపఁగలవా"

8-49

**రావిమానిజిగురు :** ప.బం; వి. ఊరక అంటే జిగురు, పిసినారి.

"ఏ వేళ గుణమో యెడతెగని కర్మాలు

రావిమానిజిగురై వూరక యంటీని" 2-105

**రావిమాని పువ్వులు :** వి; ప.బం; బహు. లేనివి, రావిచెట్టుకు పువ్వులుండవు కదా!

"రతులలో మాటలు రావిమాని పువ్వులు

తతి విరహపుకాఁక తాటిమాని నీడ" 2-268

**రాసకొడుకు :** వి. రాజపుత్రుడు.

"వసముగాని సతుల(లు) వారిఁగూడి

మమ్ముఁగూడి

కొసరించుకొని రాసకొడు కాయ నిపుడు"

27-393

**రాసబలుపువాఁడు :** వి. రాజగర్వం కలవాడు.

"రాసబలుపువాఁడు రామ నాతఁడు వాఁడే
మోసపోక మనము మొక్కవలె వాఁడే" 24-150

**రాసికూటము :** వి. రాశికూటము.
"వాసులెంచి నీవు నన్ను వలెనని కూడితిని
రాసికూటా లెంచఁబోతే రవ్వగాదా ఇఁకను"
26-291

**రాసికెక్కు :** (రాసికి + ఎక్కు) వ.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు, గణనకెక్కు.
"వాసులకుఁ బెనగితి వోడి సవతులలోను
రాసికెక్క నా వలపు రమ్మనవే పతిని" 29-428

**రాసిగొల్లవారు :** వి. గొల్లల్లో ఒక జాతివారు.
"చేసేవు మంచితనాలు చిక్కియుఁజిక్కవు
రాసిగొల్లవారి నేల రాఁపులఁబెట్టేవు" 16-96

**రాసివిరహము :** వి. అత్యధికమైన ఎడబాటు.
"రాసివిరహానఁ గప్పురము మేనఁజల్లుకోఁగా
దోసమెఱఁగక యేల దోసి లొగ్గినే" 25-126

**రాసిసేయు :** వ.బం; స.క్రి. ప్రశంసించు.
"ఆసపడి వచ్చినట్టి అతిథి బలురాజుకు
రాసిసేసి యే మిచ్చిన రతికెక్కెని" 2-490

**రాసులగు :** అ.క్రి. కుప్పలగు, అధికమగు.
"సేసవెట్టి యేలినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
రాసులాయ వేడుకలు రావే వాకిటికి" 19-315

**రాహు :** వి. రాహువు; రాహు, బాహు శబ్దాలపై ప్రథమైక వచనంలో వచ్చిన 'వు' ప్రత్యయానికి లోపం వచ్చిన రూపం.
"వెనకఁ దురుమను రాహు వేవేలు రూపులై
తనర ముఖచందురుఁడు తలఁకడు గదా"
5-348

## రి

**రిచ్చ :** వి. నిశ్చేష్టత, విసుగు, దిగులు.
"కచ్చుపెట్టేదెందు నీకు కాఁగిలి యెవ్వరి సొమ్ము
రిచ్చల నీ మనసిద్దరికిఁదూఁచిచ్చేవా" 13-356

**రివ్వనన్ :** క్రి.విశ. తివ్వన, శీఘ్రంగా, వేగంగా.
"పువ్వులనే నన్ను వేసి బుజ్జగించి సన్నసేసి
రివ్వనఁజుట్టరికము రేఁచెఁగా తాను" 29-396

**రివ్వలు :** రెమ్మలు.
"రవ్వలైనా నాయఁగాని రాఁపైనా నైతిఁగాని
రివ్వల నీ మోవితేనె రేఁచవద్దా ఇందుకు"
27-184

**రివ్వలుగా :** క్రి.విశ. అధికంగా. (వ్య.)
"మువ్వంక నీ రాజసము మున్నిటివంటిదా
నేఁడు
రివ్వలుగా సతు లెల్ల రేఁచిరి నీ గుణము"
11-509

"రివ్వలుగ నెందాఁక రేఁచేము నిన్నును"
11-102

## రు

**రుకుమిణి :** (21) వి. 'రుక్మిణి'కి జానపద వ్యవహారరూపం. రుక్మిణిలోని కకారం మీద ఉకారం ఆగమంగా చేరింది. రుక్మిణి అనే పదంకూడా రెండుచోట్ల మాత్రమే వాడ బడింది.
"గతి గూడి రుకిమిణి కాఁగిట పంజరములో
రతి మద్దు గురసేటి రాచిలుకా" 15-215

**రుక్మిణిదేవి :** వి. 'రుక్మిణిదేవి'కి జానపద వ్యవహారరూపం.
"వోడక రుక్మిణిదేవి నూరకే యెత్తుకవచ్చి
పాడితో నగ్రపూజకుఁ బాత్రుఁడ వైతివి" 15-211

**రుణము :** (6) వి. అప్పు. 'ఋణము' అనే శబ్దంలోని 'ఋ' వర్ణానికి బదులు 'రు' వర్ణం వాడబడింది. అన్నమయ్య 'ఋ' ఉన్న పదాలన్నింటినీ 'రు' తోనే ప్రయోగించినాడు. ఉదా: రుణం, రుషి.
"ఏమి సేసినా నీ రుణ మెట్టు వాసును" 1-474

**రుణస్తుఁడు :** వి. అప్పుల్లో ఉన్నవాడు. 'ఋణ' అనే పదం ఇట 'రుణ'గా వాడబడింది.
"యెపుడూ నీ ధర్మమున నిటు నీ రుణస్థుఁడనై
ప్రపన్నుఁడనై నేను బ్రదుకుటే కలది" 2-197

**రుణానుబంధపశుపత్ని :** 'ఋణానుబంధరూపేణ పశుపత్నీ సుతాలయాః' అనే సంస్కృత వాక్యానికి సంగ్రహరూపం. మానవుడు చేసుకున్న పుణ్యకర్మలను బట్టి అతనికి

పశుసంపద, భార్య, కుమారులు, గృహము కలుగుతా యని భావం.

"పయమేల తమకించీ పడఁతుల కొఱకుఁగా

బాయట రుణానుబంధ పశుపత్ని యనఁగా"

15-223

**రుణానుబంధము:** ఏదేనొక ఋణపు సంబంధం, ఏదో ఒక కారణసంబంధం.

"పుత్రదారధనధాన్యభూములు నమ్మితినా

పాత్రమగు రుణానుబంధములని" 2-422

**రుణోత్తారము:** వి. ఋణాన్ని దాటడం, ఋణాన్ని తొలగించుకోవడం.

"తరి యజ్ఞములు రుణోత్తార మయ్యేడికొరకు

సరిలేని దానములు జన్మములకొరకు" 1-34

**రుత్త:** (5) విణ. రిక్తము, వట్టి, రిత్త, శూన్యమైన, వశమని ఆం.ప.ని.

"ఒత్తి నారాయణనామ ముచ్చరించే నోరను

రుత్త యధరపుఁదోలు రుచి గొనేదా" 2-115

**రుత్తవోవు:** అ.క్రి. రిత్తపోవు, వ్యర్థమగు. బ్రౌను 'రుత్త' శబ్దాన్ని చూపి దానికి 'నాశము' అనే అర్థాన్ని ఇచ్చినాడు. ఈ ప్రయోగంలో 'రుత్తవోని' అనే దానికి అంతులేని, నాశంలేని అనే అర్థాలు కూడా సరిపడుతాయి.

"చిత్తమె చిమ్మరేగితే సిగ్గేమి యేమి

రుత్తవోని వేడుకలు రుచి గన్నవారికి" 10-2-66

**రువ్వ:** వి. దమ్మిడీ, ఐదుకాసుల నాణెం.

"రూకలై మాడలై రువ్వలై తిరిగేని

దాకొని వున్నచోటఁ దా నుండ దదివో" 1-458

**రుషి:** (6) వి. ముని. 'ఋషి' అనే పదంలోని 'ఋ' కు బదులుగా 'రు' వాడబడింది.

"మునులు రుషులకు నభయ

మొసఁగిన మూలమూరితి రాముఁడు" 2-178

## రూ

**రూఢి:** వి. 'రూఢి'కి వ్యవహారరూపం. 1.స్థైర్యం 2.నిశ్చయం 3.ప్రసిద్ధి 4.నిక్కల. (తె.వ్యు.కో.)

"రూపుఁజూపవే నీవు రొచ్చులుగఁ జేరి తొల్లె

రూపులెల్లా నద్దములో రూఢి నున్నవి" 7-208

## రె

**రెంట:** వి. ద్వైవిధ్యం, జత, రెండుగా ఉండే స్థితి.

"గొంటుఁజేతల(లు?) మనసు గొల్లకొన కేలుండు

రెంటలను విరహాగ్ని రేచ కేలుండు" 5-101

**రెంటదెప్పరము:** వి. ఎక్కువకష్టము.

"తలఁచుకోఁడు గాక తన లాగులు

రెంటదెప్పరాన ఇతవౌనా వలపు"

26-332 & 2-163

**రెంటెము:** (16) వి. జంటనేత వస్త్రం. 'రెంటము'నకు రూపాం. జమిలి నూలుబట్ట.

"చెమట రేఁగి రెంటెము చిప్పిలఁదడిసెనంటా"

7-373

"చెక్కు చేతఁ బెట్టఁగానె చిగురు బాణమాయె

గక్కన నీ రెంటె మింతి గప్పుకొనెను" 27-466

**రెంటికిఁ గొరగాని రేవని కత:** వి. (రేవఁడు = చాకలివాడు) చాకలివాడొకడు రేవున గుడ్డ లుదుకుతూ కొన్నింటిని గట్టుపై ఆరవేసి కొన్నింటిని ఉతుకుతూ ఉన్నాడు. ఇంతలో పెద్దగాలి వీచి గట్టుపై గుడ్డలు లేచిపోతూ ఉన్నాయి. చాకలి వాటికోసం పరుగెత్తి సగందూరం పోయేలోపుగా నదిలోని నీ రుబికి బండ దరినున్న గుడ్డలు మునిగిపోతున్నాయి. వెంటనే వాడు వాటి దాపునకు పోతూండగా వెంటనే గాలి మరింత తీవ్రంగా సాగటంవల్ల వాడు వాటిని వదలి గట్టుపైకి పరుగెత్తినాడు. పరుగెత్తేలోగానే గాలికి గుడ్డలు లేచిపోయినాయి. నది పొంగడంవల్ల ఉదుకాల్సిన గుడ్డలు నీటిలో మునిగి పోయినాయి. వాడు రెంటికీ చెడి నిట్టూర్చినాడు. అటునిటు కాక ఉభయభ్రష్టుడైనాడని అర్థం.

"రెంటికినిఁ గొరగాని రేవని కత గా కిట్టి

సొంటులు సోదించి నీవు చూచుకో వో జీవుఁడా"

15-93

**రెంటికిని గాని వీరిడి:** ప.బం; వి. రెంటికి చెడిన రేవడి. ఉభయ భ్రష్టమైన మూర్ఖుడు.

"మంటఁజేసిన బొమ్మ మనికి సంసారంబు
రెంటికిని గాని పీరిడి కొలువు బ్రదుకు" 1-104

రెండు నొకటగు: అ.క్రి. ఏకీభావమందు.
"రెండు నొకటి గాని రచన ప్రియము లేటికి"
5-55

రెంబు: స.క్రి. రాల్చు, కోయు, దూయు.
నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.

రెక్కలగుఱ్ఱము: వి. గరుత్మంతుడు.
"దిక్కులు సాధించి తన దేవుల నందఁబెట్టుక
రెక్కలగుఱ్ఱముపై పేరెము దోలీని" 9-160

రెక్కలచక్రము: వి. చక్రవాకపక్షి. (రెక్కలున్న
చక్రము, రెక్కలున్న చక్రవాకపక్షి)
"ఒక్క చక్రమె నీ కున్నది గాని యింతి
రెండు చక్రాలె పో రెండుగుబ్బలు" 5-71

రెక్కలపిట్ట: వి. చక్రవాకపక్షి.
"చిక్కని వెన్నెల లేల చిమ్మి కలియఁబెట్టేవే
రెక్కలపిట్టల నేల రేచఁజొచ్చేవే" 28-158

రెట్టి: వి. ద్విగుణం, రెండవ పర్యాయం.
(మణుగు, గుణం)
"పట్టి ప్రహ్లాదు బాధలు పాపిన దేవుఁడితఁడు
రెట్టిగా వేదము లుద్ధరించె నితఁడు" 3-195

## రే

రేక: (5) వి. రేఖ, గీత.
"గారవపు నీ మేన గస్తురి రేకలవిగో
తేరకొన వంకలెల్లా దిద్దుకొనరాదా" 11-158

రేకలుదీయు: (?)
"రేకలు దీయిమనేవు రీతిగా నీ బుజముల
కాకుసేసేదాననుఁ గాను సుమ్మీ నిన్నును"
23-122

రేఖరేఖపందెము: (?)
"రేఖరేఖ పందెమా" 6-13

రేతిటనుండి: రాత్రినుండి.
"కాతరాన బువ్వానకు గక్కనఁబెట్టరె మీరు
రేతిటనుండియు వేగిరించేరు వీరు" 16-295

రేతిరి: (8) వి. 'రాత్రి'కి వికృతిరూపం.
"ఈ రీతి నిందరి చిత్త మేకమైనందుకు గురి
మేరతో సూర్యోదయము మించి రేతిరయ్యీనా"
2-467

రేపకాడ: 'రేపకడ'కు వ్యవహారికరూపం.
ప్రాతఃకాలం.
"రేపకాడ రచ్చసేసి రేతిరి యీపె దగ్గరి
చేపట్టితి వింతలో నీ చిత్తమింతే యింకను"
21-259 & 13-219

రేపట: పగటిపూట, మరుసటిదినం.
"మది రేపట కాకుంటే మాపట వచ్చేవుగాక
కదిసి యిప్పుడు యేమి కక్కురితా" 21-503

రేపల్లెవాడలో పాలమ్ము: ప.బం; అ.క్రి.
అనవసరమైన పనికి పూనుకొను.
"భ్రమసి రేపల్లెవాడఁ బా లమ్మితే సరకొనా
ప్రమదాన నీకు మొక్కి బ్రదుకుట గాకా"
15-156

రేపుమాపను: ప.బం; అ.క్రి. అనిర్దిష్టమగు
గడువుపెట్టు.
"సమ్మతించిన వాఁడైతే చనవిచ్చి కూడుఁగాక
కమ్మటి రేపుమాపని గడువేటికే"

రేపుమాపు: (9) వి; ప.బం. రాత్రింబవళ్లు (రేపు=
పగలు, మాపు = రాత్రి) ఉదయం-
సాయంకాలం, ఎల్లప్పుడు.
"రేసులదానఁగాను రేపుమాపును నీకు
సేసపెట్టి పెండ్లాడిన చిన్నదాన నేను" 19-231
"బాపు బాపు మెచ్చితినే పడఁతి నిన్ను
రేపుమాపు నితనినే మరిగించుకొంటిని" 26-238

రేవంతుఁడు: వి. గుఱ్ఱపురౌతు.
"దిట్టయిన మనసనేటి తేజిగుఱ్ఱమునకు
వొట్టిన రేవంతుఁడ వుపమింప నీవు" 15-137

రేవు: వి. రొట్టె తినడానికి నంజుడు
ఉపయోగించు కొనే పచ్చడి వగైరాలుంచుకొనే
స్థలం కావచ్చునని సంపాదకుల ఊహ. (24-
132 f.n.)

"ఏ దాయ నేమి రొట్టె కింత రేవే కాదా
దాదాత మోచెబని తానే నేఁగానా" 24-132
"రొట్టెకును రేవేది రుచిగొనుటే గాక" 7-270

**రేవులు రేవులుగా చూచు :** ప.బం; అ.క్రి. కన్నార్పకుండా చూచు.
"రెప్పలణఁచినదాఁకా రేవులు రేవులుగాను
అప్పటిఁ దప్పక నన్ను అదేల చూచేవే" 22-83

**రేసు :** (8) వి. 1. ఈర్ష్య 2. చులకన.
"ఎప్పుడు మానవు కోప మేమే నీవు
రెప్పలెత్తి చూచితేనే రేసు పుట్టీనా" 14-226

**రేసుతిమ్మట :** వి; బహు. అదేవిధంగా భ్రమించుట, వ్యర్థ భ్రమణము.
"రెక్కలు గల పక్షికి రేసుతిమ్మటలే కాని
చక్క వైకుంఠానకెగయ సత్తువ లేదు" 2-89

**రేసులది :** (రేసులు + అది) వి. ఈర్ష్య గలది, చులకనది.
"రేసులదానఁగాను రేపును మాపును నీకు
సేసవెట్టి పెండ్లాడిన చిన్నదాన నేను" 19-231

**రేసులాడు :** ప.బం; అ.క్రి. ఈర్ష్య చూపు.
"కొప్పువట్టి తియ్యఁగాను కొమ్మ నీ చేయివట్టి
రెప్పలెత్తి జంకించి రేసులాడేవు" 23-202

**రేసులెక్కించు :** అ.క్రి. ఈర్ష్యకలిగించు, చులకనచేయు.
"ఓసి పోపో నీకు నేమె వుండఁబట్టదా
వాసులు రేసులెక్కించి వాదుకువచ్చేవా"
11-307

**రేసువడు :** (2) (రేసు + పడు) ఈర్ష్యపడు, చులకనపడు.
"రెప్పలెత్తి చూచితేనే రేసువడె నా మనసు"
9-244

**రేసువెన్నెల :** వి. పొగరువెన్నెల.
"రేసువెన్నెల యెండ కోరిచెఁగా నా తనువు
ఆసల నా ప్రాణవిభుఁడాతనిఁ బాసి" 9-52

## రొ

**రొండి :** వి. నడుము పార్శ్వభాగం, తుంటి, పార్శ్వభాగాన ఉండే బిట్టమడత.
"సిరుల రొండ్ల నీవు చేతులు వెట్టుక యిట్టే
వెరవు విచారించేవు విఠ్ఠలేశ్వరా" 13-244

**రొంపికంబము :** ప.బం; వి. అస్థిరం
"నిన్నుఁ గైకొనరాదు నెలఁతఁ బొమ్మనరాదు
అన్నిటా రొంపికంబమై నీ వున్నాఁడవు"
16-129 old
"రొంపి కంబము వంటిది రొక్కమైన నీ నిజము"
16-254

**రొంపిలోని కంబము :** (4) ప.బం; వి. అస్థిరం. బురదలోని కంబము స్థిరంగా నిలువదు కదా!
"రిత్తకు రిత్తయి యీ రెంటి నడుమను జిక్కి
కత్తరపు రొంపిలోని కంబమైతి గాక" 4-44

**రొక్కము :** నిర్బంధము.
"రొక్కమైన (నా) పొందులు రోకటఁబాడిరిగా
దిక్కులు నిండెఁగా నీవు తెలియ కుండినను"
10-2-33

**రొచ్చు :** వి. (1. అడుసు 2. నుచ్చు 3. మాలిన్యం 4.తూము కాల్వలవెంట పారే మురికిబంద) 5.అపవాదం (6.పశువుల మూత్రంలో ఏర్పడ్డ బురద.)
"బలువాఁడవయ్యా భామల రొచ్చు కోర్చితివి
పలువై యెందరిపాలఁ బరగె నీ మేను" 18-593

**రొచ్చులుసేయు :** ప.బం; స.క్రి. కల్మషభూయిష్ఠం చేయు.
"ఏపున శ్రీవేంకటేశ యిట్టె నన్నుఁగూడితివి
రూపించేవు నే నిన్ను రొచ్చులు సేయుదునా"
23-514

**రొమ్ముచోటు :** వి. వక్షస్థలం.
"కైదండ పట్టేనంటా కంకణము గట్టెనే
జూదాలాడేనంటా రొమ్ముచోటు గీరెనే" 18-18

**రొమ్మునఁగుంపటి :** (2) ప.బం; వి. బాధాకరం.
"సమ్మతిగాఁబెనఁగితే సతిఁబాయకుండుఁగాక

రొమ్ముకనఁగుంపటియైతే రుచి పుట్టునా"
17-241

**రొయ్యకొవ్వు:** ప.బం; వి. లేనిది, వ్యర్థం.
"వొల్లనె సంసారములో నూరకె గర్వించేవు
చెల్లఁబో రొయ్య కొవ్వేలె జీవుఁడా" 10-1-14

## రో

**రోఁటు:** (?)
"ఏఁటిదే మా వలపు యింతా నీదే వలపు
రోఁటితోఁ బదియుఁ బది రొక్కమాయ వలపు"
27-390

**రోకటఁబాడు:** స.క్రి. దంపుడుపాటగా పాడు, సువ్విపాటగా పాడు.
"రొక్కమైన నా పొందులు రోకటఁబాడిరిగా
దిక్కులు నిండెఁగా నీవు తెలియకుండినను"
10-2-33

**రోకలికైదువవాఁడు:** వి. రోకలి ఆయుధంగా గల బలరాముడు.
"రోకలికైదువవాఁడు రోలఁగట్టువడ్డవాఁడు"
6-154

**రోసును:** క్రి.ప. 'రోయును' అనే రూపానికి వ్యావహారికరూపం.
"హేయమేమీ లేదు జగమింతా రుచికరమే
మాయావికారమిది మనసెట్టి రోసునో" 4-473

## ఱ

**ఱట్టడి:** వి. అల్లరిచేసేవాడు.
"ఱట్టడివి నిన్నాపె యాఱడిసేయనోపునా
పట్టినవ్రతముతోడి బలిమే కాక" 8-146

**ఱట్టు:** వి. అల్లరి.
"అసల నీ తమకమే అంత ఱట్టుగాఁజేసె
యేస చూపులను మిమ్ముఁ నేమిచూచేవయ్యా"
14-146

**ఱట్టు వొలకమ్మ కెక్కు:** ప.బం; అ.క్రి. (?)
"వద్దు వద్దు మాఁటలనే వలపుల యేరు వారి
మద్దులు మాఱేళ్లు మోఁచె మానరాదా యిఁకను"
20-233

## ఱా

**ఱాఁగ:** వి. ధూర్తస్త్రీ.

**ఱాతిగుండె:** వి; ప.బం. కఠినమైన హృదయం.
"ఱాతిగుండెతోఁ దనకు ఱట్టొకటే దక్కెఁగాక
యీతల నే నాఁటదాన నె ట్టోరిచేనే" 13-241

**ఱాతిగుండెది:** (ఱాతిగుండె+అది) వి.కఠిన హృదయురాలు.
"ఱట్టయి మీతగవు దిద్ద ఱాతిగుండెదానను గాను
వట్టి యానలేల నాకుఁబెట్టేరు మీరు" 27-192

**ఱాతిగుండెవాఁడు:** వి. కఠినహృదయుడు, దయాదాక్షిణ్యాదులు లేనివాడు.
"ఱట్టడివి మిగులాను ఱాతిగుండెవాఁడవు
పట్టిపట్టి చూచి యేల భ్రమసేవయ్యా" 14-175

**ఱాతిచన్నులు:** వి. కఠినమైన స్తనాలు.
"చేతి జిగురువంటిది రేకలు నీ మేన నివే
ఱాతిచన్నుల నెట్టొత్తి జాఱుసేసేవే" 8-231

**ఱాతిమనసు:** వి; ప.బం. కఠినమైన మనస్సు.
"ఆతఁడు బాగాలిచ్చి ఆకుమడిచియ్యఁ జూచి
ఱాతిమనసా రమణీ ఱట్టు నీ కిదేమే" 16-282

**ఱాలు దింటా మలిగండ్లేరు :** (2) ప.బం; అ.క్రి. కంబళిలో తింటూ వెంట్రుక లేరు వంటిది.
"ఱాలు దింటా మలిగండ్లాఱిడి రాసి గానేరము
తేలుచ శ్రీహరి నీవే దిక్కొట గాక" 10-61

## ఱే

**ఱేసు:** వి. (?)
"ఱెప్పలు రిచ్చవడె మీ ఱేసులెల్లాఁ జూచి
చూచి" 11-133
"ఱెప్పలెత్తి చూచితేనే ఱేసు పుట్టె నిదె నీకు
దుప్పటికొంగు వట్టితే దూరకుండేవా" 9-143

## ల

**లంకెఁబెట్టు:** స.క్రి. తగుల్కొనజేయు.
"యెంచరాని తిరువేంకటేశుఁగూడి యాతని

లంచపుఁ గౌఁగిటితావి లంకెఁబెట్టె నిపుడు"
5-205

**లంకె**: వి. తగులము, జోడి.
"కుంకుమ చెమటబొట్లు కురిసె నీడ నెల్లాను
లంకెలైన నీ చెక్కుల లాగులా వోయి" 11-112

**లంకెపాటు**: (2) వి. తగులుపాటు, తగులం, బంధం.
"పొంతల మీ రిద్దరును పొంది యెడయకుండితే
బంతినే వాసన లంకెపాటు లాఁబోయినపుడే"
21-530

**లంకెలవిందులు**: వి; బహు. వరుసవిందులు.
"జంకెనల కారాలు చవుల షాకములు
లంకెలవిందులు వెట్టీ లలన నీకు" 8-166

**లంకెల విను**: వ.బం. స.క్రి. అధికంగా విను.
"వేంకటగిరిపై విభుని పుణ్యకథ
లంకెల వినని యన్యులము" 1-241

**లంగించు**: 'లంఘించు'కు వ్యావహారికరూపం.
"లాసేటి లాగులును లంగించే యెగరులు
వేసేటి గంతులెవ్వరే వీది వీదులా" 16-180

**లంచపుసంసారము**: వి. లంచాలతో కూడిన సంసారం.
"పంచేంద్రియములనే బాడిగె మోచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి" 4-227

**లంజకాఁడు**: (3) (లంజ + కాఁడు) విటుడు.
"లంపుగుబ్బ గొల్లెతల లంజకాఁడ నీ
యింపులే వెదకంబట్టీ నెట్లరా వోరి" 6-125
"లంజకాఁడవౌదువు నీ లాగులెల్లఁ గానవచ్చె
ముంజేతఁబెట్టిన సొమ్ముల కద్దమేలరా" 5-84

**లంజగొడవ**: వి. నీచమైన గొడవ. (?)
"బడిబడి తల్లిదండ్రి పగటుండఁగా లంజ
గొడవలకుఁ బెనఁగే కూళలు గలరుగా" 11-181

**లంజెవారు**: వి. బహు. వ్యభిచారులు. 5-84

**లండఁడు**: వి. కుత్సితుఁడు, వ్యర్థుడు
"లాగులు చూచినవారు లండఁడందురు"
19-567

**లండుఁజేతలు**: వి; బహు. (?)
"కాకుసేసే చేతలూ కతకారి చేతలూ
లాకల సిగ్గుమీరిన లండుఁ జేతలు" 13-391

**లండుగా**: క్రి.విణ. కుత్సితంగా, మొండిగా.
"సెలవుల నిన్ను నవ్వి చేయి మాటు సేసుకొని
లలి నీకు నెత్తించీ లండుగా ఇది" 27-488

**లంపటపడు**: అ.క్రి. శ్రమపడు.
"లంపటపడని మేలు లవలేశమే చాలు" 1-114

**లంపు**: వి. (?) మేత?
"లంపు గుబ్బగొల్లెతల లంజకాఁడ" 6-125

**లకిమమ్మ**: (17) (లకిమి+అమ్మ) 'లక్ష్మమ్మ'కు వ్యావహారిక రూపం.
"లకిమమ్మ కేమైనా లంచము లిమ్మనరో
శుకవాణి తలుపు మూసుకు తియ్యదు" 5-81

**లక్కపూత కపురులు**: వ.బం; వి; బహు. అశాశ్వతాలు. 1-189

**లక్కపూస కపురులు**: అస్థిరములు. లక్కపూసల శోభలు స్థిరంగా ఉండవు కదా!
"లలనల జవ్వనాలు లక్కపూసకపురులు
నెలకొని సేసే బత్తి నీటిపై వ్రాత" 2-268

**లక్కముద్ర**: వి. లక్కతో వేసే ముద్ర.
"పండువంటి మోవి కేలే పచ్చిలక్కముద్ర లివి
పండిన పంటకే కావా బలుముద్రలు" 7-38

**లక్కవంటి మనసు**: (3) వి. త్వరగా కరిగన మనస్సు.
"లక్కవంటి దీ మనసు చొక్కు వంటిది వలపు"
18-347

**లక్కిమమ్మ**: (2) (లక్కిమి + అమ్మ) 'లక్ష్మమ్మ'కు వ్యావహారికరూపం.
"పొలసి విఱ్ఱవీగేవు పురుషోత్తముఁడ నంటా
పొలిసి లక్కిమమ్మ నీ వురమెక్కి వుండఁగా"
16-31

**లక్ష్మిదేవి పండుగ**: వి. వరలక్ష్మి వ్రతం.
"పచ్చిగా లక్ష్మిదేవిపండుగలు సేసె నిదె

యిచ్చకుఁడ శ్రీవేంకటేశ నిన్నుఁగూడెనూ" 11-184

**లక్ష్మిమండపము:** వి. దిగువ తిరుపతిలోని మండపం. క్రీ.శ 1494 కు పూర్వమే నిర్మితమైన వసంతమండపం కావచ్చు. తిరుపతి గోవిందరాజస్వామి ఆలయంలో లక్ష్మీదేవి మంటపమని వేరొకటి ఉన్నది. కాని అన్నమాచార్యుడు పేర్కొన్నది అది అగునో కాదో! ఏలన ఆ మంటపము క్రీ.శ. 1537 తరువాతనే నిర్మితమైనదని చారిత్రికుల భావన అని వేటూరి ఆనందమూర్తిగారు పేర్కొన్నారు. (సం.వా., పద. 242 పు.)

"లలితపు గోవిందుఁడు లక్ష్మిమండపమందున్న
వలరాజదివో కొలువఁగ వచ్చెను" 7-445

**లగినము:** వి. 'లగ్నము'నకు జానపద వ్యవహారరూపం. ముహూర్తం.

"మంతనపుఁగాఁగిటికి మంచి లగినము వచ్చె
బంతిఁబులకల శాన పైఁ జల్లవే" 29-444

**లగ్గము:** వి. 'లగ్నము'నకు జానపద వ్యవహారరూపం. పెండ్లి, ముహూర్తం.

"అప్పుడు నే నెంత గబ్బి ననవద్దు
తప్పేదు లగ్గము నీపైఁ దగిలింతుఁ జామ్మి" 17-420

**లగ్గము వెట్టుకొను:** అ.క్రి. వివాహముహూర్తం నిర్ణయించుకొను.

"లలి నిన్నుఁబెండ్లాడ లగ్గమువెట్టుకుండఁగ
బలిసి యేమి వినేవు వూరఁగతలు" 22-306

**లగ్గవెట్టు:** స.క్రి. ముట్టడించు. (పద.)

"దాకొని నీ చిత్తమెల్ల దక్కఁగొంటేఁ గొంటిఁగాక
వాకల నీపెనపులు లగ్గవెట్టినా" 17-364

**లగ్గస్తుఁడు:** వి. 'లగ్నస్థుడు'కు వికృతిరూపం. లగ్నమైనవాడు, స్వాధీనమైనవాడు, నమ్మకస్థుడు, అవమానస్థుడువంటి శబ్దం.

"దీమనపుటాసలకు తీరని లగ్గస్థుఁడను
యీ మరఁగువాఁడ నిన్ను నెట్టు గొలిచేనయ్యా" 2-480

"లలిఁజిత్త మింద్రియముల లగ్గస్థుఁడూ
తొలఁగఁదోయఁగ నేది దొరతనమూ" 15-62

**లచ్చన:** (11) వి. గుర్తు, లక్షణం, అచ్చతికిన పడుగుమీద కొలతను బట్టి వేసిన గుర్తు. రూపాం. లాంచన.

"పచ్చిమోవితేనె లాని పలుమారుఁ దనియరు
లచ్చనై వొకమాఁటే పులకలు రేఁగె" 7-441

"కందువగు నీ మేను కాఁగిలించఁగానే నా మై
చందముగ నీ మేని లచ్చన లంటెను" 8-163

"ముచ్చట నామనికాలమునఁ బండిన పంటకు
లచ్చనలు వేయరా యీ లాగుల నెవ్వరును" 13-490

**లచ్చనగుఱుతు:** గుఱుతు అనే అర్థంలో జంటపదం.

"పచ్చగా నీ మోవిమీఁదఁ బల్లుమోపఁగలఁగాక
లచ్చనగుఱుతు మాన్ప లాగుల నా వశమా" 9-60

**లచ్చించు:** (2) 'లక్షించు'కు తద్భవం. చూచు.

"ఎచ్చరికగాఁ జాదాన లచ్చించరాదా" 18-411

**లచ్చిగొండి:** (లచ్చి+గొండి) వి. ధనవంతుడు, ధనవంతురాలు. 'లచ్చిగొండి' లోని 'లచ్చి' అనే పదానికి లక్ష్మి, సంపద అని అర్థం. కనుక 'లచ్చిగొండి' అనే పదానికి ధనవంతుడు అనే అర్థం చూపబడింది. ఆనందమూర్తిగారు దీనికి అహంకారం కలది, దుడుకుతనం కలది అనే అర్థాలను సూచించినారు. (సం.వా.పద., భాషా. 470 పు.) వాచ్యార్థమైన ధనవంతు(డు)రాలు అనే దానికి పై అర్థాలు లక్ష్యార్థాలుగా భావించవచ్చును. అహంకారానికి, దుడుకుతనానికి, ధనం కలిగిఉండడం కూడా కారణమే కదా!

"లచ్చిగొండి నీవంటి నెలఁతనా నేను యింత
పెచ్చుపెరిగే వదేమె పిన్నదానవా" 6-105

**లచ్చిగొండితనము:** వి. ధనవంతురాలితనం, అహంకారం కలిగి ఉండడం. చూ: లచ్చిగొండి.

"లచ్చిగొండితనముల లాగవేగకాఁడపు

విచ్చనవిడి తగులు విరికాఁడవు" 19-17

**లచ్చిమమ్మ :** (లచ్చిమి + అమ్మ) 'లక్ష్మమ్మ'కు జానపద వ్యవహారం.

"సేసవెట్టి లచ్చిమమ్మ చెంగటనే వుండగాను

ఆసపడే వెవ్వరికో అప్పటి నీవు" 21-282

**లచ్చెన :** వి. గుర్తు, లచ్చనము.

"బచ్చెనలు కుచయుగముపై నతని మృగమదము

లచ్చెనలు కొనగోళ్ల లాంచనములు" 5-184

**లచ్చెనవెట్టు :** గుర్తుపెట్టు. (వ్య.)

"గక్కన వేరొకతెకుఁ గాఁగిలి నీ వియ్యకుండా

లెక్కల లచ్చనవెట్టే లీల సుమీ విభుఁడ" 9-135

**లతలమంజిష్టి :** వి. (?)

"దంతియానకు సింహాలఁ దగ్గ్రవాసిన చీ రేలే

చెంతలనే లతల మంజిష్టిగాక" 17-427

**లప్ప :** (9) వి. రాశి, ముద్ద.

"కదిమి యాపె నోరిలోఁ గప్రపులప్ప వెట్టేవు

అదనఁబనులు గొనేయట్టి నిబ్బరాననను"

23-319

**లప్పలుగట్టు :** ప.బం; అ.క్రి. రాసులగు.

"గందానఁ బూసినపూఁత కడఁగి లప్పలుగట్టి

యిందుముఖి లలమేల్మంగ కింపులాయను"

7-144

**లయకాఁడు :** వి. మోసగాడు.

"ప్రియముతో మంచమెక్కి పిలువని పేరంటము

లయకాఁడు గదవే తొలఁగు బావఁగారు"

11-355

**లయకాఁడు :** (లయ + కాఁడు) వి. మోసగాడు.

"ప్రియముతో మంచమెక్కి పిలువని పేరంటము

లయకాఁడు గదవే తొలఁగు బావఁగారు"

11-355

**లయపడు :** ప.బం; అ.క్రి. లయమగు, నశించు.

"చేగల నింద్రియములలోఁ దిరిగిన

చిత్తవికారము లయపడదు" 2-137

**లలాటశూన్యపు చూపు :** వి. ఏమతమునకూ చెందకపోవుట.

"కొందతేమియును లేదు కొట్టఁగొన లయమని

అంది వట్టి లలాటశూన్యము చూపిరి" 2-270

**లలాటశూన్యము :** వి.శూన్యమైన లలాటము. శూన్యలలాట మనటం యుక్తం. సమాసం విలక్షణం.

"కొందరేమియును లేదు కొట్టఁగొన లయమని

అంది వట్టి లలాటశూన్యము చూపిరి" 2-270

**లలి :** క్రమం, ప్రేమ, ఉత్సాహం, విలాసం.

"లలి భోగమతనితో లంకెసేసిన వెనక

చెలిమి సేయక మరవఁజెల్లు నటవే" 28-54

"లలి మోవి పిప్పిసేసీ లావణ్యమెఱఁగడు

అలరి తానాడినదే ఆట యనవే" 26-249

**లవలవలు :** పెనుగులాటలు, పొకులాటలు, భంగపాట్లు. భేదము లని ఆం.ప.ని. 344 పు.

"లంపటాలెఱఁగము లవలవలెఱగము

పంపుల బాల్యమే పరిణామము" 2-465

**లవలేశము :** (2) వి. 'కొద్ది' అనేఅర్థంలో వాడబడే జంటపదం. లవం అన్నా లేశం అన్నా ఒకే అర్థం.

"చవియూఁ దీరదు చలమూఁ బాయదు

లవలేశమైన నొల్లకపోదు" 1-124

## లా

**లాఁచు :** (9) స.క్రి. కోరు, పొందు, పెనఁగులాడు, లాగిపట్టు. కవియు, పొంచు. (శ.ర.)

"అలమేలుమంగపతివైన శ్రీవేంకటేశ్వర

లలి నీవద్ద నే నుంటే లాఁచీఁదాను నీకును"

22-325

"చేచేత శ్రీవేంకటేశ చేకొని నన్నేలితివి

లాఁచి మెచ్చినట్లా వొల్లఁగె మెచ్చరాదు" 26-480

**లాఁతు :** (3) విణ. మిక్కిలి, అధికం. వి. మిక్కిలివెక్కసం.

"యీతల శ్రీవేంకటేశ యెనసితివి

లాతాయ మన్ననలు లలనకును" 23-246
"ఏతులకు నాకు మడిచిప్పించుకొంటి విందాకా
లాతుగా నిది గొంత లాభమే కాదా!" 21-129

**లాక:** (4) అంకురం.
"లాకల నీ రతులకు లాచుట గాదా" 22-198
"కాకుసేసీ చేతలూ కతకారి చేతలూ
లాకల సిగ్గు మీరిన లండుఁజేతలు" 13-391
"ఈకె యెంత చనవరో యేకతాన నింతేసెసి
లాకలుగా వారు నవ్వి లలి నొక్కటై" 21-141

**లాగవేగకాఁడు:** వి. లాఘవమూ, వేగమూ కలవాడు.
"లచ్చిగొండితనముల లాగవేగకాఁడవు
విచ్చనవిడి తగులు విరికాఁడవు" 19-17

**లాగవేగాలు:** వి; బహు. సులువు-వేగము. లాగ లాఘవ శబ్దభవం. వేగానికి లాఘవం కారణమూ కావచ్చు. అప్పుడు ద్వంద్వం పొసగదని సం.ప.స. (19.12 పు.) అన్నమయ్య సమాసనిర్మాణంలో కూడా స్వతంత్రుడని భావిస్తే ద్వంద్వసమాసాన్ని సమర్థించుకోవచ్చు.
"యిచ్చగించి శ్రీవేంకటేశ! నన్నుఁగూడితివి
లచ్చనలే గురుతాయ లాగవేగా లేలా" 7-511
"ఆడనుండే లాగవేగా లాడవద్దు
యీడనే నీ కాఁగిలి నా కిప్పుడే యిమ్మా"
24-590

**లాడిఁబడు:** అ.క్రి. బలియగు, వశమగు.
10-2-27
"పంచేంద్రియములనే బాడిగె మోచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి" 4-227

**లాడి:** వి. బలి, పెద్దపుండు.
"పంచేంద్రియములనే బాడిగె మోచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి" 4-227

**లాబగాఁడు:** (లాబము + కాఁడు) వి. లాభం పొందినవాడు.
"ఈ కొలఁదివాఁడవా నీ వింత లాబగాఁడవా
కాకుగా నా పచ్చడమే కప్పుకుమీ నాకును"
16-222

**లాబము:** వి. 'లాభము' నకు వికృతిరూపం.
"మూసుకొనేవేమి నేడు మొగవాడ విందరిలో
దోసమా నీ కందుకేమి తొలుసారి లాబము"
7-515

**లాయము:** వి. అశ్వశాల.
"యీయెడ శ్రీవేంకటేశ యిటు నన్నుఁగూడితివి
లాయపుటింతుల పౌఁజులను గూర్చవయ్య"
8-276

**లాయు:** ఉద్రేకించు, విజృంభించు.
"మోసపోక తమలోన మొగములు చూచుకోఁగా
లాసిలాసి నీ వెంత వలపు చల్లేవే" 29-14

**లాల:** వి. నీరు. బాలభాషలోనే దీనికి ప్రయోగం. లాలాజలం.
"కత్తులు నూరీ కఠినపుఁ గోరటు
కొత్తనురుగులటుఁ గురిసీ లాలల" 28-33

**లావరి:** (లావు + అరి) బలవంతుడు.
"మావంటివారికెల్లా మాటలో నయ్యేవా
లావరుల కైతేఁగాక లాలనకు మెత్తువా" 21-338

**లావరితనము:** (లావు+అరి+తనము) బలంకలిగి ఉండడం.
"లాలించి శ్రీవేంకటేశ లలన నిన్నుఁ గలసె
నీ లావరితనానకు నేరుచునా యీకె" 25-262

**లావుకొను:** (లావు + కొను) అ.క్రి. అతిశయించు.
"అంకురించినట్టి తలఁపు లధికమయిన చెలిమి
లంకెలయిన యాసలెల్లా లావుకొన్న చెలిమి"
1-29

## లి

**లింగముమీఁది యెలుక:** ప.బం; వి. విశ్వాసానికి భంగం కలిగించి బాధ కలిగించేది.
"కలకాలమునకు లింగముమీఁది యెలుకరై
తలకొనియె నాత్మపరితాపము" 1-321

**లిక్కి:** వి. చిన్నకొడవలి.

"పెక్కగు నమృతము పెదవి కోమలికి
లిక్కిగఁ జేసితి లేవయ్యా" 6-151

**లియ్యము:** వి. స్నేహం, ఒద్దిక, ఐక్యం, మిక్కిలి కలిసినది, లీనం.
"నెయ్యమలర మంచి విరులశయ్య వేంకటాద్రి విభుఁడు
లియ్యమైన చెలికి చనవు లియ్యఁ దొణగెనే" 5-315

## లూ

**లూటిఁబెట్టు:** ఉపద్రవం కల్పించు, దుడుకుతనం ప్రదర్శించు. బ్రౌన్: లూటీ = దుడుకు, ఔద్ధత్యం, misbehaviour లూటీ, లుటానా అనే తురుష్కపదానికి దోపిడిచేయు అని అర్థం. దోపిడిచేయడమే దుడుకుతనం చూపడం. ఇది తురుష్కపదమనియే భావించవచ్చునని ఆ.మూ.
"లోకములోపల లూటిబెట్టు-ఇది
కైకొనిన హరి యెరఁగవుగా నీవు" 4 అను. 22

**లూటిసేయు:** స.క్రి. దోపిడీచేయు.
"రమణఁ గంపాదియసురలు లూటిసేయఁగాఁగా
తమిఁ గృష్ణావతార మిందరికైతివి" 2-160

## లె

**లెక్కలువెట్టు:** (లెక్కలు + పెట్టు) గణించు.
"లేవే యెందాఁకాను లెక్కలువెట్టేవు
ఆవటించి పైకొంటే నాయములు రేఁగును"
21-331

**లెక్కసేయు:** (2) (లెక్క + చేయు) లక్ష్యపెట్టు, లెక్కపెట్టు.
"లేవే నే బిలిచితే లెక్కసేసీనా తాను
చావి వోయ వుమి నాకి చవుతమా ఇక(?)"
26-61

## లే

**లేఁతచందురులు:** వి; బహు. సన్నని నక్షత్రాలు.
"చన్నులపై నీవు లేఁతచందురుల నించితివి
కన్నులమెచ్చితినోయి గండికోట కేశవా"
18-367

**లేక:** (29) వి. 'లేఖ'కు వికృతి రూపం.
"దాకొన్న మోవిగంటి తానే చూచుకొమ్మనవే
లేకలు ముంజూరు నిండె లెక్కించుకొమ్మనవే"
(19-477)
"యెదుటికి వచ్చి వీడె మిప్పించుకొ మ్మనరాదా
పదిమారులు లేకలు పంప నేటికి"

**లేటి:** వి. ఆడుజింక, మగజింక.
"నవ్వుల నుండిన లేటిఁ దప్పక చూచితిఁగాక
రవ్వల నంటఁగాఁ బరారైతినా" 17-335

**లేసు:** వి. సులభము, చులుకన(శ.ర.) లేత, మృదువైన (వ్యు.)
"లేసులు నీ గుణాలెన్ని లెక్కవెట్టేమయ్యా"
22-404
"ఆసపడ్డ సతితో మాటాడితే దోసము గాదు
లేసుపెదవులు గదలించవయ్యా" 12-309

## లొ

**లొల్లి:** వి. అల్లరి, గోల.
"ఇల్లిదె శ్రీవేంకటేశ యింతి నీకుఁ జెప్పించె
లొల్లిఁ గూడితివిఁకను లోన నుండరాదా" 7-399
"చల్లలమ్మే చోట నెల్ల జాణతనాలాడి యాడి
లొల్లిగా నీ పోఁగులకు లోనయితిమి" 20-484

## లో

**లోఁచు:** (4) స.క్రి. 'లోఁగు'కు ప్రేరణార్థకం.
1. వెనుదీసేట్లు చేయు, సంకోచింప జేయు
2. అణగించు 3. అడకువ కలవానినిగా చేయు
4. చొచ్చునట్లు చేయు 5. జంకునట్లు చేయు
6. లోపల పోవునట్లు చేయు 7. కుంగునట్లు చేయు 8. వశమగునట్లు చేయు.
"లోకములో నెవ్వతైనా లోఁచి మాటాడఁగాను
పైకొననివానికి పంతమేది" 9-172
"మమ్ము నేల లోఁచేవు మర్మా లేల రేఁచేవు
కమ్మర మాపై నేల కాలు చాఁచేవు" 26-336

**లోకదిమ్మరి:** ప.బం; వి. ప్రపంచమంతా తిరిగేవాడు.
"తీరుపడ్డపెను లోకదిమ్మరివి నీకు నేను
ఆరితేరి నేఁడు నీకు నాల నెట్టితిరా" 7-10

**లోకదొంగ:** వి. లోకంలో ప్రసిద్ధుడైన దొంగ, గజదొంగ. (?)
"లోనివారి మొఱఁగేటి లోకదొంగవు" 6-55

**లోకబండఁడు:** వి; ప.బం. ప్రపంచంలోని అజ్ఞుడు.
"యోనిగతుఁడనై పుట్టి యోనికి మగ్నుఁడనైతి
పూని లోకబండఁడనే బుద్ధితీఁగి" 15-13

**లోకలోడి మాట:** ప.బం; వి. పైమాట (లోకానికి ఓడి అంటే జనప్రభావానికి లోబడి అని అర్థం. వ్యు.)
"లోకలోడి మాట గాదు లోను వెలి నొక్కటే
ఆకె నీడకె తేవయ్య నవ్వుఁగాము లెంచను"
11-68

**లోభించు:** అ.క్రి. లోభంకలిగి ఉండు.
"నేమమున లోభించితి నీ మంత్ర
మన్యులకియ్య" 2-215

**లోలాయము:** వి. శ్రమ, బడలిక.
"అట్టె పరువు దోలిన ఆసలనే గుఱ్ఱముల
గట్టిగ లోలాయమునఁ గట్టుకోరాదా" 3-217

## వ

**వంకగాలము:** వి. వంకరగా ఉండే గాలము.
"కుత్తికె మరుశంఖము కురులు వంకగాలాలు
కొత్త నీకు నాకుఁ బొందు గూడు నటవే" 9-81

**వంకచందురులు:** వి; బహు. నఖక్షతాలు, గోరొత్తులు. వంకరగా ఉండే చంద్రుని ఆకారంలో ఉండేవని వ్యుత్పత్తి.
"వంకచందురుల చెక్కు వన్నెకాఁడా
కొంకక కూడె నిన్నాపె కోడెకాఁడా" 23-471

**వంకలచంద్రులు:** వి; బహు. నఖక్షతాలు.
"వంకలచంద్రుల నించి వాడివెట్టఁగాక నీకు
కంకిగా రతులలో ఘాత సేసునా" 8-112

**వంకలాడు:** (2) (వంకలు+ఆడు) అ.క్రి.లోపాలు పేర్కొను.
"వంకలాడవద్దు గాని వంతుల సవతులలోన
కొంకు లేక నీ పాదాన కోరి చిమ్మరా" 23-409

**వంకలొత్తు:** (3) అ.క్రి. తప్పులుపట్టు (వ్యు.), వంకలుతీర్చు, చక్కగాచేయు (పద.)
"యీడనే శ్రీవేంకటేశ యిటు నన్ను నేలితివి
వోడక నీకు వంక లొత్తదాయను" 13-360

**వంగళము:** వి. 'వంగడము' నకు రూపాం.
"ఇంతేపో యెడమాఁటలిఁక నేఁటికి తా
నంతే వంగళమైతే నంతకంటె నేను" 24-81

**వంగుడు:** వి. బొట్లు రాలడం, చినుకులు పడడం. (బ్రౌన్. వంగుడు = బొట్లు రాలడం)
"వరుస వానకంటే వంగుడే ఘనము"

**వంగులిచ్చు:** నమస్కరించు. (?)
"రంగగు శ్రీవేంకటాద్రిరామునిదేవి కిచ్చితి
వంగులియ్యక మొక్కంత హనుమంతా" 2-249

**వంచాడించు:** (వంచి+ఆడించు) అ.క్రి. అదుపులో ఉంచు, బెదిరించు, విహ్వలించు, దాక్షిణ్యంతో చూచు.

**వంచెన:** (2) వి. 'వంచన'కు వ్యావహారికరూపం.
"యెంచుకొంటే తన బత్తి యెందైనా
నాకుఁగలదు
వంచెనతో మొక్కె మరవకుమనవే" 29-154
"వంచెన మొక్కులనుండు వాడికైన తరితీపు
నించిన నేర్పుల నుండు నెలకొన్న సిరులు"
28-243

**వంటలేని కూడు:** వి. అమృతం. 5-297

**వంటసాల:** వి. 'వంటశాల'కు వ్యావహారికరూపం.
"వాలిన రాజసముతో వంటసాలలోననే
మేలిమిఁ గూచున్న దలమేలుమంగ" 14-370

**వండదగినకూర:** వి. ముక్కలు ముక్కలుగా ఉండేది.
"ఫుండగిలి నరకాల నుడుక బోయెడ మింక
వండఁదగిన కూరవలె నాయ బతుకు" 1-90

**వండదగిన కూరవలె అగు :** ప.బం; అ.క్రి. ముక్కలు ముక్కలు అగు, సిద్ధంగా ఉండు.
"వుండగిలి నరకాల నుడుకబోయెద మింక
వండదగినకూరవలె నాయ బతుకు" 1-90

**వండవండనట్లుగా :** ప.బం; క్రి.విశ. పకపకమని. అర్థమింకను విచార్యమని పద.
"వండవండనట్లుగా వారిజూచి నవ్వేవు
యెండలెల్లా నీడ లాయె నింక నేటి మాటలు"
17-117

**వండీవండని కూడు :** వి; ప.బం. పూర్తిగా ఉడుకని అన్నం.
"రెండు విడువలేక రతులు వేరే యయితే
వండీవండని కూడువలె నవు మనసూ" 15-117

**వండు :** వి. బురద.
"కారణాన నప్పటిసీఁ గలిగేనా నదీ మరి
తేరిన నీళ్ల వండుదేరి నట్లవును" 2-29

**వంతు :** (6) 1. భాగం 2. వరుస 3. సామ్యం 4. పోటీ.
"వంతుకు మాటలాడితే వాఁడివోయనా యేమి
చింతదీరఁ జెవిలోనే చెప్పిచూపేఁగాక" 25-473

**వంతుకుఁజెప్పు :** (7)
"చింతించి చింతించి శ్రీవేంకటేశ్వరు
వంతుకుఁ జెప్పిన హరివాక్యమే యెక్కుడు"
4-188

**వంతుకు వంతు :** ప.బం; వి. సరికి సరి.
"ఇంతి సేసిన మేలు కిదియా నీవు
వంతుకు వంతే వైపోఁగాక" 26-189

**వంతుకువాసికి :** (2) ప.బం; వాసికి వన్నెకు, ప్రసిద్ధికి.
"అంతటనే వచ్చి కాచు నాపద్బాంధవుఁడు హరి
వంతుకు వాసికి నతనివాఁడ నంటేఁ జాలు"
4-201

**వంతుపెట్టు :** ప.బం; అ.క్రి. వంతుతెచ్చు, పోటీపెట్టు.

**వంతుల సతులు :** వి; బహు. పోటీలు పడు సతులు, పంతాల సతులు.
"వంకలాడవద్దు గాని వంతుల సతులలోన
కొంకులేక నీ పాదాన కోరి చిమ్మరా" 23-409

**వంతులు వాసులు :** (5) వి; ప.బం; బహు. వన్నెలు వాసులు, గొప్పలు.
"దొంతులాయఁ గూరిములు దూరులాయ
నేరములు
వంతులు వాసులు నింక వద్దనవే" 9-109
"వంతులకు వాసులకు వలపులు చల్లి
అంత నిన్ను దూరేటి యాటదాన చల్లనా"
11-484

**వంతువరుసలది :** (వంతువరుసలు + అది) వి. వావివరుసలది.
"వంతువరుసలదాన వలచి వుండినదాన
యెంత విరహాన నున్నా నే మాయను" 8-161

**వంతువరుసలవారు :** వి; బహు. వావివరుసలవారు.
"వంతువరుసలవారు వాకిటఁ గాచుకుండఁగా
దొంతివెట్టీ నవ్వులెల్లా దొరతన మెట్టిదో"
21-185

**వంతువరుసలు :** ప.బం; వి; బహు. వావివరుసలు.
"వంతువరుసలు గాక వద్దఁ గాచుకుందానవు
యెంతలేదు నీ మాపోదమేమి చెప్పేదే" 18-457

**వంతువాసి :** ప.బం. వన్నెవాసి.
"అంత హితులా తనకు నన్నలుఁదమ్ములును
వంతువాసికిఁ బెనఁగువారే కాక" 1-179

**వంతువాసికెక్కు :** ప.బం; అ.క్రి. ప్రసిద్ధికెక్కు
"వంతువాసికెక్కఁగా నా వగ పొకచోటనైన
సంతమైన నాయకుఁడ చాలదా నా జన్మము"
11-255

**వంతువాసులు :** (14) ప.బం; వి; బహు. తమతమ వంతులప్రకారం తృప్తిమంతులు కాని వర్తకసంస్థలు కాని ప్రభుత్వానికి చెల్లించే ద్రవ్యవిభాగం అని వ్యు.
"వంతు వాసులడుగను వచ్చి వచ్చి యలుగను
వింతగా నీ మేనెల్లా వినుచుండేము" 16-223

**వందడి :** వి. (?)

"పరంగ నీరు వందడి (?) పారే నీరువలె

సిరులవెంటఁ బారీనా చిత్తవికారాలు" 15-194

**వందన :** వి. నమస్కారం, స్తుతి.

"పందెమాడఁ బిలిచితే పచ్చిసేసి నన్నుఁగూడే

వందనతోఁ దన్ను ముట్టవస్తినా నేను" 20-225

**వందు :** (4) వి. ఈ పదం క్రియారూపంగానే కాని విశేష్య రూపంగా నిఘంటువుల్లో కానరాదు. క్రియారూపంగా దీనికి దుఃఖపడు, పరితపించు అనే అర్థాలున్నాయి. సంతాపం (?) దుఃఖం, గ్లానత, వివర్ణత అనే అర్థాలు చెప్పవచ్చు.

"కందువ వెంకటపతి కౌఁగిటి పరవశాన

వందు లేక పండి క్రైవాలెనో యనంగా" 6-124

"సందడించి యిన్నిటా నీ చైతన్యమై

యుండఁగాను

వందు లేక నేఁగొన్ని వాహనా లెక్కితిని" 1-427

**వంపెట్టు :** (వంపు + పెట్టు) ప.బం; స.క్రి. వంగెట్లు పెట్టు (తె.వ్యు.కో.) కాని ఇట సంపాదకులు సూచించినట్లుగ 'అరచుట' అనే అర్థమే సముచితం. దీని వికృతరూపమైన ఓపెట్టు అనేపదం ఈ అర్థంలో ఇప్పటికీ రా.సీ.లో వ్యవహారంలో ఉందట.

"ధరణి వంపెట్టుఁ బ్రతిధ్వనులు

మిన్నులుముట్టు

శిరసెత్తి నలి నరసింహదేవుఁడు" 2-228

**వంబు :** వి. 'వమ్ము'కు రూపాం. కావచ్చు. వ్యర్థత. (వంబు – త.)

"వంబు లేక అందుకె పో వైపుగ మాధవుఁడనే

పంబిన పేరు ధరించె" 9-281

**వక్కణించు :** స.క్రి. 'వక్కాణించు'కు రూపాం. చెప్పు, వివరించు.

"అంటిన నీ తలఁపు లేమని వక్కణింతు నేను

నంటున నీ కూటమికి నమ్మి కాచుకున్నది"

12-79

**వక్కు :** అ.క్రి. కృశించు, బక్కటిల్లు.

"యెక్కువ తమకపుటింతులఁ బొందక

వక్కుచు వాడే వయసేలా" 1-216

**వగకాఁడు :** (వగ + కాఁడు) వి. ప్రియుడు, విలాసవంతుడు, వన్నెకాఁడు.

"కైకోలు వేగిరకాఁడ కందువుల వగకాఁడ

చేకొని నీ చెప్పినట్టు సేసేమయ్యా" 11-57

**వగరించు :** అ.క్రి. వగర్చు, నిట్టూర్చు. వంచనపు మాటలాడు ఆం.ధా.పా.

"ఎంత లేదు చిత్తమా, ఈఁతలేల మోతలేల

పంతులకుఁ బారనేల, వగరించనేల" 4-426

**వగ్గరించు :** అ.క్రి. 'వగరించు'కు రూపాంతరమా? నిట్టూర్చు.

"వొగ్గిన రతులలోన వూరకైనా వలపులు

వగ్గరించి చవిగొనేవారు గలరా"

**వజ్రపంజరము :** ప.బం; వి. గట్టిరక్షణ నిచ్చేది.

"కావలెనన్నవారికి ఘనమనోరథమవు

వావిరిఁ బూజించువారికి వజ్రపంజరమవు"

3-508 & 2-101

**వజ్రాంగి :** వి. వజ్రమయమైన కవచం, అంగీ, చొక్కా. ఈ పదం నేటికీ పశ్చిమాంధ్రలో రోజూ వినబడే మాట అని పద.

"సందడి నాతనిపై మచ్చము సోదించేదానవు

తుందుడుకేల వజ్రాంగి దొడుగఁగ వలదా"

17-186

**వజ్రాంగిజోడు :** వి. వజ్రమయమైన కవచం, రక్షణ.

"పంచామృతములు నీ పాదతీర్థము మేనికి

పంచముద్ర లదే వజ్రాంగిజోడు" 3-393

**వజ్రాలబిల్ల :** వి. ఆభరణవిశేషం.

"పెనుగొప్పుపై వజ్రాలబిల్లలు మెరవఁగాను

మినుకుఁగమ్మలకాంతి మించఁగాను" 22-212

**వజ్రాలబొట్టు :** వి. ఆభరణవిశేషం. (?)

"సుదతి వజ్రాలబొట్టు సూర్యోదయమై

వుండఁగా

యెదుటఁగను మెఱుఁగు లెండఁగాయఁగా"

12-444

**వటర:** వి. వదరుబోతు, వాచాలుడు, సమర్థుడు, నేర్పరి. (వ్యు.)
"సేసపాలు రాలఁగానే చెప్పరాని బాసలిచ్చీ
యీ సుద్దుల వటరతో నే మందునే" 27-566
"వటరవై చంచలవాణి నాఁబరగు" అని పరమ.
(268 పు.)

**వట్టఁగట్టు:** అ.క్రి; ప.బం. ఇంకిపోవు. వి. బ్రహ్మచర్యం (వట్టన్ + కట్టు = వట్టగట్టు అని పద విభాగమేమో! లేకున్న అరసున్న చింత్యం. 1.సం. పీఠిక 38 పుట) విణ. 1.రిక్తం 2.ప్రయోజనం లేనిది 3.శుష్కం 4.కారణం లేనిది 5.పాలుడిగినది.
"ధృతిహీనులకు నెల్ల దిక్కయి గాతువుగాక
వ్రతము చెల్లిన నింక వట్టఁగట్లా" 1-280

**వట్టవెట్టు:** స.క్రి. తక్కువ చేయు, న్యూనపరచు.
"చనవు లొకతె కిచ్చి చలము రేఁచె వొకతె
వనితకు వనితలు వట్ట వెట్టేరా" 21-145

**వట్టిజోలి:** వి. ఖాళీసంచి, వట్టి సంబంధం.
"చెంది నీతో సిగ్గుతోడి చేరువ నిలుచున్నది
యెందాఁకా వట్టి జోలియిఁక నానతీవయ్యా"
8-29

**వట్టిమాకు లిగురించు:** ప.బం. అద్భుతం జరుగు.
"వట్టి మాకు లిగిరించు వనిత నీమాట వింటే
నెట్టన ఆదివృద్ధి గుణములు నీకు నీకే వలదా"
8-5

**వట్టిమాకు లివురుపెట్టుట:** ప.బం; అ.క్రి. పనికి రానివి ఫలవంతమగుట.
3-99, 541 ఆ.భా. 3-3

**వట్టుపోవు:** (వట్టు + పోవు) ప.బం; అ.క్రి. ఎండిపోవు, ఇంకిపోవు.
"గుట్టున జడియరు కొంకుచు మొరయరు
వట్టువోరు తమ వలపులకు" 9-214

**వడఁబడు:** (4) అ.క్రి. వేడిచెందు, శ్రమచెందు.
"నడుమ రెంటికిని నా మేను
వడఁబడె యొందలివాఁడనొ నేను" 3-342
"వడఁబడి పరులిండ్ల వాకిలిగా చేసెను
వడి నాలో హరియున్న వాకిలి గాచేను"
"నడుమ రెంటికిని నా మేను
వడఁబడె యొందలి వాఁడనొ నేను" 3-342
సంబంధపడు:
"చీచీ వో బదుకా సిగ్గులేని బదుకా,
వాచవికి బతిమాలి వడఁబడ్డ బదుకా"
1-467 & 9-53

**వడఁబెట్టు:** స.క్రి. శ్రమ కలిగించు, వేడి కలిగించు.
"బడిబడి నీడుగాని పనులకే పెనఁగేవు
వడఁబెట్టి సటకాఁడ వచ్చేవో రావో" 9-84

**వడ:** వి. 1.వేడిగాలి 2.వేడిమి 3.పరితాపం 4.హిమం 5.దప్పి 6.శ్రమ, బడలిక 7.ఆకలిబాధ. విణ. ఉష్ణం, వేడి అయినది.
"నీడల చూపులు నీకేలే యీ
వాడక వాడెడి వడ నీకేలే" 6-66

**వడగండ్ల గుడి:** వి; ప.బం. అస్థిరం. వడగండ్లతో నిర్మించిన గుడి అస్థిరమే కదా!
"పడఁతుల వేడుకలు పచ్చివడగండ్ల గుళ్లు"
2-268

**వడచల్లు చూపుకాఁడు:** వి. చల్లనిచూపులు గలవాడు. (వ్యు.)
"కడు ముత్యపుం బేరులె కట్టబెట్టి మెడనిండ
వడచల్లు చూపుకాఁడ వచ్చేవో రావో" 4-106

**వడచల్లు మేను:** వి. చల్లటి శరీరం.

**వడదాఁకు:** ప.బం; అ.క్రి. వేడిగాలి సోకు, ఎండదెబ్బ తగులు. (వ్యు.)
"వెన్నెలబాయిట నీవు వెలఁదిఁదలఁచుకొని
పన్నెకాఁడ విరహాన వడఁదాకేవు" 7-146

**వడదీరు:** అ.క్రి. దప్పితీరు. 4-164

**వడదేరు:** (వడ + తేరు) అ.క్రి. శ్రమనుండి తేరుకొను, వాడిపోవు, తాపం తొలఁగు.
"కడు విరహినై నిన్నుఁ గన్నులఁ జూచేమంటేను
వడదేరి కొలువు చావడి నుందువు" 7-22

**వడిఁబడు:** అ.క్రి. మెలిబడు.
"ఆసల శ్రీవేంకటేశ అంగన నిట్టె కూడితి
వాసితోడ సరసము వడిఁబడదు" 21-284

**వడిఁబెట్టు:** వి. 'వడి'కి వేగమని సామాన్యార్థం. కాని ఇట మెలిబెట్టు అని అర్థం.
"నీమాట మీరేనా నీవేనేఁ గానా
వాములాయ వలపులు వడిఁబెట్టకింకను" 12-19

**వడిగొను:** ప.బం; అ.క్రి. వేగం కలుగు, త్వరపడు, వడియు, కారు, స్రవించు. (వ్యు.)
"అడఁకువలు మోదములు అలుక దీరినదాఁక
వడిగొన్న కోరికలు వలసినందాఁకా" 17-517

**వడియించు:** స.క్రి. కార్చు, స్రవింపజేయు.
"తొడతొడ మోయఁగాలు దొక్కి శ్రీవేంకటేశ్వర
వడియించేవు చెమట వనితదేహమున" 17-217

**వడియు:** (7) అ.క్రి. కారు, స్రవించు.
"వలచిన వలపులు వడియుచుఁ జెక్కులను
జలజలఁ జెమటలై జడివట్టె నదివో" 7-379

**వడియు:** స.క్రి. వడియఁజేయు, కార్చు.
"అడువఁడా నేలతో నలిమి శకటాసురుని
వడువఁడా నెత్తురులు వసుధ కరినునిని" 1-126

**వడివడు:** ఒడంబడు, సంబంధపడు. 12-264

**వడివెట్టు:** (వడి+పెట్టు) మెలిపెట్టు, నులుము, వస్త్రగాళితం పట్టు.
"వాములైన వలపులు వడివెట్టవచ్చునా
ప్రేమముతో తానే వచ్చి పెండ్లాడీఁగాక" 12-472

**వడ్డికిఁబారు:** (2) ప.బం; అ.క్రి. ఎక్కువగు, వర్ధిల్లు. (వ్యు.)
"వనితల తలఁపులు వడ్డికిఁబారీ నీమీఁద
యెనయు నెక్కడనైనా యేదుగాను సతుల"
7-95

**వడ్డిరెచ్చుకొను:** పెంపొందించుకొను.
"వలనైన చిరునవ్వు వడ్డి రెచ్చుకొనేవటే
వెలయు నీ వెంత నవ్వించినా వగవు" 12-136

**వడ్డివారు:** (8) ప.బం; అ.క్రి. అధికమగు. (వ్యు.)
"వడ్డివారె శిగ్గుతోడి వనితను వానిఁదెచ్చి
జిడ్డుదేర నవ్వించేవు చీచీ నీవు"
11-74 & 1-198

**వత్తలూరి కేశవుఁడు:** వి. కడపజిల్లా పుల్లంపేట మండలం లోని నేటి బత్తలూరే వత్తలూరు. ఇక్కడ కృష్ణదేవాలయ ముండేది. ఈ స్వామిని కేశవుడని అన్నమయ్య కీర్తించినాడు.
"వత్తలూరికేశవా వన్నె లీడ జేసేవా
బత్తిగలవాఁడ వాదు పట్టకువయ్యా" 22-106

**వత్తికి నూనెకుఁగొలది:** వి; ప.బం. అతికష్టంమీద జరుగుబాటు జరగటం.
"హత్తిన పుణ్యము బాపము నప్పటి
సుఖములకొఱకే
వత్తికి నూనెకుఁ గొలదై వడిఁజనె దివసములు"
1-176

**వత్తికి నూనెకు ఒక్కవరుస యగు:** ప.బం; అ.క్రి. అతికష్టం మీద జరుగుబాటు జరుగుతున్నదనే సందర్భంలో వాడబడే పలుకుబడి.
"వత్తికి నూనెకు నొక్క వరుసాయ
హత్తి నీవే సేసవెట్టీ తల్లనాఁడే నీకు" 14-324

**వత్తికి నూనెకు కొలఁది యగు:** ప.బం; అ.క్రి. ఒకదాని కొకటి సరిపడు.
"హత్తిన పుణ్యము బాపము నప్పటి
సుఖములకొఱకే
వత్తికి నూనెకుఁ గొలఁదై వడిఁజనె దివసములు"
1-176

**వత్తిలోపలి నూనె:** ప.బం; వి. అస్థిరం, అంతర్లీనంగా ఉండేది.
"వత్తిలోపలి నూనెవంటి దీ జీవనము
విత్తుమీఁదటి పొల్లు విధము దేహంబు" 1-328

**వదర:** వి. ఇది 'వదరు' కావచ్చు. వదరు అంటే సొరకాయ. (వదరుకాయ = సొరకాయ)
"ఓడ విడిచి వదర వూరకేల పట్టేవు
గోడ గడుగ నడుసే కురసే వో మనసా" 3-196

**వదరు[1]:** వి. దంభవచనం, (డంబం) వ్యర్థవచనం, ఉపయోగం లేని మాట, ప్రేలుడు, ప్రలాపం.

"అదన నెదుటనె అత్తమామ లున్నవారు
వదరు లింతేలంటా వారైనఁ దిట్టరా" 11-283

వదరు²: వి. సొరకాయ.
"జలధి దాఁటేవాఁడు సరి నోడ వుండఁగా
వలవని జాలితో వదరు వట్టేదా" 3-456

వదరుఁదనము: (వదరు + తనము) వి. ఎక్కువగా మాట్లాడటం.
"చదురులాడి యాతఁడు సారెకు నేరుతునంటా
వదరుఁదనములనె వాదించెనె" 8-260

వదరుమాటలు: వి; బహు. ప్రలాపాలు, మాయమాటలు, అర్థంలేని మాటలు.
"అదనఁ బార్వతీదేవి కతఁడే నీ మంత్రమిచ్చె
వదరుమాటల మాయావచనా లేమిటికి" 3-493

వద్దివారు: వి; బహు. దగ్గరివారు.
"చెలరేఁగి యాతఁడొపె చేతికి లోనై వుండఁగా
వలవని వాదులేలే వద్దివారికి" 12-374

వననిధిఁగురిసిన వాన: ప.బం; వి. నిష్ప్రయోజనం. సముద్రంలో కురిసిన వానవల్ల ప్రయోజనం లేదు కదా!
"వననిధి గురిసిన వాన లివి మతి
పనిలేని పనుల భారములు" 1-24

వనభోజనాలు: (2) వి; బహు. కార్తికమాసంలో శ్రవణా నక్షత్రం నాడు తోటల్లోకి వెళ్లి బంధుమిత్రులతో కలిసి భోజనాలు చేసే ఉత్సవం. దీనికి ఉల్లాసయాత్రోత్సవం అని కూడా పేరు.
"పొలయుచు నేడు వనభోజనాలు సేయఁగాను
అలమి పొత్తులనుండి ఆరగించీఁదాను" 26-227

వనితె: (2) వి. 'వనిత'కు వ్యావహారికరూపం. 'వనిత' లోని అకారం ఎకారం కావడం కన్నడ ప్రభావంవల్ల కావచ్చు.
"మంచివాఁడవె నీవు మంకువనితెను నేను
యెంచి మాతోఁగూడి నీవు యెడ్డవైతివి" 27-436

వన్నెకాఁడు: (4) (వన్నె + కాఁడు) వి. అందగాడు, సౌందర్యవంతుడు, విలాసవంతుడు.
"ని న్నిటనుండి తన్ను నిందలాడితి ననీని
వన్నెకాఁడేమి సేసినా వట్టి వెరపేఁటికే" 26-528

వన్నెకుఁదెచ్చు: ప.బం; స.క్రి. ప్రతిష్ఠకు తెచ్చు, సామర్థ్యం మెరుగుపరచు.
"అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్మంగను నేను
వన్నెకుఁ దెచ్చుకో మాట వహికెక్కినపుడు"
8-93

వన్నెచెడు: ప.బం; అ.క్రి. పేరుపోవు, కళతప్పు.
"వాసి విడిచితిమి నీ వారమైతిమి
మమ్ము వన్నె చెడనీకు వో కర్మమా" 1-284

వన్నెపదాలు: వి; బహు. ప్రసిద్ధినీ, కీర్తినీ వర్ణించే పదాలు.
"జీవునికిని దండె వేసినవాఁడవు నీవు
వావాతిమాటలే నీపై వన్నెపదాలు" 3-467

వన్నెలు వాసులు: వి; ప.బం; బహు. ప్రకాశమూ దాని విలువా; లక్షణయా 'కీర్తిప్రతిష్ఠలు' అని కూడా.
"వన్నెలాను వాసులాను వలపు నీపైఁ జల్లఁగా
ఇన్నిటా సంతోసము లింకఁ జెప్పనేల" 26-441
"వన్నెలు వాసులతోడ వడి బతికేవారము
నిన్ను వలెనా నేము నిలవయ్యా" 11-142

వమ్ము: విణ. నిరర్థకం వి. నాశం.
"వమ్ముదొలి మాటలనే వాఁడి వసులనే నన్ను
కుమ్ముచుఁబ్రాణముల నిట్టె కొన దొరకొంటివి"
5-119

వయసువాఁడు: (వయసు + వాఁడు) వి. యువకుడు, పడుచువాడు.
"అనుక వయసువాఁడ వందుకుఁ దో డివిఁయైతే
మోనమున సతులెల్ల మోహించకుందురా"
7-518

వయ్యాళి: వి. విహారం, స్వారి. తమిళంలో ఈ పదానికి గుర్రాలు తిరిగే చోటని అర్థమట.
"నీటున వయ్యాళివోయి నీవు రాగా నది చెలి
కోటకొమ్మ నొరగుండి గొబ్బునఁజూచీ" 9-277
"అంది నీకుఁగావఁబో నావులమంద గలదు

కుంది వయ్యాళికి రాతి గుఱ్ఱము గద్దు" 7-219

**వయ్యాళిపోవు:** అ.క్రి. వాహ్యాళికి పోవు, విహారానికై పోవు.

"నీటున వయ్యాళిపోయి నీవు రాఁగా నది చెలి కోటకొమ్మ నొరగుండి గొబ్బునఁజూచి" 9-277

**వరతఁబోవు:** ప.బం; అ.క్రి. ప్రవాహంలో పడిపోవు. 4-49

**వరతఁగలపు చింతపండు:** (3) ప.బం. వ్యర్థం, నిష్ప్రయోజనం. ప్రవాహంలో కలిపిన చింతపండు వ్యర్థమే కదా!

"వావిరిఁగేశవు నొల్లని బదుకులు
వరతఁగలపు చింతపండు" 2-235

**వరతఁగొట్టు:** ప.బం; స.క్రి. నశింపజేయు.

"కడుఁగోపపుభూతము కాయమెల్లా మఱపించె
వడి నజ్ఞానపుటేరు వరతఁగొట్టె" 3-65

**వరత వచ్చు:** ప.బం; అ.క్రి. విజృంభించు.

"వాటమై వరత వచ్చె వనితల కోరికలు
యీటువెట్టుకొన నేను యెవ్వరిఁబోలుదును"
14-121

**వరతిపాలగు:** ప.బం; వ్యర్థమగు. (వరద పాలగు అని వాచ్యార్థం)

"నిరతి రామునిచేత నిమిషము లోననే
వరములన్నియు నెందో వెరతి పాలాయ"
3-364

**వరదరాజులు:** వి. మదరాసు (చెన్నై) సమీపంలోని కంచి క్షేత్రంలో వెలసిన వరదరాజస్వామి.

"తేరువెంట వచ్చె వరదరాజులును
నరులార సేవించరే మన కోరికలు మీర"

**వరదహస్తము:** వి. వరాలను ప్రసాదించే హస్తం.

"వరదహస్తమున వలచేయి వట్టుక
అరుదుగ విను మాఁటాడించినది" 20-6

**వరవాత:** (3) 'వఱువాత'కు వ్యావహారికరూపం. ఉదయాన.

"యెరవు లేక విభుఁడు యేమీ ననఁజాలఁడు
వరవాత నీకనైనా వచ్చేవో రావో" 27-161

**వరిగురుము:** వరిగింజ, వరిబీజం, వరివిత్తు.

"చుట్టి వరిగురుమతో జొన్నగింజ సరిదూఁగు
తెట్టలై మేలొకటికి పీలొకటాయ" 3-14

**వరుసదినములు:** (2) వి. వంతు వచ్చే దినములు.

"మోనాన వరుసదినములు యెంచుకొమ్మనవే
తా నిఁక నాపై దయదలఁచుమని యనవే"
28-525

**వరుసవంతు(లు):** (12) ప.బం. వాసివంతు(లు), వన్నె-వాసి.

"వరుసవంతులు చూపి వసపరతువు గాక
తెరదీసి మరియేల తిలకించేవే" 22-427

"వరుసకంతడిగితే వలపించనేరవలె"
29 అను. 10

**వర్తన:** వి. ఆయా పనుల్లో ఇంతింత ఇవ్వడం అనే కట్టుబాటు, మామూలు. ఈ అర్థంలో ఇది వ్యావహారికం. (f.n. 22-376) ( నడవడి, జీవనం. శ.ర.)

"వాసితో శ్రీవేంకటేశ వలపు వర్తన గొనె
యీ సరి నన్నేలితివి యీకె నీకు సబ్బైను"
22-376

**వలఁబడు:** ప.బం; అ.క్రి. మోసపడు. 22-376

**వలఁబెట్టు:** ప.బం; స.క్రి. మోసంచేయు, (వ్యు.) వంచించి వశంచేసుకొను. (పద.)

"కద్దురా నీ సుద్దులు కడఁగడల వింటిమి
వద్దురా యింతేల మమ్ము వలఁబెట్టేవు
వాసితో నుండినవారిని వలఁబెట్టవలెనా"
11-587

"వాలుగన్నులచేత వలలఁబెట్టుటె కాక" అని నిరంకు. ప్రయోగం.

**వలగొను:** స.క్రి. చుట్టుకొను, పరివేష్టించు.

"సులభానఁ గలరు సొరిది దేవతలు
వలగొను పాపము వారించలేరు" 4-215

**వలచేయి:** వి. కుడిచేయి.

"వరదహస్తమున వలచేయి పట్టుక
అరుదుగ నిను మాటాడించినది" 20-61

**వలతి:** 1. వశము, అధీనము 2. నేర్పరి 3. అనుకూలము 4. చోటు.
"వనిత కాగిలి నీకు వలపుల వలతౌను
తనిసి చేపట్టితే తమ్మిపూజలే" 14-403

**వలపక్షము:** (2) వి. పక్షపాతం.
"మగవారయినవారు మగరీతి నుంటఁగాక
పగటులు మించి వలపక్షాలకు వత్తురా" 13-538

**వలపల:** వి. కుడివైపు.
"వలపల దాపలాను వడిగాఁ గొసరె నిన్ను
చెలియ విన్నపములు చెవిసోఁకెనా" 25-241

**వలపుకాఁడు:** (వలపు+కాఁడు) వి. కాముకుడు, ప్రియుడు.
"చొల్లెపుఁజుట్లే నీకుఁజుట్టుఁబట్టె నింత వడి
వల్లడి వలపుకాఁడ వచ్చేవో రావో" 6-106

**వలపుమడుగు:** వి. ప్రేమసరస్సు.
"నెమ్మి యమునలో నీఁద నేరిచినవాఁడు నాతో
ఇమ్ముల వలపుమడు గీఁదఁగలఁడా" 26-78

**వలపుల కత:** వి. ప్రేమకథ.
"గారవించి వలపుల కతలు చెప్పేవు
నేరుపు గలిగినావె నీ వద్దనే వుండఁగాను"
23-370

**వల(సి)సీ నొల్లములు:** (4) వి; బహు. అనిష్టములు.
"వలపు నా కాయ నీకు వలసీనొల్లములాయ
మలకల బొంకు లేఁక మానవయ్యా" 21-453

**వలరాచకాఁక:** వి. మన్మథతాపం.
"పొలఁతి దేహము మొదలఁబూఁదీగె కనక ఇదె
వలరాచకాఁకచే వాడఁబారీని" 24-1

**వలలఁబెట్టు:** ప.బం; స.క్రి. మోసంచేయు, వంచించి వశం చేసుకొను. (పద.) చూ: వలఁబెట్టు.
"వలచినవారి నింత వలలఁ బెట్టఁగఁబోతే
అలరి యెంతపకీర్తి యనరా లోకులు" 17-481
"వగలు బాఁతె వలలఁ బెట్టెడి తమ్ముఁ
దగిలించు మమత వేదనము సేయఁగా" 1-41
"వలపించి నన్నింత వలలఁబెట్టినందుకు
సొలయవద్దా అదీఁ జూడనైతిఁగాక" 16-25

**వలలోపలి నిడిపరువులు:** ప.బం; వి; బహు. అసంభవాలు.
"కలలోపలి సంభోగము ఘనమగు సంపద లిన్నియు
వలలోపలినిడిపరువులు వన్నెలవిభవములు"
2-133

**వలసీనొల్లని:** విణ. అంతగా ఇష్టపడని
"వలసీ నొల్లని సతి వద్ద నెంత నిలుచున్నా
తలఁపులో నీ కిట్టె దయ పుట్టీనా" 23-171

**వలుము:** వి. మోసం. (వ్యా.)
"వలుములు చన్నులంటా వాసుదేవుఁడా వట్టి
వళుకులఁ బెట్టకుమీ వాసుదేవుఁడా" 15-249

**వలువకాఁడు:** (వలువ + కాఁడు) గోపికల వస్త్రాలను అపహరించిన శ్రీకృష్ణుడు.
"పాము నాడించిన యట్టి బాలజోగి పిన్నవాఁడు
వాముల వెన్నలు దినే వలువకాఁడు" 24-112

**వలె:** (3) క్రి.రూ. 'వలయును' అనే రూపానికి వ్యావహారిక రూపం; కావలయును.
"మంచితనమే వలె మాటలాడే యప్పుడెల్లా"
3-158

**వల్ల:** వి. 1.నైపుణ్యం 2.అనుకూల్యం 3.యుక్తత 4.స్నేహం. (తె.వ్యు.కో.)
"వల్ల చూచి కామినుల వలపించేఁగాని
మొల్లమై నా మేను ముదిసిన దెరగ" 2-16

**వల్లడి:** వి. 1. తొందర 2. అకారణమైన ఆపద 3. కొల్ల. (తె.వ్యు.కో.)
"పల్లదాన నలిగితే బలిమి నీవు గూడేటి
వల్లడిరతి దలఁచి వడి లోలో నవ్వేను" 16-247

**వల్లె:** వి. పశువులను కట్టే పలుపు, కట్టుతాడు, తలుగు, ఉచ్చు, ఉత్తరీయం, పగ్గం.
"వల్లెవేసి కోడెలను వంచుకొనేయట్టి నీకు
చెల్లు నెంత నీవు చేత చేసినా కుమ్ము" 7-92

వల్లెతాడు: (3) వి. పశువులను కట్టే తాడు, పగ్గం.
"కోడెల వల్లెతాడై గొల్లెతలా తాఁ
గూడిపైకొన నుండెగోరి కొన్నాళ్లు" 5-94
వల్లెవేయు: స.క్రి. పగ్గంతో కట్టివేయు.
"బాలకృష్ణ బోయిఁడా పసుల వల్లెవేయరా
వాలుఁజూపుల మమ్మేల వల్లెవేసేవు"
11-346 & 7-92

వళకాడు: అ.క్రి. వణకు. (వ్యు.)
"శ్రీవేంకటేశుఁడే చిత్తగించి నన్నేలెఁగా
వావాత నింద్రియాలు వళకాఁడినా" 3-417
వళకాడు: ప.బం; అ.క్రి. వళకులాడు,
నిందలాడు.
"ఏఁటి మాటలాడేవే యెందాఁకా నీవు వోరి
హటముగ యిట్టే వట్టి వళకులాడరా" 7-23
వళకు: వి. 'వళుకు'కు రూపాం. (?) తగవు,
నింద, మోసం, భయం.
"యిందుకు నందుకుఁబోనీ
రిహలోకమందువారు
దిందుపడని వళకు తీరుచవయ్యా" 3-330
పైకొని శ్రీవేంకటేశు బంటుకు వళకు లేదు
సైకమైన హరిభక్తి సహజమింతే" 2-288
వళకులాడు: తడబాటు మాటలు పలుకు.
"ఏఁటి మాటలాడేవే యెందాకా నీవు వోరి
వాఁటముగ యిట్టే వట్టి వళకులాడకురా" 7-230
వళచుకొను: 'వలచుకొను'కు రూపాం.
"పలుమారు వచ్చీఁదానే పనిలేని పరాకు
వళచుకొన్నది తానే వట్టి భీతి" 3-225
వళావళి: వి. 1.కుతూహలం 2.విజృంభణం
3.కోలాహలం 4.చప్పుడు, ధ్వని (వ్యు.)
5.ఊరకమాట్లాడే వ్యర్థమైన మాటలు.
(ఆం.ప.కో.)
"ఎంత చన విచ్చితివి యీపెకు నీవు
వంతులకు వట్టి వళావళ్లు సేసీ నిపుడు" 7-174
వళుకు: వి. 1.మోసం 2.తగవు, కారణం లేని
తగవు, వివాదం (శ.ర.) 3.అపవాదం, నింద (?)
4.మిథ్యాభియోగం. (బ్రౌన్)
"వాకున వినయము వళుకులు చెంతల
సాకిరి రమణుఁడ సరికి సరి యాయ" 21-525
"వళుకు కోపనివాఁడు వచ్చి పూటవడనేల
వొలసినట్టు తనంత నుండరాదా" 10-1-30
వళుకువేయు: లగ్నంచేయు.
"వట్టి భక్తి నీ మీఁద వళుకువేసి నిన్నుఁ
బట్టితెచ్చి మతిలోనఁ బెట్టుకొంటిని" 3-49
వళుకుసేయు: లగ్నంచేయు. 3-49
వశగాదు: క్రి.ప. వశముగాదు, సాధ్యంకాదు.
చూ: వసగాదు.
"వాడిక నా కోరిక వశగాదు
వేడుకకు నెంతైనాను వెలలేదు" 18-97
వసంతకాఁడు: (వసంతము + కాఁడు) వి. (?)
"యింత యేలే నాతోఁగారింతలు నీవల్లనే పో
సంతమైతి నేలో వసంతకాఁడా" 24-217
వసంతపు నీళ్లగు: ప.బం; అ.క్రి. ఆనందమగు.
"జోడుగా మరియు నీ చూపులు నాపైఁ బారెనా
నీడలనే వసంతపునీళ్లాయ వలపు" 13-60
వసంతపునీళ్ళు: వి; బహు. వసంతోత్సవంలో
ఒకరిపై నొకరు చల్లుకొనే రంగునీరు, పసుపు-
సున్నం కలిపిన ఎఱ్ఱనీరు.
"జోడుగా మరియు నీ చూపులు నాపైఁ బారెనా
నీడలనే వసంతపు నీళ్లాయ వలపు" 13-60
వసంతపూర్ణిమ: వి. చైత్రపూర్ణిమ
"వరుసతో సాసముఖా వసంతపూర్ణిమ నేఁడు
సిరుల యీ విభవాలు సేవించరో" 7-445
వసంతమాడు: స.క్రి. చల్లుకొను, అ.క్రి.
వసంతాలు చల్లుకొను.
వసంతము: వి. సంబరం, ఆనందం.
(లాక్షణికార్థం)
"వాడల వాడల వెంట వసంతము
జాడతోఁ జల్లేరు నీపై జాజర జాజర జాజ"
26-18

**వసకాఁడు :** (వసము + కాఁడు) వశంకలవాడు, అధీనంలో ఉన్నవాడు.
"రచ్చ రావికింద రంతులె చేసేవు
బచ్చనమాటల వసకాఁడ" 6-103

**వసగా :** క్రి.విణ. ఇది 'వసిగా' కావచ్చును. మిక్కిలిగా.
"వసగా నాసలలోన వడిఁబడ్డ నా మనసు
యెసఁగ మళ్లించవే న న్నేలిన గోవిందుఁడా"
3-437

**వసగాదు :** క్రి.ప. వశం కాదు, సాధ్యం కాదు.
"మందలించి వలపులు మట్టుపెట్టి వసగాదు"
25-154
"వెసఁ గర్మమొక వంక విజ్ఞానమొక వంక
వసగావు రెంటి బలవంతములు" 3-570
"వసగాని పెక్కు దేవతలఁ గొలుచుట కంటే
సుసరాన హరి వారై సుఖియించరో" 3-568

**వసము :** (9) 'వశము' నకు వికృతిరూపం. వశం, అదీనం, సాధ్యం.
"వసము గాక నీతో వాదు లడువఁగ లేదు
వస ఇంతే కలది నా పడఁతితనమున" 27-186

**వసవాడు :** (వాడు + వాడు) ప.బం; అ.క్రి. మిక్కిలి వాడు.
"మొగి విచ్చకుండే సిగ్గు మొలచి వసివాడదు
యిగిరించె నా వయసు యెటువలె దాఁటునె"
24-379

**వసి :** వి. ఆశ్రయం, ప్రాపు, కూచిగా చెక్కిన కొయ్య.
"వావాత నీ వనెటి వసి దవ్వి కైకొంటి
భూవిభుఁడు నీ పనెటి పురుషార్థము" 4-200

**వసివాడు :** (3) (వాడు + వాడు) ప.బం; వి. మిక్కిలి వాడిపోవుట.
"వత్తివలె మోవిమీఁది వసివాడు లేమిటికి
పొత్తుకు వచ్చి యాతనిఁబోదోసేయరాదా"
23-228

**వసివాడుతనము :** (వసివాడు + తనము) ప.బం; వి. మిక్కిలి వాడిపోయే లక్షణం.
"వసివాడుతనముల వలపెంతైనాఁ గద్దు
పసురువయసు తోడఁబదరదు గాని" 14-64

**వసులమూట :** (?)
"వసుల మూఁట మోవఁగఁ బడవేయఁగ
వసముగాని దెటువలె నౌనో" 1-180

**వస్తి :** (2) క్రి.ప; 'వచ్చితిని' అనడానికి వ్యావహారిక రూపం.
"పిలువఁగా వస్తి నింతే పెనఁగినఁదానఁగాను
కలియ లోనికిఁదీసి గడెవెట్టు వలెనా" 26-234

**వహమానము :** వి. చిన్నతనం. (శాంతి?) అహంకారం (?)
"వంచుకొనవలె నొండె వహమానమున నుంటే
కొంచక పంతములిచ్చి కూడవలెను" 17-248
"వడి నీచకృత్యంబు వహమాన మొదవించుఁ
జెంది వృద్ధత్వంబు శిథిలపఱచు" నీ.శ. 23

**వహించు :** (2) అ.క్రి. పట్టుబట్టు.
"బహుయోని కూపసంపదఁ దేలేవాఁడ నేను
వహించుక నావంటివానిఁదే నోపేనా"
"అమరఁగ నన్ను వహించుక
నా వళుకంతయుఁదీర్చఁగఁ దాఁగర్తా" 2-294

**వహించుకొనేవాఁడు :** వి. భరించుకునేవాడు.
"వహించుకొనేవాఁడు వద్ద నట్టే వుండేవాఁడు
విహరించ నా కిన్నిటా వెలసె తానె" 11-149

**వహి :** (3) వి. 1. విధం, రీతి 2. ప్రసిద్ధి. (3. పర్యాయం, లెక్కరాసే పుస్తకం)
"వహి దేవతాచక్రవర్తి బిరుదు నీకే
విహితము చక్రముచే వెలసేవు గాన" 2-142
"వహి ముత్తాతలా నీచే వరములు గొన్నవారు
మహి నిండులకె పోనీ మఱిఁగు చొచ్చితిని"
15-19

**వహికెక్కు :** (5) (వహికి + ఎక్కు) వాసికెక్కు, ప్రసిద్ధికెక్కు.

"ఇహమున గర్మ వహికెక్కితి నేను" 3-48
"వహికెక్క నేలినవాఁడెక్కడ నుండుమన్నా
తహతహఁ గొలువు కుత్తరువే బంటుకును"
4-47
"వహికెక్కు శ్రీవేంకటవల్లభుఁడితఁడే నన్ను
తహతహ దీరఁగూడె తగవరి అవుఁగదే"
11-149

## వా

**వా౦కపువలపు:** వి. 'వాఁక'కు 'వాఁకము' అని రూపము కలదా? అట్లైన ప్రవహించు వలపు అను అర్థము కావచ్చును లేదా వాకమైన = వాటమైన వలపు అనియు కావచ్చును.
"ఏఁకారే యాపె నేల యేఁచేవు నీవు
వాఁకపువలపులెల్లా వంచీని నీకు" 13-245

**వాఁకము:** విణ. వాటము, జారుడుగా ఉండేది.
"వాఁకమైన జవ్వనపాయము
వచ్చెను మతితోఁ దలఁచుకొనవే" 28-57
"వూఁకొంటే దోసమా వొంటి సుద్దులు చెప్పఁగా
వాఁకపుగోళ్లు చిమ్మవద్దు గాక" 22-3

**వాఁకసీయు:** (?)
"యెంతవడైనాఁ గూడేవేమి నేరుచుకొంటివి
వంతవంతి సిగ్గేటికి వాఁకోసేపు" 18-81

**వాఁగు:** అ.క్రి. 1. మోగు, ధ్వనించు 2. వదరు, పేలు.
"పొదలు పూదండ లవే పూఁచివాగే ఘంట
యెదుటఁ దిరువీథుల వేఁగీ సేవించరో" 3-501

**వాఁటమగు:** (3) అ.క్రి. అనుకూలమగు, వలనుపడు. ఇట అరసున్న విచార్యం.
"యిచ్చటఁ శ్రీవేంకటేశుఁడేలెఁ దానే
వచ్చేఁ బదివేలు వాటమాయనే" 14-38
"యీటుతోఁ బెండ్లాడితివి యిట్టె సేస వెట్టితివి
వాఁటమాయ వలపులు వద్ద నే నుందానను"
11-377

**వాఁటి:** (?)
"వాచవియుఁగాదు వాటి తీపు వోదు
ఆ చాయనే వున్న వందుకోనీవే" 14-38

**వాఁడిమి:** (వాఁడి + ఇమి) వి. వాడితనం, నైశిత్యం, తీక్ష్ణత, ప్రతాపం, పరాక్రమం.
"నేఁడు నీ శరణమనే నిశ్చయమిచ్చితిఁగాన
వాఁడిమి నన్నిటా నేఁ బావనమైతి నిదివో"
3-466

**వాఁడిమీఁదవాఁడి:** మిక్కిలివాడి.
"చెలువుఁడు పీఁడె చేకొను నేఁడె
వలరాజు తూపులివి వాఁడిమీఁద వాఁడి" 9-16

**వాఁడులు:** (2) వి; బహు. 'వాఁడి' శబ్దానికి బహువచనరూపం. చూ: వాండ్లు.
"జక్కవ చనుముక్కులు సరి వాఁడు లైతేను
వుక్కునఁ గాఁగిట నిన్ను నొత్తే నవేవు" 19-113

**వాండ్లు[1]:** (22) (వాఁడి + లు) 'వాఁడి' శబ్దానికి బహువచనరూపం. తీక్ష్ణతలు, పదునులు.
"మక్కువ మీ ఇద్దరికి మాటలే వాండ్లుగాని
లక్కవంటి పెంచి చూడలవి మీ మనసులు"
19-148
"కొనగోరివాండ్లు" 19-301
అన్నమయ్య వేండ్లు (వేఁడి శబ్ద బహువచనరూపం) అనికూడా వాడినాడు. రామకృష్ణుని ప్రయోగంలో కూడా ఈ రూపం కనిపిస్తుంది.

**వాండ్లు[2]:** 'వాఁడు' శబ్దానికి బహువచనరూపం. వారు.
"ఆడెడి బాలుల హరి అంగిలి చూపుమని
తోడనే వాండ్ల నోర దుమ్ములు చల్లి" 2-167

**వాండ్లెక్కు:** (6) అ.క్రి. తీక్ష్ణతలు అధికమగు. ఇట వాఁడ్లు అనేది వాఁడి (= తీక్ష్ణత) శబ్దానికి బ.వ.రూపం.
"పాని నీపై మచ్చరము పండ్లఁ బెట్టుకుండితేను
మోనాన వాండ్లెక్కి నీ మోవిమీఁద నిండెను"
8-221

**వాకట్టు:** (వాయి + కట్టు) ప.బం; వి. వ్యతిరేకంగా మాట్లాడనీయకుండా పెట్టే మందు.

"కొంచక నా కొప్పులోన కురువేరు ముడిచితివి
వంచి నన్ను లోనుసేసే వాకట్టు గాబోలు దా"
17-383

**వాకట్టుగట్టు**: (2) స.బం. దిగ్బంధం చేయు.
"మొనసి నీ కిది యేమి మొగసిరిమందు గద్దో
వనితలు నన్ను నవ్వ వాకట్టుగట్టితివి" 14-306

**వాకట్టువాఁడు**: వి. మూలికా మంత్రాదులచే దిగ్బంధం చేసేవాడు, నోట మాటలు రాకుండా చేసేవాడు.
"పంచిన కోవిల వాకట్టువాఁడట
ముంచి కోవిలలు మొఱసీనా" 19-360

**వాకట్టేమంత్రము**: వాగ్బంధనం చేసే మంత్రం, మాటలు రాకుండా చేసే మంత్రం, కనికట్టువిద్య.
"మొదలనే మాతోఁజెప్పిన మొక్కే మిదే నీకు
మదనుని నిటు వాకట్టే మంత్రంబిఁక నేదో"
17-354

**వాకము**: (3) వి. అనుకూలత, (?) పక్క, వాటము. (పీఠిక. 12)
"కైకొ నేలితివి శ్రీవేంకటేశ నన్ను
వాకముగా నాకు నిట్టే వలతువు గాక" 13-446

**వాకిట గాచుకుండు**: స.బం; అ.క్రి. నిరీక్షించు.

**వాకిటిగొల్ల**: వి. వాకిట్లో ఉండే గొల్ల.
"వామనమూర్తికి వాకిటిగొల్లను
సోమార్కనేత్రుని నొరిది లెంకను" 1-446

**వాకిటితంగెటి జున్ను**: వి; స.బం. మిక్కిలి అందుబాటులో నున్న వస్తువు.

**వాకిలిగాచు**: స.క్రి. రక్షించు.

**వాకు**: వి. నోరు.
"వాకులు దెరచి లోలో వావులు దెలుపుకోగా
ఆకడీకడ నుండి మిమ్మాఁగాదనవలదా" 27-93

**వాకు**: వి. మాట, శబ్దం.
"వాకుగా జలధి గట్టవచ్చు మాయ చూపవచ్చు
పైకొని నిన్నొకయింత పలికించరాదురా"
20-210

"యేకతాన నాపెతోనే యేమన్నా నందువు గాని
వాకునిష్ఠూరము లేల వద్దు వద్దు యీడను"
11-392

**వాకుచ్చు**: (5) 'వాక్రుచ్చు'కు రూపాంతరం. 1. వచించు, చెప్పు 2. పేర్కొను, పేరుచెప్పు, పలుకు.
"నీకంటే మునుపను నిన్ను నే రమ్మనఁగానే
వాకుచ్చి పలికేవు వలెరా యీ వలపు" 16-91

**వాకులు పోకులు**: వి; బహు. మాటలు - నడవడులు.
"యేకతాలు సమకూడె నియ్యకోళ్లే మనకు
వాకులు పోకులు నొక వావి గూడెను" 8-32

**వాకైనవారు**: వి; బహు. వాటమైనవారు, దిట్టమైనవారు.
"నీకేల ప్రియము చెప్ప నెలఁతల కెవ్వరికి
వాకైన వారే కానీ వనితలు" 27-174

**వాగపుబిత్తరికాఁడు**: చక్కని విలాసవంతుడు.
"వేగుదాఁకా జాగరాల వేసారితిమి
వాగపు బిత్తరికాఁడ వచ్చేవో రావో" 9-84

**వాగము**: (5) వి. 1. 'వాగై' తమిళం. మంచి నడత, సమృద్ధి మొదలైన అర్థములు గలవు. అట్లే వాగు అను పదము కూడ గలదు. అందమని అర్థము. ఇది తెలుగు బాగు. ఇంకను అర్థము విచారింపఁదగినది. అని సం.ప.స. (14 వా. 355 పు.) చూ: సం.ప.స. 23 సం.
"సోగకన్నులనుఁ జూచి సొలపుల మాటలాడి
వాగపుగొల్లెతలను వలపించేవు" 23-245
"వాగమై యెవ్వతె నీకు వచ్చినవేళ గుణమో
ఆగడపుమాటలకు నటు గురియైతివి" 27-110

**వాగము**: వి. వాగె.
"సోగల శ్రీవేంకటేశు సురతసింగారము
వాగమై యమరెఁగాన వన్నెలెల్ల నమరే" 9-90

**వాగె**: వి. గుఱ్ఱంనోటి కళ్లానికి తగిలించే పగ్గం.
"లోనుగా కెట్టు మాను లోలత నీ చేతలకు
దీనికే పురసతులు తేరె నీ వాగెకు" 27-250

**వాచకపు మాటలు :** వి; బహు. నోటి మాటలు.
"అందమై వాచకపు మాటలాడేవు సారె నాపె
పొందులంజదివించు నా పుస్తకములు నిన్ను" 17-125

**వాడఁబారు :** అ.క్రి. వాడజొచ్చు.
"చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు ముంగిటవేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను" 5-28

**వాడమగువ :** వి. వేశ్య.
"వోడఁ డెందరికినైనా వుత్తరువు చెప్పీని
వాడమగువల విందు వాని కేమె" 10-2-31

**వాడలసతి :** ప.బం; వి. కులట, జారిణి.
"వలపు లెల్లా రేచి వాడలసతులఁ జూపి
చలము పుట్టింతురా సతుల కింత" 17-344

**వాడవనిత :** (2) ప.బం; వి. జారిణి, కులట.
"వాడవనితలతోడి వంతులు మా కేటికె
యీడువెట్టుకొని దూరే దితనిఁగాకా" 9-275

**వాడవారి మరఁది :** ప.బం; వి. స్త్రీ లంపటుడు.
"వదినెంటాఁబిలిచేవు వద్దు సుమ్మీ యెవ్వరోయి
వదినెలు నీకు వాడవారి మరఁది" 5-322

**వాడసతి :** ప.బం; వి. జారిణి. చూ : వాడల సతి.
"వీడు దొర్రై విందువెట్టి వీడెము చేతికిచ్చె
వాడసతులకు నీవు వలచేవే యిఁకను" 29-212

**వాడా లేదు పీడా లేదు :** వాడలేదు ఏమీలేదు అనే అర్థంలో జంటపదం.
"వాడాలేదు పీడాలేదు వచ్చేవంటా నీ రాకకు
తోడనే యెదురుచూచే తొలఁగకిదే" 8-214

**వాడిక :** (2) పోషణము (సూ.ని.) చెప్పకుండా, చూపకుండా ఉంచిన నిధి, ఉపనిధి, తాకట్టు, పోషణం, నాడుక, వ్యవహారం, ఆచారం, (తె.వ్యు.కో.) సాధారణ ప్రసిద్ధి, పనుపడడం, ఉపయోగం, అభ్యాసం, అలవాటు, వ్యవహారం, (బ్రౌన్) చెప్పక చూపక ఉంచిన యిల్లడ, ఉపనిధి. (శ.ర.)
"యేడో వున్న శ్రీవేంకటేశుఁడే యింటికి వచ్చె
ఆడికో వాడికో అంగన నీకు" 8-1
"వాడికతో రమణుఁడు వచ్చితే రానీఁగదవే
వేడుకగా నేనే విన్నవించేఁగానీ" 24-301
"తోడఁదోడఁ బాదాలు తుడిచేవు పయ్యదను
వాడిక సేసుక యెంత వలపు చల్లేవే" 22-372
"వేడుకకత్తె యైనది వెక్కసాన నవ్వఁగాక
వాడికైన యిల్లాలికి వరుసా యిది" 12-323

**వాడికె :** (42) వి. 'వాడిక'కు రూపాం. చూ : వాడిక.
"వేడుకతో దగ్గరి శ్రీవేంకటేశ కూడితివి
వాడికెగా నిట్లనె వచ్చేవో రావో" 7-76
"వాడికె నొండొరులము నలచిన వలపులే
కోడి యెరుకలు సేసికొన వచ్చేరు" 18-14

**వాడిన పైరుకు వాన వచ్చు :** ప.బం; అ.క్రి. అవసరమైన సమయంలో అనుకూల్యం లభించు.
"యెడయ కిందుపై నీవు యేపాటి మాటలాడిన
వడి వాడిన పైరుకు వాన వచ్చినట్టు" 14-334

**వాడివో :** (వాడు + ఇవో) వాడు ఇదిగో > ఇవో అని అర్థం. ఇట్లే వీడివో అని కూడా ఉంది.
"వాడల వాడల వెంట వాడివో వాడివో
నీడనుండి చీర లమ్మే నేతబేహారి" 1-275

**వాడు :** వి. వాడుట.
"చెప్పఁజాలక వలపు సిగ్గువడీఁగాని చెలి
చొప్పున మొకము వాడు చూడరాదా" 27-362

**వాడుదేరు(ఉ) :** ప.బం; అ.క్రి. 1.వాడు, మ్లానమగు 2.తేరుకొను.
"వాడుదేరఁ బూజించవలెఁ గమ్మపువ్వు లివె
వీడె మిదె కొలువుకు విచ్చేయవయ్యా" 3-484
"హత్తి కాఁగిలించుమంటా నానలేల పెట్టేవు
వత్తివలె నీ మోవి వాడుదేరీ నిపుడు" 20-492

**వాతరొట్టు :** (వాయి + రట్టు) వి. వాతరట్టుకు రూపాం. నోటి దురుసుతనం కలది, వదరుబోతు.
"కెలయుఁగీరంబు మిక్కిలి వాతరట్టు" అని చిన్నన్న పరమ. 8-278

**వాతులుమోయు :** ప.బం; అ.క్రి. (?)
"వాతులు మోవఁగ వలెనని వెదకిన
పూతల నిన్నియు భోగములే" 3-481

**వాతెర :** (వాయి + తెర) వి. పెదవి. వాయికి (= నోటికి) తెరలాగా ఉండేది.
"పలచనగు గోళ్ల నీ పగడవాతెర నొక్కి
చెలువమగు నునుగంటి సేయు టెన్నఁడురా"
5-54

**వాదడుచు :** (వాయి+తడుచు) ప.బం; అ.క్రి. వివాదపడు.
"వాదడుతుఁ జెలులతో వడి నీవు బొంకవని
నా దెస చూడకుండితే నమ్మకుండుదు" 2-37

**వాదువాఁడు :** (వాదు + వాఁడు)
వాదులాడువాడు, నింద కలవాడు.
"యిల నిది నిందరికి నెగసక్కెమై తోఁచీ
వలవని అట్టుగాక వాదువాఁడా తాను" 22-68

**వానగుంటలు :** వి; బహు.
'ఓ(వా)మనగుంటలు'కు ఆనాడు వ్యవహారంలో ఉన్న రూపం కావచ్చు. గవ్వలను గాని, చింతగింజలు మొ॥ వాటిని గాని వేసి ఆడే రెండు వరుసలుగా ఏడేసిగుంటలు గల పీట. దాన్నిఉపయోగించి ఆడే ఆట.
"పైపై దొరతోటి పంతాలకు నేమి పని
ఆ పరాకై వానగుంట లాడుకొనేఁగాక" 7-247

**వానగుంతలు :** వి; బహు. వామనగుంటలు. చూ : వానగుంటలు.
"చివ్వన నీ వియ్యనంటే చేతవాసి చూపరాదా
తవ్వి వానగుంతలైనా తా నాడీఁగాని" 23-438

**వానచేతకము :** వి. వానకోసం ఎదురుచూచే చాతకపక్షి; చాతకము లనడానికి చేతకములనడం వ్యవహారాన్నిబట్టి కావచ్చు.
"వానచేతకములవలె నాయ మనసు
గోనెఁబట్టినబంక గుణమాయ మనసు" 1-337

**వానపడ :** వి. 'వానపడె'కు వికృతిరూపం. వాననీరు నిలిచే గుంట. (తె.వ్యు.కో.)
"నిధినిధానాలవలె నిచ్చ వానపడలను
సదమదమై నవ్వీని చతురత మెఱసి" 28-35

**వాన లేని వరద :** ప.బం; వి. కారణం లేకుండానే జరిగినది.
"చెలి నీ కడకు రాఁగా చెమటలఁ దొప్పదోఁగె
వలపులు వానలేని వర దాయను" 7-402

**వాపాటము :** (వాయి+పాటము) వి. కంఠపాఠం, నోటిపాఠం, అభ్యాసం, అలవాటు.
"కనుపట్టె మీ జాడలు కతలు వాపాట మాయ
తనిసితి విన్నిటాను తలపోఁత లేఁటికి" 16-451

**వాపోటు :** (వాయి+పోటు) వి. మాటలపోటు, మాటలదెబ్బ.
"ఓరిచితేఁ జుట్టరిక మొల్లకుంటేఁ జుట్టరిక
మీరసపు వాపోటు లీడ నేలే" 20-108

**వాబలిమి :** (వాయి + బలిమి) నోటిబలిమి.
"ఏ బాస కియ్యకొనేవే యిప్పుడు నీవు
వాబలిమి మాటల వాదు కోపఁగాని" 7-181

**వామి :** వి. గడ్డిమేట, గింజలు రాల్చిన గడ్డిమోపులతో వేసిన పెద్ద కుప్ప, వాము, ప్రోగు, రాశి.
"వలపుల పంటకెల్ల వామివైతివి" 21-274

**వాము :** వి. రూపాం. వామి. అన్నమయ్య 'వాములు' అనే శబ్దాన్ని అనేక పర్యాయాలు వాడినాడు. గడ్డి, చొప్ప మొ॥ వాటి ఎత్తైన కుప్ప అని వాచ్యార్థం. అధికం, మిక్కుటం అని లక్ష్యార్థం.

**వాములకొలఁది :** మిక్కిలి, అపరిమితం, అతిశయంగా. అన్నమయ్య అపరిమితం, అధికం అనే అర్థంలో ఎక్కువగా 'వాములకొలది' 'వాములగు' ఇత్యాది శబ్దాలను ప్రయోగించడం కనిపిస్తుంది. వాము (వామి) అంటే గడ్డిమోపులను ఒక్కచోట చేర్చిన పెద్దకుప్ప అని అర్థం. అడుకులు చక్కిలాలు ఆనవాలు నురుగులు వడపప్పు మొ॥.
"అడుకులు చక్కిలాలు ఆనవాలు నురుగులు
వడపప్పు మొదలుగా వాముల కొలఁదులు"
4-27

**వాములగు :** అ.క్రి. అధికమగు.

"వాములాయ వలపులు వడిఁబెట్ట కింకము"
2-19

**వాయితప్పు:** ప.బం; అ.క్రి. మాటతప్పు.
"ఆయమంటి మొదలనే అన వెట్టించుకోరాదా
వాయితప్పి యిప్పుడీక వాదులేఁటికే" 26-129

**వాయిదము:** వి. 'వాద్యము'నకు వికృతిరూపం.
"వాయిదాలు వాయించేరు వాకిటికి రాఁబోలు
యీ యింటిఁ జేపట్టినాఁడింతలో నట" 11-403

**వాయిద్యము:** వి. వాద్యమునకు వ్యావహారికరూపం. మద్దెల మొదలైనవి.
"ధరపై బ్రహ్మాదిదేవతలెల్లాను వచ్చి రదె
వరుసతో వాయిద్యాలు వాయించరో" 25-432

**వాయెత్తు:** ప.బం; అ.క్రి. గొంతెత్తు.
"చేయెత్తి మొక్కితి నిన్నుఁ జెనకికి చేతలకు
వాయెత్తి పాడితి నీతో వాదుదీరను" 27-246

**వారకము:** వి. లేనప్పుడు ఇతరులకు వాడుకోవడానికి ఇచ్చి ఉన్నపుడు మళ్ళీ తీసుకునే ధనాదికం, తాకట్టు. (తె.వ్యు.కో.) సమానత్వం; పరకీయ శబ్దభవం. ఓరిగే, వారిగె అనునవి కన్నడమున ఈ యర్థమునందు గలవు అని సం.ప.స. (13 సం. 7 పు.)
"వారకానఁ బ్రహ్లాదవరదుఁడు మరుముద్ర
లూరట సొమ్ములు గాఁగ నుంచీ
నరసింహుఁడు" 13-204

**వారచేడె:** వి. వేశ్య, వారకాంత. వింత సమాసం.
"అడేనంటా వచ్చె నారగించలే దింకా
వాడ వారచేడెలాల వనజాక్షుఁ జూపరో"
22-139

**వారధి:** వి. వంతెన.
"వల్లెగాఁ గొండలచేత వారిధిగట్టుట యెంచ
ఇల్లిదె నాకొరకుఁగా నింత సేసితివిగా" 24-128

**వారపట్టు:** ఓరపట్టు శబ్దం కావచ్చుననీ, ఒకమూల స్వాధీనం చేసుకొను అని అర్థం కావచ్చుననీ పరిష్కర్తల ఊహ. (సం.ప.స. 16 సం. 431 పు.) 1.కుండకు చేతి నానించి ధారగా కింద పడుతుండగా పొడవుగా పోయు. 2.దేవతా విగ్రహాదులకు ముందు భక్తిసూచకంగా ధారగా నీళ్లువదలు, ఆపోశించు.
"వారము వర్జము లేదు వంచుక పాలు వెన్నలు
వారవట్టి యారగించీ వాఁడే వాఁడే కదవే"
16-180
"నీరువట్టుగొని భూమి నీళ్లెల్లా వారవట్టి
కేరి కేరి నగవయ్యా కృష్ణభట్లూ" 2-70

**వారబియ్యమెత్తు:** ప.బం; అ.క్రి. భిక్షాటనం చేయు. (పద.)
"సూరిభట్లొక నంక చొరని చోట్లు చొచ్చి
వారబియ్యమెత్తి యెత్తి వడదాఁకి" 2-70

**వారమిచ్చు:** ప.బం; అ.క్రి. భిక్షమిచ్చు.
"మంతనాన నుండి తమకింతు నీ రాకను
బంతికూటివేళ నీకు వారమిత్తును" 12-281

**వారము వజ్జమనక:** ప.బం. శుభాశుభ సమయము లాలోచించక, ఇష్టం వచ్చిన సమయంలో.
"వారము వజ్జమనక వాకిట నన్ను నాగేవు
పోరచి మావారు నీకుఁ బోకవెట్టిరా" 10-2-38

**వారము-వర్జము లేదు:** శుభాశుభ సమయాల పట్టింపులేదు.
"వారము వర్జము లేదు వంచుక పాలు వెన్నలు
వారవట్టి యారగించీ వాఁడేవాఁడే కదవే" 16-180

**వారముసేయు:** (వారము+చేయు) ప.బం; అ.క్రి. ఒక్కొక్క రోజు ఒక్కొక్కరింట్లో భోజనం చేయు.
"వారముసేసే మనుచు వడి నింటివారమెల్లా
కూరలు పాశాలు దొంతి గూడఁబెట్టితే" 2-165

**వారలుపట్టు:** ప.బం. చూ: వారవట్టు.
"పట్టరో వారలు పాలునేతికిని
గట్టిగ జోరునఁ గారీ నవిగో" 29-37

**వారవట్టు:** (8) ప.బం. ఓరపట్టు శబ్దమేనా? ఒకమూల స్వాధీనము చేసుకొని అని అర్థముండవచ్చును. (సం.ప.స. 16 సం.) 1. కుండకు చేతి నానించి ధారగా కింద

పడుతుండగా పొడవుగా పోయు. 2. దేవతా విగ్రహాదులకు ముందు భక్తిసూచకంగా ధారగా నీళ్ళు వదలు, ఆచమించు, ఆపోశించు, తాగు. కొలుచు అని పద.

"పాలు పెరుగు వారవట్టీ గోవిందుఁడు
సోలిఁ గొనేటి యీ చుట్టులను"
22-537 & 8-131

**వాలాయము:** (3) వి. అవశ్యం, అనివార్యం, నిరంతరం.

**వాలాయించు:** (3) నిర్బంధపడు.

"ఏలే పొగిలేవే యిప్పు డింతిరో నీవు
వాలాయించి నీ విభుఁడు వచ్చి కూడీఁగాక"
18-130

"ఏల మమ్ము నేడు కొనే వెంత అట్టుసేసేవు
వాలాయించి నీ చేతిలోవార మింతే నేము"
18-211

**వాలిక:** విణ. 1. మనోజ్ఞం 2. మృదువు 3. దీర్ఘం.

"వాలికమోము వంచి వనిత నీకు మొక్కఁగా
కేలనొత్తి నీ విట్టే కొఁగిట నించేవు" 12-411

**వాలుక:** విణ. దీర్ఘమైన, వాడియైన.

"వాలుకచూపులు వసమై యాకెకు
కేలు చాఁచి తమకించేవు" 25-408

**వాలుమగంటిమి:** వి. శూరత్వం.

"ఆలికై విల్లువిఱిచి వాలికై యమ్ము వేసిన
వాలుమగఁటిమి గలవాఁడా వీఁడు" 2-226

**వావాత:** (27) ప.బం; క్రి.విణ. నోరార, (పద.) చేసేత వంటిది.

"వావాత శ్రీవేంకటాద్రి వరములిచ్చీఁ గనక
యేవల దాతలలోన నితఁడే దొడ్డ"
3-411 & 24-200

"శ్రీవేంకటేశుఁడే చిత్తగించి వన్నెలెఁగా
వావాత నింద్రియాలు వశకాడీనా" 3-417

వాచికమైన కైంకర్యంతో అని లక్ష్మణయ్య గారు. (అ.సం; 360 పు. 4-200 సం.)

"వావాత నీ వనేటి వసి దవ్వి కైకొంటి
భూవిభుఁడ నీ వనేటి పురుషార్థము"

**వావాతమచ్చికలు:** వి. (?)

"కాపరపు వలపు లొడిఁగట్టుకుండినవెనక
వావాత మచ్చికలు వదలఁదగునటవే" 28-54

**వావాతలు:** వి; బహు. మిక్కిలి వ్రాతలు.

"చేతలెన్నైనా గలవు చిక్కించుక చెనకితే
వావాత లెన్నైనాఁ గలవు వ్రాసేనంటే" 29-331

**వావాతిమాటలు:** (?)

"జీవునికి దండె వేసినవాఁడవు నీవు
వావాతిమాటలే నీపై వన్నెపదాలు" 3-467

**వావాదము:** (వాదము + వాదము) మిక్కిలి వాదము.

"రచ్చల నీఁగక యున్న రతుల వీఁగేవు గాక
వచ్చి వచ్చి నీతోడ వావాదమా" 21-503

**వావాదు:** వి. ఉపన్యాసం, వాఙ్ముఖం. (వ్య.)

"నీ వేమి సేతువు నన్ను నీవు
మోహించుమంటివా
వావాదు నెంచేది నా వలపింతే కాక" 12-193

**వావిదిష్టము:** (?)

"దేవుల వయితివి వావిదిష్టము లాయఁగదవే
శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జేరి కూడినాఁడు"
28-361

**వావిలి:** విణ. వావిరి కావచ్చు. 1. ఉత్కృష్టం, గొప్పది 2.అత్యంతం. (3. వెన్నంటిన 4. ధూర్తుడు)

"నీవే ఆతఁడు గావా నేటిదాఁకా
వావిలి నాతనిలోని వలపు చేకొనవే" 27-202

**వావిలిపాటి రామచంద్రుఁడు:** వి. చిత్తూరు జిల్లా మదనపల్లి తాలూకాకు చెందిన వాయిల్పాడు గ్రామంలో వెలసిన శ్రీరామచంద్రుడు. వాయిల్పాడుగ్రామమే వావిలిపాడుగా పేర్కొనబడింది. అన్నమయ్య వావిలిపాటి రామచంద్రుని పది - పన్నెండుచోట్ల పేర్కొన్నాడు.

"రావయ్య వావిలిపాటి రామచంద్ర
రావాడి వలపులు రామచంద్ర" 10-2-67

**వావిలిపాడు:** చిత్తూరుజిల్లా లోని మండల

కేంద్రమైన వాయిల్పాడు. శ్రీరామచంద్రుడు వెలసిన గ్రామం.

"ఉంకువ వావిలిపాటనుండి శ్రీవేంకటగిరి
తెంకుల నిన్ను గూడి తిరుమాయ నమ్మా"
26-40 & 1-178

**వావివర్తన:** ప.బం. సరి అయిన నడవడి అనే అర్థంలో జంటపదం.

"కోవిదు శ్రీవేంకటేశుఁగొలిచి పెద్దల కృప
వావివర్తన గలవాఁడు వో వైష్ణవుఁడు" 1-59

**వావివర్తనది:** సరియైన నడతగలది, వావివరుస గలది.

"కావరించి తిట్టేది గయ్యాళి యొకతెగాని
వావివర్తనది యైతే వచ్చి మొక్కును" 26-589

**వాసంతిక:** వి. అడవిమొల్ల, పువ్వుల గురివెంద, బట్టకడిమి.

"వలనగు తావుల వాసంతికలలోన
కెలకుల నరమోడ్పుఁ గెందామరలయందు"
5-177

**వాసి:** వి. 1. ఆధిక్యం 2. లాభం 3. ప్రసిద్ధి 4. పరిమితి 5.తారతమ్యం 6. భేదం 7. ఔన్నత్యం, బాగు .

"వాసికిఁ బెనఁగఁబోతే వడిఁబడుఁజేసునిఁక
నా సరివారెల్లాఁజూడ నవ్వినంతే చాలును"
19-385

**వాసికత్తె:** (9) (వాసి + కత్తె) వి. పేరుపొందిన స్త్రీ. (తె.వ్యు.కో.)

"మచ్చరపు సవతుల మట్టుపెట్టుట మంచిది
యొచ్చిన వాసికత్తెల నేలుట కీర్తి" 24-282

**వాసికాఁడు:** (వాసి + కాఁడు) వి. పేరుపొందినవాడు, ఉన్నతుడు.

"తగిలి నేఁ దడవితేఁ దడవఁగ వలెఁగాక
మిగుల వాసికానికి మేర మీరఁ జెల్లునా" 19-395

**వాసితనము:** (వాసి + తనము) వి. గొప్పతనం, ఘనత, యుక్తత, ఔచిత్యం.

"వాసితనంబున వంచిన శిరసున
సేసలువెట్టీఁ జెనకవయ్యా" 25-348

**వాసిదప్పు:** అ.క్రి. పేరుపోవు.

**వాసిపట్టు:** (2) ప్రసిద్ధికెక్కుట.

"పురుషుండైతే నేమి పొలఁతి యైతేనేమి
వరుస నొకటే కాదా వాసిపట్టు" 21-311

**వాసివంతు(లు):** ప.బం; వి; బహు. వన్నె-వాసి.

"వాసివంతు విడిచినవాఁడే యోగి ; యీ
ఆసలెల్లా విడిచిన అతఁడే యోగి" 1-167

**వాసివట్టము:** ప.బం; వి. హెచ్చుతగ్గులు, లోపము.

"వాసివట్టముకొరకు వదలిదినములచేతఁ
బాసిపోయిన వెనక పర మేడ పరము" 4-1-25

**వాసివట్టు:** అ.క్రి. అభిమానం చూపు.

"నీటునఁ బ్రాణవిభుఁడ నీ వేమి సేసినా
వాఁటమై మొక్కుదుఁగాక వాసివట్టేనా" 11-213

**వాసివన్నె(లు):** ప.బం; వి; బహు. గొప్పతనాలు అనే అర్థంలో జంటపదం.

"వేడుకతో నీ వెన్నివిధముల రక్షించినా
వాడికతో మెత్తురు వాసివన్నె లెల్లాను" 12-73

**వాసివాఁడు:** (వాసి+వాఁడు) ప్రసిద్ధి గలవాడు, అందగాడు.

"యీయెడ నన్నుఁ గూడితి వింత వాసివాఁడవు
చాయల శ్రీవేంకటేశ చన్ను లంటఁజెల్లునా"
21-366

**వాసీవంతు:** వన్నె-వాసి.

"చేసినట్టె సేసుఁగాక చింత మాకేలా
వాసీ వంతూ నతనిదే వట్టి జాలి యేలా" 3-91

**వాసులు:** (6) వి. తారతమ్యములు, ఆధిక్యములు, లాభములు, పరిమితులు.

"వారి వీరిఁ జూపకు వాసులు వుట్టించకు
కోరికతో నున్నదాన గుట్టుసేసి నేను" 25-344

"వాసులకు నీతోను వాదులడువఁగ రాదు"
25-475

**వాసులువంతులు:** (8) ప.బం; వి; బహు. వన్నెవాసులు.
"చేసినట్టెల్లా నీకుఁ జెల్లెఁగాక
వాసులు వంతులుఁ బట్టి వద్దనేమా నిన్నును"
25-80

**వాసులువట్టు:** (వాసులు + పట్టు) ప్రసిద్ధికెక్కు.
"అడరి శ్రీవేంకటేశ అలమేలుమంగ నేను
వడి నన్నుగూడితివి వాసులు వట్టుదునా"
11-590

**వాహనసుపర్ణుఁడు:** వి. సుపర్ణవాహనుడు, గరుడవాహనుడు, విష్ణుమూర్తి.
"పూర్ణుఁడు నీలమేఘవర్ణుఁడు
దానమున విస్తీర్ణుఁడు వాహనసుకర్ణుఁడు"
2-208

**వాహ్యాళి:** వి. స్వారీ.

## వి

**వింగడము:** విణ. 1. సుందరం 2. విశాలం 3. విస్తృతం.
"వింగడమై నాకు నబ్బె వేంకటేశుమంత్రము"
4-438

**వింతతనము:** (వింత + తనము) వి. భేదం, అన్యత్వం.
"వీడని చుట్టరికము వింతతన మెంచదు
వేడుక యెదిరివల్ల వెరవెంచదు" 26-380

**వింతవాఁడు:** (వింత + వాఁడు) అన్యుడు, పరుడు, కొత్తవాడు.
"వింతవాఁడా తా నేమి వేమరుఁజెప్పించుకొన
బంతినే తరితీపులు పచరించవలెనా" 7-234

**విందుపొత్తు:** వి. బంధుత్వపు పొత్తు, విందుభోజనల లోని పొత్తు.
"ముందు నా యెంగిలి మోవి మాటాడితివనీ
విందుపొత్తులు గలసి వెలయమా తొల్లి"
12-364

**విందువేడుకకాఁడు:** వి. (?)
"విందువేడుకకానికి వెసలఁ బెట్టినకత
యిందులోనే నెరపనేల యింటికి రారాదా"
25-378

**వికల్పవాది:** వి. ఏ పక్షాన్నీ గట్టిగా సమర్థిస్తూ వాదించనివాడు.
"అయ్యో వికల్పవాదులంతటా సిగ్గువడరు
యియ్యెడ నెట్టు గలిగె నీ యసురమతము"
3-52

**వికవికలు:** వి. 1.నవ్వటంలోని ధ్వనికి అనుకరణపదం (2.చెల్లాచెదరు కావడంలోని ధ్వనికి అనుకరణం 3.తెగటంలో అయ్యే ధ్వనికి అనుకరణం.)
"యెన్నరాని వేడుకల కింపులు పుట్టించీ నిదె
వెన్నెలనవ్వుల నీ వికవికలు" 22-490

**విగడము:** వి. వికటము అన్న పదానికి వ్యావహారికరూపం, విపరీతము.
"చాలుకొన్న జంకెనల జగడాలు మీ
వేలికొన గోళ్లలో విగడాలు" 7-296

**విచ్చనవిడము:** వి. విచ్చనవిడి, విచ్చలవిడి.
"అచ్చముగాను సరసమాడితేను తనలోన
విచ్చనవిడము గాని వెగటు దోఁచదు" 14-570

**విచ్చనవిడి:** (73) వి; ప.బం. విచ్చలవిడి. (వ్యా.) అన్నమయ్య అంతటా 'విచ్చనవిడి' యనే రూపాన్నే ప్రయోగించినాడు. 'విచ్చలవిడి' అనే పదం కనిపించదు.
"కుచ్చి శ్రీవేంకటాద్రిపైఁ గూడితివి నన్ను
విచ్చనవిడాయ నీఁక విట్ఠలేశ్వరా!" 18-216

**విచ్చనవిడికాఁడు:** (విచ్చనవిడి+కాఁడు) వి. విచ్చలవిడితనం కలవాడు, స్వేచ్ఛాప్రవృత్తి కలవాడు.
"ఇచ్చట నన్నుఁ గూడితి విరుమొనసూదివైతి
విచ్చనవిడికాఁడవు వెరపేల యిఁకను" 7-457

**విచ్చనవీడి:** విచ్చలవిడి.
"నిచ్చలు రతివేళ నేరుపు మరతురా
విచ్చనవీడైన చోట వేగుదురా" 18-110
"ఇచ్చిన కాఁగిళ్లగురి యిద్దరి తమకములు
విచ్చనవీళ్లకు గురి వింతరతులు" 8-64

**విచ్చిచెప్పు:** స.క్రి. విపులీకరించి చెప్పు.
"విచ్చి చెప్పఁగాని తన వింత చక్కఁదనమెల్ల
పచ్చి నా చూపులలోనే పదరనేలే" 18-79

**విజనగరము:** (4) వి. 'విజయనగరము'నకు వ్యావహారికరూపం.
"వేడుకకాఁడు గదమ్మ విజనగరములోన
వేడెవెట్టీ సతులను వెన్నముద్దకృష్ణుఁడు"
14-294

**విజయనగరపు వుగ్రహనుమంతుఁడు:** హంపీ విజయనగరంలో నెలకొన్న ఉగ్రహనుమంతుడు.
"పట్టపు శ్రీవేంకటేశుబంటయి ప్రతాపమెల్ల
వొట్టీ విజయనగరపు వుగ్రహనుమంతుఁడు"
4-85

**విటకత్తె:** (విట+కత్తె) వి. విటురాలు, విటి, విటుకులాఁడి, కులుకులాఁడి, వలపుకత్తె.
"జాడతోనే అడపముసతుల వెదకఁగాను
వీడెము నీ విచ్చేవు విటకత్తెవమ్మా" 12-160

**విటకుక్కితనము:** విటుల యొక్క సంకుచితమైన లేక నీచమైన భావము కావచ్చునని సంపాదకులు. (f.n. 172 పు.)
"ఇటువంటి సుద్దులకు యెరిది సాకిరై వచ్చు
విటకుక్కితనా లెల్ల వెరగంది చూతము" 27-254

**విటతనము:** (5) (విట + తనము) వి. విటత్వం, జారత్వం. కేవలసంస్కృతశబ్దంపై 'తన' ప్రత్యయం రావడం విలక్షణం.
"విటతనములవాని వేమారుఁ గొసరరాదు
చిటుకురంటే సేవసేయవలెఁ గాని" 23-182

**విటరాయఁడు:** వి. విటశ్రేష్ఠుఁడు.
"విటరాయఁడవు శ్రీవేంకటనాథ నీ కూటమి
ఘటియించ వేడుక మిక్కుటమాయఁ
గృష్ణమ్మా" 10-2-84

**విటరాయతనము:** (విట + రాయ + తనము) వి. విటశ్రేష్ఠుని లక్షణం.
"భావింప నెవ్వరికైనా పక్క నున్నట్టున్నాఁడవు
తావగు నీ విటరాయతన మెట్టిదో" 12-90

**విటుకులాఁడి:** వి. మిటుకులాడికి రూపాం. విటురాలు, కులుకులాడి.
"వింత వింతవలపుల విటుకులాఁడి
యింత యెమ్మెలు చూపీ నకేమౌనయ్యా"
23-65
"విటుకులాడిని బిగికౌగిట చేర్చి
మేటొ చాకటు లిచ్చినాడట" అని సారంగపాణి. శృంగార. 63

**విట్ఠలరాయఁడు:** వి. చూ: హంపీలోని విఠ్ఠలేశుఁడు, విఠ్ఠలేశుడు.
"ఇట్టి సింగారము సేయ వింత నీకుఁ
బ్రియమాయ
వెట్టి నీ చేతల మాయ విట్ఠలరాయ" 5-96

**విట్ఠలము:** వి. విట్ఠలుడు వేంచేసివున్న హంపీ క్షేత్రం.
"అనయము శ్రీవేంకటాద్రిదేవుని బంటు
వెనుబలమై యుంటాడు విట్ఠలములోను"
3-301

**విట్ఠలుఁడు:** వి. చూ: విట్ఠలరాయడు. 17-289

**విఠ్ఠలేశుఁడు:** వి. బళ్లారిజిల్లా హోస్పేటతాలూకా తుంగభద్రా నదీతీరంలోని హంపీక్షేత్రంలో గల విఠ్ఠలేశ్వరస్వామి. అన్నమయ్యా పండరిపురం (మహారాష్ట్రం) లో గల విఠ్ఠలేశ్వరుని, హంపిక్షేత్రంలోని విఠ్ఠలేశ్వరునికి అభేదం కల్పించి కీర్తన రచించినాడు.
"వెన్నలు సెలవిఁగారే విఠ్ఠలేశా
నన్నుఁ జూచి నవ్వేవు విఠ్ఠలేశా" 11-127
"యిల్లిదె శ్రీవేంకటేశుఁడితఁడె తానై వుండి
యెల్లగాఁ గోనేట వరాలిచ్చె విఠ్ఠలేశుఁడు"
14-590

**విడిదల:** వి. విడిది చేసే చోటు.
"వెస దెరువరి తమి విడిదలపై నున్నట్టు
వసియించవలదా శ్రీవల్లభుమీఁదటను" 15-46
"మెడఁగట్టినట్టున్నది మెలఁగీ నురులది
విడువక యెల్లప్పుడూ విడిదలైన దేహము"
3-216

**విడిదిల్లు:** (విడిది + ఇల్లు) వి. విడిది చేసే ఇల్లు.
"బలిమిసేసి నా చేతఁబడి తలంపించితేను
వెలలేని నీ కాఁగిలి విడిదిల్లు గాదా" 25-451

**విడిపరి:** 'విడుపరి'కి రూపాం. త్యాగశీలుడు.
"కలలోపలి సంభోగము ఘనమగు
సంపదలన్నియు
వలలోపలి విడిపరులు వన్నెల విభవములు"
2-133

**విడిముడి:** వి. ధనం.
"అడుగనేఁటికి మమ్ము ఆపె నిట్టె కరుణించు
విడిముడిగా నీక విచ్చి చెప్పవలెనా" 25-97

**విడుగర యగు:** విడుదలయగు, విమోచనమగు, విడుగడయగు.
"పడిన మీ బాధలెల్ల ప్రజలాల యిప్పు డిట్టె
విడుగరాయ మీరు వెరవకుఁడీఁకను" 10-1-32

**విడుజోడువాఁడు:** వి. విడిచిపెట్టే స్నేహితుడు. (వ్యు.)
"విన్నవించేవాఁడనా విడుజోడువాఁడనా
అన్నిటా శరణు చొచ్చినట్టి జీవికి" 2-492

**విడుముడి:** వి. విడుదల కావచ్చు.
"సటలోభపు సంసారము చొచ్చితి
ఘటన విడుముడిఁకఁ గలిగీనా" 4-69

**విడువకైతే:** విడువకుంటే, విడువకపోతే.
"వడి మా విడేలకే(ల?) వరుసఁ జేయి చాఁచేవు
విడువకైతే కారాలు వేగినంతా వలెనా" 7-514

**విణ్ణాపఁజివారు:** విణ్ణప్పం సెయివార్ అనే అరవపదానికి సంగ్రహరూపం కావచ్చు. స్తోత్రపాఠకులు.
"పరుసతో విణ్ణాపఁజివారు తాళము లొత్తుచు
పోరిఁబోరి ద్రావిడానఁ బొగడఁగాను" 18-281

**వితః** వి. 'వితా'కు రూపాం. వ్యర్థమని అర్థం.
"యితరు లేమీ నెఱుఁగ రిద్దరును నవ్వుకోఁగా
వితగాని మీ పనులు వెల్లవిరులాయను" 8-19

**విత్తరాలు:** (4) వి. శ.ర., బ్రౌన్, వ్యు.కో. ల్లో ఈ పదం లేదు. సూ.ని. లో 'విత్తు' అనే పదం ఉంది. దానికి జ్ఞానం, తెలివి అని అర్థం. ఈ పదం ఉన్న కీర్తనలో జవరాలు, చదురాలు, ఘనురాలు అనే పదాలుకూడా ప్రయోగింపబడ్డాయి. కనుక ఇట విత్తరాలు అనగా తెలిసినది అని అర్థమేమో అని ఆనందమూర్తిగారు వివరించినారు. ఐతే జ్ఞానార్థకమైన విత్ శబ్దంనుండి ఈ రూపం ఏర్పడిందన్నమాట. అప్పుడు 'తర' అనే ప్రత్యయం ఎలా వస్తుంది? అది విశేషణాలపైనే రావాలికదా! అనే సందేహం రావచ్చు. కనుక ఇట 'తెలిసినది' అనే అర్థంకల విత్ (జ్ఞానవిత్, అర్థవిత్ మొ॥) అనే శబ్దం విశేషణం కనుక దానిపై అతిశయార్థంలో 'తరప్' ప్రత్యయం వచ్చి 'విత్తర' అని ఔతుంది అని చెప్పితే ఉచితంగా ఉంటుందేమో! బాగా 'తెలిసిన' అనే అర్థం వస్తుంది. దానిపై ఆలు శబ్దం చేరిస్తే విత్తరాలు అనే రూపం ఏర్పడుతుంది. బాగా తెలిసిన స్త్రీ అని అర్థం. సం.ప.స. లో ఈ పదం 'బిత్తరాలు' కు రూపాంతరంగా ఊహించబడింది. 'బిత్తరాలు'కు రూపాం. బిత్తరము = విలాసము. అది కలది బిత్తరాలు.
"యిప్పుడే శ్రీవేంకటేశ యెనసి నిన్ను గుట్టున
విప్పుమ రట్టుసేసునా విత్తరాలు" 7-454
"వినయపు బిత్తరాలు వేడుకతో గొలువుసేయఁ
బెనఁగీ వద్దఁ గూచుండఁబెట్టుకోరాదా" 22-323
"ఆసతో శ్రీవేంకటేశుఁ డట్టె నిన్నుఁగూడె నంటా
వేసాలు సేసే వెంత విత్తరాలవే" 22-417
బిత్తరము కులుకు బెడఁగు బెళుకు
హొయలనఁగ విలాసమొప్పు చుండు"
(ఆం.భా. 1-139)
"వాడికమాటల నిన్ను వలపులు రేఁచిరేఁచి
వేడుకలు గాదెఁబోసీ విత్తగాలు" 23-31

**విత్తుకొను:** విత్తనాలు చల్లు.
"చిలుకపలుకు లెల్లాఁ జేన విత్తుకొంటివపటే
వొలికేవు పెదవుల నొకటొకటే" 7-322

**విత్తుమీఁదటి పొల్లు:** ప.బం; వి. అస్థిరం, సారం లేనిది.
"వత్తిలోపలినూనెవంటిది జీవనము

విత్తుమీఁదటి పొల్లువిధము దేహంబు" 1-328

**విదరవెల్లిది:** (విదరవెల్లి + అది) వి. ఈ పదాన్ని గూర్చి అధః సూచికలో ఈ విధంగా ఉంది. వేదురువెల్లి, వేదురు శబ్దము వ్యావహారికముగ 'వేదర' కాగా 'వే' కు బదులు 'వి' లేఖక ప్రమాదమేమో!. విదురువెల్లి = పిచ్చి పొంగిన (దానవా) అని కావచ్చు. దీనిని బట్టి పిచ్చి పొంగినది అనే అర్థాన్ని భావించవచ్చు. చూ : పీదరవెల్లితనము.

"గరిమతో పీడెమిచ్చి కడు నుబ్బు రేఁచేవు

తరితీపుతోడి విదరవెల్లిదాననా?" 24-269

**విద్యముల యాట:** వి. ఇంద్రజాలపు ఆట, విద్దెలాట. 'విద్యము' విలక్షణమైన రూపం.

"విడివిడి చేతులతో విద్యముల యాటవాఁడు

అడవిఁగాచేటి గంగ్యావులవాఁడు" 24-112

**విద్యముల యాటవాఁడు:** వి. విద్యము రూపము చింత్యము అని సంపా. కాని 'విద్దెము' అనే పదం బాలక్రీడా విశేషమనే అర్థంలో ఉంది. విద్యము అనే దానిని 'విద్దెము'నకు ప్రకృతిగా గ్రహించినచో దీనికి అదే అర్థము చెప్పవచ్చును. అప్పుడు ఒకానొక బాలక్రీడా విశేషము నాడువాడనే అర్థం చెప్పవచ్చు.

"విడివిడి చేతులతో విద్యముల యాటవాఁడు

అడవిఁగాచేటి గంగ్యావులవాఁడు" 24-112

**విద్యలాడు:** (విద్యలు + ఆడు) గారడీవిద్యలు చేయు, ప్రగల్భాలు పలుకు, స్వోత్కర్ష చెప్పుకొను, దంభోక్తులాడు, వ్యంగ్యార్థం వచ్చేట్లు మాట్లాడు.

"ఘటనఁ బరకాంతను కన్నులెదుట నిలిపి

విటునిచందాన నేఁడు విద్యలాడించేవు" 19-191

**విద్రూపుఁడు:** వి. ఇది విరూపుడు కావచ్చు.

"ఘోర కుడునఁగఁ ద్రిశంకుని నంత్యజునిఁ జేసి

పీరుఁడగు నలుఁబట్టి విద్రూపుఁజేసె" 1-134

**వినపము:** వి. 'విన్నపము'నకు రూపాం.

"వినఁగానే వినపాలు వేమారుఁ జేసితిఁగాక

యెనసి నిన్ను నేమించ నెంతదానను" 23-111

**వినయాలు:** వి; బహు. భక్ష్యవిశేషం కావచ్చు.

"కరజపు వినయాలు కాఁగిటి బువ్వాలు

సిరులతో విందువెట్టీ శ్రీసతి నీకు" 8-166

**వినయాలుసేయు:** అ.క్రి. వినయంగా ప్రవర్తించు.

"వినయాలు సేసేవు వేంకటేశుఁడ

వెనువెంటఁ బాయక వేంకటేశుఁడ" 28-494

**వినయివాఁడు:** (వినయి + వాఁడు) వి. వినయవంతుడు. 'వినయి' అంటేనే వినయవంతుడని అర్థం.

"ముంపునే గరివినైనా మొదల వినయివాఁడు

పెంపునఁ దానె వచ్చీఁ బిల్వరె వాని" 11-188

**వినికి:** వి. శ్రుతి, వేదం.

"వినుకుల కొననెల్లా విష్ణుఁడొక్కఁడే" 3-380

**వినిచెవుడు:** వి. చెవులు ఉండీ కూడా వినలేకపోవడం.

"కనిగుడ్డును నదె వినిచెవుడును నదె

ననిచె జగత్తు నడచీ నదివో" 3-185

**వినుకలిచదువులు:** (2) వి. వేదములు, శ్రుతులు. వినికిడితోనే వచ్చిన విద్యలు అని వ్యుత్పత్తి.

"వినుకలిచదువుల సదలో వేమరు మూఁగఁగఁ బెట్టిన

ఘనకర్మపుటొగ రుడుగదు కమ్మర పులిగాయై"
1-482

**వినుకుల కొన:** వి. ఉపనిషత్తు. (శ్రుతుల అంతం)

"విని యాలకించినాను వినకట్టె మానినాను

వినుకుల కొననెల్లా విష్ణుడొక్కఁడే" 3-380

**వినుకొను:** (విను + కొను) విను, వినుధాతువుపై 'కొను' అనుబంధంగా చేరడం విలక్షణం.

"గుఱుతులు వినుకొన్నాఁ గూటములు పెనగొను

యెఱుఁగుదుఁ దన నేమ మెంతని చెప్పీనే"
12-354

**వినేది:** వి. వినడం.

"వేడుకతో నీ మాటలు వినేదే మేలు గాక

జోడుగూడ నందుఁగొంత సోధించనేలా" 7-178

**వినోదకత్తె:** (వినోదము+కత్తె) క్రీడాదుల చేత పొద్దుపుచ్చే లక్షణం కల స్త్రీ.

"అంతె కాదా పుష్పు వేసి అట్టె పొత్తు గలసేవు
వింతలాయ నీవు నొక వినోదకత్తెవు" 14-496

**వినోదకాఁడు:** (3) (వినోదము + కాఁడు) వేడుక కలవాడు.

"అతిరాజసపువాఁడు అన్నిటా వినోదకాఁడు
కతలు చెప్ప నన్నెంత గారవించీనే" 28-561

**విన్నకన్నందుకు:** (విన్న + కన్న + అందుకు) విన్నందుకు, కన్నందుకు.

"కన్నందుకుఁ బట్టే వెఱ్ఱివంటిదానవా
సన్నల నీ పని సేసే జవరాలఁగాక" 20-559

**విన్నకన్నది:** (విన్న + కన్న + అది) విన్నది-కన్నది.

"సన్నిధిని మిమ్ము నుతియించి సరుస
జిహ్వయుఁ దనియదు
విన్నకన్నది గాదు ఇది నా వెలితో నీ వెలితో "
2-375

**విన్న వినుకులు:** చెప్పుడుమాటలు. 2-253

**విప్రవినోది:** వి. కనుకట్టు చేసేవాడు, గారడివాడు, అసాధారణమేధావి. (తె.తె.ని.)

"అంచెల విప్రవినోదై తిరిగేటివాఁడు
కంచుమించైతిరి గాడీఁ గానరటే మీరు" 24-112

**వియ్యపువిందు:** వి. చుట్టాలకు సంబంధించిన విందు. 15-273 old

**విరజానది:** వి. వైకుంఠంలో నుండే దేవనది. ఇది తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామివారి పాదాల కిందినుండి ప్రవహిస్తుందని పెద్దల అభిప్రాయం. ఈ నదిలోని కొంతభాగమే స్వామివారి ఆలయంలో సంపంగి ప్రదక్షిణంలో ఉగ్రాణం ముందున్న చిన్నబావినే విరజానది అని, విరజాతీర్థం అని అంటారు.

"తిరమై వీరి పాదతీర్థమే విరజానది
సొరిది నన్నిచోట్లు చూచినట్టే వున్నది" 1-479

**విరవాది:** వి. 'విరజాజి'కి రూపాం. నవమాలిక.

"కలసిన కాఁకదేఱ గన్నేరుల వేసేరు
వలపులు రేఁగి విరజాజుల వేసేరు" 15-200

**విరవిర:** అవ్య. బిరబిర, తొందరగా, వేగంగా.

"దరిదాపు యితఁడే కాతగా వెనుకవేసుకో
విరవిరఁబాపాలు నావెంటఁబడినాను" 3-417

**విరవిరవీఁగు:** ప.బం; అ.క్రి. మిక్కిలి విఱ్ఱవీఁగు, నిక్కు.

"ఎరవుల తపముల నెంతైనా
విరవిరవీఁగుట వృథావృథా" 1-84

**విరసము:** వి. వైరస్యం, విరసత్వం; ధర్మవాచకానికి బదులు ధర్మివాచకం వాడడం అన్నమయ్యకు సహజమే.

"విరసము లే దీక విచారమేలా" 3-429

**విరహపడు:** అ.క్రి. విరహాన్ని పొందు.

"గరిమ విరహపడఁ గన్నులు మూసేఁగాని
నిరతి నీవు వచ్చేవని తలఁపే మూయదు"
9-111

**విరికాఁడు:** (విరి + కాఁడు) వి. మన్మథుడు. పుష్పాలు బాణాలుగా కలవాడని వ్యు. 3-400

**విరిమీఁది బిడ్డపేరి వెలఁది:** వి. అలమేలుమంగ, విరిమీఁది బిడ్డ = పువ్వున పుట్టిన బిడ్డ-ఆ పేరుగల స్త్రీ. (అలర్-మేల్-మంగకు సమానార్థకం)

"పొరి నీటిపేరి పాన్పున శ్రీవేంకటనాథ
విరిమీఁది బిడ్డపేరి వెలఁది నిన్నుఁగూడె"
10-2-137

**విరివికాఁడు:** (విరివి + కాఁడు) ఆధిక్యం కలవాడు.

"ఎరవులవా రెవ్వరు యిందులో నీకు,
విరివికాఁడవు నీవు విచ్చేయవయ్యా" 20-565

**విరివిగొను:** ప.బం; అ.క్రి. అతిశయించు.

"పరిపూర్ణమగు తుంగభద్రాతటమునందు
విరివిగొన్నాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు" 10-165

**విరుగాలి:** పువ్వుల వాసనతో వచ్చే గాలి. 'విరుల గాలి' యనుటకు బదులుగా 'విరుగాలి' అనడం. విలక్షణం.

"వెన్నెలల ముగ్గువెట్టి విరుగాలి తూరుపెత్తె

పన్నుకొని నిమ్మపండ్లు పట్టెఁగానుక " 23-63

**విరులాడు:** పూబంతులాడు.

"తచ్చనకాఁడవు నీవు తగులు విరులాడేవు
నచ్చుల గొల్లెతలెట్టు నమ్మిరయ్య నిన్నును "
21-20

**విఱవీఁగు:** ప.బం; అ.క్రి. విఱ్ఱవీగు, మిక్కిలినిక్కు.

"నిండెను నా కోరికలు నిముపు వారిధులై
వెండిబంగారాలతోడ విఱవీఁగవయ్యా" 4-241

**విఱిగిపోవు:** అ.క్రి. ఓడిపోవు, బెదరిపోవు.

"పోరి నీకును విఱిగిపోయిన దానవులు
బిరుదులుడిగి వోడ బేహారులైరి" 2-246

**విఱ్ఱవీఁక:** ప.బం; వి. విఱ్ఱవీగడం.

"విన్నవించుదాఁకా విఱ్ఱవీఁకలు
మున్నాడీఁ బులకల మూఁకలు" 25-295

**వివరము:** వి. విస్పష్టత.

"వివరమెందున్నదో వెలఁదికి వీను లివె
తవిలి నీ సుద్దులందే తావైనవి" 24-124

**వివాది:** వి. దిష్టి తీసేవాడు.

**వివేకించు:** (3) స.క్రి. ఆలోచించు, వివేచనచేయు.

"తివిరి చలములే సోదించితే నెఱఁగఁగాక
వివేకించితే మనసే వింత సొమ్ము గాదా"
21-147

**విషయములు:** వి; బహు. రూపరసగంధస్పర్శ శబ్దాదులు, చక్షురాది ఇంద్రియవిషయాలని భావం.

"మెఱయు విషయములె తన మెడనున్న యురులుగా
ఎఱిగినది యది గదా యెఱుక" 1-181

**విష్వక్సేనుడు:** వి. విష్ణుమూర్తి.

"వేడుకతో వీఁడె విష్వక్సేనుఁడు
కూడి యిందరునుఁ జూడరో జనులు" 4-286

**విసరించుకొను:** (4) రువ్వించు, తిప్పించుకొను, కురిపింపజేసుకొను.

"ఆవల నలసిన వారట్టె విసరించుకొంటే
నీ వలసిరావు గదా నీ వేల నవ్వేవు" 17-79

"వెలినున్న మాచేత విసరించుకొనరాదా
పలుమారు నేము సేసేపని యేమి నీకు" 27-53

"సరసమాడుతాను విసరించుకొంటాను"
1 అను. 6

**విసరు:** వి. విసరడం.

"వెలఁది పయ్యెదకొంగు విసరులు
కులుకునవ్వులలోని కొసరులు" 28-417

**విసవిస:** అవ్య. విస్సుమని, గాలివీచడంలోను, కత్తి మొదలగు వాటిని తిప్పడం, నవ్వడం, నడవడం, ఊదడం, కోయడం మొదలగు వాటిలోను అయ్యే ధ్వనికి అనుకరణం.

"విసవిస నాతనిచే విడె మందుకోరాదా" 23-14

"మొసలిమొకముసొమ్ములు సెవులనుఁ బెట్టి
విసవిస నవ్వీని వీఁడు గదమ్మా" 17-230

**విసుకు:** అ.క్రి. విసుగు, విసువు.

"మెలుపున వద్దనుండి మేను విసుకనేర్చు
తిలకించి చిటుకలు దియ్యనేరుచు" 18-176

**విసుపు:** (4) వి. విసుగు ధాతువు భావార్థకరూపం. విసువుతోపాటు విసుపు కూడా ఔతుంది. 1.విసుగు 2.రోత

"వేడుకలలోపల విసు పేల
వీఁడెమిచ్చీ నాతఁడు వేగ నందుకోవే" 11-60

## వీ

**వీఁడివో:** (వీఁడు+ఇవో) (వీడు+ఇదిగో > ఇగో; ఇవో) అవ్య. ఎదుటనున్న పురుషుని నిర్దేశించడంలో ప్రయోగింపబడే పదబంధం. రూపాం. వీఁడిగో, వీఁడుగో

"వీఁడివో లక్ష్మీపతి వీఁడివో సర్వేశుఁడు
వీఁడివో కోనేటిదండ విహరించే దేవుఁడు" 3-402

**వీఁడుదొడులు ఆడు:** పెనగొను.

"వింతగు నా వావులే వీఁడుదొడులాడించె
పంతము దనతో నేలే బతుకుఁగాక" 16-285

**వీండ్ల వాండ్ల మాటలు:** వి; బహు. ఎవరెవరివో మాటలు.
"వీండ్ల వాండ్ల మాటలు వినలేనురా" 21-505

**వీండ్లు:** వి; బహు. 'వీఁడు' శబ్దానికి బ.వ.రూపం. 'వీరు' అని అర్థం.
"ఆండ్లైరి గోపసతులంటానే బిగేసవు
వీండ్ల వాండ్ల మాటలు వినలేనురా" 21-505

**వీటఁబోవు:** ప.బం; అ.క్రి.1.చెడు, నశించు 2.దూషితమగు 3.వ్యర్థమగు.
"కాలమును వీటఁబోయె, కర్మమునుఁ
దెగదాయ
మూలనుండి యెవ్వరికి మొరవెట్టేను"
3-323 & 2-105
"తిన్ననై యెవ్వరి చేతి తిట్టు దాకిన విధమో
విన్ననై విజ్ఞానమెల్లా వీటిబోయఁదుదిని" 2-105

**వీటిబుచ్చు:** స.క్రి. వ్యర్థంచేయు.
"పోటుమీరిన యసురపురము లన్నియుఁజొచ్చి
వీటిబుచ్చి దుమ్ములుగా వేసినాఁడు" 6-43

**వీడని గంట:** ప.బం; వి. (?)
"యెగ్గులు వట్టేటిదానవు యేల రమ్మంటివే
ముందు
వొగ్గి వీడని గంటవై యుండఁగరాదా" 7-239

**వీడించుకొను:** స.క్రి. తొలగింపజేసుకొను.
"తనువుతో భోగాలు తగులు వీడగలేము
వెనక కర్మపాశాలు వీడించుకోఁగలమా" 3-549

**వీడిక:** (వీడు + ఇక) వి. వీడటం, విడివడటం.
"అనిశముఁ జెలులతో నాడికలు
వెనక చూడవయ్య వేనలి వీడికలు" 28-417

**వీడు:** వి. ఈ శబ్దానికి 'త్యాగము' అనే అర్థం ఉందనీ "చాలించరే జోలి వీడు చదివేవేళ" అనే సందర్భాన్ని బట్టి కన్యాదానం అనే అర్థంలో ప్రయోగించినట్లున్నదనీ, నేటి చదివింపులని కొందరు చెప్పిరి కాని అది ప్రాచీన సంప్రదాయం కాదనీ సం.ప.స.
"పాలవెల్లి కూతురుకు పసపులు నలఁచరే
చాలించరే జోలి వీడు చదివేవేళ" 20-182

"జాడతో శ్రీవేంకటేశ సతి మించితే నే మాయ
వీడెమి చ్చెనసితివి వీడుకూఁళ్లు వెట్టదా"
27-324
దీనికి వీడుటలు కూడుటలు కూడా అర్థంకావచ్చు అని సంపా. కాని కుడుపుపెట్టు అనే పదాలు పై అర్థమే యుక్తమని సూచిస్తున్నాయి.

**వీడుఁబట్టు:** ప.బం; వి. 1. నివాసస్థానం, ఉనికిపట్టు 2.బస, విడిది 3. శిబిరం.
"వెనుక మునుపులకు వీడుఁబట్టు జననము
కొనమొదలునుఁ దానే గురి యాయ నాత్మ"
2-386

**వీడుకు వీడగు:** (?) ప.బం; అ.క్రి. సరికి సరియగు, దెబ్బకు దెబ్బ వంటిది. (పద.)
"వీనులు చల్లఁగా వింటి వీడుకు వీడాయను
మోనమున నప్పటిని మొక్కితి నే ననరే"
23-205

**వీడుకూళ్లు:** వి; బహు. పెండ్లిలో వియ్యాలవారిని వీడుకొలిపే సందర్భంగా ఇచ్చే విందుభోజనాలు.
"వియ్యాలంది వీడుకూళ్లు వేమారుఁ గుడుప
నీవే
వొయ్యనె తనకు లోనై వుండేఁగాని" 11-147

**వీడుజోడు:** ఎడబాటు పొందినది - సాగనంపే తోడు.
"కూడి వుండినట్టిచోట గుఱుతు వెతకనేల
వేడుకలకు వేడుకలే వీడుజోళ్లు"

**వీడుజోడుది:** వి. ఈడుజోడు గలది, సమానురాలు.
"యెనసితి శ్రీవేంకటేశ యిదివో నిన్ను
వెనకముందర నీకు వీడుజోడుదాననే" 16-311

**వీడుదోడాడు:** ప.బం; అ.క్రి. పెనగు.
"వెడవెడని తమ్ములము వీడుదోడాడ మన
సదరీని తలఁప వెరపయ్యీని" 6-98

**వీడుదోడాడు:** (?) ప.బం; స.క్రి. 'వీడుజోడాడు'కు రూపాం. కావచ్చు.

1.మాఱుమలయు, ప్రతిఘటించు 2.పెనగొను 3. సరిపోలు 4.వ్యత్యస్తమగు.

"వీడవు మన పొందులు విట్ఠలేశ్వరా!
వెస వీడుదోడాడే వీడెములఁ బచ్చిదే
వుసురు నూరుపులతో నున్నాఁడు వీఁడే"
24-151

**వీడుదోడు:** వి. సాగనంపు సహాయుడు, పంపించే తోడు.

"వేడుకతోడుత శ్రీవేంకటేశుఁడీకెఁ గూడె
వీడుదోడై యుండుఁగాక వింత లేల సేసునే"
16-427

**వీడుదోడు:** విణ. సదృశమైన, ఈడుజోడు.

"ఆడినదే యాటా ఆకెఁజక్క జూడరాదా
వీడుదోడు వయసులు వేడుకోవెట్టో" 7-328

"వీడుదోడాయ వలపు వెలఁదికి నీకును
చూడఁజూడ వేడుకాయ చూచువారికిని"
18-109

**వీడుదోడులాడు:** అ.క్రి. పెనగొను, మారుమలయు, ప్రతిఘటించు, వ్యత్యస్తములగు, తారుమారగు.

"విందుగాఁ దమ్ములములు
వీడుదోడులాడఁగాను
అంది చిగురుఁగత్తులాయ చెలి మోవి" 14-150

**వీడుదోల్లాడు:** అ.క్రి. చూ: వీడుదోడులాడు.

"వెల్లివిరి నవ్వఁగాను వీడుదోల్లాడకున్న
చల్లేటి వలపులేవి? సట లింతే కాక" 7-11

**వీడుప(వి)డు:** అ.క్రి. 1. భేదపడు, వేర్పడు 2. తడబడు, తారుమారగు.

"వేడుకైతేఁ జాలు నీకు వేమారుఁ బుప్పలను
వీడుపడకుండా నన్ను వేయవయ్యా" 23-512

**వీడువెట్టు:** ప.బం; స.క్రి. విడిచిపెట్టు, వదలివేయు. (తె.వ్యు.కో.)

"కాయకపుగాడిదెకు కవణము వెట్టి మరి
వీయపుచుట్టాలెల్ల వీడువెట్టరో" 3-461

**వీడెములో కప్పురము:** ప.బం. ఎటూ పోనిది.

"ఏడనుండా నా సొమ్ము యెందు వొయ్యీనే
వీడెములో కప్పురమే వీని వలపెల్లను"

**వీడేలు:** వి. 'విడేలు'కు రూపాం. తాంబూలాలు.

"అక్కజమై సతి నీకు నడపము పట్టఁగాను
పెక్కు వీడే లింతులకుఁ బెట్టవయ్యా" 7-110

**వీణమెట్టు:** వి; బహు. సరకట్టు, సారె.

"మీటఁగా గట్టిన వీణమెట్టు చక్కఁబెట్టఁబోతే
పాటించి బాహుమూలాలు బయటఁబడె"
26-292

**వీదరవెల్లితనము:** (వీదగవెల్లి + తనము) వేదరువెల్లితనము > విదురువెల్లితనము. పిచ్చిపొంగిన లక్షణము.

"పాదువలె నందరి చన్నులపైఁ జేయి చాఁచు
వీదరవెల్లితనాల వేంకటేశుఁడు" 24-368

**వీదరవెల్లిపొందులు:** వి. (వెల్లి + వెల్లి = వీదరవెల్లి) కావచ్చును. ప్రసిద్ధనిఘంటువుల్లో ఈ పదం ఎందులోనూ కానరాదు. 'వెల్లి' కి పరంపర, ప్రవాహం అనే అర్థాలు ఉన్నందువల్ల ఈ పదానికి మిక్కిలి ప్రవాహరూపంలో వచ్చే అని కానీ, మిక్కిలి పరంపరగా వచ్చే అని కానీ అర్థం చెప్పవచ్చునేమో!

**వీదిఁబోయేది:** వి; ప.బం. సాధారణస్త్రీ.

"వీదిఁబోయేదానితోడ వెస నవ్వుతాఁగాక
యీ దెసకుఁ బిలిచేవు యింత వలెనా" 11-215

**వీది:** (14) 'వీథి'కి జానపదవ్యవహారరూపం. అన్నమయ్య అంతటా 'వీది' అనే పదాన్నే వాడినాడు. ప్రాస స్థానంలో 'ద' వాడబడింది కనుక ఇది నిర్ధారకం.

"వీదిలోన నదే కదే విష్ణుపదము
ఆ దెసనే పాయకుందు నాదిమూలము" 2-418

**వీదికట్టువారలు:** (వీది+కట్టు+వారలు) ప.బం; వి; బహు. వాడకట్టువారు, వాడలోనివారు.

"ఇంతవాఁడవు గాకున్న యేది దూరతనము
వింతకు తలలూచేరు వీదికట్టువారలు" 13-17

**వీథులేగించు:** స.క్రి. ఊరేగించు.

"పాదరె సోబనాలు పైపైనె పేరటాండ్లు

యాడాడ ననక వీధులేగించారే" 15-55

వీధులేగు: అ.క్రి. మెరవణిపోవు, ఊరేగు. 11-70 old

వీనుల జేర్చి విను: స.క్రి. సావధానంగా విను. 2-204

వీనులపండుగ(వ): (4) వ.బం; వి. శ్రోత్రపర్వం, కన్నులపండుగవంటి పదం, చెవులకు ఆనందాన్ని కలిగించేది, వీనులవిందు.

"వేమరు నాలకించఁగా వీనులపండుగ లాయ
కోమలితో నీవాడే గురిమాటలు" 9-88

వీనులు చిల్లులగు: వ.బం; అ.క్రి. చెవులు భరింపలేకపోవు.

"వీనులెల్లఁ జిల్లులాయ వినివిని నీ కతలు
పూనిన నా మనసెట్టు వొడఁబడీ నీకను" 13-468

వీపు బట్టగట్టు: వ.బం; అ.క్రి. మిక్కిలి శ్రమించు, అట్టగట్టు.

"ఇట్టు నట్టు మిట్టిపడ్డ నింమకంతా లేదు వీఁపు
బట్టగట్టు మోపు మోఁచి పాటుపడ్డాలేదు" 1-55

వీరనరసింహుఁడు: వి. అహోబలంకొండపై ఒక గుహలో చక్రాకారంగా కొండనీటిధార అడుగుభాగంలో ఒక అరుగుమీద పదిభుజాలతో వెలసిన నృసింహస్వామి. నవనారసింహుల్లో ఒక స్వామి.

"సతతప్రతాపరౌద్రజ్వాలా నారసింహా
వితత వీరనరసింహా విదారణా" 1-453

వీరి(ఱి)డి: వి. అవివేకి, మూర్ఖుడు.

"నీవే మంచివాఁడవయ్యా నేనే వీరిడిఁగాని"
"నెప్పున శ్రీవేంకటేశ నేనూ నీవూ నొక్కటే
యిప్పుడే వీరిడి మరుఁడింత సేసఁగాని" 7-2

వీరిడికత్తె: (వీరిడి + కత్తె) వి. వివేకం లేని స్త్రీ, మూర్ఖురాలు. (తె.వ్యు.కో.)

"మగనాలి కేటికే మంకుఁదనాల వొట్లు
తెగనాడే వీరిడికత్తెలకుఁగాక" 26-345

వీరుత్తరాలు: (వీర+ఉత్తరాలు?) వి. ఘాటైన సమాధానాలు. విలక్షణప్రయోగం.

"యీరసమ నా కున్నదా యింత నీవు
చుట్టమవా
వీరుత్తురాలు మాతోను విడువవే ఇఁకను" 27-260

వీలు: అ.క్రి. చీలు, పగులు.

"గాలి యావటించి యిచ్చీఁ గారుమేఘము
మింట
వీలి జీర్ణమై యిచ్చీ విక్రమార్కుని బొంత" 1-455

"చాలుగ నడచి సారెకు నిలచి
వీలుచుఁ బయ్యెద విసరీని" 20-142

వీలు: స.క్రి. వదలు.

"మేలిమి శ్రీవేంకటేశుమీఁద భారము వేసుక
వీలక తనలో విజ్ఞివీఁగువాఁడే నిత్యుఁడు" 2-117

వీసమంత: (9) విశ. కొంచెం, కొద్ది.

"వేసరించఁజూమీమ్మ త్రివిక్రమ నిన్ను
వీసమంత పనికే త్రివిక్రమ" 15-243

వీసముచేయు: వ.బం; అ.క్రి. కొద్దిపాటి విలువచేయు.

"వీసము సేయనందుకే విడనాడే వాఁడు దాను" 10-508

వీసరపోవు: వ.బం; అ.క్రి. వెడలివడు, వెలితిపడు, తగ్గు, (తె.వ్యు.కో.), విసరబోవు, కించిద్భంగమగు, (ఆం.ధా.మా.) వ్యర్థమగు. (తె.జా.)

"ఆసలనాసల హరినెఱగక చేడి
వీసరపోయిన వెఱ్ఱులను" 1-241

## వృ

వృషభాసురుఁడు: వి. (?)

"పగుల పగుల వృషభాసురునిఁ జంపె
పగ నీఁగే అతని బలములతో" 2-108

## వె

వెంగము: వి. 'వెంగెము'కు రూపాం. వెకిలితనం.

"నేనే వింతగాని నీ చుట్టాలవేయివి
కానుకగా నేదెచ్చితే కడు వెంగమనేవు" 7-371

"పొదిగి నీ చేఁతలెల్లా పొగడుతా నుండఁగాను
వెదకి వెదకి యాడే వెంగ మనేవు" 8-108

**వెంగలితనము :** (వెంగలి + తనము) వెఱ్ఱితనం, అవివేకం, మూర్ఖత్వం. (తె.వ్యు.కో.)

"దొంగిలి గజ్జలపేరు గొలఁగఁ బెట్టఁగఁబోతే
వెంగలితనమే కాక వినక మానరే" 10-2-45

**వెంగెపుమాట :** వి. వేళాకోలపుమాట, వెకిలితనపుమాట.

"వెల లేని కొసరుల వెంగెపుమాటలే వన్నె
చలి వాసినట్టి రాజసములే వన్నె" 21-254

**వెంగెమాడు :** (11) ప.బం; అ.క్రి. పరిహాసమాడు, వ్యంగ్యార్థం వచ్చేట్లు మాట్లాడు.

"మొకమోట గల సతి మొక్కనే నేరుచుఁగాని
వెకలిఁయై యెంతైనా వెంగెమాడదు" 12-20

"మనసిచ్చి నే నీతో మాటలట్టి ఆడఁగాను
వెనక సుద్దులకేల వెంగెమాడేవే" 9-212

**వెంగెము :** (18) వి. పరిహాసోక్తి, వ్యంగ్యంతో కూడిన మాట.

"పచ్చడము గప్పితేను పట్టి తీసితి ననీని
యిచ్చకమాడితే వెంగె మేటికనీని" 14-67

**వెంగెములాడు :** (14) ప.బం; అ.క్రి. పరిహాసోక్తులు పలుకు.

"వేలుఁగొప్పుతోడ నీవు వెంగెములాడఁగాను
కోలుముందుగా నిన్నుఁగోర గీరెనతఁడు"
25-223

**వెంగేలాడు :** (5) (వెంగెములు + ఆఁడు) అ.క్రి. చూ : వెంగెములాడు.

"వెనకటి సుద్దులకు వేవేల వెంగేలాడితి
నినుపు నిజమరివి నీకుఁదప్పు లున్నవా" 7-525

**వెంగొంగనామము :** వి. తెల్లనికొంగనామము, శ్రీవైష్ణవులు ధరించే నామం.

"సింగారానకు నొక్కఁడు చిన్న తిరుమణిపెట్టు
వెంగొంగ నామమువెట్టు వెక్కిరింపుచు
నొక్కఁడు" 15-325

**వెంజామరము :** (2) (వెల్ల + చామరము) తెల్లని చామరము.

"వెండిపైఁడి గుదె లవె వెంజామరము లవె" 2-79

"జామురాఁకాఁ దనకు వెంజామరము వేసితి
నేమి సేయుమనీ నన్ను నింతే కాదా" 20-139

**వెంటలు[1] :** (?)

"జంటవాసినఁ జంపుదుమని లేని
వెంటలు గడియించి వేఁచేరే" 5-139

**వెంటలు[2] :** అవ్య. వెంటకు బహువచనరూపం. విలక్షణ ప్రయోగం. చూ : వెంట్లు.

"ఎందరివెంటల నేగేము
చందపు హరి నీ శర ణనియెదము" 4-265

**వెంటిక :** వి. వెంట్రుక.

"వెంటిక పట్టుకపోయి వెసఁగొండవాఁకుట
వెంటఁగర్మమార్గమున విష్ణుని సాధించుట"
2-49

**వెంటిక పట్టుకపోయి వెసఁగొండ వాకు :** ప.బం; అ.క్రి. బలహీనమైన సాధనంతో అసాధ్యమైన కార్యానికి పూనుకొను, వ్యర్థప్రయత్నం చేయు.

"ముంటిపై సుఖమందుట ముక్కున
నూరుపువట్టి
దంటవాయువు గెలువఁ దలఁచేదెల్లా
వెంటిక పట్టుకపోయి వెసఁగొండవాఁకుట
వెంట గర్మమార్గమున విష్ణుని సాధించుట"
2-49

**వెంటెన :** వి. (?)

"వేసర నీ కుంటె నలువేవేలు వెంటెనలు
తాసున వేసి చూచితే తన కేమి బాతే" 19-479

**వెంట్లు :** అవ్య. 'వెంట' (వెంబడి)కు బహువచనరూపం. విలక్షణప్రయోగం.

"వూరఁజుట్టమైనవాఁడు వొదిగి వుండగ నేలే
ధీరత ఇండ్లవెంట్ల దిరుగుఁగాక" 26-379

**వెండిశికరమువాఁడు :** వి. శివుడు.

"వెండిశికరమువాని వెఱ్ఱి యీవి తుదముట్టి

వండని కూటివారికి వైపాయఁ బనులు" 7-277

వెండ్లు: వి. 'వెండి'కి బహువచనరూపం. వెండి, బంగారం మొ॥ లోహవాచకపదాలకు బహువచనరూపా లుండవి వ్యాకర్తల మతం. అందువల్ల ఈ రూపం విలక్షణం. ఇట్లే బంగారులు అనే రూపం కూడా కనిపిస్తుంది.

వెంబాలవెల్లి: (2) (వెల్లి + పాలవెల్లి) వి. తెల్లని పాలసముద్రం.

"వెన్నెలఁగాయఁగాఁ జూచి వెంబాలవెల్లి యనేవు

తన్నుఁదానే పతిరాక తడసెనటే" 17-207

వెకలితనము: వి. అవివేకం, మూర్ఖత్వం, వెకిలితనం.

"మొకదాకిరివి నీపై మోహమే చల్లుఁగాని

వెకలితనాన నిన్ను వేసరించదు" 23-180

వెక్కసపుటడియాస: వింత అడియాస.

"మిక్కుటపుఁదమకము మీఁదు మెం(యెం)చదు

వెక్కసపుటడియాస వేసటెంచదు" 26-380

వెక్కసపు నేర్పు: వింత నేర్పు.

"వెక్కసపు నేర్పులు శ్రీవేంకటేశుకొరకా

మిక్కిలి యీతనిచేత మెప్పించుకొంటివి"

26-274

వెక్కసపుమాట: వి. దుస్సహమైన మాట.

"వెక్కసపు మాటలాడి వేడుకలు పచరించి

కక్కసించీ రతులకు కతకారి వనిత" 26-254

వెక్కసము: (4) విశే. 1. మిక్కుటము, అధికం 2.దుస్సహం 3. దుర్లభం 4. ఆశ్చర్యం.

"వెక్కసపుజవ్వనాన విఱ్ఱవీఁగే చెలి గాన

పక్కన నేమైనాఁ జేయఁ బాడి గాదు ఆపకు"

14-124

వెక్కసాలాడు: ఎకసక్కెములాడు.

"చక్కని విభుని సారెకుఁ జెలులు

వెక్కసాలాడక విడరో" 5-187

వెక్కసి: (వెక్కసము + ఇ) వి. దుస్సహు(డు)రాలు, హింసకు(డు)రాలు.

"తక్కినవారి కింత తగునా నేఁడు

వెక్కసి గనక నిన్ను వేమారు దూరీని" 26-388

వెక్కసీఁడు: (వెక్కసము + ఈఁడు) సహించ శక్యంకాని వాడు.

"చెక్కలువార గోళ్లఁ జించి చెండాడినయట్టి

వెక్కసీఁడు వీఁడివో వీరనారసింహుఁడు" 4-162

వెగట్లాడు: అ.క్రి. చేదుమాటలాడు, విరసపు మాటలాడు, సరిపడని మాటలాడు, అసహ్యించుకొను.

"మగవారి చేతలకు మానినులైనవారు

వెగట్లాడకుండరు వేయైనాను" 7-19

వెగ్గలిం(ళిం)చు: (68) స.క్రి. తోసిపుచ్చు, (తె.వ్యు.కో.) తిరస్కరించు, వెక్కిరించు, మితిమీఱు. (ఆ.మూ.)

"యెగ్గుదీర శ్రీవేంకటేశుఁడిట్టె నన్నుఁగూడె

వెగ్గళించి మోవితేనె విందుపెట్టరాదా" 20-542

వెక్కిరించు:

"సిగ్గుపడ కింటిపనే చేసీ నేను

వెగ్గళింపఁదగునా వెఱ్ఱి నింతేకాక"

అతిశయించు:

"వినయము చేసితేను వెగ్గళించు మోహము

ననుపు చక్కనయితే నాటు మోహము" 24-557

వెగ్గళము: (15) వి; మాం. అతిశయం, అధికం. 'ఎగ్గలమై పోయింది' అని రాయలసీమ వాడుక.

"తానాడిన సరసము తనకు వెగ్గళమైతే

నే నేమి సేతునే యాల నెపాలు వేసేనే" 12-457

"వెగ్గళించఁజూచితేను వేసటలౌను అందు

వెగ్గళమైతే వలపు వెల్లివిరిసీని" 13-536

వెచ్చఁజెప్పు: ప.బం; స.క్రి. అమ్ము, విక్రయించు.

"వేంకటవిభుండ! నీకు వెచ్చఁజెప్పఁగా

ఉంకువగా నాకు నబ్బె ఉదుటు నీ చేతలు"

5-91

వెచ్చపువలపు: వి. క్రయ విక్రయాదులకు లోబడే ప్రేమ, విటుడు చూపే ప్రేమ (?)

"వలదు వోరి వెచ్చపువలపు నీ దెల్లాను

పలుమారు నిట్ల నాపైఁ బూయవలెనా" 5-278
"వలదు వోరి వెచ్చపు నీ వలపులోని
దాహమెల్లా నాతోనే యింతటఁ జూపవలెనా"
5-278

వెచ్చపెట్టు: (వెచ్చము + పెట్టు) వ్యయంచేయు, వెచ్చించు, పాడుచేయు.
"వెచ్చపెట్టఁడు గదా వేడుక నెవ్వరికైనా
అచ్చలాన నే నా సుద్ది యడుగుదునా" 7-51

వెచ్చమగు: అమ్ముడుపోవు.
"వేంకటవిభుఁడ నీకు వెచ్చమైతిఁ జెప్పరా
వుంకువగా నాకు నచ్చె ఉదుటు నీ చేతలు"
15-91

వెచ్చిచేతలు: పరిపక్వమైన చేష్టలు.
"బద్దులో నిజమోకాని పచ్చివెచ్చి చేతల
వొద్దికతో బందుబండై వున్నాఁడటా" 11-183

వెచ్చివేవు: వ.బం. అ.క్రి. పరిపక్వమగు.
"యెలమి నీతో నాపె యిచ్చకము లాడఁగాను
వెలయ నీ మాట వెచ్చివేవదాయను" 7-801

వెచ్చు: అ.క్రి. 1. సంతాపం పొందు 2. కాలు 3. కాగు 4.ప్రజ్వలించు.
"వెచ్చిన (నీ) మేని సొంపు వింత దోచె నేటికే
మచ్చిక నీ కోరికెలు మదమెక్కె నేటికే" 6-78

వెట్ట: వి. 1. వేడిమి 2. తాపం 3. వేసవికాలం విశే. వేడి, ఉష్ణం.
"వెట్టగా రావణురొమ్ము విరుగఁ జేతనే గుద్ది
నిట్టతాడువంటివాఁడు నీ బంటు" 1-69
"వెల లేని వెన్నెలలు వేగినంతాఁగాయఁగాను
వెలనుండే యెవ్వరికి వెట్టఁబడఁ దగునా"
23-358

వెట్టఁబడు: (2) వేడియగు.
"వెలలేని వెన్నెలలు వేగినంతాఁగాయఁగాను
వెలినుండే యెవ్వరికి వెట్టఁబడఁదగునా"
23-458

వెట్టకాయము: వి. వేడిశరీరం.
"దట్టపుటాసల నేఁదాల్చితి నట నా
వెట్టకాయము మోవ వెఱచేనా" 1-169

వెట్ట చేతలాఁడి: వి. ఉగ్రమైన పనులు చేసే స్త్రీ.
"వెట్టచేతలాఁడివైనా వీఁకకుఁదేవచ్చుఁగాని
చుట్టపు సూడుఁదానిఁ జొక్కించరాదు" 23-107

వెట్టసంసారము: వి. కటకటగా నడిచే సంసారం. ఇది "వెట్టి సంసారము" కావచ్చు. ప్రయోజనం లేని సంసారమని అర్థం.
"వెట్టసంసారమిది వేంకటేశుఁగొలువని
వట్టి మనుజుల పెడవాడఁ బెట్టుఁగాక" 1-177

వెట్టికొసరు: ప్రయోజనంలేని కొసరు.
"ఎట్టున్నదో నా మనసు యెఱఁగ నేను
వెట్టికొసరులు నీపై వేయఁగవచ్చేనా" 21-178

వెట్టిగాఁడు: వి. ప్రతిఫలం ఇవ్వకయే అనుభవించు వాఁడు.
"రట్టడి వేంకటరమణుఁడ గలసితి
వెట్టిగాఁడ యింక విడు విడు చెఱఁగూ" 6-91

వెట్టిమాన్యము: వి. వెట్టిపని చేసినందుకు ఇచ్చే మాన్యం.
"మీటి శ్రీరమణుని మెప్పించు సేవకులకు
వీటిడికర్మముల వెట్టిమాన్యము" 15-110

వెట్టిమోపు: వి. ఫలం లేకుండా మోసే మోపు, వెట్టికి మోసే మోపు.
"వెట్టిమోపువంటి మేను విడనాడి వీఁ
డిట్టె దాటిపోయె నెటువంటి జాణో" 1-173

వెట్టివేములు: వి. కూలి ఇవ్వకుండా చేయించుకునే పని, వెట్టివేతనం.
"వట్టి జా లింకేల దేవతలాల మునులాల
వెట్టివేములు మానెను వెరవకుఁడీకను" 10-1-32

వెడ: విశే. 1. అల్పం 2. తుచ్ఛం 3. వికృతం 4. వ్యర్థం 5.ఇంచుక.

వెడమాటలాడు: అ.క్రి. అల్పపుమాటలు పలుకు.
"వేసరించఁ జూమ్మీ వెడమాటలాడి నేను
ఆసపడి సరసము లాడుదుఁగాని" 12-185

**వెడవికారి:** తుచ్ఛమైన వికారం కలది.

"మొగము చూపుకొంటాను ముందర నిలుచున్నది
వెగటుగా నవ్వీవెంత వెడవికారి" 29-524

**వెడవెడ:** విణ. మిక్కిలి చిన్నవైన.

"వింతవింత నీ మేని వెడవెడ గురుతులు
కొంతగొంత వొడగని కోపమాయను" 21-280

**వెడ్డువెట్టు:** (15) (వెడ్డు+పెట్టు) వంచించు, మోసగించు అనే అర్థాలు శ.ర.లోనూ, తె.వ్యు.కో. లోనూ చూపబడ్డాయి. నిర్బంధించు అనే అర్థం సం.ప.స. లో చూపబడింది. (27-203 పు.) కాని ఈ పదానికి పెక్కు ఉదాహరణల్లో 'బుజ్జగించు' అనే అర్థం సరిపోతుంది.

"బిడ్డలేమి యియ్యఁగాను ప్రేమముతోఁ గన్నతల్లి
వెడ్డువెట్టి చన్నిచ్చి వెసఁబెంచును" 15-33

"చెప్పుమంటా నన్ను నేల చేరి వెడ్డువెట్టేవు
తప్పక చూచితేనే తలవంచితి" 27-30

సంపాదకు లీ కీర్తన పాదంలోని వెడ్డువెట్టేవు అనే దానికి నిర్బంధించేవు అనే అర్థం సూచించినారు. ఇటపై రెండర్థాలూ కుదరవచ్చు.

**వెడ[1]:** వి. 'వ్యథ'కు వికృతిరూపం.

"నిరతరతి సుఖము నిమిషములోనిదే
విరహపువెడలు వేవేలు" 3-329

**వెడ[2]:** వి. విత్తుట.

"నెక్కొని యంతవట్టును నీమీఁదనే జల్లితేను
వెక్కసమై పులకలు వెదకు మొలచెను" 23-165

**వెదపడు:** ప.బం; అ.క్రి. నాటబడు.

"వెదవడి పుత్రులు పౌత్రులే విత్తులు లోలో మొలచియు
పొదిఁగర్మపు పూ మారదు పూ పిందెయిన దిదే" 1-482

**వెదవెట్టు:** (9) స.క్రి. విత్తు, నాటు, (తె.వ్యు.కో.) ఎరువులు మొ॥ వాటితో సారవంతం చేయు.

"శేరడపు నవ్వులే కిమ్ముల వెదవెట్టఁగ
సారెసారె ని న్నెట్లు సాదించేము" 23-566

"యిది నీపై యాసల నిట్టె మేను పులకించె
వెదవెట్టక పసులు వేవేలు మొలచెను" 23-127

"పొలమెల్లాను చిలుకపలుకులే వెదవెట్టి
నెలవుకు నిన్నుఁ బిలిచే నేరుపులను" 28-8

"వెదవెట్టి లోకములో వేదములన్నియు మంచి
పదములు సేసి పావనము సేసెను"

**వెనకతియ్యు:** అ.క్రి; ప.బం. వెనుదీయు, వెనుకంజవేయు.

"వేడుకకుఁ దోడువచ్చి వెనక తియ్యఁగరాదు
వాడికకుఁ జోటిచ్చి వద్దనరాదు" 23-231

**వెనక నుయ్యి తగరు ముందట:** ప.బం. ఎటుచూచినా ప్రమాదమే అని భావం. వెనుక నుయ్యి ముందర పొట్టేలు అని వాచ్యార్థం. 'ముందు గొయ్యి వెనుక నుయ్యి' అనేది ఇటువంటిదే. రెండువైపులా పొంచి ఉన్న ప్రమాదం.

"తలఁప వెనక నుయ్యి తగరు ముందట దీన
దొలఁగ నాకుఁదెరువు దోఁపదేమి సేతు" 1-310

**వెనకముందర చూచు:** ప.బం; అ.క్రి. లాభనష్టాలను చూచు.

"తనియకాసలనే తగిలేటి బ్రదుకు
వెనకముందర చూడ వెరపయిన బ్రదుకు"
1-348

**వెనకముందు ఎంచు:** ప.బం; అ.క్రి. సంకోచించు, సందేహించు.

"వెనకముందెంచనేల వెఱపులు మఱియేల
ఘనముగఁ బాలు నీరు గలసినట్టాయను"
20-561

**వెనకవేసుకొను:** (3) ప.బం; స.క్రి.
1. బలపరచు, సమర్థించు, వత్తాసుపలుకు
2. దాచుకొను, పొదుపుచేయు.

"భామ లెవ్వరైనా నిన్ను బతిమి చెరిచినాను
వేమారు నిన్ను వెనక వేసుకోకపోవునా"
19-474

**వెనకాముందు :** ప.బం. ముందూ, వెనకా.
"అల్లుకొనెఁ గర్మములు అక్కడికి నిక్కడికి
వెల్లవిరాయ మాయ వెనకాముందు" 2-490

**వెనవెనక :** (3) (వెనక + వెనక) వెనుకవెనుక, మిక్కిలివెనుక.
"మునుకొని వెదకితే ముక్కు నూర్పు గాలికొన
వెనవెనకఁ దిరిగీ వీడివో హరి" 8-57

**వెనుబలము :** వి. వెన్నుబలం, సహాయం.
"ఘనుఁడ శ్రీవేంకటేశ కాఁగిలించి నన్ను నేలి
వెనుబలమై యుండఁగా వెఱపేఁటికి" 23-511

**వెన్నకుఁ బండ్లు వచ్చు :** (2) ప.బం; అ.క్రి. అల్పుఁడు బలవంతుడైనాడనే అర్థంలో వాడబడే పదబంధం. వెన్నపూసకు కఱువ పన్నులు వచ్చు అని వాచ్యార్థం. అసంభవమగు.
"పస గల తిరువేంకటగిరిపతి నా దేహపుఁ బురి సీ
వసమై వెన్నకుఁబండ్లు వచ్చిన యట్లాయ"
1-72

**వెన్నకొద్ది నెయ్యి :** ప.బం; వి. కారణాన్నిబట్టీ కార్యం.
"వేడుక శ్రీవేంకటేశ వెన్నకొద్దే నెయ్యీ" 14-200

**వెన్నచిట్టి :** వి. చిన్న వెన్నపావు, చిన్న వెన్నపాత్ర.
"ఇంత బాఁతిపడేవాని నేల మాకుఁదక్కరించ
చెంత నిదే వెన్నచిట్టీఁ జిట్టిఁడేసి వలపు" 7-180

**వెన్న చేతఁబట్టి నేయి వెదకు :** ప.బం; అ.క్రి. సాధనం చేతిలోనే ఉండగా మరోచోట వెంపరలాడినట్లు.
"వెన్న చేతఁబట్టి నేయి వెదకినట్టు
యెన్నఁగ నీ వుండఁగాను యెక్కడో చూచేను"
4-118

**వెన్నట్టు :** వి. భక్ష్యవిశేషం.
"తేనెలు జున్నులు తెంకాయ పాలును
ఆనవాలు వెన్నట్లును" 6-4

**వెన్నతోఁ బాముచపెట్టు :** ప.బం. చిన్నతనంలోనే నేర్పు.
"పక్కన నవ్వఁగానే పైకొని పంతమాడేవు
మొక్కళము వెన్నతోఁబాముచఁ బెట్టిరా"
25-384

**వెన్నతోఁబెంచు :** ప.బం; స.క్రి. పుట్టిననాటినుండి పెంచు.
"వెన్నతోఁబెంచే దేవుఁడు వివేకమిచ్చే దేవుఁడు
యెన్నని పొగడవచ్చు యీతఁడే మా దేవుఁడు"
4-496

**వెన్నతోఁబెట్టు :** ప.బం; స.క్రి. చిన్నతనం నుండీ నేర్పు, ఉగ్గుపాలతో పెట్టు.
"వెన్నతోఁబెట్టిరి నీకు వేసాలెల్లాను
పిన్ననాడే గొల్లెతలు పెక్కు చందములను"
13-299

**వెన్నతో కలుగు :** ప.బం; అ.క్రి. బాల్యంతోనే కలుగు.
"అన్నిమంత్రములు నిందే యావహించెను
వెన్నతో నాకుఁ గలిగె వేంకటేశుమంత్రము"
11-143

**వెన్నతోడఁబెట్టు :** ప.బం; స.క్రి. బాల్యంనుండే నేర్పు, పుట్టుకతో నేర్పు.
"తోయఁదోయఁదల్లి వెన్నతోడఁ బెట్టె ముచ్చిములు
పోయఁబోయ గొల్లి దోమటాయఁబో మా పెరుగు" 9-73

**వెన్నతో నిడు :** ప.బం; స.క్రి. పుట్టుకతో నేర్పు.

**వెన్నదిన్న నోటనే వేఁడిపాలు దాగు :** ప.బం; అ.క్రి. సుఖం అనుభవించిన దానితోనే దుఃఖాన్ని కూడా అనుభవించు.
"వెన్నదిన్న నోటనే వేఁడిపాలు దాగినట్టు
వెన్నెగా మాటాడీ యేల వెంగెమాడేవే" 20-31

**వెన్నదుబ్బలు :** వి. వెన్నదిబ్బలు.
"తొడనె వెన్నదుబ్బలు తొడుక నేల వచ్చీని
వేడుకకాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు" 7-134

**వెన్న నూరు :** నిరర్థకమగు పని చేయు.
"మిన్ననూయి చేఁతాటఁజేది మెచ్చిమింగు
నొక యోగి

వెన్న సన్నముగ నూరి వీఁగు నొకయోగి "

2-125

**వెన్నపూసినట్టివారి వెలిమిడి పూయు:** ప.బం; అ.క్రి. ఆదరించిన వారిపైనే నిరాదరణ చూపు. వెన్నపూసిన వారికి వెలిమిడి (బూడిద) పూయడమని వాచ్యార్థం.

"వెన్న పూసినట్టివారి వెలిమిడి పూయలేక

పన్ని నీవు పలుకఁగఁ బలికేఁ గాని" 22-151

**వెన్నముచ్చిమి:** వి. వెన్నదొంగతనం. 7-195

**వెన్నలో కలి:** ప.బం; వి. అసంభవం. 2-118

**వెన్నలో నేతివంటిది:** ప.బం; వి. అంతర్భూతంగా ఉండేది.

"అన్నియుఁ దెలిసినవే అందరును

వెన్నలో నేతివంటిది వేడుక నీ ప్రియము "

19-148

**వెన్నవంటి మనసు:** వి. అతిమృదువైన మనస్సు

"వెన్నవంటి మనసు వేఁడివంటి దీ వలపు "

18-336

**వెన్నవట్టుక (కొని) నేయి వెదకు:** ప.బం; సాధనం చేతిలో ఉండగా మరొకచోట వెంపరలాడు.

"సరవి నీ వొళ్లి జాణతనమెట్టిదో

నిరతి వెన్నవట్టుక నేయి వెదకేవు"

16-422 & 2-33

**వెన్న వేసినవారిని రాత వేయు:** ప.బం; అ.క్రి. ఆదరించినవారిని అవమానించు.

"వెన్న వేసినవారిని వెస రాత వెయ్యరాదు

అన్నిటా జాణఁజేసితి నటు మీరవద్దురా" 13-58

**వెన్న సన్నగ నూరు:** ప.బం. వృథా ప్రయత్నం చేయు. 2-125

**వెన్నెకాఁడు:** వి. వన్నెకాఁడు. 'వె' యతిస్థానంలో ప్రయోగింపబడింది.

"కన్నుల జంకించక కాఁగిట నే నించితేనే

వెన్నెకాఁడవై కడు వెరగందేవు" 27-215

**వెన్నెలకాలము:** వి. శరదృతువు.

"పొటపొట నవ్వు మోవిఁ బొడ నటు నవ్వితేను

నీటున నీ పతికి వెన్నెలకాలము " 17-522

**వెన్నెలకువ్వ:** వి. వెన్నెల కుప్ప.

"యిన్నిటా శ్రీవేంకటేశ యెంచి చూచకుంటేను

వెన్నెల కువ్వ లెల్లా వెలకెక్కీనా" 21-214

**వెన్నెలగలనాఁడే అల్లునేరేళ్లు:** నానుడి; అల్లోనేరేళ్లు అనే ఆట వెన్నెల ఉన్నప్పుడే ఆడే ఆట. అనుకూల్యం ఉన్నప్పుడే సమయానికి తగిన విధంగా ప్రవర్తించాలి అని భావం.

"వెన్నెల గలనాఁడే కావించె నల్లునేరేళ్లు

యెన్నేసి కతలకారి యెట్టు నీకు దొరకె " 22-376

**వెన్నెల గాదెఁబోయు:** అసాధ్యమగు పనికి పూను.

"వెన్నెల గాదెఁబోసితే వెచ్చాన కడవు గాదు

సున్నమే వెన్నయైతే సూటిపడేఁగాని " 16-293

**వెన్నెల పులు(గము)గాలు:** వి; బహు. క్రీడావిశేషం.

"సన్నపుగుబ్బలమీఁద చంద్రవంకలుగా నొత్తి

వెన్నెలపులుగా లాడే వేడుకకాఁడా" 18-354

"వెలఁది మోము నీకు వెన్నెల పులుగమాడ

నెలవాయ నింతలోనె నీ కిదివో"

12-414 (23-573)

**వెన్నెలపూట:** వి. వెన్నెల సమయం.

"చక్కని వెన్నెలపూట సతి నీ నవ్వుతేట

మొక్కులలోని మొలఁగు మోవితెలఁగు"

23-357

**వెన్నెలబాయలు:** (2) వి. వెన్నెలబయలు.

"వింతగా చెలి నవ్వులే వెన్నెలబాయలు నీకు

పొంత నధరామృతమే పులుఁగాలు " 14-408

**వెన్నెలబాయిలు:** వి. వెన్నెల బయలు.

"పుప్పొడి వెన్నల పొళ్లు(?)

పొలఁతికి వెన్నెల బాయిలు" 5-88

**వెన్నెలమొలక:** వి. చిన్నివెన్నెల.

"అలరి కప్పురకాపు అవధరించేటి వేళ

మొలచిన వెన్నెల మొలకయై యుండెను "

3-165

**వెన్నెల యెండలు :** ప.బం; వి; బహు. (?)
"వెన్నెల యెండలు వెలయఁగ మేల్కొను
టెన్నఁడు నిద్దుర యెన్నఁడు నీకు" 1-148

**వెయిసేయు :** ప.బం; అ.క్రి. మిక్కిలి విలువకలది యగు.
"ముదిత నడపులలోని మురిపెమే వెయిసేసు
కొదమగుబ్బల తీరు కోటివేలు సేసు" 5-304

**వెయ్యవేలు :** (వేలు + వేలు) వేలకువేలు.
"వెయ్యవేలై వేగుదాఁకా వెట్టిసేసి యలసితి
వో యయ్య కొంతైనా వూరడించవలదా" 1-412

**వెరఁజాడు :** ప.బం. స.క్రి. 1. పోగుచేసి ఎత్తు 2. కొల్లగొట్టు. (వ్య.)
"రోలఁగట్టువడ్డవాఁడు రోఁకలి వట్టినవాఁడు
వేళలేదు వెన్నలెల్ల వెరఁజాడేరు" 3-178

**వెరఁజు :** స.క్రి. కొల్లగొట్టు.
"వీఁడివో యిదె వింతదొంగ
వేఁడిపాలు వెన్న వెరఁజిన దొంగ" 1-322

**వెరబొమ్మ :** (వెరపు + బొమ్మ) పశువులు మొ॥ వాటికి భయం కలిగించడానికి భయంకరమైన ఆకారంలో ప్రతిష్ఠించే ప్రతిమ. 'వెఱబొమ్మ' అని శకటరేఫంతో కూడిన రూపం సాధురేఫంతో ప్రయోగింపబడింది.
"వసుధలోఁ బురుషలో వనితల రూపులు
వెస మాయయంత్రపు వెరబొమ్మలు" 2-203

**వెరసుగ :** క్రి.విశే. మొత్తంగా.
"పొరలింపు మాటలాడి బొమ్మలను జంకించు
వెరసుగ సాదించితివే విభుని" 14-152

**వెరసువేయు :** ప.బం. అందరినీ కలుపు
"వరుస మథురలోని వారకాంత నెల్లా
వెరసువేసి పొందితివిగా నీవు" 13-502

**వెర్తుఁడు :** వ్యర్థుడు అనే పదానికి వికృతిరూపం. ప్రయోజనం లేనివాడు.
"ముదుపు కొంగునఁగట్టి మూలమూలల వెదకే
వెడమతినై నే వెర్తుఁడనైతి" 1-19

**వెఱఁజు :** (2) వి. జారుకొను, కొల్లగొట్టు.
"గుతిగా శ్రీకృష్ణుఁడు మనకు దొరదూరువాఁడు
వెఱవక చేతికొద్ది వెఱఁజిరో మీరు" 19-534
"యెన్నఁడు గొల్లెతల యిండ్లు వేమారుఁ జొచ్చి
వెన్నలుఁబాలును వెఱఁజఁడు" 1-57

**వెఱివెఱాటాడు :** అ.క్రి. వెఱ్ఱివెఱ్ఱి ఆట ఆడు, మిక్కిలి పిచ్చిగా ప్రవర్తించు.
"వెంగలి యభిని దింటే వెఱివెఱాటాడుఁగాని
అంగవించునా వివే మప్పుడే లోకులకు"
74-389

**వెఱుఁజు :** రూపాం. వెరజు. కొల్లగొట్టు, పోగుచేసి ఎత్తు.
"మెఱని యట్టుగమీఁది చక్కిలాలు
వెఱఁజి కైకొనె వీఁడెకదె" 4-288

**వెఱ్ఱిఁదెలిసి రోఁకలి జుట్టుకొన్నట్టు :** (2) నానుడి; తాను చేప్పేమాట తప్పని తానే తెలుపుకొనే సందర్భంలో ఉపయోగించే పలుకుబడి. వెఱ్ఱి కుదిరినదని అంటూనే రోకలి తలకు చుట్టమనడంతో తన వెఱ్ఱిని తానే ఋజువు చేసుకున్నట్లే కదా!
"వెఱ్ఱిఁదెలిసి రోఁకలి వెసఁజుట్టుకొన్నట్టు
యిఱ్ఱి దీము భోగముల నెనసేము" 3-174

**వెఱ్ఱిచెరకు :** వి. మాం. తియ్యగా లేని పిచ్చిచెఱకు.
"కొనబు వెఱ్ఱిచెరకు కొన యేమి మొదలేమి
యెనయని పతిమాట లెన్నైనా నేమి" 9-66

**వెఱ్ఱిచే(తి)రాయి :** ప.బం; వి. గురిలేని విషయం. ఎక్కడ ఎవరికి హాని కలిగిస్తుందో తెలియని విషయం. వెఱ్ఱివాడు తన చేతిలోని రాయి విసరినపుడు తగిలితే తగులుతుంది లేకపోతే లేదు అనే దాన్ని బట్టి వచ్చిన పలుకుబడి.
"కావిరి వెఱ్ఱిచేరాయి కాఁపురమా
కావలసినట్లయ్యే కాపురమా" 2-34

**వెఱ్ఱి దవ్వించు :** ప.బం; అ.క్రి. మోహం కలిగించు.
"ఇంకా నో దైవమా యేల వెఱ్ఱి దవ్వించేవు
కొంకితెంచి ముడిగొంటే కుఱుచే కాదా" 3-175

**వెఱ్ఱిదవ్వించు**: ప.బం; అ.క్రి. మోహం కలిగించు.

"ఇంకా నో దైవమా యేల వెఱ్ఱి దవ్వించేవు
కొంకి తెంచి ముడిగొంటే కుఱచే కాదా" 3-175

**వెఱ్ఱిదవ్వు**: ప.బం; అ.క్రి. మోహం కలుగు.

"దేహమేమి సేయును దేహము లోపలనున్న
దాహపుదాసలు వెఱ్ఱి నవ్వేఁగాను" 4-53

**వెఱ్ఱి దెలిసి వేదురు నవ్వు**: ప.బం; అ.క్రి. వెఱ్ఱి తొలగినా వెఱ్ఱినవ్వు నవ్వు.

"వెఱ్ఱి దెలిసి మఱియు వేఁడురు నవ్వేము" 3-177

**వెఱ్ఱినవ్వు**: ప.బం; వి. నిస్తేజమైన నవ్వు.

**వెఱ్ఱివాని చేతి రాయి**: ప.బం; వి. ఎవరికి ప్రమాదం కలిగిస్తుందో తెలియనిది, గురిలేని విషయం.

"వీలిన యీ యాసా వెఱ్ఱివాని చేతిరాయి
చాలు నింకా హరి నిట్టే శరణను జీవుఁడా" 2-157

**వెలంకాయ**: వి. వెలగకాయ.

"తొలఁగకిటు రెండుచేతుల వెలంకాయలై
తలుకొత్త జేతు వెండలివాడవ్వా" 13-596

**వెలకు**: వి. సం.ప.స. (23 సం.) లో 'వెళక్కు' అనే తమిళ శబ్దవికారంగా ఊహింపబడింది. తమిళంలో వెళక్కు అంటే దీపమని అర్థం.

"వెలయఁబెండ్లాడితివి వెఱపేటికి
వెలకా వేఁగుచునుండఁగా వెఱపేటికి" 23-571

**వెలపరచు**: ప.బం; అ.క్రి. వెలకట్టు.

"యెలమి శ్రీవేంకటేశుఁ డేడ నుండె నన్నుఁగూడె
వెలపరచఁగరాదు వేడుకలే నిండెను" 8-296

**వెలపెట్టు**: వెలకు పెట్టు.

**వెలమజోలి**: వి. అస్థిరమైన స్నేహం, అవకాశవాదం, వెలమ చెలిమి అనికూడా వ్యవహారం. (తె.జా.)

**వెలిఁగాంత**: (వెలి+కాంత) వి. వేశ్య. బయటి స్త్రీ అని వ్యు.

"కలలో నింతులఁగలసినట్లనే
వెలిఁగాంతలతోడి వేడుకలు" 4-381

**వెలుగు చేను మేసినట్టి విధము** : నానుడి; రక్షకమే భక్షకమైన రీతి. 23-593

**వెలుగే చేను మేయు**: ప.బం. కంచే చేను మేయు. (వెలుగు = కంచె)

"చెదఱక వెలుగే చేనుమేయఁగఁ జొచ్చె
అదలించి తగదు నీ కనువారు వేరీ" 1-193

**వెలుగోడు**: వి. కర్నూలు జిల్లాలోని ఒక మండల కేంద్రం. ఇది చెన్నకేశవస్వామి వెలసిన క్షేత్రం. వెలుగోటి చెన్నకేశవునిపై అన్నమయ్య ఒక కీర్తన చెప్పినాడు.

"కుంకుమాంక వక్ష వెలుగోటి కేశవ సర్వ
శంకాహరణ నమో జగదేక కేశవా" 4-391

**వెలుచుకొను**: స.క్రి. వెలువఱచు, వెడలించుకొను.

"వెలుపలిసుద్దులెల్లా వెలుచుకొంటా యిది
పిలిచి మరేమైనా బేరుకొంటినా" 23-189

"మంచివానివలెనె మాటలు వెలుచుకొని
పొంచి నవ్వుతాఁ జెప్పేవు పొలఁతికిని" 11-515

**వెలుతురుఁగాలము**: వి. శరత్కాలం.

"మొత్తమిఁ జెలితురుముమొయిలు విరిసె నిదె
హత్తి వెలుతురుఁగాలమది నేఁడే" 19-519

**వెలుమజోలి**: వి. ఈ పదము అర్థాన్ని గురించి సం.ప.స.లో వివరణం ఇలా ఉన్నది. వెలమవారి సహవాసము? అది యెట్టిదో తెలియదు. వెలమబంక చాలా జిగురని, వెలమబంకవలె అంటుకొన్నాడని వాడుక రేనాటిలో కలదని ఒక పండితమిత్రులన్నారు. ప్రకృతమున కీ యర్థము కొంత అనువుగా నున్నది. ప్రమాదకరమైన స్నేహమనే అర్థం కావచ్చు. "అవకాశ ధోరణి, ఏరోటికాడ ఆ పాట, అశాశ్వతస్నేహం" అని తె.జా. (254 పు.)

"వేగినంతా నేమిచెప్పే వెలుమజోలి
వాగమై నాకు మేనవాఁడౌనోకాఁడో" 14-1

**వెలువ**: (4) వి. 'విలువ'కు రూపాం.

"ఎక్కినవానికిఁ జూడ నేనుగ గుజ్జై యుండు
వెక్కసమై వెలువ వేవేలు సేసునయ్యా" 17-47

**వెల్తి:** వి. 'వెలితి'కి రూపాం. న్యూనత, లోపం.
"దేవ నీ పక్షపాతమో తిరిగే లోకుల వెల్తో
శ్రీవిభుఁడ నీవే కాదా చిత్తములోనయ్యా" 3-422

**వెల్లవిరి:** వి. 'వెల్లివిరి' అని సూ.ని., వెల్లడియైనది, ప్రకటితమైనది.

**వెల్లవిరిగా:** క్రి.విశే. వ్యాప్తమయ్యేట్లుగా, ప్రకటితమయ్యేట్లుగా.
"చెల్లఁబో నన్ను నీ వింత సేతురటవే
వెల్లవిరిగా నేమైనా వింటివటవే" 21-498

**వెల్లవిరిగా చేయు:** ప.బం; స.క్రి. వ్యాప్తమగునట్లు చేయు.
"వేగిరించి వలపులు వెల్లవిరిగాఁ జేసీనీ
యీ గతి వీని గుణము లేమిసేతునే" 23-252

**వెల్లవిరివారు:** (?)
"ఏఁటిదో నీ చిత్తము నే మెఱఁగమయ్య
వాఁటమైన వెల్ల విరివారమయ్యా" 8-154

**వెల్లవిరిసేయు:** ప.బం; అ.క్రి. వెల్లివిరిసేయు అని సూ.ని; ప్రకటించు.
"కూడేవేళ లేని సిగ్గు కోలులో వచ్చెనా
వేడుక వలపు వెల్లవిరిసేయరాదా" 14-495

**వెల్లావిరులగు:** 'వెల్లివిరులగు'కు రూపాం.
"వెగ్గళించి తన సేఁతలెల్లా విరులైనను
వొగ్గి తన్ను మెచ్చేఁగాని వొరటులు చూపనే" 27-369

**వెల్లిఁజింతపండు:** ప.బం; వి. ప్రవాహంలోని చింతపండు. వ్యర్థమని భావం.
"వుల్లములోపలి హరికొసగని పూజలెల్లా
వెల్లిఁ జింతపంటివలె వృథావృథా"

**వెల్లి:** వి. వెల్లువ, ప్రవాహం, పరంపర.
"మొక్కవే చెలువునికి మున్నాటికి
వెక్కసమైతే సిగ్గులు వెల్లులై నిగుడును" 18-396

**వెల్లిగొలుపు:** ప.బం; స.క్రి. విస్తరింపజేయు.
"ఇల్లిదె శ్రీవేంకటేశ్వరునామము
వెల్లిగొలిపె నీ విష్ణుకథ" 3-355

**వెల్లిబోవు:** ప.బం. వ్యర్థమైపోవు. ప్రవాహంలో కొట్టుకొని పోవు అని వాచ్యార్థం. 3-68

**వెల్లివిరియగు:** అ.క్రి. వ్యాపించు, ప్రకటితమగు, వెల్లడియగు.
"వాదము లేటికి వలసినవారికి
వేదము గలుగఁగ వెల్లివిరాయ" 15-157

**వెల్లివిరులగు:** ప.బం. ప్రకటితములగు, వెల్లడియగు, వ్యాప్తములగు.
"అంగవించి శ్రీవేంకటాధిపుఁ గూడితినిట్టే
వెంగలితనాన వెల్లివిరులాయఁ జేతలు" 7-453

**వెళ్లఁదీయు:** ప.బం; స.క్రి. బయటకు తీయు.
"వట్టి దుష్టులతో సహవాసమైతే దాసులను
దిట్టయై వెళ్లఁదీసి తా దిక్కై కాచుఁగాక" 3-195

**వెళ్లఁదోయు:** ప.బం; స.క్రి. బయటకి గెంటు.
"కావరము లేల మాను కంతల మే నుండఁగాను
తోవచేసుకొని వెళ్లఁదోయుచుండుఁగాక" 4-61

**వెళ్లఁబడు:** ప.బం. అ.క్రి. బయటపడు.
"సొరిది నిర్మోహమను జోడు దొడిగినఁగాని
వెర వుడిగి మమతచే వెళ్లఁబడరాదు" 5-206

**వెళ్లనాడు:** ప.బం; అ.క్రి. స్పష్టంగా చెప్పు.
"పొలఁతి యంపిన లేక బూతులు దొరలఁబోలు
వెలయ నేమడిగినా వెళ్లనాడవు" 10-2-40

**వెళ్లవేయు:** (2) స.క్రి. వెడలజేయు, వెడలకక్కు, పోజేయు, తీర్చుకొను.
"వెలఁది నీ చెమటలె వెళ్లవేయఁగా
తలఁగి నేఁజెప్పకుంటే దాఁగఁబొయ్యీనా" 10-2-45
"వేగిరపుఁజేఁతలనె విరివి నీ మోహమెల్ల
బాగుగా వెళ్లవేసెవు పందరంగివిఠలా" 10-2-27

**వెవసాయము:** వి. వ్యవసాయమునకు వికృతిరూపం.
"పలుకంతల చేను బండవెవసాయము
బలిమిఁ దొక్కెఁ గుంటిపసురము" 3-464

**వెసురు:** వి. వేడి, వెట్ట, ఉూర్పు.
"చెలువపు నీ మోము చెక్కిట నేల మోపేవే

వలపు వెసురుదాఁకి వాఁడబారీని" 17-44

## వే

**వేఁకకాండు:** (2) (వేకము + కాండు) వి. వెగటు గలవాడు, వెక్కసి.
"రాపున హరి కింకరపు వేఁకకాండ్లాల
పైపైని మా కింకఁ బట్టియ్యేరో" 1-506

**వేఁకము:** (4) వి. ఉపద్రవం, వెగటు, వెక్కసం. (వ్యు.)
"దండివేఁక మాసెకును తగు సంతోసము నీకు
నొండొరుల కెటువలె నొనగూర్చె దైవము"
26-223

**వేఁగాటి పిఱుదు:** వి. వేఁగు అయిన అనే అర్థంలో వేఁగాటి. పొడుగాటి వలె వ్యావహారికం కావచ్చు.(సంపా.) భారమైన పిఱుదు.
"వేఁగదేరఁ గూడి మొక్క శ్రీవేంకటేశ నే రాఁగా
వేఁగాటి పిఱుఁదు చూచి వెరగందేవు" 23-408

**వేఁటము:** వి. 1. వినోదం 2. వేడుక:
"నీఁటుకత్తె యెవ్వతైనా నీతోను మాటాడితే
వేఁట మేక మాఁగాఁక వేరె పాసీనా" 11-178

**వేఁటవెట్టు:** వెంటబడు (?)
"వాఁటమైన వలపులే వాసిరేచెఁగాక నన్ను
వేఁటవెట్టి నిన్ను నింత వేసరింతునా" 11-460

**వేఁడిక:** (వేఁడు + ఇక) వి. వేడుకోవడం, వేడుకోలు.
"వెలసిన వొడఁబాటు వేడికలు"

**వేఁడిపాలకు నాలుక చాచు:** ప.బం. ఇబ్బంది తెచ్చుకొను.
"నాయమా వేఁడిపాలకు నాలుక చాఁచ నీకు
యీా యెడ నీకే తెలుసు నెటువంటి సుఖము"
13-358

**వేఁడి విడువని కూడు:** ప.బం; వి. ఆరగించడానికి అనువైన ఆహారం. 1-328

**వేఁడివేండ్లు:** (వేఁడి + వేఁడి) వి; బహు. మిక్కిలి వేడులు. 'వేఁడివేఁడి' శబ్దానికి బహువచన రూపం. 'వేఁడి' శబ్దానికి 'వేండ్లు' అనేది విలక్షణమైన బహువచనరూపం.
"కలయికలే చల్లన కలయికలోపల
వెల లేని రతులెల్లా వేఁడివేండ్లు" 8-133

**వేఁడులు:** వి. వేఁడి శబ్దానికి బహువచనరూపం.
"సిగ్గువడఁబోతేను చింతలెక్కీని
వెగ్గళించితేను వెన్నెల వేఁడులయ్యీని" 7-44

**వేఁటకాఁడు:** (వేఁట + కాఁడు) వేఁటకాడు. ఇట వేట శబ్దం వేంట అని పూర్ణబిందుసహితంగా ప్రయోగించడం విలక్షణం.
"మత్తుఁడైనవానికి మరి పనులే లేవు
హత్తి వేంటకానికి దయలు లేవు" 15-103

**వేండ్లు:** వి. వేఁడిశబ్దానికి బహువచనరూపం.
"చందురు నేరమేకాదు సరపాన నలిగిన
విందువంటి వెన్నెలకు వేండ్లెక్కును" 16-265

**వేండ్లువాండ్లు:** వేండ్లు (= వేఁడి శబ్దానికి బహువచనరూపం.) వాండ్లు (= వాఁడి శబ్దానికి బహు. రూపం.)
"విరుల శరంబుల వేండ్లవాండ్ల
మరులునుఁ దెలువులు మగువకును" 20-266

**వేఁగరికాఁడు:** (వేఁగు + అరి + కాఁడు) చారుడు, వృత్తాంతం తెలిపేవాడు.
"ఆసలు చూపిన లో నొనంటి గదవే
వేసదారి యంటిఁగదే వేఁగరికాఁడంటిఁ గదే"
11-266

**వేఁగస:** క్రి.విశ. వేఁగంగా (?)
"వీడియు వీడని కొప్పు వేఁగస ముడుచుచు
ఆడెడి బిత్తరిమాట లమరఁగా" 5-128

**వేఁగాటి:** విశ. భారమైన.
"వేఁగదేరఁ గూడి మొక్క శ్రీవేంకటేశ నే రాఁగా
వేఁగాటిపిఱుదు చూచి వెరగందేవు" 23-408

**వేఁగిసంతా:** తెల్లవారేంత వరకు.
"వేఁగిసంతా మాటలాడి వేసారదు నా మనసు
జాగుకు నీ కోపవంటా జడిసేఁగాని" 27-530

**వేఁగిరకత్తె:** (2) (వేఁగిరము + కత్తె) త్వరపడే స్త్రీ.

"ఇంత వేగిరకత్తె నా యెఱఁగనా నే నేమైనా
మంతనాన న న్నతఁడే మన్నించీఁగాక" 18-49

**వేగిరకాఁడు:** (వేగిరము + కాఁడు) వేగిరపాటు కలవాడు, త్వరపడేవాడు.
"ఎట్టి వేగిరకాఁడవు యేమయ్యా నీవు
మిట్టిపడి దయ్యమైనా మెచ్చవద్దా నిన్ను" 13-479

**వేగిరపుఁదనము:** (వేగిరము + తనము) త్వర, తొందర.
"ఒల్లనని మానరాదు వొలసి పైకొనరాదు
వెల్లవిరి ఆయ నా వేగిరపుఁదనము" 20-97

**వేగిరించు:** (3) స.క్రి. తొందరపెట్టు, త్వరపెట్టు.
"ఆసోదకాఁడవై యంటితివి ముందే
వేసరకట్లా వేగిరించేవయ్యా" 25-249

**వేగిలి:** (?)
"రాసికెక్కె మునులకు రచ్చైన పొలము
వేసరక నాఁగేట వేగిలైన పొలము" 4-52

**వేగుఁబొద్దు:** వి. ప్రాతఃకాలం.
"చెలి వేగుఁబొద్దునను సేసిన చేతలకు
సెలవుల నవ్వుకొంటా సిగ్గువడీని" 22-438

**వేటులాడుకొను:** ఆడుకొను. 11-216 old

**వేడిక:** వి. 'వేడుక'కు వికృతిరూపం (?)
"కనుచూపు వాడికాయ కాఁగిలిట్టె వేడికాయ
మొనగోరి చెనకుల మోనములేలే" 29-488

**వేడీ:** ఏడీ? ఎక్కడున్నాడు?
"యేకోదకమున వటపత్రమున యీఁరేటి నీ కంటే
దీకొని పలికిన కాలంబుల కొనదేవుఁడు మఱి వేడీ" 4-104

**వేడుకకాఁడు:** (13) (వేడుక+కాఁడు) వి. కౌతుకం కలవాడు, కోరిక కలవాడు, విలాసవంతుడు, క్రీడాసక్తుడు, ఉపపతి, జారుడు, విటుడు.
"వేవేలు సతులు గల వేడుకకాఁడవు నీవు
దేవులఁ గనక నీకుఁ దెలిపితిఁ జుమ్మీ" 29-270

**వేడుకకారితనము:** (వేడుక + కారి + తనము) కుతూహలం, విలాసం, వినోదం.
"వింటిమి కంటిమి తన వేడుకకారితనాలు
ఇంటిలోనఁ దన నేమా లెచ్చరించనేఁటికే" 29-145

**వేడెము:** వి. మండలగతి.
"మట్టి దైత్యపురాల మర్మాలు విదలించినాఁడు
చుట్టు వేడెమున యింతా సోదించినాఁడు" 4-306

**వేడెము:** వి. మండలగతి, చుట్టు తిరగటం.
"వెడెము నేఁ జేయనంటా విచారాలే
హెచ్చెనంటా
యీడనాడ వారితోడ నేల చెప్పీనే" 14-385

**వేడెవెట్టు:** (వేడెము + పెట్టు) పరివేష్టించు, చుట్టుముట్టు, ముట్టడించు.
"వీడనాడనీఁడు నన్ను విట్టలేశుఁడు అట్టె
వేడెవెట్టీ వలపులు విట్టలేశుఁడు" 11-70

**వేద:** (8) వి. వ్యథ, బాధ. 'వేధ' కు అంతటా 'వేద' అనే రూపమే కనిపిస్తుంది.
"వేద(దు)తో నొక్కొక్కవేళ వెలుతులు గలిగితే
నీ దయవెట్టి వెనక నీవే తీరుతువు" 3-18
"నీ దాసులున్నచోట నిత్యవైకుంఠ మిదె
వేదతో వేరొకచోట వెదకనేలా" 3-180

**వేదనముసేయు:** వేదన కలిగించు.
"వగలు బాఁతె వలలఁబెట్టెడి తమ్మెఁ
దగిలించు మమత వేదనము సేయఁగా" 1-141

**వేదనారాయణుఁడు:** వి. సోమకాసురుడపహరించిన వేదాలను తిరిగి తెచ్చిన విష్ణుమూర్తి.
"వేదనారాయణయంటే వీడేటి (వీడని?)
బంధములు
ఆదిగా మూఁడు లోకాలనైనా ఉన్నదా" 1-407

**వేదపఠన:** వి. వేదపఠనం.
"భవహరముగ వేదపఠన సేసేమంటే
భవహరమగు హరిపాటలు నోట నున్నవి" 4-252

**వేదలుకట్టు:** బాధలు కలిగించు.
"సాదువలె నుండఁగాను సన్నసేసినంటే
వేద లేల కట్టేవే విభునిమీఁద" 20-538

**వేదవట్టు:** ప.బం. వేదప్రవచనం చేయు.
"వేదవట్టి యింకనేమి వెదకేరు చదివేరు
వేదాంతవేద్యుఁడైన విష్ణునెఱుఁగరా" 3-535

**వేదశిఖలు:** వి. వేదాంతములు, ఉపనిషత్తులు.
"కల్లని మీ త్రివిక్రమాకారము చూపి మీరు
చెల్లఁబెట్టితిరి వేదశిఖలందు మరియు" 3-68

**వేదాద్రి:** వి. కృష్ణాతీరంలోని యోగానంద నృసింహస్వామి వెలసిన క్షేత్రం. నెల్లూరు జిల్లాలోని నరసింహుని కొండకు కూడా వేదగిరి అనే నామాంతరం ఉంది. కాని యోగానంద లక్ష్మీనృసింహస్వామి అనడంవల్ల కృష్ణాతీరంలోని వేదాద్రియే కావచ్చు.
"సగముపై యోగానందనరసింహము వీడె
మిగుల వేదాద్రి లక్ష్మీఁనారసింహము" 4-182

**వేదు:** వి. దుర్గంధం.

**వేదుగా:** క్రి.విణ. వెగటుగా, వెక్కసంగా, దుస్సహంగా.
"పాదమున నంటిన పచ్చకప్పురములోన
వేదుగాఁ దులసితావి విసరీని" 5-190

**వేదు విడిచిన కూడు:** వి. దుర్గంధం లేని కూడు, విరసత్వం లేని కూడు.
"ఏది చూచినఁ దమకు యిన్నియును నిటువలె
వేదు విడిచిన కూడు వెదకినను లేదు" 1-95

**వేధాముఖము:** వి. దశమహావిద్యల్లో ఒకటైన తారావిద్యకు సంబంధించిన సాంకేతికపదం. మనస్సు చెదరకుండా ఉంచి శ్రీహరిని తలచడం.
"అదివో వేధాముఖ మంతరంగపు మనసు
చెదరకుండా జొనిపి శ్రీహరిఁదలఁచుట" 1-452

**వేనామాల వెన్నుఁడు:** వి. వేయి (సహస్ర) నామాలు గల విష్ణువు.
"వేనామాల వెన్నుఁడా వినుతించ నెంతవాఁడ
కానిమ్మని నా కీ పుణ్యము గట్టితి
వింతేయయ్యా" 2-338

**వేనీళ్లు:** (వేడి + నీళ్లు) వి. 'వేన్నీళ్లు' అనే శబ్దానికి వికృతిరూపం. వేడినీళ్లు.
"ఒకరికొకరు దాపు వోపనంటేఁబోదు యింక
వెకలి చన్నీళ్లకు వేనీళ్లు దోడు" 5-86
"ఒప్పుగ వేనీ ళ్లొల్లని దేహము
నిప్పులు చల్లఁగ నిలిచీనా" 6-93

**వేనుబాము:** వి. (?)
"దోమటి యింద్రియాలే నాతోడు నీడై యుండి
నన్ను
వేమరు భోగించఁజేసే వేను బామైనది" 15-69

**వేయింటిపై జవ్వాది కొమ్మ:** ప.బం; వి. పదిలో పదకొండు. (f.n.)
"యెంత లేదు పదవే వేయింటిపై జవ్వాదికొమ్మ
యెంతలేదు పదవే అంతక వచ్చితేఁగా ఆ
పనులు" 22-9

**వేయిటిపై జవ్వాది:** ప.బం; వి. పదిలో పదకొండు. (f.n.)
"వేయిటిపై జవ్వాదివో వేగిరించవేల నాకు
దాయము వచ్చినపుడు తలపించేఁ బనులు"
20-145

**వేయినోళ్ల భోగి:** ప.బం; వి. ఆదిశేషుడు. వేయి శిరస్సులు గల సర్పమని వ్యుత్పత్తి.
"వేయినోళ్లభోగి నీవు విన్నపము సేయరాదా
వేయేసి మా విన్నపాలు విష్ణునికిని" 3-267

**వేయివేలగు:** అ.క్రి. పదిలక్షలగు, అనేకమగు.
"వేయివేలై వేగుదాఁకా వెట్టిసేసి యలసితి
హోయయ్య కొంతైనా వూరడించవలదా"
4-412, 4-207

**వేయివేలు:** వి; బహు. వేలవేలు.
"వెంటనే హరినామాలు వేయివేలై వుండఁగా
జంట నితరమంత్రాలు జపియించీ జీవుఁడు"
2-103

**వేరీ:** (11) ఏరీ, ఎక్కడ. (వేరు = ఎవరు)
"హరి నీ ప్రతాపమున కడ్డమేది లోకమున
సరి వేరీ నీకు మరి సర్వేశ్వరా" 2-156

**వేరు:** వి; బహు. ఎవరు.

**వేరుపురువగు:** ప.బం; అ.క్రి. వినాశకరమగు.
"వెలయఁ జిత్తంబునకు వేరుపురువై బుద్ధిఁ
గలఁగించె మోహవికారము" 11-3-109

**వేరువెల్లంకులు:** వి; బహు. వేర్లు-గడ్డలు.
(వెల్లఁకి = గడ్డ, దుంప. తె.వ్యు.కో.)
"వెడమంత్ర మిఁక నేల వేరువెల్లంకులు నే
పుడమిధరుఁడు మాకు భువనౌషధము" 1-461

**వేలఁజూపు:** దోషాన్ని చూపు.
"పొంచి యేమి సేసినాను పుచ్చకాయలోర్చుఁ
గాక
యెంచి వేలఁజూపితేను యితరము లోర్చునా"
8-131

**వేలపుఁబ్రియములు:** (?)
"వేలపుఁబ్రియముల వేంకటేశ నిను
మూలకుఁ బిలుచుచు మొక్కిరి నీకు" 5-214

**వేలుఁగొప్పు:** వి. వేలాడుకొప్పు (?)
"వేలుఁగొప్పుతోడ నీవు వెంగెములాడఁగాను
కోలుముందుగా నిన్ను గోర గీరె నతఁడు"
25-223

**వేలుకాడు:** (వేలుక + ఆడు) వేలాడు.
"కనుఁగొనఁబోతే నందు కళ లింతే వుండీనని
వెనుకొని కాంతలెల్లా వేలుకాడేరా" 21-121

**వేలెడు దీపము:** చిరుదీపము.
"వేలెఁడు దీపము నమ్మి వెడఁగు జీఁకటిఁబాసి
పోలిమి నొక్క నరుఁడు పొదలఁగాను" 1-429

**వేళగాచు:** (?)
"మూలనున్నాఁ బోనీదు మున్నిటనే వేసది
వేళగాచిన బంధము విద్యాగర్వము" 3-361

**వేళము:** వి. త్వరగా.
"మేలే వేంకటపతి మెల్లనె విచ్చేసినాఁడు
వేళమె అక్కకు విన్నవింత మోసి" 5-9

**వేళ లేదు పొద్దు లేదు:** ప.బం. వేళాపాళా లేదు
అనే అర్థంలో వాడిన పలుకుబడి.
"వేళ లేదు పొద్దు లేదు వేగిరించే నింతలోన
నీ లాగు లెఱఁగరు నిందలాడేరు" 26-169

**వేళవేళ:** సర్వదా.
"పోలింప వివేకులకు పుణ్యమునుఁ బాపమును
వేళవేళనే వున్నవి వెదకరో జనులు" 3-104

**వేళావేళ:** వి. సమయాసమయాలు.
"వేళావే ళెరుఁగక వేసరించితిని నిన్ను
యీ లీల నీ చిత్త మెట్టో యెరఁగఁజుమ్మీ
అయ్య" 11-103

**వేళావేళలు:** (3) 1. అన్నిసమయాలు, సర్వదా.
"వెలుపల లోపల వేళావేళల
నలినాక్ష నీకే నమో నమో" 4-100
"వేళావేళలు లేవా వినోదములకైనాను
యేలా తమకించి వస్తే యిది నీ వెఱఁగవా"
10-2-114

**వేవేలు:** వి; బహు. అనేకం.
"వేవేలకు నీకు నీవే విచారించి మన్నించు
భావించి యెన్నఁడునుఁ బాయకుమీ నన్నును"
13-341

**వేవేళ:** (వేళ + వేళ) అన్నిసమయాల్లో,
ప్రతిసమయంలో.
"యీవేళ శ్రీవేంకటేశుఁ డీతఁడిట్టె నిన్నుఁగూడె
వేవేళకు నీ మోవి విందులాయఁగదవే"

**వేసంగికాలము:** వి. వేసవికాలం, ఎండకాలం.
"వేసంగికాలమున వేడ్కసలుపు లివె
శ్రీసతియు భూసతియుఁ జేరి కలయఁగను"
7-444

**వేసదారి:** (5) (వేసము + దారి) వి. 'వేషధారి'కి
తద్భవం, మాయదారి, నటనలు చేసేవాడు.
(విఱ. కల్లబొల్లి)
"వొడఁబాటైనఁ గద్దు వోపిక గలిగితేను
విడువక నీవంటి వేసదారికి" 11-428

**వేసరించు:** అ.క్రి. 1. శ్రమపడు 2. విసుగుచెందు 3.చింతిల్లు, విచారంపొందు 4. నొచ్చు, బాధపడు.

"ఆసలెల్లాఁ జూపినాఁడు ఆలిఁ జేసుకొన్నవాఁడు
వేసరించి ఇఁకనేమి వేఁడుకొనేదేమే" 18-242

**వేసరుకొను:** 1. శ్రమపడు 2. విసుగుచెందు 3. చింతిల్లు, విచారంపొందు 4. నొచ్చుకొను, బాధపడు. (తె.వ్యు.కో.)

"వేసరుకొనవలదు విభుఁ డెలయించితేను
ఆస రేచి యిచ్చకము లాడుటగాని" 16-442

బాధించు:

"వెరవున నే నెవ్వరిని వేసరించజాలక
దరిచేరుటే దొరతనమిది గాదా" 4-326

అసహ్యించుకొను:

"వాసులకే పెనఁగేము వలచి వలచి నీకు
వేసరుకోకు యెంతైనా విడువరాదు" 27-253

**వేసారేది:** ఇట 'ఏది' అనేది భావార్థంలో చేరిన పదం. శ్రమపడడం, బాధపడడం, విసగడం.

"మిక్కిలి సంసారము మెడఁగట్టితివి నాకు
అక్కరనే వేసారేది అపరాధమవుఁగాదో" 3-20

**వేసాలఁబెట్టు:** ప.బం; స.క్రి. ఆట ఆడించు.

"వెచ్చిమేనితోఁ గూడి వేంకటేశుఁడ నీ
వెచ్చవుఁ గౌఁగిట నన్ను వేసాలఁబెట్టేవు" 5-4

**వేసాలఁబోవు:** (6) ప.బం; అ.క్రి. వట్టి నటనలు చేయు.

"ముంగిట మావంటివారి ముందరను గోలవటె
వెంగలివిద్యలే సేసి వేసాలఁ బొయ్యేవు" 16-377

**వేసాలది:** (వేసాలు + అది) నటనలది.

"వేసాలదానఁగాను వెక్కసపుదానఁగాను
పోసరించి నన్ను నింత పొగడనేలే" 20-408

**వేసాలరాయఁడు:** వి. వేషాలరాయఁడు, వట్టి నటనలు చేసేవాడు.

"వేంకటేశుఁడు వేసాలరాయఁడు
అంకెలా నన్ను నలరించెనే" 5-176

**వేసాలవాఁడు:** వి. నటనలు చేసేవాడు.

"వెలలేని మహిమల వేసాలవాఁడు
పలుకు లీడేరె నీఁక భావించనేఁటికి" 24-326

**వేసాల వేడుకకాఁడు:** నటనల వేడుకకాడు.

"వీధుల జాజరకాఁడ వేసాల వేడుకకాఁడ
యీదెసఁ బాయము కానుకిచ్చేమయ్యా"
11-57

**వేసాలు:** (7) వి; బహు. నటనలు.

"ఈడ మాతో నింత యేల యెగసక్కేలు
వేడుకకాఁడవు నీవు వేసాలు మానరా" 20-242

"వేసాలకు నీ వెంత వేడుకఁగాఁ గలించినా
ఆసపడి నిన్ను నేను ఆయా లంటేనా" 7-588

**వేసాలు చూపు:** అ.క్రి. నటనలు చూపు.

"కంటిమే నీ వల్ల నిట్టి కతలెల్లాను
వెంట వెంట వచ్చి కడువేసాలు చూపేవు"
19-290

**వేసాలు చే(సి)యు:** (13) అ.క్రి. నటనలు చేయు.

"వెగ్గళించి మా ముందర వేసాలు చేసేవు గాక
అగ్గమై యేకతవేళ నడ్డాఁకలున్నవా" 25-330

**వేసాలు వేయు:** ప.బం; అ.క్రి. నటనలు చేయు, వేషాలు వేయు.

"నీడల నే నవ్వితేనే నీ పరిణామము గాదా
వీడనాడనే వేసాలు వేయకురా" 11-365

**వేసును:** క్రి.ప. 'వేయును' అనే దానికి వ్యావహారికరూపం.

**వేసులు:** వి; బహు. వ్యాసులు (వ్యాసమహర్షి) అనడానికి జానపద వ్యవహారం.

"వేసులు మాకుఁ జెప్పె విన భారతము గాఁగ
మోస నీ పాల ముచ్చిమి మొదలుగాను" 2-162

## వై

**వైకుంతము అరచేత నిలుచు:** ప.బం; అ.క్రి. గొప్ప అదృష్టం కలుగు.

**వైఘానసులు:** వి; బహు. రూపాం. వైఖానసులు. విఖనసుడు అనే ముని ప్రవర్తింప జేసిన వైష్ణవమతాచారాలను అనుసరించేవారు.

"తేటగా భుజచక్రద్విజాతి నవని
తాటించి వైఘానసులు ధరించే ధర్మమిది"
15-113

వైతాళము: వి. ఈ శబ్దం ప్రసిద్ధనిఘంటువుల్లో ఎందులోనూ కానరాదు. సం.ప.స. లో ఈ పదం అర్థాన్ని గురించి ఈ వివరణ కనిపిస్తుంది. వైతాళిక శబ్దము యొక్క రూపాంతరంగా వైతాళ శబ్దమును గ్రహించి వాడినట్లున్నది. సమయమునకు తగినమాటలు, పొగడ్తలు ఇత్యాదులు దాని అర్థము కావచ్చును. (27 సం. 388 పు.)

"వద్దువద్దు అంతేసి వైతాళాలు
వుద్దండాలు వేయఁబోతే పుట్టిలేక వూఁగవా"
21-169

తగినమాట, పొగడ్త అనే అర్థం పై ఉదాహరణల్లో సముచితంగా ఉన్నా ఈ క్రింది ఉదాహరణల్లో కుదరడంలేదు.

"ఆతుమ వేసరి అలసి వూరకుండితే
వైతాళపు నీడవలె వచ్చు వెంటవెంటను" 2-240

ఇట వేతాళపు (బేతాళపు) నీడ అనే అర్థం ఉచితంగా ఉంటుంది. వేతాళశబ్ద తద్ధితరూపం వైతాళము.

వైనవైనాలు: (వైనములు + వైనములు) మిక్కిలి వివరణలు, ఉపాయాలు, కారణాలు, క్రమాలు, విధాలు. క్రింది ఉదాహరణంలో అనేకవిధాలు (రకాలు) అనే అర్థం కుదురుతుంది.

"బౌనటవే ఇంకా నేమందునే నేను
వైన వైనాలుగా నన్నీ వాఁ(వ్రా)సిత్తునటవే"
23-467

వైపరి: (వైపు+అరి) వి. శ్రేష్ఠుడు (తె.వ్యు.కో.) ఉపాయశాలి, వాసికాడు.

"వైపరివి ఇటువంటివాఁడవు గాకుండితేను
రాఁపుల నిన్నిందరును రసికుఁడవందురా"
21-167

వైపు తెలిసినవాడు అని సంపా. 21 సం. 112 పు.

వైపు: (13) వి. 1. ఉపాయం 2. ఒడుపు, లక్ష్యం 3. తట్టు, పక్క 4. సరి (17-579 old) 5. వాసి 6. అతిశయం 7.మెలకువ 8. అనుకూలం.

"వై పాయ నీ సింగారము వడి సంతోసించు కొంటిమి
ఆపాటి నీ దొరతనమందరు నెఱఁగరా" 27-544

వైపుగ: క్రి.విశే. గుఱిగా.

"పాపాలు సేసి మఱచి బ్రదుకుచున్నాఁడఁగాని
వైపుగఁ జిత్రగుప్తుఁడు వ్రాయు టెఱఁగ" 2-16

వైపులాఁడి: (వైపులు + ఆఁడి) వి. ఉపాయశాలి.

"అలయించి రతిఁగూడి అంగము లెంగిలిచేసి
వలచిన జా డనేవే వైపులాఁడివి" 26-317

వైష్ణవాగారము: వి. విష్ణువు గుడి.

"వాసి గనవలసినను వైష్ణవాగారంబు
వాసి సేయుట దనకు వైభవస్ఫురణ" 1-326

## వొ

వొలకమ్మకెక్కు: (?)

"యిట్టి యాతఁడు వచ్చిన నిద్దరును నొక్కటే
అట్టు వొలకమ్మ కెక్క యిట్టి మాను మిఁకను"
20-233

## వో

వోఁకలు: (?)

"యేఁకట దొర నీకు నెందరు గలరని
వోఁకల పులుసు కలువులఁ బుచ్చవలెనా" 5-1

వోచిక: వి. 'వాచికము'నకు వ్యావహారికమా? (సంపా.)

"చూచినయందెల్ల చూపును రూపము
వోచికఁ (?) బొగడిన వుండు నోటను" 3-141

## వ్ర

వ్రతము చెల్లిన వట్టగట్టు: ప.బం; వి. (?)

"ధృతిహీనులకు నెల్ల దిక్కయి కాతువుగాక
వ్రతము చెల్లిన నింక వట్ట గట్లా" 1-280

వ్రయ్యము: (?)

"వ్రయ్యములు తొమ్మిదైన వనిత మానితినని
కొయ్యతనమున బాసగొనక నిన్నొల్లను" 6-166

## వ్రా

**వ్రాలకమ్మలు:** వి; బహు. అక్షరాలు వ్రాసే కమ్మలు.

"వలనై పొందికల నీ వ్రాలకమ్మలు చూచి
పలచనినవ్వుల పండు గాయ మోవి" 7-233

**వ్రాలాకు:** (వ్రాలు + ఆకు) జాబు; అక్షరాలు గల ఆకు.

"తాను వచ్చేననునో యీతరి నన్ను రమ్మనునో
పూని తన వ్రాలాకు పుత్తెంచెనా" 9-54

**వ్రాసు:** స.క్రి. 'వ్రాయును' అనడానికి వ్యావహారికరూపం.

"భావించి యొకమారు పలకపైనిను వ్రాసు"
28-59

## వ్రి

**వ్రిత్తి:** వి. 'వృత్తి'కి వ్యావహారికరూపం.

"ఆహికముగ నిట్టి అధమవ్రిత్తికి నే
సాహసమున నెట్టు చాలుదునయ్య" 1-235

"కడలేని యిటువంటి కలుష వ్రిత్తికి నాత్మ
వొడఁబర పఁగ నెట్లోపుదునయ్య" 1-235

**వ్రిథా:** అవ్య. వృథా.

"యెంత లోకానుభవము అంతయు వ్రిథానష్టి
కొంతైనా బ్రహ్మచింత కోటి లాభము" 2-185

"అయ్యో నేనేకా అన్నిటికంటెఁ దీలు
గయ్యాళినై వ్రిథా గర్వింతుఁగాని" 2-80

## వ్రే

**వ్రేఁతె:** వి. 'వ్రేఁత'కు వ్యావహారికరూపం. గొల్లస్త్రీ.

"మత్తిలి వ్రేఁతెల నిండుమనసుల కొల్లాను
చిత్తజునివంటివాఁడు శ్రీవేంకటేశుఁడు" 11-343

"తెలిఁగున శౌరివ్రేఁతెల యెడయెడను" అని అష్ట.క. లో 'తె' యతిస్థానంలో ప్రయోగింపబడటం విశేషం.

## శ

**శంకనినాదమృదంగుఁడు:** వి. విష్ణువు, వేంకటేశ్వరస్వామి. శంఖధ్వనియే మృదంగధ్వనిగా కలవాడని వ్యుత్పత్తి. 1-141

**శంకము:** వి. 'శంఖము'నకు జానపదవ్యవహారం.

"శంకమ నీవ సాక్షి చక్రమ నీవు సాక్షి
వంకలాడ భుజముల వ్రాసుకొంటి మిమ్మును"
15-169

**శంకరాభరణము:** వి. ఒక రాగవిశేషము.

"పాటలలో శంకరాభరణ మాళాపించరే
నీటు చల్లగాలి సొంపు నిలుచఁగాని" 28-273

**శంకుఁజక్రములు:** (3) వి. 'శంఖచక్రములు' అనడానికి జానపదవ్యవహారం, విష్ణుమూర్తి అలంకారములైన శంఖము, చక్రము.

"తిమ్మిరి మమ్ముఁగావఁగ దిక్కయి మాకు నిలువ
జమళి భుజముల శంకుఁజక్రములు గలిగె" 3-3

**శంఖుఁజక్రాలు:** వి. శంఖచక్రాలు.

"భుజములుపొంగఁగాను పూఁచిన శంఖుఁజక్రాల
త్రిజగములు నేలేటి దేవసింహమా" 2-363

**శంఖచక్రాలహస్తాలవాఁడు:** వి. విష్ణువు, శంఖమూ చక్రమూ రెండు చేతుల్లో కలవాడు.

"ముద్దులమొగమువాఁడు ముత్తేల నామమువాఁడు
అద్దిగో శంఖచక్రాల హస్తాలవాఁడు" 7-116

**శంఖుచక్రములవాఁడు:** వి. శంఖచక్రములు గల విష్ణుమూర్తి.

"జవళి పంతాలవాఁడు శంఖుచక్రములవాఁడు
తివిరిన అహోబలదేవుఁడటే వీఁడు" 2-508

**శంఖుచక్రాలు:** వి. శంఖచక్రములు.

"ఇప్పుడు శ్రీవేంకటాద్రి నిరవై శంఖుచక్రాలు
కుప్పె కటారముఁబట్టె గోవిందరాజు"
7-470 & 14-453

**శఠకోపముని:** వి. ద్వాదశాళ్వార్లలో ప్రసిద్ధులైన నమ్మాళ్వారు.

"నిరతి సహోబలనృకేసరికిఁద
త్వరుఁడగు శఠకోపముని యితఁడు" 1-117

**శఠియించు:** అ.క్రి. కుత్సితత్వం చూపు, మూర్ఖత్వం చూపు.
"వెల్లిగొను మందునకు వేంకటేశుస్మరణ
చల్ల నౌనా మనసు శఠియించఁగాక" 1-242

**శత్రులాఱుగురు:** వి; బహు. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు, అరిషడ్వర్గం.
"బెదరి యైదుగురికిని భీతి నొందుచుఁ గడు
జెదరంగఁ జూతువే చిలుకా" 1-50

**శమించుకొను:** స.క్రి. శాంతింపజేసుకొను, క్షమించు.
"శమించుకోవయ్యా సర్వాపరాధాలు
కొమరెవయసు గుణాలదాన" 27-416

**శలవు:** వి. సెలవు. 1. ఉపయోగం 2. సత్యం 3. ఆజ్ఞ 4.చోటు 5. అనుజ్ఞ 6. విడుదల 7. వీలు 8. పోటు 9.విరామం.
"ఇతరాలు మానఁగానే యీతనికే శలవు
నేనెట్ల నుండినాను నీకె శలవు" 8-217

## శా

**శాఖ:** కొమ్మ అని శబ్దార్థం. కాని క్రింది ఉదాహరణంలో దాని ధాయార్థంగా కిరణం అని అర్థం చెప్పవచ్చు.
"సతతము చందురుని శాఖాశైత్యము మాన
రతివేళ తాంబూలరసము మందు" 16-145

**శాన:** క్రి.విశ. 'చాల' అనే శబ్దానికి జానపద వ్యవహారం, ఎక్కువ.
"పూరకే నన్నేల యింక వొడివట్టేవు
నారుకొన్న సతులు శానలు గారా నీకు" 17-104
'శాన' శబ్దానికి బహువచనరూపం విలక్షణం.

**శానశాన:** (2) విశ. 'చాలా చాలా' అనడానికి జానపద వ్యవహారం.
"అచ్చపు నీ కాఁగిలిదే అతివలు శానాశాన
ఇచ్చితివి నా వంతు యెంత వచ్చునందును"
7-517

"యెంత వలసినాఁ గద్దు యెంచుకొంటే నా యాస
చింతించితేఁ గోరికలు శానాశాన" 12-235

**శాయగన్:** 'చేయగన్' అనడానికి జానపద వ్యవహారరూపం.
"తరుణి నినుఁబెడఁబాసి తపము శాయఁగఁదొడఁగె
విరహంపునులిగురులతో విరిజడలతో" 7-290

**శాలామాలము:** 'శాలామాలావాహ = అవకతవకలుగా confusedly అని తమిళనిఘంటువు. ఇట్టివే ఈదా-మోదా, సాటికి-బేటికి అనే జంటపదాలు.
"శాలామాలములైన చయ్యాటము నీతో నేల
మేలే నీసేఁత లెల్లా మెచ్చితినే" 13-486

**శావ:** (2) వి. 'సేవ'కు జానపదవ్యవహారరూపం. పరిచర్య, పూజ.
"భక్తి యింతా నొక ఘంటాపథము నీ శావలే
యుక్తిఁ బాత్రాపాత్రములు యూహించనేల"
1-497

**శాసలు:** (3) వి; బహు. 'సేసలు' అనడానికి జానపద వ్యవహారరూపం. తలంబ్రాలు.
"పెట్టిన శాసల నీ ప్రియురాండ్లెల్లాను
గుట్టుతోడ నుండవలెఁ గోరి నీవద్ద" 7-587

**శాస్త్రి:** వి. శాస్త్రం చదివినవాడు.
"జపితలు గొందరు శాస్త్రులు గొందరు
ప్రపత్తిఁ గొందరు బలువులు" 1-499

## శి

**శింగరి:** వి. 'సింగరి'కి జానపదవ్యవహారరూపం. సింగడు, నృసింహస్వామి.
"చెల్లెఁజెల్లె నీ చేఁత శింగరి నీ
వుల్లమెల్లఁ దక్కఁగొంటినో శింగరి" 7-315

**శింగిణి:** వి. 'సింగిణి'కి జానపదవ్యవహారరూపం. హరివిల్లు, ఇంద్రధనుస్సు.
"అరచంద్రుఁడుఁ జకోరాలద్దాలు సంపెగయు
ధర శింగిణులు శ్రీలు తలిరులును" 7-337

**శికరము:** వి. శిఖరము.
"వెండిశికరమువాని వెజ్జీయావి తుదముట్టి
వండనికూటివారికి వై పాయఁబనులు" 7-277

**శిఖరులు:** వి; బహు. భక్ష్యవిశేషం.
"పానకాలు శిఖరులు పటికంపుఁగొప్పెరల
పూని వాసనలు గాఁగ పువ్వుగట్టించి" 17-316

**శిఖాసూత్రాలు:** వి; బహు. (తలమీది) శిఖ మరియు యజ్ఞోపవీతం.
"వెరసి శిఖాసూత్రాలు విడిచితే ప్రణవమేది
పరఁగ భక్తి లేదట భవ మెట్టు గడచె" 4-270

**శిగ్గగ్గు:** వి. సిగ్గు అనే అర్థంలో జంటపదం.
"పొంచి శిగ్గగ్గెఱఁగని బోయనాయఁడు
మించి రాలమీఁద దాఁటీ మెండు
బోయనాయఁడు" 1-460

**శిథిలి:** వి. 'చెదలు'కు ప్రకృతిరూపమని సంపా.
"కదుఁబులకలనె శిథిలి కన్నచోటనె పొడమె
సుడిసి చెలి సిగ్గెట్లు చూరఁబోఁగలదో" 5-249

**శిన్నెక:** వి. 'చిన్నక్క' అనడానికి జానపదవ్యవహారరూపం.
"శిన్నెక లేవే చెలువుని తా
వెన్నలు సవిగొను వెన్ననితో" 5-168
"చెలువపు సేఁతల శిన్నెకా
చిగురుబెదవులాఁడి శిన్నెకా" 5-261

**శిరసుండ మోకాల సేసవెట్టిన యట్లు:** నానుడి; అర్థమైంది. ఒకటి ఉండగా దానిని విడిచి అనర్హమైన మరొక దానికై వెళ్లు. (తలంబ్రాలు పోయవలసింది శిరసుపై కాని వాటిని మోకాలిమీద పోయడం మీద వచ్చిన పలుకుబడి.)
"శిరసుండ మోకాల సేసవెట్టిన యట్లు
పరమధర్మము మాని పరచుగా వలసె" 15-120

**శిరసుముడుచు:** ప.బం; అ.క్రి. (స్త్రీలు) తలదువ్వుకొను.
"శిరసు ముడువఁబట్టెఁ జిక్కు దియ్యఁగబట్టె
గరిమల గవటాలఁ గాలకాలము"

**శిరులు:** వి; బహు. సిరులు అనడానికి జానపద వ్యవహారరూపం. సంపదలు.
"చేరి బ్రహ్మాదులెల్లాను సేవలు సేయఁగాను
మేరమీరిన శిరుల మేడలో నున్నాఁడు" 2-355

**శిరోమాణికము:** వి. తలలోని మాణిక్యము.
"కప్పురపుఁ బళ్లందిన కాంతల కెల్లాఁను (?)
కప్పిన శిరోమాణికమవె కావా!" 9-201

**శిలుగు:** వి. 'సిలుగు'కు జానపదవ్యవహార రూపం. 1.ఉపద్రవం 2. హాని 3. కష్టం.
"తలఁపులో దక్కె ముక్తి తగు శరణాగతికి
శిలుగుఁబుణ్యములకుఁ జిక్కదు గాని" 3-399

**శివమాడు:** ప.బం; అ.క్రి. పూనకం వచ్చి ఊగు.
"బొమ్మలాట నిజమంటాఁ జూచి చూచి
మెచ్చినట్టు
తెమ్మగా శివమాడి తా దేవరైనట్టు" 2-37

**శివసత్తులు:** వి; బహు. శివభక్తులు.
"పేరులు విడిచి సంకుఁబేరులు మెడవేసుక
సారెకుఁగొందరు శివసత్తులైరి" 2-246

**శిష్టు:** వి. 'శిష్టులు' లోని ఉకారం లోపించగా ఏర్పడిన రూపం. ఇలాంటి రూపాలు దేశికవుల రచనల్లో కనిపిస్తాయి. ఇట్లే 'దుష్టు' అన్న పదం కూడా.

**శిసువు:** (5) వి. 'శిశువు'కు జానపద వ్యవహారరూపం.
"శిసువనై నాఁడు నీవు బండికిఁ బాదము చాఁచి
దెసలనర్జునుబండి తేరు నెక్కితి" 20-332

## శీ

**శీతు:** వి. చల్లదనం, చల్లన. రూపాం. సీతు.
"వానల శీతున వాయుమార్గమున
యీనుచు నున్నవి యేండ్లు" 15-360

**శీతో భవ:** ఇది సంస్కృతవాక్యం. 'చల్లబడుము' అని అర్థం.
"అనలము "శీతో భవ" యన నేరిచిన సీత
పనివి రావణ "హతో భవ" యన నేరదా"
15-263

శీర: వి. 'చీర'కు జానపదవ్యవహారం.
"పసపు శీర నాకుఁ బరవుగాఁ బరపించి
యెసఁగ నిట్టి సనవియ్యఁడుగా" 5-370

శీరపాణి: వి. 'సీరపాణి'కి జానపదవ్యవహార రూపం. బలరాముడు, నాగలి చేత గలవాడు.
"శీరపాణే గోసమాణే శ్రీ వేంకటగిరి
కూటనిలయా" 2-34

## శు

శుకపికము: వి. చిలుకలు, కోకిలలు. ద్వంద్వంలో ఏకవచనం విలక్షణం.
"రవ్వేసేయ శుకపికము రాయడి కోర్వఁగ రాదు
అవ్వల నెవ్వతె పసల కలరున్నవాఁడో" 6-147

## శూ

శూర్పనఖ: వి. 'శూర్పణఖ'కు జానపదుల వ్యవహారం. చూ: సూర్పనక, చుప్పనాతి.
"తటుకన మారీచుతలపైఁ బోయ కర్మము
కుటిలశూర్పనఖ ముక్కునఁ బండెను" 4-520

## శె

శెలవు: వి. అర్పణం.
"తండ్రిపైఁ జేసిన భక్తి దైవమా నీకే శెలవు
తండ్రికి తండ్రివి నీ వంతర్యామివి" 15-144

శెలవుసేయు: స.క్రి. అర్పణచేయు.
"నెలవైన మాటలె నిజమయ్యీని మాకు
శెలవుసేయకు వోయి చెలువరీ!" 10-2-21

## శే

శేకరము: వి. 'శేఖరము' నకు వికృతిరూపం కావచ్చు. సిగదండ, బాసికదండ.
"సేకరమాయ వలపు సిగ్గులువడితే బోదు
చేకొలదిఁ బ్రియములు చెప్పవలె నికను"
19-216
"జోకతో సింగారించు కచ్చోటి కట్టె రావయ్యా
సేకరముగా నీ రాక చెప్పివచ్చే మికను"

శేన: విణ. 'చాల' అనడానికి జానపదుల వ్యవహారం. ఎక్కువ, అధికం.
"మేనెల్లఁ జొక్కించితివి మేకులఁ దక్కించితివి
శేన నవ్వులు నవ్వేవు సేంత లింత చాలదా"
21-477

శేనగా: క్రి.విణ. మిక్కిలి, చాలా.
"శేనగా గూడీనిది శ్రీవేంకటేశ్వర
నానాగతి నేలవయ్య నమ్మిక లీవయ్యా"
13-336

శేనాశేన: (3) 'చాలా చాలా' అనడానికి జానపదవ్యవహారం. చూ: సేనాసేన; అనేకములు.
"వొప్పుగా నన్ను మన్నించే దొక్కటే గుఱుతు గాక
చెప్పితే నా విన్నపాలు శేనాశేన" 12-450

శేవంతి చామరలు: వి; బహు. చేమంతి చామరాలు.
"మెలువుఁజెంగలువలు మేలు కట్లమరించి
మలసి శేవంతిచామరలు వీవఁగను" 7-444

శేసుఁగాక: 'చేయుగాక' అనే అర్థంలో వాడబడిన జానపదవ్యవహారం.
"చిక్కించుక యింటిలోనే చెల్లినట్లు శేసుఁగాక
తక్కి మీ యేలికసాని తగ వేటి తగవే" 7-4

## శై

శైత్యోపచారము: వి. విరహతాపంతో బాధపడుతున్న నాయికకు చల్లదనాన్ని కలిగించడానికి చేసే ఉపచారం.
"అప్పటి శైత్యోపచారా లందుకుఁగాఁ జేయఁబోలు
గుప్పుకొనీఁ దులసి చిగురు దండలు" 22-528

## శో

శోభనగిరి: వి. మంగళగిరి.

శోభనగిరీశుఁడు: వి. గుంటూరు జిల్లా గుంటూరు తాలూకా మంగళగిరి గ్రామంలో వెలసిన నృసింహస్వామి. మంగళగిరికి శోభనగిరి అనేది పర్యాయనామం.
"యిక్కువ దేలిసి నీ వెవ్వతెను గలిసితివో

దక్కి శోభనగిరీశ! దగగొంటివి"

**శోభనము:** వి. (?)

"ఔభళేశ వోగునూతులౌభళేశ

శోభనము నీకు నాకు జోడుగూడెఁ గాదా" 26-3

## శ్రి

**శ్రింగారరాయఁడు:** వి. శృంగారరాయడు అనే పదానికి వికృతిరూపం. 'ఋ'కారం చాలాచోట్ల 'రి' కారంగా మారడం కనిపిస్తుంది.

"అంగనకు నీవె అఖిలసామ్రాజ్యము

శ్రింగారరాయఁడ నీకు శ్రీసతి నిధానము"

9-299

## శ్రీ

**శ్రీ జయంతి:** వి. కృష్ణాష్టమి, శ్రీకృష్ణ జయంతి

"నేఁడు కృష్ణుఁడు జనించె నేడే శ్రీ జయంతి

దేవకి కొడుకుఁ గన్న దినమిది శ్రీ జయంతి"

4-27 old

**శ్రీరామరక్ష:** ప.బం; వి. గట్టిరక్షణ నిచ్చేది.

"విడువని మతికిని వేదరాసులే రక్ష

చెడని నీ యాయువుకు శ్రీరామరక్ష" 4-459

## స

**సంక:** (2) వి. 'శంక'కు వికృతిరూపం. సందేహం, అనుమానం, జంకు.

"అంకె శ్రీవేంకటేశుఁడని దన కమరుఁగాక

సంక లేనిదాన నాకు సటలాడవచ్చునా" 23-199

**సంకము:** వి. 'శంఖము'నకు జానపదవ్యవహారం.

"అంచెలఁగూర్మాలు రెండు హంసలతోఁ బొందుసేసె

పొంచి బిసాలు సంకముపొత్తు గూడెను" 7-327

"కొక్కరవంటి సంకము కుదురువంటి కైదువ

అక్కుమీఁది కొకపూస అబ్బెఁ దనకు" 27-393

"ముందు నీ సంకపురవమునకు గోపికలెల్ల

కుందణపుటందెలకుఁ గూడె సతి" 24-114

**సంకరుషణుఁడు:** వి. 'సంకర్షణ' శబ్దానికి వికృతిరూపం. విష్ణువు.

"సాదించితివి విద్యలు సంకరుషణా మంచి

సాదువలె నుండే వీవు సంకరుషణా" 17-235

**సంకించు:** స.క్రి. 'శంకించు'కు వ్యావహారికరూపం.

"సంకించక నిన్ను నిట్టె సాదించిరింతే కాక

బింకపు గుట్టేమిటికి పెట్టువయ్య సేస" 19-211

**సంకు:** వి. 'శంఖము'నకు వికృతిరూపం.

"వంకరకోరలవె వజ్రపుదంతములవె

సంకును జక్రము నిరువంకలా నవె" 2-379

**సంకు:** వి. శంక, సందేహం.

"యింక నేల మా విన్నపా లన్నియి నిందే వున్నవి

సంకు దీరె మాకు మీకు సారె మొక్కేమయ్యా"

12-41

**సంకుఁగడెము:** (సంకు + కడెము) వి. శంఖంతో చేసిన కడియం.

"అమరెనే సంకుఁగడె మందుకుఁదోడు

భ్రమసి నీవేల గుల్ల పట్టు కున్నాఁడవురా"

19-418

**సంకుఁజక్కురాలు:** వి. శంఖచక్రాలు.

"జక్కవచన్నుల నీడ సరి నీయందు నంటెనో

నిక్కి నీ చేతుల సంకుఁజక్కురాలై వున్నవి"

7-218

**సంకుఁజక్రములవాఁడు:** వి. విష్ణువు, శంఖచక్రాలు గలవాడు.

"సంకుఁజక్రాలవాడు చల్లుచున్నాఁడు వలపు

కొంకక శ్రీవేంకటాద్రి గోవిందరాజు" 21-47

**సంకుఁజక్రములు:** వి; బహు. 'శంఖచక్రాలు' అనేదానికి వ్యావహారికరూపం.

"సంకుఁజక్రములతోడ చంద్రగావిరెంటెముతో

కంకణముల చాఁచిన కరములతో" 13-128

**సంకుటుంగరము:** వి. శంఖంతో చేసిన ఉంగరం.

"మోహపు సంకుటుంగరముల వెలిగోర నా

దేహముపై నునురేక దియ్యఁజూచేవు" 5-278

**సంకుదుబ్బ :** (?)

"గుల్ల సంకుదుబ్బను కొలచిపోయి మనేవు
యిల్లిదె యిప్పుడె మా యింటికి రావయ్యా"
7-474

**సంకుపోచి :** వి. (?)

"వాడి బిల్లకత్తి వలచేతఁబరిజించి
పోడిమి బాలడ సంకుపోచి నాడించి (?)"
17-230

**సంకుమెడది :** వి. స్త్రీ, శంఖంవంటి మెడగల స్త్రీ.

**సంకుసక్రముల సక్కనయ్య :** వి. విష్ణుమూర్తి, శంఖచక్రాలతో కూడిన అందగాడు. శ్రీవేంకటేశ్వరస్వామి.

"సంకుసక్రముల సక్కనయ్యకుఁ దన
వుంకువవో నా వొళ్లెల్లా" 5-370

**సంకుసక్రములు :** వి. 'శంఖచక్రములు' అనడానికి జానపదవ్యవహారం.

"సంకుసక్రముల సక్కనయ్యకుఁ దన
వుంకువవో నా వొళ్లెల్లా" 5-370

**సంకె :** (84) 'శంక'కు వ్యావహారికరూపం. సందేహం, అనుమానం.

"అంకించి నే వారివాఁడనని దుష్టుఁడనైనా నా
సంకెదీరఁ గావవయ్య సర్వేశ్వరా" 3-127

"యింక నీవు నన్ను నేఁడు యెట్టు లాలించేవో
కాని
సంకె లేక నిన్ను దూర సంగతే నాకు" 18-329

**సంకెళ :** వి. 'సంకెల'కు వ్యావహారికరూపం.

"సంకెళ పెట్టినవేళ చంపఁబిలిచినవేళ
అంకిలిగా నప్పులవా రాగినవేళ" 1-158

**సంగడము :** వి. జెట్టి సాధన కుపయోగపడే ఇనుపగుండు. (స్నేహం, సైన్యం, విణ. అనుగుణం ఆం.ప.ని. రవిక.)

"సంగడాలంటా నీవు సారె నెత్తేవు
అంగవించి యప్పటిని ఆపె కాఁగిలే నీకు"
22-191

"సంగడాలెత్తిన చేయి చాఁచేవు మా వురముపై
అంగనలము మా చన్నులంత కోపునా"
11-600

**సంగడించు :** స.క్రి. కూర్చు, అనుసంధించు, (పర్యాయ.) స్నేహం చేయు.

"సంగడించి మాటాడుతాఁ జవిచూచితి వి మోవి
యెంగి లని చూడవద్దా యింతిని నేను" 25-160

**సంగడి :** వి. మిత్రురాలు, చెలికత్తె, సంగడికత్తె.

"చన్నుల నొరసి నాపె సారె గొప్పు దువ్వే నంటా
సన్నసేసి మాటలాడె సంగడి నంటా" 27-210

**సంగడి :** (35) వి. 1. పార్శ్వం, పక్క 2. సమీపం 3. ప్రేమ 4. స్నేహం 5. స్నేహితుడు 6. సమూహం 7. విధం 8. వెనుక 9. తెప్ప 10. రెండు (పర్యాయ.) విణ. తోడైంది, జతైంది. ఇట 1, 4 అర్థాలు సముచితంగా ఉంటాయి.

"కామించి యాతఁడు నా సంగడిఁగూచుండె
నంటాను
యేమేమి మాటలాడేవే యింతలో నీవు"
26-433

**సంగడిచన్నులు :** వి. జంటగా నున్న స్తనాలు.

"సంగడిచన్నులు నివె చక్రవాకములు నివె"
7-406

**సంగడి జాణతనములు :** (2) స్నేహంతో కూడిన నేర్పులు.

"సంగడిజాణతనాలు సరసములాడించు
ముంగిటి నేస్తములు ముచ్చటాడించు" 12-234

**సంగడిదాష్టీకము :** ప్రేమతో కూడిన దాష్టీకం.

"అమర శ్రీవేంకటేశ అట్టె నన్నుఁగూడితివి
సముకాన నీకె కెంత సంగడిదాష్టీకము" 18-143

**సంగడిపాదములు :** వి; బహు. రెండుపాదాలు.

"జంగ చాచినట్టి నీ సంగడిపాదములు
చెంగలించి యెత్తినట్టి శ్రీహస్తము" 4-413

**సంగడిపొందు :** వి. స్నేహపుపొందు.

"పొరసి యాతఁడు నిన్ను బొమ్మలఁ
జంకించఁగానే

తొరలించి సంగడిపొందులు చూపదగునా"
13-141

సంగడిబూవము : వి. (?)
"ముంగిటనే కొంకనేలే ముసిముసినవ్వి లేలే
సంగడిబూవానకు చలివాసీ రావే" 7-249

సంగడివేయు : స.క్రి. పక్కకువేయు.
"అదరి శ్రీవేంకటేశ ఆపె మోవి గంటిసేసి
వీడి సంగడి వేసితివి వనిత వలపులు" 19-271

సంగడిసింగారము : వి. మొత్తపు సింగారము.
"అంగన చెలువు చూడవయ్యా నీవు
సంగడిసింగారాలు సతమై నిలిచెను" 7-406

సంగతి : (12) వి. చేరిక, కూడిక.
"చలువకు వేడికి సంగతయ్యీనా
నెలఁతలఁగంటే నిట్టే నీవేమి సేతువు" 21-85
యుక్తం :
"చేయిచాఁచి నే నేమైనా సేవలు సేయఁగఁబోతే
చాయలకు సిగ్గుపడీ సంగతి గా దిపుడు"
20-413
"చెలిమి సేసినవారు చేతికి లోను గావలె
చలములు సాదించ సంగతి గాదు" 14-557

సంగాతము : (10) వి. స్నేహం, చెలిమి.
"సరసము లాడియాడి సంగాతాలు సేసితివి
మరిగి నావద్ద నున్న మగనితోను" 28-201

సంగాతి : (సంగాతము + ఇ) వి. చెలికాడు, మిత్రుడు, బంధువు, ఆప్తుడు.
"యిరవై శ్రీవేంకటేశుఁ డితఁడిట్టె నన్ను నేలె
పరగు సంగాతివి సోబానఁబాడఁగదవే" 29-318

సంచకరువు : (2) వి. ఒక వస్తువు కొనేప్పుడు దాని స్థిరత్వం కోసం ముందుగా ఇచ్చే డబ్బు, బయానా, అడ్వాన్స్. రూపాం. సంచకారి, సంచకర్వు, సంచకరము, సంచకారు.
"యింతి కానుకలు నీకు యిచ్చిన సంచకరువు
దొంతు లైనవని మాకు తోయవసమా" 27-298

సంచకారు : (3) వి. చూ : సంచకరువు.
"ఉంకువిచ్చి కైకొన్న వొగి సంచకారు సుమ్మీ
సరి లక్షకు నా మొక్కు సంచకా రిచ్చితిని"
16-292
"కంతు సంచకారులోనఁ గల్ల దోఁచె నీయందు
మంతనమున నీతోడి మాట లేఁటికే" 17-440

సంచము : (4) వి. బంగారం. (క. సంచ)
"అక్కుపై నిలచి కూడె నలమేలుమంగ నిన్ను
చక్కఁదనమెల్ల నీకు సంచమాయను" 8-92

సంచరిష్ణుఁడు : వి. సంచరించేవాడు.
"పనివడి సజ్జనులపాలికి వర్ధిష్ణుఁడు
సనకాదుల మతుల సంచరిష్ణుఁడు" 12-137

సంచు : (2) వి. 1. గుంపు 2. గొడవ 3. జాడ.
"పొంచి మచ్చ (చ్చె?) మైనవాఁటి
పొలసుకంపులు వాయ
సంచులఁబన్నీట మజ్జనమార్పరే"
"పంచమవేదము నీకు పడఁతి మాటలెల్ల
సంచుల నెవరి మాట చవులయ్యీని" 16-142

సంచు : వి. 1. జాడ, గుర్తు, సూచన (ఆం.ప.ని.) 2. నేర్పు 3. గుట్టు 4. పద్ధతి 5. అందం 6. కాంతి 7. అల్పరవం 8. రతి 9. ప్రకారం 10. గాజు 11. పోలిక.

సంత : వి. కొనేవాళ్లు అమ్మేవాళ్ల యొక్క కూటమి.
"సంతలోని జాణవు జాజరలోవాడవు
వింతలేదు నాకు నీకు విన్నపమిదయ్యా" 7-209

సంతకర్మము : వి. (?)
"వింత చదువులవల్ల వేవేలు మతాలు గంటి
సంతకర్మములవల్ల సాముగంటిని" 2-256

సంతకూటపు బ్రదుకు : వ.బం; వి. అస్తవ్యస్తమైన బతుకు.
"దొంతులగుఁగర్మములు తోడనే తిరిగేని
సంతకూటపుబ్రతుకు సటలఁబెట్టీని" 3-483

సంతకూటమి : వి. సంతలో కొనేవాళ్లూ, అమ్మేవాళ్లూ కలవడం, తాత్కాలిక మన్నమాట.

"బంతివిందులు చేప్పేరు పాలిండ్లు చూపి చూపి
సంతికూటములలోని చవులాయ వలపు"
21-115

**సంతకూటము :** (7) వి. సంతలోని గుంపు.
"సంతకూటపువారెల్లా సారె నీ మేనంటఁగాను
పొంత నడ్డము రాకెట్టు పోనిత్తు నేను" 12-351

**సంతకూటము అగు :** ప.బం; అ.క్రి.
అస్తవ్యస్తమగు.
"యింతుల మిద్దరమును యిరువంకలా
నుండఁగా
సంతకూటమాయను చక్కని నీ మేను" 7-404

**సంతకెక్కు :** ప.బం; అ.క్రి. బజారుకెక్కు.
"దొంతులై యిల్లెల్ల నిండె దొమ్మి నీ యానలు
నాకు
సంతకెక్కె నివి పాలు సరసాలు చాలురా" 12-8

**సంతజాణతనము :** (3) మోసంతో కూడిన నేర్పు.
"దొంతిఁబెట్టు మోవిపండు తొలఁగ కందుకోరాదా
సంతజాణతనాలేల సరసములోనను" 13-237

**సంతతగరు :** వి. సంతగొడ్డు. బిక్కిరి బిక్కిరి
చూపులు చూస్తూ 'ఇదంతా యేమి' అన్నట్లున్న
మనిషి విషయంలో వాడే పలుకుబడి.
సంతలోని పొట్టేలు అని శబ్దార్థం. ఎవరికైనా
అమ్ముడు పోయేది. బిత్తరగొడ్డు.
"ఒడలిపై నీ చెమట వూరు వాడెడు చెలమ
జడియు నీ తమకంబు సంతతగరు" 5-75

**సంతపరచు :** స.క్రి. శాంతిపరచు, కట్టుబాటు
లోనికి తెచ్చు.
"వినయపుదైన్యము విడువని కర్మము
చనదది నీ విటు సంతపరచకా" 2-475

**సంతపాకలంజ :** వి; ప.బం. జారిణి, లంజె,
సంతపాక తొత్తు, సంతబసివి. (సంతపాక =
అంగడి పెట్టడానికి వేయబడిన పాక.)
"ఎంతేసిసెబో దైవమింతలోన నయ్యో
సంతపాకలంజవలె చల్లుఁజూపు లేటికి" 6-30

**సంతపుఁబొందు :** వి. సంతలోనో, సంతపక్కనో
పాక వేసుకొని వచ్చిపోయ్యే వారికి
ఉపయోగపడే వ్యక్తి కావచ్చును అని పీఠిక
(1.సం.) కాని 'సంతపొందు' సంతపుపొందు గా
మారుతుందా? ఆలోచించాలి.
"సంతపుఁబొందులు జరపెడివారికి
వింతగాఁ జూచినా వేడుక గలుగు" 23-195

**సంతబత్తి :** వి. సంతవలపు, అస్థిరమైనది.
"పైకొని సంతబత్తి గద్దా నీ కేమైనా
నీకు మోహించినదాననే బాయలేఁగాక"
23-194

**సంతమాటలు :** వి; ప.బం; బహు. అడ్డదిడ్డమైన
మాటలు.
"నంతమాట లాడేవు సణఁగులు రాలిచేవు
యెంతలేదు నీ పగటు యేమి చెప్పేదే" 18-434

**సంతము :** వి. 'శాంతము'నకు తద్భవరూపమైన
జానపద వ్యవహారరూపం.
"తగిలి శ్రీవేంకటాద్రి దైవమై పొడచూపఁగా
సంతమై మీలో మీరు చక్కనుండరాదా" 27-81
"పంతమాడవచ్చుఁ గాని బలిమి చూపుటరుదు
జగడము సంతమాయ సంసారము" 3-111

**సంతము :** వి. స్వాంతము.
"చింత యాలె తనకు నేఁ జెక్కిటఁ జే
యిడుకొంటే
సంతముగాని చోట సరసములా" 9-139
"జాడతో మాలో మమ్ము సంతముసేసేవు గాని
పాడిపంతా లొరులఁ బచారించరాదా" 26-526
"జగడము సంతమాయ సంసారము" 3-111
"కలిసితివిటు శ్రీవేంకటగిరీశ్వర నన్ను
తలఁచి ఇద్దరిని సంతము సేయనేరవా" 26-325
"చక్కఁగా మాటలోనే మమ్ము
సంతము సేయిమంటాను" 13-48

**సంతముద్రకోల :** వి. సంతలో వస్తువులకు
ముద్రవేసే కోల.
"చందమైన నీ పాదము సంతముద్రకోలాయ
యిందుకు నేనూ లోనై యిరవుకోవలెనా"
7-185

**సంతముసేయు :** సొంతము చేయు, తనదిగా చేయు.

"మన్నించవయ్య యిఁక మగువను
సన్నలనే మాకుఁజెప్పీ సంతము సేయుమని"
23-267

**సంతల చుట్టరికము :** ప.బం; వి. తాత్కాలికమైన చుట్టరికం, అల్పపు చుట్టరికం.

"సంతలఁజుట్టరికాల జడిసితి నిఁకఁ గావు
అంతరాత్మ నా పాలి ఆదిమూలమా" 2-66

**సంతలోకూటము :** (2) వి. తాత్కాలికం. సంతలో కలయిక తాత్కాలికమే కదా!

"సంతలో కూటమువలె సతులెందరు గూడినా
పొంతనే నీ శిరసున పూజై వుండఁగలరా"
23-313

**సంతలోని జాణ :** వి. మోసగాఁడు.

"సంతలోని జాణవు జాజరలోవాఁడవు
వింత లేదు నాకు నీకు విన్నప మిదయ్యా"
7-209

**సంతవలపు బేరము :** వి. అస్థిరం.

"ఇంతగాఁ జేసితి నన్ను నింతలోననే వోరి
సంతవలపుబేరాల జట్టికాఁడ రారా"

**సంతవావి :** వి; ప.బం. సంతలోని సంబంధం, తాత్కాలికం.

"సంతవావు లిటు చెప్పి సారెకును నవ్వునవ్వి
యింతలోనే పైకొనేమా యెంతైనాను" 16-116

**సంతవెట్టు :** (సంత + పెట్టు) ప.బం; స.క్రి. విడుచు, త్యజించు.

"సంతవెట్టుక మగని సంగడిఁగూచుండి యీకె
యెంత దడవైనా మొగమేమి చూచీనే" 22-488

**సంతవేడుకలు :** వి. సంతలోని వేడుకలు, అస్థిరములు, అల్పములైన వేడుకలు.

"సంతవేడుకలు నీకు చవి చూచి (పి) పిలువఁగ
పంతమా మాకేమి పైపై నిట్టే" 13-445

**సంతసతి :** (3) వి. జారిణి, బజారుపడతి.

"ఇంతకు వచ్చేనా నేఁడు యీపె వలపు
సంతసతులకు నేఁడు సన్నలు చూపేవు" 19-91

"దొంతి వెట్టు కక్కడ విందులు నీకుఁ జేయ
సంతసతులతో నేమి సరసాలాడేవే" 22-306

**సంతసపుట్టు :** (సంతసము + పుట్టు) సంతోషం కలుగు.

"సంతసపుట్టీ రతికి సరిలేదే చెలియా" 12-309

**సంతసాకిరి :** వి. సంతలోని సాక్ష్యం.

"కాంతుఁడు నేనూఁ దారుకాణకు వచ్చితే
సంతసాకిరి చెప్పేవు జాణ వౌదువే" 26-383

**సంతసించుకొను :** అ.క్రి. సంతోషపడు, సంతసించుపై 'కొను' ప్రయోగం రాయలసీమ మాండలిక లక్షణం.

"మంతనాన నుండితేనే మనసు లేకములాయ
సంతసించుకొంటేనే చలము వాసె" 27-336

**సంతోషించుకొను :** (5) అ.క్రి. సంతోషపడు.

"సారెకుఁగాఁగిటఁగూడి సంతోషించుకొందుఁ గాని
నేరుపు నీ గుణాలెంచనేరను నేను" 13-14

**సంతోసపడు :** అ.క్రి. 'సంతోషపడు'కు వ్యావహారికరూపం.

"చింతించి యందుకుఁగాను చెక్కు చేతిలో నున్నది
సంతోసపడ నాన లిచ్చుటఁబెట్టుకో వయ్యా"
12-305

**సంతోసము :** (68) వి. 'సంతోషం' అనే శబ్దానికి వికృతిరూపం.

"అంది నీవే మాఁకు దిక్కైతివి
అన్నిటా సంతోసాన నున్నారమయ్యా" 2-339

**సంతోసముసేయు :** అ.క్రి. సంతోషం కలిగించు.

"సంతోసముసేసి నాకు చనవెల్లా నిచ్చెనే
యెంతకొంత వాని గుణమేమని చెప్పవచ్చునే"
23-87

**సంతోసించు :** (31) అ.క్రి. 'సంతోషించు'కు వికృతిరూపం.

"కోడెకాఁడు మొదలనే గురుతులు
మెయినున్నవి

కూడి సంతోసించేఁగాక కొఱత లెంచేనా"

27-521

**సంతోసించుకొను :** (25) అ.క్రి. సంతోషపడు. ఇట కొను అనే అనుబంధం రాయలసీమ మాండలికతాలక్షణం.

"సంతోసించుకొంటి నెంతే చవిగా మాటాడఁగాను" 12-218

"సన్నలా చాయలా నవ్వి సంతోసించుకొందును" 12-218

**సందడించు :** (9) అ.క్రి. 1. రొదచేయు 2. విజృంభించు 3.గోలపెట్టు 4. అతిశయించు 5. చుట్టుకొను 6.గుమిగూడు 7.ప్రకాశించు 8. తత్తరపడు 9. వ్యాపించు 10. సాంద్రమగు 11. తొందరపెట్టు 12. అంటుకొని యుండు.

"సురలు నీ యవసరము చూచుకొని కొలువునకు

సరవి నాఇత్తపడి సందడించేరు" 2-436

"సందడించి యిన్నిటా నీ చైతన్యమై యుండఁగాను

వందులేక నేఁగొన్ని వాహనా లెక్కితిని" 1-427

**సందడిగొల్లెత :** గుంపులోని గొల్లెత.

"ఇందరు జాణలే మీరు యేమని విన్నవించేము

సందడిగొల్లెతలము సంతోసించే మిదేవో"

13-514

**సందడి జాణతనము :** వి. అతిశయమైన నేర్పరితనం.

"అందుకుఁగా చెలి నవ్వి అంగమెల్లా జెమరించె

సందడిజాణతనాల సరసుఁడ వవుదువు"

20-534

**సందడిబంటు :** వి. పక్కనున్న సేవకుడు.

"కందువ శ్రీవేంకటేశ కడు నీ బంటుబంటుకు

సందడిబంటనవుటే చాలదా నాకు" 3-23

"నీ బంటుబంటుకు సందడిబంట

నవుటే చాలదా నాకు" 3-23

**సందడిరతులు :** వి; బహు. అతిశయమైన రతులు.

"అందుకే శ్రీవేంకటేశ యీకె నిట్టె యేలితివి

సందడి నీ రతులకు జవదాటదు" 39-490

**సందించు :** స.క్రి. 'సంధించు'కు జానపదవ్యవహారం.

"సందించి వైశాఖ శుద్ధచతుర్దశి శనివార

మందు సంధ్యాకాలమున నౌభళేశుఁడు" 4-310

**సందించుకొను :** 'సంధించుకొను'కు వ్యావహారికరూపం.

"తప్పుగాదు మఱఁగున దండనే వుండేము గాని

చప్పుడుసేయ కిద్దరు సందించుకోరయ్యా"

26-497

**సంది :** (11) అవ్య. మధ్య.

"సారె మోవి నే నానఁగ చన్నుల నాప వొత్తఁగ

యీ రీతి నిద్దరిసంది నెట్టు చిక్కితి" 23-436

**సంది :** వి. సందిలి, రెండు దండల నడిమిభాగం, దండచేయి.

"సందిఁగట్టుకొన్నవి చంద్రవంకతాయతులు

అందపు వల్లెవాటు పయ్యెద బుజాన" 29-106

**సందికంతల త్రోవ :** వి. ఇరుకైన అడ్డతోవ, సందిగొందు.

"సందిగట్టినతాడు సంసారము చూడ

సందికంతల త్రోవ సంసారము" 1-199

**సందిగొందులవారు :** వి. సందుల్లో, మూలల్లో ఉండేవారు.

"ఇందరిలో శ్రీవేంకటేశ నన్ను నేలితివి

సందిగొందులవారిని సరకుగొనేవా" 19-140

**సందు :** (2) వి. అవకాశం, అదను.

"అడనె కాఁగిటఁ జేర్చె వదే సందుగాను" 1-495

**సందుకొను :** (10) ప.బం; అ.క్రి. అవకాశం చేసుకొను, వ్యాపించు, సమయంచూచి చేరు, పరిగ్రహించు, (అం.ప.ని.) ప్రసరించు, మధ్యదూరు, కూర్చుకొను, కలసికొను. స.క్రి. పశపరచుకొను, గ్రహించు.

"సందుకొన నీకు నవి చవులై మెరయును"

16-582

**సందుగిందు :** వి; ప.బం. 'సందు' అనే అర్థంలో వాడబడే జంటమాట. ఇట సందులోని 'స' కారానికి నిందార్థంలో 'గి' కారాదేశం.

"జ్ఞానము లేని యెఱుక సందుగిందు లేని యిల్లు" 15-462

**సందుగిందు లేని యిల్లు :** ప.బం; వి. అసంభవం.

"జ్ఞానము లేని యెఱుక సందుగిందు లేని యిల్లు
రానిపోనిచోటి యాస రాజు లేని కొలువు"
15-462

**సందుగొను :** అవకాశం పొందు, సమయంచూచి చేరు.

"ఇందాఁకావలెఁ గాదు యిదేమి నీవు
సందుగొని సారె సారె సరసమాడేవు" 23-309

**సందులుగొందులు :** ప.బం; వి. ఇరుకువీథులు.

"సారె నవ్వకు మంటీఁగా సందులగొందుల నీవు
వారు వీరుఁ జూచితేను వట్టి రట్టౌఁ బనులు"
20-222

**సందుసుడి :** నడుమ, సమయం చూచుకొని, సమయాను కూలంగా, సందు చూచుకోవడం.

"పైకొని మీరిద్దరును బాసలు చేసుకొనగా
సాకిరై నే నుండేనా సందుసుడిని" 27-93

"పచ్చిగడము నీ చేపట్టుఁగా జెలియ్యరాఁగా
ముచ్చటతో సందుసుడి మోవి యానేవు"
18-172

"పొందినదాఁకా నింతే పొరపొచ్చెము లెల్లాను
సందుసుడి నీ కేలే జంకెనలు" 21-23

"పంతపుజీవుఁడు భ్రమసి సందుసుడి
దొంతులు దొబ్బుచుఁ దూరీఁగాక" 1-495

**సందుసుడికత్తె :** (4) వి. సందు చూచుకొని నడుమ దూరే స్త్రీ.

"సందుసుడికత్తెవు జాణవు నీవు
యిందరు నుండఁగా నీ వెంత లాఁచేవే" 18-132

**సందుసుడిది :** (సందు + సుడి + అది) సమయానుకూలంగా ప్రవర్తించే స్త్రీ.

"సందుసుడిదానవు చప్పన వుప్పన చేసి
విందులు చెప్ప వచ్చేవు విభునికి" 26-219

**సందుసుడి దొంతులు దొబ్బు :** ప.బం. సందుచేసుకొని దొంగకుక్కవలె ప్రవర్తించు.

"పంతపుజీవుఁడు భ్రమసి సందుసుడి
దొంతులు దొబ్బుచు దూరీఁగాకా" 1-495

**సందుసుడి మాటలు :** ప.బం; వి. అవకాశం చూచుకొని మాట్లాడే మాటలు.

"విందువలె నిన్ను శ్రీవేంకటేశుఁ డిదె కూడె
సందుసుడిమాట లేల చల్లఁ జూచేవే" 16-483

**సందుసుడివనిత :** వి. సమయానుకూలంగా ప్రవర్తించే స్త్రీ.

"సందుసుడివనితవు జాణవమ్మా
అందుకోలు పెండ్లాడే వౌనమ్మా" 12-160

**సందుసుడివలపు :** ప.బం; వి. సందు చూచుకొని చూపే వలపు.

"సందుసుడివలపుల జాజరకాఁడ
యిందరిపై నడియాస లేల చూపవయ్యా"
7-161

**సందుసుడిసన్నలు :** వి; బహు. సమయానుకూలమైన సంజ్ఞలు.

"సందుసుడిసన్నలలో జంకెనలే వేడుక
పొందులై నందులో పిలుపులే వేడుక" 12-205

**సందెకాడ :** (3) సంధ్యా సమయంలో, సాయం సమయంలో.

"సందెకాడ రమ్మనఁగా జాముపోయి వచ్చితిమి"
17-6

"సందెకాడఁ బుట్టినట్టి చాయలపంట యెంత
చందమాయఁజూడరమ్మ చందమామపంట"
4-342

**సందెకాడ వదినె :** ప.బం; వి. జారిణి.

"గద్దించకువే సందెకాడ వదినె
ముద్దులమఱది వింత మొక్కల మేటికిరా"
17-203

**సందెపొద్దు :** వి. సంధ్యాసమయం, సాయంకాల సమయం.
"తళితోడ సందెపొద్దు దప్పనీక జలధిలో
బళిపుగాఁబండిన నా బాఁపనయ్య వీఁడివో"
5-254

**సందేహించుకొను :** స.క్రి. సందేహించు. ఇట 'కొను' అనే ప్రయోగం విలక్షణం. కొన్ని ధాతువులపై కొను అనే ప్రయోగం రాయలసీమ మాండలికంలో విలక్షణం.

**సందైతే చావడి చంకబెట్టుకొను :** ప.బం; అ.క్రి. అవకాశం దొరికితే చాలు వస్తువులు అపహరించుకొని పోవు.
"చాయ సందైతే చావడి చంకఁబెట్టుకొన్నమాట
యీ యెడ నీయందె వున్నదిఁక నేటి మాటలు"
9-272

**సంపతిలు :** అ.క్రి. సమృద్ధమగు.
"జవ్వనపు మదములో సంపతిలి సారెతిలి
యివ్వల నిప్పుడుగా మా యింటికి విచ్చేసితి"
17-74

**సంపాదము :** వి. పూర్తిచేయడం, నెరవేర్చడం, పొందడం.
"శ్రీకాంతుఁడు శ్రీవేంకటపతి సేసిన సంపాద
మిందరికి
మేకొని యిన్నియు మీరినవారికి మీ నామమే
సుజాతి" 2-383

**సంబటూరి చెన్నుఁడు :** సంబటూరులో వెలసిన చెన్నకేశవస్వామి. చూ : సంబటూరు. అన్నమయ్య సంబటూరి చెన్నకేశవస్వామిని ఎనిమిది కీర్తనల్లో స్తుతించినాడు.
"చక్కని యీ చెన్నుఁడూ సంబటూరి
చెన్నుఁడూ
అక్కడ నిక్కడ చూపి ఆసలు రేఁచీని" 11-162

**సంబటూరు :** వి. కడపజిల్లా కమలాపురం మండలంలోని ఒక గ్రామం. పెన్నానదీతీరంలో ఉంది. ఇట చెన్నకేశవస్వామి ఆలయం శిథిలావస్థలో ఉంది. అన్నమయ్య ఈ సంబటూరి చెన్నుని కీర్తించినాడు. 11-162

**సంబళము :** (2) వి. 1. పాథేయం, దారిబత్తెం 2. వేతనం, జీతం 3. ఆయుధవిశేషం. సంబళము = wages అని బ్రౌన్.
"పాపములే సంబళమెపుడూ యీ
యాపదఁబడి నే నలసేనా" 1-82
సారంగపాణి పదాల్లో కూడా ఈ పదం ప్రయుక్తం.

**సంబురము :** వి. 'సంబరము' నకు వికృతిరూపం. సంతోషం, వేడుక, పండుగ.
"సంతసాన మాటలాడే సంబురముతోడనే
యింతలో ముత్యాల ఆరతెత్త మఱచితిని"
7-159

**సకి :** (8) వి. 'సఖి' శబ్దానికి వికృతిరూపం.
"చాలా వేడుక నాకె సకియె యుండినటు
ఆలికిఁగా భువనమోహనరూప మాయను"
10-2-119

**సకిన :** వి. 1. శుభసూచక నిమిత్తం 2. శుభాశుభసూచక వాక్కు 3. రత్నాలు మొ॥ వాటితో చేసిన కృత్రిమపక్షి. (ఆం.ప.కో.)
"పలుకవే పతితోను పదవే సకినలే
పలికి నతఁడు పండే పట్టెమంచాన"

**సకినగాఁడు :** (సకిన+కాఁడు) శుభసూచక నిమిత్తమైనవాడు.
"భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సవరని పైఁడిపక్షి సకినగాఁడు" 10-22

**సకినము :** (2) వి.1.శుభసూచక నిమిత్తం 2.శుభాశుభసూచక వాక్కు.
"సరినెందు వొయ్యేవంటే సకినాలు వాటించి
తిరిగి తిరిగి వచ్చి తిట్టేవేరా" 11-212

**సకినలమంచము :** (3) వి. రత్నాలు మొ॥ వాటితో చేసిన కృత్రిమపక్షులు గల మంచం. (సకినె = కీచుబిళ్ళ)
"వచ్చి కూచుండఁగా మోసీ వడి సకినలమంచ
మిచ్చట విడెమియ్య వే మీతనికి నీవు" 29-420

**సకినలసజ్జ :** (22) వి. రత్నాలు మొ॥ వాటితో చేసిన కృత్రిమ పక్షులు గల పడక, కీచుకీచు మనే పడక.

**సక్కెర**: వి. 'శర్కర'కు వికృతిరూపం.
"సక్కెరరాసులు సద్యోఘృతములు
కిక్కిరియ నారగించవో స్వామీ" 1-22

**సగినము**: వి. 'శకునం' అనే శబ్దానికి వికృతిరూపం.
"యీకడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యేకమాయ సగినము యింటికిఁ బోవయ్యా"
18-519

**సగియించు**: అ.క్రి; మాం. సగించు, రుచించు, సయించు, సహించు.
"సగియించకుంటేను చవి పుట్టీనా" 25-82
"సటలివి మాకైతే సగియించ వింకాను
నటన నాతనితోనే నవ్వవే పోయి" 19-473

**సగుణవంతుఁడు**: వి. గుణవంతుడు. ఈ అర్థంలో సగుణుడైనా, గుణవంతుడనైనా అనాలి. కాని సగుణవంతుడని ప్రయోగించడం విలక్షణం.
"సగుణవంతుఁడు వీఁడే సర్వకాముఁడు వీఁడే
నగుమొగము సుగ్రీవనరసింహుఁడు వీఁడే"
4-500

**సగ్గిసమగ్గిసలు**: వి; బహు. లోలోపల ఉడుకులు. (తె.జా. II భా)

**సగ్గు**: (5) అ.క్రి. అణఁగు, తగ్గు.
"సగ్గి నవ్వకుండఁగాను సరసమాడుదురటే
సిగ్గునఁ దప్పించుకోఁగా చే చాతురటే" 17-212

**సగ్గుడు**: వి. అణగుట.
"చన్నుదాగి పూతనను సగ్గుడుగా జప్పరించె
మిన్నుదాఁకె సుడిగాలి మెడదొక్కెను"
4 అను 76

**సగ్గుడు ముగ్గుడగు**: ప.బం; అ.క్రి. సతమతమగు.
"చంచలపు విషయాల సగ్గుడుముగ్గుడు గాక
యెంచి హరిఁదలపోయు టిదియె యెఱుక"
1-378

**సట**: (109) వి. 1.మోసం 2.కపటం 3.అసత్యం 4.కొండెం.
"యెటువలె నీ వుండినా నెదురు మాఁటాడదు
సట గాదు రావయ్యా సమ్మతించెను" 28-343

**సటఁబడు**: వంచింపబడు.
"కందువైన శ్రీవేంకటనాథుఁడు గావఁగా
సందుసుడి కోరికల సటఁబడఁజెల్లునా" 10-1-55

**సటకాఁడు**: (25) (సట + కాఁడు) వి. మాయకాడు, వంచకుడు, కొండీడు.
"ఏలోయి సటకాఁడ యెఱఁగనా నీ సుద్దులు
పోలించి యామె వలపు పూసేవు నీమీఁదను"
18-351

**సటకారి**: (4) (సట + కారి) మాయకాడు, వంచకుడు, కొండీడు.
"నెమ్మది నన్నేలినాఁడు నే నలమేల్మంగను
సమ్మతించ నేరుతువే సటకారి నీవు" 7-381

**సటకారితనము**: (సట + కారి + తనము) వి. శాఠ్యకారి శబ్దభవం కావచ్చు. వంచకత్వం, మోసం చేసే లక్షణం.
"మటమాయతనమున మగువలు మగవారి
సటకారితనమున పాదింతురు" 18-201

**సటకారివాఁడు**: (సట+కారి+వాఁడు) మాయగాడు, వంచకుడు, మోసగాడు.
"వెల్లవిరాయఁ బనులు విట్ఠలేశ్వరా
చల్లజంపుసేఁతల సటకారివాఁడవు" 9-173

**సటము**: అసత్యం, మాయ, (తె.వ్యు.కో.) చిక్కు.
"సారె సటములు సందడింపుచు
జారీఁ బయ్యెద సరుగనా" 5-49

**సటరాజసము**: వి. మోసపు రాజసము.
"కట్టి సటరాజసాలు వర్ణాశ్రమములును
పుట్టుగు లన్నియును యీ భూమిమీఁదివే"
4-235

**సటలఁబెట్టు**: స.క్రి. చిక్కులఁబెట్టు, బాధపెట్టు, పీడించు.
"సంతకూటపు బ్రతుకు సటలఁబెట్టీని
సానఁబట్టినవయసు సటలఁబెట్టీని" 3-483

"యెంత లేదు నీ వేసాలు యెఱుఁగనా నేఁడొల్లి
సంతకూటములు చూపి సటలఁబెట్టేవు" 19-207
"సానఁబట్టిన వయసు సటలఁబెట్టీని
పూని పురాకృతములు పోనీక తిరిగిని" 3-483

**సటలకారి:** వి. మాయలమారి. 'సటకారి' అనడం సహజం.
"కన్నుల సొలసుకొంటా కానుక నీ చేతికిచ్చీ
సన్నలా చాయలా నెంత సటలకారి" 29-524

**సటలమాట:** వి. మోసపుమాట, మాయలమాట, అసత్యపు మాట, క్రూరపుమాట.

**సటలవాఁడు:** వి. మోసగాడు, మాయగాడు.
"చేసిన తన చేఁతలు చెప్పరాదు
యి సటలవానితోడ నేమిసేతునే" 7-584

**సటలాడు:** (5) (సటలు + ఆడు) అసత్యములాడు, మాయలు చేయు.
"అటు శ్రీవేంకటేశు దాస్యము లేక బిగిసితే
సటలాడుకొనేటి రాక్షసమత మౌను" 2-120

**సటవటలు:** (3) వి. సటవట మాటలు - అనగా జల్లిమాటలు "boasting lies or idle talk బ్రౌన్. దండగమారి మాటలు, వ్యర్థపుపనులు. సటవట = కపటం అని వ్యు.ప.కో.
"అందియు నందనిచోటి యాసలు
సందడిఁ బెనఁగఁబోతే సటవటలు" 8-265
"కటకటా జీవుఁడా కాలము దోలుకరాగా
సటవటలనే పొద్దు జరపేవుగా" 1-350

**సడఁగు:** వి. 1. బాధ 2. అస్ఫుటమైన వాక్కు.
"సడఁగులు చల్లిచల్లి చత్రాత నా రొలిచేవు
తడయక సిగ్గులనే దడిగట్టేవు" 29-464

**సడఁగులు:** దోషవాక్కులు అని అం.ప.వి.
"సడఁగులు చల్లి చల్లి చత్రాత నారొలిచేవు
తడయక సిగ్గులనే దడి గట్టేవు" 29-464

**సడి:** వి. 1. నింద 2. చప్పుడు.

**సడిఁబడు:** కలుషితమగు.
"సడిఁబడ్డ నా తలఁపు చక్కఁగాక వుండినాను
వొడయఁడవు నీ కృప వొగిఁజిక్కనే"

**సడిఁబెట్టు:** అ.క్రి. కలుషితమొనర్చు.
"బెడిదపువినయాలు పెదవిఁబెట్టుకున్నది
సడిఁబెట్ట కొపె దిక్కు చక్కఁజూడవయ్యా"
29-512

**సడ్డ:** 1. ఆదరం 2. అక్కర 3. లక్ష్యం 4. శ్రద్ధ 5. ఆసక్తి 6.గౌరవం 7. ఎన్నిక 8. దుష్పరిణామం.
"ఇంతలో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టి
యెంతకెంత సడ్డ యేల యెవ్వరితో నీకు"
25-319
"కైవసమాయను కైవల్యపదమునుఁ
జావు ముదిమితో సడ్డే లేదు" 5-233 old

**సడ్డలాడు:** ప.బం; స.క్రి. గౌరవించు.
"సడ్డలాడఁగానే కడుజారిన పయ్యద చూచి
యెడ్డ నన్ను జాణఁజేసే వేటికో కాని" 5-373

**సడ్డసేయు:** స.క్రి. సరకుచేయు, లెక్కచేయు.
"అక్కడ వేరొకతెపై నాసలఁబొరలే నీవు
చక్కెరవంటి నామోవి సడ్డసేసేవా" 17-228

**సడ్డు:** వి. దుష్పరిణామం. 5-233 old

**సణఁగరము:** వి. బాధ.
"చెలరేఁగి యందరితోఁ జెప్పుకొనే సుద్దులు
చలివాసి చల్లేటి సణఁగరాలు" 12-328

**సణఁగు:** (13) వి. 1. అస్ఫుటవాక్కు 2. బాధ.
"సారె సారె నీ మీఁద సణఁగులే చల్లితిని
మేరలు మీరి నవ్వితి మేనవానిని" 14-402

**సణఁగులాఁడి:** వి. లోలోన గొణిగే స్త్రీ.
"చక్కనిదాన వౌదువే సణఁగులాఁడి వౌదువే
నిక్కి విభునిఁ గొసర నేరుతువే" 19-25

**సణఁగులాడు:** (2) అ.క్రి. లోలోన పలుకు, అస్ఫుటంగా పలుకు.
"ఇద్దరి నెట్టు గూరుత మేమి సేత మమ్మలాల !
వద్దనే సణఁగులాడీ వద్దన్న మానదు" 14-320

**సణఁగులు:** 'సడుగులు'కు రూపాం. కావచ్చు. వంకరమాటలు.
"చనవుసేసుక నీవు సణఁగులు చల్లితేను

ననుపుసేసుక నతఁడు నవ్వు నవ్వే నవ్వెను"

సణగులాడు: 'సడుగులాడు'కు రూపాం. కావచ్చు. వంకరమాటలు పలుకు.
"సన్నలు సేసితేనే సణఁగులాడుదురా
వున్నతితోఁ గొనగోర నూఁదితేఁగాక" 26-457

సతమగు: (58) ఆయాసపడు.
"యితవై శ్రీ వేంకటేశ యేలితి నీవెందున్నా
సతమైతి నిట్లానే సరగన రావయ్యా" 23-221

సతమగు: వి. విణ. శాశ్వతమైన, ఎడతెగని, ఎల్లప్పుడు.
"సతమైన కూరిమికి సాదించనేల
హితవైన వినయాలే యింపులుగాక" 8-74

సత్తు(గా): (17) వి; క్రి.విణ. 1. సత్యం(గా), సత్య శబ్దభవం కావచ్చునని పరిష్కర్తల సూచన. (2. బలం, సారం.)
"సత్తుగా శ్రీవేంకటేశ సరివారి మగఁడవు
హత్తి కూడితివి నిన్నునట్టి మెచ్చవలెను"
22-516 & 22-516
"సత్తగు నీ దయ నాపైఁ జల్లుదుఁగాక" 11-150
ఇట బలమైన అనే అర్థం కూడా చెప్పవచ్చు.
"సత్తగు శాస్త్రము చాయ చూపినా
కొత్తగ నేనిఁక గుణినయ్యేనా" 4-60

సత్తెము: వి. సత్యం, నిజం.
"మట్టు మీరిన చేతల మగవాఁడవు
వట్టి సత్తేలు నెరపవలెనా నీకు"

సత్వ: (8) వి. సత్వం, బలం. సత్తువకు వికృతిరూపం.
"నిలుచుండ సత్వ లేక నేరమి వచ్చునో
కొలువుసేయక మఱుఁగున నుంటిని" 15-320

సద: (2) వి. 1. ఆకు 2. ఆకు మీది నూగు 3. ఆకులోని సన్నటి ఈనె. (వ్యు.)

సదచేయు: స.క్రి. నుగ్గుచేయు, సదమదం చేయు, గజిబిజిచేయు. (అ.మూ.)
"మెదలి నా ముంగిలది మెట్టిన తప్పునకును
సదచేసి జగడాలు చల్లేబో యికను" 5-50

సదమదము: (19) వి. నలిగిపోవడం.
(సదమదము: అందులోనే పూర్తిగా మునిగి పోవుట. పద.)
"సిగ్గరి పెండ్లికొడుకుఁ జేరి చూతము
వొగ్గి సదమదములై వున్నాఁడట" 11-183
"సదమదముగ సరసము లాడఁగదవే" 28-392
"విందుల నీ రతులలో వేడుక పిక్కటిల్లఁగా
సందడించి కుచములు సదమదమాయను"
8-25

సదరపుదివిజులు: వి. సాధారణ దేవతలు.
"యెదలో శ్రీవేంకటేశ్వరుఁడుండఁగ
సదరపుదివిజులు చవులయిరి" 4-96

సదరమగు: అ.క్రి; మాం. తేలికయగు.
"చల్లలమ్మే వారమైతే సదరమైతిమా నీకు
యెల్ల చోటులకు వచ్చి యేల మొక్కేవయ్యా"
28-312

సదరము: (17) వి. వేళాకోళం, చులకన.
"సదరాన బొమ్మలను జంకించితే నేమాయ"
29-535
"అయ్యో యేమీ నేనంటే నెంత సదరమే
కొయ్యఁగదే ముక్కుననే కోపమున్నది" 11-248

సదరముగ: సమగ్రంగా, స్పష్టంగా.
"ఇదివో శ్రుతి మూలమెదుటనే వున్నది
సదరముగా హరి చాటీ నదివో" 4-71

సదసచ్చాహమ్: "అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహ మర్జున!" అనే భగవద్గీతా శ్లోకం లోని భాగం. లోకంలో సత్తునూ, అసత్తునూ నేనే అని అర్థం.
"పొదలుచుండేటి యీ జగము పొసఁగ నీవు గా
వన వెలితు
యిది విపరీతజ్ఞానము సదసచ్చాహంబంటివి
గాన" 2-121

సనఁగలు: వి. సెనగలు, శనగలు.
"చారపప్పుఁ దేనెలు సనఁగలు చెఱకులు
ఆరగించి ............ లతో నట్టుగలెక్కి" 22-240

ఇట 'సనగలు'లోని 'స' యతిస్థానంలో ప్రయోగింపబడింది.

**సనిగెపప్పులు:** వి; బహు. శనగపప్పులు.

"చక్కిలాలు నడుకులు సనిగెపప్పులును
చెక్కిన మెత్తని తూఁటచెఱకులును" 1-256

**సనిగెలు:** (2) వి; బహు. 'సెనగలు'కు జానపద వ్యవహారరూపం. చూ: సనగలు.

"ఊని నానిన సనిగె లొకటి కినుమడి" 21-310

**సన్నగాళె:** (సన్నము + కాళె) వి. వాద్యవిశేషం.

"చీని చీనాంబరముల సింగారపు మేడనుండి
వీనుల సన్నగాళెలు వినుకొంటాను" 18-281

**సన్నము దొడ్డెంచు:** (సన్నము+దొడ్డ+ఎంచు) ప.బం; అ.క్రి. చిన్నది పెద్దది అనే భేదం ఎంచు.

**సన్నలరతులు:** వి; బహు. (?)

"సన్నల (నీ) రతులకే సమ్మతించే నేను"
19-162

**సన్నలు:** వి. సన్ననైనవి, చిన్నవి.

"కందువ కన్నులె గొప్పగాని పాదాలు సన్నాలు
మందలించి నీతో మారు మలయంగఁగలనా"
11-118

**సన్నలు - చాయలు:** ప.బం; వి; బహు. గుర్తులు, జాడలు అనే అర్థంలో జంటపదం.

"సన్నలా చాయలా నవ్వి
సంతోసించుకొందును" 12-218

**సప్పుసారై పోవు:** అ.క్రి. చప్పబడిపోవు; సప్పు-చప్పె flatness, unsipidness, dull - సవర్-to perish (కిటెల్)

"కవకవ నవ్వి కన్నులు దేలగిలఁగ
సవరన్ని యాటదెల్ల సప్పుసారై పోయెను"
12-157

**సబ:** (2) వి. 'సభ'కు జానపద వ్యవహారరూపం.

"తీగెల యెలుఁగులు తెగని గర్వములు
సాగి యే సబలఁ జదివితివే" 29-340

**సమందము:** వి. 'సంబంధము' అనే శబ్దానికి జానపద వ్యవహారరూపం.

"గట్టిగా శ్రీవేంకటేశ నీ నా సమందమే
యెట్టయినాఁ దలఁచుకో యింకనైనాను" 15-16

**సమకట్టు:** వి. కూర్పు, రచనం, వేషరచన.

"కావించి నీ సమకట్లలో నల్ల జల్లి
దూవిన నేరుపుల కెదురు వలెచెనయ్యా"
10-2-102

**సమతు:** వి. సమ్మతి, అంగీకారం.

"సంతోసాన నవ్వు నవ్వి సమతు సేసుకొనేవు
చెంత నీ వేమి సేసినాఁ జెల్లునయ్యా" 22-407

**సమత్తు:** వి. సమర్థుడు, నేర్పరి. (త. శమత్తు)

"అమ్మరో నీ వాకకు అరవి (య) సమత్తువేమో
చిమ్మిరేఁగి తరితీపు చిందీ మీ వల్లను" 24-325

**సమదిష్టి:** వి. సమదృష్టి.

"సారె జారుపయ్యదతో సమదిష్టి నిలుచుండి
కోరి సిగ్గువడేవేమే కొచ్చి చూచెనంటాను"
22-241

**సమయుఁడు:** వి. మతవిషయకమైన కార్యాలను పర్యవేక్షించేవాడు.

"ఆచార్యపురుషులు అవ్వలఁగొందరు
యేచిన సమయులై యేర్పడిరి" 1-499

**సమరతి:** వి. ఉపరతికి విరుద్ధమైంది.

"జంపు నీ చన్నుల నొత్తి సమరతులకుఁ దీని
అంటి దక్కఁగొనఁగానే నందుకుఁ గాదంటినా"
18-190

**సముకపువారు:** (2) వి; బహు. ఎదుటివారు.

"అమర నీ రతి కాతఁ డాసపడి నవ్వితేను
సముకపువారినల్లా సాకిరి వెట్టుదురా" 14-546

**సముకము:** (13) వి. సముఖమునకు వికృతిరూపం. ఎదురు, సమక్షము.

"జమళి నిద్దరిని సంగడిఁగూర్చితి
తమకము సముకముఁ దానెఱుఁగు" 25-221

**సముఖా:** 'హెచ్చరిక'ను తెలియజేసే పదం.

"సముఖా యెచ్చరిక వో సర్వేశ్వరా
అమరె నీ కొలువు ప్రహ్లాదవరదా" 4-489

"అవధారు రఘుపతి యందరినిఁ జిత్తగించు
యిపల నిండెఁ గొలువిదె నదె సముఖా" 3-492

**సముద్రబిల్లలు :** వి; ప.బం; బహు. ఒక విధమగు ఆట.

"తమితోడ గోపాలులు తానుఁ గూడి
ముంగిటను
సముద్రబిల్లలాడీ సాధుకృష్ణుఁడు" 4-172

**సముద్రము కడచి ఓడలో నినుము దెచ్చు :** ప.బం. కొండను తవ్వి ఎలుకను పట్టుట వంటిది. శ్రమకు తగని అల్పఫలాన్ని పొందిన సందర్భంలో ఉపయోగించే పలుకుబడి. 3-574

**సముద్రములో వానలగు :** ప.బం; అ.క్రి. వ్యర్థమగు.

"నన్నుఁ జూచేవారు లేరు నవ్వేటివారు లేరు
వన్నెల సముద్రములో వానలాయ బ్రదుకు"
2-6

**సముద్రాన కేతాలు వెట్టు :** ప.బం; అ.క్రి. అసాధ్యమైన కార్యానికై వ్యర్థప్రయత్నం చేయు. (ఎంత ఏతం వేసినా సముద్రంలోని నీళ్లు ఇంకుతాయా అనే దానిపై వచ్చిన పలుకుబడి.)

"చుట్టిచుట్టి యాతని మై సొంట్లు
సోదించుకొంటా
యిట్టి సముద్రాన కేతా లెన్ని వెట్టేవే" 29-64

**సమేళము :** (6) విఠ. అనుకూలము (ఆం.ప.ని.) ఒద్దిక, చేరిక, (శ.ర.) గుమి. (తె.వ్యు.కో.)

"ఇక్కువంటి శ్రీవేంకటేశుఁ డిట్టి నన్నుఁగూడె
మిక్కిలి నవ్వీన యీ సమేళమె చాలదా"
14-344

**సమేళి :** వి. (?)

"వలపులు వలపులు వయాళి
చలమరి మరుఁడును సమేళి" 7-292

**సమ్మందము :** వి. 'సంబంధము' అనే దానికి జానపదవ్యవహారం.

"కాఁగిటి సమ్మందము కలయఁ జెప్పఁగవచ్చె
చేఁగదేర సేవలెల్లఁ జేయ వచ్చెను" 25-415

**సమ్మంధము :** (20) వి. 'సంబంధము' అనే దానికి జానపదవ్యవహారం.

"అట్టి దేహసమ్మంధ మాసపడే జీవులాల
పట్టి హరిసమ్మంధాన బ్రదుకరాదా"
10-42 & 2-92

**సమ్మటూరి చెన్నుఁడు :** వి. కడపజిల్లా కమలాపురంలోని సంబటూరిలో వెలసిన చెన్నుడు.

"సమ్మటూరి చెన్నుఁడా జాణఁడ వౌదువయ్యా
పమ్మి యన్నిటాను చెల్లుబడీ యాయ వలపు"
23-554

**సమ్మటూరు :** వి. రూపాం. సంబటూరు. కడపజిల్లా కమలాపురం మండలం లోని గ్రామం.

"సరవి శ్రీవేంకటేశ సమ్మటూరిలో మనము
యెరవు లేని యీ మేలు కేమి సేతురా" 11-455

**సమ్మాళిగెలు :** వి; బహు. పాదరక్షలు, సంబవులు. రూపాం. సమ్మాళిగలు, సంబాళిగలు.

"సమ్మాళిగెలు మెట్టి సతి రాజసముతోడ
కమ్మి యెుక చెలిమీఁదఁ గరము చాఁచి" 17-83

**సయించు :** స.క్రి. 'సహించు'కు జానపద వ్యవహారరూపం. హితమగు, అంగీకారమగు, సహించు.

"కొంత సయించవె పతి కొరత దీరుచకుండితే
చెంతల నప్పుడె సంతసింతువు గాని" 11-264

**సరకు :** వి. ఇది రాయలసీమ మాండలికం. సరదా, తమాషా.

"ఎచ్చరించెద ననిన యీ జగంబనఁ గాను
సచ్చరిత్రుఁడ! నీకు సరకా వోరి" 5-314

**సరగతి :** వి. 'స్వరగతి'కి వికృతరూపం.

"దిక్కులందు హంసలివి తీర్థయాత్రలు సేసి
చక్కని పాదములందు సరగతు లాయ"
28-277

**సరతు :** వి; చెమట; ఇది రాయలసీమ మాండలిక పదం. ఈ నాటికీ రాయలసీమలో ఈ పదం

'సర్తు' అనే రూపంలో వ్యవహారంలో ఉన్నది. 'సరత' అని మాం.ప.కో. (389 పు.)

"చల్లని గందవొడిచే సారవుఁ బన్నీరిదే
చల్లుకోరాదా మేన సరతు వాసు" 21-424

"అక్కుపై గురుతులు అంగవు సరతులు
మక్కళించనేల యిది మరవకు చాలు" 9-91

**సరపణి:** వి. 1. గొలుసు (ఆభరణం), ఇనుపగొలుసు.

"చాలుఁజాలు బంగారు సరపణు లుంగరాలు
నీలపుఁగంటసరులు నీవే వుండనీ" 5-342

**సరవి:** వి. 1. క్రమం, వరుస 2. తీరు, విధం 3. ఒప్పు, అందం (సూ.ని.; తె.వ్యు.కో.)

"చనవరి నయ్యేనంటా సరవెల్ల నడపితి
మనసులో తమకాలు మాన వేలరా" 11-282

**సరవిసేయు:** (?)

"యివల శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
జవళి నన్ను నాపె సరవిసేసితి వి" 25-254

**సరిఁబదకము:** వి. ఒకరకపు ఆభరణం.

"సరిఁబదకము నీకు నే చక్కఁగా నేఁబెట్టితి
నరుదైయున్నది కంఠహార మేడది" 17-98

**సరి:** విణ. యుక్తం (వి. సాటి, తగిన సమాధానం, సామ్యం, సమానం. విణ. అనుకూలం, సమాప్తం, సమర్థత కలిగి చెడిపోయినది, తగినట్లు, సమానంగా, యుక్తంగా, అనుకూలంగా.)

"పండిన పండ్లు తొడమఁబాసి వూడినయట్టు
అండనే మరణములు అందరికి సరి రే" 2-140

**సరికి బేసికి:** ప.బం; అవ్య. ప్రతిదానికి, ఐనదానికి కానిదానికి, (తె.వ్యు.కో.) మంచికి చెడుకు.

"చలుములు బలుములు సరికి బేసికి ముంచె
నిలచిన నిలువకే నీవు మన్నించితివి" 14-324

**సరికి బేసియగు:** (4) ప.బం; అ.క్రి. మంచికి చెడు అగు, నాశనమగు.

"సరికి బే శాయ నిది చాలదా నేఁడు
యిరవాయఁ బనులెల్ల నిఁక నేల మాటలు"
21-435

**సరికి సరి:** (4) ప.బం; వి. దేనికది, మాటకుమాట అప్పగించడం.

"చేసేటి పుణ్యములకు చెందేటి పాపములకు
యీసుల సరికి సరి ఇందుకిందుకు" 3-363

"చనవుకు మనవికి సరికి సరి
చలువకు వేఁడికి సరికి సరి" 20-234

"అనుఁగుఁబున్నములకు అమాసచీకట్లు
అనయ సరికి సరిందు కందుకు" 3-363

**సరికి సరి బేసి గాదు:** దేనికదే కాని తద్విరుద్ధం కాదు (?)

"చనవు సేసుక నీవు సణఁగులు చల్లితేను
ననుపు సేసుక నతఁడు నవ్వు నవ్వేను
పెనచి సరికి సరి బేసిగాదు" 15-110

**సరికి సరియగు:** అ.క్రి. దేనికి అదే అగు, ఒక వస్తువునకు సమానమగు.

"వాకున వినయము వళుకులు చెంతల
సాకిరి రమణుఁడ సరికి సరియాయ" 21-525

**సరిగద్దె నుండు:** ప.బం. అ.క్రి. అర్ధాసనాసీనుడగు. ఇది అత్యంతగౌరవాదర సూచకం.

"సాజమై నిన్నుఁ గొలిచి సరిగద్దె నుండునా
వోజతో నిన్నుసేవించివుందు నింతేకాక" 2-139

**సరిగె:** వి. 'సరిగ'కు రూపాంతరం. 1. హారం 2. కాంతి 3.జలతారు 3. బట్టలంచులకు, గాని డిజైన్ల కోసం గాని నేతలో వాడే సన్నని మెరుపుదారం.

"చక్కనిదాననంటా సరిగె గలదంటాను
వెక్కసి వెంతైతివే వెల్లివిరితో" 28-558

**సరిత:** (38) వి. 'చరితము' అనే పదానికి వ్యవహారరూపం.

"కంటిమి మీ సరితలు కందువగాను
ఇంటికి రావయ్యా యీడ నేల చెనకేవు" 17-45

"కందము నీ సరితలు కడదాఁకాను

యింధరిలో నన్ను మాటలేల బొంకేనికను "
11-135

**సరితె:** (6) వి. 'చరిత్రము' అనే పదానికి వ్యవహారరూపం.
"కానుకగాఁ బట్టేమయ్య్య కాంతకు నీ సరితెలు
యీ నిజాలె చెల్లించుకో యేల నవ్వేమికనే"
11-389

**సరిదాపు:** ప.బం; వి. దగ్గరివాడు.
"శరణాగతులకు సరి దాపెవ్వఁడు
యిరువుగ శ్రీపతి యెవ్వఁడు" 4-403

**సరిన్:** ఎదుట కావచ్చు. (f.n. 22-218)
"పొరుగున నున్న నన్నుఁ బోరచివెట్టు మనేవు
సరినున్న కాంతమోవి చవిగొనరాదా" 22-218

**సరిబేసి:** వి. మంచి-చెడు.
"తెరలోన దాగేవు తేరి నిన్నుఁ జూచితేను
సరిబేశా నీ చేతలు సారె సారె ముయ్యేను"
7-487

**సరిబేసి:** వి; ప.బం. బాలక్రీడావిశేషం.
"చలివాయ నియ్యవే సరిబేసి ఆడినట్టు
వలపులు తనమీఁద వడిఁజల్లేను" 11-476

**సరిబేసికి:** (4) మంచికి చెడుకు, ఐనదానికి కానిదానికి.
"ఎలమి సరిబేసికి యిదె సుద్ది నిన్ననేల
నిలువు నివ్వెరగులు నీ కేలయ్యా" 8-157

**సరిబేసి జంట జరుపు:** చిక్కుప్రశ్నలు వేయు.
"గరిమ శ్రీవేంకటేశ కరుణించితివి నన్ను
సరిబేసి జంటమాట జరపకు మీఁకను" 4-203

**సరిబేసి పంతాలు:** ఐనవీ కానివీ ఐన పంతాలు.
"సరిబేసిపంతాలు జగడించకతీరదు
మరుతంత్రముల మెండు మతి చొక్కక తీరదు"
22-91

**సరిబేసులాడు:** సరిబేసులాట ఆడు.
"సొరిది గచ్చకాయలు చూపి విట్ఠలా
సరిబేసులాడేవు జాణవిట్ఠలా" 18-369

**సరిబేసులు:** (2) బాలక్రీడావిశేషం.
"సరిబేసులాయను మీ సరసము నిద్దరికి
మెరసిన మీ చేతలు మెచ్చితి మిందరము"
28-413

**సరిముద్రలు:** వి; బహు. సాటిముద్రలు.
"సాజాని శ్రీవేంకటేశు సరిముద్రలు ధరించే
తేజముతో విజ్ఞానదేహములో నున్నది" 15-60

**సరియాఁక:** (2) వి. ఒరగుడం, వంగడం.
"చదురులాడఁ జూచితే సరియాఁకలై యుండు"
21-331

**సరిసేయు:** స.క్రి. సమానం చేయు.
"మానక సరిసేసుక మాటలాడీ నాతో
వీనులకు వెట్టదోఁచు విభుఁడు తాఁదాను" 7-467

**సరుగ:** క్రి.విశ. వేగిరంగా, తొందరగా.
"చెక్కిటి చేయి దియ్యకు చింతతోడను
చక్కఁబెట్టుదువు ప(స)తి సరుగన రావయ్యా"
23-221
"సరుగ లంకారాజ్యము సాధించినాఁడు" 3-148
"సరగ విచ్చేయుడు సాకేతమునకు"
అని క.వ.రా. 520 పు.

**సరుగు:** (2) అ.క్రి. వర్ధిల్లు, పెరుగు.
"పరగు వేదరాసులే పగ్గాలు వట్టి తియ్యఁగ
సరుఁగు దుష్టులఁగొట్టి జయము చేకొనెను."
3-122

**సరుస:** (47) సరస, సమీపం.
"సవతులమింతే సరుసల నుంటిమి
దవనపు వాట్లు తా నెఱుఁగు" 25-221
"ఇరవాయ నుండవయ్య యేమి చెప్పేవు
సరుసఁగూచున్నదెల్లా చనవే కాదా" 13-45

**సర్గము:** వి. 'స్వర్గము' అనే శబ్దానికి జానపద వ్యవహారరూపం (?)
"చలపట్టితే జాలు సర్గమేమి బాఁతా
చలివేఁడి నాలికపై సత్యములో నున్నాఁడు" 2-7

**సర్వం విష్ణుమయమ్:** 'సర్వం విష్ణుమయం జగత్' అనే శ్లోకపాదంలోని భాగం. (సమస్త విశ్వమూ విష్ణువుతో ఏర్పడిందే అని భావం.)

"సర్వం విష్ణుమయంబను భావము
సత్యం సత్యం బన్నిటను" 40-90

సర్వజాణ: వి. మిక్కిలి నేర్పరి, అందరిలో జాణ.
"సరసుఁడ వన్నిటాను సర్వజాణవు
గరిమనన్నీఁదెలియఁగదవయ్యా నీవు" 8-194

సర్వపాపేభ్యో అహం త్వా : (?) "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" అనే భగవద్గీతా శ్లోకభాగం. (అన్ని ధర్మాలను వదలి నన్నొక్కణ్ణే శరణుపొందుము. నేను నిన్ను అన్నిపాపాల నుండి విడిపిస్తాను. దుఃఖపడకు అని గీతాచార్యుడైన శ్రీకృష్ణుని అభయదానం.)
"హరి "సర్వపాపేభ్యో అహం త్వా" యనె
గరిమ నా వాక్యమే ప్రమాణమైనట్టి గతి
యొక్కటే నాకు" 4-77

సర్వాపరాధి: వి. సమస్త అపరాధములు చేసినవాడు అని వాచ్యార్థం. శ్రీవైష్ణవులు నమస్కరిస్తూ పలికే మాట. భయకారకమైన స్వదోషానుసంధానం ప్రపన్నునికి ఎల్లవేళలా ఉండాలని శ్రీవైష్ణవుల నియమం. ఈభావం తోనే శ్రీవైష్ణవులు భగవంతునికీ, ఇతర వైష్ణవులకూ నమస్కరించేప్పుడు వినయపూర్వకంగా "సర్వాపరాధిని" అని విన్నవించుకోవడం ఆచారం.
"సంతతము నన్నేంచితే సర్వాపరాధి నేను
యెంత నీ వేమి సేసినా నంత కర్తుఁడ" 2-192
"అట్టి సర్వాపరాధి నపరాధా లెంచనేల
గట్టిరాళ్లతో మలిగండ్లేర నేల" 2-254

సలలితముగ: క్రి.విణ. మనోహరంగా, ఒప్పుగా. ఇట 'స' అనే తొలిపదం అనవసరం.
"సలలితముగ నీవు జగములు రక్షించఁగా
వలనుగఁ బొగడేరు వ్యాసాదులు" 13-504

సలిగ: వి. అండదండలవల్ల కలిగే బలిమి, ఆశ్రయబలం (ఆం.వ.కో.) ప్రాపు, ఆశ్రయం, (శ.ర.) చనవు, కూడని స్వాతంత్ర్యం (సూ.ని.) రూపాం. సలిగె. (క.తు. సలిగె) ప్రాపు, ఆశ్రయం అనే అర్థాలు అన్నమయ్య ప్రయోగాల్లో ఒకటి రెండు తావుల్లో సరిపడుతాయి కాని పెక్కుచోట్ల చనవు అనే అర్థమే పొసగుతుంది. "సలిగెతో మొత్తరాగా" "సలిగలు చెప్పబోతే" మొదలైన ప్రయోగాలు.
"చక్కని యశోద తన్ను సలిగతో మొత్తరాగా
మొక్కఁబోయీఁ గొల్లకు ముద్దులాఁడు" 4-142
"చెప్పినట్టు సేసేటి చేకొలఁది మగఁడాయ
అప్పుడే సలిగ గల ఆలవైతివి" 17-196

సలిగె: వి. ఆశ్రయం, చనవు, కూడని స్వాతంత్ర్యం. రూపాం. సలిగ. (క.తు. సలిగె) బలం, అండ. (బ్రౌన్) కిటెల్ కన్నడ నిఘంటువులో చనవు అనే అర్థం చూపబడింది. సలిగె – familiar intercourses, familiarity, indulgence, intimacy, familiarity probably is taken from k. (సం.కీ.వా. పద. భాషా - 477, 478 పుటలు) అహంభావపూరితమైన మాట.
"సలిగెతో నిట్టె నిన్ను సారెసారెఁ జెనకఁగా
వెలినున్న యాపె నేల వెలిగోర నూదేవు"
18-206
"పొలయుచు రాజసాన పురుషుని సలిగెల
నలువంక విఱ్ఱవీగి నవ్వునవ్వేవే" 18-580

సలిగెతనము: (2) వి. చనవు, కూడని స్వాతంత్ర్యం.
"వెలలేని గుణముల విభుఁడాతఁడు
సలిగెతనాల నెంత సాధించేవే" 22-260
"లలి నీ వాతని తమ్ములము వెట్టించుకొంటివి
సలిగెతనాల నివె జట్టిగొంటివి" 23-73

సలిగెలు చూపు: చనవులు చూపు.
"సరసము నీతో నాడి సలిగెలు చూపితేను
సరివారు వెరతురా సారెఁదనకు" 16-4

సళుపు: అ.క్రి. వి. వ్రణం లోనైనవి పోటెత్తు విణ. బాధాకరమైన, భారమైన.
"సళుపు మరునమ్ములు సాక్షి వెట్టినట్లు
సొలపి తాఁజూచినట్టి చూపులు నీకుఁదెలిపె"
7-62

**సళుపులాడు:** అ.క్రి. బాధపడు.

"వలచిన నీవు నాకు వసమై వుండితేఁ జాలు
సళుపు లే మాడేరు సవతులిఁక" 13-368

**సవతిచుట్టరికాలు:** వి; బహు. కపటబంధుత్వాలు.

"సవతిచుట్టరికాలు జగతిలోఁ గలవా
వివరించుకొంట గాక వినయాలింకానా" 26-12

**సవతిపోరు:** (4) వ.బం; వి. తగనిపగ, సవతి మత్సరం.

"చలములు సాదించ సవతిపోరా యేమి
తలఁపులో కొద దీర్చి దగ్గరి రమ్మనవే" 8-57

**సవతు:** వి. 1. సామ్యం, ఔపమ్యం, ఈడు, సమానం 2.విధం, పద్ధతి 3. ఖ్యాతి.

"సవతైన చదువులు సరుగఁదెచ్చిన తలఁపు
రవళిఁదరి గుబ్బలిని రంజిల్లు తలఁపు" 1-356

**సవరఁగా:** క్రి.విణ; చక్కగా.

"వివరించి చెప్పవయ్యా వినవేడుకయ్యీ మాకు
సవరఁగా నేము తెరచాటుననే వుంటిమి"
22-256

**సవరఁదనము:** వి. చూ: సవరందనము.

"చివురువంటి నా చేతులెత్తి మొక్కించె
సవరఁదనముల నా జవ్వనపు మోహము"
27-507

**సవరందనము:** వి. సవరఁదనం, చక్కదనం, సౌందర్యం.

"ఏటి పొందు యేటి గుణము యేటి
సవరందనము మనసు
నాటు కొలుపంజేయలేని నటన లేఁటికే" 6-180

**సవరణ:** వి. వాహనాద్యలంకారం, సన్నాహం, సామగ్రి, సవరంపు, సౌమ్యం, సేవ. (తె.వ్యు.కో.)

"మించె నివె సింగారాలు మెలుతలాల
పంచబాణు సవరణ పరఁగినయట్లు" 7-405

**సవరని:** విణ. చక్కని, అందమైన.

"సంపదల ముజ్జగము చందురుని సోయగము
జంపులేల యెత్తవే నీ సవరని మొగము"
26-47 &17-34

**సవరనివాఁడు:** వి. అందమైనవాడు.

"సవరనివాఁడవంటూ జాణతన మాడితేని
రవళిఁ జెయిముట్టి సరసమాడేవు" 10-2-11

**సవరపుఁగొప్పుది:** (సవరము + కొప్పు + అది) సవరం (= స్త్రీలు జుట్టుముడితో ఉపయోగించే చమరవాలం) కొప్పులో ముడిచిన స్త్రీ.

"పవడపుమోవిదాన ఖారపు గుబ్బలదాన
సవరపుఁగొప్పుదాన చక్కనిదాన" 29-409

**సవరాజ్యపట్టము:** వి. 1. సర్వరాజ్యపట్టం 2.అర్ధరాజ్యపట్టం.

"అదివో పట్టపుదేవులారడి పంతము చేరె
పదరక సవరాజ్యపట్ట మేలవయ్యా" 8-276

**సవరాజ్యము:** వి. సగరాజ్యము (సర్వరాజ్యశబ్ద వికారమా అని అధస్సూచికలో పేర్కొనబడింది. సర్వరాజ్యవికారమే ఐతే సమస్తమైన రాజ్యమని అర్థం.)

"సంగతిఁ గొలువున్నాఁడు సవరాజ్య మేలు
ముంగైమురువులచేత మొక్కవే నీ పతికి"
26-517

**సవరేతిరి:** (సవము + రేతిరి) వి. అర్ధరాత్రి, అర్ధమరేయి. చూ: సవరేయి.

"చందురు నుదయవేళ సవరేతిరికాడ
కందువ దేవకి బిడ్డఁ గనెనమ్మా" 3-193

**సవరేయి:** వి. అర్ధరాత్రి.

"సవరేయి పుట్టినాఁడు శ్రావణబహుళాష్టమి
నవముగా రోహిణి నక్షత్రమందు" 22-239

**సవి¹:** వి. 'చవి' కి జానపదవ్యవహారం. రుచి.

"బట్టబయలు నవ్వులు పచరించి రమణుని
జట్టిగొని పెనఁగఁగా సవులయ్యీనా" 27-62

**సవి²:** వి. 1. భ్రాంతి 2 అని - హేత్వర్థకం.

"పొదలఁబూవులు చూచి బోయతి యంప
పొది సవి వెరచెనె బోయతి" 5-175

"వుదయచందురుఁజూచి అదె నీ పంజని సవి

యెదురుకోనే వచ్చితిరా" 7-223

**ససి :** వి. 1. పైరు, సస్యం 2. విత్తనాలు పోసిన కయ్య, ఆకుమడి 3. శక్తి 4. రుచి.

"పులకల ససులు గొబ్బున మైనిండా మొలచె" 13-137

"యిదె నీపై యాసల నిట్టి మేను పులకించె
వెదవెట్టక ససులు వేవేలు మొలచెను" 23-127

**ససులెత్తు :** అ.క్రి; ప.బం. మొలకెత్తు, అంకురించు.

"పన్నీరే చల్లుకొనేవు పదనెక్కి వలపులు
పిన్నపిన్న ససులెత్తి పెరిగీఁ జూమ్మీ" 17-497

**ససువు :** వి. 1. సాధువు 2. మొక్క.

"యెసఁగు భక్తవత్సలుఁడింట వెంట నుండఁడా
ససువై మొక్కిని వెల్తి జగములది గాక" 4-123

**సహజము :** (2) వి. సహజత్వం. ధర్మవాచకానికి బదులు ధర్మివాచకం.

"సంసారికిఁగల సహజమిది మతిఁ
గంపారి మనకుఁ గల డటుగాన" 3-481

**సహజి :** వి. ఈ శబ్దము విశేష్యనిఘ్నం. సహజస్వభావం కలవాడు సహజి. పుట్టినవాడు పుట్టినట్లే (ఏ ప్రయత్నము చేయక) వుండుట. అనే అర్థంలో ప్రయోగించినట్లున్నది. సహజః స్వభావః అస్య అస్తీతి. 'సహజీ'. పుట్టిన నాటి స్వభావమే కలవాడు. ఏమీ ఎరుగనివాడు. శబ్దం వ్యాకరణవిరుద్ధము కాదుగాని బహుళప్రయోగప్రహతం కాదని సంపాదకుల అభిప్రాయం.

"మహినుద్యోగి గావలె మనుజుఁడైనవాఁడు
సహజివలెనుం డేమీ సాధింపలేఁడు" 2-212

## సా

**సాంబ్రాణి :** వి. 1. ఉత్తమాశ్వం (సాంబ్రాణీ దేశపు గుఱ్ఱం) 2.సుగంధద్రవ్యం. రూపాం. సాంబ్రాణి.

"సింగారించి వాహనాలు ముంగిట నెన్ని వుండినా
సంగతి నీ వెక్కినదే సాంబ్రాణి" 12-202

**సాకము :** వి. 1. ఉత్సవం (ఆం.భా.) 2. వ్యాజం.

"జంకెనల కారాలు చవుల సాకములు
లంకెలవిందులు వెట్టీ లలన నీకు" 8-166

**సాకారము :** (13) వి. ఆకారం. ఇందులోని 'స' శబ్దానికి అర్థం లేదు.

"సాకారము పైకొని దశదిక్కులు కరములఁ గబళించి
సాకారము చూపినాఁడిచ్చట హనుమంతుఁడు" 2-218

**సాకిరి :** (5) వి. సాక్షి.

"నీ వేమి సేతు వాపె నిన్నుఁ బెరరేఁచఁగాను
తావుల సాకిరి గోరఁదగదా నిన్నును" 10-2-50

**సాకిరి చెప్పు :** (2) అ.క్రి. సాక్ష్యం చెప్పు.

"ఎవ్వరు సాకిరి చెప్పె రెందుకుఁ గాఁదనకు
వువ్విళ్లూరఁదనలోనే వూహించుకొమ్మనవే" 21-217

**సాకిరిమాట :** వి. సాక్ష్యపుమాట.

"పతిగా సాకిరిమాట పలుకుమంటే నవ్వేవు
మతకానఁబగదీర్చే మాయ నీది గాదా" 17-15

**సాకిరివయసు :** వి. సేవచేసే వయస్సు. సాకిరి చాకిరికి వికృతిరూపమా?

**సాకిరివెట్టు :** (8) ప.బం; అ.క్రి. సాక్ష్యం చెప్పు, సేవచేయు.

"నిక్కి చూచి గుట్టుతోడ నిమ్మపంట వేయఁగాను
చక్కఁగా నందరి నేము సాకిరివెట్టేవే" 28-373

**సాకిరులు చెప్పు :** సాక్ష్యం చెప్పు.

"సంగడి మీయిద్దరికి సాకిరులు చెప్పఁగాను
చెంగట నన్ను యాపెపై సేసవెట్టేవా" 12-531

**సాగఁబెట్టు :** స.క్రి. ప్రవర్తిల్లజేయు.

"వేగిరించకంత నిన్ను వింతలుగా బొగడితే
సాగఁబెట్టకు బొంకులు చవులు గావు" 25-349

**సాగుడుఁగత :** వి. పెద్ద కథ.

"కోడి కూసినందాఁకా సాగుడుఁగతే చెప్పితివి
వీడె మిప్పించుకొనను వేళ యేది" 14-169

**సాగుడుగొండ :** వి. పొడవైన కొండ.

"చల్లని వానల నీడ సాగుదుఁగొండలలోన
వల్లెగా వేసుకొన్న వాలముతోడ" 3-144

**సాజము:** వి. సహజం, స్వభావం.
"కామినుల కెప్పుడును గలిగిన సాజమిది
తా మగఁడు నే నాలను దయఁజూడు మనవే"
12-100

**సాటికి బేటికి:** (6) అవ్య. సరివచ్చుటకు, ఘనతకు. చూ: సాటిబేటికి.
"యీటున శ్రీవేంకటేశుఁడేలె నిన్ను నింతలోనె
సాటికి బేటికి మీలో జంటలిఁకఁ బాయవు"
7-336
"మాటలాడేనంటేఁగాక మంకు దెలుపవచ్చునా
సాటికి బేటికి నిన్ను సాదించెఁగాక" 9-241

**సాటిపెట్టు:** స.క్రి. పోల్చు, ఉపమించు.
"సాటిపెట్టవద్దుగాని సతులతోడ నన్ను
పాటించి నీ తొత్తుఁజేసి పనిగొనరా" 23-409

**సాత్తించు:** ఇది సాత్మించు కావచ్చు. చూ: సాత్మించు.
"బుద్ధిమంతుఁ డవుటెన్నఁడు భూమెల్లా వెఱ్ఱులు
తిద్దుకొనక సాత్తించి(?) తిరిగేరు గాక" 15-67

**సాత్మించు:** స.క్రి. సహించు, సైచు. (తె.వ్యు.కో.)
"అప్పటి గురుతు లెల్లా నట్టె వున్నవి
దెప్పరమునఁగొంత సాత్మించనీయరాదా"
21-410

**సాద:** వి. అల్లుడు.
"సాదనైన నేఁ జలమతినైనా నీ
పాదమొక్కటే నేఁబట్టినది" 4-392

**సాదనకాఁడు:** (సాదన+కాఁడు) వి. శస్త్రదక్షుడు, ఆయుధవిద్యలో ఆరితేరినవాడు.
"చందపుమరుగరిడీ సాదనకాఁడవు
సందడిఁ జన్నులపైఁ జేయిచాఁచకుండ గలవా"
22-363

**సాదించు:** (45) స.క్రి. 'సాధించు'కు జానపద వ్యవహారరూపం. 'సాధించు' లోని మహాప్రాణమైన ధకారం వ్యవహారంలో అల్పప్రాణం (ద)గా మారింది. ఒక్కచోట మాత్రమే 'సాధించు' అనే మహాప్రాణవర్ణంతో కూడిన రూపం ప్రయోగింపబడింది. 7-161

**సాదింపు:** వి. 'సాధింపు'కు జానపదవ్యవహార రూపం. విరామం లేకుండా కఠినమైన మాటలతో బాధించుట, బాధించుట.
"దిగ్గన యెవ్వతెచే సాదింపులఁ బడి వచ్చితో
యెగ్గుల నీ మొగమాటే ఇంత సేసె నిన్నును"
20-502

**సాదు:** (9) వి. 'సాధువు' శబ్దానికి జానపదవ్యవహారం. సజ్జనుడు.
"వాదించవద్దు గాని వాడ వారిఁ గూడినాను
సాదవై నావద్ద నుంటే సమ్మతించవా" 27-52
"పాదాలు గుద్దుతానే పానుపుపైఁ గూచుండేవు
సాదువలె నుండుతా సేసలు చల్లేవు" 14-452

**సాదుఁగొయ్య:** (2) (సాదు + కొయ్య) పైకి సాధువుగా కనిపిస్తూ సరసుడు కానివాడు.
"సాదుఁగొయ్య వైనాఁడవు సరికి బేసికి నీవు
యేది నిజమేది గల్ల యేమి సేతునయ్య"
19-219

**సాదుఁగొయ్యతనము:** (సాదు + కొయ్య + తనము) వ.బం; వి. పైకి సాధువుగా కనిపిస్తూ దుర్మార్గుడైన వ్యక్తి లక్షణం.
"మా దిక్కేమి చూచేవు మాటిమాటికి
సాదుఁగొయ్యతనాలకు సాదించవలదా"
27-364
"వాదులడిచి నిన్నిట్టె వలసినట్టు తిట్టఁగా
సాదుఁగొయ్యతనముతో సారెకు నవ్వేవు"
14-277

**సాదుఁదనము:** (9) (సాదు + తనము) మంచివాని లక్షణం, మంచితనం, సాధుత్వం.
"వొగరుమాటలకెల్లా వోరిచేవాఁడా తొల్లి
నిగిడి సాదుఁదనాలు నెరపీ నే దీడనే" 17-333

**సానఁబట్టిన చూపు:** (2) వి. తీక్ష్ణమైన చూపు.
"సానఁబట్టిన చూపుల జగము లేలేటివాని
కొనలుకొనలుగాఁగఁ గుచ్చి యె ట్టిత్తుదునే"
17-121

**సానఁబట్టిన వయసు :** ప.బం; వి. మెరుగారు వయసు, మెరుగెక్కిన వయస్సు, యౌవనం.
"పూని పురాకృతములు పోనీక తిరిగేని
సానఁబెట్టిన వయసు సటలఁబెట్టీని" 3-483

**సానఁబట్టు :** (4) స.క్రి. పదునుచేయు, వాడిచేయు.
"పూని శ్రీవేంకటేశుఁడ పొదిగి నిన్నుఁ గూడితే
సానఁబట్టిన గోరేల జళిపించేవు" 21-49

**సానబిల్ల :** వి. బిళ్లవంటి సాన.
"అతివ మోముఁజంద్రుఁడనేటి సానబిల్లకు
తతి జడి(డ?) యనేటికి సూత్రము చుట్టి"
7-409

**సానరాయి :** ప.బం; వి. గంధం తీసే రాయి.
"చక్కని నవ్వుల సానరాయివే
మిక్కిలి యేల నమ్మించేవే" 25-263

**సానలఁబట్టు :** ప.బం; స.క్రి; చూ : సానఁబట్టు.
"రానీ పోనీ తమకాన రాములు తమ చూపుల
సానలఁబట్టుచుఁ బగ చాటుదురు" 7-54

**సాప :** వి. 'చాప'కు జానపదవ్యవహారం.
"పచ్చని సాపమీఁదఁ బవళించు మనవే
కుచ్చి మా సూపులు దన్ను గురి దాఁకెను"
11-93

**సాపనీటి కింది సతి :** వి. లక్ష్మిదేవి, సముద్రం నుండి ఉద్భవించిన సతి.
"సాపనీటి కింది సతి సంకఁబెట్టుక
తీపుల తిరుమలదేవరైనాఁడే" 24-13

**సాపెన :** వి; మాం; శాపం, దీప్తి, దూషణ.

**సాపెనదాఁకు :** ప.బం; వి. శాపం తగులు.
"ఓరి నీ సాపెన దాఁకి వొగిఁ బిక్కటిల్లఁజేసు
చేరి చేరి నీ మీఁది చేయి దియ్యఁ జూమ్మీ"
17-420

**సాయ :** వి. 'చాయ'కు జానపదవ్యవహారం. తోవ, మార్గం, దిక్కు, వైపు, స్థలం.
"చూడఁగానె నా కన్నులు సొరిదిఁ జేరఁడే సాయ
సాయపు వలపులనే పైడివంటి గొల్లెతల
సాయనంపి తొలఁగవా సటకాఁడ" 5-285

**సారె :** అవ్య. మాటిమాటికి.
"సారెఁ బిల్లఁదీపులాడి జారిపడెఁ గృష్ణుఁడు
వూరకే గడించనేల వోయమ్మ తాను" 17-372

**సాళంగము :** వి. కలగలుపుదనం, మేళనం.
"గబ్బిమాటల సాళంగంబు లవి యేతులా
గుబ్బతిలు మోహముల కుంటెనలు గాక"
5-126

**సాళగించు :** స.క్రి. మిళితమగు, సక్తమగు.
"కొదలుదేరు కోవిలెలుఁగు కుత్తికందు సాళగించి
కదలు మోవి రమణి చల్లకడవ తోడను" 5-162

**సావధానము :** వి. అవధానం, శ్రద్ధ, జాగరూకత, శ్రద్ధతో ఉండడం, నిష్ఠ.
"సావధానములు వద్దు శరణంటేనే చాలు
భావింపనిదే కీలు పరమయోగులకు" 3-528

**సావి :** (5) వి. 1. భ్రాంతి, భ్రమ 2. కాలం 3. సారం. (విణ. మనోజ్ఞం)
"తావుగ దేహమందు ద్వాదశనామములకు
సావివోని సంకల్పమే శరణాగతి" 15-324
"శ్రీవేంకటేశుఁడ నీ చిత్తము వట్టినది
సావితో నీ రతులలో సదమదమైనది" 24-149
కాలము శ.ర. ఇత్యర్థము అని బ్రౌన్. నన్నెచోడుని ఈ శబ్దప్రయోగాలన్నీ భ్రాంతి అనే అర్థంలో ఉన్నాయని, సావివోదు అనే పదానికి క్రమం తప్పదు అనియో, నన్నెచోడుని ప్రయోగానుసారం భ్రాంతి తప్పదు అనియో అర్థం కావచ్చుననీ, పద. ఇచ్చిన 'సాటియగు' అనే అర్థం సరికాకపోవచ్చుననీ ఆ.మూ. వివరణ. (సం.వా. పద. భాషా. 472 పు.)
"దైవికము మా స్వతంత్రముతో గూడె
సావి వోదెన్నడు సంసారము" 3-105
సారము :
"చావుఁ బుట్టుగులవేళ సతము నీతఁడే
సావిభోగములకు నిచ్చకుఁడీతఁడే" 4-205

**సావివోవు :** ప.బం; అ.క్రి. సాటియగు. (వ్యు.) భ్రమపడు, విధము తప్పు, క్రమము తప్పు (?) (ఆ.మూ.)

"దైవికము మా స్వతంత్రముతోఁ గూడె
సావి వోదెన్నఁడు సంసారము" 3-105
"కాలము నెందూఁబోదు కర్మము నెందూఁబోదు
జాలిఁబడ్డ మనసే సావివోయను" 3-104

**సాసముఖా :** (4) వ.బం. 'చాంగుభళా' వంటి శబ్దం. 'సాసముఖా' అనే శబ్దం అంతమందుగల పద రచన. ఈ పదానికి 1వ సం. పీఠికలో ఈవిధంగా వివరణం ఉంది. "కొందరు పండితులు సహస్రముఖా కావచ్చునని సూచించిరి. అది ప్రకరణమునకు అతుకునట్లు లేదు. ప్రకరణమును బట్టి ఈ శబ్దముయొక్క అర్థమును విచారింతము. అది స్వామికి మజ్జన సమయము. అన్ని లోకములలోని వారు గుంపుగ కూడి స్వామితో వినోదసంభాషణము సాగించుచున్నట్లున్నది.కాలమునకు తగిన కార్యములను నెరవేర్చుటకు కొందరు నియోగింపబడి యుందురు. ఆ వెండిగుదెల వారు వచ్చి గుమిగూడిన గుంపును హెచ్చరింపుచు స్వామి కిది మజ్జన సమయమని తెలియజేయు చున్నారు. ఇప్పుడును స్వామివారి నివేదన, మజ్జన సమయములందు సన్నిధి ! సన్నిధి ! అని అరచుట కలదు. అనగా స్వామివారివద్దకు మమ్ము పోనిండు, త్రోవ విడువుడు అని అర్థము. ఈ సన్నిధిపదమే అన్నమయ్యనాడు సముఖ (సముఖము) పదముగా నుండినదేమో! సన్నిధి! సన్నిధి! అని రెండుసార్లు ఉచ్చరించినట్లే ఆనాడు సముఖము సముఖము (సముఖ సముఖ) అని ఉచ్చరించుమండిరేమో? ఆ ద్విరుక్తమునే అన్నమయ్య 'సముఖ సముఖకు' బదులు సాసముఖా అని ఆమ్రేడితసంధి చేసి యుండవచ్చును. ఇట్టి ప్రక్రియలలో అన్నమయ్య చాలా స్వతంత్రుడు. వావాదము వంటి ప్రయోగములు ఈతనిలో కలవు" (29, 30 పుటలు)
"సందడి విడువుము సాసముఖా
మందరధరునకు మజ్జనవేళా" 1-12

**సాసముత్యాలు :** సేసముత్యాలు, ముత్యాలవంటి అక్షతలు. ఇట 'సేస' 'సాస' గా మారడం జానపదవ్యవహారం వల్లే అని భావించాలి.
"పువ్వులనఁగా నెట్టో పూఁపలనఁగా నెట్టో
ముప్పంక సాసముత్యాల ముగ్గులువెట్టేను" 11-131

**సాసించు :** స.క్రి. 'శాసించు'కు జానపద వ్యవహారరూపం.
"మేసుల నీ లాంఛనాలు మించి నన్ను దూషించె
సాసించి శత్రువును సంహరింపవే" 4-454

**సాహాయము :** వి. 'సాహాయ్యం' అనే శబ్దానికి వ్యవహారరూపం.
"యీవల శ్రీవేంకటేశుఁ డట్టే కరుణించితేను
సాహాయమై వచ్చుఁదానే సత్వగుణజ్ఞానము" 2-238

## సి

**సింకసూపు :** వి. 'చింకచూపు' అనడానికి జానపద వ్యవహారరూపం. లేడిచూపు. (చింక = జింక)
"సంకనున్న తన సదురాలి మొరఁగైన
సింకసూపు నాపై సిమ్మఁడుగా" 5-370

**సింగారదేవుఁడు :** వి. శృంగారదేవుఁడు, మన్మథుడు.
"దేవదుందుభులతోడ తేటతెల్లమైనవాఁడు
సేవించరో యిదే వీఁడే సింగారదేవుఁడు" 3-125

**సింగారపుఁదోట :** వి. శృంగారవనం, ఉద్యానవనం, ప్రమదవనం.
"సింగారపుఁదోటలోన చెలిని దవ్వులఁజూచి
అంగపుఁజెమట నుస్సురుస్సురనేవు" 7-146

**సింగారబొమ్మ :** వి. శృంగారపుబొమ్మ, సింగారం కల బొమ్మ, హృద్యమైన బొమ్మ.
"రీతిగా సింగారించి రేయిఁబగలుఁ బాలార్ప
ఘాతల సింగారబొమ్మ గలిగెఁగా నీకు" 11-482

**సింగారరసము :** వి. శృంగారరసం.
"జిగి సింగారరసము చేరి నీపై నొలుకఁగా
పొగరు మించుల తట్టుపుణుఁగాయను" 23-498

**సింగారరాయఁడు :** వి. శృంగారరాయడు.
"దొంగిలి వారి చీరలు తొడికి తీసిన చేత
సింగారరాయఁడ నీకుఁ జెల్లదాయనా" 20-224

**సింగారవతి :** వి. శృంగారవతి, సింగారం కలది. తత్సమ శబ్దాలపైనే చేరవలసి మతుప్ ప్రత్యయం (వతి) ఇట 'సింగార' అనే తద్భవంపై చేరడం విలక్షణం. లేదా శృంగారవతికి ఇది తద్భవం.
"సెలవుల వడిసేవి చిఱునవ్వుల వెన్నెలలు
చెలియ నీ కెవ్వ రీడే సింగారవతిని" 12-413

**సింగారవిభుఁడు :** వి. 'శృంగారవిభుడు' శబ్దానికి వికృతరూపం, మన్మథుడు.
"యేతుల వుబ్బుసిగ్గులు యిలమీఁద నాతనికి
చైతన్య మెప్పు డీతఁడు సింగారవిభుఁడు గాని" 3-114

**సింగారించు :** స.క్రి. శృంగారించు, అలంకరించు.
"సింగారించుక కన్నులజిగి నీ మొకముసేసి
అంగడివలపు చల్లెనదివో" 7-530

**సింగారిది :** (సింగారి+అది) శృంగారవతి, సింగారించుకున్న స్త్రీ. అందమైన స్త్రీ.
"చిప్పిలు గళలదాన సింగారిదాన" 29-409

**సింగిణి :** వి. రూపాం. సింగిడి. 1.విల్లు. (2.సింగిడి 3.ఇంద్రధనుస్సు)
"చెఱకు సింగిణివై చెలువుని నేఁచేవు
గుఱిగా నెంత ధనము గూడెనే నీకు" 14-83

**సింగినాదము :** ప.బం; వి. 'శృంగనాదము' నకు వికృతిశబ్దం. 1. పొడదుప్పి కొమ్ముతో చేయబడిన యోగుల సుషిరవాద్య విశేషం 2. కొమ్మువాద్యం.
"నాదించ వెఱచి సింగినాదా లూదుకొంటాను
సోదించేరటాఁ గొందరు జోగులైరి" 2-246

**సిగ్గరికాఁడు :** (2) (సిగ్గు+అరి+కాఁడు) వి. సిగ్గు గలవాడు.
"సిగ్గరికాఁడతఁడు చెప్పఁడు మనతో నేవి
యెగ్గులెంచ నేనతని యాడకుఁ బిలువరే" 7-430

**సిగ్గరితనము :** (7) (సిగ్గు + అరి + తనము) సిగ్గుగలవాని లక్షణం, సిగ్గు గలిగి ఉండడం.
"నిగ్గుల సరసమాడనేరనా కొంతయినా
సిగ్గరితనానికే నేఁ జింతించేఁగాక" 20-231

**సిగ్గరిది :** (2) (సిగ్గు + అరి + అది) సిగ్గు గలిగిన స్త్రీ.
"ఆతని తలఁపు మీరే అడుగరే చెలులాల
కాతరము లేని సిగ్గరిదాన నేను" 7-341

**సిగ్గరిభావము :** (సిగ్గు + అరి + భావము) వి. సిగ్గరితనం.
"చిత్తపు కోరికలలో సిగ్గరిభావముతోడ
పొత్తుల చెలులు చెప్పే బుద్ధులతోడ" 19-491

**సిగ్గరివాఁడు :** (సిగ్గు + అరి + వాఁడు) సిగ్గు గలవాడు. ఇట 'వాఁడు' శబ్దం స్వార్థంలో చేరింది.
"చేముట్టి పెనఁగలేని సిగ్గరివారము నేము
యీమేర నుందుముగాక యేమి సేతుమయ్యా" 25-253

**సిగ్గరీఁడు :** (సిగ్గరి + ఈఁడు) సిగ్గుకలవాడు.
"కాసులు మాకు నెక్కించి వద్దఁ దాయకుండఁ జేసి
సేసలు వెట్టితివిగా సిగ్గరీఁడా" 11-589

**సిగ్గరికత్తె :** (7) (సిగ్గు + అరి + కత్తె) సిగ్గు గల స్త్రీ.
"ఎంత సిగ్గరికత్తెవు యేమే నీవు
ఎంత వింత వాసులేల వెదచల్లేవే" 29-48

**సిగ్గుఁబాటు :** వి. సిగ్గుపడటం.
"తగ్గుముగ్గు లైనవేళ తలఁచినవారెల్ల
సిగ్గుఁబాటే కాక తమ్ముఁ జేరవచ్చేరా" 1-210

**సిగ్గు చూరబోవు :** ప.బం; అ.క్రి. మానం పోవు.
"నుడిసి చెలి సిగ్గెల్ల చూరఁబోఁగలదో" 15-249

**సిగ్గులమ్ముకొను :** ప.బం; అ.క్రి. మానం అమ్ముకొను. 4-19 old

**సిగ్గులు చెఱచు :** ప.బం; స.క్రి. మానభంగం చేయు. 3-150 old

**సిగ్గులు బయటవేయు :** ప.బం; అ.క్రి. సిగ్గు

వదలు, మానమును బయల్పరచు.
"చీరల కొంగులు వట్టి సిగ్గులు బయటవేసి
గారవించి కాఁగిటను కరఁగించేవు" 23-245

**సిగ్గులు మూటగట్టు:** వ.బం; అ.క్రి. మిక్కిలిసిగ్గు గలిగి ఉండు, సిగ్గులు రాసిపోయు.
"సిగ్గులెల్లా మూటఁగట్టి చెలి నీపై వేసినట్టు
వొగ్గి నీపై వేసెఁ బువ్వులచెండున" 13-503

**సిగ్గులు యెగ్గులు:** వ.బం; వి; బహు. సిగ్గులు అనే అర్థంలో జంటపదం.
"సిగ్గులు యెగ్గులు వాసి చీఁదక చీమిడి వాసి
దగ్గరి మీరుండితేఁ దరుణులాల" 11-334

**సిగ్గులువడు:** (సిగ్గులు + వడు) అ.క్రి. సిగ్గుచెందు.
"వొగ్గుచు గందము నీకు వువిద వుయ్య రాఁగాను
సిగ్గులువడుచు చెక్కు చేతఁబెట్టేవు" 23-490

**సిగ్గులు వడుకొను:** అ.క్రి; వ.బం. సిగ్గుచెందు.
"చెక్కుచేయి మాటువెట్టి సిగ్గులు వడుకొంటాను
తక్కించి నీన్నికై యవద(ధ)రించవయ్యా"
29-429

**సిగ్గువాటు:** వి. నగుబాటు, సిగ్గుపడటం.
"యెలమి నాకె వలపు యెరవు నాపైఁ బెట్టేవు
చెలులకింకా నెంతేసి సిగ్గువాట్లో" 7-455

**సిడి:** వి. సిడిమాను.
"సిడిమీద బిత్తరపు చిమ్ములు చిమ్మగవద్దు"
4-62

**సిడిదల:** వి. కొరతవేయడం.
"సిడిదల లియ్యవద్దు జీవాలఁ జంపవద్దు
బడిబడి పగ్గాలఁ బారవద్దు" 4 అను. 62.

**సితకమ్మ:** వి. సీతమ్మ (సీతాదేవి) అనే అర్థంలో జానపదుల వ్యవహారం.
"చెచ్చెరఁ బోరుపెట్టిన సితకమ్మ వుండఁగాను
నిచ్చలుఁబ్రియము చెప్పే నేమేల నీకు" 19-435

**సితరకాఁడు:** వి. చిత్రకాఁడు, చిత్రం చేసేవారు.
"ఎట్టు వేగించే దిందు కేగురు సితరకాండ్లు
వెట్టి నేమి సేయమంటా వెన్నడించే రిపుడు"
1-370

**సిద్దెబట్టు:** (?)
"ఒద్దేలె జగడాలు వో యింతి
సిద్దెబట్టి కోరికలు చిత్తగించఁగదవే" 8-70

**సిబ్బితి:** (5) వి. 1. సిగ్గు 2. కష్టం.
"నవ్వకుండినా నన్నుఁ బెడరేఁచీ
చివ్వన నా కిది సిబ్బితి గాదా" 11-441

**సిబ్బితిపడు:** (8) అ.క్రి. సిగ్గుపడు.
"ఏలసిబ్బితి పడేవు యేమి సేసేది నీవు
యేలిక విందరికైతే ఇంతలోనె తప్పేనా" 21-190

**సిరసు:** (7) వి. 'శిరసు'కు జానపదవ్యవహారం.
"చొక్కపు సిరసునిండాఁ జుట్టుకొన్న
పూదండలు
మిక్కుటముగా నాపె మెడవేసీఁదానూ" 12-173

**సిరివంతుఁడు:** వి. శ్రీమంతుడు, ధనవంతుడు.
"పరాకుసేయక నన్ను భావించి చిత్తానఁబెట్టు
సిరివంతుఁడు దీనుని జేరితేను రక్షించుఁగదా"
15-344

**సిరివరుఁడు:** (4) వి. శ్రీవరుడు, లక్ష్మీపతి, విష్ణుమూర్తి.
"దొరల కొలు వీవేళ తోదీపు లీవేళ
సిరివరుఁడిపు డేమి సేసునో యీవేళ" 24-119

**సిరిసింగనవ(వృ)త్తి:** వ.బం; వి. ఒకరకమైన పిల్లల ఆట.
"చెమటలు గార సిరిసింగనవత్తి యాడీ
గుమితాన వీఁడే యమ్మ గోపాలకృష్ణుఁడు"
4-172

**సిలుగందు:** వ.బం; అ.క్రి. కష్టపడు.
"చింతతోడఁ బొరలుచు సిలుగందనేల" 5-40

**సిలుగు:** (2) వి. 1. ఉపద్రవం 2. హాని 3. కష్టం.
"చెలఁగి నన్నేలితివి శ్రీవేంకటేశ నీవు
సిలుగు లేదు నిన్నుఁజేరి నేఁబొగడుదు"
20-551 & 1-81

సిలుగులాఁడి : (సిలుగులు + ఆఁడి) వి. హాని కలిగించే స్త్రీ.
"తలఁచుకో యింకా నీవే తగవులన్నియు నేడు
సిలుగులాఁడి సుద్దులు చెప్పలేము గాని"
24-377

సిష్టి: వి. 'సృష్టి'కి వికృతిరూపం.
"కనురెప్ప మూసితేనే కడు సిష్టి చీఁకటౌను
కనురెప్ప దెరచితే క్రమ్మరఁబుట్టు" 1-434

సిష్టికర్త : వి. సృష్టికర్త అనే పదానికి వికృతిరూపం. బ్రహ్మ.
"చెలియరో నీవే కదే సిష్టికర్తవు
నిలువున నీ మగఁడు నిను
మెచ్చు(చ్చె)నమ్మా" 13-427

సిసువుఁడు : వి. శిసువు. 1-255

సిసువు: (8) వి. 'శిశువు'కు వికృతిరూపం.
"సిసు వితనికి మొక్కి చేసేము జాగరాలు
కొసరరో వరములు కోట్ల కొలఁదులు" 4-27
"సిసువు గోవర్ధనాద్రి చేతఁబట్టి యెత్తేనంటే
కొసరీతని పాదాలే కొలువవద్దా" 1-503

## సీ

సీఁకటిమైవాడు : వి. చీకటిమైవాఁడు, చీకటివలె నల్లని శరీరం (మై = శరీరం) కలవాడు, విష్ణుమూర్తి.
"సీకటిమైవాఁడు సీల పసవువాఁడు
సీలపసపువాఁడు ఆకుదండలే తలనటు
మోసినాఁడు" 24-13

సీతకమ్మ : వి. సీతమ్మ అనేఅర్థంలో జానపదవ్యవహారం.
"సీతకమ్మఁ బెండ్లాడె చెప్పఁ గొత్తకదవే
చేతనే యీకొమారుఁడా శివుని విల్లువిఱిచె"
1-474

సీతుగాయు : వ.బం; అ.క్రి. చలిపోవడానికి వేడిమి కలిగించు.
"వెలయ నిద్దరికిని వేఁడికోపములు రేఁచి
చెలఁగి నడుమ నీవు సీతుగాయవయ్యా"
19-197

సీరపసపువాఁడు : వి. పసపు రంగు వస్త్రం కలవాడు, పీతాంబరుడు. సీలపసపువాఁడు అని పొరపాటున ముద్రింపబడింది.
"సీకటిమైవాఁడు సీలపసపువాఁడు" 24-13

సీలము : వి. 'శీలము' అనే శబ్దానికి వికృతిరూపం. స్వభావం, మంచి నడత.
"ఆలుబిడ్డలఁగని యటుఁ దన మగనికి
సీలాన సమర్పణ సేయవలె నటవయ్యా"
2-444

## సు

సుంకమాన్యము : వి. పన్ను లేకుండా ఇచ్చే భూమి.
"తక్కక యితని ముద్ర ధరించే దాసులకు
చొక్కుల భవబంధపు సుంకమాన్యము"
15-110

సుంకరవాఁడు : వి. సుంకం వసూలు చేసేవాడు, సుంకరీఁడు, సుంకీడు, సుంకరి.
"కరువుకు లోఁగాదు సుంకరవాని కబ్బదు"

సుంకు : (7) వి. సోకు, స్పర్శ. (కిటెల్) ప్రతిబంధం. (శ.ర.) పెండ్లిలో పళ్ళెరంలో పోసి వధూవరుల మీద చెరిగే బియ్యం లేక వడ్లపొట్టు.
"సుంకులు చెరిగించుక సొరిదిఁ దోడ నీళ్లాడి
లంకెఁ బెండ్లి పీఁటెక్కిన లలనవో యీపె"
28-252
"అంకెలఁ గూడేయప్పుడే అలపెందుండైనా
సుంకుల నీ నేరుపెల్లఁ జూపఁగరాదా" 14-154
"సుంకులఁగుచాలు నిన్ను సోఁకెనంటా సిగ్గుపడి
అంకెలఁ దలవంచుక అదివో నవ్వీని" 7-502

సుంకుదేరు : వి. ప్రతిబంధం నుండి తొలగు, బాధనుండి తొలగు.
"బొంకకురే చతురుఁ డప్పుడే వచ్చీనా
సుంకుదేరీఁ జూపు మరిచి సుద్దోమద్దో" 5-341

సుంకుమతకము : వి. అడ్డగించే మాయ.
"ఇంకనేల రావయ్య ఇన్నియుఁ జెల్లెను నీకు

సుంకు నీమతకములు చూపి చెప్పఁగలవా"
21-176

**సుంకుల పోగలు :** వి. మదముల రేఖలు.
"వేంకటపతిఁగూడి వేడుకతోడుత
సుంకుల సోగల సొలశీనయ్యో" 5-261

**సుంకులు మోచు :** (2) తగవులు మోచు, బాధలు మోచు.
"ఇంక నెన్ని కాఁగలవో యింతి నీవల్లఁబనులు
సుంకులు మోచినవెల్లాఁ జూచేము నేము"
7-453
"చందురుఁడు సుంకుమోఁపె, జవ్వనము చిమ్మిరేఁపె
మందలించి నా మేను మరచితినే" 21-507
"ఇంకనేల సుద్దులు యెదురూఁగుదురుగాను
సుంకుమోచిన కళలు సూట్లాయను" 7-32

**సుంకులుమోపు :** (5) తగవులు మోపు, బాధలు మోపు.
"చూచితే నందరి యాస సుంకులు మోపు నీమీద
మాచేత నింతేసి పని మట్టుపడునా" 14-31

**సుకము :** (8) వి. 'సుఖము'నకు జానపదవ్యవహారరూపం. 'క' కారం ప్రాస స్థానంలో ప్రయోగింపబడింది.
"వెకలి శ్రీవేంకటేశు విష్ణుదాసులకే మంచి
సుకము లెల్లాఁ గలవు సుడివడలేదు" 2-89

**సుకించు :** (3) 'సుఖించు'కు వ్యావహారికరూపం.
"చెలరేఁగి జవరాలు చేరి నిన్ను నవ్వించఁగా
యెలమి సుకించితివి ఇందాఁకాను" 18-347

**సుకినప్పాలు :** వి; బహు. భక్ష్యవిశేషం.
"సుడిగొను నప్పాలు సుకినప్పాలును
పొడిబెల్లముతోఁ బొరటులును" 6-4

**సుకియించు :** అ.క్రి. 'సుఖియించు'కు వ్యావహారికరూపం.
"వొకట శ్రీవేంకటేశుఁ డొనరించినట్లవును
సుకియించి పొగడేటి సుద్దులింతే నేము" 3-453

అన్నమయ్యలో సుఖియించు అనే రూపం కూడా కనిపిస్తుంది. చూ : 3-7

**సుక్కు :** వి. గర్వం, (తె.వ్యు.కో.) బాధ, చింత.
"చక్కగా నాతని మోవి చవిగొన్న యట్లాయ
సుక్కు దీర మైమఱచి చొక్కినట్లాయ"

**సుక్కురారము :** (4) వి. 'శుక్రవారము'నకు జానపద వ్యవహారరూపం.
"చూడరమ్మ యిదె నేఁడు సుక్కురారము
వేడుక చక్కదనాలు వేవేలైనాఁడు" 17-498

**సుక్కువడు :** అ.క్రి. వాడిపోవు, జంకు, వెనుదీయు, ముడుచుకొను, ముడుతపడు, తగ్గు, ఏడ్చు, చింతించు, మూర్ఛిల్లు, చుట్టుకొను.
"తిరమై నేఁడిందువంక దినములు నొక్క కళ
సురలెల్లఁ దినఁగాను సుక్కువడఁగలిగె" 24-33

**సుగుడతనము :** (సుగుడ + తనము) వి. సరసత్వం, గుణిత్వం, యోగ్యత, సుగిడతనము.
"చూతుఁబో అప్పుడు నీ సుగుడతనము లెల్లా
కాతరాన నేఁడిట్టితేఁ గాదనఁగలవా" 20-306

**సుగుడరాయఁడు :** వి. సరసుల్లో శ్రేష్ఠుఁడు.
"యిద్దరు సతులమీఁదా నిమ్ములఁ జేతులు చాఁచి
సుద్దులు చెప్పేఁగదే సుగుడరాయఁడు" 20-186

**సుగుడి :** వి. సరసుడు.

**సుగుడీతనము :** వి. సరసత్వం, సుగుణత్వం, యోగ్యత.
"చూడవయ్యా నీ దేవుల సుగుడీతనము నేఁడు
యీడనే బుద్ధులు చెప్పి యియ్యకొలువరాదా"
16-3

**సుగు(డ)డుడు :** వి. సరసుడు, సుగుణుడు, యోగ్యుడు.
"అట్టె యంగనలు నీతో నలిగిన ములుగవు
చుట్టరికపువాఁడవు సుగుడవయ్యా" 14-168
"వేదపురాణార్థమందు విశ్వాసము పెట్టుకొని
సోదించి తెలుసుకునే సుగుడులాలా"

"అద్దరిపాటుండఁగాను అంతలో విచ్చేసి కూడి
సుద్దులు చెప్పవచ్చేవు సుగుడవౌదు" 20-176

**సుగుణతనము :** వి. సౌగుణ్యం, సుగుణత, మంచిగుణాలు కలవాని లక్షణం. 'సుగుణ' అనే కేవల సంస్కృతశబ్దంపై 'తన' ప్రత్యయం చేర్చడం అన్నమయ్య విలక్షణత.

"చూడరే వో చెలులాల సుగుణతనాలు తాను
ఆడరే మీరిందరును ఆయములు నీకును"

18-560

**సుగ్రీవనరసింహుఁడు :** వి. చూ: సుగ్రీవనారసింహము . 4-500

**సుగ్రీవనారసింహ(హుఁడు)ము :** సుగ్రీవనారసింహుడు . విజయనగరంలో తుంగభద్రానదీతీరంలో హంపీశిథిలాలున్నాయి . ఇందులో హజారరామాలయం ఒకటి. దీనికి పశ్చిమంగా 22 అడుగుల ఎత్తైన ఏకాంతపు రాతివిగ్రహం ఉంది. ఈ స్వామిని సుగ్రీవనృసింహస్వామి యని అంటారు. ఈ స్వామి సుగ్రీవ ప్రతిష్ఠితుడు కావచ్చునని రాళ్లపల్లివారి అభిప్రాయం.

"సులభుఁడై వున్నాఁడు సుగ్రీవనారసింహుఁడు
నెలకొన్న దాసులకు నిధానము వీఁడే" 4-512

"తుంగభద్రాతటమున తొడపై నిందిరతోడ
సింగారించుకొన్న వేల్పుసింహము వీఁడే"

4-512

"వెక్కసపు నోరితోడ వెలయు బుగ్గలతోడ
క్రిక్కిరిసీ నవ్వుల సుగ్రీవనారసింహము" 3-518

"సులభుఁడీతఁడిదివో సుగ్రీవనారసింహుఁడు
చెలఁగి మొక్కులు మొక్కి సేవించరో" 4-275

**సుజాణఁడు :** వి. మంచి నేర్పరి .

"అప్పసము చేయి చాఁచి ఆయములు గరఁగ
యీ
చొప్పు నీవె యెరుఁగుదు సుజాణఁడవు"

11-101

**సుడిగొను :** ప.బం; అ.క్రి. చుట్టుకొను, పెనఁగు

"సుడిగొన్న యాసలు" 16-262

**సుడియు :** అ.క్రి. 1. తిరుగు 2. చుట్టుకొను 3. వ్యాపించు 4.ప్రసరించు 5. చలించు 6. సుడిగా వీచు 7. కలతనొందు 8. డాయు, సమీపించు 9. సంచరించు 10. అడ్డువచ్చు 11.మొదలు 12. లీనమగు .

"వుడిగినాఁగామాదు లొక్కొక్కవ్యాజాన నచ్చీ
సుడిసి నడుము చొచ్చు చుట్టాలవలె" 2-331

"చూచిన నాతని రూపే సుడిసీ దిక్కుల నెల్లను"

**సుతిగూడు :** (3) అ.క్రి; ప.బం. శృతి కలియు . (శృతికి సుతి వికృతి)

"వేడుకతోఁ బతివద్ద వీణె నే వాయించఁగాను
జోడుగా వచ్చి నీవేమి సుతిగూడేవే" 22-161

**సుద్దముగ :** క్రి.విణ. 'శుద్ధముగ' అనే పదానికి జానపదవ్యవహారం.

"సుద్దముగ మోము మోముఁ
జూడవలెనా యెదుట" 9-50

**సుద్ధాత్ముఁడు :** వి. 'శుద్ధాత్ముడు' అనే శబ్దానికి జానపదవ్యవహారం. పవిత్రమైన ఆత్మ కలవాడు.

"చూడవే తానంతే కడు సుద్ధాత్ముఁడైతేను
వోడక తా నొక్క రీతి నుండవలదా" 29-195

**సుద్ధాత్మురాలు :** వి. శుద్ధాత్మురాలు అనే పదానికి జానపదవ్యవహారరూపం. పవిత్రమైన మనస్సు గలది.

"అన్నిటా యిచ్చలాడి సుద్ధాత్మురాల నైతేను
వున్నతి వోజకు వచ్చి వుబ్బున మెచ్చేవు"

7-102

**సుద్ది :** వి.1.మాట 2.వృత్తాంతం, వార్త 3.సామెత 4.ప్రసంగం 5. జాడ 6.సల్లాపం, ముచ్చట 7.జోస్యం 8.పాటగాచెప్పే వీరులకథ 9.విషయం, జోలి . (తె.వ్యు.కో.)

"ఓరిచేను నీ సుద్దులు వొడఁబడ్డదాఁకాను
జీరవారెఁ జెక్కు మీఁదఁ జేయవయ్యా చేతలు"

27-218

**సుద్దు :** (14) వి. సూక్తి, మంచిమాట. లేదా ఇది సుద్దికి వ్యావహారికరూపం కావచ్చు.

"నీ చిత్తమెట్టుండునో నిన్ను నే నడుగరాదు
చూచి చూచి ఓర్వరాదు సుద్దు చెప్పవయ్యా"
27-547

**సుద్దులకత్తె :** (సుద్దులు+కత్తె) మాటకారి, మంచిమాటలు చెప్పే స్త్రీ.
"వద్దనుండి ఇందుకుఁగా వావు లేరుపరచేవు
సుద్దులకత్తెవు గదే సుదతి రో నీవు" 18-440

**సుద్దులు చెప్పు :** ప.బం; అ.క్రి. డంబాలు పలుకు.
"చుట్టమవై నాతోనే సుద్దులు చెప్పేవు నీవు
జట్టిగా నిన్ను జంకించి సాదించేనంటాను"
27-236

**సుద్దోమద్దో :** సుద్దో (సుద్ది+ఓ) సుద్ది అనే అర్థంలో 'సుద్దిమద్ది' అని జంటపదం కావచ్చు.
"బొంకకురే చతురుఁడప్పుడె వచ్చీనా
సుంకుదేరీఁ జూపు మంచి సుద్దోమద్దో" 5-341

**సునియు :** (4) నిఘంటువుల్లో ఈ పదం కానరాదు.
"సునిసి నా మొగమేమి చూచి నీవు లోగేవు
మనసునఁ గలయట్టే మాకుఁ జెప్పరాదా"
20-547

**సుప్పనాతి :** వి. 'చుప్పనాతి'కి జానపదవ్యవహారం. 'చుప్పనాతి' లోని 'చ' కారం 'స' కారంగా మారి ఏర్పడినరూపం. శూర్పణఖ.
"సుప్పనాతి శిక్షించి సొరిది రుషులఁగాచి
అప్పుడే ఖరదూషణాదులఁ గొట్టి" 2-274

**సుమాళము :** (2) వి. 1.సంతోషాదులవల్ల కలిగిన పారవశ్యం 2.మత్తత, గర్వం 3.సంతోషాతిశయం 4.వినయం 5.సుఖం 6.మూర్ఛ (ఆం.ప.కో.లో సుఖం అనే అర్థం ఈయబడింది.) కన్నడంలో సుమాన, సుమ్మాళ అనే శబ్దాలు ఉన్నాయని వాటికి సంతోషమర్థమనీ సం.ప.స. (14 సం. 356 పు.) ఇట పారవశ్యమనే అర్థం యుక్తంగా తోస్తుంది.
"చెలరేఁగి చెలరేఁగి చేతులు చాఁచేవు నాపై
మలసి యిచ్చటనే సుమాళమెత్తెనో" 14-158
"జవ్వనులఁ గూడి యాడి సంతోసాలు దలపోసి
యివ్వల సుమాళమైతే యింక నేనేమి సేతును"
17-223

**సురటి :** వి. 1. విసనకఱ్ఱ, చామరం 2. రాగవిశేషం. 1-6

**సురాళము :** వి. 1. కోపావేశము 2. భూతాద్యావేశంచే కలిగిన శిరోభ్రమణం. (శ.ర.)
"విరాళిఁగూడెను శ్రీవేంకటేశుఁడిటు నన్ను
సురాళమైన రతిఁ జొక్కి వుండరాదా" 19-439

**సురుసురు :** వి. 'చుఱుచుఱు'కు వ్యావహారికరూపం. కాలుట మొ॥ వాని యందనుకరణం. తీవ్రత.
"గుఱిగాని మనసే గుబ్బతిలీఁగాక చెలి
కఱకున సురుసురు కన్గొనరాదా" 27-362

**సులభము :** (6) వి. సౌలభ్యం. ధర్మవాచకానికి బదులు ధర్మివాచకప్రయోగం. ఈ పదం కొన్నిచోట్ల 'సులబము' అనే రూపంలో కూడా ప్రయోగింపబడింది. (29-362, 28-554)
"చెలరేగి రమ్మనుచు చేయి వట్టి తీసీని
సులభాన నెటువంటి చుట్టమో కాని" 29-406

**సువర్ణవిద్య :** వి. ఓంకారాన్ని గట్టిగా ఉచ్చరిస్తూ మనస్సులో దేవుణ్ణి పొగడే విద్య (?)
"చేరువ సువర్ణవిద్య చిత్తములోఁ బ్రణవము
ధీరత నాదము సేసి దేవునిఁ బొగడుట" 1-452

**సువ్వను :** ధ్వన్యనుకరణ శబ్దం.
"సువ్వన నా మనసు యిసుకపాతర యెంతని
తవ్వేను తానే దయదలఁచీఁ గాకా" 12-261

**సువ్వాలమ్మ :** వి. 'సువ్వాల' పాడే స్త్రీ. సువ్వాల అంటే ఆడవాళ్లు పెండ్లిండ్లలో సువ్వి అనే పదంతో ఆలాపన చేసి పాడే పాట.
"సువ్వి సువ్వి సువ్వాలమ్మ
నవ్వేచు దేవకినందనుఁ గనియె" 5-361

**సువ్విపాట :** వి. జానపదులు పాడుకునే దంపుడు పాట. ఇందులో 'సువ్వి' అనే పదం ఊతగా ఉంటుంది. కన్నడంలో ఈ పాటలను 'సువ్వాలి' అని అంటారు.

"సువ్వి సువ్వి సువ్వలమ్మ
నవ్వుచు దేవకి నందనుఁ గనియె
శశి వొడచె అలసంబులు గడచె
దిశల దేవతల దిగుళ్లు విడిచె - సువ్వి" 5-361

**సుసరము :** (38) విణ. సులభం, సూక్ష్మం, సరళం.

"కొసరుచుఁ జెలి నిన్నుఁ గొంగువట్టి పెనఁగిని
సుసరాన లోనైతే సూటికి రావయ్యా" 28-507

శీఘ్రం అనే అర్థంలో తాళ్లపాకకవుల ప్రయోగాలు ఉన్నాయి.

"అటమటీఁ డెప్పుడు నప్పులు తెగి తీతు
సుసరాన దిద్దక జుణుఁగుగాను" నీతిశతకం. 36 ప. భాగవతం, కు.చ., స.నీ.స. లోనూ ఈపదప్రయోగాలు కనిపిస్తున్నాయి.

"సుసరముతో గొల్పుచున్న సురసంఘములన్"
భాగ. 8-179

"సుసరముగఁ బారి కాంక్షు లే జోలిలేక"
(కు.చ. 2-64)

"తొలిచిన మాను విఱువ సుసరమైనయట్లు"
(స.నీ.స. 596)

ఇది సుస్వర శబ్దభవం కావచ్చుననీ, సులభముగా అని అర్థమనీ, సుసరశబ్దానికి కన్నడంలో ఈ అర్థం ఉన్నదనీ సం.ప.స. (14 సం. 356 పు.) తేలికగా అని అర్థమేమో! అని అ.మూ.

"సుసరము గాదు జంటమొన
సూదిని రెంటము గ్రువ్వ నొక్కటే"
(శృంగారవృత్త పద్యాల శతకం. 73)

**సుసరి :** (2) వి. సులభోపాయం కలవాడు (?)

"సుసరివై శరణము చొచ్చుట యతనికి
యెసఁగిన దేహుల మే మెఱుఁగుదుము"
15-138

## సూ

**సూటిఁబడు :** (4) చూ : సూటిపడు. జరుగు, సంభవించు ; సరితాకు, సరిపడు. వసు. 2-98

"వద్దు వద్దు నీకింతేసి వట్టి సొలపు
సుద్దులు జెప్పఁగఁబోతే సూటిఁబడ దీకను"
20-200

"మాటాడినంతటిలోన మర్మము లెల్ల గరఁగు
సూటిఁబడీనా మా కిట్టే సులభానను" 14-31

**సూటి :** (3) వి. 1. గురి, లక్ష్యం 2. ప్రసిద్ధి 3. ప్రతి 4. తిన్నన 5. వెరవు 6. విధం.

"చూపులు రూపై నిలచె సూట్లు వాఁటానకెక్కె
వోపిక లర్థరివాయ వొట్లేలే" 20-399

"చూడఁజూడ సూట్లు సుదతి నీ చూపులు
వాడవాడ వలపులు వాడికలు" 29-11

**సూటికత్తె :** (సూటి+కత్తె) వి. గురికత్తె, అందగత్తె. (తె.వ్యు.కో.)

"మట్టుమీరి మెలఁగితే మరేమున్నది
చుట్టరిక మెరిఁగిన సూటికత్తెలకును" 24-469

**సూటికి వచ్చు :** ప.బం; అ.క్రి. ఎదురుకు వచ్చు, జతపడు.

"సూటికిఁ బతి రాకున్న సొలతురు మలతురు
తోటకూరవంటి నన్ను దూరుసేసేవా" 14-241

"తప్పు నీ యందున్నదా తగవరి వన్నిటాను
చొప్పు లెత్తఁబోతేను సూటికిరాదు" 8-280

**సూటికెక్కు :** (2) (సూటికి+ఎక్కు) ప.బం; అ.క్రి. జతపడు, పొసగు, పెంపెక్కు, సరిపడు, లక్ష్యపెట్టు, రీతికెక్కు, ప్రసిద్ధికెక్కు.

"యీడనె శ్రీవేంకటేశుఁ డీతఁడే నన్ను నేలె
జోడైన చుట్టరికము సూటికెక్కఁగదవే" 25-64

"వెదకఁగా వెదకఁగా వేడుకలు దొట్టుకొనె
సుదతిచందము లింత సూటికెక్కఁ గదరే"
27-592

**సూటిదప్పు :** అ.క్రి. లక్ష్యం తప్పు, గురితప్పు.

"యీడనె శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు

జోడుగూడే వుండుఁగాని సూటిదప్ప దెపుడు"
26-483

**సూటిపడు :** (6) అ.క్రి; ప.బం. 1. జరుగు, సంభవించు 2.సరితాకు, సరిపడు. (తె.వ్యు.కో.)
"సొలయఁగా సొలయఁగా సూటిపడదు నేరుపు
పలుమారు మాటాడితె పలచనౌను" 28-379
"సూటిపడఁదా నెన్ని సుద్దులు చెప్పినాను
మాటల నేనూ కొనేనా మందెమేళాన" 12-438

**సూడిగము :** వి. చేతికడియం, ఆభరణవిశేషం.
"కంకణసూడిగాలాపె కస్తూరినామము వెట్టు
కుంకుమగందము పూసి గుబ్బలు సోఁక"
22-781

**సూడిదిపట్టు :** కానుక గ్రహించు.
"చొక్కిన నా వేడుకలు సూడిది పట్టఁగరాదు
గక్కన నీ వెనసితేఁ గానవచ్చీని" 20-384

**సూడిదె :** వి. 'సూడిద'కు రూపాం. కానుక.
"దవ్వులనే వలపులు తతి నీపైఁ జల్లేనంటే
సువ్వనఁ జేతిమొక్కులు సూడిదెగాఁ బట్టి"
21-228

**సూడిదెవట్టు :** కానుక గ్రహించు.
"సూడిదె వట్టి వున్నది సుద్దు లలమేలుమంగ
యీడేరెఁ బీటమీఁదికి నిఁక రావయ్యా" 14-109

**సూడు :** (7) వి. 1. ఈర్ష్య 2. వైరం 3. శత్రువు.
"అట్టి శ్రీవేంకటేశ అరమఅపాయ మేను
చుట్టమై ఇంతోసేయ సూడా నీకు" 22-151
"జోడై నీ వున్నందుకు సూ డెంత గలిగినాను
వేడుక నాతని బుద్ధి వినేదే కదే" 17-250
"చుట్టరిక మమరితే సూళ్లు వెదకరాదు
పట్టి కాఁగిలించుకొంటే పాయఁగరాదు" 29-335

**సూడుకాఁడు :** (సూడు + కాఁడు) వి. పగ కలవాడు, ఈర్ష్య కలవాడు, శత్రువు.
"యేపున నీ గురుత నే మేలెఱఁగమయ్యా
చూపుల సాములు సేసే సూడుకాఁడవు"
18-540

**సూడుఁబాడు :** (14) (సూడు+పాడు) సూడు (= ఈర్ష్య, శత్రుత్వం, శత్రువు) అనే అర్థంలో జంటపదం.
"కోపగించఁబనిలేదు కూడితి మిద్దర మీఁద
చూపులఁ జూడు మనవె సూడుఁబాడేల"
11-302
"వట్టి నేరాలెంచకిఁక వచ్చేవో రావో
చుట్టరికాలలో యింత సూడుఁబాడుఁగలదా"
26-13

ఆచార్య ఎస్. గంగప్పగారు మాండలికమైన ఈ పదానికి 'సిగ్గూ లజ్జా' అనే అర్థాన్ని సూచించినారు. (రా.సీ. మాం. 96 పుట) సందర్భాన్నిబట్టి పై అర్థమే సరిపోతున్నట్లుగా తోస్తుంది.
"చుట్టమైన నాయకుఁడు సూడుఁబాడు నెంచ
జట్టిగొని సరసమే జరపఁగవలెను" 12-524
గంగప్పగారు పరిష్కర్తలు సూచించిన పగతో కూడుకున్న అనే అర్థం సరికాదన్నారు. ఇది సరియేనా? ఆలోచించాలి.

**సూడుఁబాడు బట్టు :** ప.బం; అ.క్రి. పగబట్టు. (పద.)
"చుట్టమనై వుండుఁగాని సూడుఁబాడు బట్టనే
మెట్టిసేవసేతుఁ గాని మేరమీరనే" 29-467

**సూడుబంటు :** (8) వి. పగదీర్చుకునే శూరుడు. (తె.వ్యు.కో.)
"ఓడక నీ కితవైతే వుట్టిగట్టుకుందుఁగాని
సూడుబంటుతో బలాలు చూపి చెప్ప నేలరా"
19-515

**సూడులువట్టు :** అ.క్రి; పగలు పూను.
"సూడులువట్టవుగదా సుదతి నే పంగించితే
యీడ శ్రీవేంకటేశ నీ కీపె చుట్టము" 23-447

**సూడువట్టు :** (2) పగబట్టు, విరోధించు. మాత్సర్యం వహించు అని ఆ.మూ. (సం.వా. పద. భాషా. 479 పు.)
"సొరిది నీ వేల వచ్చి సూడువట్టేవిపుడు"
17-222

"గోర నిన్ను నూఁదితేను గొబ్బున సూడువట్టేవు
బీరమింతిపైఁ జూపేది పెద్దరికమా!" 23-384

**సూడువెనఁగు :** విరోధించు.

"చుట్టపువరుసనే సూడు వెనఁగఁగ వద్దు
పట్టి నీ పిడికిటిలోఁ బెట్టు యేల వెఱపు" 25-244

**సూడో పాడో :** ప.బం; పగ అనే అర్థంలో నిందార్థకమైన జంటపదం ; (సూడు = పగ)

"సూడో పాడో తనకు సొరిది స న్నింతసేయ
యీడా నుండఁడు చూడ నింటనే వున్నాఁడు"
20-220

**సూతకపుమానము :** వి. (?)

"ఈతలఁ గన్నుల మేలిటు చేప్ప రావయ్యా
సూతకపు మానములు(?) చూడఁగలదిఁకను"
7-312

**సూతకము :** వి. మృతాశౌచం, మైల .

"ఆతల మతకమున నాపెఁ దను నంపకుంటే
సూతకమైన యట్టి సుద్దేరుఁగునా" 14-36

**సూత్రపుగణికె :** వి. (?)

"కోపుల నాలికెలోనఁ గుచ్చి కట్టినట్టి తాడు
చూపరాని సంసారమే సూత్రపుగణికె" 3-467

**సూత్రబొమ్మ :** వి. తోలు బొమ్మలాటలు మొ॥ వాటిలో దారంతో ఆడించే బొమ్మ.

"కదలి సూత్రబొమ్మలు కమ్మె సురట్లు విసరీ
పెదవితేనియ లాని ప్రియములు రేచవే"
29-420

**సూత్రము :** వి. 1. కిటుకు 2. కీలకం 3. పన్నుగడ .

"ఏమి సూత్రమో కాని ఇందుకు నందుకు నేఁడు
తామరమొగ్గల సొం పద్దముపై నిలిచెను"
26-308

**సూత్రవతీపతి :** విష్వక్సేనుడు .

"దిట్టపు సూత్రవతీపతి వసురలఁ
చట్టలు జీరఁగఁ జతురుఁడవు" 1-207

**సూత్రే మణిగణా ఇవ :** "మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" అనే భగవద్గీతా శ్లోకం లోని పాదం. దారంలో మణులవలె నాలో ఈ ప్రపంచమంతా కుచ్చబడింది అని భావం.

"ఇదివో సుజ్ఞానము "సూత్రే మణిగణా యివ" గాన
మది నితరమే లేదు మాయల యద్భావం
తద్భవతి" 2-121

**సూదిపిరిది తాడు :** ప.బం; వి. వెనువెంట వచ్చేది. ఒకదానిని అనుసరించుకుంటూ పొయ్యేది. సూది వెనుక వెళ్లే దారం అని వాచ్యార్థం.

"పెనఁగి నీ వాడా నీడాఁ బిలువకుమయ్య నన్ను
తనిసి సూదిపిరిఁదితాడువంటివాఁడవు" 9-5

**సూదిరాయి :** (4) వి; ప.బం. సూదంటురాయి, అయస్కాంతం.

"అంటదిదియైతేఁ జాలు నంటుకొనేవు గక్కున
వాఁటమైన సూదిరాతివలెనే నీవు" 23-391

**సూదివజ్రాలు :** వి. సూదులు, వజ్రాలు.

"చుక్కలు సురవొన్నలు సూదివజ్రాలు గోళ్లు
అక్కర యేనుఁగ తొండాలరంట్లే తొడలు"
7-287

**సూదివాటు :** (2) వి. సూదివంటి సన్ననైన గాయం, క్షతం.

"చుక్కలువలె మోవిపై సూదివాంట్లుంటించును
గుక్కక పూవులు చెక్కలు గొప్పువట్టి తీసును"
27-201

**సూదివెంటదారము :** (2) ప.బం; వి. వెనువెంట వచ్చేది, అనుసరించి వచ్చేది.

"సుదతి వెంటనే వచ్చి సూదివెంటదారమై
అదిగో నివ్వెఱఁగంది అట్టే నవ్వీని" 17-198

**సూదుల మూఁటల సుఖములు :** బాధను కలిగించే సుఖములు (?)

"యేది దలంచిన నే కాలంబును
సూదులమూఁటల సుఖము లివి" 1-81

**సూదుల (వంటి) మాటలు :** వి; ప.బం; బహు. హృదయాన్ని కుచ్చుకుని బాధపెట్టే మాటలు , సూదుల వంటి మాటలు. 2-117

"సూదులమాటలు వో నీ సుద్దులూ కడుఁ
బోదిసేసే కొలఁది నీ బుద్ధులు" 9-116

సూర: వి. ఉంట, కట్టుబడిలో పనికిరాని రాతిముక్క.

"భారతములో నున్నదే పంచమవేదమిది
సూరలుగా సోదించి చూచుకొండో" 15-113

సూరియుఁడు: వి. 'సూర్యుడు' అనే దానికి జానపదవ్యవహారరూపం.

"సూరియునిఁ జూడరాదు చుక్కలెల్లా నెంచరాదు
పోరచి వెట్టించవే వొత్తుగలసె" 25-381

సూరుఁడు: వి. 'శూరుడు' అనే దానికి జానపద వ్యవహారరూపం.

"సూరుఁడు నీవు యెదురుచూచి మోహించినవాఁడు
నేరుపుల నవ్వు నీపై నించెఁ గదమమ్మా"
20-590

సూర్పనక: వి. 'శూర్పణఖ'కు జానపదుల వ్యవహారపదం.

"తనకు వలచినట్టి తరుణి సూర్పనకను
పెనుముక్కు గోసిన బీరగాఁడే" 9-134

సూర్యవీథి: వి. తూర్పువీథి, తూర్పు పడమరలుగా సాగే వీథి. (సూర్యవీథి =తూర్పువీథి, సోమవీథి = ఉత్తరమున నుండు వీథి. సోమసూర్యవీథుల తిరుగుట అనగా ప్రదక్షిణ మాచరించుట అని అర్థమగును. (సం.వా.పద. భాషా. 479 పు.)

"అల సూర్యవీథి నేఁగీ నాదిత్యుని తేరిమీఁద
కలికి కమలానందకరుఁడు గాన" 1-424

సూళ్లువట్టు: ప.ఖం; అ.క్రి. పగ(లు)వట్టు. ('సూడు'కు సూళ్లు బహువచనం.)

"గోర గిరీని చెమట కుమ్మరించఁ జోటు లేక
జోరునఁబైఁ జిమ్మితేనె సూళ్లువట్టీనా" 9-238

సూసకపుఁబెండ్లి: వి. వధువు తలమీద అలంకరించెడి పూవులను కూర్పుపెండ్లి.

"తాసువలెఁ బెనగుచు తలమొల యెఱఁగరు
సూసకపుఁబెండ్లి మిమ్ముఁజూచి నేరవలెను"
23-200

సూసకము: (6) వి. 1. స్త్రీలు తలలో ధరించెడి తిరుగుడు బిళ్ల. (శ.ర.) 2. వివాహ సమయంలో వధువు తలమీద అలంకరించెడి పూవుల కూర్పు.

"సూసకాల పేరటాండ్లు సోబాన బాడరో
మోసపోక యిట్టే ముహూర్తమడుగరో" 14-365

సూసరము: వి. ప్రకరణాన్ని బట్టి బాసికం అర్థం కావచ్చునని సం.ప.స.

"చుక్కబొట్టు పెట్టుకొని సూసరము గట్టుకొని
నిక్కినిక్కి చూచీ నాపె నీ దిక్కు" 18-53

## సృ

సృగాలివాసుదేవుఁడు: వి. కరవీరమనే నగరంలో నివసించే పౌండ్రక వాసుదేవుఁడు. జరాసంధుని మిత్రుడు. ఇతడు జరాసంధునితో కూడి శ్రీకృష్ణుణ్ణి ఎదిరించేవాడు. శ్రీకృష్ణునిచే సంహరింపబడినాడు. చూ: పౌండ్రక వాసుదేవుఁడు.

"వొట్టి సృగాలి వాసుదేవుని భంగించిన తేరు
బెట్టు పౌండ్రకునిపై దాడి వెట్టిన తేరు" 2-227

## సె

సెంకించు: స.క్రి. 'శంకించు'కు జానపదవ్యవహారరూపం. అనుమానించు.

"సెంకించక తన దాసులఁజేపట్టే మందు"

సెక: వి. సెగ, జ్వాల, తాపం, కాక, వేడిమి, ఆముకాల్పుల యొక్క వేడిమి.

"కాఁగిన దేహపుసెకలును కప్పిన పువ్వుల సొరబులు
వేఁగిస చెలి తాపమునకు వెన్నెల నుండడిని"
5-138

సెగ్గించు: అ.క్రి. అసహ్యపడు, గర్హించు, నిందించు.

సెగ్గెము: (3) వి. రోత, ఏవము.

"శ్రీవేంకటేశుఁడ ఆకె చేయివట్టి పెండ్లాడఁగా
సేవసేయ నొకతెకు సెగ్గెము గాదా" 16-39

**సెరబడివారుము :** (?)

"సిరసెత్తు శ్రీవేంకట శ్రీనారసింహ నీ

సెర బడివారము(?) శ్రీనారసింహ" 15-227

**సెల :** వి. సెలయేరు.

"పిస లేనివారిఁ జేరఁ బిలువఁబోవుటకంటె

కొసరి కొండసెలకు కుయ్యుటే మేలు" 16-237

**సెలయు :** (2) అ.క్రి. 1. విజృంభించు 2. కొమ్ములు మొ॥ వాటితో పొడుచు 3. చిమ్ము 4. ఖండించు.

"తల వంచఁబోతేను తనువెల్లాఁ బులకించె

సెలసి చూడకువే సిగ్గు లేమొనో" 21-428

**సెలయు :** స.క్రి. చిమ్ము, విజృంభించు.

"పైకొని నీవే పాదము చాఁచగ

చేకొని పిసుకక సెలసీనా" 11-474

"చేయి నా మీఁద వేయఁగా సెలసి విదలించితి"

**సెలవినవ్వులది :** సెలవి (=పెదవుల మూలభాగం) భాగంలో నవ్వులు గల స్త్రీ.

"తళుకుఁ జెక్కులదాన తలిరుఁబాదాలదాన

సెలవినవ్వులదాన సిగ్గరిదాన" 29-409

**సెలవిల్లు :** (సెలసు + విల్లు) వి. ఒకరకం విల్లు. రూపాం. సెలసువిల్లు.

"జలధి బంధించిన సౌమిత్రిరామా

సెలవిల్లు విరిచిన సీతారామా" 3-300

**సెలవు :** (13) వి. 1. ఉపయోగం 2. సత్యం 3. ఆజ్ఞ 4. చోటు 5. అనుజ్ఞ 6. విడుదల 7. వీలు 8. పోటు 9. విరామం 10.ఖర్చు 11. అర్పణం. (అ.మూ.)

"ఆదిమూలమగు హరి నాతుమ సేవించక

యే దైవముల గన్నా యేమి సెలవు" 4-59

"కలిగిన దినములు కాపురానకే సెలవు" 8-86

"కైపుగాఁగ కన్నవారి కాళ్లకు మొక్కినాను

శ్రీపతికి మొక్కినంత సెలవు గాదు" 4-250

**సెలవుల నవ్వులాపె :** వి. సెలవుల (=పెదవుల మూలభాగాల) లో నవ్వులు గల స్త్రీ.

"చేరఁదేసి కన్నులాపె సెలవుల నవ్వులాపె

మూరెఁడు గొప్పాపె నీకు మొక్కితే నని"

28-511

**సెలవుసేయు :** (2) వ.బం; స.క్రి. ఉపయోగించు, వ్యయంచేయు.

"చెలఁగి పాయము నీకు సెలవుసేసెఁ గనక

తలకొన్న చింతలకు తలఁకదు" 24-285

"ఇటువంటివెల్లా నీకే యిట్టే సెలవుసేసితి

తటుకున నీ వనే నిధానము చేకొంటి ని" 2-215

**సెలసుమోరవాఁడు :** వి. వరాహావతారుడు.

"పొలసుమేనివాఁడు బోరవీఁపువాఁడు

సెలసుమోరవాఁడు సిన్నెకా" 5-182

**సెలసువిల్లు :** వి. సెలసు (ఒకానొక చెట్టు) బద్దలతో చేసిన విల్లు.

"సెలసువిల్లు విఱిచి సీతఁ బెండ్లియాడునాఁడు

పలికి బొంకని మాఁట పట్టు నాకు నిమ్మీ" 9-21

## సే

**సేత :** (2) వి. 'చేత'కు జానపదవ్యవహారం. చేష్ట, పని.

"ఏ సేతలైనా మేలు యెదురాడవయ్యా"

14-450

"దైవమా నీవే మమ్ము దయదలఁచుట గాక

చేవల నీ సేతలెల్ల చెల్లును లోకానను" 2-158

**సేతికుత్తికవాఁడు :** వి. శివుడు. (సేతి అనేది చేదుకు వ్యావహారికరూపమేమో!) చేదు కుత్తిక కలవాడని వ్యుత్పత్తి.

"సేతికుత్తికవాఁడు సెడకుండ దాఁచిన

పాత పెద్దవిల్లు బలువున

నాఁతికొరకు వచ్చి నడిమికి విఱిశిన

శేతలాఁడు గదె శినకాటి" 5-367

**సేకరము :** వి. 'శేఖరము' అనే శబ్దానికి జానపద వ్యవహారరూపం కావచ్చు. శిరోభూషణం, మేటి.

"మాకుఁజూడ వెరగాయ మగువచందము నేఁడు

సేకరముగా చలము చెల్లించకుండీనా" 26-22

**సేగి :** వి. 1. నష్టి 2. ఆపద.

"నీవంటి చతురునకు నిక్కంబుగా వలచి
జీవంబు విడిచినా సేగి గలదా" 6-79

**సేదెగాఁడు :** (సేద్యం+కాఁడు) సేద్యం చేసేవాడు, వ్యవసాయంలో జీతగాడు.
"మమతఁ జెక్కులమీఁద మళ్లుగా గోరను గీరి
చెమటనీళ్లు గట్టే సేదెగాఁడ" 18-354

**సేన :** (6) విణ. 'శాన' అనే పదానికి వికృతిరూపం. ఎక్కువ, అధికం, రూపాం. చాల, శాల, శాన, సేన. ఈ సేన అనే శబ్దం 'సేనలు' అని బహువచనరూపంగా కూడా ప్రయుక్తమైంది.
"చెల్లు లేరా నీకు నిది సేన సతులు గలరు" 11-281
"ఆసఁ దొల్లి మును లనంతకోట్లు
చేసిరి తపములు సేనలుగా" 3-255
"ధరలో సేనలు ధనధాన్యంబులు
పరమజ్ఞానవిభవ మీవు" 4-275

**సేనమారులు :** వి; బహు; చాలా పర్యాయాలు.
"యెప్పుడూఁ బాయకుమని యిన్నిటా వలతునని
చెప్పితిఁగా ప్రియములు సేనమారులు" 29-8
అను.

**సేనమొదలారి :** (3) వి. విష్వక్సేనుడు. సేనలకు అధిపతి అని వ్యుత్పత్తి.
"పరఁగు సూత్రవతీపతివై వెంకటవిభు
సిరుల పెన్నిధి నీవే సేనమొదలారి" 1-285

**సేనసేన :** విణ. మిక్కిలి ఎక్కువ. రూపాం. చాలచాల > శాలశాల > శానశాన > సేనసేన.
"చెలికత్తె నీకుఁ జేసె సేనసేన విన్నపాలు
వెలయ నీ చెవులార వింటివా నీవు" 22-173

**సేనాసేన :** (19) విణ. మిక్కిలి ఎక్కువ. రూపాం. చాలాచాల > శాలాశాల > శానాశాన > సేనాసేన.
"చిల్లపూవుదండ లేలే చెంచెత నీకు
చెల్లెఁబో మాకులమీఁద సేనాసేన" 24-159
"యిరుమేలా నూడిగపుటింతులు సేనాసేన
యెరవులేక యిందరి నెట్టు మన్నింతువయ్యా" 25-123

**సేవంతి :** వి. చేమంతి.
"తొయ్యలి కొప్పున సేవంతులు వించే నిట్లనే
నెయ్యమెల్ల నీకె పైనె నించరాదా" 6-134

**సేవిది :** వి. శేవధి కావచ్చు. నిధి.
"యిందిరారమణి నేచిన సేవది
చెందరు సుజనులు చెప్పంగలదే" 2-42

**సేసకొప్పు :** వి; వ.బం. కొండెసిగ, సేసలు చల్లేటప్పటి కొప్పు.
"సేసకొప్పుతోడిది చెమట ముత్యాలది
సేసిన నీ పొందు మాతో జెప్పుకొన్నది" 11-204

**సేసచల్లు :** వ.బం; అ.క్రి. అక్షతలు చల్లు, పెండ్లాడు. (?)
"రమణుఁడ నా మన సరయవు గాక
సముకాననే సేస చల్లఁగ వద్దనేనా" 27-7

**సేసపాల చెలి :** వి. శాస్త్రోక్తంగా వివాహమాడిన స్త్రీ.
"కాయకపు వావులకాంతలు సరయ్యేరా
చేయిమీఁదై సేసపాల చెలులకును" 21-214

**సేసపాలది :** (2) (సేసపాలు + అది) శాస్త్రోక్తంగా వివాహమాడిన స్త్రీ.
"ఆసపడ్డాడవు నీవు అడ్డమాడ దోసము
సేసపాలిదాన నీ చిత్తమిఁక నయ్యా" 27-120

**సేసపాలమగువ :** వి; వ.బం. అప్పుడే పెండ్లియైన స్త్రీ, తలంబ్రాలు గల స్త్రీ, శాస్త్రోక్తంగా పెండ్లియైన స్త్రీ.
"యేపున వహించుకొని యింటిపను లేమరక
చేపట్టుగుంచమైనది సేసపాలమగువ" 22-524

**సేసపాలవారు :** వి; బహు. భార్యాభర్తలు. (తలంబ్రాలు గలవారు)
"సిగ్గులు వడఁగరాదు సేసపాలవారికెల్ల
నిగ్గులఁగాఁగిటఁగూడి నిక్కుటే కాని" 20-544

**సేసపాలు :** వి; వ.బం; బహు. సేసప్రాలు, అక్షతలు, తలంబ్రాలు.

"చేతిలోనె వున్న వివే సేసపాలు
కాతరించ నేఁటికే కాంతునితోను" 12-172
"సెలవి నవ్వులనే సేసపా లివె చల్లె
సొలవక యీకె మోము చూడవయ్యా" 29-289

**సేసపెండ్లికూతురు :** వి. శాస్త్రోక్తంగా వివాహమాడే కన్య.
"ప్రేమ నాపె నీకు సేసపెండ్లికూతు రాయఁగాని
నేము వెట్టికి వచ్చిన నెలఁతల మైతిమా"
11-515

**సేసపెండ్లిది :** (సేస + పెండ్లి + అది) శాస్త్రోక్తంగా పెండ్లాడిన స్త్రీ.
"శ్రీవేంకటేశ నీ సేసపెండ్లిదాన నింతే
కేవలమై యిఁక కనికరించవద్దా" 21-198

**సేసపెట్టి పెండ్లాడు :** ప.బం; స.క్రి. శాస్త్రోక్తంగా పెండ్లాడు. (అక్షితలు చల్లి పెండ్లాడు అని వాచ్యార్థం.)
"ఆసగించి వున్న యింతి నారఁడిఁబెట్టుదురా
సేసవెట్టి పెండ్లాడిన చెలువుఁడవు" 19-45
"సేసపెట్టి పెండ్లాడి చేతికి లోనైన వేళ
వేసరుకొంటే నా దెస విన్నవించవచ్చునా"
18-33

**సేసలు చల్లి పొత్తులు గలయు :** ప.బం; అ.క్రి. ఉప్పువేసి పొత్తుగూడు అనడం వంటిది.
"పుక్కట సేసలు చల్లి పొత్తు గలసే వాతని
దక్కఁగొంటివా నా చందమున నీవు" 24-577

**సేసవెట్టు :** (సేస + పెట్టు) ప.బం; అ.క్రి. అక్షతలు మొ॥ చల్లు, తలంబ్రాలు పోయు, పెండ్లియాడు. (తె.వ్యు.కో.) దీవించు.
"చెట్టుపైఁ బూవులు రాల చెలి సేసవెట్టె నంటా
అట్టే శ్రీవేంకటేశుఁడాలకించఁగా" 17-251
"సేసవెట్టిన పతికి సేవలెల్లా జేయవే"
హరివంశంలో ఈ ప్రయోగం కనిపిస్తుంది.
"కైసేసి తాను సుదతులు
సేసలు వెట్టుటకు శైబ్యచిత్తంబున ను
ల్లాస మెలర్ప నెదుర్కొని యా సరసిజనయనఁ
గని యె నరదముమీఁదన్" (పూర్వ. 3-133)

"జేసబెల్లితనమునఁ బిలిపించి యిందరిలో
సేసవెట్టి పచ్చిసేసి సిగ్గులు వరతురా" 13-21

**సేసాడు :** (సేస + ఆడు) ప.బం. పెండ్లాడు.
"కూడి నిన్ను నారతులె గురుతులు సేసాడేవు"
14-226

**సేసు :** క్రి.వ. 'చెయు(ను)' అనే తద్ధర్మార్థక రూపానికి జానపదవ్యవహారం.
"కొత్త చంద్రుఁడేమి సేసు, కోవిల కేడ నేరమి
హత్తిన నా కోరికలే ఆరడిసేయఁగను" 12-412

**సేసి :** క్రి.వ. 'చేయు' ధాతువు భూతార్థక ఏకవచన రూపానికి జానపదవ్యవహారరూపం.
"సేసెఁగా దైవము నీ చేతిమీఁదుగా నేఁడు
వేసితిఁగా పైజేయి వింత లేమీ నెంచక" 20-209

## సై

**సైదపుఁగుడుము :** వి. గోధుమపిండితో చేసిన కుడుము, మధురమైన కుడుము.
"దప్పిదేరంగ సైఁదపుఁగుడుములును వడలుఁ
బప్పులునుఁ బన్నీటి పానకములు" 5-14

**సైకము :** వి. మాండలికపదం. శుభ్రం, పరిశుద్ధం, సుందరం, సూక్ష్మత్వం. విణ. సూక్ష్మం.
"చేకొని యెంతలో నాకె చెరగుమాసి వుండితే
సైకముగా శిరసు మజ్జనము సేసితివి" 14-592
"వలయపు బండికండ్లు వంటి పిఱుఁదు ఘనము
జలజపుఁ బాదములు సైకమైనవి" 12-449
"యెన్నిక శ్రీవేంకటేశ యిద్దరముఁ గూడితిమి
తన్ను దానె సైకమాయఁ దడవలు పనులు"
21-5
"సన్నపు నడుములోని సైకమే లక్షసేసు
పన్నుగాఁ బిరుఁదు వన్నె పదివేలు సేసు" 5-304

## సొ

**సొంటు :** (2) వి. తప్పు, దోషం, (శ.ర.) నెపము, సాకు. (తా.పె.కృ.స.వ.పరి)
"గొంటరితనాన మేని గురుతులు చూపేవు
సొంటులు నీకు నింపా చూచేఁగాని"
13-359, 15-93

సొంటులు సోదించు : (9) అ.క్రి. బాగా పరీక్షించు, దోషాలు వెదకు.
"సొంటులు సోదించి నిన్నుఁ జూడఁగ వసమా
యింట శ్రీవేంకటేశ నీ విరవొట గాక" 13-367

సొకనాసి : ప.బం; వి. దేవాలయంలో గర్భాలయపు ముందరి పట్టు, దేవాలయముఖద్వారం.

సొక్కు : వి. 'చొక్కు'కు జానపదవ్యవహారం. 1. పారవశ్యం 2. చొక్కుపొడి 3. మూర్ఛ 4. మోహం.
"యీడనె శ్రీవేంకటేశుఁడెనసె నిన్నింతలోనె
పీడెపు సొక్కులతోడి వింత లిదేటిదే" 21-363

సొచ్చెము : వి. ధనాదికము.

సొట్టు : (3) వి. నెపం, సాకు, సొడ్డు, లొట్ట. (తె.వ్యు.కో.)
"విరసపు సొట్టు విడువు మంటి మిటు
తరవాతి పనులు తా మెఱుఁగు" 25-221

సొట్టులెంచు : ప.బం; అ.క్రి. సొడ్డులుపెట్టు, తప్పుపెట్టు, సాకుపెట్టు.
"యేది నీవు సేసినాను యిన్నియును నియ్యకొంటే
సోదించనేఁటికి యందు సొట్టు లెంచనేఁటికే"
1-497

సొడగిలు : అ.క్రి. సోలిపోవు.
"చూచి చూచి సొడగిలి సొంపుల నీ చేఁతలెల్ల
తాచి తెరమాఁటుకైనా దలఁగరాదా" 17-446

సొన్నాటంకము : ప.బం; వి. మాడ అనే నాణెం. రూపాం. సొన్నటంకము, స్వర్ణటంకము.
"సుదతి బిత్తరిచూపు సొన్నాటంకాలే సేసు
అధరబింబము తీరు ఆరువేలు సేసు" 5-304

సొన్నాటంకాలు సేసు : ప.బం; అ.క్రి. మిక్కిలి విలువ చేయు.
"సుదతి బిత్తరిచూపు సొన్నాటంకాలే సేసు
అధరబింబము తీరు ఆరువేలు సేసు" 5-304

సొమ్మ : వి. మూర్ఛ, ఊపిరితిత్తుల జబ్బు, ప్రమాదకరమైన జబ్బు, చుట్టబట్ట.
"వుమ్మడి శ్రీవేంకటేశుఁ డొగి నిట్టె నన్నుఁగూడె
సొమ్మల మైమఱచి నేఁ జొచ్చినదే నేరమా"
11-528

సొమ్మలంబోవు : ప.బం; అ.క్రి. సొమ్మలఁబోవు కావచ్చు. మూర్ఛపోవు.
"సొమ్మలం బోయేవేళే సొంపుగొల్లెతా వోరి
దిమ్మరి కోనేటిరాయ తిరమైతి నీకును" 6-113

సొరబు : వి. కృశత్వం, వాడిపోవుట.
"కాఁగిన దేహపు సెకలును కప్పిన పువ్వుల సొరబులు
వేఁగిన చెలితాపమునకు వెన్నెల మండెడిని"
5-138

సొరిది : వి. క్రమం, వరుస, పంక్తి, శీఘ్రం, యుక్తంగా.
"చూతమువో వొక్కతైన సొరిదిఁ గాంతునిఁ దమ
చేతికి లోనుగాఁజేసి చిక్కించుకో గలదా"
11-402

సొరుగు : అ.క్రి. మూర్ఛిల్లు.
"సొరిగితినంటా సురతపరవశాన
నరవిరి కనురెప్ప లల్లాడించీని" 5-117

సొర్ణాటంకము : వి. సొన్నాటంకము, మాడ అనే బంగారునాణెము.
"ఎన్నఁగ సొర్ణాటంక మింతటానుఁ జెల్లినట్లు
సన్నపుఁదోలుబిళ్లలు సరిగాఁ జెల్లునా" 2-170

సొలఁగు : పారవశ్యం పొందు.
"తలవంచుకొని నీతో తమకపు మాటలాడి
సొలయుచు నింతి మొక్కి సొలగిలీని" 8-258

సొలతు : క్రి.ప. సొలయు ధాతువు తద్ధర్మార్థంలో మ.పు; ఏ.వ.రూపం. ఇట అంతర్భావితణిజర్థంగా వాడబడింది. సొలయింతును అని అర్థం(?)
"చెప్పినట్టు సేయఁగాను చిత్తములోఁ గరఁగక
చొప్పలెత్తి యెటువలె సొలతు నిన్ను" 14-556

సొలపు : (3) వి. 1. శ్రమ, బడలిక 2. పారవశ్యం 3. పంక్తి 4.దీనభావం 5. మూర్ఛ 6. విలాసం 7. మృదుత్వం 8. వైముఖ్యం 9. విధం 10. దృష్టివిశేషం.

"ఎలమి శ్రీవేంకటేశుఁ డీతఁ డిట్టె నన్నునేలె
సొలపులు మావంటి సుదతుల కేలే" 26-228
"వెల్లవిరిసొలపుల వేడుకలు దైవారె
కొల్లలుగా రీతులను గూడుదువు" 14-564

**సొలసేవు:** క్రి.ప. సొలయు ధాతువు తద్ధర్మార్థంలో మ.పు; ఏ.వ.రూపం. ఇట అంతర్భావితణిజర్థంగా వాడబడింది. సొలయింతువు అని అర్థం(?)
"ఈతని నేల సొలసే వెందాఁకా నీవు
యేతులు నెమ్మెలుఁ జూప నిఁక నేలే చెలియా"
14-584

**సొల్లెము:** వి. 'చొల్లెము' అనే శబ్దానికి జానపద వ్యవహారరూపం. జడలో చుట్టిన చుట్ట.
"జడల సొల్లెము సుట్టి సరివీఁక విల్లువట్టి
వెడదవాలంప పొది వీఁపునఁ గట్టి" 20-230
"వేణింజొల్లెము వెట్టి" అని భాగవతప్రయోగం.

## సో

**సోఁకనాడు:** ప.బం; అ.క్రి. మనసు నొచ్చేరీతిగా మాట్లాడు. తాకనాడు, ఆవేశంతో మాట్లాడు.
"సొలయక మలయక సోఁకనాడక
వలపులే చల్లి కైవశము చేసుకోవే" 29-100

**సోఁకోర్చు:** ప.బం; అ.క్రి. 1. బాధలకోర్చు 2. సంభాషణాదులను పెట్టుకోవడానికి ఇష్టపడు.
"కాఁకలఁబొరలినది కౌఁగిటఁగొసరినాను
సోఁకోర్చి మెచ్చే సరసునిదే నేర్పు" 12-133

**సోఁపు:** వి. (?)
"సొమ్ముగలవాఁడవు సోఁపుగని యిచ్చె కాక
సమ్మతిఁగాక వంచన సేయువచ్చునా" 11-123

**సోగ:** వి. పొడవు, అందం. విణ. పొడవైనది, అందమైనది.
"సోగల శ్రీవేంకటేశు సురత సింగారము
వాగమై యమరెఁగాన వన్నెలెల్ల నమరె" 9-90

**సోగమేను:** వి. అందమైన శరీరం.
"సోఁకనన్న మానదు నా సోగమే నేమో కాని
పైకొని నీ పచ్చిమీఁదఁ బచ్చి దగునా" 9-64

**సోదన:** వి. 'శోధన'కు వికృతి.
"చొక్కి తన మేను నీకు సోదన లియ్యఁగానే
నెక్కొని యప్పటి నేల నిందవేసేవే" 26-460

**సోదనగొను:** (2) స.క్రి. గాలింపుచేయు.
"జోలిఁబెట్టలేదు నిన్ను సోదన గొనఁగలేదు
మేలు మేలనుచు నిన్ను మెచ్చరాదా" 24-594

**సోదనిచ్చు:** (2) (సోదన+ఇచ్చు) అ.క్రి; వి. శకునం కోసం రామాయణాది గ్రంథాల్లో దారంవేసి శోధించు, గాలించు.
"చూడుమని నీ మేను సోదనియ్యవలెనా
జాడతో నీ సేఁతలు సత్యాలుగావా" 23-189

**సోదించు:** (36) స.క్రి. 'శోధించు'కు జానపద వ్యవహారం. అన్నమయ్య తాను ప్రయోగించిన 36 ప్రయోగాల్లోనూ మహాప్రాణవర్ణమైన 'ధ' కాక అల్పప్రాణమైన 'ద'కారాన్నే ప్రయోగించినాడు. ఒక ప్రయోగంలో మాత్రమే 'ధ' కారం కనిపిస్తుంది. (చూ: 6-96)

**సోద్యము:** (6) వి. 'చోద్యము'నకు జానపద వ్యవహారం. వైచిత్రి, వింత, ఆశ్చర్యం.
"చూడఁజూడ సోద్యాలాయ చుట్టరికము గట్టీయ
జాడతో మీ యిద్దరికి సరసములు" 23-67

**సోపులాడు:** ఊగులాడు. 2-246

**సోబనపక్షంతలు:** (సోబనపు + అక్షంతలు) మంగళకరమైన అక్షంతలు, సేసలు.
"సుదతి నీ కొసఁగే సోబనపక్షంతలు
అదన నీవు మీఁజేత నందుకొంటివి" 8-19

**సోబనపత్రిక:** వి. శోభనపత్రిక, మంగళపత్రిక, పెండ్లిపత్రిక, లగ్నపత్రిక.
"ఇది పెండ్లి లగ్నవేళ యింతికి నీకు
సుదతి మోవిచిగుళ్లు సోబనపత్రికలు" 16-439

**సోబనము:** వి. మంగళం. (ముగ్గు)
"యిప్పుడు శ్రీవేంకటేశుఁడు గూడఁగ
చొప్పున నితనికి సోబనమాయ" 28-161

**సోబనవేళ:** వి. శోభనవేళ, మంగళవేళ.

"సుదతుల కితనికి సోబనవేళ
వుదుటునఁజెలులెల్ల నూడిగాలు శాయరే"
13-100

**సోబనాలు:** వి; బహు. గీతివిశేషం.
"పాడరె సోబనాలు పైపైనె పేరఁటాండ్లు
యీడా డనక వీథు లేఁగించరే" 9-55

**సోబాన:** వి. ఒకరకం పెండ్లిపాట, శోభనంపాట. (తె.వ్యు.కో.) 8-21
"చూచి చూచి మీ పెండ్లికి సోబాన వాడేము గాక
మీ చేతలిట్టివని మేమెంచఁగలమా" 28-352

**సోభనము:** వి. 'శోభనము'నకు జానపదవ్యవహారరూపం.
"చూచినవారికెల్లా సోభనమై వుండువు
తాచిన శ్రీవేంకటేశ దైవమై వుండువు" 21-446

**సోమపుమోము భూతము:** వి. పరాక్రమంతో నిండిన ముఖంకల భూతమని వాచ్యార్థం. ఇట మిక్కిలి పరాక్రమం కల సింహము యొక్క ముఖంతో హిరణ్యాక్షుని సంహరించిన నృసింహావతారమని భావం.
"కనలి కవియు చీఁకటిభూతము
పొనుఁగు సోమపుమోముభూతము" 1-109

**సోమయాది:** వి. 'సోమయాజి'కి వికృతిరూపం.
"సోమయాదు లొకవంక సొరిది సురలకెల్లా
నామనితో విందువెట్టీ ననుదినము" 2-70

**సోమరించు:** (సోమరి + ఇంచు) అలసత్వం చూపు, బద్ధకించు. సోమరి శబ్దంపై ఏర్పడిన ధాతువు.
"సోమరించి యేపాటి సోఁకినాఁ గాఁకలు రేఁగీ
ప్రేమ నీ చేతలు ఆవపిండి వంటిది (వి)"
14-113

**సోమవీథి:** వి. ఉత్తరం ఉండే వీథి, ఉత్తర దక్షిణాలకు పాగే వీథి.
"చక్క సోమవీథి నేఁగెఁ జందురుని తేరు మీద
యెక్కువైన కువలయహితుఁడు గాన" 1-424

**సోమశిలకనుమ:** వి. నెల్లూరుజిల్లా సరిహద్దులో ఆత్మకూరు తాలూకా -సిద్ధవటం తాలూకా సరిహద్దులో ఉన్న కనుమ.
"సొంపుల నీ వదనపు సోమశిలకనుమ
యింపులెల్ల జేకొనఁగ నిల్లు నీ పతికి" 5-115

**సోరణగండి:** (5) వి; ప.బం. గవాక్షం, జాలకం. (తె.వ్యు.కో.) రూపాం. సోరణగండె, సోరుణగండె, సోరణగెండె, సోర్గండి.
"చూచితి నప్పుడే వాని సోరణగండ్ల నేను
యేచి వేరె సింగారించి యింట దోడి తేరె" 9-266

**సోలగిలు:** అ.క్రి. మొక్కు, తలవంచు.
"ఏలే చెలియ యీ యింతులకెల్ల
సోలగిలి నీ చనవు చూపవలెనా" 9-14

**సోలి:** (3) మాం; వి. వరుస. సం.ప.స. లో సోలిగా అనే పదానికి అదేపనిగా అని అర్థమని, అరవంలో శోలి అంటే పని అని అర్థమనీ పెర్కొన్నారు. ఈ అర్థంకూడా సమంజసంగానే ఉన్నది.
"ఏల సిగ్గులువడేవు యెదుటికి రాఁగదవే
సోలిగా నీ సింగారాలు చూచుఁగాని యీతఁడు"
18-290, 4-457 & 16-448

**సోవ:** (48) వి. పొడవు. (అందం అని లక్ష్యార్థం) విణ. దీర్ఘములైన, అందమైన.
"పూవుల వేసి మోహాన బుసకొట్టుకుంటాను
సోవగా సతిచే నాకు చుట్టింప్పించుకొనవా"
24-456
"సోవలఁ గన్నవారెల్లా జుట్టములంటా నేను"
4-371
"నీ వేడుకే చూచేవు నెలత లాగెంచవు
సోవలకన్నుల నాపె సొలయఁగాను" 23-128
అ.ము. గారు దీనికి ఎదుట, ప్రత్యక్షముగ అనే అర్థాన్ని సూచించి ఈ కింది కీర్తనపాఠాలను పేర్కొన్నారు.
"దీవులను కొండలెక్కి తిరుగాడనే వద్దు
సోవల బిలములోనఁ జొరవద్దు" 10-54
"దేవుఁడు శ్రీవిభుఁడని తెలియరె
సోవల ననంతునిఁజూడరె" 10-2

**సోహ:** వి. 1.సోహం భావం 2.రక్షణ కీయవలసిన సొమ్ము.

"సోహలను వెలిఁజూచే చూపులోను చూచుటే
అహోదేవతల దనందే తాఁగనుట" 4-68
"వూహించ కిందుకుగాను వూఁరకే మారుమో
మేల
సోహగా మొకమొకాలు చూచుకొనరాదా"
20-512

## సౌ

**సౌకుమారుఁడు :** వి. సుకుమారుడు,
సౌకుమార్యం కలవాడు ; సుకుమార ఏవ
సౌకుమారః అని స్వార్థంలో అణ్ ప్రత్యయం
రాగా ఏర్పడిన రూపమని చెప్పాలి.
విలక్షణప్రయోగం.
"పైకొని వెలిగేటి పరంజోతి యై (యౌ)
సౌకుమారునకు శరణ్యము" 4-376

**సౌఖ్యత :** వి. సౌఖ్యం; సౌఖ్యమనే
భావార్థకప్రత్యయం పై మళ్లీ భావార్థక
ప్రత్యయం రావడం విలక్షణం.
"రుకుమిణిదేవికి రూపయవ్వనికి
సకలవిభవముల సౌఖ్యతలు" 5-311

## స్ప

**స్పరుశవేధి :** వి. స్పర్శవేధి, పరుసవేది,
ఇనుమును బంగారం చేసేది.
"చాల శ్రీవేంకటేశ స్పరుశవేధిచే
కాలజన్మపుటినుము కనకమాయ" 15-70

## స్రి

**స్రిష్టి :** (2) వి. 'సృష్టి' అనే పదానికి
జానపదవ్యవహారపదం. 'సృ' లోని ఋవర్ణం
'రి' గా మారింది.
"కామించి మోక్ష సుఖమునకు నైతే
వోమిన స్రిష్టులు వొకటీఁ గావు" 2-95

## స్వ

**స్వతంత్రము :** వి. స్వాతంత్ర్యం; ధర్మవాచకానికి
బదులు ధర్మివాచకప్రయోగం.
"సేదదేర నామీఁదఁ జిత్రగుప్తుఁడేల వ్రాసీ
మేదిని స్వతంత్రమేది మెరయ నీ బంటను"
3-498

**స్వరూపదీక్ష :** వి. స్వస్వరూప జ్ఞానాన్ని-
ఆత్మస్వరూప జ్ఞానాన్ని తెలుసుకునే దీక్ష. తన
నిజస్వరూపాన్ని గుర్తెరిగే దీక్ష.
"యెదలో శ్రీవేంకటేశు నిటు ప్రత్యక్షము చేసి
యిదివో స్వరూపదీక్ష యిచ్చెను మా గురుఁడు"
2-148

**స్వర్గానికి యెక్కి యేకులు వడకుట :** నానుడి;
ఉన్నతస్థానానికి చేరి సాధారణమైన పనిని
చేయడం.
"అక్కటా లోకోన్నతుఁడు హరిఁజేరి యిట్లయితి
యెక్కువ స్వర్గానికెక్కి యేకులు వడకుటా"
15-71

**స్వస్తిపెట్టు :** స.క్రి. స్వస్థపెట్టు, నెమ్మదిపరచు.
"ఆ రీతి నిట్టూరుపుల నసురుసురై వుండఁగా
గొరవించి స్వస్తిపెట్టి కందువ నిల్తువుగా"
21-249

**స్వస్థపఱచు :** స.క్రి. నెమ్మదిపరచు.
"వరుస లోకమింతాను వసము చేసుకొనేనా
పరఁగ నా మతి స్వస్థపరచుకోలేను" 15-316

## హ

**హత్తుగడ :** వి. రూపాం. అత్తుగడ. 1.పొందిక,
చేరిక 2.కలయిక.
"బత్తి యెందుఁగలిగినా పదరి సాదించేనా
హత్తుగడై వున్నదాన నట్టె మెచ్చేఁగాక" 28-587

**హరిగె :** వి. 'హరిగ'కు రూపాం. 1. డాలు 2.
ఎండ తగులకుండా పట్టే కేడెంలాంటి
సాధనవిశేషం.
"రాసి మధ్యరంగానఁ జక్రాలు మరుఁడొనరింప
యీసు దీర హరిగె దానెడ చొచ్చినట్లు" 7-405

**హరినీల దర్పణము :** వి. ఇంద్రనీలపు అద్దము.
"తలపోయు హరినీలదర్పణంబో యితఁడు
వెలుగుచున్నాఁడు బహువిభవములతోడ"
1-228

**హరిమధ్య:** వి. సింహపు నడుము వంటి నడుము గల స్త్రీ, స్త్రీ.

"కరిగమనకు బాగాలు చేతి కొసఁగరే

హరిమధ్య కొడ్డాణ మమరించరే" 29-15

**హరుషము:** వి. 'హర్షము' అనే రూపానికి వికృతిరూపం. సంతోషం.

"తావులు చల్లెడి దేహము తలపులు మీరిన హరుషము

లోవెలుతుల వెడయాసలు లోపలి కోరికలు" 5-164

**హరుషించు:** (2) అ.క్రి. హర్షించు, సంతోషించు.

"నెరతనములు చూపి నిరంతరము నాథుని

హరుషించఁగఁజేసితి గదమ్మా" 1-102

**హల్లకల్లోలము:** వి. 'అల్లకల్లోలము'నకు రూపాం. చిందరవందర.

"బల్లిదుండై లంకచొచ్చి బలురాకాసులఁ గొట్టి

హల్లకల్లోలము చేసె హనుమంతుఁడు" 4-155

**హస్తిణిజాతి:** (2) వి. 'హస్తిని' అనే స్త్రీజాతి. హస్తిణి పదంలోని 'ణ'కారం విలక్షణం.

"కాంత హస్తిణిజాతి గాఁబోలు కరమూలము

లంత కంతకు నలుపులై యున్నవి" 5-123

## హా

**హారించు:** స.క్రి. 'హరించు'కు వ్యావహారికరూపం.

"ఇలనెల్లా హారించె నెనసెఁ గొండగుహల

యెలమి నిన్నిటాను నీ కితవుగానె" 9-300

**హావభావములు:** వి; బహు. శృంగారచేష్టలు.

"హావభావములతోడ ఆయమంటి మన్ననలే

ఆవటించుకొనేవార మందు కొడిగట్టము" 21-38

## హి

**హిగ్గు:** స.క్రి. వెనుకకు పంపు. రూపాం. ఇగ్గు.

"అగ్గపు శ్రీవేంకటాధిప యిట్టవుత

హిగ్గిన వేడుక నెఱఁగముగా" 9-13

**హితవరి:** (హితవు+ అరి) వి. మేలు చేసేవాడు, మేలు చేసేది. 'ఇతవరి' అని ఆధునిక వ్యవహారం.

"హితవరి పని నీతో నేకతము చెప్పితేను

అతివతోఁ జెప్పితివి అవునా నీవు" 10-2-69

**హితవరురాలు:** (హితవు + అరి + ఆలు) వి. మేలు చేసే స్త్రీ, హితం చెప్పే స్త్రీ, ఇతవరురాలు.

"యెంచఁగా నాపె నీకు హితవరురాలు గాని

పంచల వేయఁగ నీకుఁ బగవారమా" 11-515

**హిమంతకాలము:** వి. హేమంతకాలము.

"శ్రీవేంకటేశుఁ జూచి సిగ్గు లీ కామిని చిందె

యీ వేళ హిమంతకాలమిదియే కాక" 17-525

**హిమరుతువు:** వి. హేమంతర్తువు.

"కమలోత్పత్తికి హిమరుతువుకుఁ గల

కాలము వైరము గాదా" 10-2-112

**హిరణ్యకసిపుఁడు:** వి. హిరణ్యకశిపుడు.

"పక్కన నుక్కుఁగంభము పగిలించుక వెడలి

తొక్కి హిరణ్యకసిపుఁ దొడికిపట్టి" 4-285 & 2-516

## హీ

**హీనదెస:** వి. కష్టమైన దశ.

"నానాపాట్లఁ బడె నాఁడు కరి మకరిచే

హీనదెస ప్రహ్లాదుఁడు హిరణ్యుచేఁ బాటువడె" 3-245

**హీనాధికములు:** వి; బహు. హెచ్చుతగ్గులు.

"కందువగు హీనాధికము లిందు లేవు

అందరికి శ్రీహరే అంతరాత్మ" 2-1

## హృ

**హృదయము చిల్లులగు:** ప.బం; అ.క్రి. మనస్సు మిక్కిలి బాధ చెందు.

"యిదె మేడపై నతఁడు యిటు నన్నుఁ జూచెనంటే

హృదయము చిల్లులయ్యా నేమిసేతునె"

## హె

**హెగ్గాళ:** వి. హెగ్గాళె, ఒకరకం వాద్యవిశేషం.
"తుమ్మెదరవము విని తొంటి హెగ్గాళేలంటా
తమ్మికంటి యాసలతో దగ్గరిపోయి" 24-146

**హెచ్చుకుందులాడు:** అ.క్రి. దూషించు. 7-90

**హెచ్చుకుందులు:** వి; బహు. హెచ్చుతగ్గులు.
"పచ్చిమాటలాడితేను భావమెల్లా గరగేవు
హెచ్చుకుందులాడినా యియ్యకొనేవు" 7-90

## హే

**హేయము:** వి. 1. అశుద్ధం, అమేధ్యం.
(2. విడువదగింది)
"హేయము దొక్కకుమన్న యేచి తినే
ననేవాఁడు
చాయకు రాకున్న నేమిసేయవచ్చును" 1-208

## హై

**హైహై:** అవ్య. సంతోషసూచకంగా పలికే మాట.
"పాలించి శ్రీవేంకటాద్రిపతి నాకుఁ గలుగఁగ
ఆలరినై గెలిచితి హైహై నేను" 7-279

## హో

**హోయపుటింతి:** (హోయము + ఇంతి) వి.
వినోదించే స్త్రీ, వేడుకకత్తె.
"ఈ మేనే కాదా హోయపుటింతులఁగూడె
నీ ముద్రలు ధరియించి నిక్కఁగాక" 4-56



# అనుబంధం

అంక: వి. పార్శ్వం, పక్క.

"అలరి మమ్మేలి మాయంకల రాఁగదవయ్య"

19-142

అంటసిలు: అ.క్రి. నేల కూలబడు. (తె.వ్యు.కో.)

అంతల పొంతలవారు: వి; బహు. చుట్టాలు.

అక్షయ వటపత్రము: వి. సృష్ట్యాదిలో విష్ణువు శయనించిన మఱ్ఱాకు.

"అనంతవేదాలుండేటి అక్షయవటపత్రము
ఘనదేవతలకు శ్రీకరయజ్ఞము" 7-10

అగ్గళ్లు: ముందర, అగ్రభాగం. (తె.వ్యు.కో.)

"అప్పుడీ మానవే నీవు అతనిఁ గానని వేళ
వుప్పరాలై (?) అగ్గళ్లు వురికిన దానవా"

17-109

అటమటములు: అసత్యాలు. 19-471

అడ్డమై కాచు: స.క్రి. ఎదిరించి రక్షించు.

అడ్డలించు: స.క్రి. ఊహించు. (సంపా. 17సం. పీఠిక, 6పు.)

అనసి: 'ఎనసి'కి వ్యావహారికరూపం.

"అనసి యందుకె యాతఁడిట్టె కాఁగిలించుకొంటె
తనువంతెఁ జెమటంటా తప్పు వేయనేఁటికే"

21-418

అపలపించు: స.క్రి. మఱుఁగువెట్టు. (సంపా. 17సం. పీఠిక, 6పు.)

"ఆనవెట్టరాదు పెట్టి యపలపించఁగరాదు"

17-167

అమాసచీకట్లు: దట్టమైన చీకట్లు.

"అనుగుపున్నమలకు అమాసచీకట్లకు
అనయము సరికి సరందు కందుకు" 3-363

అఱిముఱి: ముందువెనుకలు.

"ముందువెనుకలు నా నఱిముఱి యనఁగ"

(అం.భా. 3.73)

అఱ్ఱు వంచి తడుకల్లు: ప.బం; అ.క్రి. శ్రమపడి ప్రయత్నం చేయు.

"వెఱ్ఱిలాల మీకు వేడుక గలితేను
అఱ్ఱు వంచి తడుకల్లంగ రాదా" 7-260

అవళు: వి. స్త్రీ (క.)

అసిఁబోవు: అ.క్రి. రవంత తగిలి తప్పిపోవు (తె.వ్యు.కో.)

అసిమి: 'అసిమిసంచి' అని హం.విం. 2-27

ఆటబొమ్మ: వి. అస్వతంత్రుడు.

ఆడుకోలుమాటలు: ఇచ్చకపుమాటలు.

"ఆడుకోలు మాటలు నీవాడితే నాడుదు గాక
పాడితే దొరవు విన్ను బలిమిసేసీనా" 22-414

ఆలకించి విను: స.క్రి. శ్రద్ధతో విను, ఏకాగ్రతతో విను. (ఆలక్షించి > ఆలకించి)

"విన్నపము లాలకించి వినవయ్యా
నీకె పొందు నేఁడేరించనయ్యా" 29-469

ఇగ: 'ఇక'కు వ్యావహారికరూపం. ఉదా :- మరిగేమి. (మరి + ఇగ + ఏమి)

ఇండె: వి. మాల, చీలిక, ఎముక, కీలు.

ఇండెవాయు: అ.క్రి. చీలు, పగులు. (తె.వ్యు.కో.)

ఇందవమ్మ: అమ్మా! ఇదిగో తీసుకో అని అర్థం.

"నిద్దురతో నున్నాఁడో నేనతని దోడిలెంచే
వద్దు వీడె మిందవమ్మ వట్టి చలిమేల" 11-581

ఇట్ల: క్రి.విణ. ఈవిధంగా, ఇట్లు. తెలంగాణంలో కూడా ఈ వ్యవహారం ఉంది.

ఇడి: వి. భక్ష్యవిశేషం.

ఇవో: ఇగో, ఇదిగో.

"వేదమై నిలచే వీడివో హరి
ఆదిగొని వెదకితే నట్టే నాలిక కొన"

ఈఁతామోఁతా: 1. ఈదునంతగ, మోయునంతగ అని అర్థము గల ఈ పదములు ఎక్కువగ అను తాత్ప ర్యార్థమున నేటికి వ్యవహారమున గలవని సంపా.

"ఇతవైన వలపులే యీఁతామోఁతా" 21-96

2. ఈదుటయు, మోయుటయు. నీటి బరువు మోపు బరువు అని తాత్పర్యమని సంపా.

"చేఁతకుఁజేత సేసెను చెల్లుఁగదవే
యీఁతా మోఁతా నొక్కటాయ నీక నే మనేరే"

21-135

**ఈలకూర:** వి. సముద్రప్రాంతాలలో నేలను అంటుకొని మొలిచే ఒకజాతి ఉప్పని ఆకుకూర.

**ఈహి:** వి. ప్రయత్నం.

**ఉద్దుఉద్దులు:** వి; బహు. జతలు జతలు.

**ఉనికిమనికి:** వి. స్థిరమైన ఉనికి.

"కొనరో కొనరో మీరు కూరిమియందు
వునికిమనికి కెల్లి నొక్కటే మందు" 1-237

**ఉప్పరము:** వి. ఆకాశం.

**ఉలివచ్చిమాట:** వి. పోటుమాట. (బాధాకరమగు మాట)

"పిలువ వచ్చేవు నీ ప్రియురాండ్ల చేతి
వులివచ్చిమాట లోర్చి యుండనా నేను" 17-10

**ఊరకుండఁబట్టదా:** ఊరకే ఉండబట్టదా అని ప్రచారంగా ప్రయోగముంది.

"పొద్దుపోదా తనకేమి పోరుపెట్టి వేగి లేచి
ఉద్దండీఁడు తనకేమి వూరకుండఁబట్టదా"

11-160

**ఎండనీడబతుకు:** సుఖదుఃఖాలతో కూడిన బ్రతుకు.

"ఇంపు సుఖదుఃఖాల యెండనీడబతుకు
మంపు కామక్రోధాలమాటు బదుకు" 7-163

**ఎండలు నీడలగు :** ప.బం. ప్రతికూలములు అనుకూలము లగు (?)

"వండవండ నట్లుగా వారిఁజూచి నవ్వేవు
యెండలెల్లా నీడలాయ నింక నేటి యానలు"

17-117

**ఎండ వెన్నెలయగు:** ప.బం. హాయి కలుగు.

**ఎకపోయు:** ప.బం; స.క్రి; రా.సీ.మాం. లేనివి కల్పించి చెప్పు.

"చాయలనే యెకపోసి సన్నల నింతేసేసి
యే యెడకుఁబోసేవు ఇంతకంటె నేమే" 19-368

**ఎడ(డఁ)గొల్లకత్తె:** (ఎడన్ + కొల్ల + కత్తె) వి. ఈ పదం కొన్ని చోట్ల ఎడఁగొల్లకత్తె అనీ, కొన్ని చోట్ల ఎడగొల్లకత్తె అనీ ప్రయోగించబడింది. అర్థబిందుసహిత రూపమే సముచిత మని భావించవచ్చు. సందుచూచి కొల్లగొను స్త్రీ అని అర్థం.

"ఎడగొల్లకత్తె యీమె యెవ్వతోయి
అడియాలా లెత్తీ నాతో నానతీవోయి"

16-589 & 2-2

**ఎత్తరము:** వి. ఎత్తైనది.

**ఎదుటనే వలపు ఇంటికాడ బులుపు:** నానుడి; కపటప్రేమ.

**ఏఁజెల్ల:** అవ్య. విచారసూచక పదం.

**ఏటవేయు:** స.క్రి. గుఱిపెట్టు, చూపు నిగుడ్చు. (బలి యిచ్చు, భారంవేయు అని పద.)

"వేగి లేచి సంసారవిధులనే వొడిగట్టి
యే గతిఁ గొసరి నీపై నేట వేసేము" 10-2

**ఏడకేడ ఎంతకెంత:** పోలికకు అందనిది, కుదురనిది.

"ఏడకేడ ఎంతకెంత యెక్కడికినెక్కడనే
తోడ నలుగఁగ నంత దొడ్డ దాననా" 4-59

**ఒజ్జలపుచ్చకాయ:** వి. నేర్చిన విద్య మరచిపోవడం.

**ఒత్తి గొట్టాన బెట్టు:** ప.బం; స.క్రి; బాధించు.

**ఒలినిలయుఁడు:** ఈ మాటకు సంపాదకుల వివరణ మిట్లున్నది. ఒలి = శబ్దము అని తమిళము. అదే మనకు 'ఉలివు' కావచ్చును. ఒలిశబ్దార్థమునకు ఛాయగా (శ్రుతి = వేదము) అని అర్థమైనచో వేదాధారా అని అర్థము కావచ్చు. కాని –

"నిచ్చలు మాచనవొలి నిలయా నేఁ గోరఁగానే
మెచ్చుగా నన్నుఁగూడి మేల మాడితి మేలు
మేలురా శ్రీవేంకటరాయా"

అనే ఉదాహరణ చరణాల్లో 'మాచనవొలి నిలయా' అనే పదానికి మాచనవోలు గ్రామం నివాసంగా కల చెన్నకేశవస్వామి అని అర్థం చెప్పడం సమంజసమేమో! తాళ్లపాక గ్రామానికి సమీపంలో ఉన్న మాచుపల్లెయే మాచనవోలు కావచ్చు. చూ: మాచనవోలి నిలయుడు, మాచనవోలి చెన్నుఁడు.

**ఓఁకలు:** వి; బహు. వక్కలు.

"వీఁక వింటి చెంచెతా వీఁచి కోసేవేటికే
వోఁకల విడేలు వో వొగరుఁగాని" 26-77

**ఓదేఁడు :** (ఓదె + ఎడు) మిక్కిలి ఎక్కువగా అని లాక్షణికార్థము. (ఓదె = చేనియందు అక్కడక్కడ ఉంచే వెన్ను పోచల కుప్ప)

"బిగిసేవు గాక ప్రియురాండ్లు నిన్ను
పొగరులాడేది వోదేఁడు గావా" 17-152

**ఓపె :** వి. స్త్రీసంబోధనార్థకపదం.

"ఓమె యోపె యనంగ నొప్పు
స్త్రీసంబోధనార్థమై" ఆం.భా.3.72)

**కంచము కూడు :** వి. అందుబాటులోనిది.

**కంచాన అన్నము వెట్టి కాచు :** జాగ్రత్తగా రక్షించు.

"అంచల దేవతలకు నమృతమిచ్చిన నీవు
కంచాన అన్నమువెట్టి కాఁచుట నన్నింత"
7-217

**కందికుడుము :** వి. మంగళకరమైన విందు అని అర్థమా? అని సంపాదకులు.

"కన్నచోటనే నీకు కందికుడుము" 24-335

**కక్కువడు :** అ.క్రి. (?)

"కక్కువడ నవ్వకుమీ నడుమెల్ల బడగయ్యీని
వుక్కున రేపటి కింద కునుతువు గాని" 17-292

**కచ్చుకొను :** అ.క్రి. ఆశించు, పంతముపట్టు.

**కటూరము :** 'కఠోరము'నకు వికృతి కావచ్చు. (సంపా.)

"మంకు దీర్చ వసమా మదిఇంచు కుచముల
పొంకపుఁగటూరమే పొగడుతగాక" 24-181

**కడుపూ నిండదు కన్నూ తనియదు :** లోకోక్తి; తృప్తి ఉండదనడం. కన్ను కావాలనడం - కడుపు వద్దనడం.

"కడుపూ నిండదు కన్నూ తనియదు
కడగి లోని యాకలియు పోదు" 1-124

**కడ్డి :** వి. చిత్తరువు గీసే సాధనవిశేషం (?)

"చెలువుఁడంతటిలోన చేతికడ్డి దీసుకొని
తలిరుబోడి రూపు తగులుగా వ్రాసె" 17-314

**కతకు కాళ్లడుగు :** ప.బం. లేనివాటిగురించి అడుగు.

**కతలుగా చెప్పు :** ప.బం. రకరకాలుగా చెప్పు.

"కాంతలెల్లా నీ సుద్దులు కతలుగా చెప్పేరు"
22-53

**కత్తరాలు :** వి; బహు. చీకట్లు.

**కదుము :** స.క్రి. తరుము; రూపాం. గదుము, గెదుము.

"నీకు నిచ్చకమే నెరవుడు గాకిటు
కాకు సేసి నినుఁ గదిమేనా" 11-474

**కనకరాయఁడు :** వి. చందనూరు గ్రామంలో వెలసిన స్వామి.

"కందు వలర నగుతా యిట్టి
కనకరాయఁడిపుడూ
విందు వలెనె యెనసె శ్రీవేంక టేశుఁడితఁడు"
17-126

**కనుగిరుపు :** వి. కన్నుగీటు.

"తిరువేంకటాచలాధీశ్వరుని కనుగిరుపు
తరుణి కిటువంటి మెత్తని పూవుఁబరపు" 6-20

**కప్పరపు చూపులు :** వి; బహు. స్వచ్ఛమైన చూపులు.

"కప్పురపు చూపులు చల్లని చూపులు ఆ కాంత
నీపై చల్లఁగాను
ఉప్పతిల్ల వెన్నెలనవ్వులు చల్లేవు" 15-298

**కమ్మిరించు :** స.క్రి. ఆచ్ఛాదించు.

"చెల్లఁబో యింతేసి పని సేతురా నీవు
కల్లలంటేఁబో నిను కమ్మిరింతుఁగాని" 17-291

**కరకరిఁబెట్టు :** స.క్రి. బాధపెట్టు.

"మెరవడికత్తెలైన మెలుఁతలే నీకు బాఁతి
కరకరిఁబెట్టేది కాంతలే బాఁతి" 21-108

**కలపనగంప :** వి. కలహశీలుడు.

**కలబెరికాయ :** వి. ఒక కాయ.

"నలుపున జనుపక నాసిక మొకటే
కలసి కదంబపు కలబెరికాయ"

**కలయో నిజమో :** ప.బం. స్పష్టం కానిది.

**కలుపడు:** అ.క్రి. నివ్వెరపడు.

**కవ్వపుఁగొండ:** మంథరపర్వతం.

"కడఁగి శ్రీవేంకటేశ క్రమ్మర నెంచి చూచితే
వడియు నురుగుల కవ్వపుఁగొండఁ బోలు" 7-169

**కాయాటుది:** వి. కాయవాటుది. వయస్సు మళ్లినా కాయవలె శరీరం ఉండేది. (నెల్లూరి మాండలికం)

**కిల్లాకు:** వి. లేఖ, చీటి. (అ.భా. _____)

"యింతలో శ్రీవేంకటేశ చిగురుఁ గిల్లాకు
కాంత కియ్యఁగా మదనుగుడి చేరి" 17-541

**కిసుక:** వి. కృషి, సేద్యం.

**కీలు అయివుండు:** ఆధారం ఐఉండు.

"అతని మూలమె జగమంతా నిది
ఆతుమలో హరి కీలు అయివుండుఁగాని" 7-128

**కూకులు వత్తులు అగు:** ప.బం. మిక్కిలి కృశించి వత్తులు అగు. (తె.జా; 1. భా; 273 పు.)

**కూడువేఁడైతే కూరపై చేఁజాచినట్లు:** లోకోక్తి; ఒకటి ప్రతికూలమైతే అనుకూలమైన మరొక విషయంపై ఆసక్తి చూపడమని భావం.

**కూరాకువలె నగు:** అ.క్రి. ఉడికిపోవు.

"పోరుకుఁజాల కిందుకుఁ బుత్తెంచిన విడెమిదె
కూరాకువలె వాయ కోపపు నా చేతను" 7-213

**కెలయు:** అ.క్రి. విజృంభించు.

"రట్టుగ శ్రీవేంకటేశ ముట్టి యేల కెలసేవు
వెట్ట దీర నాపె నిన్ను వినుతించఁగాను" 23-128 & 17-234

**కొంగుల పసిడి:** ప.బం; వి. అవసరానికి పనికివచ్చేది.

**కొంటెత:** (కొంటె + త) కొంటెతనం కలది కావచ్చునని సంపా.

"చలపట్టిన గొంటెతఁ జక్కు నవ్వించకుంటేను
తలకొన్న నీ జాణతనమేమి వున్నది" 21-297

**కొండలుఁగోట్లును అగు:** ప.బం; అ.క్రి. మిక్కుటమగు.

"గోర గిరితే వలపు కొండలుఁగోట్లు నగును
నేరుతుమా నీ వంటి నేరుపులు" 14-31

**కొండవంటి చుట్టాలు:** వి; బహు. అవసరానికి ఆదుకునే బంధువులు.

**కొనవేయు:** అ.క్రి. చిగురించు.

"ఇక్కువ నున్నవారము ఇచ్చాఁడఁగలము గాక
గుక్కక పట్టి వేడుక కొనవేయఁగలమా" 23-411

**కోడెసేఁత:** వి. యౌవనపు చేష్ట, విటుని చేష్ట.

"మేడలోనఁ బవళించి మెత్తని పరపుమీఁద
కోడెసేఁతలు సేసేని గోవిందరాజు" 23-454

**కోలు:** వి. కొల్ల.

**గండిగడుచు:** అ.క్రి. కష్టం దాటుకొను.

"కమలాక్షుఁ డితఁడు కలుగఁగఁగదా దేవతలు
గమిగూడి రిందరును గండిగడచి" 1-116

**గంపమోపు:** గంపబరువు, మిక్కిలి బరువు.

**గచ్చువిచ్చగు:** అ.క్రి. చిందరవందర అగు, కలతచెందు.

**గరిడి:** వి. గరుడుడు.

"కమ్మటి బుసకొట్టేవు గరిడా నా జవ్వనము
దొమ్మిఁబట్టి తీసేవు ద్రోణమా జడ" 23-217

**గాదెఁబోసిన కొలుచు:** ప.బం; వి. వ్యర్థం.

"గాదెఁబోసిన కొలుచు సంసారము
వేదు విడువని కూడు వెడమాయ బదుకు" 1-328

**గాయకము:** విణ. గూఢము, మర్మము.

**గాళకుఁడు:** వి. ధీరుడు, ప్రౌఢుడు.

**గిలుపు:** స.క్రి. (కను) తిప్పు.

"కలికి ఆదివో కన్ను గిలిపీని
పొలుపు తామెరలచే పూజ చేసినట్లు" 17-159

**గుంగు:** విణ. పనికిరాని.

**గుండె మీది చింబోతు:** ప.బం; వి. ఇతరులకు హాని తలపెట్టి బాధించేవాడు.

"కుతిలపు టహంకారి గుండెమీఁది చింబోతు"

**గుంౘ్రలు:** వి; బహు. చెఱకు రాట్నపు కంబములు. (శ.ర.)

"రాట్నము నిలువక గుండ్రలు తా నిల్చునా"

**గుగ్గిలి:** వి. గుగ్గిలికి రూపాం. గుక్క. 5-57

**గుడిసేటి:** వి. దేవదాసి. (గుడి చేటీ జారిణి)

**గుడ్డికుక్క సంతకుఁ బోయినట్లు:** నానుడి; అన్నీ కష్టాలే అని భావం.

**గుల్ల్నసేయు:** స.క్రి. పొడి చేయు, నిరుత్సాహ పరచు, బాధించు.

**గుల్ల:** వి. గవ్వ.

**గువ్వకుత్తుకపడు:** ప.బం; అ.క్రి. నీరసించిపోవు.

**గోర గీరు:** స.క్రి. రెచ్చఁగొట్టు.

**గోరత:** వి. ఘోరతకు తద్భవం(?) ఘోరత్వము, భయంకరత్వము.

"వనితలిందరు నీవంటివారే కారా యేమి

కొనలకెక్కేది కడు గోర తని కాక" 21-393

**గోరాదిగొను:** (గోరు + ఆదిగొను) గోళ్ల కొలతలు తీసుకొను అని సంపా. 21-49

**గోవిందనాంచారి:** వి. లక్ష్మీదేవి, గోవిందుని భార్య.

"మేలు మేలు యిద్దరై మేకులకే సేవచేసి

గోలతనము మానితి గోవిందనాంచారి" 17-315

**చండిపడు:** అ.క్రి. (?)

"పలుమారు గొసరితే పచ్చిదేరు వలపులు

తలపట్టి మొక్కఁబోతే చండిపడును"

29 సం. 359 పు.

**చంద్రశాల:** వి. పైమేడ, వెన్నెల.

"దొంతి తామెరలు తోడుతనే చూపఁగా

సంతసంబున చంద్రశాలలో నిలిచె" 17-541

**చట్టుపము:** వి. గరిటె, పాత్ర. (చట్టపం అని త.)

"వాసినే సీలపుఁ జట్టుపములనే నించి నించి

ఆనించుకొని వడ్డించ నాయత్తపడీని" 17-316

**చన్నుగుడుచు:** ప.బం. పాలుదాగు.

"గుక్కక జంతులు చన్నుగుడుప నేరుపవద్దు

చక్కఁగా ననాదివాసనలే నేర్పిని" 2-144

**చలిమి:** వి. చలం.

"చలమిని బలమిని జలనిధి కన్యకనుఁ

గలసిన శ్రీవేంకటపతివి" 23-535

**చలువరాయఁడు:** వి. చంద్రుడు (?)

**చాగతగొను:** స.క్రి. అదుము.

**చాతను:** వి; త. గ్రామదేవత. 2-237

**చాళికుడు:** వి. నేపథ్యప్రసంగం చేసేవాడు.

"నవ్వుచుఁ జాళికుఁడు తనావారి మడిచిన పువ్వుఁలెట్టు

చాళికుడని ముడిచితి పొంది దొరవు"

**చింబోతు:** వి. మేకపోతు.

"కుటిలపు టహంకారి గుండెమీఁద చింబోతు"

**చిట్టంటు చెమటలు:** పలుచని చెమటలు. పీఠిక 25 సం.1.10-2-95

**చిత్తమెల్ల నీరగు:** ప.బం. అంతులేని దుఃఖం కలుగు.

"చిత్తమెల్లా నీరై చెలులలో దూరై

తత్తరించి కలసితి తక్కటినటే" 26-134

**చిన్నము:** విణ. కొంచెము, నాలుగు గురివిందగింజల ఎత్తు బంగారు నాణెము.

**చీకటి యేరై పారు:** ప.బం. చీకటి దట్టంగా వ్యాపించు.

"ఉక్కున జారు దురుము వొయ్యారానకింతే కాక

పక్కన చీకటి యేరై పారే యందుకా" 22-484

**చీకటిమేను:** వి. నల్లని శరీరం.

**చూడికుడుత నాంచారి:** వి. గోదాదేవి; ధరించి ఇచ్చిన అమ్మవారు.

**చెరకున పండు పండినట్లు:** లోకోక్తి; బంగారానికి తావి అబ్బినట్లు.

**చెఱకు పోఁకి వెదరు నమలినట్లు:** లోకోక్తి; వృథాప్రయాస, వ్యర్థం కావడం.

**చెవుల కాపురముండు:** ప.బం; అ.క్రి. పదే పదే చెప్పు, అదేపనిగా చెప్పు.

**చెవులెల్లాఁ జిల్లులగు:** ప.బం; అ.క్రి. విన శక్యం కాకుండు.

"చెప్పకువే వాని సుద్ది చెవు లెల్లాఁ జిల్లులయ్యీ

దప్పిదేరెఁజాలు చాలు తానె బదుకనీవె" 9-102

**చేపట్టుకొమ్మ:** ప.బం; వి. ఆధారం.

**చొక్కనాథఁడు:** వి. చొక్కనాథుఁడు.

"ఒప్పుగాఁగూడె నెలఁదలూరి చొక్కనాథఁడు"

10-2-20

**చొక్కనాథుఁడు:** వి. సుందరుడైన దేవుడు.

**చోఁపు:** వి. కలత.

**జంటమొనసూదిని రెంటము గుచ్చు:** లోకోక్తి; అసాధ్య మనడం. రెండుమొనలుగల సూదితో వస్త్రం కుట్టడం అసాధ్యమే కదా!

**జాతరదైవాలు:** వి; బహు. అల్పదైవాలు.

**జాళె:** వి. బొంగరానికి చుట్టే తాడు.

"బోరునఁదా జాళె లేక బొమ్మరాలు వేసెను"

23-127

**జిబ్బిటాయ:** వి. జిబ్బిడాయ గావచ్చు. గబ్బిలం.

"వొబ్బిడైన వేదమార్గ మొల్లని పుణ్యమంటేవు

జిబ్బిటాయ తపమేలె జీవుఁడ" 10-1-14

**జుంజు:** వి. వెంబ్రుకలు.

**జోఁటి:** వి. చెలి. (జోటి)

"ఏఁటికి నీ మనికితా అంతేసి నీకు

జోఁటికి నీ వజ్రాంగి జోడఁవై వుండరాదా"

17-105

**డిమికీలు:** వి. (?)

"కాంత వెట్టిన కొప్పు గండుదుమ్మిదల కొప్పు

చెంత నెన్న డిమికీలు సింగము బోలు" 23-95

**తన వేలే తన కన్ను తాకు:** లోకోక్తి; తన నడవడియే తనకు కీడు కలిగించు.

"తన వేలే తన కన్ను దాఁకినను తానెవ్వనిఁ గోపించీని

తన కర్మమే తన్నుఁ జేయఁగ దైవము దూరఁగ"

21-151

**తలఁజుట్టు:** ప.బం; స.క్రి. బలవంతంగా అంటగట్టు.

**తలమొల వీడు:** ప.బం; అ.క్రి. భయం మొ॥ వాటిచే తలగుడ్డ, కట్టుబట్ట విడిపోవు.

**తవ్వక కన్న ధనము:** ప.బం; వి. అప్రయత్నంగా లభించేది.

**తామరకంటె తంపర:** మిక్కిలి ఎక్కువ.

"తంపి నీ చుట్టరికము తామరకంటె తంపర"

15-89

**తిరుదండెలు:** వి; బహు. మంగళకరమైన దైవ వాహనపు పొడుగాటి కఱ్ఱలు.

"తిరుదండెలపై నేగీ దేవదేవుఁడిదె తొలునాడు

సిరుల రెండవనాఁడు శేషునిమీఁద"

**తిరుపళచ్చి:** వి. కోయంబత్తూరు సమీపంలో గల గ్రామం (?)

**తిరుపళచ్చి విష్ణుఁడు:** వి. తిరుపళచ్చి గ్రామంలో వెలసిన విష్ణుమూర్తి.

**తిరువీసము:** వి. స్వామివారి ఆరగింపునకై చేసిన పలుచని క్షీరాన్నం, కణ్ణముదు.

**తిల్ల:** వి. తమిళనాడులోని చిదంబరక్షేత్రం.

13-334

**తీదీపు:** వి. 1. రాాపు, ఒరపిడి 2. తీవ్రబాధ.

**తీయమగు:** అ.క్రి. సంఘీభవించు, ఏకమగు.

**తీరు:** స.క్రి. తీర్చు.

"జగడాలు దీరుమని సారె సారె మిమ్ము నంపె"

18-33

**తేలించు:** స.క్రి. జయించు.

"తెలిసితిమింక నెంత తేలించేవే

కలికివి పతినెంత కారించేవే" 19-190

**తొబుక:** వి. పండ్ల చర్మం, కాయలపై తోలు. చూ: తొబుక కవిత్వాలు.

**తొల:** వి. తొన.

"పొలఁతి నీ మోవిపండు పుల్లనో తీపో వోరి

తొలరా నీకేలందుతోడి చింత" 17-75

**తోటి:** 'తోడ' అనే అర్థంలో ప్రయోగింపబడే రూపం.

"గుట్టుతో డలమేల్మంగ గుబ్బలేల పిసికేవు"

29-176

**తోడుఁబోతు:** వి. 1. మంత్రాల ద్వారా ఎదుటి వాళ్లకు కీడు చేయు. 2. క్షుద్రోపాసనతో పంపు చేసి మనుష్యులను చంపేవాడు.

**దరిశనము:** వి. రాజాదుల దర్శనార్థం ఇచ్చే కానుక.

**దర్సెనము:** వి. కానుక.

**దలాటు:** అవ్య. అకస్మాత్తు.

**దార:** వి. విధం, క్రమం, రీతి.

"బీరాన నాపె మోవిఁబెదవి నంటించఁబోతే
దార తప్పకుండ తన తమ్ములానఁగప్పె" 17-176

**దారకత్తి:** వి. పదునైన కత్తి.

**దావంతము:** వి. 1. ఆత్రం 2. దుఃఖం.

**దీవిసంకు ముత్యమగు:** ప.బం; అ.క్రి. (?)

"పూవు గట్టిన జవ్వాది పూసితే వాసన వోదు
దీవిసంకు ముత్యమైతే తెలిసీఁగాని" 16-293

**దుత్త:** వి. పాలకుండ. (ఆం.భా.)

**దొడ్డి కట్టు:** వి. చుట్టు కొలారం, నడుమ బయలు, చుట్టును కట్టడములును గల యిల్లు అని నిఘంటువు. 21-87

**దొడ్డికట్టుది:** (దొడ్డికట్టు + అది) వి. దొడ్డిలో కట్టివేయు నట్టిది అని సంపా. (21-87)

"దొంతిఁబెట్టేవు ప్రియము దొడ్డికట్టుదాననా"
21-87

**దొమ్మిసరసము:** వి. ప్రేయసీప్రియుల్లో పరస్పరం ప్రేమ లేనపుడు చేసే సరసం.

"దొమ్మి సరసాలాడితే దొరతనాలు సెల్లునా
వుమ్మడినే సక్కనాయ నుండవయ్య
నాయఁడా" 23-128

**దోమటి నవ్వులు:** వి. కపటపు నవ్వులు.

**దోమటి సంసారి:** వి. కపటపు సంసారి.

**ధర్మాంగదుఁడు:** వి. రుక్మాంగదుని పుత్రుడు. చూ: రుక్మాంగదుడు. 2-85

**నందలూరు:** వి. చెళ్లపిళ్లస్వామి నెలకొన్న క్షేత్రగ్రామం.

**నట్టు:** వి. మాంద్యం, జాగు, ఆటంకం.

**నడుకొత్తు:** అ.క్రి. నిర్భయంగా ఉండు.

"యెడయక శ్రీవేంకటేశ యీకెఁ గూడితివి
నడుకొత్తి నిచ్చకల్యాణమువలె నున్నది" 7-464

**నరకఁడు:** వి. మోటువాడు, మొద్దు.

**నల్లితిండి:** చిరుతిండి. 1-189

**నాచుఁబాము:** వి. పసిరికపాము.

**నాగము పేరిటి నాతి:** వి. గజలక్ష్మి (?)

**నాగేటి గీత:** వి. తప్పనిది.

"బాఁతిలేని దారవోఁత పాపము చూడని చేఁత
నాఁతిమీఁది తలవోఁత నాగేటి గీఁత" 12-275

**నాచ్చారి:** వి. అమ్మవారు.

"మాయి మాయి యలమేలుమంగ నాచ్చారి
మతిఁ
బాయని వేంకటపతి పట్టపురాణి" 6-47

**నామెక్కు:** అ.క్రి. లేత జొన్నపైరు, ఆముదపుపైరు గొడ్డుగోద మేస్తే విషమై పశువులు మరణిస్తాయి. దాన్నే నామెక్కి చచ్చిందని అంటారు. విషమెక్కు.

"వలపనే నామెక్కి వనిత యేమైన గదా
బలి నధరామృతాన బతికెఁగాక" 26-173

**నాలికఁదగులు:** ప.బం; అ.క్రి.బయటకు వచ్చు.

**నాలికె తుదలనె నాను:** ప.బం; అ.క్రి. ఎప్పుడూ గుర్తుండి పోవు.

"నాలికె తుదలనె నానెఁ జుట్టరికము
మేలిమి సరసముల మించె మోముకళలు"
21-224

**నాలిమాటలు:** వి; బహు. అల్పపు మాటలు.

"గాలములై నీ చిత్తము కడుఁదగిలె
ఆలరి నాములై నీకు నమ్మనట్టెను" 13-143

**నిక్కల:** వి. నిక్కమైన కల.

"నిక్కల గంటిని నిను నా పాదము
తక్కక యేఁటికో తాఁకెనని" 17-64

**నిప్పు దెచ్చి వొడిలోనఁ బెట్టుకొను:** ప.బం; అ.క్రి. ఆపదలు తెచ్చుకొను.

**నిప్పు తేరై పారు:** ప.బం. ఎక్కువ నాశనమగు.

"గోరపువెన్నెల వెల్లిగొని మీదమీదై నిప్పు
తేరై పారఁగఁజొచ్చె నెందు చొత్తమే" 4-16

**నిప్పువంటిది:** వి. పవిత్రమైనది.

"దెప్పరమాతఁడు నీచే దిట్టించుకొనుఁ గాక
నిప్పువంటిదాన నేను నీచేతఁ బడేనా" 17-194

**నిరుధానకు :** నిరోధ, నిరుద్ధ శబ్దాలకు వ్యావహారికరూపం కావచ్చు. అడ్డగింపు, అవధి, పర్యంతము అని అర్థం. కడపటి దినమని తాత్పర్యం.

"అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు తిరువేంగళనాథుని మీఁదను అంకితము గాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపము చేసిన శృంగార కీర్తనలు" (అన్నమాచార్యుల శృంగార కీర్తనల ప్రారంభ గద్యం)

**నీటికొద్ది తామెర :** పిండికొద్ది రొట్టె అన్నట్లు.
13-256, 14-200 & 18-423

**నీరువంక తుంగ :** వ.బం; వి. గెలుపువారి పక్షం వహించే వ్యక్తి.

**నురిపే కళ్లమగు :** వ.బం; అ.క్రి. అస్తవ్యస్తమగు. ధాన్యాన్ని నురిపే కళ్లం గడ్డి మొ॥ వాటితో అస్తవ్యస్తంగా ఉంటుంది.

"యిక్కువ శ్రీవేంకటేశ యెనసి యిద్దరివల్లా
అక్కర నురిపే కళ్లమాయను నీ వురము"
23-164

**నూట యిరువై యెనిమిది తిరుపతులు :**
1. నిచుళము (ఉరైయూర్) 2. తంచాపురము (తంజమామణిక్కోయిల్) 3. శ్రీముష్ణపురము (?) 4. ప్రేమాలయము (అన్బిల్)
5. కదంబపురము (తిరుక్కరంబనూర్)
6. విశదాద్రి (తిరువెళ్లరై) 7. శ్రీ పక్షిభూతపురి (తురుపుళ్లం బూదంగుడి) 8. పలాశవన గుహాపురము (తిరుప్పేర్నగర్) 9. ఆరునూరు (తిరుఅదనూర్) 10. రథమగ్నపట్టణము (తిరువళుందూర్) 11. వ్యాఘ్రపురి (శిరుపులియూర్) 12. శ్రీసారభూపురి (తిరుచ్చేఱై) 13. మస్తక శంఖపురి (తిరుతలైచ్చంగనాణ్మదియమ్)
14. కుంభఘోణమ్ (తిరుక్కుడందై)
15. ఖండనగరము (తిరుక్కండియూర్)
16. అంతరిక్షాఖ్యపురి (తిరువిణ్ణగర్)
17. శ్రీకృష్ణపురము (తిరుక్కణ్ణపురం)
18. పరింభపురము (తిరువాలి)
19. నాగపురము (తిరునాగై)
20. గంధపట్టణము (తిరునరయూర్)
21. నందిపురాంబర నగరము (నందిపురవిణ్ణగరం) 22. ఇందుపురము (తిరువిందళూర్) 23. తిల్లవన చిత్రకూటము (తిరుచిత్రకూటం) 24. శ్రీరామాబ్రపురి (శీర్గాళి)
25. సంగమపురి (కూడలూర్) 26. కృష్ణపురి (తిరుక్కణ్ణంగుడి) 27. శ్రీపార్థసఖి మహిషీపట్టణము (తిరుక్కణ్ణమంగై)
28. కపిస్థల పట్టణము (కపిస్థలం)
29. రౌప్యపట్టణము (తిరువెళ్లియంగుడి)
30. శ్రీనాగపురము (తిరువాంగూర్)
31. మణిధామ పురము (మణిమాడక్కోయిల్)
32. ప్రసవ సాయక పుంఖపట్టణము (తిరుతెత్తియంబలం) 33. పురుషోత్తమ నగరీ (వణ్పురుషోత్తమం) 34. హైమధామ పురము (శెంబోన్‌శెయ్‌కోయిల్) 35. శ్రీసక్తసభాపురీ (తిరుత్తేవనార్ తొగై) 36. అనవాప్యగగనపురము (అరిమేయవిణ్ణగరం) 37. వైకుంఠపుష్కరము (వైకుంఠ విణ్ణగరం) 38. ధవళపుష్కరిణి (తిరువెళ్లక్కుళం) 39. వనాద్రి (తిరుమాలిరుంజోలై) 40. శ్రీగోష్ఠీపురము (తిరుక్కోట్టి యూర్) 41. సత్యపట్టణము (తురుమెయ్యం) 42. దర్భశయనము (తిరుప్పుల్లాణి) 43. శీతకాసారము (తురుత్తణ్గాల్) 44. మోహనపట్టణము (తిరుమోగూర్) 45. మధురాపురము (తిరుక్కూడల్) 46. శ్రీవిల్లిపుత్తూరు (శ్రీవిల్లిపుత్తూర్) 47. కురుక (తిరుక్కురుగూర్)
48. తిరుత్తులవెల్లి మంగళపురి (తిరుత్తొలవెల్లి మంగలం) 49. దక్షిణాపురి (తెన్ తిరుప్పేరై)
50. వైకుంఠపురి (శ్రీవైకుంఠం) 51. దక్షిణ కుళిందపురి (తిరుక్కుడందై) 52.వారాంగనాపురి (శ్రీవరమంగై) 53. చించాపురి (తిరుప్పులింగుడి) 54. గుణవతి (తిరువరగుణమంగై) 55. సూచకపురి (తిరుక్కోళూర్) 56. వామనపురి (తిరుక్కురుంగుడి) 57. అనంతపురము

(తిరువనంతపురము) 58. తిరువణ్పరిశారపురము (తిరువణోపరిశారం) 59. దక్షిణ మరుత్తటపురి (తిరుక్కాట్కరై) 60. శ్రీమూళిధామ పురి (తిరుమాళిక్కళం) 61. శార్దూలపురి (తిరుప్పలియూర్) 62. నౌపురస్థలి (తిరునావాయ్) 63. శ్రీవల్లనాళపురము (తిరువల్లవాయ్) 64. శ్రీసారభృంగపురి (తిరువణ్ వండూర్) 65. నిద్రాణపట్టణేశ్వరుడు (?) 66. పరుష్టిహేశ్వరనగరము (తిరువాట్టూరు) 67. విద్వద్రథ నగరము (తిరువత్తువక్కోడు)68. శ్రీకటిస్థాన పురి (తిరుక్కడిత్తానమ్) 69. సద్వృష్టిమత్పురము (తిరువారన్ విళై) 70. ఐంద్రనగరము (తిరువైంద్రపురం) 71. గోపపురము (తిరుక్కోవలూర్) 72. కాంచి (తిరుకాంచీపురము) 73. యథోక్తకారి (తిరువెణికా) 74. పరవేలశ్వరవిణ్ణగరము (పరమేశ్వరవిణ్ణగరం) 75. పాటకేశము (తిరుపాడగమ్) 76. శిశిరోపవనపురి (తిరుత్తణ్కా) 77. కామపురము (తిరువేళిక్కై) 78. జ్యోత్స్నేందుఖండపురము (నిలాత్తింగళ్తుండం) 79. నీరధిపురి (తిరునీరగం) 80. వర్షాకాశపతి (తిరుకార్వానం) 81. ఊరకము (తిరుఊరగం) 82. అష్టభుజకరము (అష్టభుజం) 83. తిరునిన్నయూరు (తిరునిన్షవూర్) 84. శ్రీపక్షికుండము (తిరుప్పుట్కుళి) 85. తోయమహీంద్రము (తిరునిర్మలై) 86. శ్రీమత్స్థలము (తిరువిడవెంద్రై) 87. సాగరమల్లము (తిరుక్కడల్మల్లై) 88. ఘటీకాచలము (తిరుఘటీకై) 89. వేంకటాద్రి (తిరువేంగడం) 90. లతికాహ్రదము (తిరువెవ్వళూర్) 91. సాలగ్రామము (సాలగ్రామం) 92. నైమిశము (నైమిశారణ్యాం) 93. ఖండపురి (కుండ మెన్నుమ్ కకడినగర్) 94. బదరికాశ్రమము (బదరికాశ్రమమ్) 95. గరుడాద్రి (శింగవేళ్కున్రం) 96. కేరళపురి (?) 97. శ్రీపతిపురము (తిరుప్పిరిది) 98. అయోధ్య (తిరువయోధ్యై) 99. మధుర (వడమధురై) 100. వ్రేపల్లె (తిరువాయ్ప్పాడి) 101. ద్వారక (ద్వారకై) 102. కలశాబ్ధి (తిరుప్పార్కడల్) 103. వైకుంఠం (పరమపదం) 104. శ్రీరంగధామము (తిరువరంగం) ఇవి చిన్నన్న పరమయోగి విలాసంలో చెప్పిన 104 దివ్యతిరుపతులు. వీటిలో రెండు పునరుక్తులను, రెండు నూతన క్షేత్రాలను (శ్రీముష్ణం, కేరళపురి) తొలగిస్తే చిన్నన్న చెప్పని దివ్యదేశాలివి. 1. తిరుమణిక్కూడమ్ 2. పార్తన్పల్లి 3. తిరుక్కావళంబాడి 4. తిరుచ్చెంగున్నూర్ 5. తిరుకారగం 6. తిరుక్కళ్వనూర్ 7. పవళవణ్ణమ్ 8. తిరువల్లిక్కేణి ఈ విధంగా దివ్యతిరుపతులు (దివ్య దేశాలు) 108 మాత్రమే ప్రసిద్ధం. అన్నమయ్య నూట యిరవై అని పేర్కొన్నాడు. బహుశః ఆంధ్రదేశంలోని భద్రాచలం, సింహాచలం మొ॥ కొన్ని వైష్ణవక్షేత్రాలను వీటిలో చేర్చి ఉండవచ్చు.

"తగ నూట యిరువై యెనిమిది తిరుపతులఁ గల

స్థానికులును చక్రవర్తి పీఠకములును" 1-227

**నూనెకుంచము వలె నుండు :** ప.బం; అ.క్రి. చేతికి అందకుండా ఉండు, జారిపోవు.

"అన్నియు వింటానే అట్టే వాసన గొంటానే

వన్నెల నూనెకుంచమువలె నున్నాఁడు" 2-232

**నూవుగింజ నానదు :** ప.బం; క్రి.ప. రహస్యం దాగదు.

"ఏవంక చూచిన వీరి యెమ్మెలే వెగ్గళమాయ

నూవు గింజ నానదిదె నోటిలో నీ సుద్దులు"

27-19

**నెత్తురు పొత్తు :** వి. 'రక్తసంబంధం' అనడానికి తెలుగు పదం.

**నెరవు :** వి. హెచ్చు.

**నెఱతనీఁడు :** వి. (నెఱతనము + ఈఁడు) జాణతనం కలవాఁడు.

**నెఱిగురి :** వి. న్యాయదృష్టి.

**నేటి :** వి. నిశ్చయం.

"నేటినే తెలుసునో నీ చందము మాకు

నాటివారు గానరైరి నవ్వుల నీ చందము"
17-441

**నేలపొద్దులు:** వి; బహు. దేశకాలాలు.

**నొడికారితనము:** వి. మాటచమత్కారం.

**నోముఫలమిచ్చు:** ప.బం; అ.క్రి. ఒకటీ రెండు పొరపాట్లు జరిగినా చేసిన మంచిపనికి ఎప్పుడూ ఫలం ఉండు.

**పంగెము:** వి. స్పర్ధ.

**పంచలఁదోయు:** స.క్రి. పారదోలు, పాడుచేయు.

**పంటి:** వి. కన్నులు కన్నులుగా తాడుతో అల్లిన ఉట్టి.

**పంతగారిది:** (పంతము + గారి + అది) వి. పంతకత్తె, పట్టుదల గల స్త్రీ.

**పగిడి:** వి. పరిహాసం, వెక్కిరింపు.
"తెగువ నీ వలె నాకు దేవరియ్యఁడాయఁగాక
పగిడివెట్టి నవ్వితే బదరవా నీవు" 14-245

**పచ్చిమాటలు:** వి; బహు. తిట్లు.
"పచ్చిమాటలాడేవు బయకాఁడా
గచ్చులు సేతురా నీవు కాతరీఁడా" 26-420

**పట్టిన చేతి బంగారము:** వి. పట్టినదెల్లా బంగారము.
"నెట్టనఁదలఁచేవారి నిండు నిధానమవు
పట్టిన చేతి బంగారమవు" 9-219

**పతికి పతి:** ప్రతికి ప్రతి.
"కొనచూపులో కొసరు గొణఁగులో నసురుసురు
మునుపనే పతికి పతి ముంచెఁగదె అతఁడు"
19-453

**పదరుఁడనము:** వి. కోపం, తొందరపాటు.

**పన్నారులు:** వి; బహు. చిన్నపాత్రలు.
"కతలుగా పన్నారు కాఁగులలో బియ్యాలు
సతులపై సేసలు చల్లీ వాఁడె" 14-456

**పరదు:** వి. పద్దు, లెక్క.

**పరిసిపోవు:** అ.క్రి. నశించు.

**పలుకుల పర్వతాలు:** వి; బహు. వేదాలనే పర్వతాలు.
"పలుకుల పర్వతాలె బండికండ్లైన తేరు
నలుదిక్కులంచుల వున్నతపుఁదేరు" 2-366

**పళి:** వి. త. నింద.

**పాఁతుమాకు:** వి. పాతబడిన చెట్టు.

**పాటిగంప:** వి. ధాన్యం నింపడానికి ఉపయోగించే గంప. 15-247

**పానుపట్టు:** అ.క్రి. ప్రయత్నించు.

**పాయఁదట్టు:** స.క్రి. తొలగించు.

**పాలకుండమల:** వి. తిరుపతికొండ.
(తె.వ్యు.కో.) 11-30

**పాలకొండమల:** వి. పాలగిరికొండ. కడపజిల్లా మండల కేంద్రమైన వీరపనాయని పల్లెలోని గ్రామం పాలగిరి. ఇదియే పాలకొండ. ఇట చెన్నకేశవుడు వెలసి యున్నాడు.
"మందల పాలకొండమలకు నట్టనడుమ
విందగు దాసులతోడ విహరించీ దేవుఁడు"
4-375

**పాలగిరిరాయఁడు:** వి. పాలగిరి (పాలకొండ)లో వెలసిన చెన్నకేశవుడు. చూ: పాలకొండమల.
"కంటిరా నీ గుణమెల్ల కడగడనే
పంట మోపితేనే పాలగిరిరాయఁడా"

**పాళగాఁడు:** వి. 'పాళెగాఁడు'కు రూపాం. ప్రభువు, సేనాని.
"అట్టి శ్రీవేంకటనాథుఁ డమరులనెల్లనుఁ జే
పట్టి దైత్యులఁ జంపించే పాళగాఁడు" 10-1-22

**పిచ్చె:** వి. ముక్క.
"చెలరేగి యాపె మోవి చెఱకుపిచ్చె యందాను
చలువగా వేడుకతోఁ జవిగొనేవు" 22-191

**పిడువరించు:** అ.క్రి. అతిశయించు, పిడుగువలె ఘోషింప జేయు.

**పిరువీకు.** వి. బాధ, కష్టం.

**పుండెరువ మందు నేరుచు:** ప.బం.బాధపై బాధ కలుగు. (పుండే బాధిస్తుండగా దాని బాధను తొలగించుకోవడానికై పెట్టిన మందుకూడా బాధించడమని వాచ్యార్థం.)

**పుల్లవెలుగులోని బోనపు తరివాఁడు:** వి. విష్ణుమూర్తి. పుల్లవెలుగు = అగ్ని;

పుల్లవెలుగులోని (అగ్నిలోని) బోనం అంటే అమృతం; అమృతం చుట్టూ అగ్ని ఉంటుంది. కనుక ఆ అమృతంలోని తరి అంటే ఆ అమృతాన్ని చిలకడమని అర్థం. అట్టి చిలకడం కలవాడు అంటే విష్ణుమూర్తి. అమృతాన్ని మందరం చిలికేప్పుడు అది జారి సముద్రంలో దిగబడుతుంది. అప్పుడు విష్ణువు కూర్మ రూపంలో దానికి ఆధారంగా నిలిచినాడని భారతకథ.

"పుల్లవెలుగులోని బోనపు తరివాఁడు
తెల్లని మెఱుఁగుల తెరలఁదేలెటివాఁడు" 24-13

**పూచుక మాట్లాడు**: ప.బం; అ.క్రి; రా.సీ.మాం. తనదికాని దాన్ని నెత్తిన వేసుకొని మాట్లాడు.

"పోటి చెలికత్తె గాన పూచుకనే మాటాడితి
ఆటది గోలయైతే నట్టే వొత్తుదురా" 16-554

**పూవకపూచు**: అ.క్రి. అపురూపంగా పూయు.

**పెంజ**: విశ. తేలికైన, తుచ్ఛమైన.

**పెంట**: వి. ఆవు.

"పెంట పెరుగుల దొంగ పెండ్లికొడుకు భూమి"
12-185

**పెంటపెట్టుకొను**: అ.క్రి. తగవుపెట్టుకొను.

**పెట్టులు**: మరల.

"ఒరసి తనుఁదానే వచ్చినది వొల్లనాఁ
బెట్టులురా" 17-71

**పెల్లు**: వి. పెరడు.

**పేరఁబెట్టు**: స.క్రి. తోడువేయు.

**పేరించు**: స.క్రి. తోడువేయు. 12-355

**పేరుమాల్చు**: స.క్రి. నశింపజేయు. 6-156

**పైరువిత్తగా గాదము మొలచినట్లు**: ప్రయత్నంలో ఆటంకాలు కలగడం.

"గక్కనఁ బైరు విత్తఁగా గాదము మొలచినట్టు
చిక్కిన కర్మములెల్లాఁ జలఁగేఁగాక" 2-170

**పొర**: వి. కపటం. (సంపా. 17సం. పీఠిక, 7పు.)

**పొరుగుపోరచి**: వి. పొరుగువారి ఈర్ష్య. ('పోరాసి' అనేపదం ఈర్ష్య అనే అర్థంలో కడపజిల్లాలో మాండలికంగా ఉందని ఆచార్య పి. నరసింహారెడ్డి తెలిపినారు.)

**పోంచి**: వి. మణికట్టు పైభాగం.

"వాఁడి బిల్ల కత్తి వలచేతఁ బరిజించి
పోఁడిమి బాలడ సంకుపోఁచి నాడించి" 17-230

**పౌండ్రకవాసుదేవుఁడు**: వి. కరూశదేశానికి అధిపతి. శ్రీకృష్ణుడు కైలాసానికి వెళ్లినపుడు ఈతడు ద్వారకకు వెళ్లి లోకంలో ఇద్దరు వాసుదేవులుంటారా? ఒక గొల్లవాడు నా పేరు పెట్టుకుంటాడా? నాకు కూడా గద, సుదర్శనం ఉన్నాయి. నిజమైన వాసుదేవుణ్ణి నేనే. అని అందరికీ చెపుతూ శ్రీకృష్ణుణ్ణి దూషిస్తూ ఉంటాడు. ఆ మాటలు సాత్యకి విని ఇతనితో యుద్ధం చేసి ఇతణ్ణి ద్వారకనుండి వెళ్లగొడతాడు. అప్పుడు పౌండ్రకవాసుదేవుడు కాశిరాజు దగ్గరికి పోయి అతని సాహాయ్యాన్ని పొంది శ్రీకృష్ణుని వద్దకు వాసుదేవుడనే పేరును తీసివేసు కొమ్మని చెప్పడానికి ఒక దూతను పంపిస్తాడు. శ్రీకృష్ణుడు వీరిని యుద్ధానికి రండని పిలుస్తాడు. పౌండ్రకవాసుదేవుడూ, కాశిరాజూ యుద్ధానికి పోగా శ్రీకృష్ణుడు వీళ్లను యుద్ధంలో సంహరిస్తాడు. (మహాభారతం)

**ప్రాచీనవిత్తు**: వి. కుజనుడు.

**ప్రోచిళ్లు**: వి; బహు. శకునాన్ని చూడడం కోసం ఇరుగు పొరుగిండ్ల మీద చల్లే అక్షతలు.

**బంటుబంటగు**: అ.క్రి. లోబడు, సక్తమగు.

**బండయి తిరుగు**: ప.బం. నిష్ప్రయోజనంగా తిరుగు.

**బంతిపురాణము**: వి. గుంపుగా వినే పురాణం.

**బగ్గడితనము**: వి. మోటుతనము.

"బగ్గడితనా నంత పదరి పలుకకువే" 29-296

**బగ్గడింపు**: వి; బహు. కోటమీది నుండి శత్రువులపై దొర్లించే రాతిబండ మొ॥

**బడిదప్పు**: అ.క్రి. దారితప్పు.

**బద్దు**: వి. భద్రశబ్ద వికృతిరూపం కావచ్చు. క్షేమము, మంగళము.

"బద్దుల శ్రీవేంకటేశ పాడి నీ వెఱఁగవా" 29-448

**బారగించు:** అ.క్రి. 'బారకించు'కు రూపాంతరమా! బరువెక్కు.
"పారి పారి మెచ్చకుమీ బారగించీ పులకలు
కోరికె లేమి గల్లాను గుక్కుకొందు గాని"
17-292

**బారడు:** 'బారెడు'కు శుద్ధవ్యావహారికరూపం.
"తాలిములు మూరెడేసి తలఁపులు బారఁడేసి
గాలిగంటు వేసేవే కమ్మటి నీవు" 29-430

**బిందువు:** వి. దంతక్షతవిశేషం. (సంపా. 17సం. పీఠిక, 8పు.)
"యిప్పుడిట్టె శ్రీవేంకటేశుఁడ నన్నుఁగూడి
పిప్పిగా నా మోవి గడు బిందువుచ్చేవు"
17-420

**బులుపు:** పులుపు. 15-216

**బూడిదలో వసంతము:** వ.బం; వి. వ్యర్థం.

**బెంబాడి:** విణ. వ్యర్థం.

**బేసిసరి మాటలు:** వి; బహు. ఒకటికి రెట్టింపు పలికి వాదులాడే మాటలు.

**బొమ్మిరెడ్డిచెర్ల:** వి. నృసింహస్వామి నెలకొన్న క్షేత్రగ్రామం.

**బొల్లిమోరగద్ద:** వి. గరుడపక్షి.
"గొల్ల నందగోపుఁగారి కొడుకు నేఁడు మనము
బొల్లిమోరగద్ద నెక్కి పోవువాఁడటే"

**బ్రహ్మపట్టము:** వి. మిక్కిలి గొప్ప పదవి.

**బ్రాఁతిపడు:** అ.క్రి. ఇష్టపడు, ప్రియపడు.

**భ్రమించి:** స.క్రి. భ్రమింపజేసి.
"ముచ్చటలే యాడి యాడి మొదలనను
భ్రమించి" 18-24

**మందదీఁడు:** వి. గొల్లవాడు.

**మతించు:** స.క్రి. అంచనావేయు, వెలకట్టు, నిర్ణయించు అని తె.వ్యు.కో.

**మద్దెలలోని ఎలుక:** వ.బం; వి. చిక్కులలో పడినవాడు.

**మనుపీనుగ:** వి. 'జీవచ్ఛవం' అనడానికి తెలుగుపదం.

**మాటపలుకు:** వ.బం. స్పృహ కోల్పోయిన వారిని కానీ, మరణావస్థలో ఉన్నవారిని కానీ చూసి మాటపలుకు లేదనడం వాడుక అని అ.సం.సా.రా.మాం. (పుట 57)
"పక్కన మాతో మాటపలుకు లాడేవు గాని
ఎక్కడో పరాకు నీకు ని దెఱఁగనా" 26-11

**మాటపలుకు:** వి; మాం. పెండ్లి నిశ్చయం. నెల్లూరు మాండలికంలో పెండ్లి నిర్ణయం చేసుకొను అనే అర్థంలో మాటపలుకు చేసుకొను అనే వ్యవహారం ఉంది.

**మాణిక్యాలు:** వి; బహు. శుభకార్యాల్లో వెలిగించే కుందులు. వీటిలో వత్తులు, నూనె వేసి వెలిగించి హారతి ఇస్తారు.
".......... నిలువు మాణిక్యాల నీరాజనం"

**మానావతి:** వి. ముగ్ధ, గయ్యాళికి వ్యతిరేకపదం. (తె.వ్యు.కో.)

**ముత్తర:** వి. విన్నాణము.

**ముద్దుచేయు:** స.క్రి. గారాబం చేయు, ముచ్చటపడు.

**ముయికి ముయి:** సరికి సరి, వంతుకు వంతు.

**ముయ్యేడు వారు:** వి; బహు. ప్రౌఢలు, యువతులు.
"కోరినట్టె వున్నవారు కొమ్మలు
ముయ్యేడువారు
గారవపు గొల్లజాతి కలిగెఁగా నీ కిందుకే"
21-108

**మెంగ:** ముగ్ధ.

**మేకునఁబెట్టు:** స.క్రి. బాధించు.

**మేడికాయబోనము:** వి. మోసం, దగా, కుళ్లు, కుట్ర.

**మేలగాఁడు:** వి. (మేలము + కాఁడు) పరిహాసము కల వాడు.
"నిక్కి నిక్కి చూపుల నేస్తకాఁడ
మిక్కుటపుఁ బ్రియముల మేలగాఁడ" 29-23

**మేలు:** వి. ప్రియుడు, ప్రియురాలు.
"ఆతనికి నీవు మేలు ఆతఁడు నీకు మేలు"
29-499

మేలురాక: వి. 'స్వాగతం' అనడానికి తెలుగుపదం, శుభాగమనం.

మొగచాటు: వి. వెగటు. 13-41

మొగులు నమ్మి దొనల నీరు వెళ్లడియు: లోకోక్తి; మేఘాన్ని నమ్మి దగ్గరున్న నీరు వృథాచేయు.

మొయిలు లేని వాన: హఠాత్తుగా వచ్చే వాన.

మోటు: వి. గోడచివర, చివరిఅంచు.

"ఏఁటికి దగ్గరేవయ్యా యిదేమి నీవు
మోఁటున నుందానఁ" 8-194

మోడామోడి: వి. మూఢామూఢ శబ్దభవం కావచ్చునని, బయట పడీపడని అని అర్థమని సంపా. (21 సం. 239 పు.)

యంపిలిచెట్టు: వి. ఎంపిలిచెట్టు, వెంపలిచెట్టు, దేనికీ పనికిరాని పిచ్చిచెట్టు.

"సొనిగి యంపిలిచెట్టు పూచెనేమి కాచెనేమి ?"
9-66

రంటదప్పురపువేళ: వి. కలయికవేళ (తె.వ్యు.కో.)

ర(అ)ట్టు: వి. అల్లరి, రచ్చ.

రచనలు: వి; బహు. అతిశయాలు.

రవ్వతనము: వి. కొద్దిపాటితనము.

రాతికి గిలిగింత: ప.బం; వి. అసాధ్యం.

రుక్మాంగదుఁడు: వి. ఇతడు ఏకాదశీవ్రతాచార పరాయణుడు. ఇతని వ్రతభంగం చేయడానికై దేవతలు మోహిని అనే సుందరాంగిని పంపగా ఇతడామె వలలో చిక్కుకొని పోతాడు. ఐనా ఏకాదశినాడు వ్రతాన్ని చేయగోరుతాడు. తనను వదలి వెళ్లవద్దని మోహిని పట్టుపట్టింది. ఆమె కోరినట్లు తన కుమారునైనా చంపి ఆమెకివ్వడానికి ఒప్పుకుంటాడు. కాని వ్రతం మానడానికి ఇష్టపడడు. మోహిని అతని పుత్రుని ఖండింపు మని అడుగుతుంది. రుక్మాంగదుడు తన పుత్రుని చంపడానికి ఖడ్గమెత్తగా బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమై అతని వ్రతనిష్ఠను పరీక్షింపదలచి అట్లా చేసినామని చెపుతారు.

"సిరుల రుక్మాంగదు చేతి కత్తిధారఁ దొల్లి
వరుస ధర్మాంగదుపై వనమాలాయ" 2-85

రెమ్ము: స.క్రి. దూయు.

"రేఁగులెక్కి పూఁపలెల్లా రెమ్మి
మాఁగవేయఁజొచ్చె" 17-336

ఱాతిగని: వి. కఠినుడు.

"ఇదివో నీ పెద్దరికమెంతని విన్నవించేము
కదిసి కదిసి ఱాతిగని వైతివి" 21-275

ఱాలు దింటా మలిగండ్లేరు: చూ: రాలు దింటా మలిగండ్లను. 4-135

లోఁతుకొలఁదే పాఁతు: నానుడి; లోతును బట్టే వైశాల్యం.

"లోఁతు కొలఁదే పాఁతు లోన నేల జంకించేవు
చేత నీవు సేసినంతే చేరి మా పొందు" 16-256

లోకమువారు: వి; బహు. లోకులు.

వంకర కొంకర: వంకరటింకర.

"పొంకముగాని వానికి బుద్ధులెన్ని నేరిపినా
వంకర కొంకరే కాని వశము గాఁడు"

వండ: వి. స్వైరిణి (?)

"వండ వండనట్లుగా వారిఁజూచి నవ్వేవు
యెండలెల్లా నీడ లాయ నింకనేటి యాసలు"
17-17

వయ్యము: వి. శుష్కము, వట్టిది.

"తియ్యపుఁజేతలఁ దెవ్విన చోటు
వయ్యమై హృదయము వాడీనె"

వరగు: వి. దాసి.

"యిక్కడ మేల్కొని యింతలో వరగై
మొక్కె నిదివో మునుకొని నీకు" 17-64

వరుసపద్యము: వి. 1. బాంధవ్యపు వివరణలతో కూడిన పద్యం. 2. పదిమంది విద్యార్థుల్లో ఎపనిపంతుకు వాడు చెప్పే పద్యం. తక్కిన పద్యాలజోలి వానికక్కరలేదు. శాస్త్రము చెల్లించుట అని భావము.

"ఉన్నతి వరుసపద్య మొప్పగించ వచ్చితిని
మిన్నక కూచుండుము మేలుకొనీ నిపుడు"
14-555

వలలమాటలు: వి; బహు. మోసపుమాటలు.

**వలుము:** వి. తగాదా (?) వంబు. త.

"వారించి లేదని వలుము చేసి"

**వసపడు:** అ.క్రి. సాధ్యమగు, వశపడు.

"తలఁచనెంత దడవు దవ్వులనున్న పతినిఁ

బలికించుమంటే వసపడదుగాక" 16-110

**వాగము:** వి. వాటము అనే పదానికి వాకము రూపాంతరము. వాకమునకు వాగము అనే రూపాంతరం కల్పించి అన్నమయ్య ప్రయోగించినాడు.

"వాగమై యమరెఁగాన వన్నెలెల్ల నమరె" 9-90

"వాగమై యింతులకెల్ల వలవు మని" 9-218

**వాగరుమాటలు:** వి; బహు. పరుషవాక్కులు, నిందా వాక్యములు.

"వాగరుమాటలకెల్లా వారిచేవాఁడా తొల్లి"

**వాగాయిత్తము:** వి. మాటల జగడం, కీడు తోపించే మాట.

**వాముడి:** వి. త. నోటినుండి వెలువడే మాట.

**వారమిచ్చు:** ప.బం; స.క్రి; రా.సీ.మాం. పాలుకిచ్చు, కొలుకిచ్చు.

"వెలయఁగ వలరాచవిద్యలు నేరుపుమని

పలుకుదేనియ నీకు వారమిచ్చెను" 14-536

**విత్తుమీఁదటి పొల్లు:** ప.బం. నిస్సారము, నిరుపయోగము.

"వత్తిలోపలి నూనెవంటిది జీవనము

విత్తుమీఁదటి పొల్లు విధము దేహము" 1-328

**వినీని:** అవ్య. వినిన్ని. 18-242

**విభాండకుఁడు:** వి.కశ్యపుని పుత్రుడు. ఇతడు బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ తపస్సు చేసుకునేవాడు. ఒకనాడితడు స్నానం చేస్తుండగా ఊర్వశి కనబడుతుంది. ఆమెను చూడగానే విభాండకునకు రేతః పతనం కలిగి అది నదీజలంలో పడుతుంది. అప్పుడానదిలో దాహం తీర్చుకుంటున్న ఒక మృగం విభాండకుని వీర్యాన్ని జలంతో తాగుతుంది. ఆ వీర్యము వలన ఆ మృగం గర్భంలో ఋష్యశృంగుడు జన్మించినాడు.

"తగు విభాండకునితో దాఁగిలిముచ్చులాడితి

అగడుగా బండివిరిచాటలాడితి" 3-179

**విఱిపోటు:** వి. వైరం.

"తరుణిరో యిందులోనే తమలో విఱివోటాయె

విరహిజనులకెల్ల వెఱపేలే యిఁకను" 17-418

**వుద్దగచ్చకాయలు:** వి. గచ్చకాయలతో ఆడే ఒక ఆట.

**వెంగన:** వెంగాన. (వ్యంగ్యంతో)

"సంతోసాన మోవి చూపి చవులు గొలుపుఁగాని

వింత సేసుకొనీ నిన్ను వెంగన సాదించదు"

29-490

**వెండి పైడిఁ దడఁబడు:** ప.బం; వి. సిరిసంపదలతో తుల దూగు.

**వెద్దు:** వి. వంచన, కపటం.

**వెన్నెలనాఁడు:** వి. పూర్ణిమ.

"వొట్టుక వెన్నెలనాఁడు వుట్లెక్కి పెద్దవై

యిట్టె రుక్మిణి పెండ్లి తేరెక్కితివి" 3-92

**వేఁడిపాలకు నాలుక చాచు:** ప.బం; స.క్రి. ఇబ్బంది కలిగించుకొను.

"నాయమా వేఁడిపాలకు నాలుక చాఁచ నీకు

యీ యెడ నీకే తెలుసు నెటువంటి సుఖము"

13-358

**వేడిక:** వి. వేడుక.

"కనుచూపు వాడికాయ కాఁగిలిట్టె వేడికాయ"

29-488

**వేలము:** వి. శిబిరం.

"బెరయఁ బిఱుఁదు వేగు పీట యెక్కవే మంచి

వురము నీకు వీలమగు (వేళపు) వోరుతురా

17-148

**వేసరించు:** స.క్రి. శ్రమపఱచు.

**వైతాళము:** వి. మేలుకొలుపు. (సంపా. 17సం. పీఠిక, 4పు.)

"వలెఁగా యివి గొన్ని వైతాళాలు

చెలిమి సేసేయందుకు చెప్పింపవలెనా" 17-161

**వైదూర్యము:** వి. వైడూర్యమునకు రూపాం.

12-314

శింగారవనము ៖ వి. శృంగారవనం, ఉద్యానవనం.
"శింగారవనములోన చెలులతో రమణుఁడు
అంగవించిన ముచ్చట లాడుకోఁగాను" 17-302
శిరసెత్తుకొను ៖ ప.బం. ధైర్యం వహించు. 21-37
సందకాడ ៖ సంధ్యాసమయంలో.
సందులు దూరే మనసు ៖ ప.బం; వి.చంచలమైన మనస్సు.
సంబాళిగలు ៖ వి; బహు. పావుకోళ్లు.
సంబెళ ៖ వి. వక్కలాకుల తిత్తి; అడపము.
సదమదము ៖ వి. కలవరము. 5-205
సదరము ៖ విణ. చతురమైన; వి. చాతుర్యం.
సనగులు ៖ అనిష్టంతో మాట్లాడిన మాటలు.
సన్నపు లెక్కలు వ్రాయు ៖ ప.బం; అ.క్రి. పొద్దుపోక ఏవో పనులు చేయు. 6-153
సరియేమి బేసేమి ៖ ఏది గలిగితే నేమి.
"చనవు గలవారికి సరియేమి బేసేమి
మనసులే గురి గావా మన్నించవయ్యా"
13-124
సవదరించు ៖ స.క్రి. వహించు, ధరించు.
"వదలుఁబయ్యెద సవదరించి వలపులతేట
చవులు చూపి
కొదలు మాటల ముద్దు గునిసి కూరిమి
గొసరుటెన్నడే"17-20
సాకిరి ៖ వి. ఒట్టు.
సాకిరివెట్టు ៖ అ.క్రి. ఒట్టుపెట్టు.
"ఒఱికె వేసుక నేనూరకున్నా మానఁడే
సణగు లాడఁగ పేరే సాకిరి వెట్టీనీ"
సారివెడలు ៖ అ.క్రి. సన్నద్ధమై వెడలు.
సింగడు బూరడు నగు ៖ ప.బం; అ.క్రి. ఉబ్బిపోవు.
సుక్కారారము ៖ వి. 'శుక్రవారము'నకు జానపద వ్యవహారం. చూ ៖ సుక్కురారము.
"చూడఁజూడ సంతలోనే సుక్కారారమునాఁడు
ఆడనీడ విభవాలే అమరె దేవునికి" 17-526

సుడికత్తె ៖ వి. అదృష్టం కల స్త్రీ.
సూత్రపు ప్రతిమ ៖ వి. ఆటబొమ్మ. (అస్వతంత్రమని భావం) 21-2
సూదిమాటలు ៖ ప.బం; వి; బహు. ఎత్తిపొడుపు మాటలు.
సూరియలు ៖ వి; బహు. ఆళ్వారులు.
"పన్నిద్దరు సూరియల బండికండ్ల తేరు
సన్నుతి శేషాద్రి దేవాసనపుఁ దేరు" 2-239
సొంట్లు ៖ వి. రహస్యాలు. 2-231
స్థానకము ៖ వి. నిలుచున్న భంగిమ.



అనిపట్టు : స.క్రి. పూనిపట్టు
గోవాళ విద్యలు : వి; బహు. గొల్లవిద్యలు ?
కన్నడంలో గోవాళలంటే గొల్లలని అర్థం.
గోవాళితనం : వి. గొల్లతనం కావచ్చు.
చల్లజంపులు : వి; బహు. లేనిపోని చిక్కులు పెట్టునవి
అని హరవిలాసం లఘుటీక (2-51)
నోటికడవలోని నీరు : ప; బం; వి.ఉమ్మి
పలికెటి చదువులు : వి; బహు. వేదాలు
పైరులు చేయు : అ.క్రి. సేవ చేయు (తె.వ్యు.కో.)
బ్రాతి : విణ. దుర్లభం.
మంచునీరు కుంచాలఁబోయు : ప.బం; అ.క్రి. వట్టి
మాటలతో సంతృప్తిపఱచు (తె.వ్యు.కో.)
మండెమురాయఁడు : వి.మండలాధిపతి (తె.వ్యు.కో.)
మఱుగున బదుకు : ప.బం; అ.క్రి. శరణుపొంది బ్రతుకు,
చాటున బ్రతుకు
మూవంకలు : వి; మూడు. అన్ని విధాలు
మూవరుస : వి; మూడు పంక్తులు
మూతి గిరుపు : అసంతృప్తిని ప్రకటించు
మెలుచు : వి. స్నేహం
మొనవాడి : వి. ముందుండేవాడు (తె.వ్యు.కో.)
సిద్ధంజనము : (సిద్ధ + అంజనము) సిద్ధాంజనము,
విలక్షణమైన సంధి
సెలవిల్లు : వి. సెలసువిల్లుకు రూపాం. సెలసు
బద్దలతో చేసిన విల్లు
"జలధి బంధించిన సౌమిత్రిరామా
సెలవిల్లు విరిచిన సీతారామా"
సాసించు = అ.క్రి. సాహసించు (తె.వ్యు.కో.)
రాట్నపుగుండ్రలు : వి; బహు. చక్రభ్రమణములు.

# సంక్షిప్తపద వివరణం

| | |
|---|---|
| అ.క్రి. | అకర్మకక్రియ. |
| అ.సం.సా.రా.సీ.మాం. | అన్నమాచార్య సంకీర్తన సాహిత్యం. రాయలసీమ మాండలికం. |
| అను. | అనుబంధం. |
| అవ్య. | అవ్యయం. |
| అస.క్రి. | అసమాపక్రియ. |
| ఆం.క్రి.మ.దీ. | ఆంధ్ర క్రియా స్వరూప మణిదీపిక. |
| ఆం.ధా.మా. | ఆంధ్ర ధాతు మాల. |
| ఆం.భా.చ. | ఆంధ్ర భాషా చరిత్ర. |
| ఆ.మూ. | ఆనందమూర్తి వేటూరి. |
| ఉ. | ఉద్యోగపర్వం. |
| ఆం.శ.ర. | ఆంధ్ర శబ్దరత్నాకరము. |
| ఉ.రా. | ఉత్తరరామాయణం. |
| ఉ.హరి. | ఉత్తర హరివంశం. |
| క. | కన్నడం. |
| క.అ.క.కీ. | కడపరాయని అన్నమయ్య కప్పురపు కీర్తనలు. |
| క.చౌ. | కవిచౌడప్ప. |
| క్రి.ప. | క్రియాపదం. |
| క్రీడా. | క్రీడాభిరామం. |
| క.చౌ. | కవిచౌడప్ప శతకం. |
| కు.సం. | కుమారసంభవం. |
| చి.సూ. | చిన్నయసూరి. |
| త. | తమిళం. |
| తా.అ.సా.తె. | తాళ్లపాక అన్నమయ్య సాహిత్యంలో తెలుగునాడు. |
| తా.ప.భా.వి. | తాళ్లపాక కవుల పదకవితలు – భాషాప్రయోగ విశేషములు. |
| తాళ్ల.ఉ.విశే. | తాళ్లపాక అన్నమయ్య సంకీర్తనల్లో ఉత్సవవిశేషాలు. |
| తాళ్ల.ప.} | తాళ్లపాకకవుల పలుకుబళ్లు. |

| | |
|---|---|
| తి.ఆ.న. } | |
| తు. | తుళు. |
| తె.జా. | తెలుగు జాతీయాలు. |
| తె.తె.ని. | తెలుగు - తెలుగు నిఘంటువు. |
| తె.వ్యు.కో. | తెలుగు వ్యుత్పత్తి పదకోశం. |
| ప.బం. | పదబంధం. |
| ప.యో.వి. | పరమయోగివిలాసము. |
| పద. } | పదబంధపారిజాతం. |
| ప.పా. } | |
| పర్యా.కో. | పర్యాయ పదకోశం. |
| పు. | పుట. |
| ప్రా. | ప్రాకృతం. |
| బహు. | బహువచనం. |
| బ్రౌన్. | బ్రౌణ్య నిఘంటువు. |
| భా. | భాగం. |
| భా.రా. | భాస్కరరామాయణం. |
| భార. | మహాభారతం. |
| మ.చ. | మనుచరిత్ర. |
| మాం. } | మాండలికం. |
| మాండ. } | |
| మాం.ప.కో. | మాండలికపదకోశం. |
| మై.వేం.సు. | మైనంపాటి వేంకటసుబ్రమణ్యం. |
| రా.సీ. | రాయలసీమ. |
| రా.సీ.మాం. | రాయలసీమ మాండలికం. |
| రాజ.వి. | రాజవాహనవిజయం. |
| రూపాం. | రూపాంతరం. |
| వా.ని. } | వావిళ్ల నిఘంటువు. |
| వావిళ్ల. } | |
| వాచ. | ఆంధ్రవాచస్పత్యం. |
| వి. | విశేష్యం. |
| విణ. | విశేషణం. |

| | |
|---|---|
| విప్ర. | విప్రనారాయణచరిత్ర. |
| వ్యు. | వ్యుత్పత్తి. |
| వ్యు.కో. | తెలుగు వ్యుత్పత్తిపదకోశం. |
| శ.దీ. | శబ్దార్థదీపిక. |
| శ.ర. | శబ్దరత్నాకరం. |
| శు.స. | శుకసప్తశతి. |
| సం. | సంపుటం. |
| సం.స. }<br>సం.ప.స. } | సందిగ్ధ పద సమీక్ష. |
| సం.వా.పద.భాషా. | సంకీర్తనవాఙ్మయము - పదకవితలు - భాషాప్రయోగవిశేషములు. |
| స.క్రి. | సకర్మకక్రియ. |
| సారంగ. | సారంగధరచరిత్ర. |
| సూ.ని. | సూర్యరాయాంధ్రనిఘంటువు. |
| హం.విం. | హంసవింశతి. |



# తాళ్లపాక కవుల సంకీర్తనల రాగాలు (95)

అబాలి
అమరసింధు
ఆందోళి
ఆరభి
ఆహిరి
ఆహిరినాట
కన్నడగౌళ
కన్నడ బంగాళం
కాంబోది
కాంభోజి
కుంతలవరాళి
కురంజి
కేదారగౌళ
కాశి
కొండలమలహరి
కోకిలపంచమం
గంభీరనాట
గుండక్రియ
గుజ్జరి
గుమ్మ కాంబోది / కాంభోజి
ఘంటారావం
చాయ
చెంచుమలహరి
ఛాయానాట

తెలుగు కాంభోది / తెలుగు గాంభోజి
తోడి
తోండి
దీపనం
దేవక్రియ
దేవగాంధారి
దేశి /దేసి
దేసాక్షి
దేసాళి
ద్రావిళ(డ) భైరవి
ధన్నాసి
నట్టనారాయణి
నాగగాంధారి
నాగవరాళి
నాట
నాదనామక్రియ
నారణి
నారాయణదేసాక్షి
నారాయణి
నీలాంబరి
పళవంజరం
పాడి
పిసాళం
పూరిబి / భి

పూర్వగౌళ
ప్రతాపనాట
బల(ళ)హంస
బౌ(భవు)ళి
బౌళిరామక్రియ
భంగాళం
భల్లాటి
భూపాల(ళ)
భైరవి
మంగళకౌ(క్రౌ)శిక
మధ్యమావతి
మనోహరి
మలహరి
మాళవి
మాళవ(వి)శ్రీ
మాళవి గౌళ
ముఖారి
ముఖారిపంతు
మెంచభౌళి / మేచబౌళి
మేఘరంజి
రామక్రియ
రాయగౌళ
రీతిగౌళ
రేవగుప్తి

లలిత
వరాళి
వసంతం
వసంతవరాళి
వేళావళి
శంకరాభరణం
శుద్ధదేశి
శుద్ధరామక్రియ
శుద్ధవరాళి
శుద్ధవసంతం
శ్రీరాగం
సామంతం
సామవరాళి
సావేరి
సాళంగం
సాళంగనాట
సింధురామక్రియ
సోమంగాగం
సౌరాష్ట్రం
సౌరాష్ట్రగుజ్జరి
హిందోళం
హిందోళవసంతం
హిజ్జి(జ్జీ)జి

